వాల్మీకి తన గ్రంథమునుగూర్చి 'ఉదారవృత్తార్థపదమనోహరంబనియు, తదువగతసమాససంధియోగబంధురంబనియు, సమమధురోపనతార్థవాక్యబద్ధమనియు' వచించెను. ఈవిశేషణంబులు అక్షరాక్షరంబుల సత్యంబులు. కావుననే రామాయణం బంతరుచివంతమై వినువారిని దన్మయమొనర్చుచున్నది.

శ్రోతలచిత్తంబు నాకర్షించి తన్మయత్వమొసగ్చి యంగ్యార్థరసంబుల నోలలాడించునదే కవిత్వమగును. కవిత్వంబునకు రసము జీవము. రసోత్పాదనశక్తి పుట్టుపుతోడనే రావలయును. పాండిత్యాదులు దానికి మెఱుంగులగును. ఈరసంబును సమయోచితంబుగాఁ జవిచూపవలయునేగాని క్రుమ్మరింపరాదు.

ఈ రసోత్పాదనము ధ్వనిప్రాణితమైనచో శ్రోతలమనఃపరిణతినిబట్టి వింతవింతరుచులను గలిగించుచు నెంతద్రావినను వారిని దనియకుండునట్లుచేయును. అట్టికవిత్వమే యుత్తమకవిత్వమగును.

కవిత్వంబునకు ఔచిత్యంబెంతయుఁ బ్రధానము. దానిని జక్కగాఁ బాటింపనిచో రసభంగము గలుగకమానదు. ఔచిత్యము శబ్దగతమనియు భావగతమనియు, ద్వివిధము. సందర్భమునకుఁ దగినంతమాత్రమే భావంబును వెల్లడించుట భావౌచితియగును. ఆభావప్రదర్శనంబునకుఁ దులతూఁచినట్లు తగినపదమును బ్రయోగించుట శబ్దౌచితియగును. భావార్థంబులు రెండును నొండొంటికిఁ దులతూఁచినట్లుగా నుండునేని ఆకవిత్వము సజీవకవిత్వమగును. ఈశక్తిని సంపాదించుటకుఁ బాండిత్యమెంతయుఁ దోడ్పడును. పాండిత్యంబునకుఁదోడుగా యుక్తాయుక్తవివేకమును లోకజ్ఞానంబును గూడినచో నెంతయుఁ బ్రశంసనీయమగును. ఇన్నియుండియుఁ గవిమన స్తత్త్వంబు మరందమాధురీమయంబును శిరీషకుసుమకోమలంబును

గానిచో వానిరచన శిష్టగానుండుననేగాని సర్వజనమనోరంజకము కానేరదు. సర్వభూతహితబుద్ధియున్నగాని యట్టిమనస్తత్త్వంబుగలుగదు. అట్టిబుద్ధి జీవన్ముక్తుని లక్షణము. కావుననే ఋషిగానివాఁడు కవి కానేరఁడనిరి. ఇవియెల్ల వాల్మీకి మహర్షియందు సమగ్రంబులు. కావుననే వానికవిత్వము అసదృశమై చదువంజదువ రుచులూరించుచుఁ దనివి దీఱకుండును.

కవులు భావపరిస్ఫూర్తికొఱకు శబ్దాలంకారంబుల నర్థాలంకారంబుల నాశ్రయించుటకలదు. ఇట్టి ప్రతిభావ్యాపారమునకవస్సన్నదియున్నట్లు తేటమాటలతోఁ బోధకముగా వివరించి భావస్ఫూర్తిం బొనర్చుట కడిఁది కార్యమేగాక మనోహరముగాఁగూడ నుండును. ఇది యందఱికి సాధ్యముకాఁజాలదు. ఇట్టి కవిత్వము బాలవృద్ధావబోధక మగుటయేగాక బహుజనానందనీయమై శాశ్వతంబుగా నిలుచును. కవి కేవలచిత్రకారుఁడు మాత్రమేగాఁడు; బోధకుఁడును శ్రోతృజనాంతఃపరిణామప్రదుఁడు నగును. లోకాభ్యున్నతి కవీంద్రులపై నాధారపడియున్నదని చెప్పుట యతిశయోక్తిగాదు. కావుననే కవీంద్రులపూర్వసృష్టికర్తలగుదురు. పైలక్షణంబులెల్ల వాల్మీకి కవిత్వంబున సమగ్రంబులు. దానం జేసియే వానిం గవికోకిలంబనిరి.

రామాయణమందుఁ గొన్ని యంశంబులు సామాన్యధర్మదృష్టికి విపరీతంబులై తీఱనిశంకలు గలిగించుచున్నవి. ఈయంశంబులను విశేషధర్మదృష్టితోఁ బరిశీలించినచో నట్టిశంకలు తప్పక తీఱును. ఈధర్మసూక్ష్మంబులు సామాన్యులకు గోచరింపవు. భీష్ముఁడంతటివాఁడు గూడ దనకేది హితమో నిశ్చయించుకొనలేక సర్వజ్ఞుఁడైన శ్రీకృష్ణభగవానునకు స్వహితనిశ్చయార్థమై చరమప్రార్థనంబును గావించెననఁగా నితరులసంగతి చెప్పవలయునా? తెలియని దానిని తెలిసికొనుట యుక్తమగునేగాని విపరీతార్థంబులకుఁ బూనుటసరిగాదు.

రామావతారకారణము ఉత్తరకాండమునఁ గలదు. సౌకర్యార్థము దానిని మొదటనే చేర్చి పూర్వకాండమని పేరిడితిని. వాల్మీకి గ్రంథంబునకు నా రచన తర్జుమా గాదుగాని దానిని ప్రాయికముగా ననుసరించితిని. ప్రక్షిప్తములను వదలితిని. మహర్షి సూచించిన భావంబులను గొన్నిటిని సుంత వివరించితిని. సందర్భోచితంబుగాఁ గొంత చేర్చితిని. పఠన సౌలభ్యార్థము కొన్ని పద్యంబులను గ్రంథాంతరంబులనుండి గ్రహించితిని. కొన్నింటిని స్వయముగా రచించి కూర్చితిని. ' ' ఈగుర్తుగల పద్యంబులు గ్రంథాంతరస్వీకృతములు.

విప్రలంభపరిణామంబగు కరుణరసంబును పాఠకులకు మఱి కొంత చవిచూపు తలంపుతో భవభూతిరచించిన యుత్తరరామచరిత నాటకంబునుండి గొంతభాగంబును శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి తర్జుమాను గ్రహించి కూర్చితిని.

రామాయణసారంబును గ్రహింపవలయునన్నచో మూల గ్రంథమునే చదువవలయును. అందులకు గీర్వాణభాషాజ్ఞానము వలయును. అదియెల్లరకుఁ గలుగదని యాంధ్రభాషాజ్ఞానమాత్రులకళ్యాణార్థము భాస్కరాది కవీంద్రులు ఆంధ్రపద్యప్రాయంబుగా రామాయణంబును మహారసవత్తరశైలి రచించిరి. వచనకావ్యరచనకు నవకాశమిప్పుడు గలిగినందున నిటీవల నొకరు దానిని గద్యాత్మకంబుగా రచించిరి. అట్లు వారాంధ్రప్రపంచంబును ధన్య మొనర్చి తాము ను ధన్యులైరి. అట్టి యుద్గ్రంథంబులుండగా మరల నేనీగ్రంథంబును వ్రాయనేల యనవచ్చును.

బాల్యంబునుండి రామాయణమందు నాకుఁ బ్రీతి మిక్కుటము. 1899-వ సంవత్సరంబున మాకు మొల్లరామాయణంబును ప్రవేశ పరీక్షాపఠన గ్రంథముగా నిర్ణయించిరి. దానిని జదువటవలన రామ

చరిత్రయందలి నాప్రీతి రెట్టించెను. అప్పుడప్పుడే యాంధ్రభాష యందు నాకు నుంత ప్రవేశమంకురించుచుండెను. అప్పుడు నాకు సహపాఠియైన శ్రీ మేడిశెట్టి వెంకటాచలమునాయుడుగారు రామాయణంబును నవలారూపంబున వ్రాయవలసినదని నాటనుండి బలవంతపెట్టసాగెను. అందులకుఁ జాలనని మిన్నకుంటిని.

1932 వ సంవత్సరంబున గీతాహృదయ రచనకుఁ దొడంగి యందు రెండధ్యాయంబులు పూర్తిగావించితిని. అది కేవలవేదాంత విషయంబగుటం జేసి యందే నిరంతరము పరిశ్రమించుట నుంత శ్రమగాఁ దోఁచెను. ఆ క్లేశమును గావ్యరసాస్వాదనంబునఁ బాపఁ దలంచి వాల్మీకిరామాయణంబును వ్యాఖ్యాచతుష్టయ సమన్వితంబుగాఁ జదువనారంభించితిని. కొన్నాళ్ళు చనఁగా, నాచదువుభాగంబు నప్పుడప్పుడే యాంధ్రవచనరూపంబున వ్రాయఁదగదాయనుతలంపు తలసూపెను, ఆసంకల్పరు దొడ్డరామాయణ రూపంబునఁ బరిణమించెను.

నిష్కామకర్మయోగమే వాస్తవమైన గృహస్థధర్మము. అట్టి ధర్మంబునకు శ్రీరామచరిత్ర మహోత్తమమైన లక్ష్యముగా నున్నది. జీవితముయొక్క పరమావధి ముక్తి అనిరి. ముక్తిఅనఁగా విడుదల అని యర్థము. విడుదల అగుటకుఁబూర్వము బంధంబుండ వలయును. ఏల ఎప్పుడు ఎవరు దేనిని బంధించిరి ? అను ప్రశ్నలు తప్పక వచ్చును. ఈనాల్గింటివిచారమే తత్త్వశాస్త్రము. సంగమే బంధనంబనియు అసంగమమే ముక్తియనియుఁ దత్త్వశాస్త్రనిశ్చయము.

అట్టి అసంగసిద్ధి కలుగుటఁకుగా కర్మభక్తిరాజజ్ఞానముల నెడి నాల్గుమార్గంబులను జెప్పిరి. ఈమార్గములనే యోగములందురు. నాదికాదు అను భావమే అసంగయోగము. అది యొకవిధమైన

మన స్తత్వము, కర్మయోగులు తమకర్మఫలంబును తమదిగా భావింపకపోవుటచేత మన స్తత్వంబట్టిదిగా నగుచున్నది. భక్తియోగులు తమరినే ఈశ్వరార్పణము చేయుటవలన వారికింగూడ నట్టిమన స్తత్వము సిద్ధించుచున్నది. రాజయోగము జ్ఞానయోగము సినియుక్క సిద్ధిగూడ నట్టిదిగానే యున్నది.

ఎల్లయోగములసిద్ధి అసంగమే గావునను, వారు వారు వారి వారి వర్ణాశ్రమదేశకాలస్థితులనుబట్టి యనుకూలమైన మార్గము ననుసరించి అసంగసిద్ధిని బడయవచ్చుననియు, ఆనాల్గుయోగముల లో. ఒకటిహెచ్చు ఒకటితక్కువ అనుభావము సరిగాదనియు, లోక మందు గృహస్థులు బహుళమగుటంజేసియు గృహస్థులకు మోక్షము లేదను తలంపుతో అన్యమార్గంబులను అనుష్ఠింపవలసినది లేదనియు శ్రీరామచరిత్ర బోధించుచున్నది. ఈకారణముచేతనే రామాయణము సర్వజనులకుం బ్రియతమముం బ్రశంసనీయము నై గ్రాలుచున్నది.

మావంశనామధేయము 'దొడ్డ' అనియుండి కాలక్రమంబున 'దొడ్ల' అను మార్పుచెందెను. రామాయణము దొడ్డగ్రంథమగుటంజేసియు, మాయింటిపేరుగూడ 'దొడ్డ' అగుటవలనను ఉభయార్థ ద్యోతకంబుగా నారచించిన దానికి 'దొడ్డరామాయణ' మను పేరిడితిని.

నాతండ్రిగారికి బొబ్బిలిమొదలు కార్వేటినగరమువఱకుం గల సంస్థానాధీశులు చిరపరిచితులు. అందు శ్రీ వేంకటగిరి సంస్థానాధీశులు ముఖ్యులు. నాకును బ్రకృతము శ్రీ వేంకటగిరి సంస్థానాధీశులైన శ్రీ శ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్ర బహాదూరు వారికిని దొలుదొల్తం గావలిగ్రామంబున 1926 వ సంవత్సరంబున వారు కుమారరాజుగానున్న కాలములో సమావేశము

గలిగెను. అది క్రమక్రమంబుగా వర్ధిల్లి తుదకువారు నాయెడ మిత్రభావంబును జూపునంతగా నయ్యెను. వారియంత స్తత్వంబును గ్రహింపఁగల్గితిని. వారిహృదయము నిరంతర రామధ్యానపరమై యుండుటయు, ఎన్నడేనియుఁ గార్యాంతర ప్రయాణాదులవలన రామ పనపూజకు నవకాశము గలుగనినాఁడు వారికొక దుర్దినమగుటయు సుగతమయ్యెను.

ఒకవైపు సిరిసంపదలతోఁ దులతూగుచుండియు, ఎల్ల య కార్యంబులకు బీజప్రదములైన భాగ్యోన్నతులుండియు, వానికిఁ బ్రైవశముగాక దైవభక్తియు ధర్మరక్తియుఁ గలిగియుండుట సుకృత విశేషముగాని వేఱుగాదు. ఇట్టివారు భోగవాసనావిశిష్టులైన యోగ భ్రష్టులగుదురని గీతావాక్యము.

శ్రీ రాజాగారియందుఁగల యీశుభలక్షణంబులు నాహృదయంబు నాకర్షించెను. వారికీర్తి సుప్రశస్తమగుట యుక్తమని తోఁచెను. తదర్థము నారచించు గ్రంథంబును వారికి నంకితం బొనర్పఁదలఁచి నాతలఁపును వారికి నెఱిఁగించితిని. నాయెడ వారికిఁ గల ప్రేమాతిశయంబునఁ జేసి నాప్రార్థనము నంగీకరించిరి. శ్రీవారి విశిష్టశుభగుణాకారవసూచకంబుగాఁ బ్రతిఫలనిరపేక్షతో వారి నీగ్రంథంబునకుఁ గృతినాయకులనుగాఁ జేసితిని.

ముద్రణంబున అరసున్నలు శకటరేఫలు కొన్నియెడలఁ దాఱుమాఱయ్యెను. గ్రంథవిస్తరభీతిం జేసి వానిని సవరణపట్టికలోఁ జేర్పనైతిని. అజ్ఞానజనితంబులోండెఁ బ్రమాదవశంబులోండెఁ దోషంబులు కొన్ని యీగ్రంథంబునఁ గానరావచ్చును. వానిని దెలిపినచోఁ బునర్ముద్రణంబునఁ గృతజ్ఞతాపూర్వకంబుగా సవరించుకొందును.

ఈగ్రంథంబును ముద్రింపించుటకు నొసగితినే కాని, స్వ్యాపార పర్యటన విశేషంబున నొకచోటి యునికి నాకు దుర్లభమగుటంజేసి, ముద్రితభాగంబును సరిచూచుటకుంగూడ సాధ్యము గాదయ్యెను. ఆ భారంబునెల్ల శ్రీ వాయునందన ముద్రాక్షరశాలవారే యోపికతో భరించి ముద్రణంబును బూర్తిజేసిరి. అందులకై వారికి వందన పరశ్శతంబు లర్పించుచున్నాను.

నారచించిన కళావతీయుగంధరవిజయంబులవలె ఈగ్రంథము గూడ మద్గురువర్యులగు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి శుభ విమర్శనదృష్టికి నోచియున్నచో నెంతో బాగుగానుండును. వారు కీర్తిశేషులగుటంజేసి యాకలిమి దవ్వదయ్యెను. ఇది నాదురదృష్టము.

ఏరామభక్తి బాల్యంబునుండి నాయందంకురించి శుభాశుభంబులయందు జేయూతగా బరగుచు నాజీవితంబును గొనసాగించు చున్నదో, ఏరామభక్తి వాల్మీకిమహర్షి నుండి వెలువడి యీ శ్రీరామాయణంబును సర్వలోకకల్యాణంబుగా వెలయించెనో, ఆ రామ భక్తివలనఁ బ్రేరితుండనై నాగావించిన యీసేవను ఆంధ్రప్రపంచ మంగీకరించి నన్ను ధన్యునొనర్చుఁగాక.

15—10—40,
మకాం, కలిచేడు.

ఇట్లు బుధవిధేయుఁడు,
దొడ్ల వేంకటరామరెడ్డి,
గ్రంథకర్త.

శ్రీరస్తు.

సౌజన్యసింధువు లైన శ్రీయుత దొడ్లా వేంకటరామరెడ్డి గారికి
మిత్రుఁడు దుర్భా సుబ్రహ్మణ్యశర్మ ఆశీర్వచన
పురస్సరముగా వ్రాసిన లేఖ:

తమరు ప్రీతిపూర్వకముగాఁ బనిచిన 'దొడ్లరామాయణమును' తిలకించి యమందానంద భరితుఁడనైతిని. అందుఁ దొడ్లాల నామనంబున కచ్చెరువు గొల్పినది గ్రంథవిస్తృతి. సన్ననిటైపులో డెమ్మిసైజున నుమారు వేయి పుటలగ్రంథమును వ్రాయుట కెంత దృఢవ్యవసాయము వలయునో అది ప్రాజ్ఞు లూహింపఁగలరు. అట్టి పూనిక యెల్లరకు సాధ్యము కాదు. మీరన్నట్లు మీ 'వృత్తి' యొకటి, 'యాశయము' వేఱొకటి. అట్లయ్యు నైదేండ్లలో నింత గ్రంథము రచించుటకు మీకుఁ బ్రేరకము కీర్తియందలి సక్తిగాదు, శ్రీరామచరణభక్తిగాని గట్టి యుండవలయును. మిమ్ము తెలిసిన యెవ్వరు గాని మీరు తొలిదాని నంతగాఁ గాంక్షించువారని యనుకొనరు. మఱియు, మీనిరాడంబరజీవితము, మీతత్త్వజిజ్ఞాస, యివి యట్టి తలంపును దూరీకరించుచున్నవి. కావున శ్రీరామకథయందలి ప్రీతియే మీ గ్రంథనిర్మాణోద్యమమునకుఁ గారణమని నే నూహించుచున్నాను. మీ తోడిసంభాషణములవలన నేను గ్రహించినంతవఱకు, మీ 'హృదయమున' నాకుఁ గానవచ్చినంతవఱకు, మీడెందము నిర్గుణము ప్రక్కకన్న సగుణము వంకకే మొలంగుచున్నదని నాయున్కి. కావున 'సంభవామ్యాత్మమాయయా' అని వాకొని యట్లే యవతరించుచున్న సగుణబ్రహ్మముయొక్క యసంఖ్యావతారములలో శ్రీరాముని పవిత్రచరిత్ర మీడెందము నరికట్టు టబ్బురము కాదు. మొల్లరామాయణము చదువుటచే ముప్పది సంవత్సరములకుఁ బూర్వమెన్నఁడో హృదయమున నాటుకొన్న భక్తిబీజము, తత్త్వవిమర్శల దోహదముఁ బొరసి యింతకాలమునకు మొలకెత్తి పరితృప్తలోకపారిజాతమగుట మీ పూర్వపుణ్యవిశేషమని భావించుచున్నాను.

వాల్మీకి రామాయణమునకుఁ దెనుఁగింపులు పెక్కులు గలవు. కాని వానిలో నేది గాని భాస్కరరామాయణము వలె జనప్రీతిపాత్రమైనటు కానరాదు. అదేమి యింతయో గాని, ఆతెనుఁగింపులలో నుత్తరోత్తరములకన్నఁ



Rajah of Venkatagiri. Author.

శ్రీ

# రత్నమాల.

శా॥ శ్రీసీతాకరసంపుటచ్యుతములై సేసల్ పయిఁ రాలుచోఁ
నాసంతోషము సుస్మితాయతనిజాస్యంబందుఁ దోఁ కాడఁగా
వాసింగాంచిన రామభద్రుని కృపావాత్సల్యదృగ్జాలముల్
శ్రీసర్వజ్ఞకుమారకృష్ణవిభునిం జేయుఁ శుభప్రాభవుఁ॥ 1

సీ॥ సిగ్వక్రవిక్రమ నిపుణత మెఱయించి
ప్రథితరాజ్యశ్రీని బడసినారు
హరిహరదేవాలయంబులు నిర్మించి
దైవప్రసాదంబుఁ దాల్చినారు
కవిరాజరాజి సత్కావ్యరత్నములంది
చెలిమి వాగ్దేవిఁ బూజించినారు
అఖిలాన్నసత్రమహాగ్రహారంబుల
దానసన్మానముల్ దనిపినారు
గీ॥ తలను ద్రాల్చని కీర్తిపతాకయనఁగ
సింహపురికళాశాల సృజించినారు
ప్రణుతిపాత్రులు గారొకో ప్రజలకెందు
వేంకటగిరి వెల్గోటి పృథ్వీపవరులు ?॥ 2

శా॥ కాలాతిక్రమ లుప్తధర్మపరిరక్షాదీక్ష సంధిల్లఁగా
లీలామానుషవిగ్రహుండగుచు హాళిఁ లోకముల్ ప్రోచునే
కాలాతీతుఁడు వానిదివ్యకృప నెక్కాలంబు నిత్యోన్నతిం
గ్రాలుంగాక, కుమారకృష్ణపృథివీకాంతా ! భవత్సంతతుల్॥ 3

చ॥ వినయము శాంతభావము వివేకము సౌమ్యగుణంబు వాక్ప్రసా
దనమును గల్గినంగలుగుఁ దాదృశసంపద కెల్ల జీవమో

# విషయానుక్రమణిక.

## పూర్వకాండము.



## బాలకాండము.



శ్రీరస్తు.

శ్రీసీతారామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ దొడ్డ రామాయణము.

శా॥ శ్రీమద్దివ్యగృహస్థధర్మముఁ బ్రతిష్ఠింపంగ మర్త్యాకృతిన్
భూమింబుట్టి నివందు ముజ్జగము లేపుగ్యాత్మకుం బాడుచున్
సేమం బందుఁ జతుర్విధార్థముల నాసీతామనోహారి శ్రీ
రాముం డిప్రత మాకుఁ బ్రీతమయి నశ్రాంతంబు భద్రంబులన్.

ఉ॥ అంకిలి లేక కార్యము సమాప్తము నొందెడుపొంటె మున్నుగాఁ
బంకజసంభవాదులు సభక్తికపూజ లొనర్తు రేని కా
శంకరుపట్టి బన్నములసామి దయాపరతంత్రమూర్తి మా
వంకఁ గటాక్షవీక్షణ లవం బొలయించెడుఁగాత నర్మిలిన్.

కం॥ పంచాశద్వర్ణములఁ బ్రపంచంబున వ్యాప్తిఁ గాంచి పరగెడుతల్లిం
జంచద్విపంచికాసముదంచితపాణిన్ భజింతు నబ్జజురాణిన్.

ఉ॥ ఆదిఁ గలావతిన్ నుడువునవ్వుడు ప్రోడతనంబుఁ బూని యా
మీఁదట మార్గవంబనుగమించి యుగంధరునిన్ వచించి గీ
తాదహరప్రకాశమునఁ దద్దయు సామ్యతఁ దాల్చితిష్వ జే
మాదిరి వల్కుదో భువనమంగళమూర్తిచరిత్ర, భారతీ.

చ॥ ఆశయ మొందువృత్తియున నయ్యె నొకండుగఁ, బూర్వకర్మ మీ
రాశిది యూటఁ జేసి యిరురాజులఁ గొల్చుటయయ్యె నాకు, నా
యాశలు దీఱఁ దావకపదాబ్జసపర్య లొనర్పనైతి నం
చో! శుకవాణి! నావలను నూనకుమమ్మ పరాఙ్ముఖత్వమున్.

గీ॥ అరిదిగఁ గవితాశాఖాగ్రమునధివసించి
'రామరామ' యనెడి మధురాక్షరముల
మధురమధురంబుగాఁగఁ దన్మయతఁ బల్కు-
ననఘువాల్మీకికోకిలం బాత్మఁ దలఁతు.

మ॥ ప్రతిభానిర్మితనూత్నభావమయసామ్రాజ్యం బధిష్ఠించి శా
శ్వతులప్రాకృతజీవలోకశుభసాంగత్య ప్రసారిస్వ
తతధారల్ గురియించి యద్భుతమహానందంబు సద్భంగిమన్
బ్రతిపాదించెడిసంస్కృతాంధ్రసుకవిప్రష్ఠుల్ సనుంగ్రొల్తున్

చ॥ అనుపమచిత్తశుద్ధినిరుపాధికభక్తియుఁ దోఁప నిల్వ నే
యనఘుఁడు దాఁటె రామచరితాంబుధి సర్వజగన్నుతంబుగాఁ
బ్రణతజనార్తిహారియగు శుభ్రప్రతాపుఁడు నేమునీశ్వరుం డా
యనిలతనూజుఁ బ్రోవుత మనంతదయామతి వాంఛితార్థముల్.

చ॥ ఎవనిసపర్యలం దలఁచి యెంతయు వందురు నాంధ్రవాణి యా
ప్రవిమలధీవిశారదుని బండితవర్యు గణించితి రసా
స్వవివరణాద్వితీయుని గుణాగ్రమణిన్ భజియింతు మస్తకన్
వివిధకళాప్రపూర్ణు నలవేదము వేంకటరాయశాస్త్రులన్.

చ॥ పటుతరవాగ్మి యంచుఁ బ్రతిభామహితుం డని యార్తకోటికిన్
బటువగునూతకొమ్మయనఁ బ్రస్తుతిఁ గన్న రసజ్ఞమౌళిఁ బ్రా
కటకవితావినోది బుధగణ్యుని శ్రీయుత సోముటూరు వేం
కట శివరామమిత్రమణిఁ గాటపుఁగూర్మి దలంతు నిచ్చలున్.

ఉ॥ కేవలరామభక్తి పలికించినవైఖరి నిమ్మహాకృతిన్
ధీవరులార! వ్రాయుటకుఁ దెంపు వహించితి నంతె గాని ప్ర
జ్ఞావిభవంబుఁ జూపుటకుఁ గాదు ; రసంబు గ్రహించి పెద్ద దో
షావళి నుజ్జగింపనగు హంసలు క్షీరము నీరముం బలెన్.

ఉ॥ ఆయతభక్తినీదుచరణాబ్జములన్ మదినిల్పి దొడ్డ రా
మాయణమంచుఁ బేరిడి యమానుషకంబగు నీచరిత్రమున్
వ్రాయఁగఁ బూనితిం దెలుఁగువాక్యముగాఁ గడుఁ దెంపు సేసి, రా
మా! యెటు లీమనోరథము మన్ననచేయుదువో దయానిధీ!

ఉ॥ గీతలసేవచేతను జిగిర్చినచిత్తముఁ బెంపుగాంచఁగా
నాతతభక్తిమూలభవదంఘ్రులచల్లనినీడ సైచి నా
చేతులు గూర్చితిం గరుణఁ జేకొని ప్రోవుము రామచంద్ర! యా
సీతను వాయునందనుని జిష్ణువిభీషణుఁ గన్నకూర్మితోన్.

ఉ॥ నీవవతార మెత్తుటయె నిక్కముగాదఁట, మాసికల్పనో
జ్జీవితచిత్రమూర్తివఁట, చెల్లరో సాక్ష్య మెనిన్నుఁ గాంచ దో
షావిలకర్మబద్ధజనుషాంధులకున్? బహిరాంతరాత్మలీ
లావిభవాభిరాము సకలస్థితిమూలము, రామభద్రకా!

చ॥ అనృతముఁ బల్కనన్న ముని యయ్యెను డక్కరి, కల్పితుండవై
తనరితివీవు నీదుచరితల్ ముసలమ్మలసుద్దు లయ్యెని
స్సనయముగొల్పుటయ్యె హృదయంబును గ్రుస్సినదుర్బలంబహో!
కన నగుఁగాదె యింతె కలికాలవిశేషము రామభద్రకా!

ఉ॥ అంతరమందు నీదుమధురాకృతి నిల్పి నిరంతరంబునై
కాంతికభక్తి చేయుమహితాత్ముల కెల్లను దోడునీడవై
చెంతఁ జరించుచుందువు సిద్ధము సుమ్మది వక్రబుద్ధు ల
త్యంతము నిన్ను లేదనినయంతన చెల్లునె? రామభద్రకా!

తొల్లిటిగాథ లేల? యలతుర్కఁగపీసుని రామదాసునిన్
దల్లయుఁడైనయా తులసిదాసుని నమ్మఁగరాదె? వారలు
గ్గల్లరులంచుఁ బల్కునవనాగరకాగ్రణులున్న నుండనీ;
చెల్లరో! యంతమాత్రనె నశించునె సత్యము? కల్లనిల్చునే?

మ॥ చనెఁబో నేఁబదిరెండువర్షములు నాజన్మాది, నిన్నాళ్ళు భూ
మిని నున్నఁగా ఫలమేమి? యిట్టి బ్రమలన్ మిథ్యావినోదక్రియా
వినియోగాత్మకనాటకంబులుగదా, విశ్వేశ్వరుఁగా నిన్నుఁగా
ననినాఁడింతటనేని దీర్పఁగదవే నాకోర్కి సీతాపతీ.

సీ॥ సిరిసంపదలఁగోరి సేవింపఁగా లేను
ప్రారబ్ధమును ద్రోయరాదుగానఁ
బేరుప్రతిష్ఠకై పెనఁగులాడుట లేదు
వర్తనంబును బట్టివచ్చుఁగాన,
భార్యాసుతులమేలు ప్రార్థింపఁగా లేను
వారివారలకై వఱలుఁగాన
అద్వైతసిద్ధికై యాసింపఁగా లేను
ద్వైతవాసనయింకఁ దనరుఁగాన,

గీ॥ చిత్తమే ప్రొద్దునీయందు స్థిరతఁగాంచి
నీకథామృతపానైకనియతిఁ గల్గి
తావకేచ్ఛానుసారినై తనరునట్లు
ప్రేమతోఁ బ్రసాదింపుము రామచంద్ర.

శ్రీసీతారామాంజనేయాభ్యోనమస్తు.



# దొడ్డ రామాయణము.

## పూర్వకాండము.

సీ. అవసర మ్మైన నప్పుడు స్వామిమ్ముగఁ జేసినుం డాత్మమాయచే
నవతారములు నొంది దురితాత్ములనుగ్రబాధనుండి యీ
భువనముఁ బ్రోచు నప్పరమపూరుషు నాద్యు ననంతు నప్రమే
యవిభవు సర్వలోకజనునాశ్రయము దీనదయాళుఁ గొల్చెదన్.

### విశ్రవసు జననము.

తొల్లి కృతయుగంబునఁ బ్రజాపతిశ్రేష్ఠుఁ బులస్త్యుఁ డనునతఁ డుండెను. ఆతఁడు సర్వసుగుణసంపన్నుఁడై ధర్మమునుబట్టిగాని శీలమునుబట్టిగాని సాక్షాత్ప్రజాపతియేయని పొగడఁదగుచు దేవతలకెల్ల వల్లభుఁడై సర్వలోకప్రియుండుగా నొప్పెను.

ఆపులస్త్యుఁడు ధర్మపరత్వంబునం జేసి మేరుపర్వతంబునకుఁ జని యందుఁ దృణబిందువను రాజర్షి యాశ్రమంబున వసించుచు స్వాధ్యాయనియతేంద్రియుండై ఘోరతపము సల్పసాగెను.

ఆప్రదేశము సర్వఋతువులందు రమ్యమును సుభోగ్యమునై యుండుటం జేసి యచ్చటికి దేవకన్యకలును పన్నగాంగనలును రాజర్షితనయలును జని క్రీడించుచుండిరి. ఆయువతీరత్నముల మధుర గానాలాపంబులును నృత్యగీతం

గీ॥ అరిదిగఁ గవితాశాఖాగ్రమధివసించి
'రామరామ' యనెడి మధురాక్షరముల
మధురమధురంబుగాఁగఁ దన్మయతఁ బల్కు-
ననఘువాల్మీకికోకిలం బాత్మఁ దలఁతు.

మ॥ ప్రతిభానిర్మితనూత్నభావమయసామ్రాజ్యం బధిష్ఠించి శా
శ్వతులై ప్రాకృతజీవలోకశుభకాంక్షన్ సద్రసాసారసం
తతధారల్ గురియించి యక్షయమహానందంబు నశ్రాంతముం
బ్రతిపాదించెడిసంస్కృతాంధ్రసుకవిశ్రేష్ఠుల్ సమగ్రోన్నతుల్

చ॥ అనుపమచిత్తశుద్ధినిరుపాధికభక్తియుఁ దోఁప నిల్వ నే
యనఘుఁడు దాఁటె రామచరితాంబుధి సర్వజగన్నుతంబుగాఁ,
బ్రణతజనార్తిహారియు శుభప్రతిపాదియు నేమునకాత్మజా
యనిలతనూజుఁ [illegible] మనంబున నా[illegible] వాంఘ్రిపద్మముల్.

చ॥ ఎవనిసపర్యలం దలఁచి యెంతయు వందురు నాంధ్రవాణి యా
ప్రవిమలధీవిశారదుని బండితవర్యు నంచితరహా
స్యవివరణాద్వితీయుని గుణాగ్రమణిన్ భజియింతు మద్గురున్
వివిధకళాప్రపూర్ణు నలవేదము వేంకటరాయశాస్త్రులన్.

చ॥ పటుతరవాగ్మి యంచుఁ బ్రతిభామహితుం డని యార్తకోటికిం
బటువగునూతకొమ్మయనఁ బ్రస్తుతిఁగన్న రసజ్ఞమౌళిఁ బ్రా
కటకవితావినోది బుధగణ్యుని శ్రీయుత తూములూరు వేం
కట శివరామమిత్రమణి గాటపుఁగూర్మి దలంతు నిచ్చలున్.

ఉ॥ కేవలరామభక్తి పలికించినవైఖరి నిమ్మహాకృతిన్
ధీవరులార! వ్రాయుటకుఁ దెంపు వహించితి నంతె గాని ప్ర
జ్ఞావిభవంబుఁ జూపుటకుఁగాదు; రసంబు గ్రహించి పిమ్మ దో
షావళి నుజ్జగింపనగు హంసలు క్షీరము నీరముం బలెన్.

ఉ॥ ఆయతభక్తినీదుచరణాబ్జములన్ మదినిల్పి దొడ్డ రా
మాయణమంచుఁ బేరిడి యమానుషకంబగు నీచరిత్రమున్
వ్రాయఁగఁ బూనితిం దెలుఁగువాక్యముగాఁ గడుఁదెంపుసేసి, రా
మా! యెటు లీమనోరథము మన్ననచేయుదువో దయానిధీ!

ఉ॥ గీతలసేవచేతను జిగిర్చినచిత్తముఁ బెంపుగాంచఁగా
నాతతభక్తిమూలభవదంఘ్రులచల్లనినీడ స్టైచి నా
చేతులు మోడ్చితిం గరుణఁ జేకొని ప్రోవుము రామచంద్ర! యా
సీతను వాయునందనుని జిష్ణువిభీషణుఁ గన్నకూర్మితోన్.

ఉ॥ నీవవతార మెత్తుటయె నిక్కముగాదఁట, మాసకల్పనో
ల్లిఖితచిత్రమూర్తివఁట, చెల్లరొ సాధ్యమె నిన్నుఁ గాంచ దో
షావిలకర్మబద్ధజనుపాంధులకున్? బహిరాంతరాత్మ లీ
లావిధవాభిరాము సకలస్థితిమూలము, రామభద్రకా!

చ॥ అనృతముఁ బల్కు నన్న ముని యయ్యెను పక్కురి, కల్పితుండవై
తనరితివీవు నీదుచరితల్ ముసలమ్మలసుద్దు లయ్యె ని
న్ననయముగొల్చుటెట్టి హృదయంబును గ్రుడ్డినదుర్బలంబహో!
కన నగుఁగాదె యిట్టె కలికాలవిశేషము రామభద్రకా!

ఉ॥ అంతరమందు నీదుమధురాకృతి నిల్పి నిరంతరంబునై
శాంతికభక్తి చేయుమహితాత్ముల కెల్లను దోడునీడవై
చెంతఁ జరించుచుండుదువు సిద్ధము సుమ్మిది వక్రబుద్ధుల
త్యంతము నిన్ను లేదనిన యంతనె చెల్లున? రామభద్రకా!

ఉ॥ తొల్లిటిగాథ లేల? యిలతుర్కఁగపీసుని రామదాసునిన్
దల్లయుఁదైనయాతులసిదాసుని నమ్మఁగరాదె? వారలు
న్నల్లరులంచుఁ బల్కునవనాగరకాగ్రణులున్న నుండనీ;
చెల్లరొ! యంతమాత్రనె నశించునె సత్యము? కల్లనిల్చునే?

మ॥ చనెఁబో నేఁబదిరెండువర్షములు నాఁడున్నాఁడి, నన్నాళ్ళు న్నా
మిని నున్నన్ ఫలమేమి? యిట్టి బ్రతుకుల్ మిథ్యావినోదక్రియా
వినియోగాత్మకనాటకంబులుగదా, విశ్వేశ్వరుల్ నిన్నుఁగా
ననినాఁడింతట నేని దీర్పఁగదవే నాకోర్కి సీతాపతీ.

సీ॥ సిరిసంపదలఁగోరి సేవింపఁగా లేను
ప్రారబ్ధమును ద్రోయరాదుగానఁ
బేరుప్రతిష్ఠకై పెనఁగులాడుట లేదు
వర్తనంబును బట్టివచ్చుఁగాన,
భార్యాసంతులమేలు ప్రార్థింపఁగా లేను
వారివారకై నడుఁగాన
అద్వైతసిద్ధికై యాసింపఁగా లేను
ద్వైతవాసనయింకఁ దనరుఁగాన,

గీ॥ చిత్తమే ప్రొద్దునీయందె స్థిరతఁగాంచి
నీకథామృతపానైకనియతిఁ గల్గి
తావకేచ్ఛానుసారినై తరలునట్లు
ప్రేమతోఁ బ్రసాదింపుము రామచంద్ర.

శ్రీసీతారామాంజనేయప్రణవమస్తు.



# దొడ్డ రామాయణము.

## పూర్వకాండము.

ఉ. అసురవరప్రతాపమహిమాన్వితు స్వామిన్నగసేసినుఁ డాత్మమాయచే
ననుపరగఱుగు నొందు దురాత్ములదుర్భరబాధనుండి యీ
భువనముఁ బ్రోచు నప్పరమపూరుషు నాద్యు ననంతు నప్రమే
యు విభు సర్వలోకనమస్కృతు దీనదయాళుఁ గొల్చెదన్.

### విశ్రవసుజననము.

తొల్లి కృతయుగంబునఁ బ్రజాపతిక్రీఁ బులస్త్యుఁడనుసుతుఁ డుండెను. అతఁడు సర్వసుగుణసంపన్నుఁడై ధర్మమునుబట్టిగాని శీలమునుబట్టిగాని సాక్షాత్ప్రజాపతియేయని పొగడొందుచు దేవతలకెల్ల వల్లభుఁడై సర్వలోకప్రియుఁడుగా నొప్పెను.

ఆపులస్త్యుఁడు ధర్మపరత్వంబునంజేసి మేరుపర్వతంబునకుఁ జని యందుఁ దృణబిందువను మునీంద్రుని యాశ్రమంబున వసించుచు స్వాధ్యాయనియతేంద్రియుఁడై ఘోరతప మొనర్చసాగెను.

ఆ ప్రదేశము సర్వఋతువులందు రమ్యమును మనభోగ్యమునై యుండుటంజేసి యచటికి దేవకన్యకలును బన్నగాంగనలును రాజర్షితనయలును జని క్రీడించుచుండిరి. అచటి శ్రావ్యమైన మధురగానాలాపంబులును నృత్యగీతం

'అంత మాల్యవదాదులు మువ్వురు బ్రహ్మవరగర్వోద్ధతులై సురాసురులను బట్టి బాధింపసాగిరి. దేవర్షిచారణాదులెల్లరు వారినుండి కాపాడు రక్షకుని గానక నిరయం బందినవారలగుటను ననుకరించిరి. మఱియు వారు ముగ్గురట్లు నిరంకుశవర్తనులై చరించుచుఁ గొండొకనాఁడు విశ్వకర్మయొద్దకుఁ జని 'శిల్పవరేణ్యా! ఓజస్తేజోబలంబుల మాకు సాటి గలుగరు. దేవతలకు వారు కోరిన గృహంబులను స్వర్గప్రదేశముల నిర్మించి యిచ్చితివి. మాకుఁ గూడ నట్టి గృహంబులు కావలయును. హిమవత్పర్వతమందో మేరువునందో మందరగిరియందో నివసింపఁగోరుచుంటిమి. నీవు మాకుఁ గావించు గృహంబు మహేశ్వరుని గృహంబునకు దీటుగా నుండవలెను' అనిరి.'

'విశ్వకర్మ వారియభిప్రాయంబును విని 'రాక్షసులారా! దక్షిణసముద్ర తీరంబునఁ ద్రికూటపర్వతము గలదు. దానిశిఖరము మిన్నొరయు చుండును. అతిభయంకరులగు పక్షులు సైతము చేరనేరవు. అందుఁ బూర్వము దేవేంద్రుని ప్రీత్యర్థము లంకయను పేరఁ బురమొండు నిర్మించితిని. ఆపట్టణము నూఱుయోజనంబుల నిడివియు ముప్పదియోజనంబుల వెడల్పును గలిగి స్వర్ణప్రాకారంబులతో సౌధములతో తోరణంబులతో నొప్పారుచుండును. అనేకరత్నములు గలిగి మీకు నివాసయోగ్యము. అచ్చట నుండి మీరు ముగ్గురు దేవేంద్రునివలెనే సుఖింపుఁడు' అని చెప్పెను. మాల్యవదాదు లది విని మహాసంతోషముఁ బొంది మహాబలసైన్యముతో వానిని వీడ్కొని వచ్చి వేలకొలఁది యాతుధానులను వెంటఁగొని చని లంకాపురము చొచ్చి యందుఁ గాపురము చేసిరి.'

'ఆకాలంబున నర్మదయను గంధర్వాంగన యొక్తె యుండెను. ఆ యింతికి సుందరి, కేతుమతి, వసుధ యను పుత్రికలు మువ్వురు రూపలావణ్య మనోవిలాసంబుల శ్రీధీకీర్తులకు సమానలై యుండిరి. నర్మద యా మువ్వురను జ్యేష్ఠానుక్రమంబుగా మాల్యవత్సుమాలి మాలి యను మువ్వురకు నిచ్చి యుత్తరఫల్గునీనక్షత్రంబునఁ బరిణయము చేసెను. అందు సుందరీమాల్యవంతులకు వజ్రముష్టి విరూపాక్షుఁడు దుర్ముఖుఁడు సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడు మత్తోన్మత్తుఁడు అనువారలును అనల యను పుత్రికయు జనించెను. సుమాలి కేతుమతియందుఁ బ్రహస్తుఁడు అకంపనుఁడు వికటుఁడు కాలకా

రొనొప్పొగినిఁ జేరికిగొనక త్రేతాగ్నులకరణిఁ బ్రజ్వరిల్లుచు మాస్థానంబులెల్ల నపహరించిరి. దిక్కేది మేము దిమ్మరులమైతిమి. ఆ మాల్యవదాదులు త్రికూటశిఖరంబునందలి దుర్గమంబగు లంకాపురంబున నున్నారు. అందుండి వారు మమ్ముఁ గావించు గాఱియలకు మేర లేదు. మధుసూదనా! నిన్ను శరణజొచ్చితిమి. నీవే మాకు దిక్కు. మదోద్ధతులైన యారాక్షసులను సానుబంధంబుగా భాస్కరుఁడు నీహారమట్లు నీవు హరించునందాక మాభయంబులు తీఱవు. మాయెడఁ బ్రసన్నుఁడ వగు' మని విన్నవించిరి.'

'జనార్దనుఁడు వారిదీనాలాపంబులు విని కనికర మూని 'సురలారా! ఇఁక మీరు భయంబులు మానుఁడు. సుకేశునిపుత్త్రులు మాల్యవదాదులు నాకుఁ దెలియనివారు కారు. వరదర్పితులై మట్టుమీఱియున్న యాతులవలను సంహరింతు' నని పలికెను. దేవతలంత సంతుష్టులై విష్ణువునకు మ్రొక్కి తమతమతావులకుఁ జనిరి.'

'దేవతలప్రయత్నంబుల నెల్ల మాల్యవంతుఁడు విని తమ్ములను జేరి 'సోదరులారా! వింటిరా దేవర్షులజల్పనంబులు? వారు మనచావుఁ గోరి శంకరునకు మొఱలిడిరి. అతని తనవలనఁ గాదని యాయంధకారి చెప్పెను. గత్యంతర మేమని వారు నడిగిరి. శ్రీమన్నారాయణుని శరణంబు మని ముక్కంటి యుపాయము బోధించెను. వారును నట్లే యొనర్చిరి. ఆవైకుంఠుఁడు మునులకు నభయమిచ్చి మనవధకు బ్రతిజ్ఞ చేసెను. కర్తవ్యము నాలోచింపుఁడు. నిర్జరులను భగ్నించినకారణంబున హిరణ్యకశిపుఁడును నముచియుఁ గాలనేమియు వీరసత్తముఁడైన సంహ్రాదుఁడును బహుమాయుఁడును రాధేయుఁడును యమళార్జునులును హార్దిక్యుఁడును శుంభనిశుంభులును దదితరులును మహాబలపరాక్రమవంతులయ్యు సర్వాస్త్రకుశలులయ్యు నారాయణునివాతఁబడి వేనవేలుగా మనపూర్వులు మడిసిరి. జనార్దనుఁడు మనకు అవంశ్యవైరి యనుమాట మఱవక ప్రకృతము విచారింపనగును. వానిని జయించుట కష్ట' మని చెప్పెను.'

'ఆమాటలెల్ల మాలియు సుమాలియు విని 'అన్నా! వ్యాధిమగణంబులు మనకుఁ గెలుగవు. ఇది బ్రహ్మవరము; విరించిపలుకు తప్పదు. ఆవరమహిమంబునం జేసి యక్షోభ్యమైన దేవసాగరంబుఁ జొచ్చి కొల్లలాడితిమి.

ఇంద్రుఁడు దిక్కులు ప్రాఁకెను. రుద్రునిమాట నీవే వచించితివి. నారాయణుఁడా ? అతఁడేపాటి ? యముఁడంతటివాఁడే మనమ్రోల నిలువ నోపఁడనఁగా విష్ణువుజిష్ణువుఁ జెప్పనేల ? అదటుండనిమ్ము. విష్ణువునకు మనము గోరంత యపకారమైనను జేయలేదు. అతఁడు మనలను ద్వేషింపనేల ? దేవతలదీనాలాపంబులకు మది చలించి వారినోదార్చుటకుగా నతఁడట్లనియుండును. అన్నిటికి దేవతలే కారకులుగా నున్నారు. అయ్యమరులను బరిమార్చుదము. అంతతో వైరబీజము సమసిపోవు' ననిరి. మాల్యవంతుఁడును వల్లె యనెను.'

'క్షణములోన రాక్షససేనావాహిని వెల్లివిరిసెను. స్యందనంబు లధిష్ఠించి కొందఱును, గిరిసన్నిభములైన వారణంబు లెక్కి కొందఱును, బవనజవంబుగల హయంబులమీఁదఁ గొందఱును, ఖరంబు లారోహించి కొందఱును ఉష్ట్ర వృషభ శింశుమార భుజంగమ మకర కచ్ఛప మీన విహంగంబుల పయిఁ గొందఱును, సింహ వ్యాఘ్ర వరాహ సృమర చమరీ మృగంబుల మీఁద మఱికొందఱును, రాక్షసపుంగవులు దాడి వెడలిరి. మాల్యవదాదులు వారిని వెంటఁగొని మొట్టమొదట యముని పైనకు నడచిరి.'

'రాక్షసు లట్లు యుద్ధోత్సాహులై నగరు వెడలినంతనే లంకాధిష్ఠాన భూతఁబులెల్ల విమనస్కము నొందెను. భౌమంబులు నాంతరిక్షంబులు నైననిమిత్తంబులు భయావహముగాఁ దోఁచెను ; అస్థి మేధ శోణితంబులు వర్షించెను ; సముద్రము చెలియలికట్ట నతిక్రమించెను ; పర్వతంబులు చలించెను ; మేఘనిర్ఘోషాట్టహాసంబు లుప్పతిల్లెను ; వఱఁదులు దారుణంబుగాఁ గూసెను ; భూతఁబులు రాలసాగెను ; గృధ్రంబులు మంటలు గ్రక్కుముఖంబులతోఁ బిండుగట్టి మింటఁ జరించెను ; గగనతలంబునుండి కొఱవులు రక్కసులపైఁ గురిసెను ; శారికాకపోతంబులు విద్రుతంబుగాఁ బఱచెను ; కాకబిడాలంబు లుద్భటారావంబులు గావించెను.'

'అట్లు భౌమాంతరిక్షనిమిత్తంబులు మహాభయావహముగాఁ దోఁచినను రాక్షసులు బలగర్వోన్నతిం జేసి యాయుత్పాతంబుల లెక్కసేయక మృత్యుపాశబద్ధులై యీడ్వఁబడువారువోలె నిలువక చనిరి. వారిసముద్యోగంబును దేవదూతలవలన నారాయణుఁడు విని యుద్ధసన్నద్ధుఁడై యాయుధతూణీరం

బులు సంతరించి కోటిసూర్యప్రకాశమైన దివ్యకవచంబుఁ దొడిగి శ్రోణీసూత్రంబును బంధించి శంఖచక్రగదాఖడ్గంబులను సవరించి గరుడవాహనారూఢుఁడై కాంచనగిరిశృంగంబున సతటిజ్జీమూతమట్లు శోభిల్లుచు హుటాహుటిఁ దరలెను. సిద్ధచారణగంధర్వులు పాడిరి. దేవర్షులు జయంబులు పలికిరి. గరుడుఁడు టెక్కెలు విదలించెను. ఆగాలివడికి వైరిసైన్యము విక్షిప్తశస్త్రము భ్రమత్పతాకమునై క్షోభించి యుబ్బెత్తలూఁగెను.'

'రాక్షసాంబుదంబులు గర్జించుచు శరములు వర్షించుచు నారాయణుని ముట్టడించెను. నల్లనిన క్తంచరులు శ్యామవదాతుఁడగు విష్ణువును జుట్టియుంటఁ జూడఁగా వర్షమాణపయోధరంబు లంజనాద్రిని జుట్టిన వైఖరి దోఁచెను. రాక్షసధనుర్ముక్తబాణంబులు వజ్రానిలమనోజవంబులఁ జని మిడుతలు కేదారంబును మశకంబులు పర్వతంబును దంశంబులు మధుఘటంబును మకరంబులు సాగరంబును వలె హరిని గ్రమ్ముకొని లోకంబులు ప్రళయంబునం దట్లాయెను. రథారూఢులు రథంబులను, గజారూఢులు గజంబులను, హయారోహకులు హయంబులను, మాధవునిపైకిఁ బురికొల్పిరి. కొందఱు శరపరంపరల నుర్విరి; కొందఱు శక్తితోమరంబులను బఱపిరి. అవియెల్ల మూఁగి హరికి నూపిరాడనీయవయ్యెను. ఆమహనీయుఁడు కోపము వహించి కోదండంబును బూని మనోజవంబులును వజ్రసన్నిభంబులునైన శరంబులను సంధించి యాకర్ణాంతము దివిచి పుంఖానుపుంఖంబుగా సారించెను. సూర్యునుండి కిరణంబులట్లు సాగరంబునుండి తరంగంబులకరణి, పర్వతంబులనుండి నాగేంద్రంబుల చందాన, మేఘంబులనుండి ధారాపాతముక్రియ, మాధవునికోదండంబునుండి శరంబులు, పరంపరలుగా నుప్పతిల్లి రాక్షసయూథంబును గప్పెను. వారు దిక్కఱి శరభంబులకు సింహంబులట్లు, సింహంబులకు ద్విపంబులవలె, ద్విపంబులకు వ్యాఘ్రంబులకరణి, వ్యాఘ్రంబులకు ద్వీపులక్రియ, ద్వీపులకు శునకంబులవిధి, శునకంబులకుఁ బిల్లులరీతిఁ, బిల్లులకు సర్పంబులపోలిక, సర్పంబులకు నెలుకలచాయఁ బఱచుచు బొబ్బలు దూఱుచుఁ గళవళించుచుఁ గుందుచు మ్రందుచుఁ బటాపంచలైరి. అందుఁ గొందఱు వజ్రఘాతంబుల శైలంబులట్లు కూలిరి; మఱికొందఱు వ్రణాంకితులై పర్వతంబులు స్వర్ణధారలట్లు రక్తధారల నోడ్చిరి.'

'నారాయణుఁ డట్లు గావించి పాంచజన్యంబును బూరించెను. ఆ శంఖారావము త్రైలోక్యవ్యథాకరంబుగా ధ్వనింప నమ్మహానిర్హ్రాదంబునకు హతశేషులగు రక్కసులు గుండియలు వ్రీలి ససిచెడి మృగరాజు చొచ్చిన కరియూథంబు చాడ్పునఁ జెల్లాచెదరై పడుచు లేచుచు లంకదారిఁ బట్టిరి. అసురసైన్య మట్లగుట సుమాలి గాంచి కోపక్రోధమూర్ఛితుఁడై విష్ణువును దలపడి వానిపయి నంపవానఁ గురిసి నిజసైన్యసముజ్జీవనార్థ మాయన సింహనాద మొనర్చి గజరాజు తుండంబునుబోలెఁ దనహస్తంబును వీచెను. నారాయణుఁ డంత శరంబొండు వైచి తత్సారథి శిరంబును ద్రుంచెను. వానిపాటునకు రథాశ్వంబులు భయభ్రాంతిఁ గొనెను; రథము తికమక లయ్యెను; సుమాలి భ్రమచెంది భ్రాంతేంద్రియుఁడుగాఁ దోఁచెను.'

'సుమాలియట్లగుటకు మాలి మహోగ్రమూర్తియై చాపంబును గరతలంబున సంధించి వెన్నునిపయి నుఱికి వానియెద గురిచేసి కార్తస్వర విభూషితంబులగు బాణంబులను వైచెను. ఆ తూపులు క్రౌంచపర్వతంబును హంసలట్లు హరిశరీరంబును జొచ్చెను. జితేంద్రియుఁ డాధికిపలె జనార్దనుఁ డందులకు సుంతయుఁ జలింపక ప్రత్యస్త్రంబుల నయ్యసురునిపయిఁ బఱపెను. వజ్రవిద్యుత్ప్రభాభాసురంబులైన యాశరంబులు మాలిదేహముఁ జొచ్చి నాగంబులు సుధారసంబు నట్లు వాని రుధిరంబులను గ్రోలెను. విష్ణువట్లు వానిని నొప్పించి తదీయరథ ధ్వజచాపతురంగంబులఁ ద్రుంచెను. మాలి కోపస్ఫూర్తి వహించి మధ్యందిన చండభానుని పగిది మండిపడి గదఁ బూని పర్వతాగ్రంబునుండి కేసరివోలె రథంబునుండి దుమికి గరుడుని లలాటంబున వైచెను. ఆ వ్రేటువడికి వైనతేయుఁడు వేదనాతురుఁడై మోము మఱలించెను. అది చూచి మాలి మహాట్టహాస మొనర్చెను. నారాయణుఁడు పక్షీంద్రునకుఁ గోపించి వెడవాటుగానుండియు మాలిమీఁదఁ జక్రంబును బ్రయోగించెను. కాలచక్రమునుబోని యాచక్రము రవిమండలమువలెఁ బ్రకాశించుచుఁ బోయి మాలి శిరంబును ఖండించెను. ఆ తల మింటి కెగసి వేఁడి నెత్తురులు గార్చుచుఁ దవ్వునఁ బడెను. సురలు సంతుష్టులై సాధువాదంబులు పలికిరి.'

'మాలిచావునకు సుమాలి మాల్యవంతులు బెగ్గడిల్లి శోకసంతప్తులై

లంకాపురమువంకఁ బరుగెత్తిరి. అంతలోన గరుడుఁడు తెప్పరిల్లి కోప ప్రచండుఁడై ఱెక్కలల్లార్చెను. వాని ఱెక్కల గాలివడికి రక్కసులు నొగుడాకులక్రియ దవ్వునబడి తలలు తెగి కొందఱును, గుండియలు వ్రీలి కొందఱును, జూర్ణితాంగులై కొందఱును, మడిసిరి. మాల్యవంతుని హరి వెంబడించెను. ఆ రక్కసుఁ డది చూచి సంరక్తలోచనుఁడై పద్మలోచ నునివంక మరలి 'నారాయణా! పురాతనమగు క్షత్త్రధర్మంబును మఱ చితివా! భయపడి యుద్ధము మానిన మమ్ముఁజంప నగునా? పరాఙ్ముఖవధఁ గావించుపాపి నరహంత యగునుగదా! పుణ్యకర్మసాధ్యమగు స్వర్గము వానికి దవ్వుగాదా? యుద్ధశ్రద్ధ నీకున్నదందువా? అట్లయిన నిదిగో రమ్ము నీబలమెల్లఁజూపు మని యెద యిచ్చి నిలిచెను.'

'అట్లు మాల్యవంతుఁడు మాల్యవంతము పగిది నిల్చిన హరి వానిం గాంచి 'మీకు వెఱచియున్న దేవతలకు నభయ మిచ్చితిని. నా మాటను జెల్లించుకొనుటకై రాక్షసోత్సాదనమునకు నవసరమయ్యెను. సురలకార్యము నాకుఁ బ్రాణప్రియము; కావున రాక్షసులు రసాతలమున చొచ్చినను వారిని వదలక మర్దింతు నని పలుకుచు నేమఱియుండెను. అది యవసరంబుగా మాల్యవంతుఁడు శక్తి నెత్తి హరి భుజాంతరంబున వైచెను. ఆ శక్తియు ఘంటాస్వన పురస్సరంబుగాఁ జని హరియెదఁదాకి మేఘాంతరంబున శత హ్రదవలె మెఱసెను. శక్తిధరప్రియుఁడగు విష్ణు వాశక్తినే గైకొని మాల్యవంతు నుద్దేశించి ప్రయోగించెను. అది గోవిందకరనిస్సృతమై యురవడించి చని మణిహార సముజ్జ్వలంబును విశాలంబునైన మాల్యవంతుని యురోభాగంబును గిరికూటంబును బిడుగువలెఁ దాఁకి వాని కవచంబును వ్రీల్చెను. వాఁడు సుంత చలించి తెప్పిఱిల్లి కంటకావృతమైన శూలంబు నొండు దివిచి నారాయణవక్షోభాగమును గుఱిచేసి వైచి గరుడుని దాడించి దవ్వు నిలిచెను. వైనతేయుఁడు మహోగ్రమూర్తియై ఱెక్కలల్లార్చెను. ఆ వాయువేగంబునకు సుమాలి ససైన్యంబుగా దవ్వు వీవఁబడి లంకలోఁ బడెను.'

'రక్కసులట్లు హరివలన బహుభంగుల భంగపడి సేనానాయకులను బెక్కండ్రఁ గోల్పోయి విష్ణు నెదురింప నోపక లంకానివాస మెప్పటికేని

ప్రాణోపద్రవకరమని నిశ్చయించుకొని పుత్త్ర మిత్త్ర కళత్త్ర పరివారంబుగాఁ బాతాళంబునకు వలసపోయిరి.'

వత్సా! నాఁడు సుత లంకానగరము శూన్యముగానున్నది.'' వైశ్రవణుఁడు తనతండ్రిమాటప్రకారము లంకయందుఁ గాపురముచేసెను.

రావణాదుల జననాదికము.

'సుమాలికిఁ గైకసి యను పుత్త్రిక గలదు. ఆబాలిక పద్మాలయమును వదలి వచ్చిన లక్ష్మియో యన నుండెను. సుమాలి యాకూఁతును వెంటఁ గొని రసాతలమునుండి వచ్చి మర్త్యలోకసంచారవినోదంబులఁ దనుపుచుండెను. ఒకనాఁ డతఁ డట్లు సంచరించుచు విశ్రవసుఁడున్న యాశ్రమము డాయ వచ్చెను. ఆసమయంబున ధనేశ్వరుఁడు పుష్పకవిమానముమీఁద వచ్చి తండ్రికి విశ్రవసునకు మ్రొక్కి పోవుచుండెను. సుమాలి యావైశ్రవణుని గాంచి విస్మయ మంది 'కటా! రాక్షసకులమున కెంత దాపరించెను! మేము సన్నగిల్లుటచేతఁగదా వీరికింతటి సిరి యబ్బుట! ఏమి సేయునగు?' నని మహాచింతాక్రాంతుఁడై రసాతలంబునకుఁ బోయి పెద్దయుం దడవు సొలపోసి పుత్త్రికను బిలిచి 'అమ్మా! నీకు యౌవనము సంప్రాప్తమయ్యెను; ప్రదానకాలము వచ్చెను. తిరస్కరింతువో యని వెఱచి స్వయముగా నిన్నెవ్వఁడును వరింపఁడు. నీవన్ననో సాక్షాత్ లక్ష్మిని బోలుదువు; ఏతన్మాత్రులకు నిన్నొసఁగనొల్లము. తగువరునకై సర్వప్రయత్నము లొనర్చితిమి. ఇందాక యత్నసిద్ధి గలుగదు. మానాభిమానులకుఁ గన్యాపితృత్వదుఃఖ మింతనరాదు. కన్యవలనఁ దల్లివంశమును, దండ్రివంశమును, భర్తృవంశమును మూఁడు నుద్ధరింపఁబడును. ఆమూఁడువంశములకీర్తిగాని, యపకీర్తిగాని కన్యనుబట్టి యుండును. పుత్త్రీ! మునివరంబునఁ బ్రజాపతికులంబున జనించితివి. నాచూచినంతలో విశ్రవసుఁడుదక్క నొండు నీకుఁ దగఁడు. పౌలస్త్యవంశ్యుఁడైన యమ్మహానీయుని వరింపుము; కుబేరసదృశులైన పుత్త్రులు నీకుఁ గలుగుదురు' అని చెప్పెను.'

'కైకసి యంతఁ దండ్రిమాట నొదలఁ దాల్చి విశ్రవసుఁడున్న యాశ్రమంబునకుఁ బోయి యట నగ్నిహోత్రము నుపాసించుచు నాల్గవయగ్నివలెఁ దేజరిల్లుచున్న యామునిపుంగవుని డాసి సమయాసమయంబులు విచారింపక వానిచరణంబులు మెట్టి యెదుట నిలిచి యధోముఖియై యంగుష్ఠాగ్రంబున

నేల రాయుచుండెను. విశ్రవసుఁ డాపూర్ణచంద్రనిభాననను జూచి 'సుమంగళీ! ఎవనితనయవు? ఇందేల వచ్చితివి? నీతలఁపేమి? ఏమి వలయునో చెప్పు' మనెను. కైకసి యంతఁ జేదోయి గీలించి 'మునివరా! నామతము మీకు స్పష్టము; న న్నడుగ నేల? నాతండ్రి యాజ్ఞమేరకు నిందు వచ్చితిని; నాపేరు కైకసి యందురు; నాతండ్రి సుమాలి' యని వినయమధురంబుగాఁ జెప్పెను.'

'విశ్రవసుఁడంత ధ్యానగతుఁడై సుంతతడవునకుఁ గను విచ్చి 'కళ్యాణీ! నీమనోగతము తెలిసెను. నావలన సుతునిఁ గోరి యిందువచ్చితివి. నీ యిచ్ఛ యగుఁగాక. నీవు నన్నాశ్రయించిన సమయము దారుణమైనది గావునఁ దత్ఫలంబుగా నీసుతులట్టివారే యగుదురుగాక' అనెను. ఆకన్య యామాట విని సాష్టాంగ ప్రణామ మొనర్చి 'మహాత్మా! బ్రహ్మవాది వగు నీవలన నిట్టి దురాచారులఁ బడయనొల్లను. నాయెడఁ బ్రసన్నుఁడ వగు' మని ప్రార్థించెను. ఆముని పుంగవుఁడు కరుణించి 'తన్వీ! ఓడకు; నీకడపట్టి సుతుఁడు నావంశానురూపుఁడును ధర్మాత్ముఁడు నగుఁ బొమ్ము' అనెను.

కైకసి యంతఁ గొన్నాళ్లకు గర్భవతియై మహా భీభత్సాకారుని గాంచెను. అతఁడు పదితలలు నిరువదిచేతులుఁ గలిగి దంష్ట్రాకరాళుఁడై కాటుకరాశివలెఁ జూపట్టుచు వెఱపించుచుండెను. వానిపుట్టుకకు శివంబులు నోట నిప్పులు రాల్చెను; క్రవ్యాదంబు లపసవ్యంబుగా మండలాకృతిఁ బాఱెను; రుధిరంబులు వర్షించెను; మేఘంబు లాక్రందించెను; సూర్యుఁడు నిస్తేజుఁడయ్యెను; మహోల్కలు పడెను; ధరాతలంబు చలించెను; ప్రలయఝంఝానిలంబులు వీఁచెను; సముద్రుఁడు ఘూర్ణిల్లెను.

ఆ శిశు వుదయించినంతనే యచ్చటికి వానితండ్రి విశ్రవసుఁడు వచ్చి తదీయాకారముఁ గాంచి వానికి దశగ్రీవుఁడను సార్థకనామ మిడి చనెను. అనంతరము మఱియొక సుతుఁ డాకాంతకు నుదయించెను. అంతటి యున్నతుఁడు మఱియొండు గలుగఁడు. వానికిఁ గుంభకర్ణుఁడను పేరు పెట్టిరి. వాని వెనుక యొకపుత్త్రి జనించెను. దానిని శూర్పణఖ యనిరి. కట్టకడపట వెండియుఁ గుమారుఁ డొకఁ డుద్భవించెను. వాని జననకాలంబునఁ బుష్ప

వృష్టి కురిసెను; దేవదుందుభులు మ్రోఁగెను; అంతరిక్షంబున సాధువచనం బులఁ బలికిరి. వానిని విభీషణుఁడనిరి.

దశగ్రీవుఁడు బాల్యంబుదొట్టి లోకోద్వేగకరుఁడై చెలరేఁగెను. కుంభకర్ణుఁడు కంటఁబడిన మహర్షులను మ్రింగసాఁగెను. ముల్లోకంబులను భక్షించినను వానికిఁ దృప్తికాకుండెను. విభీషణుఁడు మాత్రము ధర్మపరుఁడై స్వాధ్యాయ నియతాహార వ్రతముఁబూని విజితేంద్రియుఁడై యుండెను.

ఇట్లుండఁ గొండొకనాఁడు ధనేశ్వరుఁడు పుష్పకవిమానమెక్కి పితృదర్శనార్థము వచ్చెను. కైకసి యాధనపతిని గాంచి తదీయవిభవంబు నోర్వనిదై దశగ్రీవునిఁ జీరి 'పుత్రా! నీయన్న వైశ్రవణుని జూతువా? భ్రాతృభావము మీయిరువురకు సమానముగా నున్నను వాని దివ్యవైభవము నీకుఁ గలుగదుగదా. నాయనా! మీ రిట్టి విభవాభిరాములగుట నేనుజూడ నోతునా? సర్వము యత్నాధీనమందురు. నీవును కుబేరునకు సాటి కారాదా?' యని వ్యసన కలుషస్వరంబునఁ బలికెను. దశగ్రీవుఁడు తల్లి పలుకులు విని మహోదగ్రము నొంది 'జననీ! నీయెడదరు మానుము. కుబేరునకు సాటియో వానికన్న నధికుఁడనో కాకున్న నాదియును నొక బ్రదుకా? అట్లు కానినాఁడు నన్ను మఱచిపొమ్ము; ఇదే ప్రతిజ్ఞ సలుపుచున్నాను.' అని పలికి యామంటతోనఁ దమ్ములవెంటఁగొని వెడలిఁ గోకర్ణాశ్రమము చేరి యందు దుష్కరమైనతపం బాచరింపఁ దొడఁగెను.

వారితపఃక్రమ మిట్లని వచింపరాదు. అందు దశగ్రీవుఁడు నిరాహారవ్రతముఁ బూని దీర్ఘతపోనిష్ఠ నిల్చి వేయేండ్ల కొకొక్కతలవంతున ఛేదించి హోమముచేయుచుఁ దొమ్మిదివేల సంవత్సరములకుఁ దొమ్మిదితలలు వ్రేల్చి పదియవవేయి సమాప్తమైనంతఁ బదవశిరస్సును గూడఁగోసి హోమమొనర్పనుండెను. అప్పుడు పితామహుఁడు దేవతలతోడ వెడలి వచ్చి 'దశకంఠా! నీకుఁ బ్రీతుఁడ నైతిని. కోరుము వరము; కోరినదిచ్చెద' ననెను. దశగ్రీవుఁడు సంతసించి నలువకుఁ దలతోడ మ్రొక్కి 'దేవా! ప్రాణులకు మరణభయంబును మించినభయము గలుగదు; మృత్యువుసాటి శత్రువును గలుఁగఁడు. 'జీవన్ పశ్యంతిభద్రాణి' యందురు. నిఖిల సుఖానుభవంబునకు జీవము ముఖ్యము. అది పోలనినాఁడు తక్కినవెల్లఁ గల్గియు నిష్ఫలంబు.

కావున నమరత్వంబును వేడుదు'ననెను. బ్రహ్మ యాకోరికను విని 'దశగ్రీవా! సర్వామరత్వంబు నొసంగ నెవరికిని దరముగాదు. వేఱొండు గోరు'మనెను. దశగ్రీవుఁడు ప్రాంజలియై 'స్వామీ! అట్లగునేని, సుపర్ణనాగయక్షులవలనఁ గాని దైత్యదానవరాక్షసులవలనఁగాని దేవతలవలనఁగాని నాకుఁజావు రాకుండునట్లు వరమును బ్రసాదింపుము. ఇతర ప్రాణులవలని చింత యీషన్మాత్రముగూడ నాకు లేదు. మానవులో యనిన వారుతృణప్రాయులు గదా' యని వచించెను. పరమేష్ఠి వాని యజ్ఞానగర్వోద్ధతులకు విస్మయ మంది

'కర్ణస్య కండూయనకేన వాపి దంతస్య నిష్కోషణకే నాపివా
తృణేన కార్యం భవ తీశ్వరాణాం కిమపి వాక్పాణిమతా నరేణ ॥'

అనువాక్య మితఁడు వినఁడు కాఁబోలు ; 'మతి యెంతో గతి యంతే గదా' యని తలఁచి 'దశకంధరా ! నీకోరినట్లే యగుఁగాక. నిన్ను మెచ్చితిని గావున నీయడుగనివరమును గూడ నిచ్చుచున్నాను. నీవు వ్రేల్చినతలలు తొమ్మిది మరల మొలఁచుగాక ; కోరినరూపంబును ధరింతువుగాక' అని వచించి చనెను. పరమేష్ఠిమాటతోడ దశగ్రీవునితలలు తొమ్మిది మొలచెను.'

కుంభకర్ణుఁడు తీవ్రదీక్షఁ బూని వేసవియందుఁ బంచాగ్నిమధ్య నిల్చియు, వర్షాకాలంబున జడివానలో నుండియు, శిశిరంబున నీటమునింగియుఁ బదివేలయేండ్లు తపంబొనర్చెను. వాని తపోవహ్నికి లోకంబులు క్రాఁగెను. విధాత యయ్యాపదఁబాప నెంచి కుంభకర్ణునియొద్దకుఁ బోనుండెను. దేవత లది యెఱిఁగి పితామహునకు దోయి లొగ్గి 'తండ్రీ ! కుంభకర్ణుఁడు లోకఁబుల నెట్లు గాసించినది మఱచితివా ? ఈదుర్మతి నందనవనంబుఁ జొచ్చి యట నచ్చరలేమల నేడ్వుర నొకపెట్టున దిగమ్రింగెను ; మహేంద్రానుచరులను బదుగురఁ దృటిలో భక్షించెను ; పెక్కండ్రు ఋషులను మెసవెను. ఈకూళ తిన్నట్టి నరులకు లెక్కయే లేదు. ఎట్టిపరబలంబును లేకయే యింత యొనర్చిన యీదురాత్మునకు నీవు వర మిచ్చుచో నీసృష్టి యెల్ల నామావశిష్టయగును. మామొఱ లాలకించి వరవ్యాజంబున నితనిని మోహవివశు నొనర్చి లోకంబులను రక్షింపుము. ఈసేఁత వీనికి శిక్షయగుఁగాక' అని ప్రార్థించిరి. నావుడు బ్రహ్మ సుంత చింతించెను. తోడ్తోడ

సరస్వతీదేవి వానిపార్శ్వంబునఁ దోఁచి ప్రాంజలి యొనర్చి 'దేవా! సెల విమ్మ' నెను. ప్రజాపతి వాణిం గాంచి 'దేవీ! ఈరక్కసునినోట నిల్చి దేవతలప్రణయంబును దీర్పు' మనెను. శారద వల్లె యనెను.

అంతఁ బ్రజాపతి కుంభకర్ణునొద్దకుఁజని 'కుంభకర్ణా! ఇష్టవరంబును గోరు' మనెను. వాఁడామాట విని కన్నువిచ్చి చూచి 'దేవా! నిద్రాత్వ మునిమ్ము' అనెను. అట్లే యని పలికి బ్రహ్మ చనెను. కొంతవడికిఁ గుం భకర్ణుఁడు తెలివొంది 'అహో నిత్యత్వ మనుటకు మాఱుగా నిద్రాత్వమును గోరి కీడు తెచ్చికొంటిని గదా. కటా! ఎంతమోస మయ్యెను' అని బహు భంగులఁ జింతించి' ఇదంతయు దేవతలు గావించిన వ్యామోహఫల' మని నిశ్చయించుకొనెను.'

అట విభీషణుఁడు ధర్మపరమతిం దగిలి శుచియై యొంటికాల నిలిచి యైదువేలయేండ్లు తపంబొనర్చి యనంతరము మఱియైదువేలేండ్లు సూర్యునను సరించుచుఁ దలయు బాహువులును బయి కెత్తి స్వాధ్యాయధృతమానసుఁడై నందనంబున స్వర్గస్థుడువోలె విడువనినిష్ఠఁ దవిలి యుండెను. అతనినియమ ము సమాప్తమైనంతనే పుష్పవర్షము గురిసెను; అచ్చరలాడిరి. అంతఁ బితామహుఁడు ప్రత్యక్షమై 'వత్సా! నీధర్మబుద్ధికి మెచ్చితిని; వరము గోరు' మనెను విభీషణుఁడు నలువకు సాష్టాంగమొనర్చి 'దేవా! లోక గురుఁడవైననీవు స్వయముగా నాయెదుటఁ దోఁచి యిట్లడుగుటచేతనే కృత కృత్యుఁడ నైతిని. అయిన నొక్కటిఁగోరుదు. ఎంత యాపద నైకొన్నను నాబుద్ధి ధర్మమును బాయకుండుఁగాక; అశిక్షితముగా బ్రహ్మాస్త్రము నాకుసిద్ధించుఁగాక. ఏయాశ్రమము ననుష్ఠింతునో యాయాశ్రమమునకు నుచితమైన ధర్మనిరతి నాబుద్ధియందుఁ బ్రవర్తిల్లుఁగాక. ఇవి నాకుఁ బర మాభీష్టములు; ధర్మాభిరక్తులకు దుర్లభంబు గలుగదు గావున ధర్మమునే వరిం తు' నని వినయపురస్కారంబుగా వచించెను. నావుడు విధాత లేనగవు మోము నలంకరింపఁ గరుణార్ద్రదృష్టితో విభీషణుని జూచి 'వత్సా! రాక్షస కులోత్పన్ను లెక్కడ? ధర్మాభిరతి యెక్కడ? ఇది నీయందు విపరీతము; నీకెంతయు సంతసింతు; నీయడిగినవేగాక యమరత్వంబును గూడ నీకిచ్చితి' నెను; విభీషణుఁడు తలతోడ నవ్వరంబులను గ్రహించి మహాప్రసాద

మని పలికి పరమేష్ఠికి సాష్టాంగ మొనర్చెను. అంత నలువ యంతర్హితుఁ డాయెను.

దశగ్రీవుఁడు దనుజరాజ్యాభిషిక్తుఁ డగుట.

దశకంధరాదు లట్లు వరంబు లంది శ్లేష్మాతకవనంబున జనకునితోడ సుఖముండిరి. వారట్లు వరంబులఁ బడయుట సుమాలి విని సంతోషవశుఁ డై మారీచ, ప్రహస్త, విరూపాక్ష, మహోదరాది సచివులను వెంటఁగొని రసాతలమునుండి వెడలి పంక్తికంఠునొద్దకు వచ్చి వానిఁ గవుంగిటఁ గూర్చి యభినందించి 'నాయనా! పరమేష్ఠివలన నీవింత యుత్తమవరంబులఁ బడయుటంజేసి నాచిరమనోరథ మీడేరిన ట్లయ్యెను. ఎవనికి వెఱచి స్వస్థానమగులంకాపురంబును ద్యజించి రసాతలంబునకు వలస వచ్చితిమో వాని వలనిభయము గూడ నేఁటితో సమసిపోయెను. వత్సా! లంకానగరము మనపురముగాని యొరులదిగాదు. అయినను విష్ణువునకు నోడి యందుండి పాఱివచ్చితిమి. ఇప్పుడచట నీయన్నకుబేరుఁ డున్నాఁడు. సామముచేత నొండెఁ దానమువలన నొండెః బరాక్రమంబున నొండె లంకానగరంబును వశపఱచుకొనుము. అట్లగునేని నీకు లంకేశ్వరత్వము సిద్ధించును; నీవలన మనరాక్షసకులమెల్లఁ బ్రకృతిమరవస్థను బాసి తలయెత్తనోపును. మేమెల్ల రము నిన్నుఁ గొలిచి సుఖముందు' మనెను.

దశగ్రీవుఁ డాసలహా విని 'తాతా! కుబేరుఁడు నాయగ్రజుఁ డం టివి. అన్నయనఁ దండ్రియంతటివాఁడు. వానిఁ గపయమున మీ రిట్లాడ నగునా?' యని యడిగెను. సుమాలి వానిమనంబు గ్రహించి నాఁటికి మిన్నకుండెను. కతిపయదినంబులు చన్నంతఁ గొండొకనాఁడు మఱల నాసంగతి ప్రస్తావమునకు వచ్చెను. ప్రహస్తుఁ డది యవకాశముగాఁ గొని 'దశగ్రీవా! శౌర్యవంతులు మానమేమను లెంచరు. అన్నదమ్ము లనెడిభావము శూరు లందుగలదా? తొల్లిఁటి పరాక్రమవంతులచరిత్రలు వినవా? అదితి దితి యనువారు అక్కాచెల్లెండ్రుండిరి. వారికి శరీరములు మాత్రమే వేఱుగాని హృదయ మొక్కటిగా నుండెను. వా రిరువురును గశ్యపప్రజాపతిని బెండ్లాడి యెట్టియఱమఱలు లేక సుఖముండిరి. అదితి దేవతలను గాంచెను; దితికి దైత్యులు జనించిరి. దైత్యులు స్వభుజాటోపపరాక్రమంబుల

వ్యయించి వనార్ణవపర్వతసహితంబుగా మహామహీమండలంబు నెల్లఁ గెలిచి యెదురు లేక యుండిరి. విష్ణువు వారిని సంహరించి యవ్యయమైన తదీయ రాజ్యంబును దేవతలకిచ్చెను. తమ్ములసొమ్మని మాటమాత్రమైన నిగ్గురులనిరా ? రాజ్యము నొల్లరైరా ? అమరులంతటివారే పాటింపనిధర్మంబును నేఁడు నీవు తలఁపవేల ? ఇదియునుగాక యొరులసొమ్ము నీవు కోరుటగాదు. లంకానగరము నీవంశ్యులది. అది యెప్పుడో యొకనాఁడు నీకు వచ్చి తీఱును. వెన్నునిదుర్ణయంబునంజేసి యది ప్రకృతము పరాధీనమయ్యెను. పరులనుండి నీసొత్తును నీవు గ్రహించుట, యధర్మ మెట్లగును ? అట్లు సేయ వేని నిన్నొకయనదగాఁ దలంపరా ? శక్తిమంతునకు నింతకన్నఁ దలవంపు గలదా ?' యని యుక్తియుక్తముగా బోధించెను.

దశగ్రీవుఁ డది యెల్ల సావధానముగా విని ముహూర్తకాలము పర్యాలోచించి 'ప్రహస్తా ! నీమాట యసమంజసముగాదు. నీవు వెంటనే కుబేరు నొద్దకుఁ బోయి, 'లంకాపురము మహాత్ము లగు మారాక్షసులదనియు మాపురంబును మాకు మరల నిచ్చుట పరమధర్మమనియు, నీయట్టియనఘాత్ములు పరద్రవ్యంబును గాంక్షింపరనియు, మాది మాకిచ్చుటవలన ధర్మంబును బాలించినవాఁడ వగుదువనియు' నామాటగా సామపూర్వకంబుగా వచింపు' మని చెప్పి వానిని బంపెను.

ప్రహస్తుఁడు తోడ్తోడఁ గుబేరునొద్దకుఁ జని 'రాజా ! నీతమ్ముఁడు దశగ్రీవుఁడు పంపఁగా వచ్చితిని. నాపేరు ప్రహస్తుఁడు. సర్వశాస్త్ర విదాంవరా ! ఈలంకాపురంబునుఁ దొల్లి సుమాలిప్రముఖులు బహుకాల మేలిరి. ఇది రాక్షసులవలన భుక్తపూర్వము. కారణాంతరమున వారు దానిని వదలి వలసపోయిరి; వారు లేనప్పుడు నీవు దాని నాక్రమించుకొంటివి. అంతమాత్రాననే యది నీది గాదు, గానేరదు. నేనన్నో సుమాలివంశ్యుఁడను, మీఁదుమిక్కిలి నీకుఁ దమ్ముఁడను. నా వేడికోలు గ్రహించి నాసొమ్మను నాకు మనఃపూర్వకముగా నిమ్ము ; తగవు వలదు' అని నీతమ్ముఁడు దశాస్యుఁడు నాముఖంబున విన్నవించుచున్నాఁడు. ధర్మజ్ఞుఁడవగు నీబోంట్లకుఁ బెక్కుచెప్పనేల ?' అనెను.

కుబేరుఁ డావృత్తాంత మెల్ల విని 'ప్రహస్తా! ఈ పురంబును దొల్లి

రాక్షసులుపాలించిరనుట నిజము. వారు చన్నతర్వాత నాతండ్రి నన్నిట నిలి పెను. నాఁడుసుత నేనిట యక్షులతోఁడనుందు. దీనికై యింతరాయబార మేల ? నాతమ్ముఁడు దశగ్రీవుఁ డిందు వచ్చి యీరాజ్యంబు నెల్ల యథా విధిగా నేలుకొనవచ్చును. నీవు చని యిది నామాటగా వానికిఁ దెలుపు' మని పలికి వానిని బంపివైచి, తాను దనతండ్రియొద్దకుఁ బోయి సంగతియెల్ల వానికివినిపించి 'నాయనా ! తమ్మునిరాజ్యంబు నాకేల ? దానిని వానికే యిచ్చివైతును. ఇఁక నేనెందుండనగునో సెలవి'మ్మని వేడెను.

విశ్రవసుఁడు పుత్త్రుని విని 'నాయనా ! లంకాపురమును గూర్చి దశ గ్రీవుఁడు నాతోఁ బ్రస్తావించెను. వలదన్నను వినఁడు. వాఁడు వరప్ర దానసంమోహితుఁడై మాన్యామాన్యంబులఁ గూడఁ బాటింపకున్నాఁడు. నా శాపనిమిత్తంబున వానికట్టి దారుణప్రకృతి గలిగెను. అదురాత్మునితో అంపు వలదు. వత్సా ! లంకను వానికే వదలివైచి నీవు కైలాసపర్వతం బునకుఁ బోయి యందు నివాస మేర్పఱచుకొనుము. అచట నదీమతల్లి మందాకిని గలదు. ఆనదీజలంబులు మహానిర్మలంబులును గనకకమలకల్హార సుగంధి బంధురంబులునై యెంతయు హృద్యంబుగా నుండును. దేవకిన్నర గంధర్వాదులు విహారార్థులై యెప్పుడుఁ దన్నగరాజము నాశ్రయించి యుం దురు. అందు నీకు సుఖమగు' నని హిత ముపదేశించెను. కుబేరుఁడు తండ్రి మాటను దలఁదాల్చి లంకకువచ్చి భార్యాపుత్త్రులను, మంత్రులను, బరివా రంబును, ధనకనకవస్తువాహనంబులను వలసినంత వెంటంగొని కైలాసంబు నకుఁ జని యందు వసతి నిర్మించుకొని సుఖముండెను.

ప్రహస్తుఁడు కుబేరుని వీడ్కొని దశకంఠునొద్దకుఁ జని సంగతియెల్ల వినిచెను. దశాస్యుఁడు పరమసంతోషమంది బంధుమిత్త్రపురస్సరంబుగా లంకాపురముఁ బ్రవేశించి దనుజరాజ్య పట్టాభిషిక్తుఁ డయ్యెను.

### దశగ్రీవాదుల వివాహాదికము.

దశగ్రీవునకు శూర్పణఖయను సోదరిగలదుగదా. ఆకాంత వివాహ యోగ్యయై యుండెను. ఆమెకుఁ దగువరుని దశగ్రీవుఁడు విచారించి విచారించి యెందుఁ గానక తుట్టతుదకుఁ గాలకేయుఁడైన విద్యుజ్జిహ్వుఁడను వానిని నిశ్చయించి యతనికి నక్కన్య నిచ్చి వివాహ మొనర్చి, తాను సమ

స్తరాజోపభోగంబుల నివ్వటిల్లుచుఁగొండొకనాఁడు మృగయాభిలాష వనం బున కేగి వేఁటాడుచు నట నొకపురుషునిఁ గన్యాద్వితీయుని గాంచి యచ్చెరు వొంది తత్సమీపంబునకుఁబోయి 'అయ్యా! ఎవఁడవు ? ఇందేల వచ్చితివి ? ఈమృగశాబాక్షి యెవతె ? నీవెంట రానేల ?' అని పల్కరించెను.

అతఁడు దశగ్రీవుని నింపాదిగాఁజూచి 'నాయనా ! హేమ యను పేరియచ్చరమచ్చెకంటిని విందువుగదా ? ఆలేమను భార్యగా దేవతలు నా కొసంగిరి. ఆకాంతామణియందుఁ దగిలి యుపభోగార్థము హేమమయంబును వజ్ర వైడూర్య రచితంబునైన పురవరం బొండు నిర్మించి యాయింతితోడిదే లోకంబుగా నేనాయిండ్లందు సుఖముంటిని. మాకీపుత్త్రిక జనించెను. ఆమనోహరాంగి యంతట దేవకార్యార్థము నన్ను వదలిపోయెను. నా ప్రేయసి మఱల వచ్చునను పేరాసతోఁ బదునాల్గువత్సరంబులు కాచి యుంటిని. అప్పటికి నది రాదయ్యెను. ఆకుసుమాంగి లేనియప్పురంబున నొంటిగా నుండనోపక మాయిరువుర ప్రేమ ఫలమైన యీపుత్త్రికను వెంటఁ గొని తరలి యీసుతకుఁ దగువరు నవలోకించుచు భూపర్యటనం బొనర్చుచు నిందువచ్చితిని. కన్యాపితృత్వమునకన్న దుఃఖతరమైనది వేఱులేదుగదా. ఈమెగాక మఱియిద్దఱు పుత్త్రులను హేమవలనఁ గాంచితిని. అందుఁ బెద్దవానిని మాయావి యందురు. రెండవవాఁడు దుందుభి యనఁబడును. నన్ను మయుఁడందురు. ఇది నావృత్తాంతము. ఇఁక నీసంగతి వినవలతు' ననెను నావుడు 'మహాత్మా ! పులస్త్యమహర్షిని విందువా? వానికి విశ్రవసుఁడు జనించెను. అతనికి నేను బుట్టితి; నాపేరు దశగ్రీవుఁడు; మృగయావినోదినై యిటు వచ్చితి'నని పఙ్క్తిముఖుఁడు చెప్పెను.

మయుఁ డది విని 'ఇతఁడు నాసుతకుఁ దగువరుఁడు. మహర్షివంశజుఁడగు నితనికిఁ గన్య నిచ్చుట యుక్తము. కాదన్నను నన్నుఁద్రోచి యితఁడీకన్యను హరించును' అని తలపోసి దశగ్రీవునిచేయి పట్టుకొని 'ఈకన్యారత్నమును మండోదరిని భార్యగా గ్రహింపు' మని దరహాసపూర్వకంబుగా నుడివెను. దశగ్రీవుఁడు వల్లె యనెను. మయుఁడు వారిరువురకు నగ్నిసాక్షికముగా ముడివైచి యల్లునకు నరణంబుగా శక్తి నొండొసంగెను.

రావణుఁ డట్లు వివాహమాడి భార్యతోడ లంకకుఁ జని దమ్ముల

పరిణయము తలపెట్టి వైరోచనుని మనుమరా లగువజ్రజ్వాల యనుదానిని గుంభకర్ణునకును, గంధర్వరాజు శైలూషుని తనయను సరమ యను దానిని విభీషణునకును నిశ్చయించి యథోచితవైఖరి వారికి వివాహము లొనర్చెను.

అంతఁ గొంతకాలంబునకు మండోదరి గర్భవతియై సుతుని గాంచెను. వాఁడు పుట్టుచునే మేఘగర్జనంబుగాఁ దోఁపఁ రోదన మొనర్చెను. ఆధ్వనికి లంకానగరమెల్ల జడీకృతమయ్యెను. ఆకారణంబున వానికి మేఘనాధుఁడను పేరిడిరి. వాఁడు దశగ్రీవాంతఃపురంబున రక్షస్త్రీసంరక్షితుఁడై కాష్ఠసంరక్షితవహ్నిచందంబునఁ బెంపొందుచుఁ దలిదండ్రులకు నల్లారుముద్దుగా నుండెను.

కుంభకర్ణునకుఁ బితామహప్రేరణంబునఁ దీవ్రనిద్ర యాపాదిల్లెను. ఆతేఁడానిద్ర నాఁపలేక కొలువుదీఱియున్న యన్నకడకుఁ బోయి రాజా! నిద్రపైకొనెను; తగు మందిరంబును నిర్మించి యిమ్మని కోరెను. దశగ్రీవుఁడు తోడ్తోడ మందిరనిర్మాణ మాజ్ఞాపించెను. విశ్వకర్మనుబోని శిల్పులు చని రెండుయోజనంబులనిడుపు నొక్కయోజనము వెడల్పుగలశాలను గట్టి యందుఁ జిత్రవిచిత్రంబుగాఁ గనకస్ఫాటికస్తంభంబులు తీర్చి వైడూర్యసోపానంబులు దాపి కింకిణీజాలకంబులను దంతతోమరంబుల నమర్చి వజ్రమయ వేదికలు పొలుపొందఁ జేసిరి. కుంభకర్ణుఁ డందుఁ బ్రవేశించి నిద్రావివశుఁడై యుండెను.

విభీషణుఁడు ధర్మబుద్ధిఁ బాయక నియమితకార్యంబులను శ్రద్ధాభక్తులతో నిర్వహించుచు విరామసమయంబుల శాస్త్రజిజ్ఞాసతోఁబుచ్చుచు నెల్లరకు గౌరవపాత్రుఁడై వర్తించుచుండెను.

### దశగ్రీవుని దుండగములు.

### 1. దూతను జంపుట.

వరోద్ధతికి దనుజరాజ్యాధికారము తోడయినంతనే దశగ్రీవుఁడు మైమఱచెను. దేవర్షులను వధించుట యక్షగంధర్వులను జక్కాడుట నందనాది మహోద్యానవనంబులను రూపుమాపుట మత్తగజంబువోలె నదులు జొచ్చికలఁచుట క్రీడావృక్షంబులను జంఝానిలంబుకైవడి నుద్ఘాటించుట నగంబులను వజ్రంబుపగిది భేదించుట వానికి సహజక్రీడ లయ్యెను.

కుబేరుఁ డాసంగతి విని చింతాక్రాంతుఁడై సహోదరవాత్సల్యంబు నఁజేసి దశగ్రీవునకుఁ గులానురూపధర్మంబుల నెఱిఁగించి హితముఁ గఱప నెంచి వానియొద్దకు దూతను బంపెను. ఆదూత లంకకుఁబోయి మొదట విభీషణుని సందర్శించి వానివలన మర్యాదలు వడసి తా వచ్చినకార్యముఁ దెలిపెను. విభీషణుఁడు దూతనుఁ వెంటగొని పోయి రాజుసందర్శనంబుఁ గలిగించెను. ఆదూత రాక్షసరాజునకు జయంబులుపలికి 'రాజా! మీయన్న కుబేరుఁడు పంపఁగా వచ్చితిని. ఆయన తనమాటగా నీకిట్లుచెప్పు మనెను. నాయనా! నేను తపశ్చరణార్థము హిమవంతంబునకుఁ జని యందు నియతేంద్రియుఁడనై యుండగాఁ గొండొకనాఁడు నాకుఁ బార్వతీపరమేశ్వరుల సందర్శనభాగ్యము లభించెను. హైమవతీ రూపవిలాసంబులు నాకు మహాశ్చర్యంబును గలిగించెను. అట్టి యామెను జూచితిని, నావలకన్ను దగ్ధమాయెను. కారణముఁ దలపోసి నాయపరాధంబును గ్రహించి ఖిన్నుఁడనై యాచోటు పాసి గిరితటాంతర మాశ్రయించి యందు నూఱుయెనిమిదేండ్లు మహోగ్రతపం బొనర్చితిని. మహేశ్వరుఁడు నాకు మెచ్చి వచ్చి 'కుబేరా! దేవీరూపనిరీక్షణదోషంబున నీవలకన్ను పింగళత్వమొందెను. అయినను నీతపస్సునకు మెచ్చితిని. ఈవ్రతంబును మొట్టమొదట నేనెంతో కష్టించియనుష్ఠించితిని. నావెనుక నీవుదానిని బాటించితివి. మనయిరువురకుఁదక్క నన్యుల కిది సాధ్యము గాదు. ఈవ్రతకారణంబున నీవు నేఁడు సుత నాకు సఖుఁడవైతివి. నీకంటికి మాత్రము పూర్వస్థితి యిఁకఁ గలుగదు. దేవీప్రభావ మట్టిది గావున నీకంటికై చింతింపకుము. ఇదిమొదలు ఏకాక్షిపింగళుఁ డనుపేరు నీకు శాశ్వతమై యుండు'నని చెప్పి చనెను. అట్లు నేను శంకరుని సఖ్యంబు సంపాదించుకొని యింటికి వచ్చి చూడఁగాఁ జిరసంవృద్ధమైన [illegible] ~~నందనవనంబు~~ రూపుమాసి యుండెను. కారణము విచారించితిని. నీ కార్యముగాఁ జెప్పిరి. మఱియుఁ దపోధనులైన ఋషుల నెందఱినో చంపితివఁట. దేవతలకు మహాపకృతిఁ దలఁచితివఁట. నన్నెంతో నిరాదరించితివఁట. ఇందొండేనియు మన్నింపఁదగవు. బాలుఁడవనియు దమ్ముఁడవనియు నివియెల్ల సైచితిని. ఇఁక నేని యిట్టికులదూషణకార్యంబులమానుము. దేవతలును ఋషులును గూడి నీవధోపాయంబుఁ జింతించుచున్నారు. విమర్శింపకమున్నె మేల్కొనుము' రాజేంద్రా! మీయన్నగారిహితవచనంబులను విన్నవించితిని. చిత్తగింపవలయు ననెను.

దశగ్రీవుఁడు దూతపలుకులు విని క్రోధమూర్ఛితుఁడై కన్నులనిప్పులు రాల్చుచుఁ బండ్లు గీఁటుచు చేతులు పిసికికొనుచు 'ఓరీ ! నీభావము తెలిసెను. ధూర్తుఁడవు గానిదూతవు గావు. నిన్నుఁ బంపినవాఁడు భ్రాత గాఁడు; వానిసందేశము హితము గాదు. తాను సాధించినమహేశ్వరసఖ్యంబును జాటుటకుఁగా నిన్నతఁడు పుత్తెంచెను గాని వేఱుగాదు. నీప్రల్లదంబులు మన్నింపఁగావు. జ్యేష్ఠుఁడనియు గురువనియుఁ దలఁచి వాని నింతకాలము సహించితిని. వానికారణంబున ముల్లోకంబులకును దిక్పతులకును జేటువాటిల్లనున్నది. ఇదిగో త్రైలోక్యజయపతాక నెత్తుచున్నాను జూడు' మని పలికి ఖడ్గంబును దూసి యాదూతశిరంబుఁ ద్రుంచి దానినందున్నరక్కసులకు భక్షణార్థ మిచ్చి స్వస్వయనంబులతోడ రథమారోహించి త్రైలోక్య విజయకాంక్షియై తరలెను.

అన్నతోడించి పుష్పకవిమానమును హరించుట.

దశగ్రీవుఁ డట్లు తనమంత్రులైన మహోదర, ప్రహస్త, మారీచ, శుక, సారణ, ధూమ్రాక్షులనువారిని వెంటఁగొని లోకదహనార్థమో యన వెడలి పురంబులును వనంబులును నదీశైలంబులును ముహూర్తమాత్రంబున దాఁటి కైలాసగిరి చేరెను. ఆపర్వతమందుఁ గాపున్నయక్షులు వానిని జూచియుఁ దమ కేనితమ్ముఁ డనుతలంపున నడ్డగింపక కుబేరునకు సంగతి విన్నవించిరి. ఆమాట విన్నంతనే ధనపతి మహాగ్రహమొంది దశగ్రీవుని తోడి యుద్ధంబునకు నాజ్ఞాపించెను. యక్షులు డీకొనిరి. ఇరుఁదెగలవారికి మహాసంకులయుద్ధ మయ్యెను. ఆసంక్షోభంబునకుఁ గుబేరు డున్నపర్వతము చలించుచున్నదో యనఁదోఁచెను. జక్కులవడికి దశకంఠుని సచివులు వ్యథితచిత్తులైరి. రాక్షసేశ్వరుఁ డది గాంచి మహాహర్ష నాదంబు లొనర్చుచు యక్షులపైకి నుఱికెను. వానితోడ నతనిసచివులు గూడ విజృంభించిరి. ఒక్కొక్కరక్కసుని వేగురువంతున జక్కులు ముట్టడించి గదలతో ఖడ్గంబులతో శక్తితోమరంబులతో ముసలంబులతోఁ బ్రహరించిరి. మహోదరాదు లుక్కుచెడి దిక్కుఱి నిలిచిరి. దశగ్రీవుఁడు వారికిఁ దోడ్పడెను. వానిపై జీమూతధారగా యక్షులు శరవర్షంబు గురిపించిరి. పఙ్క్తిముఖుఁ డాయంపవానలో దొప్పదోఁగసాగెను. వానికి నూపిరాడదయ్యెను. అట్లుండియు నతఁడు లవమాత్ర మేని చలింపక మేఘధారాశతసముక్షితమైన మహా

మహీధ్రము పగిది నిలిచి కాలదండంబునుబోని దండంబును గైకొని యక్ష సైన్యంబు నుఱుమాడెను. జక్కులెల్లరు వికావికలైరి. అవయవంబులు తెగి కొందఱును, దలలుపగిలికొందఱును, గుండియలు వ్రీలి కొందఱును, గూలి రణరంగమెల్లఁ బఱచిరి. హత శేషులు వాతోద్ధూతాభ్రశకంబులువోలెఁ జెల్లాచెదరై దవ్వుచని మాసిరి. ఆయుద్ధమును జూడ వచ్చినఋషిసంఘంబు లంతరిక్షమెల్ల నాక్రమించుటంజేసి యుద్ధనిహతులైన యక్షులు వీరస్వర్గంబు నకుఁ బోవ సందులేదయ్యెను.

యక్షవీరులపాటు విని ధనపతి మఱికొందఱను సంగ్రామంబునకుఁ బంపెను. వారిలో సంయోధకంటకుఁ డను పేరి మహాబలశాలి మునుముందుగాఁ బోయి మారీచుని గదిసి చక్రాయుధముచేత వాని నడిచెను. ఆ వ్రేటునకు రక్షోవీరుఁడు, పుణ్యక్షయంబున నేలరాలుగ్రహంబుపగిది దొల్లి ముహూర్తమాత్రంబునఁ దెప్పఱిల్లి వైరిని మఱల నెదుర్కొనెను. ఆయిరువురకుఁ గొంతవడి మహాభయంకరమైనపోరు జరిగెను. తుదకు యక్షవీరుఁడు భగ్నాంగుఁడై పాఱిపోవసాగెను. దశగ్రీవుఁడు వానినిదఱుముచు యక్ష సైన్యాంతరముఁ జొఱనుండఁగా, సూర్యభానుఁ డను పేరి యక్షద్వారపాలకుఁడు రక్షోనాయకు నడ్డగించి తోరణంబునఁ బ్రహరించెను. పఙ్క్తిముఖుఁడు వ్రేటుపడి శైలము ధాతుసారమునట్లు దశవదనంబుల నెత్తురు గ్రక్కియు విధాతృవరబలంబునఁ ద్రుంగక సుంత సొమ్మసిల్లి తేఱి కోపంబు దీపింపఁగాఁ దత్తోరణంబునే యొడిచి లాగికొని దానిచేతనే యయ్యక్షునితల మీఁద నొక్కటి వడ్డించెను. వాఁడా వ్రేటునకు నుగ్గునూచమై పొలకువయాఱెను. యక్షులు భయభీతులై నదీగుహాంతరంబులు సొచ్చిరి.

యక్షు లట్లగుట కుబేరుఁడు విని మాణిభద్రుఁ డను మహాయక్షుని రావించి 'మాణిచరా! దుర్వృత్తుఁడైన యారక్షఃపతిని సంహరించి యక్షవీరులకు శరణగు' మనెను. అతఁడు నాల్గువేలయక్షశూరులతోడ రణరంగముఁ జొచ్చి, గదాముసలప్రాసంబులతో శక్తితోమరముద్గరంబులతోఁ బ్రహరించుచు దేగవలె నెగయుచు నొక్కఁడ నల్వురు రాక్షసవీరులతోడఁ దుముల మగుయుద్ధము గావించెను. ఆరణకోలాహలంబునకు దేవతలును, గంధర్వులును, ఋషులును మహావిస్మయమందిరి. అంతఁ బ్రహస్తుఁడు

విజృంభించి సహస్రయక్షులను జంపెను; మహోదరుఁ డొకవేయిమందిని ద్రుంచెను; మారీచుఁడు రెండువేలు బలిగొనెను. ధూమ్రాక్షుఁడు మాణిభద్రు నెదుర్కొని వానియురంబున ముసలంబుతోఁ గొట్టెను. యక్షవీరుఁ డాదెబ్బసరకు చేయక పెనుగదనొండు గైకొని యెదిరితలమీఁద మోఁదెను. ధూమ్రాక్షుఁడు విహ్వలుఁడై నేలఁబడెను. వానిపాటుఁ గాంచి దశాస్యుఁడు క్రోధమూర్తియై మాణిభద్రుని డీకొనెను. ఆ యక్షశూరుఁడును రక్షోనాథుని పయి శక్తిత్రయము వైచెను. రాక్షసేశ్వరుఁడు గదతో మాణిభద్రునిమకుటంబున మోఁదెను. అది మొక్కపోయి సుంత ప్రక్కకు నొఱగెను. నాఁడుసుత వానిని బార్శ్వమౌళి యనిరి. అతఁ డంత రణవిముఖుఁడయ్యెను. దశగ్రీవుఁడు సింహనాదము గావించి ధనదుని వంక మఱలెను.

దశకంధరుఁడు తనవంక వచ్చుట కుబేరుఁడు దవ్వునుండి చూచి, శుక్రుఁడు, ప్రోష్ఠపదుఁడు అనుతనమంత్రుల నిరువురను బద్మశంఖాదినిధుల యభిమానదేవతలను వెంటఁగొని తమ్మునకు నెదురేగి 'దశకంధరా! తమ్ముఁడవని హితము పలికితిని; వినవైతివి. కర్మఫల మెవ్వరికిని దప్పదు. మరణాంతమునఁ గాని యీరహస్యంబును గ్రహింపరు. మోహవశంబున విషముఁ ద్రావుచున్నావు. తత్ఫలము పరిణామమున నీకే తెలియును. తల్లిని వినవైతివి; తండ్రిని గర్హించితివి; గురువు నవమానించితివి. ఈదుర్ణయఫలము యమునిబారిఁబడినప్పుడు విదిత మగును. శరీరములు బుద్బుదప్రాయములు. అవిగలనాఁడే యాత్మకళ్యాణంబును సంపాదింపవలయును. అట్లు సేయనివారు మరణాంతమునఁ దమదుర్గతికై వగవక మానరు. రాజ్యముగాని ధనముగాని సౌఖ్యముగాని ధర్మమువలనఁ గలుగును. అధర్మంబునకు దుఃఖమే ఫలము. మఱియుఁ బాపకారులు స్వాత్మాపఘాతకులు; వారియెడ శుభసంకల్పము లెన్నడు నుదయింపవు. సంకల్పమునుబట్టి కర్మమును, దానిఁబట్టి ఫలము నుండును. సత్సంకల్పము సుఖమును, దుస్సంకల్పము దుఃఖమును బుట్టించును. దుఃఖమే నరకము. మూఢా! నీవు నరకమును వరింపవుగదా. కావున్న నీకిట్టి బుద్ధియేల జనించెను? చాలుఁజాలు; దుష్టునితోడి సంభాషణంబును దోసఁగు దెచ్చు' ననెను.

ఆమాటలు విని మారీచాదులు మోము తప్పించి చనిరి. దశగ్రీవుఁడు వానిని ధిక్కరించి పలికెను. అంతఁ గుబేరుఁ డాగ్రహము వహించి గదతో

రక్షోనాథునితలపయి మోఁదెను. రాక్షసేశ్వరుఁడు చలింపక కుబేరునిఁ బైకొనెను. ఇరువురు నొండొరుఁ బ్రహరించుకొనుచు జడుపుగాని యలపుగాని లేక పెద్దయుంగాలము పోరిరి. ధనదుఁ డాగ్నేయాస్త్రంబును బ్రయోగించెను; దశగ్రీవుఁడు వారుణాస్త్రంబున దానిని వారించి రాక్షసమాయ నాశ్రయించి తిరోధానమంది వ్యాఘ్రంబుగా నొకచోట, వరాహంబుగా నొకచాయ, జీమూతంబుగా నొకవంకఁ బర్వతంబుగా నొకదెస, యక్షుఁడుగా నొకవలన, దైత్యుఁడుగా నొకప్రక్క నానారూపంబులఁ దోఁచి స్వమాయాబలంబును బ్రదర్శించి మహాస్త్ర మొండు కుబేరునితల గుఱిచేసివైచెను. అయ్యస్త్రహతికి ధనదుఁడు విహ్వలుఁడై రుధిరంబులు గ్రక్కుచు మొదలు నరికినయశోకంబుక్రియ నేలఁ గూలెను. అది గాంచి నిధిదేవతలు చింతాక్రాంతులై కుబేరుని జుట్టి నానోపచారంబుల వానిని దేర్చి నందనవనంబునకుఁ గొనిపోయిరి. దశగ్రీవుఁడు హర్షోత్ఫుల్లనయనుఁడై నిజవిజయలక్షణంబుగాఁ గుబేరుని పుష్పకవిమానంబును హరించి, కాంచనస్తంభములతో వైడూర్యతోరణంబులతో ముక్తాజాలకంబులతో మణిమయసోపానంబులతో నపరంజి తిన్నెలతో సమలంకృతమై [illegible] గామగమనముఁ గలిగి విహంగమువలెఁ బఱచునదియుఁ గంటికిని మనస్సునకు నింపు గూర్చునదియు శీతముగాని, యుష్ణముగాని, లేక సర్వఋతువులందు హాయి గూర్చునదియునైన యవ్విమాన మెక్కి త్రైలోక్యవిజయ సంకల్పముతోఁ గైలాసమునుండి దిగెను.

నందీశ్వరశాపము.

కైలాసాచలపాదంబున శరవణమను పర్వతము గలదు. ఆనగము సువర్ణమయమై రెండవసూర్యునిపగిది వెలుఁగుచుండును. అది స్కందునకు జన్మస్థానము. పుష్పకవిమాన మచ్చోటుదాఁక హుటాహుటి వచ్చి తటాలున స్తంభించెను. ఆ వింతకు దశగ్రీవాదు లచ్చెరువంది తలకొక యూహగా వితర్కింప సాగిరి. అంతలోన నట నొకవ్యక్తి దోఁచి 'దశగ్రీవా! ఇందు రావలదు. ఇది శంకరుని క్రీడాపర్వతము. సుపర్ణ నాగ యక్షులకుఁగాని దేవగంధర్వ రాక్షసులకుఁగాని మఱియే భూతంబునకుఁగాని యీ కొండ చొఱరాదు. దుర్మతీ! ఇందుండి తత్క్షణమే చనుము; ఒండుచో నశింతు' వనెను.

కరాళుఁడును, గృష్ణపింగళుఁడును, వికటుఁడును, వామనుఁడును మీఁదుమిక్కిలి ముండియు నైనయావ్యక్తి యట్లు పలుకఁగా దశాస్యుఁడు విని తామ్రనయనుఁడై 'ఏమి! శంకరుఁడా?' అని నిర్మర్యాదగా వచించి పుష్పకమునుండి దిగి శైలమూలముఁజేరి యటు శూలము ధరించి యపరశంకరుఁడోయన నున్ననందీశ్వరుని గాంచి వానికోఁతిముఖంబునకు వికవిక నవ్వెను. వానియహంకారంబునకు నందీశ్వరుఁడు కినిసి 'దురాత్మా! నావానరరూపంబునకు బిట్టు నవ్వితివి గావున వానరులచేతనే నీవును నీకులంబును నశించుఁగాక' యని శపించి 'నిశాచరా! నీయవజ్ఞకు నిన్నిందే యిప్పుడే నేనే పొరిగొనియుందు. స్వకర్మహతుని నిన్ను మఱలఁ జంప నేల యని మిన్నకున్నాను' అనెను. నందీశ్వరునినోట శాపము వెడలినంతనే వానిపయిఁ బుష్పవృష్టి కురిసెను; దేవదుందుభులు పెల్లున మ్రోసెను.

శివుని తిరస్కరించుట.

ఆశాపవచనంబును దశగ్రీవుఁడు నిరాదరించి 'పశునాయకా! ఈకొండ నావిమానగమనమును నిరోధించెను. దీని నున్మూలింతుఁ జూడుము; ఎందు భవుఁడు నిరంకుశక్రీడావినోదియో యందే యతఁడు సంప్రాప్తస్వభయంబును గ్రహించుఁగాక' అని తనయిరువది బాహువులను జాడించి యాహస్తముల నప్పర్వతము క్రింద జొనిపి తన్నగంబునట్టె యూఁచెను. ఆయూఁపునకు నందున్న దేవతలును గణాధిపతులు నుఱ్ఱుట్లూగిరి. పార్వతియు భయకంపితయై మహేశ్వరుని గవుఁగలించుకొనెను. ఈశ్వరుఁడు సంగతి గ్రహించి తనపాదాంగుష్ఠంబును శైలముమీఁద లీలామాత్రంబుగా నూనెను. దశవదనునిహస్తంబులు కొండఁక్రిందఁ జిక్కెను; ఎంత లాగినను రావు. ఆవిపరీతంబునకు రాక్షసేశ్వరుఁడును, వానిమంత్రులును భయవిస్మయములంది మ్రాన్పడి నిలిచిరి. ఱేనియవస్థ నోర్వలేక తదనుచరులెల్లరు గుమిగూడి వానిచేతులుఁబట్టి తమశక్తికొలఁది యొక్కుమ్మడి లాగిరి. ఆబాధ సహింపలేక లంకేశ్వరుఁడు దశముఖంబుల నెలుఁగెత్తి యఱచెను. ప్రళయకాలధ్వనియో యనఁ ద్రిభువనభయంకరముగాఁ దటాలున నుప్పతిల్లిన యామహారావంబునకు నింద్రాదులు స్వస్థానంబులనుండి యులికిపడిరి; సముద్రుఁడు సంక్షోభమందెను; పర్వతములు చలించెను; యక్షులును సిద్ధవిద్యాధరాదులును దహతహపాటు చెందిరి.

అట్లు విక్రోశించుచున్న రక్కసునిఁ గని వానిమంత్రులు చూచి 'రక్షోనాయకా ! నీలకంఠుని మహాదేవునిఁ గాత్యాయనీపతినిఁ బరితోష పెట్టుము. ఆమహనీయుఁడు దక్క నొండు శరణంబు గాన్పింపదు. ముక్కంటికిఁ బ్రణమిల్లి వానిని స్తుతింపుము. శంకరుఁడు పరమదయాళువు ; ఆయన తప్పక నీకుఁ బ్రసన్నుఁడై నీయార్తి నుడుపు' ననిరి. దశాస్యుఁ డంత శంకరునకు శిరములతోడ నమస్కరించి వివిధసామములచేత వానిని స్తుతింపసాగెను. ఇట్లు వేయేండ్లు గడచనెను. అంత నొక్కనాఁడు శూలి వానినిఁ గనికరించి పాదాంగుష్ఠంబును సడలించి 'దశాననా ! నీవీర్యపరాక్రమంబులకు మెచ్చితి ; నీయఱపుచేత ముల్లోకంబులను భయారాడిత మొనర్చితివి గావున నిన్నిఁక రావణుఁడందురు ; అనుజ్ఞ యిచ్చితి ; ఇచ్చ వచ్చినదారిఁ బొమ్ము' అనెను.

రావణుఁ డావచనంబులు విని 'దేవదేవా ! మహాదేవా ! నాయెడఁ బ్రీతుఁడవేని నాకోరువరం బనుగ్రహింపుము. దేవ గంధర్వ రక్షో దానవ నాగ గుహ్యకులకును దదన్యులకు నవధ్యుఁడ ననువరంబును బొందితిని. మనుష్యులా ? తృణప్రాయులు ; వారిసంగతియే తలంపరాదు. విరించి ప్రసాదంబున నాకు దీర్ఘాయువు గలదు. అందుఁ బ్రథమభాగ మిప్పుడు గడచెను. ఎట్టిదుష్కర్మమొనర్చినను మఱి యేమి చేసినను నాయాయుశ్శేషము నశింపకుండునట్లు వరము ప్రసాదించి దివ్యశస్త్ర మొకం డనుగ్రహింపుము.' అని వేడెను. శంకరుఁ డట్లేయగుఁగాక యని మహాదీప్తమైన చంద్రహాసఖడ్గ మొసఁగి 'రావణా ! దీని నెన్నఁడుగాని యవజ్ఞచేయ వలదు. అట్లు గావింతువేని తోడ్తోడ నిది నన్నుఁజేరు' నని చెప్పెను.

రావణుఁ డంత మహాదేవునకు మ్రొక్కి యనుజ్ఞాతుఁడై విమాన మారోహించి భూమండలమెల్ల సంచరించుచు నందందుఁగల మహావీరులను బీడించుచు యుద్ధదుర్మదాంధులై తనయాజ్ఞకు లోఁబడనివారిని దుదిముట్టించుచు శరణన్నవారిని విడిచిపుచ్చుచు దర్పబలోత్సిక్తుఁడై సమస్తరాష్ట్రంబులను స్వప్రతాపావనతంబులుగా నొనర్చుచు దిరుగాడసాగెను.

వేదవతిని బలాత్కరించుట.

రావణుఁ డట్లు లోకసంచారముచేయుచుఁ గొండొకనాఁడు హిమవ

లయంబునకు బోయెను. అచట నొకచెటియయందుండి వింతకాంతు లెగసి వానికన్నుల మిఱుమిట్లు గొలిపెను. అతఁడు విస్మయమంది సంగతియేమో యని యాచటియ డాయఁబోయి యందు వల్కలములు గట్టి జడలు దాల్చి ధ్యానపరయై యున్నస్త్రీని గాంచి 'అహో! ఏమిసౌందర్యము! ఈకాంతామణి తనూచ్ఛాయ యపరంజికిఁగూడఁ గలుగదు ; శరీరము శిరీషపేశలమై గ్రాలును ; దేహకాంతియన్ననో వెలఁదివెన్నెలను మించుచున్నది ; ముఖబింబమునకుఁ జంద్రమండలము సయితము సరిరాదు ; బొమలన్ననో మరుని కోదండంబుల ఠీవి నొప్పారెడు. ప్రత్యంగమనోహరాంగక యనుటకన్న వేఱువిధంబున నీబింబాధరను వర్ణింపరాదు. ఎవతెయో! యేమికోరి తపంబాచరించుచున్నదో యెఱుంగనగు' నని నిశ్చయించి 'కళ్యాణీ! ఎవ్వరిదానవు? నీపొందుఁ గాంచుపుణ్యాత్ముఁ డెవఁడు? ఏమి వలచి నవనీతకోమలమైన నీతనూవల్లినిఁ గఠోరతపోవహ్నిని గ్రాఁచుదానవు? రాజ్యమును గోరుదువా? ముల్లోకంబులు నీపాదాక్రాంతములుగా నొనర్తు ; సిరిని వలతువా? నవనిధులు నీముంగిటనుంతు ; భోగంబులఁ గాంక్షింతువా? ఎల్లభోగంబులుఁగూర్తు. నీతలపేమో తెలుపుము. నీవ్రత మిఁకఁ జాలు. ఎలప్రాయంబును రిత్త వుచ్చకు. నీసౌందర్యము పురుషులను గామోన్మాదమునఁ ద్రోయుచున్నది' యని పల్కరించెను. ఆతపస్విని సుంత కనువిచ్చి దృష్టిసారించి లేచి యథావిధి వానికి నాతిథ్యమర్యాదలు గావించి 'అయ్యా! బృహస్పతికిఁ గుశధ్వజుఁడను సుతుఁడు బ్రహ్మర్షి గలఁడు. ఆయన బుద్ధియందు గురువునకు సాటియందురు. ఆపుణ్యమూర్తి దినదినము వేదాధ్యయన మొనర్చువాఁడు. వాని వాఙ్మయిమైన నేను కన్యగా జనించితిని. అయోనిజను గావున నన్ను వేదవతియందురు. దేవగంధర్వయక్షరాక్షసపన్నగపతులెందఱో నన్నుఁ గోరి నాతండ్రిని యాచించిరి. త్రిజగన్నాథుఁడైన శ్రీమహావిష్ణువు దక్క నన్యుఁడు నాకరగ్రహణంబునకుఁ దగఁడని నాతండ్రి చెప్పెను. దంభుఁడను రాక్షసుఁ డామాట విని కుపితుఁడై నిద్రావశుఁడైయున్న నాజనకుని నర్ధరాత్రంబునఁ జంపెను. పతివియోగదీనయై నాతల్లి భర్తతోడఁ జితిఁ జొచ్చి హుతాశనునకుఁ బ్రీతిగూర్చెను. పితృసంకల్పమును దీర్పఁగోరి నారాయణుని గూర్చి తపోనిష్ఠనున్న దానను. శ్రీమన్నారాయణుఁడే నాపతి ; అన్యు నొల్లను. నీమతము గ్రహించితిని;

అడియాసలం మాని వచ్చినదారిం బొమ్ము” అనెను.

రావణుఁడు కందర్పశరపీడితుఁడై కదిసి ‘మోహనాంగి! ఇట్టి గర్వము వలదు; నీగుణసంపదకును నీమాటలకును జతగాదు. త్రైలోక్యసుందరి! నీజవ్వనము వృథపోవుచున్నది. మానినీ! నేను లంకాధీశ్వరుఁడను, నా పేరు దశగ్రీవుఁడు. నీవు నాకు భార్యవై నిఖిలభోగంబుల యథామతిం జూఱఁగొనుము. కాంతారత్నమా! విష్ణువు విష్ణువని కలవరింతువు. అతఁ డెవఁడు? వీర్యంబుననొండెఁ దపోమహిమంబుననొండె వాఁడు నాకు సాటి యగునా? వరాటుని వరింతువేల?’ యని బదులు పలికెను. నాఁవుడు వేదవతి కటకటంపడి ‘నిశాచరా! ముల్లోకంబులకు నధిపతియుఁ జరాచరసమస్త ప్రపంచనమస్కృతుఁడు నైన యామహావిష్ణువును భవదన్యులు బుద్ధిమంతు లెవ్వరును దూలనాడరు. మదాంధకారము నీకనుఁ గప్పియున్న’ దని తిరస్కారస్వరంబున వచించి యావలఁ బోనుండెను. రావణుఁడు తటాలున నామెను శిరోజములఁబట్టి తిగిచెను. వేదవతి యాగ్రహదుర్నిరీక్షణయై ఖడ్గంబునంబలెఁ దనచేతితోన యక్కురుల నంతవఱకు ఖండించి బంధవిముక్తయై రోషాగ్నిచేత వానిని దహింపనున్నదో యన నండుచు నగ్నిఁ బేర్చి మరణోన్ముఖయై ‘నిశాచరాధమా! నీహస్తస్పర్శఁ గాంచి యీశరీరము మలీమసమయ్యెను. ఇఁక నిది యుండరాదు; హుతాశనునివలనఁగాని దీనికిఁ బవిత్రత గలుగదు. పాపీ! వనాంతరమునఁ దపమొనర్చునన్ను నిష్కారణముగా ధర్షించితివిగదా! దృష్టిమాత్రమున నిన్ను భస్మీకృతు నొనర్పఁ జాలుదు. పురుషులను జంపుట స్త్రీకిఁ దగదని యూఱకుందు. శపింప రాదా యనినఁ దపోవ్యయమునకు వెఱతును. నేను దపోనిష్ఠనేని, నా వ్రేల్చినహోమంబు లగ్నిదేవునకుఁ బ్రియంబులగునేని, శ్రీవిష్ణుపాదపద్మములందు నాభక్తి నిశ్చలమేని యయోనిజగా జనించి సాధ్వినై నీకు మృత్యువు నగుదుఁ జూడు’ మని యగ్ని జొచ్చెను. వెనువెంటనే పుష్పవృష్టి కురిసెను. రావణుఁడు భగ్నమనోరథుఁడై వడుపుతప్పిన సర్పంబువలె రోఁజుచుఁ జనెను.

### యజ్ఞభంగము చేయుట

ఉశీరబీజ మను ప్రదేశ మొండు గలదు. అచ్చట మరుత్తు అను రాజుండెను. ఆఱేఁడు బృహస్పతి భ్రాతయైన సంవర్తుని ఋత్విక్కుగా వరించి యజ్ఞమారంభించెను. దేవతు లెల్లరు వచ్చిరి, రావణుఁడు విమానము

మీఁద సంచరించుచుఁ దత్సమయంబున నటకు వచ్చెను. వానిసడి విన్నంతనే దేవతలు భయభ్రాంతులై యతనికంటఁబడ వెఱచి తిర్యగ్రూపంబులు దాల్చిరి. ఇంద్రుఁడు నెమలియయ్యెను ; యముఁడు కాకిగా మాఱెను ; కుబేరుఁడు తొండరూపు దాల్చెను ; వరుణుఁడు హంస యయ్యెను ; ఇతరు లాయాపక్షిరూపంబులు వహించిరి. అశుచియగుకుక్క యజ్ఞవాటినివలె రావణుఁడాక్రతుప్రదేశంబుఁ జొచ్చి మరుత్తును ఁజూసి 'రాజా ! యుద్ధము చేయుదువా ? జితోఽస్మి యందువా ? యనెను.

యజ్ఞక్రియాపరతంత్రుఁడైయున్న మరుత్తు తలయెత్తి వానిని గాంచి 'ఎవఁడవురా నీవిట్లుపహాసంబు లాడుదు' వన 'రాజా ! నన్నెఱుంగవా ? నాపరాక్రమంబును జవి చూడనిప్రాణి ముల్లోకంబులఁ గలదా? అన్నయగు కుబేరుని జయించి వానివిమానమును హరించి యజేయుఁడై విహరించు దశగ్రీవు నిప్పుడేని యెఱుంగు' మనెను. నావుడు 'అహో! మహాధన్యుఁడవు; నీయట్టిపుణ్యాత్ములసందర్శనము నాబోంట్ల కగునా ? అన్నను గెల్చినవీరాగ్రణీ ! నీవంటి శ్లాఘ్యపురుషుఁడు ముజ్జగాన గలుగఁడు. ధర్మమొనర్చి ప్రకటించుకొనువారు గలరు. దౌరాత్మ్యకమొనర్చి లజ్జించుటకు మాఱుగా ఢంకాకొట్టువానిని కని విని యెఱుఁగ. దుర్మతీ ! వరగర్వోద్ధతి విఱ్ఱవీఁగుచున్నావు. నేను బ్రదికియుండఁగా నిందుండి నీవు జీవముతోఁ బోఁజాలవు' అని పలికి శరశరాసనంబులు గొని రణోన్ముఖుఁడుగానుండెను.

అంతసంవర్తుఁ డడ్డుపడి 'రాజా ! ఇప్పుడు నీకు యుద్ధము తగదు; మాహేశ్వరవ్రతమును బూనితివి. దానికెట్టియంతరాయముఁ గలుగరాదు. విఘ్న మొదవినచోఁ గర్తృవంశము దగ్ధమగును. మఱియు దీక్షితుఁడవు ; దీక్షాపరులకుఁ గ్రోధము చెల్లదు. అది యట్లుండ నిమ్ము. జయాపజయంబుల నిశ్చయింపరాదు. ఈరాక్షసుఁడో సుదుర్జయుఁడు. నాకుఁ దోఁచినంత చెప్పితి' నని మైత్రిపూర్వకంబుగా బోధించెను. మరుత్తు గురువాక్యంబులు పాటించి యుద్ధసన్నాహము మాని చాపశరంబులు విసర్జించి మఖసమాప్తికిఁ గడఁగెను. అది గాంచి శుకుఁడను రాక్షసుఁడు 'జయ జయ రావణ' యని హర్షనాద మొనర్చెను. తోడ్తోడ సోఁకుమూక చెలరేఁగి యజ్ఞార్థము

వచ్చిన ఋషులనుబట్టి చంపి వాని నెత్తురుఁ ద్రావిరి. అంతరావణుఁ డచ్చోటు వాసి చనెను.

రావణుఁడు చన్నంతనే యింద్రాదులు బ్రదికితిమిరా యని సంతసించి స్వస్వరూపంబులు దాల్చి యాపత్కాలంబునఁ దమ్ముఁ దాఁచి కాపాడిన మయూరాదులకుఁ గృతజ్ఞతఁ దెలుపుటకో యన వానికి నపూర్వవరంబు లిచ్చిరి. ఇంద్రునివరంబున మయూరంబులకు నాఁటగోలెఁ బన్నగభయము వీడెను; మఱియు నల్లగానున్న వాని కుంచెలు వేయికన్నులుగలిగి పెట్టని భూషణ మాయెను. కాకులకు రోగపీడారాహిత్యమును మఱియుఁ బరుల వలనివధ లేకున్నచో జిరజీవిత్వముఁ గలుగుటయు నవి పిండాన్నముగ్రహించునేని పితరులకు క్షుద్వ్యథ తీఱుటయు, ధర్మరాజువరంబునఁ సంప్రాప్తమయ్యెను. హంసలు తొల్లి నీలవర్ణయుక్తములును నీలాగ్రపక్షములునై తృణాగ్రనిర్మములైన ముక్కులు గలిగియుండెను. వరుణునివరంబున నాఁడు సుత యవి శుద్ధఫేనవర్ణంబును బడసెను. కుబేరుఁడు తొండకు హిరణ్యవర్ణముఁ బ్రసాదించెను. ఇంద్రాదుల ట్లొనర్చి మఖసమాప్తిఁ గావించి యాతనితోడ సురలోకంబునకుఁ జనిరి.

### నానారాజులను జయించుట—అనరణ్యశాపము.

రావణుఁ డట్లు మరుత్తును జయించి యుద్ధకాంక్షియై నానారాజనగరంబులకుఁ బోయి 'యుద్ధమునకు రమ్ము; లేదా ఓడితి నను' మని యొక్కొక్కనరేంద్రు నడుగ సాగెను. దుష్యంతుఁడు సురథుఁడు గాధి గయుఁడు పురూరవుఁడు మున్నగురాజులు లంకేశ్వరునివరబలంబు లెఱిఁగి పరస్పరము కలియఁబలుకుకొని 'బ్రదికి యున్న శుభముఁ బడయ వచ్చు' నను నానుడి ననుసరించి 'జితోస్మి' యనిరి.

అంత రాక్షసేశ్వరుఁడు అయోధ్యకు వచ్చెను. అత్తఱి యానగరంబును అనరణ్యుఁడను రాజసింహుఁడు పాలించుచుండెను. రక్షోనాథుఁడు వానికిఁ గూడ నట్టిసందేశమునే పంపెను. ఆ ఱేఁడు కోపోద్దీపితుఁడై యుద్ధమునకు రమ్మని బదులు చెప్పిపుచ్చెను. ఇరుసైన్యంబులకుఁ దీవ్రయుద్ధ మాయెను. రాజుసేన రక్కసిమూకచేతఁబడి వహ్నిహుతహవ్యంబుకరణి నయ్యెను. సాగరము జొచ్చిననదులట్లు నిజబలము నశించుచుండుట యన

రణ్యుఁడు గాంచి శక్రచాపంబునుబోని శరాసనంబుఁ గైకొని యెక్కుపెట్టి ధనుష్టంకార మొనర్చి రణరంగము సొచ్చి మారీచ శుక సారణ ప్రహస్తులను సింహము స్వల్పసత్త్వములఁ బోలెఁ బాఱఁదోలి దశకంఠునితలలు గుఱిచేసి యెనిమిదివందలబాణంబు లొక్కుమ్మడి వైచెను. ఆ శరవ్రాతంబును రావణుఁడు లెక్కసేయక విజృంభించి యనరణ్యుని శిరంబుమీఁదఁ జేకోలఁది తాడించెను. ఆ వ్రేటునకు నతఁడు విహ్వలుఁడై డొల్లి కూలెను. నేలఁ బడిన యానృపతిని రావణుఁడు చూచి నవ్వుచు 'ఎదిరించిన ఫలంబుఁ గంటి వా? నరాధిపా! ద్వంద్వయుద్ధంబున నాతోఁ బోరఁగల మగఁడు ముజ్జగానఁ గలఁడా? గర్వమువలనఁ జెడితివి' యని పరిహసించెను.

అనరణ్యుఁ డామాటలు విని 'లంకాధిపా! కాలము మంచిది కాని నాఁడు ఎవరు నేమియుఁ జేయనోపరు. నన్ను జయించితి వని ప్రగల్భము లాడవలదు. కాలమునకుఁ జిక్కితిని గాని నీకుఁ గాదు. కాలమే యన్ని చేయును. అది యెఱుంగక యహంకారపడుట యజ్ఞానము.

ఉ॥ 'వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచుం।
బాయుచు నుండుకైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై।
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ జరింపదు కాల మన్నియుం
జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తరమెట్టివారికిన్॥'

అను పెద్దలవాక్యమును విని యేని తెలివి తెచ్చుకొను టొప్పు. నా ప్రాణంబులు తరలనున్నవి. ఇప్పుడు నిన్ను నే నేమియుఁ జేయనోపను. వెన్ను చూపక వీరరణం బొనర్చితిని; సంగ్రామంబున నోడితిని. నీవు జయించితివి. అంతతో నుండుట ధర్మము. ధర్మమును ద్రోచివైచి నీ నోటితీఁటవోవ నన్నును నా యిక్ష్వాకుకులంబును దూలనాడితివి. ఇది దుస్సహము. రాక్షసాధమా! నేను దానపరుఁడనేని నాయొనర్చిన యజ్ఞంబులు నన్ను మన్నించునేని, తపస్వినేని నావచించుమాట తప్పదు. ఇక్ష్వాకువంశంబున నే రాముఁడను పేరితో నేను పుట్టి రణరంగమున నీ ప్రాణంబులు పొరిగొందుఁ జూడు' మని నీరెలుంగునఁ బలికి యసువులు దొఱఁగెను. రావణుఁ డామాటలు పిల్లిశాపంబులుగాఁ దలఁచి లోలోన నవ్వుకొనుచునందుండి పోయెను.

### యమునిజయించుట.

రావణుఁ డట్లు విజయుఁడై యయోధ్యానగరమునుండి వియన్మార్గంబున వచ్చుచుండఁగా మార్గమధ్యమున వానికి నారదుఁ డెదురయ్యెను. లంకేశ్వరుఁడు వానికి నభివాదన మొనర్చి తత్కుశల మరసి వచ్చినకారణ మడిగెను. అనవుడు 'రాక్షసేశ్వరా! శుభమగుఁగాక; నీవిక్రమోర్జితంబులకు సంతసింతు; ఒక్కయాసమాత్రము నన్ను వదలదు. విష్ణువు దైత్యులను వలె నీవు గంధర్వోరగులను బరిమార్చుట చూచి యానందించు టెన్నడో గదా యని తమకింతును. నాయనా! నీవు దేవతలకుఁగూడ నవధ్యుఁడవు నిన్నెవ్వరును జెనక నోపరు. నీవీనరులను జంపుటఁ జూడ నాకెంతయు నాశ్చర్యవిషాదము లయ్యెను. ఏలయందువా? నరులు పుట్టిననాఁడే మృత్యుముఖముఁ జొచ్చి మృతప్రాయులై యుందురు. వారిని నీవు చంపుట చచ్చినవారినిఁ జంపుటగదా. అదియెట్లందువా? నరులు స్వహితజ్ఞానము లేని మూఢులు అడి యాసలు పెంచి యా యెండమావుల వెంటఁబడి నిరంతరముఁ బరిధావించుచుఁ దీఱనివ్యసనంబులకుఁ జిక్కియుందురు. జరావ్యాధులు వారినిఁ బ్రతిక్షణము మ్రింగుచునే యున్నవి. అట్లుండియు ననిష్టములను మానరు. ఆఁకలిదప్పులకుఁ జిక్కి ముదిమికిఁ దలయొగ్గి శోకవిషాద సంమ్మూఢులై యుత్తరక్షణంబున నేమి రానున్నదో నెఱిలేకుండియుఁ జిరజీవులవలె భావించుచు విచిత్రార్థసంపాదనంబున నొకనాఁటికిఁ దనియక వాదిత్రనృత్యాదులందుఁ దవిలి యపరరాత్రమైనంతనే కన్నీటిధారలు గార్చుచు మాతాపితృసుతస్నేహంబులకును భార్యాబంధుప్రియంబులకును మోహపడి యాజంజాటములనుండి తప్పించుకొనలేక దురపిల్లుచు స్వయంకృతాపరాధములచేతనే మృతజీవులై యున్న మర్త్యులయెడ నీవృథాక్లేశమిఁకఁజాలింపుము. రావణా! ఇందఱను జంపితివిగదా? ఈ చంపుట యెందులకు? వారునీకు వశులైయుండుటకుఁ గదా? ఒక్కరైన నట్లయిరా? ఎంతపిచ్చి! కాదన్న శరీరములు మాత్రము నీయధీనమగును. ప్రాణములు యముని యధీనము. భళి! ఇఁక నిన్ను శవములరాయఁ డనకమానరు. ఎంత వెఱ్ఱివాఁడవు! నిగ్గును వదలి పిప్పిని సేకరించుచున్నావు. యముని జయింతువేని సమస్తము జయించినట్లగును. అప్పుడు నీధాటి కెదురుండదు. ఇంతమాత్రము యోచింపక యెంతకాలము వృథపుచ్చితివి!' అని నారదుఁడు పలికెను.

ఆఋషివచనంబు లెల్ల విని రావణుఁడు నవ్వి తలయూఁచి 'మహాత్మా! విజయార్థము రసాతలంబునకుఁ బోవనున్నాను. నాగలోకంబున నాయాజ్ఞ నిలిపి యమృతార్థము సముద్రముఁ మథించి వచ్చి యనంతరము నీయనినకార్య మొనర్తు' నసెను. 'దశగ్రీవా! నీకు దక్కనన్యులకు యమలోకము చొరరాదు; ప్రేతరాజపురమార్గము మహాదుర్గమము' అని మఱియు నారదుఁడు వచించెను.. ఆమాట విని రావణుఁడు నవ్వి 'సురవరానీ! సంశయింపవలదు; ఒక్కయముని నే గాదు, లోకపాలుర నెల్లర జయింతు నని యిదే ప్రతిజ్ఞాపూర్వకంబుగా వచింతు. నీప్రీతికై నాకార్యక్రమమును మార్చితిని. ఇప్పుడే యమపురికిఁ జని సర్వభూతప్రాణిసంక్లేశకరుని వానిని మట్టుపెట్టుదు' నని మునికి నమస్కరించి దక్షిణాభిముఖుఁ డయ్యెను.

నారదుఁ డంత ముహూర్తకాలము ధ్యానగతుఁడై 'చరాచరంబుగా జగత్త్రయంబు నశించు వేళఁగూడ నెవఁడు ధర్మముఁ సంరక్షించునో, ఎవఁడు రెండవపావకునివలెఁ[illegible] దీపించుచు నెల్లరకర్మములకు సాక్షియై యుండునో, ప్రాప్తసంజ్ఞు లెవనియనుగ్రహము పేర్మిఁ జరించుచుందురో, ఎవనికి ముల్లోకంబులును భీతిల్లునో, సుకృతదుష్కృతంబులకు ననుమేయఫలంబు లెవఁడిచ్చునో, ఎవనికనుసన్నల మృత్యువు వర్తించుచుండునో యట్టి పరేతరాజు నితఁ డెట్లు జయించునో చూడనయ్యెడు. యమసదనంబునకుఁ బోయి సర్వముఁ గన్నారఁ జూతుఁ గాక' యని నిశ్చయించుకొని యాదారి ద్రొక్కి తత్పురము చేరి యట నానాప్రాణులకు నిగ్రహానుగ్రహంబులను నిర్ణయించుచున్న యముని గాంచెను. సమవర్తి యాబ్రహ్మర్షికి నర్ఘ్యమిచ్చి మర్యాదలు గావించి 'మునివర్యా! త్రిలోకసంచారివి నీ వెఱుంగనిది గలుగదు. సకలధర్మంబులు సక్రమంబుగాఁ బ్రవర్తించును గదా. మీయీరాకకుఁ గారణము గలదా?' యనెను. 'ధర్మరాజా! ఒకవింతసంగతి విని నీకుఁ దెలుప హుటాహుటి వచ్చితిని. ప్రతిక్రియ నూహింపుము. దశగ్రీవుఁ డసురరాక్షసుని విందువుగదా. వాఁడు కండక్రొవ్వునఁజేసి కన్నెఱుంగక జయముఁ గోరి నీపయి దాడివచ్చుచున్నాఁడు. దండధరునకు నీ కేమియగునో యనుభయము నన్ను నిలువనీయదయ్యెను.' అని నారదుఁడు చెప్పెను.

వారట్లు కలియఁబలుకుచుండఁగా దవ్వున సూర్యతేజస్సువంటి తేజస్సు దోఁచెను. ఆ వెలుఁగునకు యమపురమందలి చీకట్లు విరిసి పాఱజొచ్చెను. యముఁ డది గాంచి 'ఏమి యీ వింత! యని యాశ్చర్యపడి, యది రావణ విమానతేజోవిశేష మగుట గ్రహించి సమరసన్నద్ధుఁడు కాసాగెను. అంతఁ లోన రావణుఁడు యమపురి చొచ్చి జముని మందిరమువంకకు నడిచెను. మహోగ్రులును ఘోరాకారులు నైన కింకరు లొకచోటఁ గొందఱను గట్టి కొట్టుచుండిరి; ఆ బాధకు నోర్వలేక వా రయ్యో యని యఱచుచుండిరి; ఒకచోటఁ గొందఱు రౌరవంబునఁ బడి మ్రగ్గుచుండిరి; ఒకచోటఁ గొందఱు క్షారనదులఁబడి తల్లడిల్లుచుండిరి; ఒకచోట గొందఱు చురకత్తులఁ గడికోఁతలకు హా యని విలపించుచుండిరి. పురుగులు తొలుచుటచేతఁ బరితపించుచున్నవారును, భయంకరములైన కుక్కలు మూఁగి కండలు పెఱికి తినుటవలన బాధకు వాపోవువారును, గుండియలపయిఁబడు సమ్మెటవ్రేటులకు నెత్తురులు గ్రక్కుచు హాహాకారము లొనర్చువారును, వైతరణీరక్తజలంబులలో ముంచి యదిమిపట్టుటవలన నూపిరాడక గిజగిజ తన్నులాడువారును, మండుసైకతంబున వ్రేల్వఁబడుచున్నవారును అసిపత్రవనాంతరంబున వేధితులై యుమ్మలించుచున్నవారును, ఏడ్చియేడ్చి గొంతుకఎండి నీరో యని కుయ్యిడుచున్నవారును, ఆఁకటఁ జొక్కి యటమటించుచున్నవారును, శవమాత్రాకారంబుననున్నవారును, శుష్కభూతులును, వివర్ణులును, విరిసిన తలతోఁ బరుగులాడుచున్నవారును, మలపంకంబుల బొర్లాడుచున్నవారును, ఇట్లు నానావిధంబులఁ దమతమ దుష్కృతఫలంబు లనుభవించుచున్న ప్రాణులు వానికిఁ బురమందెల్లఁ గానవచ్చెను. ఒకచోటఁ గొందఱు సంగీతవినోదంబుల నుండిరి. ఒకచోట మఱికొందఱు గోక్షీరంబులు ద్రావుచుండిరి; ఒకచోటఁ గొందఱు మృష్టాన్నసంతుష్టులు గానుండిరి. మఱియు గృహదానఫలంబుగా దివ్యసౌధాంతరంబుల విహరించుచున్నవారును, కన్యాదానఫలంబుగా సువర్ణమణిముక్తాసమలంకృతలగు ప్రమదారత్నంబుల గూడియున్నవారును, స్వధర్మానుష్ఠానఫలంబుగా దివ్యశరీరంబులఁ దేజరిల్లుచున్నవారు, నందందుఁ గానవచ్చిరి.

రావణుఁ డావిశేషములెల్లఁ జూచి స్వకృతాపరాధంబుగా నట్లు బాధపడుచున్నవారినెల్ల విడిచిపుచ్చెను. అతర్కితముగాఁ దటాలున బాధా

విముక్తిగలిగినందులకై యాప్రాణులెల్లఁ బరమానందమొందెను. ప్రేతరక్షకులు రావణుని దౌష్ట్యంబునకుఁ గినిసి వానినిఁదలపడిరి. హాలహాలాశబ్దంబులు దిక్కులందు విదిక్కులందుఁ బ్రతిధ్వనించెను. ప్రాస పరిఘశూల, ముసల, శక్తి, తోమరంబులు పుష్పకవిమానముపయి జడివానవలెఁ గురిసి యందలి ప్రాసాదవేదికలను దోరణంబులను సుఖాసనంబులను జిందఱవందఱ గావించెను. ఆవిమానము దేవనిష్ఠానుభూతము గావున క్షణములో యథాపూర్వమయ్యెను.

యమకింకరు లట్లు తమతొలిపూనికను వ్యయించినంత రాక్షససైన్యము చెలరేఁగి వృక్షశైలంబులను గొని జముని సేనను డీకొనెను. ఉభయసైన్యమట్లు పరిఘూర్ణించి బాహాబాహి, ముష్టాముష్టి తీవ్రయుద్ధము పెద్దయుం దడవొనర్చెను. కాలునిభటుల వ్రేటులకు నసురరాజమంత్రులు శోణితదిగ్ధాంగులైరి. రాక్షసవీరహతులకు దండధరుని మొనయెల్లఁ బిండీకృతమయ్యెను.

శమనకింకరులు కొందఱు దశాస్యుని దాఁకి వానిపయి శూలవర్షము గురిపించిరి. రావణుఁడు జర్ఝరీకృతాంగుఁడై నెత్తుట జొత్తిల్లుచుఁ బూచిన యశోకమువలెఁ దోఁచియు లేశమాత్రముగూడ చలింపక కోపాగ్నులఁ బఱచుచు నస్త్రబలము నాశ్రయించి శూలగదాప్రాసంబులను, శక్తితోమరముసలంబులను, వివిధసాయకంబులను, శిలావృక్షంబులను యమయోధులపైఁ గుమ్మరించెను. వారు ప్రత్యస్త్రములచేత వానినెల్లఁ జూర్ణమొనర్చి మేఘంబులు పర్వతముమీఁద నట్లు రావణునిపయి వ్రాలి భిండివాలంబులతో శూలంబులతో మర్దించిరి. సురవైరికవచము వ్రీలెను; వానికిఁ బ్రత్యంగమునుండి రక్తము చిమ్మసాగెను. అంత లంకేశ్వరుఁడు విమానమునుండి దిగి శరచాపంబులు గొని యంతకునివలెఁ గ్రాలుచుఁ బగఱ నదల్చి పాశుపతాస్త్రంబును సంధించి శంకరుఁడు త్రిపురంబులపయిఁబోలె యమచమూపటలంబుమీఁద వదలెను. ఆదివ్యాస్త్రము విధూమజ్వాలామండలాకృతిఁ బొల్చి నిదాఘసమయంబునఁ గార్చిచ్చు కీకారణ్యంబునుబోలె విరోధివరూథినీచయంబునెల్ల బూతి యొనర్చెను.

స్వబలనాశమును శత్రువిజయంబును యముఁడు చూచి కనలుచు

రథ మారోహించెను. కాలదండము మూర్తిమంతమై యగ్నులఁ రాల్చుచు
వాని ప్రక్క నిలిచెను; కాలపాశము రూపుదాల్చి యొక ప్రక్క చేరెను;
ముద్గరము సాకృతితో ధగధగమండుచుఁ గొలువు దీర్చెను. ముజ్జగంబులు
భీతిల్లెను. వాగెలను సడలించిరి; రథాశ్వంబులు నింగి కెగసి క్షణములో
రణరంగమున నిల్చెను. మృత్యుసమాయుక్తమై మహావికృతముగానున్న
యయ్యరదంబును గాంచి రాక్షసరాజసచివులు భయార్దితులై నిలువనోపమని
పలుకుచుఁ బలుదెసలు పట్టిరి. దశగ్రీవుఁడు మాత్రము చలింపక నిలిచెను.

యముఁ డంతట శక్తితోమరంబులఁ బఱపెను. రావణుఁడు వాని
నెల్ల మార్గమధ్యంబునఁ దునిచి యెదిరిరథముమీఁద శరవర్షముఁ గురిపించెను.
సమవర్తి యందులకుఁ గ్రోధమూర్తియై యసురయురంబున మహాశక్తిని వై
చెను. రావణుఁడు శల్యపీడితుఁడయ్యుఁ బ్రతిక్రియ నేరకుండియు సంగ
రక్షోణి విడనాడక నిలిచి యేడుదినంబులు పోరి యొట్టకేలకు స్మృతి దప్పెను.
వానిని రణభూమినుండి దొలఁగించి సేదదేర్చిరి. అతఁడు సంతదిటవు తా
ల్చి మగుడ డీకొనెను. యమరావణులకు ఘోరయుద్ధము వొసఁగెను.
ఒకరొకరు వెనువీయరైరి. వారియుద్ధంబున లోకప్రళయమగునట్లు దోఁచెను.
రావణుఁడు దంభోళిఁబోని చాపదండంబు గ్రహించి యంతకానఁగురిసి యా
కాశమెల్ల నిరవకాశ మొనర్చి మృత్యువుపయి నాల్గువిశిఖంబులఁ జివ్వి
సూతుని నేడమ్ముల నొంచి వివిధసాయకంబులతో యముని మర్మంబులఁ గాడ
నేసెను. జముని నోటనుండి కోపాగ్ని జ్వాలాకీలములును ధూమసహితములై వెడ
లెను; మృత్యువును గాలమును మహాసంరబ్ధులైరి. అందుమృత్యువుమునుపడ
వచ్చి చేదోయిఁ గీలించి 'దేవా! ఇతని నిఁక మననిచ్చుట పాడిగాదు; అనుజ్ఞ
యిమ్ము; ఈపాపిని బూదియొనర్తు; హిరణ్యకశిపుఁడు, నముచి, శంబ
రుఁడు, విసంధి, ధూమకేతువు, బలి, విరోచనుఁడు, దంభుఁడు, వృత్రుఁడు,
బాణుఁడు మున్నగు రాక్షసవీరుల నెందఱినో గావుగొంటిని; రాజర్షులఁగాని
గంధర్వులుగాని, దైత్యయక్షులఁగాని, నాదృష్టి సోఁకి మనినవారు లేరు.
నాచే పూనినంత నే మహీతలంబు గూడ పర్వతసరిద్ద్వీపంబులతోడ మహా
ర్ణవములతోడ రూపుమాయును. ఈకూళి యననెంత? నాయీసహజ
శక్తికి తుణముసేపు ఆటవిడుపగుఁ గాక.' అని వేఁడెను.

ధర్మరాజవ్వచనంబులు విని మృత్యువును వారించి కాలదండముఁ జేతఁబూనెను. కాలపాశము విజృంభించెను; ముద్గరము మనుగాళ్ళనుండెను. ప్రాణిలోకమెల్లఁ దల్లడిల్లెను. జ్వాలోగ్రమై లోకదహనోత్తేజంబునఁ గ్రాలుచున్న యాదండంబును గాంచి రాక్షసులు మహాభయార్తులై రణరంగముఁ బాసి పఱుగులెత్తిరి. సంగరావలోకనార్థము వచ్చి మింటనున్న సురదేవర్షులును దవితరులును భీతులై కలంకఁ బాఱిరి. యముఁడు కోపకరాళుఁడై యాదండంబును గిరగిరఁ ద్రిప్పి దశాననునిపైవదలనుండెను.

అత్తఱి బ్రహ్మ తటాలున నటఁదోఁచి 'వైవస్వతా! శమింపుము, శమింపుము; ఈ యమితవిక్రమము వలదు. నీదండ మమోఘము; దానిని వదలితివేని ముల్లోకంబులు రావణునితోఁడ నామావశిష్టము లగును. దీని నెదిరింప నేరికిఁ దరముగాదు. మృత్యువును దోడుగాని నేను దీనినిఁ దొల్లి సృష్టించితిని. సౌమ్యా! ఇది వ్యర్థము గారాదు; అట్లగునేని నాసంకల్పము వృధవోవును. దీనిని వదలితివేని దశాస్యుఁడు చచ్చును; అట్లయినచో వానికి నాయిచ్చిన వరములు కల్లయగు. ఎట్లు విచారించినను మహానర్థకము దాపరింపనున్నది. నామాటఁ గాపాడక నీకుఁ దీఱదు. కావున నీవు దీని నుపసంహారించి నా కోర్కి సేయుము' మనెను. యముఁడంతటఁదనచేతినివిడువనున్న దండంబును దటాలున నాఁపివైచి 'స్వామీ! మీయాజ్ఞఁ బాటింతు; పాటింపక తప్పదు. ఈ కాపురుషుఁడు రణార్థియై వచ్చెను. వీనిని జంపనేని యితని యెదుట నుండనొల్లు' నని పలికి యంతర్హితుఁ డయ్యెను. దశకంఠుఁ డది గాంచి యముని నోడించితి నని సింహనాదము లొనర్చుచు నప్పురము వదలి పోయెను. నారదుఁడది యెల్లఁజూచి దేవతలను బ్రహ్మను గూడి త్రిదివంబునకుఁ జనెను.

రసాతలదండయాత్ర.

రావణుఁ డట్లు రణశ్లాఘియై మారీచాదులను వెదకుచుఁ బోయెను. వారు తమ ఱేఁడు జర్ఝరీకృతాంగుఁడై నెత్తుట జొత్తిల్లుటకు విషాదమును ఱేఁడు యముబారినుండి తప్పివచ్చినందులకు విస్మయము నంది వాని నభినందించిరి. దశగ్రీవుఁడు వారినెల్ల రథముమీఁద నెక్కించుకొని పయోనిధిఁ జొచ్చి రసాతలమునకు జని యందు వాసుకిపాలితమైన భోగవతీపురము డాసి యట నాగులనోడించి లోఁబఱచుకొని, యందుండి తరలి మణిమయ

పురంబుఁజేరి తదధీశులైన నివాతకవచులనెడి దైత్యులను బోరుటకుఁ జీరఁగ వారును డీకొనిరి. దైత్యరాక్షసులకు వీడనిపోరొక సంవత్సరము జరిగెన నెవరికిని జయాపజయములు గలుగవు. వారిసంగ్రామక్షోభకుఁ బ్రపంచమెఁ గగ్గోలుపడెను.

అంతలోన విరించి యటకు వచ్చి నివాతకవచులను బిలిచి 'ఈరాఁ ణుఁడు సురాసురులకెల్ల నజేయుఁడు ; మీరు నట్టి వారలే. కావున మీకు గలహము వలదు ; ఉభయులును మైత్రినై నుండుటొప్పు. సుహృదుల సర్వార్థములందు నవిభక్తబుద్ధి వర్తింతురు. మీరు నట్ల యుండుఁబోలు' ననెను. అందులకు వారియ్యకొనిరి. రావణుఁడు వారితో నగ్నిసాక్షిక ముగా మైత్రి యొనర్చి స్వపురంబునఁ బోలె నచట నొక్కసంవత్సరపర్యం తము సమస్తభోగము లనుభవించి పెక్కుమాయలు వారివలన నేర్చి యనం తరము యశ్మనగరమునకుఁ జని యటఁ గాలకేయులతోఁ బోరి వారిని బరి మార్చి, మఱఁదియనియేని వెనుదీయక శూర్పణఖాభర్తను విద్యుజ్జిహ్వుని ద్రుంచి నాల్గునూర్లదైత్యులను హరించి వరుణాలయముపంక మరలెను.

వరుణునిజయించుట.

వరుణపురము పాండురమేఘంబులవన్నెఁ దన్ని యపరకైలాసమో యన భాసిల్లుచుండును. రావణుఁ డాపట్టణమును డాయఁ బోయి యట క్షీరధారలు గురియుచున్న సురభిని జూచి 'ఏయావుపాలతో నిండుటవలన సముద్రమునకు క్షీరాబ్ధి యనుపేరు వచ్చెనో, ఏగోవువలన సాక్షాత్పరమ శివునివాహనము జనించెనో, ఏయావు పాలకడలిలో జనించుటఁజేసి చంద్రుఁ డు శీతకరుఁడయ్యెనో, దేనినురువు ద్రావి పరమర్షులు జీవింతురో, దేనివలఁన నమృత ముత్పన్నమయ్యెనో, సురులకు స్వధ యేది గూర్చునో, యాధేను రత్నంబునకు నతఁడు ప్రదక్షిణ మొనర్చి, చనిచని, నానావీరసంరక్షితంబు ను జలధారాశతాకీర్ణంబును శారదాభ్రనిభంబును నిత్యప్రహృష్టమునైన వరుణునిగృహోత్తంబును జొచ్చి బలాధ్యక్షులను దునిమి 'యుద్ధార్థియై రావణుఁడు వచ్చియున్నాఁడు. యుద్ధ మొసఁగుటో జితోస్మి యనుటో రెంట నొకటి జరుగవలయును. ఈసంగతి మీ తేనికి వినిచి రండు' అని యుఁదున్నభటులతోఁ జెప్పెను. అంతలోన వరుణుని పుత్త్రులును, పౌత్త్రు

లును గోపుష్కరు లనెడినాయకులతోడఁ గూడి వచ్చి రావణుని దాఁకిరి. ఇరుపక్షములవారికి మహాదారుణమును రోమహర్షణము నైన సంగ్రామము జరిగెను. వారుణబలమెల్ల క్షణములోఁ గూలెను. నేలమీఁదనుండి తాము ను మింట విమానస్థుఁడై రావణుఁడును యుద్ధ మొనర్చుటవలనఁ దమబలము నశించెనని వారుణులు తలంచి రథంబు లెక్కి నింగికి నెగసి కదియఁబడిరి. వారికి దేవదానవయుద్ధమువంటి యుద్ధము పొసఁగెను. రావణుఁడు పావక సమానశరంబువలన వ్రేటువడి మోము ద్రిప్పెను. వారుణులు మహాఘ్ర నాదంబులు గావించిరి.

దశగ్రీవుఁడు ధర్షితుఁ డగుట మహోదరుఁడు చూచి చావునకుఁ దెగించి గదఁగొని వరుణపుత్త్రులను గుదియలుపడఁగొట్టి సింహనాద మొనర్చె ను. వారు రథాశ్వసారథులను గోల్పోయి నేలఁబడి దెప్పటిలి సహజబలం బుపేర్మి మగుడ నింగి కెగసి విల్లులెక్కుపెట్టి శరపరంపరల మహోదరునిఁ జీల్చి చెండాడి, రావణుని గదిసి వజ్రకల్పంబులగు నిశితసాయకంబుల వా నిని గప్పివుచ్చిరి. దశగ్రీవుఁడు క్రోధమూర్ఛితుఁడై కాలాగ్నికరణి వెలుఁ గుచు మహాఘోరాస్త్రంబులను దండోపతండంబులుగా సారించి వారి మర్మములనెల్ల గాడనేసి, ముసలంబులతో, భల్లంబులతోఁ బట్టసంబులతో శక్తిశతఘ్నితోమరంబులతోఁ దదీయులను జీకాకుపఱచెను. ఆవ్రేటులకు వారెల్లరు నేలఁగూలి జంబాలమగ్నమైన యరువదియేండ్లకుంజరంబులవలె లేవలేక తల్లడిల్లసాగిరి. వారిదురవస్థఁ జూచి తదీయులు వచ్చి వారినెల్ల నిం డ్లకుఁ గొనిపోయిరి.

అట్లు రావణుఁడు వారుణులను గావించి సింహనాద మొనర్చి 'ఏఁడీ వరుణుండు?' అనెను. అంతలోన వరుణునిమంత్రి ప్రభాసుఁ డనువాఁడు వచ్చి 'రాజా! జలేశ్వరుఁడు గాంధర్వమును వినుటకై బ్రహ్మలోక మేగి యున్నాఁడు; ఆయన యిందు లేఁడు; నీకీవృథాయాసమేల? వానిసుతులు పరాజితులైరి' అనెను. రావణుఁ డంత తనజయంబును వీటఁ జాటించి వరుణాలయమును వదలి సచివులతోడ విమానముమీఁద లంకాభిముఖుఁడై చనెను.

నానాస్త్రీలను జెఱపెట్టుట.

రావణుఁ డట్లు చనుచుండఁగా మార్గమధ్యంబున రూపవతులైన రాజకోమలీమణులును, ఋషికన్యకలును, దేవతాంగనలును, గంధర్వకాంతలును వాని కంటఁబడిరి. అతఁడు వారినెల్లఁ గేశబంధములు పట్టి బలాత్కారముగా నీడ్చి విమాన మెక్కింపసాగెను. ఆయింతులకై వారియాత్మబాంధవు లెందఱో రావణు నెదిర్చి ప్రాణంబులు గోల్పోయిరి. ఆలలితాంగులు తమ విపద్దశకై దుఃఖబాష్పంబులు గార్చుచు మహారోదన మొనర్చిరి. వారి యశ్రుధారాప్రవాహం బవ్విమానంబును ముంచివైచునో యనఁదోచెను. లతాలలితాంగములతోడఁ బూర్ణచంద్రముఖంబులతోడఁ, బీనపయోధరంబులతోడ, వజ్రవేదిమధ్యప్రభలతోడ, దీర్ఘకేశపాశములతోడ దీపించుచున్న యానవలామిన్నలు శోకదుఃఖభయత్రస్తలై విహ్వలింపఁగా వారినిశ్శ్వాసవాతంబున నవ్విమానము సందీపితమై మహాగ్నికుండమువలె నుండెను. కరిణీచయము సింహావశమైనట్లుగా వారు రావణునివశమై గావించినవిలాపము లిట్టివనరాదు. 'అయ్యో! ఈకూళ నన్ను భక్షించునో' యని యొకతె యేడ్చెను; 'కటా! ఈరక్కసుఁడు నన్ను గడికండలు జేయునో' యని యొకతె విలపించెను. 'హా! సోదరా! నీచెల్లెలిగతి యిట్లయ్యె' నని యొకతె వందురెను. 'ప్రాణవల్లభా! నీదయిత నిఁక మఱచిపొమ్ము' అని యొకతె పనలెను. 'జననీజనకులారా! నాకై వగచి వాడి నశింతురా!' యని యొకతె పల్లటిల్లెను. 'మృత్యుదేవతా! నీకు సాష్టాంగము; ఈదుఃఖాగ్నిని హరించి మానఘుఁ గాపాడు' మని యొకతె దుఃఖించెను. అయ్యో! సూర్యోదయము నక్షత్రంబులనువలె నీరక్కసుఁడు మారూపు మాపవచ్చెను. పరవధూపాయంబుల నిరంతరము రంజిల్లు నింతపాపాత్ముఁడు మఱియొండు గలఁడా! యని యొకతె యడరెను. కొడుకులను దలఁచి యొకతెయు కూతును దలఁచి యొకతెయుఁ గుమిలి కుమిలి యేడ్చిరి. వారి యొడరునకు మేర గాన్పింపదయ్యెను.

అట్లు వారు పెద్దయుండడవు దుఃఖించి 'కటా! ఈ రాక్షసుఁడు దుర్వృత్తమే నిజాచారముగా గ్రహించెను. ఇతనికి లజ్జ యను మాటే గలుగదు. పరదారాభిమర్శనము పాపకర్మమగునేని, మాసతీత్వ ముడివోదేని యీదుర్మతి మాయట్టిసతీమణికారణంబున నశించుగాక' యని యొక

గ్రీవమున శపించిరి. దేవదుందుభులు మ్రోసెను; పుష్పవృష్టి గురిసెను. రావణుఁడు తేజోహీనుఁడయ్యెను.

సోదరీనిరసనము.

అట్లయ్యును రావణుఁడాశాపంబులఁ జెవిఁ బెట్టక వారినెల్ల హరించి తెచ్చి లంకానగరము జొచ్చెను. అతఁడు వచ్చిరాకమున్న వాని చెల్లెలు శూర్పణఖ బోరున నేడ్చుచు వానిపాదముల వ్రాలెను. అతఁ డామెను లేవఁదీసి సాంత్వనంబులు పలికి 'అమ్మా! సంగతియేమి' యని యడుగగా ఆరక్కసి కన్నీరు మున్నీరుగాఁ గార్చుచు 'రాజా! నీవలన విధవనైతిని. కాలకేయులతోడ నాభర్తను గూడ హరించితివి. కటా! సోదరుఁడే నా సౌఖ్యములనెల్ల దూర్వానపట్టుటయ్యెను. ఇట్టి దెందేనిఁ గలదా! ఈ సేఁతకు లజ్జింపవా!' యని కఠోరంబుగాఁ బల్కెను. రావణుఁ డాచెల్లెలి నోదార్చుచు 'అమ్మా! వగవకు; నీ కెందును భయముండదు; దానమానప్రసాదంబుల నీకుఁ బరితోష మొనర్తును. వీరులు రణరంగమందు వివశులై వర్తింతురు. చావు బ్రదుకులు తలంపరు; జయకాంక్షయే వారికిఁ బ్రధానమై యుండును. సంగ్రామమునందుఁ దనవారు పరులు ననెడి వివక్షకుఁదడవుండదు. నాజామాత యని యెఱింగియు నట్లొనర్తునా! ఆలాగు నీవు తలంపవచ్చునా! సోదరీ! అనివార్య మశోచ్యము; దానికై వగవ నేల! ఇఁక నీకేది మేలో యది యొనర్ప సంసిద్ధుఁడను. మన పినతల్లికొడుకు ఖరుఁడు గలఁడు. అతఁడు చతుర్దశరాక్షససేవితుఁడై దండకారణ్యంబున వసింపనున్నాఁడు. వానికడ సుఖముండుము; నీయాజ్ఞ నతఁడు శిరమున దాల్చును; ఎందును నీకచటఁ గొదువ యుండదు. ఖరునకు బలాధ్యక్షునిగా దూషణుని నియమింతును. వాఁడును నీకోరిన యుపచారము లొనర్చు' నని పలికి యట్లొనర్చెను. శూర్పణఖయు వారివెంటఁ జని యందుండెను.

రంభను ధర్షించుట.

రావణుఁ డట్లు చెల్లెలిని బుజ్జగించి పుచ్చి కుమారుని మేఘనాదునిఁ జూడఁగోరి యతఁడు నికుంభిలావనమున నుండుట విని యటకుఁ జనెను. అత్తఱి మేఘనాదుఁడు మహాయజ్ఞ మొందు సంకల్పించి తీవ్రవ్రతముఁ బూని కృష్ణాజినముఁ గట్టి కమండులువుఁదాల్చి శిఖాధ్వజుఁడై యూపశతాకీర్ణమును జైత్యోపశోభితము నైన జన్న మొనర్చుచు భయావహుఁడుగా

సుండెను. లంకేశ్వరుఁడు సుతునిఁ గవుఁగిటఁ గూర్చి 'నాయనా! సంగతి యేమి?' యని ప్రణయపూర్వముగాఁ బలుకరించెను. శుక్రాచార్యుఁడు మాటనందుకొని 'రాక్షసేశ్వరా! నీసుతుఁడు అగ్నిష్టోమము అశ్వమేధము రాజసూయము గోమేధము వైష్ణవము మున్నగుయాగము లొనర్చుటయేగాక దుష్కరమైన మాహేశ్వరయజ్ఞమున ముక్కంటిని మెప్పించి వానివలన ననన్యసాధ్యములైన వరంబులఁ బడసెను. ఎట్టి వరంబు లందువా? అంతరిక్షచరమైన దివ్యరథమును సంపాదించెను. అది మనోరథమువలెఁ గామగమై తనరారును. మఱియుఁ దామసి యను మాయను గూడఁ బడసెను. దాని ప్రభావంబునఁ దలఁపుతోడఁ గటికచీకట్లు వ్యాపించును. దాని బలంబున నీసుతుఁడు గగనచరుఁడై యెవ్వరికి గోచరింపకుండి పోరుసల్పును. ఇవియునుంగాక యక్షయతూణంబును శరచాపంబులను శత్రువిధ్వంసకరమగు మహాస్త్రంబును గూడ గ్రహించెను. యజ్ఞసమాప్తికై నీరాక చూచుచున్నాఁ' డనెను.

ఆవృత్తాంతమెల్ల రావణుఁడు విని ముఖము చిట్లించి 'ఇంద్రాదులు మనకు శత్రువులు; వారిని బూజించితిరి; ఇది సరిగాదు. మించినపనికిఁ జింతయేల? నాయనా! ఇఁక రమ్ము; ఇంటికిఁ బోద' మని సుతుని విభీషణుని వెంటఁగొని నగరు జొచ్చి పుష్పకవిమానమందు బాష్పగద్గదలైయున్న సురసతీచయము నందుండి దింపెను. వారిని జూచినంతనే విభీషణునకు లంకేశ్వరుని దుష్టభావము స్పష్టమై మేరలేని దుఃఖము గలిగెను. అతఁడు శోకకోపంబులఁ బట్టనోపక 'అన్నా! యశస్సు అర్థము కులము—ఈ మూటికి ముప్పు దెచ్చునట్టి యకృత్యములు నీకొనర్పనగునా? అయ్యో! వీరికై తదీయజ్ఞాతుల నెందఱఁ జంపితివోగదా. కటా! కర్మఫల మెన్నఁడును దప్పదు. కావుననే మధుఁడు మనకుంభీనసిని హరించి నీకుఁ దీఱని యవమానమును మూటఁ గట్టెను.' అని పలికెను.

రావణుఁడది విని 'ఏమి! మధుఁడు కుంభీనసిని హరించెనా? ఎవఁడు వాఁడు' అని కోపస్ఫూర్తి దీపింప నడిగెను. నావుడు 'అన్నా! మేఘనాదుఁడు యజ్ఞముం దవిలి యుండెను; కుంభకర్ణుఁడు నిద్రావశుఁడై యుండెను. నేను దపఃపరుఁడనై జలాంతరమందుంటిని. అత్తఱి మధుఁడు

వచ్చి రాక్షసశ్రేష్ఠులైన నీమంత్రులఁ గొందఱను సంహరించి నీయంతఃపురమున నిద్రించుచుండిన కుంభీనసను మన పెదతాత మాల్యవంతుని దౌహిత్రి నపహరించెను. ఆసంగతి తర్వాత వినియు మిన్నకుంటిని. ఏలయందువా? యుక్తవయస్సువచ్చిన కన్నెను దగువరునకుఁ గూర్చుట యామెసోదరులకుఁ దప్పనివిధియై యున్నది. ఆపనిమన ముపేక్షించితిమి. తత్ఫలముగానో నీదుర్వృత్తిఫలముగానో యిట్టిది సంభవించెను. పాపఫలము తప్పదుగదా' యనెను.

బడబాగ్నికి సముద్రమువలె రావణుఁ డాత్మకోపంబునకు నుడ్డుడికి 'రావణనిర్భయుఁడైన యాతుంటరి యింక మనరాము; నేఁడే వానినివధించి సురలోకంబుపయి దాడి వెడలుదుఁగాక. రథమును దెమ్ము; కుంభకర్ణాది నిశాచరశూరులు నానాప్రహరణాయుధసన్నద్ధులై తరలుదురు గాక' అని యాజ్ఞాపించెను.

రాక్షసులు వేయియక్షౌహిణులు నానాప్రహరణంబులు గైకొని యుద్ధాభిరతులై వెడలిరి. మేఘనాదుఁడు దుముదారుదొరయై నడచెను. రావణుఁడు సేనామధ్యభాగంబునఁ బ్రచండమార్తాండునిభంగిఁ దేజరిల్లెను; కుంభకర్ణుఁడు దళపృష్ఠభాగము ననుసరించెను. నేలయీనినట్లు ఖరంబులు నుష్ట్రంబులును హయంబులును దరలెను. చమూఘూళికి నాకాశమెల్ల నిరవకాశమయ్యెను. విభీషణుఁడు మాత్రము లంకయందే నిలిచి ధర్మములాచరించుచుండెను.

రావణుఁ డట్లు తరలి మధుపురము చేరినంత వానిరాక కుంభీనసి విని యతనితలంపు నూహించి భయవిహ్వలయై మునుముందు పోయి రాక్షసేశ్వరుని పాదంబుల వ్రాలెను. దశగ్రీవుఁ డామెను లేవఁదీసి 'అమ్మా! భయము వలదు; ఏమి వలయునో చెప్పు' మన 'అన్నా! కులస్త్రీలకు వైధవ్యమునకన్న మించిన కష్టము లేదు. పతిభిక్ష యొసంగుము. నా ప్రార్థనఁ ద్రోయ రాదు. భయము వలదంటివి; కోరినది యిత్తు నంటివి. మాట దక్కించుకొనుము.' అని వేడెను. రావణుఁ డామె ప్రణయమును విని 'ఏఁడీ నీ భర్త? వానినిఁ దోడ్తోడ నాకుఁ జూపుము; అతఁడు నావెంట సురలోక

జయార్థము వచ్చుఁగాక; నీయందలిప్రేమ నన్నుఁ గట్టివైచె' ననెను. కుంభీనసి బెదరుమాని మందిరాంతమున నిద్రించుచున్న మధువును లేపి 'నా యగ్రజుఁడు రావణుఁడు సురలోకజయాభిలాషియై వచ్చి నిన్ను సాహాయ్యముఁ గోరుచున్నాఁడు. బంధుమిత్రపరివారముతోడ నీవు వాని ననుగమించుట యొప్పు. స్నేహపాత్రుఁడైన నాయన్న నీయాదరంబునఁ బరితోషించు'నని చెప్పెను.

మధు వంతటఁబోయి లంకేశ్వరుని యథోచితమర్యాదలఁ బూజించెను. రావణుఁడు వానికి సంతసించి యారేయి యందే పుచ్చి తెల్లవాఱి బయలుదేఱి కైలాసగిరి చేరెను. అంతలోనఁ బ్రొద్దుగ్రుంకెను. వారచట విడిసిరి. కొంతసేపటికిఁ గైలాసకాంతి బిల్లగట్టి తోఁచెనో యనఁ జంద్రుఁ డుదయించెను. ప్రకృతి సౌభాగ్యములు రజనీకరకరశోభితములై హృదయంబుల నాకర్షింపసాగెను. కర్ణికారవంబులసొంపుఁ గదంబగహనంబుల పెంపుఁ బూచి బెడగారుచున్న పొందామరకొలకులసారు మందాకినీ జలములతీరు మహోద్దీపకములయ్యెను. రావణుఁడు విరాళికిఁ జిక్కి యటునిటుఁ బ్రచారముచేయుచు జంపకాశోకపున్నాగ వనాంతరంబులయందలి కిన్నరుల గానము మేళముగాఁగ, మదరక్తాంతలోచన లగు విద్యాధరాంగనల కవుఁగిట పెనగులాటలఁ జిక్కి పల్కుచున్న తత్ప్రియుల ప్రియభాషణంబులు మంగళవాద్యంబులుగాగ మదనకోదండఘంటానినదంబులోయన నొప్పు వియచ్చరాప్సరోజనకాంచీ కింకిణీధ్వనులు తాళమానములుగాఁ బవన తాడితములై వర్షించుపుష్పంబులను జల్లుచుఁ బుష్పవడి బుక్కాము లలఁదుచు నాకు వీవనల ననుగాడ్పులు వీచుచు గగనకామినీమణి లేవెన్నెలపరికిణీదోడవి యాపర్వతరాజును సేవించుచుండుట చూచి మరులుగొని చంద్రుని వంకఁ జూచి యూర్చి యూర్చి కృశింపసాగెను.

అత్తఱిఁ గాంతామణి యోర్తు నవరత్నభూషణభూషితయై దివ్యచందన మలఁది మందారపుష్పంబులు సిగనుముడిచి నెత్తావిపూసరంబులు ధరించి భావాభావమగువలగ్నంబును మణిమయకాంచీదామంబున బంధించి జలధరనీలవస్త్రంబును మేల్ముసువు వైచి యాదారిఁ బోవుచుండెను. అపరశ్రీవలె నున్న యాహొయలుమిన్నను దశగ్రీవుఁడు చూచి డాయఁబోయి

తదీయరూపరేఖావిలాసంబులుచూచి

సీ. గండుమీలకుఁబుట్టి కాముబాణములతోఁగలసియాడెడునట్టికన్నుఁగవయు
బిసకాండములశిక్షఁబెట్టఁగలేఁదీగల మెచ్చక యున్నట్టి మృదుకరములుఁ
జిగురులతో సంధిచేసి యంబుజముల పైనెత్తిచనునట్టిపదతలములుఁ
గలకంఠములచేతఁ గఱచినవిద్య వీణలకిచ్చునట్టి తిన్నని యెలుంగుఁ

నత్తెఱుంగున రేఖయు నవ్విధంబు
గఱువచందంబు నమ్మెయి కలికితనము
నట్టిచెన్ను నిత్తరళాక్షి యంద కాక
కలవె యొరులకు నెందేనిఁ దలచి చూడ॥'

అని తలపోసి కామవశుఁడై హితాహితంబులు గూడ పాటింపక య య్యింతి కరముఁబట్టి 'వరారోహా! ఎవతెవు? ఎటకేగెదవు? ఎవనికి భోగసిద్ధిఁగూర్తువు? ఎవనియభ్యుదయకాలము నేఁడు సమకూరెను ? పద్మోత్పలంబుల మెచ్చని నీవదనబింబము గురియుచున్న సుధామృతరసంబును నేఁడు పడయ నోఁచిన పుణ్యాత్ముఁడెవఁడు? సువర్ణకుంభంబులఁ దలపించుచు నొండొంటి నొరసియున్న నీపీనపయోధరములపయి వ్రాలి నేఁడు సుఖింపనున్న సుకృతి యెవఁడు? కనకచక్రప్రతిమంబులై స్వర్ణదామంబునఁ గట్టువడియున్న నీ జఘనము నెవ్వఁ డారోహించి స్వర్గారోహణభాగ్యంబును గనునున్నాఁడో గదా? కామినీరత్నమా! శక్రుని వరించితివో, విష్ణుని గోరితివో అశ్వినుల వలచితివో చెప్పుము. నేనిందుండఁగా నన్ను గాదని వారికై వోనేల ? తలోదరీ! ఈశిలాతలంబున విశ్రమించి పథికశ్రమము వాసి చనుము. నన్ను మించినవాఁడు ముల్లోకములఁ గలుగఁడు. ఇదిగో దశాననుఁడు దోయి లొగ్గి నిన్ను యాచించుచున్నాఁడు. ముజ్జగంబులకుఁ బ్రభువైన యీరావణుని లంకేశ్వరుని గూడి భువనత్రయంబును బాలింపుము.' అని నిజప్రణయమును దెలిపెను.

ఆకాంతారత్నము గడగడ వడఁకుచుఁ జేదోయి కీలించి 'అయ్యా ! నాపేరు రంభ ; నీవునాకు గురుఁడవు ; కోడలితో నిట్లాడఁ దగదు. పర ధర్షంబునుండి నాబోంట్లను రక్షింపవలసిన నీవే యిట్లు పలికిన నిఁక మాకు

గతి యెవ్వరు ?' అని తలవంచి నిలిచెను. రావణుఁడు పులకితశరీరుఁడై 'వగలాడీ ! నీకు నేను మామ నెట్లగుదు ? నాసుతుని పెండ్లాడితివా ?' యనెను. 'రాక్షసేశ్వరా ! బొంకుటగాదు ; కుబేరుఁడు నీకు సోదరుఁడు; ఆయనపుత్త్రునకు నలకూబరునకు నేను ప్రియురాలనై యుందును. ఆలోక పాలసుతునకై సంకేతస్థానంబునకుఁ జనుచున్నదానను. ఒరులయందు నా మది దగులదు. నన్ను వదలుము. అధర్మాత్ముఁడు నాకో అకు నిరీక్షించు చుండు. నీసుతుని యాత్మసౌఖ్యంబునకు నీ వడ్డుపడుట పాడిగాదు. సజ్జనుల దారి మేలగును. నాకు నీవు పూజ్యుఁడవు ; నీకు నేను రక్షణీయ' నని వినయపురస్సరంబుగాఁ బలికెను.

రావణుఁడు వెక్కసపునవ్వు నవ్వి వగలాడీ ! నాకుఁ గోడల నఁటివి. ఇందులకు నవ్వొయ్యేదు ; దేవలోకమర్యాద లెఱుంగనని తలంతు వా ? సురవేశ్యవు ; దినమునకు నొకనిపొత్తు పడయుదువు ; నీకులమునకే వావివరుసలు లేవు. నీపాతివ్రత్యప్రసంగ మిఁకఁ జాలు' అని యయ్యా చ్చరపూబోడిని శిలాతలంబునఁ బడవైచి బలవంతముగా రమించెను. రంభ యెట్టకేలకు రావణుని గవుంగిటనుండి వదలఁబడి, కరింద్రక్రీడామధితతరం గిణివలె నాకులపాటు చెంది గాలికిఁ దూగాడు పూఁదీవె క్రియ నసియా డుచుఁ జిక్కువడినమాల్యాభరణములతో విశీర్ణశిరోజాలముతో నలకూబరు నొద్దకుఁ జని వానిపాదంబుల వ్రాలి లజ్జావ్యసనభరంబునఁ బలుకాడ నోప కుండెను. అతఁ డాప్రియురాలిదురవస్థను జూచి సంగతి యూహించి 'ప్రేయసీ ! పాదముల వ్రాలితివేల ?' యనెను. రంభ నిట్టూర్పులు పు చ్చుచు వడఁకుచుఁ గేల్దోయి గూర్చి యుదంతమెల్ల వినిపింపఁ దలచి 'హృదయేశ్వరా ! దశగ్రీవుఁడు సేనాసమేతుఁడై సురలోకముపయి దాడి వెడలుచుఁ గైలాసగిరితటంబున విడిసెను. ఆసంగతి యెఱుంగక యామా ర్గమున నీకడకు వచ్చుచుంటిని. ఆకూళ నన్ను నిరోధించి బలాత్కరించెను. గలరూపు విన్నవించితిని. కామమోహితుఁడై యాదుష్టుఁడు నామాటలు వినకుండెను. 'నీకోడల నంటిని ; నీతుడు పలికితిని ; వేడుకొంటిని. ఏమి చేసినను వినక నన్నతఁడు బలవంతముగా ధర్షించెను. నాయపరాధము సైరింప వేడుదు. అబలలగతి యిట్టిదే గదా' యని విలపించెను.

నలకూబరుఁడు కొండొకతడవు ధ్యానగతుఁడై సంగతియెల్ల నెఱిఁగి క్రోధాగ్ని దీపింప దోయిట జలము గైకొని యాచమించి యథావిధి ముఖాదికము స్పృశించి 'కళ్యాణీ ! ఒల్లనినిన్ను బలవంతముగా నతఁడు ధర్షించెఁ గదా. ఒల్లని యేయువతి నేని యతఁ డిక ముట్టునేని తత్క్షణము వాని తలలు వ్రీలి యేడుతునియలై నేలఁ గూలుఁగాక' యని శపించెను. తథాస్తు అని తెలుపుటకో యన దేవదుందుభులు మ్రోగెను. బ్రహ్మాదులు హర్షించిరి. మునులు సెబాసనిరి. ఆశాపవృత్తాంతమును రావణబంధితలై యున్న పతివ్రతామణులును కన్యారత్నములును కర్ణాకర్ణికగా విని మనస్తాపంబులు కొంతమాని స్వస్థచిత్తలైరి.

ఇంద్రుని జయించుట.

రావణుఁ డంత సురేంద్రలోకమార్గము ద్రొక్కెను. రక్కసుల రావములు సముద్రమథనధ్వనులను ధిక్కరించి వారిరాకఁ దెలుపుటకో యన మునుమున్న నాకలోకము బ్రాఁకెను. ఇంద్రుఁ డాసంగతి విని గద్దెమీఁదనుండి యులికిపడెను; కొలువున్న దేవతులముఖంబులు వెల్లబాఱెను; దేవస్త్రీలు భయవిహ్వలలై మానముకొఱకు ప్రాణంబులను త్యజింప నుద్యుక్తలైరి. సురలోకమెల్ల గోడుగోడు మనెను.

ఇంద్రుఁ డేమియుఁ దోఁపక హుటాహుటి విష్ణువునొద్దకుఁ బోయి (1) ఎవఁడు మొట్టమొదట విశ్వము నెల్ల సృష్టించెనో, ఎవఁడు సర్గానంతరం బావిశ్వంబునెల్లఁ బోషించుచున్నాఁడో ఎవఁడు తుట్టతుదకు విశ్వసంహర్తయగుచున్నాఁడో, ఇట్లు సృష్టిస్థితిసంహారములకు మూఁడింటికిఁ గర్తయగుచు నెవఁడు మూఁడురూపంబుల వెలుంగునో యట్టి బ్రహ్మవిష్ణుహరాత్మకుఁడవైన నీకు నమస్కారము. (2) కూటస్థుఁడవైన నాకుఁ ద్రిరూపవ్యమెట్లు పొసఁగు నందువా ? ఆకాశమునుండి వచ్చువర్షోదకము మొట్టమొదట నేకరసముగానే యుండును. అయిన నయ్యది ఊషరాది దేశంబులందుఁ బడి లవణాది రసాంతరంబును బొందుచున్నదిగదా ? అట్లే నిర్వికారుఁడవైన నీకు సత్త్వాదిగుణసంసర్గంబునం జేసి బ్రహ్మాదిరూపంబులు గలుగుచున్నవి. (3) దేవా! నీవు అమేయుఁడవు అనఁగా అపరిచ్ఛిన్నుఁడవు; లోకమో పరిచ్ఛిన్నమైనదిగానున్నది. నీవో నిస్పృహుఁడవు, అనఁగా ఎట్టి

కోరికలేని వాఁడవు, అట్లుండియుఁ గోరినవారికిఁ గోరినకోర్కు లిత్తువు. నిన్ను జయించువారే లేరు; ఎల్లరను నీవు జయింతువు. అతిసూక్ష్మరూపివి; అట్లుండియు వ్యక్తమైన యీస్థూలరూపంబునకెల్లఁ గారణమవుదువు. (4) స్వామీ! నీవుసర్వాంతర్యామివి గావునఁ బ్రతివ్యక్తిహృదయాంతరంబున నిత్యసన్నిహితుఁడవై యుందువు. అట్లున్నను నీరూపం బగమ్యముగావున నిన్ను దూరస్థునిగాఁ దలంతురు. నీవు పరిపూర్ణుఁడవును నిస్పృహాపంతుఁడవును గావున నీకెట్టియభిలాషయు లేదు. దానంజేసి నిష్కాముఁడవు. అట్లుండియు, మహాతపస్వివై యుందువు. దేనింగూర్చి తపస్సు చేయుచుందువో యూహింపరాదు. పరదుఃఖంబుల లేశమాత్రముగూడ సహింపలేని మహాదయాళుఁడవు. అట్లుండియు నిత్యానందస్వరూపుఁడవు గాన నెట్టి దుఃఖము నెఱుంగవు. పురాణుఁడవే గాని జరత్వము మాత్రము నీకు లేదు. (5) స్వామీ! నీవు సర్వజ్ఞుఁడవు; నిన్ను మాత్ర మెవ్వరు నెఱుంగరు. సర్వములకుఁ గారణమై యుందువు. నీకు మాత్రము కారణము లేదు. సర్వమునకు నీవే ప్రభుఁడవు; నీకుమాత్రము ప్రభువు లేఁడు. ఏకమూర్తివయ్యు సర్వరూపంబుల నుందువు. (6) దేవా! రథంతరాది సప్తసామంబుల నుపగీతింపఁ బడుదువు; సప్తార్ణవజలంబుల శయనింతువు; మఱియు సప్తార్చివదనుడవై విరాజిల్లుదువు. సప్తలోకంబులకుఁ బ్రభుఁడవై యుందువు. (7) దేవా! ధర్మార్థకామమోక్షంబు లనెడి నాల్గింటికి ఫలకమైన యేజ్ఞానముగలదో అది నీవేనై యున్నావు. కృతత్రేతాది చతుర్యుగకాల పరిణామంబును చాతుర్వర్ణ్యప్రచురశాలివియునై యుందువు. ఈ సమస్తము చతుర్ముఖుఁడవైన నీవలననే కలుగుచున్నది. (8) ఎవరు అభ్యాసబలంబున విషయాంతరములనుండి తమమనస్సును నివర్తింతురో యట్టి యోగులు హృత్పుండరీకాంతంబున జ్యోతిర్మయ మూర్తివై యున్న నిన్ను మోక్షార్థము ధ్యానింతురు. (9) అజుఁడవు గావున నీకు జన్మములే లేవు. అట్లుండియు మత్స్యాదిరూపంబుల గ్రహింతువు. నీవు చేష్టారహితుఁడవు. అట్లుండియు శత్రువులను సంహరింతువు. నిత్య ప్రబుద్ధుఁడవు; అట్లుండియు యోగనిద్రావశుఁడవై యుందువు. ఇట్టి పరస్పరవిరుద్ధచేష్టలు గల నీ యాథార్థ్యంబు నెవ్వరెఱుంగగలరు? (10) మఱియుఁ గృష్ణాదిరూపంబులెత్తి విషయాదుల ననుభవింతువు; నరనారాయణాదిరూపములు దాల్చి దుశ్చర

మైన తపంబొనర్తువు. దైత్యులను మర్దించి ప్రజలను గాపాడుదువు; ఉదాసీనుఁడవై యుందువు. ఇట్టి పరస్పరవిరుద్ధంబులఁ జేయ నీకన్న మఱియెవరికి సామర్థ్యము గలదు! (11) స్థితిహేతువులైన మార్గంబులను ఆగమాదులు బహువిధంబులఁ బల్కుచున్నను వానికెల్ల నీయందే సమన్వయము. ఎట్లందువా! గంగాది ప్రవాహంబులు వివిధంబులుగా భిన్నంబులై వచ్చినను దుదకు వానికెల్ల సముద్రమే శరణము గదా. (12) నీయందే యెవరు చిత్తంబును నిల్పుదురో, నీకే సర్వకర్మంబుల నెవ్వరు సమర్పింతురో, యట్టి రాగరహితులకు నీవే మోక్షసాధనము. (13) దేవా! నీమహిమంబు పృథివ్యాది ప్రత్యక్ష ప్రమాణంబుల ద్వారమున గమ్యమానమగుచున్నది. ప్రత్యక్ష ప్రమాణమైన పృథివియే అపరిచ్ఛేద్యమనగా ఆపృథివికిఁ గారణభూతుఁడవై యప్రత్యక్షమూర్తివై యున్న నీవు అపరిచ్ఛేద్యుఁడవని వేఱ చెప్పవలయునా! (14 స్వామీ! కేవలస్మరణమాత్రాననే నీవు నిన్ను స్మరించువానిని పవిత్రీకరింతువు. నీస్మరణమే యింతఫలమిచ్చుచుండఁగా నీదర్శన స్పర్శన భాగ్యము గన్నవానిగతి చెప్పవలయునా! (15) ఉదధిగర్భమందలి రత్నంబులనైనను సూర్యునికిరణంబులనైనను లెక్కింపవచ్చును గాని నీచరిత్రలను లెక్కింప సాధ్యము గాదు. అట్టి అవాఙ్మానసగోచరంబులైన నీచరిత్రల సమగ్రంబుగా స్తుతింప నేరితరము! (16) దేవా! నీవు పొందనిది గాని పొందఁదగినదిగాని యేదియులేదు అట్టివాఁడవయ్యు నీవవతారములు ధరింతువు. ఇట్టి నీజన్మకర్మములు కేవలలోకానుగ్రహార్థమేగాని వేఱు గాదు. నీవు పరమకారుణికుఁడవు గావున బరార్థ ప్రవృత్తి నీకుండుట వింత గాదు సుమా. (17) దేవా! నీమహిమంబును గీర్తించి వాక్కు సంపూతమగుచున్నది. ఈవచస్సంహరణము వాగ్వ్యాపార పరిశ్రాంతివలననో గాక సమగ్రంబుగా స్తుతించుటకు శక్తిజాలకయో యగును గాని నీగుణముల పారము ముట్టగాదు. 'ఓదేవా! శరణు; శరణు; రావణుఁడు యుద్ధకాంక్షియై వచ్చియున్నాఁడు; వాఁడు సహజబలశాలి; దానికి బ్రహ్మ వరములు తోడయ్యెను. పరమేష్ఠివచనంబు లమోఘంబులు. అందువలన భయపడుదు. నీదయ నూఁతగాని నముచిని వృత్రాసురుని బలిని నరకాసుర శంబరాసురులను రూపుమాపిన నా కితఁడొక లెక్కగాదు. దేవా! సచరాచర భువనత్రయంబునకు నీవే దిక్కు; లోకంబులను స్థాపించితివి;

సురరాజ్యపీఠంబున నన్ను నిలిపితివి. మహాత్మా! జగంబులెల్ల నీవలనఁ బొడమి నీయందు నిలిచి తుదకు నీయందే యడఁగును. ఆజ్ఞయిమ్ము వేరేల? నీచక్రాయుధము వానిని దఱుఁగ నందాఁక మాకు బ్రతుకులు లేవని దీనాతి దీనస్వరంబున మొఱపెట్టెను.

నావుఁడు 'సురేశ్వరా! భయపడకు; సురాసురకోటి క్రితఁడు వధ్యుఁడు గాఁడు. చంపుదునా యనినఁ బరమేష్ఠివర మడ్డు పడుచున్నది. తద్వరబలోత్కటుఁడై వీఁడొనర్చు దుర్ణయంబులు విన రాకున్నవి. కొడుకన్ననో తండ్రిని మించెను. వీరిరువురిబాధలకు ముల్లోకములు తల్లడిల్లుచున్నవి. వీరితోడి నాయుద్ధమున కిది సమయము గాదు. తుదకు నేనే వీనికి మిత్తి నగుదు. ఈమాట తప్పదు. వెఱపుమాని సురులతోఁగూడి వానికి యుద్ధ మొసంగుము పొమ్ము.' అని విష్ణువు చెప్పి వానినిఁ బంపెను.

సురసైన్యంబులు తలపడెను; వారిని గాంచినంతనే రాక్షసులు హర్ష కోలాహలములు గావించి చెలరేఁగిరి. ఇరుదళంబులకు ఘోరయుద్ధ మొనరెను. దశగ్రీవుని మంత్రులైన మారీచ ప్రహస్త మహాపార్శ్వ మహోదరాదులును సుమాలియుఁ దమతమబలంబులతో రణక్షోణి ప్రవేశించి వాయువు మేఘంబులనువలె నిర్జరసైన్యంబును జించి చెండాడిరి. దేవతలసేనయెల్లఁ బాఱిపోవసాగెను.

అష్టమవసువు సావిత్రుఁ డనువాఁడు నిర్జరులదురవస్థఁగాంచి విక్రమించి రణాజిరము చొచ్చెను. వానికి నాదిత్యులును ద్వష్టయుఁ బూషుఁడును దమతమ యోధాగ్రేసరులతోడ సాయపడిరి. దేవరాక్షసులకు నిట్టి దనరాని పోరుజరిగెను. అసురులు నానాప్రహరణంబులతో నమరులను వేలకొలఁదిగా బడఁగొట్టి ఱంకెలువైచిరి. సుమాలి మఱియొకప్రక్కఁ జేరి దేవబలంబును గగ్గోలు గావించెను. హతశేషు లూపిరియాడక దిక్కులఁ బట్టిరి. వారిని సుమాలి వెంబడించెను. సావిత్రు డదిగాంచి సుమాలిని దాఁకెను. వారిరువురయుద్ధము తలఁచిన నేఁడును బులకరించును. అట్లు పెద్దకాలము పోరుజరిగెను; ఎవరును వెన్నుజూపరైరి. సావిత్రుఁడు విజృంభించి నిశితాంబరంబులు వెదచల్లి వైరిరథంబును గూల్చి కాలదండము బోని గదాయుధముచేత సుమాలిశిరంబునఁ జఱచెను. ఆ వ్రేటునకు

వానితలప్రక్కలయ్యెను. వాని యెముకలును శరీరమును నెత్తురుగుజ్జులయ్యెను వానిని గుర్తించుటకుగూడ సాధ్యము గాకుండెను. వానిపాటునకుఁ దదను చరులైన రక్కసులు గుండియలు ప్రీలి బిట్టఱచుచుఁబాఱఁ జొచ్చిరి.

సుమాలిపాటును రాక్షసులయలజడియు మేఘనాదుఁడు గాంచి క్రోధపరీతుఁడై రథమారోహించి ప్రళయాగ్నివలెఁ గ్రాలుచు దానవులను గ్రమ్మరించి సురసైన్యముఁజొచ్చి కార్చిచ్చు కాననంబునుబోలె శరాగ్నుల దహింపసాగెను. నిర్జరులు వానిధాకకు నోర్వలేక విచ్చి పాఱఁజొచ్చిరి. ఇంద్రుఁ డంతమునుపడ వచ్చి భయపడకు; పాఱిపోకు, మరలుము మరలుము ఇదిగో నాకొడుకు రణముఁ జొచ్చుచున్నాఁడని కేకలువైచి తనసేనకు ధైర్యము గొలిపెను. అంతలోన వానిసుతుఁడు జయంతుఁడు మహాద్భుత కల్పితమైన రథమెక్కి యాహవోన్ముఖుఁ డయ్యెను. త్రిదశులును దెంపు వహించి మరలి వానికిఁ దోడయిరి.

జయంతమేఘనాదులకుఁ బ్రచండాహవము జరిగెను. అసురవీరుఁడు కనకభూషితాశుగంబులు వైచి జయంతసారథిని గోముఖుని నొప్పించెను. శచీసుతుఁడు రావణిసారథి నట్లే యొనర్చెను. మేఘనాదుఁడు క్రోధ సమావిష్టుఁడై నేత్రగోళంబుల నిప్పులు రాల్చుచు శరవర్షముఁ గురిసి యింద్రసుతుని ముంచివైచి సురసైన్యంబుపయి శితధారాభయంకర ములైన నానాయుధంబులు పఱచి మాయాబలము నాశ్రయించి చెంజీకట్లు గప్పెను. ఆగాఢాంధకారములోఁ దమవారినిఁ బగవారిని గుర్తింపరాక యమరులు నిర్విణ్ణులై నిలిచిరి. రక్కసు లుక్కుమీఱి యమరుల నెచ్చటి వారి నచ్చటనే తఱిగిరి. మేఘనాదుఁడు వివిధాయుధములు పఱపి శచీ సుతుని బహుప్రకారములఁ గలఁచెను. అతఁడు దిక్కుదోపకుండెను. జయంతుని దురవస్థను వానిమాతామహుఁడు పులోముఁడు చూచి హుటాహుటి వచ్చి యాచీకటిలో నెల్లరఁ గనుబ్రామి మనుమ నెత్తుకొనిబోయి సాగరాంతమున డాగెను. జయంతుని కానక సురసైన్యము వితాకు చెంది బరాబరియయ్యెను. రాక్షససైన్యమందు హర్షనినాదంబు లుప్పతిల్లెను.

ఇంద్రుఁడు నిర్జరులకలవరముఁ గాంచి నిజసుతవినాశమును శంకించి యాహవముఁ జొచ్చెను. అదితులును రుద్రులును వసువులును సాధ్యులును

మరుద్గణమును బురందరుని జుట్టి నిలిచిరి. మేఘంబులు ప్రళయగర్జలు గావించెను; వాయువులు నిర్ఘాతధ్వని వీఁచెను; భాస్కరుఁడు తేజంబును బాసెను; ఉల్కాపాతంబులు గురిసెను; వివిధవాద్యంబులు బోరుకలంగెను.

అంతలోన రావణుఁడాసంగతి విని విశ్వకర్మనిర్మితమహాభోగవిషజ్వాలాజాజ్వల్యమానస్యందనం బారోహించి దైత్యసేనాపరివృతుఁడై కుమారుని వారించి తానుదలపడెను; దేవదానవులకు శస్త్రాస్త్రి బాహాబాహి ముష్టాముష్టి భయంకరముగా నాజి వాటిల్లెను. కుంభకర్ణుఁడొక ప్రక్కరణాంగణము జొచ్చి చేఁజిక్కినవారి నొడిచిపట్టుకొని దంతంబులతోఁగొరికి భుజంబులతోఁ దాడించి కాలఁదన్ని పెక్కునిర్జరులను జంపివైచెను. రుద్రులు క్రోధసంపూర్ణితులై శస్త్రాస్త్రంబుల నెడలేక ప్రయోగించి నిశాచరులను నురుమాడిరి. మరుత్తులొకవంక విక్రమించి నానాతీవ్రప్రహారణంబుల రేద్రిమ్మరులను గసిమసిచేసిరి. రక్కసులు కొందఱు కరచరణంబులు దెగి నేలఁగూలిరి; కొందఱు రథంబులక్రిందఁబడి నలిగిచచ్చిరి; కొందఱు వాహనంబులతోడ డొల్లిరి; గుఱ్ఱపురౌతులు కొందఱు తురంగమములమీఁదనే మడిసియుఁ గానెబలంబునఁ గ్రిందబడక యట్లే నిల్వఁ గొని యుండిరి; మఱి కొందఱు భయపడి పఱచు నొంటెల త్రొక్కిళ్లకు నెత్తురుగుజ్జయిరి. రక్తంబులు వఱదలై పాఱెను. గృధ్రకంకంబులు రుధిరమాంసాతురములై గుంపులుగుంపులుగాఁ గూడెను.

నిశాచరబల మట్లగుట దశగ్రీవుఁడు చూచి మహాగ్రహోదగ్రుఁడై భూరిచాపంబును గైకొని ధనుష్టంకారము గావించి సురసైన్యము జొచ్చి నిశితభల్లంబుల వారిని నూర్లకొలఁది కూల్చి యింద్రుని దాఁకెను. పాకశాసనుఁడును మహాకోదండమును గ్రహించి దశదిశావిస్ఫారముగా జ్యానాదమొనర్చి యగ్నులంబోని శరంబుల వేనవేలు రావణునితలలు గురిచేసి వైచెను. దశకంఠుఁడును శక్రుని నంపవానలో ముంచెను. ఆ యోధాగ్రేసరుల బాణమండలము పర్వి నభోంతరాళమెల్లఁ గప్పుటంజేసి రవికిరణప్రసారమునకు సందులేదయ్యెను. ఆకారణంబున రణరంగమెల్ల నిరులు గప్పెను.

ఆచీకటిలో సురాసురవీరులు బలోన్మత్తులై ప్రాణంబులకుఁ దెగించి

పోరి యొండొరులంజంపుకొనిరి. ఎట్టకేలకు రాక్షసబలంబున దశాంశము మాత్రము మిగిలెను. రావణుఁ డందులకుఁ దీవ్రకోప మూని బొబ్బరించి 'సూతా! సురలోకమెల్ల నేఁటితో నామావశిష్టమగును. శత్రుసేనాంతరమునకు రథమును బోనిమ్ము; శక్రుని జంపి, ధనదుని దగ్ధమొనర్చి వరుణుని గావుగొని, యముని సమయించి, యమరులఁ బరిమార్చి జయలక్ష్మిని బడయునందాఁక మరలరాదు. జాగువలదు, పోనిమ్ము రథమును; ఈనందనసీమనుండి యుదయపర్వత ప్రాంతమునకుఁ దోలుము' అని భీషణస్వనంబున నాజ్ఞాపించెను. మాటతోడ సారథి వాగెలు సడిలించెను. హయంబులు చెంగలించి మనోజవంబున రథంబును గొని పోయి శత్రుమండలిమధ్య భాగంబున నిలిచెను.

దశకంఠుని నిశ్చయము నింద్రుఁడు గ్రహించి సమరక్షోణినున్న దేవతలనెల్లఁ గలయఁ జూచి 'నిర్జరులారా! చూడుము చూడుము. పర్వకాలంబున సముద్రంబును దరంగంబులట్లురావణుఁడు నిజసైన్యంబుతో వచ్చి సురపృతనను జొచ్చినాఁడు. వరదానబలంబున నితనికి మరణభయమే లేదు. వీనిని జంప సాధ్యముగాదు. కావున నితనిబట్టి బంధించుట మేలు. ఆప్రకార మొనర్చి జగత్త్రయంబునకు సుఖమును గూర్తు' నని చెప్పి యుత్తరభాగమున నున్న రావణుని వదలి దక్షిణకోణమునకుఁ బోయి యందలి రక్కసుల పీఁచ మడఁపసాగెను.

రాక్షసేశ్వరుఁడు సురసేనామధ్యగతుఁడై యడ్డము వచ్చినవారి నెల్లఁ దునుమాడుచు నూఱుయోజనంబులు చనెను. అందాఁక నిర్జరసైన్యము వినష్టమైధరాతలంబునఁ బడెను. ఇంద్రుఁడది దవ్వునుండి చూచి తెంపు చేసి దశాననుని ముట్టడించెను. ఆవ్యూహాకౌసల్యమునకు రావణుఁడు సంభ్రాంతుఁ డయ్యెను. దానవులును రాక్షసులును 'చచ్చితిమి, చచ్చితిమి' అని హాహారావములు గావించిరి.

ఆ కలకలము విని మేఘనాదుఁడు క్రోధమూర్తియై శతాంగంబధిరోహించి సురసైన్యముఁ జొచ్చి యీశ్వరప్రసాదలబ్ధమైన మహామాయను బ్రయోగించి యెల్లరకన్నులు గప్పి యింద్రుని దాఁకి శరవర్షముఁగురిసెను.

పాకశాసనుఁడు కటకటంబడి విల్లుపూని ప్రతిశరంబులు సంధించి వైరిని వెదకి యెందునుగానక 'కటా! చేఁజిక్కియు నితఁడు మాయాబలంబునఁ దప్పించుకొనుచున్నాఁడు' అని చింతఁ గూరి నిర్వీర్యుఁడువోలె నుండెను. రావణి విజృంభించి క్రూరనారాచంబుల మాతలిని నొంచి మహేంద్రుని పయి గుంభవర్షమట్లు నిశితభల్లంబులు గురిసెను. ఇంద్రుఁ డంత రథసారథులను వదలి యైరావత మెక్కి విరోధిని వెదుక నారంభించెను.

మేఘనాదుఁడు మాయాబలంబున నంతరిక్షమందే యదృశ్యుఁడై యుండి శత్రుని మాయాపరిక్షిప్తునిగా నొనర్చి నలువలంకులనుండి తీవ్రసాయకములు ఉవ్వి వానిని బరిశ్రాంతునిజేసి మాయాశక్తిచేతఁ గట్టివైచి కొనిపోయెను. సురనాథుఁడట్లు కొనిపోబఁడుట యమరవర్గము చూచి 'అహో! ఎవఁ డీమాయావి? ఎందును గానరాఁడు; మన ఱేఁడు మాత్రము బద్ధుఁడై జీవచ్ఛవమువలె వెంటఁ జనుచున్నాఁడు. ఇఁక మన బ్రతుకు లేల?' యని రోషావేశులై మైమఱచి రావణునిపయిఁ బడిరి. దశగ్రీవుఁడు నిర్జరగణార్దితుఁడై ప్రతియుద్ధంబునకు నోపకుండెను. తండ్రియట్లు శరజర్ఝరీకృతాంగుఁడై సనిచెడి యుండుట మేఘనాదుఁడు చూచి 'నాయనా! యుద్ధము విరమించి రమ్ము; జయలక్ష్మిని గ్రహించితిమి; మనసేనలను మరలింపుము; ముల్లోకముల ఱేఁడు పట్టువడెను; అమరుల దర్పంబు లడుగంటెను; ఇఁక జగత్త్రయంబు నశాత్రవముగా నేలు' మని యనన్యదృగ్గోచరుఁడుగా నుండి పలికెను.

ఆమాటలు విని బృందారకులు రణముఁ జాలించిరి. నిశాచరపతి దీర్ఘనిశ్వాసము పుచ్చి 'నాయనా! మనకులము నుద్ధరించితివి. నీబలపరాక్రమము లిట్టివని సురేంద్రుఁడే చాటును. నీరథముమీఁదనే సుత్రాముని లంకకుఁ గొని పొమ్ము. మనసైన్యము నెల్లఁ గూర్చికొని నీయడుగులలోనే వత్తు'నని చెప్పెను. అతఁడట్లే యొనర్చెను. అంతలోన రావణుఁడు వచ్చి వీరుల నెల్ల నభినందించి వారివారి యిక్కవలకుఁ బంపెను.

దేవతలు తనవల్లభునిగతికిఁ బరమదుఃఖితులై ప్రజాపతియొద్దకుఁ బోయి 'తండ్రీ! నీవరబలంబున మా కీదురవస్థ సంప్రాప్తించెను. ఇంద్రుని

బంధించి ముల్లెమూఁటగా రక్కసులు గొనిపోయిరి. లంకేశ్వరుఁడు మాకు వధ్యుఁడు కాఁడు. ఇంతలో మా యగచాట్లు తీఱవు. అతనికొడుకునకు మహేశ్వరుఁ డిచ్చినవరంబులబల మింతనరాదు. మాయాబలవత్తరుని వానిని మేమేమి సేయఁగలము? ఎవనివరమువలన నింద్రునకు నిట్టిపాటు గలిగెనో నీయా వరదాతవు నీవేమమ్మిఁక రక్షింపనగు' నని సాగిలఁబడి మ్రొక్కిరి.

ప్రజాపతివారికెల్ల నూఱటపల్కి లంకానగరమునకుఁ బోయి మింట నుండి 'వత్సా! రావణా! నీబలమును నీసుతుని కౌసల్యంబును మెచ్చితిని. విక్రమౌదార్యంబుల నీకొడుకు నీకు సాటియో మిన్నయో చెప్పరాదు. స్వతేజోబలంబులచేత ముల్లోకములను గెల్చి నీప్రతిన నిలుపుకొంటివి. నేఁడు మొదలు నీకొడుకు 'ఇంద్రజిత్తు' అను పేర నొప్పును. ఇఁక నీకెదురు గలంగరు. వేల్పులటేనికై వందరుచున్న యీసురలకు సంతసముఁగూర్పు' మనెను. పరమేష్ఠి యట్లుచెప్పఁగా 'దేవా! ఇంద్రుని వదలు మనుదువేని యమరత్వమును నాకుఁ బ్రసాదింపుము' అని యింద్రజిత్తు కోరెను. బ్రహ్మ యది విని 'వత్సా! సర్వామరత్వ మెవ్వరికిని గలుగదు. 'జాతస్య మరణం ధ్రువ' మ్మని వినవా? అసాధ్యంబును గోరి ఫలమేమి' యనెను. 'అట్లగునేని వీతిహోత్రుని హవ్యమంత్రములతో నేను యజించుచో నయ్యగ్నికుండమునుండి రథాశ్వములు పుట్టి వచ్చుఁగాక; ఆరథముమీఁద నేనున్నంతకాలము నాకు రణాంగణంబున మృతి గలుగకుండుఁగాక ; ఈ వరము ననుగ్రహింతువేని నీకోరినట్లు సేయుదు' నని యింద్రజిత్తు చెప్పెను. బ్రహ్మ సుంత యాలోచించి 'వత్సా! అట్లే యగుఁబొమ్ము. హోమమును సంకల్పించి పరిసమాప్తి గావింపకమున్నె రణరంగముఁ జొత్తువేని నీకు వినాశము దప్ప'దనెను. అంత వజ్రిని విడిపించిరి. 'అహో! ఎల్లరుఁదపస్సుచేత మెప్పించి వరములు పడయుదురు. ఇతఁడు విక్రమముచేత మెప్పించి వరములు పడసెగదా' యని యమరులు మేఘనాదుని బ్రశంసించిరి.

ఇంద్రుడు తాననుభవించిన యవమానంబునకు గడుంగడు దీనతఁ గాంచి పలుకనోఁపక యట్టె నిలిచెను. ప్రజాపతి వానివగ గ్రహించి 'అమరేంద్రా! దైన్యము వలదు. కర్మఫలము తప్పదు. నీయీదురవస్థకుఁ గారణము వినుము. తొల్లి నేను ప్రజలనెల్ల నేకవర్ణులుగా నేకరూపులుగా

నొక్కభావమాటాడు వారినిగా సృజించితిని. అందువలన వారిలోఁబర స్పర మేర్పాటుపరాకుండెను. అది తలపోసి వారికంటె వైశిష్ట్యముగా సృజింప సంకల్పించి ప్రజలప్రత్యంగమందలి గుణంబు లేరి యేరి కూర్చి యొకస్త్రీని పుట్టించి యాయింతికి అహల్య యనుసార్థకనామ మిచ్చితిని. సార్థకనామ మెట్లందువా? హలమనఁగా వైరూప్యము; హలశబ్దభవము హల్యము; హల్యము లేనిది యహల్య యగును. అట్లాపడతుకను గుణ రూపవిశిష్టగా నిర్మించినతర్వాత 'అహో! ఈకల్యాణి నెవనికిఁగూర్తునా?' యను చింత వొడమెను. నీ వక్కాంతారత్నమును జూచి యాత్మపద గౌరవమును భావించి 'ఈకన్నె నాకుఁ దక్క నన్యునకుఁ బత్ని కాఁదగ' దని మనసారఁ గోరితివి. తగినవరుని గానక నేనాయింతిని గొనిపోయి గౌతమర్షి యొద్ద నిల్లడ యుంచితిని. ఆమహాత్ముఁడు మది చలింపక పెక్కేండ్లాపడతుకను గాపాడెను. వానిబుద్ధినైర్మల్యంబునకును దత్త పస్సిద్ధికిని మెచ్చి యాయింతిని వానికే పత్నిగాఁ గూర్చితిని. అది విని నీవు మత్సరించి యాముని యింటలేనితఱిఁ దదీయాశ్రమముఁ జొచ్చి యందు నగ్నిశిఖవలెఁ దేజరిల్లుచుండిన యహల్యను గాంచి కామమోహితుఁడవై యా సుందరిని గూడి తిరిగి వచ్చుచుంటివి. నిన్నాఋషి చూచి నీయకార్యమును గ్రహించి 'కామమోహితుఁడవై హితాహితంబులు పరికింపక పరదారా గమన మొనర్చితివి గాన విఫలుఁ డవగుము. చోరుఁడవై నాయాశ్రమముఁ జొచ్చితివి గావున రణరంగమున వైరికిఁ జిక్కి బందివగుము. ఇఁక నెవఁడు జారత్వ మొనర్చినను దత్పాతకంబున సగము నీకు డాపరించు చుండును. పదగౌరవంబునకుఁ ద్రుళ్ళితివి గావున నీయింద్రపద మస్థిర మగుఁగాక; ఇంద్రత్వ మింతయొనర్చెఁ గావున నెవనికిఁగూడ నది యశాశ్వ తమగుఁగాక' యని నిన్ను శపించి 'దుర్భగా! ఇంద్రియలోలవైతివి గావున పసిచెడి యాయాశ్రమము పొంతనే పడియుండుము. ఏ నీరూపయావన సంపదలకు మురిసి యిట్లొనర్చితివో యవి నీకేగాక లోకసామాన్యమగుగాక; నీ యబుసుపోక లడఁగుఁగాక' యని యహల్యను దిట్టెను. వాసవా! ఇదిమొదల స్త్రీలు సహజరూపవతు లైరి. అహల్య యట్లు శాపదగ్ధయై చింత పడి పతిచరణంబుల వ్రాలి 'నాథా! ఇంద్రుఁడు నీరూపమున వచ్చి మోస గించెను. నాయజ్ఞానమును సైరింపు' మని గౌతముని బ్రార్థించెను. ఆ

దయామయుఁడు కనికరించి "మానినీ! నీదురిత మింతనరాదు; దానినిఁ బోకార్ప నొరులతరము గాదు. శ్రీమహావిష్ణు వొక్కఁడే యందులకు నోపును. ఆ భగవంతుఁడు ధర్మరక్షణార్థము రాముఁ డనుపేర నిక్ష్వాకువంశంబున జనించి యిందు వచ్చును. అప్పుడు వాని పాదధూళి నీపయి సోఁకును. అంతట నీపాపము పరిహృతమగును; నీవు యథాపూర్వ మగుదువు. ఆమహాత్మునకు యథావిధి యాతిథ్య మొసఁగి పరిశుద్ధవై నన్నుఁ జేరుదువు పొమ్ము" అని శాపపరిహార మనుగ్రహించెను. ఇంద్రా! సంగతి వింటివా? కర్మఫల మెవ్వరికిని దప్పదు. నీసుతునకై వగచుచున్నావు. అతఁడు సాగరాంతమున వానిమాతామహునియొద్ద సుఖమున్నాఁడు. సురేంద్రా! వైష్ణవయజ్ఞ మొనర్చి సర్వకలుషంబులు పోఁచికొని నాకమునకుఁ బొమ్ము" అని పలికి బ్రహ్మ యంతర్హితుఁ డయ్యెను. ఇంద్రు డట్లు గావించి స్వర్గలోకమునకుఁ జని యథావిధి సురరాజ్యంబును బాలింపఁ దొడఁగెను.

### రావణకార్తవీర్యార్జునుల యుద్ధము.

రావణుఁడు వజ్రిని జయించి మాహిష్మతీపురముపయి వెడలెను. ఆనగరంబును గార్తవీర్యార్జునుఁ డనుమహాతేజశ్శాలి శరకుండంబున నుంచిన వీతిహోత్రుఁడో యన నొప్పుచున్నవాఁడు పరిపాలించుచుండెను. ఆసమయంబున నతఁడు జలక్రీడావినోదియై సుందరీమణులను గూడి నర్మదానదికిఁ బోయియుండెను. రావణుఁ డాప్రోలు చేరి రాజసచివులను బిలిచి "ఏఁడీ మీ ఱేఁడు? రావణుఁడు యుద్ధార్థము వచ్చెనని యతనికిఁ దెలుపు" మనెను "రాక్షసేశ్వరా! మారా జిందు లేఁడు" అని వారు చెప్పిరి.

అంత రావణుఁడు వింధ్యపర్వతమునకుఁ బోయెను. ఆనగేంద్రము భూమిని వ్రచ్చి పుట్టి తనయౌన్నత్యంబును జూపుటకుఁగా మిన్నొరయుచున్నదో యన నుండెను. దానిశిఖరంబులు సహస్రాధికమై రవిమార్గంబును నిరోధించుటకుఁగాఁ గొండేల ఱాయఁడు చాచిన బాహువులో యన నొప్పెను. అగిరిగుహలు సింహశార్దూలాదిక్రూరసత్త్వంబులకు నిలయములై డాయరావమయ్యెను. అందలి సెలయేళ్ళధ్వనులు నగాధిపుఁడు గావించు మహాట్టహాసంబులుగాఁ దోఁచెను. దేవదానవ గంధర్వులు తమతమప్రియులఁ గూడి సలుపువినోదక్రీడలకు నందు మేర గలుగదు. స్ఫటికనిర్మలజలంబులు

వాకలు గట్టి పాఱుచు శైలేంద్రుని పేరురంబునఁ గ్రాలుముత్యాలహారములు పేరులోయన నొప్పెను. మఱియు నచ్చటిచటియలు నాల్కలల్లార్చుచుఁ బడగలు విచ్చుచు ముడుచుచు బుసగొట్టుచునున్న వివిధపన్నగములతో నిండి మహాభయంకరముగా నుండెను.

నర్మదానదం బాయావింధ్యగిరియందుఁబుట్టి పశ్చిమముఖముగాఁ బ్రవహించుచుండును. ఆనదజలంబులందు మునుగుచుఁ దేలుచుఁ గూయుచుఁ జక్రవాక హంస కారండవ జలకుక్కుటంబులు గావించు రట్టడిఁజూడఁగా, ధ్యానభంగము గలిగినప్పుడింద్రియలోలురు చేయుకోలాహలధ్వనులు జ్ఞప్తికి వచ్చుచుండెను. మహిషాదివనమృగంబులు వడదాకి డప్పిగొని తండోప తండములుగా వచ్చి యా నదీతోయంబులను గలఁచుచున్నను దానియడుగు భాగమందలి వివిధశిలాలింగములు స్పష్టముగా నగపడుచుండుటఁ జూడఁగా నింద్రియములకు నింద్రియార్థములకును సంయోగము గలుగుచున్నను స్థితప్రజ్ఞునియంతరంగము వికారరహితమై స్ఫటికస్వచ్ఛముగానుండు ననుటకుఁ నయ్యది సాదృశ్యమో యన నొప్పెను.

ఆనదీమతల్లి నిర్మలతోయములాడి పులినశ్రోణీతలంబుపయిఁ దెల్లని నురుగుఁబుట్టముఁగట్టి జక్కవగబ్బిగుబ్బలమీఁద సంఫుల్లద్రుమోత్తంసంబును సవరించి రాయంచబాఱునెడి మొలనూలు బిగించి పూఁబొడిగంధ మలఁది వికచారవిందనేత్రంబులఁ గ్రీఁగంటిచూపులు నెఱపుచుండుట రావణుఁడు చూచి పుష్పకవిమానమునుండి దిగి ప్రియురాలి కవుంగిటంబలె నయ్యేటి యెదపై వ్రాలి యంపిలి. సైకతప్రదేశములందు సచివులతోడఁ గూర్చుండి 'అహో! గంగయేల?' యని యాత్మసంతోషంబును వెలిపుచ్చి శుకసారణుల వంక మరలి 'అదిగో చూడుము తపనుఁడు లోకసంతాపకరుఁ డయ్యు నాకుఁగా శీతకరుఁడై మింటనిలిచి నాయాజ్ఞకు వేచి యున్నాఁడు; వాయువు నాకు శ్రమపరిహారిగా నర్మదాజలకణ శీతలంబులును సుగంధబంధురంబులు నగువాతాంకురంబులను మెల్లమెల్ల వీఁచుచున్నాఁడు; ఆహో! ఈ తరంగిణి నర్మవర్ధనియై నక్రమీనవిహంగోర్మికలతోఁగూఁడి తిరస్కృతిని శంకించు నంగనామణివలెఁ దోఁచుచున్నది సుమా. మంత్రులారా! నానాశేంద్రులతోడను మహేంద్రాదిదేవతలతోడను బోరి మీరెల్లరు

శస్త్రాంకితశరీరులును రుధిర చందనదిగ్ధాంగులునై యున్నారు. శర్మదమైన యీనర్మదయందుఁ గ్రుంకి మలినంబులు వాసి సుఖముండుఁడు. అదిగో శరదిందు శుభ్రమైన యాపులినతలంబున నేను శంకరునకు నంతలోనఁ బుష్పోపహారమొనర్చివత్తు' ననెను.

ప్రహస్తాదులు చని వామనాదిదిగ్గజంబులు గంగానదినిఁబోలె నర్మదాతరంగిణిని గలఁచి జలకములాడి రావణుఁడు గావించు శివపూజార్థము పుష్పంబులు గొనివచ్చి రాశివోసిరి. లంకేశ్వరుఁడంత నీరములాడి విధిప్రకారము జపించి వచ్చి తడివస్త్రము విడిచి పీతాంబరముఁగట్టి లింగార్చనంబునకై తగుచోటు వెదకసాగెను. వానివెంట నతని మంత్రులు సువర్ణమయపూజాలింగమును మోచికొని తరలిరి. పరిసరప్రదేశమెల్లఁ బరీక్షింపఁబడెను. తుదకొకచోటు నిర్ణీతమయ్యెను. అచట సైకతవేదిని గల్పించి దానినడుమఁ బూజాలింగము నుంచి గంధపుష్పాక్షతల నర్చించిరి. రావణుఁడంతఁగొంతవడి నంతర్ధ్యానగతుఁడై యుండి తర్వాత శివార్చనకుఁ దొడఁగెను.

అత్తటిఁ దన్నదీజలంబులు లుబికి బూరటిల్లి పొరలి రావణునిపూజాద్రవ్యముల నెల్ల ముంచి కొట్టుకొనిపోయెను. దశగ్రీవుఁడంతతోఁ బూజ మానిఁ ప్రియకాంత ప్రతికూలయగుకరణిఁ బశ్చిమముఖియైన యేఱు ప్రాఙ్ముఖియగుటఁగాంచి, 'ఏమీ యీవింత ! విభ్రాంతవిహంగమయయ్యె నిత్తరంగిణి సహజశాంతగుణంబువేర్మి నిర్వికారయగునంగన క్రియఁ దోచుచున్నది. కారణమూహింపరా' దని తలపోసి శుకసారణులకు వ్రేలితో సైఁగ చేసెను.

వారు తనిభావమును గ్రహించి మింటికెగసి పశ్చిమముఖులై నది మీఁదుగా నర్ధయోజనము చని యట నున్నతసాలమునుబోని పురుషుఁడొకఁడు మదవ్యాకులతేజోవిలసితుఁడై మూర్ధజంబులు నీటఁ దేలియాడుచుండ స్త్రీలఁ గూడి జలక్రీడలు సల్పుచుఁ గనకాచలము తనవేయిపాదంబులతో మేదినీతలంబునువలెఁ దనవేయిహస్తములతోఁ దటినీమణి నాఁకవెట్టి యుండుటయుఁ దత్కారణంబునఁ బ్రవాహము ముందునకుఁ బోలేక పొంగి

మరలుటయుఁ జూచి యాశ్చర్యమగ్నులై వచ్చి సంగతియెల్ల దశగ్రీవునకు విన్నవించిరి.

రావణుఁడు సంగతి విని యవియంతయుఁ గార్తవీర్యార్జునునిపనిగా గ్రహించి యుద్ధలాలసుఁడై యతనిపయికిఁ దరలెను. వాయువు చెలరేఁగి కెంధూళుల లెగఁజిమ్మి ప్రచండగతి వీచెను; మేఘంబులు సక్రుత్తుగా ఘోషించుచు రక్తపర్షములు వర్షించెను. అయశుభసూచకంబులను లంకేశ్వరుఁడు లక్ష్యపెట్టక చని, కరణీగణంబుతోడ గజేంద్రుమపగిది స్త్రీలబృందముతోడ జలకమాడుచున్న నరేంద్రుని గాంచి, రోషరక్తలోచనుఁడై వానియమాత్యులను జీరి తనరాక వారిజేని కెఱింగింపు మనెను. వారా మాట విని 'భళీ! భళీ! సంగ్రామమునకు మంచివేళ నిశ్చయించి వచ్చితివి! కలువకంటులఁ గూడి సలిలక్రీడల నుండువానిని గయ్యమునకుఁ బిలుతువా! నీమగటిమిని స్త్రీలకుఁజూపఁదలచితివా? చాలుఁజాలు; ఈ రేయి నిదానింపుము; జేపకడ రమ్ము; నీభుజకండూతి తెమలును. యుద్ధతృష్ణాతిరేకంబున మామాట వినవేని మాతోఁబోరునకు రమ్ము; తర్వాత మారాజు నొద్దకుఁ బోనగు' ననిరి.

రావణమంత్రులు విజృంభించి యర్జును సచివులను దాఁకిరి. హలాహలాశబ్దములు పెచ్చుపెరిఁగెను; నదీతటంబులు ప్రతిధ్వనులను రట్టింపుగా నీని వింతఁగొలిపెను. అర్జునునిమంత్రులు కసెలు శరంబులు శూలత్రిశూలంబులుఁ గొని రావణసచివులను నొప్పించి నక్రమీనమకరసంకులంబగు సాగరమువలె గర్జించిరి ప్రహస్తశుకసారణాదులు రోషాగ్నులను గ్రుమ్మరించుచు వివిధాయుధములను బఱపి యరివర్గంబును దుత్తునియలు గావించిరి. ఆసంగతి హైహయుఁడు ద్వారపాలకులవలన విని భయపడవలదని స్త్రీజనంబునకుఁ బలికి గంగాతోయంబులనుండి యంజనగజంబువోలె నర్మదానీరంబులనుండి లేచి యుగాంతకాలాగ్నికరణి మండుచు హేమాంగదము ధరించి గదఁ బూని దివాకరుఁడు పెంజీఁకట్లపయికివలె నప్పిశితాశనులపైకి నుఱికెను. గదఁ ద్రిప్పుచు గరుడవేగంబున వచ్చుచున్న యర్జునుని రావణమంత్రులు భాస్కరుని వింధ్యాచలమట్లు నిరోధించిరి. వారికి బెట్టిదంపుసంగరము జరిగెను. ప్రహస్తుఁడు లోహమయముసలంబును ద్రి

ప్పియర్జునునిపయి వైచి యార్చెను. ఆముసలము మంటలు గురియుచు లోకదహనమొనర్పనున్నదో యనుశంకఁ గలిగించుచు మహోద్ధతి వచ్చెను. కార్తవీర్యుఁడు నేర్పుమెయి దానితాఁకును దప్పించుకొని పంచబాహుశతోచ్ఛ్రయంబును మహాభారవంతము నైనగదనుజేతఁబట్టి ప్రహస్తుని మీఁదికి నురువడించి వానినొక్కటి వడ్డించెను. వజ్రహతికి శైలంబువలె నతఁడాప్రేటునకు నేలఁ గూలెను. శుకసారణాదులు భీతిల్లి పాఱిరి.

రావణుఁ డదియెల్లఁ జూచి రోషావిలుఁడై కార్తవీర్యు నెదుర్కొనెను. ఇరువదిహస్తములవాఁడును వేయిహస్తములవాఁడు నట్లు విడివడి గదిసి సంరబ్ధసాగరంబుల క్రియఁ బాదువిడిచివచ్చినకొండలరీతి మండుచండభానులకైవడి మంటలుమియుచున్న గార్చిచ్చులవలె మాతంగికై పోరు మదగజంబులతేవ ఘూర్ణిల్లుమేఘంబులచందాన విడివడినసింహములపగిది నాఁబోతులరహిఁ బ్రళయాంతరుద్రులవోలెఁ బోరసాగిరి. వారిగదలొండొంటిఁ దాఁకి మ్రోయుమ్రోఁతలు పిడుగుశబ్దంబులను మించెను. గదాయుగసంఘర్షణంబున జనించిన వహ్నిజ్వాలలకాంతి యంతరాళమునెల్ల వెలిగించెను. ఆవేడిమి సహింపనోపక రాజభటులును రాక్షససైన్యంబును దవ్వుచనెను. అర్జునుఁడు కోపోద్దీపితుఁడై లంకేశ్వరునివక్షఃపీఠిపయి గదతోఁ దాటించెను. రావణుఁడు నట్లే యొనర్చెను. అట్లు వారు పరస్పరము జయింపఁగోరి యొండొరు నతిక్రమింపఁ దలఁచి పెద్దయుంగాలము పోరిరి. ఒక్కరు నలసటఁ జెందరు ; నొప్పికి లొంగరు. వారిపోరు బలీంద్రులయుద్ధమును దలపించెను. కొమ్ములతోఁ గోడెలును దంతాగ్రంబులతో మత్తేభంబులు నొండొంటి నుఱుమాడుకొనుచందాన వారు పెనఁగులాడిరి. ఎట్టకేలకు హైహయుఁడు గదతో రావణునియురంబున మరల మోఁదెను. గద రెండుగాఁ దునిగిపడెను; రావణుఁడు నెత్తురులు గ్రక్కి నాల్గుమూరలు వెనుకకు దొల్లెను. వరబలంబునంజేసి యతఁడు చావఁడు. గరుత్మంతుఁడు పన్నగంబుపైకివలె నర్జునుఁడు వానిమీఁదికి దుమికి యతని నొడిచిపట్టి వామనుఁడు బలినట్లు బంధించెను. సిద్ధచారణులు సాధువాక్యంబులు పలికిరి. అర్జునుని పయి సుమవృష్టి గురిసెను.

మృగంబును వ్యాఘ్రమట్లు గజంబును సింహమువలె రావణుని హై

హయుఁడుబట్టి బంధించి యంబుదస్వనంబున హర్ష నాదంబులు గావింపఁగా
నాధ్వనికిఁ బ్రహస్తుఁడు కనువిచ్చిచూచి సంగతి గ్రహించి కోపవివశుఁడై
లేచి యసురసేనాశేషము నెల్లఁగూర్చి యంబురాశిని గాలిమబ్బులట్లు
కార్తవీర్యుని ముసరి 'వదలు వదలు నిలు నిలు' మని. కేకలు పెట్టుచు శూ
లంబులను ముసలంబులను విసరెను. హైహయుఁ డయ్యాయుధముల నెల్ల
జేసేతల నందుకొని వాని చేతనే యారక్కసుల నుక్కడంచెను. వారు
లుకలుకలై పెనుగాలికి నులిమబ్బులకైవడి విడిసిపాఱిరి. అంత నతఁడు
రావణుని బంది గొని తన పురముఁ బ్రవేశించెను.

దేవతలు దివిఁజేరి 'ఆహా! గాలిని మూటఁగట్టినట్లు రావణుని బం
ధించి కార్తవీర్యుఁడు కొనిపోయెను. ఇతని శక్తి సామర్థ్యము లేమనవచ్చు'
నని చెప్పుకొనుచుఁ దమసంతోషంబులను వెలిబుచ్చుచుండిరి. పులస్త్యుఁ
డాసంగతి విని పుత్త్రకృతస్నేహంబునఁ జాలిచెంది మాహిష్మతీపురమునకు
వచ్చి తనరాక కార్తవీర్యునకుఁ దెలిపెను. పులస్త్యుఁ డన్నంతనే కార్త
వీర్యుఁడు శిరంబున నంజలి పుటముఁ జేర్చి యర్ఘ్యమధుపర్కంబులు గైకొని
పురోహిత సహితంబుగా నెదురేగి, భాస్కరునివలె వెలుఁగుచున్న యమ్ము
నీంద్రునకు నమస్కరించి వానిని సముచితవిధంబున నర్ఘ్యపాద్యాదుల గౌర
వించి 'ఋషిసత్తమా! మీయాగమంబున నాయీపుర మయ్యమరావతీ
తుల్య మయ్యెను. నేను పవిత్రుఁడనైతిని. మహాత్మా! నేఁడు నావ్రత
ములెల్ల ఫలించెను; నాజన్మము సాఫల్య మొందెను. తండ్రీ! ఈరాజ్యము
నాయీపుత్త్రాదులెల్లరు నేనును మీవారమేగదా. కార్యముగలదేని యా
జ్ఞాపింపనగు' ననెను.

పులస్త్యుఁడు సంతసించి 'రాజేంద్రా! ధర్మము చక్కఁగాఁ బ్రవర్తి
ల్లునుగదా. అగ్నులు యథావిధి వ్రేలునుగదా! పుత్త్రాదులు సుఖముందురు
గదా! అర్జునా! నీబలమసదృశము. ఎవనిమాట చెప్పినంతనే సాగరము
నిస్తరంగమై నిలుచునో, ఎవనిపే రుచ్చరించినంతనే వాయువు వీచుట మా
నునో, యట్టి రణదుర్జయుని నాపౌత్త్రుని రావణుని ముల్లెమూటఁగాఁదెచ్చిన
నీశక్తి నేమనికొని యాడుదు? ఆపుత్త్రకునియశఃపూరమెల్ల గ్రోలివైచితి

వనుటకన్న వేరుగా నిన్నుఁ బొగడరాదు. రాజేంద్రా! అబుడుతను వద లుము. అందునిమిత్తము వచ్చితి' ననెను.

ఆమాటతోడఁ గార్తవీర్యుఁడు రావణుని వదలిపెట్టుటయే గాక మీఁదుమిక్కిలి యతనిని దివ్యాభరణవస్త్రంబుల సత్కరించెను. పుల స్త్యుఁడు పరమసంతోషమొంది వారిరువురకు నగ్నిసాక్షికముగా మైత్రి గా వించెను. హైహయుఁడు ఋషికి మ్రొక్కి చనెను. పులస్త్యుఁడంత రావణుని సందిటఁ గూర్చి 'నాయనా! శక్తిసంపదలకు మేరలేదు; ఒక రిని మించి యొకరుందురు; ఇది లోకసహజము. వరబలము గలదని గర్వింప వలదు. వరములు సయితము తపోబలమునుబట్టి యుండును. ఈరహస్య ము నీవు గ్రహించుటకై నేఁడిట్టిది నీకుఁ బొసఁగెనని యెఱిఁగి జాగరూకుఁ డవై వర్తింపు' మని పెక్కుధర్మములం బోధించి వానిని వీడ్కొనెను. దశగ్రీవుఁడు లజ్జావనతవదనుఁడై లంకానగరముఁ జొచ్చెను.

వాలి రావణులు.

లజ్జ యింకను మాయలేదు; హైహయుని వ్రేటులవలని గాయములిం కను మానలేదు. అంతలోననే రావణునకు రణోత్సుకత్వము మరలఁ దలసూ పెను. నైజము నిలువనీయదుగదా. రావణుఁడు ససైన్యముగాఁ దరలి ధాత్రీమండలమెల్లఁ గ్రుమ్మరుచు బలాఢ్యుఁ డని విన్నంతనే తనవునలు విచ రింపక కన్నవారినెల్లఁ గయ్యమునకుఁ జీరసాగెను. ఇట్లతఁడు దర్పోద్ధతుఁడై కన్నవారిని విన్నవారిని బీడించుచు కొండొకనాఁడు కిష్కింధకు వచ్చి త న్నెతయైనవాలిని రణభిక్ష గోరెను. లంకేశ్వరునిరాకను వాలిమంత్రులు సుగ్రీవాదులు విని వచ్చి 'రాక్షసేంద్రా! నీకుఁ బ్రతిబలుఁడు వాలి యిప్పు డిందు లేఁడు. నిన్నోర్చువానరులు మఱెవ్వరుఁ గలుగరు. రావ ణా! వానరేశ్వరుఁడు చతుస్సముద్రములందు వార్చి రాఁ జనెను. ము హూర్తకాలము సైరింపుము. ఆయన వచ్చుతతి యయ్యెను. ఇంతలో నయ్యస్థిరాశిని వీక్షింపుము. అవి వాలితోఁ బోరి చచ్చినవారి యెముకల ప్రోవు. దశగ్రీవా! అమృతము ద్రావి వచ్చినను వాలిచేతబడి బ్రదికి పోవుట కల్ల. ప్రాణంబులు నీకుఁ దీపగునేని వచ్చినదారిఁ బట్టుము.

వానరేశ్వరుఁ డిప్పుడు దక్షిణసముద్రతీరంబున వార్చుచుండు. వలతు వేని యటకుఁజను' మనిరి.

రావణుఁ డామాటలకు మండిపడి విమానమెక్కి దక్షిణార్ణవమునకుఁ బోయెను. ఆసముద్రతీరమున హేమాద్రియంతటివాఁడు కూర్చుండి సంధ్య వార్చుచుండెను. అతఁడే వాలిగా యని రావణుఁడు తలఁచి వానిఁబట్టి బంధించు తలఁపుతో విమానము దిగి కాలుకాలు గదలింపక మెల్లగా డాయఁ బోయెను. వాలి యదృచ్ఛగాఁ గ్రీగంట రావణునిఁ జూచి యతని దుర్భావమును గ్రహించి 'సరిసరి, కానిమ్ము' అని లోలోన నగవుచుఁ జూడనట్లు నటించి నిగమమంత్రములఁ బఠింపసాగెను. రావణుఁడు తటాలునఁ దనహస్తంబులను వాలిచంకలఁ దూర్చి యతనిని లేవనెత్త నుంకించెను. కపీశ్వరుఁడు నిజకక్షాంతరములను బిగించి తివ్వన నింగికెగసెను. గరుడుని కాలఁజిక్కిన పాముక్రియ వాలిచంకలలో రావణుఁడుదగులుకొని వ్రేలాడసాగెను. వాలి గగనంబునకు నెగసి గోళ్ళతో నశురుమేనెల్ల ఱక్కుచు తివ్వనఁ దూర్పుకడలివంకఁ జనెను. ప్రహస్తాదులు తమరాజు పాటుఁ జూచి వానిని విడిపించుటకై వాలివెంటఁ బడిరి. ప్లవగేశ్వరుఁడు కొంచెము వడిచేసెను. వానిబాహువులనుఁడియు నూరువులనుఁడియు జనించిన గాలి సుడితిరుగుచు వీచెను. ఆగాలివడికిఁ బర్వతములుగూడ పేఁటలువాటి దొర్లఁజొచ్చెను. రాక్షసేశ్వరుని మంత్రులు పండుటాకులవలెఁ గొట్టుకొని పోసాగిరి. వారు కొంతసేపు పెనఁగులాడి లావు చాలదని తమయత్నము మానిరి. వానరనాయకుఁడు తూర్పుసముద్రమున వార్చి యందుండి యుత్తరసాగరమునకుఁ బోయి యావలఁ బశ్చిమసముద్రము దాఁకి కిష్కింధకు వచ్చి దినవిస్తారసమాప్తిఁ గావించుకొని యానగరోపాంతప్రదేశమునఁ జంకలు సడలించెను. దశగ్రీవుఁడు సగమేడిన ప్రాణములతోఁ గ్రిందఁబడి లేచి నిలిచెను. వాలి యేమియు నెఱుఁగనివాఁడు వోలె మరలి చూచి 'అసురేశ్వరులా! ఎప్పుడు దయచేసితిరి? సేమమా? ఎందుఁ బోవుచున్నారు? కార్యమేదేనిఁ గలదా?' యని యడిగెను.

ఆమాటలు పుంటిపై మ్లుడ్డచినట్లు గాఁగా దైత్యపతికిఁ గొఱవప్రాణములు గూడ నెగసినట్లయ్యెను. 'అహో! ఏమిబలము! ఏమివీర్యము

ఇతఁడు జింకపిల్లనుబోలె నన్నుఁ జంకలలో నిఱికించుకొని నాల్గుసముద్రాలు క్షణములో జుట్టివచ్చెఁగదా' యని రావణాసురుఁడు మహాశ్చర్యమగ్నుఁడై 'వానరేశ్వరా ! నీబల మింతనరాదు ; నీవేగమునకు మనస్సుగూడ తలవంచును. హరిపుంగవా ! నీశక్తిని జవిచూచితి ; నీతోఁ జిరసఖ్య మొనర్తు; నేఁడుసుత మనయిరువురకు నెందును భేదభావ ముండరాదు' అని వచించి యగ్నిసాక్షికముగా వానితోఁ జెలిమి యొనర్చి చేతఁ జేయి పెట్టించుకొని కిష్కింధానగరమున సర్వోపభోగము లనుభవించుచు నొక్కమాసము పుచ్చెను. శుకసారణాదులు రాజును వెదకుచు దేశదేశంబులు దిమ్మతిరిగి యెట్టకేలకుఁ గిష్కింధఁ జేరియట దమయేలికను గాంచి సంతసించి వాలి యనుమతిఁ బడసి రావణుని లంకకుఁ గొనివచ్చిరి.

రావణుఁడు లంకచేరి దనుజరాజ్యము నెల్లఁ గనుసన్నలఁ బాలించుచుండెను. వానిమాటకు మాఱు గలుగదు. వానియనుచరులు చెలరేఁగి విశృంఖలవృత్తి ననుసరించిరి. ఇంద్రుఁడు గొడుగుపట్టువాఁడయ్యెను ; వాయువు పంకావాఁడయ్యెను ; కుబేరునకు సరాబు పని నిచ్చిరి ; వరుణుఁడు ముంగిటఁగలయంపి చల్లువాఁడయ్యెను ; అగ్నికి బానసములోఁ బని పెట్టిరి ; యముఁడు దండముఁగొని ద్వారమునఁ గాపుండుటయ్యెను. నైఋతి చేతికి హడపమిచ్చిరి. సూర్యచంద్రులు కాల్దివిటీలు పట్టిరి. సురవేశ్యలకు లంకానగరమే కాపురమయ్యెను.

అసురులు కొందఱు చని వనవనాంతరము దిరిగి యందందుఁ గానవచ్చు మునిపల్లెలు చొచ్చి యందలివారిని బట్టి కొట్టి బాధింపుచుండిరి. మఱి కొందఱు దేశదేశంబులు గ్రుమ్మరి చక్కని కన్నెలఁ బట్టితెచ్చి తేనికిఁ గానుకలిచ్చి వాని మెప్పు విలువసాగిరి. మర్త్యామర్త్యులెల్లరు మానప్రాణముల మీఁద నాస వదలిరి. ఏప్రాణికిని దిగులు గూడు తప్ప సుఖజీవనము గలుగదయ్యెను.

సీ॥ మునిపల్లెలెల్లెడ మొదలంటఁజనుటయ్యో
యజ్ఞయాగము లంతమందుటయ్యో
సుందరీమణులెందు బందిలోఁబడుటయ్యో
మానవతి బ్రదుకు మానుటయ్యో

జీవరాశికి దుఃఖ జీవిక విధియయ్యె
నెల్లలోకముఁ దల్లడిల్లుటయ్యె
దైవమాయనిపల్కు దండనఁబడుటయ్యె
నోరత్తియాడిన నేరమయ్యె
గీ॥ అలరుబోండ్లకంటను దడియాఁడదయ్యె
వాయిలేనిబిడ్డల గోడవారియయ్యెఁ
దలఁపఁబంటయు వంటయుఁ దక్కువయ్యె
రక్కసుల నిరంకుశపు వర్తనము పేర్మి.

పూర్వ కాండము
సంపూర్ణము.

---



శ్రీశారదాంబాయైనమః.



# శ్రీ దొడ్డ రామాయణము.

## బాలకాండము.



సీ॥ ఓం నమో భగవత ఉత్తమశ్లోకాయ
నమ ఆర్యజన రక్షణవ్రతాయ,
నమ ఉపశిక్షిత సమదర్శనాత్మనే
నమ ఉపాసిత భువనత్రయాయ,
నమ ఆగమార్థనిర్ణయసూక్తి నియమాయ
బ్రహ్మణ్యదేవాయ భావితాయ,
నమ ఆదిపురుషాయ నవనీతహృదయాయ
రాజాధిరాజాయ రఘుకులాయ,
గీ॥ మునిమనోబ్జసారంగాయ మోక్షదాయ,
ఆర్త సంత్రాణదీక్షాయ ; అవ్యయాయ,
పరమపావననామాయ భద్రకాయ,
రామచంద్రాయ నిర్జిత రావణాయ.

## ప్రథమమండలము.

### అయోధ్యానగరము.

సరయూతీరంబునఁ గోసలదేశముగలదు. దానికి నయోధ్యానగరము రాజధానిగా నుండెను. ఆపట్టణమును దొల్లి వైవస్వతమనువు నిర్మించెను. అది పదురెండుయోజనంబుల నిడుపును మూఁడుయోజనంబుల తనర్పుఁగలిగి

తీర్చి దిద్దినవీధులతోను బ్రతివీధికి నిరువంకలందు వన్నెవన్నె పొదరిండ్లతోను సొబగారుచుండెను. ఆలతాగృహంబులం బూఁచినతమవల్లికాహస్తంబులను జాచి నెత్తావివిరిజొంపంబులను వెదచల్లుచు బాటసారులకుఁ బుష్పాంజలు లర్పించుటకై నగరలక్ష్మి నియమించినచేటికలో యనఁ దోఁచుచుండెను. ఆపూఁబొదల నడుమ నందందుఁ స్థాపించిన జలయంత్రములు తుషారశీకరంబులను జిల్కరించి పథికశ్రేణికి ననాయాచితశైత్యోపచారంబులఁ గూర్చుచుండెను. ఆయంత్రముల చేరువనున్న స్నిగ్ధచ్ఛాయావృక్షంబులు, నిజశాఖాగ్రంబుల నుయ్యాలలాడుచుఁ గలకలమధురస్వనంబులఁ బలుకు శుకపికంబులతో నిండి, సంగీతపురచ్చలో యనఁ జెలువారుచుండెను. ఆతరువులనీడలందు విశ్రమార్థము తీర్చిన వింతరంగులచలువఱాతిన్నెలు డాయవచ్చినవారిని గదలనీయ వనుట యతిశయోక్తి కానేరదు.

చ॥ పరిపరిదేశశిల్పకము భావనచేసి సమస్తవాస్తువుల్
సరిగ గణించి కాలము బ్రజారుచులన్ మదినిల్పి వృద్ధి వి
స్తరముల కిమ్ముచూపి కడుశ్రద్ధయు నేర్పును జోడుగాఁగ న
ప్పురమును గట్టి రాయలకప్రోలికి నుద్దిగనుండనో యనన్ ॥

ఆనగరమందలి ప్రాసాదంబులు సృష్టియందుఁగల వివిధవర్ణశిలారత్నములతో నిర్మితములై మిన్నొరయుచు రవికిరణప్రసారంబున వింతవింత వన్నెలీనుటంజేసి సూర్యునకు సహస్రకరుఁ డనుబిరుదు రూఢియయ్యెనో యని యూహింతురు. అందలి గోపురంబులచెలువంబును హాటకమయకవాటంబులహొరువును గ్రీడాపర్వతంబులయుఁ గూటాగారంబులయు శృంగారగరిమంబును గన్నారఁ జూచిసంతసింప నగునేగాని వేఱు గాదు.

ఆనగరవిపణిశ్రేణుల విలాసంబును జూడని కన్నులకల్మి కల్మిగాదనవచ్చును. ఒకచోటు నవరత్నరాసులు వింతవింతకాంతులఁ బిసాళించుచుండ, ఒకక్రేవఁ గస్తూరికాదిద్రవ్యంబులభుగభుగవాసన లెగయుచుండ, ఒకవంకఁ జీనిచీనాంబరములును జరీబుటాజిలుఁగువలువలునుఁ దళతళ కాంతులీనుచు నేతగాండ్ర నైపుణ్యంబును బ్రదర్శించుచుండ, ఒకచాయఁ బలురంగులపూసరంబులు కమ్మనితావులఁ జూఱలిచ్చుచుఁ బ్రకృతిలీలాసంపదను బ్రకటించుచుండ, ఒకచక్కి రకరకంబులధాన్యపుఁదిప్పలు చిఱుగొండలం

బోలి రాజ్యభాగ్యంబును జాటుచుండ, ఒకదెస. దేశదేశాంతరాగతములైన వివిధవస్తువులు వాణిజ్యప్రాబల్యమును దెలుపుచుండ నప్పురిబేరివాడలు సకలభాగ్యసౌభాగ్యనిధానములై పరిఢవిల్లెను. వేయేల ?

"సీ॥ శ్రీకరోదయవధూ లోకాననప్రభా
నాటితబహుచంద్రనాటనంబు,
సమ్మార్గదళితభూషారత్నమంజరీ
యోజితరథ్యాప్రపూజనంబు,
కైలాసశైలసంకాశసౌధనివేశ
కౌముదీకవచిత గగనతలము,
విస్తీర్ణవిపణివిన్యస్త వస్తువ్రజ
ప్రకటిత రత్నగర్భాజఠరము,
తే॥ విపులపవమాన తాండవలేపమాన,
లాంఛనధ్వజపట్టపల్లవలలామ,
మాళిరచితకశాకృత్య హేళిహాయము,
దీపితంబగు శ్రీమయోధ్యాపురంబు".

మఱియు సాంగోపాంగముగాఁ జతుర్వేద లధ్యయనించి, షట్ఛాస్త్రంబులు గఱచి, గుణకర్మవిభాగ మెఱిఁగి, యాశ్రమయోగ్యంబుగా నిష్కామకర్మము లాచరించి చిత్తశుద్ధిఁ బడసి యథాక్రమము శ్రవణమనన ధ్యానంబు లనుష్ఠించి, తత్త్వసాక్షాత్కారసిద్ధిని గాంచి జగత్కల్యాణార్థము వర్తించు విప్రవర్యులతోడను, బరపీడాసమార్జితభోగంబులకుఁ జిక్కక, యథాశాస్త్రము దుష్టశిక్షణశిష్టరక్షణరూపమైన తమధర్మంబున నప్రమత్తులై యిహపరంబుల రెంటిని సాధించుచుండు క్షత్రియశిఖామణులతోడను, రాజ్యాంగమందుఁ దమకుగల హక్కుబాధ్యతలను గ్రహించి నీతినిబద్ధవ్యాపారంబులు సాగించుచు విశ్వాసపాత్రులై కుబేరసంపదల బెడగారుచుండు వైశ్యబృందంబుతోడను, స్వధర్మము నెడయక ప్రజాసేవయే భగవత్సేవగా భావించి శారీరకకర్మంబును మన్నించుచు సోమరిపోతులకుఁ దలవంపులు గలుగ రాజ్యలక్ష్మికిఁ గూర్మిసుతులై చరించు శూద్రకోటితోడను, గులశీల రక్షణగృహదేవతలో యన వెలసి మానవతులై మాతృప్రేమరసంబు లొలి

కించుచు నిసర్గమధురిమను మెఱుంగులు రాయుచు నుడివోనిసతీత్వంబునం బెంపెసలాడుచుండు స్త్రీజనంబుతోడను, సకలశస్త్రవిద్యల గడితేఱి కొదమసింగంపుశౌర్యంబుతో దీపించుచు రాజభక్తికిం బ్రాణము లిచ్చి నాయకుల కనుసన్నల మెలఁగుచుండు భటాగ్రేసరులతోడను, రాష్ట్రైకకుటుంబభావము మెఱయఁ బరస్పర మవ్యాజవాత్సల్యము నెఱపుచు నఱమఱలు లేక సుఖముండు ప్రకృతివర్గంబుతోడను, గ్రిక్కిఱిసి యప్పురవరంబు సాటిలేక సర్వవిధబలసమున్నతమై శోభిల్లెను.

రాజ్యాంగము.

ఆకోసలదేశంబు నిక్ష్వాకువంశరాజన్యులు వంశానుక్రమముగాఁ బాలించుచుండిరి. ప్రకృతచరిత్రకాలమున దానిని దశరథుఁ డనుమహారాజు అయోధ్యానగరము రాజధానిగా నేలుచుండెను. ఆరాజశిఖామణి వేదవేదాంగతత్త్వవేత్తయు దూరదర్శియునై ధర్మ మెడయక బహుయజ్ఞములాచరించుచు మహాగాంభీర్యముతో వర్తించుచుండెను. ఆ ఱేఁ డట్లనుల్లంఘ్యశాసనుడును దురాసదుఁడునై యుండినను వానియెడఁ బౌరజానపదులకుఁ గలప్రీతి యింతనరాదు.

దశరథునకు ధృష్టి, జయంతుఁడు, విజయుఁడు, అర్థసాధకుఁడు, సిద్ధార్థుఁడు, సుమంత్రుఁడు, అశోకుఁడు, మంత్రపాలుఁడు అనువారు మంత్రులుగా నుండిరి. వారెల్లరు నీతివిద్యానిపుణులును జితేంద్రియులును దృఢవిక్రములునై యథావచన మొనర్చుచుఁ దేజఃక్షమాయశఃకీర్తులతోఁ గ్రీడించుచుండిరి. మఱియుఁ గోపవశంబునఁగాని కామపరతంత్రతవలనఁగాని యర్థసంపాదననిమిత్తమునఁగాని వారు కల్ల వచింపరు. స్వపరరాజ్యంబులందుఁ ద్రికాలవిషయంబులు వారెఱుంగనివి గలుగవు. ధర్మాచరణంబునఁ బక్షపాతముఁ గోశసంగ్రహణంబునఁ బరాకు వారియెడఁ జాతమన్నను గానరావు. వారిమాట యన్నంతనే వేదవాక్యముఁగాఁ బ్రజలు తలఁదాల్తురు. వేయేల! నిష్కామకర్మయోగమును బ్రచురించుటకై భగవంతుఁడు వారిని సృష్టించి యుండు నిక్కెనో యననొప్పిరి.

దశరథునితపఃఫల మెట్టిదో గాని వానికి సచివులట్లు గురువులును సంప్రాప్తమైరి. అందు వసిష్ఠవామదేవులు ముఖ్యులు. ఆబుషిసత్తము లిఱు

వురు వానిక్ిఁ బురోహితులై కందోయకరణి వెలయుచు నతనియభిమతంబులఁ గురియింతురు. ఱేఁడును వారిహితవచనంబుల నాజ్ఞారూపంబున భావించి వర్తించుచుండెను.

అట్లు సత్యసంధులైన మంత్రు లెనమండ్రుగురు వానికి నష్టభుజంబులవోలెఁ జెలువారఁగా మహాతపోధనులగు ఋషీంద్రు లిరువురును గురువులై వానికి నేత్రద్వయముపగిది నొప్పారఁగా దశరథునియేలుఁబడి ధర్మపూతమై యుండెనని చెప్పవలయునా ? ధర్మము సురక్షితమగుటంజేసి కాలవర్షములు గురియుచు వానిరాజ్యమెల్ల ధనధాన్యసమృద్ధమై నిత్యకళ్యాణముఁ బచ్చతోరణముగా శోభిల్లెను. వసుంధర యట్లు నిత్యసస్యాఢ్య యగుటంజేసి గోవులు కుండలఁ బిదుకుచుండెను ; లేమి యెట్టిదో ప్రజలెఱుఁగరైరి ; దురాశాపిశాచంబులు నిలువనీడఁ గానక యారాజ్యమునుండి స్వపరివారముతోడ వలసపోయెను ; రాగద్వేషములు చన్నకారణంబున జనులెల్లరు నిష్కపటులై స్వభావధర్మమును మెట్టి లోకైకకుటుంబభావము గలిగి కుటుంచ తలంపులులేక దీర్ఘాయుష్మంతులై సుఖముండిరి. రాజ్యమెల్లఁ బ్రశాంతముగానుండెను.

తే॥ గీ॥ శాస్త్రశిక్షితప్రజ్ఞాఢ్య సచివులుండఁ
బరమధర్మజ్ఞులైనట్టి గురువులుండ
రాష్ట్రరంజనపరులైన రాజులుండఁ
బ్రజకు శుభపరంపర సదా ప్రబలకున్నె ? ॥

దశరథునిసంతాపము.

యోగభ్రష్టులలో భోగవాసనఁగలవారు మహారాజులుగా జనింతురు. మహారాజన్నంతనే వానికి నెందుఁ గొదువయుండదని సామాన్యులు తలంతురు. దైవగతి యట్లుగాదు. కోరిక కలంతకాలము గొదువ తప్పదని పరమేశ్వరుఁడు లోకంబునకు వేవిధములఁ జాటుచున్నాఁడు. జనులు కన్నులుండియు గ్రుడ్డివారై యీమర్మమును గ్రహింపలేక మరుమరీచికల వెంట బరుగెత్తుదురు. సమస్తైశ్వర్యములున్నను వివిధభోగము లనుభవించుచున్నను మర్త్యునకు నెందేనొకటి కొదువయుండు ననుటకు దశరథుని చరిత్రమే నిదర్శనము.

దశరథునకు వలసినంతరాజ్యముగలదు ; ఎల్లభోగములును వానియధీనములు ; మంత్రులన్ననో యసదృశప్రజావంతులేగాక స్వామిహితైకమతులు ; గురువులో గురువును మఱపింతురు. ప్రకృతివర్గమో కనుసన్నల మెలంగును ; ఏకాలమందును వానిరాజ్యమందెట్టి యరిష్టములు గలుగవు. ఇట్టి సిరిసంపదలతో సకలైశ్వర్యములతోఁ దులతూగుచు నెట్టి యుపద్రవములు లేని రాజ్యమందు నెలవై యెల్లయర్థములుఁ గోర్కి మీఱునట్లు గల్గినను దశరథుని దీఱనిదుఃఖ మొండు బాధించుచుండెను. ఇదే దైవచిత్రము.

దశరథునకుఁ బెక్కుభార్య లుండిరి. అందుఁ గౌసల్యాదేవి పట్టమహిషి ; సుమిత్రాదేవి రెండవభార్య ; కైకేయిప్రియురాలు. ఇందఱిలో నొక్కతెయైనను వంశాంకురంబును గాంచునోము నోచకుండెను. ముదిమి పైకొనెను ; సంతానము గలుగునట్టియాసయు సన్నగిల్లెను. ఈయనపత్యదోషము వానినిఁ బాయక యేద్చుచుండెను.

ఉ॥ అంకకుదారినట్టి సగరాదినరేంద్రులు ప్రోదిచేసి నా
యంకమునందుఁగూర్చిన మహాయతకోసల రాజ్యభార మే
నింకి వహింపఁజాల వయసేగుట నన్యునిపైనిమోఁప వం
శాంకురమింతలేదు, వగపయ్యెడు భావిగతిందలంచినన్ ॥

అని యాఱేఁడు దురపిల్లుచు గొండొకనాఁడు కులగురువులను మంత్రులను ద్విజోత్తములను రావించి వారికిఁ దగుమరియాదలుసలిపి,

"ఉ॥ దానములం దపంబుల సదక్షిణయజ్ఞములన్ విహీనసం
తానుల కూర్ధ్వలోకసుపథంబులు వశ్యముగావు, లబ్ధసం
తానుల యెందుఁ బూజ్యు లిది తథ్యము గావున నొండు దక్కి సం
తానము నాకు నయ్యెడువిధం బొనరింపుము ధర్మసంస్థితిన్ ॥"

అదియునుంగాక జనులు ప్రాయికంబుగా రజస్తమోగుణవృతులై యుందురు. ఆగుణంబులకు విశృంఖలవృత్తి గలిగెనేని రాజ్యమెల్ల తాఱుమాఱగును. అట్టిగుణములను శాసించుచు సత్త్వాభివృద్ధి గలిగించుటయే రాజ్యపాలనమందుఁగల పరమరహస్యము. అందులకే రాజులుండుట. ఈ

రజస్తమస్సులు తటాలున మాఱవు. వానికిఁ గ్రమక్రమముగాఁ బరిణామము గలిగింపవలయును. పరిపాలనవిధాన మవిచ్ఛిన్నముగా నుండనిచోఁ బూర్వోక్తకార్యము సాధ్యము గాదు. విధానమందు దుడుకుమార్పులు గలుగకుండవలయు నన్నచో రాజవంశమునకు విచ్ఛిత్తి గలుగరాదు. ఆ కారణంబున రాజులు సంతానము నభిలషింతురు. ఎట్లు విచారించినను సంతానము నాకు నిహపరంబులకు రెంటికి నవశ్యముగానున్నది. ఈపుణ్యము నోచనైతిని. కర్తవ్యమును సర్వజ్ఞులు మీరే యూహింపనగును. అయిన నొక్కటి తోఁచుచున్నది. పూర్వదుష్కృతములు ప్రాణులయభ్యుదయంబులకుఁ బ్రతిబంధకము లగునందురు. ప్రతిబంధకములు విధివిహితప్రాయశ్చిత్తములవలనఁ దొలఁగు నని వింటి. కానినాఁడు ప్రాయశ్చిత్తశాస్త్రమే నిరర్థకమగును. నాయనపత్యదోషము మదీయపూర్వదుష్కృతఫలముగాని యొండుగాదు. ఈపాపనివారణమునకుఁ బ్రాయశ్చిత్తము గలుగక మానదు. రాజులకు హయమేధయాగము నిఖిలదోషహరమే గాక సర్వాభీష్టప్రదమని గూడఁ బెద్దలు వచింతురు. అది నాకు యుక్తమేని యానతీయనగును. వేఱొండుపాయము గలచో విచారింపవేడుదు' నని ధర్మార్థసహితంబుగా వచించెను. వాని తలంపు విని 'రాజేంద్రా! నీసంకల్పము మాకుఁ బరమాంగీకారము; నీకోరిక ధర్మయుక్తమగుటంజేసి శీఘ్రఫలకారియగును; యాగ మారంభింపు' మని వారెల్లరుఁ జెప్పిరి.

దశరథుఁడందులకు సంతసించి 'అమాత్యులారా! వింటిరిగదా, యాగోపకరణంబులు గూర్చి యశ్వము నధ్వర్యునితోడ సరక్షకముగా వదలనగును. సరయూనదియుత్తరతీరమున యజ్ఞశాలను నిర్మించి శాంతికర్మములు కల్పోక్తప్రకారము జరిపింపవలయును. లోపంబులు గలుగవేని నిట్టి క్రతువులకు నెల్లరాజులు సమర్థులు. విఘ్నవిద్యాంసులైన బ్రహ్మరాక్షసులు యజ్ఞభంగార్థము సందులు నెమకుచుందురు. యజ్ఞము దోషగ్రస్తమేని కర్త వెనువెంట నశించును. అందువలన నిట్టిక్రతువులు సమస్తరాజయోగ్యములు గావు. మీతోడ్పాటును నమ్మి యిది తలపెట్టుచున్నాను. సమస్తభారము మీపయినున్నది' అని పలికెను. మంత్రులు తమయొడఁబాటును దెలిపిరి. బ్రాహ్మణులు దశరథుని దీవించి యనుజ్ఞాతులై చనిరి. అంతటఁడు మంత్రులను మరల హెచ్చరించి యంతఃపురమునకుఁ జని కౌసల్యా

దులకు సంగతి వినిచి వారిని దీక్షవహింపు మనెను. వారును ఋతివచనంబులకు వికసితవదనారవిందులైరి.

సుమంత్రుని హితవచనము.

దశరథునకు సుమంత్రుఁడను సారథి గలఁడు. అతఁడు వయోబుద్ధులఁ బెద్దయై తేనికి బహిఃప్రాణముగా నుండెను. సుమంత్రుఁడు తేనిసంకల్పమును విని యేకాంతముగా వానిని సందర్శించి 'దేవా! మీసంకల్పమును వింటిని. దీనింగూర్చి భగవానుఁడు సనత్కుమారుఁడు తొల్లి ఋషులకుఁ జెప్పినవచనంబులఁ బురావృత్తముగా వింటిని. అవి విన్నవింతు నవధరింపుము.

'కశ్యపప్రజాపతికి విభండకుఁడను సుతుఁడు గలఁడు. వానికి ఋష్యశృంగుఁడు జనించును. ఆమునికుమారుఁడు పుట్టువునోట్టి యరణ్యమునందే నివసించుచుండును. ఆకారణమున వానికి లౌకికజ్ఞానము బొత్తిగా నుండదు. అతఁడు ద్వివిధబ్రహ్మచారి యగును. వానికాలమెల్ల నగ్నిహోత్రకార్యములందుఁ బితృజనశుశ్రూషలందుఁ గడచుచుండును.

ఋష్యశృంగుఁడు ప్రథమబ్రహ్మచర్యావ్రతియై యుండునప్పుడు రోమపాదుఁ డనునంగరాజు ధర్మాతిక్రమ మొనర్చును. తత్ఫలముగా వాని రాజ్యమెల్ల ననావృష్టి వ్యాపించి సర్వభూతభయావహముగాఁ జిరకాలము బాధించును. రాజు దుఃఖదీనుఁడై శాస్త్రజ్ఞులను రావించి పాపప్రాయశ్చిత్తము వేఁడును. వారు దీర్ఘాలోచనము గావించి 'రాజా! ఋష్యశృంగు నేవగనేని యిందు రప్పించి వానికి నీపుత్త్రికను శాంతాదేవి నిచ్చి వివాహముఁ గావింపుము; వర్షప్రతిబంధకములు దొలఁగు' నని చెప్పెదురు. ఆఋషికుమారుని దోడితెచ్చుటకుఁగా రోమపాదుఁడు తనమంత్రిపురోహితులను నియమించును. వారు రాజాజ్ఞకు వ్యథితమనస్కులై ఋషివలని భయమును తేనికిఁ దెలిపి యుపాయాంతరమునఁ గార్యమును సాధింతు మందురు. రాజు సమ్మతించును. మంత్రులు మునిసుతునికొఱకు వేశ్యాంగనలను దరలింతురు. ఆహోయలంకత్రికలు చని యచ్చికబుచ్చికములచేత ఋష్యశృంగు నాకర్షించి యతనిఁ దోడితెత్తురు. రాజు వానికిఁ దనకూతు

నిచ్చి పెండ్లిచేయును. అంగదేశము సుఖవంతమగును. దశరథునకును బుత్త్ర ప్రాప్తి కలుగును ; దేవా భగవానుఁడు సనత్కుమారఋషీంద్రుఁ డిట్లు చెప్పెనట. నావిన్నతి విన్నవించితి’ ననెను.

దశరథుఁ డావృత్తాంతము విని హృష్టచిత్తుఁడై ‘సుమంత్రా ! ఋష్యశృంగుఁడు జితేంద్రియుఁ డని చెప్పితివి. అతఁడెట్లు వారాంగనలకు వశుఁడయ్యెను ? వాని నెట్లు పడపుఁగొమ్మలు తోడితెచ్చిరి ? ఇది సాకల్యముగా వినఁ గుతూహలమగు’ ననెను. నావుడు సుమంత్రుఁ డిట్లనియెను. ‘దేవా ! మంత్రులపంపున రూపవయోవిలాసచతురలగు వేశ్యాంగనలు కొందఱు తరలి విభండకాశ్రమముఁ జేరి ఋష్యశృంగునకై వేచియుండిరి. ఒకనాఁ డమ్మునితనయుఁడు యాదృచ్ఛికముగా నమ్మిటారులున్నయెడకు వచ్చి వారిచిత్రవేషములు చూచి యాలాపగతులు విని యాశ్చర్యపరవశుఁడై వారిని డాయఁబోయెను. ఆసుందరాంగనలు భయవినయంబులు నటించి ‘అయ్యా ! ఎవఁడవు ? కుల మెయ్యది ? ఎందుండి వచ్చెదవు ? క్రూరమృగాకులమైన యీగహనాంతరమున నొంటిఁ జరింతువేల ? నీరూపరేఖావిలాసంబులు మాకువింత సంతసంబులను బొంగించుచున్నవి. వినఁదగునేని నీచరితఁ దెలుప వేడుదు’ మని యతని బల్కరించిరి. ఋష్యశృంగుఁడు తనకత యెల్లఁజెప్పి ‘అదిగో మాయాశ్రమము చేరువనున్నది. అటకు వచ్చి మాయిచ్చునతిథిసత్కారంబుల గ్రహింపఁ గోరుదు’ ననెను. ఆవిలాసినులు తదాశ్రమదర్శనోత్కంఠలై చనియట నర్ఘ్యపాద్యములును గందమూలఫలంబులును గైకొని, విభండకమహర్షి వలనివెఱపు త్వరింపఁగా నంతఁ దడవు సేయనోడి పయనమై, తాము తెచ్చిన మోదకాదిస్వాదుభక్ష్యంబులను వానికిచ్చి ‘ఋషికుమారకా ! ఇవి యపూర్వఫలములు మహారుచిరంబులు ; వీనిని భుజింపుము, శుభమయ్యెడు. వ్రతచర్యాపరతంత్రలము గావున మేమిందు మసలరాదు.’ అని పలికి యాలింగనసత్కారపురస్సరంబుగా నతని వీడ్కొని యథాస్థానము చేరిరి.’

‘ఋశ్యశృంగుఁ డా భక్ష్యంబులు ఫలంబులగా యని తలంచి వానినారగించి సంతుష్టుఁ డయ్యెను. అదిమొద లాకాంతలను వెండియుఁ జూచు కుతూహలము వానినట నిలువ నీయదయ్యెను. అతఁడు నాఁటిరేయి

యెట్లో గడపి వఱువాత బయలుదేరి పూర్వసమాగమస్థలంబునకుఁ బోయెను. ఆలీలావతులు వానిఁ జూచి లోలోన సంతసించి 'సౌమ్యా ! మాయాశ్రమపదము భవత్సమాగమమును గోరుచున్నది. మాసత్కారపూజ లంగీకరించి మమ్ముఁ గృతార్థులఁ జేయఁ బ్రార్థింతు' మని వినయమధురంబుగాఁ బల్కిరి. అతఁడు సమ్మతించెను. వారు క్రమక్రమముగా వానినంగదేశము చేర్చిరి.' రాజేంద్రా! పరిశుద్ధదర్పణముగూడ మాలిన్యస్పర్శమువలనఁ గప్పుదాల్చునుగదా.

చ॥ కులుకుమిటారిచన్గవయుఁ గుందరదంబులుఁ గెంపుమోవియున్,
బొలుపగుమేను దీవెయును బున్నమచందురుఁబోలు మోమునున్,
దళుకుమెఱుంగు గాంతియును సుధామధురోక్తియు హంసయానమున్
గలనవమోహనాంగకలఁ గాంచిన బ్రహ్మయు రిమ్మచెందఁడే ?

అట్లు ఋష్యశృంగుఁడు వచ్చినంతనే రోమపాదుఁ డెదురేగి వానికి వినయపూర్వకదండప్రణామములు గావించి యర్ఘ్య మొసఁగి 'మహాత్మా! వ్యాజరూపంబున నిన్నిటకు రప్పించి విభండకమహర్షికి సుతవియోగమును గలిగించిన నాయీయకార్యంబునకు నన్నా మునీశ్వరుఁడు శపింప కుండునట్లు నాకు నభయప్రదాన మనుగ్రహింపు' మని వేఁడి యావరమును బడసి ప్రసన్నహృదయుఁడై శాంతాదేవిని వానికిఁ గూర్చి కృతకృత్యుఁడయ్యెను. ఋష్యశృంగుఁ డంగదేశంబునఁ గాలూనినంతనే జగత్సమాహ్లాదకరముగా వర్షించెను. దేశమెల్ల నూత్నవికాస మొందెను.'

రాజేంద్రా ! ఋష్యశృంగునిసంగతి విన్నవించితిని. దీనికిని నీ పుత్త్రాభ్యుదయసిద్ధికి సంబంధ మేమని యడుగ వచ్చును. ఆవిషయమును గూర్చి సనత్కుమారుఁడు వెండియు నిట్లనియెనట. 'ఇక్ష్వాకువంశమున దశరథుఁడను పరమధార్మికుఁడు జనించి కోసలదేశంబునకు రాజగును. ఆతనికి రోమపాదునితో గాఢమైత్రి పొరయును. దశరథుఁడు తనసుతను శాంతాదేవిని రోమపాదునకుఁ బుత్త్రికగా నిచ్చును. కొండొకకాలంబునకు దశరథుఁడు సంతానార్థము యజ్ఞ మొండు సంకల్పించి శాంతాపతియైన ఋష్యశృంగుని ఋత్విక్కుగా వరించి ప్రసవార్థము స్వర్గార్థము జన్న

మొనర్చెను. వానికి మహావిక్రమవంతులును వంశప్రతిష్ఠాపనకరులు నైన కొడుకులు నలుగురు గలుగుదురు. ‘రాజాగ్రణీ! సర్వజ్ఞుఁడైన యమ్మహర్షి తెలిపినయెఱుక మేరకుఁ జేయుటొప్పు. యథాచిత్తము”

యాగప్రకరణము.

దశరథుఁడు సుమంత్రుని విని తలయూఁచి వసిష్ఠునియనుమతిఁ బడసి యంతఃపురజనముతోడ మంత్రిసత్తములతోడఁ దరలి నదీవనపర్వతంబులు దాఁటి యంగదేశముఁ జేరి, మునుపడ ఋష్యశృంగు నపరవీతిహోత్రుని వలెఁ దేజరిల్లుచున్నవానిని సముచితవిధంబున సందర్శించి పదంపడి రోమపాదుని జేరెను. అంగరాజు తనచిరమిత్రమున కెంతయు సంతసించి వానిని గొన్నాళ్ళు తనమందిరమునుండి కదలనీయఁడయ్యెను. దశరథుఁడు శాంతాదేవికి జనకపితయగుట ఋషికుమారునకుఁ దత్పూర్వము తెలియదు. ఆ సంగతి ఋష్యశృంగుఁ డప్పుడా యంగరాజువలన విని యానందించి కోసలేంద్రునకుఁ బ్రతిపూజ లొనర్చెను.

ఇట్లేడెనిమిదిదినములు చన్నంత నొకనాఁడు దశరథుఁడు రోమపాదుని డాసి ‘మిత్రమా! కార్య మొండు తలపెట్టి తన్నిమిత్తము శాంతాఋష్యశృంగులను వెంటఁగొని పోవచ్చితిని. అనుమతిఁ గోరుదు’ ననెను. అంగరాజు వల్లె యని యల్లునిని దనయను సాకేతపురంబునకుఁ దరలించెను. ఱేఁడు మరలివచ్చుట నయోధ్యావాసులు దూతలవలన విని మహోత్సుకులై నగరమెల్లనలంకరించి దశరథాదులు వచ్చినంతనే వారిని సమస్తమంగళవాద్యంబులతో నెదుర్కొని సముచితసత్కారంబులఁ బురఃప్రవేశ మొనర్చిరి.

అంతలోన వసంతకాలము వచ్చెను. దశరథుఁడు తన చిరసంకల్పంబును నెఱవేర్చువాఁడై ఋశ్యశృంగుని శిరముతో మ్రొక్కి ‘మునీంద్రా! సంతానార్థము యజ్ఞమొకటి పెద్దలయాజ్ఞాప్రకారము సంకల్పించితిని; ఋత్విక్కుగా మిమ్ము వరింతు’ నని విన్నవించెను. ఆమునితనయుఁడా ప్రణయము నంగీకరించెను. అంత దశరథుఁడు సుయజ్ఞ, వామదేవ, జాబాలి, కాశ్యప, వసిష్ఠాది తపోధనులను రావించి వారిని యథోచితగతిఁ బూజించి ‘మహానుభావులారా! అనపత్యదోషంబునఁ బరితపించునాకు

సుఖంబును మనశ్శాంతియుఁ గడుదూర మగుట మీకు విదితము. సంతానార్థము హయమేధయాగంబును మీయనుమతితోఁ దలపెట్టితిని. విభండక మహర్షి తనయుఁడు ఋష్యశృంగుఁడు నాయెడఁ బ్రసన్నుఁ డయ్యెను. ఆ మహాత్ముఁడు నాయజ్ఞంబును యథాశాస్త్రము నిర్విఘ్నపరిసమాప్తి నొందించి నాచిరమనోరథము నీడేర్పనోపు' ననెను. వారును తమపరితోషంబును దెలిపి ఱేనిని దీవించి కార్యమునకుఁ బ్రేరేచిరి.

ఆసంవత్సరమంతయు నట్లు గడచి మరల వసంతము వచ్చెను.

చ॥ కిసలయముల్ మెసంగి తమకించి యథామతిఁ బాడెఁ గోయిలల్,
బిసరుహరాజివాసనలఁ బిచ్చిలి వీచెను బిల్లతెమ్మెరల్,
ప్రసవమనోజ్ఞభూషణయుఁ బల్లవరాగపరీతచేలయుం,
బొసఁగె వసుంధరారమణి, పొంపిరిపోయెను సృష్టి యెల్లెడన్ ॥

దశరథుఁ డంతటఁ దనకులగురువును వసిష్ఠుని రప్పించి,

క॥ హితుఁడవు మాకుఁ గులపురో
హితుఁడవు మహిమాతిశయసహితుఁడ వగుట మో
పితి నీపయిఁ గ్రతుభారముఁ
గృతకృత్యుఁడ నగుదు నీదుకృప గురువర్యా !

అని వచించి తదనుజ్ఞాతుఁడై దేవతారాధననిమిత్తము యజ్ఞశాలఁ బ్రవేశించెను.

వసిష్ఠుఁ డంత యజ్ఞకర్మనిష్ఠితులైన బ్రాహ్మణవృద్ధులను యాగోచిత పదార్థసంపాదనాధికృతులైన పెద్దలను, గర్మాంతికులను, శిల్పక వర్ధక ఖనక గణకులను నటీనర్తకులను, శాస్త్రప్రయోగవేత్తలను, దదితరులను, బిలిపించి సభగూర్చి 'సభాసదులారా ! ఱేనిసంకల్పమును వింటిరి గదా. అది యేతన్మాత్రకార్యము గాదు. త్రయీధర్మమూర్తులగు ద్విజోత్తములు వేల కొలఁది రానున్నారు. దేశదేశాంతరములనుండి రాజులు పెక్కురు వత్తురు. పౌరజానపదులకు లెక్కయే యుండదు. బ్రాహ్మణులకుఁ దగు వసతిగృహములు కట్టవలయును. నరపాలురకు యథోచితముగా విడుదు

లను నిర్మింపవలయును. ఇతరవర్ణములకుఁగా నెన్నిశాలలఁ దీర్పవలయునో తెలియరాదు. వారివారికిఁ దగినట్లుగా స్నానపానాదులకు భక్ష్యభోజనంబులకు నేర్పాట్లు జరుగవలయును. ఎవరికి నెందుఁ గొఱఁత గలుగరాదు. ఎల్లరకుఁ దగినట్లు మరియాదలు గావింపవలయును. ఈభారమునెల్ల ఱేఁడు మనపయి మోపెను. కీర్తికి నపకీర్తికి మనమే బాధ్యులమైతిమి. రాజగౌరవంబును గార్యభారంబును దలఁచి సొంతపనిగా దీనిని భావించి యెల్లరు వర్తించునది. స్నేహవశంబుననొండెఁ గోపకారణంబుననొండె మఱి దేనినిమిత్తముననొండె బుట్టపురువునకుఁ గూడ ననాదరణము గలుగరాదు. వేయేల ? మనరాజభక్తికి మనప్రతిభావిశేషంబునకు మనకార్యదక్షతకు మనయైకమత్యమునకు మనమనోనిశ్చయమునకుఁ బరీక్షాసమయము వచ్చినదని గ్రహింపుఁడు. ఎట్లునిర్వహింతురో తెలియ' దని చెప్పి వారివారి నయ్యాపనులందు దిట్టపఱచి, సుమంత్రుని బిలిచి 'మంత్రివర్యా ! చతుస్సముద్రముద్రితవసుమతీవలయంబునఁ గలనరేంద్రులకెల్ల సందేశమును బుత్తెంపుము. సమస్తదేశజనులను బిలిపింపుము. సకలవేదశాస్త్రనిపుణుఁడును మహాభాగుఁడునైన మిథిలాపతి జనకమహారాజు మనఱేనికిఁ జిరమిత్రము. ఆ జనపాలునొద్దకు నీవు స్వయముగా మొట్టమొదటఁ జని సంగతి విన్నవించి వానిని దోడితెమ్ము. కాశీనాథుఁడు మనరాజునకుఁ బరమాప్తుఁడు. అంగాధిపునిసంగతి తెలిసియేయున్నది. కేకయరాజుఁ గూర్చి వేఱె చెప్పనక్కఱలేదు. వీరినెల్ల నీవు స్వయముగా నాహ్వానింపవలయును. ప్రాచీప్రభువులకు సింధురాజులకు సౌవీరసౌరాష్ట్ర దాక్షిణాత్య పార్థివులకుఁ తగురూపంబున సందేశ మందించి వారు సబాంధవముగా వచ్చున ట్లొనర్పుము. బ్రాహ్మణాదులకు నెఱుకచేయుము. దేశమందెల్లఁ జాటింప నాజ్ఞాపింపుము' అని వచించెను. సుమంత్రుఁడట్లే యని ప్రాచ్యాదిదేశాధీశుల యొద్దకు నాంతరంగికులను బంపి యితరులకు నేర్పాట్లు గావించి తాను స్వయముగా జనకాదులకొఱకుఁ దరలెను. ఎల్లరును తమతమనియమితకార్యములను గూర్చి ప్రతిదినము వసిష్ఠునకు శ్రుతపఱచుచు వానియాజ్ఞలు పడయుచు శ్రద్ధాభక్తులతో వర్తించిరి. ఎల్లకార్యములును గడవుమేరకు సమాప్త మయ్యెను.

యాగారంభమునాఁటికి ద్విజోత్తములు వేనవేలు గూడిరి ; భూపతులు పెక్కండ్రు సపరివారంబుగా వచ్చిరి ; పౌరజానపదులు వెల్లివిరిసిరి. మణిమౌక్తికరథకనకవస్త్రాద్యుపాయనంబులు రాసులుపడెను. బ్రాహ్మణసత్తములు ఋష్యశృంగుని మున్నిడుకొని యజ్ఞ మారంభించిరి. వేదమూర్తులైన యాజకులు శాస్త్రవిధి న్యాయంబులఁ బొల్లుపోనీయక ప్రవర్గ్యము ఉపసత్తు మున్నగుకర్మంబు లొనర్చిరి. మునిపుంగవులు కర్మాధిదేవతలను బూజించి ప్రాతస్సవనాదులఁ గావించిరి. ఇంద్రుఁడు తన హవిర్భాగమును గ్రహించెను. మాధ్యందినసవనము యథాక్రమము జరిగెను. రాజార్థము తృతీయసవనంబును యథాశాస్త్రము నిర్వర్తించిరి. యాగప్రక్రియయెల్ల సక్రమముగా జరుగసాగెను.

భోజనశాలలందు నిసుము చల్లినను రాలదయ్యెను. వచ్చువారికిఁ బోవువారికిఁ దెంపు గలుగదు. ప్రతిపదార్థము రుచ్యమై యెంతభుజించినను దనివివోకుండెను. కొసరికొసరి వడ్డించుచుండిరి. చాలుఁ జాలు వలదు వలదన్నమాటలు తప్ప యొండు విన రాకుండెను. పండితులొకవంకఁ దమప్రాగల్భ్యమును బ్రదర్శించుచుండ, హేతువాదులొక ప్రక్కఁ దమ ప్రతిభావిశేషంబును వెల్లడించుచుండఁ గవీంద్రులొకచాయ నవనవకల్పనలచేత భావప్రపంచంబును బ్రతిష్ఠించుచుండ, వైయ్యాకరణులొకచక్కి మహాకవిప్రయోగములను విమర్శించుచుఁ బూర్వపక్షసిద్ధాంతము లొనర్చుచు స్వమతస్థాపనార్థము పోరాడుచుండ, రసికులొకయోరఁ గవిహృదయంబులు విచ్చి ప్రచురించుచుండ, జ్యోతిష్కులొకచోట గోళగోళాంతర రహస్యంబులను జాటుచుండ, వైదికులొకవలను శ్రుతులకు స్వరములు మేళవించి పదక్రమజటాఘనములు పలుకుచుండఁ, గాయకులొకక్రేవ నవనవరాగంబులు గూర్చి మధురమధురంబుగాఁ బాడుచుండ దద్భోజనశాలలు వివిధ కళాదేవతల కొలువుకూటములో యన శోభిల్లెను.

మ॥ అవనీమండలమట్టె యీనె ననఁగా నాబాలవృద్ధంబుఁ ద
త్సవనార్థం బరుదెంచి యందు బహుమృష్టాన్నాది సంతుష్టులై,
భవసాఫల్యము నాఁడు గల్గె ననుచున్ భావించి యాజన్మ మా
జవనంబుం గొనియాడుచుండుదురు వాచారూఢి దీపింపఁగాన్ ॥

యజ్ఞశాలయందుఁ గొన్నికంబములను నాటుసంప్రదాయము గలదు. ఆకంబములను యూపములందురు. ఒక్కొక్కయూపము నిరువదియొక్క మూర పొడవుండును. ప్రతియూపంబు నెనిమిదియంచులుగాఁ దీర్తురు. యజ్ఞముంబట్టి యూపసంఖ్య యుండును. అశ్వమేధయాగంబున క్రిట్టి యూపంబు లిరువదియొండు వలయును. అందు నాఱుయూపంబులు మారేడి యూపంబులు, నాఱు మోదుగయూపంబులు, రెండు దేవదారుయూపంబులు, నొక్కటి విరిగియూపంబుగానుండును. యజ్ఞకోవిదు లట్టియూపంబులను సంతరించి వానికి బంగారుపూవివి వస్త్రగంధపుష్పంబుల నలంకరించి బారెఁడేసి దూరమున నొక్కొక్కటి స్థాపించి యాయాదేవతోద్దేశంబుగా మృగపక్షిపన్నగములను గట్టిరి. యాగీయాశ్వము బంధింపఁబడెను. శుల్బకర్మజ్ఞులైన విప్రులు యథాశాస్త్ర మిటుకలు చేసి యాఱు ప్రస్తారములు దీర్చి ప్రతి ప్రస్తారమునకు మూఁడేసి యిటుకలుచొప్పునఁ గూర్చి బంగారు రెక్కలగరుడపక్షిరూపంబున యజ్ఞవేదికను నిర్మించిరి.

కౌసల్యాదేవి సపత్నులతోడ వచ్చి యజ్ఞీయాశ్వమునకుఁ బ్రదక్షిణ మొనర్చి బంగారుసూదులు మూఁడు దానిమేనఁ గ్రుచ్చి ధర్మకాంక్షంజేసి స్థిరచిత్తయై యారాత్రి యొంటరిగా నందుండెను. తెల్లవాఱి దశరథుఁడు తనబుత్విగ్బ్రహ్మకుఁ బట్టమహిషిని హోతకు వావాతను, ఉద్గాతకుఁ బరివృత్తిని, అధ్వర్యునకు బాలాకలిని దాన మొసఁగెను. వా రానల్వురు స్త్రీలను శాస్త్రమర్యాదవలన గ్రహించి తత్ప్రతిద్రవ్యదానమును జేకొని వారిని మరల నొని కిచ్చిరి.

అధ్వర్యుఁ డంత యజ్ఞాశ్వంబు వపను దీసి హోమ మొనరించెను. దశరథుఁడు నిజపాపనివృత్తికై తద్వపాధూమగంధము నాఘ్రాణించెను. బుత్విజులు పదునార్గు రంతట నయ్యశ్వావయవములను యథాశాస్త్రము మంత్రపూర్వకముగా వేల్చిరి.

ఇతరయాగములందు హవిస్సును జువ్విక్లొమ్మలందు సంస్కరింతురు. అశ్వమేధంబునఁ బ్రబ్బలితీఁగెలందు దానిని సంస్కరించుట సంప్రదాయము. కల్పసూత్రములనుబట్టి వేదోక్తులనుబట్టి హయమేధయాగము మూఁడు

దినములు నడచును. అందుఁ దొలిదినము చతుష్టోమమనియు, రెండవదినము ఉక్థ్యమనియు, మూఁడవదినము, అతిరాత్రమనియు బేర్కొందురు. మఱియు జ్యోతిష్టోమము ఆయుష్టోమము, అతిరాత్రద్వయము అభిజిత్తు విశ్వజిత్తు మున్నగుమహాక్రతువులు శాస్త్రాంతరములందుఁ గలవు.

దశరథుఁడు వానినెల్ల ఋత్విక్కులప్రేరణంబునఁ గావించి, హోతకుఁ దనరాజ్యమందుఁ దూర్పుభాగంబును, బ్రహ్మకు దక్షిణభాగంబును అధ్వర్యునకుఁ బశ్చిమభాగంబును ఉద్గాతకు నుత్తరభాగంబును విధివిహితంబుగా దక్షిణార్థ మిచ్చి క్రతుసమాప్తి మొనర్చెను. ఋత్విక్కులు ఱేనిగుణశీలత్యాగంబులకు మెచ్చి

చ॥ జపముల వీతిహోత్రముల జన్మముఁ బుచ్చెడు మాకు రాజ్యముల్
నృపతికులావతంస! యగునే? వల దీకయిగాళ్ల సంకెలల్;
కృపదయివాఱ నిందులకు నెయ్యది యో యిసుమంత యిచ్చి మా
కుపకృతమైన రాజ్యమును నొందుము నీక్రతువుల్ ఫలించెడున్

అని యేకగ్రీవముగవచించిరి. దశరథుఁ డంతట గోసువర్ణరజతంబుల వారిని యథోచితముగా సత్కరించెను. వారును బరమపరితోషులైరి. ఇతరబ్రాహ్మణులకు బొక్కసమెల్ల వ్యయ మయ్యెను. ఆవిప్రులు వానివినయనయదాతృతాదికళ్యాణగుణంబులకుఁ బరమప్రీతులై కలోక్తాశీర్వచనంబులను వానిపయిఁ గురిసిరి.

అశ్వమేధయాగమును దశరథుఁడట్లు సమాప్తము గావించి ఋశ్యశృంగుని సమీపించి దోయిలొగ్గి 'మునీంద్రా! నీయనుగ్రహముపేర్మి హయమేధయాగము నిర్విఘ్నముగాఁ బరిసమాప్త మొందెను. పుత్త్రప్రతిపాది యగు సత్కర్మము మాత్రము మిగిలియున్నది. దానిని జరిపింప భవదన్యులు సమర్థులు గారు. నాప్రణయము మనస్కరించి నన్ను సఫలమనోరథునిగా నొనర్పు' మని ప్రార్థించెను. ఋశ్యశృంగుఁడు హసించి 'రాజేంద్రా! వంశకర్తలగుపుత్త్రుల నల్వురఁ బడయుదు' వని మహాప్రియవాక్యమును బలికి క్షణమాత్రము ధ్యానగతుఁడై కనువిచ్చి 'రాజచంద్రమా! అథర్వశిరఃప్రోక్తమగు పుత్త్రకారకమంత్ర మొండు గలదు. ఆమంత్రపూర్వకంబుగా యాగమొకటి నీవలనఁ జేయింతు' నని చెప్పి యాక్రతువు నారంభించి మంత్రదృష్ట కర్మప్రకారము హోమము గావించెను.

హవిర్భాగములను బరిగ్రహింప దేవతులును యాగమును జూచుటకుఁగా గంధర్వ సిద్ధచారణాదులును వచ్చిరి. నలువయు నరుదెంచెను. నిర్జరాదులట్లు వచ్చిన పరమేష్ఠిని గాంచి 'తండ్రీ ! మీమాటను నమ్మి యిన్నాళ్ళు సైరించితిమి. రావణుని దుండగములు నానాఁటికి హెచ్చుపెరుగుచున్నవి. వానిధాటకు నిఁక నిలువరింపనోపము. ఇవంతయు నీవు వానికిచ్చినవరంబుల ఫలము.' ఆలోకవిద్రావణుఁడు ముజ్జగంబులను బీడించుచు దిక్పాలురను ద్వేషించుచు నుండుటయ గాక యింద్రునిపదచ్యుతికి నెసరు పెట్టి యున్నాఁడు. వానింజేసి మహాస్షలతపంబులు సాగవు ; గంధర్వుల విహారఁబు లుడిగెను ; వాయువు యథాగతి వీవఁడు ; సముద్రుఁడు నిస్తరంగుఁడై మినుకరించుచున్నాఁడు ; ఎప్పుడేమి సంభవించునో యని మేమెల్లగముఁ బిడికిటఁ బ్రాణములఁ బట్టుకొనియున్నాము. ఆకూళి యుండు నందాఁక మాకు లగ్గు గలుగను. వెఱవుఁ దలఁప వేఁడుదు' మని సాగిలఁ బడిరి.

పరమేష్ఠి వారి దీనాలాపము లాలకించి 'నిర్జరులారా ! దేవత్వము వచ్చినంతమాత్రాననే మీరు సుఖదుఃఖాదులకు నతీతులు గాఁజాలరు. దేహాభిమానమున్నంతవరకు సుఖదుఃఖాదిద్వంద్వ కోలాహలము తొలఁగదు. కావున మీభ్రాంతిని వదలనగును. మఱియు మీక్లేశములెల్ల నావలనఁ గలిగెనని మీరు భావించుచున్నారు. ఇది భ్రాంతిమూలకముగాని వేఱుగాదు. రావణుఁడు నన్ను గూర్చి తపంబాచరించుటయు వాంఛితార్థములను బడయుటయు సత్యమే గాని వానియభీష్టముల నేనిచ్చితి నని మీరు తలంచుటమాత్రము సరిగాదు. తపస్సునకు ధ్యానము ముఖ్యాంగమగును. ధ్యానమునకు మనోనిశ్చలత్వము వలయును. మనస్సు సహజచంచలము గావున నెల్లరకు దానిని బంధించుట సులభకార్యము గాదు. మనస్సును గట్టిపైచుటకు దానిని దేనియందైనను నిలుపవలయును. ఇతరోపాయము గలుగదు. ఒకదానియందు మనస్సును నిలిపి ధ్యానించుటను సాలంబన ధ్యానమందురు. ఇట్టిచోట్ల మేము ధ్యానమునకు లక్ష్యభూతులమై నిమిత్తమాత్రులమగుచున్నాము. అంతియగాని వేఱుగాదు. ధ్యానమూర్తులు వాంఛితార్థముల నిచ్చుటయే సత్యమైనచో వారు తమకు ముప్పు గలుగు వరంబు లిత్తురా ? మఱియు మేమెల్లరము లోకకళ్యాణార్థ ముందుము.

అట్టి మేము లోకోపద్రవకరంబులైన వరంబుల నిత్తుమా? అట్లుచేయుట మాకే హాని గదా. కావున మావరంబులబలంబున రావణాదు లిట్లొనర్చుచున్నారను నింద మాకు మూట గట్టవలదు.

అట్లగునేని తపోనిష్ఠులకు వాంఛితార్థసిద్ధి యెట్లు గలుగునందురా? ఆరహస్యము వినుము. ప్రతికర్మమునకు ఫలము దానినంటియుండును. అనఁగా ఫలరహితమైన కర్మమే గలుగదు. తపస్సుగూడ నొకవిధమైన కర్మమే గావున దానికిని ఫలము తప్పక కలుగును. కర్మములన్ననో వారి వారి పూర్వవాసనల ననుసరించియుండును. వాసనలు గుణములను బట్టి యుండును. గుణరహితమైన వస్తువే గలుగదు. వేయేల? సృష్టియెల్ల గుణములకార్యమేగాని వేఱుగాదు. ఈగుణములు సత్త్వరజస్తమస్సులని మూఁడు విధములు. ఏగుణము పెంపుగా నుండునో యావిధమైనవాసనయు దానికనుగుణమైన కర్మమును గర్మానుగుణమైన ఫలమును గలుగుచుండును. కావునఁ బ్రాణులే తత్తత్కర్మ ఫలములను గలిగించుకొనుచుఁ దత్ఫలము ననుభవించుచున్నారు. సత్త్వగుణ భూయిష్ఠులకు మోక్షము పరమప్రాప్యమగును. రజోగుణవంతులకు భోగభాగ్యోన్నతులు పరమప్రాప్యములుగా నుండును. తామసులకుఁ బరాపకర్షణము సంతోషకరమై యుండును. ఎవరు దేనినిగోరి ప్రయత్నింతురో వారు దానినే పడయుదురని మున్నే సూచించియున్నాను.

ఈయత్నసిద్ధి యుద్యమవేగమునుబట్టి యుండును. ఉద్యమము తీవ్రమనియు సామాన్యమనియు మందమనియు మూత్తెఱంగులు. తీవ్రోద్యమము సద్యః ఫలకారియగును. తక్కినవిరెండును గాలాంతరమున ఫలించును.

రావణుఁడు రజోగుణభూయిష్ఠుఁడు గావున వానికిఁ ద్రైలోక్యాధిపత్యాదులందు రుచి జనించెను. అతలంపుతో నతఁడు మహాతీవ్రతపం బాచరించి సిద్ధిగాంచెను. ఇట్టికోరికగలవారు తమకు నెదురుగాని చావుగాని యొల్లరు. రావణుఁ డట్టికోర్కితో దేవదానవయక్షరాక్షసగంధర్వాదులవలనఁ దనకుమరణము గలుగకుండునట్లు సంకల్పించి మహోగ్రతపం బొనర్చెను. వానిసంకల్పము సద్యఃఫలకారి యయ్యెను. తత్ఫలంబుగా మీ కిట్టియగచాట్లు గలిగెను. ఇవి మీకుసహింపక తీరదు.

గత్యంతరములేదా యని దిగులుపడవలదు. ప్రాణిమాత్రులకు సర్వామరత్వము గలుగదు. కావున రావణునకుఁ జావు గలదు. వాని నెదుర్చువారెవ రందువా? దేవాదులవలనఁ జావులేకుండునట్లు వాఁడు సంకల్పించెనే గాని మర్త్యమాత్రునిఁ గలలోఁ గూడఁ దలఁపఁడు. ఆకారణంబున వాఁడు తుదకు మర్త్యునివలనఁ జావనున్నాఁడు; అని పలుకుచుండఁగా

సీ॥ నీలమేఘముడాలు నిరసించిచెలువాఱు
కమనీయతరదేహ కాంతివాఁడు
అంభోజములచొప్పు నపహసించుచునొప్పు
శ్రవణాంతదీర్ఘనేత్రములవాఁడు
నిండుచందురుసారు నినుపార బెడగారు
మొలకనవ్వులతేఁటమొగమువాఁడు
క్రొమ్మించునుదళ్కుఁ గ్రిమ్మించుసొబగారు
పసపుఁబుట్టముతోడఁ బరగువాఁడు,

గీ. శంఖచక్రముల్ గ్రాలుహస్తములవాఁడు,
డంబుమీఱు శ్రీవత్సవక్షంబువాఁడు,
పక్కిరాయనిపై నెక్కిపరచువాఁడు,
శ్రీమహావిష్ణువఁట దోఁచెఁ జెలువుమీఱ.

అట్లు వైకుంఠంబునుండి వచ్చిన యమ్మహానుభావునకు నింద్రాదులు ప్రణమిల్లి 'శ్రితజనరక్షకా! లోకంబులయోగక్షేమంబులు భవదధీనములు. నీవే మాకు దిక్కు. రావణుఁడు విరించివరగర్వోద్ధతుఁడై మమ్ముఁ బెట్టుబాము లెన్నరాదు.

సీ॥ అమరల నిర్జించె నతివలబంధించె
నందనోద్యానము నలువుఁబాపె,
దాపసుల నదల్చెఁ దపముల మఱపించె
నాశ్రమసీముల నడఁగఁ ద్రొక్కె,
యాజుల గర్జించె నగ్నిహోత్రము
లార్చె సవనతంత్రంబుల జక్కడంచె

జక్కులమర్దించె శమనుని నోడించె
ముల్లెగా నవనిధుల్ కొల్లలాడె,
గీ॥ వెలుఁగురాయనిఁ గనుసన్న మెలఁగఁజేసెఁ,
జలువ ఱేనికిఁ గాల్బంటుకొలువు నిచ్చెఁ
బవనుచేతిలో సీవిరుల్ పట్టిపెట్టెఁ
జెప్పరాదు మాకడగండ్లు శ్రీనివాస.

దేవా ! స్త్రీలు మానంబునకై ప్రాణంబు లుంకువ పెట్టుచున్నారు. ఆదీనురాండ్ర దుఃఖారావములు వినవా ? ధర్మము దిక్కుఁదిది మిణుకరించుచున్నది. దానిదురవస్థయేని గనవా ? మా మొఱ లాలకింపవా ? మాయెడఁ గనికర ముదయింపదా ? నాఁడు మాకిచ్చినమాటను దలంపవా ? నిర్జరాదులు రావణునిఁ జెనక నోపరు. నరునివలన వానికి మరణము సిద్ధము. మానిమిత్తమును లోకరక్షణార్థమును నీవు మనుజావతారంబును గ్రహింపక తప్పదు. అందులకు సమయముఁగూడఁ బ్రత్యాసన్నమై యున్నది. దశరథుఁడు పుత్త్రార్థియై యీయాగమొనర్చుచున్నాఁడు. ఆఱేఁడు ధర్మపరతంత్రుఁడు ; అతనిభార్యలు ముగ్గురు శ్రీహ్రీకీర్తులకు నెనయగుదురు. దీనజనకల్పకా ! నీయాత్మను నాల్గుగా విభజించి నలువురు పుత్త్రులుగా వారియం దవతరింపనోపును. నీయవతారంబునఁ గాని మాకుఁ బ్రదుకులు గలుగవు' అని బహుభంగుల హరిని బ్రార్థించిరి.

విష్ణువు వారి ప్రణయంబులు విని 'వేల్పులారా ! భయంబులు మానుము ; శుభ మగును. మీకోరినట్లు మర్త్యావతారమెత్తి లోకకంటకుఁడైన రావణుని బుత్త్ర మిత్ర జ్ఞాతిసహితంబుగా వధించి దేవర్షి సాధుజన త్రిలోకశ్రేయస్కరంబుగా సాగరమేఖలావలయితధాత్రీతలంబును బాలించుచు భూలోకంబునఁ బదునొకండువేల దివ్యవర్షంబులు నివసింతును. సుఖముండు' మని యభయంబు వారి కిచ్చి యంతర్హితుఁ డయ్యెను.

అటు హోమము పరిసమాప్తమైనంతనే యయ్యాహవనీయాగ్నికుండమునుండి యొకపెనుభూత ముదయించెను. ఆభూతము శైలశృంగసమున్నతమై నీలరక్తాంబరము దాల్చి రక్తాస్యముతో, సింహరోమంబులఁబోలు గడ్డము మీసము తలవెండ్రుకలతో, సూర్యతేజంబున మెఱయు దివ్యాభరణ

ములతో దీప్తానలజ్వాలామాలికను ధిక్కరించు తైక్ష్ణ్యముతో మహా భయంకరముగాఁ జూపట్టుచు సువర్ణపాత్రము నొండు చేదోయి నిడి కొని దశరథుని కట్టెదుట నిలిచి 'రాజా! ప్రజాపతిపంపున వచ్చితి' నని దుందుభిస్వరంబునఁ బలికెను. సభాస్తారులెల్లరు నిర్నిమేషులైరి. దశరథుఁడు కేలుమోడ్చి భయభక్తులు పిరిగొన లేచి 'దేవా! స్వాగతము; ఆజ్ఞ వేడుదు' ననెను. ప్రాజాపత్యపురుషుఁడు మఱికొంత డాయ వచ్చి 'రాజా! దేవతల నారాధించినఫలంబుగా నీకీపాయసము సంప్రాప్తమయ్యెను. ఇది విష్ణునిర్మితము; దీన నీకు సంతానాదిసకలైశ్వర్యంబులు సమకూడును. దీనిని గొనిపోయి యనురూపలగు నీపత్నులకు నొసంగుము. వారు దీనిని సేవించి హయమేధపుత్రకామేష్టిఫలంబులో యన నొప్పారు తనయులను బడయుదురు. నీమనోరథము నెఱవేఱు' నని చెప్పి యాపాత్ర నిచ్చి యయ్యగ్నికుండమందే తిరోహితుఁ డయ్యెను. దశరథుఁ డాపాయసపాత్రము నావల గ్రహించి రాజవర్గంబును సముచితసత్కారంబుల వీడ్కొని యంతఃపురమునకుఁ బోయెను.

### వానరావతారఘట్టము.

అంత బ్రహ్మ యింద్రాదులను బిలిచి 'వేల్పులారా! భగవంతుఁడు శ్రీమన్నారాయణమూర్తి మనమొఱ లంగీకరించి ధర్మరక్షణార్థము లోకహితంబు పొంటె మర్త్యలోకంబున నవతరింపనున్నాఁడు. అవతారము లీలామాత్రము గావున సర్వేశ్వరుఁడయ్యు నమ్మహానుభావుఁడు మర్త్యుల మర్యాద వర్తింపక తప్పదు. మీ కార్యార్థము వానికిఁ గామరూపులును మహాబలశాలులునైనవారు తోడ్పడవలసివచ్చును. ఒకచోట వాయుజవనులతోఁ బనిపడును; ఒకచోట నీతిశాస్త్రవేత్తల యక్కఱ గలుగును; ఒక్కొక్కసారి చతురుపాయవిదులు వలసివత్తురు; అజరామరణులు లోకతతి యవసరమగును. దేవాంశసంభూతులు దక్క నన్యు లిందులకుఁ జాలరు. మీకుఁ బార్వతీశాపము గలదు. ఆకారణంబున మీకు స్వక్షేత్రసంతానము చేకూఱదు. గంధర్వ యక్షఋక్ష పన్నగ కిన్నర వానర విద్యాధరాప్సర, స్త్రీలయందు మీరు మీయంశంబుల నవతరింపనగు. రాక్షసులకు వానరుల చేత మృత్యువు సిద్ధము. అట్లు నందికేశ్వరశాపము గలదు. అది నేడు

సార్థకముగానున్నది. ప్రాయికంబుగా వానరరూపజననము యుక్తము. ఈసంకల్పముచేతనే భల్లుకేశ్వరుని జాంబవంతుని మదీయవక్త్రజృంభణంబునఁ బుట్టించితి' ననెను.

అంత దేవేంద్రుఁడు వాలిని, సూర్యుఁడు సుగ్రీవుని, సురాచార్యుఁడు తారుని, కుబేరుఁడు గంధమాదనుని, విశ్వకర్మ నలుని, వైశ్వానరుఁడు నీలుని, అశ్వినిదేవతలు మైందద్వివిదులను, దమతమయంశంబులఁ బుట్టించిరి. వరుణునకు సుషేణుఁడుఁ, బర్జన్యునకు శరభుఁడును జనించెను. వాయువు వలన మహాబలపరాక్రమబుద్ధిసంపన్నుఁడును వజ్రకాయుఁడునైన హనుమంతు డుద్భవించెను. అన్యదేవతలు వేనవేలితరులను గనిరి. వారెల్లరును గోఁతిమూతులు దాల్చి బలపరాక్రమంబులఁ దంద్రులను దలపించుచుఁ గామరూపులై రావణవధార్థము బాల్యముదొట్టి వ్యాయామక్రీడలరూపంబున సాము నేర్చుచున్నారో యన శైలంబుల నూటాడుచు వృక్షంబులఁ బెకలించుచు సముద్రంబు లంఘించుచు భూమి వ్రచ్చుచు నంతరిక్షంబునఁ జరించుచు మత్తమాతంగ సింహశార్దూలాదివన్యసత్త్వఁబులతోఁ జెర్లాడుచు దైనందినవర్ధమానతేజోవిక్రాంతులై, వాలిని రాజుగా సుగ్రీవుని యువరాజుగా నలనీలహనుమంతులను మంత్రులుగాఁ గొందఱను యూధపతులుగా నియమించుకొని ఋక్షపర్వతంబును గొందఱుఁ బర్వతాంతరంబులఁ గొందఱుఁ గీకారణ్యంబులఁ గొందఱు నాశ్రయించిరి.

**శ్రీరామాద్యుత్పత్తి.**

దశరథుఁ డట్లు పాయసపాత్రను గొనిపోయి సంతోషచంద్రికలు గురియుచున్న దేవేరులఁ జేరి పాయసంబును దైవచోదితబుద్ధింజేసి విభాగించి,

గీ॥ సగమొసంగెఁ గౌసల్యకు సగములోన
సగము నిచ్చె సుమిత్రకు మిగతలోన
సగముఁ గైకేయికి నిడి యాసగము తెచ్చి
మరల నిచ్చె సుమిత్రకు మమతతోడ.

ఆపాయసంబును వారు సేవించి సూర్యాగ్నితేజోవిలాసవతులై కాలక్రమంబున గర్భంబులు దాల్చిరి. ప్రొద్దులు నిండెను. చైత్రశుక్లనవమీ బుధవార పునర్వసుచతుర్థపాదంబునఁ గర్కాటలగ్నమందు రవి గురు శని

శుక్రాంగారకులు స్వోచ్చస్థానంబుల నలంకరించి గురువుతోఁ జంద్రుఁడు రవితో బుధుఁడుఁ గూడి తనరారు శుభముహూర్తంబున జగన్నాథుఁడు సర్వలోకనమస్కృతుఁడు మహాభాగుఁడు శ్రీమన్నారాయణమూర్తి సమస్తశుభలక్షణలక్షితుఁడై లోకకళ్యాణార్థము కౌసల్యాదేవిగర్భంబున నవతరించెను. మఱునాఁడు దశమీగురువారపుష్యమీనక్షత్రంబున మీనలగ్నమందుఁ గైకేయీగర్భంబున సత్యపరాక్రముఁడగు సుతుఁ డుదయించెను. ఆనాఁడే సూర్యోదయానంతరము ఆశ్లేషానక్షత్రంబునఁ గర్కాటలగ్నమందు సుమిత్రాదేవి కవలను బ్రసవించెను.

మ|| మొరసెన్ నిర్జరదుందుభుల్ సకలదిఙ్మైత్రైకఢక్కాలుగాఁ,
గురిసెన్ గల్పకపారిజాతతరువుల్ క్రొంబూలవర్షంబులన్,
విరిసెం బ్రాణుల దుర్వ్యథాపటల ముద్విగ్నంబుగా నెల్లెడన్,
సరసీజాయతలోచనుండు నరుఁడై జన్మింప ధాత్రీస్థలిన్.

చ|| చెలఁగెను వేదఘోష, ఋషిసీమలఁ గ్రమ్మినచెట్ట లొక్కటన్
దొలఁగెను, హోమకుండములు ధూపశిఖాపరిణద్ధకాంతులన్
వెలిఁగెను, బ్రాణమానభయవిహ్వలచిత్తుల దీనరావముల్
మలఁగెను, జీవరాశికి నమందసుఖంబు గల్గె బ్రేల్మిడిన్.

శిశువులకుఁ బదునొకండు దినములు యథాసుఖము గడచెను. అంత దశరథుఁడు పుత్త్రనామకరణమహోత్సవంబును సంకల్పించి త్రికాలజ్ఞుఁడగు కులగురువును సర్వశాస్త్రవేత్తలగు మహాత్ములను రప్పించెను. వసిష్ఠుఁడు రాకుమారుల రూపలావణ్యాదిలక్షణంబులను బరిశీలించి కౌసల్యానందనునకు శ్రీరాముఁడనియుఁ గైకేయీతనయునకు భరతుఁడనియు, సుమిత్రాసుతులకు లక్ష్మణశత్రుఘ్నులనియుఁ బేరిడెను. ఎల్లరు నందులకు సంతసించి యాశిశువులను దీవించి చనిరి.

ఆరాజపుత్త్రులు నలువురు శుక్లపక్షచంద్రులువోలె నానాఁటికి వర్ధిల్లుచుఁ బరస్పరప్రేమైకమతులై కాలక్రమంబున నెల్లవిద్యలు గఱచి దయాదాక్షిణ్యంబులు గలిగి విజ్ఞానకార్యదీక్షాకౌశలంబుల నివ్వటిల్లి సర్వజనహృదయపీఠంబు లధివసించిరి. లక్ష్మణుఁడు పిన్ననాటనుండి రామునెడ స్నిగ్ధభక్తిగౌరవంబులు గలిగి వానికి రెండవప్రాణమువలె నుండెను. లక్ష్మణుని

యెడ రాముఁడుగూడ నట్లే వర్తించెను. తమ్ముని విడిచి యతఁడు నీరేనియుఁ గ్రోలఁడు; నిద్రావస్థయందు సయితము వానిని బాయఁడు. శత్రుఘ్నుఁడు భరతుని దవిలి వానికిఁ బ్రాణంపుఁ బ్రాణంబుగా నుండెను. భరతుఁడు వానినిఁ దనసర్వస్వముగా భావించెను. తమ్ములు మువ్వురు రాముని గురుభావంమున మన్నించుచు వాని ననువర్తించుచుండిరి.

సీ॥ అవనీతలంబుపై నవతరించిననాఁడె,
ధర్మంబు నాల్గుపాదముల నిలిచె,
వచ్చిరానినుడుల నుచ్చరించిననాఁడె
సత్యంబు నిర్వక్రచార మొందె,
విశేయసూత్రంబు వెలుఁగఁ గూర్చిననాఁడె
ప్రామిన్కునినదముల్ ప్రబలమయ్యె,
విలువిద్య నేర్వంగ విల్లుబూనిననాఁడె
దుష్టాత్మకులయెదల్ దోహళించె,
తే॥ విశ్వ మెల్లెడ నూతనవిభవమందెఁ
గోసలరాజ్యంబు పరమసుఖావాసమయ్యె,
బలుకఁ దరమొకో శ్రీరామభద్రుమహిమ,
నలువకైన వేయితలలచిలువకైన.

అని జను లెల్లరుఁ బ్రశంసింపసాగిరి.

## ద్వితీయ మండలము.

### విశ్వామిత్రసమాగమము.

అట్లుపుత్త్రులు యుక్తవయస్కులై రాజవిద్యలందు జితశ్రములై యున్నంత దశరథుఁడు వారికి వివాహములు తలపెట్టి కొండొకనాఁడు వసిష్ఠాదిపురోహితులను రాజబంధువులనుం గూర్చి మంతనముచేయుచుండెను. అత్తఱి విశ్వామిత్రమహర్షి యటవచ్చి తనరాకను ద్వారపాలురవలన రేనికిఁ దెలిపెను. దశరథుఁడు వసిష్ఠాదిసహితంబుగా నమ్మునికి నెదురేగి మర్యాదలతోడ వానిని దోడితెచ్చెను. కౌశికుఁడు యుక్తాసనంబున సుఖోపవిష్టుఁడై వసిష్ఠాదులను గుశలమరసి 'రాజేంద్రా! పురకోశంబులు పదిలమే

గదా. దైవికమానుషికకర్మంబులు నిరాటంకముగా వర్తిల్లునుగదా' యని ప్రస్తావించెను. కోసలేంద్రుఁడు కరములు జోడించి 'ఋషిచంద్రమా ! మీకటాక్షవీక్షణమునకుఁ బాత్రులైన మాబోంట్లకుఁ గొదువయుండునా ? మీరాకంబట్టి ధన్యుఁడ నైతిని. మీసందర్శనము పేదకుఁ బెన్నిధి యబ్బినట్లు మాకయ్యెను. రాజర్షిత్వంబును మెచ్చక బ్రహ్మర్షిత్వంబును సాధించిన మీప్రభావముపఱచినంతదూరము వ్యతిక్రమములు గలుగునా ? మీపాదధూళి సోఁకి నేను ధన్యధన్యుఁడ నైతిని.

చ॥ చెలిమియుఁ బుత్త్రభావమును జేసి మహాత్ములు వత్తురంతెకా,
కలుగునె సిద్ధమూర్తులకుఁ గార్యము లన్యసహాయసాధ్యముల్ ?
తెలిసియుఁ బల్కఁగా వలసి ధీరతఁ బల్కుదుఁ గార్య మున్నచో
సెలవిడనోపు మీమతముఁ జేయుదుఁ దప్పక మౌనిసత్తమా !.

అని భయభక్తులతోడ విన్నవించెను.

విశ్వామిత్రుఁడు దానికి మెచ్చి 'రాజేంద్రా ! ఇక్ష్వాకువంశంబునకునుఁ భవదీయవ్యపదేశకుఁడైన వసిష్ఠమహర్షికిని దగినట్లు వచించితివి. కచ్చిత్ఫలమునుగోరి యాగదీక్షను బూనితిని ; కామరూపులగు రాక్షసులు నాకార్యమునకు విఘ్నమాచరించుచున్నారు. యజ్ఞసమాప్తికాలము వేచియుండి వారు వేదిమీఁద రుధిరమాంసంబులు వర్షింతురు. వారివలనఁ బెక్కుసారులు భంగపడితిని. యజ్ఞపరినిష్ఠులకుఁ గోపము తగదు గావున వారు నాశాపాగ్నికి గుఱిగాక యింతకాలమున్నారు ఉపాయాంతరమునఁ గార్యమును సాధింపవలసియున్నది. అందులకుఁగా నిందు వచ్చితిని. క్రతురక్షణార్థము శ్రీరాముని గోరుదు. కాకపక్షంబులు వీడనిబాలుఁడని యతని శంకింపవలదు. వానియందు నేనుందు. మదీయదివ్యతేజఃపరిరక్షితుఁడై యతఁడు రక్కసుల నుక్కడంచును. దశరథరాజేంద్రా ! నీసుతునికీర్తి యీరేడుజగంబులు నిండును ; శ్రేయఃపరంపరలు వానిని వరించుచున్నవి. పుత్త్రులయభ్యుదయమునకన్న వాంఛనీయము తండ్రులకుఁగలుగదుగదా. అన్యులుతేరాయని శంకింతువా ? అన్యులు నాకార్యమునకుఁ జాలరు. దుర్మదాంధులైన యారాక్షసులు నిజపాపకాలపాశంబులఁ గట్టువడి మృతప్రాయులై యున్నారు. బాసచేసి చెప్పుచున్నాను. నామాటనమ్ము. పుత్త్ర

వాత్సల్యంబును బైకొన నీయకు. నీసుతుని నీవెఱుంగవు. వానిసంగతి నాకును వసిష్ఠునకును వామదేవునకును స్పష్టము. అతఁడు పదినాళ్ళు నా వెంటనున్నఁ జాలు ; నాయభీష్టమొనర్పును. ఎంతయు నీకు మేలగును.

కం॥ వచ్చినకార్యము పో నీ
విచ్చియు నర్థంబుగల్గ దినవంశ్య ! తఱిం
బుచ్చక యనుమానింపక
చెచ్చెరఁ బుత్త్రెమ్ము వాని శీఘ్రము చనెదన్.

అని తాను వచ్చినపనిఁ దెలిపెను.

దశరథుఁడు నివ్వెఱఁగంది 'మునీంద్రా ! మీవచనము వజ్రసారమై నాహృదయంబు నగల్చుచున్నది ; మూర్ఛయయ్యెడు. పదియాఱేండ్లనియు నిండనికూనయెడ ? రాక్షసయుద్ధమెడ ? ఋషికార్యము రాజులకు విధియందువా ? నేనే ధనుష్పాణినై మీవెంట వచ్చి మీపనిఁ జక్కఁబెట్టెదను ; అనుగ్రహింపుము. రామునియందు నాప్రేమయెల్ల మూర్తీభవించి యుండు ; వానిని బాసి జీవింపఁజాల. పడరానిశ్రమ లోర్చి పెక్కు వ్రతోపవాసములు సలిపి ముదిమియుప్పునఁ గానకకన్నచిన్నిపాపను విడనాడుమని మీరుమాత్రము చెప్పఁగలరా? అది యటుండనిమ్ము. తపోధనా! మీవచించు రక్కసు లెవ్వరు ? వారివృత్తాంతమేమి ? వారిశౌర్యసంపద లెట్టివి ?' యనెను. నావుఁడు 'రాజా! వినుము. పులస్త్యబ్రహ్మవంశంబున విశ్రవసువుఁడనువాఁడు జనించెను. వానికిఁ గుబేరుఁడు రావణుఁడు ననుతనయులు గలిగిరి. అందు రావణుఁడు బ్రహ్మనుగూర్చి ఘోరతపమొనర్చి యభీష్టవరములఁ బడసి మహాగర్వోద్ధతుఁడై యున్నాఁడు. అతనిని వినియుందువు. వానికి మారీచసుబాహువు లనుపేరియనుచరులు గలరు. యజ్ఞములకు విఘ్నమొనర్చుట వారికి దినకృత్యముగా నున్నది. ఆచెనఁటుల వలన నాకార్యము చెడుచున్న' దని యాఋషి చెప్పెను.

ఆరక్కసులపేర్లు విన్నంతనే దశరథుఁడు డీలుపడి 'గాధేయా! రావణుఁ డన్నంతనే గుండియ లవియుచున్నవి. ఆదురాత్ము నెదిరింప నాకును లావు చాలదు. నాసంగతి యటుండనిమ్ము. సురాసురు లెత్తి వచ్చి

నను వానిని మార్కొననేరరు. మారీచసుబాహువులు సుందోపసుందుల తనయులు గదా. ఆసంగ్రామకారులను వారింప మముబోంట్ల తరమా ? ధర్మజ్ఞా ! నాయెడఁ బ్రసన్నుఁడ వగుము. మాకు గురువును దైవమును సమస్తము మీరేగదా. మీయాజ్ఞ సేయ నిమ్మందభాగ్యుఁడు నోఁచఁడు. దయానిధీ ; నన్నును నాకూనను నిండుమనంబున ననుగ్రహింపుము' అని కేల్మోడ్చెను. ఆమాటలకు విశ్వామిత్రుఁడు చిఱునవ్వుదాల్చి 'దశరథా ! కేవలపుత్రకృతస్నేహము నిన్నిట్లు పలికించుచున్నది.ఇట్టి వట్టి భయంబులు వలదు.

'అహంవేద్మి మహాత్మానాం రామం సత్యపరాక్రమం।
వసిష్ఠోఽపిమహాతేజా యేచేమే తపసిస్థితా॥' అనివచించెను.

ఈశ్లోకమునందు 'దశరథా ! రాముఁడు నీకుఁ బుత్త్రుఁడై జన్మించుటంజేసి వానినిఁ గేవల మర్త్యమాత్రునిగా భావించుచున్నావు. ఇంతకన్న వెఱ్ఱి తనము గలదా ? రాముఁడు పరమాత్మయేగాని యొండుగాఁడు. లోక కళ్యాణార్థము భగవంతుఁడు లీలామానుషవిగ్రహమును దాల్చెను. నీతండ్రి తనము నిమిత్తమాత్రము. ఈరహస్యము రాగద్వేషభూయిష్ఠమైన హృద యముగలిగి నిరంతరభోగలాలసులై కేవలకర్మపరతంత్రులుగా నుండు నీ యట్టి వారికి సుంతయు గోచరింపదు. బహుగురూపాసనాపరిణత బుద్ధు లును సత్వగుణప్రధానులును మోక్షైకనిష్ఠాగరిష్ఠులు నగు తపోనిధులకు మాత్రమే యీగుట్టు తెలియవచ్చును. మన యిరువురకు నిట్టి తారతమ్యము గలదు. అందువలన నీజ్ఞానచక్షువు మోడ్చి యుండుటయుఁ దత్కార ణంబునఁ గలరూపు నీకుఁ దెలియరాకుండుటయు నగుచున్నది. కన్న నాటినుండి క్షణముసేపుగూడ బాయకుండునట్టి తండ్రికిఁ దెలియరాని సుతునివిశేషంబు లెన్నడుగాని వానినిఁ గని విని నేరని నీకెట్లు తెలియ వచ్చునందువా ? నీదృష్టియెల్ల బాహ్యమేగాని యాంతరము గాదు. మఱి యు నయ్యది పుత్త్రవాత్సల్య నిరుద్ధమైయున్నది. మాబోంట్లసంగతి యట్టిదిగాదు. కామాదులు మాదృష్టిని గప్పవు. అదియునుగాక మా దృష్టి నిరంతరము తత్త్వపరమైయుండును. అందువలన మాకుసమస్తము హస్తా మలకముగాఁ గాన్పించుచుండును. ఆత్మలాభార్థినై నిన్ను మోసగింప

నిట్లనుచున్నానని తలంపవలదు. ఈ రహస్యము తపోనిష్ఠుల కెల్ల స్పష్టము. వలతువేని నీకులగురువును నిరంతరము నీ మేలు గోరుచుండు వాఁడును నైన వసిష్ఠమహర్షి నడుగుము. ఏకారణముచేతనైనను అనఁగా, మాలిమింజేసిగాని మాయిరువురకుఁ గల బ్రాహ్మణత్వముంజేసిగాని వానిని సంశయింతువా ? అట్లగునేని ప్రకృతము నీయాస్థానము నలంకరించుచున్నట్టియు అహంకార మమకార స్పర్శగూడలేనట్టియు బ్రహ్మవేత్తలలో నగ్రేసరులైనట్టియు వామదేవ మార్కండేయ ప్రభుతులనేని యడుగ వచ్చును. వీరెల్లరు నామాటసరియని వచింతురేని సంశయములెల్ల మాని శ్రీరాముని నావెంటఁ బంపనగును ' అను భావములు పెక్కు లిమిడి యున్నవి.

దశరథుఁడీ భావంబులను గ్రహింపక కేవలప్రాకృత బుద్ధియై పదంపడి,

సీ॥ కూఁకటివేణిక్రిఁ గురులు కూడనివాఁడు
తల్లిదండ్రులమాల్మిఁ దనరువాఁడు
సోఁకుమూఁకల నెందుఁజూచి యుండనివాఁడు
పరులన్న నెడముగాఁ బఱచువాఁడు
విలుపట్టి శరమింతవేయ నేరనివాఁడు
కష్టంబు లెట్టివో గననివాఁడు
ఇలువాసి యడుగైన నిడి యెఱుంగనివాఁడు
కడిఁదినోములు నోచి కన్నవాఁడు.
తే. మాకు నల్లారుముద్దుగా మనెడువాఁడు
రాముఁ డాపాపఁగోని పోయి రక్కసులకు
నప్పగింపఁగా నాచేతు లాడవయ్య !
కరుణమై నన్ను మన్నింపు గాధితనయ !.

అని యొడ్డుకొనెను. విశ్వామిత్రుఁడు రోషకషాయనేత్రుఁడై 'రాజా ! నీకెంతయు సంతసింతు. ఆడితప్పుట రాఘవకులంబున నేఁడు గంటిః చాలుఁజాలు. నీమలికితము మానుము.

శా॥ రారే మానసులు? వారి యీప్సితములన్ రాజాగ్రణుల్ దీర్పరే?
ఎరీ యీ క్రియఁ బల్కి లేదనెడు ధాత్రీశుల్ త్రిలోకంబులన్?
నీరాముం డటురాకయున్నఁ గ్రతువుల్ నింపారఁగాఁబోలవే?
వారలన్ వీరననేల?ఁ బోయెద మృషావాదీ! సుఖంబుండుమా.

అని చివ్వున లేచెను. వసిష్ఠుఁడు ప్రమాదమును శంకించి గాధేయు నాపి 'రాజేంద్రా! ధర్మమూర్తి వనెడునీకీర్తి ముల్లోకము లావరించి యున్నది. దానిని వాడనీయవలదు. ఆడితప్పుట యిష్టాపూర్తివధ యగును. ఒండువిచారింపక మునివెంట రాముని బంపుము. నీసుతుఁడు కృతాస్త్రుఁడని గాని యకృతాస్త్రుఁడనిగాని జింతింపవలదు. సుధారసంబునకుఁ బావకగుప్తి యట్లు రామునకు గాధేయసంరక్షణము గలదు. విశ్వామిత్రుఁ డేతన్మాత్రుఁ డుగాఁడు. శూరులకు శూరుఁడును, జ్ఞానులకు జ్ఞానియు మహాతపస్సంపన్నుఁ డునునై యీతఁడు దనరారును. విలువిద్యయం దితని సాటిగలుగడు. ము జ్జగంబులఁగల వివిధాస్త్రంబులు వీనియఱచేత నున్నవి. ఎవడు పరమశివుని మెప్పించి సకలాస్త్రంబులఁ బడసెనో, నూతనాస్త్రంబుల సృష్టించు శక్తి యెవనికిగలదో యట్టి యీతపోధనుఁడు రక్కసులవలన వెఱచి సహాయార్థియై యిందు వచ్చెనని భావింపవలదు. ఇదంతయు నీసుతుని యభ్యుదయార్థముగా గ్రహింపుము; జాగువలదు. తోడ్తోడ రాముని దరలింపు' మనెను.

దశరథుఁడు శాంతచిత్తుఁడై రామలక్ష్మణులను రప్పించి వారికి మంగళస్నానంబులు గావించెను. వసిష్ఠుఁడు వారిని శుభమంత్రాభిమంత్రితులుగా నొనర్చెను. అంత దశరథుఁడు కౌసల్యాసహితుఁడై యాసుతుల నిర్వురను విశ్వామిత్రునిచేత నుంచెను. వాయువు పరాగరహితమై భావి శుభోదర్కముగా సుఖముగా వీచెను. పుష్పవర్షములు గురిసెను; దేవ దుందుభులు మ్రోసెను; దిశలెల్ల దెలివొందెను.

బలాతిబల విద్యలను గ్రహించుట.

రామలక్ష్మణులు ధనుష్పాణులును బద్ధగోధాంగుళిత్రాణులునై కైదువులు ధరించి విశ్వామిత్రు ననుగమించి యాఱు క్రోసులు చని సరయూ తీరము చేరిరి. అంత గాధేయుఁడు రాముని బిలిచి వత్సా! ఆచమింపుము,

జాగువలదు. సర్వమంత్రసమిష్టిరూపం బగుబలాతిబలవిద్య నిత్తును గ్రహింపుము. దానికలిమింజేసి శ్రమముగాని జ్వరముగాని రూపవిపర్యయముగాని నీకుఁగలుగవు; నిద్రావస్థయందేనియు నిన్ను రాక్షసులుగూడఁ జెనకనోడుదురు; భుజబలంబున నీకు సాటియుండఁడు; అది యిది యననేల ! ఎందును నీకు సరియుండరు. సౌభాగ్యంబునకుఁ బరమావధివై దాక్షిణ్యంబునకు నిధివై జ్ఞానబుద్ధినిశ్చయంబుల నసదృశుఁడవై యుత్తరప్రత్యుత్తరచాతుర్యంబున నొజ్జవై వెలయుదువు. ఈవిద్యలు రెండును నిఖిలమంత్రజ్ఞానంబునకు మాతృస్థానములు. నీవు దక్క యొరులు వీని గ్రహింపఁదగరు. ఇవి నీకు బహుఫలకారిణులగు' ననెను. రాముఁ డాచమించి శుచియై మునివలన బలాతిబలవిద్యలను గ్రహించెను. అంతలోన

"శా॥ శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బారెంబక్షుఁ లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె, మృగతృష్ణావార్థు లింకెన్, జపా
శోణంబయ్యెఁ బతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె, సరోజషండములు నిద్రాణం బయ్యెం గడున్"

అంగదేశవృత్తాంతము.

వారంత నాఁటికిఁ బ్రయాణముఁ జాలించి తృణశయనంబులఁ బరుండి యారాత్రియందు సుఖముగాఁ గడపిరి. వఱువాత విశ్వామిత్రుఁడు లేచి 'రామా ! ప్రాతఃకాలసంధ్య ప్రవర్తిల్లుచున్నది. దైవవిహితంబులైన యాహ్నికంబులను దీర్పనగు' నని పలుకరించెను. రామలక్ష్మణులు మేల్కాంచి నీరాడి వార్చి వచ్చి ఋషికి నమస్కరించి గమనాభిముఖులై నిలిచిరి. కౌశికుఁడు వారిని వెంటఁగొని తరలెను. కొంతవడికి వారు త్రివేణీ సంగమము చేరిరి. అచట ఋష్యాశ్రమ మొండు గానవచ్చెను. రామలక్ష్మణు లాయాశ్రమమును జూచి మహానంద మొంది 'మహాత్మా ! ఇది యెవరి యాశ్రమము ? ఇందెవ్వరు వసింతురు ?' అని యడిగిరి. విశ్వామిత్రుఁడు 'వత్సలారా ! పూర్వము మహేశ్వరుఁడు నియమసమాహితుఁడై యిందు దీర్ఘకాలము తప మొనర్చుచుండెను. వానికిఁ బార్వతి శుశ్రూషలు గావించుచుండెను. ఆయిరువురకు వివాహము సంఘటింప నెంచి దేవతలు మన్మథునాశ్రయించిరి. మరుఁడు సురలకుఁ బ్రీతిసేయఁ గోరి స్థాణువును

ధర్షించెను. విషకంఠుఁ డది గ్రహించి హుంకరించెను. ముక్కంటికంటి మంటకుఁ దుంటవిల్తుఁడు భస్మీభూతుఁ డయ్యెను. అదిమొదలు యతఁ డతనుఁ డుగా నున్నాఁడు. అంగజుఁ డిందు తనయంగంబులను దొఱంగినకతనంబున నిది యంగదేశమనఁ బడుచున్నది. ఇది యీపరమశివునియాశ్రమము. అదిగో చూడుము. పరమేశ్వరుని శిష్యులు నిత్యపుణ్యులు వచ్చుచున్నారు. మనమీరాత్రి యిందుఁ గడపి రేపు గంగానదిని దాటుదము. రామా !

గీ॥ గగననాటకశాలలోఁ బగటిపూటు,
వేయుచేతులదేవర వేస మూడి,
చిచ్చుమొగమైనయంత నే దించినట్టి
జాజుపఱజాయనఁగ జాజె సంజచాయ.

సాయంసంధ్యాహ్నికములు దీర్చిరండు ; ఆశ్రమముఁ బ్రవేశించుదము' అనెను. వారట్లు గావించి వచ్చిరి. అంతలోన నాశ్రమవాసులుదెంచి కౌశికునకును రాజపుత్త్రులకును మర్యాదలు గావించి వారిని మువ్వురనుఁ దోడ్కొనిపోయిరి. గాధేయుఁడు వచించుమనోహరకథలతో రేయెల్ల వారికచట హాయిగాఁ జనెను.

## గంగాతరణము.

తెల్లవాఱినంత విశ్వామిత్త్రాదులు కాలకృత్యములు దీర్చి పయనమైరి. ఆశ్రమవాసులు వారిని గంగాతీరమువఱకు సాగనంపి నదీతరణార్థము నావ నేర్పాటుచేసి మరలిరి. విశ్వామిత్త్రాదు లాపడవయెక్కి నట్టేటికి వచ్చిరి. అచ్చట వాహినీతలము తరంగాభీలమై ఘూర్ణిల్లుచుండెను. రాముఁ డది గాంచి 'మహాత్మా ! ఇట వీచీకల్లోలము మెండుగానున్నది. అలలు గెలుపుఁగోరియో యన నొండొంటిఁ బైకొనుచున్నవి. ఆరొదకుఁ జెవులు ద్దపడుచున్నవి; కారణ మేమో'యనెను.

నావుఁడు 'వత్సా బ్రహ్మదేవుఁడు మనస్సంకల్పమాత్త్రంబున సరోరమునొండు కైలాసపర్వతంబున నిర్మించెను. అది మనస్సంకల్పజమగుటంసి దానిని మానససరోవరమందురు. అందుండి యొక ప్రవాహము వెడ

లెను. అది సరస్సునుండి ప్రచ్యుతంజేసి దానిని సరయూనది యందురు. గంగాసరయూనదు లిచటఁ గలియుచున్నవి. సంగమస్థానము గావున నిటఁ బరస్పరజలసంఘర్షణము తుములమై ధ్వనించుచున్నది. ఈనదీమతల్లులకుఁ బ్రణమిల్లు నగు నని విశ్వామిత్రుఁడు చెప్పెను. రామలక్ష్మణు లట్లు గావించిరి. అంతలోనఁ బడవ దరి చేరెను. వా రాయోడఁ దిగి యేటిదక్షిణపుగట్టునఁ దరలిరి.

మలినకరూశదేశంబుల వృత్తాంతము.

వా రట్లు పోవుచుండఁగా ఘోరకాంతార మొకటి యడ్డు వచ్చెను. రాముఁ డాయరణ్యమును జూచి 'మునీంద్రా! ఈకాననంబునఁ గటికి చీఁకట్లు తాండవ మాడుచున్నవి. ఇందు మారుత మార్తాండ మరీచి గోచరంబుగాదు. మారేడుమ్రాకులును రేగుచెట్లును కలిగొట్లును, చంద్రలును మద్దులును గిక్కిరిసి పెనఁగొని నింగి ముట్టుచున్నవి. రవికిరణంబులకుఁగూడ నిందు సందు గానరాదు. గజఘీంకారములు సింహగర్జనంబులు బెబ్బులిబొబ్బరింతలు మాఱుమ్రోయుచున్నవి. శకుంతారావములు వీనుల నగల్చుచున్నవి. చూచుటకుఁ గూడ నిది మహాభయంకరముగా నున్నది. దీని పేరేమి? యని యడిగెను.

'వత్సా! తొల్లి దేవేంద్రుఁడు వృత్రాసురుని సంహరించెను. ఆ కారణంబున వానికి బ్రహ్మహత్యాదోషము సంప్రాప్తమయ్యెను. అదోషఫలంబుగా వానికి దురంతక్షుద్వ్యాధ దార్కొనెను. దేవతలును మునులును గూడి తద్దోషపరిహారమును గూర్చి యాలోచించి గంగోదకంబుల వానిని దీర్ఘమాడించి కలశోదకంబులను వానిపయిఁ బ్రోక్షించిరి. పాకశాసనుఁడు శుచియై యాకఁటిబాధను బాసెను. మునీంద్రాదుల ప్రసాదంబున శచీపతి తనమలినకారూశంబుల నిందు వదలుటంజేసి యీ ప్రదేశంబులు మలినకరూశంబులందురు. ఈ తావులు నిర్జరేశ్వరునివరప్రభావంబునఁ జిరకాలము ధనధాన్యసమృద్ధములై పెంపెసలారుచుండెను.

తాటకవధ.

ఇట్లుండఁ దాటకయను యక్షాంగన సహస్రగజబలశాలిని సుందుఁ డనువానిఁ బెండ్లాడి వానివలన మారీచుఁడను సుతునిఁ బడసెను. మారీచుడు

పుట్టువుదొట్టి ప్రజాక్షోభకరుఁడై యీ ప్రదేశంబులరెంటి నిర్మానుష్య
మొనర్చెను. ఆచోట నిమ్మహారణ్యము పెరిగెను. ఈకాననంబునఁ దాటక
వసించుచున్నది. ఆరక్కసి యాఱుక్రోసులనేల నావరించును. అది మన
దారిలోనేయుండును. ఆదుష్టచారిణిని బరిమార్చి యీప్రదేశంబు
నిష్కంటక మొనర్పుము. ఆక్రూరురాలికి వెఱచి యెవ్వరు నిందురారు'
అని గాధేయుఁడు చెప్పెను.

నావుఁడు 'మునీంద్రా! యక్షులు స్వల్పవీర్యులందురు. తాటకకు
సహస్రనాగబలమెట్లుగలిగె'నన విశ్వామిత్రుఁడిట్లనియెను. వత్సా! సుకే
తుఁడను యక్షనాయకుఁడు పుత్రార్థము బ్రహ్మను గూర్చి శుభాచారపుర
స్సరముగా దీర్ఘతపమాచరించి విరించివరప్రసాదంబున వేయియేనుగుల బల
ముకలపుత్త్రికను దాటకను బడసి దానిని బెంచి జర్ఝరాత్మజునకు సుందునకు
వివాహమొనర్చెను. బ్రహ్మవరంబునఁదాటకకు నంతబలము గలిగెను.
సుందుని దుండగములు దుస్సహము లయ్యెను. వాని నగస్త్యుఁడు సంహ
రించెను. పతివధకుఁ బగఁబూని యామహర్షిని మ్రింగుటకై పుత్త్రుని
వెంటఁగొని తాటక యార్చుచు వచ్చెను. అగస్త్యుఁడు వారిని శపించెను.
అంత వారు రాక్షసులై యుంచున్నారు. తాటకను వధింప భవదన్యులకుఁ
దరముగాదు. ఈపనిగావించి గోబ్రాహ్మణహిత మొనర్పుము. స్త్రీవధ
యని శంకింపవలదు. చాతుర్వర్ణ్యహితముపొంటె స్త్రీలవధసయితము
రాజులకుఁ గర్తవ్య మగును. ఇది శాస్త్రసిద్ధము. శిష్టరక్షణమునకన్న వేఱు
పరమధర్మము రాజులకుఁ గలుగదు. దుష్టశిక్షణంబునఁ గాని శిష్టరక్షణము
చేకూఱదు. ధర్మాచరణముపట్ల స్త్రీవధ యని వెఱచువాఁడు రాజుగాఁ
దగఁడు. భూపాలురకర్మములెల్లఁ బరోపకారార్థములుగాని యాత్మార్థము
లుగావు. ఆత్మార్థముగాని కర్మము ఫలాభిసంధిరహితముగా నుండును. అభి
లాషలేనినాఁడు ఫలము తత్కర్తకుఁ బొరయదు. ఈతత్త్వరహస్య మెఱిఁగి
రాజులు నిష్కామకర్మపరతంత్రులై తమధర్మంబుల నిర్వర్తింతురు. పూర్వ
ము విరోచనునిపుత్త్రిక మంథర జగత్సంహారంబును యత్నించెను. ఆదురా
త్మను వజ్రి వధించెను. ఇట్టిపురాణగాథలు వినవా! శుక్రునితల్లి భృగు
పత్ని యింద్రశూన్యముగా లోకమును గావింప సమకట్టెను. శ్రీమహా

విష్ణువు దానిని గడతేర్చెను. ఇట్టినిదర్శనము లెన్నోగలవు. ధర్మవిషయమున స్త్రీపురుషవిభేదము గలుగదు.'

నావుడు 'మునీంద్రా! నాతండ్రి పంపునను భవన్నియోగంబునను లోకహితముపొంటె మీవచన మొనర్తు' నని రాముడు వచించి విల్లెక్కు వెట్టి ధనుష్టంకార మొనర్చెను. ఆధ్వనికి వనాంతరమృగజాలమెల్ల విత్రాసుచెందెను. తాటకయుఁ దత్తరిల్లి క్రోధమూర్ఛితయై బిట్టార్చుచువచ్చెను.

ఆయసురను జూచి 'లక్ష్మణా! దీనిఘోరాకారంబును జూచినంత నే శూరుల ధైర్యకవచంబులు జాఱుట వింతగాదు. అయినను స్త్రీవధకుఁ జేతులాడవు. ముక్కును జెవులును దఱిగి దీనిని సంపుదు' నని రాముడు పల్కునంతలోన నప్పొలసుదిండి బిట్టఱచి బాహువులు చాచి యతనిపైకి నుఱికెను. విశ్వామిత్రుఁడు హుంకరించి రామలక్ష్మణులకు జయవచనముఁ బలికెను. తాటక చెలరేగి దుమ్ము చీకట్లు పఱపి యంతర్ధానయై శిలావృష్టిని గురిపింపసాగెను. రాముఁడు కోపప్రచండుఁడై శరజాలంబున ఱాలవానను వారించెను. రక్కసియుక్కుమీఱి వానిమీఁదికిఁ బఱతెంచెను. రాముఁడు దానికరద్వయమును దెగవ్రేసెను; లక్ష్మణుఁడు దాని ముక్కుఁజెవులు ద్రుంచెను. తాటక బొబ్బరించుచుఁ బలుమాయలు దాల్చి వివిధంబుల వారిని గాఱింపఁ జొచ్చెను. సంధ్యయు సమీపించెను. విశ్వామిత్రుఁడు రాముని బిలిచి 'వత్సా! జాలి యికఁజాలు. సంజవేళ యయ్యెను. ఈ పాతకి యిఁక విజృంభించును.' అని హెచ్చరించెను. రాముఁడు శబ్దవేది గావున సడిపట్టి క్రొవ్వాడికోల యేసి తాటక నరికట్టెను. ఆపిశితాశని తనమాయ లుడిగి ఱంపిల్లుచు బిఱ్ఱున వానిపయికి నుఱికెను. రాముఁడు శితభల్ల మొండు దానియురముఁ గుఱిచేసి వైచెను. ఆప్రేటునకు నయ్యసుర గుండియలు వ్రీలి దిక్కులు వ్రక్కలుగా నఱచి నేలఁగూలి యసువు ౯ దొఱఁగెను.

దేవతలు పరమానందభరితులై యింద్రపురస్సరముగా వచ్చి 'మునీంద్రా! శుభము, శుభము. మాకు మహాప్రీతిని గూర్చితివి. రామునియెడ సంపూర్ణముగాఁ బ్రసన్నుఁడవగుదువుగాక. నీయుపదేశంబునకు నతఁ

డెంతయుఁ బాత్రుఁడు. భృశాశ్వపుత్రులను వానికి ననుగ్రహింపుము. వానివలన మాకెల్ల మహోపకారము గానున్న' దని గాధేయునికి వచించి చనిరి. విశ్వామిత్రుఁడు రాముని శిరము మూర్కొని వానిఁ బ్రశంసించెను. అంతలోన,

“క॥ ధరణీదిశాప్రసారిత
గురుకరనికరంబు లుడిచికొని దీర్ఘనిరం
తరగతి ఖిన్నుఁడవోలెను
హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రిదరిన్.”

ఆరేయి వారచ్చటఁ బుచ్చిరి.

### నానాస్త్రప్రదానము.

తెల్లవాఱి గాధేయుఁడు రాముని బిలిచి ‘వత్సా! నీయెడ నెంతయుఁ బ్రీతుఁడనైతిని. దండచక్రము కాలచక్రము ధర్మచక్రము విష్ణుచక్రము అనుచక్రంబులను, ఐంద్రాస్త్రము వజ్రాస్త్రము శూలము బ్రహ్మశిరోనామకాస్త్రము ఐషీకము బ్రహ్మాస్త్రము అనుమహాస్త్రంబులను, మోదకియు శిఖరంబునను గదాద్వయంబును, ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము అనుపాశత్రయంబును, వారుణము పైనాకము నారాయణము అను దివ్యాస్త్రంబులను, శుష్కాశనిని ఆర్ద్రాశనిని శిఖరమనెడి యాగ్నేయాస్త్రంబును, ప్రమథనమనెడివాయవ్యాస్త్రంబును, హయశిరోనామకాస్త్రంబును, క్రౌంచాస్త్రంబును, విష్ణుశక్తి రుద్రశక్తి అను శక్తిద్వయంబును, కంకాళ కాపాల కంకణంబులను, వైద్యాధరాస్త్రంబును, నందనమనెడి ఖడ్గరాజంబును, మానవ ప్రస్వాప ప్రశమనామకగంధర్వాస్త్రంబులను, సౌర దర్పణ శోషణ సంతాపన విలాపన మదన మోహాస్త్రంబులను, తామస సౌమనః సంవర్ధ మౌసలాస్త్రంబులను, సత్య మాయాధరంబులను, తేజఃప్రభ శిశిర సుదామన భగ మానవాస్త్రంబులను నీకొసఁగ నిశ్చయించితిఁ బ్రతిగ్రహింపుము. ఈయస్త్రంబులు కామరూపంబులును మహాబలసంపన్నములు. ఇవిగలుగునేని సురాసురులేకమై వచ్చియు వ్రేలుగదలింపఁ జాలరు. వీని నెల్లఁబడయుము; నీకన్యుండు ధానుష్కుఁడు గలుగఁడు’ అని చెప్పి మంత్రగ్రామంబును జపించెను. అస్త్రదేవతలెల్లరు వచ్చి కేలొగ్గి నిలిచిరి. ఋషి

పుంగవుఁడు వారిం జూచి అస్త్రదేవతలారా! మిమ్ము రామునకు నిచ్చితిని' అనెను. వారు రామునకు మ్రొక్కి 'కింకరులము సెలవు' అనిరి రాజపుత్త్రుఁడు కరతలంబున వారిని స్పృశించి 'నాకు మనోనువర్తనులరై యుండు' డని మునికి నమస్కరించి 'మహాత్మా! ఉపసంహారంబునుగూడఁ బ్రతిపాదింపు'మని వేడెను.

విశ్వామిత్త్రుఁడు హర్షించి, సత్యవంతము సత్యకీర్తి ధృష్టము రభసము ప్రతిహారతరము పరాఙ్ముఖము అవాఙ్ముఖము లక్షాక్షము విషమము దృఢనాభము సునాభము దశశీర్షము శతోదరము పద్మనాభము మహానాభము దుందునాభము జ్యోతిషము కృశనము నైరాశ్యము విమలము యోగంధరము హరిద్రము దైత్యము ప్రశమనము శుచి బాహువు మహాబాహువు నిష్కాలి విరుచి సార్చిస్మాలి ధృతి మాలి వృత్తిమంతము రుచిరము పిత్ర్యసౌమనసము విధూతము మకరము కరవీరకరము ధనము ధాన్యము కామరూపము కామరుచి మోహము ఆవరణము జృంభకము సర్వనాభము సంతానము వరణము అనునట్టియుపసంహారాస్త్రముల నిచ్చెను. ఆమంత్రదేవతలు దివ్యభాస్వరదేహములతోఁ గొందఱును, అంగారకతేజంబులతోఁ గొందఱును, చంద్రార్కకాంతులతోఁ గొందఱును, ధూమవర్ణములతోఁ గొందఱును వచ్చి కైమోడ్పుల రాము నెదుట నిలిచిరి. దాశరథి సంతసించి 'అస్త్రదేవతలారా! తలంపుతోడ రండు పొండు' అనెను వారతనికి మ్రొక్కి చనిరి.

సిద్ధాశ్రమము.

అంత రామలక్ష్మణులు విశ్వామిత్త్రసహితులై యందుండి తరలిరి. మార్గమధ్యమున వారికి మఱియొకమహారణ్యము గానవచ్చెను. రాముఁడు మహర్షి వంక మరలి 'మహాత్మా! ఈకాఱడవి మెంజీకట్లు గ్రమ్ముచున్నది. ఇంతదట్టముగానున్నను వెఱపనుమాట యిందుఁ దోఁపదు. ఇది ఋష్యాశ్రమము గానోపు. బ్రహ్మఘ్నులైన రాక్షసులు మాయాగంబునకెందు విఘ్నమొనర్తురో, క్రతురక్షణార్థ మెచ్చటకు మమ్ముఁ దోడి తెచ్చితిరో యాయాశ్రమమిదిగా నుండునా?' యనెను. 'రామా! వినుము. సర్వలోకనాథుఁడు శ్రీమహావిష్ణువు తపశ్చరణార్థ మెందు యుగయుగంబులు వసించెనో, ఎందుఁ గాశ్యపమహర్షి ఘోరతపమొనర్చి సిద్ధిఁ బడయుటవలన

నేది సిద్ధాశ్రమమను సార్థకనామము వహించెనో, బలిచేత నిరాకృతుఁడై రాజ్యచ్యుతిని గాంచి పాఱి వచ్చి యొచట దేవేంద్రుఁడు విష్ణువును రాజ్య ప్రదానమర్థించెనో, పురందరుని యార్తిఁ బాపుటకును గాశ్యపుని కిచ్చిన వరమును జెల్లించుటకును వామనావతారమెత్తుదు నని విష్ణుదేవుఁ డెందు వాగ్దానమొనర్చెనో యాపుణ్యాశ్రమ మిది. ఇందే నేను వసింతును. యాగ విఘ్నకారులైనరాక్షసుల సంహారమిచ్చట జరుగవలసియున్న' దని విశ్వామిత్రుఁడు చెప్పెను.

అంతలో నయ్యాశ్రమము సమీపించెను. మునిశిష్యు లెదురు వచ్చి మహర్షి ని బూజించి రామలక్ష్మణులకు నాతిథ్యమిచ్చిరి. ఎల్లరుఁ గొంత వడి విశ్రమించి మార్గాయాసముఁ దీర్చికొనిరి. అంత రాముఁడు మహర్షిని డాసి 'మహాత్మా! యాగదీక్షఁ బూనవలయు. మీ క్రతుసిద్ధింజేసి యాశ్రమ సార్థకాభిదానము సిద్ధమగుఁగాక. మీమాటయు సత్యమగుఁగాక' యని విన్నవించెను. గాధేయుఁడు దీక్షవహించెను.

మా రీ చా దు ల సం హా ర ము.

పిమ్మట రామలక్ష్మణులు కౌశికుని డాయఁబోయి 'ఋషిచంద్రమా! రాక్షసులు క్రతువిఘ్నార్థము వచ్చుతరుణము మాకుఁ దెలుప వలయు' ననిరి. మునిశిష్యులు వారికార్యతత్పరతకు సంతసించి 'రఘువంశతిలకులారా! దీక్షఁ బూనుటంజేసి మహర్షి మౌనవ్రతుఁడు. మీకుఁ బలుకఁడు. నేఁడు మొదలుకొని యాఱురాత్రులు క్రతువును రక్షింపవలయు' ననిరి. రామలక్ష్మణులు విల్లెక్కుడింపక నిర్నిమేషులై కాచియుండిరి.

అయిదుదినములు యజ్ఞము నిర్విఘ్నముగా జరిగెను. ఆఱవనాఁడు ఋత్విజులు సమిత్కుశపానపాత్రహోమపాత్రంబులను సిద్ధపఱిచి యథా విధిఁ గూర్చుండి సమంత్రకంబుగాఁ గ్రతువును సాగించిరి. యజ్ఞవేది ధగ ధగ కాంతుల వెలుచుండెను. దానిమీఁద హఠాత్తుగా రక్తధారలు వర్షించెను. రాముఁడది గాంచి కోపోద్దీపితుఁడై యాగశాల యెల్లఁ గలయఁ బరికించి దుండగీడుల నెందుఁగానక మింటివంకఁ జూపు సారించి 'సౌమిత్రీ! అదిగో రాక్షసులు నింగినుండి యీయకార్యముఁ గావించుచున్నారు. మేఘమండలంబును ఝంఝానిలమువలె వీరిని మానవాస్త్రంబునఁ బాఱఁ

జిమ్ముదు' వని శరంబు సంధించి మారీచునివక్షము గుఱిచేసి యేసెను. అక్కోల వాని సువ్వెత్తుగాఁ గొనిపోయి నూఱామడదవ్వున సముద్రాంతమునఁ ద్రోసెను. దాశరథి యంతనాగ్నేయాస్త్రమును బ్రయోగించి సుబాహువక్షంబును జీల్చెను. వాడు నడగొండవలెఁ గూలి యసువులు వదలెను. రాముఁడట్లు మారీచసుబాహువులపీఁచ మఁడచి వాయవ్యాస్త్రమును వదలెను. దానివడికి సోఁకుమూకలెల్ల ఛిన్నాభిన్నమై యెందలివార లందే ప్రండిరి. విశ్వామిత్రుఁడు యజ్ఞశేషమును సమాప్తి గావించి దీక్షమాని వచ్చి రామా!

క॥ అన్నంత యొనర్చితి నా
జన్నంబును దీఱె మాట సత్యంబయ్యెన్
నిన్నెడయించెడు విల్తుఁడు
మున్నీరొడ్డాణమైన భూమిం గలఁడే ?.

యని ప్రశంసించెను. ఆశ్రమవాసులును వారి నెంతయు శ్లాఘించిరి. రామలక్ష్మణులు నాఁటిరేయి నిద్రించి జాగరణశ్రమముఁ బాసిరి.

### మి థి లా గ మ న ము.

తెల్లవారినంత రామలక్ష్మణులు ఆహ్నికములు దీర్చి ఋషికడకు వచ్చి 'మహాత్మా ! సేవకులము ; ఆజ్ఞ వేడుదు' మనిరి. అందున్న మునీంద్రులెల్లరు వారివినయమధుర వచనంబులకు సంతసించి గాధేయునిబురస్కరించుకొని 'రాకుమారులారా ! మిథిలాధీశుఁడు జనకమహారాజుగొప్పయజ్ఞముఁ దలపెట్టెను. అటకుఁ బోనున్నాము. వానియొద్ద మహాద్భుతమైన ధనూరత్నము గలదు. తొల్లి దేవరాతుఁడను మిథిలాపతి యాగమొనర్పగా దేవతలు వానికి మెచ్చి పసదనముగా దాని నతని కిచ్చిరి. ఆవింటి లావింతనరాదు.

శా॥ ఆవింటిం గన వచ్చినట్టి యలమర్త్యామర్త్య దైత్యేంద్రులన్
భావింపంగనురాదు, వచ్చి కని విభ్రాంతాత్ములై పోయి రం
దే వాఁడున్ దనకేల దానినిడి నట్టిన్నాళ్ళుగా లేదహో !
లావుంజేయవు విశ్వమందుఁ గలవా లాగెంతయుం దోఁచెడిన్.

ఆకార్ముకంబును మోపెట్టలేనివాఁడు ధానుష్కుఁడుగాఁజాలఁడు' అనిరి. అది విని రామలక్ష్మణులు ధనుర్విలోకనకుతూహలపడిరి. విశ్వామిత్రుఁడంత వనదేవతలను వీడ్కొని సిద్ధాశ్రమంబునకుఁ బ్రదక్షిణంబుఁ గావించి రాసుతులతోడఁ దరలి జాహ్నవీతీరముంబట్టి హిమాచలమార్గము ద్రొక్కెను. బ్రహ్మవాదులను దమతమయగ్నిహోత్రసంభారంబులను నూఱుబండ్లమీఁద నింపి గాధేయుని వెంబడించిరి. ఎల్లరు నూర్యాస్తమయము నకు శోణనదముఁజేరి యందుఁ గ్రుంకువిడి యగ్నిహోత్రంబులు గావించి సుఖోపవిష్టులైరి.

గిరివ్రజపురవృత్తాంతము.

శోణనదతీరంబున మహారణ్య మొండు గలదు. అది జీబుకొని పొడయెండనుగూడఁ బొలయనీక వనలక్ష్మికి నాటుపట్టోయన నత్యంతశోభాకరముగా నుండెను. రాముఁ డాకాననముఁ జూచి 'మహాత్మా! ఈవన సీమ యెవ్వరి' దనెను.

అనవుడు 'వత్సా! కుశుఁడను బ్రహ్మపుత్త్రుడుఁ డుండెను. అతఁడు నిర్విఘ్నవ్రతసంపన్నుఁడును సజ్జనప్రతిపూజకుఁడునై విదర్భరాజతనయను బెండ్లాడి యాయింతివలనఁ గుశాంబుఁడు కుశనాభుఁడు అమూర్తరజసుఁడు వసువు అనుపుత్త్రుల నాత్మసదృశుల నల్వురఁ గాంచి యాసుతులు యుక్త వయస్కులైనంత వారికిఁ దనరాజ్యంబును బంచి యిచ్చెను. అందుఁ గుశాంబుఁడు కౌశాంబీనగరంబును, కుశనాభుఁడు మహోదరపట్టణంబును, అమూర్తరజసుఁడు ధర్మారణ్యంబును వసువు గిరివ్రజపురంబును దమకువాస స్థానములుగా నేర్పరచికొని రాజ్యమును బరిపాలించుచుండిరి. ఈశోణనదం బీవసుదేశంబున నుత్పన్నమై ప్రవహించును. వసుదేశంబును మగధదేశ మనియు వచింతురు. ఆకారణంబున నిస్స్రోయవతిని మాగధియనియుఁ జెప్పుదురు. ఇది యైదుకొండలనడుమఁ బూదండవలె విరాజిల్లుచు బశ్చిమాభి ముఖముగాఁ బ్రవహించుచుండును.

కుశనాభుఁడుఘృతాచియను భార్యయందు లోకోత్తర సౌందర్యవతు లగు పుత్త్రికల నూర్గురఁ బడసెను. ఆకాంతారత్నములు కొండొకనాఁడు

యథోచితాలంకృతులై యుద్యానవనముఁ జొచ్చి ప్రావృట్పయోధరంబున విద్యుల్లతలువోలె విహరించుచు నాటపాటలఁ దవిలియుండిరి. వారి వారిరూపవయోవిలాసంబులకు వాయుదేవుఁడు మోహవశుఁడై యాసుందరీమణులను సమీపించి 'కామినీరత్నములారా! మీసొబగుముల్లోకంబులఁ గానరాదు. మీవలపునకు జరామరణపరాధీనులైన మర్త్యమాత్రులుదగరు. నన్నుఁ గూడి యుడివోని యెలప్రాయలై 'యమరసుఖంబులు చూరగొను'మని వారిని బ్రణయించెను. ఆమాటకు నజ్జవరాంగ్రలు నవ్వి 'సురోత్తమా! నీవు సర్వప్రాణులకు నంతశ్చరుఁడవు. అట్టిమహిమాఢ్యులు భవాదృశులు మమ్మిట్లు పరిభవింపనగునా? ఈయవినయంబునకుఁ బదచ్యుతియే తగుపరిహారము. ఆపని సేయఁ గుశనాభతనయలకు దుష్కరముగాదు. ఆత్మతపోనష్టమునకు వెఱచి మిన్నకుందుము. మాతండ్రి నీకు మృత్యువుగాకుండుగాక. కన్నెలు పితృపరాధీనలు. తండ్రి యిచ్చునతఁడే వారికి భర్తయగు' ననిరి.

ప్రభంజనుఁడు నిజప్రణయతిరస్కారంబునకు నలుకయు సిగ్గును దాల్చి ప్రతీకారముఁ జింతించి యయ్యంగనామణుల గాత్రంబులు సొచ్చి వారినెల్ల గుబ్జలుగానొనర్చెను. అంగవైరూప్యమునకు నయ్యేలనాగలు దైన్యమంది లజ్జాభ్రాంతులకుఁ జిక్కి యిలుదూఱిసాగయసాగిరి. పుత్త్రికలదీనావస్థకుఁ గుశనాభుఁడు వ్యసనకలుషితాంతరంగుఁడైసుతలను డాసి 'తనయలారా! ఈగుజ్జుతనము మీకు రానేల? సంగతియేమి? ఇట్లు ధర్మాతిక్రమమొనర్చినవాడెవఁడు?' అని యడిగెను. వారు బదులాడక పొరలిపొరలి యేడవసాగిరి. కుశనాభుఁడు వారినెంతయు బుజ్జగించి వివరము వినుపింప గోరెను. వారు దుఃఖము నెట్టకేలకు నడంచుకొని తండ్రికి మ్రొక్కి 'నాయనా! వాయుదేవుఁడు ధర్మాతిక్రాంతుఁడై యశుభమార్గముఁ ద్రొక్కి మమ్ముఁ బ్రధర్షింపవచ్చెను. పితృపరాధీనలమనియుఁ దండ్రిని మెప్పించి మమ్ముఁ బడయనగుననియు వాని నొడ్డుకొంటిమి. ఆపాపానుబంధుఁడు మావిజ్ఞాపనములు ద్రోచిపుచ్చి మమ్మిట్లు భంగపరచె' నని డగ్గుత్తికతోఁ బరికి విలపించిరి. కుశనాభుఁడు వివరము విని 'పుత్త్రికలారా! అంతటివాఁడు మీకు మనోవికారముఁ గలిగింప నోపఁడయ్యెఁగదా. మీ

సౌశీల్యమునకు నిదే ప్రబలనిదర్శనము. భంగపాటు చెందియు వానిని గోపింపక క్షమాప్రదీపకలై తిరి; నాకులగౌరవంబులు కాపాడితిరి.

మ॥ వ్రతము ల్దానములుం దపశ్చరణశాస్త్రామ్నాయతత్త్వార్థకో
న్నతులుం సాటికి రావు సుమ్ము క్షమకుం దథ్యంబుగానందుదత్
స్థితికై మీరు ప్రమోదగర్వగరిమం జెన్నారనౌఁగాక యో
సుతలారా! వ్యసనవ్యథాకలితలై శోకింపఁగాఁ జెల్లునే!.

అని వారి నూదార్చి తత్పరిణయంబులఁగూర్చి మంత్రుల నాలోచించుచుండెను. ఆకాలంబునఁ జూళియను నష్ఠలిత బ్రహ్మచారి పరమేష్ఠింగూర్చి తీవ్రతపంబు సేయుచుండెను. వానిని సోమదయను గంధర్వాంగనఁ బరిచరించుచుండెను. ఆ బ్రహ్మచారి యాసపర్యలకు మెచ్చి 'సోమదా! ఇచ్చవచ్చినవరముఁ గోరు' మనెను. ఆకాంతామణి సంతసించి 'మునివర్యా! నీయందు బ్రహ్మవర్చస్సు తేజరిల్లును. అట్టితేజశ్శాలియైన పుత్త్రుని నాకనుగ్రహింపు' మని వేడెను. అతఁడు ప్రసన్నుఁడై సంకల్పమాత్రంబున నొకపుత్త్రుని మహాతేజోవంతుని బుట్టించి యాయింతి కొసంగెను. ఆకుమారుని బ్రహ్మదత్తుఁ డందురు. వాఁడు కాంపిల్యనగర మధిష్ఠించి సర్వజనాహ్లాదకరముగాఁ బాలించుచుండెను. వానిసంగతి కుశనాభుఁడు విని యతని రప్పించి తనసుతల నూర్వుర వానికిచ్చి పెండ్లి యొనర్చెను. వరుని ప్రసాదంబున వారు కుబ్జత్వముఁ బాసి యథాపూర్వ మైరి. కుశనాభుఁడు పరమానంద మొంది యల్లునిని దనయలను సముచితసత్కారంబులఁ బంపెను. వారు కాంపిల్యానగరము చేరి సోమదకు నేత్రోత్సవ మొనర్చుచు సుఖముండిరి.

కుశనాభుఁడట్లు పుత్త్రికల నత్తవారింటికిఁ బంపి పుత్త్రార్థము పుత్త్రకామేష్టిఁ గావించెను. అతనికి వానితండ్రి కుశుఁడు ప్రత్యక్షమై 'నాయనా! ఆత్మసదృశతనయుని గాధియనువానిఁ బడయుదువు. వానివలన నీకు శాశ్వతకీర్తియగు' నని చెప్పి చనెను. కొన్నాళ్ళకు ఘృతాచి యనునది దాల్చి గాధిని గనెను. వానికి నేను జనించితిని. కుశవంశమునఁ బుట్టిన కతన నన్నుఁ గౌశికుఁడందురు.

రామా! నాకు సత్యవతి యను పేరి యగ్రజాత గలదు. ఆమెను ఋచీకుఁడు వివాహమయ్యెను. పెండ్లియైన కొండొక కాలంబునకు భర్త పరమపదమొందఁగా వానిని సత్యవతి సశరీరగా స్వర్గలోక మనుగమించియు లోకహితార్థము మరలవచ్చి హిమవంతము నాశ్రయించి కౌశికినామపుణ్య నదీరూపంబునఁ బ్రవర్తిల్లుచున్నది. ఆమెయందలి యాదరంబునఁజేసి నేను హిమాచలప్రాంతముల వసింతును. క్రతునిమిత్తము సిద్ధాశ్రమంబునకు వచ్చితిని. నీ తేజంబు పెంపున నా యజ్ఞము కొనసాగెను.

రామా! గిరివ్రజవృత్తాంతంబును బ్రసంగవశంబున నా చరితను వింటివి. అదిగో చూడు.

చ॥ తరువులు దాల్చె నిశ్చలనధర్మము గుంభకయోగమూనె నాఁ,
బరుగులు మాని కూర్కె మృగపక్షులు, మిన్నెలనాగ తారకా
తరళవిలోకనంబుల సుధాకరునిం దనివోవఁ జూచెడిన్
సురిగెను జీకటుల్ దివిరి సోకుఁడు లెల్లడఁ దాఁకాడెడిన్.

పూర్వరాత్రము చననున్నది. జాగారము రేపటిపయనమునకు నాటంకమగు. నిద్రింపుము' అని విశ్వామిత్రుఁడు చెప్పెను. రామలక్ష్మణులు సంతోషమూర్ఛితులోయన నిద్రించిరి.

షణ్ముఖజనన వృత్తాంతము.

మఱునాఁడు రాముఁడు ప్రాతరాహ్నికములు తీర్చి లక్ష్మణునిగూడి వచ్చి 'మహాత్మా! శోణనదమందలి సైకతప్రదేశములం గాన్పించుచున్నవి. వీనిఁబట్టి చూడఁగాఁ బ్రవాహము లోతుఁగాఁ దోఁపదు; రేవు చూచి కాల్నడ దాఁటు నగు' ననెను. విశ్వామిత్రుఁడు వల్లె యని రాకుమారుల తోడఁ దరలి శోణనదము దాఁటి మార్గమధ్యమందలి విశేషంబుల వారికిఁ జెప్పుచు మధ్యాహ్నవేళకు గంగాతీరము చేరి యట వసతులేర్పఱచికొని తర్పణహోమాదిక్రియలు గావించి హవిర్భాగము నమృతముకరణి నారగించి సుఖోపవిష్టుఁ డయ్యెను. రాముఁడు గాధేయునిఁ జేరి 'మహాత్మా! గంగానదిని త్రిపథగయందురు. ఆపే రెట్లువచ్చెను? ఈ శైవలిని ముల్లోకములావరించి సముద్రుని గలియునట. ఆ వృత్తాంతము వినఁగుతూహలమగుచున్నది' అని యడిగెను.

నావుడు 'వత్సా! ఎల్లధాతువులకు నిధానంబును మహోన్నతుఁడు నైన పర్వతరాజు హిమవంతుఁడు గలఁడు. వానికి మేరుతనయయైన మనోరమవలన నప్రతిమానరూపవతులు పుత్త్రికలిద్దఱు జనించిరి. అందుఁ బెద్దకూఁతు గంగయందురు. రెండవసుత యుమ నాఁబడు. దేవతులు స్వహితార్థమును త్రిలోకశ్రేయఃప్రాప్తిని గోరి హిమవంతుని బ్రార్థించి గంగను స్వర్లోకంబునకుఁగొని పోయిరి. ఉమ రుద్రునిగూర్చి దీర్ఘతపమొనర్చి వానిని వివాహమయ్యెను. శివుఁడు వలపు దగిలి పార్వతితో నూఱుదివ్యవత్సరములు గ్రీడించెను. వారికిఁ బెనుభూతమొండు జనింపనుండెను. దేవత లందులకు బెగ్గడిల్లి బ్రహ్మను దోడ్కొని ముక్కంటి యొద్దకుఁ బోయి 'మహాదేవా! లోకశరణ్యా! ప్రసన్నుఁడ వగుము. నీ తేజస్సును ముల్లోకంబులుగూడ ధరింపఁజాలవు. జగత్కల్యాణముఁగోరి యద్దానిని నీయందే ధరించి వేదోక్తయోగయుక్తుండవై భార్యతోడఁ దపంబు సేయనోపు' నని మొఱలిడిరి. మహేశ్వరుఁడు నిర్జరులప్రణయ మాకర్ణించి 'సురలారా! మీయభీష్ట మగుఁగాక; మీకును లోకంబులకును సుఖంబగుఁగాక; నా తేజస్సు స్వస్థానమునుండి క్షుభితమయ్యెను. దానిని ధరింపనెవ్వరో చెప్పనగు' ననెను. 'భూమిమీఁదవదలు' మని దేవతులు చెప్పిరి. శివుఁ డట్లొనర్చెను. అది గిరివనసహితంబుగాఁ బుడమియెల్లఁ గ్రమ్మెను. దేవతలు కలగుండు చెంది యగ్నిఁ జీఁటి 'వాయుపూర్వకంబుగా శివరేతస్సును బ్రవేశింపు' మనిరి. అతఁడట్లు గావించెను.

పార్వతియు, దనకుఁ బుత్త్రసంతానాంతరాయమగుటఁ గాంచి దేవతలకుఁ గినిసి 'అమరులారా! మీయపచారఫలంబుగా మీకు స్వభార్యలందు సంతానము లేకుండుఁగాక' యని శపించి 'ధాత్రీ! నాసుతోదయంబును సహింపవైతివి గావున నీవు మత్క్రోధకలుషీకృతవై నానారూపంబులు దాల్చి పెక్కురాజులకు నంపుడుగత్తెవగుచుఁ బుత్త్రప్రీతికిఁ దవ్వగు' మని భూదేవిని దిట్టెను. శివుఁడు సతీద్వితీయుఁడై చని హిమాద్రిశిఖరంబునఁ దపస్సునకుఁ దొడఁగెను.

దేవతలు కొండొకనాఁడు మరల బ్రహ్మకడకు వచ్చి 'పితామహా! ఉమాశివులకు జనించుసుతుఁడు దేవసేనానియగు నని వరమిచ్చితివి.

త్రిశూలి తపోనిష్ఠుఁడయ్యెను. ఇఁక వానివలన మేము సేనానాయకుని బడ యుపవిధము దోఁపదు. కార్యవిధానజ్ఞుఁడవు; నీకన్న మాకు దిక్కు గలు గరు. కర్తవ్యము విచారింపు' మనిరి. చతురాస్యుఁడు వేల్పుల నూరా ర్చి 'పార్వతిశాపము తప్పదు; ఇఁక మీకు మీకళత్రంబులసంతానముకల్ల. వీతిహోత్రుఁడు వియద్గంగయందు సుతుని జనింపనోపు; అతఁ డరిందముఁ డై యమరసేనాధిపత్యము వహించును. ఆకుమారుని గంగ ధరించుటకు నామెచెలియలు పార్వతి పరితోషించును' అని చెప్పెను.

అసురులంతఁ గైలాసంబునకుఁ జని యందున్నయగ్నిదేవుని బుత్రో దయంబునకు నియోగించి 'రుద్రవీర్యంబును గంగయందు విసర్జించి దేవహిత మొనర్పు' మని వానిని గోరిరి. ఆసంగతి యగ్ని గంగకుఁ దెలిపి 'యమరు లకుఁ బ్రియము సేయు' మనెను. గంగ యందులకు సమ్మతించి దివ్యాంగ నారూపముఁ దాల్చెను. వైశ్వానరుఁ డంత తనయవయవంబుల నున్న రుద్రవీర్యంబును స్రవించెను. అది గంగాసర్వాంగములు వ్యాపించి తచ్ఛ రీరంబు నెల్ల నుడ్డుడికింపసాగెను. గంగ యావేడిమిఁ దాళఁజాలక 'ఇది ధరింనావలనుగా' దనెను. దానిని హిమవత్ప్రాంతమున వదలుమని యగ్ని చెప్పెను. గంగ యట్లొనర్చెను. ఆతేజోరక్తాదికము భూగతమై నానా విధధాతువర్ణముగాఁ బరిణమించెను. ఆతేజస్సునుండి బాలుఁడొకఁ డుద్భ వించెను. కృత్తికలార్గురుఁ బాలిచ్చి వానిని బెంచిరి. ఆఱుముఖములతో జన్మించినందున వానిని షణ్ముఖుఁ డందురు. వేల్పు లాతనిని సురసేనాధి పత్యమునకు నియమించిరి.

గంగావతారచరిత్ర.

వత్సా! కథానుషంగికముగా షణ్ముఖావతారచరిత్ర చెప్పితిని. గంగావతారచరిత్ర వినుము. తొల్లి సగరుఁడనురాజు అయోధ్యాధిపతి యుండెను. అతఁడు విదర్భరాజతనయను కేశియనుకాంతను జ్యేష్ఠభార్యగాఁ గాశ్యపపుత్త్రిని సుమతిని ద్వితీయపత్నిగా గ్రహించి సంతానార్థియై సతు లతోఁడ హిమవంతంబునకుఁ జని యట భృగుప్రస్రవణంబున శతవర్షంబులు ఘోరతపం బొనర్చెను. భృగుమహర్షి ప్రసన్నుఁడై 'వత్సా! సగరా! నీతపస్సునకు మెచ్చితిని; నీకుఁ బుత్త్రలాభమగు; ఒకభార్యయందు వంశ

కర్తయగు సుతుఁడును, మఱియొకసతియందు నఱువదివేలు తనయులును జనింతు' రనెను. కేశీసుమతు లది విని 'మహాత్మా! మాలో నెవతె వంశకర్తను గాంచునని వేడిరి. మీమీకోర్కులు తెలుపుఁడని యాఋషీంద్రుఁ డడిగెను. వంశకర్తను గేశి కోరెను; సుమతి యఱువదివేలతనయుల నభిలషించెను. అట్లేయని యామహాని వారి నాశీర్వదించి పంపెను.

కొండొకకాలంబునకుఁ గేశి యసమంజసుఁడను తనయుని గాంచెను. సుమతి గర్భపిండమును బ్రసవించెను. ఆతుంబమును భేదించి యాతునియలను నేతికడవ లందుంచి దాదులు పోషించుచుండిరి. అవి క్రమక్రమముగా నవయవములు దాల్చి పురుషాకారంబుల వర్ధిల్లెను. అసమంజసుఁడు బాల్యముదొట్టి చెనటియై పసికూనలఁబట్టి సరయూజలంబుల ముంచుచు నూపిరాడక వారుతల్లడిల్లుట చూచి యానందించుచుండెను. ఆదుండగములు విని సగరచక్రవర్తి వానిని నగరమునుండి వెడలనడచి యతనిసుతుని నంశుమంతుని దగ్గరతీసి పెంచుచుండెను.

ఇట్లుండఁ గొండొకకాలంబున సగరునకు యాగాభిలాషము జనించెను. పెద్దలు చేరి హిమాచల వింధ్యాద్రులమధ్యభాగంబున యజ్ఞప్రదేశమును నిర్ణయించిరి. సగరుఁడు క్రతు వారంభించి యజ్ఞాశ్వమును వదలి దాని వెంట నంశుమంతునిఁ బంపెను. మఱునాఁడు యజ్ఞనశాలయందు ఉత్సవ మొనర్చుచుండిరి ఋత్విజులకుఁ గొన్నియశుభసూచనలు గానవచ్చెను. వారు సంగతి గ్రహించి 'రాజా! పర్వణిసమయంబున నెవఁడో యశ్వమును హరించి గొనిపోవుచున్నాఁడు. హర్తను వెంటనే దునుమాడి హయమును గాపాడుము. కానిచో యజ్ఞచ్ఛిద్రమగును; తత్ఫలముగా మనయెల్లరకు ముప్పు వాటిల్లు' ననిరి. సగరుఁడు తనయఱువదివేలసుతుల రప్పించి 'నాయనలారా! యజ్ఞముం దవిలి పరాకుచెందితిని. యాగాశ్వము నెవఁడో హఠాత్తుగా హరించెను. మీరెల్లరుఁ జని చతుస్సముద్రముద్రితధరామండలంబున యాగాశ్వ మెందున్నను దానిని గొనిరావలయును. అది యెచ్చో భూగర్భంబున డాగుఁగాక; వానిని విడువవలదు. యజ్ఞదీక్ష నన్నుఁ గదలనీయదు. అశ్వమును దెచ్చునందాఁక యిందేయుందు; పోయిరమ్ము శుభమగు' ననెను.

వారు తరలి పుడమియెల్లఁ గలయ వెదకిరి. ఎందును గుఱ్ఱముపొలఁకువయే గానరాకుండెను. అంతవారు భూగర్భంబును బరిశోధింప నిశ్చయించి వజ్రంబులఁబోని శూలములతో హలాయుధములతో నొక్కొక్కరొక్కయామడేసిదూరము పృథివిని ద్రవ్వి పాతాళముఁ దాకిరి. అచటి దేవదానవగంధర్వులావిపరీతంబునకు భీతిల్లి పితామహునొద్దకు బఱచి సంగతి విన్నవించి యతనిశరణు వేడిరి. 'వేల్పుపెద్ద ప్రసన్నుడై భయము వలదు; శ్రీమన్నారాయణుడు కపిలావతారమెత్తి సమస్తక్షోణీమండలంబును ధరించుచున్నాఁడు. కపిలునిక్రోధాగ్నిఁ బడి సగరాత్మజులు బుగ్గియగుదురు. ప్రతికల్పంబుననిట్లగు. వెఱపులు మాని మీతావులకుఁ జనుఁడు' అని ధైర్యమూల్కొల్పి వారిని బంపెను. సగరపుత్త్రులు పాతాళమెల్ల శోధించి యెందును యజ్ఞాశ్వమును గానక విఫలమనోరథులై మరలి వచ్చి తండ్రికి సంగతి వినిచిరి.

అది విని సగరుఁడు మండిపడి 'విశ్వంభరాతలమెల్ల ధూళీపాళీకరించి తూర్పాఱఁబట్టుడు. ఎందున్నను హయంబును సార్తతోడఁ బట్టితెండు. అందాఁక మరల వల' దని చెప్పి తనయులఁ బుచ్చెను. వారు చని భూభాగము గుద్దలించి తద్గర్భముఁ జొచ్చి యట ధరామండలంబును శిరంబున మోయుచున్న విరూపాక్షదిగ్గజంబును గాంచి దానిని బ్రదక్షిణించి, యందుండి తూర్పుదెస భేదించుచుఁ బోయి దక్షిణదిక్కుంభిని మహాపద్మంబును వలగొని పశ్చిమాభిముఖులై తరలి సౌమనసదిక్కరికి నెరగి, యుత్తరదిశయందున్న హిమపాండురవర్ణదిగ్దంతిని భద్రంబును జుట్టి యీశాన్యదిక్కునకు గడచి యటఁ గపిలమహర్షిని గాంచిరి. వానిచెంత యాగీయాశ్వము మేయుచుండెను. దొంగ యతఁడే యని వారు నిశ్చయించుకొని క్రోధపర్యాకులేక్షణులై ఖనిత్రలాంగూలంబులతో శిలావృక్షంబులతో నమ్మునిపయికి నురవణించిరి. కపిలుఁడు వారిదుర్నయముఁ జూచి హుంకరించెను. క్షణములో వారెల్లరు భస్మరాసులైరి.

సుతులెన్నాళ్ళకు రామికి సగరుఁడు చింతావ్యాకులుఁడై తదన్వేషణార్థ మంశుమంతుని బంపెను. అతఁడు వెడలి పినతండ్రులు చన్నమార్గముఁ బట్టిపోయి యొక్కొక్క దిక్కుంభిని సందర్శించుచుఁ దదీయాశీర్వచనంబులు పడయుచుఁ జనిచని యెట్టకేలకు సగరపుత్త్రభస్మరాసులు జేరి సంగతి

గ్రహించి దుఃఖపరీతుఁడై పెద్దయుందడవు విలపించి పితృతర్పణంబులకు సమకట్టెను. ఎందును జలంబులు గానరావు. అతఁడేమియుఁ దోఁపక శూన్యహృదయుఁడై నింగివంక దృష్టి సారించి చూచుచుండెను. వాని మేనమామ గరుత్మంతుఁడు వానికప్పుడు ప్రత్యక్షమై 'పురషాగ్రణీ ! నీపిన తండ్రులచావునకు వగవవలదు. అది లోకహితప్రాపకముగాని యొండు గాదు. వారు కపిలమహర్షి కోపానలంబున దగ్ధులైరి. వారికి సలిలక్రియలు లౌకికజలంబులఁ గారాదు. వియద్గంగాతోయంబులఁ బితృతర్పణంబు లొనర్పనగును. లోకపావని గంగాదేవి యీభస్మరాసులపైఁ బ్రవహించునేని నీపినతండ్రులకు స్వర్గప్రాప్తియగును. అదిగో యాగాశ్వము, దానిని గొనిపోయి నీతాతజన్నంబును సమాప్తిగావింపు' మని పలికి చనెను.

అంశుమంతుఁడు యాగాశ్వంబును వెంటఁగొని తాతయొద్దకు వచ్చి యుదంతమెల్ల వానికి వినిచెను. అతఁడు మహాచింతాక్రాంతుఁడై యజ్ఞశేషము యథాకల్పము పూర్తిచేసి గంగావతారోపాయము నేరక నిర్విణ్ణుఁడై ముప్పదివేలేండ్లు రాజ్యమేలి పుత్త్రశోకముతోన మరణించెను.

అంశుమంతునకుఁ బట్టముఁ గట్టిరి. వానికి దిలీపుఁ డుదయించెను. అతఁడు యుక్తవయస్కుఁడైనంతట నంశుమంతుఁడు వానికి రాజ్యమొప్పగించి గంగావతరణార్థియై హిమగిరికిఁ జని యట ముప్పదివేల వర్షంబులు మహోగ్రతపం బొనర్చి యిష్టసిద్ధిఁ బడయకయే స్వర్గతుఁడాయెను. తాతల దుర్మరణంబునకునుఁ దండ్రి తపోవ్యయమునకును దిలీపుఁడు వగచి యుపాయాంతరము దోఁపక ముప్పదివేలయేండ్లు పుచ్చి సుతునకు భగీరథునకు రాజ్యంబును మనోవ్యథావ్యాధికి శరీరంబు నొప్పగించెను.

భగీరథునకుఁ బుత్త్రసంతానము గలుగదు. అతఁడు రాజ్యమును మంత్రులయధీన మొనర్చి హిమాచలప్రత్యంతపర్వత మైన గోకర్ణాద్రికిఁ జని యందు జితేంద్రియుఁడై యాహారనియతిఁ బూని బ్రహ్మను గూర్చి పంచాగ్ని మధ్యంబునఁ దీవ్రతపం బొనర్పసాగెను. రామా! ఆతపస్సు నేమని చెప్పుదు?

సీ॥ ఒకమిడుంగురు లేచి యుదధిలోపల వ్రాలి,
రెండవయౌర్వమై దండుమీఱె,
ఒకమిడుంగురు లేచి యూర్ధ్వలోకముఁ బ్రాకి
దివ్యవిద్యుల్లతాదీపమయ్యె
ఒకమిడుంగురు లేచి యుడువీధి నెడనిల్చి
యత్యర్కచంద్రమై యతిశయిల్లె
ఒకమిడుంగురు లేచి యురగభూములు దాఁకి
చిత్రమాణిక్యమై చెలువుఁగాంచె

గీ॥ ముక్కుపయికి వ్రే లెగసెను మునులకెల్ల;
వేల్పు లాశ్చర్యసంతోషవివశులైరి
పుడమి నూత్నవికాస మెల్లెడలఁబడసె
సగరపౌత్రప్రసాత్త్వికతపోజ్వాలఁజేసి.

పరమేష్ఠి వానికిఁబ్రీతుఁడై సురసమేతంబుగా వచ్చి 'వత్సా! వరము గోరు' మనెను. భగీరథుఁడు బద్ధాంజలియై 'దేవా! నాయెడఁ బ్రసన్నుఁడ వేని నాతపము ఫలవంతమేని, మఱియు ప్రపితామహులభస్మరాసులు గంగాపుణ్యోదకప్లుతము లగుఁగాక. అక్షయపదము వారికి లభించుఁగాక. ఇక్ష్వాకువంశ మవిచ్ఛిన్నమగుఁగాక' అని వేఁడెను. భగీరథుని యౌదార్య సౌశీల్యంబులకు హిరణ్యగర్భుఁడు సంతసించి 'దృఢవ్రతా! నీయిచ్ఛయగు. గంగాపతనంబునకు భూదేవి యోర్వదు. శూలాక్షుఁడు దక్కనొండు గంగను ధరింపనోపఁడు. హరుని బ్రార్థింపు' మని పలికి, గంగను సంప్రతించి 'దేవీ! సమయమెఱిఁగి భూమికి నవతరింపు' మని చనియెను.

అంత భగీరథుఁడు నిరాలంబనిరాశ్రయవాయుభక్షణరూపకఠోరదీక్షఁ బూని ధ్యేయాకారితచిత్తవృత్తుఁడై రాత్రిందివము సంవత్సరపర్యంతము మహోగ్రతపం బొనర్చెను. వానికి ముక్కంటి ప్రసన్నుఁడై 'వత్సా! నీకు మెచ్చితిని; ప్రియ మొనర్తు; గంగను దలఁదాల్తు' నని పలికి తిరోహితుఁడయ్యెను.

సీ॥ రంగదుత్తుంగతరంగపఙ్క్తులతోడఁ
బ్లవమానహంసరాట్పటలితోడఁ

మత్స్యకచ్ఛపశింశుమారకాండముతోడ
గాంగేయనీరేజగణముతోడఁ
బాండురాంబుదఖండడిండీరములతోడఁ
జటులసంప్లుతిసమార్భటులతోడ
హరికాంతకాంతశీకరరత్నములతోడ
నతిచితెమ్మెరపరంపరలతోడఁ

గీ॥ గగనకామినీకంఠముక్తాస్రజంబు
త్రెస్సి పఱచి యిలకు జాఱు తెఱఁగుదోఁప
వింతవింతహొయలు మీఱ వింటినుండి
హరజటాజూటమున వ్రాలె నభ్రగంగ.

అట్లు మిన్నేఱు వ్రాలి నిజఝరీవేగంబునఁ బరమేశ్వరునిగూడఁ బాతాళంబునకుఁ గొంపోవనుండెను. ధూర్జటి దానిగర్వోద్ధతికిఁ దామసించి యన్నదిని దిరోభవించెను. గంగానది యందుఁ జిక్కి.

మ॥ తిరుగుల్ దిమ్మరుఁ దల్లడిల్లు నులుకుం దీడ్రించు నుఱ్ఱూగు ను
ద్దురలున్ ఘూర్ణిలుఁ బిక్కటిల్లు నుఱుకున్ డుల్లున్ మిటారించు బ
మ్మెరవోవున్ మతిదప్పరిల్లు నెగయున్ మిట్టాడు బిట్టార్చు నా
హరజూటాంతరబంధనంబెడయఁగా నత్యంత ముద్వేగయై.

అట్లానది కపర్దితలముడినుండి నిర్గమింప నిఖిలప్రయత్నంబుల్లు గావించి వెఱవుగానక తన్మోహిత మోయన నందే పెక్కేండ్లు పరిభ్రమించుచుండెను. ఎన్నాళ్ళకు గంగ రాకుంటగాంచి భగీరథుఁడు శివునిగూర్చి మరల లోకోత్తరతపం బొనర్చెను. నిటలాక్షుఁడు వానియెడ జాలివడసి యాతరంగిణిని బిందుసరోవరమందు డించెను. అందుండి యది యేడు పాయలుగాఁ జీలి హ్రాదిని పావని నలిని యనుమూఁడు శాఖలను దూర్పు ముఖంబుగా, సుచక్షువు సీత సింధు వనుమూఁడు శాఖలను బశ్చిమముఖంబుగాఁ బ్రవహింపఁజేసి నడిమిశాఖయైన దాను భగీరథునివెంటనంటి యొకచో ధృతంబుగా, నొకచోఁ గుటిలంబుగా, నొకచో మందమందంబుగా, వేఱొకచో నమ్రముగా, నింకొకచో మహోద్భూతంబుగా, నానాగతులఁ బ్రవహించుచు, నిజజలావగాహమాత్రవిగతశ్రములై జనులుగావించు స్తోత్ర

పాఠంబులు వినుచుఁ జనిచని జహ్నుమహర్షి యజ్ఞవాటిని నీటముంచెను. ఆ మహర్షి దాని కావరంబునకుఁ గనలి తజ్జలంబులెల్లఁ గ్రోలెను. గంగ నామావశిష్ట యయ్యెను. ఋషులు వచ్చి లోకహితార్థము జహ్నుమహర్షిని ప్రార్థించిరి. ఆతపోధనుఁడు కరుణించి గంగను నిజశ్రోత్రమార్గంబున వెడలించెను. ఆనది యట్లు బహిర్గతయై భగీరథు ననుసరించి సముద్రము గుండఁ బాతాళముఁ జొచ్చి యందున్నసగరపుత్రభస్మరాసులను దడిపెను. ఆప్రేతలు తమపాపంబులఁ దొలఁగి దివికిఁ జనిరి. గంగానది జహ్నుమహర్షి కర్ణబహిర్గతయైన కారణంబున దానిని జాహ్నవి యందురు.

అంతఁ బరమేష్ఠి భగీరథునకుఁ బ్రత్యక్షమై 'రాజా! నీముత్తాతకును దాతకును, దండ్రికిని, ముగ్గురకుఁ దరముగాని కార్యంబును సాధించితివి; అఱువదివేల ప్రేతలకు స్వర్గమిచ్చితివి. ప్రతినఁ గాచికొంటివి ; ఎంతయు శ్లాఘాపాత్రుఁడవు. నీవలన భూమియెల్లఁ బావన మయ్యెను. నీకారణంబున గంగానది పుడమికి నవతరించెను. కావున నేఁడుమొదలె నయ్యాది భాగీరథి యనియు నాఁబడు. ఆనదీపుణ్యోదకము లాడి తన్నీరంబులఁ బితృతర్పణంబు లొనర్చి చరితార్థుఁడవైచను' మని వచించి యంతర్హితుఁడయ్యెను. భగీరథుఁ డట్లు గావించెను.

వత్సా ! ఈగంగావతరణోపాఖ్యానము ధన్యము యశస్కరము నాయుష్యవర్ధనము స్వర్గ్యము నైనది. దీనిని విన్నను వినిపించినను సర్వపాపక్షయమగును" అని విశ్వామిత్రమహర్షి నుడివెను.

అంతలోన సూర్యాస్తమయ మయ్యెను. రామలక్ష్మణులు చని దివసాంతకృత్యములు దీర్చి ఫలంబు లారగించి పరుండిరి. నాఁటిరేయి యెల్ల గంగాచరిత్రస్మరణముతో వారికి నిమిషప్రాయము గాఁ గడచెను.

ఉ॥ అల్లనఁ బ్రొద్దుసెనీలితెఱ నవ్వుల రేయెలనాగ, నేర్పు సం
ధిల్లఁగఁ బుల్గుబట్టువులు దెల్పిరి వేగుపరాకు, లుల్లస
త్పల్లవరాగరమ్య మగుపయ్యెద కాళ్లనుజీరియాడఁ దొ
ట్రిల్లుచు నయ్యుషాంగన వడిం జనుదెంచెను దూర్పుకొండకున్.

రామలక్ష్మణులు లేచి ప్రాతరాహ్నికములు దీర్చి విశ్వామిత్రునికడకువచ్చి 'మహాత్మా! ఋషులు మీరాక విని నదీసుఖతరణార్థము పడవను సిద్ధ

పఱచి' రని తెలిపిరి. గాధేయుఁడు పయన మయ్యెను. వారెల్లరుఁ బడవ మీఁదఁ గంగానదిని దాఁటి తీరంబున నించుక విశ్రమించి విశాలానగర మార్గముఁ ద్రొక్కిరి.

### విశాలానగర వృత్తాంతము.

అట్లు విశాలానగరమునుబట్టి చనుచు 'మహాత్మా! ఆనగరమునకు నట్టి పేరెట్లు వచ్చెనని రాముఁడు ప్రస్తావింప విశ్వామిత్రుఁ డిట్లనియెను. వత్సా! తొల్లి కృతయుగంబునఁ గశ్యపుఁ డను ప్రజాపతి యుండెను. వానికి దితి యదితి యను భార్యలిద్దఱుండిరి. అందు దితి మహాబలసంపన్నులైన దైత్యులఁ గాంచెను. అదితికి ధర్మనిరతు లగుదేవతలు జనించిరి. వారట్లు జనించి యజరామరణంబులును, నిరామయత్వమును గోరి తదర్థము పాలవెల్లిని ద్రచ్చి యమృతము సాధింప నిశ్చయించి మంథరగిరిని గవ్వముగా వాసుకిని ద్రాఁడుగాఁ జేసి నిరవధికపరాక్రమోత్సాహంబులతో క్షీరాబ్ధిని మథింప సాగిరి. అట్లు వేయిసంవత్సరంబులు మథింపఁగా నందుండి కీలికీలాయతమైనహాలాహల ముద్భవిల్లి లోకంబును దేవాసురమానుషంబుగా దహింపనుండెను. నిర్జరులు భీతిల్లి శంకరుని శరణు జొచ్చిరి. అంతలోన హరియు నటఁదోఁచి 'త్రిలోచనా! దేవతలకెల్ల నగ్రజుఁడవుగదా. అగ్రపూజగా నివ్విషంబును గ్రహించు టొప్పు' నని చిఱునగవుతోఁ బ్రస్తావించి చనెను. పరమేశ్వరుఁ డావిషంబు నమృతప్రాయముగా మ్రింగెను.

మరల దేవదానవులు మథనక్రియకుఁ గడఁగిరి. అత్తఱిఁ గవ్వముగా నున్నమంథానపర్వతము పాతాళంబునకుఁ గ్రుంగెను. దానిని లేవనెత్త లేక వారెల్లరు దీనులై చేతులు పిసికికొన సాగిరి. ఎట్టకేలకు దేవతలు దామోదరుని బ్రార్థించిరి. విష్ణువు కూర్మరూపముఁ దాల్చి తఱిగొండను వీపున వహించి దుగ్ధసాగరంబునఁ బరుండెను. సురాసురులంత వేయిసంవత్సరంబు లహోరాత్రంబులు ద్రచ్చిరి. ఆసముద్రాంతమునుండి ధన్వంతరియు నప్సరసలు నుచ్చైశ్రవహయమును గౌస్తుభరత్నము నమృతము నొక్కొక్కటిగా వెడలెను. అమృతార్థము దేవదానవులకు ఘోరసంగ్రామ మొనరెను. విష్ణువు మోహినీరూపంబున వచ్చి సుధారసమును హరించెను. దేవతలు విజృంభించి దానవులను ద్రచ్చి వందఱలాడిరి.

దితి తనసుతవినాశనంబుకుఁగా వెలవెల్లనై వెచ్చనూర్చి కాశ్యపునితో 'నాథా ! సవతికొడుకులు నాసుతుల నోర్చి వధించిరి. ఇది దుస్సహము. ఇంద్రుని జయింపనోపుపట్టిని నాకుఁ బ్రసాదింపు' మని వేఁడెను. ఆముని యట్లేవరమిచ్చి తత్సిద్ధికిఁగాఁ బరిశుద్ధమనంబునఁ దపంబొనర్పు మని చెప్పి నిజతపశ్చరణార్థము చనెను. పతివచనముఁబట్టి దితి కృతనిశ్చయయై కుశ ప్లవంబున దారుణతపం బొనర్పసాగెను. దేవేంద్రుఁడటకువచ్చి యగ్ని సమిత్కుశజలంబులను గందమూలంబులను సమకూర్చుచు నామె నుపచరించు చుండెను. ఇట్లు తొమ్మిదివందలతొంబదిసంవత్సరములు చనెను. దితి వాని పరిచర్యకు మెచ్చి 'ఇంద్రా ! నాతపంబిఁకఁ బదియేండ్లకు నిండారును. నీతండ్రివరముమేరకు నాగర్భంబున లోకోత్తరపురుషుఁడు జనించును. జయోత్సుకుఁడైన యాపట్టిని నీయెడ సమాధానపఱతు. త్రైలోక్య విజ యుఁడైన యాతమ్మునిఁ గూడి సుఖముండు'మని వచించి నాఁటి మధ్యాహ్న ము ప్రొల్మొలి తలగడవంక పాదము లుంచి నిద్రించెను. అపసవ్యంబుగాఁ బరుండుటఁజేసి దితియశుచియగుట యింద్రుఁడు గాంచి సమయమువొరకి నందులకు సంతసించి యోనిమార్గంబున నామెగర్భముఁ జొచ్చి యందున్న పిండమును సప్తఖండములుగా వజ్రంబునఁ దుండించెను. కులిశహతులకుఁ బిండము విలపించెను. అప్పుడు దితి మేల్కాంచి సంగతి గ్రహించి 'ఖం డింపకు ఖండింపకు' మని యింద్రుని బ్రతిమాలెను. పాకశాసనుఁడు గర్భ మునుండి వెడలివచ్చి 'తల్లీ ! నీగర్భంబున శక్రహంత జనింపనుండుట వింటిని; నాఁడుసుత వెఱపు దోఁచి యిన్నాళ్ళు కాచితిని. అపసవ్యంబుగా నిద్రిం చుటంజేసి యశుచివైతివి. అది యవకాశముగా నీసుతుని భేదించితిని. ఆత్మరక్షణ మెల్లరకుఁ గర్తవ్యము. తదర్థమిట్లు చేయవలసివచ్చెను. ఒండు తలంపకు ; క్షమింపు' మనెను.

ఆకార్యంబునకు దితి లోలోన మలమలమఱుగుచుండియు నింద్రుఁడు దురాధర్షుఁడైనకతన వానికిఁ గినియనోడి 'బలసూదనా ! నాయపచారమింత తెచ్చెను. ఇందు నీదోషమేమియు లేదు. చన్నదానికై వగచియు ఫలము లేదు. అయిన నొండు ప్రియంబు నీవలనఁ గోరుదు. ఈసప్తఖండంబులు దివ్యరూపములు దాల్చి సప్తమారుతులై వాతస్కంధంబున సప్తవాయు

స్థానంబు లధిష్ఠించి యందొకటి బ్రహ్మలోకంబునను రెండవది స్వర్గంబునను మూఁడవది యంతరిక్షంబునను దక్కినవినాల్గును నాల్గుదిశలను బాలించుటకు నను గ్రహింపుము' అని యాచించెను. సురేంద్రుఁ డందులకు సమ్మతించె నట. నాఁడు దితి తపంబొనర్చినచోటనే విశాలానగరమును నిర్మించిరి.

వత్సా! విశాలానగర ప్రదేశమాహాత్మ్యమును జెప్పితిని. దాని కా పేరు వచ్చినవిధము వినుము. ఇక్ష్వాకువంశ్యుఁడు అలంబుసుఁడను వాఁ డుండెను. వానికి విశాలుఁడను సుతుఁడు జనించెను. అతఁడు తనపేర నప్పురంబును నిర్మించెను. విశాలునకు హేమచంద్రుఁడు వానికి సుచంద్రుఁడు, వానికి ధూమ్రాశ్వుఁడు, వానికి సృంజయుఁడు, వానికి సహదేవుఁడు, వానికిఁ గుశాశ్వుఁడు వానికి సోమదత్తుఁడు, వానికిఁ గాకు త్స్థుఁడు, వానికి సుమతి జనించిరి. ఆసుమతి యిప్పుడు విశాలానగరంబున నున్నాఁడు వీరెల్లరు వైశాలికులనఁ బ్రసిద్ధిగాంచి ధర్మతత్పరులై దీర్ఘకాలము మనిరి. ఈరాత్రి యందు విశ్రమించి యెల్లి మిథిలకుఁ బోవుదము.

గాధేయుఁ డట్లు చెప్పుచుండఁగాఁ విశాలానగరము సమీపించెను. విశ్వామిత్రాదులువచ్చుట సుమతి చారులవలన విని యెదురేగి మహర్షికిఁ బూజలొనర్చి, వానిపార్శ్వంబున ధనుఃఖడ్గతూణీరధారులై సముపస్థిత యౌ వనంబున నివ్వటిల్లుచు సౌందర్యంబున నశ్వినులఁ బోలి మూర్తీభవించిన పరా క్రమదేవతలోయన నొప్పారుచున్న రాకుమారులఁగాంచి 'మునీంద్రా! ఎవరు వీరు? ప్రమాణేంగితచేష్టితంబుల నియ్యిరువురును బరస్పరసదృశులై వెల యుచుసు. పాదచారులై వీరిందు రానేల?' అని యడిగెను. గాధేయుఁడు వారివృత్తాంతము చెప్పెను. సుమతి యత్యధికప్రమోద మొంది రామ లక్ష్మణుల నెంతయుఁ గారవించెను. అట్లు కౌశికుఁడును రాసుతులును సుమతిసత్కృ లంది యారేయి యందు బుచ్చి తెల్లవాటి మిథిలాభిముఖుఁడై తరలిరి.

అహల్య.

వారట్లు పోవుచుండఁగా మార్గమధ్యంబున మహారమ్యమైనయుపవనం బొండు గానవచ్చెను. ఆవన మంతమనోహరముగానున్నను నందు నరసం చార మనుమాట గానరాకుండెను. అది వింతదోఁప 'మహాత్మా! ఇది

ఋష్యాశ్రమముగాఁ దోఁచుచున్నది. ఇట్లుండియు నిచ్చట మును లెవ్వరును గానరారు. కారణ మేమో యూహింపరాకున్న' దనెను.

'వత్సా! ఇది గౌతమాశ్రమము. ఆఋషి యింట లేనితఱి వజ్రి గౌతమవేషంబున నిటకు వచ్చి యతనిభార్యయైనయహల్యను డాసి 'విలాసినీ! నామనంబు సేయుము. కాముకులు ఋతుకాలంబును బ్రతీక్షింప' రనెను. అతఁ డింద్రుఁ డగుట యాదుష్టమతి యెఱింగియు సురరాజకుతూహల ప్రేరితయై తదభీష్టముఁ దీర్చి 'నిర్జరేశ్వరా! నీవలనఁ గృతార్థనైతిని; హుటాహుటి నపక్రాంతుఁడవగుము. ఉభయరక్షణముఁ గార్య' మని చెప్పెను. శచీపతియు నాత్మసంతోషంబును తెలిపి పర్ణశాలనుండి చనుచుండెను. అంతలోన గౌతముఁడు వానికెదురై యాకుహనావేషధారిని గుర్తించి 'దుర్మతీ! నాపరోక్షమున నారూపు దాల్చి యకార్య మొనర్చితివి గావున విఫలుండవగు' మని శపించెను. ఆమాటతోఁడ నింద్రుని వృషణంబులు నేలరాలెను. గౌతముఁడు పర్ణశాలఁజొచ్చి భార్యను బిలిచి 'పాపినీ! కామమోహితవైతివి; తగుప్రాయశ్చిత్తమునఁ గాని నీకుఁ బరిశుద్ధి గలుగదు. వాయుభక్షణమాత్రురాలవై భస్మశయన మాశ్రయించి యదృశ్యరూపంబున నిట వర్షసహస్రముండుము. దశరథాత్మజుఁడు రాముఁడిందు వచ్చును. వానికి నాతిథ్య మొసంగుము. ఆపుణ్యవిశేషంబున నీలోభమోహంబు లెడసిపోవును. పవిత్రీకృతవై యప్పుడు యథారూపంబున నాకడఁ జేరుదువుగాక' యని యాఋషీంద్రుఁ డచ్చోటు వదలి సిద్ధచారణసేవితం బగుహిమవంతంబునకుఁ జనెను.' అని విశ్వామిత్రుఁడు వచించెను.

వారట్లు మాటాడుచు నాశ్రమముఁ జొచ్చిరి. ఎవతె పుట్టువుదొట్టి నిర్మాతృప్రయత్నసారమోయన నొప్పి తపఃప్రభామండలంబున నయ్యాశ్రమంబెల్ల వెలిగించుచు సురాసురులకుఁ గూడఁ దేఱిచూడరాకయుండెనో ఏకాంతామణి పతిశాపవశంబునఁ దుషారమేఘంబు చాటున దోఁచుపూర్ణచంద్రప్రభవోలె ధూమ పరీతయైన యగ్నిశిఖచందంబున జలాంతర సూర్యకాంతివలె, వేయిసంవత్సరములుండెనో యాయహల్య రామపాదధూళి సోకినంత నేస్వస్వరూపము దాల్చి శోభిల్లి తనశాపావధిని గ్రహించి వారికి నాతిథేయసత్కారము లొనర్చి రాము నిట్లు స్తుతించెను.

## అహల్యాస్తవము.

"అహో! కృతార్థోఽస్మి జగన్నివాస! తే
పదాబ్జసంలగ్నరజః కణా దహం;
స్పృశామి య త్పద్మజశంకరాదిభిః
విమృగ్యతే రంధితమానసై స్సదా॥ 1

అహో! విచిత్రం తవ రామ! చేష్టితం
మనుష్యభావేన విమోహితం జగత్,
చర స్యజస్రం చరణాదివర్జితః
సంపూర్ణ ఆనందమయోఽతిమాయికః॥ 2

యత్పాదపంకజపరాగపవిత్రగాత్రా
భాగీరథీ భవవిరించిముఖాన్ పునాతి,
సాక్షా త్స ఏవ మమ దృగ్విషయో యదాస్తే
కిం వర్ణ్యతే మమ పురాకృతభాగధేయమ్॥ 3

మర్త్యావతారే మనుజాకృతిం హరిం
రామాభిధేయం రమణీయదేహినం
ధనుర్ధరం పద్మవిశాలలోచనం
భజామి నిత్యం న పరాన్ భజిష్యే!॥ 4

య త్పాదపంకజరజః శ్రుతిభి ర్విమృగ్యం
య న్నాభిపంకజభవః కమలాసన శ్చ
య న్నామసారరసికో భగవాన్ పురారిః
తం రామచంద్ర మనిశం హృది భావయామి॥ 5

య స్యావతారచరితాని విరించిలోకే
గాయంతి నారదముఖా భవపద్మజాద్యాః
ఆనందజాశ్రుపరిషిక్తకుచాగ్రసీమా
వాగీశ్వరీ చ త మహం శరణం ప్రపద్యే॥ 6

సోఽయం పరాత్మా పురుషః పురాణః
ఏష స్వయంజ్యోతి రనంత ఆద్యః
మాయాతనుం లోకవిమోహనీయాం
ధత్తే పరానుగ్రహ ఏష రామః॥ 7

అయం హి విశ్వోద్భవసంయమానా
మేకః స్వమాయాగుణబింబితో యః
విరించి విష్ణ్వీశ్వరనామభేదాన్
ధత్తే స్వతంత్రః పరిపూర్ణ ఆత్మా॥ 8

నమోఽస్తు తే రామ! తవాంఘ్రిపంకజం
శ్రియా ధృతం వక్షసి లాలితం ప్రియాత్
ఆక్రాంత మేకేన జగత్త్రయం పురా
ధ్యేయం మునీంద్రై రభిమానవర్జితైః॥

జగతా మాదిభూత స్త్వం జగత్త్వం జగదాశ్రయః
సర్వభూతే ష్వసంయుక్త ఏకో భాతి భవాన్ పరః॥ 10

ఓంకారవాచ్య స్త్వం రామ! వాచా మవిషయః పుమాన్
వాచ్యవాచకభేదేన భవా నేవ జగన్మయః॥ 11

కార్యకారణకర్తృత్వఫలసాధనభేదతః
ఏకో విభాతి రామ! త్వం మాయయా బహురూపయా॥ 12

త్వన్మాయామోహితధియా స్త్వాం న జానంతి తత్త్వతః
మానుషం త్వా మభిమన్యంతే మాయినం పరమేశ్వరమ్॥ 13

ఆకాశవ త్త్వం సర్వత్ర బహిరంతర్గతోఽమలః
అసంగోఽహ్యచలో నిత్యశుద్ధబుద్ధః సదవ్యయః॥ 14

యోషి న్మూఢాహ మజ్ఞాతే తత్త్వం జానే కథం విభో
తస్మా త్తే శతశో రామ! నమస్కుర్యా మనన్యధీః॥ 15

దేవ! మే యత్ర కుత్రాపి స్థితయా అపి సర్వదా
త్వత్పాదకమలే సక్తా భక్తి రేవ సదాస్తు మే॥ 16

నమస్తే పురుషాధ్యక్ష ! నమస్తే భక్తవత్సల !
నమస్తేఽస్తు హృషీకేశ! నారాయణ నమోఽస్తుతే॥ 17

భవ భయహర మేకం భానుకోటిప్రకాశం
కరధృతశరచాపం కాలమేఘావభాసం
కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం
కమలవిశదనేత్రం సానుజం రామమీడే॥ 18

రామలక్ష్మణులంత నామెకు మ్రొక్కి చనుచుండిరి. అంతలోన గౌతమమహర్షియు నటకు వచ్చి స్వతపోబలంబునను రామసందర్శనంబునను విశుద్ధయై యున్నయహల్యను గ్రహించి గాధేయునకును దాశరథికిని యథోచితమర్యాదలు గావించెను. రామలక్ష్మణులు గౌతమునకు మ్రొక్కి తదనుజ్ఞాతులై విశ్వామిత్రునివెంట నీశాన్యదిక్కు పట్టి చని జనకునియజ్ఞవాటిఁ జేరిరి.

జనకుని యజ్ఞము.

ఆ యజ్ఞశాల "యనవరతపదక్రమపఠ్యమాన మహాద్విజవేదధ్వనులను నవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రస్వాహాశబ్దంబులను ననేకమునిగణప్రణీతవచనవిషయవిభాగ వినిర్ణయన్యాయ నిపుణవిద్వత్సభాసంభాషణఘోషంబులను బ్రతిపక్షదుర్విభేదప్రమాణ విచార్యమాణవేదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగప్రవీణులైన యాజ్ఞికులతో మహాతపోధనులతో" నగ్నిహోత్రసంభారశకటీశతంబుతో నిండి యుండెను. రామాదులకు నట విడియుటకేని తావుదొరకదయ్యెను. వారది గాంచి కొండొకవివిక్తప్రదేశంబున బస చేసిరి.

జనకమహారాజు విశ్వామిత్రాగమనంబు విని శతానందునితోడఁ జని యాఋషికి ఋత్విక్పూజలు గావించి యర్ఘ్యాదు లర్పించి సంభావితుఁడై "మునీశ్వరా ! దేవతలకృపవలన యజ్ఞము యథావిధి వర్తిల్లుచున్నది. మీ రాక యాగఫలంబుగా భావింతు. ధన్యుఁడనైతిని. క్రతుకార్య మింకను ద్వాదశదివసంబులు జరుగవలయుననియు భాగార్థులైన దేవతలసందర్శనము యజ్ఞాంతమునఁగాని సిద్ధింపదనియు విబుధులు వచింతు' రని వచించి గాధేయునిచెంత నున్న రాకుమారులఁ జూచి

సీ॥ కనుపండువొనరించు కలికికాంతులతోడఁ
జంద్రమండలనిభాస్యములతోడ
శ్రవణాంతదీర్ఘ నేత్రాంబుజములతోడ
సమదసింహపరాక్రమములతోడ
గజరాజగమనవైఖరిమించు నడతోడఁ
గమనీయకాకపక్షములతోడఁ
గవలకుసాటియై గ్రాలుమూర్తులతోడఁ
శరగతచాపఖడ్గములతోడ

తే॥ నవతరించిన సురవర్యులనఁగ నొప్పి
సూర్యచంద్రులదీప్తికి శోభగూర్చు
సురుచిరాకారవిజ్ఞానశుద్ధమతులు
వీర లెవ్వరో విన నోర్తు విశ్రుతాత్మ ! ॥

అని యడిగెను. విశ్వామిత్రుఁడు మందస్మితవదనారవిందుఁడై 'జనక రాజా!

సీ॥ తాటక మర్దించి తాపసకోటికిఁ
బ్రాణదాన మిడిన దాతృవరులు
మారీచుని సుబాహు ఘోరాజిఁ బోకార్చి
సవనంబుఁ గాచిన శౌర్యనిధులు
పాదాంబురుహధూళిఁ బాపంబు నెడయించి
యహల్యను దేర్చినట్టిఘనులు
దశరథావనినాథు తపము ఫలింపఁగా
నవతరించిన యనఘాత్మవరులు

తే॥ కాలకంఠునిచాపంబుఁ గాంచువేడ్క
నిందు వచ్చినధార్మికశుద్ధచరిత !
రమ్యసుగుణాభిరాముఁడు రాముఁ డితఁడు
మిత్రవంశవర్ధనుఁడు సౌమిత్రి యితఁడు॥

అని వచించెను. ఆవచనంబులు సుధామయములై దోఁప శతానందుఁడు పరమానంద మొంది 'నాతల్లి యహల్యాదేవి కృతార్థయయ్యెనా ? ఆమె సపర్యలు గాంచితిరిగదా. నాతండ్రియైన గౌతముని సత్కృతులందెఁ గదా'

యనెను. 'శతానందా! ఆసంగతి యడుగవలయునా? రేవణాదేవి భార్గవునిఁబోలె నహల్యాదేవి గౌతమునిగూడె' నని గాధేయుఁడు చెప్పెను.

అంత శతానందుఁడు రామలక్ష్మణులకు స్వాగతము పలికి 'ఈమహర్షి తోడ మీరిటకు వచ్చుట దైవయోగము గాని వేఱుగాదు. ఈయనఘుఁడేత న్మాత్రుఁడు గాఁడు. వీని చరిత్రము లోకోత్తరమై మముబోంట్లకు మార్గ ప్రదీపకముగానుండును. ఇట్టియచింత్యతపోమహిమాఢ్యుఁడు బ్రహ్మర్షి మీకు రక్షకుఁడును శుభదాయకుఁడు నగుట మీరుధన్యులరని వచింప నేల? ఈ మహామహునియుదంతము సంగ్రహముగా వచింతు వినుము.

### విశ్వామిత్రుని చరిత్ర

బ్రహ్మకుఁ గుశుఁడు వానికిఁ గుశనాభుఁడు వానికి గాధియు జనించిరి. ఆగాధికీమహానీయుఁ డుదయించెను. ఈపుణ్యమూర్తి బాల్యమందే సమస్తవిద్యలు గఱచి ధర్మజ్ఞుఁడును ధర్మాత్ముఁడునై ప్రజాహితంబుగా రాజ్యమేలుచుండెను. ఒకనాఁడు వేఁటతమకము చెలరేఁగగా నీయనఘుఁడు చతురంగబలంబుఁ గూర్చి యక్షౌహిణీ సేనాసమావృతుఁడై తరలి నదీనదంబులు సేవించుచు నానానగరంబులు విలోకించుచు వివిధపుణ్యాశ్రమంబులు సందర్శించుచుఁ జనిచని బహువృక్షవ్యాకీర్ణము సిద్ధచారణసేవితము దేవదానవకిన్నరాది సంశోభితమునై వాతాంబుపర్ణమూలాశనంబుల మనుచు జపహోమక్రియలఁ దవిలియున్న వాలఖిల్యవైఖానసాదిమహర్షులచేతను బ్రహర్షులచేతను వేది వహ్నులకరణిఁ దేజరిల్లుచున్న తపస్సిద్ధులచేతను నిండి యపర బ్రహ్మలోకము వలె నున్న వసిష్ఠాశ్రమము చొచ్చెను. వసిష్ఠుఁ డీమునీంద్రునకు స్వాగతమిచ్చి యుచితాసనఫలమూలాదిసత్కారంబుల నిమ్మహాత్ముని బడలికలు వాపి యెంతయు మన్నించెను. ఉభయులును శుభకథలఁ దడవు పుచ్చిరి. అంత వసిష్ఠుఁడు దరహాసపూర్వకంబుగా 'రాజా! అతిథిశ్రేష్ఠుఁడవును బూజనీయుఁడవునైన నీవు మాకు విందవైతివి. ఇది మాప్రాప్తము. కొండంతదేవరకుఁ గొండంతపత్రి పెట్టఁజాలరు. నాయలఁతిసత్కారంబులను నీవు నీచతురంగబలసమేతంబుగా గ్రహించి నన్ను సంతోషపెట్టఁగోరుదు' ననెను. వసిష్ఠునియౌదార్యంబునకు నీయన సంతసించి 'మునీంద్రా! మీ సందర్శనమాత్రాననే మాకు సమస్తముఁ జేకూరెను. మీప్రేమయేఁ జాలు

పోయివచ్చెదొ' ననెను. వసిష్ఠుఁ డంతత్తో మిన్నకుండక పట్టుపట్టెను. ఎట్టకేల కీయనఘుఁడు వాని ప్రణయ మంగీకరించెను.

వసిష్ఠ విశ్వామిత్రుల వైరము.

వసిష్ఠుఁ డంత శబల యను తనధేనువును బిలిచి 'వత్సా! విశ్వామిత్ర రాజమౌళికి సేనాసహితంబుగా నాతిథ్యమును నిశ్చయించితిని. షడ్రసోపేతములైన సమస్తభోజనపదార్థములఁ గూర్పు' మనెను. మాటతోడ మకరందములు నిక్షురసంబులును వివిధపానకంబులును నానాభక్ష్యవిశేషంబులును దధిక్షీరఘృతంబులును సూపంబులును బహురూపంబులైన యుపదంశంబులును మితిమీఱ సిద్ధమయ్యెను. ఈమాననీయుఁడు సబలంబుగా విందారగించి సంతుష్టుఁడై 'ఋషిచంద్రమా! రాజు రత్నహారి యనుట సుప్రసిద్ధము. నీహోమధేనురత్నంబును గోరితిని. ఇది ధర్మవ్యతిక్రమముగాదు. నీహోమాదిక్రియలకుఁ దఱుగులేకుండుటకుఁగా లక్షగోవు లిత్తును. శబలాధేనువును నాకొసంగు' మని యడిగెను. అదివిని 'రాజేంద్రా! మానవంతునకుఁ గీర్తివలె నాకీశబల యున్నది లక్షగాదు నూఱుకోట్లు గోవుల నిచ్చినను రజితరాసులఁ గుమ్మరించినను దీని నీయనోపను. హవ్యకవ్యంబులు నగ్నిహోత్రంబులును బలిహోమంబులు నవియివి యననేల నాజీవయాత్రయంతయు దీనియధీనము. ఇదే నాసర్వస్వ' మని వసిష్ఠుడుపలికెను. ఈధీరాగ్రణి యంతతోఁ దనవిచెందక 'మునీంద్రా! ఇది రాజదృష్టి నాకర్షించెను. నీవు మోడిసేయుట యుక్తముగాదు. సర్వభూషణభూషితంబులైన గజంబుల నాలుగువేలును, హేమకింకిణీకలితహయోత్తమంబులతోడి సువర్ణరథంబుల నెనిమిదివందలును, వాజిరత్నంబులఁ బదునొకండువేలును, గోవుల నొక్కకోటియు, నీకొసంగుదును. మాఱుతలంపక యీశబలనిచ్చి నాకు సంతోషము' గూర్పుము. ఉచితంబుగా బ్రాహ్మణధనంబును గ్రహింపరాదు. ఏదికోరినను బదులాడక యిత్తు' ననెను. ఎన్నివిధముల బ్రబోధించినను వసిష్ఠుఁ డియ్యకొనక 'రాజా! నాకు సకలకర్మాధారభూతయుఁ గామదోగ్ధ్రియు నైనయీగోవును నీవు గోరుట తగదు. నీరాజ్యమెల్ల నర్పించినను దీనినిఁ బాయఁజాల' నని ఖచితముగా బదులాడెను.

ఈగాధేయుఁ డందులకుఁ గోపోద్వేగియై గోవును బలాత్కారంబుగాఁ గొంపోవ నుంకించెను. అది విచారకృశయై 'కటా! దీనురాలిని నన్నిట్లు రాజు బలాత్కరించుటఁ గన్నారఁ జూచుచు వసిష్ఠభగవానుఁడు మిన్నకున్నాఁడు. ఈమహానుభావుఁడు నన్నుఁ ద్యజించెఁ గాఁబోలు. మహర్షి కి నే నేమి యెగ్గొనర్చితి? భక్తిపై బ్రియంబులు గూర్తుఁగదా?' యని లోలోనవంది వెచ్చనూర్చి తన్ను చుట్టియున్న భటవర్గంబును విదళించివైచి కుప్పించియెగచి వసిష్ఠునిపాదమూలముఁ జేరి 'బ్రహ్మపుత్త్రా! నీకట్టెదుట నన్నిట్లు రాజభటులు బలవంతముగాఁ గొనిపోవనున్నారు. నీ శబలను విడనాడితివా?' యని వ్యసనకలుషితస్వరంబునఁ బలికెను. వసిష్ఠుఁ డామాటలు విని 'శబలా! నాకెట్టి యపకారమునుఁ జేయవు; నిన్నుఁ ద్యజించిన వాఁడఁ గాను. ఈ ఱేఁడు మహాబలశాలి; ఇతనినోర్చుబలము నాకుఁ గలుగదు. ఏమి సేయ నగు' ననెను. అందులకు శబలాధేనువు జోటజోట కన్నీరు నించి 'బ్రహ్మబలమే బలముగాని క్షత్త్రబలము నొకబలమా? మహాత్మా! నీబల మప్రమేయము; నీతేజస్సుదురాసదము. భవదీయబలసంభృతనైన నన్ను నియోగింపుము; ఇతనిబలదర్పంబులఁ జూతు; రాజులకుఁ గఱటిదనము గారాదని యితఁ డెఱుంగుఁగాక' యని విన్నవించెను. వసిష్ఠుఁడు తలయూఁచి మిన్నకుండెను.

అంత శబలాధేనువు హుంభారవముఁ గావించెను. ఆశబ్దముతోడఁ దండోపతండములుగాఁ బప్లవు లుప్పతిల్లి యీరాజసైన్యంబును రూపుమాపిరి. ఈధార్మికోత్తముఁడు కోపోద్దీపితుఁడై రథ మధిష్ఠించి నానాస్త్రంబులఁ బప్లవులనుసంహరించెను. శబలాధేనువు మరల హుంభారావముఁగావించెను. ఆరావముతోడ హేమకింజల్క దేహచ్ఛాయా శుభగులును సువర్ణాంబరధరులునైన యవనశకులు వేనవేలుగా నుద్భవించి నిడుదుకైదువులు దొడవి తేజోవీర్యరాసులోయన నొప్పుచుఁ జెలరేఁగి రాజబలశేషంబును దాఁకి దానినెల్ల నిర్దగ్ధ మొనర్చిరి. ఈగాధేయుఁ డది గాంచి మహోగ్రుఁడై వివిధాయుధంబులఁ గురిపించి వారిని మట్టుపెట్టెను. శబల మరల హుంభాయనెను. దాని పొదుగునుండి పప్లవులును, యోనినుండి యవనులును శకృత్తునుండి శకులును రోమకూపంబునుండి మ్లేచ్ఛకిరాతహారీతకులును ముఖంబునుండి సూర్యాగ్నిదీప్తిమంతులైన కాంభోజులును జనించి వైరి

మూలబలంబును ముట్టడించి దానినెల్ల నుగ్గునూచ మొనర్చిరి. కౌశికుని తనయులు నూర్వురు నదిగాంచి యాగ్రహావివశులై యాయుధంబులఁ గొని వసిష్ఠునిమీఁదికి నుఱికిరి. ఆ తాపసి హుంకరించెను. వారుభస్మీభూతులైరి.

విశ్వామిత్రుఁడు రాజ్యమును సన్యసించుట.

పుత్త్రనిరయంబునుగాంచి యీ గాధేయుఁడు గోరలుతీసినసర్పంబు పగిది నుత్తతియుడిగిన సముద్రముక్రియ రాహుగ్రస్తమైన సూర్యబింబము వలె నుద్వేగదర్పతేజంబులు మాని లజ్జించి ఱెక్కలు దుల్చినపక్షివలె నిరాధారుఁడై హతుశేషుఁడైన తనతనయునకు రాజ్యమప్పగించి హిమవత్పర్వతంబునకుఁ జని యట మహేశ్వరునిగూర్చి ఘోరతపంబు గావించెను. ఆముక్కంటిప్రసన్నుఁడై వరముగోరుమనెను. ఈధృఢవ్రతుఁడు ధూర్జటికి మ్రొక్కి 'దేవా! నాతపంబును మెచ్చితివేని నాకుధనుర్వేదంబును సాంగోపాంగంబుగా సరహస్యంబుగా నను గ్రహింపుము. మఱియు దేవ దానవ యక్షరక్షోగంధర్వమహర్షులయందుఁ గలసర్వాస్త్రంబులు నాకు స్ఫురించునట్లుఁ గరుణింపు' మనెను. పరమేశ్వరుఁడు నట్లే యగుఁగాక అని పలికి యంతర్హితుఁ డయ్యెను.

విశ్వామిత్రుఁను మరల వసిష్ఠుని దార్కొనుట.

ఈధీరుఁ డంత హరవరగర్వోద్ధతుఁడై పర్వకాలసముద్రముభంగి విజృంభించి వసిష్ఠాశ్రమపదముఁ జొచ్చి సర్వదహనశీలంబులైనయస్త్రంబుల దానిని దగులఁ బెట్టెను. ఆవేడిమికి నయ్యాశ్రమవాసులు పాఱఁజొచ్చిరి. అందలిమృగపక్షిజాతంబు లుదిలకొని వెఱవు దోఁపక దుముకుచు నెగయుచు నఱచుచుఁ బడిచచ్చెను; క్షణములో నయ్యాశ్రమమెల్ల నిర్జీవమై యూసర క్షేత్రముగా మాఱెను. వసిష్ఠుఁ డది గాంచి పఱచుచున్నతనశిష్యవర్గంబును మరల్చి యాయుద్ధతునివంక మరలి రోషావేశుఁడై 'మూఢా! చిరసంవృద్ధమైన యాశ్రమంబును బాడుచేసితివి; ఇఁక నీజీవము దుర్లభ' మని పలికి ప్రళయాగ్నికరణి వెలుఁగుచున్నదియు యమదండంబును బోనిదియు నైన తనదండంబును జేఁబూనెను. ఈధార్మికోత్తముఁడు వాని నదల్చి యతనిపై నాగ్నేయాస్త్రంబును వైచెను. వసిష్ఠుఁడు నిజదండంబును విసరి 'క్షత్త్రియాధమా! చూపు నీసామర్థ్య' మనెను. జలంబుల నగ్నివలె బ్రహ్మ

దండబున నాగ్నేయాస్త్రము శమించెను. ఈకుశికనందనుఁడు వెల్లఁ గినిసి వారుణాస్త్రంబును రౌద్రాస్త్రంబును ఐంద్రాస్త్రంబును పాశుపతంబును ఐషీకాస్త్రంబును మానవమోహనాస్త్రంబులను గాంధర్వాస్త్రంబునుస్వాపన జృంభణ మారణ సంతాపన విలాపన శోషణ దారుణాస్త్రంబులను వజ్రాస్త్రంబును బ్రహ్మపాశ కాలపాశ వరుణపాశంబులను పైనాక దైవతంబులను శుష్కార్ద్రి దండ పైశాచ క్రౌంచంబులను ధరచక్ర కాలచక్ర విష్ణుచక్రంబులను వాయవ్య మథన హయశిరోనామకాస్త్రంబులను గంకాల ముసలంబులను శక్తిద్వయంబును వైద్యాధర కాలాస్త్రంబులను త్రిశూల కాపాల కంకణంబులను దదితరంబులైన నానాస్త్రంబులను బరఁగించెను. వసిష్ఠుఁడు వాని నెల్ల దనదండంబునహరించెను. ఈవీరాగ్రణియుపాయాంతరము గానక తెంపు వహించి బ్రహ్మాస్త్రంబును బ్రయోగించెను. దేవతులును దేవర్షి గంధర్వాదులును సంభ్రాంతులైరి; ముల్లోకంబులుడ్డుడికెను. వసిష్ఠుఁ డంతఁ ద్రైలోక్య మోహనంబును మహారౌద్రంబునైన రూపముఁ దాల్చి నిజ తపోవిశేషసముపలక్షితంబైనయాబ్రహ్మదండంబునఁ దద్బ్రహ్మాస్త్రంబును మ్రింగెను. వాని రోమకూపంబునుండి ధూమజ్వాలలురికెను; బ్రహ్మదండము విధూమకాలాగ్ని కరణిఁ బ్రజ్వరిల్లెను. మును లెల్లరు విషాదపరులై గుమికూడి వచ్చి 'మహాత్మా! నీబలమమోఘము; విశ్వామిత్రుఁడు నిగృహీతుఁడు ; శాంతింపుము; బ్రహ్మాస్త్రంబును బ్రశాంత మొనర్పు' మని వేడిరి. ఆబ్రహ్మర్షి యట్లొనర్చెను. ఈ యుక్కరి నిజపరాభవంబునకు నిట్టూర్పులు పుచ్చి 'అహో! హరవరదత్తంబులైన మహాస్త్రంబులుగూడ నిమ్మునిమ్రోల మస్తకములు వ్రాల్చెఁగదా బ్రహ్మబలమే బలము. ఛీ! క్షత్రబలమునొకబలమా? నిజము గ్రహించితి' నని విసివి క్షత్రధర్మంబును నిరసించి భార్యాసమేతుఁడై దక్షిణదిశకుఁ జని బ్రహ్మత్వంబును గోరి నలువంగూర్చి వేయివత్సరంబులు మహోగ్రతపం బొనర్చెను. పితామహుఁడు ప్రసన్నుఁడై 'విశ్వామిత్రా! రాజర్షి వైతివి లెమ్మ' అని పలికి యంతర్హితుఁ డయ్యెను. ఆవచనంబుల కీఘనుఁడు సంతసింపక ఇంతయా మదీయతపఃఫలము' అని కటకటంబడి మగుడఁ గఠోర తపశ్చరణంబునకు దొరకొనెను.

విశ్వామిత్రుఁడు త్రిశంకునకు సశరీర స్వర్గ మిచ్చుట.

అయ్యవసరంబునఁ ద్రిశంకుఁ డనునిక్ష్వాకువంశ రాజుండెను. అతఁడు సశరీరదేవలోకప్రాప్తికై మఖ మొనర్పఁ గోరి తనసంకల్పంబును స్వ

కులాచార్యుఁడైన వసిష్ఠునకు విన్నవింపఁగా నాఋషిచంద్రుఁ డతని వీని 'రాజా! నీకోరిక దుర్లభము. ఈయూహమాను' మని హితముపదేశించెను. త్రిశంకుఁ డామాటఁ ద్రోసిపుచ్చి దక్షిణదిశకుఁ జని క్రతుకర్మసిద్ధికిఁగా వసిష్ఠపుత్త్రులకు నూర్వురకు మ్రొక్కి 'మునిపుత్త్రకులారా! మహాక్రతు వొండుసంకల్పించి వచ్చితిని. తన్నిర్వహణార్థము గురుపుత్త్రులను మిమ్ము వేడుదు' ననెను. సంగతి యేమని వారతని నడిగిరి. 'సశరీరదేవలోకప్రాప్తిఁ గోరి యందులకు నుఱవగు యజ్ఞంబుఁ గావింప నుద్దేశించితిని. తగు జన్నంబును నిర్దేశించి నావలన దానిఁ జేయించి నన్నుఁ జరితార్థుని నొనర్పుఁడు. నాగురువు వసిష్ఠుఁడు నాయాశయంబును నిరసించెను. కాన గత్యంతరముఁ గానక యంతటివారైన మిమ్ము నాశ్రయించితిని. ఇక్ష్వాకులకు వసిష్ఠుఁడే యెడుగడ. అట్లుండియు వారు నన్నను గ్రహింపరు. మీరే నాకిఁక దక్షు' లని మ్రొక్కెను. వాసిష్ఠు లాకతయెల్ల విని 'దుర్మతీ! ఆచార్యునిమాట రాజులు జవదాఁటరు. అందునను నీవు ఇక్ష్వాకువంశ్యుఁడవు; మాగురువు వసిష్ఠభగవానుఁ డేతన్మాత్రుఁడుగాఁడు. ఆయన కాదన్నది మావలన నగునా? నీ విట్లు చేయుటవలన గురువును దిరస్కరించినవాఁడవైతివి. నీజడబుద్ధిని మాని వెంటనే నీనగరంబునకుఁ బొమ్మ' నిరి. అతఁడు వారిహితవచనంబుల మన్నింపక 'గురువు నిరాకరించుఁగాక, గురుపుత్త్రులు తిరస్కరింతురుగాక; అన్యయాజకసాహాయ్యంబున నేని నాయర్థంబును సాధింతుఁగాని యుజ్జగింప' ననెను. వాసిష్ఠులు వానియవినయంబునకుఁ గోపగించి 'ఛీ! మూర్ఖా! చండాలుఁడ వగు' మని శపించిరి.

ఉ॥ ఆముని పుత్త్రకోపదహనార్చుల మాడుటనో యనంగఁ ద
ద్భూమిపు దేహమొందె మసిఁబూసినచందముఁ గట్టువస్త్రముల్
ధూమసవర్ణమయ్యె మెడఁదోఁగెడుభూషలు లోహమయ్యెఁ బ్రా
చీముఖమండలాగ్రమునఁ జేవులుగ్రమ్మెడు నంతలోపలన్.

త్రిశంకుఁడు తనచండాలత్వంబునకు ఖిన్నుఁడై నిజపరివారము నెల్లడించి యేకాకిగా నిమ్మహాత్మునికడకు వచ్చెను. ఈగాధేయుఁడు త్రిశంకువును గుఱుతించి 'వత్సా! సంగతి యేమ' ని యడిగెను. మహాత్మా! బొంకి యెఱుఁగ; క్షత్త్రధర్మంబు నుజ్జగింపను; పెక్కుజన్నంబులు గావించితిని; గురువులను బెద్దలను యథామతిఁ బూజింతును. ధర్మైకదృష్టిఁ బ్రజలను

బరిపాలింతును. ఇట్లుండియు నాకు నాగురువు వసిష్ఠులును వారిపుత్త్రులును బరితోషింపరు. పౌరుషము నిరర్థముగాఁ దోఁచెను. సర్వము దైవాధీనము; దైవోపహతుని నన్నుఁ బ్రసాదింపుము; నీకన్న దిక్కు గలుగదు.' అని దీనాలాపపూర్వకంబుగాఁ దనవృత్తాంత మెల్ల నెఱింగించెను. ఈ దయానిధి త్రిశంకునియెడఁ గనికర మూని 'వత్సా! భయపడకు; నేను రక్షకుఁడనై నీయభిమతంబుఁ గావింతు; ఈనీచండాలరూపంబుననే నీకు సశరీరస్వర్గప్రాప్తిఁ జేకూర్తు' నని వానికి నభయహస్తమిచ్చి తనపుత్త్రులను రప్పించి సుతులారా! వలయుయజ్ఞోపకరణంబుల సమకూర్పుము; నామాటఁగాఁ జెప్పి బహుశ్రుతులగు ఋషులను ఋత్విజ్మిత్రశిష్యవర్గంబుతోడ రావింపుఁడు; నావచనము నిరాకరించువానిని నాకెఱింగింపు' మని యాజ్ఞాపించెను.

వారు నానాదేశంబులకుఁ జని బ్రహ్మవేత్తలకు సంగతి తెలిపి వచ్చి 'నాయనా! మీయాజ్ఞ యొనర్చితిమి; ఎల్లరు రానున్నారు గాని మహోదరుఁడు మాత్రము రాఁడు. మఱియు వాసిష్ఠులు మాపిలుపు విని 'భళీభళీ! చేయునది యజ్ఞము, చేయువాఁడు చండాలుఁడు, చేయించునది క్షత్త్రియుఁడు; దేవతలు హవిర్భాగంబులఁ జేసేతల గ్రహింతురులే. విశ్వామిత్త్రుని యేలుబడిలోని బ్రాహ్మణమహనీయులు చండాలభోజన మారగించి సశరీరస్వర్గముఁ బడయుదురపో' యని పరిహాసించిరి. వారిగేలి యింతనరా' దని చెప్పిరి.

ఆమాటలు విని యాచండశాసనుఁడు మండిపడి 'ఔరా! తపశ్శాలిని నన్ను నిష్కారణంబుగా నిందించిరా? వాసిష్ఠులారా! మీగర్వము దుర్భరము. మీరు మీయపరాధానలభస్మీభూతులై యమలోకంబునకుఁ బోవుదురుగాక; మఱియు సప్తశతజన్మంబులు శవాశనులుగాఁ బుట్టి శ్వపచులై విరూపంబులతోఁ భూలోకంబునఁ జరింతురుగాక; మహోదరుఁడు లోకదూష్యుఁ డగుకిరాతుఁడగుగాక' యని వారిని శపించెను.

తక్కినఋష్యాదులు రెండుమూఁడుదినములలో వచ్చిచేరిరి. వారి నెల్లఁగూర్చి 'ఇతఁడు త్రిశంకుఁడు; ఇక్ష్వాకువంశజుఁడు; దయార్ద్రధర్మపరుఁడు. శాపవశంబున వీనికిఁ జండాలత్వము దాపురించెను. ఇతఁడు

సశరీరస్వర్గప్రాప్తిం గోరి నన్ను శరణొల్లెను ; మాట యిచ్చితిని ; తదర్థము క్రతువారంభింపు' మని యీయన చెప్పెను. వారామాట విని దిగాలుపడి యొండొరు గుసగుసలాడి 'కటా! ముప్పు దప్పదు ; పరమకోపనుఁడు ; అడ్డు చెప్పినచో శపించు' నని తలపోసికొని యెట్టకేలకు సమ్మతించిరి.

ఈయన యాజకుఁడై నిల్చెను. మంత్రకోవిదులు కల్పసూత్రప్రకారము సమస్తకర్మములను గావించి హవిర్భాగగ్రహణార్థము సర్వదేవతల నాహ్వానించిరి. ఎవ్వరు రారైరి. వేల్పులసమ్మెకట్టునకు గాధేయుఁడు క్రోధావిష్టుఁడై త్రిశంకునివంక మరలి 'వత్సా! ఇదిగో విశ్వామిత్రుఁడు స్వతపోమహిమంబున నిన్ను సశరీరంబుగా స్వర్గంబునకుఁ బంపుచున్నాఁడు, పోపొమ్ము' అనెను. ఎల్లరు నిర్నిమేషులై చూడసాగిరి ; త్రిశంకుఁడు శరీరముతోడ స్వర్గమునకుఁ దరలెను. అట దేవేంద్రుఁడువానిఁ జూచి 'త్రిశంకూ! ఇందుండఁదగవు; భూతలంబునకుఁబో ; మూఢా ! గురుశాసనధిక్కారఫలంబుగాఁ దలక్రిందుగాఁ బడు' మని పలికి వాని నందుండి త్రోసెను. త్రిశంకుడు దలక్రిందుగా వ్రాలుచు 'హా ! విశ్వామిత్రా ! హా! గాధేయా ! త్రాహి! త్రాహి' యనికుయ్యిడసాగెను. అయ్యార్తరావమును గాధేయుఁడు విని 'నిలు నిలు' మని పలికి యపరబ్రహ్మయో యన నూతనసృష్టికి దొడఁగి సప్తమహర్షులను సప్తవింశతినక్షత్రంబులను సృజించి రెండవయింద్రుని బుట్టించుటో స్వర్గమనింద్రమగుటో యొకటి తప్పదని నిశ్చయించుకొని నిర్జరనిర్మాణంబునకుఁ బ్రారంభించెను.

దేవతలు భీతిల్లి యాకౌశికునొద్దకు వచ్చి 'మునీంద్రా ! నీ వెఱుంగని ధర్మము గలుగదు. త్రిశంకుఁడు గురుశాపహతుఁడు. అట్టివాఁడు శరీరముతోడ దివికి రాఁజన' దని సానునయంబుగా వచించిరి. ఈయన తలయూచి నామాటవమ్ము గారాదు ; మిమ్ముఁ జిన్నపుచ్చఁ గూడదు. నానిర్మించిన నక్షత్రాదులు లోకంబులున్నంతకాలము శాశ్వతంబుగా నుండవలయును. ఇదిమీకు సమ్మతమేని నాయుద్యమము నుజ్జగింతు' ననెను. వారు బదులాడనోడి 'అట్లేయగుఁగాక; అయిన నొక్కటి కోరుదుము. నీనిర్మించిన నక్షత్రంబులు జ్యోతిశ్చక్రంబు వెలుపల నుండుఁగాక; త్రిశంకుఁడు వాని మధ్యదలక్రిందుగా నమరతేజంబునఁ దనరారుగాక! వాని నవియటు స్వర్గంబున బలె ననుసరించుఁగాక' యనిరి. ఈయన సమాధానపడెను. యజ్ఞమటు పరిసమాప్తమయ్యెను. అనంతర మీ తపోధనుఁడు యజ్ఞార్థము వచ్చిన

మునులను బంపివైచి యాశ్రమవాసులను బిలిచి 'నిర్విఘ్నతపశ్చరణముఁ గోరి యిందు వచ్చితిని. ఇట నాసంకల్పము భంగమయ్యెను. పశ్చిమదిశయందుఁ బుష్కరతీర్థములతో నిండినదివ్యతపోవనంబులు గలవు. అందు జనుద' మని వారిని వెంటఁగొని తరలి యచ్చోటుచేరి యందు

సీ॥ నీహారనిర్మలనీరముల్ గలచోటు
ఫలమూలబుద్ధమై మలయుచోటు
నీడయిరుల్ గప్పి నింపాదియగుచోటు
పూఁదేనెసోనలు పొలయుచోటు
కమ్మనితెమ్మెరల్ గవచి వీచెడుచోటు
హాయిగా లేయెండ గాయుచోటు
నిశ్శబ్దనిలయమై నివ్వటిల్లెడుచోటు
పరదుష్ప్రవేశమై పరఁగుచోటు

గీ॥ నిరతనిర్వ్యాకులాత్యుగ్రతరసమాధి
యోగనిష్ఠానుకూలమై యుండుచోటు
వెదకి వెదకి యాఘోరాటవీతలంబుఁ
గడకుతనయిచ్చవచ్చినకడను గాంచె.

అట్లు యోగ్యస్థానంబును నిర్ణయించుకొని యచట ఫలమూలాశనుఁడై మహోగ్రతపం బొనర్పసాగెను.

### అంబరీషోపాఖ్యానము.

అత్తఱి నయోధ్యాపతి యంబరీషుఁడు యాగ మొండు ప్రారంభించెను. ఆయజ్ఞపశువును దేవేంద్రుఁడు తెక్కలికొనిచనెను. ఆసంగతి పురోహితుఁడు గ్రహించి రాజునకు సంగతి తెలిపి 'రాజా! ఇది నీదుర్నయఫలము; అరక్షితులైనరాజులను దోషంబులు హరించును. దోషపరిహారార్థము మహత్తరప్రాయశ్చిత్తము కర్తవ్యము. యజ్ఞపశువును వెదకించి తెప్పించుటో తత్ప్రత్యామ్నాయంబుగా నరపశువును బంధించి యాగసమాప్తి చేయుటో రెంటనొకటి తప్ప' దనెను. అంబరీషుఁడు సంగతి విని పర్యాలోచించి యింద్రాపహృతమైన యజ్ఞపశువును సాధించి తెచ్చుట కానిపని యని నిశ్చయించి నరపశువునిమిత్తము వేనవేలగోవులతోడఁ దగలి నానా

దేశంబులు గ్రుమ్మరి వివిధనగరంబులును బెక్కుగ్రామంబులును బహుపుణ్యాశ్రమంబులును గలయ విచారించి యెందును వాంఛితార్థంబుఁ బడయక యెట్టకేలకు భృగుతుంగపర్వతముఁజేరి యట మిత్త్రకళత్త్రసహితంబుగానున్న ఋచీకమహర్షిని సందర్శించి యెఱిగి సంగతి విన్నవించి 'మహాత్మా ! నాయాగార్థము నీసుతులలో నొకరి ననుగ్రహింపుము ; వేన వేలు గోవు లిత్తు' ననెను.

ఋచీకుఁడు తలయూచి 'రాజేంద్రా ! జ్యేష్ఠకుమారు నీయరాదుగదా! యనెను. ఆమాట వానిభార్య యందికొని 'తండ్రికిఁ బెద్దకొడుకు ముద్దు, తల్లికిఁ జిన్నకొడుకు ముద్దు' అని పలికెను. ఆఋషికుమారులలో నడిమివాఁడు శునశ్శేఫుండు తన తలిదండ్రుల పలుకులు విని 'రాజా! రెంటకుఁ జెడినరేవడ నేనున్నాను. గోశతంబున నన్ను విలిచికొని పొ'మ్మనెను. అంబరీషుఁడు సంతసించి యట్లు గావించి వానిని రథమెక్కించుకొని మధ్యాహ్నంబునకుఁ బుష్కరతీర్థము చేరి యందు సుంత విశ్రమించెను.

అటఁ దనమేనమామ విశ్వామిత్త్రుఁ డుండుట శునశ్శేఫుఁడు విని వానియొడిలోఁ వ్రాలి 'మునీంద్రా ! రక్షింపుము, రక్షింపుము. అన్యశరణంబు నాకుఁ గలుగదు. రాజు కృతకృత్యుఁడు గావలయును ; నేను దీర్ఘాయుష్మంతుఁడనై చిరతపంబు సలిపి నాకలోకముఁ బడయవలయును. ఈయుభయముఁ గూడునట్లు ప్రసాదింపు' మని సంగతియెల్ల వివరించెను. ఈగాధేయుఁడు వాని నోదార్చి తనకొడుకులను బిలిచి 'పుత్త్రులారా ! శుభార్థులై సుతులను గాంతురు. శుభంబులు ధర్మఫలంబులు. ధర్మములలో నెల్లఁ బరోపకార ముత్తమోత్తమము. 'పరోపకారార్థ మిదం శరీర'మ్మని చెప్పిరిగదా. ఇట్టి ధర్మాచరణంబునకు నవసరంబులు వలచినప్పుడెల్లఁ గలుగవు. అట్టిది నేఁడు మనకు నయాచితంబుగా లభించెను. అదియు సామాన్యమైనదిగాక శరీరత్యాగ పూర్వకమైనదిగా నున్నది. పరలోక మంగళంబునకు నింతకన్న మంచికాలము దొరకదు. పుణ్యవిశేషంబున నిది సంప్రాప్తమయ్యెను. ఇంటికి వచ్చినసిరినిఁ గాలఁ దన్నరాదు. సంగతి వినుము. ఈబాలుఁడు మునిసుతుఁడు ; నన్ను శరణచొచ్చెను. వీనికిఁ బ్రాణదానమిచ్చి శుభంబుఁ బడయుము. అంబరీషుఁడు యాగార్థము నర

పశువును గోరెనఁట. తదర్థము వీని నితనితలితండ్రు లిచ్చిరఁట. ఆతని కోర్కెఁ దీర్చి యగ్నిదేవునకు సంతుష్టి యొనర్చుము. ఇతఁడు రక్షితుఁ డగును ; యాగము పూర్తి నొందును ; దేవతలు తనియుదురు. మీరు మీతండ్రిపనుపు నొనర్చి పితృఋణముఁ దీర్చినవారగుదు' రనెను.

ఈమహర్షికుమారులు మధుచ్ఛందాదు లామాటలు విని 'నాయనా! కడుపారఁ గన్నసుతులను బలి యిచ్చి పరజనపుత్త్రులఁ గాచు తండ్రి యుండునా? ఇట్టిచేఁత సిద్ధాన్నంబును గాలఁ దన్నివైచి శ్వమాంసంబును దినుటగదా.' యని పరిహాసపూర్వకముగాఁ బలికిరి. ఈతపోధనుఁడు మహోగ్రహ మొంది,

చ॥ గురువులమాటఁ బుత్త్రకులు గూర్తురు ప్రాణము లిచ్చియైన ని
క్కరణిని మాఱుమాటఁ బలుకన్ సహసింపరు, ధిక్కరించి యా
డిరి పరధర్మగర్హితపుతేవ సహింపగ నానె దీని ? మీ
గరువమె మిమ్ము మ్రింగ సమకట్టె ఫలంబదిదప్ప దేరికిన్.

మీపాపఫలంబుగా మీరుగూడ వాసిష్ఠులవలె శ్వపచులై వేయేండ్లు భూమండలంబునఁ గ్రుమ్మరుదురు' గాక యని శపించి శునశ్శేఫునకు రక్ష యొకటి యిచ్చి 'మునిపుత్త్రా! వైష్ణవంబగు యూపస్తంభమును నిన్నుచేర్చి నప్పుడు రక్తమాల్యానులేపంబులు దాల్చి దర్భపాశబద్ధుఁడవై యింద్రోపేంద్రగాథల గాన మొనర్పుము ; మేలగు' నని చెప్పి యామంత్రంబు లుపదేశించి వానిని బంపెను.

అంబరీషుఁడు యాగ మారంభించి సదస్యులయనుమతిఁ బొంది రక్తాంబరమాల్యధారియైన శునశ్శేఫుని యూపస్తంభమునకు దర్భపాశంబులతో బంధించెను. ఆమునికుమారుఁడట్లు బద్ధుఁడైనంతనే యామంత్రంబుల జపించెను. ఇంద్రుఁడు ప్రసన్నుఁడై వానికి దీర్ఘాయువులిచ్చి చనెను. అంబరీషుఁడు తనయజ్ఞము దేవేంద్రప్రసాదంబున బహుగుణఫలవంతంబుగా భావించి దానినంతతోఁ బరిసమాప్తి యొనర్చెను.

ద్వితీయభంగము.

ఈమహాత్ముఁ డట్లు గావించి తనవ్రతభంగంబునకు కుంత విసివి మరల వేయిసంవత్సరములు తీవ్రతపం బొనర్చి వ్రతాంతస్నాతుఁ డయ్యెను.

అంతలోన బ్రహ్మదేవుఁడు సురపురోగముఁడై యటకు వచ్చి 'కౌశికా! నీతపంబు పేర్మి ఋషివైతివి సుమా' యని పలికి చనెను. ఈగాధేయుఁ డామాటకుఁ దనివి చెందక మరలఁ దపశ్చరణంబునకుఁ గడఁగెను. అట్లు ఘోరతపం బాచరించుచుండఁగాఁ గొండొకనాఁడు మేనక పుష్కరతీర్థంబునకు స్నానార్థము వచ్చి యందుఁ దోయములాడుచుఁ గాఱుమబ్బులోని మెఱుఁగుఁదీవవలె వీనికంటఁ బడెను. తోడ్తోడ వీనికి వలపు చెలరేఁగెను. మోహము దురత్యయము.

"ఆ॥ వె॥ ఎంతశాంతులయ్యు నెంతజితేంద్రియు,
లయ్యుఁ గడువివిక్తమైనచోట,
సతులగోష్ఠి గలుగ సంచలింతు రెందుఁ,
గామశక్తి నోర్వ "గాదుసుమ్ము"

అంత నిత్తాపసి యాపూఁబోఁడి నియ్యపఱచి దానివలపులకుఁ జిక్కి యదే లోకంబుగా పదియేండ్లు గడపి కనువిచ్చి చూచి యాత్మదోషంబునకు సిగ్గునంబొలెఁ జింతాశోకపరాయణుఁడై 'కటా! అమరులపన్నుగడ నేరక వెట్టినైతిని; తపోవిఘ్నమయ్యెను; పదియేండ్లు వృథచనె' నని పశ్చాత్తాపపడి, తనమ్రోల వడఁకుచు నిలిచియున్న మేనకను బుజ్జగించి పంపివైచి, యందుండి హిమాద్రికిఁ జని కౌశికతీరంబున దృఢసంకల్పపూర్వకంబుగా ఘోరతపం బారంభించెను.

అట్లు వేయిసంవత్సరములు చనెను. ఆతపోవిశేషంబునకు ఋషులు బెగ్గడిల్లి పితామహుని డాసి మొరలిడి వానితోడి తెచ్చి 'మునీంద్రా! నీతపఃఫలంబుగా మహర్షివైతి' వని వానినోటఁ జెప్పించిరి. ఆమాటకు నిమ్మహాధీరుఁడు సంతోషదుఃఖములు పొరయక 'దేవా! మహర్షి నేని జితేంద్రియుఁడనే గదా' యని సవినయంబుగా నడిగెను. 'గాధేయా! జితేంద్రియత్వము నీకింకను సిద్ధింపదని' వేల్పుపెద్ద పలికి చనెను.

తృతీయ ఖండము.

ఈధీరుఁ డంత రెట్టించినపట్టుదలతో వాయుభక్షణవ్రతియై నిరాలంబముగా వేసవియందుఁ బంచాగ్నిమధ్యంబునను వర్షకాలంబున బట్టబయిటయు

శిశిరంబున జలాంతరమందును రాత్రిందివము కఠినతపం బొనర్పసాగెను. అట్లు వేయేండ్లు మరలఁ గడచెను. ఆతపస్సునకు నింద్రాదులు భయాక్రాంతులై తద్విఘ్నమును సంకల్పించి వివిధోపాయంబు లాలోచించి 'ఎల్లయనర్థములకుఁ గామము బీజమై యున్నది. కామమును జయించినఁగాని సంకల్పరహితుఁడు గాఁడు; సంకల్పరహితమైనఁగాని జితేంద్రియత్వము సిద్ధింపదు. కామోద్దీపనమునకు వనితారత్నమును మించినది గలుగదు. కావున వన్నెలాఁడి నొకర్తుకను బంపి విశ్వామిత్రుని గలంచి చూతము. ఆఋషి యందులకుఁ గలఁగినను గలఁగకున్నను మనయీప్సితము సిద్ధించును. ఎట్లందురా ? కలఁగునేని తపోభ్రష్టుఁడగును. కలఁగఁడేని వానితపస్సు మోక్షార్థమగునే గాని యింద్రాదిపదవులఁ గూర్చినది గాబోదు. మనపదవులకు సేగిలేకుండునే గదా మనయభిమత మని నిశ్చయించి రంభను రావించి 'అప్సరోరత్నమా ! మనయెల్లరకుఁ బెద్దయొగ్గు రానున్నది. విశ్వామిత్రుని బూవింటిదొరబంటుగా నొనర్చి సురకార్య మొనర్పుము' అనిరి. ఆమచ్చెకంటి యంజలి యొనర్చి 'దేవా ! గాధేయుఁడు చండకోపనుఁడు. వానిని డాయుట దవానలంబున నురుకుటగును. నాయెడఁ గరుణింపు' మని పలు వగల వేఁడెను. త్రిదశాధీశుఁడు ప్రసన్నుఁడు గాఁడయ్యెను. ఆకాంత గత్యంతరముఁగానక జగన్మోహనరూపము దాల్చి పుష్కరతీర్థమునకు వచ్చి

'సీ॥ తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుఁగావిరంగువలన
శశికాంతమణిపీఠిజాజువాటుఁగఁగాయ
నుత్తుంగకుచపాళినత్తమిల్లఁ
దరుణాంగుళీఘాతతంత్రీస్వనంబుతో
జిలిబిలిపాటముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కియరమోడ్పుగనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁదెలుప

గీ॥ బ్రాఢిఁ బలికించుగీతప్రబంధములకు
గమ్రకరపంకరుహరత్నకటకఝణఝణ

ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండె ”

ఆమిటూరికి వసంతకందర్పులు తోడైనిల్చిరి. శారికాకీరంబులు మధుర మధురంబుగాఁ గూయసాగెను. మధుపఝుంకారపటుహధ్వనులు చెలరేఁగెను. గానాలాపతరంగంబు లతిహృద్యంబుగా వీచెను. ఈ విశ్వామిత్రునిమనఃకర్ణంబులకు సుంత విక్షేపము గలిగెను. ఈయన బహిర్ముఖుఁడై యాగానంబు నాలకించి

“ శా॥ నానాగాయనగాయనీమణులగానంబుర్వి నాలింపమో
నానాఁటన్ నగభేదివీఁటఁ గలగంధర్వాప్సరోగీత వి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో యందైన నిందైన వీఁ
దై నాదంబొనఁగూర్చునే మదికి నిట్లానందసందోహముల్. ”

అని తలఁచి యావంక కన్నుసారించెను. అచ్చటకు సమీపంబున నొకానొకకాంతారత్నమును గాంచి యాయింతి రంభ యగుట గుఱుతించి యదంతయు నింద్రునిజాలమగుట గ్రహించి ‘దుర్భగా! కామక్రోధజయంబునకు సమకట్టి తపంబాచరించుచున్న నన్నుఁ బ్రలోభింప యత్నించితివి గావునఁ బదివేలవత్సరంబులు శిలవై యుందువుగాక. మత్కోపకలుషీకృతను నిన్ను మహాతపస్తేజోవంతుఁడైన కొండొక బ్రాహ్మణుఁ డుద్ధరించుఁ బొమ్ము’ అని శపించెను.

బ్రహ్మత్వసిద్ధి

విశ్వామిత్రుఁ డట్లు శపించి పదంపడి ‘కటా! ఎంత ప్రమాద మొనర్చితిని! రాగద్వేషంబు లింకను నాయందు నిర్బీజములుగాకున్నవి. ఇవి నశింపవలయునన్నచో నహంకారమమకారంబులు సవాసనానిర్మూలము గావలయును. చిత్తము పరిశుద్ధమైనగాని యివి మట్టుమాయవు. చిత్తశుద్ధిలేని తపస్సునిరర్థకము. ఇన్నాళ్ళు నేను శ్రమించినను నాచిత్తము సమగ్రముగా శుద్ధముగాకున్నది గదా?

శరీరంబులు తన్మాత్రలసమ్మేళనంబున నేర్పడుచున్నవి. శరీరంబుల వైచిత్ర్యముఁ దన్మాత్రలమార్పుయొక్క వైచిత్ర్యమే గాని వేఱుగాదు. ఈకూర్పునది యెవ్వరు? ఎవ్వరోగాదు; ఆయాజీవియొక్క ప్రాక్తన

సంస్కారంబులు కూర్చుచుండును. ఆసంస్కారంబులు త్రిగుణాత్మకంబులు. ఏగుణము బలవత్తరమో ఆవిధసంస్కారంబును దద్విధమాత్రలు గలుగుచుండును. గుణముల మార్పుతోడ సంస్కారంబులును వాని వెంటనే మాత్రలును మాఱుచుండును. కావున శరీరతత్త్వపరిణామమనఁగా గుణపరిణామమే యగుచున్నది.

ఈగుణపరిణామము ఆహారవ్యవహారంబులబట్టి జరుగును. ఏగుణాభివృద్ధిఁగోరుదురో తదనుకూలమైన ఆహారాది నియతి నాచరింపవలయును. తపస్సుగూడ నిట్టి వ్యవహారమే యగును గావున దాని ననుష్ఠించితిని. తత్ఫలముగా నింతమాత్రము చేకూరెను. అహో! చిత్తశుద్ధి యెంతకష్టసాధ్యము! అయినను జింతవలదు. నాపుట్టినది క్షత్రవంశము. అది రజఃప్రధానమైనది. అట్లుండియు శ్రమపడిక్రమక్రమంబుగా రాజర్షిత్వమహర్షిత్వంబులను సంపాదించితిని. దీనింబట్టి చూడఁగాఁ గేవలరజఃప్రధానమైన చిత్తము చాలవరకు మాఱి యింతవరకుఁ బరిపక్వమయ్యె నని స్పష్టము. పురుషకారంబున సర్వము సాధ్యమనుట వెల్లడించితిని. ఇఁక బ్రహ్మత్వము సిద్ధింపవలసియున్నది. ఇంతదూరము సాధించినవానికి నదియుఁ జేకూరదా? వర్షశతంబులు గడచుగాకఁ; సిద్ధిపర్యంతము నాపూనిక వదలఁజాల. ఇక నిరాహారుఁడనై కుంభకయోగమూని తపంబొనర్తును. తటాలున నేదియు సిద్ధింపదనియు నభ్యాసయోగబలంబున సక్రమాభివృద్ధి గలుగకమానదనియు బురుషకారము నాశ్రయించి చిత్తశుద్ధిఁ బడసి శ్రవణ మనన ధ్యానంబులం దవిలి చిత్తైకాగ్ర్య మొంది జితేంద్రియుఁడును నిర్మలాంతఃకరణుఁడునై యొకజన్మంబుననే బ్రహ్మర్షి గావచ్చుననియు సిద్ధియంతయు ప్రయత్నమునుబట్టి యుండుననియు నిప్పటికి గ్రహించితిని. అహో! దేవత లెంత ప్రమాదపడిరి. ఇంద్రాదిపదవులఁ గోరి నేనిట్లు తపంబొనర్చుచున్నానని వారివిశ్వాసము. ఆతుచ్ఛములకు నింతశ్రమవలయునా? నాగుట్టు గ్రహింపనోపక స్వపదరక్షణార్థ మిట్లొనర్చిరి. అయినను నాకిది మేలే యయ్యెను గదా. ఈపరీక్షలకు నిల్చినఁ గదా నిగ్గుతేలును. బంగారువన్నె యొరపుఁబాటిమీఁదఁ గదా తెలియు' నని వితర్కించుకొని యందుండి తూర్పు దెసకుఁ జని,

" సీ॥ ఇంద్రియార్థంబులం దింద్రియవ్యాపార
మడిగించి క్రియ లెల్ల విడిచి పుణ్య
పాపబంధంబుల నోపి బంధింపంగఁ
బడక మనోవృత్తి నొడిచి నాకు
నిది ప్రియం బప్రియం బిది నింద యిది
మహాస్తుతి యిది యనక సంతతనితాంత
సంతోషయుతుఁడనై సంతసము
భయమును శీతాతపంబులు వాతగతియు
గీ॥ నెఱుఁగ కివ్విధమున మఱచి శరీరంబు
మరణజీవితముల కురువిషాద
తోషవృత్తు లుడిగి భీషణాటవినుండి
చేసెదను తపంబు భాసురముగ. "

అని నిశ్చయించుకొని మరల దుష్కరతపం బారంభించెను.

ఈమహాత్ముఁ డట్లు శతవర్షంబులు తపంబు సలిపి వ్రతస్నాతుఁడై భుజింపఁబోనుండఁగా నింద్రుఁడు బ్రాహ్మణవేషంబున నటకు వచ్చి 'అయ్యా! ఆకటఁ జావనున్నాను. పిడికెఁడన్నము పెట్టి నన్ను రక్షింపు' మని యాచించెను. ఈజితేంద్రియుఁడు తాను గుడువనున్నయన్నము నతని కిచ్చి మరలఁ దపశ్చరణుఁ డయ్యెను. వీనిమూర్ధంబునుండి ధూమ మెగసి ముల్లోకంబు లావరించెను. ఆతపస్స్ఫారాగ్నికి దేవగంధర్వాదులు వితాకుచెంది బ్రహ్మను సందర్శించి 'స్వామీ! మామాయ లిఁక సాగవు; విశ్వామిత్రుఁడు సుంతయుఁ జలింపఁడు. వానితపోవహ్ని వేడిమికి దిశలెల్ల వ్యాకులపడుచున్నవి; పుడమి కంపిల్లుచున్నది; వాయువు యథాగతి వీవఁడు; సూర్యుఁడు ప్రభాహీనుఁడయ్యెను; ప్రతీకారము దోఁపదు; నిజతపఃకీలల నితఁడు జగత్త్రయంబును భస్మీకరింప నున్నాఁడో యని భయ మయ్యెడు. దేవా! సృష్టికి ముప్పు వాటిల్లకమున్న యితనియభిమతంబులు దీర్చుటొప్పు; ఆలసించినఁ గీడు తప్పదు. దేవరాజ్యంబును గోరునో యని తహతహపడుచున్నా' మని మొఱలిడిరి.

పితామహుఁడు చిఱునవ్వు వహించి యమరాదులను వెంటఁగొని యాస్థిరప్రతిజ్ఞునికడకు వచ్చి 'గాధేయా ! నీతపస్సు మెచ్చితిని ; బ్రాహ్మణత్వంబును సాధించితివి ; చిరాయువిచ్చితి' ననెను. ఆమాటకు నిమ్మహాత్ముఁడు సంతసించి పరమేష్ఠికి నమస్కరించి 'స్వామీ ! నాకు బ్రహ్మత్వసిద్ధి గల్గెనేని యోంకార వషట్కార వేదోపదేశాధికారము గూడఁగలిగి నట్లేగదా ; వసిష్ఠుఁడు నాబ్రహ్మత్వంబు నంగీకరింపవలయును గదా. ఇవి యగునేని నాతపంబును విరమింతు' ననెను. వసిష్ఠుఁడు దేవప్రసాదితుఁడై యాయనఘుని బ్రహ్మత్వ మంగీకరించెను. ఇరువురకుఁ జిరసఖ్య మొదవెను. రామా ! ఈమహనీయుఁ డింతటివాఁడు."

జనకుఁ డాకథయెల్ల విని పరమానందభరితుఁడై 'మహాత్మా ! మీ చరితామృతమువినవినఁ జవులూరుచున్నవి. కాకుత్స్థులతోడి మీయాగమంబు నన్ను ధన్యునొనర్చెను. అనుగృహీతుఁడ నైతిని. అదిగో ప్రదీచి లంబమానరవిమండలమై తోఁచుచున్నది. కాలోచితక్రియలకు సమయ మయ్యెను. తెల్లవాఱి పునస్సందర్శనభాగ్యంబును బడయుదు; అనుజ్ఞ వేఁడుదు' నని వారియనుమతిఁ బడసి నిజమందిరంబునకుఁ జనెను. రామలక్ష్మణు లంత దినాంతకృత్యములు దీర్చి యారాత్రి మునితోడ సుఖముండిరి.

### శివధనుర్భంగము.

"మ॥ ఉరుసంధ్యాతపశోణవృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమ
న్గరిడిం గాలపుహాణంతగాఁడు చరమాగస్కంధముం జేర్చె ని
బ్బరపుస్సంగడమోయనన్ శశి డిగెం బ్రాగ్భూమిభృత్కేతవే
తరబాహాగ్రపుసంగడంబనఁగ మార్తాండుండు దోఁచె న్దివిన్."

అట్లు సూర్యుఁ డుదయించినంతనే వేదవేదాంగపారీణులగు బ్రాహ్మణులును దపోమూర్తులగు మునీంద్రులును దేశదేశాంతాగతులైన రాజచంద్రులును సభాప్రదేశమెల్ల నిండిరి. విశ్వామిత్రుఁడును రామలక్ష్మణులతోడ వచ్చి యుచితాసన మలంకరించెను. జనకుఁడు ప్రవేశించి సభాస్తారులకు మ్రొక్కి కూర్చుండెను. విశ్వామిత్రుఁ డంత జనకమహారాజును సంబోధించి,

మ॥ శివచాపంబును గూర్చి చెప్పుకతలం జిత్తంబు రంజిల్లి యీ
యువకుల్ వచ్చిరి రామలక్ష్మణులు వీక్షోత్సాహసంరంభులై
యవనీనాథులు మౌనివర్యులు నదే యాసింత్రుఁ జేరాసతో
నవునే మామదిఁ జేయఁగా నిటు విదర్భాధీశ ! మీకియ్యెడన్.

అని ప్రస్తావించెను. ఆమాట విని జనకుఁడు లేచి 'మహాత్మా ! మీ యిచ్చకు వేఱు గల్గునా ?' యని ముక్కంటి వింటిని గొని రా నాజ్ఞాపించెను. ఐదువేలభటులు చని యెనిమిదిచక్రములబండిని దానిమీఁదనున్న పెద్దయినపప్పెట్టెతోడ లాగి తెచ్చి సభామధ్యంబున నిలిపిరి. మిథిలేశ్వరుఁ డాబండిని డాయఁ బోయి 'మహాత్ములారా ! ఈధనుర్వృత్తాంతము సుంత మీరవధరింపనగును. తొల్లి దక్షప్రజాపతి యాగమొండు గావించి తత్ హవిర్భాగంబును శివునకు నిరాకరించెను. హరుఁ డాపరిభవంబును సైపక ధనుర్ధరుఁడై తన్నుఁ గాదని హవిర్భాగంబును గ్రహించిన దేవతల శిరంబులు దఱుగ నుంకించెను. వారు జడిసి శూలికిఁ బ్రియ మొనర్చిరి. ఫాలాక్షుఁడు ప్రసన్నుఁడై తనచేతి చాపంబును వారికిచ్చెను. దేవత లాకార్ముకంబును శిబిచక్రవర్తికి నాఱవతరమువాఁడును మాకుఁ బూర్వపురుషుఁడు నైన దేవరాతునకు నొసంగిరి. ఆయన దానినిఁ బదిలముగా దాఁచియుంచెను., అది యిప్పుడు నాయధీనమయ్యెను. నేనొకయాగమును సంకల్పించి యజ్ఞశాలానిర్మాణార్థము భూమిని జక్కపఱచుటకుగా దున్నించుచుంటిని. అప్పుడు నాఁగఁటిచాలులోనొక కన్యారత్న ముద్భవించెను. ఆబాలికను బుత్త్రికనుగా గ్రహించి పెంచుచున్నాను. నాగఁటిచాలునకు సీత యనిసంస్కృతంబున వచింతురు. నాగఁటిచాలులోఁ బుట్టిన కారణంబున నామెకు సీతయను పేరు పెట్టితిని. ఆమె యయోనిజ గావున సామాన్యు లామెకరగ్రహణంబునకుఁ జాలరు. ఈశివచాపంబు నెవఁడు మోపెట్టునో యతఁడే యామెవరుఁ డని నిశ్చయించితిని. నాప్రతిజ్ఞ విని పెక్కురాజులు వచ్చి చాపంబును జూచి కొందఱును దానిఁగదలింప నోపక కొందఱును, నిరుత్సాహులై యంతతోఁ జనక దౌష్ట్యంబుచేసి నా పుత్త్రికను హరింప సమకట్టి వారెల్లరు నేకముఖులై మిథిలానగరంబు నొక్క సంవత్సరపర్యంతము ముట్టడించిరి. నాసైన్యసాధనంబులు సన్నగిల్లెను ; వెఱవుతోఁపవయ్యెను. అంత నేను దేవతలఁ గూర్చి తపం బొనర్చితిని,

వారు నాయెడఁ బ్రసన్నులై నాకుఁ జతురంగబలంబును బ్రసాదించిరి. ఆబలసహాయ్యంబున వీర్యసందిగ్ధులైన వైరినృపతుల నోడించితిని. వారు ముట్టడి మాని దిక్కులం బ్రాకిరి. మహాత్ములారా ! ఎవఁడీచాపంబును మోపెట్టునో యావీరుఁడు సీతను బడయు' నని వచించెను.

అనవుఁడు విశ్వామిత్రుఁడు తలయూఁచి రాముని వంకఁజూచి 'వత్సా ! ముక్కంటివింటినిఁ జూడఁ దమకింతువు గదా. అదిగో చూడు' మనెను. రాముఁడు లేచి విల్లున్నమందస వంకకుఁ దరలెను. సభాస్తారు లెల్లరు నిర్నిమేషులై వానిని జూడసాగిరి. రాముఁ డట్లు చని యవలీలగా నొకవ్రేలితో మందస మూఁత యెత్తివైచి,

"మ॥ కలభం బాతతచండతుండమున వీఁకన్ శేషనాగేంద్రునిన్
బలిమిం బట్టినభంగి రామధరణీపాలుండు కోదండమున్
బలుముష్టిన్ వడిఁ బట్టి యెత్తి వెగ విస్ఫారంబుగాఁజేసి ని
శ్చలుఁడై యల్లన లస్తకంబు వదలెం జాపంబు భగ్నంబుగాన్.

క॥ నారులఁ బట్టినవారికి
నారయధర్మములు గలవె యన నారిఁ గరం
బారంగఁ బట్టి రాముఁడు
పౌరులు చూడంగ ధనువు భగ్నము చేసెన్.

మ॥ ధను వుద్యద్గతి రాముఁడట్లు విఱువం దద్ఘోరఘోషం బొగిన్
ఘననిర్ఘాతనిపాదజాతనినదోగ్రధ్వానమై మ్రోసినన్
విని యాస్థానమువార లెల్ల వడిఁ బృథ్విం ద్రెళ్ళి మూర్ఛిల్లి రా
జనకాధీశుఁడు రామలక్ష్మణులు విశ్వామిత్రుఁడుందక్కగన్॥

చ॥ కులగిరు లెల్ల బెల్లగిలెఁ గుంభిని యల్లల నాడె దిగ్గజం
బులు బెదరెన్ భుజంగపతి బొమ్మరవోయెఁ బయోధు లన్నియుం
గలఁగె దిగంతముల్ వగిలెఁ గన్కనిఁ దారలు రాలె సూర్యచం
ద్రులగతి తప్పెమేఘములు నూలె నజాండము మ్రోసె నయ్యెడన్."

అచింత్య మహాద్భుతమైన రామబాహుబలంబునకు జనకుఁడు మహా విస్మయమంది 'మునివర్యా! రామపరాక్రమంబుఁ గంటిని. ఈవింటిని మోపెట్టనోర్చువీరుడుండునా యని శంకించితిని. నాభ్రాంతి నేఁడు తీరెను. నాప్రతిజ్ఞ సఫలమయ్యెను. నేను కృతకృత్యుఁడ నైతిని. అనుజ్ఞయేని యయోధ్యకు నామంత్రులు చని దశరథమహారాజునకు సంగతి వినిపించి వారిని దోడితెత్తు' రనెను. విశ్వామిత్రుఁ డట్లే గావింపు మనెను.

దశరథాగమనము.

జనకరాజ మంత్రులు తరలి మూఁడురాత్రులు ప్రయాణము సాగించి యయోధ్యచేరి తమరాకను దూతలవలన నేనికిఁ దెలిపి యనుజ్ఞాతులై లోనికిఁ జని 'రాజేంద్రా! మిథిలాపతియగు జనకమహారాజుగారి దూతలము. సీతాదేవి మా యేనికిఁ బుత్త్రికారత్నమగుటయు నామెవివాహమునుగూర్చి మారాజు ప్రతినచేసియుండుటయు దేవరవారికి శ్రుతిగతమై యున్నది. రామలక్ష్మణులు మా యేనిభాగ్యవశంబుననో యన మిథిలానగరంబునకు విశ్వామిత్రపురస్సరంబుగా వచ్చిరి. రాముఁడు శివచాపంబును మోపెట్టి యాకర్ణాంతముఁ దివిచెను. అదియిరుఖండములై తునిగిపడెను. అట్లు మీజ్యేష్ఠసుతుఁడు తనబాహుపరాక్రమంబు నుంకువయిడి మారాజపుత్త్రికను సీతాదేవిని వరిచెను. మీపుత్త్రులను సందర్శించునిమిత్తము దేవరవారు సకుటుంబమంత్రిపురోహితబాంధవపరివారంబుగా రాఁగోరి మాముఖంబున మా యేఁడు ప్రార్థించుచున్నాఁడు. విశ్వామిత్రశతానందులయనుమతితోఁ దరలి వచ్చితిమి. ఏలినవారిచిత్త' మని విన్నవించిరి.

దశరథుఁడు హర్షపులకితశరీరుఁడై జనకమంత్రులను బహువిధంబుల సత్కరించి వసిష్ఠ వామదేవ జాబాలి కాశ్యప మార్కండేయ కాత్యాయనాదిమహర్షులతోడ సుమంత్రాదిమంత్రులతోడఁ జతురంగబలసమేతంబుగా మఱునాఁడే తరలి నాల్గవనాఁడు మిథిలానగరము చేరెను.

జనకుఁడు దశరథాదులను సముచితసత్కారంబులఁ దనిపి 'మహాత్ములును బరాక్రమసింహులునైన రాఘవులతోడివియ్యంబునంజేసి నావంశము మహోన్నతిఁ గాంచెను. నాయాగము సమాప్తము గానున్నది. అనంతరము వైవాహికమంగళంబును బుషీంద్రులు నిశ్చయించి' రనెను. ఆమాటకు

దశరథుఁడు సంతసించి 'ఇచ్చునది మీరు పుచ్చుకొనునది మేము. ప్రతిగ్రహము దాత యధీనముగదా. ధర్మజ్ఞుఁడవైన నీవచనమగుఁగాక' యని ప్రియంబులు పలికెను. నాఁటిరేయి యట్లు గడచెను.

చ॥ అలఁతిగ జాభరారసము నద్దిన పెందెఱ డించి రోయనం
బొలిచెను ప్రాగ్దిశాతలము, పుష్కరిణీహృదయాంతరాళముల్
వెలిసెఁ బ్రసన్నతోయభరవిహ్వలమై, తొలినాఁటి సేదలన్
దలఁగిసమస్తసృష్టియు స్వధర్మముఁబూనెను నూత్నశోభతోన్.

అట్లు తెల్లవాఱినంత జనకమహారాజు యాగీయకార్యంబులన్నెల్ల నిర్వర్తించి, యిక్షుమతీతీరంబున సాంకాశ్యపట్టణంబున నున్నతనతమ్మునిఁ గుశధ్వజుని సీతాకళ్యాణమహోత్సవానుభవార్థము రప్పించెను. ఎల్లరు సభగూడిరి. దశరథునిఁ దోడితెచ్చుటకై వానివిడిదికి సుదాముఁడను జనకమంత్రి పోయెను. ఆనరేంద్రుఁడును బురోహితాదిసహితుఁడై వచ్చి కళ్యాణమండపము నలంకరించెను. వియ్యంకులు కొంతవడి ముచ్చటలఁ బుచ్చిరి. అంత నయోధ్యాధీశుఁడు మిథిలాధిపుని సంబోధించి 'వియ్యము నకుఁ గయ్యమునకు సమత వలయునందురు. మఱియు వివాహముపట్ల కన్యావరుల వంశక్రమంబులు దెలుపుట యాచారము. ఇక్ష్వాకులకు నిలువేల్పయిన వసిష్ఠమహర్షి మాకు వక్తయై మావంశక్రమంబును వినిపించు' ననెను.

ఇక్ష్వాకువంశక్రమము.

అంత వసిష్ఠుఁడు లేచి 'జనకరాజా! ఇంతకన్న సంతోషకరమైన కార్యము గలుగదు. రఘువంశంబునకు బ్రహ్మమూలము. వానికి మరీచి, వానికి గాశ్యపుఁడు, వానికి సూర్యుఁడు జనించిరి. సూర్యునివలన మనువుద్భవించి రాజయ్యెను. మనువునకు నిక్ష్వాకువు ప్రభవించెను. అతఁడే యయోధ్య నేలిన మొదటి ఱేఁడు. వానికిఁ గుక్షి, వానికి వికుక్షి యతనికి బాణుఁడు వానికి అనరణ్యుఁడు, వానికిఁ బృథువు, వానికిఁ ద్రిశంకుఁవు, వానికి దుందుమారుఁడుఁగలిగిరి. దుందుమారుని యవనాశ్వుఁడనియుఁ జేర్కొందురు. వానికి మాంధాత, వానికి సుసంధి, వానికి ధ్రువసంధి ప్రసేనజిత్తులుఁ బుట్టిరి. అందు ధ్రువసంధికి భరతుఁడు, వానికి నసితుఁడుఁ బొడమెను. అసితుఁడు హైహయ తాళజంఘ శశిబిందురాజులతోఁ బోరి యోటమిఁ గాంచి హిమ

వత్పర్వతమందలి భృగుప్రస్రవణంబు నాశ్రయించెను. అతనికి భార్యలిరువురుండిరి. వారు గర్భవతులై యుండఁగా రెండవభార్యయగు కాళింది సవతిమత్సరంబునఁ జేసి పెద్దభార్యకు గర్భస్రావార్థము విషము పెట్టెను. అయ్యవసరంబున నటకుఁ జ్యవనమహర్షి దైవయోగంబున వచ్చెను. అమ్మహర్షికి వారిరువురును బ్రణమిల్లిరి. ఆమహాత్ముఁడు పెద్దభార్యవంకఁ జూచి మహాబలశాలియైనపుత్త్రుని బడయుదువుగాక యని దీవించెను. అంతఁ గొన్నాళ్ళకు నసితుఁడు పరలోకగతుఁడయ్యెను. వాని పెద్దభార్యకు సుతుఁడుదయించెను. ఆకుమారుఁడు గరసహితుఁడై జనించెఁ గావున నతనిని సగరుఁడనిరి. వానికి నసమంజసుఁడు, వానికి నంశుమంతుఁడు, వానికి దిలీపుఁడు, వానికి భగీరథుఁడు, వానికిఁ గాకుత్థ్సుఁడు, వానికి రఘువు జనించిరి. రఘువునకుఁ గల్మాషపాదుఁడు, వానికి శంఖణుఁడు వానికి సుదర్శనుఁడు, వానికి నగ్నివర్ణుఁడు, వానికి శీఘ్రగుఁడు, వానికి మరుఁడు, వానికిఁ బ్రశుశ్రుకుఁడు, వానికి నంబరీషుఁడు, వానికి నహుషుఁడు, వానికి యయాతి, వానికి నాభాగుఁడు, వానికి నజుఁడుఁ గల్గిరి. అజమహారాజునకు దశరథుఁడవతరించెను. ఈకోసలేంద్రునకు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు జనించిరి.

ఉ॥ శ్రీకరు లాదివంశపరిశిష్టులు ధార్మికవర్యు లుత్తమ
శ్లోకులు సూనృతవ్రతులు సుందరమూర్తులు నాత్మవంతులై
ఖ్యాతులు రామలక్ష్మణులు వారికి నీసుతలన్ వరింతు సీ
తాకమలాక్షి నూర్మిళ సుధామధురోన్నతమంగళాత్మలన్.

రాజేంద్రా ! సీతనయాలకు రామలక్ష్మణు లెంతయు ననురూపులు వీరిదాంపత్యంబులు మహాశోభావహమ్మై జగన్మంగళకరమగును.' అని వచించెను.

### జనకవంశక్రమము.

శతానందుఁడు లేచి 'మునీంద్రా ! వరునివంశంబును దెలిపితిరి కన్యావంశమును వినుము. మా జనివంశంబునకు నిమిచక్రవర్తి ప్రధానపురుషుఁడు. ఆమహనీయునిచరిత్ర లోకవిశ్రుతమే గదా. వానికి మిథి యను సూనుఁ డుదయించెను. వాని పేర నిష్ఠారవరము నిర్మితమగుటంజేసి

దీనిని మిథిలానగరమందుకు. ఆరాజేంద్రుఁడే మొదటి జనకుఁడు. వానికి సుదావసువు, వానికి నందివర్ధనుఁడు, వానికి సుకేతువు, వానికి దేవరాతుఁడు, వానికి బృహద్రథుఁడు, వానికి మహావీరుఁడు, వానికి సుధృతి, వానికి దృష్టకేతువు, వానికి హర్యశ్వుఁడు, వానికి మరుఁడు, వానికి ప్రతిబంధకుఁడు, వానికిఁ గీర్తిరథుఁడు, వానికి దేవమీఢుఁడు, వానికి విబుధుఁడు, వానికి మహీధ్రకుఁడు, వానికిఁ గీర్తిరాతుఁడు, వానికి మహారోముఁడు, వానికి స్వర్ణరోముఁడు, వానికి హ్రస్వరోముఁడు జనించెను. హ్రస్వరోముని వలన జనకుఁడును గుశధ్వజుఁడును బుట్టిరి. అంత హ్రస్వరోముఁడు తన రాజ్యంబును జనకునకు నప్పగించి తపోవృత్తిని వనంబునకుఁ జనెను.

ఇట్లుండఁ గొండొకకాలంబునకు సుధన్వుఁడు సాంకాశ్యప్రభుండు గర్వోద్ధతుఁడై సీతాశివకార్ముకంబులఁ బడయఁ గోరి మాపయి దండెత్తి వచ్చి రణనిహతుఁడయ్యెను. ఆసాంకాశ్యరాజ్యంబును మాతండ్రి తన తమ్మునకు నిక్కుశధ్వజునకుఁ గట్టెను.' ఇది మారాజువంశవృత్తాంతము.

'కం|| శ్రీయును గులమును రూపును
బ్రాయము శుభలక్షణంబు బాంధవవిద్యా
శ్రేయముఁ గలవరునకుఁ గ
న్యాయతగాఁజేయవలయు నధికప్రీతిన్.'

అని పెద్దలు వచింతురు. ఈసంబంధము లెల్లవిధంబుల నొప్పియున్న' వని నుడివెను.

ము హూ ర్త ని శ్చ య ము.

అంత జనకుఁడు లేచి 'మునీంద్రా! మీయభిమతంబునకు మాఱు గలదా? మీకోరినట్ల నాతనయలను సీతను రామునకు నూర్మిళను లక్ష్మణునకు నొసంగితిని. వారివలన గోదానపితృకార్యంబులఁ దీర్పించి యథావిధిఁ గళ్యాణము నొనర్పనగును. నేఁడు మఘానక్షత్రము. ఉత్తరఫల్గునీనక్షత్రము శుభప్రదము. నాఁడు వివాహములు జరుపుటొప్పు' అనెను.

అంత విశ్వామిత్రుఁడు మునుపడవచ్చి 'మిథిలాధీశా! మీయుభయవంశంబులకు సంబంధములు గలుగుటకు నెంతయు సంతసింతుము. కుశధ్వజునితనయలు మాండవీ శ్రుతకీర్తులు గలరుగదా. వారిని భరతశత్రుఘ్న

లకు భార్యార్థము వరింతుము. దశరథసుతులు నల్వురు రూపవయోవిలాస సంపదల సమానులై దిక్పాలురకు సాటి యగుదురు' అని వచించెను. జనకుఁడు మునిహృదయంబును గ్రహించి 'మహాత్మా! వసిష్ఠగాధేయుల సంకల్ప మమోఘము. కన్యాదానఫలంబును నాకీరూపంబున మీరిరువురు ననుగ్రహించి మీకునాయెడఁగల శిష్యవాత్సల్యంబును జూపితిరి. దశరథునకును నాకును భేదభావ మెన్నఁడును లేదు. నారాజ్యంబును గుశధ్వజుని రాజ్యంబునేగాక యయోధ్యానగరంబును గూడ స్వతంత్రించి గురుదక్షిణగా నిచ్చితిని. మీరు సింహాసనత్రయము నధిష్ఠించి మమ్ముఁ బాలింపనగు' ననెను. ఆమాటకుఁ దశరథుఁడు పరమసంతుష్టచిత్తుఁడై మిథిలాధీశుని నిష్కళంకహృదయ మెంతయు శ్లాఘ్యము. వానివచనమును నేనును శిరమునఁ దాల్తు' ననెను. వసిష్ఠకౌశికులు పరమానందభరితులై 'విదర్భేశ్వరా! రాజ్యాలు మాకేల? మాయంతటివారు మీరు పరిపాలించుటఁ జూచుచు సంతసించుటకన్న మాకు వేఱువలయునా? మీపరిపాలనము నిష్కామకర్మానుష్ఠానరూపమై సర్వప్రాణి సముద్ధరణసమర్థమై వెలయుచున్నది. ఇదే మీకు బరమకళ్యాణనిశ్శ్రేణి యగును. కావున మీరాజ్యంబుల మీకే యిచ్చితిమి' అని పలికిరి. అంతతో నాఁటిసభ పరిసమాప్తమయ్యెను. ఎల్లరు వారివారి విడుదులకుఁ జనిరి.

మరునాఁడు దశరథమహారాజు తనసుతులవలన లక్షయేసి సువర్ణశృంగ గోవులను సవత్సకంబులుగాఁ గంచుకదోహదపాత్రలతోడ దాన మిప్పించెను. అంతలోన నచ్చటికి భరతుని మేనమామయైన కేకయరాజసుతుఁడు యుధాజిత్తు వచ్చి దశరథునిసందర్శించి 'రాజేంద్రా! కేకయరాజు మనుమనిఁ జూడ నువ్విళ్ళూరుచున్నాఁడు. బాలునిఁ దోడితేర నన్నుఁ బంపెను. అయోధ్యకుఁ జనితిని. పుత్త్రులవివాహార్థ మిటకు మీరు వచ్చుటఁ దెలిసెను. అంతట నిటకు వచ్చితి' ననెను. ఆ ఱేఁడు వానిని యథోచితంబుగా సత్కరించి సంగతి వినిచి 'నాపుత్త్రులకళ్యాణము లాకస్మికముగా నిశ్చయింపఁబడెను. అందువలన మనవారికెవ్వరికిఁ దెలుప వ్యవధి లేదయ్యె' ననెను.

సీ తా క ళ్యా ణ ము.

మఱుసటిదియుదయంబున దశరథుఁడు సుతులవివాహంబులకుఁ బూర్వాంగకర్మములెల్లఁ గావించి విశ్వామిత్రాదిఋషులతోడ యజ్ఞశాలకరుదెంచెను. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు కౌతుకమంగళంబు లొనర్చి సర్వాభరణభూషితులై వసిష్ఠపురస్సరంబుగా విజయాఖ్య ముహూర్తంబునకుఁ దండ్రిని జేరిరి.

'సీ॥ పదతలంబులకెంపు పరఁగినతలము
కుంకుమలిప్తమైనచందము వహింప ;
సంగంబు నునుఁగాంతి యడరినగోడలు
వేదులు మణిమయవిధమునొందఁ
గనుగవ మెఱుఁగులు గదిరినముందఱఁ
బుష్పోపహారంబుపోలుపు దాల్ప
వేనలికప్పుపర్వినమీఁదు నీలదుకూలంబు
మేల్కట్టు కొమరువడయఁ '

తే॥ తాను జొచ్చినకతనఁ దత్స్థానమెల్ల
క్షణములో నూత్నశోభాతిశయము నొంద
జనకరాజేంద్రుసుత సీత సఖులతోడ
మందగతిఁ జేరెఁ గళ్యాణమండపంబు.

ఆమెవెనువెంట నూర్మిళయుఁ సఖీజనవలయితరై వచ్చి చేరెను. ఆమెవెనుకమాండవిని శ్రుతకీర్తిని దోడితెచ్చిరి. అంత వసిష్ఠుఁడు జనకుని డాయఁబోయి 'రాజేంద్రా ! ముహూర్తము సమీపించెను. దాతృప్రతిగృహీతలకు సర్వార్థసిద్ధి యగుఁగాక' యనెను. జనకుఁ డాఋషిని బూజించి 'మహాత్మా ! ఇది మీయిల్లుగాని వేఱుగాదు. మీయింట మీకు వెనుముందులేల? నాతనయలును వైవాహికమంగళాలంకృతలై వేదిమూలంబుల దీప్తవహ్నిశిఖలకరణి నున్నారు. రాముని వైవాహికమంగళంబును మొదట జరిపింపు' మనెను.

వసిష్ఠుఁడంత విశ్వామిత్ర శతానందులను బురస్కరించుకొని, విచిత్ర వితానమును నవరత్నమౌక్తికజాలాభిరామంబును వివిధకుసుమమాలాలంకృతంబును నవపల్లవతోరణమనోజ్ఞమునైన కళ్యాణమండపంబున వేదిఁ గల్పించి గంధపుష్పంబుల నలంకరించి బంగారుపాలికలు మూఁకుళ్ళు ధూమపాత్రలు శంఖపాత్రలు స్రుక్స్రువంబులు నర్ఘ్యలాజాదిపాత్రలు సమస్తము సమకూర్చి యగ్నిఁ బ్రతిష్ఠించి సమప్రమాణదర్భలు పఱచి విధిమంత్రపురస్సరంబుగా హోమముఁ గావించెను. దశరధుఁడు తనముద్దుకుమారునిఁ దోడ్కొని వచ్చి వేదిమ్రోల నిలిపెను. జనకుఁడు తనసుతారత్నమును సీతను గొనివచ్చి యగ్నియెదుటఁ గౌసల్యానందవర్ధనుఁడైనరామునకు నభిముఖిగా నుంచి 'రామా !

'ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా
పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా .'

యని వానిహస్తపద్మమందు సమంత్రకంబుగా జలంబులు ధారవోసెను. దేవఋషిప్రముఖులు సాధువాదములు పలికిరి. మంగళమధురగీతంబులు చెలరేఁగెను ; నానాతూర్య వీణారవంబులు విస్తరిల్లెను.

" హస్తేన హస్తంపరిగృహ్యవధ్వాః ।
సరాజసూనుః సుతరాంచకాసే ।
అనంతరాశోక లతాప్రవాళం ।
ప్రాప్యేవచూతః ప్రతిపల్లవేన ॥
ఆసీద్వరః కంటకితప్రకోష్ఠః ।
స్విన్నాంగుళిః సం వవృతేకుమారి ।
వృత్తిస్తయోః పాణిసమాగమేన ।
సమంవిభక్తేవమనోభవస్య ॥ "

అనంతరము లక్ష్మణునకు నూర్మిళను, భరతునకు మాండవిని, శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని, జనకుఁడు జలధారాపూర్వకంబుగా నిచ్చెను. అంత రామాదులు వారివారిభార్యలకరకమలంబులను గ్రహించి యగ్నిహోత్రునకును వేదికిని జనకరాజదశరథమహారాజులకును ఋష్యాదులకును బ్రదక్షిణ

మొనర్చి విధిపూర్వకంబుగా వివాహంబులు గావించుకొనిరి. పుష్పవృష్టి కురిసెను; దివ్యదుందుభులు మ్రోసెను; గీతవాదిత్రనిస్స్వనంబు లుప్పతిల్లెను; గంధర్వ మధురగానంబులు శ్రవణమనస్సంతర్పణంబు లొదవించెను; సభాసదు లెల్లరు సంతోషరసంబుల నోలలాడిరి. అట్లు కళ్యాణంబులు పరిసమాప్తి నొందెను.

### విశ్వామిత్రనిర్గమనము.

విశ్వామిత్రుఁడు 'ఇయంసీతా' యను శ్లోకంబును సారెసారెకుఁ దలఁచి తదీయభావగాంభీర్యంబులకుఁ దద్దయు హర్షవిస్మయంబు లంది దశరథుని మ్రోలకు రామునిఁ బిలిచి 'రాజా! దశరథా! ఇదిగో నీసుతుని నీకుఁ బదిలముగా నప్పగించితి' నని యుల్లసమాడి, రామునివంక మరలి 'వత్సా! జనకునిభావంబును గ్రహించితివా? వానివచనంబులు ధ్వనిప్రాణితములై తలంచుకొలఁది మహానందంబును గూర్చుచున్నవి. సమస్తధర్మములకు సారమై జీవయాత్రకు రాజమార్గమై వెలయునట్టి యతనిపలుకు లంతరాత్మపలికినవి గాని యొండుగాదు. వానిభావములఁ గలకాలము మఱువరాదు. ఏబాలారత్నం బపరిచ్ఛేద్యసౌకుమార్యలావణ్యంబులందు లోకాతీతయై వెలయునో, ఏమహామంగళ యయోనిజ యని విన్నదిసుత తద్విలోకనకుతూహలము త్వరించి నిన్నిటకుఁ దెచ్చెనో, ఏకళ్యాణీసందర్శనంబు విద్యుల్లతవలె నీకు మహాసంరంభముఁ గలిగించుచున్నదో, అనవరతభావనాప్రకర్షంబునంజేసి యేపుణ్యవతి నెల్లెడలఁ జూతువో, యేయలేఖ్యతనూవిలాసినీప్రతిబింబంబును గళ్యాణమండపరత్నస్తంభంబులఁ గాంచి విక్షిప్తనయనుఁడవైతివో, శివచాపఖండనరూపమైన యనన్యసాధ్యకార్యంబునకు సముచితపారితోషికంబుగా నీ కేసర్వమంగళ సంప్రాప్తయయ్యెనో, ఏమహనీయచరితనీప్రాప్తికై తపించి యీరూపంబున నవతరించెనో నీయవతారసాఫల్యమే భాగ్యవతివలనఁ జేకూడనున్నదో, అయోనిజయు నుడివోని నిసర్గమధురయునైన యేమంగళకరి లీలామానుషవిగ్రహునకు నీ కెంతయుఁ బ్రాణంపుఁబ్రాణమై తనరునో, ఏకోమలమతితేజస్సు పీడ్యమానమయ్యుఁ బ్రజ్వలింపక మార్దవమధురమై నీకెంతయు శోభావహముగా నుండునో, భాగీరథి నీపూర్వులనుఁ బోలె నేధన్యచరిత మహోత్కృష్టస్వగుణసంపత్తింజేసి నీకులంబు నెల్ల నుద్ధరించునో, అగర్భపరిపూతయైన యేమానవతి పోష్యపోషకసంబంధమాత్రం

బున జనకసుతగా భావింపఁబడుచున్నదో, లోకైకవీరుఁడవైన నీకుఁ గూడఁ గార్మికవ్యాపారోపదేశకరి యగుటంజేసి యేలోకపావని నీసహధర్మచరి యగుట యక్షరాక్షరముల సత్యమో, అనగతనిఖిలజగత్కారణభావుండవైన నీవు దక్కనన్యుఁ డేపరిశుద్ధవతీకరపల్లవంబును స్పృశింపఁదగఁడో, ఉపచారంబుల శిష్యయై హితోపదేశంబులఁ జెలియై యుపభోగంబులఁ బ్రియయై యేకాంతారత్నము నీకు నిరంతర మింపుసొంపు గూర్చుచుఁ దోడునీడవలెఁ జరియించునో యట్టినీభాగ్యదేవతను సీతాదేవిని గూడి స్వధర్మరతుఁడవై శాశ్వతకీర్తిసుఖంబులు చూఱలాడుము. వత్సా! నాక్రతువు సమాప్తమైనది గావున నికఁ దపశ్చరణార్థము హిమాద్రికిఁ జనువాఁడ” నని వచించి దంపతులనెల్లర నాశీర్వదించి జనకదశరథులవీడ్కొని చనియెను.

### జనకోపదేశము.

వైవాహికవైభవంబులెల్లఁ దీఱినంతట జనకుఁడు తనసుతలకుఁ గనకవస్త్రాభరణంబులును గజతురంగవస్తువాహనంబులును దాసీదాసజనంబును యథార్హ మొసఁగి యొక్కొక్కరినిఁ గౌఁగిట గూర్చి మూర్కొని

చ॥ పతి కెదురాడకమ్మ, సతిభక్తిని జూపుము కోన్యస్థైఖరిన్
హిత మొనరింపుమమ్మ నిజభృత్యులకెపుడుఁ గొల్వుమియత్తమామలన్
వెత లవి యెన్నిగల్గినను వీడకు ధర్మము వేయునేల ? య
ద్భుతగతిఁ గీర్తిఁ గూర్పు మొగిఁ బుట్టినయింటికి మెట్టినింటికిన్.

అని పరమహితం బుపదేశించి యల్లురతోడఁ బుత్త్రికలను సాగనంపి మరలి వచ్చెను. మాలిమిశక్తి యెట్టిదో గాని విజితేంద్రియుఁడైన జనకుఁడు గూడఁ బుత్త్రికావియోగంబునకు వ్యసనకలుషితచిత్తుఁడై

“ఉ॥ కుందు జనించె నేఁగెడు శకుంతల యిప్పుడె యంచు బాష్పపుం
గ్రందు నడంప లోవెలుఁగు గాడ్పడెఁ జింతకుఁ జూపుమాన్పడెన్
వందర నిట్లు ప్రేమ వనవాసిని నేఁ దమఁ బాసి క్రొత్తగా
నందన లేఁగ నా వగమనంబున నెట్లు గృహస్థు లోర్తురో ?”

అనుకాశ్యపవచనంబులు తలంచి వెచ్చనూర్చెను.

# తృతీయమండలము.

### రామపరశురామసమాగమము

దశరథుఁడు తనయులను గోడండ్రను వెంటఁగొని తరలి కొంత దూరము చనఁగాఁ ద్రోవలోఁ బక్షులు గుమికూడి వికృతముగాఁ గూసెను; మృగములు ప్రదక్షిణము గావించెను. దశరథుఁ డాశకునంబులఁ బరికించి వసిష్ఠునితో 'గురువర్యా! పక్షులవికృతారావంబులు పరమాశుభసూచకంబులందురు; మృగప్రదక్షిణంబులు శుభసూచకంబని వచింతురు. రెండు మనకిప్పుడు సంభవించెను. ఏమోదిగులగుచున్న' దనెను. వసిష్ఠుఁ డది విని 'రాజేంద్రా! భయము వలదు. అశుభములు శుభములవలనఁ బ్రతిహతమగు' ననెను. అంతలోన వాయువు ప్రచండమై నిర్ఘాతధ్వని వీచి భూమినెల్లఁ గ్రక్కదల్చెను; వృక్షంబులు ఫెళఫెళారావములతో నున్మూలితములై విసరిపడసాగెను; రవిమండలంబును గాఢచీఁకట్లు గ్రసించెను; దిక్కులు నిస్తేజ మొందెను. ఆవిపరీతంబులకు వసిష్ఠదశరథులును రాజపుత్త్రులును దక్క దక్కినవారు భయభ్రాంతులై మూర్ఛిల్లిరి. అంతలోనఁ గైలాసమువలె నున్నతుఁడును గాలాగ్నికరణి దుస్సహుఁడును దేజోరాశిక్రియ దున్నిరీక్ష్యుఁడునైన యొకఁడు జటామండలముతో మూపున వ్రేలాడుచున్న పరశుతూణీరంబులతోఁ ద్రిపురాంతకునివలె మహాభీకరుఁడై వారి యెదుటఁ దోఁచెను.

దశరథుఁడు వానిం గాంచి 'గురువర్యా! జ్యోతిర్జ్వాలాప్రచయజటిలమైన కుఠారతూణీరంబులు మూఁపున వ్రేలాడుచున్నవి; కటిభాగంబున మౌంజీపల్కలంబులు వ్రేలుచున్నవి. హస్తాగ్రంబునఁ గోదండంబును వలయీభూతలోలాక్షసూత్రంబును వెలయుచున్నవి. ఉగ్రశాంతరసంబులు వివర్తమొందుచున్నవో యన నితనివేషంబున దోఁచుచున్నది. ఏనిని గాంచ మహాభయమొదవె' నని వసిష్ఠునితో బలికెను. అది విని 'రాజేంద్రా! ఇతఁ డెవఁడో యెఱుఁగవా? ఏధార్మికోత్తముఁడు క్రౌంచమహీధరశిఖరమును బాణాగ్రంబునదొలిచెనో ఏదానవీరుఁడు ధాత్రీతలంబునెల్ల ధారాగతమొనర్చెనో ఏరణశౌండీరునకుఁ బయోనిధి ప్రత్యగ్రక్షితిఖండదండనవిధి క్రీడావిశేషంబునకు విధేయమయ్యెనో ఏవీరాతివీరుఁడు షణ్ముఖునితోఁ బోరిజయంబుగాంచెనో హైహయరాజేంద్రుని యుద్ధామ

దోఃకాంతార మెవ్వనిక రాంతరవిలసత్కుఠారాగ్రంబున నిర్మూలితమయ్యె నో యాధీరుఁడు పరశురాముఁడు సుమీ' యితడనెను. ఆమాటతోడ దశర థుఁడు నిలువెల్ల గగుర్పాటొంది 'కటా ! పితృవధామర్షిగ్రస్తుఁడైన యితఁడు క్షత్రసంహారంబును మరల దలపెట్టి వచ్చెనా యని దగ్గుత్తుకతోఁ బలికెను. ఇట్లు వసిష్ఠ దశరథులు లోలోన గుసగుసలాడి యర్ఘ్యము గైకొని యాభీమ దర్శనుని డాయఁబోయిరి.

పరశురాముఁడు ఋషిసత్కారంబును మాత్రము గ్రహించి దశరథ జ్యేష్ఠకుమారునివంక మరలి 'రామా ! నీపరాక్రమాతిశయంబును లోకము వేనోళ్ళ చాటుచున్నది. తాటకను వధించితివఁట ; మారీచ సుబాహులను బరిమార్చి గాధేయునిమఖముఁ గాచితివట ; ఫాలాక్షునికోదండంబు నవలీల ద్రుంచితివఁట; ఈకడపటి కార్యముమాత్రంబచింత్యాద్భుతము. ఈకతలెల్ల విని నీబలంబును బరీక్షింపవచ్చితిని. ఇదిగో నాచేతిచాపంబును జూడుము. దీనిని నాతండ్రి జమదగ్ని నాకొసంగెను. దీనిని మోపెట్టి నీలావు చూపుము. ఇది సేయుదువేని నాతోడిద్వంద్వయుద్ధంబునకు దగుదు' వనెను.

ఆవచనంబులు చెవిసోకినంతనే దశరథుఁడు చింతాభయవ్యగ్రాంత రంగుఁడై కయిమోడ్చి 'మహానుభావా ! నీయందు క్షత్రరోషము ప్రశాంత మయ్యెను. బ్రాహ్మణుఁడవు మహాయశశ్శాలివి స్వాధ్యాయతత్పరులగు భార్గవులవంశంబున జనించి ప్రతిజ్ఞాపూర్వకంబుగా నింద్రుని మ్రోల శస్త్రసన్న్యాస మొనర్చి ధరామండలమెల్లఁ గాశ్యపునకు ధారాగత మొనర్చి దిగంతకీర్తిఁ గాంచినపుణ్యాత్మా ! సత్యసంధాబంధురా ! త్యాగిలోక రత్నమా ! నాతనయులైన యీబాలురకు నభయప్రదాన మనుగ్రహింపుము. మాప్రాణంబు లీరామునందున్నవి. రక్షింపు' మని ప్రార్థించెను.

పరశురాముఁ డాభీరుని వచనంబులు జీరికిఁ గొనక 'రామా ! తొల్లి విశ్వకర్మ బహుప్రయత్నపూర్వకంబుగాఁ జాపద్వయము నిర్మించెను. అం దొకటి త్రిపురాసురయుద్ధమునాఁడు దేవతలు శివునకు సమర్పించిరి. రెండవ దానిని విష్ణుదేవున కిచ్చిరి. దేవతలట్లు కార్ముకముల రెంటిని శివకేశవుల కిచ్చి యాయిరువురబలాబలంబులు తెలియఁగోరి బ్రహ్మను బురికొల్పిరి. అతఁడు హరిహరులకుఁ బగకల్పించెను. మహాంతకపుదాంతములు కదిసి

ఘోరసంగ్రామ మొనర్చిరి. విష్ణునిహుంకారంబున శివచాపము జడత నొందెను. ఫాలాక్షుండు మహోగ్రుండై కనులెఱ్ఱజేసెను. అంతలోన దేవర్షిచారణాదులు వచ్చి ప్రళయం బాపుమని సహస్రవదనంబుల వారిని ప్రార్థించిరి. శివకేశవులు మనస్కరించి శాంతించిరి. విష్ణువే పరాక్రమతముఁ డనెడిఋష్యాదులయాంతరంగికభావంబును శివుఁడు గ్రహించి యలిగి తనచాపంబును విదేహాధిపుఁడైన దేవరాతున కిచ్చెను. దానిని నీవు జనకరాజసభయందు ఫెళ్ళున విఱిచి పెల్లుకీర్తిఁ గాంచితివి. విష్ణువు తనధనుస్సును ఋచీకునకిచ్చెను. అతఁడు దానిని నాతండ్రి కొసగెను. నాజనకుఁడు న్యస్తశస్త్రుఁడై తపం బాచరించుచుండఁగాఁ గార్తవీర్యార్జునుఁడు వానిని జంపెను. ఆధూర్తదుండగము నాయెదలో క్షాత్త్రంబును రగిల్చెను. అంత నేను క్షత్త్రియకుల సంహారంబును సంకల్పించి పలుమాఱు క్షత్త్రియులను బరిమార్చి తద్రుధిరంబులతో బితృతర్పణక్రియ లొనర్చి క్షోణీమండల మెల్ల గైవసము చేసికొని యాగమొండు గావించి క్రతుదక్షిణగాఁ బృథ్వీతలమును గాశ్యపున కిచ్చి మహేంద్రాచలంబునఁ దపంబాచరించుచున్నాను. రామా! నీకతలు విని యిందు వచ్చితిని. క్షత్త్రధర్మంబును మఱువవు గదా. కానిమ్ము నీదోస్సారముఁ బరికించి నీతో మల్లయుద్ధము గావింతు' ననెను.

దశరథునకుఁ బ్రాణంబులెల్ల నెగచినట్లయ్యెను. వానిశరీరము చిమ్మచెమటలఁ గురియ సాగెను. అతఁడు నిశ్చేష్టితుఁడై నోరప్పళించి చేతులు చాచి యట్టే చూచుచు నిలిచెను. రాముఁడు పరశురాముని మాటలకుఁ గినుకదాల్పక వినయము వహించి 'భార్గవా! నీకార్యములు వింటిని; నీపితృభక్తికి సంతసించితిని. అయినను నన్నొకశక్తిహీనునిగా భావించి నీవిట్లు పలుకుట పాడిగాదు. నీగావించిన యవమానము దుస్సహము. ఇదిగో చూడు' మని వానిచేతిశరంబు నందుకొనెను. బాణగ్రహణముతోడఁ బరశురామునిశక్తి గూడ రామునిఁ జేరెను. అంత రాముఁడు విల్లందికొని శరసంధాన మొనర్చి 'భార్గవా! బ్రాహ్మణుఁడవు గావునను మీఁదు మిక్కిలి విశ్వామిత్రునిభగినియైన సత్యవతికిని ఋచీకునకుఁ బుట్టిన జమదగ్నికిఁ గుమారుఁడగుటంజేసియు నీవు నాకెంతయుఁ బూజ్యుఁడవు. ఆకారణంబుల బట్టి నీపయిఁ బ్రాణహరణంబైన యీశరంబును వదలజాలను.

ఈబాణము వైష్ణవంబు గావున వ్యర్థముగా నేలఁబడరాదు. నీపాదగతి శక్తియో భవత్తపోబల సమార్జితంబులైన లోకంబులో నెంతునొకటి దీనిం గుఱి కావలయును. ఇందేది వలతువో చెప్పు' మనెను. ఆయుద్ధముఁ జూచుటకై వచ్చిన సిద్ధచారణగంధర్వులు యక్షరాక్షసులును బ్రహ్మర్షులును నిర్జరులును బ్రహ్మయు రామునకుఁ బరశురాముఁ డేమి బదులాడునో యని యూపిరిబిగియపట్టి వేచియుండిరి.

భార్గవుఁడు నిస్తేజవీర్యుఁడై 'రామా! భూమండలమునెల్లఁ దొల్లి కాశ్యపునకు దత్తమొనర్చితిని. నాభూమియందు నుండరాదని యతఁ డప్పుడు కోరెను. రాత్రిపూటమాత్ర ముండరాదని వానికి మాట యిచ్చితిని. ఆకారణంబున నేను సూర్యాస్తమయములోపల మహేంద్రగిరికిఁ బోక తీఱదు. కావున నాపాదగతిని హరింపవలదు. తపోబలంబున నార్జించిన పుణ్యలోకంబులను వేయుము. కాలవిలంబనము వలదు. విష్ణుచాపంబును మోపెట్టినప్పుడే నీవు సాక్షాద్విష్ణుండని గ్రహించితిని. నీకు శుభమగుఁగాక. నీయమానుషకార్యంబునుఁ జూడఁ బర్యుత్సుకులై యిదిగో నిర్జరాదులు వచ్చియున్నారు. త్రైలోక్యనాథుఁడవైన నీవలన నేను బరాజయమొందుట యెంతమాత్రము లజ్జాకారణము గాదు. శరమును విడువుము. బాణమోక్షానంతరము మహేంద్రగిరికిఁ జనువాఁడ' నని చెప్పెను.

రాముఁ డంత శరవిమోచనముఁ గావించెను. ఆబాణము క్షణములోపల బరశురామతపస్సార్జితలోకంబులను హరించెను. అంత జామదగ్న్యి రామునకుఁ బ్రదక్షిణ మొనర్చి మహేంద్రాద్రికిఁ బోయెను. దిశలు ప్రసన్నంబులయ్యెను. సుఖవాయువులు వీచెను. నిర్జరాదులు విస్మయమంది రాముని బహుముఖంబులఁ బ్రశంసించిరి. దాశరథి ప్రశాంతమనస్కుఁడై యాశరచాపంబులను వరుణునకు నొసఁగి వసిష్ఠాదులకు నమస్కరించి, భయవివశుఁడై యున్నతండ్రిని జూచి 'నాయనా! పరశురాముఁడు చనెను; ఇఁక మనము చతురంగబలసమేతంబుగా నయోధ్యకుఁ దరలనగు. చాతకంబులు వర్షంబును బలె సేనాపటలము మీయాజ్ఞ నిరీక్షించుచున్న' దనెను. దశరథుఁడంతఁ దెప్పిఱిల్లి తనకొడుకులు పునర్జన్మ మెత్తినట్లుగా భావించి రాముని గవుంగిటఁ గూర్చి మూర్ధాఘ్రాణంబులు చేసి ప్రయాణంబునకు ననుజ్ఞ యిచ్చెను. ప్రయాణమును సాగించిరి.

అట్లు చనుచు వసిష్ఠుఁడు రామున కిట్లనియెను.

'వత్సా ! రామా! ఈ పరశురాముని చరిత్ర వింటివా. కన్యాకుబ్జ దేశంబున గాధియను పేరి రాజొకఁడుండెను. ఆ గాధి యనువాఁడు చంద్ర వంశ్యరాజులలో మొట్టమొదటివాఁడైన పురూరవునివంశ్యులలో నొక శాఖ యందు జనించెను. ఆగాధికి సత్యవతియను పుత్త్రిక యుండెను. ఆసత్యవతిని భృగువంశ్యుఁడైన ఋచీకుఁడనువాఁడు పెండ్లియయ్యెను. ఆకాలమందు బ్రాహ్మణులు కన్యారణముగా వేయి యశ్వములనిచ్చు సంప్రదాయ ముండెను. ఋత్విజుఁడు నిజతపోమహిమచేత గంగాదేవిని మెప్పించి వరుణుని యనుగ్రహంబున నుత్తమోత్తములైన యశ్వములను వేయింటిని బడసి గాధికి సమర్పించి తత్తనయను గ్రహించెను. గాధియు ఋచీకుని తపో విశేషంబున కెంతయు సంతుష్టుఁడయ్యెను.

ఋచీకుఁ డట్లు సత్యవతిని బెండ్లాడి యామెతో సుఖముండగా నొక నాఁడు ఋచీకుని తండ్రి పుత్త్రుని జూచుటకై యతని యాశ్రమమునకు వచ్చి, కోడలి సౌశీల్యాదుల కెంతయు మెచ్చి కోరిన వరమిత్తునని యామె తోఁ బలికెను. సత్యవతి యందులకుఁ బరమప్రీతయై తనకునుఁ దనతల్లి కిని బుత్త్రసంతానమును గోరెను. ఋచీకుని తండ్రి వల్లె యని పాయ సాన్నపాత్రములు రెండిచ్చి 'ఈపాయసము మంత్రపూతము ; ఇందొకటి నీవును రెండవది నీతల్లియు భుజింతురేని, నీకోర్కి సిద్ధించును. మఱియుఁ బుణ్యదివసంబున నీవు మేడిచెట్టును నీతల్లి అశ్వత్థవృక్షంబును స్పృశింప నగును.' అని పలికి యెవరేపాత్రలోని పాయసంబును భుజింపవలసినది వేఱుచేసి చూపి యంతర్హితుఁ డయ్యెను.

సత్యవతి యీసంగతి నామె తల్లికిఁ జెప్పెను. ఆమె యది విని ఆఋషికి నాయొదకన్న నతనికోడలగుటంజేసి సత్యవతియందుఁ బ్రేమ మెండుగా నుండక తప్పదు. కావున నతఁడువాని కోడలికిచ్చిన పాయస మందు గుణాధిక్యత యుండును.' అని తలపోసి సత్యవతిపాత్రను దాను గైకొని తన పాత్రను సత్యవతి కిచ్చుటయే గాక తాను మేడిచెట్టును స్పృశించి సత్యవతిని అశ్వత్థవృక్షంబును స్పృశింపఁ జేసెను.

కొన్నాళ్ళకు నిరువురుం జూలుదాల్చిరి. సత్యవతి జమదగ్నియను పుత్త్రుని గాంచెను. ఆమెతల్లికి విశ్వామిత్త్రుండు పుట్టెను. ఆపాయస పాత్త్రాదులవినియమము నమ్మహర్షి గ్రహించి 'సత్యవతీ! నీతల్లిగావించిన కార్యము ఫలముగా నీపుత్త్రుండు బ్రాహ్మణసంభూతుం డయ్యు క్షత్త్రవంతుండు గానుండును. నీతల్లికొన్ను క్షత్త్రబీజంబునకు జనించినను బ్రాహ్మణ గుణసంకలితుండు గా నుండు' ననెను.

సత్యవతి యా మాటవిని 'మహాత్మా! బ్రాహ్మణపతివలన నాకు క్షత్త్రగుణపుత్త్రుండుదయించుట కొంతయు దురపిల్లుదు. నాయెడం గరుణించి నాకూన బ్రాహ్మణగుణశాలిగాను వానికిజనించువాండు మీరన్నట్లు క్షత్త్రగుణాన్వితుండు గా నుండు నట్లనుగ్రహింపు'మని ప్రార్థించెను. ఆ ఋషీంద్రుం డట్లేయగు ననెను.

అందువలన విశ్వామిత్త్రుండు క్షత్త్రియుండగు గాధికిజనించినను నిజ తపోమహిమంబున బ్రాహ్మణత్వమును బడసెను. జమదగ్ని కొన్నాళ్లకుం బ్రసేనజిత్తు అను రాజుకుమార్తెను రేణుకయను దానిని వివాహమాడెను. వానికి నామెవలనం బరశురాముండను పుత్త్రుండు జనించెను. అతండు పరశువుం (గండ్రగొడ్డలి) నాయుధముగా ధరించుటం జేసి వానికి నట్టిపేరు సార్థకనామమయ్యెను.

ఇట్లుండగా నొకనాండు రేణుక స్నానార్థము పోయి వచ్చుచుండంగా గంధర్వరాజు చిత్త్రరథుం డనువాం డామెకంటంబడెను. ఆమెకు వాని యందు మరులు జనించెను. ఎప్పుడట్టిభావ మామెయెడం గలిగెనో యప్పుడే యామెనైజతేజస్సు కప్పుదాల్చెను. ఆమె యింటికి వచ్చినంతటం జమదగ్ని యామెముఖలక్షణములను గాంచి తపోదృష్టిచేత సంగతిని గ్రహించి, వాని కొడుకులను నలువురను జీరి 'మీతల్లి దుష్టభావయయ్యెను గావున దాని తలను ద్రుంపనగు' ననెను. మొదటి ముగ్గురుకొడుకులు నందులకు సమ్మతింపరైరి. జమదగ్ని వారిని జడములగుమని శపించెను. నాల్గవ కుమారుండైన పరశు రాముండు తండ్రియాజ్ఞను దలందాల్చి తనగొడ్డటం దల్లితలం దటిగెను. జమ దగ్ని వానికెంతయు (బ్రీతుండై 'కుమారా! నీయిచ్చవచ్చిన వరమును గోరు మిచ్చెద' ననెను.

పరశురాముఁడు వానికి మ్రొక్కి 'తండ్రీ ! నాతల్లి పునర్జీవితురాలగునట్లును, ఆమె తలనఱకుట యామెకు జ్ఞప్తియుండకుండు నట్లును, నా సోదరులు ముగ్గురు యథాపూర్వమగునట్లును వరమును ప్రసాదింపు' మని కోరెను. జమదగ్ని యట్లే యనెను. రేణుకాదులుం దోడ్తోడ యథాపూర్వమైరి.

ఆకాలంబున హైహయరాజ్యమును కృతవీర్యునికుమారుఁడు అర్జునుఁడను మహాప్రతాపశాలి పరిపాలించుచుండెను. కృతవీర్యుని తనయుఁడగుటం జేసి వానిని గార్తవీర్యార్జునుఁ డనిరి. అతఁడు నారాయణావతారమైన దత్తాత్రేయుని గూర్చి తపస్సు చేసి, వానివలన సహస్రబాహువులును సువర్ణ రథమును బడసి తద్వరగర్వోద్ధతుఁడై లోకకంటకుఁడుగాఁ బరఁగి కొండొక నాఁడు జమదగ్ని యాశ్రమమునకు వచ్చి వాని హోమధేనువును బలాత్కారముగాఁ గొనిపోయెను. పరశురాముఁడు కార్తవీర్యుని వెంటనంటి వానితోఁ బోరి తదీయ బాహుసహస్రంబును ద్రుంచివైచి వానినిసంహరించి తన పగఁ దీర్చికొనెను.

కొండొకనాఁడు కార్తవీర్యుని పుత్త్రులు తమపగ దీర్చుకోదలఁచి జమదగ్ని యాశ్రమమునకుఁ జని యప్పుడచ్చటఁ బరశురాముఁడు లేకుండుట యెఱింగి, తపోనిష్ఠలోనున్న జమదగ్నిని జంపి వచ్చిరి. పరశురాముఁ డాశ్రమంబునకు వచ్చి తండ్రిపాటుఁ గాంచి సంగతి విని క్రోధదుర్నిరీక్షణ మూర్తియై క్షత్త్రవంశము నిర్మూలమగు నందాక నాపరశువును క్రిందఁబెట్ట నని శపథముఁగావించి, క్షత్రరాజసంహారార్థ మిరువదియొక్కసార్లు దండయాత్ర గావించి, క్షత్రియులనెల్ల మట్టుపెట్టి తద్రుధిరంబులచేతఁ గురుక్షేత్రమందు నేనుమడుగులు గావించి యారక్తములతో నిజపితృతర్పణ మొనర్చెను. ఆయైదుమడుగులే నేఁడును శమంత పంచకమనఁబడును. అప్పుడు వాని తాత ఋచీకుఁడు ప్రత్యక్షమై 'వత్సా! ఇఁక నీయాగ్రహంబు నుడుగు' మనెను. పరశురాముఁ డంతట శాంతి వహించి నిజపాపక్షయార్థము మహాయజ్ఞ మొనర్చి యజ్ఞదక్షిణగాఁ దానుజయించిన దేశమునెల్లఁ గాశ్యపుఁడను వానికి నిచ్చెను. నాఁడుసుత వసుమతికిఁ గాశ్యపియను పేరు వచ్చెను. తక్కినచరిత్ర వానిముఖంబుననే వింటివిగదా.

అయోధ్యానగరప్రవేశము.

దశరథాదులు వచ్చుట విని యయోధ్యానగరవాసులు పట్టణము నెల్లెడ ధ్వజనీపతాకాదులతో నలంకరించి రాజమార్గంబులను జలసిక్తంబుల గావించి పూలు చల్లిరి. పురమెల్ల నానావిధశృంగారములతో శోభిల్లెను. ఆవేడుకలు చూచుటకై బహుదూరమునుండివచ్చిన ప్రజలతో నగరమెల్లఁ గ్రిక్కిరిసెను.

దశరథుఁడు చతురంగబలసమేతుఁడై యపూర్వమహోత్సాహముతో రాఁగాఁ బౌరులు వివిధమంగళవాద్యంబులతోఁడ వానికి నెదురేగి నిండు వేడుకలతో వానిని దోడితెచ్చి పురప్రవేశ మొనర్చిరి.

వారట్లు నగరుచొచ్చినంతనే కౌసల్యాదులు తమకోడండ్రకు రాచ కన్నియలవలన శాస్త్రోక్తములైన యుపచారంబులు చేయించి వారినంతఃపుర మునకుఁ గొనిపోయి యట గృహదేవతలకు వారివలనఁ బూజ లొనర్పించి బ్రాహ్మణోత్తములకు ధనధాన్యధేనువస్త్రాదికము దానమిప్పించిరి. విప్రులును బరమసంతుష్టులై వారిని మహాశీర్వచనమాలికలఁ గైసేసిరి. సీతాప్రభృతులు బ్రాహ్మణాశీర్వచనమాలికలను దలదాల్చి యత్తలకు నిండుభక్తితో మ్రొక్కి భర్తలఁగూడి సుఖముండిరి.

ఇట్లు కొన్నాళ్ళు చనెను. ఒకనాఁడు దశరథుఁడు భరతుని బిలిచి 'నాయనా ! కేకయరాజు నిన్నుఁ జూడఁ గోరి నీమేనమామను బంపెను. అతఁడు వచ్చి దినములు గడచెను. నీవు చని నీతాతముచ్చటలు దీర్చి రమ్మ'ని చెప్పి వానిని బయనము చేసెను. భరతుఁడు తండ్రికిని రామునకును మ్రొక్కి లక్ష్మణుని గవుఁగిటఁ గూర్చి తల్లులను వీడ్కొని శత్రుఘ్నునితోడఁ గేకయ పురికిఁ దరలెను.

రాముఁడు తండ్రి పంపునఁ బౌర్యకార్యములెల్ల నోర్పునేర్పులతో సర్వ జనప్రియకరముగా నెఱవేర్చుచుఁ దల్లులను గురువులను యథాకాలశుశ్రూ .లఁ దనుపుచు నిజశీలవృత్తంబుల నెల్లరహృదయంబులను హరించెను. నులు వానియెడ నిర్వ్యాజవాత్సల్యాతిశయంబులు గురియుచుండిరి.

సీతారాముల దాంపత్యమన్ననో యిట్లని చెప్పరాకుండెను. రాముని మనస్సు సీతయందు లీనమైన దనుటకంటె నొండువిధంబున వాని ప్రేమాతిశయమును వర్ణింప సాధ్యము గాదు. సీతాదేవియు భర్తను స్వమనోధిష్ఠిత ధ్యానమూర్తినిగాఁ గొలువసాగెను. ఇట్లు వారు పరస్పరానురాగబద్ధులై యసాధారణదాంపత్యము వెలయ లక్ష్మీనారాయణులపగిది విలసిల్లిరి.

చ॥ అమరులకోర్కెఁ దీర్ప మనుజాకృతిఁ గైకొని కోసలేంద్రుగ
ర్భమున జనించి రక్కసులఁ బాపి మునీంద్రుమనంబు సేసి యా
శ్రమములు సంచరించి పతిశాపమునుండి యహల్యఁ గాంచి చా
పముఁ దెగటార్చి భూమిసుతపాణి గ్రహించిన రాము మ్రొక్కెదన్ ॥

బాలకాండము

సమాప్తము.

---



# అయోధ్యాకాండము.



ఉ. దైహికమైనద్వంద్వములు తప్పవు త్రోయఁగరావు గాన సం
దేహము మాని సంగమము ద్రెంచి స్వధర్మము నాచరించుటే
దేహికి రాజయోగ మని దెల్పుచు మార్గముఁ జూపినట్టి వై
దేహివిభుణ్ భజింతుఁ బ్రణుతింతును బ్రేమ నితాంతభక్తితోణ్.

### దశరథమంతనము.

రామునియందు రూపపరాక్రమంబులు పరస్పరజిగీషకై మూర్తీభవించెనో యన నొప్పెను. ఆయన నిస్తరంగసముద్రమువలె నిరంతరప్రశాంతహృదయుఁడును మృదుమధురభాషియునై, కృతజ్ఞతాబుద్ధియు ననసూయత్వంబు ననెడి నిసర్గభూషణంబుల ధరించి, యుపకారంబులకుఁ దలంగక ప్రత్యుపకారస్ఫురణగూడ లేక, జ్ఞానశీలురయు వయోవృద్ధులయు గోష్ఠి వినోదించుచు శుక్లపక్షశీతకరునివలె వర్ధిల్లుచుండెను. ఎన్నడును వాని నోట పరుషవచనము రాదు; సత్యముఁదప్ప నొండు పలుకఁడు; వాని భాషణములు స్మితపూర్వకంబులై వినవిన నింపుసొంపులు గూర్చుచుండెను; పరాక్రమంబున సాటిలేనివాఁడయ్యు గర్వంబెట్టిదో యెఱుఁగఁడు; దయారసము నిరంతరము వాని నేత్రకోణంబుల నొలుకుచుండెను.

మఱియు రాముఁడు పరధనమన్న విషప్రాయముగాఁ జూచుచు నాయవ్యయములందు శాస్త్రమార్గము నతిక్రమింపక అసంగబుద్ధితో స్వధర్మము ననుష్ఠించుటయే మర్త్యునకు నుత్తమోత్తమకర్మయోగమని భావించి తన్మార్గదర్శియై ఎలప్రాయపుబాటలెంత జాఱునవిగా నున్నను బతనమొందక జాగరూకుఁడై మెలంగుచు, దేశకాలపరిస్థితులు సమగ్రముగా గ్రహించి పరేంగితజ్ఞానియై, 'విపది ధైర్య' మను నార్యోక్తిని మఱువక, ఆత్మశుద్ధి

యత్యంతము ద్రికరణదర్పణంబులందుఁ బ్రతిబింబించి వెలయుచుండఁగా, వేదవేదాంగరహస్యార్థంబులకుఁ దనప్రవర్తనంబును సులభవ్యాఖ్యానముగా నొనర్చి, స్వపరదోషంబు లెఱింగి లోకైకసాధువనుకీర్తిఁ బడసి విబుధాశీర్వచనపరంపరలకును బ్రజాకృతజ్ఞతాభివందనంబులకును బాత్రమై, యర్థసంపాదనంబున మధుకరకౌశలంబును రాష్ట్రహితైకవ్యయంబున జలదునిత్యాగమును గలిగి, నీతిశాస్త్రంబునకు నిధియై కావ్యనాటకాలంకారసాహిత్యంబునకు మేలుబంతియై సంగీతశిల్పంబులందును వాజివారణశిక్షావిధానమందును ధనుర్వేదరహస్యజ్ఞానమందును వ్యూహప్రతివ్యూహనిర్మాణమందు నద్వితీయుఁడై సమస్తకళలకు మెఱుఁగుకళయో యననొప్పారి బుద్ధియందు బృహస్పతిని క్షమాసంపదయందు ధాత్రిని బరాక్రమంబున సహస్రాక్షుని నతిశయించి, కిరణంబులకు సూర్యుఁడట్లు సకలకల్యాణగుణంబులకుఁ దావలమై శోభిల్లెను.

చ॥ వినయముచేతఁ దండ్రిని వివేకముచేత మనీషివర్యులన్
పెనుపగుదానమానముల భృత్యుల బోషణచేత బీదలన్
పనుపడ నిష్టకారియయి బంధుల గూరిమిచే ననుంగులన్
వినుతనయంబులన్ నృపతివీరుల దన్పెను రాముఁ డెంతయున్.

దశరథసంకల్పము.

అట్లు రాముఁ డసదృశసద్గుణసంపన్నుఁడై యెల్లరకుఁ బ్రియంబు గూర్చుచుండుట దశరథుఁడు గాంచి యట్టిలోకోత్తరగుణవత్తరునిపై రాజ్యభారమును సంపూర్ణముగా మోపి వేడుకజూడఁ గోరి కొండొకనాఁడు తనమంత్రులను రావించి 'సచివోత్తములారా! నానాఁటికి నన్ను ముదిమి పైకొనుచున్నది. మఱియుఁ బీడాసూచకములైన మహోత్పాతంబులు గానవచ్చుచున్నవి. ఇఁక రాజ్యభారమును వహింపనోపను. ప్రజలన్నో తమకు మేలుసేయురాజును గోరుదురు. ప్రజాసేవ యింతటికష్టకార్య మనరాదు. శక్తియున్నంతకాలము జనులకై శ్రమించితిని. అదిచాలనప్పుడు మోయరానిభారమును వహించుట హాస్యకరమేగాక దానివలన ముప్పు గూడనగును. మఱియు ప్రజానురాగము రామునియెడ మెండుగానున్నది. ఈసమయముననే రాముని రాజ్యాధిపతినిగాఁ జేయుట యుక్తము. ఇవియెల్లఁ బర్యాలోచించి నాతనయునకు యౌవరాజ్యాభిషేకముఁ గావింప

నిశ్చయించితిని. ఇది మీకు సమ్మతమేని తడవుసేయక సమస్తరాజులకు శుభవార్త నందఁజేసి కార్యముఁ గొనసాగింపుము. కేకయరాజునకును జనక మహారాజునకును సందేశమందింపఁ గాలము చాలదు. అయినను వారు మనవారే గావున వేఱుగా భావింపరు. మీఁదుమిక్కిలి సంతసింతు' రనెను.

మంత్రులు వల్లెయని చని రేనియాజ్ఞఁ గావించిరి. సామంతరాజులును నాగరజానపదులును వచ్చి పురమెల్ల నిండిరి. దశరథుఁడు నిండుకొలువు దీఱి సభాస్తారులను గాంచి 'ఆర్యులారా! ఇందాఁక నాశక్తికొలఁది ప్రజలను సేవించితిని; ముదిమి దార్కొనెను; తనువు విశ్రాంతిని గోరుచున్నది. అంతరంగభూతులైన వసిష్ఠాదులకు సంగతి తెలిపితిని. రామునియందు రాజ్యభారము మోపి విశ్రాంతిని గైకొందును. నా యీ సంకల్పమును మీరభినందింతు రని నమ్ముదు. ఒండుచో మీమతము దాఁప వలదు. ప్రజాసమ్మతము గానికార్యమును రాజు చేయరాదుగదా' యని వచించెను.

పౌరజనామోదము.

సభాసదులు రేనిభావంబును గ్రహించి తగవుతగము లాలోచించి 'రాజేంద్రా! ప్రజాసేవను జిరకాలము గావించి మీరు డస్సిరనుట సత్యము. ముదిమియుఁ మిమ్ము బైకొనుట నిజము. ఇప్పుడు మీశరీరము విశ్రాంతిని గోరుట వింతగాదు. ఇఁకఁ బరిపాలనక్లేశమును మీకిచ్చుట పాడిగాదు. రాముఁడన్ననో మీయంతటి వాఁడు; రాజ్యభారము వహింప నతఁడెంతయుఁ దగును. మీమతమునకు భిన్నము గలుఁగ' దనిరి. దశరథుఁడామాటలు విని వారిభావమును గ్రహింపనివాఁడు వోలె నటించి 'ఆర్యులారా! ఆహార వ్యవహారములపట్ల మోమోటమి కూడదందురు. ముఖప్రీతికిఁగా మీరిట్లు వచించినట్లు తోఁచుచున్నది. ఏలయందురా? ఎన్నడును మీయనురాగము నాయెడఁ గొదువగాదు. అట్టిమీరు నానోట మాటవచ్చిరాకమున్నె యామోదించుట వింతగదా' యనెను. వారపుడు 'రాజోత్తమా! అడిగినప్పుడు మిన్నకుండరాదు. మీరాజ్యసేవను మేము మఱువఁజాలము. మిమ్ము మనసార వదలినవారము గాము; శారీరకధర్మము లెల్లప్పుడు నేకరీతిగా నుండవు. మీరిప్పుడు విశ్రాంతిని గోరుట వింతగాదు. అదియును

గాక మీయంతవానిని మాకు రాజుగానిచ్చుచున్నారు. ధర్మసంస్థాపనార్థము నీతపఃఫలముగా నెవఁ డవతరించెనో, ముల్లోకంబు లెవ్వాని బహుముఖంబులఁ గీర్తించి యానందింపనున్నవో, జను లెవ్వనిని దమధ్యానమూర్తినిగా గ్రహించి ప్రభాతప్రదోషంబులందు శ్రద్ధాభక్తులతో నారాధించి సంసారసాగరంబును దరింపనున్నారో యట్టిసర్వమంగళాకారుఁడు దయాసముద్రుఁడు సమస్తకళ్యాణగుణధురీణుఁడు త్రిభువనారాధ్యుఁడు శ్రీరాముఁడు మాకు రాజగుట మాపూర్వసుకృతపరిపాకవిశేషముగాక యొండగునా? ఇంతటి మహాభాగ్యమును మీరుమాకుఁ గనికరింపఁదలంచిన నాఁడు మేము వలదనఁ గలమా? మీయావరమునకుఁ గోసలరాజ్యశ్రీ కయిచాచి యున్నదిగదా' యని యేకగ్రీవమునఁ బల్కిరి.

దశరథుఁడు వారిసౌహార్దంబును బ్రశంసించి వసిష్ఠవామదేవాదుల వంక మరలి 'చైత్రమాసము వచ్చెను. ఇదియుమహాశ్రీమంతము; ఈనెలలో మ్రోడులు సైతము చిగుర్చును. ఇది చనకమున్నే రామునియౌవరాజ్యపట్టాభిషేకమునకు నార్యులుపక్రమించుట శోభావహామగు' నని చెప్పెను. ఆమాటతోడ సభాస్థలియందెల్ల జయజయధ్వనులు మాఱుమ్రోగెను. నాటికిఁ గొలువు ముగిసెను.

యౌవరాజ్యాభిషేకయత్నము.

అంత వసిష్ఠాదులు గూడి మంత్రులను బిలిచి 'ఱేనిసంకల్పమును వింటిరిగదా. జాగువలదు ; వలసినసామగ్రిని సంతరింపుఁడు. మణిసువర్ణంబులు నోషధులును లాజాధవళపుష్పమాలికలును మధుఘృతంబులును నూత్నవస్త్రంబులును సర్వాయుధంబులును జతురంగబలంబును రథంబును శుభలక్షణలక్షితమైన గజేంద్రంబును జోడుచామరంబులును ధ్వజశ్వేతఛత్రంబులును గనకకుంభశతంబులును గాంచనశృంగవృషభంబును సమగ్రమగువ్యాఘ్రచర్మంబును బ్రాతఃకాలమునకు ఱేనియగ్నిహోత్రగృహంబున సిద్ధముగా నుండవలయును. అంతఃపురద్వారంబులను నగరద్వారంబులను గంధపుష్పమాలికలతో నలంకరించి వాసనద్రవ్యధూపధూపితంబులు గావింపఁగను, దధిక్షీరసిక్తంబైనయన్నంబును లాజలతోడ బ్రాహ్మణులకు నూర్గురికొలఁది ప్రాతఃకాలంబున నిప్పింపనగును. సూర్యోదయముతోడ స్వస్తివాచకము జరుగునుగావున బ్రాహ్మణులకు ముందుగా సంగతి యందింపుము. నగరమెల్ల

ధ్వజతోరణసమలంకృత మొనర్చి రాజమార్గములందుఁ బన్నీరుకలయంపిఁ జల్లింపనగును. నటీనటగాయకులం సాలంకృతులై రాజగృహము రెండవతోలి కట్టునందుఁ గొలువు తీర్చియుండవలయును. దేవాలయములందును జతుష్పథములందును దేవతలకు నైవేద్యంబులును బ్రాహ్మణులకు భక్ష్యభోజ్యదక్షిణలును యథావిధి నర్పింపవలయును; యోధులు కవచధారులై కటారులు బిగించి ముంగిటఁ దీఱవలయు' నని యాజ్ఞాపించిరి. మంత్రులాప్రకార మొనర్చిరి.

మఱునాఁడు దశరథుఁడు సమస్తరాజులతోడను మ్లేచ్ఛప్రభువులతోడను పేరోలగము దీఱి రామునికై సుమంత్రుని బంపెను. ఆరాకుమారుఁడు తండ్రియాజ్ఞ విని వెనువెంటఁ బయనమై రథమెక్కి సభాస్థానమునకు వచ్చి సారథిచేయూతఁగొని తేరుడిగ్గి మేడమీఁదికిఁ బోయి జనకుని పాదంబులకు మ్రొక్కెను. దశరథుఁడు పుత్త్రునిఁ గవుంగిటఁ గూర్చి తనచెంతనే దివ్యరత్నాసనంబునఁ గూర్చుండఁ బెట్టెను. బాలభాస్కరుని వలన మేరువువోలె రత్నపీఠియుఁ, జంద్రునివలన శరద్గగనంబువోలె సభాతలమును రామునివలన శోభిల్లెను. ఆజగన్మోహనమూర్తిని జూచుచు సభాస్తారులెల్లరు నిర్నిమేషులైరి.

అద్దంబునఁ దనబింబమునట్లు దశరథుఁడు సుతునిఁగాంచి లేనగవు మోమునలరింప 'వత్సా! ప్రజలు నీసుగుణవశవర్తులై నీకు యౌవరాజ్యాభిషేకమును గోరుచున్నారు. తనయుఁడంతటివాఁ డగుటకన్నఁ దండ్రికిఁ బ్రియతరముండునా? పరమపునీతురాలు నీతల్లి నోచిననోములు ఫలించెను. పుష్యనక్షత్రమునాఁడు నీకు బట్టముఁ గట్ట నిశ్చయించిరి. నాయనా! నిసర్గమధురమూర్తికి నీకు నుపదేశింప నేల? అయినను సుహృద్భావంబూఱకుండ నీయనుగావున వచింతును. సర్వానర్థంబులకుఁ గామము బీజము; ఎల్లరకు వినయము పరమమిత్త్రము. జితేంద్రియునకు దుర్లభము గలుగదు. ఈమూఁడు మఱవవలదు. మఱియు రాజు నిజమంత్రులతోడ బ్రత్యక్షముగా వ్యవహరింపవలయును; భృత్యులను బరోక్షమున శాసింపవలయును; ప్రకృతిరంజనమునకన్న వేఱు తలంపు ఏనిక్కి నుండరాదు. ఇంతకంటెఁ జెప్పదగినవి లే' వనెను. ఆ హితోపదేశంబును రాముఁడు తలతో గ్రహించి తండ్రికి నమస్కరించి వానియాజ్ఞఁబడసి తన మందిర

మునకుఁ బోయెను. పౌరులును సర్వాభీష్టసిద్ధియట్లు సంతసించిరి. ఆ శుభవార్తను రాముని మిత్రులు కొందఱు హుటాహుటిఁగొని పోయి కౌసల్యాదేవికిఁ దెలిపిరి. ఆమెయు మహానందభరితయై యావార్తాహరులను వివిధ పారితోషికంబుల మన్నించెను.

దశరథుఁడు సభ చాలించి పోయి యేకాంతమున మంత్రులను బిలిచి 'రేపుగదా పుష్యనక్షత్రము. కార్యము నిలువరాదు' అని హెచ్చరించి పంపి, సుమంత్రుని రావించి రాముని మఱలఁ దోడ్కొని రమ్మనెను. అతఁడు చని తండ్రిపిలుపు తనయునకుఁ దెలిపెను. రాముఁడది విని యేమో యని దోడ్తోడ బయలుదేఱి పోయి తనరాకను జనకునకు నెఱింగించి తదనుజ్ఞాతుఁడై లోనికిఁజని యందుఁగూర్చుండియున్న తండ్రికి నమస్కరించెను. దశరథుఁడు సుతుని నిజాంకమునఁ గూర్చి 'నాయనా! దీర్ఘకాలము నుంటిని ; ఇష్టభోగంబులను యథామతిఁ జూఱలాడితిని ; యాగాధ్యయన దానంబులవలన దేవర్షి బ్రాహ్మణ ఋణంబులఁ దీర్చితిని ; సుఖానుభవమువలన శరీరఋణముఁ బాపికొంటిని ; నిన్నుఁ బడసి పితృఋణముఁ గడగంటిని. ఇఁకఁ గోరదగినదియుఁ బడయదగినదియు నాకు నొండు గలుగదు. అయినను రాజ్యవిషయిక చింతమాత్రము నన్నుఁబాయదు. ముదిమిం జేసి రాజ్యభారము మోయనోపననుట స్పష్టము. అట్టి సందర్భమున రాజ్యమును యోగ్యునిచేతఁ బెట్టుట నాకు ధర్మము ; జాగుసేయవలదని సూచనలు హెచ్చరింపుచున్నవి. ఎట్లందువా? దుస్స్వప్నంబులకు విరమరలేదు ; ఉల్కాపాతములు బహుళముగా సంభవిల్లుచున్నవి. ఈ దుర్నిమిత్తంబులు ప్రాయికంబుగా రాజమరణంబునుగాని తత్సమానమైన ఘోరవిపత్తును కాని సూచించును. ఇందులకుఁ దోడుగా నాజన్మనక్షత్రము ప్రకృతము సూర్యాంగారకరాహుగ్రహంబులచేత నవష్టంభితమై యున్నదని దైవజ్ఞులవలన విందును. ఇట్టి గ్రహస్థితి మేలుగాదు. అన్నియుఁ బర్యాలోచించి నీకుఁ బట్టముఁగట్టుట యుక్తమని నిశ్చయించి యాకార్యముఁ దొఱకొంటిని. వత్సా! నియతాత్ముఁడవై భార్యతోడ నేఁడుపవసించి దర్భప్రస్తరశయనముఁ గావింపుము. శుభకార్యంబులకుఁ బెక్కు విఘ్నములు గలుగుచుండును. నీ సుహృదులు జాగరూకులై నిన్ను సర్వవిధంబులఁ గాపాడుదురుగాక. భరతుఁడు రాకమున్న యీపని జరుగుట

యుక్తము. అతఁడు సదాచారసంపత్తియు ధర్మనిరతియు భ్రాతృవత్సలతయుఁ గలిగి యుండుట నిజము. అయినను జాంచల్యపిశాచము మానవజాతిని వెన్నంటి యుండును. దానినోటఁ బడకుండుటకు నందరుఁజాల' రని వాత్సల్యభయవిహ్వలమైన స్వరమున వచించి రామునిఁ బంపెను. ఆ రాజకుమారుఁడు తండ్రికి మ్రొక్కి సంగతియెల్లఁ దల్లికి విన్నవించువాఁడై యామె యంతఃపురమునకుఁ బోయెను.

అత్తఱిఁ గౌసల్యాదేవి పట్టుచీరఁగట్టి దేవతాగృహముఁజేరి పుత్త్రార్థము రాజ్యలక్ష్మిని గోరి కులదేవతయైన శ్రీమన్నారాయణమూర్తి నిట్లు స్తుతించుచుండెను.

"ఉ॥ ఎవ్వనిచేజనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందుఁబరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వానినాత్మభవునీశ్వరు నే శరణంబు వేఁడెదన్.॥

"క॥ లోకంబులు లోకేశులు,
లోకస్థులుఁదెగినఁదుది నలోకంబగు పెం,
జీఁకటికవ్వలనెవ్వం,
డేకాకృతివెలుఁగు నతనినే సేవింతున్."

శా॥ ఓదేవాధిప ! యోకృపాజలనిధీ ! యోసింధుకన్యాపతీ !
ఓదైత్యాంతక ! యోగజేంద్రవరదా ! యోభక్తచింతామణీ !
ఓదామోదర ! యోజగత్త్రయగురూ ! యోపుండరీకేక్షణా !
ఓదీనావనదీక్ష ! నీపదాబ్జములనెంతోనమ్మితిన్ మాధవా !.

ఉ॥ కాటుకకొండఁ గజ్జలముగా వనరాశి తదీయపాత్రగాఁ
బాటిలధాత్రియన్ పలకపై సురశాఖకలంబుఁబట్టి యా
హాటకగర్భురాణి నలుహస్తములన్ రచియించినన్ జగ
న్నాటకసూత్రి ! నీగుణగణంబులపారము ముట్టనేర్చునే ?

ఉ॥ అందవుబుద్ధికిన్ నుడికి నంతకుముందటె యందవెంచఁగా
నెందును నీవయుండువది యేమి విచిత్రమొ యిట్టులున్ననే,

కొందఱో నిన్నుఁ గొంతఁ గనుగొందురు భావసమాధినిష్ఠ నీ
చందము మౌనిముఖ్యులకు సైతమతీతముగాదె శ్రీపతీ.

ఉ॥ నాయెదగుట్టు నీదుచరణంబుల ప్రోలను వైచి భక్తిపై
దోయిలియొగ్గి నిల్చితిని ద్రోయకుమవ్వలఁ దోయజాక్ష నీ
వే యిఁక నాకుదిక్కు మఱియెవ్వరుఁగల్గరు, ప్రార్థితార్థమున్
జేయుము సేయుమయ్య నినుఁజేరినవారికి సేగియుండునే ?

ఆమె యిట్లు స్తుతించి కొండొకవడి ధ్యానగతాత్మయై యుండి లేచి సాష్టాంగమొనర్చి నిలిచెను. అంతలోన రాముఁడామెను డాసి తదీయ పాదంబులకు నమస్కరించి 'తల్లీ ! నాతండ్రి నన్ను రాజ్యపరిపాలనంబునకు నియమించెను ; పట్టాభిషేకము రేపని నిశ్చయించిరి ; నేఁడు నేను సీతతోడ నుపవసించునట్లు కట్టడి యయ్యెను. వలయుమంగళంబులను మాకుఁ గావింపవేడుదు' ననెను.

కౌసల్యాదేవి హర్షాశ్రువులు నించి పుత్త్రుని గవుఁగిటఁగూర్చి దీవించి 'నాయనా ! సద్గుణంబులచేతఁ దండ్రి నారాధించితివి ; నాతపస్సు ఫలించెను. శ్రీమన్నారాయణమూర్తి యనుగ్రహంబునఁ గోసలరాజ్యశ్రీ నిన్ను వరింపనున్న' దనెను. అంతలోన సీతయు సుమిత్రాలక్ష్మణులు నటకు వచ్చిరి. రాముఁడు తమ్ముని జూచి 'సౌమిత్రీ ! నాయనగారి యాజ్ఞ వింటివా! నీవు నాకు బహిఃప్రాణంబవుగావున నీకొఱకు రాజ్యంబును నాజీవితంబును లెక్కసేయుదు. రాజ్యలక్ష్మి నాతోటి నిన్నుఁగూడ నాశ్రయించియుండును. రాజ్యభోగంబుల నెల్ల నిర్విశేషంబుగా ననుభవింపు' మని పలికి తల్లికిని సుమిత్రకును మ్రొక్కి సీతను వెంటఁగొని, సంతోష వికసితవదనారవిందలైన నారీరత్నములతోను మహాసంతోష వివశమైన సేవకబృందముతోను గ్రిక్కిరిసి ప్రఫుల్లనళినము మత్తద్విజగణము నైన సరోవరంబును బోలియున్న నిజమందిరంబును బ్రవేశించెను.

దశరథుఁడట్లు రామునిఁబంపియు నంతతోఁదనియక వసిష్ఠుని రావించి 'గురూత్తమా ! ఉపవాసవ్రతమును రాముఁడు మఱచునేమోయని శంకయయ్యెడు. మీరుచని వానికి వ్రతక్రమముపదేశించి వచ్చుట మేలని

వచ్చెను. వసిష్ఠుఁడు వల్లెయని బ్రాహ్మణయోగ్యమైన రథమెక్కి రాముని మందిరమునకుఁబోయి కక్ష్యాత్రయము దాటి తనరాక యెఱిఁగించెను. రాముఁడెదురు వచ్చి చేయూఁతయిచ్చి మునీంద్రుని రథమునుండి దింపెను. వసిష్ఠుఁడు వాని నాశీర్వదించి 'వత్సా! నీతండ్రి నీయెడఁ బ్రసన్నుఁడయ్యెను; యౌవరాజ్యముఁ బడయనున్నావు; తెల్లవాఱి యభిషేకమంగళము జరుగనున్నది. భార్యాసహితముగా నుపవసింపు' మని చెప్పి జాయాపతులను సమంత్రకంబుగా నుపవాసవిధినుంచి వారిపూజలంది మరలి వచ్చి యాసంగతి రేనికి వినిచి వానియుత్తలపాటు దీర్చెను.

రాముఁడట్లు సపత్నీకముగా నియతవ్రతుఁడై శ్రీమన్నారాయణ భగవాను నుపాసించి, హవిఃపాత్రమును యథావిధిఁ దలఁదాల్చి యుపాసితదైవంబునుగూర్చి యగ్నిహోత్రంబున నాజ్యహోమమొనర్చి తచ్ఛేషంబును భుజించి, విష్ణ్వాలయమందు దర్భాసనంబున నధివసించి, మౌనవ్రతముఁ బూని నారాయణధ్యానైకపరుఁడై రేయిపుచ్చి, జాము ప్రొద్దుండఁగా లేచి ప్రాతస్సంధ్యఁదీర్చి గాయత్రి జపించి, విష్ణుదేవునకు స్తుతిపూర్వక దండప్రణామంబు గావించి, నీరాడి పీతాంబరము ధరించెను. బ్రాహ్మణులు వచ్చి పుణ్యాహవాచన మొనర్చిరి. ఆఘోషతూర్యనినాదమువోలెఁ బురమెల్ల వ్యాపించెను.

నగరవాసులు తరుతమ భక్తిసంతోషంబుల నొండొరులమించు తలంపులతో వేఁకువనే లేచి వారిముంగిళ్ళు కైసేసిరి. గోపురములందుఁ జతుష్పథములందు రథ్యాప్రదేశములందు రాజమార్గములందు నట్టాలకవిపణిశ్రేణులందుఁ బ్రాసాదమందిరములందు సభాస్థలములందు నున్నతశాఖిశాఖాగ్రములందుఁ జిత్రవిచిత్రములైన ధ్వజపతాకలెత్తబడెను. మార్గాంతరంబులందు సుగంధిజలములును బుష్పములును జల్లిరి. అభిషేకమహోత్సవకార్యములు సమాప్తముగులోనఁ జీఁకటి పడునోయని యందందు దీపవృక్షంబులను విచిత్రముగాఁ దీర్చిరి. నగరమెల్లఁ బ్రజాహర్షతరంగముల రొదతోడనిండి యల్లోలకల్లోలమగుసాగరమును బోలెను. కందువులఁ గూడఁ దమయాటపాటలతో నదేసంగతిగా నుండిరి. రేనిత్యాగబుద్ధియు భావశుద్ధియు వేనోళ్ళఁగీర్తింపఁ బడుచుండెను. జనులు చిరమనోరథసిద్ధు

లట్లు పరమోత్సుకులై స్వశక్తిసంపదల నావంతయుఁ బరిగణింపక మహోత్సవమును శతగుణాధిక మొనర్చుటకై నిండుమనంబుతో సర్వము వ్యయింప సాగిరి.

### విషబీజారోపణము—కైకేయీమంథరలు.

దశరథుఁడు కైకేయియందు మిక్కుటముగాఁ దగిలియుండెను. అట్లుండియు రామయౌవరాజ్యాభిషేకవిషయమై యామెతో సందాఁశ నతఁడు ప్రస్తావింప డయ్యెను. అందువలన నామెకాసంగతియే తెలియదు. మఱియు ఱేఁడు ప్రతిరాత్రి యామెతోఁ బుచ్చుచుండువాఁడు. నాఁటి ఱేయి యేలకో యందురాడయ్యెను. కైకేయి పతికై చాలసేపుకాచి యుండి నిద్రాలసయై కనుగూర్కెను. తెల్లవాఱి యామెకూర్మిదాసి మంధర యనునది ముందుగా లేచి యదృచ్ఛగా మేడయెక్కెను. నగరమెల్ల ధ్వజపతాకలతో నిండియుండెను; వివిధవాద్యంబులు చెవులు గిడ్వడ మ్రోయుచుండెను. ఎల్లెడల జనులు గిటగిటమని యుండిరి; తెల్లనిపూమాలతోరణంబులసువాసనలు గుప్పించెను; గజబృంహితములును హయఘోషలును దుస్సహమయ్యెను; పచ్చతోరణముఁ గట్టని యిల్లేకానరాదయ్యెను. మంధర యావింతఁగాంచి పరమాశ్చర్యమొంది 'ఏమి! ఇది యింద్రజాలమా? కాకున్నఁ దెల్లవాఱులోపల నింతమార్పుగలుగునా? ఏమియుఁ దోపదు' అని దిగాఱుపడి చూడసాగెను. అంతలోనచ్చటికిఁ బనికత్తెయొకటి వచ్చెను. మంధర దానినిగాంచి 'ఈవింతయేమి?' అనెను. అమ్మా! రామునకు యౌవరాజ్యాభిషేకమటు; అందులకుసంబంధించిన మహోత్సవలక్షణములివి యెల్ల' నని యాబోటిపలికెను. ఆమాటతోడ మంధర కోపమూర్ఛితయై రోఁజుచు మేడనుండి హుటాహుటి దిగి పడుచు లేచుచుఁ గైకేయీశయ్యాగృహమునకుఁ బోయి గాఢనిద్రాపరవశయై యున్నయామెను దాసి 'మూఢా! ఇంకను గన్నును విప్పవా? విపత్తుమ్రింగుచుండుట గానక మ్రోడువలె నిద్రింతువా? సిగ్గులేదా? లేలెమ్మ; దుఃఖకూపంబున నిన్ను ద్రోసిరి; అనిష్టా! మహాసౌభాగ్యవతినని మురియుదువు. నీసౌభాగ్యమెల్ల వలసపోయెను. నీగతి యిప్పుడైనను గ్రహింపు' మని రోషదీనస్వరంబునఁ బలికెను.

కైకేయి కన్నులు విచ్చి 'మంథరా! సంగతియేమి? తహతహపడుదు వేల? నీమోము విన్నవోయియున్నది ; కారణమేమి ?' అని నిబ్బరముగా నడిగెను. మంథర కన్నీరు నించుచు 'ఏమిచెప్పుదు ; నోటమాటరాదు. అప్రతిహతమైన వినాశయత్నము నీకుఁ గావించిరి. నాదేహమే నాకుఁ దెలియకున్నది ; ప్రాణములెగసిపోవుచున్నవి ; ఎడద నిలువెల్ల నేర్చు చున్నది ! అయ్యో ? కడలేని విపత్సాగరంబున బ్రుంగితివి; ఏమిసేయుదు! ఏమిసేయుదు ! నీహితము నన్నుఁబాయని కారణంబున జీవముతో నిటరాఁ గల్గితిని. కైకా! నీదుఃఖము నాదుఃఖముగా నీమేలు నామేలుగా భావింతును గాన నీ యీదుర్గతికిఁ జింతింతును. కటా ! ఎంతయాపద ! హా ! దైవమా! మమ్మమఱచితివా? కేకయరాజా! ఏమని నీకు విన్నవింతు! కైకా ! కైకా! ఎంతబేలవు ! ఛీ ! ఇఁక నాబ్రతుకేల ?' అని విలపించెను. కైకేయి యయ్యా గడముఁజూచి యేమియుదోఁపక 'మంథరా ! సంగతిచెప్పవేల! ఏమి విపత్తు వచ్చె'నని మఱిమఱి యడిగెను. మంథర సంగతిచెప్పకయే 'నిర్భాగ్యురాలా! రాచవంశమునఁ బుట్టితివేగాని రాచనడతల కటుకుఁదనముఁ దెలియవు. ఎంత గోలవు ? ఇఁకనైన నీబేలతనమును మానుదువా ? కల్లకపటంబులు నేరవు; కావుననే నీకీగతిపట్టెను. ముఱిపెంబులకు బూరటిల్లుదువు ; తియ్యనిపలుకు లకుఁ గొండయెక్కుదువు. జడమతీ ! నాభర్త ధర్మదేవతయని చాటితివి. ధర్మదేవతయో కర్మదేవతయో యిప్పుడైనను గ్రహింతువా ?' యనెను.

కైక.—చెలీ ! నిష్కారణంబుగా నిందింతువేగాని సంగతి తెలుపవేల ?

మం.—అకటా! దశరథా ! ముద్దుఁజిల్కను గండుపిల్లినోటికి నందించితివా? త్రాచును ముద్దుసేసినట్లయ్యెఁ గదా నీచెలిమి ?

కైక.—అయ్యో ! మంథరా ! ఏమియిది ? పిచ్చిపట్టెనా ? నాపతిని దూఱుదువేల ? సంగతియేమి ?

మం.—కైకా ! నాభర్తకూర్మి నాయందు మూర్తీభవించియున్నదంటివి. వానిటక్కుఁడెక్కులకుఁ జిక్కి సొక్కుదువు. ఆకూర్మినెల్ల నేడతఁడు నీపయిఁ బ్రయోగించెను. ఊడిగపుఁగత్తె వైతివి. ఇఁతకన్న నేమి చెప్పుదు ?

కైక.—మంథరా ! గర్భోక్తులు మాని సంగతి తెలుపుము.

మం.—అయ్యో ! ఈపాడువార్త యేమని తెలుపుదు ? దుఃఖము పొరలి వచ్చుచున్నది ; మాటరాదు.—రామునికి—పట్టముగట్టి నీచేతికి—

రామునకుఁ బట్టముకట్టుదురనుమాట చెవిసోకినంతనే కైకేయి లేచి కూర్చుండి 'అహో ! ఎంతప్రియవార్త ! ఈశుభవార్తను వినిపించిన నీ కేమియీయరాదు ! మంథరా ! ఇదిగో యీ ముత్యాలహారమును బహుమానముగాఁ గైకొనుము. అహో ! ఈవార్త యమృతప్రాయమై నాకు సకలేంద్రియసంతర్పణ మొనర్చుచున్నది. నాభాగ్యమే భాగ్యము. సఖీ ! నీవు నాకుఁగూర్చిన సంతోషమింతనరాదు' అని పలికెను. ఆమాటలకు మంథర మండిపడి 'బాలికా ! ఏడుపునకు బదులుగా సంతోషమా ? శోకసాగరంబునఁ గూలుట యెఱుంగవా ? దుర్మతీ ! నీయజ్ఞానంబునకు నెంతయు వగతు. కన్నకొడుకునుగూర్చినచింత యీషన్మాత్రముగూడ నీకుఁ గలుగదా ? ఇంత నిర్భాగ్యురాలుండునా ? సవతిసుతునిసంపదకుఁ గ్రుళ్ళు వెట్టివగుట నేఁడు గంటిని. కావుననే దశరథుఁడు నీకు వాతఁబెట్టెను. అమ్మా ! రామాభిషేకమునకు నులుసుపోకలువోవుదువు ; భరతునిగతి యేమనుకొంటి ? పరాకుచెందకు ; కడుపారఁ గన్నసుతుని గాచికొనుము. అయ్యో ! భరతా ! నిన్నుఁ దలంచినంతనే నాగుండియలు వ్రీలుచున్నవి. నాయనా ! ఇఁక నీగతియేమి ?' దోసెఁడు గుడ్డయు బట్టెఁడు కూడును గఱువై పొట్టఁజేతబట్టుకొని పస్తుపడిఁ పరులపంచలు ప్రాకి యెట్టకేలకుఁ జివికిచచ్చుకర్మినిఁ గట్టడిదైవము నీనొసఁట వ్రాసెనా ?' యని యెలుఁగెత్తి వాపోవసాగెను.

కైక:—మంథరా ! రామాభిషేకంబునకు భరతుఁడు గూడ సంతసించును సుమా. రామభరతులిద్దఱునాకు నొక్కటేగదా. అయ్యో ! ఈకలవరమేల ? రామునిఁదెలియదా ? తమ్ములనుఁ దనకు సాటిగాఁ జూచును ; స్వార్థమెట్టిదోయెఱుఁగడు; నమ్మినవారికిఁ బ్రాణ మిచ్చును ; మిన్నుమీఁదఁబడినను మిథ్యావచనము పలుకఁడు ; ఆడినమాట తప్పఁడు ; తల్లిదండ్రులయెడ వానిశ్రద్ధాభక్తులింతనరాదు. నిసర్గమాధురీ గుణమట్లు మూర్తీభవించెనో యని వానిని దలంతును. ధర్మజ్ఞుఁడును శిక్షితుఁడును బరి

శుద్ధుఁడునైన రాముఁడు యువరాజగుట రాష్ట్ర సుకృతముగాని వేఱుగాదు.

మం.—ఔనౌను ; చతుస్సముద్ర ముద్రితధరామండలేశ్వరియైన కౌసల్యాదేవికి దాసియైనోసి పనులుచేయు నీసుకృతముమాత్రము సామాన్యమా ? నీజోలినాకేల ? కౌసల్యకు మమ్మేలఁ గుదువఁబెట్టెదవు ? నీకన్నకొడుకును రామునకు సమర్పింపుము. కోడలిని మసుఁగువైచి మూలఁగూర్చుండఁ బెట్టుము. నీకన్నులకల్మి తీఱును. వెఱ్ఱిదానా ! లక్ష్మణుఁడు రామునిమాట జవదాటఁడు. భరతుఁడు లక్ష్మణశత్రుఘ్నులకన్నఁ బెద్దవాఁడు ; రాజ్యాధికారము భరతునకు సన్నిహితము; రామునియనంతరము రాజ్యము భరతవశముగాకమానదు. రాజులన్ననో యశాత్రవరాజ్యమును గోరుదురు. రాముఁడు రాజనీతివేత్తగాని యేతన్మాత్రుఁడు గాఁడు ; వానిసమయజ్ఞతయుఁ బ్రజావశీకరణశక్తియు నింతన రాదు. సంగతి యింతస్పష్టముగానున్నది ; ముంజేతికంకణమునకుఁగా నద్దమును గోరుదువు. నీయజ్ఞానము బోధపడదు సుమా !

కైక :—మంథరా ! నీభావము బోధపడెను. రామాభిషేకము నీకెంత మాత్రము సమ్మతముగాదు. ఆబిడ్డవలన నీవు వేఱుపు శంకింతువు. ఆకూన యెన్నఁడుగాని యెవరికి నెగ్గుసేయఁడు. నీవిట్లు తలఁప నేల ? ఈభ్రాంతి యుడుగుము. భరతునిసంగతి యేమందువా? రాజ్యము జ్యేష్ఠానుగతమగుట ధర్మము. రాముఁడు నూఱేండ్లు రాజ్యమేలుఁగాక. అనంతరమే మనభరతుఁడు రాజుగాఁగలఁడు. తొందఱయేమి ? రాముఁడు నన్నింతో యెక్కువగా శుశ్రూషించును ; నాయభిమతంబు లడుగకయే కురియుచుండును ; వానియందలి నావాత్సల్య మింతనరాదు. రామాభిషేకమును నేనుగూడఁగోరుదు. ఈకార్యభారమును నేనే స్వతంత్రించి వహింతుఁగదా.

మం :—అనర్థదర్శినీ! నీమాధ్యము మానదు. ఆత్మహితమెట్టిదో యెఱుఁగవు.

నీతలవ్రాతయిట్లున్నది కాఁబోలు. రామునితర్వాతనే రాజ్యము
భరతునకువచ్చునని చంకలెగవేయుచున్నావు. నీయట్టి బాలిశ
రాలు జనింపఁబోదు. రాజ్యము జ్యేష్ఠానుక్రమమని నీవే
చెప్పితివి. రామునకుఁ గొడుకు గలుగఁడా? అతఁడు రాజు
గాఁడా? నీసుతునకు రాజ్యమెట్లు దక్కును? పుత్రాభ్యుదయ
మును గోరునట్టితల్లి యిట్లాడునా? అమ్మా! నీకొడుకును గుట్ట
లకుఁదోలుము. నీకడుపుచల్లారును. ఇంతవెఱ్ఱివని తెలియక
నీవెంటవచ్చితిని; నీకుఁగాదు నాయజ్ఞానంబునకుఁగావగతు.
నీకడగండ్లతో నాకుఁబనిలేదు. చేతులారఁ బెంచిన భరతునకై
విలపింతును. నాయనా! భరతా! ఎండకన్నెఱుంగవు; ఆ
గర్భశ్రీమంతుఁడవు; ఇఁక నీగతియేమి? నీయన్న రాజు గా
నున్నాఁడు. దాయాదిమచ్చరమునకు మేరలేదు. క్షత్రియుల
సంగతి చెప్పవలయునా? నాయనా! బ్రదికియున్న శుభములు
పడయవచ్చునందురు. ఇటు రావలదు. నీమేనమామ పంచలు
ప్రాఁకి పొట్టపోసికొనుము. ఇదే నీతల్లికోరిక; కటా! మాలిమి
వలన మ్రాఁకులుగూడఁ బ్రియమగునందురు. నీతల్లి యంతట్టిది
గోరంతయు గాన్పింపదు. నిజము గ్రహించితిని. పాషాణము
నూటి యావిధాత నీతల్లిహృదయము కల్పించెను. కైకా!
రాముఁడు రాజనీతిజ్ఞుఁడంటివి. ఇఁకనీకొడుకునకు నీళ్ళు
వదలుము. ఏలయందువా? భయమనునది యెల్లభూతముల
నావరించియుండును. ఆత్మరక్షణార్థము ప్రాణికోటి పలు
పోకలు పోవుచుండును. ఆత్మకన్న ధనమునెక్కుడు సేయు
దురు. దానికి హానిగలుగనున్నచోఁ దద్రక్షణార్థము ధర్మాధర్మ
ములనుగూడఁ బాటింపరు. అది లోకసహజమేగదా? రాముఁడు
రాజయిననాఁడు రాజ్యరక్షణార్థ మతఁడెంత జాగరూకుఁడై
యుండవలయునో నీవే యూహింపుము. రాజులు రానున్న
యాపదలనుఁగూడ ముందుగా వారింతురు. భరతుఁడు నిర్దోషి
యైనను వానియెడ రాముఁడు దోషము శంకింపవచ్చును. కారణ
మేమందువా? రామునకు భరతుఁడు సన్నిహితుఁడగుటయే

కారణము. అట్లు దోషమును శంకించునేని నీకొడుకును బ్రతుక నిచ్చునా ?—దేవీ! నాయూహలు నిరాధారములు కానగును ; నామాటలు వదురుకూఁతలు గావచ్చును. అట్లేయగుఁగాక. మఱియొకమాట. నీభర్తకు నీవు ప్రాణాధికవుగదా. దయితుని మచ్చికఁజేసి నీసవతిని గౌసల్యనెంతో యవమానించితివి. రాముఁడు రాజయిననాఁడు నీకుఁ బ్రతిక్రియతప్పునా ? ఇది యైనఁ దలపోయవా ?

కైక :—మంధరా ! నీవేమైనఁ జెప్పుదువుగాక ; నారామునివలన మాకెట్టి యెగ్గుఁ గలుగుదు.

చ. వినయము మాతృభక్తియు వివేకము శాంతియు సూనృతంబు నె
వ్వని వలనం బ్రకాశిలుఁ గువాదము లెవ్వఁడెఱుంగఁడెన్నఁడున్ ;
తనయపకారికైనను హితంబొనరించునకాండమెవ్వఁడా
తనయునకివ్విధంబునఁ బ్రతారణబుద్ధులు మాటగట్టుదే ?

మం :—అమ్మా ! నిజమాడిన నిష్ఠురము తప్పదు. రాజు రాముఁడు గానీ మఱియొకఁడు గానీ, కూలిదానికి నాకేల ? ఎవఁడురాజైనను నాకూలి నాకుఁదప్పదు. ఏలుటకునూళ్ళుండవు గాని యెత్తి కొని తినుటకు నూళ్ళుండవా ? రాముఁడెన్నఁడును నాకుఁగీడు ద్రోయలేదు. వానిమే లంతయోర్వనిదానను గాను. నీవెంట నీతండ్రి నన్నుఁబంపుచు 'మంధరా ! బిడ్డను నీచేతిలోనుంచితిని. ఎట్లుకాపాడుదువో' యనెను. ఆమాటకుఁ గట్టువడి నాఁటి నుండి నీతోడిదే లోకముగానుందు.

మ. సరసాలాపములాడువేళఁ జెలియై సౌఖ్యోపదేశంబులన్
బరగంబల్కెడువేళ నొజ్జయయి నీభాగ్యంబు నీమేలు నీ
నిరతైశ్వర్యశుభోన్నతుల్ తనవిగా నిత్యంబు భావించు మం
థర చేదయ్యెను నేఁడునీకు నకటా ! ధర్మంబులేదే యిలన్.

కైక :—మంధరా ! ఈనిష్ఠురములు వలదు. ఎన్నఁడేని నీమాటఁ గాదంటి నా ? రామదూషణము నాకు దుస్సహము. వానింగూర్చి చిన్నమాటలాడకుము.

మం :—ఇది రామదూషణముగాదు. నీకు రానున్నముప్పును దెలిపితిని. ఎంత విప్పిచెప్పినను గ్రహింపవు. భరతుఁడు నీకడుపునఁబుట్టఁడా? వానిమేలు నీకు వలదా! ఆతని సంగతి యటుండనిమ్ము. నీగతిని గూర్చి విచారింపుము. అదియూ వలదా! అట్లయిన మిన్నకుందు. అయిననొక్కమాట. దశరథునకు నీవుఁ గూర్మిపత్నివిగదా.

కైక:—మంధరా! ఈసంగతి యడుగవలయునా!

చ. మురిపపుఁజిల్కగామనుచు, ముద్దులు తాఁగురియించు, జీవితే
శ్వరినిగనెంచి ప్రోచుఁ గనుసన్నలఁ గోర్కులుతీర్చు, నామతం
బరయకసేయడెద్దియుఁ దనంతటఁ, బెక్కు వచింపనేల! మా
యురములురెండు నేకమయియుండు నవస్థలనెల్ల, మంధరా!

మం :—ఈమాట వినుటకెంతయు సంతసింతును. ఆడుదానికినంతకన్న నభ్యుదయమున్నదా?

అమ్మా! రామపట్టాభిషేకము నీకుఁ దెలిసియున్నదని స్పష్టపడెను. ఈపాపిష్ఠురాలు వినరాదని దాచితివా? ఇంత కపటనాటకసూత్రధారిణివగుటఁ నేఁటి వఱకు నేరనైతిని.

కైక:—మంధరా! ఆసంగతి తెలిసిదాపలేదు. అట్లుచేసియున్న రౌరవాదినరకమనుభవింతును.

మం :—అమ్మా! మీయంతరాత్మలు రెండు నొక్కటేయంటివి. ఇట్టిదా మీయొద్దిక? నీకుఁ జెప్పక నీయనుమతి పడయక యింతకార్యమునకు నీవల్లభుఁడు పూనెనా? నీపైనివలపు ఇంతమాత్రమా! తరుణీ! దశరథునిహృదయము కౌసల్యయందు లీనమైయున్నది. వేఱునిదర్శనమేల? నీమాట యటుండనిమ్ము. భరతునియెడ వానికి నిక్కమైన పుత్రవాత్సల్యము గలుగదు. ఉన్నచోఁ గొడుకు తనయింటలేనప్పు డింతపని సంకల్పించునా? సంకల్పించెను బో; పుత్త్రుని రప్పింపఁడా? తల్లీ! పైనికి నీమీఁదను నీకొడుకుమీఁదనుగల ప్రేమవట్టి బూటకము. ఇదినాకెన్నఁడో తెలిసియున్నది. కొఁడెలాఁడినిగా నన్నుఁ దలంతువో యని

యున్నాళ్ళు మ్రింగి మిన్నకుంటిని. నీపతినిగూర్చి పల్లెత్తు మాటయైన నీతోఁబలికితినా ? నీపతినిగూర్చిన నీబట్టుపలుకులు సహ్యములు గాకున్నను జెవియొక్కవిందును. ఏలయందువా ? మీయిరువురకు నణమణలు గలుగునోయని జడిసితిని. నీపడిన ప్రమాదమును నేఁడు నీకుఁ దెలుపవలసివచ్చెను. విధి యిట్లు నానొసఁట వ్రాసినాఁడు. నీకొడుకును దేశాంతరము పంపెను; నీతోమాటమాత్రము చెప్పఁడు; అకస్మాత్తుగా నిట్టిది సంకల్పించెను. కీలకమేమో యూహింతువా ? భరతుఁడింటనున్న నేమోయని నీభర్త శంకించెను, నీవల్లభుఁడు జిత్తులమారిగాని వేఱుగాదు. నీయెడ వానివలపులెల్ల వట్టియభినయములనియు నిట్టికుహనా ధర్మదేవతకు నిత్యముఁ గుసుమార్చనలొసంగుదువనియు నేఁకనైనను నిజము గ్రహింపుము. ముహూర్తకాలము సమీపించుచున్నది.

విష పరిణామము.

మంథర యిట్లు విషగుటికను నానానుపానములలో మెదిపి ప్రయోగించెను. పుత్త్రవాత్సల్యానుపానము గిట్టదయ్యెను; ఆత్మసౌఖ్యానుపానము వెగటించెను; సపత్నీన్యక్కారానుపాన మందకుండెను; కట్టకడకుఁ బతి నిరాదరణరూపమైన యనుపానమొకకొంతే యనుకూలించెను. ఆవిషము కైకేయీగర్భాంతరమునఁజేరి క్రమక్రమముగా నామెకు నిలువెల్ల వ్యాపించెను. ఆదేవి జేవురించినముఖంబుతో నిటూర్పులు వెడల్చుచుఁ గరకమలకీలితకపోలభాగయై వితర్కింపసాగెను. భావపరంపరలు తెరతెరలుగా నామెయెదుటఁ బొడకట్టి విచ్చి మాయముగాఁ జొచ్చెను. 'ఏమీ! నాపతి నన్ను నిరాదరించెనా ! వివాహము మొదలు నేఁటిదనుక యట్టి లక్షణమొక్కటియుఁ గాన్పింపదు. మూర్తిగొన్న నిజప్రేమానురాగముల సర్వస్వముగా నన్ను నావల్లభుఁడు మన్నించును ; నాయీప్సితంబుల నింగితంబులవలననే గ్రహించి యయూచితంబుగాఁ గురియించును; నాతోడిదే లోకముగా వర్తించును. అట్టి నాదయితుఁడు నన్ను నిరాదరించెనను మాట నమ్ముటెట్లు ?—నమ్మకున్న దీనికేమనవలయును ? నన్నుఁగాదని గోరంతపనికూడఁ జేయఁడు. అట్టిప్రియుఁడు నేఁడిట్లు వర్తింపనేల ?

రామాభిషేకము నాకు నెంతో సంతోషకరముగదా. మాటమాత్రమన్నచోఁ గార్యభారమెల్ల నేనే వహింపనా ! ఏదో గుట్టుగలదు.'

'అయ్యో ! నిష్కారణముగా నాహృదయేశ్వరుని శంకించి మహాపాతకము నొడిగట్టుచున్నాను. నాథా ! రాజ్యచింతలోన దివారాత్రంబులు నీకుఁ గడచుచుండును. మైమరచి యొక్కనాఁడును నిద్రించియెఱుంగవు; 'కూలినాలిచేసికుడుచు పేదసుఖంబుఁదక్కదిలను మకుటధారికెందు' అను మాట నీయెడ నక్షరాక్షరముల సార్థమగుట నేనుఁ గన్నార జూచుచునే యున్నాను. ఇట్లు నిరంతరరాజ్యచింతల మునుగుటఁజేసి యీసంగతి నాకుఁ జెప్పమఱచి యుందువు. ఇంతమాత్రానకే పరభావదోషము నీపయి నారోపింపఁ దగునా !

ఉ. ఇంతల నింతగాఁదలచి యీసువహించి దురంతర వ్యథా
క్రాంతమనస్కులై చివికి క్రాగుట కాంతలకెందు నైజ, మీ
వింతగుణంబుగల్గుటలి వేణుల దోసముగాదు, వారిరై
కాంతికభర్తృరాగరసకాంక్షలదోషముగాని యెంచఁగాక్.

'అకటా ! ఎంతవెఱ్ఱి ! భరతునిఁ బంపుట, నాకుఁ జెప్పకుండుట; కార్యము రేపగుట, యివియెల్ల ఊనిభావమర్మమును దేఁటతెల్లము గావించుచుండగా మీనమేషము లెంచుచు స్పష్టార్థమునకు వ్యాఖ్యానముఁ గోరుచున్న నాయట్టి మూఢురాలుండునా ! రాచపనులతొందఱ యొకసమాధానముగా గుదుర్చుకొంటిని. మాటమాత్రము తెలుపుటకు వ్యవధిలేకున్నదా? నాపతి నాకన్నులుమూసి యీపనికిఁ గడగుట నిక్కము. సఖీ ! మంథరా ? మోహప్రభావము నేఁడు విశదమయ్యెను.'

ఆ॥ వె॥ కన్ను మోసగించుఁ గప్పును జిత్తంబు
హితములెల్లఁ జెవికి నేవగించు
మోహజాలికుండు మ్రోలనిల్చినయంత ;
వానిమాయ నేఁడు గాసనయ్యె.

'ఏమి నా యవివేకము ! ముక్కునకు సూటిగాఁ జూతుఁగాని పూర్వోత్తరములు విమర్శింపనైతిని. ముహూర్తము రేపుగదా ? ఇవి రాత్రి నిశ్చయించి యుందురు. ఇప్పుడో యిఁకఁ గొంతసేపటికో నాపతి యుందు

వచ్చి నాకు సంగతిఁ దెలుపును. అంతమాత్రపుఁ దాల్మి లేక యూహా ప్రపంచంబునఁ బరిభ్రమించుచున్నాను. ఈకార్యము నెన్నఁడో నిశ్చయించిరందురా ? అట్లయిన నగరమందు వెల్లడి గాకుండునా ? నాపని కత్తెలు విని నాకుఁజెప్పకుందురా ? ఎట్లు వితర్కించినను నాపతి నన్ను నిరాదరించెనను సిద్ధాంతంబునకు నవకాశముగాన్పింపదు'.

'అట్లేయగుఁగాక. భరతునకు సంగతి తెలిపెనా ? నన్నుగాదని యది చేయుటెట్లు?—హా ! సంగతి స్పష్టమైనది. ఊహాపిశాచమా ! ఇఁక నీమాయదారితననుఁ జాలింపుము. ఈకైకేయిని మోసగింపఁజాలవు. నా సుతుఁడు తప్పక వచ్చును; నాభర్త వానిని రప్పించును. లగ్నమెప్పుడు? తెల్లవాటినఁగదా ? ఇంతలో నాకూన వచ్చుటెట్లు ? నాల్గురోజులు ప్రయాణము సాగినఁ గాని యటకుఁ బోఁజాలరు. ఇప్పటి దనుక నెవరినిఁ బంపరైరి. ఇఁకఁ బోవుట, వాఁడు వచ్చుట కల్ల. ఏదో మర్మముగలదు. మంథరయూహలు కేవల నిరాధారములు గావు ; పాపము ! దాని నన్యథా భావించితిని ! ఆ ! ఇప్పటికి బోధపడినది. నాపతి పరమసాధువు. అమాయకుఁడు. ఈమహావ్యూహమును నాసవతిపన్నెను. తనకొడుకునకు రాజ్యమును గట్టునెపంబున నన్నాబోటి యేలఁదలంచి యీయెత్తువైచెను. నాపతి దాని జాలములోఁ జిక్కెను. నాతండ్రి కేకయరాజగుట, నేనుపుట్టినది శుద్ధ క్షత్రవంశమగుట, పెరిగినది రాజాస్థానమగుట మఱచెనా ? ఇంత మాత్రానకే వేలనగుదునా ? కౌసల్యా ! నీవు విషబీజమును నాటితివేగాని యది మొలచుటకల్ల. అది యంకురించెనేని నాదియు నొకబ్రదుకా ? ఇదిగో నానేర్పు చూడుము.' అని యామె పెద్దయుండదవు వితర్కించి కృతనిశ్చయరాలై 'మంథరా ! నీమాట నిజము. ఇదంతయు నాసవతిజాలము, ప్రతిక్రియ యూహింపు' మనెను.

కైకేయి యట్లు పలికినంతనే మంథర లోలోన సంతసించి 'అమ్మా ! ఊడిగపుఁగత్తె యెక్కడ? యీసంవిధానమెక్కడ? పనిపాటలు చేయుటో చీరనారలందిచ్చుటో నేపథ్యములు రచించుటో నాబోంట్లకగుఁ గాని యిట్టి పనులకుఁ జాలుదుమా ? రాచకులమునఁబుట్టలేదు ; పెద్దచదువులా చదువ లేదు; లోకపరిజ్ఞానమునకు మాకుఁ గడుదూరము ; తలంపులు ముడివెట్టుట

విచ్చుట యెన్నడు నేరను. ఇట్టిదా నీకుపదేశించుట ! ఇంతయుల్లసమా? నేనుండుట నీకు వెక్కసమైనచో దారిఁబట్టుదు. నీయుపదేశికుఁడు దశరథుఁడుండఁడా ? ఆ నీప్రియుని నీమనోహరుని నీసర్వస్వము నడుగరాదా ? ఆ తంత్రజ్ఞుఁడు నీచేతిలోనుండగాఁ బరుల నడుగనేల ? దశరథప్రేయసీ! ఎగతాళి యిఁకఁజాలు. ఏలువారికి రాజ్యాలు గలుగవుగాని బిచ్చగాండ్రకు దేశాలం పెక్కుగలవు. నలువ నాఁడు మానొసట వ్రాసిన వ్రాఁత నేఁడు దప్పదు. కూటికెంత పేదలమైనను గులమునకుఁ బేదలముగాము. పుంటిపై మల్లు గ్రుచ్చవలదు' అని నిష్ఠురములాడెను.

'నావుడు మంధరా ! పరిహాసముగాదు ; నిజముపలుకుచున్నాను ; మదికుదుటఁ బడదు ; శూన్యహృదయనై పరితపింతును ; వేఱువు వచించి రక్షింపుము.

చ. ఉరుతరదావకీలలకు నోర్చిన నోర్వఁగవచ్చుఁగాక, దు
స్తరమగు కాలకూటమును ద్రావినఁ ద్రావఁగవచ్చుఁగాక, యీ
శ్వరనయనాగ్నిమంటలకు సైచిన సైపఁగవచ్చుఁగాక, నా
వరుఁడు సపత్నిలోలుఁడను వార్తసహింపఁగ శక్యమే ? చెలీ !

'ఆ: వె: సొమ్ములీయవచ్చు సొమ్మంత యీవచ్చు,
నియ్యరాని ప్రాణమీయవచ్చు,
తనదువిభుని వేఱు తరుణిచేతికినిచ్చి,
తాళవశమె యెట్టి దానికైన ?'

చ. మరుఁడను నైంద్రజాలికుఁడు మానసమందునఁజేరి మోహపుం
దెర దిగవైచి యద్భుతగతిన్ రచియించిన విభ్రమంబులన్
స్థిరమనినమ్మివెట్టినయితిన్ సవతుల్ నగుటయ్యె నామనో
హరుఁడు సపత్నిహస్తగతుఁడయ్యెను నేబ్రతుకంగనేలొకో.

మం :— దేవీ ! ఇంతదారుణమేల ? భాగ్యవతులలో భాగ్యవతివని మే
మెల్లరము నిన్ను భావించి కొలుచుచుండఁగా నీవిట్లు దుఃఖించుట చేలతనముగదా. ఎట్లుభాగ్యవతిసందువా ?

చ. కుడిచి మిగిల్చినట్టి చలికూడును గట్టిన ప్రాఁతకోకలున్
చిడిముడియానతుల్ వెగటుఁజీదఱలున్ బరతంత్రజీవమున్
విడువనియూడిగంబుఁబదివేలుగ నీకొనఁగూడనుండ నో
పడఁతిరో ! నీకుసాటియగు భాగ్యవతీమణులుందురే భువిన్ !.

కైక :—మంధరా ! అగ్గిమీఁద నాజ్యమువోయవలదు. ఈదీనురాలిఁ గరుణింపుము.

మ|| పరదైవంబుగఁ గొల్చునాదయితుఁ డాభామామనోవర్తియై
పరదైవంబుగనయ్యెనాకునకటా ! ప్రాణంబుసంరంభియై
యురలంజొచ్చెను, నీదుకైక యిలపైనుండంగఁగాంక్షింతువేఁ,
బరమోపాయముచెప్పికాచికొనుమా ప్రాగల్భ్యమేపారగాన్.

మం :—కైకా ! ఎంతనంగనాచివి ! కావుననేగదా విభునిమాటదప్ప మా మాటపాటింపవు.

కైక :—మంధరా ! మంధరా ! నీపలుకుగాదనియందునా ! నీయాన నీవు చెప్పునట్లు నడతును. తరణోపాయము ననుగ్రహించి యీవ్యధాశల్యంబును బెకలించి వేయుము. స్త్రీరక్షణపుణ్యము నీకగును. కాదందువా ? నన్ను మఱచిపొమ్ము.

మం :—సాహసమేల ? నీవు నేరనియుపాయమును నేనుమాత్రము నేర్తునా ? నాజ్ఞాపకశక్తిని బరీక్షింప నిట్లాడుదువా ?

కైక :—మంధరా ! నీభావము తేటపడదు. గుట్టువిచ్చి చెప్పి రక్షింపుము.

మం :—అమ్మా ! ఈసంగతి యటుండనిమ్ము. నీ దయితుని పరాక్రమమును గూర్చి వేసార్లు చెప్పితివి. మందమతినిగావున మరచితిని. దేవాసురయుద్ధము నాఁడు నీపతిచూపిన విక్రమవిశేషంబుల మఱల వినఁ గుతూహలమగుచున్నది. అదిసుంత వివరింతువా ?

కైక :—మంధరా ! ఆపురాణమిప్పుడేల ? అవితలచినంతనే నిలువెల్ల నుడుకుచున్నది. ఈగండము తొలఁగుదారి చూపుము. ఆకతలు నెమ్మదిగా వినవచ్చును.

మం :—చెలీ ! మనస్సు కుదిరినఁగాని సరియైన తలంపులు స్ఫురింపవు. నాచిత్త మిప్పుడాకత విననఁగోరుచున్నది. దానియుదిరిపాటు దీర్చినఁగాని యది వశముగాదు. విషయాంతరగతమైన హృదయమును మఱలించుటకు వేఱుపాయము గలుగదు. నీకార్యము నకుఁ జిత్తమెంతో సంవిత్తముగావలయును సుమా.

కైక :—మందరా ! నీగిలికలు మానవు ; పట్టువదలవు. ఏమిసేయుదు ! సంగ్రహముగాఁ జెప్పెదు వినుము. శంబరాసురుఁడను మహాబలశాలియుండెను. వానిడాడికి దేవేంద్రుఁడు వెఱచి నాపతిని సాహాయ్యముఁగోరెను, నాదయితుఁడు చతురంగబలముఁగూర్చుకొని దండకారణ్యాంతరముననున్న వైజయంతమను పేరి శంబరరాజధానిపయి నడిచెను. శంబరుఁడు శతమాయావి; వాఁడు నాపతి నెదుర్కొనెను. నేను నాభర్తకు సారథ్యమొనర్చుచుంటిని. ఇరువీరులకు ఘోరయుద్ధ మొనరెను. రాత్రియైనంత నిరువాగులు రణముచాలించెను. మాసైన్యము స్రుక్కి మైమరచి నిద్రించెను. అత్తఱి శంబరానుచరులు హఠాత్తుగా మాబలముపై బడిరి. నావల్లభుఁడు నిజసైన్యరక్షణార్థము వారిని ఢీకొని శస్త్రశకలీకృతాంగుఁడై మూర్ఛిల్లెను. తేనిదురస్థనుజూచి వానిని రణభూమినుండి యావలకు గొనిపోయి వివిధశైత్యోపచారములఁ దేర్చుచుంటిని. అంతలోనటకు వైరులు వచ్చి మరల నానాథుని బ్రహరింపసాగిరి. నానేర్పుమెఱయించి యందుండి నాజీవితేశ్వరుని దొలఁగించి గాపాడుకొంటిని. నాసాహసోపకృతులకు నాఱేఁడు నన్ను మెచ్చి ప్రసన్నుఁడై రెండు వరములు గోరుమని నాతోఁజెప్పెను. వలసినప్పుడు కోరుదునంటిని. అందులకు నాభర్త సంతసించెను. అంత

మం :—చాలుఁజాలు ; కథాశేషము స్ఫురించినది. ఇఁక నీసంగతి చూచుకొనుము.

కైక :—మంథరా ! నన్ను దిగనాడుదువా ? ఈకటికితనమేల ?

మం :—కైకేయీ ! ఇంత వెఱ్ఱియుండునా ? బ్రహ్మాస్త్రములు చేతిలో నుండఁగా యెదురుకోలలు వెదకుదువేల ?

కైక :—ఎట్లెట్లు ?

మం :—ఎట్లా ? అంతమాత్రము తెలియదా ? ఆవరమిప్పుడు కోరరాదా?

కైక :—వరములవలన నాదురవస్థ తీఱుటెట్లు ?

మం :—కైకా ! నోటఁబెట్టినముద్దను గూడ మ్రింగజాలవు. నాయంతటి కార్యసాధకురాలు గలదాయని బడాయికొట్టుదువు. ఆతెలివి నేఁడేమాయెను ? సాగినప్పుడు ప్రగల్భములు గురిపింపవచ్చును. సమయమువచ్చినప్పుడుగదా తెలివిదేఁటలు తెల్లమగుట. కాలహరణమేల? వినుము. దశరథుఁడు కౌసల్యమాయకులోఁబడుట, ఆ కారణంబున రామునకుఁ బట్టముగట్టుట—ఈ రెండుఁగదా నీ దుఃఖకారణములు. రాముఁడు పెద్దవాఁడు ; వానికిఁ బట్టము కట్టుట లోకసహజము. మొట్టమొదట దీనికిఁ బ్రతిబంధక మూహింపవలయును. దీనివెంట రెండవది తనంతటతానే యగును. మహారాజు తానిఁక రాజ్యభారము వహింపఁజాలననియు రామునకుఁ బట్టముఁగట్టుదుననియు సభలోవచించెనట. రామ పట్టాభిషేకమునకు విఘ్నము కావలయునన్న దశరథుఁడు మరల తానురాజ్యభారము వహించుటో లేక భరతునకుఁ బట్టము కట్టుటో రెంటనొకటి జరుగవలయును. రాజ్యభారమును ఱేఁడు మరల వహింపనొల్లఁడు. అందులకై యత్నించియు ఫలము లేదు. కావున భరతపట్టాభిషేకమునకై యత్నింపక తప్పదు. ఇది యుక్తియుక్తమేగదా. అంతతో మనపని తీరదు. రామునకుఁ జతుర్దశవర్ష వనవాసమును గోరవలయును. ఏలయందువా ? రాముఁడు మహారాజనీతివేత్త ; ప్రజలన్నో వానికి వశవర్తులై యున్నారు. ప్రజానురాగము గలుగని నాఁడు రాజ్యపరిపాలనము సుకరముగాదు. రాముఁ డిందున్నంతకాలము జనులహృదయము వానియందే తగిలియుండును. ఇది భరతునకుఁ జెప్పరానిముప్పుఁ దెచ్చును. ప్రక్కలోనియీఁటెను దొలఁగింపవలయును. కన్ను చాటయినచో మనస్సుగూడఁ జాటగునందురు గదా. రాముడు దేశాంతరగతుడైనప్పుడు వానియందలి ప్రజాభ[illegible]లి రెండు మూఁడునాళ్ళు మిక్కుటముగా నుత్కటించి నానా[illegible]లు

దాల్చినను క్రమక్రమముగా సన్నగిలి తుదకు భరతునాశ్రయించును. జనులు సద్యఃఫలాసక్తులై వర్తింతురు గావున దానమానములచేత వారిని వశపఱచుకొనఁగును. కావున రాముని వివాసము ప్రధానము. పదునాల్గు వత్సరముల వివాసమేల యందువా ? భరతుఁడు జనుల హృదయమును సమగ్రముగా నధిష్ఠించుటకుఁ దడవువలయును. అది యెంతదీర్ఘమైన నంత మేలగును. కైకేయీ ; ఈ రెండువరములనుగోరుము ; నీయాప్తితము సిద్ధించును. వానిని సాధించు టెట్లందువా ?

"మ॥ కరచంచన్మణికంకణరణత్కాంచీగుణస్వానమా
పురనాదాహృత రాజహంసరమణుల్ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ముగ్ధప్రస్తుతస్త్రీలగీ
తరళాలోకన తుల్య విభ్రమ దృగంతస్తోమ పాతంబులన్."

అని స్వభావజ్ఞులు సిద్ధాంతరీకరించియున్నారుగదా. అందు దశరథుఁడు నీవన్నఁ బ్రాణములు విడుచుచుండును. రాజపుత్త్రీ ; నీవు త్రిశుద్ధిగఁ బంతగింతువేని క్షణములో నీకోరిక తీఱెదను. ప్రకృత మేమిసేయవలయు నందువా ? మలినవస్త్రమ్ములు ధరించి యొంటికయిల్లు చొచ్చి కటికనేలఁ బరుండుము. నీకుఁగా రాజువచ్చును వానిని కన్నెత్తియైనఁ జూడకుము; నిన్నుఁ బలుకరించును ; బదులాడకుము ; చేరవచ్చి బుజ్జగించును ; పొరలి పొరలి విలపింపుము. ప్రణయము లాడును ; భావముఁ దెల్పవేడును; మణిమయాభరణంబు లిచ్చును ; బాసలుచేయును; తుదకుఁ గాళ్ళవ్రాలును. ఏమిచేసినను సందియ్యవలదు. ఇట్లొనర్తువేని యతఁడు నీ పరితోషార్థము నిజప్రాణములనైన నుంకువ పెట్టును. అట్టిస్థితికి వానినిదెచ్చి, అడిగినదిచ్చునట్లు ముమ్మాటికి బాస చేయించి, మాట తప్పఁడను నమ్మికగల్గిన తర్వాత, దేవాసురయుద్ధమునాఁటి వరములను జ్ఞప్తి చేయుము. అంతమాత్రనకే యింత యాగడమాయనును. వానిమాటతోడనే వానిని గట్టిగాఁగట్టి వైచి సమయము పక్వమైనదని నీకుఁదోఁచినప్పుడు నాచెప్పిన వరముల రెంటిఁ గోరుము. సర్వార్థములు నీకు సిద్ధించును. మెలఁకువతో వర్తింపుము ; మంచి యదును వచ్చెను ; ఆత్మదోషంబునఁ గార్యమును జెడఁగొట్టుకొనకుము. జలగపట్టు విందువుగదా.

మ॥ సిరి చన్నం గులమేవగించిన జనుల్ చీకొట్టి పోఁదోలినన్
ధరణీభాగము వ్రచ్చి మ్రింగనయినన్ దంభోళిపై వ్రాలినన్
మరణంబబ్బగనున్న నేమయినన్ మార్పాటు సుంతేనియున్
బొరయన్నేరదు నిశ్చయాత్మలకిలన్ బూర్ణేందుబింబానన.

కైక :—మందరా! నీ ప్రతిభ యింతటిదని నేఁడు గ్రహించితిని. చూచుటకుఁ గుబ్జవైననుఁ బ్రజ్ఞయందు సురాచార్యుని మింతువు. నీవ్యూహము సద్యఃఫలమిచ్చునని నాయంతరాత్మ గూడఁ దెలుపుచున్నది. నీకొసఁగరాని పారితోషికములు గలుగవు. మనపంతము నెఱవేరునేని నీకు జాతిబంగారు కవచముఁ దాపుదును. అయిన నొక్కటికి వెఱతును. భరతాభిషేకమును సాధింతును. అది నిస్సంశయము. రామవివాసంబునకు మాత్రము మనస్సొల్లదు. రాముఁడు కన్నతల్లికంటె మిన్నగా నన్ను సేవించును. వానిఁ జూడని దినము నాకు దుర్దినముగానుండును. ఏపాపము నెఱుఁగఁడు. ఆపాపను వనవాసమునకుఁ బంపుమని యడుగ నోరాడదు.

మం :—జడమతీ! పెద్దకుమారునింటఁ బెట్టికొని రెండవవానికిఁ బట్టము గట్టుదురా; అందులకు దశరథుఁడంగీకరించునా? జనులు సమ్మతింతురా? కాదని యత్నించినను దేశమందెల్లెడల హాహాకారము జనింపదా? ప్రజలు తిరుగఁబాటుగారా? గయ్యాళీ! నావంచించినట్లు చేయవేని నీకోర్కె యొక్కటియుఁ గొనసాగదు. నీయజ్ఞానకారణంబున భరతునకుఁ బ్రాణోపద్రవముఁ గలిగింపకుము. బేలా! రామవివాసముఁ గోరవేని నీ ప్రయత్నమే మానుము. స్పష్టార్థమునకు విరసవ్యాఖ్యలు రచించు నీమౌర్ఖ్యంబున కెంతయు వగతును. ఇట్టి వ్యూహములకు నీసవతియే సరిగాని నీబోంట్లగుదురా! రామాభిషేకము సంకల్పించెను; భరతుని దేశాంతరము పంపెను; తన కార్యముఁ గొనసాగించుకొనుచున్నది. ఆప్రతిభాశాలినిఁ జూచియైన గ్రహింపరాదా! నాకుఁ దోఁచినది చెప్పితిని. ఇఁక నీయిష్టము.

కైక :—మంధరా ! నీమాటనిజము. నాసవతివ్యూహమే నన్నింతకుఁ దెచ్చెను. గుండె బాయి చేసికొందును. వరములం బడయుటో నిరశనవ్రతంబునకుఁ బ్రాణములర్పించుటో యగును.

ఉ॥ ఏకరిఁయైన నాసవతియేడ ? మదీయవిభుఁడు మహోగ్రద
ర్వీకరయై గ్రసించువిపరీతమదేడ ? వరుండు తద్విష
వ్యాకులుఁడౌట యేడ ? జడయై ప్రతిమంత్రము సేయ నేరకీ
కేకయరాజపుత్రి పరికించుచు నుండుటయేడ ? చెల్లరో.

ఇట్లు కైకేయి తనమనోనిశ్చయంబును దెలిపినంతనే మంధర లోలోన నుబ్బి బూరటిల్లి

ఉ॥ ఉల్లమ ! తల్లడంబుడిగి యూరటనొందుము, నాటినట్టివి
త్తల్లన నంకురించె నికనయ్యది యేఁచి చిగిర్చి మెల్లగా
నల్లి విదిల్చి పూచి బరమాద్భుతముఁ బహుమాధురీరసా
భ్యుల్లసితంబులైన ఫలమెంయ్యన నిచ్చు నపూర్వవైఖరిఁన్.

అని మూసినముత్తెమువలె నుండెను.

స్త్రీసాహసము—కైకేయిమందిరము.

కైకేయి యంత మలినపరిధానయై కోపాగారము చొచ్చి పుణ్యాక్షయంబున దివినుండిరాలిన కిన్నరివోలె నందుఁబడి యుండెను. సమస్తభూషణంబులం ద్రుల్చి దుఃఖావృతవదనయైయున్న యారాజపత్నిని జూడ మగ్నతారకయు గాఢతమోవృతయునైన దివి తలంపునకువచ్చుచుండెను. ఆకాంతామణి యట్లు పరుండి మంధరాకుత్సితబోధనలస్మరించుచు విషధర విద్ధ కిన్నరిం బోలె నాగకన్యకరీతి వెచ్చనూర్పసాగెను. ఆమె రత్నాభరణంబులు విశీర్ణంబులై నేలరాలి యామందిరంబును నక్షత్రంబులు గగనంబునుబోలె వెలిగించుచుండెను.

రాజపత్నులకు వేర్వేఱు ప్రాసాదములుగలవు. అందుఁ గైకేయి ప్రాసాదము విశిష్టశోభావహమై యుండెను. దానిబహిర్ద్వారము నవరత్నఖచితద్వారశాఖాలంకృతమై శిల్పికళాకౌశలంబునకు మచ్చుగాఁ దీర్చబడ నొప్పెను. అనగరు ప్రహరీగోడలు పలువన్నెల బాలతో బొలి

ఱాతికి సందులేకుండునట్లు నేకశిలానిర్మితముగాఁ దోఁచునట్లుగట్టిరి. ఆ వింతచెక్కడము లొకదానినిజూచిన కంట నొకదానిని జూడ రాకుండెను.

ఆప్రహరీలోపల సప్తకక్ష్యాంతరములు గలవు. అందుఁ దొలికక్ష్యాంతరము వివిధచ్ఛాయాద్రుమశ్రేణులతో నీడలు వాఱి, పలువన్నెజాతిస్పెలచేత బెడగారుచు, శాఖాంతరములందు వ్రేలాడు సువర్ణరజితపంజరంబుకుఁ బరిమితి లేక పొలుపారుచుండెను. ఆపంజరాంతరములందు వింత వింతపులుఁగులు మధురమధురంబుగాఁ బలుకుచు సృష్టివైచిత్ర్యమును జాటుచుండెను. రెండవకక్ష్యాంతరము నానాజాతిపుష్పలతా వృక్ష నీరంధ్రమై నెత్తావులను వెదచల్లుచుండెను. మూడవ కక్ష్యాంతరము వివిధలతాగృహములతోను బన్నీటిచిమ్ముపురలఁ జిల్కరించు యంత్రములతోను నిండియుండెను. నాల్గవకక్ష్యాంతరము దంతపుదాపలును స్ఫటికసోపానములును దాపిన క్రీడాసరోవరములు గలిగి చూడఁజూడ వినోదముఁగూర్చుచుండెను. ఆకొలంకులజలము స్ఫటికనిర్మలమైయున్నందున సోపానంబులందుఁ బ్రతిబింబించుచు వింతఁ గూర్చుచుండెను. మఱియుం నందలి కలువలును దామరలను బూచి యపూర్వశోభావిశేషంబును గలిగించుచుండెను. ఆజలజంబుల మకరందంబును గ్రోలుమధుపంబులఝుంకారంబులెంతయు దుస్సహముగానుండెను. ఆకొలఁకులచుట్టుఁ దీర్చిన లేఁబచ్చికవాడలు శాసారేందిరా రత్నములు కైసేసినపచ్చపట్టుపైఠాణులో యననొప్పెను. ఐదవకక్ష్యాంతరమున వివిధశిలానిర్మితస్త్రీవిగ్రహంబులు సజీవములవలె నిలిచి స్ఫాటికకలశంబులఁగొన్ని రతనంపుగిండులఁగొన్ని బంగరుపళ్లెరంబులఁగొన్ని హస్తతలంబుల ధరించి యందువచ్చువారికిఁ బన్నీటిజలకంబులార్చి పుష్పోపహారంబులిచ్చి మర్యాదలు గావించుటకై యారామలక్ష్మి నియమించిన దాసీజనమోయనఁ దోఁచుచుండెను. ఆఱవకక్ష్యాంతరము సంగీతశాలయనుటకన్న వేఱుదోఁపదు. అందు నానారత్నరచితస్త్రీప్రతిమలు వివిధగానయంత్రంబులఁ గైకొని స్వయముగానే మధురాలాపనగతులచేత వినువారినిఁ బరమానందపారవశ్యులఁ జేయుచు వియచ్చరాంగనలు తమగాననైపుణిఁ బ్రదర్శరింపఁ గొలువుతీఱిరోయను భ్రాంతిని గలిగించుచుండెను. ఏడవ కక్ష్యాంతరమునఁ గైకేయీవాసమందిరము గలదు. అది మదన సామ్రాజ్య

పట్టాభిషేకమండపమాయన శోభిల్లుచుండెను. ఆమందిరాంతరము నందుఁ గోపగృహమును నిర్మించిరి. అటఁ గైకేయి యట్లు పరుండియుండెను.

### కైకేయీదశరథులు.

దశరథుఁడు నాఁటిరేయివచ్చి, చంద్రుఁడు పాండురాభ్రమైన యాకాశంబునుబోలెఁ గైకేయీమందిరముఁ జొచ్చి, హుటాహుటిఁ గేళీగృహంబునకుఁ బోయి, యందు దయితారత్నమును గానక యవ్విపరీతమునకు విషాదాశ్చర్యమగ్నుఁడై కొంతవడి తహతహపడి నెమ్మది వహించి తేటి దేవియెందున్నదోయని యంతఃపుర ద్వారపాలికను విచారింపఁగా నద్దాసి గడగడవడఁకుచు 'దేవిగారు కోపగృహమునఁబడియున్నార'ని వ్యసనకలుష స్వరంబునఁ బలికెను. ఆమాటతోడ ఱేఁడు విలువితవ్యాకులేంద్రియుఁడై యత్యంత విషాదము నొంది పిశాచగ్రస్తుఁడువోలె నెగచి యలుకట్టిల్లు డాసి యటఁ ద్రుంచి పాఱవైచిన పూఁదీవెవలె, మింటనుండి పడఁద్రోసిన కిన్నరి చందంబున, గగనాంతరమునుండి జాఱిపడిన యప్సరోరత్నముక్రియఁ బరిభ్రష్టయైన మాయఁబోలెఁ, గట్టివైచిన లేడిచాడ్పున, ధరాతలంబునబడియున్న ప్రియురాలిని శిరీషకోమలాంగకను గాంచి నిర్విణ్ణుఁడై తెప్పరిలి యాయింతిని సమీపించి, కాననాంతరమున వ్యాధవిషబాణవిద్ధయై పడియున్న కరేణువును గజరాజువోలె నక్కాంతామణిని దనకరాగ్రంబులఁ దడవి 'ప్రేయసీ! సంగతియేమి? నీయాజ్ఞసేయరా? ఎదురాడిరా? అప్రియంయంబులుపల్కిరా? తలఁచినకార్యము సమకూరదా? ఏదేని యచింత్యము దోఁచెనా? దూఱిరా? సేవలందుజాగెయ్యెనా? ఏల యిట్లలిగితివి? నాసర్వకళ్యాణ స్వరూపవు నాభాగ్యదేవతవు నీవిట్లు ధూళిఁ బ్రుంగుటకు నాగుండియ లవియుచున్నవి. జీవితేశ్వరీ! సంగతి సుంత వినిపింపుము. మోహనాంగీ! అదండ్యులనైనను దండింతును; దండ్యులనైన నాదరింతును. నీమనంబు తెల్పుము. శాతోదరీ! కుసుమకోమలమైన నీతనూలతను గటికనేలఁ ద్రోయనగునా? దశరథుఁడు నీవాఁడైయుండఁగా నీకుఁ గొఱతయుండునే?

'సుందరీ! ఎంతబతిమాలినను బలుకవేల? దానమానంబులఁ జక్కఁగాఁ గూర్పనా! ప్రాణంబులు వలచినను వెనుదీయనుగదా. మోడుపీడి

మకరందమాధురీస్యందియైన మృదూక్తినొండు పలికి నీవల్లభునకుఁ బ్రశాంతి గూర్పుము. మంగళస్వరూపిణీ ! యిచ్చకముగాదు ; నాసుకృతము తోడుగా బాసచేయుచున్నాను. నీకొరకు చేయరానిదేదియుఁ గలుగదు వ్యాధిపైకొన్నచో వైద్యులను రప్పింతును ; పిశాచమావేశించెనేని మాంత్రికులను బిలిపింతును. జీవితేశ్వరీ ! అంజలియొనర్తు ; నాయెదఁ జిచ్చుఁ జొనుపవలదు' అని వివిధగతులఁ బ్రార్థించెను.

కైకేయి సుంత కన్నువిచ్చి 'ఆర్యా ! ఈపాపిష్ఠురాలికి రోగమా ! ఎవరో యేమి చేయుదురు ? నాతలవ్రాఁతకు పగతు. ఎవరితో మొఱ పెట్టుదు ? ఆదరించువారెవరు ? మృత్యువునకుఁ గూడ వెగటించితి' నని హీనస్వరమున నేడువసాగెను. దశరథుఁ డాయింతి చేతులుపట్టుకొని 'లోకైకమోహినీ ! నీపల్కు నాకుఁ బ్రాణదానమిచ్చెను. ప్రేయసీ ! సంగతియేమి ? కామినీప్రపంచంబున నీకన్నఁ బ్రియయుఁ బురుషలోకంబున రామునికన్నఁ బ్రియుఁడును నాకుఁగలుగరు. నీయాన రాముని యాన నీ యిష్టము తప్పకొనర్తును, ప్రాణేశ్వరీ !

చ. మకరముఖాంతరస్థమగు మానికమైనను దెత్తు సర్వరా
ణ్మకుటవిగత్నరత్నమయినన్ గొనివత్తు సురేంద్రునోర్చి క
ల్పకమును దెమ్మటన్నను సపాదముగాఁ బెకలించి తెత్తుఁ గో
రిక మఱియేదియైన నొనరింతును నంజలిమాని చెప్పుమా.

అని శపథపూర్వకంబుగా వచించెను.

దశరథుఁడట్లు పలికినంతనే 'రాజా ! నీవు పుత్త్రుని సాక్షిగాఁ బాస చేసితివి. ఇది చేయుటకా ? అగ్నిహోత్రుఁడును ముప్పదిమూఁడుకోట్ల దేవతలును నీమాటలాలకించుచున్నారు.—నిశాకరదివాకరులారా ! రాజ శపథమును విందురా ? గ్రహములారా ! ఈనిప్రతిజ్ఞ నాలింతురా ? ఆకాశమా ! జనపాలకునిబాసకు నీవేసాక్షి ; దివారాత్రములారా ! భూపతి వచనంబులాకర్ణింపుము. పంచమహాభూతములారా ! సర్వముఁ బరికింతురు గదా' యని కైకేయి చరాచరంబులను సాక్షిగోరెను. దశరథుఁడు వింత దోఁచి 'ప్రాణేశ్వరీ ! ఈశంకయేల ? మిత్త్రులుశత్త్రులగుదురుగాక, ప్రజా కోటిదూఱుఁగాక, గురువులాఁక వెట్టుదురుగాక, పుత్త్రులు పాయుదురుగాక,

మంత్రులు మోహరింతురు గాక, రాజ్యలక్ష్మి త్యజించుఁగాక; మఱి యేమైననగుఁగాక, నామాటతిరుగదు. నీ సంకల్పమేమో తెలుపు' మని దశరథుఁడు నొక్కి వచించెను.

కైకేయి యావచనంబులు విని 'రాజేంద్రా! మిమ్ము శంకించుట గాదు. మీ సత్యసంధతయు మీధర్మనిష్ఠాపరతయు నాకుఁదెలియవా? 'ప్రమాదోఽధీమతామపి' అని యందురు. అట్టికళంకము మీకు రాకుండుఁగాక యని సమస్తదేవతలను బ్రార్థింతును. మీకిట్టి యనర్థముకలుగునేని నీ కైక సహింపఁజాలదు' అని ప్రేమరసంబును గ్రుమ్మరించెను.

దశ:—విలాసినీ! నీహృదయము శిరీషకోమలమగుట నేనెఱుంగనా? సంగతియేమో తెలుపుము.

కైక:—నాయడుగనున్నది మీకు మిక్కిలియల్పము. అదివిని మీరునవ్వి నను నవ్వవచ్చును.

దశ:—బేలా! ఈయలఁతికై యింతయాగడమేల?

కైక:—కోవిదులకు నెట్టిదియు నల్పముగానేయుండును. ముగ్ధలసంగతి యట్లుగాదుగదా? నాథా! ధర్మసందేహమొకటి నన్నుఁ గలఁచుచున్నది. పండితులులేరా యనిన వారికి శాస్త్రజ్ఞానమేగాని యనుభవజ్ఞానము జాలదు. మీకు రెండునుగలవు. అందువలన నాముడి మీవలన వీడుననియుంటిని. ఏలకో రాత్రియిట రామఱచితిరి. ఆఁడువారికి నోర్పులేదనుట మీకుస్పష్టము. మీ విలంబము నన్నింతకుఁదెచ్చెను. నాయవినీతిని మన్నింపనగు.

దశ:—ప్రేయసీ! నావలన నీకిట్టిక్లేశము గలిగినందుల కెంతయుఁ జింతింతు. రాజు పరతంత్రుఁడు గాని స్వతంత్రుఁడు గాఁడు. నాయపరాధమును సైరింపుము. కాంతామణీ! నీయెఱుంగని ధర్మసూక్ష్మములుగలవా? నీసలహావలననేగదా నారాచకార్యములు సుకరములగుట. వినోదార్థ మడుగుదువు కాబోలు. సంగతి తెలుపుము చూతము.

కై:—నాథా! నాచెలి కొండొకనాఁడు నాకొకప్రియ మొనర్చెను. అందులకు నేను మెచ్చి 'ఇచ్చవచ్చినదికోరుము' ఇత్తునంటిని? 'వలసి

నప్పుడు కోరుము' నని యపె చెప్పెను. ఇది జరిగిన యేండ్లు పూండ్లు గడచెను. ఆసంగతినే మఱచితిని. ఆయింతి నేఁడు వచ్చి గుప్తార్థము నిమ్మనుచున్నది. వరములు కోరుమంటిని; వలసినప్పుడు కోరెద ననెను. అంతమాత్రమే గాని, యివియని యాపె యడుగలేదు; వానిని ఇచ్చెదనని నేను చెప్పలేదు. అంతలోన నవి సుప్తార్థములగునా? కాదన్న బొంకగునా?

దశ :—దేవీ! ఇదెస్పష్టార్థము. దీనికై డోలాయమానమేల? సంకల్పము ప్రధానము. ఇచ్ఛాసంకల్ప మెప్పుడు నీయెద నంకురించెనో యది దత్తమేయగును. అందులకు మాఱులేదు. ఇది యని కోరలేదందువా? కోరినదియిత్తునంటివి. ఏదికోరినను గోరుఁగాక, కోరినదాని నియ్యకతప్పదు; నాఁడు కోరకున్న నేఁడు కోరుచున్నది. సత్యమునకుఁ గాలహరణదోషముగలుగదు. నోటఁ జెప్పి దప్పినప్పు డసత్యమగునేగాని చెప్పనినాఁడట్టి దోషము రాదని కొందఱు పల్కుదురు. అదిమిథ్యావాదము. సంకల్పమే ప్రధానముగాని చెప్పుట గాదు. ప్రేయసీ! కుహనాతర్కములకు నెడమీయవలదు; ధర్మదూషితవు గాకుము. నీచెలి యేమికోరెనో చెప్పుము. నీకుఁగా నేను దానికోర్కి తీర్తును.

కైక :—నాథా! నీకుబమలాడ నేరను. తలఁచినఁగాని వెన్న పుట్టదుగదా. నాయవినీతిని మన్నింపుము. నాచెలి తనకోరికలు తెలిపియుండి, యిత్తునని నేనుచెప్పియుండి, యిప్పుడు కాదన్నచో నసత్యదోషమాపాదించును. మాటసామెతకు నాఁడు వచించితిని. అప్పుడు మూఁగవలెనున్నకుండి యిప్పుడు హఠాత్తుగా దుర్ఘటమును గోరినప్పుడు కాదన్నఁ గల్లయగునా? నేఁడుసాధ్యమగుపని రేపు, కాకుండనగును. కాలము దురత్యయము. అసత్యమాడి తప్పించుకొనునట్టి యూహయేలేదు. కాలవ్యతిక్రమముంజేసి పరిస్థితులు మాఱి సంకల్పము నెరవేఱుమార్గముండనప్పు డేమిసేయనగు?

దశ :—కళ్యాణీ! కోరినదాని నిత్తునంటివి, ఆమాటచాలు. సత్యము త్రికాలాబాధితమని మున్నే చెప్పితిని. పరిస్థితులు మాఱినప్పుడో

యని యందువా ? అప్పుడుగూడ లేదనరాదు. యథాశక్తి ప్రయత్నించి నీయంతరాత్మను దృప్తిచేయుము ; అసత్యదోషము బొరయదు. మఱియు సాధ్యాసాధ్యములు పరిశీలించి మాట యిచ్చుట మేలు. అట్లుగావింపకుండుట యెవరిదోషము ? ప్రచ్ఛన్నవిధమున వరములుకోరినప్పుడో యని యందువా ? బలి చరిత్ర వినవా ? శుక్రాచార్యులు వలదన్నను బలి వినెనా ?

"మ. నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనం బైన దు
ర్మరణం బైనఁ గులాంతమైన నిజముల్ రానిమ్ము కానిమ్ము పో
హరుడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్."

అని బలిచక్రవర్తి స్పష్టముగాఁ బలుకలేదా ? సజ్జనులు యుక్తి వాదము నాశ్రయింపరు. దేవీ ! మనకార్యఫలములొండొరులకుఁ జెందక మానవు. సతీపతులసంబంధము వాగర్థముల వలెనుండునుసుమా. మనోహారిణీ! ఇంత విచారమేల ? సంగతిజెప్పుము.

కైక :—నాథా ! ధర్మతత్త్వము సూక్ష్మాతిసూక్ష్మమగుట నేఁడుగంటిని. ధర్మమందుఁబుట్టి యందే పెరిగి దానినే యాశ్రయించియుండు భవాదృశులకే యదిగోచరించును ; అన్యులకు స్పష్టపడదు. హృదయేశ్వరా ! ఇదంతయు సూచ్యార్థసూచికగా వచించితిని. దేవాసురయుద్ధము మఱువరుగదా ? అప్రార్థితముగా రెండు వరములు నాకు ననుగ్రహించితిరి గదా.

:—కల్యాణీ ! నాఁడేయననేల ? నేఁడుమాత్రము నీవుకోరినది కాదందునా ? దశరథుఁడు నీవాఁడే గదా ? ఏమిరవలయునో కోరుము. తప్పక యిత్తును.

—నాథా ! అభిషేకసంభారములు సిద్ధమేగదా. ఆద్రవ్యములతోడనే భరతునకుఁ బట్టాభిషేక మొనర్పుము. ఇది మొదటివరము. రామునకు జటావల్కలములిచ్చి వానినిఁ బదునాల్గేఁడ్లు వనవాస మునకుఁ బంపుము. మాటతప్పవలదు. ధర్మాతిరేకమునకు సాహ

సింపకుము. అన్నమాటయొనర్చి కలకాలము జీవింపుము. రాముఁడు నేఁడే తరలవలయును. అతఁడు పోవుటఁ గన్నారఁ జూడవలయును. నాథా! ఆత్మకళ్యాణమును గోరుదువేని, కులశీల సంరక్షణము నీకువలయునేని, ఇక్ష్వాకువంశంబునకుఁ గళంకము రానొల్లవేని యాడినమాట చెల్లింపుము.

కైకేయీవరంబులు చెవిసోకినంతనే దశరథునకు నిలువెల్లవడఁకెను; చెమ్మటలు పిచ్చిల్లెను; మోము వెలవెలఁ బాఱెను. 'హా! ఏమి! ఇది స్వప్నమా? పూర్వానుభవస్మరణమా? హృదయము తప్పుచున్నది. నేత్రములు సుడియుచున్నవి. మూర్ఛయయ్యెడు—హా! పాపినీ! కులనాశినీ! చండాలినీ! ఏమంటివి? రాముఁడు నీకేమియెగ్గుచేసెను? నిరపరాధుని నిష్కారణంబుగా నిట్లుచేయనేల? వాఁడు నీకొనర్చినశుశ్రూషలకై యీ పారితోషిక మిత్తువా? అయ్యో! ఎవనికళ్యాణగుణంబులను జీవలోకము సంస్మరించి బ్రహ్మానందమొందునో యట్టి నిత్యమంగళాకారుని గుట్టలకుఁ దోల సమకట్టితివా? ఆకూన యొనర్చినయపరాధమేమి? నీవిట్టి కాఠిన్యము వహింపనేల? అయ్యో! కౌసల్యను వదలుమన్నను బదులాడియుండను; సుమిత్రను విడనాడుమన్నను సమ్మతించియుందును. రాజ్యమును బాయుమన్నను సంతసించియుందును. ప్రాణములుగోరినను గొమ్మందును. రాముని బాయఁజాల.

చ॥ రవిరహితంబుగా జగము గ్రాలినఁ గ్రాలును గాక, వారిధా
ప్రవిరహితంబుగాఁ బుడమి సస్యము పండినఁబండుఁగాక, ని
ప్పువసతలంబునన్ వెలుఁగు భాసిలఁగల్గినఁ గల్గుఁగాక, నా
ప్రవిమలజీవరాశియగు రామునిఁ బాసిన మేను నిల్చునే?

అని లోలోనఁ జింతించి 'ప్రేయసీ! నీయెడఁగల నాకూర్మిని బరీక్షింతువా? కాకున్నచో నిట్లాడవు. అయ్యో! నవనీతకోమలమైన నీహృదయమందిట్టి దంభోళిదారుణమైన యూహ జనించునా? ప్రేయసీ! ఈకైలాటములు చాలించి నీచెలికోర్కులేవో తెలుపు' మని ప్రణయమధురస్వరంబున నడిగెను.

కైక:- రాజా! పైపూఁతలు చాలు; అన్నమాట చెల్లింతువా? తప్పుదువా?

మ. ఆడియాసల్ గల్గించి లేదనక మాయల్ పన్ని హైతీపుగా
నుడువుల్ బల్కి హళిక్కి చేయుచదురల్ నూత్నంబుగా నేర్పదే
తడవుందూళియుజడ్డులేకయె నిరాధారానఁ జిత్రించి చూ
పెడుప్రోడల్ తఱితీపుమాటలపెయిం జేల్వోదురే యెన్నడేఁ.

దశ:—దుష్టా! నీసంకల్పము నిజమా? పిశాచగ్రస్తవై యిట్లాడుదువా! నన్ను నేను నమ్మఁజాలకున్నాను. రాముఁడన్న నెంతో సంతసింతువు; వానిపయిఁ బ్రేమంబులు కురియింతువు; భరతునైనను విడిచియుండువుగాని రాముని జూడనిదినము దుర్దినముగా భావింతువు. అట్టి నీవు నేఁడిట్లాడుదువని నమ్ముటెట్లు? నాచెవులు చక్కగావినవు. ఇదినిజము. సత్యంబున స్వర్గలోకంబును, దానంబున దీనులను, శుశ్రూషలవలన గురుజనంబులను, వింటివలన శాత్రవమండలంబును జయించి జగదేకవీరఖ్యాతిని బడసి యెల్లరకు నల్లారుముద్దుగా నెవఁడు శోభిల్లునో, ఎవనినాశ్రయించి తపశ్చర్యయుఁ ద్యాగమును మైత్రియు శౌచవార్జవంబులును విద్యాభక్తులును గృతార్థత నొందుచున్నవో, మూర్తీభవించిన శాంతరసమని యెవని నభివర్ణింతురో, పరమ ధర్మజ్ఞుఁడునై, నిజప్రవర్తనము కృతజ్ఞతా తత్త్వార్థపరిజ్ఞానంబునకు సులభ వ్యాఖ్యానము కాఁగా సన్మార్గమును దప్పక యెవఁడు ప్రవర్తించుచుండునో, ఎవని త్రికరణవ్యాపారము అహింసాధర్మస్వరూపనిశ్చయంబునకు బిండీకృతార్థమో యట్టి లోకోత్తరగుణవంతుని దేవసమానుని మహర్షికల్పునిఁ బరిశుద్ధహృదయుని సర్వభూతప్రియుని రాముని గహనాంతరసీమలకు వినీతవేషంబునఁ దఱుమ మని కిరాతకీచకులుఁగూడ గోరరు. దయితామణీ! ఉల్లసమునకుఁగా నట్లంటివేనియు; నెమ్మది వహించి జీవింతును.

కై:—రాజా! ఇచ్చకములు వలదు.

ఉ॥ ఆడినమాట కాదనుదువా సరిరాజులలోన నిల్చి? యా
నాఁడు తెగించి మృత్యువదనంబునఁ జిక్కి తపించు నిన్నుఁ గా
పాడినపత్నికిత్తునని పల్కినబాసలు తప్పుదంచు మెం
బాడి వచింతువా యలమహర్షుల ప్రోల సభాంతరంబునన్?

దశ :—అయ్యో ! కైకా ! ఈవిపరీతమేమి ! ఈగుణము నీకు సహజము గాదు. పరదుర్బోధనలు వింటివా ! కళ్యాణీ ! నయసంపన్న వైననీకు నిట్టిగుణము నిక్కముగా జనించెనేని యిక్ష్వాకువంశ మండలంబున నగ్నిజొనుపుట గాదా ! ఏనోటరాముని బ్రశంసింతువో యానోట నిట్టిమాట రానోపదు. అప్రియముఁ బలికి గాని, అయుక్తమొనర్చిగాని యెఱుఁగని నీవు నేఁడేల యిట్లాడుచున్నావు ! పరవశవై యున్నావనుట స్పష్టము. మోహనాంగీ ; ఇదే సాష్టాంగమొనర్తు ; నీ దశరథుని గలంపకుము.

చ॥ బలముడిగెన్ మనోద్రఢిమ పాయఁగఁ జొచ్చెను నాఁడు నాటికిన్
పలితములైన కేశములు పైఁబయిఁ దెల్పును గాలశేషమున్,
గలిగెను దృష్టిమాంద్యమును, గాడటు రమ్మను వీడు పొమ్మనున్,
కలికిరో ! మూఁడుగాళ్ళముదుకం దెగటార్పకు మున్ముముందుగాన్.

మ॥ ధరణీమండలమెల్ల నీకొఱకిదే ధారాగతంబిత్తు నీ
చరణంబుల్ తలదాల్తు నీనయనసంజ్ఞావర్తినై యుందు నీ
పరిచర్యాక్రమమొప్పఁగా సలుపుదున్, బద్మాక్షి నారాముపైఁ
గరుణాలేశముఁజూపుమా, దయితునిం గాపాడుమా యింతటన్.

కైక :— రాజేంద్రా ! ఈవగలు నాకుఁ దెలియనివిగావు. ఒక్కమాట. తనువు శాశ్వతముగాదు. ధీరులు యశశ్శరీరమునుగోరి వర్తింతురు. కీర్తివలతువో అపకీర్తిని వరింతువో విచారింపుము. నీ యీచర్యలవలన రెండవదే నీకిష్టముగాఁ దోఁచుచున్నది. శైబ్యుడు తన శరీరమును గోసియిచ్చి డేగను దనిపి పారావతమును గాపాడెను. అలర్కుఁడు తననేత్రంబుల నంధుఁడడుఁగగా బదులాడక యిచ్చెను. మాటకుఁగట్టుపడి సముద్రుఁడు నేఁడును జెలియలికట్టఁ దాటఁడు. బలిచక్రవర్తిసంగతి జగద్వితమేగదా. వారినిజూచియైన గ్రహింపరాదా ! సిరిసంపదలు నిత్యములు గావు. నీటిబుడగలకై ప్రాల్మాలవలదు, పూటు గడచును మాట నిలచును. నీవు కపటనాటకసూత్రధారివగుట నేఁడు స్పష్టమయ్యెను. రామునకే రాజ్యముఁగట్టుము ; కౌశల్యతోడఁ జిర

కాలము సుఖముండుము ; నాతలంపే నీకు వలదు, ఆత్మలాభార్థపై మాట దప్పి మృత్యుముఖాంతరమునుండి రక్షించినభార్య నకాలమరణదేవతకుఁ జేతులార నప్పగించిన మహాకీర్తి యాచంద్రతారార్కముగా నీకగుఁగాక.

కైకేయి యిట్లు నిష్ఠురములాడి కులిశధారంబోని వాఁడిచూపును దశరథుని వంకఁబఱపును. అతఁడు బదులాడనోపక 'హా ! రామా ! నష్టాత్ముఁడనైతిని. మంత్రనిర్వీర్యసర్పంబుగతి నాకు సంప్రాప్తమయ్యెను' అని కొంతసేపు విచారపడి తెంపుచేసి 'గయ్యాళీ ! ఈయనర్థంబును నీకెవ్వరు బోధించిరి! పిశాచగ్రస్తవలె భయమువక్కి నాయెదుట నిట్లాడ లజ్జింపవా! రామవివాసము! భరతాభిషేకము! అయ్యో! రామునివలన నీకెంతభయమేల! దీర్ఘసుమంగళీత్వమును గోరుదువేని భరతునిమేలు నీకుఁ బ్రియమేని లోక సన్మానమును వలతువేని నీవిమతమును వదలుము. కుశీలపతాకా ! నీయీ దురీప్సితమును భరతుడంగీకరించునని నమ్మితివా ? ఆమాటకల్ల. రాముని గాదని భరతుఁడు రాజ్యమొల్లఁడు. కొడుకును గన్నావే గాని వానితత్త్వమును గ్రహింపవైతివి. అంతమాత్రపుఁ బరిజ్ఞానమున్న నిట్టివింతలుపుట్టునా! చెనటీ ! ఇంగితజ్ఞులైన మంత్రులును త్రికాలవేత్తలైన పురోహితులును శ్రేయోభిలాషులైన బాంధవులును మిత్రులును గూడి నిశ్చయించిన యర్థంబు నవ్యెత్తుగా నూదివేయ సమకట్టితివి. ఇదిసాగునా ? పిశాచీ ! నీమతమొనర్చి పెద్దలకేమి పలుకుదు ? రాజలోకము మ్రోలఁదలయెత్తుటెట్లు ? ఛీ ! నీముఖముఁ గూడ చూడరా' దని యంతః కోపంబును వెలువరించెను.

కైకేయి యీపన్మాత్రమేని జడియక 'రాజా ! పెద్దలకేమనిపలుకుదునంటివి. మృత్యుముఖాంతరమునుండి తప్పించినసతికి బాసచేసి తప్పితినని చెప్పుము. రాజలోకము మ్రోలఁదలయెత్తుటెట్లంటివి. నీతిలేనివారి కేలోకమైననేమి ? అయ్యో ! నిన్ననవలదు. ఆత్మదోషము ననుభవించుచున్నాను. నివులుగప్పిన నిప్పనియుఁ బయోముఖవిషకుంభమనియు నేరక మోహవివశనై నిన్నుఁగౌఁగిటఁ గూర్చి ముద్దాడి బాహ్యాంతరపరిదగ్ధనైతిని. ఇదే ప్రాణములు తరలుచున్నవి. చిరకాలము సుఖముండు' మని పలికెను.

దశరథుఁడంత గొంతశాంతము వహించి 'కైకా ! నేఁడు నీనడత యపూర్వముగానున్నది. కారణమూహింపరాదు. అయ్యో ! విపరీత

భావముదగదు. నామాటవినుము. పరిచర్యాసమయంబున దాసివై వినోద వేళలసఖివై ధర్మాచరణంబున నర్ధాంగివై యుపలాలనంబులఁ దోఁబుట్టువై పోషణంబునఁ దల్లివై యెల్లప్పుడుఁ ద్రిశుద్ధిగ నన్ను సేవించు కౌసల్యనుగూడ నీకునోడి మనసార మన్నింపనైతి. నీకుఁగా నాయొనర్చినవి యెల్ల రోగికి నపథ్యమట్లు పరిణమించెను' అని లాలనగర్భముగా వచించెను. దశరథుఁడు లాలించుకొలఁది కైకేయి మొండితనము పెచ్చుపెరుగ సాగెను. ఆతఁడు చింతాక్రాంతుఁడై యేమియుఁ దోఁపక 'హా! రామా! ఈకఠోరవార్త నీకు వినుపించు టెట్లు? నీపట్టాభిషేకమును గూర్చి సభాంతరాళమున వెల్లడించితిని. అది తప్పు టెట్లు? కౌసల్యా! నీయట్టి దురదృష్టరాలుండదు. నీవుగాదు నీవుగాదు; నీపతి పరమదురదృష్టుఁడు అభాగ్యహీనునిఁ జేపట్టినకతన వానిపాపము నిన్నుఁగూడఁ జెనకెను. సుమిత్రా! ఈసంగతి విని నన్నేమందువోగదా? కటా! సీతా! ఈ దుఃఖ మెట్లు భరింతువు? పరస్పర ప్రేమగ్రంథితములై యెడబాయని మీహృదయంబులకుఁ బ్రళయమును హఠాత్తుగాఁ గలిగించు పాతకంబును నానొసట ధాత వ్రాసెఁగాఁబోలు. కాంతునిఁబాసినకిన్నరివలె రామునిఁబాసి నీవు జీవింపవు. స్త్రీహత్యాదోషము గూడ నాకుఁదప్పదు. ఎవరినోయన నేల? ఇదంతయు స్వయంకృతాపరాధ ఫలము; అనుభవింపక తీరదు. రూపునుగాంచి మోసపోయి యసతినిసతిగా గ్రహించితిని; విషమిశ్రమధువు సేవించుటయ్యెను—హా! కరాళీ! కైకా! గానమాధుర్యము లేడినివలె నీ చక్కఁదనము నన్నుహరించెను. కామినీలోలత్వఫలము నేఁడుపండెను. మూర్ఖా! నీమాటకుఁ గట్టువడి పట్టిని కాననలకు దరలింతునేని సురాపుఁడైన బ్రాహ్మణునివలె నన్ను రాజవీథుల ధిక్కరింపరా? పాపీ! నీచెలిమి మృత్యువుతోడి క్రీడ యయ్యెను' అని పరుషంబుగాఁబలికెను.

అందులకుఁ గైకేయి సుంతయుఁజలింపక కోపదీపితయై 'రాజా! పట్టినిందలవలన ఫలములేదు. అన్నంత చేయుదువా లేదా?' యని ఖచితముగా నడిగెను. దశరథుఁడు వెలవెలబోయి 'హా! రామా! జీవలోకగ్వతుఁడైన యీమహాత్మునకు నీవేలఁబుట్టితివి? నీకాలమెల్లఁ గఠిన వ్రతములతోడ గురుశిక్షాశ్రమలతోడఁ జనెను. ఒక్కనాఁడును గోరంత సుఖంబుఁ బడసి యెఱుంగవు. నీకు భోగానుభవకాలము వచ్చెఁగదా

యని యాఁడిల్లితిని. కుమారా! ఇంతలో నీకిట్టికష్టము దాపరించునని కలలోఁ గూడఁదలంపనైతిని. నాయనా! బదులాడియెఱుఁగవు; నిప్పులోనుఱుకుమన్నను వెనుదీయవు; ఇప్పుడేమి సేయుదువు? తండ్రీ! ఒక్కసారి నా మాట కాదనుము; బ్రతిమాలుదు; గురుజనోల్లంఘన పాపమువచ్చునందువా? నేనే నిన్నుఁగోరుచున్నాను. ఆకార్యము నాకెంతయుఁ బ్రియమును హితమునగును.—అయ్యో! ఎంతయజ్ఞానము; నీతత్త్వమెఱింగియు రిత్తకోరికలు కోరుచున్నాను. ఆజన్మపరిశుద్ధమైన నీహృదయమందిట్టి కపటంబులకుఁ దావుగలదా?' అని కొంతతడవు విలపించి, కైకేయివంక మరలి 'అనర్థదర్శినీ! మావంశవినాశమును సంకల్పించితివి. రాముని వనంబునకు నన్ను యమసదనంబునకు నొక్కసారిగాఁ దగలింతువుగదా. సుతవివాసముఁ బతివియోగము ననెడి శోకాగ్నులు ముమ్మరమై కౌసల్యను దహించి పరిమార్చును. రామునియందుఁగలభక్తిస్నేహంబులు లక్ష్మణుని హరించును. ఆదారుణవార్తకు శత్రుఘ్నుఁడు గుండియలు వ్రీలిచచ్చును; మాయనంతరము సుమిత్ర జీవింపదు; భరతుఁడుగూడ నుండుట కల్ల. అనాదిప్రసిద్ధము గుణసత్కృతము అక్షోభ్యమునైన యిక్ష్వాకుకులంబు నిట్లు వ్రేల్మిడిలో నామావశిష్టముగావించి వారిరాజ్యంబును నీవే యాకులంబుగాఁ బాలింపుము. అని వివిధగతుల దూఱి, మరల రామునిఁదలఁచి 'హా! కుమారా! శిలాకర్కశంబులును క్రూరమృగాభీలములునైన ఘోరాటవులందుఁ గ్రుమ్మరుదువా? కటుతిక్తకషాయంబులైన వన్యపదార్థములతో జీవింతువా! కాషాయపరిధానుండవై చరింతువా! జీవులకు సంయోగవియోగంబులు సహజములందురు. రామా! నీవు సామాన్య జీవిమాత్రుఁడవు గాదు; అలౌకికమూర్తివి. నిన్నెట్లు చేతులారఁ ద్యజింతు? నీయెడ నిట్లు వర్తింతునేని సర్వప్రపంచము నన్ను నిగ్రహింపదా? నాయనా! నిన్నుఁజూచినంతనే నాకడుపునిండును; నీవు చెంతనున్నప్పుడు యౌవనప్రాదుర్భావమట్లు బూరటిల్లుదును. నిన్ను విడనాడు టెట్లు?' అని పలువగల విలపింపసాగెను.

దశరథుని దుఃఖసరణిని విని కైకేయి సుంతసంతసించి 'దారికి వచ్చుచున్నాఁడు; పట్టువదలరా'దని నిశ్చయించుకొని 'రాజా! ఏమిచెప్పెదవు? కాలవిలంబమగుచున్న'దని హెచ్చరికగాఁ బలికెను. ఆమాటవిని దశరథుఁడు తోఁకద్రొక్కినపామువలె నూర్చుచు 'పాపీ! ఈకోరికలు గోరి

నప్పుడు నీనోటిరదనములు రాలవా ? ఈదురూహ జనించినప్పుడు నీడెందము ప్రీలదా ? ఛీ ! చండాలినీ ! దుఃఖనిహతమైన నగుదువుగాక ; శోకపరిదగ్ధమైన నగుదువుగాక ; నీవంత మెంతమాత్రముఁ గొనసాగదు. రాక్షసీ ! పరమేష్ఠి పనిఁబూని లోకములోఁగల సర్వమాలిన్యంబుల నేఱియేఱి, కాలకూటవిషము పదునిడి నూఱినూఱి, నీయాకారమును దీర్చి దిద్ది మకరందరసము తేఁగా రాసి తళుకుమెఱుఁగులిడి నిన్ను సృజించుట నేరక పైవన్నెలకు భ్రమించి నిన్నుఁజేరి యెట్టకేలకు దీపపతంగన్యాయమును గ్రహించితి' నని దుఃఖింప సాగెను.

దశరథుఁడెంత పరితపించినను గైకేయీహృదయము మాఱకుండెను. ఆ ఱేఁడు పగలఁబొగిలి యితికర్తవ్యతాజడుఁడై వెఱ్ఱివలెను బిశాచగ్రస్తుని పగిది రోగవిహ్వలుని చందమున విలపించుచు రెండుచేతులుచాచి 'ప్రేయసీ ఈదీనుని గనికరింపుము ; నీపాదములు పట్టుదు' నని తదీయచరణంబుల బ్రాలఁబోయెను. కైకేయి తన పాదముల నవ్వలకు జరిపెను. అతఁడు పట్టు గానక జాఱి నేలఁగూలఁబడెను.

అట్లు ధరాగతుఁడై పుణ్యాంతంబున దేవలోకపరిచ్యుతిఁ గాంచిన యయాతిని దలపించుచున్న పతిపయిఁ గైకేయి సుంతేనియుఁ గనికరమూనక 'రాజా ! నిత్యసత్యవ్రతు డనంటివి. సత్యమునుగూర్చి పెద్దగ్రంథముఁగఱపితివి. ఇదియా నీసత్యవ్రతము ? నీవచించిననీతులు నీయెడవర్తింపవా? ఇంతయేల ? చెప్పితప్పితిననుము. అంతేచాలు. నీమాట నీయొడిలోనైచి చనుదు' నని యెత్తిపొడిచెను. దశరథుఁడు కటకటంబడి కన్నులెఱ్ఱజేసి 'నన్నును నా రాముని జంపి నీకోర్కె కొనసాగించుకొని సుఖముండుము రండా' యనెను. 'రాజా ! నీయాగడమునకు వింతయగుచున్నది. ఈ నాటకాభాసము చాలు ; ఏమి చెప్పెద'వని మరల నయ్యింతి పుంటిపైముల్లు గ్రుచ్చెను.

దశరథుఁడు నిర్విణ్ణుఁడై 'కటా ! ఏమి సేయుదు ? బొంకఁజాల ; రాముని వనమునకు బంపఁజాల. ఒకవంక నూయి యొకప్రక్క గోయిగా నేర్పడెను. ఎటుఁబోవుటకుఁ దోఁపదు. రామా ! నీకుఁ బట్టముఁగట్టుదు నంటిని. కల్లయెట్లు వచింతు ? నాయనా! నిన్ను దుఃఖకుండమునఁ ద్రోయుట

కన్న నేను ప్రాణపరిత్యాగమొనర్చుట మేలు. అట్లయిన నీకీగండము తప్పుఁగాక. హా! దైవమా! జన్మాంతరంబున నేనేమి యొనర్చితినో నాకిట్టి యప్రతియోగమైన పాపముఁగూర్చితివో! అయ్యో! ఇదికేవల కామవికారదుష్కృతఫలము కాఁజాలదు. స్త్రీలోలురెందరు గలుగరు! వారికెల్ల నిట్టిదిసంభవించెనా!' అని లోలోనఁ గృశింప సాగెను. వాని వ్యసనముఁ జూడనోపక రేయాయన భానుఁడపరాంబుధియందుఁ గ్రుంకెను. తానిదుఃఖపటలి యోయన ముంజీఁకటి వ్యాపించెను.

దశరథుఁడు పెద్దయుండడవు వాపోయి వెచ్చనూర్చుచు నింగి వంక తలయెత్తి చంద్రోదయమగుటఁగాంచి 'నక్షత్రభూషణా! తెల్లవాఱకు; ఈదీనుని గరుణింపుము; ఇదే నమస్కారము—కాదు కాదు; వెనువెంటనే తెల్లవార్చుము. ఏలయందువా? దురంతదురితావతారయైన యీకరాళిని జూచుచు నిందుండఁజాల' నని పేరెలుగెత్తి యేడ్చి యేడ్చి, మగలఁ గైకేయిని జూచి 'శాతోదరీ! నిన్ను నాభాగ్యదేవతనుగాఁ గొలుతు; నామొఱ వినుము. అవసానకాలంబున నాకు బొంకుమాటకట్టవలదు. శరణంటిని, కాపాడుము. రాజ్యమెల్ల నీహస్తగతమొనర్తును. నీవే దానిని రామునకిమ్ము; నీకీర్తి లోకాలోకములు వ్యాపించును. నీవు జగదాహ్లాదకారిణివగుదువు; నీ యశశ్శరీరము కలకాలముండును; ప్రపంచమునకు మార్గప్రదర్శకురాల వగుదువు. ఇంతకన్న మర్త్యులకేమి కావలయును? నామాట వినుము. కళ్యాణీ!

చ. పరిణయబంధనంబునను భావములం బెనవైచి, యన్య దు
స్తరమగు దోహదక్రియలు సల్పి, యపూర్వసుఖైకభావ్యముల్
సురవర దుర్లభప్రణయ సూనమనోజ్ఞము జీవితంబు గాఁ
బరిణతిఁగూర్చు ప్రేమవనపాలిక నేఁడిటులీగనో గదా!

అనుచు వివిధయాలాపములతో హితోపదేశములతోఁ బ్రార్థనాపరంపరలతోఁ బ్రొద్దుపుచ్చి సొమ్మసిల్లెను.

కైకేయి భ్రుకుటీకరాళాస్యయై 'రాజా! దుఃఖమేల? అన్నమాట చెల్లింపవలసి వచ్చెనని దుఃఖింతువా? మాట తప్పవలసివచ్చెనని దుఃఖింతువా?' ధర్మజ్ఞుఁడవుగదా. 'సత్యంవద ధర్మంచర' అనువచనంబులు వినవా?

"చ॥ నుతజలపూరితంబగు నూతులు నూటికంటె నూనృత
వ్రత! యొకబావి మేలు మఱి బావులు నూటికంటె నొక్క సత్
క్రతువది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడగాన్"

"గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావు
ఎఱుఁగు మెల్ల ధర్మంబులకెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు"

అను విబుధోక్తులు తెలియవా ? 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అనివచించిరి. కావున శరీరము శాశ్వతముగాదు. ఇన్నాళ్ళు బ్రతికి యిప్పుడ కల్లరి గావలదు. అన్నమాటను సమర్థింపలేనివాఁడు పురుషాధముఁడందురు. ఈ యపకీర్తి నొడిగట్టకుము. నాకోరికలు నీయరచేతిలో నున్నవి. ముందీతిని గట్టిగాముడువనేల ? రాజా! అభినయములచేతఁ దెల్పవాలేను. అవునో కాదో చెప్పు' మని మర్మములు గాఢవచించెను.

దశరథుఁడు పండ్లుగీఁటి 'పాపీ! ఇఁకనీవు నాభార్యవుగావు; నేటితో మనదుసరి ; నీకొడుకునకు నాఋణము తీఱినది. అదిగో సూర్యభగవానుఁడుదయించుచున్నాఁడు. అభిషేకద్రవ్యంబులను గూర్చి గురుజనము నన్ను నిరీక్షించుచుండును' అని పలికెను. బ్రహ్మాస్త్రంబులఁ బోని యావచనంబులు హృదయమునగలింపఁగాఁ గైకేయి కాలఁద్రాచిన త్రాచుపగిడి నిశ్వసించుచు 'రాజా ! ప్రతిన చెల్లింతువా లేదా ? మంత్రాలకు మామిడి కాయలు రాలవు సుమా' యని యూనిపలికెను. దశరథుఁడు కడుంగడు ముచ్చిటి హా ! రామా ! యని మూర్ఛిల్లెను.

అ భి షే క ద్ర వ్యా ర్జ న ము.

అటువసిష్ఠుఁడు శిష్యులనుగూడి సరయూతోయములాడి యభిషేక ద్రవ్యములతోడఁ దరలి వివిధాలంకారశోభాయమానమై చందనాగురు ధూపవాసనాపరంపరల గుబాళించుచు లక్షోపలక్షజనసమ్మర్దమై యున్న యయోధ్యానగరవీధులను మెలమెల్లగాఁ గడచి రాజాంతఃపురము సమీపించి సుమంత్రుఁడను సారథినిబిలిచి గంగా గండకీ బ్రహ్మవర్తాదిపుణ్య నదీతీర్థము

లతోఁ బరమపవిత్ర సరోవరజలంబులతోఁ బయోధినీరముతో నించిన కనక ఘటంబుల నశ్వత్థాది పత్రాచ్ఛాదితములుగాఁ దెచ్చిరి ; ఔదుంబరపీఠము సిద్ధమైయున్నది. వివిధరత్నంబులను సమస్తబీజములను నానాగంధములను మధుదధిఘృతక్షీరంబులను లాజాకుశపుష్పంబులను జతపరచిరి. మనోహరాంగకలైన కన్నెలెనమండ్రుగురు వచ్చియున్నారు. భద్రేభముఁ జతురశ్వ రథముఁ జాపఖడ్గంబులును బోయలతోడి పల్లకియు శ్వేతచ్ఛత్రముఁ జామర ద్వయము సువర్ణదామబద్ధమైన తెల్లవృషభమును సమకూర్చిరి. స్వర్ణపాత్రమును నాలుగు కోరలువైచిన నిడుదజూలుతేజియు వ్యాఘ్రాజినమును సింహాసనంబును వీతిహోత్రంబును గోగణంబును బూజ్యములైన మృగ పక్షిరాజములును సమస్తవాద్యంబులును యథావిధి నున్నవి. ఆచార్యులును బ్రాహ్మణోత్తములును జానపదముఖ్యులును వేంచేసియున్నారు. వేశ్యాంగనలు సాలంకృతలై కొలువు దీరిరి. ముహూర్తము సమీపించుచున్నది. ఈసంగతి ఱేనికి విన్నవింపుము ; నారాకయు నెఱింగింపు' మని చెప్పెను.

కైకేయీసుమంత్రులు.

సుమంత్రుఁడు బిఱబిఱచని కైకేయియంతఃపురము సొచ్చి శయ్యా మందిరము వాకిట నిలిచి,

ఉ॥ రాజకులైకదీప ! రతిరాజసురూప ! జోహారు, శౌర్యవి
భ్రాజిత దివ్యమూర్తి ! యమరాధిపకీర్తి ! జోహారు, సత్యసం
పూజితవాగ్విశాల ! గుణభూషితశీల ! జోహారు, కోసల
శ్రీజయగీతికాభిరతచిత్త ! జోహారు, నరేంద్రశేఖరా !

సీ॥ నీరజాకరములు నిద్ర మైఁ జేసిన
భవ్యతపంబులఫలమనంగ,
దివసముఖాభినందితచక్రయుగ్మకం,
బులయనురాగంపుఁ బ్రోవనంగ,
హరిహరబ్రహ్మమహానుభావంబు లొ
క్కొక్కటిగాఁ గరఁగినగుటికయనఁగ,
సతులవేదత్రయలతికాచయము,
పెనుపొందఁటు పైడుపూల కందమనగ

తే॥ సకలజగముల కందెఱయగుచు జనస
మాజకరపుటహృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబునునొసర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.

రాజేంద్రా! వేదవేదాంగంబులు చతురాస్యుని బ్రబోధించుచున్నవి. ఉదయకాంతామణి సర్వమంగళస్వరూపిణి యైన భూదేవిని సేవించుచున్నది. ఇనావలోకనమహాభాగ్యము లోకము నిరీక్షించుచున్నది. సుమంత్రుఁడు దేవరవారిని బ్రబోధించుచున్నాఁడు. రవిచంద్రులును వైశ్వానరదేవేంద్రులును సదాశివుఁడును ఏలినవారికి విజయముఁగూర్చుఁగాక. వసిష్ఠభగవానుఁడు భూసురసమేతుఁడై యరుదెంచి వేచియున్నాఁడు. కాపరిలేనిపశుగణంబువలె నాయకుఁడు లేని సేనరీతిఁ జంద్రుడులేనిరాత్రికైవడి రాజదర్శనంబులేనిరాజ్యము శోభాహీనమై యుండును. ముహూర్తము సమీపించెను. రామపట్టాభిషేకకార్యక్రమమునకు ననుజ్ఞవేడుదుము; వేవేగ దయచేయఁ బ్రార్థించుచున్నా' మని విన్నవించెను.

సుమంత్రుని ప్రబోధవాక్యంబులు విని 'సుమంత్రా! నీసూక్తులు నూదులై తోఁచు' నని దశరథుఁడు పలికెను. సుమంత్రుఁడది విని దిగాలుపడి తొలివంకఁ జూచి తన్నయనరక్తిమవలన వానిమనోద్వేగమును గ్రహించి భయాక్రాంతుఁడై యోసరిల్లి నిలిచెను. మంత్రజ్ఞయగు కైకేయి సారథినిజూచి 'సుమంత్రా! రామునికైన సముత్సుకత్వంబునఁజేసి రాజుగారు రేయెల్లఁగనుఁగూర్కక నిద్రాలసులై యున్నారు. రామునిటకుఁ దోడ్కొనిరమ్ము' అని చెప్పెను.

కైకేయీవచనంబులు రాజసమ్మతమని సుమంత్రుఁడు తలఁచి యందుండి హుటాహుటిఁ దరలి, రాజదర్శనార్థులైయున్న నరేంద్రలోకమును గడిచి, పైపైఁ బొరలుచున్న ప్రజాసాగరంబును దాఁటి, యడిగినవారితో 'రాముని తోడితేరఁబోవుచున్నా' ననుచుఁ జనిచని, మహోకవాటపిహితంబును మణివిద్రుమతోరణంబులైన రామమందిరబహిర్ద్వారము దాఁటి, నానాదేశాగతనరపాలమండలమండితంబైన ముఖశాల నతిక్రమించి, దాసీదాసజనసంకీర్ణంబైన త్రొట్టికట్లుమించి, కాషాయవస్త్రధారిణులై వేత్రంబులు

పూనియున్న యంతఃపురరక్షక స్త్రీజనగౌరవంబులంది, దాశరథికిఁ దనరాక నెఱింగించెను.

తండ్రియాప్తుఁడు సుమంత్రుఁడు వచ్చుట రాముఁడు విని వానిని లోనికి రప్పించెను. అతఁడట్లుపోయి 'రత్నకంకణంబులు మధురరవంబు లీనుచుండ, మృణాళనాళమృదుహస్తతలంబునఁ జామరము వీచుచుఁ జేరువ సీతాదేవి విలసిల్లుచుండఁగా, హిరణ్మయపర్యంకము నధిష్ఠించి, చిత్రానక్షత్రసంయుక్తుఁడైన చంద్రునికరణిఁ బొలుపారుచున్న రాముని సందర్శించి, భయనయనంబులు పిఱిగొన మ్రొక్కి సుఖప్రశ్నముఁ గావించి తావచ్చిన సంగతి విన్నవించెను.

### రాముఁడు దశరథునొద్దకుఁ బోవుట.

రాముఁడు సుమంత్రుని సత్కరించి భార్యవంక మరలి 'దేవీ! తండ్రియుఁ గైక తల్లియు నాకొఱకు సుమంత్రుని బంపిరి. నాయభిషేకంబునుగూర్చి వారాలోచించుచున్నట్లు తలంతును. నాపినతల్లిగారు భర్తృప్రియకామయు సమర్థురాలును గాననఁ బతియభిప్రాయంబు నుజ్జీవింప జేయును. జగన్మంగళాభిలాషిణి యగుటంజేసి యీమెయిందులకు సంతసించుట వింతగాదు. వారిరువురుఁగూడి యర్థసాధకుఁడైన సుమంత్రుని నాకడకుఁ బంపుట నాభాగ్యవిశేషముగాని యొండుగాదు. జాగువలదు, పోయివచ్చెద. పరిజనంబులతోడఁ గ్రీడల సుఖింపుచుండు' మని పలికి వెడలెను. సీతాదేవియు భర్తృమంగళంబును గోరుచు ద్వారముదాఁక వెంట నడిచి 'పరమేష్ఠి యింద్రునకుఁబోలె దశరథమహారాజు మీకు రాజసూయాభిషేచనయోగ్యమైనరాజ్యంబు నిచ్చుఁగాక. రాజసూయయాగదీక్షను వహించి వ్రతసంపన్నుఁడవై కృష్ణాజినమును ధరించి కురంగశృంగమును హస్తతలమునఁ దాల్చియుండునిన్నుఁ గన్నారఁ జూతుఁగాక. దేవేంద్రుఁడు ప్రాచీభాగంబునను యముఁడు దక్షిణపార్శ్వంబునను వరుణుఁడు ప్రతీచీదిశయందును గుబేరుఁ డుదీచీదిక్కునను నిల్చి నిన్నురక్షింతురుగాక' అను మంగళోక్తులతో సాగనంపెను.

రాముఁడట్లు వెడలివచ్చి హజారమునొద్ద వేచియున్న తమ్ముని లక్ష్మణుని వెంటఁగొని మధ్యమ కక్ష్యాంతరమున బారులుదీఱియున్న మిత్రకోటి

నభినందించి, వ్యాఘ్రాజినసమాచ్ఛాదితమై యగ్నివలెఁ దేజరిల్లుచున్న రజత రథంబు నారోహించెను. సౌమిత్రి ఛత్రచామరములు పట్టి పృష్ఠభాగంబున నిల్చెను. వందిమాగధుల జయజయధ్వనులు చెలరేగెను. నానామంగల వాద్య నాదంబులును బ్రజాకలకలంబులును రోదసీకుహరము నిండెను. ఉత్తమహయంబులెక్కి కొందఱు మాతంగంబు లధిష్ఠించి కొందఱు వెంటఁ దరలిరి. అంత సారథి రథాశ్వంబులవాగెలు సడలించెను.

రాముఁడట్లు బయలుదేఱి రాజవీథిఁబడి నిరుపార్శ్వంబున సౌధోపరితలంబులనుండి యిందుబింబాననల దోయిళ్ళవర్షించు దివ్యపుష్పంబులఁ దోఁగుచు, నుత్తమాంగనల మంగళాశీర్వచన మాలికలను దలతోడ గ్రహించుచు, రోహిణి చంద్రునట్లు సీతాదేవి నిజపురాకృత సుకృతఫలంబుగా రామచంద్రుని గూడె ననువృద్ధనారీమణుల ప్రశంసోక్తులు వినుచుఁ దనపరిపాలనంబునఁ గలుగు నభ్యుదయంబులను గూర్చి జనులు బహుముఖంబులఁ బల్కుచున్న యాశావచనంబుల నాకర్ణించుచు భావవికారమింతయుఁ బొరయక, దేవాలయంబులు వలగొని మందమందగమనంబునఁ బోయి తండ్రియున్న నగరు జొచ్చి ధనుర్ధరసంరక్షితంబైన కక్ష్యాత్రయముదాఁటి యట రథము డిగి పాదచారియై మఱిరెండ్లు కక్ష్యలు గడచి తోడిజనంబు నందుండి మరలించి తన రాక నెఱిఁగించి లోనికిఁ జని తండ్రికిఁ గైక తల్లికి మ్రొక్కి నిలిచెను.

కైకేయీరాములు.

దశరథుఁడు తనప్రియసుతుని జూచి 'రామా!' యనుమాటమాత్రము పలికి మిన్నకుండెను. రాముఁడు తండ్రిని దేఱిచూచి, వానికంఠము వ్యసనకుంఠితమగుటయు వానిదృష్టిబాష్పనిరుద్ధమగుటయు వానియునికి యపూర్వస్థితినుండుటయు కలతవాఱిన సముద్రమువలె దబ్బఱలాడిన ఋషి చందంబున నంతస్తాపసంతప్తుఁడై నిట్టూర్పులవలన నతఁడు హృదయపరితాపమును వెలిపుచ్చుచుండుటయుఁ బరికించి పార్వణసాగరము క్రియ మనఃక్షోభ మొంది పురపురఁ బొక్కుచు 'గటా! నన్నుజూచినంతనే సంతోషపరవశుఁడగు నాతండ్రి నేఁడిట్లు కానేల? ఏమి విపరీతమువాటిల్లె?' నని వితర్కించుకొని, కైకేయివంక మరలి 'తల్లీ! నాతండ్రి యిట్లుండనేల? కాయిక మానసిక వ్యాధిరూపదుఃఖంబులు వానిని బాధింపవు గదా? భరతశత్రుఘ్నులు

కుశలమేగదా ? మీరెల్లరు సుఖముండురుగదా ? జననమూలమును బ్రత్యక్ష దైవతమునైన తండ్రిగారియాజ్ఞను సుతులు శిరంబునం దాల్తురుగదా? తల్లీ! మైత్రినొండె మఱియేకారణముననొండెం బరుసములాడవుగదా ? సంగతి యేమో తెలుపుము, తల్లీయని' యనెను.

కైక :— రామా ! కోపముగాదు. తాపముగాదు. ధర్మసందేహమొకటి గలిగి ముడివీడక త్రొక్కటపడుచున్నాఁడు. ధర్మజ్ఞుడవగు నీవే దీనిఁదీర్పవలయును. సంగతియో యంత దురవగాహము గాదు. ఆడితప్పనగునా కాదాయనునది ప్రస్తావనాంశము. సత్యమునకు నపవాదములు గలవని నానేర్చినకొలఁది చెప్పితిని; పెద్దలచరిత్రలు తార్కాణగాఁజేకొంటిని.

'ఆ॥ వె॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ
ప్రాణ విత్త మాన భంగమందుఁ
జకితగోకులాగ్ర జన్మరక్షణమందుఁ
బొంకవచ్చు నఘము పొంద దధిప !'

అను శుక్రాచార్యోపదేశంబు నుదహరించితిని. ఎందునను వాని తలంపుచిక్కు వీడదు. నీవేదీనినిఁ దెలుపనగును.

రామ:— అమ్మా ! సత్యమునకు నపవాదములు కేవలాపద్ధర్మంబులుగా వచింతురు. అంతేగాని యొండు గాదు. ఆడితప్పరాదు ; తప్పినచో దోసము సంభవింపక మానదు. తల్లీ ! ఈ ధర్మము నీకు మాత్రము తెలియదా? ఓర్పుమాటగా నట్లంటివిగాఁబోలు.

కైక :— రామా ! నీవును నీతండ్రితో నేకీభవించితివి. ఇఁక నామాట సాగదు. ఆడితప్పరాదంటివి ; తప్పుట దోసమంటివి. నీయట్టి ఋజుమార్గవర్తియు సత్యవాదియుఁగలుగఁడు. నీతండ్రి కొం డొకనాఁ డొకమాటచెప్పెను, అదినేఁడు కాదనలేక పరి తపించుచున్నాఁడు. తండ్రియెడరు తీర్చుట తనయులకు విధి విధానముగదా.

రామ:— తల్లీ ! ఈవిషయమున నీరాముని సంశయింతువా ? గురువును దైవము నైన తండ్రికిఁ జేయరానిది గలదా ? రాముఁడు తండ్రి కెదురాడఁడు. ఆడితప్పఁడు. ముమ్మాటికి నమ్ముము. తల్లీ! సంగతియేమో చెప్పుము ; నాతండ్రికిఁగా నేనోర్తును.

కైక :— రామా ! తొల్లి దేవాసురయుద్ధంబున నీతండ్రి శంబరాసునివలన శకలీకృతాంగుఁడై మూర్ఛిల్లెను. అప్పుడు సారథ్యము వహించి యున్న నేను మూర్ఛాగతుని నీతండ్రిని నేదతేర్చి కాపాడితిని. నా సేవకుమెచ్చి నీతండ్రి యయాచితంబుగా నాకప్పుడు రెండు వరములిచ్చెను. అవియిప్పుడు కోరితిని. వానిని జెల్లింపనోడి యిట్లుపరితపించుచున్నాఁడు. నీతండ్రి బహుయాజి యందురు; కలిమిగలనాఁడు వేనవేలు యజ్ఞములు చేయవచ్చును. వానిని సత్యసంధుఁడని కీర్తింతురు. అక్లిష్టసమయములం దెల్లర నట్టి వారుగానే కాన్పింతురు. సమయమనెడి యొఱపుసానమీఁద రాచుదాఁక నిగ్గు తేలదుగదా.

రామ:— అమ్మా! నాతండ్రి నీకిచ్చినవరములేవి? వానిని జెల్లింప సంశయ మేల ? నాతండ్రికి మాఱుగా నవ్వరంబులను నీకు నేను సాధింతును. తల్లీ ! మాటతప్పను.

కైక :— రామా ! సాధింపరానివరములను నేనుగోరలేదు. నా కోరినవి నీనియరచేతిలోనే యున్నవి. దాపనేల! వినుము. భరతునకుఁ బట్టముఁగట్టుమంటిని ; నీకుఁ బదునాలుగేండ్లు వివాసమును గోరితిని. ఈసంగతి నీకుఁజెప్పనోడి నీతండ్రి తలవ్రాల్చి యున్నాడు. జనకునికీర్తినిఁ గాపాడఁదలఁతువేని వానిమాట చెల్లింపుము. సంభారములెల్ల సిద్ధముగా నున్నవి. ఆద్రవ్యములతోన భరతునకుఁ బట్టముగట్టి నీవు జటాజినవల్కలంబులు ధరించి చతుర్దశవర్ష వన వాస మొనర్పుము.

రామ:— తల్లీ ! అనర్ఘములైన వరములను నాకుఁ గృపచేసితివి. ఇవితప్పక చెల్లింతును ; వేఱుతలఁపువలదు. ఇప్పుడే నీయెదుటనే నార చీరలు గట్టి తరలుదును. ఈపరమవరములను నాతండ్రి నాకు

స్వయముగా నను గ్రహింపఁడయ్యెనను చింతదక్క నొండుగలుగదు నాయెడఁబితృభక్తిని శంకించెనోయని వందురుదును. తల్లీ! తండ్రి పనుపుచేయుటకును నీకు నభిమతార్థమును గూర్చుటకును రాజ్యమునేగాదు సీతనేనియుఁ దుదకుఁ బ్రాణంబునేనియుఁ దృణీకరింతును. అమ్మా! నాయనగారి నాశ్వాసింపుము. అయ్యో! నాతండ్రి కన్నీరునింపనేల! వలదు వలదు; ఎంతమాత్రము వలదు. ఒండుతలంపక తడవుసేయక భరతునకై సందేశమును వాయువేగంబునఁ బంపుము.

కైక :— రామా! అట్లేచేయుదుఁగాని నీవుమాత్రము జాగుచేయవలదు. మాటచెల్లింతువో లేదోయని జంకి నీతండ్రి సిగ్గుపడిపలుకఁడు. వానికొంకుమాన్పుము. నీవు వనమునకుఁ బోవుదాఁక నీతండ్రి యన్నపానాదులుగూడ స్మరింపఁడు.

కైకేయీ వచనంబులు కొఱడావ్రేటులై త్వరించెను. రాముడంత దశరథుని లేవనెత్తి ‘నాయనా! రాజ్యాదిసంపదలకు నీరాముఁడు దాసుఁడుగాఁడు. ధర్మమొండు వానికిఁజాలును. పితృసేవకు మించినయజ్ఞముఁ దండ్రిపనుపుసేయుటకన్న నధికమైన ధర్మముఁ గలుగవు. అట్టి ధర్మము నొనర్చుటకు నాకిప్పుడవకాశమును గలిగించితివి. ఇంతకన్నఁ బరమభాగ్యము నాకేల? నీయాజ్ఞ దల్లిముఖంబున వింటిని. నీరాముఁడు నీకెదురాడఁడు. అట్టిజంకు కళంకులువలదు’ అని పలికి కైకేయిని జూచి ‘తల్లీ! నీవేనన్ను శాసింపరాదా? నీపనుపుఁ దలదాల్పనా? నీకోరినవి మహాస్వల్పములు. ఇవి యొకవరంబులుగా రాజేంద్రుని యాచింపవలయునా? ఇదిగో జననీజనకులను వీడ్కొని సీతనూఱడించి నేఁడే దండకారణ్యంబునకుఁ దరలుదు. నాతమ్మునకు భరతునకు రాజ్యమును గట్టుము. పితృశుశ్రూషలందుఁ బరాకుచెందవలదని నామాటగా వానికిఁ జెప్పు’మని వచించి కైకేయీదశరథులకుఁ బ్రదక్షిణమొనర్చి ప్రణమిల్లి పితృవాక్యపరిపాలన మహాభాగ్యప్రాప్తి కెంతయు సంతసించుచు నందుండి వెడలి లక్ష్మణుని వెంటఁగొని యభిషేక జలభాండాదులవంక కన్నెనియుసారింపక వానిని బ్రదక్షిణమాత్రంబున నభ్యర్చించి తల్లిమందిరంబునకుఁ బోయెను. అఱచేతిలోని రాజ్యశ్రీ హఠాత్తుగా జాఱిపోయినను రాముని హృదయము లవమాత్రమేనియు·

జలింపక నిర్వాత దీపకళివలెనుండెను. వానిమోమునందెట్టి వికారముఁ దోఁపదయ్యెను. వానిని జూడఁగా ద్వంద్వాతీతుఁడైన స్థితప్రజ్ఞుఁడు తలం పునకు వచ్చుచుండెను.

రాముఁడు కైకేయీమందిరమునుండి వెడలివచ్చుచేతడవుగా శుద్ధాంత కాంతాజనంబుల హాహారావములు పిక్కటిల్లెను. 'కటా! మాప్రాపు, మాభాగ్యము. మాకన్నతండ్రి మారాముఁడు మమ్మెల్ల విడినాడి వనాంతర మునకుఁ జనుచున్నాఁడు. అయ్యో! ఏమిసేయనగు! కటా! రాజా! నీదుర్బుద్ధికేమనవగు! లోకశరణ్యుఁడైన ధార్మికసుతుని గహనాంతరములకుఁ దోలి ప్రాణిలోకంబును బెంజీఁకటి ముంతువా!' అని వారు దూడలఁ బాసినగోవులచందానఁ బనవసాగిరి.

రాముఁడు తల్లిని వీడ్కొనుట.

అటఁ గౌసల్యాదేవి పుత్త్రుని హితార్థము నియమనియమితచిత్తయై రేయెల్లజాగరణముండి వఱువాత విష్ణువు నర్చించి కృతమంగలయై హోమము గావించుచుండెను. రాముఁడు తల్లిమందిరముఁజొచ్చి తొలితొలికట్టునం దున్న ద్వారపాలకుల జయాశీర్వాదములు గైకొని రెండవతొలికట్టునందున్న వేదవేత్తలకు నమస్కరించి మూఁడవతొలికట్టుఁ బ్రవేశించెను. అచట పురంధ్రీమణులు వానినిగాంచి ప్రమోదభరితాంతరంగలై యాశీర్వదించి వానిరాకఁ దల్లికెఱిఁగించిరి. కౌసల్యాదేవి వాత్సల్యము పిచ్చలింపఁగాఁ గొడుకునకు నెదురువచ్చి తనకు నమస్కరించిన సుతుని నంకమునఁ గూర్చి శిరముమూర్కొని 'నాయనా! మహాత్ములగు రాజర్షులవలె నీవు దీర్ఘాయుః కీర్తులగుఁ గాక; వంశార్హమగు ధర్మంబును భావింతువుగాక' యని దీవించి 'వత్సా! నేఁడు నీకు యౌవరాజ్యాభిషేక మంగళమును గానున్నదిగదా. ఇటఁగుడిచి చను' మని పలికి యాలోన సుతుని మరిపెంబులను విన గుతూ హలయై వానిని గూర్చుండుమనెను.

రాముఁడు తల్లికి మరల మ్రొక్కి 'అమ్మా! సంగతి యొండు వినిపించి పోవచ్చితిని. వెరవకుము. దేహధారులకు సుఖదుఃఖంబులు సహజంబులు. పరమార్థము విచారించినచో సుఖము సుఖముగాదు; దుఃఖము దుఃఖముగాదు. ఏలయందువా! దేహాత్మబుద్ధిగలంతకాలమే యీద్వంద్వములకు నునికిగలదు.

అప్పుడుగూడ నవి దైహికములేగాని యాత్మసంబంధములుగావు. మఱియు నిట్టిసుఖదుఃఖాదులు జీవరాశికిఁ బూర్వకర్మానుసారమున వచ్చుచుండును. కర్మగతి యిట్లని చెప్పదరముగాదు. ప్రాప్తమును సహింపకతీఱదు. ఈపరమరహస్యము నెఱుంగనివారు ద్వంద్వకోలాహలమునకుఁ జిక్కి నశింతురు. ఇదియునుగాక సుఖదుఃఖములయొక్కయు మేలుగీళ్ళయొక్కయు యాథార్థ్యము సులభగోచరముగాదు. ఇప్పుడు మేలుగాఁదోఁచునది మఱికొంతసేపునకుఁ గీడుగావచ్చును. ఇప్పుడు కీడుగాఁదలఁపఁబడినది కాలాంతరమున మేలుగావచ్చును. కావున నేది నిజముగా మేలో యేదినిజముగాగీడో మాయావృతులకుఁ దెలియవు. ఈయజ్ఞానంబునకుఁ జిక్కి వారు భ్రాంతులై మరుమరీచికలవెంటఁ బరువెత్తుచుందురు. తెలివిగలవారట్లుసేయరాదు. నాతండ్రి నాకుఁ బట్టముఁగట్టుట మేలో కాదో చెప్పగలరా ? తలఁచినపని సమకూఱునో లేదో నిశ్చయింపఁగలరా ? సర్వము దైవాయత్తమై యుండును. ఎప్పుడేది గల్గునో దానిని సహించుటయే మర్త్యులకుఁ బరమ శ్రేయోమార్గము. తల్లీ! సుఖదుఃఖంబులను గలిమిలేములను సమదృష్టితో భావించుచుఁ ప్రాప్తంబు ననుభవించుచుండుము. కోరికలవెంటఁ బరువు లెత్తవలదు. భరతునకుఁ బట్టముఁగట్టునట్లు నిశ్చితమైనది. నేను దండకారణ్యంబునఁ బదునాల్గువత్సరంబులు కందమూల ఫలభోజినై వసింపఁ దలచుచున్నాను. అనుజ్ఞవేడుదు. నిండుమనంబుతో సెలవిమ్ము" అనెను.

ఆమాట చిచ్చుఱపిడుగుంబోలె చెవిఁబడినంతనే కౌసల్యాదేవి నిలువున నఱికిన కదళివోలె నేలఁగూలి మూర్ఛిల్లెను. ఆమెను దాదులు శైత్యోపచారంబులఁ దేర్చిరి. ఆమె నేదదేఱి "వత్సా! నాశోకార్థము జన్మించితివా! అయ్యో! సంతానములేని నాటికంటె నేఁడు నాదుఃఖము దుస్సహమయ్యెనుగదా. భర్తవలన నిండారుసుఖమెట్టిదో యెఱుంగకున్నను బుత్రునివలననేని సుఖింతుఁగదాయని కొండంత యాసతోనుంటిని. ఆయాసకు నమ్మి యోర్వరానికష్టము లోర్చితిని ; మరణంబుఁబోని సపత్నీనిరసనంబును సహించితిని. అయ్యో! నాయాసలెల్ల నడియాసలయ్యెను. ఇఁకనాగతి యేమి ? కైకేయికి వెఱచి పరిజనంబు నన్ను మనసారఁ బరిచరింపదు ; దయితుఁడు హృదయమిచ్చి వర్తింపఁడు. నాయనా! నిన్నుఁ జూచికొని యివియెల్ల మ్రింగియుండును. నీయుపనయనమై యిప్పటికిఁ బదునేఁడు

వత్సరంబులుగడచెను. నీకు యౌవరాజ్యంబు వచ్చుననియు నాయెదరులెల్ల సమసిపోవుననియు నూఱట్లిల్లుదును. పుత్రా ! కడకు నిన్నుఁజూచుటయే నాకుఁ గఱవుగానయ్యెను. లెక్కలేనిదినము లుపవసించితిని ; చెప్పరాని వ్రతములు సలిపితిని. కన్నదేవతలకెల్ల మ్రొక్కితిని. ఎట్లో నాతపః ఫలంబుగా నిన్నుఁబడసితిని. నాపడినగాసియెల్ల నేటితో వ్యర్థమయ్యెను. వఱదతాఁకున నదీకూలమువలె నాహృదయము విఱియరాదా ? కటా ! యముఁడు గూడ తనలోకంబున నాకు జోటియ్య వెఱచెనా? హా! ప్రాణము లారా ! ఈమొండికట్టియను వదలి పున్నెముఁ గట్టుకొనరా ? దేహమా ! ఈవ్యసనంబులో ర్చుటకన్నఁ దలనుండిజాఱిన నీటి కడవవలెఁ దుత్తునియలై నశింపరాదా? పితామహా ! వజ్రసారంబునఁ బదనిడి నన్ను సృజించితివా ? కానిననే గదా నన్ను దుఃఖాగ్ని దహింపదు. ఇఁక నాకు మరణభాగ్యముకల్లు. నాయనా! నీతోడిదే లోకంబుగా నుందును. నిర్జీకలోకంబున నన్ను ఖయిదు చేయవలదు. నీవెంట వత్తు' నని గొబ్బున విలపించెను.

అందాఁక లక్ష్మణున కీసంగతియే తెలియదు. రాముఁడట్లు కౌసల్య తోఁ జెప్పుట వినిసౌమిత్రి తన్నుఁదానమ్మరుండెను. కౌసల్యాదేవి యెలుగెత్తి విలపించెను. లక్ష్మణుఁడు బహిర్ముఖుఁడువోలెనై తల్లీ ! దుఃఖనువలదు. స్త్రీమాటకుఁ గట్టువడి నాయన్న హస్తగతమైన రాజ్యశ్రీని నిరసించి గుట్టల పాలగుట నేనెంతమాత్రము సహింపఁజాలను. ఱేఁడన్ననో వయఃపరిపాక జనితచిత్తచాంచల్యంబునకు విషయలౌల్యముతోడ్పడగా నెత్తువారిచేతిబిడ్డఁడై యున్నాఁడు. వివశుని ఖాటించుట వెఱ్ఱితనము' అని పలికి రాముని వంక మరలి 'అన్నా ! ఏమి ? నీకు దేశాంతరవాసశిక్షను విధించెనా ? ఏల ? రాజద్రోహమొనర్చవు. అంతటి నేరమేదియుఁ జేయవు. పగతుడుగూడ నీవంక వ్రేలుచూపఁ జాలఁడు.ఋజుమార్గవర్తివి. జితేంద్రియుఁడవు; దైవ సమానుడవు; మిాదుమిక్కిలి గాదిలికుమారుఁడవు. అట్టినిన్ను నిష్కారణముగా దండ్రి త్యజించెనా? వానియస్వస్థచిత్తతను నిరూపింప మఱేమి వలయును. అట్టివాఁడు ధర్మజ్ఞుఁడగునా ? ధర్మజ్ఞుఁడు కానివాఁడాదరణీయుఁడా ? ధర్మదూరుని లెక్కసేయనగునా ? లెక్కచేయుట యధర్మముగాదా? ధర్మ మువలనఁ బ్రమాదముండవలదు ; అన్నా ! ఈయవివేకశాసనము వెల్లడిగాక మున్నె రాజ్యంబు నాక్రమించుదముగాక. నేను ధనుష్పాణినై నీచెంతనున్నంత

కాలము నీయాజ్ఞ జవదాటు ప్రాణిగలుగఁబోదు. అయోధ్యారాజ్యంబెల్ల నొక్కటిగా నెత్తివచ్చినను నిలువనోర్తును. రాతు మెత్తనైన గుణ్ణము ముక్కాలనడచు నను సామెత నేఁడు మన యెడ వర్తించుచున్నది. కైకేయీమాయలకుఁ జిక్కికన్నతండ్రియే మనకు శత్రువయ్యెను. కానిమ్ము; కార్యాకార్యావివేకము దక్కి యుత్పథంబుఁ ద్రొక్కినయతఁడు తండ్రిగాని గురువుగాని శిక్షార్హుఁడుఁగాకమానఁడు. స్మృతులే యిట్లు వచించుచున్నవి. ఇదియిట్లుండనిమ్ము. రాజ్యము నీకు ధర్మప్రాప్యము. నీసొమ్మును భరతునకిచ్చుటకు దశరథున కేమిహక్కుగలదు ? మనయిద్దఱను విరోధించి వగ్గుముదుసలి యీపని చేయఁజాలునా ? ఏబలంబును నమ్మి యట్లొనర్చునో చూతము ; తల్లీ ! జ్ఞాతినని నన్ను సంశయింపవలదు. సత్యము సాక్షిగా నాచేతివిల్లు సాక్షిగాఁ బ్రమాణము చేయుచున్నాను. అన్నయెడ నాయనురాగము నిర్వ్యాజనిష్కళంకము. అన్నమాటఁ దలఁదాల్చి వర్తింతును. ఆయన మహారణ్యము చొరనున్నను గాలాగ్నినుఱుకనున్నను వానికన్నమున్న నేనుందును. అమ్మా ! ఊరడిల్లుము. నాపరాక్రమముఁ జూతువుగాక' అని రోషభీషణంబుగా వచించెను.

కౌ :—నాయనా ! రామా ! తమ్ముని వింటివా ? సవతిదుర్బోధనలకు రాజు చిక్కువడియున్నాఁడు. నన్ను శోకసాగరంబునఁద్రోయకుము. నీవు వనమునకు నెంతమాత్రముఁ బోఁదగదు. వత్సా ! నీ వెఱుంగనిధర్మము గలుగదు. మాతృశుశ్రూషకన్నఁ బరమధర్మము గలదా ? రాజ్యము లేకున్న మానెఁగాక ; నాతోడ నిటనుండుము. కాశ్యపుఁడు మాతృసేవైకవ్రతియై యిల్లెడలకుండియు స్వర్గమును బడయఁడా ? బిడ్డలకుఁ దండ్రియెట్లో తల్లియు నట్లేగదా. వత్సా! నీవులేనిబ్రదుకు నాకేల ? నీవు చెంతనుందువేని తృణభక్షణము గూడఁ బరమరసాయన సంతృప్తినొదవించును. నామాట వినవేని యన్నపానాదులు వర్జించి ప్రాణపరిత్యాగ మొనర్తును.

రా :—తల్లీ! నీకు వేనవేలు నమస్కారములు. దారుణము వలదు. తండ్రియాజ్ఞఁ దప్ప నాతరముగాదు. జనకునియాజ్ఞ యనుల్లంఘ్యము. తండ్రిపనుపుసేయుటకై కండుమహర్షి గోహత్యకుఁగూడ సాహ

సించెను ; సగరపుత్రులు తమప్రాణంబులను ధారవోసిరి ; పరశు రాముఁడు కన్నతల్లిని గొడ్డట ఖండించెను. పెద్దలమార్గమును బరిశీలింపుము. నన్నుఁగని పెంచితివనుట నిజము ; నాకై పడరాని పాట్లు నీవు పడుట సత్యము. ఏది యెట్లున్నను ధర్మమెల్లరకుఁ బ్రధానము. బిడ్డలు ధర్మమార్గావలంబకులగునట్లు చేయుట తల్లిదండ్రులకు విధివిధానము. ధర్మమాచరింపనున్నప్పుడు నీవునాకుఁ దోడ్పడవలయునే గాని యిట్లనరాదు. ధర్మమును విడనాడనోప. నేను వనవాసముచేయుట నీకుదురంతశోకకరమగునని యెఱుంగుదు. దానినైననోర్తుఁగాని తండ్రియాజ్ఞ మీఱఁజాలను. నా యీ నిర్ణయము విపరీతముగాదు. లోకవ్యతిక్రమమిందేమియు లేదు. తొల్లింటి మహాత్ములత్రోవఁ ద్రొక్కుచున్నాను. ధర్మనిబద్ధమైన నాయీకార్యమునకు ననుజ్ఞయిమ్ము.

లక్ష్మణా ! నీకూర్మికెంతయు సంతసింతును. తేజోవిక్రమంబులందు నీవు దురాసదుఁడవనుట నాకుఁ గ్రొత్తగాదు. నాతల్లి సత్యశాంతగుణాదుల తత్త్వము సమగ్రముగా గ్రహింపని కారణమున నట్లాడుట చిత్రము గాదుగాని గురుశుశ్రూష లొనర్చి శాస్త్రములభ్యసించి యెల్లధర్మములు నేర్చిన నీవిట్లాడుట చిత్రమేగాక దుఃఖకరముగానున్నది. వత్సా! ధర్మమునకు సత్యమే మూలము. ధర్మమునకన్న నుత్తమపురుషార్థము గలుగదు. దేహధారులకు సత్యంబుకంటె శరణ్యంబులేదు. ధర్మంబు నెడయుటసత్యద్రోహమగును. ఆత్మవినాశమును వరించువారు దక్క నన్యులందులకుఁ దెగింపరు. భావితాత్ములకు ధర్మమే శరణము. ఎల్లధర్మములలోఁ బితృవాక్యపరిపాలన ముత్తమోత్తమధర్మమని పెద్దలనిశ్చయము. తండ్రియాజ్ఞ నతివర్తింప నావలనుగాదు. అది కైకేయీ ప్రేరితమందువా ? అగుగాక. తండ్రియాజ్ఞప్రధానము గాని తన్మూలకారణము ప్రధానముగాదు. ఉత్పథమందువా ? ఆవిచారణకే నీవర్హుఁడవుగాదు. లక్ష్మణా ! కేవలక్షత్రధర్మాశ్రితబుద్ధి వలదు. ఆర్యులుదాని నంతగా మన్నింపరు. క్రౌర్యమెడసి ధర్మమాచరింపుము.

కౌ :-కుమారా! గురుజనాజ్ఞ మీఱరాదంటివి. పోషణస్నేహంబులఁ దల్లియుఁ

బుత్త్రులకు గురువగునుగదా ! నాగర్భాంతనుమాత్రము మీఱ నగునా ? వత్సా ! నామాట వినుము. నన్ను వనమునవెల్లఁద్రోయకుము. నీవులేని నాఁడు పితృలోక స్వధ గాని స్వర్గలోకామృతముగాని నాకెంతమాత్రము నభిమతంబులు గావు. నీసన్నిధానము నాకుఁ గల్పముగానుండును. పుత్త్రా ! నీమనస్సును మరల్చి నాప్రాణములు నిలుపుము.

రా :—తల్లి ! వ్యసనపరితాపంబులకు సెడమీయవలదు. సందిచ్చినచో నవిమిగ్గైచును. ప్రాణులకు సుఖదుఃఖములు సహజములని మున్నే విన్నవించితిని. స్థైర్యము వహించి యివి యెల్లసహింపుము.

రామలక్ష్మణులసంవాదము.

(తమ్మునివంకకుమరలి) 'లక్ష్మణా ! నీవిట్లు దుఃఖించుట పౌరుషమా! నాయనా ! సత్పురుషులకు ధర్మార్థకామంబులు మూఁడును సమాదరణీయంబులు. అందు ధర్మము త్తమము. ఏలఁనందువా ? వశ్యగయై ధర్మంబును, బుత్త్రవతియై యర్థంబును భార్య భర్తకుఁ గూర్చుసగిది ధర్మమొక్కండె నరునకు నమ్మూఁటిని సమకూర్చును. కావున ధర్మము ప్రధానము; అర్థకామంబు లానుషంగికములు. ధర్మార్థకామంబులు మూఁడింటికిఁ గూడని కర్మము నాచరింపరాదు. కామార్థములకుఁ మాత్రమేయగు కర్మంబులను బరిత్యజింపవలయును. కామార్థములకుఁ గాకున్నను ధర్మమునకు మాత్రమేయైనచోఁ దత్కర్మము పరమానుష్ఠేయము కేవల కామార్థ కర్మము లోకగర్హితమని వేఱచెప్పనక్కఱలేదు. ఈవచనంబులు తాత్పర్యాణగాఁ బ్రకృతవిషయంబును విచారింపుము. రాజ్యభోగాదులు కామార్థప్రదములే గాని యంతకు మించినవిగావు. అట్టి తుచ్ఛంబులను మనబోంట్లు పెద్ద సేయవచ్చునా ? ఎన్నికష్టంబులు వచ్చినను సహించి ధర్మమును సంపాదింపవలయు. కావున నివ్విషయంబునఁ బరాకు చెందకుము. సౌమిత్రీ! మహారాజు మనకు గురువును దండ్రియు రాజునగుటయేగాక వృద్ధుఁడును గావున వారు చతుర్విధములఁ బూజనీయులై యున్నారు. అట్టిమహనీయుని యాదేశము కామకారితముగానీ యేమైనఁగానీ ధర్మపరుఁడు నిరాకరింపఁడు. లక్ష్మణా ! తండ్రియాజ్ఞ నీకుఁగూడఁ గర్తవ్యమేగదా ?

తల్లీ ! సతికిఁబతియేగతి. పతిమాటను నీవు నిరాదరింపరాదు. అమ్మా ! రాజ్యాదులు క్షణికములు ; ప్రాణముశాశ్వతముగాదు. నీటిబుడుకలం బోని వీనికై నిత్యమగు ధర్మమును వదలుదురా !—లక్ష్మణా ! ధైర్యమవ లంబించి రోషశోకంబులను నిగ్రహింపుము. అవమానమును సుంతయు శంకింపవలదు. అభిషేకార్థము రచించిన యలంకారములనెల్ల విసర్జింపుము. ప్రవృత్తినివృత్తుల నొక్కరూపున బాలించు వాఁడే ధీరుఁడు. జాగువలదు. మనతండ్రి నిజప్రతిజ్ఞా భంగమును సంశయించి పరలోకభీతుఁడై యున్నట్లు తోఁచెను. వానిశంక తీరవలయును. నేనువనగతుఁడనగుదాఁక యది తీరదు. అందాఁక భరతాభిషేకమునుగూడఁ దలంపరు. తమ్ముఁడా ! రాజ్యమును ద్యజింపరాదంటివి. నాదియు నొకత్యాగమా ? తండ్రికి నాయెడఁగల పుత్త్రవాత్సల్యమెంతో నీవేయూహింపుము. నాఁడు విశ్వామిత్రమహర్షితోడ నన్నుఁబంపుటకు నాయన యెంతపరితపించెనో నీవు కన్నారఁ జూచియున్నావు. అట్టివాత్సల్యమూర్తి సత్యప్రతిష్ఠాపనార్థము పుత్త్రునిఁ జేతులార గుట్టలకుఁ బంపుచున్నాఁడు. ఈత్యాగము మ్రొలమనది యుఁ ద్యాగముగాఁ జెప్పనగునా ? నన్ను వనమునకుఁబంపుట న్యాయమా యని శంకింపవచ్చును. తండ్రికెన్నఁడు నప్రియమొనర్పలేదు ; వానిమాటకు నెదురాడి యెఱుంగను. నాయన తనకూరుములెల్ల నాపయిఁగురియించు చుండును. అట్టివాఁడు నాయెడ నిట్లువర్తింపనేల ? ఈపాట్లకెల్లఁ గైకేయి మూలమందురు. ఇది కేవలము భ్రాంతి మూలకము. ఆమె భరతునకన్న నన్నే ప్రియంబుగా మన్నించును. ఆమెకు నేనెట్టియవిన యంబుఁ గావింపలేదు. అట్టి తల్లి నేడిట్లు కోరనేల ? తమ్ముఁడా! ఇదంతయు దైవికముగాని వేఱుగాదు. దైవయోగమును గుర్తింపరాదు. సామాన్యులకుఁ దెలియరాకున్నను యోగీంద్రులకేనియుఁ దెలియదా యని యడుగవచ్చును. యోగులకుఁ గూడ దురూహమే యనవలయును. ఎట్లందువా? మహర్షులు త్రికాలజ్ఞులందురు. అట్టివారు నాపట్టాభిషేకముహూర్తమును నిశ్చయించిరి. తెలిసితెలిసి వారెగ్గుచేయరుగదా. వారినిశ్చయము సహితము క్షణములో వైపరీత్యమొందెను. కావున దైవయోగమంతదురూహము. అది బహురూపంబులఁ బరిణామమొందుచుండును. మర్త్యాదులు నిమిత్తమాత్రులగుదురు. ఈరహస్యమెఱింగినవారుఁ దమకు సంభవించు

సుఖదుఃఖములకై నిమిత్తమాత్రులైన వారిని భూషణదూషణాలొనర్వరు. కాబట్టి మనతండ్రినిగాని కైకతల్లినిగాని నిందించుట యజ్ఞానమూలక మగును. దైవయోగమును బ్రతిఘటింపనగునని నీవు భావించుచున్నావు. దైవయోగమనఁగానేమి ? సర్వేశ్వరునిశాసనమని కొందఱు తలంతురు. అదికేవలము ప్రమాదము. సర్వేశ్వరుఁడను పరతత్త్వము నిష్క్రియానిరంజననిర్వికార శుద్ధబుద్ధస్వరూపమైయుండును. అట్టి దానికిట్టి కార్యములంట గట్టరాదు. దైవయోగమనఁగాఁ బ్రారబ్ధకర్మవిశేషమని గ్రహింపుము.

"కం॥ వినుఁ పూర్వకర్మ ఫలములు,
దనకు వశముగాక పొందుఁదజీతో వానిం,
గనుఁగొన నేరక మూఢుఁడు,
దన కాపదయైనచోట దైవము దూఱుక్. "

"తే॥ కార్యఫలములయెడఁ దాన కర్తననుట,
కడునెఱుంగమిఁజువ్వె వాఁగర్తయేని,
తగిలితనదైనకార్యజాతంబులెల్లఁ,
జెడక ఫలియించునట్లుగాఁజేయరాదె ?"

సీ॥ నీతిమంతులు ధర్మనిరతులు దక్షులు
నగువారు సేయుకార్యములు గొన్ని
సిద్ధిఁబొందవు దుష్టచిత్తులుఁగ్రూరులై
చేయఁగొన్ని విశేషసిద్ధిఁబొందు
నూరకయుండంగ నొందుఁగొందఱువిపు
లార్థముల్గొందఱాయాసపడియుఁ
నిష్ఫలారంభులై నిలుతురు కొందఱు
పేదవారికిఁబ్రజపెల్లు వొడము.
తే॥ నర్థవంతులు కొందఱు కర్థి నధిక
దానములు ధర్మములు సువ్రతములుఁజేయఁ
బ్రజలుపుట్టరు వినుమట్టి భంగిసుమ్ము
కర్మఫలమాత్మ తంత్రంబుగాకయుండు.

"కం॥ పురుషుఁడు కర్మాధీనత,
నరుగక తనవశమయనిన నాపదలురుజల్,
మరణంబును నివియేమియుఁ,
బొరయకయుండంగఁ బోలదెచెప్పుమా ?"

తమ్ముడా ! వేయిమాటలేల ?

ఉ॥ కర్మమునన్ జలించును జగంబులు కర్మమునందు నిల్చు న
క్కర్మమునందెడిందు మఱికర్మగతిన్ నిలుపంగరాదు త
న్మర్మమెఱింగి ధర్మమగుమార్గమునం జరియించుచుండినన్
నిర్మలనిత్యసంపదలు నిక్కముగాఁదుదిఁగల్గు జీవికిన్.

"ఆ॥ కర్మవశతఁజూవె కలుగుదేహము
దేహవర్తనంబు కర్మవశతఁబుట్టు
దేహపాతమైనదేహస్థుఁడగుజీవుఁ
డరుగుఁగర్మవిహితమైనయెడకు."

రాముఁడట్లు వచింపఁగా లక్ష్మణుఁడు తలవంచి సమగ్రముగా విని బొమముడివెట్టి బిలస్థకుపితసర్పంబువలె నిశ్వసించుచుఁ గ్రుద్ధసింహంబుపగిడి భయంకరవదనుఁడై హస్తాగ్రమువిదిల్చి తలపంకించి 'అన్నా ! సమస్తనీతు లెఱింగియుఁ బ్రమాదపడుచున్నావు. క్షత్త్రియాగ్రణీ ! భ్రాంతి నిన్నుఁ బైకొనె ననకతీఱదు. కాదేని దైవబలంబు నొకబలంబుగా నుగ్గడింతువా? స్వతంత్రశక్తిలేని దీనులు దాని నాశ్రయింపవచ్చుఁగాక ; మనబోంట్లకు దగదు. పౌరుషసాధ్యములుగాని కార్యములుగలుగవు. ఆసంగతి యటుండ నిమ్ము. ధర్మవ్యతిక్రమము దగదంటివి. కైకేయీదశరథుల యీవ్యూ హము ధర్మబాహ్యమని నీవుఁదోఁపదా ? ధర్మబాహ్యమగునేని వారిమాట సేయుట దోసమేగదా. ఆత్మాభీష్టసిద్ధికై యామాయావులు ధర్మదేవతల వలె నీమెడ నింతకాలము నభినయించిరి. ఆమంత్రరహస్యము నెఱుంగక వారిపన్నిన వలలోఁ జిక్కితివి. కతయెల్లఁ జక్కగా విమర్శించి చూడుము. తేఁడు వరము లిచ్చి యేండ్లు పూండ్లుఁ గడచెను. నేఁటిదనకఁ దత్ప్ర సక్తియే గలుగదు. నేఁడు హఠాత్తుగా నీపట్టాభిషేకనిమిత్తమై యవి గాడనూపనేల ? ఇన్నాళ్ళు వలవనివరములు నేఁడు కోరనేల ? మఱియు

నాఁడిట్టివరములని కోరలేదు. కోరదగిన వెన్నో గలవు. ఇప్పుడీరెంటినే కోరనేల? వానికి రాజు సమ్మతింపనేల? సత్యసంధుఁడందువా? ఈవరములని నాఁడుచెప్పి నేఁడులేదన్నచో మాట తప్పుటగును. అట్టిదేమియు లేదు. కావున నిందుబొంకను మాటకే యవకాశములేదు. సత్యవ్రతము సర్వత్ర వర్తింపవలదా? ఇట్టివని కోరనిరహస్యవరములను గాదనుట యసత్యమైనచోఁ బట్టబగలు సభాంతరాళమున రాజన్యులమైత్రాల నీకుఁబట్టముఁ గట్టుదునని విస్పష్టముగా నాడినమాటలు తప్పుట యసత్యము గాదా? అన్నా! అమాయకునకు నీకిట్టి కుత్సితములు గోచరింపవు. ఇఁకనైనను గన్నుదెఱచి చూడుము. సత్యాసత్యవిచారమటుండ నిమ్ము. ధర్మశాస్త్రమును బరిశీలింపుము. రాజ్యము జ్యేష్ఠక్రమాగతమని శాస్త్రములు ఘోషించుచున్నవి. మనకులాచారముగూడ నట్లేయున్నది. నీవు జ్యేష్ఠుఁడవు. నిన్నుఁ గాదని భరతునకుఁ బట్టముగట్టుట శాస్త్రధర్మవిరుద్ధమును గులాచారవిరుద్ధము నైయున్నది. ఈ నేత ధర్మనిరసనముగదా. రాజుగారి ధర్మబుద్ధి యేది? దీనికేమిసమాధానముఁ జెప్పెదవు? భ్రాంతిపటలంబులు నీమనోదర్పణంబును గప్పియున్నవి. అన్నా! నీవు నవనీతహృదయుఁడవు. ఈసంగతి తెలిసి మూఁడు గాళ్ళ ముసలి యాడినది యాట గానున్నది. ఇది సహింపరాదు. ఎదయిచ్చి పల్కితిని; క్షమింపుము. అధర్మంబునకు ధర్మకవచమును గూర్చినంత నే లోకము మోసపోవదు. వివశునిమాటకు విలువలేదు. అన్నా! ఆజ్ఞయిమ్ము. దిక్పాలురేకమైవచ్చినను ముల్లోకంబులడ్డగించినను నానిశ్చయము మాఱదు. ఏపాపాత్ముల దురాలోచనలు నీకుఁ జతుర్దశవార్షిక వివాసశిక్ష విధించెనో యావ్యూహమును [illegible] యాశిక్షకు వారినే పాత్రులగా నొనర్తును. ఏదురాశాపిశాచము మహోన్మత్తగా నుద్భవించి నీమంగళంబునకు విఘాతమొనర్చెనో యాపిశాచంబు నున్మూలించివత్తు. ఇక్ష్వాకురాజ్యంబు వర్షసహస్రపర్యంతము భవద్భుక్తమై నీస్వాయత్తమగుఁ గాక. అన్యథాకరణమొంత మాత్రముఁ బొసఁగదు. రాజ్యవిభ్రమంబును శంకించితువా? నేనుండఁగా నీకట్టి శంకయే వలదు. నీకట్టి భంగము గలిగినను నేను వీరలోకదూరుఁడనగుదు. చేయి తట్టి బాసచేయుచున్నాను. పట్టాభిషేకమునకు సమ్మతింపుము. నాయీభుజాదండంబులు ధనుర్ధరణాక్షముగాని శోభార్థముగావు. ఎదిరించు విరోధుల శిరోధులు గగనచర

భూతంబులకు విందగుఁగాక. బద్ధగోధాంగుళిత్రాణుఁడనై శరసంధాన మొనర్చి నిల్చిననన్ను డీకొనుమేటిమెవఁడో రానిమ్ము. నాయస్త్రంబులకు నాటవిశుపగుఁగాక. దీనజనాభినందనంబులును ధర్మశరణ్యంబులునైన నాబాహువుల కందూతి భవదభిషేకమంగల విఘ్నకారుల ముండనంబులను చెండాడుటవలనఁ దెమలుఁగాక. అన్నా! నీకింకరుఁడు నీయాజ్ఞకువేచి యున్నాఁడ'ని రౌద్రముప్పొంగఁ బలికెను.

## రాముఁడు లక్ష్మణుని శాంతిప జేయుట.

రాముఁ డారోషభీషణవచనంబులు విని, 'సౌమిత్రీ! పరమ సౌమ్యునకు నీకిది తగదు. ధర్మతత్వము సూక్ష్మాతిసూక్ష్మము. అత్యంతపరిశుద్ధాంతఃకరణమునకు మాత్రమే యదిస్ఫురించును. రజస్తమోగుణంబులు దానిపొడ గూడఁ గాననేరవు. అతిదీర్ఘతపఃఫలంబుగా సత్త్వశుద్ధిని గాంచిన మహర్షులు మహాస్వచ్ఛంబులైన తమయంతఃకరణంబులకు నవ్యగ్రస్థితియందు స్ఫురించిన యర్థంబులను లోకసంగ్రహార్థము శాస్త్రీకరించిరి. ఆయర్థంబులు లోకవాసనావిష్టులకు గోచరింపవు. లౌకికదృష్టితో వానినివిమర్శించి యిచ్చవచ్చినట్లు వర్తింపరాదు. ధర్మజ్ఞులయాదేశమును జవఁదాటఁజాలను. ఇంతకన్న సత్పథము నాకుఁగలుగదు. వత్సా! నీవును దాత్కాలికములు నవిమర్శపూర్వకములునైన నీకోపదుఃఖంబులను మాని పెద్దలమాట యవధరింపుము. అహంకారమమకారము లిన్నిభ్రాంతులను గలిగించుచుండును. ఆ శత్రువులను జయింతువేని యజాతశత్రువుగా నుందువు' అని హితముపదేశించెను.

## కౌసల్యాదేవి పుత్రుని దీవించి పంపుట.

కౌసల్యాదేవి తనపుత్రుని మనోనిశ్చయమువిని దుఃఖాక్రాంతయై 'కటా! ఏమిసేయుదు? పుట్టువుదొట్టి దుఃఖమెఱుఁగడు; ఎన్నడును ధర్మమెడయఁడు, అట్టినాకూనకు నేడిట్టివిపరీతావస్థ సంప్రాప్తమయ్యెను. ఎవని ముదిపెంబుల నేనుఘ్రాణపుచ్చుచుందునో యట్టినాముద్దు సుతుని బాసి యుండుటయ్యెను. ఇష్టమృష్టాన్నములు భుజించు నాపట్టి రాలినధాన్యకణంబు లేరి బ్రతుకుటయ్యెను. అహో! దైవము దురాధర్షమనుట నేడు గ్రహించితిని' అని పెద్దయుందడవు లోలోనఁ జింతించి

'కుమారా ! దుఃఖవిలాపంబులను సమిధలు పేర్చి, వియోగాగ్నిఁ జొనిపి, కన్నీరుఘృతము వోసి, చింతాధూపము రేపి, నీయదర్శనంబనెడి మారుతుఁడు, హిమాత్యయంబున లతాగృహంబును జిత్రభానుఁడు వోలె నన్ను సప్రాణంబుగా దహించుచున్నాఁడు. వత్సా ! నిన్నువిడిచి మనఁజాల; నీవెంట వత్తు ; ఇడేని సమ్మతింపు'మని యురియాడుచి_త్తంబుతో వాపోవసాగెను.

రా :—తల్లీ ! నీవు నావెంట వత్తునంటివి. నాయనగతి యేమి ? మన మిద్దఱము చన్నచో నాతండ్రి జీవింపఁడు. వానికి దిక్కులేని చావు గలుగును. కావున నీవువానిని వదలి రాఁజనదు. మఱియు నెట్టియాపదలువచ్చినను సతి తనపతినిబాయరాదు. ఇదియే స్త్రీలకు నుత్తమోత్తమ ధర్మము. పతినివదలి నావెంటవత్తువేని ధర్మదూషితవై లోకనింద నొడికట్టుదువు. ఈపని కలనైనఁదలపవలదు, అమ్మా ! పతిసేవయే నీకుఁబరమ ధర్మము ; ఒందు స్మరింపకుము.

కౌ :—నాయనా ! దుఃఖము నన్ను దరిగొనుచున్నది. అయినను నీకు బదులాడఁజాలను.

రా :—తల్లీ ! రాజాజ్ఞను మనము తలతో వహింపవలయు. దుఃఖింపవలదు. ఈ పదునాల్గేఁడువత్సరములు ఱెప్పపాటులోఁ గడపి మఱల వచ్చి నీయిష్టప్రకారము వర్తింతును.

కౌ :—నాయనా ! పదునాలుగేండ్లు సవతిదండనుండఁ జాలను. ఇన్నాళ్ళు నిన్నుజూచుకొని యెట్లో గడపితిని. దుర్భరమైన యీవ్యసనకుండమున నన్నుఁ ద్రోచుటకన్న నీ వెంటఁగొని పోరాదా ? నావలన నీకెట్టి శ్రమయుఁ గలుగదు. జీవితశేషమును నీతోడఁ బుచ్చెదను.

రా :—తల్లీ! నీవెఱుఁగని ధర్మము గలుగదు. నీవు నావెంటనుంట నాకెంతో సుఖమగుగాని శ్రమము గాదు. ఆత్మసౌఖ్యార్థమై ధర్మవ్యతిక్రమ మొనర్పరాదుగదా. స్త్రీకి భర్తయే పరమాశ్రయము. పతిని వదలివచ్చుట స్త్రీలకు ధర్మవిరుద్ధము. అట్టిదానిని నేనెట్లు ప్రేరేపింపనోపుదు ? మఱియు నీపతి సుఖముగానున్నాఁడు.

వానికి నీయెడ నత్యంత ప్రేమాదరములుగలవు. కావున వాని వలన నీకాట్టియెగ్గుగలుగదు. భరతుని శంకింతువా! వాఁడు ధర్మాత్ముఁడు. సర్వభూతప్రియుఁడు. మాతృభక్తితో నిన్నతఁడు రక్షించును. సవతికి వెఱతువా? ఆమె నిన్నేమియుఁ జేయఁ జాలదు. ఆమె తనకొడుకుచెవిఁ గఱచునందువా? చెప్పుడు మాటలకు భరతుఁడు చెవియొగ్గఁడు. అమ్మా! ఎందును నీకుభయము గలుగదు గావున నీతలంపుమాని పుత్త్రవియోగదుర్విపాకంబునకుఁ బొక్కుచున్న నాతండ్రి నుపచరించుచుండుము. తల్లీ! వానినెట్లు కాపాడుదువో? ఏమఱితివేని నాయన శోకంబునఁ జివికి మడియుట సిద్ధము. వ్రతోపవాసంబులు పెక్కు సలుపును గాక; ఉత్తము రాలను గీర్తిని గడించుగాక; పతిననుసరింపదేని యాస్త్రీ పాపిష్ఠురాలగును. దేవద్విజాది పూజలొనర్పకున్న నుండుఁగాక; భర్తృశుశ్రూషాపరతంత్రయగు నేని యాస్త్రీకి స్వర్గము స్వతస్సిద్ధము. ఇది సత్యము. ఇంతకన్న శిష్టాచారము స్త్రీలకుఁ గలుగదు. సత్యమును బహిష్కరింపక శ్రుతిస్మృతులను దూఱక, శిష్టాచారమును నిగ్రహింపక, నామాట మీఱక నీవిందేయుండి నాశుభార్థము దైవపూజాహోమాదులొనర్చుచు బ్రాహ్మణోత్తములను వివిధ దానములచేత నారాధించుచు నియతాహారవ్రతవై పతిసేవఁ దవిలి యుండుము. నేను వచ్చునందాఁక నాతండ్రి సుఖముండు నేని నీకు సమస్త శుభంబులుఁ జేకూఱును. ఒండు తలంపవలదు.

రాముఁడట్లు పలుకఁగాఁ గౌసల్యాదేవి వానినిర్ణయమును గ్రహించి 'పుత్త్రా! ఎంత బ్రతిమాలినను నీదీక్షనుమానవు. నిన్ను మరలింప బ్రహ్మకుఁ గూడఁదరముగాదు. ఇంతకుఁ గాలమే కారణము. అది దురత్యయము. నాయనా! పితృవచనమును బాలించి తండ్రిఋణముఁ దీర్చికొనిరమ్ము. ఎందును నీకు భద్రములేయగుఁ గాక. (అనియాచమించివచ్చి) వత్సా! పదునాలుగేండ్లు చన్నంతనే మఱలిరమ్ము. సత్పథమునెంతమాత్రము వదలకుము. నాయనా! ఇట్లు వనవాసముచనుచున్న నీకేమి యిచ్చిపంప నగునో యూహింపరాకున్నది. దారిబత్తెములన్నచో నీవనవాసము పదు

నాలుగేండ్లుగావున నంతకాలము చెడకుండు పదార్థము గలుగదు. ధనమిత్తునాయనిన సర్వధనమును వర్జించితివి నీవు దాని నొల్లవు. కావున నాయియ్యదగినదేదియుఁ గలుగదు. దేనికి సేగిగలుగదో, ఏది సమస్తస్థితికిమూలమైయుండునో, దేని సంరక్షణార్థము నీవు వనవాసవ్రతమును స్వీకరించితివో, ఏది గలిగియున్న సర్వముఁ గలిగియున్నట్లేయగునో, యాధర్మము నీయందు నిరంతరము సమృద్ధమై యుండుగాక. ఏధర్మంబును నీవు పరమనియమసంతోషంబులతోఁ బాలింతువో యాధర్మమే నిన్నురక్షించుఁగాక. ఏయేదేవతలకు నీవు నిత్యముఁ జతుష్పథ దేవాలయములందు నమస్కరింతువో యాయాదేవతలు నిన్నుమహర్షి సహచరుని వనాంతరములందు సర్వవిధములఁ గాపాడుఁగాక. విశ్వామిత్రమహర్షి యనుగ్రహించిన యాదివ్యాస్త్రంబులు సర్వకాలసర్వావస్థలయందు సద్గుణసంపన్నుని నిన్నుఁ బ్రోచుఁగాక. కుమారా! నీమాతాపితృసేవలును నీసత్యవ్రతమును, నిన్నుఁగాచుఁగాక. వత్సా! సమిత్కుశపవిత్రంబులును వేదికలును దేవాయతనంబులును స్థండిలంబులునుఁ బర్వతంబులును లతాతరుగుల్మంబులును నదీనదహ్రదంబులును గ్రిమికీటసరీసృపంబులును బతగపన్నగంబులును సిద్ధసాధ్యవిద్యాధరులును విశ్వదేవతలును మరుత్తులును మహర్షులును నీకు మంగళంబులు గూర్చుఁగాక. ధాతయు విధాతయుఁ బూషయు భగుఁడు నర్యముఁడును నీకు శుభంబులఁ బ్రతిపాదింతురుగాక. ముహూర్తంబులును దివారాత్రంబులును బక్షమాసంబులును ఋతుసంవత్సరంబులును నీకు జయంబు లనుగ్రహించుఁగాక. స్మృతియు ధృతియు నెల్లప్పుడును నీకుఁ బలుకుత్తోడైయుండుఁగాక. స్కందుఁడును సోముఁడును బృహస్పతియు సప్తర్షులును నారదుఁడును నెల్లవేళల నీకు భద్రకరులగుదురుగాక. దిగ్గీశ్వరులు నాస్తుతులకుఁ బ్రసన్నులై నిన్నుఁ గాననాంతరంబుల నోముదురుగాక. కులగిరులును సముద్రంబులును రవి చంద్రగ్రహ నక్షత్రంబులును సంధ్యలును నిన్నుఁ బాలించుఁగాక. గగనలక్ష్మి తోడునీడయై నిన్ను కాచియుండుఁగాక. రత్నగర్భయగు ధాత్రి నాపుత్త్రరత్నంబును నిన్నుఁ గడుపునదాచి కాపాడుఁగాక. కళాకాష్ఠలు నీకు సుఖమిచ్చుఁగాక. రక్షఃపిశాచ క్రూరమృగంబులవలనను వృశ్చికదంశ మశక ప్లవగంబుల వలనను ఋక్ష మహిష గజ సింహ వ్యాఘ్రంబుల వలనను నీకుబాధ గలుగకుండుఁ గాక. నీ నడచుమార్గంబులెల్ల

నీకు శివంకరములగుఁగాక. నీపరాక్రమంబునకు నెదురులేకుండుఁగాక. ఎందును నీకు మంగళమే యగుఁగాక. శత్రువులు సయితము నీకు శుభదాయులే యగుదురుగాక. నాయనా! ఉపసర్పణకాలంబున వాయ్వగ్నిధూమంబులును మహర్షిదత్తమంత్రంబులును నిన్నుఁ గాపాడుఁగాక. శ్రీమన్నారాయణుఁడు నీకు సదా సాక్షాత్కరించుచుండుఁగాక.'

అని పెద్దయుందడవు సుతుని దీవించి, వివిధ స్తోత్రపూర్వకంబుగా దేవతలను గంధమాల్యాదులతో నర్చించి కుమారమంగళార్థము యథాశాస్త్రము హోమము చేయించి హవిశ్శేషంబున బాహ్యాబలిఁగావించి దధిమధుఘృతాక్షతలతో స్వస్తివాచ్యమును జెప్పించి, పట్టి!

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే।
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్॥
యన్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా।
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్॥
అమృతోత్పాదనే దైత్యా న్ఘ్నతో వజ్రధరస్య యత్।
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్॥
త్రీ న్విక్రమా న్ప్రక్రమతో విష్ణో రమితతేజసః।
యదాసీ న్మంగళం, రామ! తత్తే భవతు మంగళమ్॥
ఋతవ స్సాగరా ద్వీపాః వేదా లోకా దిశశ్చ తే।
మంగళాని మహాబాహో! దిశంతు శుభమంగళాః॥

అని యాశీర్వదించి వానియౌదల నక్షతలుంచి సుగంధమును దనువెల్లనలఁది సిద్ధార్థయైన యోషధిని విశల్యకరణియను దానిని రక్షగా వానిచేతికిఁ గట్టి యభిమంత్రించి, దుఃఖవివశభావయయ్యు సంతోషంబును వాఙ్మాత్రంబునఁజూపుచుఁ, బైకొనుచున్న తొట్రుపాటును సమదాయించుకొని యతని శిరమును మూర్కొని వానిని గవుఁగిటఁ గూర్చి 'వత్సా! సర్వార్థసిద్ధిని బడసి సుఖంబుగా నయోధ్యకు నీవు మఱలివచ్చి రాజ్యాధిపత్యమును వహింపఁగాఁ జూతుఁగాక. నాకును నా కోడలైన సీతకును గోర్కులు దీర్తువుగాక. ఎల్లభూతంబులును నిఖిల దేవతలును నీకుఁ బరమశుభంబులు గూర్చుఁగాక. పోయిరమ్ము' అని పలికి, రక్షార్థము వానికిఁ

ప్రదక్షిణ మొనర్చెను. రాముఁడు తల్లిపాదంబుల వ్రాలి యామెకుఁ బలుమాఱు మ్రొక్కి తదనుజ్ఞాతుఁడై యందుండి తరలి సీతామందిరంబునకుఁ జనెను.

### సీతాపతిభక్తిపరీక్ష.

అట సీతాదేవి దేవతాపూజలొనర్చి, రాజధర్మజ్ఞ గావునఁ బతికిఁ బట్టాభిషేకానంతరము వలయు సామగ్రి నెల్లఁ జేకూర్చి వానిరాక నిరీక్షించుచుండెను. రాముఁడట్లు తల్లిని వీడ్కొని సమలంకృతమును హృష్టజన సంకీర్ణము నైన తనయర్ధాంగి మందిరంబును లజ్జచేతంబోలెఁ దలవంచుకొని ప్రవేశించెను. వైదేహి తనపతిరాక విని యెదురేగెను. సీతను గాంచినంతనే రామునకు నిలువెల్లఁ జెమర్చెను; వాని మోము వెలవెలఁబాఱెను. అతని నయనగోళంబులు బాష్పపూరితము లాయెను. హృదయేశ్వరుని విలక్షణంబులకు జానకి వెఱఁగంది విహ్వలయై 'నాథా! బృహస్పతిదేవతాకంబైన పుష్యనక్షత్రము సమీపించెనని ప్రాజ్ఞులు వచించిరి. పట్టాభిషేక కాలము ప్రత్యాసన్నముగదా. ఇట్టిమంగళసమయంబున మీముఖమండలము వైవర్ణ్యమొంది యంతస్తాపంబును దెలుపకయే తెలుపుచున్నది. కారణమేమి? శతశలాకంబును డిండీరతేజంబునైన ఛత్రంబు మీవదనమండలంబు నాచ్ఛాదింపదు; చంద్రహంసప్రకాశ పరిహాసమానచారుచామరంబులు మీ యిరుపార్శ్వంబుల వీవవు; వేదపారగులగు బ్రాహ్మణులు మీమూర్ధంబునఁ దీర్థోదకంబు లభిషేకింపరు; ప్రకృతివర్గము సాలంకృతముగా మిమ్మను గమింపదు; పుష్యరథంబును నీలాద్రింబోని భద్రగజంబును మీముందు నడువవు; ప్రియదర్శనా! రత్నకాంచనరచితమైన భద్రాసనము మీర పురస్కృతముగా నూరేగదు. అభిషేకమహోత్సవ మెంతగాఢమో యంతగాఢమైన వైవర్ణ్యము మీమోమునఁ దోఁచుచున్నది. మీయునికిని జూడఁగా నాప్రాణంబు లెగయుచున్నవి. నాథా! ఈవిపరీతంబునకుఁ గారణమేమి?' అని వినయమధురంబుగాఁ బలికెను.

రా:— ప్రేయసీ! బెగడువలదు. పరమపూజ్యమగువంశంబున జనించితివి; మహాధార్మికుఁడైన జనకమహారాజునింటఁ బెరిగితివి. నీకుఁ దెలియని ధర్మముండదు. ధర్మవ్యతిక్రమము నిరయమూలమగుట

నీకుఁ గొ_త్తగాదు. ధర్మపరిపాలనార్థము ప్రాణములనైనను ద్యజిం తురనఁగా భోగభాగ్యములసంగతి చెప్పవలయునా! మఱియు ధర్మాచరణంబునఁ బతికి సతి తోడగుట విధివిహితము. ఆకా రణముననే సతిని సహధర్మచారిణి యందురు. కావున నిప్పుడు నీవిధిని నీవు జంకుకళంకులు మాని నిర్వహింపుము. సంగతి వినుము. నాతల్లి కైకేయీదేవి తొల్లి నాతండ్రివలన రెండు వరములు పడసెను. ఆమె యావరముల నిప్పుడు రాజును గోరుచున్నది. రాజు సత్యమును దప్పరాదు; ఇచ్చినవరములఁ జెల్లించి తీఱవలయును. తండ్రివాక్యమును బరిపాలించుట పుత్రునకు నుత్తమోత్తమ ధర్మమగుట నీకు విదితము. నాతండ్రి మాటఁ జెల్లింప నిశ్చయించుకొంటిని. నాతల్లికోరినవరములన్నియో మిక్కిలి యల్పములు. భరతునకుఁ బట్టముఁగట్టుమనియు నాకుఁ బదునాలుగేండ్లు వనవాసమును విధింపుమనియు నామె కోరెను. భరతుఁడు యువరాజుగా నియుక్తుఁడయ్యెను. నేను వనమునకు బోవుచు నిన్ను వీడ్కొనవచ్చితిని. కళ్యాణీ! నాపరోక్షమున నీవనుష్ఠింపనగు వర్తనక్రమమును వినుము. శ్రీమంతులు పరగుణ శ్లాఘనలు సహింపరు. కావున భరతుని మ్రోల నన్నెన్నడును బ్రశంసింపవలదు. నిన్నుఁ బోషింపవలసినబాధ్యత వానికి లేదు. ఆ మాత్రంబున వానికడ నీవుండనగును. జానకీ! భరతుని దశరథుని ననుసరించి వారిమదికెక్క వర్తింపుము. అట్లు చేయుదు వేని వారు నీయెడఁ బ్రసన్నులై యుందురు. కాంతామణీ! ముని సేవితమగు వనంబునకుఁ బోవుచున్నాను. వ్రతోపవాసంబులు మఱువవలదు; ఉషఃకాలదేవతారాధనంబులు మానకుము; దైవ పూజానంతరము నాతలిదండ్రులకు నమస్కరించుట తప్పవలదు. వారికి ముదిమికిఁ దోడుగాఁ బుత్త్రవియోగసంతాపము దాపరించెను. వారెంతయు సగలింతురు. వారి నెట్లు సన్మానింతువో గదా. తల్లులు ముగ్గురు నాకు స్నేహప్రణయరక్షణంబుల సమానులుగాని వేఱు గాదు. సుమిత్రయెడఁ గాని కైకేయియెడఁగాని యవినయంబునకు లేశమాత్రముగూడ నెడమీయవలదు. భరతశత్రుఘ్నులు నాకుఁ

ప్రాణాధికులు; వారిని భ్రాతృమర్యాదతోఁ బుత్త్రవాత్సల్యంబుతోఁ జూచుకొనుము. రాజులు రాష్ట్రంబునకేగాక కులంబునకుఁ గూడఁ బ్రభువులు. వారు కులశీలమర్యాదలు మీఱక యుపసేవించువారియెడఁ బ్రీతులగుదురు. తదితరుల నాగ్రహింతురు. ఎగ్గుగావించెనేని మిత్త్రునైనను ద్యజింతురు. హితమొనర్చినచో వైరినైనను మన్నింతురు. ఇవి యెఱిఁగి సత్యవ్రతవై యుండుము. జీవితేశ్వరీ! నా పోవునది క్రూరమృగాభీలమైన కీకారణ్యము; అటకు స్త్రీలు రాఁదగరు.

సీత.—నాథా! రాజపుత్త్రునినోట నిట్టిపేదమాటలు రాఁజెల్లునా? ఇవి విన్న నగరా? ఆర్యపుత్త్రా! ధర్మముమీకుఁ బరమానుష్ఠేయమంటిరిది. అది కాదను వారెవరు? మీదుమిక్కిలి ధర్మము సర్వప్రాణులకుఁ బరమానుష్ఠేయము. ఇందు జాత్యాది భేదముగాని స్త్రీపురుష తారతమ్యముగాని గలుగదు. కావున మీకువలె నాకుఁగూడ ధర్మానుష్ఠానము విధివిధానమై యున్నది. ప్రకృతము నేననుష్ఠింపనైన ధర్మమేమందురా? నాపతిని వెంబడించుటయే యిప్పుడు నాకుఁ బరమధర్మము. మిమ్ములను మాత్రమే వనవాసంబునకు నాజ్ఞాపించిరందురా? భర్తనాజ్ఞాపించుట భార్యనుగూడ నాజ్ఞాపించినట్లేయగును. భార్యయర్ధాంగి గదా. శరీరమందు సమభాగమును వదలి మీరుచన సాధ్యము గాదుగదా. తల్లిదండ్రులును గొడుకు కోడండ్రును నన్నదమ్ములును బరస్పరసంబంధ బాంధవ్యములు గలిగి యున్నను పుణ్యపాపఫలంబులగు శుభాశుభంబుల ననుభవించు విషయమున వారికిని భార్యాభర్తలకును మిక్కిలి తారతమ్యముగలదు. ఒండొరుల శుభాశుభంబులను వారు పంచికొనరు. భార్యాభర్తలన్ననో పరస్పరశుభాశుభఫలములను విభజించికొని యనుభవింతురు. ఈ సంగతి మీకుఁ దెలియదా? ఈకారణమును బట్టి గూడ మీవెంట నేనురాకతప్పదు. మఱియు స్త్రీలు స్వతంత్రలుగారు. నునుదీఁవె మ్రాకునుబోలె సతి పతినిఁ బ్రాకి జీవించును. ప్రాపుతొలఁగినచో బ్రదుకు దుర్లభమగును. ఈనిమిత్తమునఁగూడ మీరునన్ను విడనాడఁ గాదు. హృదయేశ్వరా! దుర్గమంబగు కీకారణ్యంబునకు మీరు

చనున్నారు. అట్టిచోట తోడుండుట యత్యంతావసరము. సతికి మించినతోడు పతికిఁగలదా ? నాథా ! కుశకంటకావృతమై దారి నడువరాకుండును ; మార్గమును జక్కఁజేయుచు మీముందు నడతును. నావలన మీకు లేశమాత్రముగూడ భారము గలుగనేరదు. ఫలమూలంబులతోడ జీవింతును ; ఒండేమియుఁ గోరను. వీరాగ్రణీ ! ఈర్ష్యారోషంబులను బీతావశిష్టజలంబులఁ బగిదిఁ ద్యజించి నన్ను విశ్వసించి వెంటఁగొనిపొమ్ము. ప్రాసాదాగ్రవిహారంబులొండె విమానసంచారంబులొండెఁ దదన్యంబులొండెఁ బతిశుశ్రూషకన్న సతికి సుఖకరములు గావు. కళ్యాణసమయంబున నగ్నిసాక్షికంబుగాఁ బ్రాణమానశరీరంబులను మూఁటి మీయందు లీనమొనర్చిన నాకు నేఁడు పృథగ్భావమెట్లుగలుగనోపు ? సర్వకాలసర్వావస్థలయందు సతికిఁ బతియే గతియని నాతలిదండ్రులు నాకు బాల్యమందే యుపదేశించిరి. వారియుపదేశంబును మీఱరాదు. నాథా! అరణ్యము దుష్టసత్త్వాఖిలమంటిరి. అగుఁగాక ; మీరుండఁగా నాకు భయమేల ? సర్వలోకరక్షకుఁడవు నన్ను రక్షింపలేవా ? నాథా ! నామొఱ నాలకింపుము. మీతోడవత్తును ; మిమ్ము విడిచి త్రైలోక్యాధిపత్యమునైన నొల్లను. మీసేవయేనాకుఁ జాలు ; వేఱు తలంపకుము. పుట్టినింటనువలె మీవెంట నెందేనియు సుఖముందును. బ్రహ్మచారిణీవ్రతనియతనై మిమ్ము సేవించుచు మధుగంధిపుష్పఫలంబులైన వనంబులందు మీతోడ విహరింతును. పుణ్యనదీనదంబులను దుర్గమంబులగువనంబులను మహోన్నతములైన శైలంబులను సందర్శింప నెంతో యుత్సహింతును. పూచినతామరలతో రాయంచకొదమలతో సొబగారు సరోవరంబులను మిమ్ముఁ గూడి విలోకింపఁ దమకింతును. దివ్యతీర్థములందుఁ దోయమాడ నాకుఁ బేరాస గలదు. నాయీచిరాభిలాషను దీర్పుము. ఈ నెపంబున మనకుఁ దీర్థయాత్రాలాభంబునకు నవకాశముఁ గలిగించిరి. దానిని వృథసేయకుము. అరణ్యవాసమందురా ! ఏవాసమైనను మీసహవాసమున్నచో నదియే నాకుఁ బదివేలు. నాథా ! అనన్యభావయు ననురక్తయునైన మీసీతను విడనాడ మీరెట్లు తలంచితిరి ! కాదని విడనాడుదురా ? మరణమే నాకు శరణమగును. ఇది సత్యము.

రా.—అబలా ! కార్యాకార్యవిచక్షణము వలదా ? సాహసోత్సాహంబులకు వశము గావచ్చునా ? అరణ్యవాసము క్లేశభూయిష్టము ; సుఖమనుమాట యందుఁ గలుగదు. అట గిరినిర్ఝరధ్వానంబులును గందరాంతర క్రూరమృగాక్రందనంబులును జెవులఁ గీడ్పఱచుచుండును ; ఘోరసత్త్వంబులు విచ్చలవిడి నాహారార్థము తిరుగాడుచుండును ; నదులు మకరసంకీర్ణంబులై నీరాన రాకుండును ; దారులు కంటకలతానిబిడంబులై చొరరావు ; కందమూలఫలంబులు దక్క నొండేమియు దొరకదు ; అవియు సమృద్ధంబులు గావు ; నారచీరలు గట్టి జడలు దాల్చి యుప్పిండియుపవాసములోర్చి రాలినపండుటాకులఁ బరుండవలసివచ్చును. వెనుగాడ్పులు దావాగ్ని దుస్సహములై బోరున వీచుచుండును ; రాత్రులన్ననో యంధకారబంధురంబులై కన్నుపొడిచికొన్నను గానరావు ; ఏప్రొద్దు సరీసృపంబులు ప్రాకులాడుచుండును ; మశకదంశంబులు నిద్రింపనీయవు ; పిశితాశనార్థులై రాక్షసులు తారాడుచుందురు. సఖీ ! ఇన్ని కడగండ్లతో నిండిన వనవాసంబునకు నీవెట్లు తగుదువు ? ఎండకన్నెఱుంగవు ; అంతఃపురము దాటి నేరవు ; వీణాగానంబులకుసయితము విసువుదువు; చెచ్చెలులఁ గూడి యుందువు ; లతామందిరంబులను గూడ నొంటిగాఁ జొల వెఱతువు ; హృష్టమృష్టాన్నంబులఁ గూడఁ గసిగాటుగా నారగింతువు ; సుధారసంబునుగూడ మెచ్చవు ; హంసతూలికాతల్పంబుల గాని పరుండవు ; చీనిచీనాంబరంబులు సయితము నీవు బరువుగాఁ దోఁచును ; మలయమారుతంబునకుఁ గూడ జంకుదువు ; ఇట్టి సుకుమారిని నిన్ను గహనాంతరకఠిన క్లేశపరంపరలకు నప్పగించుట మహాపాతకముగదా. అట్లుచేయ నామదియెట్లోర్చును ? ప్రేయసీ ! నామాట విని యిందేయుండుము.

సీత.—నాథా ! మీసాన్నిధ్యంబున నివి యెల్ల గుణములే యగును. అమానుషంబగు మీరూపంబును జూచి వెఱఁగంది పాఱిపోవక క్రూరసత్త్వంబులు నిలుచునా ? భయమనునది జీవలోకసామాన్యము ; ప్రాణంబు లన్నింటికిఁ దీపుగదా. మీరు చెంతనున్నంత కాలము రాక్షసాదులెవ్వరును నన్నుఁ బ్రధర్షింపఁజాలరు. మఱియొకటిగాఁక

విన్నవింతును. నాకు వనవాసప్రాప్తిగలదు; జ్యోతిష్కులిట్లు వచించిరి; కొండొకతాపసియు నట్లే నుడివెను. కర్మఫలము తప్పదు; భోక్తవ్యంబునకు వెఱచిఫలము లేదు. నాథా! నాయొనర్చిన యలంతిసేవలఫలంబుగా నాకీయభీష్టంబును బ్రసాదింపుము. జీవితేశ్వరా! మీవెంట వచ్చుటకు మఱియొక కారణముగూడఁ గలదు. ఇన్నాళ్ళు మీకు నాయొనర్చిననేవలు సేవలుగావు. ఏలయందురా? నగరములందుఁ గోరినవస్తువులు సమృద్ధముగానుండును; వానిని దెచ్చి యందిచ్చుటకుఁ బరిజనము వేలకొలఁదిగలదు. అట్టిచోట్లఁ బతిసేవలు సతులకొక నేర్పుగాదు. నిర్జనవనప్రదేశంబున ననన్యసాహాయ్యనై యుండి మీమదికెక్కు వర్తింతునేని నాజీవము సార్థమగును. అట్టిభాగ్యము నేఁడు నాకు సంప్రాప్తము గానున్నది. ఈమహోదయంబును ద్రోచిపుచ్చకుము. మీతోడి యునికియు మీపాదసేవయు లోకాంతరమునఁ గూడఁ గలుగఁ గోరుదును. ఈయలంతి వరంబు ననుగ్రహింపుము. మఱియు దాంపత్యము శాశ్వతము; మరణముగూడ దానిని భిన్నముఁ గలిగింపఁజాలదు; ఇది శ్రుతివచనము. నైసర్గికమైన యవినాభావంబునకు మీరు వినాభావమును గలిగింపఁజాలరు. అట్టిసంకల్పముగూడవలదు. నాథా! దీనయుఁ బతివ్రతయు భక్తినిరతయునైన నీయర్ధాంగిని వెంటఁగొనిపోవ సంశయమేల? నామొఱాలకింపకేని విషమో వీతిహోత్రుఁడో నాకు శరణమగును.

—జానకీ! నీమేలుగోరి యింతచెప్పితిని; హితవును నిరసింపరాదు సుమా.

—నాథా! మీవచనంబులకు లజ్జాదుఃఖంబు లయ్యెడు. పురుషరూపమును దాల్చిన స్త్రీవగుట నాజనకుఁ డెఱుంగఁడు గాఁబోలు. ఎఱిఁగి యెఱింగి నన్ను మీకిచ్చెనా? నన్ను వెంటఁగొనిపోవ మీ యరగలియేమి? మీభయంబునకుఁ గారణమేమి? అనన్యశరణ్యను నన్ను విడువనేల? సావిత్రి యలసత్యవంతుని వలె నేను మిమ్మను గమింతును. చెడిపనై కులంబును జెఱుపఁబుట్టలేదు. భవదన్యునిఁ

గడగంటనేనిఁ జూచియెఱుఁగని దానినిఁ జిరవాసినిని గౌమారిని నన్నుఁ జేతులార నొరులపంచఁ ద్రోసి చన మీకుఁ బాడియగునా? కౌసల్యాదిగురుజనుల సేవార్థము నన్నిందుండు మనిరి. మీకును వారు సేవ్యులే గదా. మీరుమాత్రము వారి నెట్లు వదలి చన నేర్తురు? అట్లుచేయుట ధర్మాతిక్రమము గాదా? నాథా! వేయేల? ఏ వాసమైనను మీసహవాసము నాకు విధ్యుక్తము. గహనాంతరము లని వెఱవవలదు; మార్గశ్రమమగునని చింతింపవలదు. మీవెంట వచ్చు నాకు సమస్తము సుఖావహమే యగును. కుశాదికంటకంబులు తూలికామార్దవములగును; పెంధూళిరజము చందనచర్చయగును. లేఁబచ్చికలు పట్టుతల్పంబులగును; చేతులార మీయిచ్చు ఫలముగానీ, మూలముగానీ తుదకుఁ బత్రముగానీ నాకు నమృతప్రాయమగును. ఆయా ఋతువులందుండు ఫలముల భుజించుచుఁ బుష్పములు ధరించుచు మీచెంత సుఖముందును. నాభరణరక్షణంబులకై యీవన్మాత్రము గూడ మీకుఁ గాసిగలుగదు. యుష్మత్సహవాసమే నాకు స్వర్గము; మీవియోగమే నాకు నరకము. మిమ్ముఁ బాసి దుఃఖాగ్నిఁ గ్రాగి చివికి చచ్చుటకన్న మీపాదంబుల ప్రోల నిప్పుడేయిందే యంతరింతును. నాథా! ఎవతె మీతోడిదే లోకంబుగా నుండునో, మీయెడఁబాపు క్షణమయ్యు నెవతెకు యుగాయతంబగునో, ప్రకృతి పురుషునింబలె నెవతె మిమ్ము సర్వకాలసర్వావస్థల విడనాడదో, విడనాడి జీవింపదో యట్టియబలకు ననన్యశరణ్యకు నర్ధాంగికిఁ జతుర్దశవర్షవియోగ క్రూరశిక్షను విధింపకుము. త్రికుద్ధికిఁ బ్రార్థింతును; నావిన్నపము గైకొని మీవెంటరా నాకు ననుజ్ఞ యిమ్ము.

అందాఁక సీతాహృదయాంతఃస్థమై యరణియందు నగ్నివలెనున్న తదీయదుఃఖ మంతట వెలికిఁ బ్రాకెను. బాష్పధారలవలనఁ గాటుక చిద్దాడిన యామె నయనంబులు స్ఫటికంబులబోని బిందువులను వర్షింపసాగెను. ఆమె మోము కన్నీటఁ దోఁగిదోఁగి నీటఁబాసినకమలంబును దోఁపించెను. వ్యసనము మహోద్వేగమగుటం జేసి యామె పట్టూడి రాముని పయిఁ వ్రాలి వానిని గవుంగలించుకొని బిగ్గయేడ్చి మూర్ఛనొందెను.

రాముఁడు ప్రియురాలినిబోదివిపట్టి తనచేలాంచనంబున నామె కన్నీరు తుడిచి సేదఁదేర్చి 'దేవీ! దుఃఖింపవలదు; నీవొల్లవేని నాకంబును గూడ దిగనాడుదు. నీకట్టి యప్రియంబును జేయనోపను. భయంబున నట్లాడితినని తలంపకుము. నాకును భయమా! నీతలఁపుఁదెలియ నట్లు వర్తించితిని. నీ నిర్ణయమును దెలిపితివి. మానవంతుఁడు కీర్తినట్లు నేను నిన్ను విడువను; ఈమాట నిక్కము. సాధ్వీమణియైన సువర్చల సూర్యు నట్లు నీవు నన్ననుగమించుట పరమధర్మము. జనకనందినీ! తండ్రియాజ్ఞ నన్ను వనమునకుఁ దోలుచున్నది. జనకునిపంపు సేయుటకన్న మిన్నయగు ధర్మము సుతునకుఁ గలుగదు. క్లేశవశముననేని మఱియేకారణముననేని ధర్మపరిత్యాగము సజ్జనలక్షణముగాదు. తల్లిదండ్రులును గురువులును మర్త్యులకుఁ బ్రత్యక్షదేవతులు. దైవమన్ననో యదృశ్యము. అదృశ్యము నారాధించుట క్లేశతరము. దృశ్యదేవతలైన మాతాపిత్రాదుల యారాధనము సుకరమును సులభఫలప్రదమునై యుండును. ఆకారణంబున నా తండ్రిని దదీయవాక్యపరిపాలనరూపంబున నారాధించుచున్నాను. పితృసేవవలనఁ గలుగు పరలోకప్రాప్తి సత్యదానాదులవలనఁ గలుగుగదాయని శంకింపవచ్చును. అవియుఁ బరలోకప్రాప్తికరములే. అయిన నట్టివెల్ల నిర్వ్యాజపితృసేవ యందంతర్భూతములు. ఆముష్మికంబునకుఁ బితృసేవకన్న సులభమార్గము గలుగదు. పితృపరాయణులకు బ్రహ్మలోకము నయితము కరస్థమై యుండును; తక్కినలోకంబుల సంగతిచెప్పనేల! కళ్యాణీ! ధర్మార్థము స్వార్థము లోకార్థము దండకారణ్యప్రస్థానంబును గ్రహించితిని. ఏకాకిగాఁ జననుద్దేశించితిని. నన్నుఁదవిలి రానిశ్చయించుకొంటివి. ఇఁకఁ దప్పదు. సుకుమారీ! వనవాసంబునకుఁగా సృజింపఁబడితివా! సహధర్మచరీ! రమ్ము నావెంట; నీవలన నుభయవంశంబులు శోభిల్లెను. ప్రాణేశ్వరీ; ఇదిసుత నీరాముఁడు నిన్నెడసి స్వర్గమేనియు నిచ్ఛగింపఁడు. రత్నదానంబులచేత బ్రాహ్మణులను మృష్టాన్నంబుల భిక్షుకులను దనపి కోరినవారికిఁ గోరినదియిచ్చి విశిష్టంబులైన వస్త్రాభరణాదులెల్ల నీవినావియనక సమస్తము భృత్యులకునొసంగి ప్రయాణమగు' మని పలికి యామెను శోకంబువలన వారించెను. సీతాదేవి తనహృదయసంతాపము పతివచనామృతంబునఁ జల్లారగా మహానందమొంది ప్రయాణోన్ముఖిగా సాగెను.

లక్ష్మణుని పట్టుదల.

రాముఁడట్లు సీతాదేవిని వీడ్కొని యందుండి వచ్చెను. లక్ష్మణుఁ డందాఁక యాగది వెలుపటనుండి వారిసంవాదము నెల్ల వినుచుండెను. రాముఁడు గది వెడలి వచ్చినంతనే లక్ష్మణుఁడు వానిచరణములపయి వ్రాలి 'అన్నా! నానామృగాకీర్ణమగు వనంబునకుఁ జన నిశ్చయించితివి. ధనుర్ధరుఁడనై మీవెంట నంటియుండు. నా వచ్చుట మీసంచారంబులకు నెంతయు సౌకర్యముఁ గూర్చును. అన్నా! నిన్ను వదలియుండనోపను. నామనవి నిరాకరింపవలదని దృఢభక్తిపూర్వకముగా విన్నవించెను. సౌమిత్రివిజ్ఞాపనమును రాముఁడు విని 'లక్ష్మణా! నీ వెంతయు సాధుహృదయుండవు; నీధర్మనిరతినాకుఁ గ్రొత్తగాదు; వీరాగ్రణివి; నాకుఁ బ్రాణప్రియుండవును వశ్యుఁడవు నగుటయేగాక తమ్ముఁడవై యున్నావు. అట్టి నీవు నావెంట నుండుట నాకెంతో మేలుగదా. కౌసల్యాసుమిత్రలను గూర్చి తలంచితివా? నీవును నావెంట వత్తువేని వారికి దిక్కెవ్వరు? ధాత్రికిఁ బర్జన్యుండువోలె వారికి నీప్సితంబుల వర్షించుటకు రాజు గలఁడందువా? ఆఁడు కామపాశవివశుండని నీవే చెప్పితివి. మన తల్లులు దుఃఖదుర్విదగ్ధలైయున్నారు. అశ్వపతిసుతవలన సవతిమర్యాదలను మాత్రమే వారు ప్రతీక్షింపనగును. భరతుండన్ననో తల్లికి మాఱాడుగదా. నీవిందున్న యెడల మనవారికి నెందును గొఱంతగలుగ నేరదు. ఆకారణంబున నిన్నిందుండఁ గోరుదు. మాట వినుటయే భక్తిసేయుటగును. ధర్మజ్ఞునకు నీకుఁ జెప్పనేల! నావచించినట్లొనర్పుము. భ్రాతృభక్తిఫలంబును గురుజనపూజారూపధర్మాచరణ సిద్ధియు నీకుఁ జేకూఱు' ననెను.

వాఁడును 'అన్నా! నీతేజస్సే సర్వముఁ జేయును జేయించును. మన పరోక్షంబున మనతల్లులకట్టి యవినయంబు గలుగునని శంకింపవలదు. కౌసల్యాదేవిగారికిఁ బరరక్షణమేల? ఆమె వేయిభరతులను గాపాడఁ జాలుఁ గదా. ఆమెయిచ్చిన యగ్రహారములె యీసంగతిని శతముఖంబులఁ జాటుచున్నవి. ఆమెనుగూర్చిన చింతయే మనకువలదు. సేవకునిగా నన్నను గ్రహింపుము; ఇందు ధర్మవిరోధములేదు. నావలనమీకుఁ గొంత ప్రయోజనముండును. నేనును మీవలనఁ జరితార్థుండ నగుదు. నావలని ప్రయోజన మేమందురా? విల్లుపూని మీవెంటనుండును; పుటికయు గుద్ద

లియుఁ జేసికొని మీచనుత్రోవ చక్కఁజేయుచు ముందు నడతును; తపస్వి యోగ్యములైన కందమూలాహారంబులు తెచ్చి యిచ్చుచుందును; జాగ్రత్స్వప్నావస్థలయందెల్లఁ గనురెప్పవలె మిమ్ముఁ గాచియుందును; మీరు నిర్భయముగా గిరిసానువులందుఁ గ్రీడింపనగు' ననెను. ఆమాటలకు రాముఁడెంతయుఁ బ్రీతుఁడై 'వత్సా! అట్లేచేయుము; స్నేహితులను వీడ్కొనిరమ్ము. వరుణదత్తములైన దివ్యచాపకవచంబుల నక్షయతూణీర సాయకంబులను ఖడ్గరాజంబును మనయాచార్యునింట నునిచితిమి; వానిని గొనిరమ్ము' అని పలికెను.

### పెద్దలను బూజించి వీడ్కొనుట.

లక్ష్మణుఁడు తోడ్తోడఁజని మిత్త్రులకు వీడ్కోలు పలికి కులగురువగు వసిష్ఠుని బూజించి దివ్యాయుధములను గొనివచ్చెను. అంత రాముఁడు తమ్మునిఁ జేరఁబిలిచి 'సౌమిత్రీ! నిన్నుమందలనుంచికొని నాసర్వస్వము బ్రాహ్మణులకుఁ దపస్యులకు సమర్పింపఁ దలఁచితిని. వసిష్ఠపుత్త్రుఁడు సుయజ్ఞుని శీఘ్రముగాఁ దోడితెమ్ము; శిష్టబ్రాహ్మణులను రప్పింపుము. వారినెల్లఁ బూజించి వనమునకుఁ దరలుదము' అనెను. లక్ష్మణుఁడు చని యగ్నిహోత్రగృహంబుననున్న సుయజ్ఞునకు నమస్కరించి వానికి సంగతి వినిచెను. సుయజ్ఞుఁ డగ్నికార్యంబులు గావించి సౌమిత్రివెంటఁ బోయెను. అట్లు వచ్చిన మిత్త్రునకు హుతవీతిహోత్రునివలెఁ దేజరిల్లుచున్న సుయజ్ఞునకు రాముఁడు సీతతోడఁ బ్రాంజలియై ప్రదక్షిణమొనర్చి వానికి రత్నరచితసువర్ణాంగదంబులును రమణీయమణికుండలంబులును వజ్రమయ కేయూరకంకణంబులును నానారత్నంబులు నిచ్చెను. సీతాదేవి యంతతోఁ దనియక తనహారాదులను సయితము వానిభార్యకిమ్మని రామునిఁ బ్రేరేపించెను. దాశరథి యట్లు ప్రియాప్రేరితుఁడై 'మిత్త్రమా! రశనాహార హేమసూత్రంబులను, సాస్తరణంబును నానారత్నమయ పర్యంకంబును వనవాసోన్ముఖి యీసీత నీభార్యకు సమర్పించుచున్న'దని వచించి యవి యిచ్చి 'నామేనమామ నాకు శత్రుంజయమను గజరాజంబు నిచ్చెను. దానిని మాతంగసహస్రముతోడఁ గైకొను' మనెను. సుయజ్ఞుఁ డవియెల్లఁ బరిగ్రహించి సీతారామలక్ష్మణుల నాశీర్వదించెను.

ప్ర దా న ము లు.

అంత రాముఁడు లక్ష్మణుని బిలిచి 'అగస్త్యుని విశ్వామిత్రుని దోడ్కొనివచ్చి వారిని రత్నములతోఁబూజించి గోసహస్రంబున సంతుష్టులఁ గావింపుము. కౌసల్యాదేవిని నిరంతరము శ్రద్ధాభక్తులతో దీవించుచుండు తైత్తరీయాచార్యుఁడు వేదవిదుఁడు గలఁడు. వానికిఁ తృప్తిపియగునందాక కౌశేయంబులును వాహనంబులును దాసీజనంబు నొసంగుము. సారథి చిత్రరథుఁడు మనతండ్రికిఁ జిరకాలప్రియుఁడు. ఉత్తమంబులగు మణులును ధన కనకవస్త్రంబులను వేలకొలఁది గోవులను సన్నజీవముల నిచ్చి వానిని దనుపుము. కఠశాఖీయులును గాలాపశాఖీయులును బలాళదండధారులునగు బ్రహ్మచారులును గలరు. వారు నిత్యస్వాధ్యాయముచేత నివసింతురు; ఇంకొకపనికినోపరు; సోమరితనము సుంత వారినంటియుండును; మఱియు స్వాదుభోజనంబులు వారికి మహాప్రియములు. ఎనిమిదిబండ్ల మణులును శాలివాహసహస్రంబును రెండువందల దుక్కిటెద్దులును వ్యంజనార్థము వేయిగోవులునిచ్చి వారిని సన్మానింపుము. నాతల్లి నాశ్రయించిన బ్రహ్మచారులు పెక్కుగలరు. వారి కొక్కొకరికి వేయి ధేనువులిమ్ము. లక్ష్మణా! అవి యిది యని చెప్పనేల? కౌసల్యాదేవికి సంతోషమెందప్రనట్లుగా బ్రాహ్మణులను సమస్తవిధములఁ బూజింపు' మని చెప్పెను.

భృ త్య వ ర్గ స న్మా న ము.

లక్ష్మణుఁడు పోయి యన్నమాట ప్రకారమొనర్చి వచ్చెను. అంతలోఁ బరిచారకులు కన్నీరునించుచు గుమిగూడి వచ్చి రాముసెనుట నిలిచిరి. అతఁడు వారిని బుజ్జగించి తజ్జీవనార్థము బహుధనమిచ్చి 'నావచ్చుదాఁక నాయింటిని లక్ష్మణునియింటిని జాగ్రత్తతోఁ గాపాడుచుండు' మని చెప్పి పంపివైచి, ధనాధ్యక్షుని రావించి ధనమెల్లఁ దెప్పించి బాలవృద్ధదరిద్రులపాలొనర్చి కోశమంతయు వ్యయించెను.

రాముఁడట్లు నిక్షేపితకోశజాలుఁడై యుండఁగాఁ ద్రిజటుఁడను వర్గ్యముదుసతి పేదపాఱుఁడు యౌవనవతియగు భార్యతోడను గసికందువులగు పుత్రులతోడను వచ్చెను. వానిమూపున గుద్దలియు గొడ్డలియు వ్రేలాడుచు నశేఁడు కందమూలంబులేఱితిని జీవించుటను దెలుపుచుండెను. రాముని

దాతృత్వమును, త్రిజటునిభార్య విని తనపతిచేతి గొడ్డలి లాగి పాఱవైచి 'అయ్యా! ఆరామునకు నీకుటుంబమును జూపుము. అపరమధార్మికుఁడు చూపుతోడ నీపేదఱికమును గ్రహించి యేదేని యీయకపోఁడ'ని బలవంతపెట్టెను. అతఁడు పైఁగప్పుగుడ్డగూడలేక చింపిగోచితోడ వచ్చి రామమందిర ద్వారంబున నిలిచెను. వానిపేదఱికము జాలిగొలుపఁగా ద్వారపాలకులతని నడ్డగింపరైరి. ఆస ముందునకు శంకాకళంకములు వెనుకకు వాని నుఱ్ఱూతలూయసాగెను. ఆ బ్రాహ్మణుఁడట్టకేలకుఁ దెంపు వహించి లోనికిఁ బోయి రాముని సందర్శించి 'రాజపుత్త్రా! నిర్ధనుఁడను, బహుపుత్త్రకుఁడను, ఉంఛవృత్తి జీవనమయ్యెను.

ఉ॥ పూటకుఁగూడులేదు మఱిపుత్త్రకులన్ననో వేవురైరి నా
పాటవమేది నింట నెలప్రాయపుటింతిచిరాకుఁజెప్పఁగా
మాటలుచాలవెందు నవమాన మెదుర్కొనుచుండు నక్కటా!
కాట్రికిఁ గాలుచాచినను గాలుఁడుకాదను నేమిసేయుదున్.

అని మహాదీనస్వరమునఁ బలికెను.

రాముఁడు వానినిజూచి,

ఉ॥ ఎక్కడిబ్రాహ్మణుండవు మఱెచ్చటనుండితి వింతదాక నా
బొక్కసమెల్ల రిక్తమయిపోయెను నీకిపుడేమిచేతుఁ గా
సొక్కటియైనలేనితఱి నోయనివచ్చితి వేలనయ్య నీ
యక్కఱదీర్చ బెట్టులాగదయ్య ధరామరవంశశేఖరా.

భూసురోత్తమా! నిన్నుఁజూడ జాలియయ్యెను. అయినను నీకు నా చేతులాఱ నెద్దియు నిచ్చుటలేదు. అదిగో యాలమంద. నీచేతిదండమును విసరివైచి అది పడుచునంత నేలలోని గోగణమును గొనిపొ'మ్మని పరిహాసమునకోయనఁ బలికెను. త్రిజటుఁడు సంతసించి గోచి బిగించి నిగిడి తనచేతికఱ్ఱను సత్తువకొలఁది గిరగిరఁద్రిప్పి విసరెను. ఆ కఱ్ఱ సరయూతీరముదాఁటి పెక్కు వేల గోవులకు నవ్వల నాఁబోతుముందు పడెను. రాముఁడు త్రిజటుని గవుంగలించుకొని 'విప్రవర్యా! నీబలంబు నెఱుంగఁ గోరి యిట్లొనర్చితి; కోపింపవలద'ని పలికి దండముపాఱినంత మేరలోని

యావులనెల్ల గోపకులవలనఁ దోలి తెప్పించి 'ఆర్యా ! అదిగో నీధనము ; దానిని గొనిపొమ్ము. ఇంక నేదేని కోరదువేని సంకోచింపవలదు ; నాధన మెల్ల బ్రాహ్మణార్థముగాని వేఱుగాదు ; అది నీయట్టివారికిఁ జెంది సద్వినియోగమగుట నాకెంతయు బ్రీతికర' మనెను. త్రిజటుఁ డామాటవిని 'రామా ! నీయౌదార్యమునకు మేరగలుగదు. మఱేమియు నాకువలదు ; సమస్తకళ్యాణములను బడయుము' మని పలికి తన యాలమందును దోలించుకొని పోయెను.

ప్ర జా దుః ఖ ము.

అంత రామలక్ష్మణులు శరచాపంబులు ధరించి సీతాసమేతముగా దశరథునికడకుఁ గాల్నడకఁదరలిరి. అట్లువచ్చుచున్న వారిని జూచుటకై జనులు గుంపులు గూడిరి. వీధులిమ్ము చాలవయ్యెను. కొందఱు ప్రాసాదంబు లెక్కిరి ; కొందఱు హర్మ్యతలంబుల నిలిచిరి ; కొందఱు విమానశిఖరంబు లధిష్ఠించిరి. జనులట్లు సందుగలతావులెల్ల నాక్రమించి అహో ! ఐశ్వర్యరసజ్ఞుఁడును వదాన్యశిరోమణియునైన రాముఁడు ధర్మగౌరవంబునఁ జేసియుఁ దండ్రికి రానున్న యసత్యదోషంబును నివారించుటకు నెంత తెంపు చేసెనో చూచితిరా ? ఏమిత్యాగము ! ఏమివైరాగ్యము ! ఈమహనీయుని తత్త్వమూహకుఁగూడ నందదు. కటా ! గగనచరభూతంబులకుఁ గూడ దుర్లభదర్శనయగు సుకుమారి సీతాదేవి నేఁడు రాజమార్గంబున నడచుచుండెను. చందనచర్చలకేని కసుగందునట్టి యీమెమైదీఁగె శీతోష్ణవర్షంబులకు నెంత పసిచెడునో చెప్పరాదు. దశరథుఁడు పిశాచావిష్టుఁడగుట ముమ్మాటికి నిజము. కాదేనిఁ గూర్మితనయునిఁ గాననాంతరములకుఁ బాఱదోలునా ? తులువసుతునిగూడఁ దలిదండ్రులు త్యజింపరు ; సర్వలోకప్రియుని జెప్పనేల ? మహాసత్పురుషునకు రామునకు నిట్టి యిక్కట్లు వచ్చుటఁ జూచి జనులు నీరింకినకాసారమునందలి జలచరంబులపగిదిఁ దల్లడిల్లుట యబ్బురముగాదు. సకలకళ్యాణగుణసంపన్నునకు రామునకే యిట్లు సంభవించినప్పుడు సౌజన్యంబునకు నిఁక మర్యాద యెట్లుండును ? ఇఁక శీలమును గణింతురా ? శ్రుతిస్మృతులను బాటింతురా ? ఈమహావైపరీత్యము జగమునెల్లఁ దలక్రిందు చేయుచున్నది. రాముఁడనఁగాఁ బ్రపంచమహామహీరుహంబునకు మూలకందముగాని సామాన్యుఁడుగాఁడు. అతనికే యిట్టి

పతనము గలుగఁగా శాఖాపత్రపుష్పఫలమాత్రమగు ప్రాణివర్గముగతి
చెప్పఁదరమా ? మనరాముఁడు వలసపోవుచున్నాఁడు ; మనముమాత్ర మిం
దుండనేల ? మనకు గృహములేల ? క్షేత్రములేల ? మనముగూడ సమస్త
ము వర్జించి భార్యాబంధుసహితముగా వానివెంటఁ బోవుదము. అదిగో
లక్ష్మణుఁడు మనకు మార్గదర్శి. మనమెల్లఁ బోవుదుమేని నిందలి జంతు
కోట్లకు భరణరక్షణములు తొలఁగును. అవి వనగతమో దివంగతమో
యగును. అయోధ్యానగరము సర్వనివృత్తిఁ గాంచి పాడగును. ఆపాడు
పట్టణమును కైకేయి నిరంకుశముగాఁ బాలించుచు సుఖముండుఁగాక' యని
తలకొక యూహగాఁ బలుకసాగిరి.

### తండ్రిని వీడ్కొనుట.

జనుల హాహారవములును విలాపనిందావచనంబులును శ్రవణపుటం
బుల నగల్చుచున్నను రాముఁడు కించిన్మాత్రమేని వికారమొందక చని వీర
పురుషరక్షితమైన రాజగృహముఁ జొచ్చి, దూరాన నిల్చి సుమంత్రుని
దుఃఖవివర్ణుని జేరి తనరాక ఱేని కెఱిఁగింపు మనెను. అతఁడు లోనికిఁ
బోయి రాహుగ్రస్తుఁడైనసూర్యునివలె నీఱుగప్పిన నిప్పుక్రియ నింకినతటాక
మురీతి తేజోవిహీనుఁడైయున్న దశరథునకుఁ గేలుమోడ్చి జయవచనంబులు
పలికి 'రాజేంద్రా ! పురుషలలాముఁడు నీకుమారుఁడు రాముఁడు విశ్రాణన
నిశ్శేషితసమస్తకోశజాలుఁడై వచ్చి వాకిట నున్నాఁడు. మిత్రుల వీ
డ్కోలులాయెను ; దేవరవారిదర్శనముఁ గోరుచున్నాఁ' డని హీనస్వరమునఁ
బలికెను.

దశరథుఁడు తనభార్యలనెల్ల రప్పింపుమని సుమంత్రు నాజ్ఞాపించెను.
శుద్ధాంతకాంతాజనము మున్నూటయేఁబదిమంది దుఃఖావతారయైన కౌస
ల్యను జుట్టి వచ్చిరి. అంతనతఁడు రాముని బ్రవేశపెట్టు మనెను. రా
సుతుఁడు బద్ధాంజలియై సీతాలక్ష్మణులతోఁడ వచ్చెను. దశరథుఁడు
తనయునిఁ గతిపయపదముల దవ్వునఁ జూచి యాసనంబునుండి లేచి భార్యల
తోడ నెదురేఁగ యత్నించెను గాని దుఃఖభరము వానికాలు గదలనీయ
దయ్యెను ; మూర్ఛ పైకొనెను. అతఁడు నేలవ్రాలి విసంజ్ఞునిపగిదిఁ
దోఁచెను. సతులొక్కపెట్టున రోద నావించిరి. సీతారామలక్ష్మణులు

తటాలున దుమికివచ్చి వానిని గ్రుచ్చి యెత్తి పాన్పుపయిఁబరుండఁ బెట్టి సేదదేర్చిరి. అతఁడు కొంతసేపటికిఁ దెలివొంది కనువిచ్చి చూచెను. రాముఁడు కయిమోడ్చి 'మహాప్రభూ! మాకెల్లనీశ్వరుండవైన మిమ్ము వీడ్కొని వనమునకుఁ బోవచ్చితిని. వ్యసనముమాని మీకటాక్షవీక్షణ భాగ్యంబును నాకుఁ గలిగింపుము. సీతాలక్ష్మణులు నావెంట రా నిశ్చయించిరి. ఎంతసెప్పినను వినరు. అనుజ్ఞవేడుదు' మనెను.

దశ:—(వెచ్చనూర్చి) రామా! ఈమందుఁడు కైకేయీప్రతారితుఁడు. ఈ నిర్భాగ్యుని నిగ్రహించి యయోధ్య నధిష్ఠింపుము.

రా:—నరేంద్రా! ఇదిఎట్టిమాట. పెక్కుసంవత్సరములు యథావిధి రాజ్యపాలన మొనర్చితిరి; సత్యసంధుండను కీర్తిని గడించితిరి. నేఁడు మీరు మీసుతునివలన దూఱు రాఁజెల్లునా? ఈతలంపునకు సెవ మీయకు. పదునాల్గుసంవత్సరములు క్షణములోఁ జనును. వనాంతర నివాసము నాకెంతయుఁ బ్రియము. మీప్రతినఁ జెల్లించినవాఁడనై వచ్చి మీపదము లాశ్రయింతును. ఎట్టిసెంజలియుఁవలదు. విందు మానంబున ననుజ్ఞయిమ్ము.

దశ:—నాయనా! నీకు మహాభ్యుదయమగుఁగాక; నీవు సుఖముగా మఱలివత్తువుగాక. పుత్రా! అకుతోభయుండవై యవ్యగ్రము శుభస్కరమునగు సరణిద్రొక్కి చిరకీర్తి నొందుము. నీసత్యాత్మతయు నీధర్మాభిరతియు లోకాతీతములు. నీమది మఱలింప నాతరము గాదు. ఈరాత్రి యిందుండి రేపకడఁ జనుము. కుమారా! నాకుఁ బ్రియమొనర్ప సమస్తముఁ దృణప్రాయముగాఁ ద్యజించి విజనంబును గ్రూరసత్త్వమహోగ్రమునైన కాంతారంబులందుఁ ద్రిమ్మరఁ బోవన్నావా? ఈదృశదుష్కరకార్యము భవదన్యులకు సాధ్యము గాదు. రామా! నీవనవాసంబునకు సమ్మతించితినని యెంచవలదు. చెడిపెకు మోసపోయి యిన్నికడగండ్లు దెచ్చికొంటిని. ఇది సత్యము. వంచనచేసి సంపాదించిన వరములనుగూడ సఫలీకృతమొనర్చు నీధార్మికత్వ మొండుఁగలుగదు.

రా:—తండ్రీ! ఈరాత్రి నేనిందుండి చేయునదేమియులేదు. రుచ్యంబు

లగు భక్ష్యముల నారగించి పొమ్మందువా ! భోగములవలన విరమించితిని ; కోర్కెలెల్లఁ ద్యజించితిని ; మనశ్చాంచల్యమునకు నెడమీయరాదు. అదియునుఁగాక నేనింటనుండుట మీకు దుఃఖమును బెంచుటకునుగాని యూఱట గలిగించుట గాదు. రాష్ట్రమును భరతునకు నప్పగించి సత్యమును గాపాడుము. నాయనా ! కన్నకుమారునకుఁ గీడొనర్చితినను సంతాపము మిమ్మేర్చుచున్నట్లు తోఁచుచున్నది. మోహశోకమువలె మీరును భ్రాంతికి నెడమీయనగునా ! నాకు మహోపకారమును గావించితిరేగాని యెగ్గొనర్పరు. మహర్షిసాంగత్యము దుర్లభముఁ బరమవాంఛనీయము. అదియును నొకనాఁడు రెండునాళ్ళు గాదు. పదునాల్గువర్షములు. ఈమహోదయము మీ కృపవలనఁగదా నాకుఁ గలుగుట. ఇంతకు మిన్నయగు మేలుగలదా ! ఓండుతలంపువలదు ; సంతోషపూర్వకముగాననుజ్ఞయిమ్ము. సత్యపరిపాలనమును బితృసేవయు నాపరమవ్రతములు. రాజ్యముగాని భోగైశ్వర్యంబులుగానీ మైథిలిగానీ తుదకు జీవితముగానీ నాకంతకన్నఁ బ్రియములుగావు. నాయనా ! నేఁడే వనమునకుఁ జరలుదునని తల్లి కైకేయీదేవికి మాటయిచ్చితిని ; ఆమాటచొప్పునఁ బ్రయాణమై వచ్చితిని. నాసంకల్పము మాఱదు. ఈ యవినయంబు సైరించి సెలవిమ్ము. తండ్రీ ! మిమ్ముఁజుట్టి దుఃఖించుచున్న యీ జనమును జూతువా ! మీరే యిట్లయినచో వీరినూరార్చువారెవరు ! సర్వజ్ఞుఁడవు ; మీలోకానుభవ మింతనరాదు. ఇట్లు డీలుపడి వగవనేల ! మిన్ను విఱిగి మీదఁబడలేదు ; గోరంతయెగ్గు గలుగలేదు. ఎల్లప్రాణులకు సంయోగవియోగంబులు సహజంబులు; ముడివైచిన ను బాపుతప్పదుగదా. అశోచ్యంబునుగూర్చి ప్రాజ్ఞులు శోకింపరాదు.

సుమంత్రుఁడు కైకేయికి బోధించుట.

దశరథుఁడు మఱల దుఃఖవివశుఁ డయ్యెను. అతనిసారథి సుమంత్రుఁడు సమస్తము విని కినిపాటుఁగాంచి పండ్లు పటపట గొఱికి తలవిదిర్చి నిట్టూర్పునిగిడ్చి చేఁజేయి నలిపికొనుచుఁ గన్నుల నిప్పులు గుఱియ మోము జేవురింప నిలువెల్ల వడఁకఁ గైకేయి వంక మరలి 'జగత్పతియు మీఁదు

మిక్కిలి పతియు నైన మహానీయుని త్యజించినదానికి మేరగలదా? పతిఘ్నులకు గులఘ్నుత్వ మేపాటియగు ?' అని లోలోనఁ బలికికొని 'మానవతీ! వరదుని నీభర్త నవమానింపకుము. కోటిమందికొడుకులు భర్తకుసాటి గారు. రాజ్యము జ్యేష్ఠక్రమాగతము. అనాదిధర్మంబును దాఱుమాఱు సేయవలదు. నీకొడుకునకే పట్టముఁగట్టుకో; నీవే యేలుకో; మేమెల్ల రామునివెంటఁ బోవుదుము; బ్రాహ్మణుఁడొక్కఁడేనియు నీరాజ్యావ నుండఁబోఁడు. మిలిమీఱితివి; నీవృత్తంబునకు భూమి బ్రద్దలు కాకుండుట మహాశ్చర్యము. కటా! పుత్రవివాసదీక్షాపరతంత్రయైన యాభీమదర్శ నను మహర్షి ధిగ్వచనంబులు దహింపవేల! దశరథా! రామునిఁ బాఱఁ ద్రోలి కైకేయి ముద్దుదీర్తువా! రసాలవృక్షంబును దునిమివైచి వేపఁజెట్టు ను బెంచెదవా! కేకయ రాజపుత్రీ! తల్లిగుణంబులు నీకుఁ దప్పవయ్యెను. విత్తొకటి నాటిన చెట్టొకటియగునా! నీతండ్రి కొండొకమహర్షివరంబున సమస్తజీవులభాషాజ్ఞానముఁ బడసెను. ఒకనాఁడు వానిపడకయొద్ద జృంభణ పిపీలికంబులు సంభాషించుచుండెను. అదివిని నీతండ్రి నవ్వెను. నవ్వుకారణ మేమని నీతల్లి వానినిఁ బీడించెను. 'ఇదిచెప్పరాదు; చెప్పితినేని నాకుఁ జావుసిద్ధము; ఇది మునికట్టడి' యని యతఁడెంతో బ్రతిమాలెను. నీతల్లి తనపట్టువీడకుండెను; భార్యపోరు పడలేక యతఁడు మునీంద్రునికడకుఁ బోయి సంగతి తెలిపెను. 'ప్రాణములు తీపగునేని రహస్యమును దాచు' మని యా ముని వచించెను. అంతట నీతండ్రి నీతల్లిని నిరాకరించి ప్రాణము దక్కించుకొనెను. ఇవి మాకుఁ గ్రొత్తగాదు. ఆతల్లికడుపునఁ బుట్టిన నీకు వేఱుగుణములెట్లువచ్చు! తండ్రిగుణములు తనయులకును దల్లిగుణంబు లు తనయలకును గలుగుననుట నేఁడు గంటిని. కైకేయీ! నీదుండగము వలనఁ గడలేని కష్టనష్టములు రానున్నవి. ఇఁకనైనను నీమొండివీడి పతికి ననుకూలవతివగుము. రామపట్టాభిషేకంబునకు ఊనిని బురికొల్పుము; దుఃఖనిర్మగ్నమైన జీవలోకము నుద్ధరింపుము. చెప్పెడుమాటలు వినవలెను. నీవు నీచేతులార నీభర్త నధర్మగర్తంబునఁ ద్రోసి తీఱనినిందకుఁ దల యొగ్గెదవా! మానమేదేనిఁ బ్రాణమేల! నీవుగా రామునకుఁ బట్టముఁ గట్టుము; ఈదురాఱువాయుము' నని బహుభంగుల నయభయంబుల బోధించెను. వానిబోధనలెల్ల నడవిఁగాచిన వెన్నెలయ్యెను. విధివిధానము తప్పునా!

### కైకేయీదశరథుల వివాదము.

ఎవరెంత చెప్పినను కైకేయి తననిశ్చయమును మఱల్పమికి దశరథుఁడు విసివి 'సుమంత్రా! రాముని యనుయాత్రార్థము చతురంగబలమును రత్నరాసులతోఁ బంపుము. ధనవంతులైన వైశ్యులును నటీనటులును గాయనీగాయకులును కుమారుని వెంట నందుఱుగాక. నాపుత్త్రుని మిత్త్రవర్గమును భృత్యకోటినివాని వెంటఁ దరలింపుము. వివిధాయుధములును శకటంబును వ్యాధశిఖామణులును వనగోచరులును వానిని దవిలియుందురుగాక. నాసుతుఁడు రాజ్యముసంగతి మఱచి యిచ్ఛావిహారంబుల సుఖముండునట్లుగా వలయునవియెల్ల సమకూర్చి పంపుము' అనిచెప్పెను. దశరథుఁడట్లు పలుకఁగా విని కైకేయి మహోగ్రహమొంది 'రాజ్యమును బ్రాణిశూన్యమొనర్చి యిచ్చిన భరతున కిత్తువా?' యని పరుషస్వరంబునఁ బలికెను. దశరథుఁడామాటతోఁ గటకటంపడి 'కూరా! దుర్భరమగు భారము వైచి నన్నుఁ బాతాళమునకుఁ ద్రొక్కితివి. అదిచాలక పైన మన్నుద్రోయుదువా? ఏ వరములను నీవు కోరితివో వానిని మాత్రమే గ్రహింపు; అంతకు మించి పలుకవలదు. రాముని వెంట నెవ్వనిఁ బంపరాదని నీవు కోరలేదు. వృథాక్షేపణలు విరమింపు' మని యదలించి పలికెను. పతిమాటలకు నంతస్తాపముద్దీకెఁ దాచున్నను కైకేయి దానినిలోలోన నడచిపెట్టి 'రాజా! పూర్వాచారము తప్పరాదంటివి. ఆచారతిరస్కారము ధర్మాతిక్రమమగునంటివి. ధర్మాతిక్రముఁడు సత్యదూషకుఁడగునని వేసాఱ్లు బోధించితివి. ఈవిషయమునఁ గూడఁ బూర్వాచారము పాటింపవలదా? అసమంజసుని చరిత్ర వినవా? సగరుఁడు వానినిఁ దోలి వనంబునకుఁ బంపినప్పుడు వానివెంట నిట్టివి తరలించెనా? సగరుఁడు నీవంశ్యుఁడే గదా! నీవిప్పుడిట్లు చేయుట మీవంశాచార వ్యతిక్రమముగాదా?' యని నాటుఁబలికెను.

### సిద్ధార్థుఁడు కైకేయిని నిందించుట.

సిద్ధార్థుఁడనుమంత్రి కైకేయీహృదయవిదారణవచనంబులు విని కటకటంబడి 'దేవీ! నీయుక్తివిశేషము వినసింపుగాదు. ఆట్లాడుచున్న పసిబిడ్డలను బట్టితెచ్చి నీటముంచి యానందించిన యసమంజసునితో రామునిఁ బోల్చెదవా? అసమంజసుని క్రూరకృత్యంబులకుఁ బ్రజలు గోడుగోడు మని యేడ్చిరి. వారిదుఃఖనివారణార్థము సగరుఁ డాయసమంజసునకుఁ

గాడుకనుక నికరమునుగూడఁ జూపక యావజ్జీవవనవాసశిక్షను విధించి భార్యాద్వితీయునిగా వానిని వెడలించెను. రాముఁడేమి యకార్యము ఒనర్చెను ! రామవివాసమునకు లోకమెల్ల దురపిల్లుచున్నదిగదా. రాముని బల్కెనోట నసమంజసుని బల్కుట మహాపాతకముగదా ! అసమంజసుఁడు పరమదుష్టుఁడు ; రాముఁడు సజ్జనశిఖామణి ; వాఁడు ధర్మబాహ్యుఁడు ; ఇతఁడు ధర్మనిరతుఁడు ; అతని వివాసమును రాష్ట్రమెల్లఁగోరెను ; ఇతని వివాసమును నీవుదక్క నొరులుగోరరు ; సగరునాజ్ఞ నెల్లరు నామోదించిరి దశరథునాజ్ఞను బ్రతిషేధింపని ప్రాణిగలుగదు. అతనికి నితనికి సామ్యముఁ జలుక నోరెట్లాడెను ? చంద్రునియందేనిఁ గళంకముగలదుగాని రాముని యందెట్టి కళంకము గలుగదు. అట్టి సజ్జనుని ధార్మికుని లోకప్రియుని నిర్దోషిని స్వలాభార్థమిట్లు గాటించువారికి సిరిదక్కునా ! ఇంతటనేని నీ దుర్మతమును మాని యాత్మహితమొనర్చుకొనుము.' అని యంతఃకోపమును వెలువరించెను. దశరథుఁడును వానిమాటనందుకొని 'పాపీ ! సిద్ధార్థుని వింటివా ! ఎంతవిన్న నేమిఫలము ! కుత్సితమతికి హితంబులు రుచింపవు. లోకగర్హితంబునకుఁ దెగించితివి. నీక్షితి మబ్బువిడిచిన రొండయర్యోవు. కాపటీ ! నీతోడివాసమునకన్న వనవాసమే మేలు. సర్వమునప్పగించితిని ; ఏకాకిగానిందు సుఖముండుము. నేనుఁగూడ నారాముని వెంటఁ బోవుచున్నా' ననెను.

### రామాదులకు వల్కలములిచ్చుట.

రాముఁడది విని 'నాయనా ! గజమునిచ్చినదాత దానిని గట్టుత్రాటికై యాశించునా ? ఎల్లయర్థములను విసర్జించితిని ; సైన్యసామగ్రులు నాకేల ! మీరు నావెంటరాఁజనదు. వల్కలములో గుద్దలియో పుటికయో యింతయిచ్చి నన్నుఁ బంపుము. జాగువల' దనెను. రాముని నోట నమ్మాట వచ్చుటే తడవుగాఁ గైకేయి వల్కలములు తెచ్చి వానికిచ్చి ధరింపు మనెను. ఆమె నేతకు నెల్లరు నివ్వెఱఁగందిరి. రాముఁడానారచీరలు గైకొని కన్నులనద్దుకొని తనమొలనున్న జిలుఁగువస్త్రంబును దుల్చివైచి యవి ధరించెను. సీతాదేవి తనకుఁగాఁ దెచ్చిన వల్కలములను జూచి వలను గాంచిన లేడికైవడి బెగడొంది బాష్పపూర్ణలోచనయై 'నాథా ! వనవాసిములు వల్కలములధరించు వైఖరియెట్టులుంగ' నని యొకటి మెడవైచికొని

యింకొకటి చేతఁబట్టుకొనెను. రాముఁడా ప్రియురాలి భ్రాంతిని గ్రహించి యామెచేతి వల్కలము నందికొని యామెకట్టియున్న పీతాంబరము పయిఁ దానిని జుట్టెను. అదిగాంచి యందున్న స్త్రీజనమెల్ల గొల్లుమని విలపించి 'వత్సా! రామా! వలదు వలదు; ఈపనిచేయవలదు. వనవాసశిక్ష సీతకుఁ గావింపఁబడదు. ఈ బిడ్డనెడబాయఁ జాలము. నీవచ్చుదాక నీకు మాఱుగా సీతను జూచియేని మనియుందుము. పితృవాక్యమును పాలించి రమ్ము. లక్ష్మణుఁడు నీకుఁ దోడుగానుండును. అయ్యో! ఈపరమకల్యాణియెడ! తాపసవృత్తియెడ! నిన్నుమరలింప మాతరము గాదు. సీతనేని యిందుంచి చను' మని వ్యసనకుంఠితస్వరంబుల మొఱలిడిరి.

వసిష్ఠుఁడు కైకేయికి హితముచెప్పుట.

వసిష్ఠుఁ డందుండి యీనాటకమెల్ల గన్నారఁ జూచి లోలోనఁ బొడమి యేఁచి రగులుచున్న కోపాగ్నిని బట్టఁజాలక 'కులఘ్నీ! నీయతివృత్తముచాలు; రేనిని మోసగించి నీ పడసిన వరములెంతో యంతతో నిలుపుము. జానకి వల్కలములు కట్టనేల? వనమునకుఁ బోనేల? ఆమెకు నారచీర లందియ్య నీ చేతులెట్లాడెను? లజ్జయేని నిన్నాకట్టదా? గృహస్థునకు భార్య యాత్మయగును. రామునిపరోక్షమున వానిరాజ్యమును వానియర్ధాంగి యధిష్ఠించుఁగాక. ఆమెదండ మేముండి రాచకార్యంబులను జరుపుదుము. వైదేహిసయితము రామునను గమించుచో మేమును వారివెంటఁ దరలుదుము. మాతోడఁ బురమెల్లఁ గదలును; దశరథుఁడు మమ్మనుసరించును. అగ్రజసేవార్థులై భరతశత్రుఘ్నులు వత్తురు. ఈపాడుపట్టణము నేకాకిగా నేలుకొనుము. రాముఁడు రాజుగానిరాజ్యము రాజ్యమే గాదు. అతఁడుండుచోటు వనమైనను రాజ్యమగును. అవివేకీ! భరతునకు రాజ్యమును గట్టనుంకించుచున్నావు. వాఁడు దశరథునిపుత్త్రుఁడు గాఁడా! తండ్రి యీయనట్టియు నగ్రజునిసొమ్మయినట్టియు రాజ్యము నొల్లునా? కైకేయీ! నీయీదృశమాతృవాత్సల్యంబును భరతుఁడేవగింపక మానఁడు. తల్లడింతువుగాక నీమతము నతఁడు సేయఁడు. తిర్యగ్గతంబులు గూడ రామునను సరించుచుండఁగాఁ బితృవంశచరిత్రజ్ఞుఁడు భరతుఁ డొండు సేయునా? భరతునకు మహోపకృతి నొనర్చుచున్నానని తలంచుచున్నావు. అది కేవలముభ్రాంతి; వానికి మాయరాని యపకార మొనర్చుచున్నావు.

కోడలికిచ్చినవల్కలములు మరలఁదీసికొని వానికిమాఱుగా నుత్తమాభరణము లిచ్చి నీయకార్యదోషమును బాసికొను' మని హితము వచించెను.

దశరథుని పరితాపము.

వసిష్ఠుని వ్యసనాగ్రహంబులు దశరథుఁడు పరికించి 'కటా! నా యజ్ఞాన మెన్ని యనర్థములకు మూలమయ్యెను; వెదురుపూచినట్లు నా తెలివి యిట్లు పూచి యాత్మవినాశ మొనరించెను' అని లోలోనఁ జింతించి, కైకేయి వంక మరలి 'పాపీ! రాముఁడు నీకుఁ దలయేఱియిననగుఁగాక, సీత యేమిచేసెను? కుమతీ! ఆబిడకు నారచీరలందియ్యఁగా నీచేతులెట్లాడెను?' అని నిందాస్ఫూర్తితో గర్హింపసాగెను. రాముఁడు తండ్రికి మ్రొక్కి 'నాయనా! సెలవిమ్ము, పోయివచ్చెదను. నాతల్లి వృద్ధురాలు, మదేకపుత్త్రిక; అట్టినన్ను వనంబునకుఁ బంపుచున్నను మీకెదురాడదు. ఆమె నెట్లు పాలింతువో' యనెను. ఆమాటతోడ దశరథుఁడు దుఃఖపరీతహృదయుఁడై 'కటా! నాప్రియసుతుని మునివేషమును జూడనోడి నాకన్నులు మూసికొనుచున్నవి; దుఃఖము నోరాడనీయదు; తొలిబామున నేనెట్టియకార్యమొనర్చితినో! కాకున్న నాకిప్పు డీపుత్త్రవియోగదుఃఖముగలుగదు. అయ్యో! ప్రాణములుచనరాదా? ఏమినాయజ్ఞానము! కాలము రానిదే ప్రాణములు తరలునా? ఈమొండికట్టె యింక నెంత యనుభవింపవలసి యున్నదో గదా. భోక్తవ్యము తీఱనిదే యవసానకాల మెట్లుగలుగు? హా! రామా!' అని నిట్టూర్పు నిగిడ్చి సుమంత్రుని జూచి 'సారథీ! నీవు చని యుత్తమహయంబులను బూన్చి రథమును గొనివచ్చి మహాభాగుని రాముని నందెక్కించుకొని పోయి వానిని దేశాంతరమున వదలి రమ్ము. కన్నవారే తమపుత్త్రుని బరమసాధువును ద్యజించుటఁ జూడఁగా సద్గుణంబులు సయితము కొన్నివేళలఁ గారానట్లు తోఁచుచున్న' దని పలికి వానిని బంపి, ధనాధ్యక్షుని రప్పించి 'పదునాల్గువర్షంబులకుఁ జాలునంత వస్త్రాభరణాదికముఁ దెచ్చి నాగోడలికి సీతకిచ్చి పంపు' మనెను.

కౌసల్యాదేవి సీతకు హితముదేశించుట.

కౌసల్యాదేవి యంత సీతను గవుఁగిటఁ గ్రుచ్చి శిరంబుమూర్కొని 'అమ్మా! సంపత్కాలంబున భర్తనుఁ బూలతోఁ బూజింతురు; ఆపదలందు వాని ద్యజింతురు; బొంకునకు వెఱవరు. ఇవి స్త్రీలకు నైజము.

మఱియు స్త్రీహృదయంబు నశ్వప్లుతంబు నెఱుంగరాదు. ఇంతులు గోరంత యప్రియంబునుగూడ సహింపరు. తఱివచ్చెనేని వారు కులగోత్రంబులఁ ద్యజింతురు ; విద్యాధనంబుల నిరసింతురు, లోకసంగ్రహోపకారంబులను గూడఁ బాటింపరు. సాధ్వీమణులసంగతి యట్లుగాదు. కులశీలములు వారికిఁ బెట్టని భూషణంబులు ; సత్యమే వారికిఁ బ్రాణము ; గురుజనుల మాట దాఁటరు ; పతియే దైవంబుగా వర్తింతురు. అమ్మా ! నాసుతుఁడు లక్ష్మినిరాకృతుఁడని వాని నవమానింపకుము. దరిద్రుఁడో ధనాఢ్యుఁడో రాముఁడే నీకుదైవ' మని వచించెను.

### సీతనిజమనమును వెల్లడించుట.

వైదేహి యాయుపదేశంబులం విని 'తల్లీ ! నీపలుకు లాజ్ఞలుగా గ్రహించి వర్తింతును. సతీధర్మములను పెద్దలవలన నేర్చితిని. కాంతి చంద్రునివలె నేను ధర్మము ననుసరింతును. పతినిబాసినసతి తంత్రులు లేనివీణవలెఁ జక్రములులేని బండివలె నగునని యెఱుంగుదు ; తలిదండ్రుల వలనఁగాని సుతసోదరులవలనఁగాని స్త్రీలు పడయునదెల్లఁ బరిమితముగా నుండును. భర్తలవలన వారు పడయునదన్ననో యపరిమితము. కలిమి లేములు బుద్బుదప్రాయములు ; సిరివైచినట్టి ముడి యంతదృఢముగాదు ; వలపుముడి యెన్నడు వీడదు ; దానిని విప్పఁదరముగాదు. నన్నుఁగూర్చి శంకింపకు' మని నిజాంతర్భావమును సూచించెను.

### రామాదులనిర్గమనము.

కౌసల్యాదేవి కన్నీరునింప సాగెను. రాముఁడామెకుఁ బ్రదక్షిణించి 'అమ్మా ! నావనవాసము నిమిషమాత్రమునఁ గడచును ; ఎడరు వలదు; నాతండ్రిని బదిలముగాఁ గాపాడు' మని చెప్పి సుమిత్రాదులకు దండమొనర్చి, 'తల్లులారా ! అజ్ఞానముననొండెఁ బరిచయాతిశయముననొండె మఱియేకారణముననొండె మీరాముఁడు మీకెన్నఁడేని యవినయమొనర్చి యుండునేని దానిని క్షమింపనగు. ఇదే మిమ్మతఁడు వీడ్కొనుచున్నాఁ'డని పలికి, సీతాలక్ష్మణులతోడ దశరథునకుఁ బ్రదక్షిణ నమస్కార మొనర్చి మఱలఁ గౌసల్యకుఁ బ్రణమిల్లెను. రాముఁడట్లు వనవాసమునకై తరలునప్పుడు వానికి నిరువదేనువత్సరములు నిండనుండెను.

లక్ష్మణుఁడంతఁ గౌసల్యకు మొదట మ్రొక్కి యనంతరము తనతల్లికి సుమిత్రకు నమస్కరించెను. సుమిత్రాదేవి సుతుని శిరము మూర్కొని 'నాయనా! జాగరూకుండవై యుండుము. రాముఁడు వ్యసనియగుఁగాక సమృద్ధుఁడగుఁగాక. వాఁడే నీకు దిక్కు. జ్యేష్ఠునను సరించుటకన్నఁ బరమధర్మములేదు. యజ్ఞదానతపోదీక్షలకు మీవంశము జన్మస్థానము. రణరంగంబున నైక్ష్వాకులు వెనుచూపి మెలంగరు. రాముఁడే తండ్రిగా సీతయే తల్లిగా భావించి వర్తింపుము. పోయిరమ్మ'ని వానిని దీవించి పుచ్చెను.

సీతారామలక్ష్మణుల వనప్రయాణము.

అంతలోన రథమువచ్చెను. రాముఁడు తనప్రియురాలిని మొదట రథమెక్కించి యామెవెంట తానెక్కెను. రామునివెనుక లక్ష్మణుఁ డెక్కెను. సారథి వాగెలు సడలించెను. శకటము తీవ్రగతిఁ దరలెను. రథముకదలినంతనే జనులెల్లరు సమాకులభ్రాంతులైరి; గజంబులు తమకోప దుఃఖంబులను ఘీంకారంబుల వెల్లడింపసాగెను; హయశింజతములు చెలరేఁ గెను; నగరమెల్ల హాహారవముల బోరుకలఁగెను. దాహాదీనులు సలిలంబు లనువలె జనులాబాలవృద్ధము రథమువెంటఁబడిరి. పార్శ్వములనుబట్టుకొని కొందఱుఁ బృష్ఠభాగమున వ్రేలాడుచుఁ గొందఱు రథగమనమునాపి బాష్ప పూర్ణలోచనములెత్తి 'సుమంత్రా! వాగెలు బిగింపుము; రథము నిలుపుము. ఇఁక మేము రాముని జూచుటెన్నఁడో; కడసారి తనివితీఱ వానిఁజూతుము గాక. అహో! కౌసల్యాహృదయము యఃపిండముకాని వేఱుగాదు. ఒం డగునేని బ్రీలదా? భళీ! వైదేహి నిజపతిని ఛాయవలె ననుగమించు చున్నది. ఈమె మహాకృతార్థురాలు సుమా. లక్ష్మణా! అన్నను దేవ సమానుని బరిచరింపఁ జనుచున్నావు. నీవునిక్కముగా సిద్ధార్థుఁడవు. ఇంతకన్నవేఱు తపమేల? ఇదే నీకు మహాభ్యుదయకరమగు' నని కేకలిడ సాగిరి.

సుతవియోగము దశరథునకు దుస్సహమయ్యెను. అతఁడు దుఃఖ హతుఁడై యుండియుఁ బుత్రునిజూచుతమకంబున నంతఃపురమునుండి వెడలెను. అతనివెంట వానిభార్యలును దరలి యూథనాథుని బంధనఁబు

నకుఁ గరేణుకాగణమువలె రోదింపసాగిరి. తల్లిదండ్రు లట్లు వచ్చుట రాముఁడు చూచి యావిషాదప్రదర్శనంబును సమాప్త మొందింప నెంచి వాలు గదలింపుమని సారథి నాజ్ఞాపించెను. సాయంకాలము దూడకై గోవు చందంబునఁ గౌసల్యాదేవి రథమువంకఁ బరుగెత్తుచు 'హా! రామా! హా! సీతా! హా! లక్ష్మణా! అని విలపింపఁ జొచ్చెను. నిలునిలుమని దశరథుఁడు కేకలిడెను. చక్రాంతరగతుఁడువోలె సారథి డోలాయమాన మానసుఁడై దిగాలుపడి యేమియుఁదోఁపకుండెను. రాముఁడది గాంచి 'సుమంత్రా! వీరిదుఃఖమును జూడఁజాల; రథముఁబోనిమ్మ'ని త్వరించెను. రథము వాయువేగమునఁ బఱచెను. దశరథుఁడు సుతుని వెంబడింప యత్నింపఁగా 'రాజా! నీసుతుని శీఘ్ర పునరాగమనంబును గోరుదువేని వానిని దూరము వెంబడింపరా' దని చెప్పి వానినుడిపిరి. అతఁడు స్విన్నగాత్రుఁడును విషణ్ణవదనుఁడునై ప్రామువలె నిలిచెను. వానిదృష్టిమాత్రము సుతుని వెంటఁబఱచెను.

చ॥ తనకులసంభవుండును నితాంతమహామహిమోన్నతుండు ధ
ర్మవిధుఁడునై త్రికంబయినరాజ్యముఁగూడఁ ద్యజించి వల్కలా
జినములు గట్టిఘోరవనవీథులకుం జోవుటఁ జూడలేమి నో
యన నినుఁడస్తమించె నపరాంబుధి శోకవిలీనమూర్తియై.

మఱియు వీతిహోత్రంబులు వ్రేలుట మానెను; గృహస్థులయిండ్ల పొయ్యి రాజదు. గజములు కబళింపవు; గోవులు వత్సంబులఁ గుడుపవు; జ్యేష్ఠకుమారునకుఁ దల్లిసంతసింపదు; గ్రహమండలంబునఁ ద్రిశంకు కుజ బుధ గురువులును దదితర క్రూరగ్రహంబులును వక్రించి దృష్టిచేతఁగొన్నియు సంయోగంబునఁ గొన్నియుఁ జంద్రుని బొందెను. నక్షత్రంబులు నిస్తేజములై మినుకరింపసాగెను. కోసలదేశాధిదేవతయైన విశాఖానక్షత్రము ధూళిధూసరమై కాన్పించెను. కాళికానిలవేగంబున మహోదధివోలె రామనిర్గమనదుఃఖావేశంబున నగరమెల్ల వ్యాకులమొందెను. చంద్రునినైసర్గిక సౌమ్యదర్శనము మాసెను.

అంతలోన రథధూళి సన్నగిలి సమసిపోయెను. దశరథుఁడు దుఃఖహతుఁడై నేలఁగూలెను. కౌసల్యవాని దక్షిణహస్తంబును [illegible];

కైకేయి వానియెడమచేతిఁ బట్టుకొని లేవనెత్త నుంకించెను. దశరథుఁడామెనుఁ గ్రూరదృష్టిఁ జూచి దుష్టా ! నాయంగకంబులు తాక వలదు; మిత్త్రివిగాని నాకు భార్యవుగావు; అర్థంబునకుగా ధర్మంబును దిగ మ్రింగురక్కసివగుట నేఁడుగంటిని. నీకును నాకు నింతతోసరి; రాజ్యప్రాప్తికి భరతుఁడు సంతసించునేని వాఁడిచ్చుజలతర్పణంబులు నాకుఁ జెందకుండుఁగాక' యని పలికి వామకరంబును విదిల్చి లాగికొనెను. కౌసల్య మెల్లగా వానిని లేవఁదీసి యింటికి మరలించెను. దశరథుఁడు సారెసారెకు రామునిఁ దలఁచును; అడుగడుగునకు మరలిమరలి చూచును; నిప్పుతొక్కినట్లు తపించును; గుఱ్ఱములజాడలుగాంచి 'హా! రామా!' యని సొమ్మసిల్లును. 'హా! జనకరాజతనయా!' యని వాపోవును. 'అయ్యో! చందనచర్చలఁ జెమరాకు వీవనల మృదుతల్పంబుల హాయిగాంచు నాపుత్త్రరత్నము పెంధూళిఁ బ్రుంగుచు దవానలకీలలఁ గ్రాగుచుఁ గటికతానేలలఁ బరుండుచు దినములు గడపుటయ్యెఁ గదా' యని వెక్కివెక్కి యేడ్చును. 'జానకీ! మృదుపదవసనంబులపయినేని పొక్కి జాజువాఱు నీయడుగుతమ్ములు సూచికాగ్రశిలాతలంబుల నెట్లు నడయాడ నేర్చునో' యని వెచ్చనూర్చును.

కౌసల్యావిలాపము.

దశరథుఁడట్లు పరిపరివిధంబుల వాపోవుచు మెలమెల్లగా నగరము ప్రవేశించి యందుఁ జతుష్పథంబులు నిర్జనంబులగుటయు గృహద్వారంబులు నిరలంకృతముగా నుండుటయు విపణిశ్రేణికలు నిమీలితములగుటయు దేవాలయంబులు మూయఁబడియుండుటయుఁ జూచి వెల్లువిలపించి సూర్యుఁడు మేఘమండలాంతరమునఁ బోలె నిజమందిరాంతరముఁ జొచ్చి 'కౌసల్యా! నీ యింటికి నన్నుఁ గొనిపొమ్ము; ఒండుచో నూఱటగల్గదనెను. ఆమె యట్లొనర్చి మెత్తనిపాన్పుపయి వానిఁ బరుండఁబెట్టి యుపచరించుచుండెను. అతఁడందుఁ దొడగ్గువలెఁ బడి రామలీనహృదయుఁడై యంతస్తాపంబును బాష్పధారారూపంబున వెలిపుచ్చుచు నర్ధరాత్రమైనను గనుగూర్కక 'హా! పుత్త్రా! నన్నుఁ ద్యజించితివా?' యనుమాట దక్క నొండుపలుకక దుఃఖించి దుఃఖించి, చెంతనున్న భార్యనుఁబిలిచి 'దేవీ! రాముని వెంటఁజన్న

నాదృష్టి యట్లేయున్నది ; చేరువనున్నను నీవు కానరావు ; మంగళకరమైన నీకరంబున నన్నొకింత స్పృశింపు' మనెను. ఆమె యట్లేయొనర్చి సుతుని దలంచి తలంచి యేడ్చుచు 'కటా ! త్రాఁచువలెఁ గైకేయి పొంచిపొంచి నా బిడ్డను గఱచి విసముఁ గ్రాసి కుబుసము వదలెను. ఆయింతికోరిక లీడేరెను. దానితాపము చల్లారెను. ఇలుజొచ్చినపాముపగిది నిఁక నన్నెంతగాఱించునో తెలియదు. అయ్యో ! నాపట్టిని గుట్టలకు దోలుటకన్న నింటనేయుంచి భరతునకు దాస్యమొనర్చునట్లు కోరరాదా ? నాకూన నాకంటియెదుట నుండును ; అంతతో సంతసింతును గదా. నాథా ! పర్వకాలంబున దేవతల హవిర్భాగంబును రక్కసులకు నాహితాగ్ని యిచ్చుకరణి రాముని రాజ్యంబును వానిపట్టాభిషేకసమయంబున గైకేయి కిచ్చితివి. అంతతో నప్పాలఁతి తనియదయ్యెను దానితృప్తికిఁగా నాముద్దుపట్టిని ఘోరమృగాఖిలకాననాంతరములకుఁ బఱచితివి. అదియు నొండు రెండేండ్లు గాదు ; పదునాల్గు సంవత్సరంబులు. భోగంబులఁ దులతూఁగనగుయౌవన ప్రాయంబునఁ గొమరునకుఁ గోడలికి మునివృత్తి నిప్పించితివి. ఇష్టమృష్టాన్నములకు మాఱుగాఁ గందమూలంబులు పెట్టితివి. అయ్యో ! పదునాలుగేండ్లు గడపి నాపుత్త్రుఁడు మరల నింటికి రాఁజూచుభాగ్యము నాకుగల్గునా ? రామపునరాగమనసంతోషంబున ధ్వజపతాకములతో శోభిల్లుకలిమి నయోధ్యాపురము నోచెనా ? నగరోత్సవవేళల లాజప్రసూనంబులను రామునియౌదల గురిసి సంతసించుసంపద యీపురపురంధ్రీమణులకు మఱలఁ గలదా ? నాపట్టి వయోబుద్ధులఁ బరిణతుఁడైనను వానిని మూడేండ్ల కందువుగా భావించి లాలింతును. కటా ! పూర్వజన్మంబున స్తనంధయులనుఁ ద్రోపాడితినో, తల్లుల పాలిండ్లు త్రెంచితినో, ఏమహాపాతకమొనర్చితినో యాపాపఫలముగా నాకిట్టి పుత్త్రవియోగక్లేశము దాపరించెను. కైకా ! నోయరాని నోములునోచి పడరాని యిడుములుపడి కానక కన్న వరపుత్త్రుని గళ్యాణగుణరత్నాకరుని ధర్మస్వరూపుని రాముని నాయొడినుండి లాగి మిన్నులం పడ్డచోటు వైచితివి. నిదాఘభానుతాపము ధాత్రిని బోలె సుతశోకము నన్ను గ్రాచుచున్నది. హా ! దైవమా ! ఎట్లు జీవింతు; నని దురపిల్లెను.

సుమిత్ర కౌసల్య నోదార్చుట.

ఆమెపరితాపంబును సుమిత్ర చూచి నోర్వఁజాలక చెంతఁజేరి

'అక్కా! ఇంత వెఱ్ఱి యయ్యెదవా! మనరాముఁడు పితృవాక్యపరిపాలనరూపపరమధర్మంబు ననుష్ఠించి లోకాభ్యుదయ మొనర్పఁ జనెను. అందులకు సంతసించుటకు మాఱుగా విలపించెదవా! రాముఁడు మహానుభావుఁడుగాని యేతన్మాత్రుఁడుగాఁడు. వాని సేవ లక్ష్మణునకుఁ బూర్వపుణ్యఫలంబుగా లభించెను. జానకి పరమసుకుమారి, సుఖంబులకుఁ దక్క క్లేశంబులకుఁ దగదు. ఆబిడ్డ సంగతి యేమందు! పతివ్రతామణి కావున మన మెంత వారించినను వినక పతిననుగమించెను. ఎవనికీర్తిపతాక చిరస్థాయియై ముల్లోకంబుల శోభిల్లుచున్నదో, సత్యధర్మంబు లెవనివలనఁ బునః ప్రతిష్ఠితంబులై వెలయుచున్నవో యట్టిసీతనయునకు నెందును శుభమే యగును. వానికిఁ గీడు రానోపదు. రాముని శౌచంబునకు వెఱచి చండాంశుఁడు వానికి శీతకరుఁడగును; తదీయసుగుణంబులకు మెచ్చి వాయువు వానికి సుకరముగా వీచును; అతని యకళంకత్వంబునకు లజ్జించి మృగాంకుఁ డాత్మదోష పరిహారంబుగాఁ దుహినకరంబుల వాని నుపచరించును. ఇట్లు నవగ్రహంబులు వాని నెందున్నను సేవింతురు. మఱియుఁ జతురాస్య ప్రసాదిత దివ్యాస్త్రంబు లెందును వానిని గాపాడును. రామధనుష్టంకారధ్వని పాఱినంత మేర భూతబేతాళపిశాచాది దుష్టవర్గము నిలువనోపదు. ఇవియెల్ల మనకు ననుభవసిద్ధములేగదా. అట్టిమహాపురుషునకు భయము శంకింపనేల! పదునాలుగేండ్ల వియోగమందువా! అది లీలాప్రాయముగాఁ గడచనును. సూర్యునకు సూర్యుఁడును వైశ్వానరునకు వైశ్వానరుఁడును సిరికిసిరియుఁ గీర్తికిఁ గీర్తియు దేవతలకు దేవతయు భూతలంబులకు భూతంబును రాజులకు రాజునై పరమైశ్వర్యశక్తితో రాజిల్లు రాముని విరోధించి మనఁజాలు ప్రాణి భూనభోంతరాళంబులఁ గలుగదు. అక్కా! రాజ్యలక్ష్మి సీతతోఁ బంతగించియోయన రాముని వెంబడించెను. నీసుతుని విజయపూర్వకసుఖాగమనంబునకు నానందాశ్రువులు వర్షింతువు. నామాట తప్పదు. ఎవరు వాని తోడివారికి ధైర్యము పలికి సుఖముండు' మని బహువిధంబుల నూరార్చెను.

### రాముఁడయోధ్యావాసుల నూరార్చుట.

అటు రాముఁడు తనరథంబునుదఱిమివచ్చుచున్న యయోధ్యావాసులఁజూచి 'మీరిట్లుగావించుట నాకు సంతసము గాదు. నాయందలి మీ

గౌరవాదరంబులను భరతునియెడఁ జూపి నాకుఁ బ్రియమొనర్పుము. నా తమ్ముఁడు కళ్యాణచరిత్రుఁడు; అతఁడు మీకు సమస్తహితములు గూర్చును. ప్రభుత్వంబునకు వలయు జ్ఞానవృద్ధియు మృదుమధురపరాక్రంబును వాని కెంతయుఁ గలవు. వానివలన మీకు భయము గోరంతగూడఁ గలుగదు. గుణలక్షణాదులను జక్కఁగాఁ బరీక్షించి వానిని యువరాజుగా నియమించిరి; రాజాజ్ఞ నుల్లంఘింపరాదు. ఉల్లంఘించుట ధర్మవ్యతిరేకమే గాక రాజ తిరస్కారము గూడనగును. అయోధ్యావాసు లట్లొనర్పనేరరు. ఇది యునుగాక మహారాజుగారు నావియోగంబునకుఁ బురపురఁ బొక్కుచు న్నాఁడు. ఇట్టితటి మీరు వానికి నుపశాంతి గూర్ప నొప్పును. అట్లు సేయక నావెంటవత్తురేని తీనిదుఃఖంబు నినుమడింతురు. అది భయావహ మగును. నామాట విని మీరు మరలి యయోధ్యకుఁ బోయి తీని నా రార్చి నాకుఁ బ్రియమొనర్పుము' అని సవినయంబుగా వారిని బ్రార్థించెను. రాముఁడట్లు విన్నవించుకొలఁది వానియందుఁ బ్రజలకు ననురాగము పెం పొందసాగెను. వారు కన్నీరు గార్చుచు గుణబద్ధులు వోలె వానిని వెంబ డింపసాగిరి.

వృద్ధ బ్రాహ్మణులు రామునివెంటఁబడి వేడుట.

మఱియు జ్ఞానవయోవృద్ధు లగు బ్రాహ్మణులు హుటాహుటి నడువ లేక రథంబునకు దూరమై ముదిమివలన వడఁకుచున్న తలలతో 'ఓరామ వాహనములారా! మామాటమీఱుట జాత్యశ్వంబులకుఁదగదు; మరలుఁడు; మీ ప్రభువునకు హితమొనర్పుడు. నిసర్గదీర్ఘశ్రవణపుటంబులుగల మీకు మాకేకలు వినరావనుట నమ్మరాదు. ఎవఁడు పరమధార్మికుఁ డని త్రిశుద్ధిగ నొక్కి చెప్పఁగలమో, ఎవనిచిత్తశుద్ధి యద్వితీయమో, ఏరాతి వీరుఁడనియు శుభగుఁడనియు మహాదృఢవ్రతుఁడనియు నెవని నిశ్శంకము గాఁ గీర్తింతుమో యట్టిరామునిఁ బట్టణాంతరముల నూరేగించుట మీకగుఁ గాని వనాంతరములకుఁ గొనిపోవఁ దగునా?' యని యార్తాలాపంబులు గావించిరి.

వారి యార్తధ్వనులు రాముని ముందునకు సాగనీయవు; వ్రతభంగ భయము వానిని మరలనీయదు. అట్లురాముఁ డురియాడుచున్న మనంబుతో

రథంబునుండి దిగి యాముదుసలులు కలయవచ్చుటకై మెల్లగా నడువఁజొచ్చెను. అతఁడట్లు రథము దిగియు నిలువక చనుట వారు గాంచి భ్రాంతి సంతాపంబులంది 'రామా! నిలు నిలు; ఇంతకన్న వడిగాఁ రాఁజాలము; ముదిమికిఁ దోడుగా మామూఁపు లెక్కియున్న యగ్నిహోత్రంబులభారము మమ్ముఁ గదలనీయదు. నాయనా! ఎండవేడిమికిఁ దాళఁజాలవు. ఇదిగో వాజపేయయాగంబున మేము పడసిన శరన్మేఘశ్వేతచ్ఛత్రంబులు నీకుఁగాఁ దెచ్చుచున్నాము. వత్సా! వేదమంత్రంబులఁ దవిలియుండు మాబుద్ధి నేఁడు మమ్ముఁగాదని నీవెంట వనంబునకుఁ దరలెను. మాపరమధనంబులైన నిగమంబులను స్వాత్మపేటికలందుఁ బదిలపఱచి, మాభార్యలను రక్షణార్థము పాతివ్రత్యంబునకు నప్పగించి, నిన్ను మరలించు నిశ్చయముతో వచ్చితిమి. ముదిమివలన హంసశుక్లంబులయ్యు దుఃఖాతిరేకంబున నేలఁబడి పొర్లాడుటంజేసి ధూళిధూసరంబులైన శిరోరుహంబులుగల మాతలలతో నీకు మ్రొక్కి వేఁడుచున్నాము. మరలుము మరలుము. అర్థిజనవరదాన దీక్షారతుండవు నీవీధర్మంబు నుపేక్షింతువేని మఱి యేధర్మంబు నపేక్షింతువు? ఇదిగాక పెక్కండ్రు బ్రాహ్మణులు యాగసంభారములతో నయోధ్యకు వచ్చియున్నారు. నీవువచ్చినగాని వారిజన్నములు సాగవు; యజ్ఞవిఘ్నకారివి కావలదు. రామా! నీరాకను మేముమాత్రమేగాదు చరాచరభూతవర్గమెల్లఁ గోరుచున్నది. అదిగో చూడుము. వృక్షంబులు నిన్ను తజ్జిమరలింపనెంచి విసరివిసరి వీచుచుఁ దమమూలంబులు కదలమింజేసి దుఃఖించుచు నిజవ్యసనంబును వాయువేగజనిత ధ్వనిరూపంబునఁ దెలుపుచున్నవి. పక్షులు చేష్టాహారసంచారంబు లుడిగి వృక్షైకస్థాననిష్ఠితములై మునివృత్తిఁబూని సర్వభూతానుకంపహృదయుని నిన్నుఁ బ్రార్థించుచున్న [illegible]యనఁ దోచుచున్నవి. ఆర్తులప్రణయములను నిరసింపరాదని వివిధగతుల మొఱలిడెను. వారికిఁ దోడ్పడుటకోయన నంతలోనఁ దమసానది యడ్డమయ్యెను. అంత రాముఁడు సారథిని బిలిచి 'అశ్వములు బడలియున్నవి. రథమువిచ్చి వానిని బొర్లాడించి నీరుత్రాపి యొడలుకడిగి నదీతీరంబున నలాయింపు' మనెను. అతఁడట్లు గావించెను.

వనవాస ప్రథమవాసరము.

రాముఁడు సీతాలక్ష్మణులనఁజూచి 'మనవనవాసము[illegible] నిది మొదటి

వినము. అవిగో వినుము; అరణ్యములు మృగపక్షిధ్వనులముఖంబున మనకు స్వాగతమిచ్చుచున్నవి. తమ్ముఁడా! అయోధ్యావాసులకు మనయెడఁగల యనురాగమెట్టిదో వారి యనుతాపము తెలుపుచున్నది. తలిదండ్రులు కన్నీరొలికియొలికి యంధులగుదురేమోయని భయమగుచున్నది. అయినను ధర్మాత్ముఁడు భరతుఁడు గలఁడు; అతఁడు వారినూరార్చును. లక్ష్మణా! నీవు నావెంటవచ్చుట యెంతో మేలయ్యెను. నీవురానిచో వైదేహీసంరక్షణార్థము పరసాహాయ్యమపేక్షితమై యుండును. నాయనా! వన్యాహారములు పెక్కుగలవు; ఏదియు నామదినొరదు; నీవింత గ్రోలి యీరాత్రి గడపుము' మనెను.

అంతలోన సూర్యుఁడ స్తమించెను. ఎల్లరుఁ గాలకృత్యములు దీర్చి వచ్చిరి. లక్ష్మణుఁడును సుమంత్రుఁడును బర్ణశయనంబు లేర్పఱచిరి. అందు సీతారాములు శయనించిరి. వెంటవచ్చిన నగరవాసు లందఱుఁ బయిండి మార్గశ్రమంబునఁ గొంతవడికి నిద్రించిరి. సౌమిత్రి సుమంత్రులకు మాత్రము కనుగూర్కుదయ్యెను. రామ గుణాభివర్ణనంబులతోడ వారికి రేయెల్లఁ గడచెను.

రాముఁడు పురవాసుల నేమరించి చనుట.

రాముఁడు వేఁకువనే నిద్రలేచి వృక్షంబులక్రిందఁ బడియున్న నగరవాసులను గాంచి లక్ష్మణుని బిలిచి 'తమ్ముఁడా! మనయందలి యనురాగము వీరినింతదూరము లాగెను. వీరు తమ యిండ్లు వదలివచ్చి యిట్లుండుటఁ జూడఁజాలను. మనలను మరలింపవచ్చిన వీరి మనోనిశ్చయమంత సులభముగా మాఱదు. ప్రాణంబులనుగూడ వీరు లెక్కించునట్లు దోఁపదు. వీరు మేల్కొనకమున్నె యిందుండి మనము చనుట యుక్తము. అట్లుగావింతుమేని వీరు మనలను గానక తుదకు స్వగృహంబులు చేరుదురు. అనురక్తులకు వృథాదుఃఖము గలిగింపరాదు.' అని చెప్పెను. లక్ష్మణుఁడు వల్లె యనెను. సుమంత్రుఁడు రథము నాయత్తపఱచెను. అంత వారు రథము మీఁదఁ దమసానదిని దాటి యొడ్డుచేరిరి. రాముఁడు సుమంత్రునితో 'సారథీ! మేము రథము దిగి యీమార్గంబున వచ్చి నిన్నుఁ గలసికొందుము. నీవు రథంబు నుత్తరముఖంబుగాఁ గొంతదవ్వు గొనిపోయి మార్గాంతరమున

దానిని గొనిరమ్ము. నగరవాసులు మేల్కాంచి జాడలుపట్టి మనము మరలి యయోధ్యకుఁ జన్నట్లు భావించి పట్టణమార్గముఁ ద్రొక్కి యిల్లుఁజేరుదురు. ఏమార్చినఁగాని వారు మనలవదల' రనిచెప్పి, సీతాలక్ష్మణసహితంబుగా రథము డిగి దారిపట్టెను. సుమంత్రుఁ డట్లుగావించి రథమును మరలఁ దోలితెచ్చెను. రామాదులు రథమెక్కి ప్రయాణమంగళార్థము నాలు గడుగు లుత్తరముగాఁ జని తపోవనమార్గముఁ ద్రొక్కిరి.

### పౌరులు రామునిగానక యిల్లుచేరుట.

పౌరులు లేచి రామాదులను గానక నలుదెసలు వెదకివెదకి వేసారి శోకోపహతులై 'కటా! పాడునిద్రకుఁ జిక్కి యీవిపత్తుఁ దెచ్చికొంటిమి. రామా! నీభక్తులనిట్లు విడనాడుట పాడియగునా? అయ్యో! మాయిలు వేల్పు మమ్మెడసెను; ఇఁక బ్రదుకనేల? ప్రాయోపవేశమో మహాప్రస్థానమో మనకు శరణమగుఁగాక. అయ్యో! అయోధ్యకుఁ బోరాదు. కన్నవారెల్ల రాము నడుగుదురు. అడవికి వాని నప్పగించి వచ్చితిమందుమా? ఆమాటచెప్పి పురజనులనెల్లఁ గలంచుటకన్న యిందే మడియుట మేలు. చితుకులు గలవు; చితిపేర్చి యందుఁజొచ్చి కడతేరుద'మని వివిధగతుల వటువటించుచుఁ దేరిజాడనుగాంచి పేరాసతోఁ గొంత దవ్వు చనిరి. ఆవల జాడలు గానరాకుండెను. 'కటా! దైవము దాయయయ్యె' నని నిరాశ చెంది వారు మరలిరి. ఎంతనడచినను దారిసాగదు. ఎట్లో వారిల్లుఁజేరిరి.

### రాముని వదలివచ్చినందులకుఁ దమపతులను బౌరస్త్రీలు కోపాడుట.

అట్లు వచ్చినవారికి వారిభార్య లెదురేగి సంగతివిని 'రాముని వదలి వచ్చినవారికి వాలుబిడ్డలేల? లక్ష్మణుని జూచియేని స్వధర్మంబును గ్రహింపరా? సీతారాముల నుపచరించుటకన్న వేఱు భాగ్యము గలదా. నదీనదసరోవరంబులు వారి స్నానపానంబులఁ బవిత్రీకృతములుగా నున్నవి; వృక్షంబులును సానుమంతంబులైన పర్వతంబులును వారికిఁ బ్రియాతిథ్యసత్కారంబులొనర్చి శుభములు పడయనున్నవి. పొదరిండ్లు భ్రమరఝంకారస్తుతులొనర్చి ప్రసూనభారనమ్రంబులైన వల్లికాహస్తములతో వారికిఁ బుష్పాంజలులొసంగి కృతార్థతనొందును. ఋతువులకాలపుష్పఫలార్ఘ్యంబు

లిచ్చి స్వధర్మంబును రక్షించుకొనును. జడంబులు సయితమిట్లు రామారాధనంబునకు నువ్విళ్లూరుచుండఁగా మీరెట్లు వారిని వదలివచ్చితిరి! అయ్యో! మాకెంతయు సిగ్గయ్యెడు. ఇదిగో మేముఁగూడ వచ్చుచున్నాము. దరలుము. జాగువలదు. రాముని మీరును సీతను మేమును సేవించి జీవితసాఫల్యము నొందుదము. రామునితోడ ధర్మము వలసపోయెను. ఆ ధర్మదేవత కోసలరాజ్యంబునఁ గాలూనదు. ఇటనుండుట పాడిగాదు. కావలియున్నను కైకేయీదాస్యంబునకుఁ జేతులొగ్గుటో ప్రాణమానంబులు వదలుటో తప్పదు. ఇంతకన్నఁ జచ్చుటేమేలు. మీరు క్షీణపుణ్యులరు గావున దరిద్రదేవతాగ్రస్తులై మహానుభావుని రాముని వదలి యీపాపనగరముఁ జొచ్చితిరి. ఆకలిదప్పులకు వెఱచివచ్చితిరా! ఇందుండి పాతకాన్నము తిని మనుటకన్న దేశాంతరమున విసము ద్రావి చావరాదా! కటా! ఈ కపటనాటకసూత్రధారుఁడు దశరథుఁ డెట్టిపాటు గాంచునోగదా. అయ్యో! రామా! నీనగుమోము మరలఁగాంచు కలిమి మాకుఁగలదా! నీమృదువచనంబుల విననోచుదుమా! నీమధురాకారంబును సందర్శించు భాగ్యము మాకున్నదా! ఆరణ్యకములకు నీపరమసేవాభాగ్యంబును గూర్చ మమ్మువదలితివా!' యని పలువిధంబుల వారిమనస్తాపంబులను వెల్లడించిరి. వారిదుఃఖపటలమోయన నంతలోన ముంజీఁకట్లు గప్పెను. నగరమెల్ల శోభాపరిద్రాణమై తమంబున మునిఁగినట్లయ్యెను.

### రాముఁడు కోసలదేశంబును గడచి చనుట.

అటు రాముఁడు సీతాలక్ష్మణులవెంటఁగొని తెల్లవాఱులోన గడు దూరము చని సూర్యోదయముతోడఁ బ్రాతస్సంధ్య నుపాసించి పయనము సాగించి మార్గాంతర వనంబులను విలోకించుచు బీజాంకోపశోభాయతకేదారంబులఁ గాంచుచు నందందు గ్రామవాసులు గుమిగూడి కైకేయీదశరథులను గూర్చి పలుకువచనంబుల విననేవగించి హుటాహుటి నడచుచుఁ జని చని పుణ్యతోయవతియైన వేదవతిని గడచి శీతజలశోభినియగు గోమతిని దాఁటి హంసయుతమనోజ్ఞమైన స్యందిక నతిక్రమించి, సారథిని బిలిచి 'సుమంత్రా! పుష్పితవనవిలసితంబైన సరయూతీరంబునఁ దలిదండ్రులఁ గూడి మృగయావిహారాదులుగావించు భాగ్యము మఱలనాకెన్నఁ డొదవునో తెలియదు. ప్పగ

యావినోదంబులు రాజన్యులకుఁ దగవందువా! నీమాట కాదనను. గుఱికిఁగా రాజులకు వేఁట యొప్పును. మఱియు శ్రాద్ధాదులందు మృగమాంసంబు నవశ్యముగా గణింతురుగావునఁ దదర్థముగూడ వేఁట నంగీకరించిరి. ఈ కారణంబులఁజేసి నేను కొలఁది మాత్రమే వేటాఁడుచుంటిని. ఇఁక నా వేఁట యెట్టిదిగా నుండునో యూహింపరాదు?' అని సందర్భోచితంబుగాఁ బలుకుచు దారియందుఁ గానవచ్చు చిత్రంబులను సీతాదేవికిఁ జూపుచు క్రమక్రమంబుగాఁ గోసలదేశముఁ గడచి, యయోధ్యవంక మఱలి చేదోయి జోడించి 'కాకుత్స్థవంశరాజపాలితమైన యయోధ్యానగరమా! ఇదే నిన్ను రాముఁడు వీడ్కొనుచున్నాఁడు; చతుర్దశవర్ష వ్రతము సలిపి పితృఋణముఁ దీర్చి మగుడ నిన్ను సందర్శించు' నని పలికి, చూడవచ్చిన జానపదుల దెసఁ దిరిగి కుడిభుజమెత్తి 'సౌమ్యులారా! మీదయానుభావంబులు మఱువఁ జాలను; దుఃఖము దీర్ఘతరముగారాదు; ఇక మీరు చని మీపనులు చూచు కొనుఁ'డని చెప్పెను. వారు రామునకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి యశ్రుపూర్ణనేత్రంబులతో మఱలిరి. వారు చూచుచుండఁగానే రాముని రథము దృష్టికి దూరమయ్యెను.

పాడిపంటల సమృద్ధిని దెలుపు గోకుల కేదారంబులతోడ, రాజ్యమహాభ్యుదయంబును బ్రకటించు చిత్రనిర్మాణంబులతోడఁ, బ్రజాభోగైశ్వర్యంబులను జాటు వివిధోద్యానవనంబులతోడ, వేదప్రమాణబుద్ధిని వితరణశీలంబులను బ్రదర్శించు యాగశాలా యూపస్తంభములతోడ నిరంతర నిగమఘోషాప్రతిధ్వనులతోడ నిండి యలరారుచుండు దేశంబును వదలి చనుటకు హృదయమెంతో పరితపించును. దేశమునేగాక దేశాధిపత్యమునుగూడఁ ద్యజించుట యెంతకష్టమో యూహింపనగును. అట్టి దేశమును దేశాధిపత్యమును సమస్తబంధువర్గమును వదలి చతుర్దశవర్ష వనవాస శిక్ష ననుభవింపఁ బోవుచున్నను రాముని చిత్తము కించన్మాత్రము గూడఁ గలంగదు. ధీరుల వృత్తమిట్టిదే గదా.

గుహునితోడి సమాగమము.

రాముఁడిట్లు కోసలము దాఁటి, శ్రీమహావిష్ణుచరణంబులనుండి జాఱి ముక్కంటి జటాజూటమం దవతరించి సముద్రునిగూడి త్రిలోక

పావని యనుఖ్యాతిని గాంచినదియు, తీరమందలి శ్రీమంతపుణ్యాశ్రమప్రదేశంబులవలన నిజమాహాత్మ్యంబును బ్రదర్శించుచున్నదియు, దేవదానవగంధర్వాది సంసేవితంబులయ్యు నిసర్గపారిశుద్ధ్యంబును బాయని తోయంబులవలన స్వాత్మనైర్మల్యంబును జాటుచున్నదియు, జలాఘాతంబులనెడి మహాట్టహాసంబులతో ఫేనపుఁ జిఱునగవులతోఁ బ్రవాహరూప దీర్ఘతరవేణితో శోభిల్లుచు రమణీయపులినతలంబులవలన నూత్నభావంబులను బ్రబోధించుచుఁ దీరస్థపుష్పితలతాదామసమలంకృత భుజాంతరయై ప్రసూనపరాగారుణంబులైన నీరంబు లాత్మీయానురాగవిభ్రమంబులను దెలుపుచుండఁగా సొబగారుచున్నదియు నైన గంగానదిని శృంగిబేరపుర ప్రాంతంబున సమీపించెను.

“సీ. నెగసినగానలేచి నింగియంతంతకు
నవ్వలఁ ద్రోవఁగఁ దనరారుదానిఁ
జాగినశాఖలాశాచక్రములకొలం
దులుబారవెట్టంగఁ బొలుచుదానిఁ
గవట లాఁకొంటితోఁ గదియుచు నెడములు
మ్రింగి ప్రబ్బంగ సొంపుమిగులుదాని
లోనిజొంపము పవలును జెనుఁజీకటి
నొదవించి పొదలంగనొప్పుదాని”

గీ. ద్విజకులారావిస్ఫూర్తి వెలయుదాని,
పథికవిశ్రాంతి యోగ్యమై పఱగుదానిఁ
దన్నదీతీరముననిల్చి తనరుదానిఁ
గనియె నింగుదీభూరివృక్షంబునొండు”

రాముఁడావృక్షముక్రింద నాఁడు నివసింపఁదలఁచి సీతాలక్ష్మణులతోడ రథంబునుండి దిగి తచ్ఛాయ నాశ్రయించెను.

అట గుహుఁడను నిషాదపతి యుండెను. వాఁడు రాముని రాక తనచారులవలన విని నిజకులవృద్ధులను మంత్రులను వెంటఁగొని యాచెట్టు కడకు వచ్చెను. రామలక్ష్మణులు వాని కెదురేగిరి. గుహుఁడు రామునిఁ గౌఁగిటఁ బొదివి ‘నా రాజ్యమెల్ల నీయధీనము; మేము నీబంట్లము; మమ్ముఁ

భావింపనగును. నీయట్టి యతిథిప్రియుఁడు మహాదుర్లభుఁడు; భక్ష్య భోజ్యంబులును శయ్యాదులును సిద్ధముగా నున్నవి; యథామతి స్వీక రించి బడలికలు వాయఁగు' మనెను. రాముఁడందులకుఁ బరమప్రీతుఁడై గుహునిఁ బునరాలింగనంబున గారవించి 'మిత్రమా! సుఖముందువా? బం ధువర్గమెల్ల లెస్సగదా. నినుఁజూచు భాగ్యము నాకు నేఁటికిఁ గలిగెను. నెచ్చెలీ! రాజ్యాదులు నాకేల? నీప్రీతియేచాలు. తండ్రిమాట సేయఁగా వనాంతరతపోనిష్ఠను గ్రహించి నారచీరలుగట్టి వచ్చితిని. ఫలమో మూల మో యింతచాలు; భక్ష్యభోజ్యాదులనొల్ల; గుఱ్ఱములు డస్సియున్నవి. వా నికిఁ గొంచెము మేఁత యిప్పింపుము. నాతండ్రి దశరథమహారాజునకు నియ్యశ్వరత్నంబులు మహాప్రియంబు' లనెను. గుహుఁడట్లు గావించెను.

అంతలోనఁ బ్రొద్దు గ్రుంకెను. రాముఁడు వల్కలము నే యుత్త రీయముగా ధరించి సాయంసంధ్య నుపాసించి లక్ష్మణుఁడు తెచ్చిన నీటిం గ్రోలి పాదప్రక్షాళన మొనర్చి యాచమించి నేలమీఁదఁ బరుండెను. వాని వెంబడి సీతాదేవియును శయనించెను. లక్ష్మణుఁడు కతిపయపదములఁదవ్వు చని రామరక్షార్థము ధనుష్పాణియై నిలిచియుండె.

### గుహలక్ష్మణుల సంవాదము.

గుహుఁడు వారి దుర్దశకు మిగులజాలిపడి లక్ష్మణుని డాయఁబోయి 'నాయనా! ఇట్టి కష్టంబులకు మేమగుదుముగాని నీవు తగవు; రామరక్ష ణార్థము రేయెల్ల మేల్కొనియుందుము; ఆతనికన్నఁ బ్రియుఁడు నాకుఁ గలుగఁడు. నామాట నమ్ముము. ఇదిగో నీపడకపఱచి మేను వ్రాల్చి నీవును నంత శ్రమవాయుము; వేఱు భావింపవలదు. నా ప్రియసఖుని గాపాడు సుకృతంబునకన్న మహాభాగ్యము నాకుఁ గలుగునా? రాముఁడు మాకెపుడుఁ బ్రసన్నుఁడైన సమస్తైశ్వర్యంబులు మాకు దక్కినట్లగును. నేను నా బంధువర్గముతోడ మిమ్ముఁ గాచియుందును. ఈవనదుర్గంబున నాయెఱుఁ గనిది లే' దని చెప్పెను.

లక్ష్మణుఁడు గుహుని వీని 'అనఘా! నీవు రక్షకుఁడవు కాఁగా మా కేటి భయముండునా? భయంబునఁ జేసి నేను మేల్కొనియుంటగాదు. రారాజు దశరథనరేంద్రుఁడు బహుకాలము నానామంత్రానుష్ఠానపూర్వ

కంబుగా ఘోరతపంబునఁ గ్రాఁగి ప్రియసుతుని నాయన్నను రాముని బడసెను. ఈయన యాగర్భశ్రీమంతుఁడు; జనకరాజసుత సీతాదేవి యెండకన్నెఱుంగదు. ఇట్టి కటికనేలఁ బడియుండఁ జూచుచున్న నాకంటికి నిదుర యెట్లువచ్చును! సుతవియోగ దుఃఖము మాతండ్రిని పెద్దకాలము మనసీయదు; కోసలావని యచిరంబ వైధవ్యమును బడయనున్నది; శుద్ధాంతము దుఃఖరోదనపరిశ్రాంతకాంతాశతమై మాటుమణఁగనున్నది; దశరథుఁడును కౌసల్యాసుమిత్రలును నేఁటిరాత్రిఁ గడతురాయని సంశయింతును. నాతల్లి సుమిత్రకు మఱియొక కొడుకుగలఁడు గావున నామె యొకవేళ జీవించినను జీవింపవచ్చునుగాని రామైకపుత్త్రిక కౌసల్యాదేవి జీవింపదు. మిత్రమా! ఈతలంపులు తెరతెరలుగా స్ఫురించి యేఁచి కలంచుచుండఁగా నాకు నిద్రవచ్చునా! మాతండ్రి రామపట్టాభిషేకమును సంకల్పించెనే గాని యదికొనసాగకమున్నె చనుచున్నాఁడు; పితృప్రేతసంస్కారభాగ్యంబును మేము నోచమైతిమి. నాతండ్రి జీవించియుండునంటివా! పదునాలుగేండ్లు జీవించునా? ఆలోన నేము రాఁజాలముగదా. మిత్రమా! చత్వరసంస్థానమనోహరంబును హర్మ్యప్రాసాదాభిరామంబును రథగజాశ్వసమృద్ధంబును సర్వకల్యాణమనోజ్ఞంబునైన యయోధ్యానగరంబును మాతండ్రి జీవితకాలములో మఱలమేము ప్రవేశించు కలిమి మాకుఁగలదా!' యని గద్గదస్వనంబున నుడివెను. ఆవచనంబులకు గుహుఁడు జ్వరాతురనాగంబుబోలె వ్యథావ్యగ్రాంతరంగుఁడై బాష్పములునించెను. అట్లా రేయియెల్ల లక్ష్మణునకు స్వపరిదేవంబులతోఁ గడచెను.

రాముఁడు సుమంత్రుని మరలని వీడ్కొనుట.

రాముఁ డంతలోన లేచి 'లక్ష్మణా! అదిగో కృష్ణకోకిల కూయుచున్నది; కేకిధ్వనులకు వనమెల్ల మాఱుమ్రోయుచున్నది. భగవతి రాత్రి గడచెను; సూర్యభగవానుఁ డుదయించుచున్నాఁడు. గంగాప్రవాహము మహోద్ధతిమున్నది; ఎట్లయినను నదిని దాటుద' మనెను. లక్ష్మణుఁ డా సంగతిని గుహునకుఁ దెలిపెను. ఆనిషాదపతి తనమంత్రులకు నాజ్ఞాపించి తరణయోగ్యమగు నావను సిద్ధపఱచెను. రామలక్ష్మణులు ఖడ్గకవచతూణీరంబులు ధరించి సీతాసమేతముగా రేవునకుఁ దరలిరి.

వారట్లు నావఁ జేరినంతట సుమంత్రుఁడు సమీపించి కేలుమోడ్చి యాజ్ఞ వేఁడెను. రాముఁడు వానినిఁ దనదక్షిణహస్తంబునఁ దడవి సుమంత్రా! ఇందాక రథముమీఁద నన్ను గొనివచ్చితివి; ఇఁకఁ బాదచారినై చనుదు. నీవు శీఘ్రముగా నయోధ్యకుఁబోయి మహారాజునొద్ద నప్రమత్తుఁడవై యుండు' మనెను. సుమంత్రుఁడు దుఃఖాశ్రువులు నించుచుఁ 'ప్రాకృతుఁడువోలె నిల్లాలినిఁ దమ్ముని వెంటఁగొని వనవాసము సలుపనున్న నీయీదుర్విపాకంబు నెవ్వరును దప్పింప లేరైరిగదా. బ్రహ్మచర్యవ్రతంబును గఠినంబుగా నాచరించితివి; ఆఫలోదయము వేదాధ్యయనంబును సలిపితివి; దయార్జవంబులకు జన్మస్థానమనిపించుకొంటివి; అట్టి నీకే యిట్టి యిడుమలు కలుగఁగా సద్గుణముల ఫలమేమి? ఇఁక వాని నెవరు గారవింతురు? రాఘవా! నీకుఁ ద్రైలోక్యవిజయలక్ష్మి చేకూరుఁగాక. మాగతి యందువా? నీచేత విడువఁబడి పాపిష్ఠురాలగు కైకేయి బారిఁబడి దుఃఖంబులకు నప్పగించుకొంటిమి. ఇంతకన్న దుర్గతి మాకు రాదని యెలుఁగెత్తి యేడ్చెను.

రాముఁడతనిఁ జూచి 'సుమంత్రా! ఐక్ష్వాకులకు నీపాటి నెచ్చెలి గలుఁగఁడు. డీలు పడవలదు. మహారాజు నన్నుఁ దలఁచి తలఁచి దుఃఖించుచుండును. ఆయన వ్యసనంబు నెట్లేని మాన్పుము. నా తండ్రి ముదుసలియుఁ గామభారావసన్నుఁడును గావున నింతగాఁ జెప్పుదును. రాజాజ్ఞకు నెదురుండరాదు. అభీష్టనిరాతంకసిద్ధికిఁగదా రాజులు రాజ్యాలు పాలించుట సుమంత్రా! పరమపూజ్యుఁడును వృద్ధుఁడును దుఃఖమెట్టిదో యెఱుఁగనివాఁడు నైన నా తండ్రికి నావలన నింతశోకము గలుగుటకుఁ జింతయగుచున్నది. నాకుఁగా నీవు వానికి నమస్కరించి యయోధ్యానిరాకృతులమని గాని వనవాసశిక్షితులమని గాని మేము చింతించుట లేదనియుఁ బదునాల్గువత్సరములు పుచ్చి వచ్చి సందర్శింతుమనియు, భరతునకు వెనువెంటనే రాజ్యముఁగట్టి వానిని గద్దెఁగెట్టఁ గూర్చుమనియు నందువలన దుఃఖమొకకొంత చల్లాఱుననియు నా విన్నపముగా నెఱింగింపుము. సుమంత్రా! భరతుని బిలిచి తండ్రియొడ నెట్లో తల్లులయొడఁగూడ నట్లే యభేదభావముతో వర్తింపుమని చెప్పుము. కైకేయి తనకుఁగన్నతల్లియెట్లో కౌసల్యాదేవి నాకునట్లే గన్నతల్లి యగుట మఱువవలదనుము. జనకుని యాజ్ఞను దలఁదాల్పుమనుము.

తండ్రి ప్రతికేని రాజ్యభారమును వహింపుమనుము.' అని చెప్పెను.

సుమంత్రుఁడామాటలువిని 'రామా! మాలిమివలన జంకుమానియెద విచ్చి పలుకుచున్నాను; ఉపచారార్థముగాదు. నాయీయవినయంబును మన్నింపవలెను. నీవియోగకారణంబున నయోధ్య పుత్రశోకవ్యాకులయై యున్నది. నిన్ను విడిచి యచ్చటకు నేనెట్లు చననేర్తు! నిన్ను రథము పయిఁగూర్చుండఁబెట్టికొని వచ్చితిని. ఇది యయోధ్యానగరమెల్లఁ గన్నారఁ జూచెను. వట్టిరథమును గొనిపోయనేని వారికి గుండియలు వ్రీలును. నిరంత రము హృదయాంతరములఁ బ్రతిబింబించుచుండు నిన్ను నేఁడయోధ్యా వాసులు గానక యెంతకుందుదురో యూహింపుము. వారిఁక నాహారములు మాని నీవుండే యాత్మల నిల్పి జీవితశేషములఁబుత్తురుగాని యొండుసేయరు. మాబోంట్లసంగతి యటుండ నిమ్ము. నీతల్లికేమని చెప్పుదు! మేనమామ యింటి వదలివచ్చితినని బొంకుదునా! గుట్టలపాలొనర్చి వచ్చితినందునా! ఇంతయేల? నీవులేనిదే యీగుఱ్ఱములు గదలునా! రామా! నిన్ను వదలి యయోధ్యకుఁ బోఁజాలను; నీతోడవత్తును; అనుజ్ఞయిమ్ము. నామొఱాల కింపవేని నరకంబుగా నగ్నికి నర్పించుకొందును. రామా! ఇందాఁక నీ సారథ్యభాగ్యమనుభవించితిని; ఇఁక నీసేవాసంపద నభిలషింతును. దుష్కృ తునకు స్వర్గమువోలె నిన్ను విడిచినట్టినాకు నయోధ్యానగరము దుర్ప్రవేశ మగును. ఏరథమువీఁద నిన్ను వనవాసార్థము తెచ్చితినో యారథము మీఁదనే నిన్ను నీవనవాసానంతర మయోధ్యకుఁ గొనిపోవ నెంతయుఁ గోరు దును. నామనోరథముఁ దీర్చి నన్ను ధన్యునొనర్పుము. నీతోడనున్నచోఁ బదునాలుగేండ్లు క్షణప్రాయమగును. నిన్నువిడిచినచో నాకవి పదునాల్గు యుగంబులగును. భృత్యవత్సలా! నీకెంక మొఱ నిరసింపవలదు' అని వ్యసనకషాయస్వరంబునఁ బలికెను.

రాముఁడు వానితో 'సుమంత్రా! నీభృత్యవాత్సల్యము నాకుఁ గ్రొత్తగాదు. కొండొక ప్రయోజనంబును గోరి నిన్నయోధ్యకుఁబంపు చున్నాను. నిన్నుఁగని నాపినతల్లి కైకేయీదేవి వనవాసమును నమ్మును. నాతండ్రిని గూర్చిన యామెశంక తీఱును; భరతునకుఁ బట్టముఁగట్టుమను; ఆమె కభిమతార్థము సిద్ధించును. మాతండ్రికి మాక్షేమసమాచారముఁ దె

దెలిపి వానికి మనశ్శాంతిఁ గూర్తువు. ఈకారణంబులు మదినిడికొని నిన్నుఁ బంపుచున్నాను' అని చెప్పి యోదార్చి, గుహునివంక మఱలి 'మిత్రమా! జటాధారణార్థము మఱ్ఱిపాలు తెప్పింపుము; తపస్వివేషము మాకు మేలు సేయు' ననెను. గుహుఁడు వటక్షీరము తెప్పించెను. ఆపాలతో రామ లక్ష్మణులు జడలుదాల్చి నారచీరెలుగట్టి వైఖానసమతానుసారంబుగా వాన ప్రస్థాశ్రమము స్వీకరించిరి. అంత రాముఁడు గుహునితో 'మిత్రమా! రాజ్యసంరక్షణము సులభకార్యముగాదు; చతురంగబలంబులను జక్కఁగాఁ గాపాడుము; కోశవిషయంబునఁ బరాకు చెందవలదు. దుర్గమంబులైన జన పదంబుల నొకకంటఁ గనిపెట్టియుండు' మని పలికి సీతాదేవినిఁ బడవ యెక్కించి యామెవెనుక లక్ష్మణునితోడఁ దానెక్కి, యాత్మహితార్థము క్షత్రవర్ణయోగ్యమైన యారోహణమంత్రంబును 'దైవీ' మను దానినిబఠించి భార్యాసమేతంబుగా నాచమించి యథాశాస్త్రము గంగాతరంగిణీమతల్లికి పతీసహోదరులతోడ నమస్కరించి గుహునిని సుమంత్రుని వీడ్కొనెను. కలాసు లోలపాటలతోడఁ బడవను దరలించిరి

గంగావతరణము.

ఆతెప్ప నదీమధ్యంబునకుఁ జన్నంతట సీతాదేవి యాశైవలినికి నమ స్కరించి 'దేవీ! త్రిపథగామినీ! ఉదధిరాజపత్నీ! మంగళరూపే! దశరథ మహారాజాత్మజుఁడు చతుర్దశ వార్షికవనవాసంబునకుఁ బోవుచున్నాఁడు. మాకుఁ గుశలపునరాగమనంబు ననుగ్రహింపుము. మారాజ్యమును మఱలఁ జేరినంతట నీకు సహస్రసురాఘటంబులును మాంసభూతాన్నంబును సమర్పింతును; నీ తీరవాసులగు దేవతలను బూజింతు' నని ప్రార్థించెను. అంత లోన నావ దక్షిణతీరము చేరెను. రాముఁడు సీతాలక్ష్మణులతోడ దిగి డారిద్రొక్కి 'సౌమిత్రీ! ఎన్నడును మనము కాలూనని విజనప్రదేశంబు నకుఁ బోవుచున్నాము; ఆత్మరక్షణ మవశ్యము. మాకు రక్షకుండవై ముందు నీవు చనుమా; నీవెనుక సీతవచ్చును; మీయిరువురను రక్షించుచు వెనుక నేనువత్తును. అన్యోన్యపరిత్రాణము మనకిచటఁ గర్తవ్యము; కార్యము చెడినపిదప నవరింపరాదు; నిర్జనంబును క్షేత్రారామవర్జితంబును నిమ్నోన్నతంబును బ్రపాతమయంబునైన యీకాననమందు నివసించుట యెంతక్లేశ వంతమో సీతకు నవగతమగు' ననెను.

తొలిరాత్రి.

లక్ష్మణుఁడు ముందు నడచెను; వానివెనుక సీతయు నామెవెంట రాముఁడును నడచిరి. వారట్లు తరలి, 'యనవరత పదక్రమపఠ్యమానమహాద్విజవేదధ్వనులను అవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రస్వాహాశబ్దంబులను అనేక మునిగణప్రణీతవచన విషయవిభాగ వినిర్ణయ న్యాయనిపుణ విద్వత్సభాసంభాషణఘోషంబులను బ్రతిపక్షదుర్వాదభేదప్రమాణ విచార్యమాణ వేదార్థమీమాంసక గోష్ఠీవివాద నాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగ ప్రవీణులైన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తులైన యనుష్ఠాతలకును నధికతపోనిరతులైన తపోధనులకును నివాసంబుగానున్న, యప్పుణ్యనదీతీరముఁ బాసి పయనము సాగించి క్రమక్రమంబుగాఁ జని సస్యశ్యామలమగు వత్సదేశముఁ జేరిరి. వారికి నాఁకలి పెల్లిదమయ్యెను. రామలక్ష్మణులు పసుఁబోతు నేదుపందిని, దుప్పిని, నల్లచారలలేడిని వేఁటాడి తెచ్చిరి. ఆమాంసంబులు వండి యెల్లరు నారగించి విశ్రమార్థమొకవృక్షము నాశ్రయించిరి. సూర్యుఁడస్తమించెను. రాముఁడు సాయంసంధ్య వార్చి 'తమ్ముఁడా! మనదేశమును దాఁటితిమి; సుమంత్రుఁడు చనెను. మనవనవాసంబునకు నిదే మొదటిరాత్రి; సీతాయోగక్షేమములభారము మనపైనున్నది; రాత్రులందు బహుజాగరూకులమై యుండవలయును; ప్రొద్దుక్రుంకెను; పర్ణశయ్య నమర్చుకొనఁ దడవులేదు; నేఁటికి నేలమీఁదనే పరుందుద'మని యట్లుగావించి, 'లక్ష్మణా! మహారాజుగారు దుఃఖాతిశయంబునఁ జేసి నిద్రకుఁ బగదై యుండును. కైకేయి కృతమనోరథ గావున సూఱటు చెందియుండును; పట్టాభిషేకార్థము భరతుఁడు వచ్చును; ఇఁక నేని తేనికి నెత్తిపాటుపులు తీఱుఁగాక. తమ్ముఁడా! కామమెంత బలవత్తరమో కంటివా? కామవివశులను గష్టంబులంటియుండుటఁ జూతువా? కైకేయి నిరంకుశపథముఁ ద్రొక్కెను; కౌసల్యాసుమిత్రలకు మన్నిమిత్తంబునఁ బలుబాములు తప్పవు. నాతల్లి యవియెల్ల నోర్వకతీఱదు; సుమిత్రాదేవి నావలన దుఃఖభాగినియగుట సరిగాదు. మఱియు వారిదుఃఖమును విని యోదార్చువారును లేరు. తమ్ముఁడా! నీవేని యందున్న వారికిఁ గొంత యూఱట గల్గును. నామాటవినుము; ప్రొద్దునలేచి యయోధ్యకు జనుము; కౌసల్యను ధర్మజ్ఞుఁడైన భరతునకు నప్పచెప్పుము. అతఁడామెను రక్షించును.

నాతల్లి జన్మాంతరమున మాతాసుతులకు వియోగముఁ గల్పించియుండు. దానిఫలమిప్పుడు సంప్రాప్తమయ్యెను. దురంత దుఃఖమును మాటి గట్టు నాయట్టి దౌర్భాగ్యసుతు నేతల్లియు గనకుండుఁగాక. సౌమిత్రీ! మనము నాతల్లిని వీడ్కొనునప్పు డామె పెంపుడు శారిక తోడిచిలుకతో 'కీరమా! శత్రుపాదమును గొఱుకక విడువరా' దనుట మఱువవుగదా' యని హెచ్చరించెను. ఆమాట వింటివా? పక్షికిఁ గలంతజ్ఞానమేని నాకుఁ గలుగదు. తావన్మాత్ర ప్రియమేని నేను నాతల్లికిఁ జేయనైతిని. నాదియు నొక జన్మమా? మదేకపుత్రకను నాతల్లిని శోకసాగరంబున ముంచివచ్చి తిని. నాయట్టి మందభాగ్యుఁడుండునా? పరాక్రమించియున్నచో సమస్తముఁ జక్కఁబడియుండు నందువా? తమ్ముఁడా! ఇది పరాక్రమంబు నకు సమయముగాదు. కాకున్న మత్కోదండము ముల్లోకంబుల నుద్దండి కింపదా? అధర్మంబునకును బరలోకంబునకును వెఱచితిని; పట్టముకూడ నిరసించితి' నని పెద్దయుండదవు తనమనస్తాపంబును వెల్లడించి సుప్తక్రి మంటలారిన వీతిహోత్రునివలె నిర్వేగమొందిన సముద్రునిక్రియ నుండెను. లక్ష్మణుఁడు సంగతి గ్రహించి 'అన్నా! ఇట్లు నిరవధిక సంతాపసంతప్తుండ వగుట నీకుఁ దగదు. నీయనుతాపంబునకు మాయెదలు సందర్భము లగు చున్నవి. అన్నా! ఏయాజ్ఞయైనఁ జేయుదునుగాని యయోధ్యకు నన్నుఁ బొమ్మనిమాత్ర మాజ్ఞాపింపవలదు. నిన్ను వదల' నని యూనిపలికెను.

భరద్వాజాశ్రమము.

ఆరాత్రి యట్లు గడచెను; తెల్లవాఱె వారు కాలకృత్యములు దీర్చి తరలి యదృష్టపూర్వంబులును మనోజ్ఞంబులునైన నానాప్రదేశములు చూచు చుఁ బోసాగిరి.

"సీ॥ పద్మినీపద్మాతపత్రంబు శిథిలప
త్రాగ్రమైరాయంచ యాశ్రయించెఁ,
జాలుప్రవర్త్యైన జాలంబుతో ఘోణి
పంచలరోంపి గలంచియాడెఁ,
దూరోజ్ఞసద్భావ ధూమమంబువబుద్ధి
నెమ్మిలోపాదనుండి నిక్కిచూచె,

జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి
సామజంబిరుప్రక్కఁ జల్లుకొనియె,
గీ॥ సరసిపైనీరు సలసలదెరలె విపిన
సకలవీథులు నిర్మనుష్యములయ్యె
మిట్టమధ్యాహ్నమిది సుధామధురవాణి
యస్తమించెఁ బథశ్రమమపనయింప"

అని రాముఁడు ప్రియురాలికిఁ బల్కెను. అంతలోన గంగాసంగమము చేరవచ్చెను.

అటుకు ధూమధ్వజమొండు గానవచ్చెను. ఆచోటు భరద్వాజాశ్రమముగా నెఱిఁగి వారందుఁబోయి సమయము వేచి హోమక్రియాసమాప్తంబున నమ్మహర్షిని సందర్శించి తమకత విన్నవించిరి. భరద్వాజుఁడు వారిని యథావిధి సత్కరించి సుఖోపవిష్టులఁ గావించి 'రామా! చిరకాలమున కిందువచ్చితివి ; నిన్నుఁజూడఁ గంటిని. వత్సా! నీవివాసకథను వింటిని. ఎందో నీవు పోనేల ? గంగాయమునా సంగమస్థానమైన యీ చోటు మహాపవిత్రమైనది. మఱియు నిది వివిక్తము. ఇందు సుఖముండు' మనెను. అనవుఁడు 'ఋషిసత్తమా ! మీకెంతయు కృతజ్ఞుఁడనైతి. ఈ యాశ్రమము పౌరజానపదులకు సమీపముగానున్నది. ఇటకు వారుసులభముగా రావచ్చును. ఏకాంతవాసము జనకతనయకు సుఖావహమగును. అట్టితావు తెలుపవేఁడుదు' నని రాముఁడు వచించెను. భరద్వాజుఁడు వాని హృదయము గ్రహించి 'నాయనా ! ఇటకుఁ బదికోసులలోఁ జిత్రకూట పర్వతము గలదు. అది మహర్షిసేతంబును బుణ్యవంతంబును సుఖదర్శనంబునై గంధమాదనంబునకు సాటిచేయ నొప్పియున్నది. ఆనగము యొక్క శిఖరంబును దర్శించినంతనే సమస్తపాపంబు లుడుగును ; శుభకార్యోత్సాహ మంకురించును. అందు మహర్షులు పెక్కురు దీర్ఘతపములాచరించి సశరీర స్వర్గంబును గాంచిరి. అచ్చటి నివాసము మీకు నొప్పిదమైయుండు' ననెను.

అంతలోన రాత్రియయ్యెను. రాముఁడు భార్యాలక్ష్మణులతోడ నాఁటిరేయి యందుఁబుచ్చి ప్రభాతంబున ఋషీంద్రుని సం[illegible]చి '[illegible]

భావా ! రాత్రియిందు సుఖముంటిమి ; చిత్రకూటంబునకుఁ జనున్నాము; అనుజ్ఞయిమ్మ' నెను. భరద్వాజుఁడు వానిని దగ్గరకుఁ జేరి 'నాయనా ! అచ్చట వివిధవృక్షములు గలవు ; కందమూలములు కోరినన్ని యున్నవి ; అందలి సరిత్ప్రస్రవణంబులును దరీకందరనిర్ఝరిణులును జూడఁ జూడ నింపు గూర్చును ; మయూరరుతంబులు వీనులకు విందొనర్చును ; కిన్నరగానంబులకు వియమర యుండదు. అట నుచితాశ్రమంబును నిర్మించుకొని సుఖముండుము. శుభమగుఁగాక ' యని వారి నెల్ల మనఃపూర్వకముగా దీవించెను. సీతారామలక్ష్మణులు మహర్షికి మ్రొక్కి దారిపట్టిరి. జనకుఁడు సుతులను బలె భరద్వాజుఁడు వారిని గొండొకమేర సాగనంపి 'వత్సా ! రామా ! గంగాసంగమంబునకుఁ జని, యందుండి పశ్చిమముఖంబుగాఁ బ్రవహించుచుండు యమునానది యోరఁ గొంత దూరము పొమ్ము. రేవొండు గాన్పించును. అట తెప్పయెక్కి నదిని దాటుము. ఆవలిగట్టున శ్యామలంబను పేరి గొప్ప మఱ్ఱివృక్షము గలదు. ఆమహీరుహంబును సీతాదేవి నిజాభీష్టసిద్ధికై మ్రొక్కి ప్రార్థింపనగును. అట్లొనర్చి దానినీడఁ గొంతవడి విశ్రమించి బడలికలు వాయుము. అటుకుఁ గోసుమేర నల్లని కానగలదు. ఆ యరణ్యము పలాశబదరీవృక్షంబులతో నింగినొరయు వెదురుపొదలతోఁ గిక్కిరిసియుండును. ఆయడవి వెంబడిగాఁ జనుము ; చిత్రకూటమును జేరుదురు. ఈమార్గముఁ బెక్కుసార్లు నేనటుకుఁ బోయవచ్చితిని. దారి శిలాకఠినము గాక రమ్యముగానుండును ; కార్చిచ్చులబాధ గలుగ దని చెప్పి మఱల దీవించి మరలెను.

### యమునాతరణము.

సీతారామలక్ష్మణులు మహర్షిని శ్లాఘించుచు వాని సందర్శనభాగ్యంబునకు సంతసించుచు నమ్మహాత్ముఁడు చెప్పిన త్రోవఁ జని రేవు చేరిరి. అప్పుడు ప్రవాహము మహోత్తుంగతరంగభీకరమై యుండెను ; దాటుటకుఁ దెప్పయొక్కటిగూడ నందు లేకుండెను. అందులకు రామలక్ష్మణులు కొంత చింతించి యందందుఁబడియున్న కొయ్యలు సంతరించి వానిఁగూర్చి వెదుళ్ళ పఱచి వట్టివేళ్ళతోఁ గట్టి తెప్పను దయారుచేసి సుఖాసనార్థము నేరేడు కొమ్మలును బ్రబ్బలితీఁగెలును బఱచి సీతాదేవిని మొదట నెక్కించి యామె వస్త్రాభరణంబులను దమయాయుధంబులను బుట్టిక నందుంచి తామెక్కి

గడవేయసాగిరి. ఆ తెప్ప మెలమెల్లగా నడియేటిలోనికిఁబోయెను. సీతాదేవి యయ్యమునానదికి నమస్కరించి 'తల్లీ! భగవతీ! నిన్ను గడచుచున్నాము. మాకు మంగళమగుఁగాక. నాభర్త సుఖముగా నయోధ్యానగరము చేరినంతనే నీకు వేయిగోవులను పదినూర్ల సురాఘటంబులను సమర్పింతు; ననుగ్రహింపు' మని ప్రార్థించెను. మఱికొంతవడికిఁ దెప్ప దక్షిణతీరము దాఁకెను. వారందుండి దిగి వటవృక్షమునకుఁ జనిరి. వైదేహి యా భూరుహంబునకుఁ బ్రణమిల్లి భర్తకు సుఖవనవాససమాప్తంబును దనకుఁ గౌసల్యాసుమిత్రలతోడి పునస్సమాగమంబును బ్రార్థించి ప్రదక్షిణించెను. అంతవారచ్చటి సుంతతడవు విశ్రమించి పయనమైరి.

లక్ష్మణుఁడు ముందు దారి చూపుచుండెను. వాని వెనుక సీతయు నామెవెంట రాముఁడును నడవసాగిరి. మార్గంబునఁ గానవచ్చు ఫలపుష్పములను వైదేహి గోరిన వానినెల్ల రాముఁడు తెప్పించియిచ్చుచు నందందలి లతాపాదపంబులఁ గూర్చి యామె యడుగుదానికెల్ల సమాధానము సెప్పుచునుండెను. అట్లు వారు నదీతీరముఁబట్టి క్రోశదూరమేగి యొకచోట నిలిచిరి. లక్ష్మణుఁడు పోయి భక్ష్యంబులైన మృగంబులను వేఁటాడి తెచ్చెను. ఆమాంసంబున వారు క్షుధార్తిని బాసి రాత్రియగుటంజేసి యందే విశ్రమించిరి. సీతారాములు కనుగూర్కిరి. లక్ష్మణుఁడు వారిని గాచియుండెను.

### చిత్రకూటమున వాల్మీకిని సందర్శించుట.

విహంగధ్వనులు తెల్లవాఱుటఁ దెలిపెను. వారులేచి దినకృత్యములు దీర్చి దారిఁ బట్టిరి. విరియఁబూచి యాదీప్తంబులుగానున్న మోదుగవృక్షంబులును, నిండారఁబండిన ఫలంబులభారంబునకు నుఱ్ఱూతలూగుచున్న కిసిప్రాకులును వసంతకాలసమావేశంబును దెలిపెను. తేనెతెట్టెలు ద్రోణప్రమాణములై శాఖాగ్రముల వ్రేలాడుచు వింతమురువుఁ గొల్పుచుండెను. వనతలమెల్లఁ బూసెజ్జగాఁ దోఁచెను. వానకోయిలలకూఁతలకు నెమిళ్ళు బదులుకూసికూసి యలయుచుండెను. ఆ వినోదంబులనెల్ల రాముఁడు సీతకుఁ జూపుచుఁ గ్రమక్రమంబుగాఁ జిత్రకూటముచేరి, యచటి ఫలమూలసమృద్ధంబును సరసోదకంబును మనోహరలతాతరువితానంబును బరికించి యది తమకు వాసయోగ్యముగా భావించి, యా పర్వతంబునందున్న వాల్మీకి

మహర్షి యాశ్రమంబునకుం బోయి యామునీంద్రునకు మ్రొక్కి వాని స్వాగతసత్కారంబులంది తమవృత్తాంతంబును వానికి వినిచి యందుండ నిశ్చయించెను.

### పర్ణశాలాప్రవేశము.

లక్ష్మణుండు దారుసామగ్రిని గూర్చి పర్ణశాలను నిర్మించెను. రాముఁడంతఁ దమ్ముని బిలిచి 'నాయనా! వాస్తుశాంతిఁ గావింపక గృహప్రవేశ మొనర్చుట చిరజీవులకుఁ గారాదు. కృష్ణసారమాంసంబున గృహాధిష్ఠాతృదేవతల నారాధించుట శాస్త్రవిహితమేగాక యాచారము గూడ నైయున్న' దనెను. సౌమిత్రి తోడ్తోడంజని నల్లయిఱ్ఱిని వేటాడి తెచ్చెను. రాముఁడు తమ్మునిఁజూచి 'వత్సా! నేఁడు తిథిముహూర్తంబులు శుభస్కరంబులు గానున్నవి. జాగు సేయక యైణేయంబును బక్వము గావింపు' మనెను. సౌమిత్రి యట్లొనర్చెను. రాముఁడు స్నానమొనర్చి నియతుండై సత్రావసానికంబులైన మంత్రంబులు సంగ్రహముగా జపించి వాస్తుదేవతలను బూజించి వైశ్వదేవరౌద్రవైష్ణవబలులను సమంత్రకంబుగా నర్పించి వాస్తుశాంతికై పుణ్యాహవాచనాది మంగళంబులు సలిపి యథావిధి నదీజలంబులఁ దీర్థ మాడి సర్వపాపశమనంబు నుత్తమంబునైన బలి యిచ్చి యాశ్రమ యోగ్యంబుగా బలిహరణాది వేదికలును దేవాలయంబులును వీతిహోత్రగృహంబులు నేర్పఱిచి ఫలమూలమాంసంబులతో జలతర్పణంబులతో మంత్రజపంబులతో సమిత్కుశలతో శాస్త్రోపదిష్టంబుగా భూతతృప్తిఁ గావించి సీతాలక్ష్మణసమేతంబుగా గృహప్రవేశమొనర్చెను. అట్లు వారు పర్ణశాలయందు నివసించుచుఁ జిత్రకూటవినోదంబులవలనను మాల్యవతీ సైకతవిహారంబుల వలనను స్వపురవియోగాది వ్యసనంబుల మఱచుటయ్యెను.

### గుహుండు సుమంత్రుని వీడ్కొనుట.

అట గుహుండు రామాదులను వీడ్కొని సుమంత్రుని దనయింటికిఁ దోడ్కొని పోయి యథోచితమర్యాదల వానిని సత్కరించి మూనాళ్ళుంచుకొనెను. అంతలోనఁ జారులు వచ్చి రాఘవుల వృత్తాంతంబును జిత్రకూటపర్యంతముఁ దెలిపిరి. వారిరువురకుఁ గొంతమనశ్శాంతి యొదవెను. అంత సుమంత్రుఁడు నిషాదపతిని వీడ్కొని మూఁడవనాఁటి సాయంకాలము

నగరసమీపము జేరి, రామవియోగతాపాగ్నివలన నప్రాణికముగా దగ్ధమయ్యెనోయన మాటుమణగియున్న యాపట్టణంబును జూచి విభ్రాంతుండై చేరి వీధి నెఱుంగుతమకంబునఁ బురము సొచ్చెను.

సుమంత్రుఁడు దశరథుని దర్శించుట.

సుమంత్రునిఁ గాంచినంతనే పురమెల్ల గుంపుగూడెను. రాముఁడేఁడీ యనుమాట దక్క నొండు లేదయ్యెను. అతఁడు బదులాడలేక యెట్టకేలకు 'గంగయొద్దనె విడిచివచ్చితి' ననెను. నామాటతోడ మహాఘోషము ముప్పతిల్లి నింగిముట్టెను. అతఁడు తలవంచి మెల్లమెల్లఁగా రాజగృహద్వారము ప్రవేశించి జనసంకులములైన కక్ష్యాంతరములు దాఁటి లోనికిఁ జనెను. అట శుద్ధాంతకాంతాజనములు గుమిగూడి 'సుమంత్రుఁడు వచ్చెనఁట; రాముని గంగలో వదలెనఁట; కౌసల్యకు నేమని చెప్పునో! అయ్యో! ఆమె దుర్జీవము పోఁకుఁగూడవలె'నని గుసియలు పడుచుండిరి. సుమంత్రుఁడామాటలు విని శీఘ్రముగనే కదలకదలి యెనిమిదవతొలికట్టు వచ్చి యందుఁ బాండురగృహంబున శోకదీనుఁడై తొడగుపడెఁ బడియున్న రాజును దీనుఁడుగా దాసి నమస్కరించి రాముని వదలి వచ్చితిననెను. దశరథుఁడు విభ్రాంతహృదయుఁడై మూర్ఛిల్లెను; అంతఃపురస్త్రీజన హాహారావములు చెల్లరేఁగెను. కౌసల్యాదేవి వానిని సుమిత్రాసాహాయ్యంబున లేవఁదీసి 'మహాభాగా! వనవాసమునకు నుండి రాముఁడు పంపిన మాతతో మాటాడవా? అధర్మంబునకు లజ్జింతువా? వగవకు; వగచియు ఫలములేదు. సత్యపరిపాలనపుణ్యము నేఁడు నీకు సఫలకరంబుగా సిద్ధించెను. మౌనమేల? కైకేయికినోడి యిట్లుందువా? ఆయింతి యిచ్చట లేదుసుమా. ఆఁడుపలుకులు మాని మాటాడు'మని పలికి యాత్మదుఃఖనివారణ పోలెఁ గూలెను.

దశరథుఁడు కొంతవడికిఁ దెలివొందియుండును దుఃఖితుండై తనచేరువనున్న సారథినిఁజూచి 'సుమంత్రా! నాకు గతి యింక లేదు; అశారణంబున నీమాటలు వినరావు. నాముద్దుపట్టి నెందువదలితివి? ఏమేమి వానికిఁ జేసితివయ్యో? వారేమి తిని మనుదురు? ఎట్లు పరుండుదురు? నాటు చేసేఁ జెప్పినా? లక్ష్మణుఁడేమనెను? సీత యేమి పలికెను? సుమంత్రా!

ఇవియెల్లఁ వివరింపుము. అందువలన నేని నాకొక్కింత యూఱట కల్గు నేమో' యనెను.

అనవుడు 'రాజేంద్రా! రాముఁడు గంగలోఁ బడవ యెక్కుచు నన్నుఁ బిలిచి 'సుమంత్రా! నా తండ్రి విదితాత్ముఁడు రాజలోకవంద్యుఁడు. వానికి నా సాష్టాంగనమస్కారము లర్పింపుము. అవరోధ వ్రాతమునకు యథార్హము నా యభివాదము లర్పింపుము. నా తల్లికి నా కుశలప్రణామంబు లందించి ధర్మము వదలవలదనియు నగ్నిహోత్రములయెడఁ బరాకుచెందవల దనియు మహారాజును దైవంబుగా సేవింపుమనియు సపత్నులయెడ నభిమానగర్వరహితంబుగా వర్తింపుమనియుఁ గైకేయికి ననుకూలించి యుం డుమనియు భరతునియెడ రాజమర్యాదతో మెలంగుమనియు రాజధర్మం బును మఱువరాదనియు మన్నగున విచెప్పెను. మఱియు 'రాజు వయో వృద్ధుఁడు ; వానికెదురాడవలదు ; తండ్రియాజ్ఞ సేయుము. నా తల్లిని నీ తల్లివలెఁ జూచుకొను'మని భరతునితోఁ దనమాటగాఁ జెప్పుమనెను. లక్ష్మ ణుఁడు నిట్టూర్పు నిగిడ్చి 'నిరపరాధిని బహిష్కరించితివి ; అఱితివై కైకేయికి లోఁబడితివి ; మాకిట్టి యకార్యమొనర్చితివి ; ఇదియెల్ల నీయను తాపమునకే యగును. ఇఁక నాకు రాముఁడే తండ్రియు బంధువు సర్వము' నని పలికెను. సీత యేమియు మాటాడక భూతావిష్టవలె నై నా ప్రయా ణము విని కన్నీరు నించెను' అని సుమంత్రుఁడు సమయోచితముగా రామా దుల హృదయంబును వివరించి 'రాజేంద్రా! రామలక్ష్మణులు జడలు దాల్చి వల్కలములఁ గట్టి గంగానదిని దాఁటు దాఁక యుండి శృంగిబేర పురమునకువచ్చి మఱలఁ బిలుపువచ్చు నేమోయను పేరాసతో గుహుని యింట మూన్నాళ్ళు వేచియుంటిని. నా యాస నిరాశయయ్యెను. వారు చిత్రకూటముఁ జేరినట్లు తెలిసెను. అంత బయలుదేరి వచ్చితిని ; రామ వియోగంబున నీదేశము దాల్చిన మార్పుఁబాటుఁ జూచితిని. పూచి విచ్చిన వృక్షములెల్ల నిలువున వెండఁబాఱెను ; నదీసరోజలంబులు వెచ్చగిల్లెను ; ఉద్యానవనంబులు శుష్కపలాశములాయెను ; వనసత్త్వములు నడయాడు పాటి దక్కును ; క్రూరమృగంబులు నోరుచాచి నజంతువునుగూడఁ జెనక కున్నవి. కమలంబులు దివాసమయమందే ముకుళించెను ; నీరములు పంకి లములయ్యెను ; మీనంబులు చరింపవు ; విహగంబులు విహరింపవు ; పుష్పం

బులు నిస్తంభములయ్యెను. ఎందును వికాసము గానరాదు. రామరహితమైన నారథమును జూచి పురమెల్ల దుఃఖాశ్రుస్రవంబు వర్షించెను. ఏమి చెప్పుదు ? ఈవిపరీతములకు నా ప్రాణము తెగయుచున్నవి ; పలుకనోరాదను' అని గద్గదస్వరంబున వచించెను.

దశరథుని శోక[illegible]గుట.

దశరథుఁడామాటలెల్ల విని మహాదైన్యమొంది 'కటా ! పాపబుద్ధియైన కైకేయి వరములకోరెంబో, మంత్రకుశలుర నాలోచింపక మోహమునకుఁ జిక్కి యింత గావించితినిగదా. ఇది మానుషికమో దైవికమో యూహింపరాదు. ఇదంతయుఁ గులనాశనము సంప్రాప్తమయ్యెఁ గాబోలు. సుమంత్రా ! నావలన నీవెన్నడేని నుపకారమొంది యున్నచో నన్ను నా రామునొద్దకుఁ గొనిపోయి ప్రత్యుపకారమొనర్పుము. రామునిఁ బాసి జీవింపఁజాలను. ప్రాణంబులు త్వరించుచున్నవి. సారథీ ! రాజాజ్ఞ చెల్లనేని రాము నే యిటకుఁ గొనిరమ్ము. వలదు. వలదు. రాకపోకలకుఁ బ్రొద్దవగును. నన్నే యటకుఁ దరలింపుము. హా ! రామా ! ఎందున్నావు ? నీవు సీతాసమేతంబుగా నాకంటికిఁ గాన్పింపవా ? అట్లుచేయవేని నీతండ్రిని మఱచిపొమ్ము. అయ్యో ! లోహితాక్షులతో నాజానుదీర్ఘబాహువులతో మృష్టమణికుండలంబులతోఁ జూడఁజూడముచ్చటలు గురియు నిన్ను మరలఁ గాంచెడు భాగ్యమీపాపాత్మునకుఁ గలదా ? హా ! రామా ! హా ! సీతా ! హా ! లక్ష్మణా ! వ్యసనంబునఁ జావనున్న నన్నుఁ దలంపరా ? కౌసల్యా! పుత్రవియోగమహాభోగమై సీతావిరహపారము గలిగి శ్వసితోర్మి మహావర్తంబును బాష్పఫేనజలావిలంబును బాహువిక్షేపమీనాఘంబును విక్రందన మహాస్వనంబును ప్రకీర్ణకేశశైవాలంబును నై కేయీబడబాముఖంబును గుబ్జావచనగ్రాహంబును వరద్వయవేలాంచితంబును వివాసావధితంబు నగు నిమ్మహాశోకసాగరంబునుండి నన్నుద్ధరింప రాముఁడు దక్క నొండు సమర్థుఁడు గాఁడు. వాఁడు రాకున్న నీకు నేను దక్కుటకల్ల. అహో ! రామా ! అహో ! లక్ష్మణా ! మీకై వనరుదు ; మిమ్ముఁ జూడఁ గోరుదు ; కావరా రేల ? నన్నుఁ ద్యజించితిరా ?' యని మూర్ఛాగతుఁ డయ్యెను.

కౌసల్యా పరిదేవనము.

సుతశోకంబునఁ బ్రొగులుచున్న కౌసల్యాదేవికిఁ బతిసురక్ష ప్రుంటికై

మ్ములడచినట్లాయెను. ఆమె పిశాచావిష్టవలె వడఁకుచు వివశయై నేలఁబడి కొంతవడికిఁ దేఱి,

"సీ॥ కానక కన్న సంతాపంబు గావున
గానక కన్న సంతానమయ్యె
నరయ గోత్రనిధానమై తోఁచుఁగావున
నరయ గోత్రనిధానమయ్యె నేఁడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుఁడు గావున
ద్విజకులాధరణ వర్ధిష్ణుఁడయ్యె
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యె గావున
వివిధాగమాంత సంవేద్యుఁడయ్యెఁ
వ॥ గటకటా ! దాశరథి సముత్కటకరీంద్ర
కటకలితదాన ధారార్ద్రకటకమార్గ
గామి చరియించుటయ్యె నుత్కటకరీంద్ర
కటకలితదాన ధారార్ద్రకటకతటుల"

అని బహుభంగుల వాపోయి,

'సుమంత్రా ! నాబిడ్డలున్న యెడకు నన్నుఁ గొనిపొమ్ము ; వారిని విడిచి బ్రదుకనోపను.' అని దురపిల్లసాగెను. సుమంత్రుఁడు కేలు మోడ్చి 'తల్లీ ! దుఃఖము మానుము ; మోహావ్యాకులము వలదు. రాముఁడు వనమందు సుఖమున్నాఁడు. ధర్మజ్ఞుఁడును విజితేంద్రియుఁడు నైన సౌమిత్రి భ్రాతృసేవామూలంబునఁ బుణ్యలోకములం సాధించుచున్నాఁడు. సాధ్వీమణి సీతాదేవి రామలీనహృదయయై యింటవలె వనమందుఁగూడ సుఖమున్నది. ఆమెముఖంబున వివాసదుఃఖము లేశమాత్రముఁగూడఁ గాన రాదు. మార్గాయాసమునఁ గానీ గాలివడతాకునఁగానీ యామె మేను గసు గందదు ; ఆమె పాదములు లాక్షారసవర్జితములయ్యెఁ దామరమొగ్గచెన్ను దొఱఁగవు. రామభుజాసంశ్రిత గావున నామె గజములఁగన్నను బెబ్బులుల విన్నను సింగంబులు చేరవఁజన్నను బెగడొందదు. వారిలో నెవ్వరికిని నీవు దుఃఖింపవలదని పెక్కువిధముల నూరార్చెను.

కౌసల్యాదేవి సుతుని దలఁచితలచి నొగులుచు 'నాథా! దయావంతు వనియు మనోజ్ఞాతవనియుఁ క్రియవాదివనియు ముల్లోకములు నిన్నుగ్గడించు

చున్నవి. అట్టినీవు నీబిడ్డలను సుఖసంవృద్ధుల నెట్లు కాఱడవికిఁ దోలితివో యూహింపరాకున్నది. తరుణియు సుకుమారియు సుఖోచితయు నైన జానకి గహనాంతరసీమలఁ జీవిక నశింపకుండునా ? ఆబిడ్డలు తృణధాన్యంబులం దినియెదురా ?' అని పలికి 'హా ! రామా ! కమలాయతలోచనా ! తమ్మితావినిటూర్పులఁ గ్రాలునట్టి నీముద్దుమోము నెన్నఁడు చూడఁగలను ! హృదయమా ! ముద్దుపట్టిని బాసిన వగకు వ్రీలవేల ? రాజేంద్రా ! భరతునకుఁ బట్టముఁ గట్టనున్నావు. అధికార మింతతీపరాదు. ఒకసారి మరిగిన మానుటకల్ల. భరతుండు తనచేతిలోని రాజ్యకోశంబులను వదలఁడు. రాముఁడు మరలివచ్చినప్పుడు వానికేమియిత్తువు ? ఒకవేళ భరతుఁడు పెద్దమనస్సుచేసి రాజ్యకోశములను వదలినను భ్రాతృభుక్తంబును రాముఁడిచ్చగించునా ? పెఱమెకము ముట్టిన మాంసంబును బెబ్బులిగూడఁ దాకదుగదా. రాత్రిగడచిన హవిరాజ్యాదుల నధ్వరాంతరంబునకు గ్రహింపనట్లు [illegible] సురను గ్రోలనట్లు రాముఁడు భరతుఁడిచ్చురాజ్యంబును గ్రహిం[illegible]డు. తండ్రివగుట నీపయి రాముఁ డలుగకుండెను. తత్ఫలముగా వానికి రాజ్యచ్యుతియు దేశాంతరగతియు పేఱని తలవంపును సంప్రాప్తములాయెను. నాబిడ్డ విల్లెక్కుపెట్టునేని నభంబు సతారకంబుగాఁ గూలును ; స్వర్గంబు[illegible] పడును ; భూమండలం బుట్టిటులూగును. తోఁకతాకును బెబ్బులి యోర్చిన నోర్చుఁగాక ; రాముఁ డసత్కారంబు నెంతమాత్రము సహింపఁడు. యమనాల్గులోకము లెత్తివచ్చినను వాఁడు భయపడువాఁడుగాఁడు. ఒక్క ధర్మంబునకుఁ గట్టువడెను. వానికీగతియయ్యెను. మత్స్యము తనపిల్లలకట్లు నీవు వానికి దెప్పరంపు ముప్పు గలిగించితివి. శాస్త్రదృష్టమును సనాతనమునైన ధర్మము నీయందిఁక నిలుచునా ? స్త్రీకిఁ గ్రమంబుగా భర్తయు సుతుఁడును జ్ఞాతియు గతియగునందురు. సవతికి వల్లభుఁడవై తొలఁగితివి నాకు నెఱసున్నగావించితివి ; కొడుకును దఱిమివైచి రెండవగతికి నన్ను దూరమొనర్చితివి ; జ్ఞాతిసమాశ్రయము శ్లాఘ్యముగాదనుట లోకవిదితము. ఆయ్యో ! ఎల్లవిధముల నన్నుఁ జెఱచితివి. రాజ్యమును జెడిపితివి. నీవును జెడితి' వనెను.

ఆమాటలు బ్రహ్మాస్త్రములై తాఁకఁగా దశరథుండు సకలేంద్రియ[illegible] వివశుఁడయ్యెను. వాని యంతరాత్మ [illegible]త వహించెను. అట్లుండు

క్షణము సేపుండి కనువిచ్చి కయిమోడ్చి 'దేవీ! ప్రసన్నవగుము; అంజలి యొనర్తును. పగతుఱఁగూడఁ బ్రేమించునీవు నాయెడఁ గనికరమూనక తప్పదు. నీదుఃఖమునకు మేరలేదు; ఈయనర్థమునకు నేను కారణమైతి' నని సకరుణముగాఁ బలికెను. కౌసల్యాదేవి తనపతిమోడ్పుఁజేతులను నిజకరకమలంబులఁ బొదివి శిరమునఁ దాల్చి 'నాథా! క్షమింపుము, తలవ్రొక్కి వేఁడుచున్నాను. భర్తృయాచితనై మహాపాతకంబు నొడిగట్టితిని. ఈపాపపరిహారమునకుఁ బ్రాయశ్చిత్తమును వేఁడుదును. ధర్మజ్ఞా! ధర్మతత్త్వము నాకకొంత యెఱుంగుదు; నీవు సత్యసంధుఁడవగుట క్రొత్తగాదు; అయినను బుత్త్రశోకమట్లు పలికించెను. శోకమువలన ధైర్యము నశించుట విద్య సన్నగిలుట నీకుఁ దెలియదా. శోకమంటి శత్రువున్నదా! వైరిప్రహారణంబునకన్న శోకనిహతి మహాతీక్ష్ణముగదా. సర్వధర్మములెఱింగిన వేదమూర్తులు సయితము శోకకారణంబున నజ్ఞానంబునకుఁ జిక్కుటగలదు. స్త్రీమాత్రురాలిసంగతి చెప్పవలయునా! నారాముఁడు వని నేఁటికైదురాత్రులయ్యెను. ఈపంచరాత్రంబులు పంచవర్షంబులుగా నున్నవి. సుతుని దలఁచినంతనే నాయెదను పొరలి వెల్లివిరియుచున్నది. ఈ దీనురాలి యపరాధమును మన్నింపు' మని వ్యసనస్వాంతంబున నుడివెను.

దశరథుఁడు నిజశాపవృత్తాంతమును దెల్పుట.

అంతలోన సూర్యుఁడస్తమించెను. దశరథుఁడు దుఃఖవిపాకంబున నైమఱచి కొంతసేపు నిద్రించి కనువిచ్చి చెంతనున్న కౌసల్యాదేవిని జూచి 'ప్రేయసీ! శుభాశుభంబులు కర్మానుగుణంబులై యుండును. దానిని సహింపక తీఱదు. అయినను గుణదోషంబులను గౌరవలాఘవంబులను విమర్శింతురు. పూలకుఁగా మోదుగను బెంచి యెలమావిని నఱకివైచువాఁడు ఫలప్రాప్తికాలంబున దుఃఖభాగుఁడు కాకమానఁడు. నాగతియు నట్టిదై యయ్యెను. నావిజ్ఞానహీనుఁడనమే యిందులకుఁ గారణము. తెలియక చేసినను దెలిసిచేసినను కర్మఫలము దప్పదు. సంగతి వినుము. శబ్దవేదివిద్య నాకు బాల్యమందే సిద్ధించెను. వేఁటాడునప్పుడు మృగము కంటికిఁ గానరాకున్నను దానిని సడివట్టి వైచి వధించు నేర్పు నవినాభ్యాసప్రభావంబునఁ గలిగెను. మనవివాహమునకు మున్ను కొంతకాలముక్రిందట యేను యథాగతి సూర్య

భగవానుఁడు నిజకిరణంబులఁ బఱచి రసములెల్ల గ్రహించి పుడమిని సంతాపముపాలొనర్చి ప్రేతాధిష్ఠితమును భయావహమునైన దక్షిణదిశను ప్రవేశించెను. వానికై యెదురుచున్న వసుంధరకుఁ దాపోపశాంతి గావించుటకో యన వర్షఋతువు వచ్చెను. ఎల్లెడల వేడిమి చల్లారెను; నల్లని మేఘము లంతరిక్షము నావరించి కేకసారంగమయూరంబులకు సంతసమును గూర్పసాగెను. వాతవర్షంబులకు నూఁగుచున్న కొమ్మలందు పక్షులు ప్రాతస్స్నానాంతరము తడియాఱుచున్నవో యన ఱెక్కలను విదిలించుకొనుచుండెను. నదులు గైరికాది ధాతుసంయోగంబునఁ బాండురారుణంబులైన జలంబులనిండి కార్చిచ్చు బూదిబ్రుంగిన సర్పంబులఁ దలపించుచుఁ బ్రవహింపఁ జొచ్చెను. అట్టిసమయంబున నేను ధనుర్బాణముల ధరించి రథమెక్కి మృగయావిహారార్థము సరయూతీర వనము చేరితిని.

“సీ॥ సింహనఖాంకురచ్ఛిన్నవారణకుంభ
జనితముక్తాఫల శర్కరిలము,
సమదసూకర పరస్పరభీకరాఘాత
శిథిలదంష్ట్రాచూర్ణ సికతిలంబు,
గంధసింధుర ఘటాకట కటాహస్రవ
ద్బంధురదానాంబు పంకిలంబు,
దవగంధవహబంధు దందహ్యమానైక
కాశికాగురుధూప గంధిలంబు,
తే॥ వృకకులవజ్ఞస్వరోద్గీత ఖిల్లపల్ల
వాధరాగీతికా కర్ణనాతిభీతి
పరవశాత్మపటీరకోటరకుటీర
లీనఘూకియగుచు నపుడక్కానయొప్పె॥”

రాత్రియయ్యెను; రేవు పొంచితిని. మృగములు నీటికై యటకు వచ్చెను. నాఁడు చీఁకటి మహాగాఢమై యుండెను. మృగముల సడిమాత్రము వినవచ్చుచుండెనే గాని యవి కానరాకుండెను. శబ్దవేదినిగావున సడిపట్టి యుండఁగానన్నిటి వైచితిని. అంతలో నేటియందు గుబగుబధ్వని యొండు వినవచ్చెను. గజము నీరు ద్రావుటకుగా నెంచి యావంకఁ గోలవైచితిని.

36

'అయ్యో ! అయ్యో ! తాపసిని నిరపరాధిని జలార్థమువచ్చితిని ఎవఁడో కోలవైచెను ; ప్రాణములు పోవుచున్నవి. కటా ! నారచీరలుగట్టి కూరనారలుతిని జీవించు మమ్ముఁ జంపినఁ గార్యమేమి ! నన్నుఁ జంపినఁ జంపుఁగాక. నాతోడ నాతల్లిదండ్రులను వగ్గుముదుసళ్ళను జంపుచున్నాఁడు. ఈ యకృతాత్ముఁ డెవఁడో' యను మాటలు వెనువెంట నాచెవిఁ బడెను. నాప్రాణములు నిలువున నెగచెను ; నేను శోకసంభ్రాంతి పేనుఁ డనైతిని. నాతనువెల్ల మ్రాన్పాటు చెందెను. సఖీ ! ఎట్టకేలకు నాయుత్తలపాటును సుంత సమదాయించుకొని రేవునకుఁ బోయి యట విరిసినజడలతో నెత్తుటు వఱ్ఱొడ్డుచున్న మేనితోఁ బడియున్న మునికుమారుని జూచి భయవిహ్వలుఁడనైతిని ; నాకు మతి దప్పెను. ఆ మునిపుత్త్రుఁడు నన్ను గఠోరవీక్షణంబులఁ దేఱిచూచి 'రాజా ! వనవాసిని గుర్వర్థము జలములకై వచ్చితిని. నీకట్టి యపకారంబును గావింపను ; నన్నుఁ గోలవైచి కూల్చితివి. నాతోడ నాతలిదండ్రులను బరమాంధువులను గడువృద్ధులను జంపుటయ్యెను. వారు కదలమెదలలేరు ; పిపాసార్తులై యున్నారు ; నన్ను నిరీక్షించుచుందురు. కటా ! ఎంత తపస్సుచేసిన నేమి ! ఎంత విద్యాధనమున్న నేమి ! కర్మగతి తప్పదు గదా ! అయ్యో ! తండ్రీ ! నాగతి యిట్లయ్యెను. కాలులేమి నీవు కదలజాలవు. కడసారి నన్నుఁ గాంచు కలిమిగూడ నీకుఁ గలుగదు. గాలికి విఱిగిపడుచెట్టును వెంబడిచెట్లు చూచుచుండునేగాని తోడ్పడ నేర్చునా ! దశరథా ! నీవు వెంటనే చని నాతండ్రికి నాసంగతి తెలుపుము. అట్లు చేయుదువేని వాని కోపమునకు గుఱియగుట నీకుఁ దప్పును. ఒండుచో నిన్నతఁడు బూది సేయును. ఇదిగో యీ త్రోవఁ బట్టి పోయినచో నా తండ్రి యాశ్రమమును జేరుదువు. రాజా! ప్రవాహవేగము మెత్తనిదరినట్లు నీకఱకుటమ్ము నామర్మములను హరించుచున్నది. తాళజాలను ; కోలను బెఱికివైచి నాకొక కొంతయూఱటఁ గూర్పు' మనెను.

'దేవీ ! వానిని జూచి యామాటలు విన్నంతనే నన్ను దిగులు వైకొనెను. శరము నూడదియ్యుదునా ? వానికిఁ జావు సిద్ధము. దానినట్లే యుంతునా ! వానిబాధ యోర్వరాదు. నాతలపు చిక్కు నమ్ముని సుతుఁడు గ్రహించి 'రాజా! తడయవలదు. బ్రహ్మహత్యనొనర్చితినని బెంగపడకుము.

నేను శూద్రికి వైశ్యునివలనఁ బుట్టితి' నని పలికెను. వానికి శరబాధ దుర్భరమయ్యెను. అతఁడు గొంతవడి గిరగిర దొర్లాడెను; కొంతసేపు చచ్చినట్లుండెను. వానియవస్థఁ జూడనోపక బాణమును బెరకివైచితిని. అతఁడు వెనువెంటనే ప్రాణములు విడిచెను.'

'సఖీ! వానిచరమస్థితిఁగాంచి యేమిసేయుటకు దోఁపక కొండొక తడవందే మ్రాన్పడియుండి యెట్టకేలకు నిశ్చయించుకొని మునిసుతుఁడు తెచ్చిన ఘటమునిండ నీరు గైకొని మెల్లమెల్లగా నయ్యాశ్రమమును జేరితిని. అటఁ బరమాంధువులిద్దఱు ఱెక్కలు తెగినపక్షులవలెఁ బడియుండిరి. వారిని జూచినంతనే నావ్యసనము పొరలి మితిమీఱెను. వారు నాకాలిచప్పుడు విని 'నాయనా! వచ్చితివా? ఇంతజాగేల? నాలుక యీడ్చుచున్నది. కొంచెము నీరిటులిమ్ము వత్సా! నీకై నీతల్లి మిక్కిలి. పరితపించుచున్నది. పుత్రా! మాపయి నలిగితివా? ఇంతజాగునకుఁ గారణమేమి? ఏదేని యప్రియమొనర్చితిమా? చనవునఁజేసి పలుకరానిది పలికితిమా? ఎవరేమి యొనర్చినను తపోధనులకు నాగ్రహము కూడదు. ఎల్లవిధములఁ మేము దిక్కులేనివారమై యున్నాము. కన్నులు లేవు; కాలు కదలదు. నీవే మాకుఁ గన్నులుఁ గాళ్ళు సర్వమునైతివి. మాప్రాణములు నీచేతనున్నవి. పట్టీ! పలుకవేల?' యని యావృద్ధతాపసి యనెను.

'ఆమాటతోడ నాకుఁ గన్నులు పచ్చనయ్యెను; నోటఁదడియాఱెను. మాట వెలువడకుండెను. నాతత్తఱపాటు నొకకొంతయడఁచికొని 'మహాత్మా! నీసుతుఁడు కాఁడు. నాపేరు దశరథుఁడందురు. కర్మవశంబునఁ బరమదుఃఖభాగినై వచ్చితిని. వేఁటతమి యింత తెచ్చెను. సంగతి వినుము. మృగయార్థము సరయూతీరమున రేవుగాచి యుంటిని. ఏఁటిలో గుబగుబ ధ్వని వినవచ్చెను. ఏనుఁగని యెంచి శబ్దవేదిని గావునఁ బెంజీకఁటిలో నడిపట్టి కోలవైచితిని. 'అయ్యో! అయ్యో! తాపసిని, జలార్థమువచ్చితిని జచ్చితి' నను మహార్తవచనములు నాచెవిఁబడెను. సంగతి యేమో యని యావంకకు హుటాహుటిఁబోయి యట మునిసుతుఁడు ఱొమ్ముననాటిన శరంబునకుఁ దల్లడిల్లుచుండుటఁ జూచితిని. అతఁడు నన్నుఁగాంచి పెద్దయు విలపించి కోలనూడఁతీయుమనెను. నేనట్లొనర్చితిని. అంత నతఁడు మా

సంగతిం దెలిపి మీకుంగా మహా చింతాక్రాంతుండై ప్రాణములు వదలెను. తపోధనా! నీసుతునిం గానక చంపితిని; కలరూపు తెలిపితిని. కర్తవ్య మానతింపు' మని వానిని వేడితిని.'

'ఆఋషి హృదయవిదారణమైన యాదుర్వార్తకు వ్యసనాక్రాంతుండై

"ఉ॥ భానుకులప్రసూతులు కృపాపరులంట యవధ్యహింసకుల్
బూననిపుణ్యులంట గుణభూషణులంట యథాపరాధ సం
ధానుపమానశౌర్యనిధులంట మునిప్రియులంట నేఁడయో!
కానకకన్నమాసుతుఁ బొకారిచి యన్నియు మిథ్యచేసితే!"

"మ॥ మునిజీవాతువు లబ్జబంధుకులసంభూతుల్ నయోపేతు ల
త్యనుకంపాపరులంచు నమ్మితిమిగాకయ్యో! జిఘాంసల్ గిరా
తుని చందంబునఁ గొంచిజీవనపరాధుల్ సాధు మత్పుత్రుఁ బం
డెనె కోర్కుల్! ఫలియించెనే విశిఖపాండిత్యంబు నీకింతటన్?

అని దుఃఖంబును వెలిపుచ్చి 'రాజా! స్వయముగా నీవిందువచ్చి తప్పిదాంపక తెలిపి మననోంచితివి. కానిచో నీతల వేయివ్రయ్యలైయుండును. రాజా! నరహత్యా దోషము తప్పదు. తెలియక యిట్లొనర్చితివనుట స్పష్టము. అందువలననే బ్రతికి యిందురాఁగలిగితివి; ఇక్ష్వాకువంశ సమూల నాశనంబునుఁ బొలంగాను. దశరథా! పుత్రుని సజీవునిగాఁజూచుకలిమి యింకేఁ గలుగదు. వాని శవమునేనిం జూతుము. మమ్మటకుఁగొని పొమ్మ' నెను. వారిని మోచికొని పోయి యాశవముచెంత దింపితిని. వారాశవంబును దడవి తడవి పడిన పరితాపంబునకు మేరగలుగదు. తల్లి మూర్ఛాగతయై నేలవ్రాలెను. తండ్రి వెల్లువిలపించుచు 'కుమారా! తండ్రికి నమస్కరింపవా? తనయా! పలుకవా? నాయనా! అలిగితివా? పుత్రా! నీతల్లి నేనిం జూడవా? అర్ధరాత్రమున లేచి నీవు చేయు వేదాధ్యయనంబును వినుభాగ్యంబు నేఁటితో మాకు ముగిసెనా? రేపును మాపును నీవొనర్చు శుశ్రూషలెల్ల మాకుఁ బీడెనా? చూడఁగన్నులును నడువఁగాలును లేవు; ఎందును బోఁజాలము. ఏపనికిఁ దగము. ఇఁక మాకు దిక్కెవ్వరు? కాటికి

క్షత్రికిఁ జీవికి చచ్చుదుర్గతి మానోసంటు వ్రాసియున్నది. పుత్త్రా! నీవెంట మమ్ముఁగూడఁ గొనిపొమ్ము. కాలవ్యవధికి వెఱతువా! ఇదిగో యిప్పుడే నీతోడ వైవస్వతు నాశ్రయింతుము. తనయా! పాపిష్ఠుఁడైనదశరథునివలన నీప్రాణంబు లుడిపికొంటివి. సత్యవ్రతులైన శస్త్రయోధులకగు లోకములు నీకగుఁగాక. సగరుఁడేపదవి నొందెనో, శైబ్యుఁడేస్థానముఁబడసెనో, దిలీపుఁడే చోటికిఁజనెనో, జనమేజయుఁడేది పొందెనో, నహుషధుంధుమారు లేతావుఁ జేరిరో యాచెలవు నీకగుఁగాక. సాధ్యులకేది సిద్ధమో వేదాధ్యయనులకేది కరస్థమో తపోధనులకేది కొంగుబంగారమో భూమిప్రదాతలకేది నిశ్చితమో యాహితాగ్నులేది పొందుదురో యేకపత్నీవ్రతులకేది ప్రాప్తించునో గోదానమునకేది ఫలమగునో గురుపోషకులును దేహన్యాసకృతులును దేనిని జేరుదురో యది నీకగుఁగాక. నాయనా! మనకులమునఁ గూన కూడ దుర్గతిచెందదు. నీసంగతి చెప్పవలయునా! నిన్నుఁ జంపిన వానికిమాత్రము దుర్గతి తప్ప’దని నిజమనస్తాపంబును వెలిపుచ్చి భార్యాసమేతుఁడై తనయునకు సలిలక్రియలు తీర్చెను. ఆమునికుమారుఁడు దివ్యరూపమొంది యింద్రునితోడ నతని విమానముమీఁద స్వర్గాభిముఖుఁడై చనుచు, వగచుచున్న జననీజనకులను సంబోధించి ‘మీకు నాయొనర్చిన శుశ్రూషలఫలంబుగా నాకీ సద్గతి లభించెను. అచిరకాలమున మీరును నన్నుఁ గలయుదురు’ అని చెప్పి పోయెను. ఆవృద్ధులంత నావంకఁ దిరిగి ‘రాజా! ఏకపుత్త్రకుని నపుత్త్రకునిగాఁ జేసితివి. ఈదుఃఖము నీకు నీయవసానకాలంబునఁ దప్పదు. సుతశోకంబున నీజీవితము సమాప్తమగుఁగాక. తెలిసిచేసినతప్పుగాదందువా! కావునసే మహాపాతకంబునకు నెడమైతివి’ అని పలికి యేకచితిస్థులై తనుత్యాగ మొనర్చిరి.’

‘కౌసల్యా! అపథ్యము వ్యాధియట్లు నాపాపకార్యమిట్లు పరిణమించెను. భద్రా! నాకు దృష్టి తప్పుచున్నది; చెంతనున్న నీవుగానరావు. నీకరకమల స్పర్శసుఖంబును గడసారి నాకనుగ్రహింపుము. కటా! నావంటి దయారహితుఁడుండఁడు. నానోటిమాట వెడలునట్టే తపస్వి నాపట్టి బదులాడకతరలెను. ఇట్టిది వానికే చెల్లును. రామా! కడసారి కంటఁ బడిపొమ్ము. నీతండ్రి కింతమాత్రపుసుఖము నేఁడు గూర్పవా? మానవులకు మరణానంతరముఁ బరస్పరముఁ జూపులుండవుగదా. ప్రేయసీ! స్మృతి

తప్పుచున్నది. అదిగో యమకింకరులు వచ్చి వేగిరించుచున్నారు. నిదాఘ తాపము మెఱకమీఁదినీటినివలె రామాదర్శనదుఃఖము నాప్రాణముల నింకించుచున్నది. పదునాలుగేండ్ల తర్వాత రాముని మఱలఁ జూచు కలిమి నోచినవారు దేవకల్పులుగాని యేతన్మాత్రులుగారు. కౌసల్యా! చిత్తమోహమున నాహృదయము శూన్యమగుచున్నది; కరణంబులు తమపటిమను దొఱఁగుచున్నవి' అనియాతఁడు సగము రాత్రివఱకుఁ బరితపించి 'హా! రామా! హా! కౌసల్యా! హా! సుమిత్రా! అని నిట్టూర్చి మహానిద్ర వహించెనోయన మిన్నకుండెను.

దశరథనిర్యాణము.

మఱువాత యథాప్రకారము వందిమాగధులు కొలువుకూటి జోహారు లనుఁ బరాకులును మంగళోక్తులుఁ బలికి చనిరి; పంజరస్థములైన పులుఁగులు మేల్కాంచి మధురమధురంబుగాఁ గూయసాగెను; పరిచారికల రాకపోకలక్రందు మెండయ్యెను; స్నానవిధిజ్ఞులైన లెంకలు హరిచందనోదకంబుల నించిన హేమకలశంబులఁ గూర్చిరి; మంగళానులేపనంబులును ప్రాశనీయంబులును వస్త్రాభరణంబులును గొనివచ్చి యువతులు కాచియుండిరి. అంతలోన,

"సీ॥ తనఁబాసి శశి దవ్వుచనిన నెవ్వగఁబోలె
దొలిదిక్కుజవరాలు వెలుకఁబాఱెఁ,
ప్రథమాద్రిసభయందుఁ బఱచిన కెంబట్టు
జముకాణమనఁగ రాగముజనించె,
షట్పదార్తిఁ గొసరుచున్నవిపోలె ముఖరాళి
వనరుహాస్యములఁ బద్మినులు దెఱచె,
భానూష్మభీతి మున్పడినచుక్కలఫంగి
దొరలె వేకువగాలి దొరలమంచు
గీ॥ కాలగణనయుక్తిమింటిదక్కటికి నెగయు
నాసవునిపట్టి పొడవుగా వైచియాడు
గవ్వచమరిన నారుచక్రంపుబిళ్ళ
కోల నొయ్యనఁ బ్రాచి లేఁబ్రొద్దువొడిచె."

ఇట్లు సూర్యభగవానుఁడు మొలచివచ్చినను దశరథుఁడు నిజమందిరాంతరమునుండి వెలికి రాఁడయ్యెను. ఈయపూర్వవైఖరికి సంశయములు పొడమెను. అంతఃపురప్రవేశయోగ్యులు తెంపుచేసి లోనికిఁ జనిరి. ఱేఁడు నిద్రావశుఁడైనట్లుండెను. కౌసల్యాసుమిత్రలు దుఃఖశోకవశలై యతని చెంతఁ బడియుండిరి. అందుఁ గౌసల్యాదేవి వివర్ణయుఁ గాంతివిహీనయునై దుఃఖావతారమోయన మిక్కిలి జాలిగొలుపుచుండెను. ఱేనిని మృదువచనంబుల మేల్కొల్పిరి. అతఁడు కదలక మెదలకుండెను. వానిఁ దాఁకి చూచిరి. సంగతి స్పష్టమయ్యెను. మహారోదనము లెగసెను. కౌసల్యా సుమిత్రలులికిపడి లేచి పతిని దడవి సంగతి గ్రహించి యాక్రోశించుచు నేలవ్రాలిరి. శుద్ధాంతము క్షణములో మహాదుఃఖరోదన మందిరమయ్యెను.

కౌసల్య తనపతిశిరంబును దొడపైనిడుకొని,

మ॥ కొడుకా! నిన్నెడఁబాసినట్టివెత నాకుం జాలదో నాఁగ మ్రు
క్కుఁడిదైవంబు లలాటకుంకుమపుఁజుక్కం జుల్చి వైధవ్యపుం
బడబాగ్నిం బడవైచె ముత్తైదెడరుంబారంబు నేనీక్రియం
జెడియుం జావక మొండినై పడయఁగాఁ జేటింక నెంతున్నదో!

అని రామునిఁ దలఁచి 'కైకేయీ! నీమనోరథము ఫలించెనా? ఇఁక బోటులేని రాజ్యమును బాలింపుము. రాముఁడు వనగతుఁడును నాథుఁడు స్వర్గతుఁడునైరి. నేను విపథంబునఁ దోడు తప్పిన తెఱవనైతిని. ఇఁక జీవమేల? భర్తనెడసి జీవించుట నీకగుఁగాని మఱియొకర్తుకకుఁ గాదు. లుబ్ధుఁడు విషముష్టిఫలంబునుగోరి చెడినట్లు నీవు కుబ్జాదుష్టబోధనలకుఁ జిక్కి చెడితివి; రాఘవకులంబునకుఁ జేటుతెచ్చితివి. హా! రామా! వైధవ్యమును సహింపఁజాలను. సహగమనంబునకు ననుమతింపుము. ఇది పతివ్రతలకు సహజధర్మ'మని వేవగలఁ బొగులసాగెను. సుమిత్రానయనగోళంబులు స్రవించు దుఃఖాశ్రుధారలకు నెడతెంపుగలుగదయ్యెను.

వ్యావహారికులంతఁ గౌసల్యాసుమిత్రల నందుండి తొలఁగించిరి. పుత్రులెవ్వరును చెంతలేని కారణంబున దహనసంస్కారమునకు నవ్యంతరము గలిగెను. మంత్రులు సుమిగూడి వసిష్ఠునితో సంప్రతించి ఱేనికళేబరంబును తైలద్రోణియందుఁ బదిలపఱచి రాచకార్యముల నడపింపసాగిరి.

జనులు కర్తవ్యమునుగూర్చి పలుకుట.

మఱునటిరియుదయంబున రాజకర్తలైన మార్కండేయ మౌద్గల్య వామదేవ కాశ్యప కాత్యాయన గౌతమ జాబాలి ప్రభృతులును మహాత్ములును సభ చేరిరి. వసిష్ఠుఁడును వచ్చెను. బ్రాహ్మణోత్తములు పెక్కురు గూడిరి. 'రాత్రి వేయియుగముల ప్రాయమయ్యె'నని యొకవిప్రుఁడు మొదలుపెట్టెను. 'రాజు దివంగతుఁడాయెను; అతనిసుతులెవ్వరుఁ జెంతలేరు; రాజ్య మరాజకము గారాదు; ఇక్ష్వాకు వంశ్యులెవ్వరుఁ జేతికి దొరకరా' యని యొకఁడుపన్యసించెను. 'అరాజకమైన దేశమున వానలు గురియవు; చోరులు చెలరేగుదురు; ఫలముదక్కదనుభయంబున విత్తుచల్లరు; పంటలుండవు. శిక్షకుఁడు లేకుండును. తండ్రిని కొడుకు వినఁడు; భర్తను భార్య లెక్కసేయ'దని మఱియొకఁడు పలికెను. 'ఏలుఁడులేనినాఁటి ధనము దొంగలపాలు, భార్యలు జారులపాలు; సత్యము సాగరముపాలు; మఱేమి వలయు'నని యింకొకఁడు నుడివెను. యజ్ఞయాగాదులు సాగవని యొకఁడు, సభలు చెల్లవనని యొకఁడు, ఉత్సవము లుడిగెనని యొకఁడు, క్రయవిక్రయంబులాగి పోవనని యొకఁడు, శాస్త్రంబులు త్రుప్పుపట్టునని యొకఁడు; బ్రాహ్మ్యాశ్రమంబులు పాడగునని యొకఁడు, నిష్కారణవైరములు పెఱుఁగునని యొకఁడు; సౌఖ్యక్షేమములు వలసపోవునని యొకఁడు, వర్ణాశ్రమధర్మంబు లడుగంటునని యొకఁడు, నాస్తికులరాజ్యమగునని యొకఁడు, తలకొకమాటగాఁ బలుకసాగిరి. సర్వము రాజాయత్తము. రాజు జనులకు సర్వమైయుండును. యముఁడన్న దండనాధికారిమాత్రుఁడు; కుబేరుఁ డొక్క ధనమునకే యధికారి యగును; పరిపాలనాధికారము మాత్రమే యింద్రునకుఁ గలదు. రాజో సర్వాధికారి సర్వము రాజాయత్తము; రాజు సర్వప్రాణులకు సర్వస్వ మని యొకఁడు వచించెను.

ఆతలంపులెల్ల వసిష్ఠమహర్షి విని మార్కండేయాదులతో సంప్రతించి 'కాలముపుచ్చరాదు. భరతుని రప్పించుదమ'ని నిశ్చయించి మంత్రుల రావించి 'అమాత్యులారా! కర్తవ్యము వినుఁడు. రవితురగములఁబోని గుఱ్ఱములమీఁదఁ దెలివిగలవారిని రాజగృహపురంబునకుఁ బంపుఁడు. వారు భరతుని సంధించి వానికి మంత్రిపురోహితులకుశలములు వినిచి 'అత్యావసరమైన

పని తటాలునఁ గలిగెను. తదర్థము నిన్నుఁ దోడ్కొని రా వసిష్ఠుఁడాజ్ఞా పించెను; వచ్చితి’ మని చెప్పు మనుము. రామవివాసముగాని దశరథ నిర్యాణముగాని యెంతమాత్రము భరతునకుఁ దెలియరాదు. దూతలముఖ లక్షణంబులుగూడ నట్టివిసూచింపరాదు. దూతలు కానుకలఁ గొనిపోవుట సంప్రదాయము. వలసిన కౌశేయ దివ్యాభరణములిచ్చి పంపు’ మనెను.

### భరతునకు దూతలు చనుట.

దూతలు తరలి పశ్చిమాభిముఖులై కొంతదూరము పోయి యపరతాల పర్వతమును దానిదక్షిణపుఁ గొమ్మున దాఁటి, యాకొండకును ప్రలంబనా ద్రికిని మధ్యఁ బ్రవహించుచున్న మాలినీ నదీతీరంబునఁబడి యుత్తరాభి ముఖులై చనిచని మరలఁ బడమటికి మరలి హస్తినాపురంబునొద్ద గంగానది నతిక్రమించి కురుజాంగలదేశంబుల నడుమంబడి పాంచాలదేశముఁ జొచ్చి శరదండానది నుత్తరించి దానియుత్తరతీరమున నున్న సత్యోపయానమను పేరి దివ్యనికూలవృక్షంబునకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి కులింగా పురము గడచి, అధికాలమను పేరి గ్రామమును వెనువైచి, బోధితవనపర్వ తోద్గమయు నైక్ష్వాకువంశ సేవితయునైన యిక్షుమతిని నిర్గమించి, యానదీ తీరనివాసులై యంజలిమాత్ర జలాహారవ్రతమాచరించి తపంబుల వేదపారా యణంబునఁ దవిలియున్న బ్రాహ్మణోత్తములను సందర్శించి బాహ్లీక దేశ మునకును సుదామపర్వతంబునకును నడుమనున్న దారి ద్రొక్కి విష్ణుపదమును దాఁటి విపాశానది నుత్తరించి దానియొడ్డునున్న శాల్మలీవృక్షమునవలోకించి మార్గాంతర వాహినులను సరోవరంబులను వాపీతటాకపల్వలంబులను గజ వ్యాఘ్రసింహాదిమృగంబులను దిలకించుచు, భర్తృప్రీతియు తద్వంశపరిగ్రహ తత్కాలరక్షణభారంబులు మూఁడు ముప్పిరిగొని త్వరించుటంజేసి మార్గశ్రమ మును గూడ తీరిగొనక మూఁడవనాఁడు రాత్రియగునంతకు గిరివ్రజపురము జేరిరి.

### భరతుని స్వప్నము.

నాఁటి వేకువన భరతుఁడొక యశుభస్వప్నమును గాంచి ప్రభాత స్వప్నమగుటంజేసి యదినిక్కమై యేమిరానున్నదో యని పరితపింప సాగెను. సంగతి తెలియక వానిహితులు తద్వ్యథానివారణార్థము వివిధ

కథలతో మధురగానంబులతో హాస్యోక్తులతో భరతుని వినోదించిరి. ఎందు చేను వానిమనస్తాపము తీఱకుండెను. ఎట్టకేలకు సాంతరంగికుఁడొకఁడు భరతుని జూచి 'సఖా! నీ వైమనస్యమునకుఁ గారణ మేమి?' యని యడిగెను. నావుడు 'మిత్రమా! ఏమిచెప్పుదు? పాడుకలయొకటి వేఁకువఁ గంటిని. నాతండ్రి విరిసినతలతో మఱికిజొబ్బిల్లుతనువుతో మహాద్రిశిఖరమునుండి మురిగిపేడగుంటలోఁబడి తేలాడినట్లు, దోసిళ్ళఁబడి నూనెద్రావి వికృతపు నవ్వులునవ్వినట్లు నూపిండియన్నము తిని తలక్రిందు గాఁగూలి దొర్లాడినట్లు తైలావగాహ మొనర్చినట్లుండెను. అంతలో సముద్రమింకెను; చంద్రుఁడు నేలరాలెను; లోకమెల్ల గాఢాంధకారబంధురమయ్యెను; భద్రగజదంతం బులు పుప్పొడిగా నరవెను; మండుచున్న వీతిహోత్రుఁడు తటాలునఁ జల్లారెను; పుడమి వ్రీలెను; వృక్షంబులు నిలువున నెండవాఱెను; పర్వత ములు కూలి పొగలెగసెను. ఈవిపరీతము లొక్కొక్కటిగాఁ దోఁచెను. ఇవిచూచుచుండఁగానే నాతండ్రి నీలవస్త్రధారియై యినుపగద్దెయెక్కి గానిపించెను. వానిని జూచి కృష్ణపింగళవర్ణులైన ప్రమదలు వికవిక నవ్విరి. నాతండ్రి యచటువాసి పోయి కాటుకచందనములఁది రక్తమాలలు ధరించి గాడిదలుకట్టిన రథమెక్కి దక్షిణాభిముఖుఁడై తరలెను. మార్గ మధ్యమున హఠాత్తుగా నొకరక్కసి రక్తాంబరములు గట్టి వికృతముగా నున్నది విహసించుచువచ్చి వానినాకర్షించెను. మిత్రమా! ఈస్వప్న ముతోఁ బ్రభాతమెల్ల భయావహమై గడచెను. మాలో నెవరికో మరణ మును శంకింతును. ఖరరథమెక్కి చనుచున్నట్లుగా నెవఁడు కలలోఁగాన వచ్చునో వానికాటిపొగ యచిరకాలమునఁ గననగునందురు. ఈవెతయొండు తలఁపనీయదు. కంఠము తడియాఱెను; ఎద కుదుటపడదు; అకారణ భయము వెన్నంటి తఱుముచున్నది; ఎలుఁగు సన్నగిల్లెను; నన్ను నేనే నిందించుకొందును. సఖా! నాతండ్రికై భయమగుచున్న'దని భరతుఁడు చెప్పెను.

ఆ చెలికాఁడు మహైశ్వర్యవుగ్నుఁడయ్యు మిత్రుని యూఱటకుఁగా ధైర్యము వహించి 'కల కల్లగాక నిజమగునా? వాతాదిదోషములు ప్రకో పించి మస్తిష్కమును మిథ్యాప్రపంచమునఁబఱభ్రమింపఁ జేయుచుండును. భ్రాంతి

తత్త్వముఁ దెలియక వ్యసనపడుట హృదయ దౌర్బల్యమగును. నీబోంట్లకిది తగదు. జీవితకాలములోపలఁ బ్రతివ్యక్తికి లెక్కలేని కలలుగాంచును. అవినిజమైనచోఁ జెప్పవలయునే? ఇదంతయు నీకుమాత్రము స్వానుభవసిద్ధముగాదా?' యని పెక్కుసమాధానములు చెప్పసాగెను. వారట్లు సంభాషించుచుండఁగా దూతలువచ్చి 'రాకుమారా! వసిష్ఠాదేశంబున నయోధ్యనుండి వచ్చితిమి. గురుజనమును మంత్రులును గుశలముఁదెలుపుచున్నారు. ఆకస్మికముగాఁ గార్యమొండొదవెను. అందులకు నీవు మందలయుండవలయునఁట. ఈమాటనీతోఁ జెప్పి నిన్నువెనువెంటఁ గొనిరమ్మని వసిష్ఠమహర్షి మమ్ముఁ బుత్తెంచెను. తాతగారికిని మామగారికిని గానుకలు తెచ్చితి'మని విన్నవించిరి.

భరతుఁడా చీనాంబరాదులందికొని దూతలకుఁ బ్రతిపూజలొసఁగి 'తండ్రి కుశలమా? రామలక్ష్మణులు సుఖమున్నారా? ధర్మనిరతయైన కౌసల్యాదేవియు ధర్మజ్ఞయగుసుమిత్రయు సుఖమా? నాతల్లియేదేనిఁ జెప్పిపంపెనా?' యని యడిగెను. 'రాకుమారా! ఎల్లరు సుఖమే, తడవుసేయవలదు. లక్ష్మి పద్మహస్తములు సాచి నీకైవేచియున్న' దని వారు పలికిరి.

భరతుఁడయోధ్యకుఁ జరలుట.

భరతుఁడంత మిత్రులను వీడ్కొని తాతయు మేనమామలయు నొప్పుదలఁ బడసి వారిసన్మానములఁది తమ్ముని వెంటఁగొని చతురంగబల సమేతముగాఁ దరలి తూర్పుదెస పోయి సుదామనదిని దాఁటి, పశ్చిమవాహినిని శతద్రూనదిని ఏలాధానగ్రామసమీపంబున నుద్గమించి, యపరపర్వతదేశము సొచ్చి శిలామహానది నతిక్రమించి యాగ్నేయ శల్య కర్తన గ్రామంబులమీఁదుగా మహాపర్వతములుగడచి చైత్రరథవనమార్గముఁద్రొక్కి పీరవత్స్యదేశంబులకు నుత్తరంబున గంగాసరస్వతీ సంగమమందలి భారుండవనముఁబ్రవేశించి యావలఁ గుళింగాయమునా సంగమస్థానముచేరి యట సైన్యవిశ్రాంతికిఁగా నుంత నిలిచి బడలికలు వాసి యమ్మహారణ్యంబును భద్రజనుమీఁదఁగడచి ప్రాగ్వటపట్టణంబున నంశుధానంబనుచోట భాగీరథి నుత్తరించి కుటికోష్ఠికావాహినిని వెనువైచి ధర్మవర్ధనతోరణ గ్రామముల మీఁదుగా దక్షిణాభిముఖుఁడై చని జంబుప్రస్థము నతిక్రమించి వరూథగ్రామ సమీపంబున మరల నుంత విడిసి యందుండి తూర్పుగాఁబోయి కరం

జనవాటీబహుళమైన యుజ్జిహా నగరోద్యానవనము దాసి యట స్వదేశముం దడఁగిడి పరివారమును నెమ్మదిగా రమ్మని తాను బయనమై సర్వతీర్థగ్రామమునకు వచ్చి విశ్రాంతిఁగొని తరలి యుత్తానికాదినదులను పార్వతీయ తురంగంబులవలన దాఁటి లౌహిత్యనగరంబున గఫీవతీనదిని నేకసాలగ్రామంబున స్థాణుమతీనదిని గడచి వినతనగరంబున గోమతీనది నధిగమించి కళింగనగరముచేరి యందలిసాలవనంబున గోడాల యలపుదీర్చి యరుణోదయంబుతోడ నయోధ్యానగరంబును సందర్శించెను.

### అయోధ్యానగరస్థితి.

అట్లు భరతుఁడేడు దివారాత్రములు ప్రయాణము చేసి యయోధ్యానగరము చేరి యదిమాటుమణఁగినట్లుండుటఁ గాంచి యాశ్చర్యవిషాదములంది 'ఇంత స్త్రీపురుషుల కలకలధ్వనులు నిరంతరముఁ గములముగా నుండును. ఎట్టిసందడియు నేఁడు వినరాదు. కాముకులు నిశాక్రీడాసక్తులై యీనగరోపవనములందు రేలు గడపి కనుచీఁకటిలోనఁ దమయిండ్లకు హుటాహుటిఁ జనుచుందురు. ఆశోభయు నేఁడు గానరాదు. వాహనంబుల రాకపోకలతోఁ బురవీధులు నడువరాకుండును. నేఁడొక్కటియుఁ గాన్పింపదు. అరుణుఁడుదయించినను మృగపక్షులధ్వనులు చెవిఁబడవు. మారుతములు చందనాగురుధూపగంధంబులను గుబాళించుచు వీచుచుండును. అదియు నేఁడు గలుగదు. భేరీమృదంగంబులు వాయవు; నాహృదయము తహతహపడుచున్నది.' అని తలపోయుచు జయంతద్వారముగుండ నగరుసొచ్చి 'సారథీ! నన్నింత హుటాహుటిఁ బిలిపించిరి: కారణముఁ దెలుపరైరి. నా మనస్సు శంకాకులమగుచున్నది. గృహస్థులు ముంగిళ్ళను జిమ్మరు; తలుపులు మూయరు; బలికర్మములు గానరావు; ప్రజలు నిరశనులట్లు తోఁచుచున్నారు; కుటుంబిభవనము లెల్ల నలక్ష్మీకములట్లు గాన్పించుచున్నవి. దేవాలయములు పుష్పార్చనాది శోభారహితంబులుగా నసంమృష్టాజిరంబులుగా నున్నవి. యజ్ఞగోష్ఠులు లుప్తములై యున్నవి. పూలయంగళ్ళు విచ్చవు. క్రయవిక్రయములు సాగవు; మండపాములందలి పక్షులు దీనముగా నున్నవి; జనులమోములందు దహతహపాటు చూపట్టుచున్నది. ఈలక్షణము లెల్ల రాజవినాశమును సూచించునని పెద్దలు వచింతురు. ఏమి విననున్నానో'

యనుచు రాజగృహమునకుఁ బోయి యందుఁ దండ్రిని గానక తల్లి మందిరము నకుఁ జనెను.

కైకేయీభరతులు.

కైకేయి సుతుని గాంచి పరమసంతోషమునంది సువర్ణాసనమునుండి లేచి యెదురేగెను. భరతుఁ డామెకు నమస్కరించెను. ఆమె తనయుని గవుఁగిటఁ గూర్చి శిరము మూర్కొని యంకమునఁ జేర్చి 'వత్సా! ఎన్నాళ్లు ప్రయాణముచేసితివి ? నీతాత కుశలమా ? నీమేనమామ సుఖమా ? అని యడిగెను.

భర.—ఏడు దివారాత్రములు ప్రయాణముచేసి వచ్చితిని. మావారెల్లరు సుఖముగానున్నారు. వారుపంపిన పారితోషికములను గైకొని నా పరిజనము వెనుక వచ్చుచున్నది. దూతల త్వరవలన ముందు వచ్చితిని. అమ్మా ! హేమభూషితమైన నీ పర్యంకము నేఁ డలంకారశూన్యముగానున్నదేల ? ఇక్ష్వాకులందు సంతసము గానరాదేల ? నాయన యేఁడీ ?

కై.—పుత్రా ! భూతకోటికెల్ల నేగతితప్పదో యాగతిని నీతండ్రి పొందెను. వగచియు ఫలము లేదు. దానయజ్ఞాధికారిణియు శీలవతియు శ్రుతివచోనుసారిణియునైన నీబుద్ధి చలతనముఁ బడయరాదు.

భ.—తల్లీ ! అన్నగారి పట్టాభిషేకమునో యేదోయొక మహాయాగమునో సంకల్పించిరని యువ్విళ్లూరుచు వచ్చితిని. నానొకటితలఁచిన దైవ మొకటి తలఁచునన్న సామెత సార్థకమయ్యెను. కటా ! నాతండ్రిని కన్నారఁ జూచుభాగ్యము గూడ నాకుఁ గలుగదయ్యెను. అమ్మా ! ఏపాడువ్యాధి వానిని హరించెనో కదా ? పితృసంస్కార మొనర్చి నాయన్న ధన్యుఁడయ్యెను. ఆపాటి కల్మియు నాకుఁ గలుగదు. హా ! నాయనా ! నీకూర్ములు నీబుజ్జగింపులు నేఁటితో నాకుఁ గీడెను. అమ్మా ! ఇఁక నాకుఁ దండ్రియు బంధువు సర్వము రాముఁడేగదా. నారాక వాని కెఱిగింపుము. తల్లీ ! అవసానకాలంబున నాతండ్రి యేమని నాకుఁగాఁ జెప్పెనా ?

కై.—నాయనా! హా! రామా! యనుచుఁ బ్రాణములు విడిచెను గాని నీమాటయే తలఁపఁడు. రాముఁడు సీతాలక్ష్మణసమేతుఁడై మరల వచ్చిననాఁడు వానినెవఁడు సందర్శించునో యతఁడు సిద్ధార్థుఁ డను మాటమాత్రము నీతండ్రి నోట వచ్చెను.

భ.—ఏమీ! నాతండ్రి యవసానకాలంబున రామాదులుగూడ లేరా? వారెందుఁ జనిరి?

కై.—దండకారణ్యమునకు వివాసార్థము చనిరి.

భ.—ఏమి! నాయన్నకు వివాసశిక్ష విధించిరా? బ్రాహ్మణధన మపహరించెనా? అదండ్యులను దండించెనా? పరస్త్రీని గోరెనా? భ్రూణహత్యాపాతక మొడిఁగట్టెనా?

కై.—నాయనా! రాముఁ డెట్టి యకార్యమును జేయలేదు. సంగతి వినుము. రాజు నాకుఁ దొల్లి రెండువరముల ననుగ్రహించెను. అవి నేను కోరనుంటిని. అంతలోన రామునకుఁ బట్టాభిషేకమును దలపెట్టిరి. ఆసంగతివిని యీనికి నావరములు జ్ఞప్తిజేసి రామవివాసమును నీపట్టాభిషేకమును గోరితిని. రాజు సత్యసంధుఁడు గావున నావరములను బ్రసాదించి తనువు త్యజించెను. ధర్మజ్ఞా! రాజ్యభారమును వహింపుము. వత్సా! నీకుఁగా నింతచేసితిని. రాజ్యము నిష్కంటకముగా నీచేతఁ జిక్కెను. వసిష్ఠాదుల యాదేశము తలఁదాల్చి పితృసంస్కారములొనర్చి పట్టాభిషిక్తుఁడవై నాచిరమనోరథము నీడేర్పుము.

భరతుఁ డామాటలు విని కటకటంబడి నిట్టూర్చి 'ఏమంటివి? నాయన్నకుఁగాదని నాకు రాజ్యమా? తండ్రిని దెగటార్చి యన్నకు నారచీరలిచ్చి నాకు రాజ్యమును సంపాదించితివా? కరాళీ! మావంశమునకుఁ గాళరాత్రివైతివి గాని యొండుగాదు. నిప్పని యెఱుంగక నాతండ్రి నిన్నుఁ గౌఁగిటఁ జేర్చి బూదియయ్యెను. కౌసల్యాసుమిత్రలను శోకాగ్నికుండమునఁ ద్రోసితివి. నాయన్న నిన్ను మహాభక్తితో శుశ్రూషించుచుండెను. ఆసేవలేనియు దలఁపవా? కౌసల్యాదేవి నిన్ను సొంతచెల్లెలినిగా మన్నించుచుండెను. ఆమెప్రేమయేని నిన్నడ్డగింపదయ్యెనా? పాపీ! సత్యసంధుఁడగు నాతండ్రిని మోసగించి ధర్మచిత్తుఁడగు కౌసల్యాదేవి గర్భంబునఁ

జిమ్ముఁ జొనిపి లోకాభిరాముని రాముని గుట్టలకుఁ ద్రోలి కోసలదేశంబుల నేకచ్ఛత్త్రాధిపత్యము వహింప నెంచితివా ? నీయట్టి బుద్ధిహీనులుగలరా ? నీమతమునకుఁ దోడ్పడుదునని నీమనస్సు నన్నుఁ బ్రేరేచెనా? నాయన్నయెడ నాకుఁగల భక్తిగౌరవంబులు తెలియని నీయజ్ఞానంబు నిన్నింతకుఁ దెచ్చెను. కులపాంసనీ ! నాయన్నకు వెలుపనేని నిన్ను క్షణంబు పరిత్యజింతును. కుల ఘాతకా ! రామలక్ష్మణులను నిరసించి రాజ్యసంరక్షణ మొనర్ప సాధ్యమా? ఇంతమాత్రపుఁ దెలివి లేదయ్యెనా ? వృద్ధరాజు మోహమునకు లోఁ బడుటమూలమున నైతివా ? పుత్రఘాతినీ ! ఈదురాలోచనము నీకెట్టు జనిం చెను ? రాజ్యము జ్యేష్ఠక్రమాగతమగుట తెలియదా ? రాజవంశంబున జనింప వా? రాజధర్మంబును తిరస్కరించి సంప్రదాయమును నీటఁబుచ్చి మాకీర్తి [illegible] నాకు మరణాధిక దుఃఖంబును మూటగట్టితివి. దీనికిఁ బ్రతి కారమేమిగలదు ? ఇదిగో చూడుము. నాయన్నయెదుటనే తోడితెత్తును ; నీవెంటఁ జిచ్చు రగిలింతును ; భగ్నమనోరథవై యేడ్చియేడ్చి రూపుమాయుము దుష్టనారీ. నరకమే నీకు శరణమగును. పతిఘాతినీ ! నీవు నాకు మాతృ రూప మహాశత్రువవుగాని తల్లివిగావు. ఎంతో పాపమొనర్చి నీగర్భ మున జనించితిని. దుర్వృత్తా ! పుత్త్రుండు తల్లికి హృదయజుండు గాని యంగప్రత్యంగజుండు గాఁడను సంగతి యెఱుఁగవా ? పుత్త్రవియోగమున కన్నమించినదుఃఖము తల్లికిఁగలుగదని తెలియదా ? చతుష్పాదులకుఁ గల సుతవాత్సల్యము నీకుఁగలుగదయ్యెనా ? సురభి సుతసహస్రముఁ గలిగియుఁ దనబిడ్డలరెంటిని మాన్పలేక మధ్యాహ్నమువఱకు దున్నుచున్న వానిని జూచి పరపరఁ బొక్కి వగచుటయు దేవేంద్రుఁడువచ్చి యూఱడించుటయు వినవా ? అందఱు బిడ్డలుగల యాసురభి రెంటికష్టమును జూచి [illegible] పడఁగా రామైకపుత్త్రకయైన కౌసల్యాదేవి సుతవివాసమునకై యెంతవంత పడునో యూహింతువా ? పరమసాధ్విని వివత్సగా నొనర్చిన నీకు నిహపర ములు రెండుఁ దక్కవు. పాతకీ ! నీచేత సహింపఁజాలను ; అపుత్త్రకంబు లైన పౌరులమ్రోల నీకనొక్కనిమిషమైనను నిలువనోపను. నాయన్నకు దెచ్చి యిందు విడిచి వానికిమాఱుగా నేను వివాసినై దూఱఁబోవుదును అని మహాక్రోధముగాఁ గైకేయినిఁ దెగడి పాదతాడితభుజంగమునకైన [illegible] [illegible] మిం[illegible] [illegible]

నంబలె నేలఁగూలి పెద్దయుండడవువఱకుఁ దెలివొంది ధారాపాతంబుగా వర్షించుచున్న బాష్పజలంబులకుఁ దడియుచు జడునిమాడ్కి నుండెను. అంతలోన మంత్రులచ్చటకు వచ్చిరి. భరతుఁడు వారినిజూచి 'రాజ్యకాంక్ష నాకుఁ గలలోఁగూడఁ గలుగదు. ఈవ్యూహము నాకు బొత్తుగాఁ దెలియదు. సీతారామలక్ష్మణుల వివాసమిప్పుడు వినుచున్నాను; త్రిశుద్ధికి నమ్ము' మని గట్టిగా వచించెను.

భరతునిశపథము.

కౌసల్యాదేవి భరతునికంఠధ్వని విని వానినిజూచునిమిత్తము తరలి గడగడ వడఁకుచు నడుగడుగునకు సొమ్మసిల్లుచు నెట్లో కతిపయపదములు వచ్చెను. భరతశత్రుఘ్నులంతలోన నామెకెదురైరి. వివర్ణయుఁగృశయు మలినాంగకయునై దుఃఖావతారముగానున్న యామెను గాంచినంతనే భరతుని ప్రాణములెగసెను. అన్నదమ్ములిద్దఱు నామెపాదముల వ్రాలి పెల్లురోదనమొనర్చిరి. కౌసల్యాదేవి యాత్మదుఃఖమును బట్టఁజాలక 'భరతా! నీతల్లి నీకు నిష్కంటంక రాజ్యమును సంపాదించెను. నాకొడుకు గుట్టలపాలయ్యెను. నన్నుఁగూడఁ దఱుమనున్నది. ఆతల్లికింత శ్రమవలదు. అగ్నిహోత్రమును గైకొని సుమిత్రాద్వితీయనై నాకూనయొద్దకు నేనే పోవుచున్నాను. సుకృతివేని మమ్ముఁగొనిపోయి యచ్చట వదలు' మనెను.

భరతుఁడాపాదమస్తము కంపిల్లుచుఁ జేతులు జోడించి 'ఆర్యా! ఈదీనుని విన్నప మాకర్ణింపుము. నాయన్నగారిమీఁద నాకుఁగలభక్తి నీకుఁ గ్రొత్తగాదు. ఈవిపరీతము లిప్పుడే వింటిని. ఇందాఁక నాకుఁదెలియవు. ఏపాపమెఱుంగను. తల్లీ! సత్యసంధుఁడును సత్పురుషాగ్రణియునైన నాయన్న నిట్లుగావించుట నాకుఁదెలిసియుండు నేని నాశాస్త్రానుసారబుద్ధి నన్నుఁ ద్యజించుఁగాక, నాయన్న వివాసమును నేను సమ్మతించియుందు నేని, నీచజాతిని సేవించు వాఁడేగతిని బొందునో, సూర్యునెదుట మూత్రపురీషములు విసర్జించువాఁ డేగతినొందునో, నిద్రించుచున్న గోవును గాలఁదన్నువాఁడేగతిఁ బడయునో, ఉపకరించినభృత్యునకు జీతమియ్యని వారికేగతియగునో, ప్రజావల్లభుఁడైన రాజునకు ద్రోహమొనర్చువాఁడును బలిమిఁడాఁబ్భాగఁబును గొనియుఁ బ్రజలను రక్షిఁపని ఱేఁడును మహాధనులైన

ఋత్విక్కులకుఁ జెప్పిన యాగదక్షిణలీయని యజ్వియు నేగతిఁ బొరయు నట్టి యాదుర్గతి నాకగుఁగాక. జననీ! రామవివాసంబును దలఁచిగానీ చెప్పిగాని చేయించిగాని యుందునేని యుద్ధంబునఁ బిఱుదివియువాఁడును, గురూపదిష్టశాస్త్రసూక్ష్మార్థంబుల మఱచువాఁడును బాయసకృసరఛాగమాంసంబులను దేవపితృతిథులకు సర్పింపక తినువాఁడును, మాతా పితృ గురుజనంబుల నవమానించువాఁడును మిత్రద్రోహియు విశ్వాసఘాతుకుండును కృతఘ్నుండును బడయుగతి నాకగుఁగాక. అమ్మా! నాయన్నకట్టి యపకారమునైనను నేను తలఁచియుందునేని దారాపుత్రాదుల నోరుగొట్టి మృష్టాన్నము గుడిచిన పాతకమును, స్త్రీబాలవృద్ధులను జంపిన దురితంబును లాక్షామద్యమాంసలోహాది నిషిద్ధవస్తువిక్రయంబునఁ గుటుంబమును భరించిన వృజినంబును వెన్నిచ్చిపఱచు వైరిని దునిమిన కిల్బిషంబును నన్ను మ్రింగుఁగాక. జనయిత్రీ! నన్ను శంకింపవలదు. నాయన్నకట్టికీడునైనను చేసియుందునేని కపాలమును జేతఁగొని గోచిఁగట్టి వెఱ్ఱివలె నూరూరభిక్షమెత్తికొనుచు భూమండలమెల్లఁ గ్రుమ్మరుచుందుగాక; కామక్రోధాభిభూతుండనై మద్యపానము సేయుచు జూదమాడుచు వంచనాంగనలపంచలు ప్రాఁకి జీవింతుఁగాక; నాధర్మబుద్ధి నశించుఁగాక; సూర్యోదయాస్తమయంబుల నిద్రించు దరిద్రుఁడనగుదుఁగాక; గురుతల్పగపాపనిహతుఁడనై పోదునుగాక; సత్కర్మములు నన్నుఁ ద్యజించుఁగాక; సజ్జనులు నన్ను బహిష్కరింతురుగాక; బహుపుత్రకుండనగు పేదనై నిరంతరము వివిధపీడారోగదుఃఖంబుల మునుఁగుదుఁగాక; ఋతుస్నాతయైన భార్యను బతివ్రతామణిని వదలివర్తించిన పాపము నాకగుఁగాక; జలమావకుండును విషదాతయు సత్కారవిఘాతకుండును బొందు దురవస్థ నాకగుఁగాక; తల్లీ! ముమ్మాటికి నిజము వచింతు' నని నానాశపథపూర్వకంబుగా నాత్మనిర్దోషత్వంబును బ్రకటించి దుఃఖాక్రాంతుఁడై మూర్ఛిల్లెను. కౌసల్యాదేవి వానిని లేవఁదీసి యంకమునఁగూర్చి 'నాయనా! నీశపథములు నాదుఃఖమును రెట్టించుచున్నవి. సత్యప్రతిజ్ఞుండవై సతాంలోకంబును బడయు'మని యూరార్చి వ్యసన వివశయయ్యెను.

దశరథుని దహనక్రియలు.

అంతలోఁ దెల్లవారెను. వసిష్ఠమహర్షి భరతునొద్దకు వచ్చి 'రా

పుత్రా! శోకమువలదు. ఎవరికినిఁ గాలగతితప్పదు. నీతండ్రిగారియుత్తరక్రియలొనర్పుము. తదర్థము నిన్నింత వేగముగా రప్పించితి'నని చెప్పి తైలద్రోణినున్న దశరథ కళేబరంబును దెప్పించెను. భరతుఁ డాశవముపైఁబడి కొంతవడి యేడ్చి యేడ్చి 'తండ్రీ! నేను దేశాంతరమున నుండఁగా ధర్మజ్ఞుఁడైన నాయన్నను మహాబలసంపన్నుఁడగు లక్ష్మణుని వనంబునకుఁ బంపిన నీమతమేమో తెలియదు. నాయన్న వనగతుఁడౌను నీవు దివంగతుఁడవునైతిరి. ఇఁక నీరాజ్యమునకు దిక్కెవ్వ' రని వాపోయి వసిష్ఠఋత్విగాదుల ప్రోద్బలంబున శవంబు నలంకరించెను. తనయింటి యగ్నిహోత్రము కూడనందునఁ బొరుగింటినుండి దానిని దెచ్చిరి. పరిచారకులాశవంబును బల్లకిలోనుంచి దానినెత్తుకొని తరలిరి. ప్రజలు గుంపులుగూడి రజితసువర్ణంబులను జందనాగురు సరళపద్మకాదినానాగంధద్రవ్యచూర్ణంబులను వస్త్రంబులను జల్లుచు గుగ్గిలధూపములు వేయుచు ముందునడచిరి. శ్మశానవాటి చేరినంతట ఋత్విజులు శవమునెత్తి చితిపయినుంచి భరతునిచేతికి నగ్నియందిచ్చి పైతృమేధకమంత్రములు పఠించిరి. సామగులు యథాశాస్త్రము సామగానమొనర్చిరి. అంతలోన దశరథుని భార్యలు వృద్ధస్త్రీజనపరివేష్టితలై యథార్హశిబికాదుల మీఁద నటకు వచ్చిరి. ఋత్విజులును గౌసల్యాదులును భరతుఁడును శవమునకు నప్రదక్షిణముగావించి పెల్లు విలపించిరి. దహనక్రియలు ముగిసెను. అంత వారు సరయూనదికిఁజని మంత్రిపురోహితసహితంబుగాఁ బ్రేతకు సలిలదానములు గావించి నగరుజొచ్చిరి.

పదిదినములు చనెను; పదునొకండవనాఁడు భరతుఁడు శుచియై పన్నెరెండవనాఁడు శ్రాద్ధకర్మములొనర్చి పితృపరలోకక్రియలనుద్దేశించి బ్రాహ్మణులకుఁ గనకరత్నవస్త్రాభరణంబులను గోభాగంబులను దాసీదాసజనంబును గృహవాహనంబులను బుష్కలముగా దానములిచ్చి పదుమూఁడవనాఁడు శోధనార్థము ప్రాతఃకాలమున శ్మశానభూమికిఁ జని తండ్రిని దలఁచి 'నాయనా! ఎవని యొడిలో నన్నుంచి నీవ్రపోఁదగునో యట్టి నాయన్న యడవులపాలయ్యెను. దిక్కులేనిచోట నన్ను దిగవిడిచితివి సుతునిబాసి కౌసల్యాదేవిని దిక్కుమాలినదానఁగాఁజేసితివి. నీవును మమ్ములఁ ద్యజించితివి' అని భస్మారుణంబును దగ్ధాస్థిస్థానమండలంబును నైన యాచితిని జూచి రోదనసేయుచు నేలఁగూలెను. శత్రుఘ్నుఁడును దండ్రినిస్మరించి దుఃఖిం

భయపడి వడఁకుచు భరతుని చాటుఁజొచ్చెను. భరతుఁడు తమ్మునిఁజూచి 'నాయనా! స్త్రీవధకూడదు; మఱియు నన్నగారికోపతాపంబులకు వెఱతును. కాకున్నచో నీకూళ్ళిందుండరు. ఈదుష్టలను బగగొందుమేని మనకార్యము మనయన్నకుఁ దెలియకుండదు. స్త్రీవధకులను మనయన్న కంటితోఁగూడఁ జూడఁడు. వానికోపమునకు మనము గుఱిగారాదని ప్రశాంతవచనములఁ బలికెను. ఆమాటతోడ శత్రుఘ్నుఁడు తనయాగ్రహంబును సమదాయించుకొని మంధరను వదలెను. అదికైకేయివలన దాఁగి నాటికిఁ గడతేఱితినని మెలమెల్లగా నందుండి జాఱిపోయెను.

### భరత పట్టాభిషేకమును రాజకర్తలు కోరుట.

మఱునటిఁయుదయంబున రాజకర్తలు వచ్చి భరతునిఁ బిలిచి 'రాజపుత్రా! అనాయకముగా రాజ్యముండరాదు. దైవయోగంబున నెట్టి విపరీతములు గలుగక యీపదునాలుగుదినములెట్లో గడచెను. జాగువలదు. అభిషేచనికమును గొనివచ్చి స్వజనము నిన్నుఁ బ్రతీక్షించుచున్నది. పట్టాభిషిక్తుండవై పితృపైతామహధ్రువంబగు రాజ్యంబును బాలించి మాబోంట్లను రక్షింపుము.

'చ. అవనియరాజకంబయినయప్పుడ భూప్రజయందు సర్వధ
ర్మవులుఁదొలంగు దేవముని ముఖ్యులు హాయుదురోలివృష్టిలే
దవు మఱియర్ఘువ్రల్ దఱుఁగునందురుగావునఁ గాలయాపనం
బవితధవాక్య! చేయక నయనంబున రాజ్యమునిల్పు మిత్రజిత్.'

అని యుపదేశించిరి.

వసిష్ఠమహర్షియు శిష్యసమేతముగా వచ్చి సభామండపమున సుఖాసీనుఁడై మంత్రులను గణాధిపతులను బ్రాహ్మణక్షత్రియవైశ్యముఖ్యులను దదితరరాజ్యహితులను దూతలవలనఁ బిలిపించి భరతశత్రుఘ్నయుధాజిత్తుసుమంత్రులను రప్పించి సభకూర్చి 'వత్సా! భరతా! ధర్మవ్రతులైన దశరథరాములు నిష్కంటకమైన యీరాజ్యమును నీకిచ్చి చనిరి. పట్టాభిషిక్తుండవై సుఖముండు' మనెను.

### భరతుఁడు రాజ్యమును నిగ్రహించుట.

భరతుఁడు మహావిషణ్ణాస్యుఁడై కరయుగముమోడ్చి 'ఋషిచంద్రమా!

త్రవ్యాటకు వసతులేర్పఱచుటకుఁ గొందఱు బయలుదేరిరి. భరతుఁడు రథమెక్కెను. వానిని గౌసల్యాసుమిత్రలనుగమించిరి. వారితోఁడఁబురమెల్లఁ గదలెను. కైకేయి నిజాపరాధమునకుఁ బ్రాయశ్చిత్తమోయన మున్ముందు నడచెను.

గుహ భరత సంవాదము.

భరతుఁడట్లు వెడలి సాయంకాలమునకు శృంగిబేరపురసమీపంబున గంగాతీరమున విడిసెను. ఆసేనను గుహుఁడు చూచి తనజ్ఞాతులను గూర్చి 'గంగయొడ్డునున్న సేనాసాగరమును జూచితిరా? దుర్మతి భరతుఁడు రాముని పయిఁ దండెత్తఁగాఁబోలు. అదిగో కోవిదారధ్వజము. దీనినిబట్టి యది భరత సైన్యమని నిశ్చయింపవచ్చును. కటా! కైకేయీ సాహసమేమనవచ్చును? ఆమె మాయవారితన మెవరికిఁ గలుగును? భర్త వశవర్తుఁడయ్యెను; రాముఁడు గట్టలపాలాయెను. ఆయింతి యంతతోఁ దనియదు. రాముఁడు భూమి మీఁద నుండుట తనకొడుకునకు ముప్పని యామె నిశ్చయము. రాముని దెగటార్పఁ దండ్రియొల్లఁడు; ఆపనికిఁ గొడుకును బ్రేరేచిపంపెను. వనచరుని రాముని వేఁటాడు నిమిత్తము భరతుఁడు వచ్చెను. ఎంతదారుణము! ఎంత క్రూరము! పెక్కురాజులను జూచితిని; రామునియందుఁగల మహారాజ లక్షణంబు లెందును గానరావు. విశాలవక్షంబును దీర్ఘబాహువులును కంబు గ్రీవంబును సమోన్నతమాంసలములును నాకర్ణాంత నేత్రంబులును నిసర్గలక్ష్మీకూర్చినయసదృశభూషణములై యొప్పుచుండఁగా విధాతృనిర్మాణశక్తికిఁ బరమావధి యోయన నుండు నంగసౌష్ఠవముగలిగి సస్యశ్యామలశరీర చ్ఛాయ మెఱుఁగు లీనుచుండఁగా రాముఁడు చూడఁజూడ ముచ్చటగును. వేయేల! అతఁడు పుం మోహనమూర్తిగాని యొండుగాఁడు. ఆకారమునకుఁ దగిన ప్రజ్ఞయుఁ బ్రజ్ఞకుఁ దగిన వినయమధురిమయు వానియందే చూడనగును. ఆమేధావి యెఱుంగని తత్త్వరహస్యము లేదందురు. మఱియు సత్యవాదియు నెవఁడన్న వానినే చెప్పవలయును. వానిసంభాషణము మితమును ధర్మయుక్తము నై సదా ప్రియముఁ గూర్చుచుండును. అపకారినిగూడ నమ్మహాత్ముఁడు నెపమెన్నక యుపకరించును; గోరంతమేలొనర్చినను మఱవఁడు; శరణన్న ప్రాణమిచ్చును; స్వార్థమెట్టిదో యెఱుంగఁడు; అహితమెన్నఁడు నొన

యయ్యెడు. నాకు నన్నయుఁ దండ్రియు నీడయునైన రాముని దోడి తెచ్చుటకుఁ బోవుచున్నాను. సంశయమువల' దని తనయుదంతమెల్ల వినిచెను. గుహుఁడు పరమప్రీతుఁడై 'భరతా! నీకు రాజ్యమయత్న ప్రాప్తమాయెను. అట్టిదానిని గూడఁ ద్యజించితివా? నీత్యాగమేమనవల యును? నీకీర్తి చిరస్థాయియై వెలయుఁగాక' అని తనయానందమును వెల్లడించెను.

అంతలోన రాత్రియయ్యెను. సైన్యమెల్ల బడలి మైమరచి నిద్రించెను. భరతునకు మాత్రము కనుగూర్కదు. వాని తల్లిదుండగంబును దానం గలిగిన విపత్తులును వానిహృదయదర్పణంబున నొక్కటొక్కటిగాఁ బొడసూపసాగెను. వానియంగములెల్లఁ జెమర్చెను. గుహుఁడు వాని మనస్తాపంబును గ్రహించి డాయబోయి 'భరతా! నీయట్లు రాముఁడుగూడ నిందొకరాత్రి గడపెను. వానిని లక్ష్మణుఁడు రేయెల్ల నెప్పవాల్పక కాచియుండెను. నేను లక్ష్మణునిఁ జేరి 'నాయనా! ఈకష్టంబులకునోర్వ; సుంత పరుండి బడలికలు బాయుము. రామప్రసాదార్థుఁడనైయున్నాను. వానియందు నాకుఁ గల ప్రేమయింతనరాదు. నేను నాబంధుజన సహితంబుగా వేచియుండి రాముని గాపాడుదు' నని వాని నెన్నోవిధముల వేడితిని. ఎంతచెప్పినను సౌమిత్రి వినక 'అయ్యా! నాయన్న భార్యతోడ నిట్లు కటికనేలఁ బడియుండుటఁ జూచుచు నేను బ్రతికియుండుట కెంతయువగతును. ఈయవస్థ చూచు నాకంటికిఁ గూర్కు వచ్చునా? దేవాసురులేకమై వచ్చినను జయింపఁజాలని పరాక్రమశాలికి దశరథమహారాజ చిరతపఃఫలమైన వానికి నాయన్నకు నిట్టికష్టములు వచ్చుటఁ దలఁపగా విషాదాశ్చర్యములు పెనగొని యేచుచున్నవి. రామునెడఁబాసి దశరథుఁడు చిరకాలము జీవింపఁడు; కోసలావని త్వరలోనే విధవకానున్నది; కౌసల్యాసుమిత్రలు [illegible]మింతురు; సర్వము శూన్యముగా నాకంటికి గోచరించుచున్నది; [illegible] మాకును ఋణము తీరె' నని బహువిధముల దుఃఖించెను. వాని దుఃఖమును మాన్పలేనైతిని. తెల్లవారినంత వారు జడలు దాల్చి వల్కలములుగట్టి సీతాదేవిని వెంటఁగొని చని రనెను.

ఆకథవిని భరతుఁడు దుఃఖితుఁడై నేలవ్రాలెను. వానికి శత్రు

ఘ్నుఁడు విలపించెను. ఎల్లరు బెగడొంది వాపోవసాగిరి. కౌసల్యాదేవి వానిని సందిటఁగూర్చి 'నాయనా! ఏలయిట్లయితివి? మాప్రాణములు నీచేతిలోనున్నవి. నిన్నుఁజూచి బ్రతికియున్నాము. ఏదేని దుర్వార్త వినవచ్చెనా? యని దురపిల్లఁజొచ్చెను. భరతుఁడు తెప్పరిల్లి తనయొదకు వచ్చికొని కౌసల్య నోదార్చి 'నిషాదేశ్వరా! నాయన్న నాఁటిరేయి యెందుఁబరుండెను? లక్ష్మణుఁడెందుఁ గాచియుండెను? సీతాదేవి యెచటఁ బవళించెను? వారేమి భుజించిరి?' అని గుహునడిగెను. నావుడు 'భరతా! ఈగారచెట్టు క్రింద దర్భశయ్యపయి రాముఁడు పరుండెను. వాని సమీపమున సీతాదేవి యటఁబవళించెను. లక్ష్మణుఁడు వారియడుగుదమ్ములు గడిగి యాచోట ధనుష్పాణియై కాచియుండెను. వారికి భోజనార్థము నానాభక్ష్యములను వివిధఫలంబులను బహుతరరుచిరాన్నములను దెచ్చితిని. ఏదియు ముట్టరైరి. క్షత్త్రియులకు దానాధికారము గలదుగాని పరిగ్రహాధికారము లేదని రాముఁడు నాకు సమాధానము చెప్పి తమ్ముఁడు తెచ్చిన నీరు పుడిసెఁడు త్రావి యుండెను. సీతాలక్ష్మణులుగూడ నట్లేయొనర్చిరి. నేనును విల్లు దాల్చి నాబంధుజనముతోఁ గూడి లక్ష్మణునివెంటనుంటి' నని గుహుఁడు చెప్పెను.

భరతుఁ డాగారచెట్టు క్రిందకుఁజని యందున్న దర్భశయ్యను గాంచి తల్లులను బిలిచి 'యీపడకమీఁద మహాత్ముఁడు రాముఁడు నాఁటిరాత్రి గడపె' నని వారికి దానిని జూపి 'కటా! మెత్తని యాస్తరంబులు గప్పి నెత్తావిపూలుచల్లి తీర్చిన ప్రాసాదవిమానవలభీప్రదేశములందు హంసతూలికాతల్పములపయి శుకపికమధురారావములను వీణారవములు నాలకించుచు మలయమారుతుని సేవలందుచుఁ బరిజనసహస్రయుతుఁడై హాయిగానుండునట్టి నాయన్నకుఁ గటికరాలమయమైన కీకారణ్యమందు గ్రావపూగావళిమధ్య రెల్లుపయి నిద్రించుదురవస్థ కలిగెఁగదా! ఈ విపరీతము తలంపునకు గూడ అందకున్నది. దైవమునకన్నఁ గాలమే బలవత్తరమనుమాట నిజమగుచున్నది. అయ్యో! ఈ యగచాట్లకెల్ల నేనేగదా మూలము. నావంటిపాపాత్ముడుండునా! లక్ష్మణా! అనిర్వచనీయమైనట్టి దురవస్థయందుఁ గూడ రాముని విడనాడవైతివి. నీసుకృతమే సుకృతము. ఆపద్బాంధవుఁడన్న నిన్నే మాపవలయును. జనకరాజతనయా! పతివ్రతాధర్మంబును లోకంబున

నుద్ధరించి కృతార్థవై తిరిగిరా. మీపాదరేణువునకుం బోలుదునా !—అన్నా ! నీకుంగాని భోగములు నాకేల ? నేనుగూడ నీమార్గమనుసరింతును. వల్కలములుగట్టి జడలు ముడిచి కందమూలాశినినై నేలమీదం బరుండుచు నీపాదధ్యానరతుండనై యుందును. ఇదే నాకుం బాపప్రాయశ్చిత్తమగుం గాక. నామనవిచేకొనవేని నీవెంటనుందు' నని పెక్కుగతుల దుఃఖించెను. ఆరేయి యెల్ల నట్లు చనెను.

భరతుఁడు భరద్వాజ మహర్షిని సందర్శించుట.

తెల్లవారినంతట భరతుఁడు గుహునితో 'మిత్త్రమా ! నదినిదాటింపు' మనెను. అతఁడు నిజపురికిఁజని బంధువర్గంబును లేపి సంగతియెల్ల వారికి వినిచి విశాలములును జిత్రపతాకాభిశోభితములునైన యోడలను స్వస్తికములను రేవునందుఁ దీర్చి యందొక దానిపయి నెఱ్ఱకంబళి పఱపించివచ్చెను. భరతశత్త్రుఘ్నులు దానిపైనెక్కిరి. అన్నిపడవలుండియు నెల్లరకుం జాలవయ్యెను. కొందఱు తెప్పలమీఁద దాటిరి. కొందఱు ఘటముల యాధారమున నీఁదిరి. భరతుఁడట్లు ససైన్యంబుగా గంగానదిని దాఁటి యాత్రోయములాడి పరిశుద్ధుఁడై యందుండి మైత్త్రముహూర్తంబునఁ దరలి ప్రయాగవనము సొచ్చి యటఁ బరివారమును డించి శస్త్రవస్త్రములువదలి పీతాంబరముందాల్చి మన్త్రిపురోహితులను వెంటఁగొని భరద్వాజాశ్రమమునకుం జని తద్బహిర్భాగంబున నెల్లర నిలిపి వసిష్ఠద్వితీయుఁడై లోనికిఁబోయెను. భరద్వాజుఁడు వసిష్ఠునకు నర్ఘ్యశాద్యాది గౌరవములు గావించెను. భరతుఁడు తనయూరుపేరు చెప్పి యామునికి నమస్కరించెను. భరద్వాజుఁడు వారికి యథాక్రమ మర్ఘ్యపాద్యము లిచ్చి కుశలమరసి తగుమర్యాదలుగావించెను. వసిష్ఠభరతులునమ్మునిఁ గుశలమడిగి వానియగ్నిహోత్త్రములు విచారించిరి.

ఇట్లు సమాగమపూర్వాంగము ముగిసినంత భరద్వాజుఁడు భరతుని బిలిచి 'వత్సా ! రాజ్యము వదలి యింతదవ్వురానేల ? నీయన్న యమిత్త్రదమనుఁడగుటయు జగదానందవర్ధనుఁడగుటయు లోకవిదితము. ఆ కళ్యాణమూర్తి యాకౌసల్యాతపఃఫలము తండ్రియాజ్ఞకుం గట్టువడి చతుర్దశవర్ష వనవాసమును స్వీకరించి భార్యాయుతుఁడమ్మఁడుం దోడుగా వెడలివచ్చెనుగదా. రాముఁడు నిష్కంటకరాజ్యము నభిలషించితివ. అట్టియభిలాష నిన్నెట్టి

మకార్యమునకుఁ బురికొల్పదుగదా ?' యనెను. భరతుఁడు క్రించుఁదనము పాల్పి పొటుపొటఁగన్నీరు నించుచు 'భవాదృశుల మనంబున నిట్టిసంశయము స్ఫురించుట నాదురదృష్టముగాని వేఱుగాదు. ఋషివర్యా! రాజ్యము నాకువలదు; త్రిశుద్ధికి మీయెదుటఁ బ్రమాణము చేయుచున్నాను. నా తల్లి కుంటెనతనము నాకుఁ దెలియదు. నేను నగరాంతరమున నుండఁగా నింతజరిగెను. ఈలోకగర్హితకార్యమును మహానుఁడు భరతుఁడెంత మాత్రము నంగీకరింపఁడు. నాయన్న చరణముల వ్రాలి వానినయోధ్యకుఁ గొనిపోవవచ్చితిని. వానియక్కడలు సెలవీయవేఁడుదు' నని పొగిలఁ బడెను. భరద్వాజుఁడు మహాసంతోషమంది 'వత్సా! ఇంద్రియనిగ్రహ మును జ్యేష్ఠానువర్తనమును సత్పురుషలక్షణములు. రాఘవులన్యథాకరింపరు. యోగబలంబున నీతలంపును గ్రహించియు దృఢీకరణార్థమును భవత్కీర్తి ప్రచారముపొంటె నిట్లు ప్రస్తావించితిని. రాముఁడు సీతాలక్ష్మణయుతుఁడై చిత్రకూటంబున నున్నాఁడు. నీవు సపరివారముగా నేఁడిందుండి రేపు చనవగు' నని వచించెను. భరతుఁడు వానిపలుకులు తలతో గ్రహించెను. భరద్వాజుఁడు వానికి మెచ్చి 'వత్సా! మాయెడ నీకుఁ బరమప్రీతిగౌరవ ములుండుటయు నీవలఁతిసంతోషి వగుటయు నెఱుంగుదుము; నీ సేనకు విందొనర్ప నెంచితిమి; బలమును దూరాన విడిచి రానేల?' యనెను. 'తపోధనా! ఆశ్రమములకు బాధ కలుగరాదు; తాపసులున్నవలను దప్పించి ప్రయాణించుట రాజులకు విధిహితము. ఆకారణంబున నట్లు చేసితి' నని భరతుఁడు విన్నవించెను.

భరద్వాజుఁడు భరతునకు విందొనర్చుట.

భరద్వాజుఁడంత వీతిహోత్రగృహము ప్రవేశించి యమ వరుణ కుబేర దేవేంద్రాదులను విశ్వకర్మను సంస్మరించి 'భూమ్యాకాశంబులఁ గల నదీనదములిందు వచ్చి మైరేయమద్యంబును సురను నిక్షురసముపోని శీత జలంబులను సమకూర్పుఁగాక; గంధర్వాప్సరసలు గీతానృత్యంబులచేత నతిథులను దనుపుదురుఁగాక; చైత్రరథము వచ్చుఁగాక; భగవానుఁడోషధీశుఁడు చతుర్విధాన్నములను నానాపానరసంబులను వివిధమాంసంబులను బుష్కలముగా సంతరించి వృక్షవాటియెల్ల నవనవపత్రపుష్పఫలభరితంబుగా నొనర్చుఁగాక. ఎందును గొదువ లేకుండుఁగాక' యని సంకల్పించెను.

మలయమారుతము హాయిగా వీచెను; పుష్పవర్షములు గురిసెను; స్వర్వైరిణీనినదంబులు చెలరేఁగెను; నృత్యగానంబులు దృక్కర్ణహృదయ సంతర్పణంబు లొదవించెను. పంచయోజన విస్తీర్ణ పర్యంతము ధరాభాగ మెల్ల నీలవైడూర్య రచితమో యన లేఁబచ్చికలతో నలరారెను. తరువులు ఫలపుష్పభరితములై కొమ్మలు సాచి యతిథిసత్కారార్థము నిరీక్షించుచున్నవో యన నొప్పెను. చతుశ్శాలలును గజశాలలును నేలయీనినట్లయ్యెను; రాజగృహము శరన్మేఘధవళమై మహోన్నతకవాటతోరణంబులుగల్గి వివిధమాల్యావృతముగా నానామృదుతల్పాసనశోభితంబుగాఁ బరిమళగంధ బహుళంబుగాఁ బహువిధరత్న పాత్రమయముగా బరిఢవిల్లెను.

"సీ॥ ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు,
నొకకొన్ని తెఱఁగుల యొలుపుఁబప్పు
లొకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు,
లొకకొన్ని విధముల యొజ్జిచేరు
లొకకొన్ని కలకల్వ లొకకొన్ని బజ్జులు
నొకకొన్ని రీతుల యూరుపవగలు,
నొకకొన్ని పిగరులు నొకకొన్ని యంబళ్ళు
నొకకొన్ని వహులపూపోత్కరములు,

గీ॥ వివిధఫలకందమూలంబులవియుఁగొన్ని
యూరుఁబిండులు నొకకొన్ని యొక్కకొన్ని
యూరఁగాయలు పచ్చళ్ళు నొక్కకొన్ని
పెరుగుపాలేనె నేతులు, పెచ్చుపెరిగె."

భరతుఁడు ససైన్యంబుగా నందుఁ బ్రవేశించి మహర్షి తపోబలంబునకు మహైశ్వర్యమొంది యాభవనంబుననున్న దివ్యాసనంబునకును శ్వేతచ్ఛత్ర చామరంబులకును బ్రదక్షిణించి రాముని స్మరించి నమస్కరించి సింహాసనము బూజించి వింజామరముగయిఁబట్టి మంత్రిజనోచితమైన యాసనంబున గూర్చుండెను. వానిననుసరించి మంత్రిపురోహిత సేనాపతులు యథార్హమధివసించిరి. అంత గంధర్వరాజులు నారదతుంబురగోపులు గానమారంభించిరి. అలంబుస మిశ్రకేశి పుండరీక వామన మున్నగు నచ్చరమచ్చెకంటులు నృత్తము

పొగించిరి. వేనవేలు దివ్యాంగనలు వచ్చి యతిథులనెల్ల జలకములాడించువారును వస్త్రములందిచ్చువారును భక్ష్యభోజ్యములు కొసరికొసరి వడ్డించువారును బరిమళద్రవ్యము లలఁదువారును నై సకలోపచారములు గావించిరి. ఎల్లరు స్వర్గభోగము లనుభవించుచు నాటిరాత్రియందుఁ బుచ్చిరి.

తెల్లవాఱినంత భరద్వాజమహర్షి యగ్నిహోత్రకార్యములు దీర్చి యాశ్రమమున నుండెను. భరతుఁడు వానిని సమీపించి 'మహాత్మా! రామసందర్శనమునకు నువ్విళ్ళూరుదును; ఇందునాకుఁ గాలునిలువదు. చిత్రకూటమెంత దూరమో యచటికి మార్గమేదో సెలవీయవేడుదు' ననెను. ఆ మహర్షి భరతుని నిష్కళంకభక్తికి మెచ్చి 'వత్సా! చిత్రకూట మిటకు సార్ధయోజనదూరమున నున్నది. దాని యుత్తరభాగంబున మందాకినీనది గలదు. సీతారామలక్ష్మణులు చిత్రకూటమునఁ బర్ణశాల నిర్మించుకొని యున్నారు' అని చెప్పి దారిఁజూపెను.

కౌసల్యా సుమిత్రలు భరద్వాజునకు మ్రొక్కి నిలిచిరి. కైకేయి నిజపాపభారవినమ్రగాత్రయన వంగి యాఋషికి నమస్కరించి లజ్జఁజెంది కౌసల్యాదుల చెంత నిలువనోపక మునీంద్రునకుఁ బ్రదక్షిణమొనర్చు నెపంబున భరతుని ప్రక్కకు నొసరిల్లెను. భరద్వాజుఁడు భరతునిజూచి వీరెవ్వరనఁగా 'మహాత్మా! శోకదీనయై కృశించియున్న యీమెయే కౌసల్యాదేవి, రాముని గన్న పూజ్యురాలు; పూరాలి కొండగోగు వలెనున్న యీమె సుమిత్రాదేవి; విక్రమసింహులగు లక్ష్మణశత్రుఘ్ను లామెతనయులు. సీతారామలక్ష్మణులకు వివాసమును భర్తకుఁ బుత్రశోకమరణమును నాకీకష్టము నొక్కమాటతోఁ గూర్చిన యీతల్లియే యీమందభాగ్యుని తల్లి కైకేయీదేవి. ఈయార్యరూపిణికిఁగా గడలేని యపకీర్తిని మూటఁగట్టితి' నని యతఁడుపలికెను. ఆమహర్షి యామాటవిని 'వత్సా! భరతా! నీతల్లి యందు దోషమెంచవలదు. రామవనవాసము భవిష్యన్మంగళమునకుఁ బునాది యని గ్రహింపుము. ఇందువలన భావితాత్ములగు ఋషులకును దేవతలకు నెంతో మేలుగలుగనున్నది. కైకేయి నిమిత్తమాత్రురాలు. దైవప్రేరణ మట్లుగావించె' నని భగవత్సంకల్పమును సూచించెను.

భరతుఁడు చిత్రకూటమునకుఁ దరలుట.

అంతభరతుఁడు మహర్షికి మ్రొక్కి వానియనుజ్ఞవడసి సపరివారముగా వెడలి గంగాదక్షిణతీరమునఁ గీకారణ్యముఁబడి కొంతదవ్వు చని చిత్రకూటసానువులను గాంచి మందాకినీ తరంగసంఘట్టనధ్వనులను విని 'నీలనీరదంబులు జలబిందువులనట్లు సానువులందలి పున్నాగంబులు ప్రసూనంబులను గురియుచున్నవి. హరిణంబులు మనసైన్యమును జూచి పెద్ద పెనుగాలికి నభ్రములువోలె చెల్లాచెదరగుచున్నవి. నీలజీమూతములఁబోని శిఖరాగ్రతలములందుఁ బూజొంపములఁ దాల్చి సొబగారుచున్న యీతరువులను జూడఁగా పెఱులుదువ్వి విరులు ముడిచిన దాక్షిణాత్యులు తలఁపునకు వచ్చుచున్నారు. ఖురఘట్టపరాగము రాముని యాశ్రమపథంబును గప్పుచ్చునోయని గాఁబోలు మారుతుఁడు దానినెగఁజిమ్ముచున్నాఁడు. రథనేమిధ్వనులను మేఘగర్జనంబులఁగా భ్రమించి మయూరము లెగసియిక్కవలు దూయుచున్న' వని పలికి రామాశ్రమమును గురుతించిరమ్మని భటుల నాజ్ఞాపించెను. కొందఱు పోయి నలుక్రేవలఁ జుట్టి వచ్చి 'దేవా! చూపుమేరదూరమున నదిగో ధూమశిఖగానవచ్చుచున్నది. అది రామాశ్రమమో ఋష్యాశ్రమమో కానోపు' ననిరి. భరతుఁడు పరివారము నెల్ల నందుడించి వసిష్ఠసుమంత్రులను వెంటఁగొని యావంకఁ బోయెను.

సీతారాముల వనవిహారము.

రాముఁడు చిత్రకూటము చేరి నాఁటికొకమాసమయ్యెను. ఆయరణ్యము నిర్జనముగావున నందు నివసించుట సామాన్యులకుఁ గూడఁ గష్టతరము గాక మానదు. పుట్టువు దొట్టి నగళ్లలో వేలకొలఁది జనులమధ్యఁ బెరిఁగిన సీతాదేవికి నట్టి నివాసము కష్టతమమగుట వింతగాదు. అయమ్మ యందులకుఁగా విమనస్కయగునేమోయని రాముఁడు శంకించి యట్టిది పరిహరింపఁదలఁచి యామెను వెంటఁగొని వెడలి యందందలి విశేషంబుల నామెకుఁ జూపుచు 'కళ్యాణీ! ఈపర్వతరామణీయకములు రాజ్యభ్రంశదుఃఖమును గాని బంధువియోగక్లేశమును గాని నన్నుఁ దలంపనీయవు. ప్రేయసీ! వివిధధాతుమయములై మిన్నొరయుచున్న యీగిరిశిఖరంబులు బాలార్కకిరణప్రసారంబునఁజేసి వింతవింతవన్నె నీనుటఁ జూతువా? తలోదరీ! ఈనగరాజము మునిసేవితమగుట యిందలి మృగపక్షిజాతులు నిసర్గవైరముగా

మూని కలసిమెలసి యుండు నెయ్యమే ప్రకటించుచున్నది. కాంతామణీ! శైలప్రస్థములందుఁ గిన్నరమిథునంబుల విహారంబులను తిలకింతువా ? భళీ ! సెలయేళ్ళతోడను సానువులతోడ నిగ్గిరీంద్రము మదస్రావికరీంద్రమును దలఁచుచునుగదా. శిరీషగాత్రీ ! మందానిల మతిథిజనసత్కారపరతం బోలె గుహాంతనిర్గతమై నానాసూనగంధములు మోచి తెచ్చి ఘ్రాణేంద్రియ సంతర్పణ మొనర్చుచున్నది. ఇందులకుఁ దనియని ప్రాణియుండునా ? ప్రాణేశ్వరీ ! నినుఁగూడి లక్ష్మణుని పరిచర్యలందుచు నిండుసంవత్సరము లున్నను నాకుఁ దనివి తీఱునట్లు తోఁపదు. ఈవనవాసము ఫలద్వయమును గూర్చి యెంతో యుపకరించెను. ఎట్లందువా ? పితృఋణము తీఱెను ; భరతునకుఁ బ్రియముఁ గూరెను. దేవీ ! ఇందలి సౌభాగ్యంబులఁ జూఱ లాడుచు నాతోనుండు నీకు వెగటుగాదుగదా ? వనవాసము విదేహముక్తికి నప్పుతోపాయమని పూర్వరాజర్షులు వచించిరి. అట్టిది మనకు నప్రార్థితముగా లభించెను. సఖీ ! ఈచిత్రకూటము నీలపీతసితారుణశిలామయమై నిక్కముగాఁ జిత్రకూటము నగుచున్నది. అదిగో చూడుము ; ఓషధులు పెట్టనిదీపములై యద్రితలంబును మనోహరంబుగా వెలిగించుచున్నవి. రమణీ ! ఈనల్లగల్వపూవ్వులను బొగడపూసెజ్జలను భూర్జపత్రశయనంబులను లేఁదామరపడకలను బరికింతువా ? ఈమృదితకమలమాలికలు కామిజనపరిత్యక్తములై కృతఘ్నుల తత్త్వమును దెలుపుచున్నవిసుమా. ఆత్మేశ్వరీ ! కులధర్మవివర్ధనములైన నియమంబుల బాటించుచు సాధుమానవర్తినై సీతోడ నిందు విహరించుచుందు. నాకుఁ బదునాల్గువర్షములు క్షణప్రాయమగును. దేవీ ! అవిగో మందాకినీసైకతప్రదేశములు. అతిమనోహరములైన యవి భావోద్దీపికంబులుగాక మానవు. జలంబులబయిఁ దేలియాడుచున్న యాతామరలసొబగుఁ జూతువా ? హంసకూజితంబులు వీనూపురధ్వనుల ననుకరించుచున్నవిసుమా. చెలీ ! హరిణకంబులు చేవ్రేలఁబట్టి నీరు గ్రోలుతీరు చూడఁ జూడ వినోదమయ్యెడు. అదిగో చూడుము మునులు కొందఱు జటావల్కలములుగట్టి తోయమాడుచున్నారు ; కొందఱు బాహువులెత్తి మార్తాండభగవానునిగూర్చి యుపస్థాన మొనర్చుచున్నారు. శాతోదరీ !

గీ. కొండసెత్తమ్మిగొనబాఱుగున్నతెమలు
వీచినదిపైని మూనముల్ విసరుఁజూవె !

కమ్మతావిపుష్పమ్ముల నెమ్మితోడఁ
బ్రియుఁడు ప్రియురాలిపైఁ జోపు నయముదోఁప.

పర్వతమునుండి గాలికి వీచి పుష్పంబులు నపేతలంబునఁ బడుచుఁ బ్రియుఁడు వియలను బ్రియురాలిపయి విసరుమురిపెంబును దలపించుచున్నవి. సుందరీ! అలచక్రవాకపు జంటలయనురాగంబును బరికింతువా ? అవి సతీపతుల ప్రేమైకవర్తనంబునకు మార్గదర్శకములుగావా ? మర్త్యులు తిర్యగ్జంబుల వలన సయితము నేర్చికోఁదగిన సంగతు లెన్నోగలవు. కోమలీ! చిత్రకూటమే యయోధ్యగా మందాకినియే సరయువుగా వన్యమృగములే పరిజనముగా భావింపుము. అనుకూలవతివైన నీవును భ్రాతాధికుఁడైన లక్ష్మణుఁడును దోడుండుఁ రేని నింకఁ ద్రికాలనదీస్నానసుఖమనుభవించుచు మధుమూలఫలాశినై యెట్టిమనోద్వేగ మెఱుంగక హాయిగా వసింతు' నని యన్యాపదేశంబుగా నాత్మనిశ్చయమును దెలుపుచుఁ గొంత తడవు వినోదవిహారంబులఁ బుచ్చి కొండనెత్తముమీఁదఁ జలవతాతిన్నెపయి సీతాసహితుఁడై కూర్చుండి నయ్యాయవిశేషంబులను బ్రియురాలికి మధురమధురంబుగాఁ బలుకుచు స్వాదుఫలంబులఁ దెచ్చి యిచ్చుచు నామెను వినోదింపఁ జేయుచుండెను.

రామభరతుల సమావేశము.

సీతారాములట్లు గూర్చుండి యచ్చికబుచ్చికంబుల నుండఁగా వారికట్టెదుట దూరమున హఠాత్తుగాఁ బరాగపటలి రేచి యెత్తుగాఁవుకప్పెను. శ్రవణకఠోరంబులు భేరులనట్లు మహాధ్వని చెలరేఁగెను; మత్తమాతంగములు భయపీడితములై పఱచు వేగధాటికి విరిగి కూలుచున్న వృక్షంబుల ఫెళఫెళారావంబు లకాలమేఘగర్జనంబులుగాఁ దోఁచెను. రాముఁ డావిపరీతములఁ జూచి 'లక్ష్మణా ! కెంధూళిచీఁకట్లు పర్వుచున్నవి ; మేఘఘోషలవలె ధ్వనులుప్పతిల్లుచున్నవి ; వనసత్త్వంబులు భయభ్రాంతములై యాత్మరక్షణార్థ మెండొంటి దాఁటి పఱచుచున్నవి. రాజో రాజమాత్రుఁడో వేఁటకై వచ్చియుండును. అట్లుగాదేని యపూర్వసత్త్వము వనముఁజొచ్చియుండును ; సంగతియేమోపరికింపు' మని తమ్మునితోఁ జెప్పెను. సౌమిత్రి యంతచేరువనున్న మహోన్నతవృక్షమెక్కి యుత్తరదిశఁ జూపుసారించి 'అన్నా ! చతురంగబలము గానవచ్చుచున్నది. దేవిని గుహాంతరమునకుఁ

లక్ష్మ: యగ్నిహోత్రముఁజల్లార్చి కవచముఁదొడిఁగి శరసంధానమొనర్పఁ బోవును.

రా:—సౌమిత్రీ! ధ్వజముగానరాదా! దానిఁబట్టి సైన్యము నూహింపలేవా!

లక్ష్మ:—అన్నా! కోవిదారధ్వజము గానవచ్చుచున్నది; అశ్వికులు నింగిఁ జెంగలించుచున్నారు. కైకేయీసుతుని వాఁడిగాఁదోఁచును. భరతుఁడు నిష్కంటకరాజ్యమును వలచి మనకు వెసరుపెట్ట వచ్చుచున్నాఁడు; ధనుర్ధరులమై గిరినాశ్రయించుదము; కాదేని యుద్ధసన్నద్ధులమగుదము. మనచేటులకెల్ల మూలమైన యితనిసందర్శనము మనకు గలిగెనగుఁగాక. ఇతఁడు వధ్యుఁడగుట నిస్సంశయము; వీనివధ దోషముగాదు; మీఁదుమిక్కిలి ధర్మమే యగును. కైకేయి తనకుమారవ్యాపారఫలము వేఁడుఁ గడుపార భుజించునుగాక. ఆపాపిని సబాంధవంబుగా దహించి మంథరాకుధరంబును దుత్తునియలు గావింతును; ధాత్రి పాపవిముక్తయై సుఖించుఁగాక. ఇన్నాళ్ళుగా మత్క్రోధానలంబు నడఁచి పెట్టితిని; దుర్భరమైనతలవంపును మోసితిని. అవి యిప్పుడు పైకొనుచున్నవి. విరోధిరక్తమాంసంబులు వెదచల్లి క్రూరమృగసంతర్పణమొనర్చి నాభుజకండూతిని దీర్చుకొన సెలవిమ్ము.

రామ:—తమ్ముఁడా! శాంతింపుము, శాంతింపుము. భరతుఁడు దురుద్దేశముతో వచ్చుచున్నట్లు తలంపవలదు; యుద్ధసన్నాహమెంత మాత్రము వలదు; భరతుని జంపుదునేని నా ప్రతిన బూటకమగును; నాకుఁ దీఱనియపవాదము గల్గును. మఱియు నసత్యవాదినగుదును. అసత్యవాదికి రాజ్యమేల! మఱియు బంధుమిత్రరుధిరప్రదిగ్ధమైన ద్రవ్యము కాలకూటముగదా. లక్ష్మణా! రాజ్యకాంక్ష నీకులేదాయని యందువా! ధర్మార్థకామంబులొండె ధరిత్రీమండలమొండె మఱియొకటియొండె మీకొఱకె గోరుదుఁగాని యాత్మార్థము గోరుటగాదు. నిస్సంశయముగా నీవి

యేల ! వత్సా ! తలాతలలోకంబులెల్ల నాయంఋచేతనుండఁగా గోష్పాదమువంటి యీముక్కడి రాజ్యమువలయునా ! సౌమిత్రీ ! భరతుఁడు పరమభ్రాతృవత్సలుఁడు ; వాఁడు నాకుఁ బ్రాణాధికుఁడుగాని యొండుగాఁడు. అతఁడయోధ్యకు వచ్చి వివరమెల్లవిని వ్యాకులేంద్రియుఁడై యనన్యప్రేరితుఁడుగా నిందువచ్చుచున్నాఁడు. తల్లియకార్యంబును వాఁడెంతమాత్రమును మన్నింపఁడు. రాజ్యమును నాకుఁగట్టుటకై వాఁడిందు వచ్చుటగును. లక్ష్మణా ! పుట్టువుదొట్టి మనమెల్లఁ గలసి మెలసి యుండుముగదా. ఎన్నడేని వాఁడు నీకు గోరంత యపకారమొనర్చెనా ? అప్రియమెట్టిదేని వచించెనా ? వానిని సంశయింతువేల ? వాఁడిందువచ్చినప్పుడు పరుషముఁగాని యప్రియముగాని పరాకునఁగూడఁ బలుకవలదు. వానిననుట నన్ననుటయగును. ఆపదలందువా ? అవి ప్రాణిసహజంబులు. అవి రెండువిధంబుల నుపకరించును. ఎట్లందువా ? వానివలనఁ బ్రారబ్ధము భుక్తమై నశించును ; అవి ప్రాణిప్రకృతికిఁ బరీక్షలగును. సత్త్వాభివృద్ధిని గోరువారాపదలను వలతురేగాని దెగడరు. తనస్థితిని దానెఱుంగుటకన్న మానవునకు వేఱొండు మేలుగలదా ? బంగారువన్నె పటపుటాయివలన నెట్లో యట్లే మనుష్యుల స్వభావము క్లిష్టపరిస్థితులయందు బయలుపడును. తమ్ముడా ! మఱియొకమాట. రాజ్యమేనీకుఁ బ్రధానమేని భరతునిఁ బ్రాణముతీయనేల ? వానివలననే దానిని నీకిప్పింతును గదా. అతఁడు నామాట మీఱఁడుసుమా.

ఆమాటలు విని లక్ష్మణుఁడు తన యవిమృశ్యకారిత్వమునకు లజ్జించి యన్నకు మనస్సంతాపమొందవుట గ్రహించి వానిహృదయమును బ్రస్తావాంతరమునకు మరల్చువాఁడై 'అన్నా ! సుతవియోగమునోర్వక మనతండ్రియే యిందు వచ్చుచున్నాఁడుగాఁబోలు' ననెను. నావుడు ఉండనోపు ; అదిగో నాయనగారిజాత్యశ్వయుగము వచ్చుచున్నవి; అదిగో పట్టపుటేనుఁగు శత్రుంజయము సేనాముఖంబున నడచుచున్నది. శ్వేతధ్వజముమాత్రము

—నరాదు. మాతముగాక, దిగిరమ్ము' అని రాముఁడు చెప్పెను. లక్ష్మ ణుఁడు చెట్టుదిగి వచ్చి రాముని పార్శ్వమునఁ గేలుమోడ్చి నిలిచెను.

భరతుఁడు పాదచారియై కొంతదవ్వు వచ్చి యచట యాశ్రమలక్ష ణంబులను బరికించి యందు రాముఁడుండనోపునని తలపోయ సాగెను. అంత లోనఁ గుహుఁడును శత్రుఘ్నుఁడును రామాన్వేషణార్థము చన్నవారు మరలి వచ్చిరి. భరతుఁడు వసిష్ఠునకు మ్రొక్కి 'ఋషిచంద్రమా! ఈయాశ్రమఁ బున నాయన్న యుండునని స్ఫురించుచున్నది. మునుపడ మేముఁ దరలుదుము. మాతల్లులను దోడ్కొని తమరు రానగు' నని వానికి విన్నవించి, గుహుని శత్రుఘ్నుని వెంటఁగొని చని కొండొకయెడఁ దాపసగృహంబును బోని కుటీ రంబును బర్ణమండపంబును రేలమంటకుఁగాఁ గూర్చియున్న కట్టియలను బూజార్థము సంతరించిన పుష్పంబులను జలిమిరి కాచికొనుటకుఁగాఁ జేర్చిన మృగమహిషకరీష రాసులను జూచుచుఁ బోయి

'మ. కనియెన్ గోమలనీలమేఘసుభగాకారున్ జటావల్కలా
జినధారున్ సితభూతిభూషితుని రాజీవాక్షుఁ గళ్యాణకీ
ర్తనుఁ గాకుత్స్థకులప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు స
న్మునిలోకార్చితు సత్కృపాభరణు రామున్ రాజచూడామణిన్.'

భరతుఁడట్లు తనయన్నను జూచి వానియంఘ్రిపద్మముల వ్రాలి బహు విధంబుల వాపోయెను. శత్రుఘ్నుఁడును వానికి సాగిలఁబడి నమస్క రించి బొటబొట కన్నీరు నింపసాగెను. రాముఁ డాతమ్ముల నిరువురఁ గవుఁగిటఁగూర్చి భరతునిజూచి 'నాయనా! ఎన్నాళ్ళకు నిన్నుఁ జూడఁ గంటిని! తండ్రి సుఖమున్నాఁడుగదా. వానిని విడిచినీవిటు రాఁజెల్లునా? తండ్రి ముదిమియు నీబాల్యంబును నిమిత్తములుగా నన్యులు రాజ్యమాక్రమిం పరుగదా. 'వత్సా! సత్యవిక్రముఁడైన తండ్రిని శుశ్రూషింతువా? విదిత వేదవేదాంగతత్త్వసారుఁడును బ్రహ్మతేజోవిరాజితుఁడు నైన మనకులగురు వును వసిష్ఠమహర్షిని యథావిధి పూజింతువా? కౌసల్యాదేవి సుఖమా? సుమిత్రాదేవి కుశలమా? కైకేయీదేవి సంతోషమా? వినయసంపన్నుఁ డును బహుశ్రుతుఁడునైన సుయజ్ఞుని సత్కరింతువా? దేవపితృగురుజ్ఞాతు లను యథార్హ మర్చింతువా? అర్థశాస్త్రవిశారదుఁడును దివ్యాస్త్రసంప

పన్నెండు నైన సుధన్వుని ధనుర్వేదాచార్యుని మన్నింతువా! విధిజ్ఞుండగు సుయజ్ఞుండు హుతహోష్యమాణంబులను యథాకాలము నీకుఁ దెలుపు చుండునుగదా. విద్యానిధులును జితేంద్రియులును సత్కులసంజాతులును శూరులు నింగితజ్ఞులు నాత్మసములు నైన వారేగదా నీమంత్రిపుంగవులు? భరతా! రాజవిజయంబునకు మంత్రమే మూలము. దానంజేసి కోవిదులును మంత్రధరులునైన వారినే మంత్రులుఁగా రాజు గ్రహింపవలయును.

"క. అనఘులశాస్త్రవిధిజ్ఞుల
    ననురక్తులఁబితృపితామహక్రమమున వ
    చ్చినవిప్రుల మంత్రులఁగా
నొనరించవె కార్యసంప్రయోగముపొంకై."

రాముఁడు రాజధర్మముల నుపదేశించుట.

ఎన్నడుగాని సోఁదు నిద్రావశుఁడు గారాదు; అతఁడు యుక్త కాలంబున మేల్కొనుచుండవలయును. కార్యాలోచనమునకు నర్ధరాత్రము తప్పనొండుసమయము తగదు; ఏకాకిగా నాలోచింపరాదు; అట్లని పెక్కండ్రతో నాలోచించుటయుఁ దగదు. ఆలోచితరహస్యంబును వెల్లడింపరాదు. లఘుమూలమును మహోదయము నైన యర్థంబులను నిశ్చయించి శీఘ్రముగాఁ జేయుచుండవలయును. ఆలస్యము తగదు. సామంతరాజులు సుకృతంబులును కృతరూపంబులు నైన కార్యముల మాత్రమే యెఱుంగ నగును; కర్తవ్యములు వారికిఁ దెలియరాదు. నీవును నీమంత్రులును గావించు నాలోచనంబులు యుక్తులవలనఁగాని తర్కంబులవలనఁగాని యింగితంబుల వలనఁగాని యన్యులకు నందరాదు. మూర్ఖసహస్రంబును ద్యజించియైన బండితునొక్కని సంపాదింపనగును. క్లిష్టకాలంబునఁ బండితుఁడుపకరించునేగాని మొఱకులు వేనవేలుండియుఁ గొఱగారు. మంత్రహీనులైన మూర్ఖరుమంత్రుల కన్న మేధావియు శూరుఁడును దక్షుఁడును విచక్షణుఁడునైన సచివు డొక్కఁడు చాలును.

"వత్సా! భృత్యుల నుత్తమమధ్యమాధములని మూఁడువర్గములుగా విభజించి తగినకార్యములందే వారిని నియమింపవలయును. కఠినదండనంబు లెంతయు బ్రజోద్వేగకరములు గావున రాజు శిక్షావిధానంబునఁ గడుమెలఁ

తీర్థములనుసయితమర్లే యొకకంటఁ గనిపెట్టియుండవలయును. శత్రువు దేశాంతరపలాయనుఁడై తిరిగి వచ్చినప్పుడు దుర్బలుఁడని వానినుపేక్షింపరాదు. అతనినొకకంటఁగాచియే యుండవలయును. నాయనా! లోకాయతికుల నెన్నఁడును సేవింపరాదు; వారు పండితమానులును పరమాజ్ఞానులనుట నిజమేగాని యంతటి యనర్థకుశలులుండఁబోరు. ధర్మశాస్త్రమున్నంతనే వారితల కంటగించును; శుష్కతర్కంబుల వారు ప్రొద్దుపుచ్చుచుందురు. పెడదారులు త్రొక్కించుటయే వారి దినచర్యగానుండును. ఈవిప్లవకారులున్న దేశమెన్నఁడును మేలుపడయదు. వారి నెప్పుడుగాని తలయెత్తనీయరాదు. వైశ్యులు రాజాభిమతులైయుండవలయును. అట్లగుటకు రాజు వారికిఁ గష్టంబులు తీర్చుచు నిష్టంబులు గూర్చుచు నుండవలయును. ఒండుచో వర్తకము యథావిధిసాగదు; వర్తకము సాగనినాఁడు జనులకు సౌఖ్యము పొసఁగదు. సర్వప్రజారక్షణము రాజధర్మమైయున్నను వర్తకులు విశేషాభిమానపాత్రు లగుదురు గావునఁ బ్రభువువారియెడ జాగరూకుఁడై మెలఁగవలయును. అంతఃపురాంగనలను మంచిమాటలతో సంతోషపెట్టుచుఁ వారికి బరపురుషసంభాషణాదులకు నెడమీయక వారిని గాపాడవలయును. స్త్రీలమాటల నమ్మనురాదు; నమ్మనట్లగపడనురాదు. ఎన్నడుగాని వారికి రహస్యములఁ దెలుపవలదు. నాగవనంబును జక్కగా రక్షింపవలయును. గజాదిసంగ్రహంబున నేనికప్పుడును దనివి జనింపరాదు. రాజు ప్రాతఃకాలమున లేచి సాలంకృతుఁడై సభాజనులకు సందర్శనమిచ్చుచుండవలయును. అవసరముగలిగినప్పుడు మాత్రమే పనివాండ్రకు రాజదర్శనము కావలయునుగాని యన్నప్పుడెల్లఁ గారాదు. రాజు దుర్గంబులనెల్ల ధనధాన్యంబులతోడను వివిధాయుధయంత్రంబులతోడను శిల్పివర్గంబుతోడను ధనుర్ధరులతోడను నించియుండవలయును. ప్రభువు తనరాఁబడిని వృద్ధిచేయుచు వ్యయమును మట్టగించుచు నుండవలయును. అపాత్రులకు ధనమీయరాదు. పరిశుద్ధాత్ములమీఁద నేరమునుమోపినప్పుడు దానిని శాస్త్రదక్షులవలనఁ జక్కగాఁ బరిశీలించి యథాన్యాయము తీర్పుచెప్పవలయును. లోభబుద్ధికి లోనై వారిని శిక్షింపరాదు. దొంగ సద్రవ్యముగాఁబట్టుపడి బుజువుమీఁద దోషిగా నేర్పడినప్పుడు లంచముగొని వానిని విడువరాదు. ధనికునకును దరిద్రునకును వ్యవహారము పొసఁగినప్పుడు రాజు వారి

నిపుణులను సమబుద్ధితో విచారింపవలయును. మిథ్యాభిశస్తుఁడు దండితుఁడై కన్నీరొలికెనేని రాజునకుఁ బశుపుత్త్రధనాదిహానియగును. బాలంబాల కుల వృద్ధులను మచ్చికంజేసి బాలురను త్రివర్గంబుల పండితులను రాజు వశపఱచుకొనవలయును. దేవగురు తపోధనులకును వృద్ధులకు నతిథు లకును జనపదవృక్షంబులకును సిద్ధార్థులైన బ్రాహ్మణులకును నమస్కరించుట మానరాదు. అధర్మసంపాదనంబునకుఁ గడఁగవలదు. సుఖంబున కొఱకై కామంబునకొఱకై ధర్మార్థంబులను వదలఁగూడదు. భరతా! పూర్వాహ్ణంబున ధర్మంబు నపరాహ్ణంబున నర్థంబును సాయాహ్ణంబునఁ గామంబును సేవింపవలెనని కాలజ్ఞులు నియతిని ప్రతిపాదించిరి గావున రాజు తన్నియమమును బాలింపవలెను. వేయేల! జనులెల్లరు రాజశ్రేయఃకాంక్షులగునట్లుగాఁ బ్రభువు వర్తింపవలయును. అనృతము నాస్తిక్యము క్రోధము ప్రమాదము దీర్ఘసూత్రత జ్ఞానిజననిర్లక్ష్యము ఆలస్యము ఇంద్రియపరత్వము ఏకచింతనము అనర్థజ్ఞమంత్రము నిశ్చితార్థానారంభము మంత్రారక్షణము ప్రాతఃకాలమంగళాద్యప్రయోగము ఏక కాలసర్వశత్రువయుద్ధము—ఈపదునాల్గును రాజదోషంబులండ్రు. రాజు వానిని సర్వథాపరిత్యజింపవలయును. రాజు సమర్థులగు వారిని నల్వురనో ముగ్గురనో తనకు మంత్రులుగా నియమించుకొని వారిమతంబులను వ్యష్టిగా సమిష్టిగా నెఱుంగుచుండవలయును. అగ్నిహోత్రాద్యనుష్ఠానంబులవలన వేదాధ్యయనంబును ధర్మనిబద్ధదానభోగంబులవలన ధనంబును సదాచారంబువలన శాస్త్రంబును సంతానమువలన భార్యను ఫలవంతములుగా జేయవలయును. ఒంటరిగా మధురాన్నమెన్నడును భుజింపరాదు; మిత్త్రుల యభిమతంబులను ధర్మానతిక్రమముగాఁ దీర్చుచుండవలయును. తమ్ముఁడా! రాజునకు నుండవలసిన ముఖ్యగుణములను స్థూలముగా వివరించితిని. ఈ గుణములను పాటించి మనతాతముత్తాతలు కీర్తిగాంచిరి. నీవును వారి మార్గమనుసరించి రాజతేజమును సార్థమొనర్చి యిహపరసౌఖ్యములందుము'

"తే.గీ॥ వీరు నమ్మంగఁ దగుదురు వీరనమ్మ
దగరు నాకనవలదు తత్త్వబుద్ధి,
నెవ్వరిని విశ్వసింపక యెల్లప్రొద్దు
నాత్మరక్షాపరుండగు నది విభుండు॥"

"క॥ పలుమఱు శపథంబులు నం
జలియును నభివాదనమును సామప్రియ భా
షలు మిథ్యావినయంబులు
గలయవి దుష్టస్వభావకాపురుష ప్రయత్॥"

"క॥ తన కిమ్మగునంతకు దు
గ్గనుఁడిష్టుఁడవోలెనుండి సర్పమవోలెం,
దన కిమ్మగుడును గఱచును
ఘన దారుణకర్మగరళఘనదంష్ట్రలచేత్."

కావున నట్టి వారియెడ జాగరూకుఁడవై యుండుము" ఎల్లప్పుడును బాపంబులవలన నేవగింపు" మని బోధించెను.

భరతుఁడు రామపట్టాభిషేకమును బ్రార్థించుట.

భరతుఁ డవియెల్ల సాంతముగా విని 'అన్నా! నీయుపదేశము లర్థములు. అవి రాజునకుఁ జెల్లునుగాని నీసేవాధర్మపరునకు నాకేల? రాజ్యము నీదిగాని నాదిగాదు. దానిని నేనెన్నఁడును గోరలేదు. ధర్మమును మన వంశ సంప్రదాయమును రాజలోకాచారము నన్నిటిఁ బరిశీలించి నాప్రణయ మంగీకరించి పట్టాభిషిక్తుఁడవై జగన్మంగళ మొనర్పుము. నీవు సర్వార్థసిద్ధుఁడవు. ఎందున్నను నీకుఁగొదువయుండదుగాని నీవు రాజత్వము వహింపనిచో లోకాపకారమగును. ఎట్లందువా? మానవులకుఁ బురుషార్థసంపాదనంబునకు మించిన కార్యము గలుగదు. అందు ధర్మము ప్రధానము. ధర్మమునకు వృత్తివ్యవస్థలేదు. ఏవృత్తియైనను ధర్మసహితమైనచో దానివలననే సర్వమును జేకూఱును. నీవుక్షత్రవంశంబున జనించితివి. రాజ్యపాలనము నీకు విధివిధానము. అట్టిదానిని నీవు నేఁడు మానినచో దానికిఁ గళంకమాపాదించుటగును. జనులు నీమార్గమనుసరింతురు. అందువలన లేనియుపద్రవములువచ్చును. కావున నీవు రాజ్యభారంబును వహింపక తీఱదు. అట్లుయట్లుండనిమ్ము. అన్నా! నేమరాకముం న్నె నీవు సీతాలక్ష్మణసమేతముగా వనమునకుఁ దరలనేల? నన్ను శంకించితివా? అంతటి పాపాత్ముఁడవా? సీతార్మికి దూరుఁడనైతినా? నీవియోగ మెంతటి యాపద గ్రహించెనో వింటి

నా ! ఏమిచెప్పుదు ! నాయన తెగటారెను ; వానిశవమును జూచుభాగ్యము మాత్రము నాకులభించెను. అన్నా ! లేలెమ్ము. తండ్రికి జలతర్పణాదు లొసంగుము. గాదిలిసుతుని తర్పణంబులు జనకునకు నక్షయపితృలోకంబును గూర్చును. అన్నా ! నీదేశోకముగాఁ దండ్రి తనప్రాణములు దొఱఁగెనని విన్నవించెను.

రాముఁడు తండ్రికి చరమక్రియలు సలుపుట.

పితృమరణవార్త చెవిసోకినంతనే గొడ్డటనఱికిన తరువువలె రాముఁడు నేలఁగూలి మూర్ఛావివశుఁడయ్యెను. వానిని శీతోపచారంబులఁ దేర్చిరి. అతఁడు కొంతవడికిఁ దేఱి 'హా ! తండ్రి ! నీకొడుకే నీకు మృత్యువాయెనా ? అయ్యో ! పితృదహనసంస్కారభాగ్యమేని నోచనైతినా ! అయోధ్యకు నాకు ఋణము తీఱెను ; కాదనివచ్చిన నన్నిఁక రాజకార్యముల నియమించి శిక్షించు దక్షుఁడెవఁడు ! తండ్రీ ! నీమెప్పులును నీబుజ్జవంబులు నిఁకనెందుఁ బడయుదు ! హా ! జానకీ ! నీమామను మఱచితివమ్మా ; లక్ష్మణా ! పితృహీనుండవైతి'వని వాపోవసాగెను.

తమ్ములు మువ్వురుఁగూడి పెద్దయొండడ వూఱటలు పలికి పితృచరమ క్రియకు రాముని బ్రేరేపించిరి. ఆధీరాత్ముఁడు నిజదుఃఖమును మ్రింగి కన్నీటిజాలునదొఁగుచున్న సీతాదేవిని బుజ్జగించి 'లక్ష్మణా ! ఇంగుదీపిణ్యాకముఁ దెచ్చియిమ్ము ; ఉత్తరీయమందికొనుము. నీవదినె ముందును వెనుక నీవును దరలుము ; నీవెంట నేను వత్తును. ఇట్టికార్యములందు స్త్రీలును బాలురును ముందు చనుట శాస్త్రీయ'మని చెప్పి, వారితోడఁబోయి మందాకినీసలిలంబులాడి తండ్రికి సభక్తికంబుగా నుదకంబులు విడిచి మఱల దోయిలి నీరుగొని దక్షిణాభిముఖుఁడై 'రాజసింహమా ! పితృలోకగతునకు నీకు నాయిచ్చుచున్న యీవిమలోదకంబు లక్షయముఁ గూర్చుఁగాక' అని జలంబును వదలి తీరమునకు వచ్చి గారపిండియు రేఁగుపండ్లును గలిపి పిండములు చేసి వానిని దర్భసంస్తరణమందుంచి 'మహారాజా ! పురుషుఁడు తాను భుజించునట్టి యాహారమునే దేవతలకు సమర్పించుట శాస్త్రీయము ; మాకిట నింగుదీపిణ్యాకమే యాహారము; అదే నీకు సమర్పించుచున్నాను ; ప్రీతితో గ్రహింపు'మని గద్గదస్వనంబునఁ బలికి నివాపమిచ్చి పర్ణశాలాభిముఖుఁడై చనెను.

కౌసల్యాదేవి పుత్రాదుల కష్టములకై దుఃఖించుట.

అంతలోన వసిష్ఠాదులు మందాకినీతీరమునకు వచ్చిరి. కౌసల్యాదేవి మొదలి రేవులు పరికించి 'సీతారామలక్ష్మణులు నిర్వివయాకృతులై యుండు వచ్చినది మొదలీరేవునందు నీరాడుచుందు' రని తలంచి, 'సుమిత్రా! నీ కుమారుఁడు రామునికొఱకు జలంబు లీరేవునుండి కొనిపోవుచుండును. నీచ కార్యనియోజితుండగు కతన లక్ష్మణుఁడు గర్హితుఁడని యెంచవలదు. అన్న శుశ్రూషయెట్టిదేని గుణవంతమే గదా. ఆకూనకు నిట్టిక్లేశము శీఘ్రమే తొలఁగుఁగాక' యని పలికి, తత్సమీపంబున దక్షిణాగ్రంబులగు దర్భలపయి నున్న యింగుదీపిణ్యాకములు చూచి,

సీ॥ చతురంతవసుమతీచక్రాధినాథుండు
గారపిండిభుజించు కరణియయ్యె
ఆగర్భలక్ష్మికుఁడైనట్టి పుత్రుండు
నారచీరలుగట్టి నవయుటయ్యె
వీరాతివీరైకవిఖ్యాతుఁడౌ కూన
మూపున నీరంబుమోయుటయ్యె
రాజాధిరాజుగారాబు పుత్రీమణి
మృగములతోఁగూడి మెలఁగుటయ్యెఁ

గీ॥ బతినిగోల్పోయి గాదిలి సుతునిబాసి
చచ్చిచావనిదాన్నై శరణులేక
యొరులపంచఁ బ్రాకుచు మనియుండుటయ్యెఁ
గటకటా! యింతకన్నదుఃఖంబు గలదె?

అని బహువిధంబుల విలపించెను. ఆమెను మెల్లగానోదార్చి పర్ణశాలకుఁ దరలించిరి.

రామాదులను వారి తల్లులు చేరుట.

రాముఁడు కౌసల్యాదులనుగాంచి యెదురేగి వారికి సవినయంబుగా నమస్కరించెను. వారు మృదుతరహస్తంబుల వానిని బుడికి చుంచులు దువ్వి శిరము మూర్కొనిరి. లక్ష్మణుఁడు తల్లులకుఁ బ్రణమిల్లెను. వారతని నాదరించిరి. సీతాదేవి యశ్రుపూర్ణేక్షణయై యత్తలయడుగుఁదమ్ములకు

శిష్యుఁడను, దాసుఁడను ; నన్నొప్పరికింపకుము. ఇది నాయొక్కని విన్నపమేగాదు ; ప్రకృతివర్గమెల్ల నైకకంఠ్యంబున నాముఖంబున నిట్లు విన్నవించుచున్నది.

రా :—భరతా ! నీవు కులీనుండవును సత్వసంపన్నుండవును తేజస్వివియు జరితవ్రతుండవును గావుట లోకమెఱుఁగదా ? ఇట్టితుచ్ఛరాజ్యాబునకుఁ బ్రాల్మాలుదువని యెవరైనను దలంతురా ? వత్సా ! నీయెడ నెట్టిదోషంబును నేను శంకింపలేదు. నీతల్లి పూజ్యురాలు ; ఆమెను దూఱుట సరిగాదు. పుత్త్రకళత్త్రాదులను యథామతి నియమించు స్వాతంత్ర్యము గురుజనంబునకు సంపూర్ణముగాఁగలదు. తండ్రియాజ్ఞ నట్లు తల్లియాజ్ఞనుగూడ నెఱవేర్చుట సాధుమతమగును. తండ్రి పంపును దల దాల్చితిని ; నీవు నీతల్లియానతిని మీఱవలదు. మఱియు మనతండ్రి నాకు వనవాసంబును నీకు రాజ్యభారవహనంబును శాసించి పరలోకగతుఁడయ్యెను. తండ్రి యేది యిచ్చెనో యదే మనకుఁబదివేలు. దానిని నిరసింపఁజనదు. అది యటుమంగాక తల్లిదండ్రు లిద్దఱుఁగలసి మనకిట్లు విధించిరి. ఈ సంగతి మఱువక వారియాజ్ఞను శిరముతోడ గ్రహించి తదనుసారముగా వర్తింపుము.

భర:—అన్నా ! నీకెదురాడుటగాదు ; నామనవి వినుము. ఉత్పథము ద్రొక్కినప్పుడు గురుజనమును సయితము నిరసింపవలయునని శాస్త్రము. ఈవిషయమున మనతండ్రియు నాతల్లియుఁ జెడుత్రోవఁ దొక్కిరి. అట్టివారిమాట పాటించినఁ బాపమగును. రాజ్యము నీదిగాని నాదిగాదు. నీరాజ్యమును నీవువదలివచ్చినచో దానిని బాలించు వారెవరు ? మఱియు రాజ్యభారము వహింప నాకుఁదరముగాదు. అశ్వవేగము ఖరమునకుఁ గలుగదు ; పక్షీంద్రునివలె కాకి యెగురఁజాలదు. ఎవనివలనఁ బెక్కురు సుఖింతురో వాని జీవనమే జీవనమగును ; పరానుజీవనము దుర్జీవనము. మనతండ్రి యీరాజ్యవృక్షంబును బెంచి ప్రోదిసేసెను. దానిఫలము నీమూలమున లోకమునకుఁ జెందవలసియున్నది. అట్లుకానిచో మనతండ్రి శ్రమయెల్ల వ్యర్థమగును. అన్నా ! నీపట్టాభిషేకమును

నారులెల్లరు నభిలషించుచున్నారు ; మఱియు నద్దాన సంకటపూర్ణ స్త్రీలదుఃఖము సహియనున్నది. నీవుపక్రమింపనున్న కార్యంబును త్రోయకలదు. అన్నా! తండ్రియు రాజునైన వానియాజ్ఞ వాటి రాకంటివి. రాజాజ్ఞలోకకళ్యాణకరముగా నుండవలయును. ఒండె వో దానిని పాటింపుటెట్లు! ఈయయోధ్యాకోసలరాష్ట్రమెల్ల దుఃఖ సాగరమున మునిగెను. ఆసంగతి నీకుమాత్రము తెలియదా! తండ్రియాజ్ఞ నాకు మేలుగా కన్పించుచున్నదా! అన్నా. అది నీ త్యాగగుణంబును వెల్లడించి నీకు శాశ్వతకీర్తిని గూర్చునది సత్యము. ఇది యాత్మార్థమగునేగాని లోకార్థము గాదు. ఆత్మ లాభార్థ మింతలోకంబు నలమటం ద్రోయుదువా! అది ధర్మ మగునా! ధర్మమైనగానిదానిని నీవు మనస్కరింతువా!

రా :— భరతా! ధర్మాధర్మములవిచారమంత సులువుగాదు. కొన్నిసంద ర్భములందు భావితాత్ములుం గయితము పొరఁబడుదురు. ఆసంగతి యటుండనిమ్ము. భరతా! జీవులు ప్రారబ్ధకర్మానుభవార్థము దేహములు ధరించుచుందురు. దేహములున్ననో భోక్తవ్యకర్మములకు యోగ్యములుగా నానారూపంబుల వచ్చును. కర్మము భుక్తమై నశించునేగాని యొండువిధమున నశింపదు. ఏకర్మానుభవార్థ మీ జన్మమును గాంచితిమో దానిననుభవింపక మానుటెట్లు! నీవురాజ్య భారవహనరూపమైనకర్మము ననుభవింపవలసియున్నది. అదితప్పదు. తండ్రి యాజ్ఞగాని నీతల్లికార్యముగాని నిమిత్తమాత్రములు. జీవుల జీవయాత్రమందుఁగల యీపరమరహస్యమును గ్రహించి వర్తించు టయే జ్ఞానమగును. వట్టివాదములవలన ఫలములేదు. కావున నీవు మరలి యయోధ్యకుఁజనుము. నామాట వినుము. కర్మానుభవము లైచ్ఛికములని కొందఱు తలంతురు. అది సరిగాదు. ప్రతికర్మ మునకు ఫలము తప్పదుగదా. ఫలముతప్పనినాఁడు దానిని గర్త యనుభవింపక మానుటెట్లు! ఫలము స్వార్థముగాక పరార్థము కా రాదాయని యందువా! ఆసంగతినే కర్మయోగము బోధించు చున్నది. అట్లుచేయుటచో పునర్జన్మకారణమే గలుగదు. జననము లేనినాఁడు ఫలానుభవముగూడ లేని దగునుగదా.

భర:—అన్నా! నీమాట సత్యము. నాయట్టివారియేలుఁబడి స్వకర్మానుభవార్థమేయగును గాని యొండు గాదు. నీవనిననో యవాప్తసమస్తకాముఁడవు; ద్వంద్వాతీతుండవు. నీపరిపాలనము లోకకల్యాణకరమగును. ఆకారణంబున నీవురాజత్వము నంగీకరింపవలదా? పరోపకారమునకన్న ధర్మముగలదా? మఱియొకటి విన్నవింతును. మహాత్ములకుఁ గష్టములు గలుగుటఁజూచి లోకము విపరీతబుద్ధిని బడయును; ఆకారణంబున ధర్మమునందు విశ్వాసము తఱుగును. దానమహానర్థములు గలుగును. నీవట్టి విపరీతంబులకుఁ గారణభూతుఁడవు కానగునా? ఇదియును గాక నీవు ధర్మరక్షణార్థమవతరించితివి. మోక్షధర్మములవలె లౌకికధర్మములనుగూడ నీవు రక్షింపవలయును. లౌకికధర్మములందుఁ గులధర్మము పెద్దయందుము. మనము క్షత్రవంశంబున జనించితిమి. క్షత్రియులకు రాజ్యపాలనము ధర్మమగునేగాని మునివృత్తి ధర్మముగాదు. నీవే వర్ణాశ్రమధర్మవ్యతిక్రమమొనర్తువేని నిన్నుఁజూచి రాజ్యమెల్ల విపథంబునఁ ద్రొక్కునుగదా. అన్నా! మహాత్ములజీవితము పరోపకారార్థమే గాని యాత్మార్థముగాదు. నీవలన లోకమెంతో మేలుపడయు నున్నది. లోకప్రతీక్షణమును రిత్తపుచ్చకుము. వయోవీర్యాదులఁ బెద్దవగు నీవుండఁగా నేనురాజత్వము వహించుట తులువతనము గాదా? నామనవి చేకొనుము. కులగురువులు వసిష్ఠాదులువచ్చి యున్నారు. ఇప్పుడే యిందే నీకు సమంత్రకముఁ బట్టముఁ గట్టుదురు. మా మొఱలాలకింపుము; అయోధ్యకు మరలుము; దేవర్షి పితౄణములు తీర్చి ప్రజాభీష్టములుగూర్చి లోక కళ్యాణ మొనర్పుము. ఇదేసాష్టాంగపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను.

రా:—భరతా! దశరథసత్పుత్రునకు నీకు యోగ్యముగాఁబల్కితివి. రాజ్యము నాదని నీవు భావించుట ప్రమాదము. సంగతి యొఱుంగక యట్లనుచున్నావు. కైకేయీగర్భజునకు రాజ్యమునుబాసచేసి యామెను మనతండ్రి వివాహమయ్యెను. ఆకారణమున రాజ్యము నీఁదగుఁగాని నాదికానేరదు. నీరాజ్యమును నీవు పరిపాలింపక తీఱదు. మఱియుఁ దండ్రిమాట కల్లసేయఁకుము. ఎవఁడు తనతండ్రి

బున్నామనరకమునుండి కాపాడునో యతఁడే పుత్త్రుఁడగునుగాని కన్నవారెల్లఁ బుత్త్రులు కాఁజాలరు. భరతా! తండ్రులు బహు పుత్త్రులఁ గోరుటయేలనో యూహింతువా? అందొక్కఁడైన తనకు గయాపిండదాన మిచ్చుఁగాక యను పేరాసతో నట్లభిలషింతురుసుమా. ఇది గయునివచనముగాని వేఱుగాదు. కావున సత్పుత్త్రకుఁడవగుము. పితృవచనము మనయిద్దఱకు వేదవచనమే యగును. వత్సా! వేఱుమాటాడక యయోధ్యకుఁ బోయి రాజ్యభారమువహించి తండ్రిఋణముఁ దీర్పుము. నేను చతుర్దశవర్ష వివాసవ్రతము సలిపి పితృవాక్యపరిపాలన మొనర్తును. ఇదే మనకుఁ బరమధర్మము. నాయనా! మఱియొకమాట వినుము. ఇదియే నీకు నాగావించుపరమోపదేశమని భావింపుము.

“క. ఎఱుకగలవారిచరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁగదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని
మఱువకనుష్ఠించునది సమంజసబుద్ధిన్.”

“క. ఇచ్చునది ధనముపాత్త్రున
కచ్చుగనోరు వేడకుండు నది యభిముఖులై
వచ్చినయాశార్థుల వృథ
పుచ్చకచేయునది సర్వభూతప్రీతిన్.”

“క. అలిగిన నలుగక యెగ్గులం
పలికిన మఱివిననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడియెదఁ
దలఁపక యున్నతఁడుచూవె ధర్మజ్ఞుఁడిలన్.”

‘తే॥గీ॥ వీరునమ్మంగఁ దగుదుఁరు వీరునమ్మఁ
దగరు నాకనవలవదు తత్త్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక యెల్లప్రొద్దు
నాత్మరక్షాపరుండగు నది విభుండు.”

రామ జాబాలిమహర్షుల వివాదము.

జాబా:—రామా! మహాప్రతిభాశాలివి నీవు మూఢబుద్ధిం బోరయ తగునా? నీమాటలకు నీసేతలకుం బొందుగాన్పింపదు. ఎట్లందువా పక్షికులకు విశ్రమస్థానములట్లు జీవులకు మాతాపితలగుదురు; అనంగా వారిసంబంధములు సహవాసమాత్రములగునే గాని యంతకు మించినవి గావు. అట్టి యల్పకాలిక సంబంధములందు బుద్ధిమంతులు తగిలియుండరు. ఈయర్థమును నీవే పెక్కుసారులు చెప్పితివి. ఆదే వాక్కున 'తండ్రియాజ్ఞ తండ్రియాజ్ఞ' యని కలవరింతువేల? వాని యాజ్ఞవానితోన సమసిపోయెంగదా. ఈవెఱ్ఱితలంపులు మఱచి యేకవేణీధరయై నిన్ను నిరీక్షించుచున్న యయోధ్యకువచ్చి పట్టాభిషిక్తుండవై సద్యఃఫలమనుభవింపుము. సుఖదుఃఖంబులేగాక జనన మరణములు సంచితము కర్మఫలము లంటివి. స్త్రీపురుషసంయోగములేక ప్రాణులు జనించునా? కావున జననమునకుం గర్మము కారణము కాంజాలదు. సుఖదుఃఖాదులందువా? అవి వారివారి చేతిలో నున్నవి. మఱియుం బుట్టినప్రాణి గిట్టక యట్లేయుండదు. ఈ కీలకముం దెలిసినవారు యథేచ్ఛాభోగంబుల ననుభవించి కాలగతిం జెందుచుందురు. భ్రాంతాత్ములు పలుపోకలుపోయి తుదకు నైహిక సుఖమునకుంగూడ దూరులై కష్టపడి నశింతురు. రామా! ధర్మము ధర్మమని నొక్కిపలుకుదువు. ధర్మమనంగానేమి? వలచి యింటికి వచ్చినసిరికి మోకాలొడ్డి యిహసుఖంబుల నిరసించి కాననాంతరము లాశ్రయించి నిరశనవ్రతులై జీవు నల్లాడించుచుం దుదకుం జిక్కి చచ్చుటా? ఇట్టివారు జీవితమును వ్యర్థపుచ్చుటయేగాక లేనిదుఃఖములను మూటగట్టుకొనుచున్నారుగదా. రామా! ఇట్టిది ధర్మమెన్నడును గానేరదు. ఏదినైజమో దానిననుసరించుట ధర్మమగును. క్షుత్పిపాసాభోగంబులు ప్రాణులకెల్ల నైజములు. వానిని పాటించిన ధర్మమగును. స్వస్వార్థమునకు విపరీతవ్యాఖ్యానములు రచించి దుఃఖములపాలు గావలదు. రామా! పితృదేవతలకుం బిండదానార్థము సంతానమంటివి. ఇంతకన్న వెఱ్ఱితనము గలదా? పంచభూతసమ్మేళనంబున శరీర ప్రాణంబులు వొడముచున్నవి. ఆ భూతములు విడిపడునాడు శరీరప్రాణములు రూపుమాయు

చున్నవి. ఇఁకఁ బితృదేవత లెందుండి వత్తురు ! ఎట్లో వత్తురుపో. గయాక్షేత్రమునఁ బిండదానమొనర్చినచో నెచ్చటనో కనవినరాని చోట నున్నపితరులకది చేరునెట్లు ? వారిపొట్ట నిండునెట్లు ? ఇచ్చట నేను బిండమొకటిపైచిన నయోధ్యనున్న మనవారి కుఁ దాఁగ్ని చల్లారునా ? శ్రాద్ధాన్నములఁట ; పరలోకగతులకు దారిబత్తెములఁట. ఈకట్టుకతలతో లోకము మోసపోవుచున్నది. యజ్ఞములఁట, దానములఁట, యాగదీక్షలఁట, త్యాగములఁట ; అహో! ధర్మోపదేశమున నెంతలుపదేశించుచున్నారు ! మేధావులు పన్నిన పరద్రవ్యాకర్షణజాలములఁ జిక్కి లోకమెంత తాలుమాలగు చున్నది ! ఈపగటిదొంగల నెంతశిక్షింపరాదు ! పరలోకము మిథ్యామాత్రము. మనమున్నదేలోకము. ఇందే సమస్తసుఖము లనుభవింపనగును. ప్రత్యక్షమును మాని మిథ్యామాత్రమైన పరోక్షమునకుఁ బ్రాకులాడవలదు. ధర్మోపదేశంబున నైసర్గికములను నెడసి దుఃఖములపాలు గావలదు. జీవితమును వృథసేయవలదు. సద్యఃఫలమగు రాజ్యభోగములను యథామతి ననుభవించి తనవు వోఱఁగుము. ఇంతకన్న వేఱుధర్మముగలుగదు.

రా :—మునీంద్రా ! నన్నుమరలించు నిమిత్తముమీరిట్లు నుడువుదురేగాని యది మీమతము కానేరదు. అయినను మీరుగావించిన యాక్షేపణములు వైదికమతమూలక్రిములై యున్నవి. వానికిఁబూర్వపక్ష సమాధానములుచెప్పి వానినిఁ బూర్వపక్షసిద్ధాంతములు గావింపనిచో నవిలోకమెల్లఁ బ్రాఁకి కడలేని ముప్పుతెచ్చును. తన్నిమిత్తము నాకుఁ దోచినట్లు వచింతును.

శారీరకసంబంధములు శాశ్వతికంబులు గావనుట సిద్ధము. అట్టివానికిఁ గాఁ బ్రాకులాడుట తగదనుటయు నిజమే. అయిన నిందు విశేషమొకటి గలదు. తల్లిదండ్రులవలన శరీరము గలుగుచున్నది. ఆకారణంబున శరీరము తల్లిదండ్రుల సొమ్మగును. ఆసొమ్ము పుత్త్రులవశమైయున్నంతకాలము వారు జననీజనకులకు ఋణగ్రస్తులైయుందురు. దీనినే పితౄణమందురు. ఋణగ్రస్తమరణ మెవ్వరుఁ గోరరు. ఆఋణవిముక్తికిఁగా సుతులు వారి తల్లిదండ్రులకు సర్వవిధసేవలు చేయుదురు. నాతండ్రివలన నేను బడసిన

సొమ్మును మరల దానుగోరెను. దానిని సంతోషపూర్వకముగా వానికిచ్చి పితృఋణమునుండి విముక్తుడనైతిని. ఇందు విపరీతముగాని దోషముగాని లేదు. 'జీవతో వాక్యకరణాత్' అను పెద్దలవాక్యమును మఱచితిరా ?

తండ్రియాజ్ఞను బరిహసించితివి. ఆజ్ఞయే వలదందువో చచ్చి పోని యాజ్ఞవలదందువో యూహింపరాదు. లోకమెల్ల నాజ్ఞాబద్ధమై యున్నది. అట్లుకానినాఁడు జగత్తు విశృంఖలమై నశించును. కావున నాజ్ఞయే వలదనుమాటను మీరుగూడ నిరసింపక తప్పదు. చచ్చినవాని యాజ్ఞ చేయుటేలయందురా? వ్యక్తికి మరణము గలదుగాని వానియాజ్ఞకు మరణములేదు. ఎంతకాలంబాయాజ్ఞ పరిపాలింపబడునో యంతకాలమది జీవించియుండును. వ్యక్తిసమక్షంబునఁ దదాజ్ఞను బాటించుటయుఁ బరో క్షంబున దానిని నిరసించుటయుఁ గుత్సితవర్తనమగునే గాని ఋజు మార్గము కానేరదు. బుద్ధిమంతు లట్టి కపటవర్తనంబును మన్నింపరు. మఱియు మీరన్నట్లు చేయుట యగునేని రేపు మీమాటకుఁ గూడ నదేగతి కలుగదా ? ఇఁకమాటకు నిలుకడయెక్కడ ? ఆజ్ఞారూపములైన వేద శాస్త్రాదులకెల్ల దుర్గతికలుగదా ? లోకమునకే వ్యవస్థతప్పనుగదా ? ఇట్టిది మీరుమాత్రము సమ్మతింతురా ? కావునఁ బిత్రాజ్ఞను నేను బరిపాలించుట ధర్మమగునే గాని యధర్మము కానేరదు.

జననాదికము స్త్రీపురుషసంయోగ ఫలమంటిరి. అట్లగునేని వంధ్యా త్వమునకే యవకాశముండగూడదు. ఈవంధ్యాత్వము మనుష్యవర్గమందే గాక తిర్యగ్జంతుజంబులయందు సహితము గానవచ్చుచున్నది. దీనికేమందురు? అదియటుండనిమ్ము. సృష్టియెల్ల స్త్రీపుంససంయోగోద్భవమగునేని యది చార్వాకమతమగును. ఇచ్చట సృష్టియనుపదము చేతనాత్మక సృష్టికి నన్వ యింతురా ? జడాత్మక సృష్టికి నన్వయింతురా ? ద్వితీయపక్షమేని యది యంగీకృతమగును. ఏలయందురా ? శరీరప్రాప్తికి స్త్రీపురుషసంయో గము కారణమగుచున్నది. అందువలన మీయావాద మంగీకృతమగును. అంతియగాని శరీరాంతరజీవాత్మకుఁగూడ స్త్రీపురుషసంయోగమే కారణము కాఁజాలదు.

సృష్టియెల్ల స్వాభావికమే యగు నను లోకాయతనులవాదము నాఙ్గీకరి యింతురా? ఈస్వభావమునే ప్రకృతి యందురు. ఈప్రకృతి జడమా? చేతనమా? జడమందురేని యందుఁ జైతన్యముండ నేరదు. సృష్టియన్ననో చైతన్యాత్మకమై యున్నది. దీనికేమందురు? చైతన్యాత్మకమే యని యందురేని మీకును వైదికమతమునకు సమరసము గలుగును. మీప్రకృతియే వారి కాత్మయగును. ఆయాత్మవలన సృష్టికలుగుచున్నదని యిరువురు నంగీకరించుటగును.

అవయవసంయోగంబున శరీరంబు లేర్పడుచున్నవని యందురా? దానినంగీకరింతుము. కాని యీసంయోగము అవయవములకు ఐచ్ఛికమా? పరప్రేరితమా? ఐచ్ఛికమే యందురేని యిచ్ఛాశక్తి చేతనంబులకుమాత్రమే యుండును గావున అవయవములు గూడఁ జేతనములే యనవలయును. అవయవములు కేవల జడములని మున్నే నిరూపించితిమి. కావున మీరు చెప్పినట్టి సంయోగము ఐచ్ఛికము కానేరదు. పరప్రేరితమే యందురా? అది యంగీకృతమే. ఆపరమునే యాత్మయందురు.

సృష్టి ప్రస్తావితమయ్యెను గావున దాని సంగతి వినుము. అభావమునుండి భావము జనింపదు. ఇది ప్రథమ సూత్రము. కారణములేక యే కార్యముగలుగదు. ఇది రెండవ సూత్రము. సృష్టి భావము. ఈభావము అభావమునుండి గలుగదుగావున భావమునుండియే యీభావము జనింప వలయును. మఱియు సృష్టి కార్యమగును. ఈకార్యమునకుఁ గారణ ముండవలయును. ఆకారణమే సృష్ట్యాదిభావము నగును. ఆకారణమునే పరమాత్మయందురు.

ఈపరమాత్మకు మఱియొక కారణము గలుగదు. ఎల్లకారణములకు నది మొదటి కారణమై యున్నది. మఱియు నప్పరమాత్మ నిర్గుణనిరంజన కేవలచిద్రూపమున నుండును. దానికి జననాది షడ్వికారములులేవు. అది యవ్యయము శాశ్వతమునై యుండును.

కారణములేనిదే కార్యము కలుగదని చెప్పఁబడెను. ఈకారణము ఉపాదానకారణమని నిమిత్తకారణమని రెండు విధములు. ఘటమునకు మన్ను ఉపాదానకారణమగును; కుమ్మరి నిమిత్తకారణమగు. సువర్ణాభరణము

నకు సువర్ణము ఉపాదానకారణము ; స్వర్ణకారకుఁడు నిమిత్తకారణము. అట్లే యీసృష్టికి ఉపాదానకారణమేది ? నిమిత్తకారణమేది ? అనియడుగ వచ్చును.

ఘటమేర్పడుటకు మృత్తికయనుపదార్థమొకటి ఘటనిర్మాణపూర్వమే యుండును. అట్లే సృష్టి యేర్పడుటకుముందు ఘటనిర్మాణమునకు మృత్తికవంటిపదార్థ మేదియుండెను ? పరమాత్మతప్ప నన్యమేదియు లేదని మున్నే చెప్పితిమి. కావునఁ బరమాత్మయే ఘటమునకు మృత్తికవలె సృష్టికి నుపాదానకారణము కావలయును. మరియొక పదార్థ మున్నదని చెప్పుదు మేని పరమాత్మ అద్వితీయము అనువచనంబునకు భంగమగును. పరమాత్మ అద్వితీయముగావునను పరమాత్మకన్న భిన్నమైన పదార్థము సృష్టికి బూర్వ ముండుటకే యవకాశములేదు గావునను సృష్టికిఁ బరమాత్మయే ఉపాదాన కారణమని యంగీకరింపక తప్పదు.

ఘటమునకుఁ గుమ్మరి నిమిత్తకారణమంటిని. అనఁగాఁ గుమ్మరి యనువాఁడొకఁడు మృత్తికతో ఘటమును నిర్మించుచున్నాఁడని దీనిభావము. అట్లే సృష్టికి నిమిత్తకారణమేది ? పరమాత్మకన్న నన్యము లేదని చెప్పితిమి. ఆపరమాత్మ సృష్టికి నుపాదానకారణమంటిమి. నిమిత్తకారణ ముండదనిదే సృష్టికార్యమేర్పడదయ్యెను. నిమిత్తకారణముగా గ్రహించుటకు మఱియొండేదియుఁ గలుగదయ్యెను. కావునఁ బరమాత్మయే నిమిత్త కారణముగూడఁ గాకతప్పదు. దానంజేసి సృష్టికిఁ బరమాత్మయే ఉపాదాన కారణమును నిమిత్తకారణమును రెండునగుచున్నది.

ఏదే నొకయుద్దేశ్యముతో నెట్టిపనిఁగాని చేయుదురు. ఉద్దేశ్య రహితముగా నేపనియుఁ గాదు. ఈయుద్దేశ్యమునే వేదాంతపరిభాషయందు సంకల్పమని చెప్పుదురు. పైనఁ జెప్పినప్రకారము సృష్టికిఁ బరమాత్మయే ఉపాదాననిమిత్తకారణములు రెండునై యున్నదని యంగీకరించినను ఆపర మాత్మ యేసంకల్పముతో సృష్టిఁగావించెను? ఎప్పుడాసంకల్పము పుట్టెను? ఏలపుట్టెను ? అను ప్రశ్నలు వొడమును. ఏదోయొక సంకల్పము పర మాత్మకుఁ గలదని యంగీకరింపక తీరదు. అట్లు కానినాఁడు సంకల్ప రహిత కార్యమేర్పడును. అట్లనుట మూలసూత్రమును నిరసించుటగును.

సంకల్పము కలదుగాని అది యిట్టిసంకల్పమని వచించుటకు సాధ్యముగాదు. కావునంజేసి యది యనిర్వచనీయమనిరి. ఎప్పుడాసంకల్పము పుట్టెననుటకు ఎప్పుడో యొకప్పుడు సృష్టికిఁబూర్వమే సంకల్పము జనించి యుండవలయునుగాని యాకాలమును నిర్ణయింప రాదు గావున దానిని అనాదియనిరి. ఏలసంకల్పము కలిగెననుటకుఁ గూడ నిమిత్తముని నిర్వచింపరాకున్నది. అందువలన లీలామాత్రమనిరి. అనఁగాఁ ఈమూఁడు ప్రశ్నములకు జవాబుచెప్పుటకు యుక్తిచాలదు. యుక్తిశాస్త్రసంపదను సూచించిరి. యుక్తియెల్ల నింద్రియకార్యము గావునను ఇంద్రియములన్నియో పరిచ్ఛిన్నములు గావునను వానికి నందని విషయము అతీంద్రియమనిరి. అట్టివానిని నిశ్చయించు పెట్టున్నదో అది కేవలబుద్ధిగ్రాహ్యము. ఆబుద్ధియు సమాధ్యవస్థనున్నప్పుడే యిట్టియతీంద్రియ విషయంబులు స్ఫురించును. అస్ఫురణము మనస్సునకు నందినంత గ్రహించి వాక్యానకు సాధ్యమైనంత వచించిరి. ఈయాప్తవాక్యమును విశ్వసించి వర్తింపవలెను.

కర్మములను నిందించితిరి. • కర్మము నిసర్గమనియు నైమిత్తికమనియు రెండువిధములు సృష్టితోఁడఁబుట్టినకర్మము అనగా సంకల్పరూపకర్మము నిసర్గకర్మమగును. ఏదేనొకనిమిత్తము గలిగినప్పుడు చేయుకర్మము నైమిత్తికకర్మమగును. ద్వివిధమైన యీకర్మములకు సంకల్పము బీజమగును. పరమాత్మయొక్క సంకల్పకాలము అనిర్దేశ్యముగావున అది యనాదియనిరి. కావునంజేసి తత్సంకల్పముతోఁగూడ జనించిన నిసర్గకర్మమును అనాదియేయగుచున్నది. ఈనిసర్గకర్మ మొకసారి యంకురించినతర్వాత యదినిలువక ప్రవాహాకరణిఁ బరచుచుండును. దీనినాపుటకుఁ గూడ సాధ్యముగాదు. మఱియొకవిశేషము. ఈనిసర్గకర్మము అనాదియగుటయేగాక అనంతమునైయున్నది. ఎట్లందురా! సృష్టికి మార్పాట్లున్నను సర్వస్వరూపనాశనమెన్నటికినిలేదు. సృష్టియున్నంతకాలము నిసర్గకర్మముండును. ఆకారణమున నయ్యది యనంతమగును. అనాదియు ననంతమునైన యీనిసర్గకర్మమును మీరు నిరసింపజాలరు. ఆ కర్మము మీయందును నాయందును జరాచరరూపసర్వప్రపంచంబునందును ప్రతిక్షణము జరుగుచునేయున్నది. కావున నదిస్వానుభవసిద్ధము.

ఇఁక నైమిత్తిక కర్మములన్నవో నిమిత్తము గల్గినప్పుడే మానవులుచేయు

బడును. పితృకార్యాదు లీరాశిలోఁ జేరును. ఈకర్మములఫలమేమందురా? జీవునకు నాశనములేదు. జీవుఁడు శరీరవియోగానంతరము కర్మానుభవమునకుఁ గా లోకాంతరములు చెందియుండును. పితృకర్మములవలన ఆజీవునకు శాంతికలుగునని తత్త్వజ్ఞులు వచించిరి. వారిమాట కాదని నిరూపింపఁ జాలరు. తత్త్వము వట్టియుక్తికిఁ జిక్కదు. అతీంద్రియమైన యావిషయమును గూర్చి కేవల నిర్వికల్ప సమాధ్యవస్థయందు పరీక్షించి నిశ్చయించిరి. మీరు నట్లే పరీక్షించికాదందురా ? అందాఁక మీమాటను గ్రహించుటెట్లు ?

శ్రాద్ధవిధి నుల్లసించితిరి. శ్రాద్ధమునకు శ్రద్ధాపూర్వకసంకల్పము జీవము. సంకల్పము దేశకాలానవచ్ఛిన్నము. అదిక్షణములో ముల్లోకములుఁ జుట్టివచ్చును. మహర్షులసంకల్పంబులు దేశదేశాంతరములందుఁ గార్యక్షమములగుట వినమా ? తపోనిధికి మీకుమాత్రమిది తెలియదా ? కావున సుతుల శ్రద్ధా పూర్వకములైన సంకల్పములు లోకాంతరగతులైనవారి పితలయెడ నేలవ్యాప్తిఁ గాంచరాదు ? అట్లు పరిణతిఁ గాంచుట యనుభవసిద్ధమే గావున నట్టికర్మములను జేయుట పరమధర్మమగును. యజ్ఞయాగాదిక్రతువులు గూడ నీవర్గములోనే చేరును. ఏదో యొకరూపమైన యర్థమును గోరియిట్టిక్రతువులొనర్తురు. సంకల్పమెన్నడును వ్యర్థముగాదు గావున నిట్టిక్రతుకర్త లీప్సితార్థములను దప్పక పడయుదురు. ఫలము మాత్రము తప్పదు. అది యాత్మార్థమైనఁ గావచ్చును ! పరార్థమైనఁ గావచ్చును. ఆత్మార్థము చేయరాదందురా ? అది మాకును సమ్మతమే ? ఇట్టివానివలన నగుసుఖము తుచ్ఛమందురా ? ఆమాట సర్వజనాంగీకృతము. ఆకారణమువనే తుచ్ఛానందములవంకఁ జనక శాశ్వతానందమును బడయుమని మనశాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

ఈనిత్యానందమును బడయుట యెట్లందురా ? మనయంతఃకరణము తననైసర్గిక స్థితినెప్పుడు పడయునో యప్పుడు నిత్యానందము గలుగును. నైసర్గికస్థితియనగా నేమియందురా ? సృష్టియెల్ల సత్త్వరజస్తమో గుణాత్మకమైయుండును. ఈమూఁడు గుణములు ముప్పిరిఁబెనచిన త్రాఁడుగానుండును. ఈమూటింటిలో సత్త్వము నైసర్గికము. ఏలయందురా ? సృష్టిలోనావరణాచ్ఛాదితమైయున్న జీవాత్మ యాపరమాత్మయే గాని వేఱుగాదు.

పరమాత్మకును జీవాత్మకును ఆవరణకారణంబున మహాకాశ ఘటాకాశ తారతమ్యము గలుగుచున్నది. అంతియగాని యవి వేఱుగావు. పరమాత్మ యన్ననో కేవలసత్త్వాత్మక నిత్యానందస్వరూపి. జీవాత్మయు వాస్తవము గాఁబట్టివాఁడే. అయినను ఆవరణభేదమును బట్టి వేఱుగా భావింపఁబడుచుండును. ఇట్టివిపరీతభావమునకుఁ గారణములైన రజస్తమోరూపావరణంబులు తొలఁగి కేవల సత్త్వావరణము గలిగెనేని జీవాత్మయు నిత్యానందస్వరూపియై విలసిల్లును. ఇదియే నైసర్గికస్థితి.

ఈస్థితి కలుగుట యెట్లందురా ! అందులకే యీకర్మకలాపమెల్ల నేర్పడెను. ఈకర్మములనే యోగములందురు. ఈయోగములెల్ల నంతఃకరణావరణశుద్ధిపర్యంతములు. అనంతరము వానివలన ఫలములేదు. ఆవరణతత్త్వతారతమ్యమును బట్టి యోగములను నిర్ణయించిరి. గృహస్థులగువారు రజస్తమోమయావరణ కలితులై సంకల్పపరంపరలతో నిండియుందురు. గావున వారికి యోగ్యముగాఁ గర్మయోగమును జెప్పిరి. ఈకర్మయోగము సకామముగాఁ బ్రారంభమై క్రమక్రమముగా వైరాగ్యావస్థను జెంది తుట్టతుదకు నిష్కామకర్మయోగముగాఁ బరిణమించి స్వరూపజ్ఞానోత్పత్తిని గలిగించును. ఆవిధముగా నది యంతఃకరణశుద్ధి నొనర్చును. భక్తియోగము కూడఁ గర్మయోగాంతర్భూతమేగాని యొండుగాదు. ఈకర్మయోగమునే యభ్యాసయోగమనియు వచింతురు. స్వతస్సత్త్వావరణావృతులకు శుద్ధికలాపమనవసరము. వారికి స్వరూపానుభవము మాత్రమే యవసరము. ఈయనుభవమునే విజ్ఞానమందురు. వారికిఁగా జ్ఞానయోగమును నిర్ణయించిరి.

క్షుత్పిపాసాభోగములు నైసర్గిక ధర్మములనియు వానిని సేవించుటయే పరమధర్మమనియు వచించితిరి. ఈమూఁడును సర్వప్రాణి సామాన్యధర్మము లగుట నిర్వివాదాంశము. ఇతరప్రాణివర్గమునకన్న మనుష్యుని యందు జ్ఞానమనెడివిశేష లక్షణముగలదు. అందువలన మనుష్యులను దదితరప్రాణివర్గమునుండి వేఱుచేసి యధికులుగా గణించివారికి విశేషధర్మములను జెప్పిరి. ఈజ్ఞానము నిత్యానిత్యవస్తు వివేకమునకుఁ దోడ్పడును. ఆవివేకమువలన ననిత్యములను నిరసించి నిత్యమును సాధింపనగును. ఇదియే మనుష్యుల విశేషధర్మము. నిత్యముఁ సాధించుటవలన నేమియగునందురా ? అవ్య

యానందము గలుగును. మీరుచెప్పిన నైసర్గిక ధర్మత్రయము ననుష్ఠించుట వలనఁగూడ నట్టియానందమే వచ్చునుగదా యనవచ్చును. అందువలనఁ గలుగు నట్టియానందము కేవల మింద్రియానందమగును. మఱియు నదిక్షణికమే కాని శాశ్వతముఁ గాదు. ఉభయతత్త్వములకు నానందానుభవమే పరమావధి యైనప్పుడు క్షణికమును దుచ్ఛమునైన దానితోఁ దనివిఁజెందుట కన్న నిత్యమును బరమము నైనదానిని సాధించుట యొప్పుఁగదా.

సద్యఃఫలమైన రాజ్యభోగాదులను ద్యజించి కాలాంతరములను సంశయాత్మకములు నైనవానికిఁ బ్రాకులాడ నేల యనిరి. రాజ్యభోగాదులు సద్యఃఫలములే యగుఁగాక. అవి సకాములకు రుచించునే గాని నిష్కాములకు రుచింపవు. సర్వము సన్యసించియున్న మీకిప్పుడు గృహస్థాశ్రమము రుచించునా? రుచింపని దానియందు మిమ్ము బలవంతపెట్టిన ఫలమేమి. మహాత్మా!

"చ॥ ధృతిఁగొని రోగముల్ జరయుదేహమునొంపకముందె, యింద్రియ
ప్రతిహతిలేకముందె, తనప్రాణవిరావముకాకముందె, పం
డితజనుఁడాచరింపదగు కీర్తిఁబ్రయత్నము ముక్తికిక్, మహో
ద్ధతశిఖినిల్లు గాలుతఱిఁబావిఖనూతులు త్రవ్వ నొప్పునే?"

అని పెద్దలు వచించిరి. ఆవచనంబు లమోఘంబులు. ఆవాక్యంబులను మన్నింపక శాస్త్రమూషితబుద్ధులై యొండమావుల వెనువెంటఁ బరచువారు దివాంధులై యెట్టకేనికి ముప్పుఁబొరయక మానరు. ధర్మములు సూక్ష్మాతిసూక్ష్మంబులు. అవి వ్యవసాయాత్ములకు గోచరించునే గాని యవ్యవసాయాత్ములకు గోచరింపవు. కేవల యుక్తివాదమును నమ్మిన ఫలములేదు. అట్టివారిగతి అంధఃపరంపరాగతి యగును.

సత్యమేధర్మము. ధర్మమేసత్యము. ఎవరెన్ని బోధించినను నేను ధర్మమును విడువఁ జాలను. ఇది నాపరమనిశ్చయము. అశాస్త్రీయంబులును ధర్మవిరుద్ధంబులు నైన వచనంబులు మీరాడినను నాతండ్రికిఁ బరమాప్తులగుటంజేసి మీసమక్షంబున నిలిచి యింతగా వచించితిని. అన్యాపదేశంబులు నన్నుబోట్లను గలుపనేరవు. అట్టివి వచించుట భవాదృశులకును యోగ్యమునుగాదు.

రాముఁ డీయుపసంహారోక్తులను గోపకలుషిత తీవ్రస్వరంబునఁ బల్కెను. జాబాలి యది గాంచి 'రామా! కోపింపవలదు; నామతము నాస్తికముగాదు; ధర్మసంకటకాలము ప్రాపించెను; ఏవగనైన నయోధ్యకు నిన్ను మఱలింప నట్లాడితిని. నీముఖమున వెలువడిన యాతత్త్వసారము సుప్రతిష్ఠితమై యాచంద్రార్కము లోకము నుద్ధరించుఁ గాక; కుమతులును విమతులును సుమతులై మేలుపడయుదురు గాక' యనెను.

రామవసిష్ఠుల సంవాదము.

వసిష్ఠమహర్షి యావచనంబు లాకర్ణించి,

చ॥ కులమత్యజించినన్ జనులు గోలరొనర్చినఁ దల్లిదండ్రులన్
వలదనిపల్కినన్ సిరులువమ్మయినన్ సతి యడ్డగించినన్
విలయమువచ్చినన్ బుడమి క్రీలినమిన్నులుమీఁదవ్రాలినన్
దలఁగరుసిద్ధపూరుషులు ధర్మవినిశ్చిత మార్గమింతయున్.

అని లోలోనఁ దలంచి జాబాలిమాట నందుకొని 'వత్సా! జాబాలి నన్యునిగా భావింపకుము. తత్త్వవిషయికమైన నీవచనామృతమును జెవులారఁ గ్రోలి పరమ సంతుష్టుఁడనైతిని. సత్యమే ధర్మము ధర్మమే సత్యమంటివి. ఇది యక్షరాక్షరముల యథార్థము. ప్రకృతము నీధర్మమేమో విచారింపుము. రాజ్యము జ్యేష్ఠక్రమానుగతము; ఇది మీకులధర్మమేగాదు రాజధర్మమునైయున్నది. ఆధర్మంబును నీవుద్ధరింపవలదా? వత్సా! జననకారణంబున దల్లిదండ్రులట్లు జ్ఞానప్రదాన కారణంబున నాచార్యుఁడును గురువగును. గురువచనము చేయుట ధర్మము. ఈయంశమును నీవే తెల్పితివి. నేన్నో మీకుఁ గులగురువును గాని నేటివాఁడను గాదు. నామాట పాటింపవా? నాసంగతి యటుండనిమ్ము. ఇందువచ్చిన వేదమూర్తులను జూడుము. ఈబ్రాహ్మణులెల్ల నీవారేగదా. వీరి మాటయేని వినవలదా? ఇదిగో సీతల్లి; వార్ధక్యమునకుఁ దోడుగా నీమెకు వైధవ్యమును సంప్రాప్తమయ్యెను. ఇప్పుడామెను శుశ్రూషింపకున్న నెప్పుడు శుశ్రూషింతువు?

'ఉపాధ్యాయాన్ దశాచార్యః ఆచార్యాణాంశతాపితా,
సహస్రస్తుపితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే" అనిరి

మాతౄణవిముక్తికి నింతకన్న మేలు తరుణముగలుగునా ? ఆమె మతము నొప్పరిక్షింతువా? రాఘవులు యాచకజనాభీష్టదాన దీక్షాబద్ధులని లోకమెల్లఁ బ్రశంసించును. భరతుఁడు కేలొడ్డి యాచించుచున్నాఁడు. వానిని వ్యర్థ పుత్తువా?' యనెను.

రాముఁడు వసిష్ఠునకుఁ గేలొగ్గి 'గురువర్యా ! నావచించినవంతయు మీయుపదేశసారాంశమేగాని వేఱుగాదు. గురుజనుల మతమును జేయవా యనిరి. వారియాజ్ఞ శిరమున దాల్తును. ఆర్యా ! విన్నపము ; శరీరము తలిదండ్రుల సొమ్ము. నాతండ్రి నాతనువును మున్నుగాఁ గోరెను. దానిని వానికిఁ బ్రతిజ్ఞాపూర్వకముగా నిచ్చితిని. ఆయన దానికి వనవాసము విధించెను. అది యిప్పుడు తలఁగుటెట్లు ? తండ్రికి సర్పితమైన తనువును దల్లి యిప్పుడు గోరిన నేనేమి సేయనోర్తు ? ఆమాట మఱచి పొమ్మని యామె యడుగులకుఁ దలతో మ్రొక్కి వేఁడుచున్నాను. మఱియేది చెప్పినను దప్పక యామెమాట నొనర్తును. గురువర్యా ! ఇందు నా యొనర్చిన. ధర్మవ్యతిక్రమమున్న సెలవీయ వేఁడుదు' నని వినయమధురముగా నుడివెను

భరతుఁడు నిరశనవ్రతమున కుపక్రమించుట.

భరతుఁ డంత నిరాశచెంది 'సుమంత్రా ! నాకుఁ గూడ నిందే కుశాస్తరంబును సిద్ధపఱుపుము. ఇచ్చిన ఋణమును మఱల నిచ్చునందాఁక బ్రాహ్మణుఁడు ఋణగృహీతవాకిటఁ బరుండు నట్లు నేను నాయన్న ప్రసన్నుఁడగునందాఁక యీపర్ణశాలవాకిట నిరశనవ్రతమూని పరుండెదను. అన్నగారి యాజ్ఞ వలయునందువా ! అట్లయిన నేనే దర్భలు పఱచికొందు' నని యట్లొనర్చెను. రాముఁడంతఁ దమ్మునిఁ జేరఁజని వానిని లేవఁదీసి 'నాయనా ! మోడి సేయకుము. ఇది బ్రాహ్మణునకుఁ దగుఁగాని క్షత్రియునకుఁ గూడదు. ఏమి యపకారమును నేను నీకొనర్చితి నని నీవిట్లు వాకిటను నడ్డముగాఁ బరుండుదువు ? భరతా ! ఈదారుణవ్రతము మాని యయోధ్యకుఁ జను' మని వేవిధంబుల బుజ్జగించెను. భరతుఁడు రాముని పాదములఁబట్టి 'అన్నా ! నా మొఱవినకున్న నగుఁగాక ; ఈపౌరుల విజ్ఞాపనమేని మనస్కరింపవా ?' యని దీనస్వరంబునఁ బ్రార్థించెను. రాముఁడు కడుంగడు జాలిఁజిక్కి 'తమ్ముఁడా ! లెమ్ము ; జలంబులతో నన్ను స్పృశింపు' మనెను.

భరతుఁడు పంతము లేచి 'బ్రాహ్మణోత్తములారా! మంత్రివర్యులారా! పౌరులారా! రాజ్యకాంక్ష నాకెన్నఁడును జనింపలేదు; దానికై నాతండ్రిని గోరలేదు; నాతల్లిని ప్రేరేపింపనులేదు. నాయన్నవనవాసము నాకుఁ దెలియదు. ఈమాట మున్మాటికి నమ్ముఁడు. తండ్రియాజ్ఞతప్పరాదేని నాయన్నకు మాఱుగా నేను చతుర్దశవర్షవనవాసదీక్ష నిర్వహింప సంసిద్ధుఁడనై యున్నాను. నాయన్న నామనవిని మన్నించి యయోధ్యాపరిపాలనమునకు నియ్యకొని మమ్మెల్లఁ గృతకృత్యులగా నొనర్చుఁగాక!' యని ప్రత్యుత్తరంబునఁ బలికెను. రాముఁడు వానిని గౌఁగిటఁ బొదివి 'వత్సా! యట్టి కేకలు వలదు. తండ్రిచేఁతకుఁ దాఱుమాఱు కల్గింప మనకు శక్తి కారణములేదు. అట్లొనర్చుట ధర్మద్రోహమగును. నాకును కీడని తలంపు గలుగును. మనతండ్రియు బాసతప్పినవాఁడగును. భరతా! తండ్రికొఱకును నాకొఱకును ధర్మముకొఱకును నీవు నీసంకల్పమును మాని నావచించు నట్లొనర్పుము; నీకు భద్రమగు' ననెను.

దేవర్షులు భరతునకు హితము చెప్పుట.

రామభరతుల సంవాదంబును వినుచుండిన దేవర్షిసిద్ధచారణాదులు తమలోఁ దాము కలియఁబలికికొని ప్రత్యక్షులై 'భరతా! నీ సుస్వభావంబున కెంతయు మెచ్చితిమి. నీయందెట్టి దోషమును లేదు. మామాట నమ్ముమనను విశ్వాసముతోఁ జెప్పుచున్నాము వినుము. నీతండ్రి కైకేయీఋణముఁ దీర్చి స్వర్గమున నున్నాఁడు. వానిమాట కల్లయగునేని వానికి స్వర్గచ్యుతి గలుగును. చక్కఁగా విచారింపు' మనిరి. భరతుఁడు వారి వచనంబులు విని నిజయత్నము వీఁగిపోవుటకుఁ జింతిల్లుచుఁ గేలు గీలించి 'అన్నా! జ్ఞాతులును యోధులును మిత్రులును కర్షకాదిప్రకృతివర్గమును వారు వీరననేల! చరాచర సమస్తరాజ్యము నిన్నుఁ గోరుచున్నది. రాష్ట్రరంజనము రాజునకుఁ బరమధర్మము. అందులకు నీవే తగుదువు గాని నేను జాలను. రాజధర్మమునకును గులధర్మమునకు నన్ను వేఱు పురుషుగా నొనర్ప వలదు. నాతల్లి కోరిక తీఱవలయు నందువా! అట్లయిన నెల్లయర్థములకు సరిపోవు మార్గము నమజ్ఞ యి' మ్మనెను. రాముఁడు వానిని దనయంకమునఁ గూర్చి 'నాయనా! నీసహజజ్ఞానము నేఁడు వేయిరెట్లు వెలుఁగుచున్నది; మఱియు గురుశిక్షితుఁడవు గాని సామాన్యుఁడవు గావు. భూభారవహనమునకు

సంశయించుచున్నావే! మహాప్రజ్ఞావంతులైన మంత్రులుండరా? నీకై ప్రాణము లిచ్చు మిత్రులు గలుగరా? ఎందును నీకుఁగొఱఁతలేదు. వత్సా! కైకేయీదేవి నెంతమాత్రము చిన్నచూపుచూడవలదు. మాతృసేవకు లోటుగలుగ నీయకు' మనెను.

రాముఁడు తనపాదుకలనిచ్చి భరతుని పంపుట.

భరతుఁ డంత గత్యంతరము దోఁపక సువర్ణపాదుకలు తెచ్చి రాముని మ్రోలనిడి 'అన్నా! ఈపాదుకలపయి నీపాదపద్మము లుంచుము. ఇవే సమస్తలోకమునకు యోగక్షేమములుగూర్చు' ననెను. రాముఁడట్లొనర్చెను. భరతుఁడాపాదుకలకు మ్రొక్కి 'అన్నా! ఈ నీ పాదుకలకు రాజ్యతంత్రమప్పగించి నేను జటావల్కలధారినై ఫలమూలాశనవ్రతముతో నీవచ్చుపర్యంతముఁ జతుర్దశవర్షంబులు నగరబహిర్భాగంబున నివసించుచు నిన్ను నిరీక్షించుచు నుందును. పదునాలుగేండ్లు చన్నతర్వాత నీసందర్శన మహాభాగ్యము నాకనుగ్రహింపవేని నాశరీరమగ్నికి సమర్పితమగు' ననెను. రాముఁడు వానితలమూర్కొని 'నాయనా! నీతల్లి నేమఁబవలదు; నా యాన సీతయాన' యని చెప్పి యతని సాగనంపెను.

పాదుకా పట్టాభిషేకము.

భరతుఁ డాపాదుకలను మృత్యుంజయమనుభద్రగజంబుశిరంబునం గుంచి యన్నయాజ్ఞవడసి వసిష్ఠాదిసమేతముగాఁ దరలి చిత్రకూట పార్శ్వమార్గంబున భరద్వాజాశ్రమంబునకు వచ్చి యామునికి నమస్కరించి వివరమెల్ల వానికి వినిచి తదాశీర్వచనంబు లంది శృంగిబేరపురము చేరి యటఁ గొంతతడవు ప్రుచ్చి యయోధ్యానగరము డాసెను. ఆపట్టణమతల్లి గ్రహగ్రస్తయైన రోహిణివలెఁ జెన్నుదొఱఁగి దిమిరగ్రసితయైన యామినివలెఁ బీడాకరమై నిదాఘసంతప్తయైన సేలయేఱుక్రియఁగృశించి హావిర్ధూపము గప్పిన యధ్వరాగ్నిశిఖఁబోలె నిస్తేజమొంది విధ్వస్తగజవాజిరథపతాకయైన సేనవడువున నిరుత్సాహపడి వాతోద్ధూతయై యెగసి ఘూర్ణిల్లి కుదిలపడిన వీచికలాగున నిశ్శబ్దముగా నుండెను. భరతుఁ డందులకు మహావ్యసనవ్యాక్రాంతరంగుఁడై యెట్లో దశరథాంతఃపురము సొచ్చి యందుఁ దల్లుల డించి వారికి నమస్కరించి వసిష్ఠాదులతోడ నందిగ్రామముచేరి ప్రజలఁగూర్చి

రామపాదుకలను శిరమున దాల్చి 'ఈపాదుకలే రామచరణాంభోజములు. వీనికి శ్వేతచ్ఛత్త్రాదిక సమస్తరాజగౌరవంబులు జరుగుంగాక. ఇవిరాజ్యమెల్ల సురక్షితముగాఁ బాలించును. నాయన్న వీనిని నాయొద్ద నిక్షేపించెను. ఆయనవచ్చినంతనే వానిపాదములకు వీనిఁ దొడిగి వానిరాజ్యమును వానికి నప్పగించి కృతకృత్యుఁడనై దూఱువాఁడను' నని శపథపూర్వకముగా విన్నవించుచున్నాను. నాశపథంబును మీరెల్లరు మనస్కరించి యథావిధి వర్తింపనగు' నని పలికి యాపాదుకలకుఁ బట్టాభిషేకమొనర్చి వానికి సమస్త రాజమర్యాదలను జరుపుచు నతఁడందు నివసించుచుండెను.

ఋషులు చిత్రకూటమును బాసి చనుట.

చిత్రకూటముఁబాసి భరతుఁడు చన్నంతట నందలి ఋషులు కలియఁ బలికికొని యాశ్రమాంతరములకుఁ జన సమకట్టిరి. వారితలంపును రాముఁడు గ్రహించి కులపతినిఁజూచి 'స్వామీ! ఋషులవదనమండలములందు వైపరీత్యములు దోఁచుచున్నవి. మావలన నపరాధమేదేనిఁ గలిగెనా! గురుశుశ్రూషలందు సీత పరాకుచెందదుగదా' అని వినయవినమ్రుఁడై యడిగెను. అనవుఁడు 'పరమకల్యాణి సీతదేవి ధర్మవ్యతిక్రమ మొనర్చునా! నీవలన నపరాధముండునా! సౌమిత్రితలంపులోనేని యకార్యసంకల్పము జనించునా! ఇట్టిశంకలు వలదు. రావణానుజుఁడు ఖరుఁడను రాక్షసుఁడు గలఁడు. వాఁడు మహాగర్వోద్ధతుఁడై జనస్థాననివాసులైన మునులను బాఱఁదోలెను. అతఁడంతతోఁ దనియఁడు. నీవిందున్నకారణంబున మమ్ములనుగూడఁ గాసించుచున్నాఁడు. నీవీయాశ్రమంబునఁ బాదమూనినది మొదలు రక్కసులవలన మేము పడయునిడుమ లిన్నియనరావు. అఖిలంబు భీభత్సరూపంబులు దాల్చి మమ్ము వెఱపింతురు; మా హోమద్రవ్యంబులను హరింతురు; అగ్నిహోత్రములఁ జల్లార్చుదురు; మాపయి నపరిశుద్ధవస్తువులఁ జిమ్ముదురు; హఠాత్తుగాఁబట్టి వధింతురు. ఆకాలముల దుండగము దుస్సహముగా నున్నది. ఆకారణంబున నిచ్చోటువాసి తొల్లిటి మాయాశ్రమంబులకుఁ జన నుద్యుక్తులమైతిమి. అవియిటకు దవ్వుగావున మాకునచ్చట నిట్టిబాధలు గలుగనేరవు. మీరు నిచ్చగింతురేని మావెంట రానగు'నని యక్కులపతి చెప్పెను.

రాముఁడు చిత్రకూటమును వదలి యత్రియాశ్రమము చేరుట.

రాముఁడావచనంబులకు మహాఖిన్నుఁడై వారిపయనమును వాఁప

నెంతో ప్రయత్నించెను గాని ఋషులు వారినిశ్చయంబును మఱలింపరైరి. ధాశరథియంతటఁ దనయుద్యమమును విరమించి యాఋషులను సాగనంపి పర్ణశాలకు వచ్చి నిజాంతరంగంబునఁ జంచలాచంచలంబులుగాఁ బొడసూపి యంతరించుచున్న భావపరంపరలకుఁ గొందలపడసాగెను. తల్లులును దారులును మరల వత్తురో యను శంక యొకప్రక్కవాని నాశ్రమాంతరమునకుఁ దర్లఁ బెట్టెను; అతలంపునకు నాశ్రమసహవాసప్రేమయొకవంక యాకట్టెఁ జొచ్చెను. రాముఁడట్లుకొంతవడి నరియాడి యెట్టకేలకుఁ గృతనిశ్చయుఁడై సీతాలక్ష్మణులను వెంటఁగొని యత్రిమహాముని యాశ్రమము చేరెను. ఆ మహాత్ముఁడు వారిని సుతాధికప్రియంబున సత్కరించి,

> "ఉ. కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖమువచ్చుచుండు నె
> క్కాలము నేరికిన్ ధ్రువముగాదు సుఖంబును దుఃఖముక్ మహీ
> పాల! బుధుండుతద్ద్వివిధభంగులెఱింగి ప్రమాదభేద సం
> శీలుఁడుగాఁడు రెంటను బ్రసిద్ధపథంబున నప్రమత్తుఁడై."

అనివచించి నిజపత్ని ననసూయాదేవిని బిలిచెను. ఆమెకు రామలక్ష్మణులు మ్రొక్కిరి; సీతాదేవి తనపేరుచెప్పి ప్రదక్షిణనమస్కార మొనర్చెను. అనసూయాదేవి రాఘవుల నాదరించి సీతను దనవెంట లోనికిఁ గొనిపోయి 'అమ్మా! నీవృత్తాంతమును వినగోరుదు' ననెను. వైదేహి తనచరిత్రమెల్ల వినిపించెను. ఆమునిపత్ని పరమప్రీతయై 'అమ్మా! నీపాతివ్రత్యంబునకు మెచ్చితిని; నీనిశ్చయమును గొనియాడరాదు; సతికిఁ బతిసేవకన్నఁ దర తపోపాయము వేఱుగలుగదు; నీవు త్రైలోక్యస్త్రీజనంబునకు శుభమార్గదర్శిని వైతివి; మేమెల్లరము నిట్లు తపోవ్రతములాచరించుట మనశ్శుద్ధిసంపాదన మునకేగదా. శుద్ధచిత్తులకు దుష్కృటంబులుండవు. వత్సా! నీయిచ్ఛదెలుపు మొనరుతు' ననెను. జానకి యామెకుఁ గయిమోడ్చి 'ఆర్యా! నీవచనముననే నాకు సర్వాభీష్టసిద్ధియయ్యె' నని చెప్పెను. అనసూయాదేవి యంత నామెకు వస్త్రాభరణంబులును బుష్పమాలికలును నంగరాగమును గొనివచ్చి యిచ్చి వత్సా! వీనిని ధరింపుము; నీకు సమస్తశుభములగును; ఇవి చెడని పదార్థము' అని పలికి తనమ్రోలనే వానిని ధరింపఁగోరెను; సీతాదేవి వానిని భక్తితో గ్రహించి దాల్చి యామెకు మ్రొక్కి రామునొద్దకుఁజని సంగతి తెలిపెను. రామలక్ష్మణులందులకు మహాప్రీతులైరి.

అంతలోన నాఁడు విహగంబులు తమతమకులాలయములఁజేరి నిజవిహార విశేషంబులను జెప్పుకొనుచున్నవోయనఁ గలకలధ్వనులఁ గావించెను; మునులు సాయంకాలిక స్నానములాచరించి తడిబట్టలతోడ జలకలశంబులతోడ నాశ్రమములకు రాసాగిరి; అగ్నిహోత్రంబుల ధూమము కపోతాంగాసిమమును బుడమించుచు గగనభాగంబును గప్పెను; ఆశ్రమమృగంబులు విశ్రామార్థము వేదిస్థానములు చేరెను; వృక్షంబులు మహాల్పపర్ణంబులయ్యుఁ జిత్రబహుళంబులుగాఁ దోఁచెను; చంద్రుఁడు నక్షత్రపరివారముతోడఁ జేరోలగము తీఱి లేవెన్నెలలఁ జల్లి యింద్రియతర్పణమొనర్చుచుఁ దనరాజనామంబును సార్థక మొనరింపసాగెను.

రామాదులు దండకారణ్యమునకుఁ బోవుట.

సీతారామలక్ష్మణు లారాత్రి యందుఁ గడపి ప్రాతఃకాలమున లేచి క్షేమప్రయాణంబు నయ్యాశ్రమవాసులకుఁ దెలిపిరి. వారామాటవిని 'రామా! ఈమహారణ్యంబున నరభక్షకులైన రాక్షసులు నానాఘోరాకారులు గలరు; క్రూరమృగంబులును దండోపతండములుగా విహరించుచుండును. మేమెంతో మెలఁకువతో ఫలాహారములను సేకరించుకొనుచుందుము. ఇదిగో యీదారిఁ జనిన నంతభయముండదే' దని చెప్పి మార్గముఁజూపి వారినాశీర్వదించిరి. రాముఁడు వారికిఁ బ్రణమిల్లి సీతాలక్ష్మణులవెంటఁగొని సూర్యుఁడు నీలమేఘమండలంబును వలె దండకారణ్యముఁ బ్రవేశించెను.

అయోధ్యాకాండము

సమాప్తము.

---





# శ్రీ దొడ్డ రామాయణము,

## అరణ్యకాండము.



శా. రాజ్యశ్రీ విడనాడినన్ గహనగర్భంబాశ్రయంబైన సం
భోజ్యంబుల్ ఫలమూలవారియయినన్ బుంజీకృతాధివ్యధల్
ప్రాజ్యంబైన సహించె నెవ్వఁడు స్థితప్రజ్ఞాఢ్యుఁడై యాజగ
త్పూజ్యప్రాభవయోగివర్యు చరణాంభోజంబులం గొల్చెదన్ ॥

రాముఁడు సీతాలక్ష్మణులతోఁ దాపసమండలమునకుఁ బోవుట.

అట్లు రాముఁడు సీతాలక్ష్మణులఁగూడి దండకారణ్యంబుఁ జొచ్చి చనుచు మార్గమధ్యంబునఁ గొండొకచోట, స్వాదుఫలభరనమ్రంబులైన వృక్షంబులతోఁ గ్రిక్కిరిసియున్నదియు, నానామానవితానమనోజ్ఞలతామందిరంబులను వికచకల్హారకమలాకరంబులను గలిగి మహారమణీయంబుగా నున్నదియు నగు తాపసాశ్రమమండలంబొండు గాంచి తత్ప్రాంతవృక్షములం దారవైచియున్న వల్కలంబులను, యజ్ఞార్థము సంతరింపఁబడి యందందుఁ బ్రోవులైయున్న కుశలనుజూచి, చేరువకుఁబోయి యందు యాగపాత్రకృష్ణాజినసమిత్కుశజలకలశంబులతో నిండియున్న యగ్నిహోత్రగృహంబులను వానిమధ్యఁగూర్చుండి బలిహోమార్చనల బ్రహ్మఘోషలఁ దవిలియున్న బ్రహ్మతేజోమూర్తులను బరికించి, నారిసహితుఁడై వినీతవేషంబున నయ్యాశ్రమముఁ జొచ్చెను. అందలి మహర్షులు దివ్యజ్ఞానసంపన్నులు తమయాశ్రమంబునకు నట్లువచ్చిన యయ్యతిథులను గాంచి సంతసించి యెదురేగి, యామువ్వురలోన విలక్షణరూపలక్ష్మీసౌకుమార్యసౌం

దర్శనంబులఁ దేజరిల్లుచున్న రామునకు నత్యంతము విస్మయమంది, యట్టిమహా భాగుఁడు తమకు నతిథిగావుటకు కెంతయు నలరి, వారిని దోడ్కొనివచ్చి యథోచిత సత్కృతులాచరించి, ఫలమూలపుష్పంబుల గారవించిరి. ఎల్ల మర్యాదలు తీరినంత రాముఁడామునులను గుశలవృత్తాంతాదులు విచారించెను. వారు ప్రాంజలులై 'మహాత్మా! నీవు మాకెల్ల మాన్యుండవును బూజ్యుండవు నగుటయ గాక పరమశరణ్యంబవై తనరుదువు. ధర్మపరిపాలనార్థం బవతరించితివి ; దుష్టశిక్షణంబున ధర్మవు సుస్థిరంబై వెలయును. దుష్టులను శిక్షించు రాజు తండ్రికి సాటియగును ; రాజజన్మంబు సామాన్యము గాదు ; ఱేఁడు దేవేంద్రచతుర్థాంశంబున జనించును ; ఆకారణంబున నతండు సర్వలోకనమస్కృతుండును నిఖిలభోగానుభవయోగ్యుండు నగును; మేమెల్లరము నిందు నివసించుచు భవద్భుజాభిరక్షితులమై మనుచున్నాము ; నగరస్థులమో వనస్థులమో మాకెల్ల నీవే ప్రభుండవు. జితేంద్రియులము గావున నపకారులనుగూడ నొప్పింపనోల్లము. తపోవ్రతచర్యలఁ బ్రొద్దు ప్రత్తుము ; తపోధనులు నీకు గర్భసంజాతు లట్టివారు ; వారి రక్షణము నీకుఁ దప్ప' దనిరి.

విరాధవధ.

రాముఁ డట్లామహర్షులకు నతిథియై సతీసహోదరులతోడ నాఁటిరేయి యుండుఁబుచ్చి రేపకడలేచి యమ్మునీంద్రులను వీడ్కొని తరలి చనిచని యరణ్యాంతరము ప్రవేశించెను. ఆకాననంబు నానామృగాకీర్ణంబును శార్దూలవృకసేవితంబును విధ్వస్తలతావృక్షగుల్మంబునై వెఱపించుచుండెను. అందలి కాసారంబులు దుర్గంధదుస్సహములుగాఁ దోచెను. మఱియు నందు శకునిఝిల్లికాదులు చలనంబులు మాని నోరు విచ్చి తపోనిష్ఠనున్నవోయనఁ గాన్పించెను. రాముఁ డవియెల్ల జూచుచు వింతగూరుచుఁ గొండొకదవ్వు చని యట గిరిశృంగంబునుబోని మేనుభూతంబును చేటలంతటి కన్నులతోను మహాగహ్వరసమానవదనంబుతోను బూరటిల్లి విషమమైయున్న యుదరంబుతోను భీభత్సాకారముగా నున్నదానినిగాంచెను. ఆభూతము పచ్చినెత్తురు వల్చుచున్న పులితోలుచుట్టి, సింగంబులమూఁటిని బెబ్బులులనారింటిని దోడేళ్ళరెంటిని జింకలఁబదింటిని, వసగాఱుచున్న సదంతదంతిమస్తకంబొండు శూలాగ్రమున గ్రుచ్చిమూఁపున వ్రేలవైచి నోరప్పళించి యమునివలె బాపాగెను,

ఆఘాతంబు రామాదులను జూచి ధాత్రీతలంబు గ్రక్కదలునట్లు పాదసంఘట్టనంబు గావించి బొబ్బార్చి యేఁచి వచ్చి సీతాదేవి నొడిసి చంకఁ బెట్టుకొని 'ఎవరురా మీరు? నారచీరలు గట్టితిరి; ధనుర్బాణంబులను ధరించితిరి; కాంతాసహితంబుగా వచ్చితిరి. ఇది చాలఁ జోద్యమయ్యెడు. ఋషులేవ? ప్రమదాసహచర్యమేడ? మీ వేషంబులెక్కడ? ధనుర్బాణంబులెక్కడ? అధర్మవర్తనులైన మునిమాషకులు మీరెవ్వరో వచింపుఁడు. ఈదండకారణ్యంబు నాదగుటయెఱుంగరా? నాసంగతి తెలియదా? ఋషిమాంసభోజినై యిందు వసింతునని వినరా? ఈవరారోహ నాకుఁ గూర్మి సతియగుఁగాక. మీ వేఁడినెత్తురులు నాయాఁకలిఁ దీర్పుఁగాక' అని మహోద్దుష్టంబుగా బలికెను.

సీతాదేవి ప్రవాతకదళికవలె వడంకుచుఁ బరితపింపసాగెను. రాముఁడు తన ప్రియురాలి దురవస్థకు దుఃఖశోషితవదనుండై 'లక్ష్మణా! జనకమహారాజునకు జనించి శుభాచారయై యత్యంతసుఖంబులఁ బెంపొంది పరమపతివ్రతాకీర్తిని గడించిన యీరాజపుత్రి నాయనుంగు సతి యిట్లురాక్షసాంకమునఁ జిక్కి యుంటఁ జూచుచు మిన్నకుందువా? కైకేయి యెంత దీర్ఘదర్శినియో చూడుము. ఆమె తనకొడుకునకు రాజ్యప్రాప్తిమాత్రంబునఁ దనియక యేదేది సంకల్పించి సర్వభూతహితుని నన్ను వరవ్యాజంబున వనప్రస్థాపితునిగా నొనర్చెనో యవియెల్ల నేఁడు ఫలింపనున్నవి. తమ్ముఁడా! వైదేహిని బరపురుషుండు తాఁకుటంజేసి నాకిప్పుడు పొడముచున్న దుఃఖము పితృవియోగ రాజ్యహరణంబులఁ గూడ జనింపదయ్యెను. ఆమాటతోడ లక్ష్మణుఁడు మహాక్రుద్ధుఁడై మంత్రనిరుద్ధకాలసర్పంబుపగిది నిశ్వసించుచు 'అన్నా! సర్వలోకనాథుండవును దేవేంద్రకల్పుండవునైన నీవు ప్రేష్యుండనైన నేను వెంటనుండఁగా ననాథునిచందంబున నిట్లు పరితాపమొందనేల? రాజ్యకామియైన యాభరతునిమీఁది వాపగ తీఱునట్లుగా నొక్కకోల నిప్పాలసుడిండిని బరిమార్చి తద్రక్తంబుల నవనికిఁ ద్రావనిత్తుఁ జూడుము. ఆకర్ణాంతము దివిచి వేయునాబాణం బీదురాత్ముని యురస్థలంబును వ్రచ్చి వానిప్రాణంబులను హరించి తచ్ఛవంబును క్షణమాత్రంబున నేల దొర్లాడించు' నని పలికి యారక్కసునిఁ జూచి 'రాక్షసాధమా! ఈ వనంబున విచ్చలవిడిఁ జరింతువు; నీవెవ్వండ' వని యడిగెను. ఆరక్క

సుఁడు గర్వోద్ధతుఁడై 'మీ రెవ్వరో? ఎందుఁబోదురో ముందు వివరింపుఁడ'ని గభీరస్వరంబున బదులాడెను. రాముండామాట విని 'మేము క్షత్త్రియులము; సదాచారసంపన్నులము; వనవాసము వరించి వచ్చితిమి. నీసంగతియే' మనెను. వాఁడు 'రాజా! నాతండ్రి పేరు జయుఁడు, నాతల్లి శతహ్రద; నన్ను విరాధుఁడందురు. నేను బ్రహ్మనుగూర్చి కఠోరతపంబొనర్చి ఖడ్గధారాహతులవలనఁగాని ఛేదనభేదనంబులవలనఁ గాని చావు రాకుండునట్లుగా వానివలన వరంబులందితిని. నన్నుఁ జెనకనోపరు. ఈ యింతిని మీ రిఁక మఱచి ప్రాణంబులు దక్కించుకొని వచ్చినదారిఁ బోనగు'నని పలికి సీతతోడ నురుకనుండెను. రాముఁడు కోపసంరక్తలోచనుఁడై 'క్షుద్రాధమా! పరస్త్రీహరణంబును దలపెట్టి మృత్యువును గోరి వచ్చితివి. ప్రాణంబులతో నీవు వెడలుటకల్ల; నిలునిలు' మని విల్లెక్కుడించి రుక్మపుంఖంబులును వాయువేగవంతంబులు నైన శరంబుల నేఁడింటి వానిని నైచెను. ఆబాణంబులు వానిశరీరంబును జీల్చి తచ్ఛోణితదిగ్ధములై నేల వ్రాలెను. విరాధుఁడు శరహతికి నొచ్చి మహోగ్రుఁడై సీతను డించి పేర్చుచు నింద్రధ్వజముఁబోని శూలంబునుబూని కాలాంతకుని పగిది లక్ష్మణునిపైకి నుఱికెను. రామలక్ష్మణులిరువురు నొక్కుమ్మడి నతనిపై శరవర్షముఁ గురిపించిరి; విరాధుఁడు వికవిక నవ్వి తనయొడలనాఁటియున్న యమ్ములుకులను విదిల్చివైచి బిట్టార్చి రాముని గవసెను. రాముఁడు బాణద్వయంబున వానిశూలంబును ఖండించెను. విరాధుఁడట్లు నిరాయుధుఁడయ్యు విజృంభించెను. రాఘవులు వానిని గృష్ణసర్పంబులఁబోని ఖడ్గంబులఁ బ్రహరించిరి. అయ్యసుర యావ్రేటులు చీరికిఁగొనక యయ్యిరువురనొడిసి సండటఁజేర్చి పోనుంకించెను. రాముఁడు వానితలఁపు గ్రహించి 'లక్ష్మణా! మనము పోనున్న దారినే యితఁడు మనలను మోసికొని పోనున్నాఁడు; కాని' మ్మనెను. విరాధుఁడు రామలక్ష్మణులను శిశువులనువలెఁ దనభుజంబులపయి నిడుకొని బొబ్బరించుచు వనాభిముఖుండయ్యెను.

ఆరక్కసునిదుండగంబును సీతాదేవి పరికించి చేతులు పిసికికొనుచు 'అయ్యో! సత్యసంధుని బరిశుద్ధాత్ముని దశరథమహారాజపుత్త్రకుని రాముని సోదరసహితంబుగా రాక్షసుఁడు రౌద్రాకారుఁడు హరించుచున్నాఁడు. ఇఁక నేను వృకశార్దూలంబులకు బలియగుట నిజ' మని చింతించి,

మఱియు నారథమునుజుట్టి గగనస్థితులై సిద్ధగంధర్వామరమహర్షులు నిగమోక్తులఁ బ్రస్తుతించుచుండిరి. రాముఁడదియెల్లఁ జూచి 'లక్ష్మణా! కాంతిశ్రీసమాజుష్టమై మధ్యాహ్నభానుమండలంబు పగిది నింగిఁ బొంగారుచున్న యీబంగారురథంబును గంటివా? ఆతేరునకుఁ గట్టిన పచ్చవన్నెతురంగంబులఁ జూతువా! శోణాంశువస్త్రంబులుధరించి పరిఘాయత బాహుదండంబులందు ఖడ్గంబులు దాల్చి దురాసదులై యయ్యరదంబును జుట్టియున్న వారలెవరు గానోపు? సౌమిత్రీ! ఆరమణీయముల యూరంబుల మెఱయు హారంబుల తేజము వారివంకఁ దేఱి చూడనీయదు. వారెల్లరును బంచవింశతివర్ష ప్రాయములుగాఁ దోఁతురు. దేవతలట్టివారని విందుము. నీవును సీతయు నిందుండుము; నేను పోయివివరము విచారించి వత్తునని చెప్పి యాశ్రమంబువలను చనెను.

అంతలోన నొకదివ్యతేజోమూర్తి యయ్యరదంబునుండి దిగి వడివడి శరభంగమహర్షిని సమీపించి 'మునీంద్రా! అదిగో రాముఁడు వచ్చుచున్నాఁడు. ఆయన రావణునివధించి దేవతాకార్యంబొనర్ప వలసియున్నది. అందాక మాకుసమాగమంబుకూడదు. వేగమ తరలుము' అనెను. శరభంగుఁడు వారిని బూజించి 'నిర్జరవల్లభా! ఇప్పుడు రాఁజాలు' నని చెప్పి యతనిని వీడ్కొలిపెను.

అయ్యమరేశ్వరుఁడు చనుటయే తడవుగా రాముఁ డయ్యాశ్రమము చొచ్చి యమ్మహర్షికి మ్రొక్కి గగనంబునఁ దాఁజూచినరథంబును గూర్చి యడిగెను. శరభంగుఁడు తలయూచి 'నాయనా! రామా! అదియింద్ర రథము. నేను తపోబలంబున బ్రహ్మలోకంబును సాధించితిని. అటకు నన్నుఁ గొనిపోవ నిర్జరాధిపుఁడు సురసమేతంబుగా రథంబును దెచ్చెను. ప్రియాతిథివి నీవు సన్నిహితుండవగుట యెఱింగి నిన్ను సందర్శింపక చనరాదనియెంచి యింద్రుని బంచితిని. రామా! నాసాధించిన యక్షయస్వర్లోక బ్రహ్మలోకంబులను నీకు సమర్పింతు గ్రహింపు' మనెను. రాముఁ డామాట విని తపోధనాగ్రణీ! ఏలోకంబునైనను స్వయంబుగా సాధించుట ధర్మంబగును. ఆతలంపుననే యిందు వచ్చితిని. నాకు నివసింపఁ దగుతావుఁ జూపుముచాలు' ననెను. 'రామా! ఈవనమందే యనతిదూరంబున మహానుభావుండును సర్వజ్ఞుఁడును గౌతమవంశ్యుండునైన సుతీక్ష్ణ

మహాత్మ్యగలఁడు. ఆయన నీకు మేలు గూర్చును. ఇదిగో యీమందాకినీ తీరంబునఁ జనఁగా నేటిలోఁ బుష్పాకారంబులైన తెప్పలు గానవచ్చును. అవి గురుతుగా దారిం బట్టిపోయి వానియాశ్రమము చేరనగును. రామా! నీసందర్శనభాగ్యంబు లభించెను. ఇఁక నే నీజీర్ణశరీరంబును సర్పంబుకుబుసంబు వలె వదలుదును. అది చూచిచను' మని పలికి యప్పుడే యగ్ని రగిల్చి యాజ్యము వ్రేల్చి యాచితిఁ జొచ్చి దగ్ధుఁడై యందుండి కుమార వయస్కుఁడుగా లేచి, యాహితాగ్నులును ఋషులును దేవతలును బడయు లోకంబులు దాటి బ్రహ్మలోకముఁ జేరి యటఁ బితామహుని స్వాగత మందెను.

ఆశ్రమమునులు రాక్షసబాధలు గూర్చి రామునకు మొఱలిడుట.

శరభంగునియాశ్రమమందు బహువిధతపోనిష్ఠు లుండిరి. అందుఁ గొందఱను వైఖానసులందురు; వారు బ్రహ్మనఖంబులవలన జనించిరట. మఱికొందఱను వాలఖిల్యులని పేర్కొందురు; వారు బ్రహ్మరోమంబుల నుండి పుట్టిరని చెప్పుదురు. సంప్రక్షాళులను పేరివారు మఱికొందఱు గలరు; వారు ధాలి యొనర్తురు. మరీచిపులనువారు కొందఱుండిరి; వారు సూర్య చంద్రకిరణంబులను త్రావి జీవింతురుగావున వారికాపేరు వచ్చెను. అశ్మకుట్టులను నింకొక తెగవారుండిరి; వారు స్వదేహంబులను రాలతో మర్దించి కొనుటం జేసి యాపేరఁ బరగుదురు. పత్రాహారులను తెగ యొకటి యుండెను; రాలిన పండుటాకులు తిని జీవించుట వారి యాచారము. దంతోలూఖలికులనువారి తెగ మఱియొకటిగలదు; దంతములతో ధాన్యముల పొట్టొలిచి గింజలు తినిమనుట వారి వ్రతము. ఉన్మజ్జకులను మఱియొక తెగ వారుండిరి. కుత్తుకబంటి నీటిలో నిలిచి తపముచేయుట వారిసంప్రదాయము. గాత్రశాయులనువారు కొందఱుండిరి; భుజమో ఱొమ్మో తలగడగాఁ జేసికొని నిద్రింతురుగాన వారినట్లందురు. అశయ్యులనువారు మఱికొందఱు గలరు; వారు బొత్తుగా నిద్రింపరు. అభ్రావకాశులను వేఱొక తెగవారుండిరి. వారు శీతకాలంబున బహిఃప్రదేశమందు నిలిచి తపంబులాచరింతురు. కొందఱు సలిలాహారులును మఱికొందఱు వాయుభక్షులు నుండిరి. వీరుగాక నిరాలంబముగా నింగి నిలిచి తపంబు సేయునట్టి యాకాశనిలయులును, గటికనేల బండుటే వ్రతముగాఁగల స్థండిలశాయినులును, నిత్యోప

వాసంబులుచేయు వ్రతోపవాసలలును దమము నే యనుష్ఠించు దాంతులును, నిరంతరముఁ దడిగుడ్డలు కట్టియుండువట్టి యార్ద్రపటవాసులును, సజప్తలసు వారును దపోనిష్ఠులనువారును బంచాగ్నిమధ్యనిలిచి తపమొనర్చువారు నిట్లు పలురకములవారుండిరి.

రాముఁడు వారినెల్లఁజూచి లక్ష్మణా! ఈమునులనుజూతువా? ఎల్లరు నిట్టి కఠినవ్రతంబులాచరించుట యేలనో యూహింతువా? ముక్తిఁ గోరి వీరిట్లు చేయుచున్నారు. ముక్తిఁబడయుటకుఁ జిత్తైకాగ్ర్యము వలయును. చిత్తమన్ననో చంచలాచంచలము. దానినొకచోట నిలుపుట యంత సులభకార్యముగాదు. మఱియుఁ జిత్తము వివిధవాసనారూపంబుల నుండును. ఆవాసనలను నిశ్శేషమొనర్చుటయే చిత్తసమాధానమందురు. వాసనలు పలువిధములగుటయేగాక సూక్ష్మ మంద గాఢ రూపంబుల నుండును. దానంజేసి తన్నాశనంబునకు నేకమూలికాప్రయోగము తగదు. అందువలనఁ దత్త్వజ్ఞులగు గురువులు తమశిష్యుల మనస్తత్వంబులను గ్రహించి వారివారికిఁ దగునిష్ఠల నుపదేశింతురు. ఈమునులకెల్లరకు ముక్తియే ప్రాప్యముగానున్నను మనస్తత్వభేదముంబట్టి వీరిట్టిభేదమార్గంబుల ననుష్ఠించుచున్నారు. తమ్ముఁడా! ఆత్మసమాధి యెంతకష్టసాధ్యమో గ్రహింపు మనెను.

అంతలో నమ్మునులు రాముని సమీపించి "ధర్మాత్మా! దేవేంద్రుఁడు స్వర్గంబునకువలె నీవు భూమండలంబునకు నధిపతివై విశ్రుతిఁగాంచితివి. పితృభక్తి యందును సత్యపరాయణత్వమందును నిన్నుఁబోలు వతండుగలుగఁడు. రాజునకుఁ బ్రజాసంరక్షణమే పరమధర్మము. తన్నిమిత్తము జనుల వలన నాఱవవంతు బలిగ్రహింతురు. ప్రజలసొమ్ము పట్టుకొనియు వారిని రక్షింపనిరాజు మిక్కిలి యధర్మంబును బొరయును. ప్రజలను బ్రాణాధికులుగా రక్షించు నాతఁడు బ్రహ్మలోకపూజితుఁడగుటయేగాక కీర్తిమూర్తియై చిరకాలము జీవించును. కచ్ఛడంబులు గట్టి కందమూలంబుల జీవించుచున్న యీగోసిపాతలరాయలు తమరక్షణార్థము రాజులకేమి యిత్తురనవలదు. వారును దమతపోధనమందుఁ జతుర్థాంశంబు రాజులకిచ్చుచున్నారు. కావున వారుఁగూడ రాజులకు నవశ్యరక్షణీయులగుదురు. వానప్రస్థులకు మీకేమి బాధలుండు నందువా? అదిగో చూడు మిచ్చట

మ్రందఁ బడియున్న యస్థికాసులే మాకష్టములఁ జెప్పును. రాక్షసులవలన నేము పడు బాధ లిన్నియఁ గావు. వారుగావించు వధాకోలాహలంబును భరింపఁ జాలకున్నాము. నీవే మాకు శరణంబని మొఱపెట్టిరి. ఆయృషుల దీనవచనంబులకు రాముఁ డెంతయుఁ జింతాక్రాంతుఁడై 'మహాత్ములారా! మీరు నన్నాజ్ఞాపింపఁదగుదురేగాని నాకు విజ్ఞాపింపఁ జెల్లదు. కొండొక కార్యార్థినై యిందువచ్చితిని. అయినను దండ్రియాజ్ఞవట్లు మీయాజ్ఞను గూడఁ దలఁదాల్చి రాక్షసులవలని విప్రకారంబునుండి మిమ్ముఁ దప్పింతును. తపోధనులు మాశౌర్యపరాక్రమంబులఁ జూడఁగలరు. భయము మానుఁ'డని పలికి వారికి నభయహస్తంబిచ్చి సీతాలక్ష్మణులను వెంటఁగొని యామునులతోడ సుతీక్ష్ణమహర్షి యొద్దకుఁ దరలెను.

### సుతీక్ష్ణమహర్షి యాశ్రమము.

రాముఁడట్లు వెడలి మహారణ్యముఁ జొచ్చి జలపూర్ణంబులైన నదులను దాఁటి, వివిధవృక్షసమాకీర్ణములై చీఁకట్లు గ్రమ్ముచున్న పెనుగొండల నతిక్రమించి, చనిచని చీరమాలాపరిష్కృతమైన యాశ్రమమొండు చేరెను. అందుఁ జీఁకుముదుసలితపసి యొకండు నిజజటాభారము పంకావిలమైనది, తదీయ నిశ్చలతపోవ్రతతత్త్వంబును జెప్పకయే తెలుపుచుండఁగా ధ్యానసమాధినుండెను. ఆతాపసియే సుతీక్ష్ణమహర్షిగా నెఱింగి రాముఁడు వానిని డాయఁబోయి 'మహాత్మా! మీదర్శనార్థము వచ్చితిని; నన్ను రాముఁడందు' రని నమస్కరించెను. ఆమునిపుంగవుఁడు రాముని గవుంగిటఁ గూర్చి 'రామా! స్వాగతము; నీవలన నాయాశ్రమంబు నేఁడు సనాథమయ్యెను. నీరాకను నిరీక్షించి దేవలోకగమనంబునుగూడ విరమించి యీతనువును ధరించియున్నాను. నీవు రాజ్యభ్రష్టుండవై వనవాసమునిమిత్తముగాఁ జిత్రకూటంబునకు వచ్చుట వింటిని. ఇప్పుడే యింద్రుఁడిటకు వచ్చి 'మునీంద్రా! శరభంగమహర్షి కడనుండి వచ్చుచున్నాను. తపోబలంబున నుత్తమలోకంబుల నెల్ల జయించితి' వని పలికిచనెను. నాయార్జించిన యాదివ్యలోకములందు మత్ప్రసాదంబున నీవు సీతాలక్ష్మణులనుగూడి యథాసుఖంబు విహరింపనగు' నని వచించెను. నావుడు మహాత్మా! మీనిర్వ్యాజప్రేమ కెంతయుఁ గృతజ్ఞులము. పుణ్యలోకములను స్వయముగా సంపాదింప నఖిల

షింతును. ప్రకృతము మేమీవనమందు వసింపనైనచో నేదో యనుజ్ఞ యిమ్ము. శరభంగమహర్షిపంపున నిందువచ్చితిమి. నీవు సర్వభూతహిత రతుండవగుటయు సర్వజ్ఞుండవగుటయు గౌతమవంశ్యుండవగుటయు న మ్మహనీయుఁడు మాకుఁ దెలిపె' నని రాముఁడనెను. అందులకు నమ్ముని వరుండలరి 'రామా ! ఈయాశ్రమమందే మీరుండవచ్చును. ఇదిఫలమూల సమృద్ధంబును ఋషిసేవితంబునగుట మీకు వసింపఁదగియున్నది. మృగబాధ మాత్రమిందుగలదు. అన్యక్లేశంబు లిటఁగలుగ' వనెను. రాముఁడదివిని 'మునీంద్రా! ఆశ్రమాపకారములైన మృగంబులను వేయికనాకుఁ దప్పఁదు. అది మీకోపకారణంబగును. అంతకన్నఁ గష్టముందునా ? కావున నే నిందుఁ బెద్దకాలము వసింపనోప' ననెను.

వారట్లు సంభాషించుచుండఁగా రవి యస్తంగతుఁడయ్యెను. రామాదులంతట తత్సమీపంబుననున్న కొలనునందు వార్చివచ్చి తాపసభోజ్యమైన యన్నము గ్రహించి యారేయి యందుండి వఱువాతలేచి యుత్పల సుగంధబంధురశీతజలంబులాడి యగ్నిహోత్రకార్యంబులు దీర్చి దేవతలను బూజించి సూర్యోదయంబుతోడ సుతీక్ష్ణమహర్షిని సందర్శించి 'మునివర్యా! రాత్రియిందు సుఖముంటిమి. దండకారణ్యమందలి పుణ్యాశ్రమంబులను సందర్శింప నెంతయుఁ దమకింతుము. అజ్ఞవేఁడుదుము. ఎండవేఁడిమి నడు మంత్రపుసిరిఁగలానిదుందుడుకట్లు దుస్సహము గాకమున్నె యిందుండి తరలఁగోరుదు' మని వానికి సాగిలఁబడి మ్రొక్కిరి. ఆమునీంద్రుఁడు వారినిలేవఁదీసి 'రామా ! ఛాయవోలె నంటియున్న సీతతోడఁ గూర్మినిధాన మైనతమ్మునితోడ నీవు చనుమార్గము నిరుపద్రవంబగుఁగాక. తపోభావి తాత్ముల పుణ్యాశ్రమంబులను సేవించుచుఁ బ్రాజ్యఫలమూలంబు లారగిం చుచు, వివిధమృగయూథవిహారంబులఁ గాంచుచుఁ, బ్రకాండపక్షిగణ కూజితంబు లాలకించుచుఁ, బూచి దలిర్చి నునుగాలికిఁపిచుచున్న లతాహస్తం బులతోఁ బొదరిండ్లు గావించునట్టి యాహ్వానంబులందికొనుచుఁ, బ్రసన్న సలిలపూరంబులునుఁ బ్రఫుల్లపంకజకారండవమనోజ్ఞంబులునైన సరోవరంబు లను నలరుచు, మయూరనృత్యంబు లభినందించుచు, సుఖంబుగాఁ బొమ్ము· వత్సా ! లక్ష్మణా ! నీకుభద్రంబగుఁగాక. మరలమీరిందు రాఁగోరుదు' మనెను. వారంతటనమ్మునికిఁ బ్రదక్షిణంబొనర్చి తరలిరి.

సీతారాముల సంభాషణము.

వారట్లు కొంతదూరము చన్నతర్వాత సీతాదేవి భర్తను జూచి 'నాథా! ఈమునీంద్రుని గూర్చి తలంచుకొలఁది వింతయగుచున్నది. మిథ్యావచనపరస్త్రీగమనవైరంబులనునవి మూఁడుఁ గామజన్యవ్యసనంబులందురు. ఆఁదొక్కటేనియు నిమ్మునీంద్రునందుఁ గానరావు. అమ్మూఁడింటిని జయించినవారిని జితేంద్రియులందురు. కావున నిమ్మునీశ్వరుండు జితేంద్రియుండనుట నిర్వివాదాంశము. ఇట్టిజితేంద్రియులకెల్లఁ బరమపూజ్యుండగు మహానుభావుఁ డెంతటివాఁడుగానుండునో యూహింపనగునేగాని చెప్పఁ దరముగాదుగదా. నాథా! ఇట్టిమునీశ్వరులకు వేలకొలందికి మీరు ప్రాజ్యులైయున్నారు. వనవాసంబునకు మనమువచ్చినదిమొదలు ఋషీంద్రులు మీకుఁగావించు సత్కారంబులవలననే యీసంగతి స్పష్టము. ఇట్టి మీయందుఁ దత్కామజన్యవ్యసనంబులెల్ల సబీజంబుగా నశించియుండక తప్పదు. అట్లుగాకున్నచో మీకిట్టి యాధిక్యత కలుగనేరదు. ఈవ్యసనంబులు మూడింటిలో మొదటివిరెండు మీయందు వాసనామాత్రముగానేని గలుగవని మీచరిత్రయే చాటుచున్నది. ఈమూఁడింటిలోఁ బూర్వపూర్వములు బలవత్తరంబులందురు. బలవత్తరములైన మొదటిరెంటిని జయించిన మహానుభావుండు మూఁడవదానిని జయింపలేదని తలంచుటయు భావ్యముగాదు. ఎవనిచిత్తమెంతమాత్రము పక్వమైయుండునది వానికార్యములు సూచించుచుండును. కావునఁ గార్యమునుబట్టి కారణంబును లోకమూహించి నిశ్చయించును. నాథా! పైమూఁడింటిలో మొదటిరెంటికి మీయందుఁ దావే లేదని విన్నవించితిని. మూఁడవదానిని గూర్చిమాత్రము కొంతసంశయంబగుచున్నది. ఈసంశయంబునకు నాయజ్ఞానమే కారణమైయుండును. అయినను సంశయనివారణార్థము విన్నవింతును. సంశయకారణమేమందురా? రక్కసులబరిమార్తునని ఋషులకు మాటయిచ్చితిరి; దానంజేసి రాక్షసుల మీఁద మీరు మీశరంబును వ్యయింపక మానరు. అసురులు మీకెట్టి యొగ్గునొనర్పరు. అట్టివారియెడ నిట్లువర్తించుట నిష్కారణవైరంబగును. ఈ మోహవశకార్యంబు పామరులకగుఁగాని సర్వజ్ఞునకుఁ జెల్లదు. ఇట్టిది నేఁడు మీకుగలుగుటకుఁ జింతాశ్చర్యంబులయ్యెడు. అంతియగాదు; ధనుర్బాణంబులు ధరించి తమ్మునిగూడి మీరిట్లు వనంబునకువచ్చుట యేతన్నిమిత్తమే

మోయనియు స్ఫురించుచున్నది. చేతిలోని యాయుధమూఱకుండనీయదు. చేరువనున్న యింధనంబులవలన నగ్నివలె హస్తగతాయుధంబులవలన క్షత్త్రియుండు తేజోవృద్ధిని గాంచును. ఇందులకు నిదర్శనంబుగాఁ గతయొకటి చెప్పెదను. తొల్లిమునియొకండు తపోనిష్ఠుఁడై కొండొకవనంబున నివసించుచుండెను. శచీపతి వానితపంబును విఘ్నమొనర్పఁదలంచి భటురూపంబున వానియాశ్రమంబునకువచ్చి 'అయ్యా! నాచేతి యీఖడ్గంబును దాచిపెట్టుము. మరలవచ్చి కైకొందు' నని చెప్పి యాకత్తిని వానియొద్దనుంచి చనెను. ఆగుప్తార్థంబు నమ్మునిప్రాణపదంబుగాఁ గాపాడుచు ఫలమూలసంగ్రహణంబునఁగూడ దానినిబాయఁడయ్యెను. అట్లామునినిరంతరంబు శస్త్రంబును వహించుచున్నకారణంబున వానిమనస్సు క్రమక్రమంబుగాఁ దపోవిముఖమై రౌద్రంబును వహించి తుదకుఁ బ్రాణిహింసాపరముగాఁ బరిణమించెను. అట్లతఁడు ధర్మకర్శితుండై శస్త్రసంసర్గంబునఁ దుదకు నరకమొందెను. శస్త్రసంసర్గంబు వహ్నిసంసర్గంబువంటిదని యందురు. కావానివానిఁ జేపట్టినచో ముప్పువాటిల్లకమానదు. స్పర్శదోషమంత తీవ్రమైయుండును. కావుననే పెద్దలీవిషయంబున మహాజాగరూకులై వర్తింతురు. నాథా! మాలిమింజేసి యీసంగతిని జ్ఞప్తిచేసితిని. ఆర్తసంరక్షణంబు క్షాత్త్రధర్మమందువా? హింస కారాదుగదా. మఱియు మీరు రాజధర్మంబును ద్యజించి మునిధర్మంబును స్వీకరించితిరి. ఇది మీవేషమువలననే స్పష్టము. మునివేషంబునకును క్షాత్త్రధర్మంబునకు నెట్లుపొసఁగును? అది యట్లుండఁగాక ధర్మవర్తనంబునకు దేశకాలవ్యవస్థగలదు. దానికిననవసాదోషము గలుగరాదు. మునివేషంబును గ్రహించితిరి; వనముఁజొచ్చితిరి. వనసీమలు తపోవృత్తియోగ్యంబులగుఁగాని యొండుగావుగదా. అయోధ్యకుఁ జన్నప్పుడు రాజ్యపరిపాలనార్థము క్షత్త్రధర్మంబు నవలంబింపకతప్పదు. అది యచ్చటఁ రాణించును? నాథా! సర్వసృష్టికి ధర్మమే మూలమనియు ధర్మంబునఁజేసి యర్థంబును దానివలన సుఖంబుఁ గలుగుననియు ధర్మసంపాదనార్థమై త్యజింపరానిది గలుగదనియుఁ బెద్దలు వచింతురు. ధర్మార్థము మీరు సమస్తమును ద్యజించి వచ్చితిరి. వచ్చినకార్యంబును సాధింపవలయునుగదా. మఱియు నొకటివ్యయింపనిదే మఱియొకటిరాదు. వలఁతికై యలఁతినిమానుదురు. ఇది లోకస్వభావము. ధర్మార్థము మీరు సౌఖ్యంబును

త్యజించితిరి. సౌఖ్యంబునకన్న ధర్మమే పరమార్థమనిగదా యట్లొనర్చుట. దానికిక్షంగము రానగునా? మఱియు,

"ఆ॥వె॥ సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మమొండెఱుంగ;
నోరులనొప్పికోడ కువతాపమొనరించు
నదియ కడు నధర్మమనిరి బుధులు"

ఎన్నివిధముల విచారించినను మీ వేషంబునకును మీరు ఋషులకిచ్చినమాట కును బొందుగలుగదు. స్త్రీచాపల్యంబునఁజేసి యింత పలుకుదునేగాని మీ రెఱుంగని ధర్మముగలదా?' యని వినయమధురంబుగా నుడివెను.

రాముఁడావచనంబులు విని 'దేవీ! నీవంశంబునకుఁ దగినట్లు పలికితివి. నామేలు నీ వెంతకోరునది నీమాటలవలననే స్పష్టము. ఆర్తత్రాణము క్షాత్రధర్మమగుట నీవే యంగీకరించితివి; ఇఁక నాచెప్పఁగలదేమి కలదు? నావేషమందువా? ఇది యాదృచ్ఛికముగాని నైజముగాదు. ధర్మంబునకు దేశకాలాద్యవస్థలు గలుగవు. అట్టి నియతిని గలిగించుట సంకుచితంబగును. ఎందున్నను స్వధర్మము నాచరింపవలయును. నేను క్షత్త్రవంశంబున జనించితిని; ధర్మరక్షణంబు నాకు విధివిధానము; రాజ్యముననొండె వనమునఁ నొండె నాధర్మంబును నేనుతప్పరాదు. అట్లుచేయనేని యనేకానర్థంబులకుఁ గారణమగుదును. నన్నుఁజూచి యన్యులుగూడ నపమార్గంబును ద్రొక్కుదురు. రాక్షసవధ హింసకాదాయంటివి. ఆత్మలాభార్థము పరులకు మనోవాక్కాయంబులఁ గ్లేశంబులుగలిగించుట హింసయగును. నేను గోరంత గూడ స్వలాభంబుగోరి చేయుటలేదు. కావున నాపనులయెడ హింస నారోపింపఁదగదు. నాకార్యములందు రాగద్వేషములు వ్యక్తములేగదా యని యు రాగద్వేషపూర్వకర్మంబులు హింసామాత్రకములుగానాయనియు శంకింపవచ్చును. రాగద్వేషంబులనుమాటే నాయెడఁజెల్లదు. రాక్షసులని పగసేయుటలేదు; యోగులని మైత్రినెఱపుటలేదు. ఎల్లరయందు సమబుద్ధితో వర్తింతును. యోగులొండె రాగులొండె ధర్మోల్లంఘన మొనర్తురేని సహింపను. రాక్షసులు ధర్మమును బ్రతిఘటించుచున్నారు. ధర్మంబునుగాపాడుటకుఁగా వారిని శిక్షింపకతప్పదు. మఱియు రాక్షసులనెల్లఁ

జంపుటలేదు. దుష్టులను మాత్రమే శిక్షింతును. దుష్టశిక్షణంబున శిష్టరక్షణంబగును. శిష్టులం ధర్మంబును రక్షింతురు. అట్లు ధర్మము సంస్థాపితమగును. ఒక్కటిచూడుము. ఈయోగులెల్లరు నాత్మకళ్యాణార్థము శ్రమించుచున్నారు. ఒకరిజోలికిం జనరు; కందమూలములతో జీవింతురు; ఒకరి నాశ్రయింపరు. వీరివలన నెవరికి నెట్టికష్టనష్టములుం గలుగవు. ఇట్టినిరపరాధులను రక్కసులు నిష్కారణంబుగా బాధించుచున్నారు. ఈయకార్యంబును సైచుటెట్లు? కూళలకుం దాళలేక నా శరణుజొచ్చినవారిని గాదనుటెట్లు? ఇప్పుడు నేను మిన్నకుందునేని దౌష్ట్యంబునకు నెలవిచ్చినట్లు గాదా? 'గతానుగతికో లోకః' యన్నట్లొకరిని జూచియొకరు వర్తింపరా? పర్యవసానమేమి? ప్రాణమానవిత్తములకుం జేటగును. తుదకు ధర్మమే లుప్తమగును. ఇందులకు నిదర్శనము లిప్పుడే కానవచ్చుచున్నవి చూడుము. తాపసుల హోమంబులు చల్లారెను; వ్రతాదులకు వారు దూరమైరి. ఇంతటనేని దౌష్ట్యంబును నివారింపనేని యది చెలరేఁగి సర్వనాశంబొనర్చును. తాపసులే యీదుష్టులనడంప లేరాయని తలంపవచ్చును. వారికట్టి మహిమగలదు. ఆమహిమంబులను వారెంత శ్రమించి సంపాదించిరో యూహింపనగునేగాని వచింపరాదు. అట్టి చిరార్జితతపోమహిమంబును వ్యయింపనోడి వారిబాధలు సహించుచున్నారు. వారి వెతల నుడుపని రాజేల? 'దుర్బలస్య బలం రాజా' యన వినవా? ఇన్నితలపోసి మునులకు నభయహస్తమిచ్చితిని. మాటతప్పుటయెట్లు? కళ్యాణీ! ప్రాణమునుగాని లక్ష్మణునిగానీ తుదకు నిన్నుంగానీ విడిచిన విడువనోర్తుంగాని సత్యంబును విడువంజాలను. మఱియొకటి వినుము. అడుగకయే రాజులార్తులను రక్షించి స్వధర్మంబును గాచికొందురు. ఈ మునులు నన్ను సంప్రార్థించిరి. సంప్రార్థితుండనయ్యు మిన్నకుండుట ధర్మబాహ్యము నాత్మశక్తివంచనముంగదా' యని యుక్తియుక్తంబుగా సమాధానము చెప్పెను.

ధర్మభృన్ముని సందర్శనము.

అట్లు వారు సమయోచితంబులఁ గూర్చి సంభాషించుచు మార్గాంతర మండలి వివిధశైలప్రస్థంబులకును, నదీపులినాంతరవిహారమాణ సారసచక్రవాకంబులకును, వికచకమలేందీవరరమణీయజలాకరంబులకును, రూపుం దాల్చినచిఱుమబ్బులువోని వరాహమహిషంబులకును, దంతములఁ గోరా

ఘుచుఁ దుండంబుల విసరుచు నడగొండలవలె సంచరించుచున్న మత్తగజంబులకును, సంతోషాశ్చర్యములందుచు సూర్యాస్తమయంబునకుఁ దటాకమొండు చేరిరి. అది యోజనాయతంబై వెలిదామరలతోఁ బొందమ్మిలతో నిండి సారసహంసకలహంసమధురకూజితమనోహరమైయుండెను. ఆకొలనునుండి గీతావాదిత్ర ధ్వనులు నిర్గతములై చెవులకు విందుసేయసాగెను. వెదకినను మనుష్యుల పొలకువయే యందుగానరాదయ్యెను. ఆవింత యచ్చెరువు గొలుపఁగా రామలక్ష్మణులు దానినిఁ జేరఁబోయిరి. అట మునియొకఁడుండెను. ఆతపోధనుఁడు వారినిఁ జూచి కాకుత్థ్సులారా! నన్ను ధర్మభృత్తని పేర్కొందురు. నేనీయాశ్రమంబున నుందు; మీయడుగనున్నది గ్రహించితిని. ఈతటాకంబును మాండకర్ణమహర్షి నిజతపోబలంబున నిర్మించెను. దీనిని బంచాప్సరస్సని చెప్పుదురు. ఇందు నిరంతరంబు గీతావాద్యమధుర రుతంబులు వర్తిల్లుచుండును. ఏలయందురా! ఆమహర్షి వాయుభక్షణ మాత్రుఁడై నీటనిలిచి దశసహస్రవర్షంబులు ఘోరతపంబొనర్చెను. వానికి వైశ్వానరాదిదేవతలు కుతిలపడి తత్తపోవిఘ్నార్థము చంచలలఁబోలి యచ్చరమచ్చెకంటులనేవురఁ బంపిరి. వారు సురకార్యనిమిత్తంబతనిని మోహవివశునిఁగాఁ జేసి వానికిభార్యలైరి. వారికిగా నంతర్గృహమిందు నిర్మింపఁబడెను. ఆనిలింపవేశ్యలందు నివసించి యాఋషిని మధురగీతంబుల వినోదించుచుందురు. గీతానాదంబాకాంతామణుల భూషణధ్వనులతో మేళవించి యిట్లు మనోహరంబుగా వినవగుచుండు' ననెను.

### రామాదులు మునిపల్లెలో పదియేండ్లుగడపి సుతీక్ష్ణమహర్షి యాశ్రమంబుచేరుట.

రామలక్ష్మణులు మరలి వచ్చి సీతాదేవికి వివరంబు వినిపించి మరల దారిఁబట్టి కొంతదూరము చనిరి. అట మఱియొకయాశ్రమంబుగానవచ్చెను. వారమ్మునిపల్లెనుజొచ్చి యందలి ఋషుల పూజలంది యాచోటు తమకునివాస యోగ్యంబుగా భావించిరి. మునులు దమకడగండ్లు వారికి నివేదించి సంరక్షణముఁ గోరిరి. రాముఁడామునుల రక్షణార్థఁబచ్చట భార్యాలక్ష్మణుల తోడఁ బదివత్సరంబులు పుచ్చి యనంతరము సుతీక్ష్ణమహర్షి యాశ్రమము నకు మరలివచ్చి యందుండెను.

ఇట్లుండఁగాఁ గొండొకనాఁడు రాముఁడామునీంద్రునకు నమస్కరించి 'మహాత్మా! అగస్త్యభగవానుం డీవనమందుండు నని వింటిమి. ఆ

మహానుభావుని శుశ్రూషింపఁ బెద్దయుఁ గోరుచున్నాను. ఏమార్గంబున నటకుఁ బోవనగునో యనెను. సుతీక్ష్ణమహర్షి యది విని 'వత్సా! నాచెప్పవలసినది నీవే ప్రస్తావించితివి; ఇటకు నాలుగుయోజనంబుల దవ్వున నగస్త్యునిభ్రాత సుదర్శనమహాముని గలఁడు. ఈదారినే చన్నచో వానియాశ్రమంబును జేరుదురు. మీదారిలో నెచ్చటఁజూచిన పిప్పలీవృక్షంబులు దట్టముగా నుండునో యచ్చోటే వానియాశ్రమము. అందొకరాత్రి పుచ్చి ప్రాతఃకాలంబునకుఁ దరలి దక్షిణాభిముఖంబుగా యోజనమాత్రము పొమ్ము; అగస్త్యుని యాశ్రమముఁ జేరుదు' రని చెప్పెను.

సుదర్శనాశ్రమము.

రాముఁడు భార్యాలక్ష్మణసహితుఁడై బయలుదేరి పోయెను. కొండొకచోటఁ బిప్పలీగంధబంధురంబులైన మారుతంబులు కటాక్షోదయములై వీచెను; కాషరాసులందందుఁ గానవచ్చెను. దర్భాంకురములు వైడూర్యకాంతుల మఱపించుచు విస్తీర్ణములై యుండెను; అగ్నిహోత్రధూమపటలంబు కృష్ణాభ్రశిఖరంబుగాఁ దోఁచెను; మునికుమారులు వివిక్తతీర్థస్నాతులై పుష్పోపహారంబులను గోసి తెచ్చుచుండిరి. ఆలక్షణములఁబట్టి యదియే సుదర్శనాశ్రమంబు కానోపునని రాముఁడు నిశ్చయించి 'లక్ష్మణా! ఇచ్చోట అగస్త్యభగవానుని మాహాత్మ్యము నేఁడును బ్రకటించుచున్నది. సంగతి వినుము. ఇల్వలవాతాపులను రక్కసులిరువురుండిరి. ఇల్వలుఁడు బ్రాహ్మణవేషధారియై సంస్కృతము భాషించుచు శ్రాద్ధార్థము బ్రాహ్మణులను నిమంత్రించుచు, వారువచ్చినంతనే మేషరూపంబున నున్న తనతమ్ముని వాతాపిని వధించి శ్రాద్ధదృష్టకర్మపూర్వకంబుగా నిమంత్రితులకుఁ గుడువఁ బెట్టుచుండెను. వారు నమ్మి భుజించుచుండిరి. భోజనానంతరము 'వాతాపీ! ఇఁకరా' యని యిల్వలుఁడు పిలుచుచుండెను. ఆమాటతోడ వాతాపి మేకవలె నఱచుచు నిమంత్రితులయుదరకోశంబులు వ్రచ్చి వెలువడుచుండెను. ఇట్లు పెక్కువేలు బ్రాహ్మణులు మడియుచుండిరి. ఈఘోరకృత్యంబును దేవతలు సహింపలేక యగస్త్యమహర్షిని బ్రార్థించిరి. ఆ ఋషిచంద్రుఁడు సురలప్రణయంబు నంగీకరించి కొండొకనాఁడా రక్కసుల నిమంత్రణమియ్యకొని యటకుఁ బోయెను. వారు యథాపూర్వమాచరించిరి. భోజనానంతరంబుత్తరాపోశనమిచ్చి 'వాతాపీ! రా' యని

ఋల్వలుఁడు పిలిచెను. మహర్షి నవ్వి 'ఇంకెక్కడివాతాపి! వాఁడు నా యుదరంబున జీర్ణించి యమసదనమొందెఁ' ననెను. తమ్ముని దుర్మరణంబు గని యిల్వలుఁడు మహాగ్రహమొంది యగస్త్యుని పయి నుఱికెను. ఆఋషిసత్తముఁడు వానిని దననేత్రానలంబున బూడిదయొనర్చెను. అగస్త్యభగవానుఁ డిట్లొనర్చి యీదక్షిణదిక్కును ఋషిజనవాసయోగ్యంబు గావించెను. నాఁడుసుత నిందు మునిపల్లెలు వెలసె' ననెను.

అంతలోన,

'తే.గీ: గగనహారినీలశైల శృంగంబునుండి,
డొల్లిపడెఁ బ్రొద్దు జేగురుఁగల్లువోలెఁ;
దన్నిపాతసముద్భూత ధాతుధూళి
చందమునఁదోఁచె దివసావసానసంధ్య.'

"ఉ. కోమలతామ్రచూళికల క్రొవ్వెలసంజకుఁ బ్రోదిపెట్టని
ప్పీనమకతోరతారరుచిఁ జెట్టుపలార్చుచు నట్టిరాత్రి వి
శ్రామమపోలెఁ గూసె విలసచ్ఛరమాచలకూటపక్కణ
గ్రామటికాకుటీరశిఖరంబులఁ గుక్కుటచక్రవాళముల్."

అట్లు సూర్యాస్తమయంబగుట రాముఁడు తమ్మునితోడ వార్చి వచ్చి సీతాదేవిని వెంటఁగొని యాశ్రమము ప్రవేశించి సుదర్శనమహర్షికి మ్రొక్కి వానిసత్కృతులంది యారాత్రి యందుఁగడపి మఱునాఁట యగస్త్యాశ్రమమార్గము ద్రొక్కెను.

అగస్త్యాశ్రమము.

వారు కొండొకదూరమునని యరణ్యాంతరము సొచ్చిరి. ఆకాంతారము పనసతాలవంజులధవ చిరిబిల్వతింత్రిణీకాదిమహోన్నతవృక్షనిబిడమై, రేచివిదిర్చి యల్లిబిల్లిగనల్లుకొని పూగుత్తులభరంబునవంగి మనోజ్ఞమ్ములతల మెలమెల్ల వీచుచున్న కలికిపొదరిండ్లు గల్గి, నయనోత్సవము గొలుపుచుండెను. శాఖాంతరములు వానరమయములై వినోద మొదవించుచుండెను. ఆ వనమధ్యప్రదేశము చీరమాలాపరిష్కృతంబును ధూమాకులమునై యాశ్రమమగుట సూచించెను. రాముఁడాచిహ్నంబుల నుపలక్షించి 'లక్ష్మణా!

అదిగో చూడుము.

సీ॥ శుకములుచదివెడి సామగానంబుల
వినుచుమత్తేభముల్ దనకవిందుఁ,
గరికరోత్క్షిప్తశీతకణముల కాంతుమై
తచ్ఛాయ సింహముల్ బాయకుండు,
సెలయేటినీరముల్ కలసిత్రాగుచు నిందు
వ్యాఘ్రమృగంబులు వఱలుచుండు,
మూషికామార్జాలములుగూడి బలియిచ్చు
నీవారపిండముల్ నెమ్మిగుడుచు
ఆ॥వె॥ సహజవైరమేది సఖ్యంబు వాటించి,
కలసిమెలసియిట్లు గ్రాలుచున్న
యీమృగాళియునికి నీక్షింపఁగానిందు,
మౌనిశక్తిచోద్యమయము గాదె ?

తమ్ముఁడా ! ఏమహాత్ముఁడు వింధ్యునిగర్వంబడంచి సూర్యమార్గనిరోధంబును బాపి లోకంబులకు మహోపకారమొనర్చెనో, ఏతేజస్వి పేరు విన్నంతనే రాక్షసులు దక్షిణదిక్కువంకనైనఁ దలఁద్రిప్పరో, ఏపుణ్యశాలి యిందుండుటంజేసి మహర్షులకు రక్కసిబాధలు తీఱెనో, ఏ సర్వభూతహితుండు లోకహితార్థము చిరజీవిత్వంబును గ్రహించెనో, ఏ మహిమోన్నతు నిందుపాసించుచు దేవగంధర్వసిద్ధచారణాదులేగాక పక్షులు సయితము నిరాహారాది తపోనిష్ఠలఁ దవిలియుండునో, ఏ సంయమీంద్రుని కడఁ దపస్సిద్ధులైనవారికిఁ దివ్యదేహంబులతో సూర్యతేజోమయవిమానాధిష్ఠానపూర్వక స్వర్గారోహణంబు సంప్రాప్తించుచుండునో, మృషావాదిగాని క్రూరుఁడుగాని శఠుఁడుగాని నృశంసుఁడుగాని కామవృత్తుఁడుగాని యెవని యాశ్రమంబు ద్రొక్కి జీవింపఁడో, యయ్యగస్త్య భగవానుని యాశ్రమముఁ జేరితిమి. ఇందు భక్తితో భగవదారాధనంబు చేయువారికి సర్వాభీప్సితంబులు స్వతస్సిద్ధంబులగును. మన మీమునిసేవలఁ దగిలి వనవాసశేషంబులు నిందుఁ బుచ్చెదము.

"చ॥ పుడిసిటఁబట్టి నేతపసిపొంగుపయోనిధి నిల్వలానుజుం
గడుపునవేర్చె నేతపసి, గాఢతపోనిధి నే యగస్త్యునిన్,

కూడగని వింధ్యభూధరము పొంకము డింకము దక్కనేలలో,
నవఁగా శిలాంతస్థలిని సట్టిమహాత్ముని గొల్వమేలగున్॥

అని పలికి తమరాక నెఱింగించుటకై వాని నాయుష్మంతునొద్దకు బంపెను

లక్ష్మణుఁడు పోయి యాశ్రమద్వారమునందున్న మునిశిష్యునిఁజూచి 'ఆర్యా! దశరథరాజజ్యేష్ఠకుమారుఁడు రాముఁడు భార్యాసహితుండై మహర్షిదర్శనార్థము వచ్చియున్నాఁడు. నేను వానితమ్ముఁడను; నాపేరు లక్ష్మణుఁడు; అన్నకు భక్తిహితంబు లొనర్చుచు వానివెంటనుందు' ననెను. ఆమునికుమారుఁ డదివిని గురువు నొద్దకుఁబోయి యతనికి సంగతి వినిచెను. అగస్త్యుఁ డామాటవిని మహాసంతోషమంది 'రాముని బహుకాలంబుగా నిరీక్షింతును; నాకోరిక నేఁటికి సఫలమయ్యెను; వత్సా! తడయక వారిని గొనిరమ్మని చెప్పెను; రాముఁడంతట సీతాలక్ష్మణసహితుఁడై మునికుమారునివెంటఁ జని ప్రశాంతహరిణకంబైన యాశ్రమాంతరంబుఁజొచ్చి యొక్కొక్కటిగా బ్రహ్మస్థానంబు నగ్నిస్థానంబును విష్ణుస్థానంబును మహేంద్రస్థానంబును సూర్యస్థానంబును సోమస్థానంబును భగస్థానంబును కుబేరస్థానంబును ధాతృవిధాతృస్థానంబులను వాయుస్థానశేషస్థానంబులను ననంతునిస్థానంబును గాయత్రీస్థానంబును వసువరుణకార్తికేయస్థానంబులను సందర్శించుచుబోయి, యెదురుగా శిష్యగణపరివృతుఁడై వచ్చిన మహర్షికి భార్యాసహోదరపురస్సరంబుగా నమస్కరించెను.

అగస్త్యుఁడు వారికి నర్ఘ్యపాద్యంబులిప్పించి కుశలప్రశ్నంబులుగావించి వైశ్వదేవముచేసి వానప్రస్థధర్మప్రకారము ఫలమూలాహారంబు లొసఁగి 'రామా! ఋషులయతిథిపూజలు వైశ్వదేవపూర్వకంబుగా నుండవలయును. అట్లుచేయనివాఁడు కూటసాక్షివలెఁ బరలోకంబున స్వమాంసభక్షకుండగును. సర్వలోకప్రభుండవును మహారథుండవును బరమధార్మికుండవును మాఁకు మిక్కిలి మహామాన్యుండవును నైన నీవు ప్రియాతిథివైనవేళఁ జెప్పవలయునా?' అని పలికి హేమరత్నవిభూషితమైన శరచాపతూణీరంబులను లోపలినుండి తెప్పించి 'రామా! ఈవింటిని విశ్వకర్మ నిర్మించి విష్ణువునకిచ్చెను. ఆమహానీయుఁడు దానిని నాకనుగ్రహించెను. ఈబాణంబులు బ్రహ్మదత్తములు; మఱియు నక్షయంబులు; ఈ తూణీరఖడ్గంబులను దేవేంద్రుఁ

డిచ్చెను. తొల్లి విష్ణుదేవుండీధనుస్సహాయంబుననే యసురులను నిర్జించి సురరాజ్యశ్రీని మరల దేవతలకుం గైవశమొనర్చెను. వీనిని నీవు ప్రతిగ్రహింపు' మని యవియెల్ల నిచ్చి 'నాయనా! స్విన్నములైన మీయంగకంబులు మీబడలికలను దెలుపుచున్నవి. ఈజనకరాజసుత పరమసుకుమారి భర్తృస్నేహంబునఁ జేసి వనక్లేశంబులు వరించి వచ్చెను. ఈకల్యాణికి నాశ్రమ నివాసంబు సంతసమగు నట్లొనర్పుము. భర్తలు మంచిస్థితి నున్నప్పుడు భార్యలు తమయనురాగంబులఁ గురిపింతురు; పతులకు విషమస్థితి సంఘటించువేళ పత్నులు నిర్దాక్షిణ్యముగా వారినిఁ ద్యజింతురు. స్త్రీస్వభావ మిట్టిదై యుండును. స్త్రీలబుద్ధి చంచలకన్నఁ జంచలమై శస్త్రధారకన్నఁ దైక్ష్ణ్యమై వేగంబున వాయువునుగూడ మించును. నీభార్య యట్టిదిగాదు. ఈమె లోకవిలక్షణయగుట తచ్చారిత్రమే వెల్లడించును. ఈ పతివ్రతామణి యరుంధతీదేవివలె సర్వలోకశ్లాఘ్యయై పసమీఱుఁగాక. మీరుమువ్వురిందు వచ్చుటంజేసి యీదేశము పరమశోభను గాంచె' ననెను. రాముఁ డామాటలు విని 'మునీంద్రా! మీయనుగ్రహంబునకుం బాత్రులమగుటం జేసి మేము ధన్యులమైతిమి. జలసమృద్ధంబును బహుకాననంబునైన చోటొకటి సెలవిత్తురేని మేమందు సుఖనివాసార్థ మాశ్రమపదంబును నిర్మించుకొందు' మని యడిగెను. 'వత్సా! ఇటకు యోజనద్వయదూరంబున పంచవటి యనుపేరి ప్రదేశంబుగలదు. అది బహుమూలఫలోదకమై సిరులపట్టుగా నున్నది. ఆచోటు మీకోరికకుఁ దగియుండును. రామా! నీవనవాసకాలంబు చాలఁగడచెను. అచిరమే నీవు సముత్తీర్ణప్రతిజ్ఞుండవై రాజ్యశ్రీని బడయుదువు. దశరథుఁడు నాకుఁ బరమమిత్రుఁడు. ఆకారణంబున నీవృత్తాంతమెల్ల యోగదృష్టిం జూచితిని. రామా! నీవిందుండుట నాకెంతయు సంతసమగును. అయినను నీయభిమతంబు వేఱుగాఁ దోఁచుచున్నది. దానంజేసి పంచవటిని బేర్కొంటిని. దానిచెంత గోదావరీనదియుఁ గలదు. ఆనదీతీరంబు మీయుంటకు నెంతయు ననుకూలించును. అదిగో మధూకవనంబు. దానియుత్తరపార్శ్వంబునఁ జనుము; పెద్దమఱ్ఱివృక్షంబు గానవచ్చును. దానిమీఁదుగాఁబోయినఁ బర్వతమొండు గలదు. ఆకొండప్రక్కఁ పంచవటి యున్న' దని మహాతాపసి పలికెను.

### జటాయు సందర్శనము.

రామాదులంతట నమ్మునిని వీడ్కొని పంచవటికిం దరలిరి. మార్గ మధ్యంబున వారికి మహాకాయంబును భీమపరాక్రమంబును గల గృధ్ర మొండు గానవచ్చెను. వారు దానిని జూచి రాక్షసుండని తలంచి 'ఎవండవు నీ' వని యడిగిరి. వాఁడు రాఘవా! నీతండ్రికి దశరథునకుం జిర మిత్రంబునగుదు. కశ్యప ప్రజాపతివంశస్థుండును వినతాతనయుండునైన నరుణుండను వానికి శ్యేనియందు సంపాతి జటాయువులను పేరి సుత ద్వయము జనించిరి. అందు సంపాతి పెద్దవాఁడు; నేను రెండవవాఁడను. ఈకాంతారంబు క్రూరమృగసంకీర్ణంబును రాక్షససేవితంబు నై మహాభయం కరంబుగా నుండును. ఇందు వసింప మీరు వచ్చితిరి. నావలన నీకుఁ బ్రయోజనంబుగలదు. నీకు సహాయంబుగా నిందు నుందు' నని యాజటా యువు చెప్పెను. రాముఁ డాగృధ్రరాజంబున కెంతయు సంతసించి వాని వలనఁ దనతండ్రికతలు వినుచుఁ బంచవటిఁ జేరి, యాప్రదేశ మెల్లఁ గలయఁ జూచి 'లక్ష్మణా! శ్రీగంధవృక్షంబుల నెత్తావులిందుఁ గ్రందుగానున్నవి. కమలాకరంబులు హంసకారండవచక్రవాకాకరంబులై సొంపుఁ దలిర్చు చున్నవి. అదిగో గోదావరీనది. సౌమిత్రీ! అందు గైరికాదిధాతుకాంతి ప్రసారంబున మత్తేభదేహంబులు గవాక్షచిత్రంబు లట్లు దోఁచుచున్నవి. తాలతమాలాది నానావృక్షంబులు వివిధపుష్పలతావృతంబులై నేత్రోత్స వంబును గూర్చుచున్నవి. ఇందు మనము జటాయువుతోడ వసింపవలయు' నని పలికి యందు నివాసయోగ్య ప్రదేశంబును నిర్ణయించెను.

### పంచవటి.

లక్ష్మణుండంత మట్టితో గోడలుకట్టి వెదురుకంబంబులు నాఁటి జమ్మి వాసములు పఱచి ఱెల్లు గప్పి పర్ణశాలనుసిద్ధ పఱచి గోదావరీతీర్థంబులఁ గ్రుంకి శుచియై కమలంబులును ఫలంబులును గొనివచ్చి వాస్తుపూజా శాంతు లొనర్చెను. రాముఁడు ప్రియాసహితుండై పర్ణశాలను బ్రవేశించి 'లక్ష్మణా! ఉపచారంబులవలనఁ దండ్రిని మఱపించితివి.' అని వానిఁ బరిష్వంగ పారితోషికంబిచ్చెను.

ఋతువర్ణనము.

అట్లు వారు పంచవటియందు సుఖంబుగాఁ గాలముఁ గడుపుచుఁ గొండొకనాఁడు స్నానార్థము గోదావరికిఁ దరలిరి. లక్ష్మణుఁడు రాముం జూచి 'అన్నా! వసుంధర సస్యశాలినియై సొబగారుచున్నది; లోకుల శరీరంబులు నీహారపరుషంబులయ్యెను; అగ్నిదేవుండెంతయు సుభగుఁడుగా మన్నింపఁబడుచున్నాఁడు. సత్పురుషులు దేవతాప్రీత్యర్థము నూత్న ధాన్యంబులు యజించి కృతాగ్రయణకులై కల్మషంబులను బాసిరి. జనపదంబులు సమస్తపదార్థసమృద్ధంబులయ్యెను. గోవులు కుండలంబితుకుచున్నవి. విజిగీషాపరుల ప్రచారంబులు మెండయ్యెను. దక్షిణదిశ సూర్యసేవితయై వెలసెను. ఉదీచి శూన్యలలాటయగు నెలంతుకవలెనున్నది. హిమవంతుఁ డన్వర్థాభిధానుఁడయ్యెను; తరుచ్ఛాయాసలిలంబులు రుచింపవు; ద్విరదంబులు శీతోదకంబులఁదాఁకి తుండంబులను మోడ్చుచున్నవి. భీరుప్రలు రణభూమిం డాసియుఁ బాణంబులకు వెఱచి నిలుచునట్లు జలచర విహంగంబులు దరి చేరియు నీరుంజొరవు. అరణ్యంబులు శూన్యములై గాన్పించుచున్నవి. దివంబులు మంచుగప్పి చెలువు దొఱంగెను. రాత్రులు హిమారుణంబులై పొడవుదాల్చి ప్రణయినీజనదూషణ భూషణంబు లందుచున్నవి. చండభానుఁడు హిమధాముని మనోహరత్వ దర్శనీయత్వంబుల నెఱవుగొని తనమిత్రనామంబు నన్వర్థ పఱచుచున్నాఁడు. చంద్రమండలంబు తుషారుణమై నిట్టూర్పుటావిరి గప్పిన యద్దంబువలె నున్నది. పూర్వాహ్ణంబులు నిర్వీర్యములు; మధ్యాహ్నంబు లాపాండురాతప శోభాపరిణతములై సుఖస్పర్శముగానున్నవి. పడమటి గాడ్పులు మంచువలనంజేసి రెట్టించిన చల్లదనంబుతోఁ వీఁచుచున్నవి. ఇనావలోకంబునకు సిగ్గుపడియోయన వనసీమ యావిరి ముసుఁగుఁగప్పెను. కేదారంబులు పండి ఖర్జూరపుష్పంబులంబోని తండులంపు వెన్నుల బరువువలనఁ బఱచి భూమిపయిం బంగారుదాఁపిరో యను శంకను గలిగించుచున్నవి. పచ్చికబయళ్ళు మంచు గప్పి లేయెండకు వింత వన్నె లీనుచున్నవి. తరువులు విలుళితప్రసూనంబులై మంచుఁ జీకటిలోఁ బుష్పాక్షులను మోడ్చి నిద్రించుచున్నవోయన దోఁచును. తరంగిణులు బాష్పసంఛన్న సలిలంబులగుటం జేసి సారసవిహంగంబులు పరస్పరముఁ గంఠధ్వనుల వలన గుఱుతించుకొనుచున్నవి. తామరలు జరాజర్జితంబులై

పోఁగూడ నీకుఁదప్పు' ననెను. శూర్పణఖ యామాటలు నమ్మి 'లక్ష్మణా! నన్నుఁగూడి దండకారణ్య విహరణోత్సుకుండవై భోగంబులనుఁగాంచు' మనెను. సౌమిత్రి యల్లనవ్వి 'శూర్పణఖా! దాసుని భార్యకుదాస్యము తప్పదుగదా! నాయన్నకు నేను దాసుఁడనై యుందును. నన్నుఁ బెండ్లాడుట దాస్యంబును నీవు వరించుట యగును. వ్రతముచెడినను సుఖము దక్కవలదా? నాయన్న సర్వార్థ సిద్ధుఁడు. వానికి భార్యవై సుఖింపుము. ఆయన నీపొందుగాంచి యసతియు విరూపయుఁ గరాళయు నిర్గతోదరియు మీఁదుమిక్కిలి ముదుసలియు నైన సీతాదేవిని తటిమివైచును. వరవర్ణినీ! నీవంటియందకత్తెను గన్నకంటికి మర్త్యభామిని యింపుఁ గూర్చునా?' యనెను. మేలమెట్టిదో యెఱుంగని యా పొలసుదిండి రామునివంక మఱలి 'గోఁతగోయుచున్న యీముదుసలి పెండ్లాము మ్రోల నేను కానైతినా? సపత్నికుండనను బెంగకలదేని దీనినిప్పుడే మ్రింగి యానెంజలి తీర్తు' నని విజృంభించి క్రూరగ్రహము రోహిణింబలె సీతాదేవిపైకి నుఱికెను. ఆ దుండగంబునకు రాముఁడు కనలి 'తమ్ముఁడా! అనార్యులతోఁడఁ బరిహాసింపరాదు. వైదేహి యీముప్పుదప్పి బ్రదుకఁజూడుము. ఇది మదోన్మత్తయై యున్నది. దీనిని విరూపగా నొనర్చి తఱుము' మనెను. లక్ష్మణుఁడు కత్తి దూసి యారక్కసి ముక్కును జెవులను దఱిగెను. అది ప్రావృట్పయోధరంబువలె గర్జించుచు రక్తధారలు స్రవించుచు హుటాహుటిం బరువెత్తి జనస్థానము చేరి యందు రాక్షసులతోఁడఁ బేరోలగంబున్న తనయన్న ఖరుని యొడిలోఁ బడి వాపోవసాగెను.

ఖరుఁడు తన చెలియలికిఁ గ్రోధదుర్నిరీక్షణుండై 'సోదరీ! మోహసంభ్రమంబులు మాని సంగతి చెప్పుము. ఏవెఱ్ఱి యాఱుకున్నత్రాచును లీలార్థము చెనకెనో, ఏయంధుఁడు నిజకంఠగతమైనకాలపాశంబు నెఱుంగఁడో, ఏమూఢుఁడు నీస్వర్ణరూపకాలకూటంబును గ్రోలెనో, యా నిర్భాగ్యుని జెప్పుము. దేవగంధర్వ భూతంబులుగానీ మునిముఖ్యులుగానీ తుదకు సహస్రాక్షుండుగాని నన్నపకరించి మనఁజాలరు. ఎవని ప్రాణంబుల నూటాడవలయునో ఎవనిమాంసంబున విహగవ్రాతంబునకు విందొనర్పవలయునో, ఎవనిరక్తంబున ధాత్రీసంతర్పణముగానున్నదో యాక్రూరాత్ముని

బలుకుము. మృత్యువశ్యుఁడవడినను దత్కృపనుండిఁక బ్రదుకనోపఁడు? సింహస్వరంబున వచించెను. శూర్పణఖ కన్నీరు నించుచు 'అన్నా! ఏమి చెప్పుదు? ఎవరో యిద్దఱు తరుణవయస్కులు మన వనముం జొచ్చిరి. వారిరూపసంపద యిట్లనరాదు; ఎంతో సుకుమారులుగాఁ దోఁతురు. వారి బలంబన్ననో యచింత్యమహాద్భుతంబుగానున్నది. ఏలనో వారు జటావల్కలాజినంబులు ధరించి తాపసవృత్తి నవలంబించి కందమూలాశనులై చరించుచున్నారు. వారు దశరథమహారాజకుమారులఁట; రామలక్ష్మణులను వారఁట. వారు దేవతలో నరులో యూహింపరాదు. వారివెంట సర్వాభరణభూషితయైన యింతి యొకర్తు గలదు. అట్టి సుందరీలలామ యెందును గానరాదు. సొబగులెల్ల మూర్తీభవించి యాయింతిరూపంబున నభ్యుదయించెనోయని తలంతును. ఆ కాంతామణికారణంబున వారు నాకిట్టి దురవస్థను గలిగించిరి. ఆముప్పురి క్రొవ్వేడినురువు నెత్తురులు త్రావినఁ గాని నా తాపంబు తీఱదు. నాయీప్సితంబొనర్పవా?' యని రోదన మొనర్చెను.

### ఖరుఁడు రామునిపైఁ బదునల్వుర రక్షోవీరులఁ బంపుట.

అది విని ఖరుఁడు రోషభీషణుండై ప్రళయాంతకులం బోని రక్షోవీరులను బదునల్వురఁ జూచి 'పిశితాశనులారా! సంగతి వింటిరిగదా. ఆ దురాత్ములను ఖండఖండంబులుగాఁ దుండించి భూతంబులకు బలివెట్టి యా యింతిని గృతాంతునంతిపురికిఁ బంచిరమ్ము. వారిరక్తపానంబునఁగాని నా చెల్లెలితాపము తీఱ'దని యాజ్ఞాపించి వారివెంట శూర్పణఖనుబంపెను. ఆ మాటతోడ వారు మేఘవేగంబునఁ బంచవటికిఁ బోయి యచ్చట సముదగ్రతేజోవిరాజితుఁడైయున్న రాముని జూచి దావాగ్నికి గజంబులవోలె వెఱగందిరి. రాముఁడా రక్కసులను శూర్పణఖను గాంచి 'లక్ష్మణా! ఇంచుక తడవు సీతయొద్ద నుండుము; ఈరాక్షసుల పీఁచ మడంచి వత్తు' నని పలికి చామీకరవిభూషితంబైన కోదండంబు నెక్కువెట్టి యసురులను జూచి 'రాక్షసులారా! మేము దశరథాత్మజులము; మమ్ము రామలక్ష్మణులందురు. ఈ ఓడ జనకరాజసుత సీత; ఈయింతిని వెంటఁగొని దండకారణ్యంబునకు వచ్చితిమి. ఇందుఁ గందమూలంబు లారగించుచు జితేంద్రియులమై తపోధర్మంబులఁ దవిలి యుందుము. మాజోలికి రావలదు. సాధుజనహింసకులను

పరిమార్పు కార్యమందు ఋషిజనము మమ్ము నియోగించెను. ప్రాణంబులు తీపగు నేని యిందుండి చనుమ'ని చెప్పెను. ఆరాక్షసులమ్మాటలకు మహా కుపితులై శూలంబులు త్రిప్పుచు 'మా ఱేనికి ఖరునకు నిష్కారణంబుగా నాగ్రహంబుఁ బుట్టించితిరి. మీ ప్రాణహరణంబునఁ గాని వానికిఁ దాపశాంతి గాదు. నరాధమా! ఈ ప్రల్లదంబులేల? మాయెదుట నిలువనైన నోర్తువా? ఇదిగో చూడుము మాశూలంబులు నీవింటిని ద్రుంచి నీప్రాణంబులను హరింపనున్న' వని పలుకుచు రాముని గదిసి తమ శూలంబులను విసరిరి. రాముఁడు వారి శూలంబులఁ బదునాల్గింటిని బదునాల్గుశరంబులఁ ద్రుంచి క్రోధోద్దీపితుఁడై వెండియుఁ బదునాల్గుబాణంబులను సంధించి యాకర్ణాంతముఁ దివిచి వదలెను. ఆభల్లంబులు వారి వక్షోభాగంబులను భేదించి రుధిరప్లుతములై దూసి నేల వ్రాలెను. వారు భిన్నమూలంబులగు వృక్షంబులకైవడి గూలిరి.

### ఖరుని యుద్ధసన్నాహము.

వారిపాటునకు శూర్పణఖ బెగడొంది వికృతారావముం గావించుచు ఖరునొద్దకుఁ బరుగెత్తి 'అన్నా! నీశూరులు రామబాణనిహతులైరి. వాని పరాక్రమంబునకు భయమగుచున్నది. పరిత్రాసతరంగమాలికా సంకులంబును విషాదమకరాభీలంబునైన శోకసాగరంబునఁ గ్రుంగిన నన్ను రక్షింపుము. నాకుఁ గావచ్చి చచ్చిన నీయనుచరులయెడ నీకుఁ బ్రీతి కలదేని యప్రతిహతబలపరాక్రమశాలివేని రాక్షసకంటకుని రాముని రూపుమాపి దండకారణ్యంబును నిర్భయవిహారవంత మొనర్పుము. ఒండుచో నీమ్రోల నిప్పుడే యసువులు త్యజింతును. అన్నా! ఊరకుందువేల? రామునకు వెఱతువు గాఁబోలు. కాదేని చెల్లెలిపాటుఁ గన్నారఁ గాంచుచు శూరుఁ డెట్లుండునా? అన్నా! అల్పవీర్యవంతులకు జనస్థానము యోగ్యముగాదు. ఇందుండి మనము సబాంధవంబుగాఁ బఱచి ప్రాణంబులు దక్కించుకొందము రండు; విలంబము వలదు; రామతేజంబు మిమ్మెల్ల భస్మీకరింపనున్న' దని పాడుపు మాటలాడి బొబ్బ మోఁదికొనుచు విలపించుచుఁ బెనురొద గావించెను. ఖరుఁడా యవమానవచనంబులకుఁ గ్రోధవివశుండై 'సోదరీ! మృతప్రాయుండైన నరాధముని బీరంబింత పెద్దసేసి పలుకనగునా? వాని

దుర్భిక్షమే యతని ప్రాణంబులను మ్రింగనున్నది చూడుము. మందజీవుండు వాఁడు నావ్రేటు దినిమనఁడు ; వాని వేఁడినెత్తురు నీచేతఁదనివారఁ గ్రోలింతు' నని యాయింతి నోదార్చి తన సేనానాయకుని రావించి 'దూషణా! శిలాకవాటవక్షులును సమరకాలురును మన్మనోనువర్తులునైన రాక్షసవీరులు పదునాల్గువేలుగలరు. వారినెల్ల యుద్ధసన్నద్ధులఁ గావించి నారథంబును ధనుర్బాణఖడ్గంబులతోడను వివిధశక్తులతోడను సమాయత్తమొనర్పుము. నా రణపాండిత్యంబును రాముఁడు గ్రహించుఁగాక ; పౌలస్త్యవంశకీర్తి దీపించుఁగాక' యని యాజ్ఞాపించెను.

దూషణుఁడు చని మేరుశిఖరాకారంబును తప్తకాంచనభూషణాలంకృతంబును హేమచక్రవిరాజితంబును వైడూర్యమణిరచితకూబరంబును నానావిధసువర్ణమంగళప్రతిమాభిరామంబును నైన రథోత్తమంబును సాయుధంబుగా దెచ్చెను. దాని వెంట రాక్షసవీరులు పదునాలుగువేలమంది ముద్గరపట్టిశశూల పరశుఖడ్గశక్తితోమరపరిఘాది క్రూరాయుధంబులు బూని కవచంబులు ధరించి తరలిరి. ఖరుఁడు రథమారోహించెను. రథనేమి ధ్వానంబులును సేనామహాట్టహాసంబులును నింగిముట్టి మాఱుమ్రోసెను.

దుశ్శకునములు.

రాక్షసబలంబు తరలినంతనే మింట గాడిదవన్నె మబ్బులు క్రేలి రక్తవర్షంబులు కురిసెను ; మార్గము సమోన్నతమైయున్నను వారిరథాశ్వంబులు మహాజవసత్త్వములుగలవయ్యు ద్రెళ్ళిపడసాగెను ; రవిమండలంబును గొఱవిచక్రముఁబోని పరివేషంబు చుట్టెను ; ఖరుని హేమదండధ్వజంబుపయి గద్ద వ్రాలెను ; మాంసాదంబులగు మృగపక్షులు జనస్థానసమీపంబున వికృతంబుగాఁ గూసెను ; తూర్పుదెస నక్కలు వెలుఁగొత్తి యఱచెను ; దిక్కులందును విదిక్కులందును గాఢతమంబులు గప్పెను ; అకాలసంధ్యారాగంబుదయించెను ; రాపులుంగులు సేనాభిముఖమై బిట్టు కూసెను ; సూర్యునిప్రోల నల్లనిమానిసిమొండెము తోఁచెను ; అపర్వంబున భానుని స్వర్భానుఁడు గ్రసించెను ; ప్రతికూల వాయువులు మహావేగంబున వీచెను. పట్టపగలు మింటనక్షత్రములు మిడుఁగుఱుంబురువులవోలెఁ బొలిచెను ; పెంధూళి మేఘంబులు రేఁగి రాక్షససైన్యంబును గప్పివుచ్చెను ;

శారికారవంబులఁ 'పీచికూచి' యని పరుసంబుగా వినిపించెను ; పిడుగులు రాలెను ; ధాత్రీతలము సశైలవనంబుగాఁ జలించెను ; ఖరునివామభుజం బదరెను ; వానికన్నులనుండి యకారణము నీరు స్రవింపఁ దొడఁగెను ; అతనికి వక్షస్త్రికపొటూడవెను ; తదీయ లలాటభాగం బనిర్వచనీయ వికార మొందెను.

ఆయుత్పాతంబులకు ఖరుఁడు వికవిక నవ్వి 'దుర్నిమిత్తంబులు దుర్బలులని గలంచును ; బలవంతులు వానిని లెక్కసేయరు. నేను తేఱి చూచినఁ దారాగణము నభోవీథి నెడసి జలజలరాలును ; మృత్యువు నయితము పఱచును. అట్టి నాకు రాముఁడు గీముఁడు లెక్కయగునా ? ఆకూళను దమ్మునితోడఁ బరిమార్పనేని నన్ను నగరా ? ఆ నరాధముల రుధిరంబులను నాసోదరికిఁ ద్రావనీయనేని నాదియు నొకమగంటిమియగునా ? ఇంతవఱకుఁ బరాజయమనునెట్టిదో తెలియదు. ఐరావతయాయియైన మహేంద్రుఁడుగూడ నాయలుకకుఁ దాళఁడు. ఈ ముక్కిడిమేపాటి ?' యని సోత్కర్షంబులు వచించెను. వానిసైన్యము దోస్త్రోడఁ దమశైర్య సంతోష మహోత్సాహంబులను జయజయధ్వనుల రూపంబున వెలిపెను. దేవర్షిగంధర్వసిద్ధచారణులు తత్సంగరసందర్శనోత్సుకులై విమానాను లధిరోహించి గగనతలంబునఁ బాఱులు తీఱి 'గోబ్రాహ్మణులకును లోకంబునకును హితాభిలాషులైన రామలక్ష్మణులకు మంగళంబగుఁగాక. చక్రపాణి యసురులంబోలె రాముఁడు పౌలస్త్యరాక్షసవర్గంబును దునుమాడి జగత్కళ్యాణమొనర్చుఁగాక' యని పలుకుచు నిలువెల్లఁ గన్నులుగానుండిరి.

రాముఁడు యుద్ధసన్నద్ధుఁడగుట.

రాముఁ డాయుత్పాతపరంపరలు పరికించి 'వత్సా ! లక్ష్మణా ! ఈమహోత్పాతంబులు సర్వరాక్షససంహారసూచకంబుగాఁ దోఁచుచున్నవి. ఘోరసంగ్రామంబు తప్పదు. నాదక్షిణభుజము సారెసారెకు నదురుచున్నది ; బాణంబులు పొగరాజుచున్నవి ; నీమోము కాంతిమంతమై గాన్పించుచున్నది. ఒండుచోఁ బ్రాణహానియగు నందురు. అవిగో సింహనాదభేరీనినదంబులు ; ముప్పును శంకించి తత్ప్రతీకారంబును మున్నుగా శుభకాంక్షి యొనర్చుట యొప్పు. నీవు శరచాపంబులు దాల్చి సీతం గొనిపోయి పాదప

...కులంబును దుర్గమంబునైన యమ్మహాగుహాంతరంబునఁ గాచియుండుము. మాఱాడవలదు; జాగు సేయకు. నీశక్తిసామర్థ్యంబులను శంకించి యిట్లనుట లేదు. ఈసోకుమూకకు నీవెంతయుఁ జాలుదువు. ఈపని నేను జేయఁ దలఁచుకొంటి" నని చెప్పి వారినిఁ దక్కుందరాంతంబునకుఁ బుచ్చి కవచధారియై ఘనతిమిరాంతంబున విధూమాగ్నికరణిఁ దేజరిల్లుచు దిగంతంబులు ప్రతిధ్వానంబు లీనునట్లు జ్యానిర్ఘోష మొనర్చెను. మింటనున్న ఋష్యాదులు శహతహపడుచు 'రాక్షసబలమున్నదో పదునాల్గువేలుగానున్నది. అందు మహాకపాలియు స్థూలాక్షుండును ప్రమాథియుఁ ద్రిశిరుండును గలరు. ఆ సేనానాయకులు మహాబలవీర్యోద్ధతులుగాని యేతస్మాత్రులుగారు. వారికిఁ దోడుగా శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రువును విహంగముండును దుర్జయుండును గరవీరాక్షుండును బరుషుండును గాలకర్ముండును మేఘమాలియు మహామాలియు సర్పముఖుండును రుధిరాశనుండును నిలిచి యున్నారు. ఈపన్నిద్దఱును దుర్ధర్షులనుట యతిశయోక్తిగాదు. రాముఁడో యనన్యసహాయుఁ' డనుచు మిణుకరింపసాగిరి.

దూషణసంహారము.

రాక్షససైన్యంబు దిక్తటాస్ఫాలనంబుగా బిట్టార్చుచు హుటాహుటి రామాశ్రమంబునకు వచ్చి తన్ముఖంబున నేకరూపంబుగాఁ బ్రళయరుద్రునిపగిది నున్న దాశరథిని జూఁచెను. ఖరుఁడు శరవర్షంబునఁ రాము నొప్పించి సింహనాదంబొనర్చెను. రాక్షసులు చెలరేఁగి యొక్కుమ్మడి వివిధాయుధంబులఁ గురిపించిరి. రాముఁడట్లు రాక్షసాయుధంబులకు గుఱియై నెత్తురుజొత్తిల్లుచు సాయంకాలమేఘావృతచండగభస్తిక్రియఁ గాన్పించి మండలీకృతకార్ముకుఁడై దుర్వారంబులును గాలదండసన్నిభంబులునైన బాణంబులను శతసహస్రంబులుగాఁ బ్రయోగించెను. ఆశరంబులు కాలపాశంబులువోలె రక్కసులప్రాణంబులను హరించి తద్రక్తసిక్తములై మంటికొఱవులో యన నొప్పి నింగి గప్పెను. శిరంబులు తెగి సారథులు దుల్లిరి; వారిరథహయంబు లొఱఁగెను; వానిమీఁద మాతంగంబులు నడగొండలవలె దొర్లెను. రణరంగంబెల్ల శవమయంబును రుధిరప్లుతంబునై బీభత్సాకారము దాల్చెను. హతశేషులు భయభ్రాంతులై పఱవఁజొచ్చిరి.

రాక్షసబలదురవస్థకు దూషణుఁడు మహాకోపమంది హతశేషం నూలుకొల్పి యుద్ధంబునకుఁ బూన్చి రుద్రునిమీఁదికి మృత్యువుబోలె రాముని పయినుఱికెను. రాక్షసులు కొందఱు తాలవృక్షంబులను విసరిరి; కొందఱు సాలమహీరుహంబులను పెకలించి తెచ్చివైచిరి; కొందఱు భూరిశిలావర్షమును గురిపించిరి; కొందఱు నానాయుధంబులతో దాఁకిరి. వారట్లు నలుక్రేవలుజుట్టి హాహారావోర్రి పోరుగావించుట రాముఁడు పరికించి సింహనాదమొనర్చి గాంధర్వాస్త్రంబును బ్రయోగించెను. అందుండి విశిఖసారాచంబులు వేనవేలుగానుప్పతిల్లి సోకుమూక నెల్ల నుగ్గునూచమొనర్చెను.

మ. విఱిగెం దెక్కురథంబులొక్కట మొగి, నుర్వింగూలె శుండాలముల్,
దఱుచై త్రాలెఁదురంగసాదిబల సంతానంబు నింతింతలై
కుఱుకుల్ గట్టె భటాంగకంబులు, రణక్షోణీతలం బెల్లెడన్
బఱచెన్ నెత్తురు వాకలై, పరమభీభత్సాలయంబో యనన్ ॥

అట్లు రాక్షసబలంబు శిరంబులు తెగియు భుజంబులు విఱిగియుఁ దొడలుతునిగియుఁ బాదంబు లేదియుఁ గూలుటయు, గజతురంగంబులు దొల్లుటయు ఛత్రచామరవ్యజనధ్వజంబులు భగ్నంబులగుటయుఁ, బరశుఖడ్గప్రాసంబులు పుష్పొడియై సమరాంగణంబెల్లఁ బఱచుటయు, దూషణుండు గాంచి యుగ్రహదుర్నిరీక్షణమూర్తియై వజ్రంబులవంటి శరంబులు గ్రొన్ని పింజపింజ గఱచి వైచి రాముని నొప్పించెను. అయ్యాహవకాలుండు మధ్యాహ్నమార్తాండుని పగిది మండుచు నర్ధచంద్రాకారబాణంబు వైచి దూషణుని చాపంబు నిరుఖండంబులొనర్చి, నాల్గుశరంబుల నతనియశ్వంబు నొంటఁ దత్సారథిని దెగటార్చి యొకక్కసు నురంబున వాడియమ్ములు మూఁడు నాఁటెను. అరక్షోనాయకుండు భగ్నకార్ముకుండును విరథుండునై మూర్తిగొన్న యుగ్రదేవతవలె దీపించుచుఁ గాంచనపట్టపరివేష్టితంబును దీప్తశరాయశ్శంకుసంకలితంబును దేవసైన్యసమర్ధనంబునైన పరిఘంబుఁబూని యయవిక్రమాటోపంబులు మీఱ రాముని దలపడెను. రాఘవుఁడు వాని విజృంభణంబును సగకుగానక బాణద్వయము వైచి యార్చెను. దూషణుండు భుజంబులు తెగి విధ్వస్తదంతదంతి పగిది బిట్టఱచుచు నేలఁ గూలెను. వాని చావునకు నిఖిలభూతంబులు రాముని సాధువాదంబుల నగ్గడించెను. దూష

స్థానచరులు కపాలస్థూలాక్ష ప్రమాథి ప్రముఖులు తమయొడయునిపాటునకుం జింతాక్రోధంబులు దాల్చి తెంపుచేసి శూలపట్టిస పరశ్వధంబులు గైకొని రాముని డీకొని తదీయ శరవహ్న్యర్చుల భస్మీభూతులైరి.

ఖరుఁడా సంగతి విని యౌడుఁగఱచి శ్యేనగామి ప్రభృతి సేనాధ్యక్షులను పన్నిద్దఱ నొక్కుమ్మడి రామునిపయికిఁ బురికొల్పెను. వారు కొదమ సింగంబులవలె గుప్పించి యెగసి చని రాఘవుని దాఁకొని వానిపయి వివిధాస్త్రశస్త్రంబులను గురిపించిరి. రాముఁడు వారి యస్త్రంబులన్నిఁ ప్రతిశరంబులఁ ద్రుంచి వారి నొక్కొక్కరి నొక్కొక్కసాయకంబునకు గుఱిఁజేసెను. రాక్షసవీరులా బాణంబులు తాఁకువడికిఁ గులిశధారానిహతవృక్షంబులవలెఁ గూలిరి. రణభూమియెల్ల విడిసిన వెండ్రుకలతో రుధిరాప్లుతకళేబరంబులతో నిండి దర్భఁగప్పిన వేదికవలె నయ్యెను. ఆవనప్రదేశమంతయు ఘోరరక్తమాంసజంబాలమై మహానరకంబుగాఁ దోఁచెను.

త్రిశిరునిసంహారము.

రాముఁడట్లు పరసహాయనిరపేక్షముగా నయ్యసురబలంబు నెల్ల జక్కాడఁగా, ఖరుఁడు కోపప్రచండుఁడై స్వయంబుగా వానినిదాఁకనుంకించెను. త్రిశిరుఁడు వానికి నడ్డపడి 'రాక్షసేశ్వరా! నన్ను మఱచితివా? ఇదిగో పోదుము. రాముని వధింతు' నని తనకత్తి దాఁకి ప్రతిజ్ఞచేసి 'దేవా! సాహసంబువలదు; సుంత యోర్చి సాక్షిమాత్రుండవై యుండుము. నా బాహువుల రణకండూతి సహింపరాదు. నేనో రాముఁడో యొక్కండు శేషించునందాక సమరాగ్ని చల్లారదు' అని పలికి, దేదీప్యమానమైన రథంబారోహించి త్రిశిఖరపర్వతంబు పగిది రాముని డీకొని వానిపయి శరవర్షముంగురిసి, జలార్ద్రదుందుభిధ్వానంబట్లు సింహనాదంబొనర్చెను. రాముఁడు శితశరంబుల నయ్యసురబాణంబుల నరికట్టి 'రాక్షసవీరా! నీలావు చూపు' మనెను. రామత్రిశిరులపోరు సింహమత్తేభంబుల పోరును దలపించెను. త్రిశిరుఁడు విశిఖత్రయంబును రామునునుదుట నాటి యార్చెను. రాముఁడు పాదతాడితసర్పంబుపగిది నూర్చుచు 'అహో! రాక్షసాగ్రణీ! నీవిక్రమంబింతనరాదు. నీతూపులు పూఁదునుక కుసుమత్రయంబట్లు నా ఫాలభాగంబు నలంకరించెను జుమా. ఇఁక నా లావు చూడు' మని యాక్షే

విషంబులఁబోని యాశుగంబులఁ బదునాల్గు త్రిశిరుని పేరురంబున గాఢనైష్ఠి మతి నాల్గుకోలల నతని వాహవంబులను నాల్గింటిని గూర్చి బాణాష్టకంబునఁ దత్సారథిని హరించి యొక్కఁట ధ్వజంబును ద్రుంచెను. అంతఁ ద్రిశిరుఁడు రథంబునుండి లంఘింప నుంకించెను. రాముఁడంతలోన శరత్రయంబునఁ దన్మస్తకంబులను మూడింటిని జెండాడెను. త్రిశిరుని మొండెము నెత్తురు చిమ్ముచు నేలఁగూలెను.

ఖ ర సం హా ర ము.

త్రిశిరదుర్మరణఝంఝానిలంబున ఖరక్రోధానలంబు రేఁగి భగభగమండ సాగెను. అతఁడు చండభానుఁడువలె నుద్దీపించుచు రథారూఢుఁడై వచ్చి రామునిఁ దలపడి ధనుర్విద్యాపరిణతి మెఱయ నానాబాణంబులఁ బ్రయోగించెను. రాముఁడు ప్రతిశరంబులను విస్ఫులింగాగ్నులఁబోని వానినిఁ బుంఖానుపుంఖంబులుగాఁ బఱచి యాకాశంబెల్ల నిరవకాశంబొనర్చుటంజేసి సూర్యరశ్మి జల్లెడనుండినటు రణభూమిపయిఁ బ్రసరింప సాగెను. ఖరుఁడు తనశరంబులెల్ల నట్లు వ్యయంబగుటకు నాగ్రహంబొంది ధనుష్పాణియై పాశహస్తుఁడగు నంతకునిభంగి సర్వభూతభయావహుఁడై నిజభుజాసారంబేర్పడఁగా బాణంబొండు దివిచి వైచి రామచాపంబును ముష్టిదేశంబునఁ ద్రుంచి సప్తసాయకంబుల వాని కవచంబును జించి శరసహస్రంబున నతని నొప్పించి సింహనాదంబొనర్చెను. దాశరథి కోపమహోగ్రమూర్తియై యగస్త్యమహర్షిదత్తంబైన వైష్ణవనామక ధనూరత్నంబును గైకొని సజ్యంబు గావించి కనకపుంఖశరంబులఁబంచి యా దనుజేంద్రుని ధ్వజంబు నిరుతుండెములొనర్చెను. ఖరుఁడు తనధ్వజమట్లగుటకుఁ గ్రోధమూర్ఛితుఁడై శరీరమర్మజ్ఞుఁడు గావున రామునిజీవస్థానములందు నాల్గుబాణంబుల నాటి వానినెంతయు నొప్పించెను. రాఘవుండంత వైరిబాహుమూలంబులందు రెండుబాణంబులను వక్షస్థలంబున మూఁటిని గ్రుచ్చి, యొక్కఁటఁ దద్రథకూబరంబును నాల్గింట గుఱ్ఱంబులను నొంట సారథిశిరంబును దెగవైచి, మూఁట యుగంధరంబును ఛేదించి రెంట వక్షంబును దునిమి యొంటఁ జాపంబును జూర్ణమొనర్చి యొక్కఁట వానిఁ జెనకెను. ఖరుఁడట్లు భగ్నశరాసనుండును విరథుండును హతాశ్వుండును నిగ్గతసారథియునై గదం బట్టి యరదంబునుండి దుమికెను. రాముఁడతనిఁ జూచి "ఖరాసురా! రథాశ్వ

గజపదాతిబలగర్వంబునంజేసి మైమఱచి సర్వలోక జుగుప్సిత మహాదారుణ కర్మంబు లొనర్చితివి. ప్రాణులకు నెగ్గుచేయు నతఁడు ముజ్జగంబుల నేత యైనను మేలుం బొరయఁడు. లోకకంటకుని దుష్టసర్పంబు లట్లు బరిమార్పఁ జూతురు. ఎవ్వఁడు కామలోభప్రేరితుఁడై పాపంబులొనర్చునో వాఁడు వడిగండ్లు దిన్న నలిగండ్లసర్పంబువలెను వేఱుతెగినవృక్షంబు క్రియను వెను వెంట నశించును. నిరంతరము ధర్మమునందుఁ దవిలి తపోవ్రతంబులఁ గాలముపుచ్చు మహాభాగులను దండకారణ్య ఋషిసత్తములను వధింప నీ చేతులెట్లాడెను? దాన నీకగులాభమేమి? ఋతుకాలంబునఁ దరువులు పుష్పాదికంబునువలె ననుభవకాలంబున జంతువులు తమ పాపకర్మఫలంబులను తప్పకపడయును. విషాన్నభోజనఫలంబట్లు మహోత్కట పాపఫలంబు తోడ్తోడ సిద్ధించును. ఇంతమాత్రము విచారింపక మదాంధుండవై నిరంకుశముగా వర్తించితివి. దుష్టులు మనరాదు. దుష్టశిక్షణము రాజునకు విధివిధానము. ఈకార్యార్థము దశరథమహారాజు నన్ను నియమించెను. తదాజ్ఞానువర్తినై వచ్చితిని. నీపాపంబులెల్లఁ బరిణతిగాంచెను. సర్పంబులు వల్మీకంబునుండి యవ్వలికిఁ జనుక్రియ నాబాణంబును నీశరీరంబులు దూఱాడిపోనున్నవి. ఏదండకారణ్య మునిసత్తములను నీవుభక్షించితివో యా మహాత్ములు విమానస్థులై నీపతనంబునకు వేచియున్నారు. కులాధమా! ఇదిగో నీతల తాటిపండువలె నేలరాలి వ్రయ్యలుగానున్నది చూడు' మనెను.

రామపరిభాషణంబులకు ఖరుఁడు క్రోధసంరక్తలోచనుఁడై విహసించి 'దాశరథీ! అలసులైన రక్కసులను గొందఱఁజంపి మేటివై విఱ్ఱవీఁగుదువు. లావుగలవారిట్లు పలుకరు. ఆత్మప్రశంస యలసత్వంబును వెల్లడించును. కుశాగ్నిజ్వాల పసిడికాంతులీనుచు నెంతచెలరేగినను బదార్థంబును దహింపనేర్చునా? ధాతుమంతంబగు పర్వతంబువలె వీర్యవంతుఁడైన శూరుఁడు స్వతముగాఁ బ్రకాశించును. రామా! నీప్రగల్భంబులిఁకఁ జాలు. కాలాంతకుఁడు ముల్లోకములకు వలె నేను నీప్రాణములకు మన్నాను. కాలవిలంబము వలదు; అదిగో రవి క్రుంకనున్నాఁడు. సూర్యాస్తమయము యుద్ధవిఘ్నకారియగును. రారమ్ము; నీవలనమడిసిన మావారెల్లరును భవద్రక్తధారాతర్పణక్రియకు వేచియున్నా' రని పలికి పిడుఁగుంబోని వెను

గదను గిరగిరఁ ద్రిప్పి రామునిపయి విసరెను. అది మహావేగవంతమై మార్గమధ్యవృక్షంబుల నెల్ల నున్మూలించుచు రాఁసాగెను. రాముఁడు వాఁడి నొక్కకోలఁ దుత్తునియలొనర్చి 'ఖరాసురా! నీలావును జూపితివి; ఇఁక నాపరాక్రమంబును జవిగొనుము. భవత్కంఠనాళనిస్సృతరక్తధారలను ద్రావి ధాత్రి ప్రశాంతరజస్కయగుఁగాక. నీవు ధూళిధూసరంబులైన నీ భుజంబులతో ధాత్రిని దుర్లభయగు ప్రమదనుబోలె నాలింగనమొనర్తువుగాక మత్తా! నీవు దీర్ఘనిద్రను జెందినఁగాని దండకారణ్యఋషిజన సంతాపంబులు తీఱవు. పరజనప్రాణంబులతోఁ జెర్లాడు రాక్షసాంగనలు దుఃఖరసంబునుఁ జవిజూతురుగాక. దురాత్మా! నీనిమిత్తంబున వీతిహోత్రంబులు శ్రేలవయ్యెను. ఇఁక నేని వైశ్వానరుఁడు నిరాతంకముగా వెలుఁగుఁగాక' యనెను. ఆమాటలకు ఖరుఁడు వెగటు నవ్వునవ్వి 'రామా! మృత్యుముఖంబును జొచ్చియు ప్రేలుటమానవా?' యని భ్రుకుటీకుటిలలలాటుండై పండ్లు గీఁటి వెనువృక్షంబును సమూలంబుగాఁ బెకలించి యార్చి చావుమనుచు దానిని రామునిపై వైచెను. కౌసలేయుఁడాభూరుహంబు నొక్కశరంబునఁదునిమి స్విన్నగాత్రుండును రోషకషాయనేత్రుండునై ఖరునిపయి వేలకొలఁది కలుకుటమ్ములు చిమ్మెను. అసురుని నిలువెల్ల జల్లెడకంతలయ్యెను; ఆ గాయంబులనుండి స్రోవులంబలె రక్తము వెగచిమ్మెను. ఖరుఁడు క్రోధవివశుండై యెగచి రాముని పయిఁబడెను. అయ్యసురరక్తంబు మదదుర్గంధమహోదుస్సహంబుగుటం జేసియు నతఁడు కేవలసమీప గతుండగుట శరసంధానంబునకుఁ గూడ నెడము లేమింజేసియు రాముఁ డొండు రెండడుగులు వెనకకుజరిగి, యింద్రదత్తంబైన బాణంబును ద్వితీయబ్రహ్మదండమోయన విస్ఫులుఁగ్రక్కుచున్న దానిని చైకొని సంధించి యాకర్ణాంతముఁ దివిచి వైచెను. అది నిర్ఘాతంబట్లు ఖరుని పేరురంబున వ్రాలి తదీయవక్షోభాగంబును జీల్చి తూటాడిచనెను. ఖరుఁడా బాణాగ్ని దగ్ధుఁడై శ్వేతారణ్యంబున హరనేత్రాగ్నిసందగ్ధుఁడైన యంధకాసురుని దలపించుచుఁ గులిశధారాహతిఁ బడసిన వృత్రాసురునిపాటు మఱపించుచు నేలఁగూలెను.

ఖరదూషణుల వినాశంబునకు దేవర్షిగంధర్వాదులు పరమసంతోషమంది వచ్చి 'రామా! నాఁడు దేవేంద్రుఁడు శరభంగమహర్షియాశ్రమంబునకువచ్చి చనుట చూచితివిగదా. ఆయన యట్లువచ్చుట యీఖరవధార్థమే

యట్టినన్ను దశకంఠుని లెక్కగొనక యింతయొనర్చిన పంపయెవ్వఁడో చెప్పుము. ఈతలఁపు నైపరా' యని గభీరస్వరంబున నడిగెను. వాఁడును 'దేవా! ఎవఁడో మర్త్యమాత్రుఁడింతచేసెను. దశరథమహారాజ సుతుఁడట; రాముఁడఁట. అహో! వాని ధనుర్విద్యా కౌశల్యంబింతనరాదు. వానిరూపంబు లోకోత్తరంబనుటకన్న వేఱువర్ణింపఁజాల. ఆతని బలపరాక్రమంబు లత్యద్భుతంబులు ఒక్క కోలకు దూషణుని శిరంబు తెగి పెనుగాలికి దూదివలె నెందోపడెను; ఖరుఁడు పర్వతంబువలెఁ గూలెను. పైమేల? వాని శౌర్యాగ్నికి జనస్థానరాక్షసబలంబు పదునాల్గువేలు క్షణములో నింధనప్రాయమయ్యెను. సైన్యసహాయమన్ననో యొక్కరుండును గలుగఁడు. నిర్జరాదులు తోడువచ్చిరాయన నెవ్వరును రారు. ఏకాకిగా నతఁడింత యొనర్చెను. మేము సాయుధులమై సమరంబునకుఁ గడంగితిమి. ఒక్కొక్క యోధుని యెదుట నొక్కొక్క రాముఁడు నిలిచి పోరెను. ఇది రాక్షసమాయకు మించిన మాయగానున్నది. ఈచిత్రంబు మాయూహకు నందదు. రాముని వెంట నతనితమ్ముఁడు లక్ష్మణుఁడుకలఁడు గాని, యతఁడుమిన్నకుండెను. దేవరవారిచిత్తం'బని యకంపనుఁడు విన్నవించెను.

రావణుండావచనంబులు విని 'అకంపనా! సంగతి తెలిసెను; పోదము; వారిబూడిదబుంగలకత్తింతుఁ జూడు' మని క్రోధస్ఫూర్తితో వచించెను. రాక్షసేశ్వరుని తలంపు నకంపనుఁడు గ్రహించి 'స్వామీ! మన్నింపుము; నీ లెంకసాహసంబును మన్నింపుము. రాముఁడంత సులభసాధ్యుఁడుగాఁడు. వానికోపంబునకు సెలయేఱులుగూడ నింకఁబాఱును; గగనంబు సనక్షత్రంబుగా రాలును; ముల్లోకంబులును దలక్రిందగును. సమస్త సృష్టివిలయంబులు వానియటచేతనున్నట్లు భావింతును. మహాపాతకులకు స్వర్గము సాధ్యమైననగుగాక; నీకుఁగాని నీయసురబలంబునకుఁ గాని రాముఁడు సాధ్యుఁడు గాఁడు. దేవాసురులేకమై యెత్తివచ్చినను చరాచరసమస్తప్రపంచము గూడివచ్చినను వానినిఁ జెనకఁజాలరు. అట్లయిన నతఁడు నిర్జయుఁడాయని ప్రశ్నింపవచ్చును. దేవా! వాని నుపాయాంతరంబున నోడింపనగునే గాని సమరంబున జయింపరాదు. వెఱవేమందువా? వాని వెంట నతనిభార్య సీతయను కాంతామణి గలదు. ఆ

వాఁడింత యొనర్చెనని చెప్పిరి. ఆనరాధముని మననీయారావంబుని రావణుఁడా వచించెను.

రాముని పేరు విన్నంతనే మారీచుఁడు గడగడ వడఁకుచు "రావణా! ఇఁక నీయత్నంబు నుజ్జగింపనగు. విశంకటవంశాభిజనమహాస్త్రసంశోభితంబును ప్రతాపమదమత్తధమ్మిల్లంబును శౌర్యదంతపరిఘవంబునైన రాఘవగంధగజంబును దారొక్కొన నలవిగాదు. బాణనఖంబులును ఖడ్గదంతంబులును గల్గి రణాంతక్షితి సంధివాలములపై నిద్రించుచున్న యానృసింహంబును జానకి మేల్కొలుప వలదు. చాపమకరంబును భుజవేగపంకంబును శరతరంగసంకులంబును రణజలౌఘంబునై మహాభయంకరంబుగా నున్న రామపాతాళంబునఁ బడకు. రాక్షసేశ్వరా! తామసంబువదలి ప్రసన్నచిత్తుండవై లంకరాజ్యము నానోపభోగంబుల నిమ్ముఁ దనుపుభార్యలెందఱో నీకుఁగలరు. నామాట వినుమ" ని హితము పలికెను. రావణుఁడు నాఁటికి వానితలంపు నుజ్జగించి లంకామార్గము ద్రొక్కెను.

రావణునకు శూర్పణఖ తనగతిఁ జెప్పి విలపించుట.

రావణుఁడు కొండొకనాఁడు పేరోలగంబుచేసి, దేవాసురసమర సమయవజ్రవజ్రప్రహారాంకితనిజవక్షోభాగసముజ్జ్వలమానరత్నహారకాంతితతు లా సభామండపంబునెల్లఁ గిమ్మీరకాంతుల వెలిగించుచుండఁగా, యాగవిఘ్న పరదారాభిమర్శన ధర్మవ్యతిక్రమణాది దురాచారపరంపరలు తదీయ దశ ముఖదర్పణంబులఁ బ్రతిబింబించుచుండఁగా, మంత్రిపుంగవులు భయనమ్రులై గావించు విన్నపంబుల నాలకించుచు సేనానాయకులను గనుసన్నల నాజ్ఞా పించుచు నుండఁగా, రాక్షసాంగనయొకర్తు తటాలున సభాస్థలిఁ జొచ్చి "ఏ ప్రతాపశాలి యవక్రవిక్రముఁడై సర్వరాజభోగవతీపురంబుపై నడచి వాసుకిని లీలామాత్రంబున జయించి తక్షకప్రియపత్నుల నపహరించి తెచ్చె నో, ఏవీరాగ్రణి కైలాసపర్వతంబు సోమనగాయంబలె వెగపైచి శంకరుని చీఁచమడంచి పుష్పకవిమానంబును గొనివచ్చెనో, ఏ ధీరాతిధీరుఁడు చైత్ర రథంబును జక్కఁజేసి పుష్కరిణి బాడ్పి యైంద్రనందనోద్యానంబును నా మావేశిష్టమొనర్చెనో, ఏ పరాక్రమమూర్తి తనయాజ్ఞచేతులడ్డమిడి సూర్య చంద్రుల యుదయంబులనాపెనో, ఏస్థిరసంకల్పుఁడు దశసహస్రాబ్దంబులు

కఠోరతపంబొనర్చి ప్రేమతోc దన తలలు తఱిగి పరమేష్ఠి నర్చించి తద్వాక్యాన ల్పపరిమేయవరంబులc బడసెనో, ఏచండశాసనునకు నోడి దేవతలు హవ్య కవ్యంబులను స్వతంత్రించి గ్రహింపరో, ఎవని నామోచ్చారణమాత్రం బున సమస్తలోకంబు లడ్డుడుకునో, యా పౌలస్త్యవంశరత్నం బాదశ కంఠుండగు నాయన్న యని వచింప సిగ్గయ్యెడును. రాక్షసేశ్వరా ! మహా భయంబు నిన్ను సపరివారంబుగా మ్రింగుచుండcగాc గన్నులు మోడ్చి పరాకున నున్న నీ వెఱ్ఱితనంబు పరమాశ్చర్యవిషాదంబులను గలిగించుచున్నది. గ్రామ్యభోగంబులకుc జిక్కి కామవివశుండై లోభవృత్తిc జరించు రాజును శ్మశానాగ్నివలెc బ్రజలు నిరసింతురుగాని పూజింపరు. యుక్తావసరం బునc గార్యంబును సాధింపని రేcడు పదచ్యుతిc గాంచి వినాశమొందును. దేశరక్షకులుగాని ప్రభువులు సాగరనిమగ్నపర్వతంబుల గతి ననుకరింతురు. దేవగంధర్వదానవులతో మితిమీఱిన వైరంబును బెంచితివి. చారదృష్టి సుంతయు లేదయ్యెను ; దానితోడ విచారదృష్టియు సన్నగిల్లెను ; కామాంధ కారంబున మునింగితివి. ఇcక నీకు రాజ్యమెట్లు దక్కును ? చారసంప దయుc గోశసమృద్ధియు నీతిబలంబును రాజులకు జీవగఱ్ఱలగును. అవిలేని నాcడు వారును బ్రాకృతులగుదురు. చారదృష్టి కలిమింజేసిగదా రాజు లకు దీర్ఘనేత్రులందురు ? కటా ! నీస్థితి యెంతయు విపరీతంబుగానున్నది. నీజనస్థానమేమయ్యెనో, యందున్న నీబంధువర్గమెట్లున్నదో విచారించితి వా ? అన్నా ! నరమాత్రుcడు నీపదునాల్గువేలరాక్షసయోధులను ఖర దూషణులతోడ మ్రింగివైచెను. దండకారణ్యంబు రాక్షసశూన్యముగా నొనర్తునని యతండు ఋషులకు నభయదానంబిచ్చెనcట. కృపణుండవు గావున నీకును నీదేశంబునకును రానున్న గారాము లెఱుంగవు. ప్రమత్తుం డును గర్వితుండును శఠుండును గూఢాపచారుండును స్వల్పప్రదాతయును నైన రాజునకుc బ్రజలాపత్కాలంబునc దోడ్పడరు. అతిమానియు నగ్రా హ్యుండు నాత్మసంభావితుండును గ్రోధియునగు రేcడు విపత్తునకుc జిక్కి నేని వానినిc దనవారలే నిర్దయులై వధింతురు. ఎంతప్రముఖులైనను మన్నె నను దుష్కర్మునను నొకానొకప్పుడేని యుపయోగించుకొనుగాని రాజ్యభ్రష్టుc డైన రాజెన్నడు వేనాటcగాలగాcడు. కట్టియూడ్చిన పుష్పంబుతో వాడి పోయినపూమాలతో రాజ్యభ్రష్టుని పరిపోల్తురు. అప్రమత్తుండును సర్వ

జ్ఞుండును జితేంద్రియుఁడును గృతజ్ఞుండును ధర్మశీలుఁడునైన భూపతిని రాజ్యలక్ష్మి చిరకాలము సేవించును. ఏ తేని నీతినయనంబులు నిద్రావస్థయందుఁ గూడ మెలఁకువతోనుండునో, ఏనృపవర్యుని నిగ్రహానుగ్రహంబులు వ్యక్తంబులుగావో, యట్టిరాజు సర్వలోకసంభావితుండగు. నీజనస్థానముసంగతి యిందాక తెలియవు; నీవారిగతి యేమయ్యెనో వినవు; నిన్ను గ్రింగనున్న యెడరుంగూర్చి విచారింపవు; నీరాష్ట్ర మేమి గానున్నదో నేరవు. ఇఁక నీవెట్టివాఁడవో నీవే యూహింపనగు. పరజనావమానంబులు పండుగలుగా, విషయోపభోగ సుఖంబులు బ్రహ్మానందబుగా భావించి దేశకాలప్రవిభాగతత్త్వజ్ఞానంబింతయు లేక, గుణదోషపరిజ్ఞానమేది, నిద్రించుచున్నావు. అచిరకాలంబున రాజ్యభ్రష్టుండవగుదు’ వనెను.

రావణుఁ డాపరుషవచనంబులు విని కొంతతడవు చింతించి ‘సోదరీ! శూర్పణఖా! దశరథసుతుఁడు రాముఁడింత చేసెనని వింటిని. అతఁడెందు నిమిత్తమట్లు దురాసదమైన దండకారణ్యముఁ జొచ్చెనో యుద్ధమేల పొసఁగెనో వినవలతు’ ననెను. నావుడు అన్నా రామునిరాకకుఁ గారణంబు నాకు స్పష్టముగాఁ దెలియరాదు. అతని రూపలావణ్యాసంపదలు లోకాతీతములు. అపరమన్మథుండతఁడేలనో నారచీరలుకట్టి మునివేషము ధరించెను. వానికిని మనవారికిని ఘోరయుద్ధమయ్యెను. అన్నా! రాముని రణపాండిత్య మేమనివచింతు? అతఁడు శక్రచాపంబునుబోని కోదండంబునుబూని సమరక్షోణి నిలిచినప్పుడు వానిని జూడనికన్నులు కన్నులుగావు. వాని శరగ్రహణ సంధాన విమోక్షంబులకుఁ దెంపుగలుగదు. ఆవీరాగ్రణి బాణంబులఁ గ్రక్కుచున్నాఁడోయన దోఁచును. ఇంద్రశిలావృష్టివలన సస్యంబువలె వానిబాణవృష్టివలన మనసైన్యంబెల్ల నశించెను. అతఁడు మహాత్ముఁడును విదితాత్ముఁడును గావున స్త్రీవధాపాతకంబునకు శంకించెను. అందువలన నేను బ్రదికి యిందురానోచితిని. వానికిఁ దమ్ముఁడు లక్ష్మణుఁడనువాఁడు గలఁడు. భ్రాతృభక్తిప్రేమలు మూర్తిభవించి లక్ష్మణుఁడుగా జనించె ననవచ్చును. బలపరాక్రమంబుల నతఁడు రామునకు సాటియగును. లక్ష్మణుఁడు రామునకు బహిఃప్రాణమై యుండును. అన్నా! మఱియొక విశేషము గలదు. రాముని వెంట వానిభార్య సీతయను సుందరీమణి గలదు. ఆయింతిచక్కఁదనమే చక్కఁదనము. ఇందీవరంబులఁ గ్రిందుసేయు

కంఠసోయితోఁ, రాకాచంద్రునితో వియ్యమందఁ జాలు నెమ్మోముతోఁ, బడియాఱ్ఱిన్నెల నైడి సౌరుమెచ్చనితనూచ్ఛాయతోఁ, దారలకుఁ దలవంపు గల్గించునఖంబులతోఁ గలిమిలేములమధ్యంబగు మధ్యంబుతో సొబగారుచున్న యాచెలువ వనదేవతయో యపరలక్ష్మియో సంశయింతును. సురనారీమణులనేకులనో చూచితిని; యక్షకాంతలు నాకుఁ దెలియనివారు కారు; కిన్నరకీరవాణుల నెల్ల నెఱుంగుదును; ఎవ్వరును దన్నఖాగ్రంబునకుఁ గూడ నోపరు. వేయేల?

'మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరం
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళం గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణి మరాళయాన నయనాంభోజాత వక్త్రన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్య నుపమింపంబోలరే కాంతలన్.

'చ. అంబురుహాక్షి నాసిక నిజాన్వయశత్రు ప్రజంపక ప్రసూ
నంబుఁగరంబు గెల్చుట మనంబునఁ బెట్టి తపియుపార్శ్వ యు
గ్మంబున నిత్యసేవకతఁ గ్రాలెను వీక్షణతారకాఖ్యలో
లంబకదంపతుల్ వెనువళావళి నంతయు సంభ్రమించుచున్.'

అన్నా! ఆకామినీపరిష్వంగభాగ్యంబు చేకూడినవాఁడు మహేంద్ర భోగంబులుగూడ వెకటించును. ఆకాంతారత్నంబు ఆపేశలాంగి యామంగళ దేవత నీకంతయుఁ గూర్చుభార్య కాఁదగును. నీసుఖమే నాసుఖంబుగావున నయ్యిమ్మెలాడి నపహరించి తెచ్చి నీయొడఁ జేర్ప యత్నించితిని. నాప్రయత్నంబెఱిఁగి క్రూరాత్ముఁడు లక్ష్మణుఁడు నన్నిట్లు విరూపిఁగాఁ జేసెను. నాకుఁగా ఖరదూషణాదు లలిగి రాముని చేతఁ బ్రాణంబులు గోల్పోయిరి. ఆత్రైలోక్యమోహినిని గోరుదువేనిఁ గర్తవ్యంబూహింపుము. రామలక్ష్మణులు జీవించియున్నచో నీమనోరథంబీడేరదు. నీభాగ్యమెట్లున్నదో యని వాపోఁబలికెను.

రావణుఁడు మారీచునొద్దకు మరలఁబోవుట.

రావణుండంత సచివులకు సెలవిచ్చి సభ చాలించి యంతఃపురంబునకుఁ బోయి 'కటా! నరమాత్రుఁడు నాకింత యపకారంబొనర్చెఁగదా.

ప్రతికృతియొనర్పనేని నాజీవమేల? మానధనులు ప్రాణహానినైన నోర్తురు గాని యశోహాని సహింపరు. పగదీఱు టెట్లు? వైరి యంతసులభసాధ్యుఁడని తోఁపఁడు. కాదని రణంబొనర్చినచో శత్రుప్రహారణంబగును. అంత మాత్రాన నాపగదీఱదు. చచ్చినవారు నిజాపరాధఫలంబును జవిగాంచరు. రాముని వెతలంగుడిపి పరితపింపఁ జేయుదునేని రాక్షసులమాట మఱియొకండు తలంపకుండు. ఇందులకుఁ దగుమార్గమేది? ఎల్లక్లేశములకన్న భార్యాపహరణక్లేశంబు పురుషులకు దుర్భరంబు. ఆదుఃఖము భర్తకు నిద్రాహారంబులనుడిపి వానిని దేశభ్రమ్మరింగావించి యున్మాదావస్థకుఁదెచ్చి మరణాంతము వేధించును. రామునకింతకన్న శిక్షగలుగదు. అతఁడు పత్నికై చివికి నశించును. అన్నవెంటఁ దమ్ముఁడు చనును; నాకును గార్యంబు సిద్ధించును; రాక్షసలోకంబును సుఖముండును. ఇంతకన్న మంచిమార్గము గానరాదు. కటా! నాఁడు మారీచుని విని చెడితి' నని పెద్దయుందడవు తలపోసి కృతనిశ్చయుఁడై మంత్రులకుఁగాని మందోదరికిగాని తెలుపక యానశాలకుఁజని కామచారిణియైన రథమెక్కి సముద్రతీరముంబట్టి తరలి, నిర్మలతోయపూరంబులై పూచియేచిదలిర్చుచున్న పద్మములతో శోభిల్లు సరోవరంబులను జూచుచుఁ, గదళీనారికేళతాలతమాలవనంబుల నవలోకించుచు, గరుడగంధర్వకిన్నర వైఖానసవాలఖిల్యాది నివాసప్రదేశంబులను వీక్షించుచు, దివ్యాభరణమాల్యసమలంకృతలై గీతానాదంబుల సొక్కించుచున్న నిలింపనితంబినీమణుల క్రీడాస్థానంబులను దిలకించుచుఁ, దపోవిజితదివ్యలోక మహనీయుల విమానంబులను బరికించుచుఁ, జందనాగరు తక్కోలాదిసుగంధివృక్షవనంబులను గాంచుచుఁ, బుష్పితతమాలతరుకాండముతో మరీచాదిలతాతతులతో సొబగారుచున్న రమ్యస్థలంబులను సందర్శించుచు, గైరికాదిధాతుకాంతి సమభివ్యక్తంబులై చిత్రవర్ణతోయంబులతో నింపిరో యన నొప్పుచున్న నిర్ఝరంబులకు నానందించుచు, ధనధాన్యసమృద్ధంబులును జనాకీర్ణంబులునైన నగరంబు లతిక్రమించి చనిచని, తొల్లి గరుత్మంతుఁడు కచ్ఛపంబు నారగించుటకై కాలూనుటవలనఁ గొమ్మతెగియున్న సుభద్రనామ న్యగ్రోధంబును దాఁటి కడలియవ్వలిదరిఁ జేరి మారీచునాశ్రమంబుఁ జొచ్చి, యందు నియతాహారుఁడై కృష్ణాజినజటావల్కలంబులు దాల్చియున్న యతనిఁ గాంచి తదీయసత్కృతులంది తనకార్యంబును మరలవానికి నొక్కి చెప్పి యతనిని సహాయపడఁ గోరెను.

మారీచుఁ డామాటవిని వేపమానశరీరుండును శుష్కభూతవదనుం డై రావణుని నిర్నిమేషదృష్టిం జూచి 'దశకంధరా! నీతలంపువలనం జెడ సమ్మతించితివి. మరల నిన్నెవ్వరు పురికొల్పిరి? ఇచ్చకంబులాడువారు వేలకొలందిగలరు; హితముపల్కువారు మిక్కిలియరుదు. అదియుఁ బ్రియంబగునేని చెప్ప సాహసింతురు. అప్రియంబగుహితంబును దెల్పునేని పలుకునట్టివాఁ డొకండు నుండఁడు. అదియు నధికునితోఁ బలుకవలసినప్పుడేకఁ జెప్పవలయునా? అయినను నీమేలుగోరుదును గావునఁ బలుకసాహసింతును. రామపరాక్రమంబు వినియుండవు. అది తెలిసియున్నచో నీకిట్టి సంకల్పంబుదయించి యుండదు. నాయనా! పెద్దవారిమాట వినుము. రాక్షసలోకశ్రేయంబును గోరుదువేని రామునిజోలికిఁ బోవలదు. సీతాదేవి నీకు మృత్యువై జనించెనని యెంతయు దుఃఖింతును. రాజునకు నిరంకుశవర్తనంబు గూడదు; అతఁడెన్నఁడును దుర్మతి గారాదు. పాపమంత్రము వానియొద్ద సంకురింపఁజనదు. రాజు నిరంకుశవర్తనుఁడును దుర్మతియుఁ బాపబుద్ధియు నగునేని వానిరాష్ట్రంబెల్ల సపరివారంబుగా నశించును. రాముఁడు జనకుని వలనఁ బరిత్యక్తుఁడై మర్యాదమాని లోభమునకుఁజిక్కి ధర్మాతిక్రమంబుగా వనములు పట్టి ప్రాకులాడుచున్న క్షత్రియాధముండని తలంచితివా? అతఁడేతన్మాత్రుఁడు గాఁడు. దశరథుఁడు భార్యావంచితుఁడై యా యింతిపంపు సెఱవేర్పనోపక తీఱని మనోవ్యాకులంబునకుఁ జిక్కియుండఁగాఁ దండ్రియెడరుఁ బాపుటకై ప్రతిజ్ఞాపూర్వకముగా సమస్తముఁ ద్యజించివచ్చిన మహాశుద్ధసత్త్వుఁడని రామునిఁ గ్రహింపుము. అంతియే సర్వభూతప్రియుండును ధర్మావతారుండును గలుగుఁడు. వానిఁగూర్చి చెప్పఁటులు నీచెవిఁగఱచి యుందురు. ఆకూళలమాటలకు భ్రాంతిచెందితివి. సీతాదేవి రామతేజస్సార రక్షితయై యున్నది. ఆమె నపహరింపఁ దలకొనుట సూర్యప్రభ నపహరింప యత్నించుటగును. ఖడ్గచాపంబులనెడి యింధనంబులవలన రగిలి శరజ్వాలాభీలమై ప్రజ్వరిల్లు రామాగ్నికుండంబున మఱలకుము. సీతాదేవి రామునకుఁ బ్రాణాధికగాని వేఱుగాదు. ఆమెను ధర్షింప నీకు సాధ్యమా? రావణా! ఆత్మక్షేమంబు వలతువేని యిట్టినీచసంకల్పంబును దిగవిడిచి మరలిపొమ్ము. నీసచివులు విభీషణాదులు పరమధర్మిష్ఠులుండరా? వారు నీకీతలఁపు సమ్మతించిరా? రామునంతగాఁ దప్పనేసి

పలుకుదువేలయని యడుగవచ్చును. సంగతి వినుము. తొల్లి నేను వేయి కుంజరంబుల బలంబుగలిగి యెదురులేక సంచరించుచుంటిని. ఋషిమాంసము దక్క యొండు నాకు రుచింపకుండెను. నాపేరుచెప్పినంతనే జడములు సయితము భీతిల్లుచుండెను. విశ్వామిత్రుఁ డంతటివాఁడు గూడ నాదాడికి వెఱచి తనయజ్ఞంబును గొనసాగింపనోపకుండెను. ఆఋషీంద్రుఁ డెన్నిసారులో నావలన భగ్నపడి వెఱవుదోఁపక నిజమఖరక్షణార్థము దశరథునర్థించి పండ్రెండేండ్ల బాలుని రాముని వెంటఁగొనివచ్చి క్రతు వారంభించెను. ఆ సంగతి నాచెవిఁబడినంతనే నావరగర్వఁబుప్పొంగెను. నేనతని మఖశాలఁ జొచ్చి యాగవేదిపై నడుగిడితిని. నేను వచ్చునప్పుడు రాముఁడామఖశాలా ద్వారంబున విల్లెక్కువెట్టి యుండెనుగాని యతఁడు నాకుఁ గనుదాళలేదు. నాచరణంబు వేదిపైనూనుటే తడవుగా బాణమొండు నన్నుఁ దాఁకెను. నేను గాలికి దూదివలెనెగసి నూఱుయోజనంబుల దవ్వునఁ బడి చిరకాలమునకు స్మృతివడసి బ్రతికితిని. ఆదెబ్బలతోడ నాపూర్వవృత్తి నన్నెడసి చనెను. నేను తాపసినైతిని. ఆసంగతి దలంచిన నిప్పుడును నాగుండియులం గళ్లిల్లుమనును. సర్పసంసర్గంబువలనఁ దటాకమత్స్యంబులకు గరుడబాధయట్లు దుర్జనసాహచర్యంబువలన సజ్జనులకు హానిగలుగును. రావణా! నీదోషంబు నీతోన నంతరింపదు; అదిరాక్షసబృందంబునెల్ల రామశరాగ్నిహుతమొనర్చును; అసురాంగనలనుఁ దీఱని కడగండ్లఁ గుడుపును; లంకానగరంబును శరవహ్నిజ్వాలాపరిదగ్ధముఁ గావించును. ఇవన్నియు నీవుఁ గన్నారఁ జూతువు. చెలిమిం జేసి యింత వచించితిని. నాసెయ్యంబున గోరుదువేని రామునిమాట నామ్రోలఁ బ్రస్తావింపకుము. నీయపరాధకారణంబున నాకుఁ జేటుఁ గూర్పవలదు. శూర్పణఖాపరిభావంబును ఖరదూషణ వినాశంబును బురస్కరించుకొని రామునిపయి దోషంబారోపించి పగఁదీర్చికొనయత్నించుచున్నావు. నిజమును గ్రహించితివా! పరమపతివ్రతామణియగుసీతాదేవిని నిష్కారణంబుగా బాధించుటకై శూర్పణఖ చని నిజాపరాధఫలంబు ననుభవించెను. సత్యమెఱుంగక సోదరి మాటలు నమ్మి తన్నిమిత్తము ఖరదూషణులు దుడుకుపడి రాముని దాఁకిరి. రాముఁడాత్మరక్షణార్థము వారిని వధించెను. ఇందుధర్మవ్యతిక్రమంబుగాని దౌర్జన్యంబుగాని గలదా?' యని నయభయంబుల హితంబు బోధించెను.

భాగమును గొని చిరసుఖముండుము. మనవ్యూహము ఫలించునేని యుద్ధప్రసక్తియే యుండదు; రాక్షసలోకంబునకెట్టి యెగ్గును జొనరదు; నీవన్న భయము రానోపదు. అట్లుచేయవేని నీకుఁ జావుసిద్ధము. రామునకు వెఱతు నంటివి. రావణుఁ డంత వ్యర్థుఁడా! చక్కఁగాఁ బరామర్శించి నీయిష్ట మొనర్పు' మని గంభీరముగా నుడివెను.

మారీచుఁడు మహోగ్రంబొంది 'మందమతీ! మృత్యుముఖంబునఁ బడఁ దూర్పనున్నావు. నిన్నిట్టి యుత్పథమునుండి మరలించు మంత్రు లెవ్వరును లేరా! అయ్యో! నీదుర్బుద్ధికి రాక్షసలోక మెల్ల బలిగానున్నది. నీకుఁగా నాకును బ్రాణహాని నిక్కము. ఆత్మనాశంబును నేను బుద్ధిపూర్వకముగా వరించుటగాదు. నీనియాజ్ఞానిర్వహణఫలముగా నాకట్టిది కాకతాళీయ మగును. నీవో బుద్ధిపూర్వకముగా నద్దాని వరించుచున్నావు. నీకై నెల్లు దుఃఖమగుచున్నది. రావణా! నీచేతిదుర్మరణంబునకన్న రామునిచేతి మరణము నెంతయు గోరుదును. అట్టిచావు నాకు మహోపకారమగును. నీ వేలం గోరి యెంతో చెప్పితిని; నామాట నెంతయు వినవు. ఆసన్నమరణులకు హితవాక్యము రుచింపదుగదా' యని నిష్ఠురంబులాడి యొండు వెరవులేక యతని మతమొనర్ప సిద్ధుఁడయ్యెను. లంకాధిపుఁడు పరమసంతుష్టుఁడై 'ఇప్పుడుగదా నీవు మారీచుఁడవైతి' వని వానిని బ్రశంసించి యతనిఁ గౌఁగిటఁగూర్చి తనరథముమీఁద నెక్కించుకొని విహాయసమార్గముఁబట్టి నదీనద వనపర్వతపట్టణంబులు దాఁటి రామాశ్రమప్రాంతమున దిగి మారీచుని హస్తముఁబట్టుకొని 'అదిగో కదళీవనము; అల్లదిగో రామాశ్రమ' మని చూపి జాగుసేయకు మనెను.

### చిత్రసువర్ణమృగము.

మారీచుఁడు క్షణములోపలఁ జిత్రసువర్ణమృగరూపంబును దాల్చెను. ఆకురంగరత్నంబింద్రనీలశృంగశృంగారమై సితాసితముఖమండలముతో సొబగారుచు నీలోత్పలవర్ణస్నిగ్ధములైనకర్ణపుటంబులు గలిగి నీలరదచ్ఛదముతోఁ గుందేందువజ్రచ్ఛాయా సుందరతరోదరభాగంబుతో మధూకకాంతికాంత పార్శ్వంబులతోఁ బద్మకింజల్కరుచిమనోజ్ఞములైన యితరావయవంబులతో వైడూర్యమణిఖురంబులతో నొప్పారుచుఁ గించిదున్నతగ్రీవమై చూడఁ

జూపి ముచ్చటలు గొలుపుచు మహేంద్రధనుస్సమానమైన తనవాలంబును గదలించుచుఁ గసివాటుగాఁ బచ్చికలు మేయుచుఁ జివురులు గొఱుకుచు భీతభీతేక్షణంబులఁ జూచుచు నింపు సొంపు దలిర్పఁ జెంగలించుచు రామాశ్రమప్రాంతమున సీతాదృష్టిపథగతమై విహరింపసాగెను. ఆవింతలేడిని జూచి జింకలు గాయవచ్చి మూర్కొని యథార్థమెఱుంగుటవోయన దిశాక్రాంతము లగుచుండెను.

అత్తఱి సీతాదేవి పుష్పాపచయార్థము వనంబునకుఁ బోయి యందుండి యాచిత్రమృగంబును గాంచి యాశ్చర్యవికసితనేత్రయై రామలక్ష్మణులను బిలిచి వారికి నమ్మహాచిత్రకురంగమును జూపెను. లక్ష్మణుఁడు దానిని బరికించి 'అన్నా! ఇది మాయామృగముగాని యొండుగాదు. మారీచుఁడిట్టిమృగమై మృగయావినోదులైన రాజులను బెక్కండ్ర మోసగించి చంపెనని వింటిని. ఇట్టి చిత్రమృగంబును సృష్టిలోగనివిని యెఱుంగము.' అనెను. సీతాదేవి యెలనవ్వుదాల్చి 'నాథా! దీనిమురపు నామనస్సు నపహరించెను. మనము దీనినిఁ గ్రీడార్థము పెంచుదము. ఇది మనవనవాసానంతరము శుద్ధాంతంబునకు నపూర్వాలంకారమగును. ఎట్లైన దీనిని బట్టి తేఁగోరుదు. ఇది సప్రాణముగాఁ జిక్కదేని దీనిచర్మము మనసుఖశయ్యకు ననువగును. నాథా! భర్తలను స్వతంత్రించి ప్రేరేచుట పతివ్రతలకుఁ దగదు. ఈయవినయంబునకు మన్నింపవేడుదు' ననెను. రాముఁడు నక్కురంగలావణ్యవిలాసవిశేషంబులకు నక్కజపడి భార్యకుఁ బ్రియమొనర్పువాఁడై 'లక్ష్మణా! ఇట్టికురంగము నెందుఁ గానము. దీనిరోమంబులు కనకబిందుచిత్రితములై తచ్ఛరీరంబునకు వింతశోభను గూర్చుచున్నవి- ఇది నీలంపుఁ బెదవులు విచ్చి యావులించునప్పుడు దీని నాలుక సుంత బహిర్గతమై కృష్ణమేఘనిర్గతవిద్యుల్లతను దలపించుచున్నది. కదళీమృగంబులను ప్రియకీమృగంబులను బ్రవేణీమృగంబులను వేనవేలు గాంచితిమి. అందేదియుఁ గోమలత్వంబున దీనికి సాటిరాదు. తారామృగంబును దీనితో నెంచయింపవచ్చునేమో యని సంశయింతును. పురుషులకు మనకే యిది యిచ్చలెమ్ముల్లసేయుచుండఁగా స్త్రీలసంగతి చెప్పవలయునా? తమ్ముఁడా! జానకి దీనిని గోరెను. ఎట్లైన దీనిని బట్టి తెచ్చియిచ్చి వైదేహిప్రీతిఁ దీర్పవలయును. ఇది నీవన్నట్లు మాయామృగమైనచో వాతాపిని మహర్షివలె దీనిని

వనము వర్ధించి లోకకళ్యాణ మొనరింతము. ఈకార్యముగూడ మనకు విధివిహితమే గదా. అట్లుగాక యిదినిక్కమైనమృగమగునేని యిట్టిప్రార్థము రాజులకెంతయుఁ దగును. రాజులు రత్నహారులనుట సుప్రసిద్ధము. వారు వేటకై గహనాంతరములు దూఱుటయు నందు రత్నాదినిచయంబులు వారికిఁ దొరకుటయుఁ దదర్థముచేత వారు దమకోశంబుల ననాయాసముగా నించుటయు గలదు. మనమో మృగంబులఁ గాకున్నను మృగప్రాయులను వేటాడుటకై వనముఁజొచ్చితిమి. ఇందు మనకీయనర్ఘమృగరత్నము లభించెను. దీనిను పేక్షించి చనవచ్చునా ? లక్ష్మణా ! నీవిచ్చటనే యుండి సీతను గాపాడుచుండుము. నేను చని యీమృగమును బట్టియో కొట్టియో తెచ్చెదను. జటాయువుగూడ నీతోడనుండును. పరాకువలదని పలికి పైడిపిడికయిదువును మొలఁగూర్చి శార్ఙ్గకోదండమునుఁ జేతఁబట్టి తూణీరద్వయమును మూపునవైచి మృగార్థము తరలెను.

ఆమాయామృగంబు పెనుగాలికిఁ బరుగులువాఱు మేఘంబులలోని చంద్రబింబమువడువున క్షణముగాన్పించుచుఁ దటాలున గను మొఱంగుచు గుఱియయ్యెక భయంబునపోయన నింగి సెగసి దవ్వగుచు నంతలోన నంతికంబునఁ దోఁచుచుఁ ద్రుటిలోన దూరమునఁ బొడసూపుచు బహుంభంగులఁ జరించెను. రాముఁడు దానిచెయిదంబులు చూచి "అహహో ! ఏమి దీనిలీలావిశేషములు !

"మ॥ పఱచుఁ దవ్వగఁ జేయలంతినిలుచుం బట్టీకయాసాసలర
భిఱువోవుం బొదలందుడిందుఁబొడముఁ బిట్టుల్కి వేసాఁటుఁ గ్ర
మ్మఱిమోచుం జెవివార్చినిల్చు మలయుఁ మట్టాడుఁ గ్రోరాడు నే
మఱినట్లుండు దృణంబు మేయు నలయుఁ మాయామృగంబిమ్మలన్ ॥"

అని దానిప్రతారణంబులకుఁ గోపంబును దానిసొంపునకు మహామోహంబును బొందుచు ద్వైధీభావగతుఁడై దానినమసరించి కడుదూరము చని యటఁగొండొకవృక్షము నీడ నిలిచెను. అకురంగము తటాలున దృష్టిగతమై వన్యమృగములఁగూడి పసుగత్తసాగెను. రాముఁడు దానిచదురులఁ దుదిముట్టింప నిశ్చయించి బ్రహ్మనిర్మితదివ్యాస్త్రంబును సంధించి యాకర్ణాంతము దివిచి దానినిగుఱిచేసి వైచెను. ఆబాణము వజ్రపాతమువలె

నక్కు_రంగము పయింబడి దూఱిచనెను. ఆమృగంబట్లు వ్రేటుగొని తాళ ప్రమాణమెగచి పడి స్వస్వరూపముం దాల్చి 'హా! సీతా! హా! లక్ష్మణా!' యని రామస్వరంబున నెలుగెత్తి యఱచి ప్రాణంబులు విడిచెను. ఆవింతం గాంచినంతనే రామునకు లక్ష్మణవచనంబులు స్ఫురించెను; సీతాదేవి వాని హృదయదర్పణంబునం బ్రతిబింబించెను. ఆ యఱపులు సీతాలక్ష్మణులకు భ్రాంతిజనకంబులగునో యని రాముఁడు తహతహపడి వేవేగనొండుమృగం బును వైచి వానిమాంసమును దీసికొని యాశ్రమపథముంబట్టి హుటాహుటి నడచెను.

సీ తా ల క్ష్మ ణు ల సం వా ద ము.

ఆ కేకలు చెవిసోఁకినంతనే సీతాదేవి మహాఖిన్నయై లక్ష్మణుని జూచి 'మీయన్నగారి యార్తరావంబును వింటివా? నాహృదయము తల్లడిల్లుచున్నది; ప్రాణములు నిలువవు. ఆయన యెందున్నాఁడో సింగంబులకుం జిక్కిన యాబోతువలె రాక్షసులకుం జిక్కి యార్తుఁడై పరితపించుచున్నాఁడో యేమో హుటాహుటిం బొమ్ము; జాగుసేయకు; నాపతిని రక్షింపు' మని సౌమిత్రిని త్వరపఱచెను. ఆమెయెంతత్వరపెట్టినను లక్ష్మణుఁడు కాలుకదలింపక యట్లే యుండెను. అందులకు నామె పరమకుపిత యై 'దురవస్థాగ్రస్తుని నీయన్నను రక్షింపంబొమ్మని త్వరపెట్టినను జనవు. నీ మతంబూహింపరాదు. హితశత్రువులు తప్ప యెరు లిట్లొనర్పరు. నన్నుం గాంక్షించి రామవినాశంబును హార్దింతువా? కాకున్న వానియెడనసూయ వహింతువా? నిక్కపుంగూర్మితమ్ముఁడు భ్రాతృక్లేశంబునకు నెమ్మదిమంచునా? నీవు రామార్థమిందువచ్చితివిగాని నాకొఱకుగాదు, రాముఁడు ప్రాణసందిగ్ధావస్థనుండఁగా వానికై బరుగిడక నాకడనుండనేల! నీరక్షణ నాకక్కఱలేదు' అని కఠినంబుగాఁబలికి కన్నీరొలుకుచు సంత్రస్తహరిణి కరణినుండెను. లక్ష్మణుండామె కెంతయు వగఁజెంది 'దేవీ! రామునకు నా నీభయంబు వలదు. ముక్కోటిదేవతలెత్తివచ్చినను జరాచరసమస్త ప్రపంచము పైకొనినను వానికి గోరంతయేని యెగ్గు రానోపదు. ఈవనంబున నిన్నొంటరిగా వదలిపోఁజాలను. నీవు విన్నది నాయన్నకంఠధ్వని గాదు. మహామాయావి మారీచుండట్లఱచెను. మనోవ్యాకులంబును మాని సమాహితవగుము. నాయన్న మాయామృగంబును వధించి శీఘ్రముగా

గొందుఁ వచ్చెను. నీరక్షణార్థము నన్నిందుంచి యాయన చనెను. వానికి హానిఁ రాదు. ఖరదూషణులను వధించినదిమొదలు రాక్షసులు వానియెడఁ బగఁ బూనియున్నారు. ఆవైరంబును సాధించుటకై వారెన్నిమాయలు పన్నుదురనెను.

సీతాదేవి కన్నులెఱ్ఱఁజేసి 'నృశంసా ! అనార్యమైనసంకల్పంబు నెదలోదాఁచికొని యిట్లాడుచున్నావు. ప్రచ్ఛన్నవైరులను ద్రోహచింత నను పాయదు. ఈదుర్వినీతంబు నీకు స్వయంబుగా సంకురించెనా ? లేక భరతుని దురుపదేశంబును వింటివా ? నీవు రామరక్షణార్థంబు వచ్చుట నిమిత్తమాత్రమని నేఁడు స్పష్టమయ్యెను. నీకోరిక కొనసాగదు. రాము నిత్ర యన్యులను గడకంటఁ గూడ జూడదని నమ్ముము. రామునిఁ బాసి సీత నిమిషంబేనియు జీవింపదు. ఇదిగో నీసమక్షంబుననే ప్రాణములు త్యజింతు' ననెను. హృదయశూలంబులైన యాపరుషవచనంబులను లక్ష్మణుండు విని చేదోయి యొగ్గి 'మాతృదేవతకు నీకు బదులాడనోడుదు. అనుచితభాషణంబులు స్త్రీలకు సహజంబులు. స్త్రీబుద్ధి చంచలాచంచలము ; అవి ధర్మమును బాటింపదు ; కార్యంబును బాయదు. ప్రాణమిత్రులం గూడ స్త్రీకారణంబున దుర్వారవైరదగ్ధులై నశింతురు. నీపలుకులు పంచవహ్నిపరితప్తసాయకంబులై నన్నెంతయు బాధించుచున్నవి. అన్యాయముగా నన్నిట్లాడుదువు. ఇందులకై యీవనదేవతలే సాక్షులగుదురు. నాయన్నయాజ్ఞ నుదలఁదాల్చి యున్న నన్ను సంశయించి నాకు నక్రమంబుగా నిందను మూటగట్టు నీవు పరిదగ్ధవై నశింతువు. ఇదిగో నేను నాయన్న కడకుఁ జనుచున్నాను. వనదేవతలు నిన్ను రక్షింతురుగాక.' అని రెండడుగులు చని, అయ్యో ! భయంకరంబులైన దుర్నిమిత్తంబులెన్నో తోఁచుచున్నవి. రామునితోడ మరలి వచ్చి నిన్నుఁ జూతునో లేదో తెలియరాదనెను. సీతాదేవి కన్నీరు నించుచు 'నారాముని బాసి యణుమాత్రమైనను జీవింపజాలను. ఉరియో విసమో యనలమో గోదావరియో నాకు శరణంబగుఁగాక. పరపురుషాభిమర్శనంబునకు నాశరీరంబు సహింపదని పలికి గుండియలు మోదుకొనుచు విలపింపసాగెను. లక్ష్మణుండామెకు నమస్కరించి కోపము ముందునకును రామునాజ్ఞ వెనుకకును లాగుచుండుట

చందురునను గాంతికం దేర్చికూర్చి భా
గ్యనపుఁబెచ్చినయట్లు కోమలిమిగిలి,
యఖిలలంబులకొప్పు గలయంతయునుబుచ్చి
నాటుపోసినభంగి నవక మెక్క

గీ॥ యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబునునిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగంబుల కాస్పదంబుఁ
గాననౌనె యొండెనియుఁ గలుకులందు ?"

చ॥ నెఱికురులం విలోలసితనేత్రయుగంబును నొప్పు తెప్పఁగా
జెలియును దీనియాననము తెల్వుఁగరంబు మనోహరంబు నా
యెఱిఁగిన యంతనుండి సతినిట్టిలతాలలితాంగిఁ జూచియే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె ? రూపవిలాససంపదన్ ॥

"సీ॥ ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుఁడు పార్వ
తీశుపైనను దక్క నేలకున్న ?
యిన్నాతిచెలువంబుఁగన్న శచీప్రియుం
డైనను గనుకలి నవయకున్న ?
యిత్తన్వికనలేమి కెదిరిపన్నిదము భా
షావిభుతో నైనఁ జూపరాదె ?
యిత్తలోదరిజీవితేశున కిందిరా
పతినైన మెచ్చక పలుకఁ జనదె ?

గీ॥ కుసుమబాణునిబాణముల్ గూడ నైదు
గరఁగి నేరిమి వాటించి కరువుగట్టి
పోసిచేసి చైతన్యసంపుటము దగ ఘ
టించిరో ? కాక యిట్టిచేడియలఁగలరె ?"

అని లోలోనఁ దలపోసి విస్మయమంది విలంబము తగదని నిశ్చయించి సూర్యచంద్రులు లేనివేళ సంధ్యను జీకటి పొరయునట్లుగా, రజనీకరుఁడు లేని తరుణంబున రోహిణి నంగారకుఁడు డాయుసరణిఁ, జిత్రానక్షత్రంబును శనైశ్చరుఁడు పొందుకరణిఁ, బతిచింతఁగూర్చి తదేకచిత్తయై యేకాకి

—సన్న యాపరమపతివ్రతారత్నంబును సీతాదేవిని వాఁడు సమీపించి, వేదములఁ గొంత పఠించి 'సువర్ణగాత్రీ ! పీతకౌశేయవాసినీ ! కమలమాలికను బోల్పనపద్మలతవు నీ వెవతెవు ? వరారోహా ! హ్రీకాంతవో శ్రీకాంతవో కీర్తికాంతవో భూతికాంతవో రతివో పార్వతివో వచింపుము. కుందకుట్మలంబుల మెచ్చని రదనశ్రేణితో, విమలాయతరక్తాంతకృష్ణతారకామనోజ్ఞంబగు కెందామరయితోఁ గరికరోరుయుగ్మంబుతో, సమున్నతవృత్తంబులై యొండొంటి నొరయుచు మణిహారశృంగారాతిశయంబునందిఁ గోరికలొరికలెత్తించు స్తనవతోఁ, బిడికిటఁ జాలు లేఁగౌనుతో, హరినీలమేచకకుంతలంబులతో, నొప్పారు నీసౌందర్యముఁ జూడఁజూడ ముచ్చటయ్యెడు. చతురాస్యుఁడు తనసృష్టికళానైపుణ్యంబునకుఁ బరమావధిగా నిన్ను సృజించెఁ గాఁబోలు. తనూదరి ! నాచూడనిమనుష్యాంగనలు గలుగరు ; నాకంటఁబడని దేవగంధర్వయక్షకిన్నరపన్నగపద్మముఖులు లేరు ; ఎందు నిట్టిరూపలావణ్యంబులు గానరావు. నదీప్రవాహము తీరముంబోలె నీచెలువంబు జితాత్ములమనంబును సయితము క్షణమాత్రంబున హరించుట వింతగాదు. ఇట్టి యలౌకికవయోరూపసౌందర్యవతివి నీ విచ్చవనమందు నొంటిమనుండ నేల ? నీకొంతయు దగులయ్యెడు. ఈగహనసీమయందు ఘోరాకారులును గామరూపులునైన రాక్షసులుందురు. ఇచ్చోట నీవుండరాదు ; స్వస్థానంబునకుఁ జనుము. శోభనాకారా ! నీధరించినలోకోత్తరమాలికావస్త్రభోగ్యద్రవ్యంబులవలన నీభర్త సర్వోత్తముండుగా నూహింపనగును. శాతోదరీ ! దేవతాంగనవో రుద్రసతివో వాయుపత్నివో వసుప్రియవో చెప్పుము. కళ్యాణీ ! ఎవతెవు ? ఎవరిదానవు ? ఎందుండివచ్చితివి ? ఏలవచ్చితివి ? ఇందుండ నేల ? వివరము వినుపింపు' మనెను.

సీతాదేవి యాసన్యాసిని గాంచి,

"మ॥ కమనీయంబగు జన్నిదంబు శిఖయుం గౌపీనముం ధాతువ
స్త్రము దండంబును గుండికయుం గుశపవిత్రంబుం గడుం వృద్ధభా
వము సంధిల్లఁ ద్రిదండివేషధరుఁడై వల్లించుచున్ వేదముల్
సముదారస్థితిమన్న వానిఁగని ప్రాంచద్భక్తి దీపింపఁగాన్ ॥"

వానికి భయభక్తులతో యథోచితసత్కారంబులొనర్చి యాసనం బిచ్చి తన

వృత్తాంతంబెల్ల వినిపించి 'బ్రాహ్మణోత్తమా! తమగోత్ర నామచరిత్రంబుల వినవలతు' ననెను. ఆసన్యాసి చిఱునవ్వు నవ్వి సీతా! నన్నెఱుంగవా? ఎవనినామోచ్చారణంబు దేవాసురనరపన్నగలోకంబులకుఁ జంకాశాసనంబగునో యారాక్షసేశ్వరుండను రావణుండనుగదా. సుందరీ! పీతాంబరముఁ గట్టి సువర్ణప్రతిమంబోలి సొబగారు నీరూపంబు నాహృదయంబును మక్కియు శుద్ధాంతకాంతాజనపరాఙ్ముఖంబొనర్చెను. భాగ్యవతీరత్నమా! సాగరమేఖలావలయితలంకాపట్టణంబునకు దేవివై మనున్నారీమణులను గనుసన్నల శాసించుచు ననుఁగూడి నిఖిలకామోపభోగంబులఁ జూఱలాడుము. సుకుమారీ! వనవాసక్లేశంబులకు నీవెంతయుఁ దగవు? మోహనాంగీ! వేయిమాటలేల?

"చ॥ ధరణి నతిప్రతాపబలదర్పమునన్ విన నేఁ పెద్ద నె
వ్వరికిని మున్ భయంపడనివాఁడ భయాతురుఁడనైతి నిష్ప పర
కరుహదళాయతాక్షి, దయఁగావుము నన్ను భవన్నిమిత్త దు
ర్భరతరపంచబాణహతిఁ బంచతఁ బొందకయుండునట్లుగాన్ ॥"

అని నిజమోహావేశంబును వెలిపుచ్చెను.

ఆకశోరవచనంబులకు వైదేహి పరమకుపితయై 'దురాత్మా! పర్వతంబువలె నతిధైర్యుండును సముద్రంబువలె నతిగంభీరుండును దేవేంద్రసమానుండును నైన రామునికూర్మిపత్ని నీ్లాఁడ జంకుజనింపదా? సత్యసంధుండును మహాభాగుండును సర్వలక్షణసంపన్నుండును వటవృక్షంబునకుఁ బరిమండలమువోలె బంధుజాలముఁ గలవాఁడునునైన రామునిపత్ని యన్యపురుషునిఁ గ్రీఁగంటనేని చూచునా? అధమాధమా! గోమాయువు సింహినిఁ గోరునట్లు నీవు నన్ను గోరుచున్నావు. సూర్యరశ్మినివలె నన్ను నీవు ముట్టఁజోవవు. రామపత్నిని వలచుమందభాగ్యుఁ డనతికాలంబుననే కనకవృక్షంబులను గాంచుటకు సిద్ధము. మందరాద్రి నేఱచేతఁబట్టఁగా నుంకింపవలదు; కాలకూటంబును మ్రింగి బ్రదుకునట్టియుడియాసలు మానుము; సూదితోఁ గన్నుతుడువకుము; కత్తిని నాకవలదు; మండునిప్పనొడిఁగట్టకు; శూలాగ్రములమీఁద నడవకు. చలిచీమ మహాసముద్రంబును దాఁటినదాటుఁగాక; పీసము బంగారమైన నగుఁగాక; బురద చందనమైననగుఁగాక;

క్షురవజ్రంబును త్రుంచిన మ్రింగుఁగాక ; నీవెన్నఁడును రామునభార్యం బడయఁ గూడ సాటిరావు. ఇఁక నీదుర్మదంబును మాని వచ్చినదారిం బొమ్ము' అని రోషసంభావవిస్పష్టంబుగాఁ బలికెను.

రావణుం డాతిరస్కారభావముల లెక్కింపక 'విలాసినీ ! ఇంత స్వభావముండునా ? ఎవని బాహుపరాక్రమోన్నతికిఁ గుబేరుఁడు తనపుష్పక విమానంబును గానుకనొసఁగి కైలాసంబునకు వలసపోయెనో, ఎవనియాగ్రహంబునకు హస్తగతప్రాణియై దేవేంద్రుండలమటించునో, ఎవనికిఁ గాఁ బ్రాంతంబుల వాయువు సుఖస్పర్శముగా వీచుచుండునో, ఎవనిశాసనంబున వేవెలుంగు చలివెలుంగయ్యెనో, ఎవనియాజ్ఞకుఁజడిసి నదీప్రవాహంబు లుజ్జగించునో యట్టిలోకవిద్రావణుని రావణుని నిరసింప నీకుఁగాదు. రాజపుత్రీ ! పాండురప్రాకారశోభితంబును వైడూర్యతోరణాభిరామంబును హేమకక్ష్యావిరాజితంబును నానోద్యానసుందరంబును జతురంగబలసంబాధంబును నైన లంకాపురంబునకు నరుదెంచి యందు నాతోడ లోకోన్నత భోగభాగ్యాతిశయంబుల ననుభవింపుము. వోడివలదు. నీభర్త మృత్యువు నోటఁబడఁదూర్చెను. ఆనరాధముఁడంత పరాక్రమశాలియేని దశరథుండు వానినిఁ గట్టలకుఁదోలి యతనిరాజ్యంబును భరతునకుఁ గట్టునా ? రాముని పరాక్రమంబును నాకడఁ బొగడుదువా ? సుకుమారీ ! దేశనిష్కృతుండై వనాంతరంబునఁ దాఁగి కందమూలంబుల జీవించు మందభాగ్యుండు నీకట్టి సుఖంబును గూర్పనేర్చును ? కోమలాంగీ ! కష్టంబులను వరింపవలదు. నా రాజ్యంబున సమస్తభోగంబులు నీకుఁగా వేచియున్నవి. భీరూ ! రామునకు వెఱచి యిట్లాడుదువా ? ఆవరాటుండేమి చేయనోపు ? అతని నింక మఱచిపొమ్ము. కామినీమణి ! వలచివచ్చినవానిని ద్రోయరాదు. ఊర్వశీ పురూరవసులచరిత్రను మఱచితివా ? రారమ్ము నావెంట ; ఇదే సరసంబగు' నని మరలనొక్కి పలికెను.

సీతాదేవి వెచ్చనూర్చి 'దురాత్మా ! సర్వభూతనమస్కృతుండైన కుబేరునకుఁ దమ్ముండవని పలుక నీకు సిగ్గులేదా ? నీదుర్బుద్ధికతన భవదీయ కులంబెల్ల నశింపనున్నది. ఇంద్రపత్ని నవమానించువాఁడు బ్రతికినను బ్రతుకవచ్చునుగాని రామపత్ని నవమానించువాఁడు బ్రదుకుట కల్ల.

అమృతంబుగూడ నట్టివానిని గాపాడనోపదు' అని నిరసననిష్ఠురంబుగా నుడివెను. రావణుఁడంతఁ జేఁజేయితట్టి 'ఉన్మత్తవుగావున నావీర్య పరాక్రమంబులను జెప్పినను గ్రహింపవు. సప్తసముద్రంబులను దిగద్రావి యగస్త్యుని మఱపింతును ; ఇదే చూడు నానిజరూపం'బని చెప్పి స్వస్వరూ పంబుఁ దాల్చి కాలభయంకరుండై బుధుఁడు రోహిణింబలె వైదేహినిఁ గవసి వామహస్తంబునఁ దత్కేశజాలంబును దక్షిణకరంబున నామెయూరుయు గ్మంబును బట్టి యాపతివ్రతామణి నెత్తికొని నిజస్యందనంబునఁ గూర్చుండఁ బెట్టి గగనమార్గముఁ ద్రొక్కెను.

సీతాదేవి యారక్కసుని దుండగంబునకు భయవిహ్వలయై 'హా ! లక్ష్మణా ! హా ! గురుచిత్తప్రసాదకా ! నీమాట వినక రాక్షసాధమునకుఁ జిక్కితిని.

ఆ॥ వె॥ అన్నయానలేక యజ్ఞుఁగైనఁ జనసన్న,
వేఱుతలఁచి యంటి వెఱ్ఱినుడులు,
దానిపాపఫలము దాఁకెనెలక్ష్మణా !
చెనటిమతికి నెట్లు నేగితప్పు ?

"శా॥ అన్నా ! లక్ష్మణ ! నిన్నుఁబుణ్యనిధి నేనజ్ఞానినై పల్కితిన్,
నన్నాపాపమువచ్చిముట్టుకొనియెన్, నాపాలిదైవంబవై
యన్నిచోం బరిమార్ప వేఁగఁబఱతేవే నన్ను రక్షింపుమీ,
యన్నంగ్రక్కసుఁజీరవే యరుగవే యత్యుగ్రశీఘ్రంబునన్ ॥"

హా ! రామా !

ధర్మార్థంబు సర్వమును ద్యజించిన మహానుభావా ! రక్కసుని యీయధర్మం బునుఁ గంటివా ? పరంతపా ! దుష్టశిక్షణార్థము వచ్చితివి ; ఈపరమదుష్టుని శాసింపవా ? ఓరీశఠా ! రావణా ! సస్యము ఫలించుటకు ఋతువట్లు దుర్జనులు స్వకర్మఫలం బనుభవించుటకుఁ గాలము రావలయును. నీకిప్పు డట్టి కాలంబు దాపరించెను. రామునివలన నీకు జీవితాంతఘోరవ్యసనంబు తప్పదు. హా ! నాథా ! నాయీగతి యెవరివలన నీకుఁ దెలుపుదును ! కర్ణి కారములారా ! రావణుఁడు సీసీత నపహరించెనని రామునకుఁ జెప్పరా ?

ప్ర స్రవణపర్వతమా ! నీకు నమస్కరింతును, నాగతి మదీయ విభునకు విన్నవింపుము. దేవీ ! గోదావరీ ! నీకు వేయిప్రణామంబులు. నాస్థితి నావల్లభునకు వినిపింపుము. వనదేవతలారా ! కయిమోడ్చి వేడుదు ; మీ రేని నాదురవస్థను నాపాలిదైవంబునకుఁ దెలిపి పుణ్యముఁ గట్టికొనరా ? వనమృగంబులారా ! విహంగంబులారా ! శరణు శరణు ; నారామునొద్దకుఁ జని నాసంగతిఁ దెలుపరా ? ఆమహానుభావుండు నాయునికి నెఱుంగునేని నన్ను యమగర్భంబునుండియైనను రక్షించును.

సీ॥ చూతు రేమీరలో చూతవృక్షములార !
రాక్షసాధముని దుర్మార్గమెల్ల ?
కాంతు రేమీరలో కర్ణికారములార !
కామాంధకాపుని కార్యమెల్ల ?
తిలకింతు రేమీరు తిలకభూజములార !
పాపాపతాయునిపాటులెల్ల ?
వీక్షింతు రేమీరు విహగరాజములార !
కర్మచండాలుని గడుసులెల్ల ?

గీ. నగములార ! యోవివిధపన్నగములార !
గోవులార ! చరాచర జీవులార !
రామరాజన్యమౌళి కీరామగతిని
మనవి సేయరే మీకునమస్కరింతు.

చ॥ జడజములైన తమ్ములకుసైతము గూర్తువు సంతసంబు, నీ
పాడఁగనినంత నే యిరులు పోవుఁబరాబరీ, వేయికేలను
ల్లుఁడవు, భవత్సమక్షమున లబ్ధుఁడొనర్చెడిదుండగంబు ని
వ్వడిఁగని మిన్నకుండఁ భవాదృశయోగ్యులకౌనె ? భాస్కరా !

హా ! సర్వసాక్షి ! నాపాపంబు నిన్నడ్డగించుచున్నదా ? అయ్యో ! నావిధి కేమందు ?

శా॥ ఏలావచ్చెమృగంబు ? వచ్చెనదిపో, యేలాపడెంగంటు ? నే
నేలా కోరితిదాని ? నాదుదయితుం డేలా చనెన్ లేడికై ?

ఏలా లక్ష్మణునాలకింపక మహాహీనోక్తులంబల్కితిం ?
గాలంబీక్రియమాఱెనాకుఁ దృటిలోఁ గాపాడదిక్కెవ్వరో ?

అనుచు గుండియలవియునట్లుగా విలపించుచు యాదృచ్ఛికముగా వృక్షాగ్రస్థిత జటాయువునుగాంచి గృధ్రరాజా! పాపాత్ముఁడీరాక్షసుండనాథనువలె నన్నపహరించుచున్నాఁడు. ఈనిశాటుఁడు సత్త్వవంతుండును సాయుధుండును గావున వీని నెదిరింపఁగాదు. నాగతి రామలక్ష్మణుల కెఱింగింపు' మని గద్గదస్వనంబునఁ గుయ్యిడెను.

జటాయువు రావణుల యుద్ధము.

నిద్రావశుండైయున్న యజ్జటాయు వయ్యార్తరావంబువలన మేల్కాంచి కనువిచ్చి చూచి సంగతిగ్రహించి 'ఆ! రావణా! వలదు వలదు, ఈదుండగంబువలదు. గృధ్రరాజు జటాయు మాట వినుము. రాముఁడు సర్వలోకహితుఁడు; వాని ధర్మపత్ని యీసీతాదేవి పరమపతివ్రతారత్నము. ఆమె నపహరింపఁ దగదు. ధర్మస్థితుఁడు పరదారలఁ జెనకవచ్చునా ? సీతాదేవి రాజపత్నిగాని యొండుగాదు. రాజమహిషి యెల్లరకు రక్షణీయ గదా ? ఈనీకార్యంబును లోకంబెల్ల గర్హించును. ఇట్టిది నీచులకు నగునే గాని పండితులకుఁగాదు. ఆత్మపత్నినట్లు పరపత్నిని రక్షించుట ధర్మము. శాస్త్రదృష్టంబులైన ధర్మార్థకామంబులను శిష్టులెన్నడును గోరరు. రావణా! నీవు రాక్షసేశ్వరుండవుగాని సామాన్యుండవుగావు. ధర్మరక్షణము నీకును విధివిహితమగును. ధర్మార్థకామంబులకెల్ల రాజు మూలంబగు. రాజు ధర్మబాహ్యుండగునేని వానిరాష్ట్రమెల్ల నష్టేయగును. 'యథారాజా తథాప్రజా' యనవినవా ? దశకంధరా! నీకీవిపరీతబుద్ధి యేల జనించెను? ఇంతటిక్రొవ్విదంపుసేతయగునా ? ఇట్టి చపలునకుఁ బాపస్వభావునకు సిరి దక్కునా ? రాముఁడు నీకేమి యొగ్గొనర్చెను ? వానికి నీవు నిష్కారణంబుగా నపకారంబొనర్ప నేల ? ఖరుని వధించెనందువా? అది రాముని తప్పుగాదు. రావణా! ఆత్మహితంబును గోరుదువేని సీతాదేవిని వదలిపుచ్చుము. ఒండుచో రామకోపాగ్నికుండంబునఁ బడి నీవు నామావశిష్టుండవగుదువు. కాలపాశము నీయఱుతఁ దగిలియుండుట నేరవైతివి. లంకేశ్వరా! నావచించు హితంబు వినుము. మోయరానిబరువును రోగకారియైన పదార్థంబును ధర్మహానియగు కార్యంబు నెవనికినిగావు. రావణా! అరువదివేల

సోంక్షవగ్గు ముదుసలి యని నన్నుఁ దలంపవలదు. ఆయుధ సంపత్తి నాకు లేదనుకొనకు? ఏమైననగుఁగాక, నీదుండగంబును సాగనీయను. స్వతః ప్రమాణభూతయైన వేదశ్రుతిని వేదవేత్తలవ్రాల నన్యథాకరింపరానట్లు సీతాదేవిని నాయెదుట హరింపఁజాలవు. అసురాధమా! దొంగిలించి పఱచుట మగతనమా? రావణా! పిఱికివై యింతకుఁ దెగించితివా? శూరుండవేని యెదు రిచ్చి నిలువుము. కుశీలాధమా! రామలక్ష్మణులు దూరావనుండి రాకమున్నె వారిని గనుఁబ్రామి పోవయత్నించుచున్నావు. నీ యాటకట్టాంకరితనంబు జాలింపుము. జటాయువు బ్రతికియున్నంతకాలము రామునిభాగ్యదేవతను నీవు కొనిపోఁజాలవు. ఇది ముమ్మాటికి నిక్కము. నాప్రాణంబులుంకువపెట్టియైనను నేను రామునకును నామిత్రుండగు దశరథునకును బ్రియంబు సేయుదు' నని పలికెను. రావణుఁడావచనంబులు చెవిఁబెట్టక పరుగెత్తసాగెను. జటాయువందులకుఁ గనలి

'ఉ॥ ఓరిదురాత్మ యీయబలనోడక యేటికిఁబట్టినాఁడ వం
భోరుహనేత్ర విద్యుమెటవోయినఁ బ్రాణముఁగొందు నింక న
గ్రారివిభేదివిక్రము జటాయు నెఱుంగవె చావుమూడె నీ
కారయఁగానిచోఁ ద్రిభువనాధిపుపత్ని నిగోరు దేమదిక్కు.'

శఠాధమా! నిలునిలుము. నాయిచ్చురణాతిథ్యంబును గైకొనుము. ఇదిగో చూడు తొడిమవీడినపండువలెఁ గ్రింద దొర్లమన్నా' వని గద్దించి పలికెను.

రావణుఁడు దురాగ్రహుండై ధర్షించి జటాయువును దాఁకెను. ఇరువురు నొండొరు వాతోద్ధూతాభ్రంబులకరణి మార్కొని తుములంబుగాఁ బోరిరి. రావణుఁడు నాళీకనారాచంబులను గురిపించెను. జటాయువు వానినెల్లఁ బక్షవిక్షేపంబునఁ దట్టివైచి శితశిలీముఖములఁబోని నిజనఖాగ్రంబుల రాక్షసాధముని నిలువెల్ల జిక్కి చీల్చి చిందఱవందఱగావించెను.

'మ. ఘనపక్షాహతులం బ్రకాండపరిఘాతంబులం దీవ్రశా
తనఖోచ్ఛేదములం బ్రదీప్తశరవేధక్రీడలం గ్రూరచం
చు నిహాతంబులఁ బ్రాషకుంతముఖ విస్ఫోటంబు లందక్షగేం
ద్ర నిశాచేంద్రులపోరు సాధనసమత్వాప్తిన్ నొప్పెం గడున్.

‘చ. పటుతరపక్షిపక్షముఖపాతనఖప్రవిఘాత ఖండిత
స్ఫుటితశరీరుఁడై బహుళశోణితధారలు మేనఁగ్రమ్మఁగాఁ
దటసముపాంతనిర్గళితధాతురసారుణసాంద్రనిర్ఝరో
త్కటకులశైలలీల దశకంఠుఁడు నిల్చెనకుంఠితస్థితిన్॥’

అట్లు రాక్షసేశ్వరుండు వ్రణాంకితుండై నెత్తురులాలుకుచు పటు తీవ్రసాయకంబులఁ బదింటిఁ గైకొని సంధించి యాకర్ణాంతముదివిచి పక్షిరాజుపై నేసెను. జటాయువు శరవిద్ధుండయ్యు సీతావ్యసనంబునం జేసి యాత్మక్లేశంబును లెక్కింపక రక్కసుమీఁదికి నురికి తదీయశరాసనంబును నఖాగ్రంబులఁ ద్రుంచెను. లంకాపతి వేఱొండు చాపంబుఁ గైకొని నూరార్లుగా శరంబులను గృధ్రరాజు పయిఁగురిపించి యతనిని శరపంజరబంధితునిగా నొనర్చెను. అప్పతగేంద్రుఁడు విజృంభించి తన్నుఁ జుట్టియున్న యంబకములనెల్ల నిజపక్షవాతంబునఁ జిమ్మివైచి యసురచాపంబును పాదతాడనంబుల ఖండించి వానికవచంబును నుగ్గునూచమొనర్చి తదీయరథఖరంబులను వధించి స్యందనంబును తుత్తునియలుగావించి ఛత్రచామరంబులను జీగాకుపఱచి సారథిని ముక్కునఁ ద్రచ్చి కూలఁద్రోసెను. రావణుఁడు భగ్నధన్వియై విరథుండునై సీతాదేవిని జంకనిడుకొని గగనంబునకు నుద్గమించెను. జటాయువు వానిని వెన్నంటి యెగచి తఱిమి యడ్డగించి ‘రావణా! రాక్షసకులనాశంబునకై యీక్రూరకార్యంబునకు గడఁగితివి. మూఢులు తమ కార్యఫలంబు తెలియంగక తుదనుఁ జేటొందుదురు. రామలక్ష్మణులు దుర్ధర్షులు; వారు నిన్ను మననీయరు. ఇంతటనేని నామాటవిని లోకనిందితంబును వీరపురుషగర్హితంబును నైన యీనైచ్యంబును మానుము. భగవంతుఁడు బ్రహ్మదేవుఁడు గూడఁ బాపంబునకు వెఱచుచుండఁగా నీవిట్లొనర్తువేల? ఆసన్నమరణులు స్వవినాశంబు నెఱుంగరందురు. అదినేఁడు నీయెడఁ గాననయ్యె’ నని మరల హితంబుపలికెను. రావణుండవి యెల్ల సరకుచేయక జటాయువును ద్రోచిపుచ్చి చనసంకించెను. విహంగాధిపుం డందుల కంతయు సాగ్రహమొంది తచ్ఛిరోజంబులను నిజనఖాగ్రంబులఁబట్టి యీడ్చి వానిని నొప్పించెను.

రావణుండట్లు మహాబాధితుఁడై క్రోధించి సీతాదేవిని నిజవామాంకమునఁ బొదివిపట్టి దక్షిణహస్తంబుతో శక్తిఁగొలఁది జటాయువును జఱచెను.

గృధ్రరాజు క్రేటుపడి యాగ్రహవివశుఁడై రావణునిభుజంబులఁ బదింటిని నిజతుండంబునఁ దుండించెను. ఆభుజంబులు పుట్టనుండి వెడలు పన్నగంబుల వైవడిఁ దోడ్తోడ మొలచి పతగేంద్రునకు నాశ్చర్యము గలిగించెను. దశగ్రీవుఁడంత సీతను డించి జటాయువును పైకొని ముష్టిఘాతచరణతాడనంబులఁ గ్రుమ్మి రెక్కలు నఱికి పార్శ్వపాదంబుల ఛేదించెను. పక్షిరాజుఁ డల్పజీవితుఁడై నెత్తుట దోఁగుచు నేలఁబడెను.

సీతాదేవి జటాయువునకుఁగా నాత్మబంధువునకువలె దుఃఖించుచు నప్పతగేంద్రునిఁ జేరఁబోయి వానిని గవుంగిలించుకొని 'అయ్యో! గృధ్రరాజా! నాకై నీప్రాణంబులఁ దొఱంగితివా? నీఋణం బెట్లు తీర్తు?' యని పెల్లు వాపోయి చేతులం బిసికికొనుచు 'హా! రామా! నిన్నుఁ బైకొన్న వ్యసనంబు నింకను గ్రహింపవా? భుజనేత్రస్పందనంబులును విహగాది దర్శనంబులును రానున్న శుభాశుభంబులను సూచించునందురు. అట్టివేవి నీకుఁ గలుగవా? అహో! ఈమృగపక్షు లెంతో వడిగాఁ బఱాయనంబు లగుచున్నవి! నాగతిని గూర్చి నాపతికిఁ దెలుపఁ బరుగెత్తుచున్నవి గాఁబోలు. రామా! ఈపుణ్యాత్ముఁడు జటాయువు నన్నుఁ గాపాడఁ దలకొని నా దౌర్భాగ్యనిహతుఁడోయన రావణహతుఁడై నేల శయనించెను. రక్షింప నీవేలరావు? లక్ష్మణా! నాపయిఁ గోపమా? ఇఁక నాకు దిక్కెవ్వరు?' అని విలపించుచుఁ బొదలం బట్టి ప్రాకుచు వృక్షంబులఁ గవుంగలించుచు 'రామా! రామా!' యని పేరెలుంగునఁ బిలిచి పనవసాగెను. రావణుం డామెను గేశపాశంబునఁ బట్టి యీడ్చి యెత్తికొని వియన్మార్గంబు మెట్టి దక్షిణాభిముఖుఁడయ్యెను. రాక్షసదౌష్ట్యంబునకుఁ జరాచరప్రపంచంబెల్ల నతిక్రాంత నైసర్గికావస్థానంబు నొంది గాఢతమోనిమగ్నమయ్యెను; సదాగతి స్తంభించెను; దివాకరుఁడు కాంతిఁ దొఱంగెను. సీతాదేవి యట్లు పరామృష్టయు దీనయునై విలపించుట పరమేష్ఠి తన దివ్యనేత్రంబులఁ గాంచి 'దేవకార్యము సిద్ధించె' ననెను. దండకారణ్యవాసులైన మహర్షులు సీతాదేవికై ఖేదంబును రావణాసన్నవినాశంబునకై మోదంబును జెందిరి.

సీతాదేవి యట్లాదనుజేశ్వరాంకస్థయై మేఘమండలాంతరంబునఁ దటిల్లతవలెఁ దళతళలాడుచు నిజదురవస్థావిశేషంబు క్షణమాత్రంబని సూచించు

చుండెను. ఆమె కట్టిన పీతాంబరంబుమడతలు గాలికి పీచినాలుకలవ్రా మండుజ్వాలలంబోలి దవాగ్నికీలలు పర్వతంబునువలె నద్దనుజునావరించి వానియాసన్నమరణంబును దెలుపుచున్నవోయనఁదోఁచెను. ఆమె కైసేసిన రక్తోత్పలంబులు రాలి యాపాలసుదిండికి రానున్నయైశ్వర్యభ్రంశనంబుఁ వెల్లడించుచున్నవోయనఁ గాన్పించెను. ఆమెకనకచేలాంచలంబు గాలికిఁ బఱచి రవికిరణప్రసారణంబునఁ దామ్రాభ్రంబుపగిదిఁ దోఁచి, రక్షోనాయకు వినాశపిశునోత్పాతంబును దెలుపనెత్తిన పతాకవలెఁ గ్రాలెను. ఆమె నెమ్మోము జలదంబునఁగిల్చి దోఁచు చంద్రునింబోలి ప్రతిచంద్రదర్శన రూపమహోత్పాతంబుగా గానవచ్చెను. ఆమె కంఠమందలి తారహారంబులు తెగి జాలువాఱి మిన్నేటియవతరణంబును దోఁపించెను. రావణుండవి యెల్ల లెక్కసేయక హుటాహుటిఁ జనసాగెను. ఆనిశాటుని దౌష్ట్యంబును జూచి వృక్షంబులు కొందలమంది వాయుప్రచలితనిజశాఖాకరంబులను జాచి దేవికి నభయంబును దెలుపుచున్నవోయన నయ్యెను. విహంగంబులు కలకలధ్వనులతో నామెను దీవించెను. కమలాకరంబులు మృదితపద్మముఖంబులును సమాకులితమీననేత్రంబులును నై యాత్మదుఃఖాతిశయంబును బ్రకటించెను. పర్వతంబులు తమవ్యసనాతిశయంబును ఝరీబాష్పధారాప్రవాహంబులఁ దెలుపుచు మిన్నొరయు శిఖరహస్తంబులెత్తి యసురనడ్డగింపనున్నవోయనఁ దోఁచెను.

### రాముని విలాపము.

అట రాముఁడు మాయామృగమారీచుని వధించి సీతాసందర్శనోత్కంఠుఁడై మరలినంతనే వాని వెనుక ప్రక్కనుండి జంబుకంబు బిట్టఱచెను. ఆవికృతారావంబునకు దాశరథి భయకంపితహృదయుండై 'కటా! మహా దుశ్శకునమయ్యెను. వైదేహిని రక్కసులు భక్షించియుండరుగదా. మారీచుని యఱపువిని జానకి భయవిహ్వలయై నాకొఱకు సౌమిత్రినిఁ దఱిమి తా నొంటి నుండునేమో! అదే సమయంబని రాక్షసులు సీతను జూపి నాపయిఁ బగసాధింతురేమో!' అని తలపోయుచు నాశ్రమమార్గంబుంబట్టి బఱచి రా సాగెను. మార్గమధ్యంబున మృగపక్షులు వానికి నప్రదక్షిణంబొనర్చి దీనంబుగాఁ గూసెను. ఆయశుభనిమిత్తంబులకు రాముఁడు మఱిమఱి కళవళ

తెలిపితిని ; ఎట్టియాపద వచ్చినను నీకుఁ జరసహాయంబక్కఱలేదంటిని ; రాక్షసమాయలకు మోసపోయి వృథాదుఃఖదైన్యంబు లొందవలదని చెప్పితిని; లోకార్తి నుడుపవచ్చిన నీకెట్టియుపద్రవంబు కలుగనేరదనియు నొక్కిపల్కితిని. ఆమె తనపోఁడిమీఁదక 'అన్నచన్నంతట నన్ను గ్రహింపఁదలంచి యాగుట్టు నెదదాఁచి కుత్సితమతివై భ్రాతృభక్తి నటించుచు మావెంట వచ్చితివనియుఁ దత్కారణంబున రాముని క్లేశంబులకు లోలోన సంతసింతువనియు దుస్సహములైన పరుషవచనంబులు నన్నాడెను. ఓండుదోఁపక యిట్లు వచ్చితి' నని కేలొగ్గి పలికెను.

రాముఁడది విని 'సౌమ్యా! స్త్రీలమాటకుఁ గ్రోధజితుండవై వర్తించుట నీకుఁ బాడిగాదు. నాశక్తి సామర్థ్యంబు లెఱింగిన నీవెంతమాత్రంబు సీతను వదలివచ్చి యుండరా' దని పలికి భార్యను వెదక నారంభించి, మధుకర ఝంకృతులరూపంబున విలపించుటంబోలె నున్న వృక్షంబులఁ దలంచుచు; వ్యసనభరంబునఁ బుష్పాక్షులు మోడ్చినో యన నుండు లతలకు బెగ్గడిల్లుచు, దీనములై కానవచ్చిన మృగపక్షులకు భీతిల్లుచు, వనదేవతానిర్యాసంబునఁ బాడుగోరుచున్న పొదరిండ్లకుఁ సలంగుచుఁ, జనిచని కొండొకచోటఁ గృష్ణాజిన కుశబ్రుసీకటంబులు చీకాకుగాఁబడియుండుటఁజూచి తల్లడిల్లి యాశ్రమంబెల్ల శూన్యంబుగాఁ దోఁచుటకు దుఃఖించి 'హా! జానకీ! హా! జీవితేశ్వరీ! రాక్షసులు హరించిరా? కాలుఁడు కొనిపోయెనా? ఎందేని దాఁగితివా? ఫలపుష్పంబులకుఁగా వెడలితివా? జలంబులు దేర నదికేగితివా? విహారార్థము సరోవరంబులకుఁ జనితివా? ఎందున్నావో పలుకుము. అయ్యో! బదులాడవేల? నీరాముని పైఁగోపమా? నీవు పలుకకున్నను నీగుట్టును వనవృక్షమృగంబులవలన నెఱుంగుదు. కదంబమా! కదంబప్రియను నాప్రియను జూడవా? బిల్వమా! పల్లవకోమలాంగకయుఁ బీతకౌశేయవాసినియునైన నాసీతను గానవా? అర్జునమా! అర్జునప్రియయైన నాదయిదారత్నంబెందుఁ బోయెను? జనకరాజసుత యున్నదో లేదో చెప్పుము. కకుభమా! కకుభోరువు మైథిలి నీకుఁ జిరపరిచిత గదా. ఆకాంత యెందుఁజనెనో తెలుపుము. తిలకమా! నీభ్రమరగీతలకు నానందించు తిలకనీతిలకంబును సీతను దిలకింపవా? అశోకమా! శోకోపహతుఁనకు నాకు మత్ప్రియాస్థితిఁ దెలిపి నాయెడ దయఁజూపవా? జంబూవృక్షమా! జంబూఫలో

కపనాత్రి నాయనుంగుఁజెలి యెందున్నది? కర్ణికారమా! కర్ణికారలాలిత
సాక్షీపుచెల్లిని నాజానకిని బరికింపవా? చూతమా! చూతపల్లవాధర! నా
యర్ధాంగియెందు రాదా? కురవకమా! లతాలలితాంగిని నాజీవితేశ్వరి నవలో
కింపవా? మల్లికా! కాంతామతల్లికను విదర్భరాజసుతను సందర్శింపవా?
మాధవీ! మధురమధురమూర్తిని జనకరాజపుత్త్రిని గానవా? చంపకమా!
చంపకనాసను నామోహంపుబొమ్మను బొడగానవా! కేతకీ! కేతకీగర్భదళ
శరీర నాలక్ష్మి యిటువచ్చెనా? హరిణమా! హరిణచపలాయతాక్షి నాసీత
కొత్తోడనున్నదా? కరేంద్రమా! కరభోరువు నాభాగ్యదేవత యిందుఁగలదా?
అయ్యో! ఒకరును బదులాడరేల? నాయర్ధాంగిని విడిచినన్నందులకు మీరు
నాపయి నలుకవహించితిరా? హా! సీతా! చాలుమువలదు; నిన్నుఁ జూడక
నీరాముఁడుండఁజాలఁడు. నారాక తడవయ్యెనని యలిగి తరువుల డాఁగి
పలుకవా? గజగమనా! పోవలదు, నిలునిలుము; నన్నుఁ గనికరింపుము;
గోలతనంబు నేరని నీవు నన్నిట్లాడింతువా? వరవర్ణినీ! నన్నుఁ గనుఁబ్రామిఁ
జూతువా? అయ్యో! నీవుదాఁగనున్నను నీపసపుఁజీర నిన్ను దాఁపదు
సుమా. చారుదతీ! దుఃఖపరిదగ్ధుని నన్ను పేక్షింపవలదు—అయ్యో!
ఎంతయవివేకము! నాసీతయేయున్న నన్నిట్లు దుఃఖపెట్టునా?—రాకా
చంద్రముఖీ! రక్కసులు నిన్ను బొక్కలాడిరా? అయ్యో! నీముఖచంద్రుఁ
డేని వారికి జాలిఁగొలుపఁడయ్యెనా? కలకంఠీ! నీకలకలస్వనంబును విని
యైనను ఖలులు కఱఁగరైరా? మృణాళనాళకరా! నీవు దోయిలొగ్గి
యధిక్షేపించునప్పుడు నీకరకమలంబులేని వారికిఁ బ్రియంబులు గావయ్యెనా?
హా! సీతా! రాక్షసభక్షణార్థము నిన్నువిడిచి పోయితిఁగాఁబోలు!? అని
పలుతెఱంగుల విలపించుచు నున్మత్తునివలె వనమెల్లఁ గ్రుమ్మరుచు జడంబు
లనుగూడఁ బల్కరించుచు లతలను గవుంగిలించి పరితపించుచు వెదకి వెదకి
వేసారి సొమ్మసిల్లి తెలివిగాంచి 'అహో! ఎంతభ్రాంతి! దిక్కాలాద్యపరిచ్ఛి
న్నానవద్య మాయామంగళమూర్తిని నాసీతను భూతంబులు చెనకనోపునా?
తత్త్వమెఱింగియు నజ్ఞానవశంబున నిష్కారణ దుఃఖమనుభవించితిని గదా.
లోకులననేల? సీతా! కైలాటములిఁక మాని నీ వియోగభరాలసుని నీ
రాముని గరుణించి యెందున్నను వచ్చి నాకిఁ గనుపండువు సేయుము.
రమణీ! నీముద్దు కురంగశాబములు భవద్విరహచింతాతిరేకంబునఁ గన్నీ

రెట్లు దోర్చుచున్నదో చూడుము.—అయ్యో! ఎంతపిచ్చి! ఎక్కడిసీత! తమ్ముఁడా! అదిగో నాజనకుఁడు భార్యాశోకసమాసన్నమరణుని నన్నుఁ బరిగ్రహింప స్వర్గంబునుండి చేతులు సాచుచున్నాఁడు చూడుము. పోయెద; ఇఁక నన్ను మఱచిపొమ్ము. ఏమంటిని! ఆమాటసరిగాదు, అకాలమృత్యువువాతఁబడి చతుర్దశవర్ష వనవాసవ్రతభంగమొనర్ప లజ్జింపవా యని నాయన భర్జించుచున్నాఁడు. అయ్యో! జానకీ!

ఉ॥ అంచితరీతినాఁడట సభాంతరమందుఁ ద్రిశూలియిల్లుఁ ద్రుం
పించి గ్రహించి కూర్మివలపించి సుఖార్ణవరాశి నోలలా
డించి కుబుద్ధిఁగీర్తివఱెడించి దయాలవమేనిలేక వం
చించి యపూర్వచిత్రవధఁజేయఁగ నీవదియెట్టులోర్చెనో?॥

ప్రేయసీ! నీవు నన్నుఁ ద్యజించినను ద్యజింతువుగాక; నిన్ను నేను విడనాడి జీవింపఁజాలను. ఇదే ప్రాణత్యాగమొనర్చి నీ యొద్దకే వచ్చుచున్నా' నని వాపోవసాగెను.

రాముఁడట్లు జంబాలనిర్మగ్నకుంజరంబు క్రియ మహార్తింజెంది దుర్వారదుఃఖభాగుఁడు కాఁగా వానిశోకంబును లక్ష్మణుఁడు చూడనోపక 'అన్నా! దైన్యమువలదు; సీతాదేవి విహారప్రియయగుట యెఱుంగవా? ఆమె పుష్పంబులకై వనగుహాలంబోని యిందలి పొదరిండ్లు దూఱియుండును; అట్లు కాదేని స్నానార్థము చనియుండును; లేదా మనధైర్యంబును బరీక్షింపఁగోరి యెందేని డాగియుండును. అంతమాత్రానకే కొందలపడ నగునా?' యని యనునయోక్తులు వచించెను. రాముఁడు సుంత ధైర్యము వహించి ప్రియురాలు పుష్పాపచయార్థము చనెనో యని లతాగృహములు వెదకి వెదకి, విచిత్రధాతుసంగ్రహణాసక్తయై పోయెనో యని పర్వతప్రదేశ మెల్ల వెమకి వెమకి, హంసకారండవాదివిహగరమణీయపులినతలంబులఁ జూడఁ బోయెనో యని నదీతలంబులెల్లఁ దిరిగితిరిగి, జలవిహారోత్సుకయై తరలెనో యని కల్హారకమనీయ సరోవరంబులనెల్ల శోధించిశోధించి, విలాసార్థము డాగెనోయని కందరాంతరములు దూఱిదూఱి యెందును సీతను గానక దుఃఖాభిసంతప్తుఁడయ్యెను.

తమ్ముఁ డూరార్చుకొలఁది రాముని శోకం బతిశయించుచుండెను. నాడులయందలి బంధములు విలువిడములయ్యెను ; నయనంబులు పచ్చనై పరిభ్రమించెను ; కోలుడవాఱెను ; మాట రాదయ్యెను ; హృదయము క్రుళ్లి తాపు తప్పినట్లు తోఁచెను. ఊర్పులు నిడుదలై యంతస్తాపాతిశయంబును దెలుపఁజాలెను ; చిత్తము సంవిత్తముగాక భావనాప్రపంచంబు నెల్లఁజుట్టి ముట్టి సంచరింపఁజొచ్చెను. రాముఁ డవస్థాన శక్తిహీనుఁడై యొకచోఁ గూలఁబడి యర్ధాంగి కట్టెదుట నున్నట్లుగా భావించి 'ప్రేయసీ! ప్రవాక్రితింజేసి నీవు విలువెల్ల నశోకశాఖలఁగప్ప నాశోకంబు నినుపడింప నగునా? కదళీకాండోరుద్వయీ ! కదళీవనంబున డాఁగియుండుట తెలిసెను నీచేలతనంబు నేమనవలయును ? సహజస్పర్థగల కదళి నిన్ను దాచునా ? మంగళస్వరూపిణీ ! ఎలనవ్వు లొలయించుచుఁ గర్ణికారవనంబున విహరింతువా ? నీపరిహాసము చాలురమ్ము. సీతా ! పరిశ్రాంతుని నన్నుఁ గేలిసేయుదువా ? ఇది తఱిగాదు, వినుము. ప్రియా ! నీవు పరిహాసప్రియవగుట యెఱుంగుదు. పరిహాసవిశేషంబులకు నాశ్రయస్థానములు తగవుగదా. కళ్యాణి ! నీ విరహంబున నామది యట్లు పర్ణశాలయును శూన్యమయ్యెను. ఇందుండనోపను' అని కొంతదడవున్మత్తావస్థకుఁ జిక్కియుండి తెలివి గాంచి 'లక్ష్మణా ! నాసీత సజీవగా నిందెచ్చటను లేదు. ఉన్నచో నన్నింతగా నలసటఁజెందనీయదు. ఆతన్వంగిని రక్కసులు భక్షించిరో హరించిరో యుండును. అదిగో చూడుము ; మృగశాబనేత్రకుగా మృగంబులు వగచి కన్నీరు నిండుచున్నవి—హా ! ఆర్యా ! హా ! సాధ్వీమణీ ! కైకేయీ మనోరథంబును దీర్చితివిగదా—అయ్యో ! ప్రేయసీ ! నీతోడ నంతఃపురము వెడలి వచ్చితిని. ఏకాకిగా నందెట్లు చొఱనేర్తు ? సీతా ! చేతులార నిన్ను రక్కసులకు నప్పగించితిని. ఈపాటికి మననేల ? మిథిలేశ్వరా ! ఇఁకనిన్నెట్లు చూడనోర్తు? వనవాసాంతంబున నీవు నీపుత్రికనుజూడ వత్తువు. ఏమని నీకుఁజెప్పుదు ?—ఛీ ! ఎంతభ్రాంతి ! సీతాపరిత్యక్తుఁడు రాముఁడు మరల నయోధ్యయందుఁ గాలిడునా ?—లక్ష్మణా ! నన్ను మఱచి యయోధ్యకుఁజని నామాటగా భరతునకుఁజెప్పి వానికిఁబట్టముఁ గట్టుము ; తల్లులకు నానమస్కృతు లందింపుము ; నాతల్లి మాగతి విని మనఁజాలదు ; ఒకవేళ జీవించునేని యామెను గాపాడుము !' అని విలాపాశ్రయములైన దుర్వచనంబులు పెక్కు పలికి మరలఁ బ్రియురాలిని దలఁచి 'జానకీ !

సీ॥ నీమధురాకృతి నిరతంబుఁగనుచుంటఁ
గండోయికితెరంబు లిందవయ్యె,
నీనగువెన్నెట నిచ్చలునుండుట
మేనికిఁ జంద్రికల్ గానివయ్యె,
నీ నునుబల్కుల నిత్యంబువినుచుంటఁ
గర్ణపాళికి వీణ కఠినమయ్యె,
నీ కౌగిటిసుఖంబు నింపొది గాంచుట
నాత్మకు నొండేది యానదయ్యె,
గీ॥ నింద్రియములెల్ల నీయందె యిరవుకొనుట
నతివ ! నీతోడిదే ప్రాణమయ్యెనాకు
నీవు గల్గనినాఁడింక నీరజాక్షి
యుర్వి జీవచ్ఛవంబునై యుండనేల ?

అని విలపించి దారుణోద్వేగి యయ్యెను.

లక్ష్మణుఁడు రామునితలంపు గ్రహించి భయవికలవదనుండును వ్యాధితమనస్కుండును నై యెలుఁగెత్తి యేడ్చి యన్నను దుఃఖపరిశ్రాంతికై బహుభంగులఁ బ్రార్థించెను. రాముఁడు నిట్టూర్చి 'తమ్ముఁడా ! నావంటి పాపాత్ముఁడు పుట్టఁడు. పూర్వపాపఫలంబులెల్ల నిప్పుడు దుఃఖదుఃఖంబులుగా నాకుఁదాపరించెను. రాజ్యభ్రంశంబును బంధువియోగంబును పితృవినాశంబును మాతృపరిత్యాగంబు నిందొక్కొక్కటియు నాజవసత్త్వంబులను హరించెను. దావాగ్నిబోని యీదుఃఖాగ్ని నెద దాఁచి యిందు వచ్చితిని. ఇటు నాదుఃఖము పరమావధి ముట్టెను. గుండియలు వ్రీలెను ; హృదయంబు జీలెను ; ఇఁక మనఁ జాల' నని విషాదస్వరంబునఁ బలికి ప్రియురాలిని దలంచి 'హా ! సీతా ! రాక్షసులచేతఁజిక్కి నన్నెంత తలంచితివో గదా ! జానకీ ! పిశితాశనులు నిన్నెంత గాఱించిరో గదా ! దేవీ ! రక్కసులు నిన్నుఁ గబళించువేళ నీ వెంతగాఁ బరితపించితివో ! ప్రేయసీ ! ఈచలువరాతిన్నెపయి మనము గూర్చుండియుండఁగా నేనాడిన పరిహాసంబులకు నీమోముజాబిల్లిగురిసిన లేనగవు వెన్నెలల నెట్లు మఱతును ! జీవితేశ్వరీ ! గోదావరి నీకెంతయుఁ బ్రియంబగును. అటకుఁబోయి యుంటివా ? కమలాక్షీ ! పద్మములఁ దేఱఁజనితివా ? అలివేణీ ! ఒంటరిగావుండ

లేక పుష్పితతరుమండలంబును విహంగమ గీతామధురంబులైన వనాంతరంబుల విహరింపఁదరలితివా? అయ్యో! ఎంత భ్రాంతి! నాయర్ధాంగి పరమభీరువు నన్ను వదలి యడుగైనను బెట్ట సాహసింపదు. ఇది యెఱిఁగియు నడి గూఁటాపడుచున్నాను—అయ్యో! ఇది మిథ్యయని విశ్వసింపరాకున్నది. నాసీత బ్రదికియున్నదో లేదో తెలియదు. ఎవరును జెప్పువారు గాన రారు. ఏమిసేయుదు!—సరిసరి! సర్వసాక్షి సూర్యభగవానుఁడుండఁగా నొరులనడుగ నేల? సహస్రకిరణా! నీకనుమానము నెవ్వరికిని దరముగాదు. సర్వసాక్షివిగావున నీకుఁ దెలియక యేపనియు జరుగదు. నాప్రియురా లెందున్నది? రాక్షసులపహరించిరా? బదులాడవేల నీకును బగయైతినా? వాయుభగవానుఁడా! నీవు సర్వాంతర్యామివిగదా! నాచెలి వివరంబును దెలిపి నన్ను రక్షింపు' మని కడుంగడు దురపిల్లి విసంజ్ఞుఁడయ్యెను.

లక్ష్మణుఁడు వానిని మెల్లఁగా సేదఁదేర్చెను. కొంతవడికి రాముఁడు ప్రజ్ఞఁగాంచి 'జానకీ! క్లేశపరంపరలకు వాడి సకిచెడిన నాశరీరమునకుఁబింత నీసరససల్లాపామృతసేచనంబున వికాసముగాంచుచుండెను. ఇకఁ దరినిలువవద్దని వేఁడియు విలపించి కట్టెదుటఁ జూపుసారించి 'తమ్ముఁడా! ఈమృగంబులేలనో సారెసారెకు నన్నుఁ జూచుచున్నవి. నాప్రియురాలి వివరంబును నాకెఱ్ఱవి తెలుపనున్నట్లు వాని యింగితములు సూచించుచున్న' వని వాని వంకఁ జూచి 'మృగములారా! నాదేవి సంగతి తెలిసియున్న నాకుఁదెలిపి సుకృతముగావింపు' మనెను. ఆమృగంబులు దక్షిణాభిముఖములై నింగిఁజూచెను. లక్ష్మణుఁ డాభావంబును గ్రహించి 'అన్నా! నీ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగా నిమృగంబులు దక్షిణదిక్కును జూపుచున్నవి. అవలఁ జనుద' మనెను.

రాముఁడు సీతాన్వేషణకై తరలుట.

రాముఁడంతఁ దమ్ముని వెంటఁగొని దక్షిణదిశఁబట్టి కొంతదవ్వు చనెను. మార్గమునఁ బుష్పములు కొన్ని రాలియుండెను. రాముఁ డా ప్రసూనములను గుఱుతించి 'ఆహా! ఇవి నేను స్వయముగాఁ గోసితెచ్చి నాసతి తురుమున ముడిచితిని. రక్కసులు నాచెలినిఁ గొనిపోవునప్పుడు నాయింతి సిగలోనివి యిపు డిచట జారినవనుట నిజము. సూర్యభగవానుఁడును

వాయుదేవుండును భూదేవియు నాయభిజ్ఞానార్థము వీని నిందాఁక కాపాడిరి. వారికెంతయుఁ గృతజ్ఞుండనగుదు. నాసీత యీదారిం బోయెననుట నిర్వివాదాంశము. ఎందుఁ బోయియుండును? సంగతి తెలుపువారెవ్వరు! ప్రస్రవణగిరీంద్రమా! నాసఖి యెటుం జనెనో చెప్పుము. బదులాడవేల! సానుమంతుండవుగానుండఁ గోరుదువేని నామోహనాంగిని జూపు' మనెను. వానివచనంబులు గిరికందరములదాఁకి ప్రతిధ్వనులీనెను. ఆమాటలు శ్రోతలు ప్రత్యుత్తరముగా రాముఁడు భావించి 'నగరాజా! నీ మాటలు స్పష్టములు గావు. భాగ్యహీనుండను గావున నాతో స్పష్టముగా మాటాడ నిచ్చగింపవా? అంతమాత్రాననే నీకు గౌరవహానియగునా?' యని మహాకోపముదాల్చి కన్నుల నిప్పుకలు రాల్చుచు లోకదహనోద్యోగివలెఁ గాన్పించి తీవ్రబాణమొకండు సంధించి యాగిరినిగురిచేసి వదలనుండెను. అంతలోన వానియెదుట కాలిజాడలు కొన్ని కాన్పించెను. రాముఁడా జాడలను బరికించి 'లక్ష్మణా! ఈజాడ పురుషపదాంకితముగానున్నది. ఈజాడ చిఱుపదంబుల త్రొక్కిడిగానున్నది. మఱియు నిది భయభ్రాంతికిఁ జిక్కిన స్త్రీ యటునిటుఁ బరువెత్తుటను గూడ సూచించును. నాసతి రాక్షసభీతయై వానిబారితప్పించుకొనుటకై యీదారిం బఱతెంచి యుండు' నని పలికి యాజాడలంబడి మఱికొన్నియడుగులు చనెను. అచ్చటఁ దుత్తునియలుగాఁ దునిఁగిన విల్లును, భిన్నాభిన్నమైనరథంబును, రాలిపడియున్న బంగారుశకలంబులును, దెగియున్న పుష్పమాలికలును గానవచ్చెను. తత్సమీపంబున నొకతావు రక్తసిక్తమై యుండెను. రాముఁడవియెల్లఁ బరిశీలించి 'లక్ష్మణా! సందియంబుతెల్లఁ దీఱెను ఈపెద్దజాడ రక్కసునిది; ఇవి నాకలికి యడుగులు; ఈసువర్ణశకలంబులును విశీర్ణమాలికలును నాభాగ్యదేవతాలతనువల్లినుండి తెగి రాలినవిగాని వేఱుగాదు. అక్కటా! ఈరక్తసిక్తప్రదేశము నాయర్ధాంగిగతిని దెలుపకయే తెలుపుచున్నది. 'హా! జానకీ! నీగతి యిట్లయ్యెనా? ఇఁక నేనుండనేల?' యని కన్నీరునించెను. లక్ష్మణుఁడు కయిమోడ్చి 'అన్నా! భ్రాంతికిఁ జిక్కి శోకింపవలదు. ఇరువురుబలిష్ఠులు పోరాడిరని భావింతును; కానిచో రథాదులిందుఁ బడియుండనేల?' యనెను. రాముఁడు వాని మాటనందుకొని 'నాయనా! జానకి నిమిత్తమెవరో యిద్దరిందు యుద్ధమాడి యుందురు. మణిమయంబైన

యీచాపంబును బాలభాస్కరద్యుతినిబోని యీహిరణ్యకవచంబును సామా న్యులవిగా నుండవేమో. ఇదిగో తపనీయదండాతపత్రంబు ; అవిగో వాహ నచయంబులు ; అల్లవిగో భగ్నములైన సాంగ్రామికరథధ్వజములు. లక్ష్మణా! ఈశరాగ్రలను జూచితివా ! చతుశ్శతాంగుళపరిమితంబులును సువర్ణాగ్రం బులునైన యీసువర్ణసాయకంబు లేఘోరకర్మనిమిత్తనిర్ముక్తములై యొకని హరించెనోగదా ! అదిగో సారథిని జూడుము. వాఁడు వాగెలచేతను మునికోలనొక్కకరంబునను బట్టి యట్టె చచ్చియున్నాఁడు. అదిగో చా పగ్రాహుల యుష్ణీషంబులు తొలఁగవు ; వారిమణికుండలంబులు తళతళ లాడుచున్నవి ; నిలిచినవారలు నిలిచినట్లే వారెల్ల నూపిరివాసియున్నారు. ఏరెవరివారో యూహింపరాదు. ఎవరివారైననగుఁగాక. ఈయుద్ధసన్నా హంబెల్ల నాకానికి నిమిత్తముగానున్నది. సీతా ! రాక్షసులు నిన్నెంత బాధించిరోగదా ! హా ! ధర్మమా ! ఆజన్మముగా నిన్ను గాపాడుచుంటి. ఆకృతజ్ఞతయేని లేక గహనాంతరమందుఁ జిక్కి తోడుగానక యున్న యబలారత్నంబును రక్కసులు హరించుచు నీవు చూచుచుంటివా ! ఇంత కన్నఁ గృతఘ్నతగలదా ! అయ్యో ! ఒకరి నననేల ! నాపూర్వదుర్భాగ్యమే నన్నింతకుఁ దెచ్చెను. కష్టరేనినాఁడు గొఱ్ఱెగూడఁ గఱచుననుట సార్థక మయ్యెను. కటా ! గుణంబులు నన్నుఁబొంది విపరీతములాయెను.—సౌ మిత్రీ ! సైరణ నన్నువదలుచున్నది. మార్తాండుఁడు శీతచంద్రికలను మాపి లోకసంతాపకరుఁడై యుదయించునట్లు నేనిఁక సర్వసద్గుణంబులమాఁ ద్రోచి లోకంబులెల్ల నిరవకాశములొనర్తు ; గ్రహగతుల నరికట్టుదు ; పంచ మహాభూతంబులను నిర్మూలింతు ; ప్రపంచంబునెల్ల ధూళీకరింతు. కటా ! దేవతలనెల్ల నెంతో యొగ్గివేడితిని ; నామృదుభావంబును దైన్యలక్షణంబు గా వారు భావించిరి. వారి భ్రాంతి వదలఁగాక ? యని యుక్తంబులు పలికి కోపతామ్రాక్షుఁడై కోదండంబును బూని యాశీవిషంబులఁబోని శిలీముఖం బులను సంధించి నిలిచెను. రాముని యాకారంబదృష్టపూర్వంబును మహా మహోగ్రంబునై దీపించెను. అతఁడు ప్రళయకాలరుద్రావతారుఁడునాఁ గోఁచెను.

### లక్ష్మణుఁడు రామునకుఁ బ్రశాంతిఁ గూర్చుట.

లక్ష్మణుఁడు దుఃఖభయవిహ్వలుఁడై 'అన్నా ! శమదమాది సమస్త

కళ్యాణగుణంబులు నిన్నాశ్రయించి తనరుచున్నవి. సర్వభూతంబులకు హితమొనర్చుట నీపరమ దీక్షయై యున్నది; అట్టి నీవిట్లు క్రోధావేశము దాల్పనగునా? చంద్రుఁడు కాంతిని సూర్యుఁడు తేజస్సును వాయువు గమనవేగంబును భూమి క్షమను నిట్లొక్కొక్క రొక్కొక్క గుణంబును గలిగి ప్రకాశింతురు. నీవో సమస్తసద్గుణమూర్తివై విరాజిల్లుదువు. అపకారంబొనర్చుట యల్పులకు నైజము. వారియకార్యమునకుఁగా సమస్తనిరపరాధిలోకంబును నిర్మూలింతువా? దండనంబు దోషానురూపంబుగా నుండఁజోలుఁ గాని మితిమీఱవచ్చునా? నరపాలుఁడెన్నఁడేని శాంతికి విశ్రాంతి నొసఁగఁదగునా? రాజమాత్రులసంగతియే యిట్లుండగా సర్వభూతశరణ్యుండవును జరాచరపరమగతివియునైన నిన్నుఁ గూర్చి యేమిచెప్పనగును? అన్నా! నీకుఁ గీడుగోరు ప్రాణిగలఁడా? నామనవి చేకొనుము. లోకంబు ననుగ్రహింపుము. నీక్లేశములు నిన్నేగాదు ముల్లోకంబులను దురవగాహదుఃఖాబ్ధియందు ముంచెను. వానికిఁ బ్రశాంతిఁ గూర్ప నీవే దక్షుండవు. సీతాపహర్తను మన్నింపుమనుటగాదు. ఆధూర్తు బిలాంతరంబు చొచ్చినను పాతాళగర్భంబున దాగినను దేవగంధర్వాదిలోకంబులకు జన్నను విడువరాదు. వాఁడెందున్నను సాధించి లోకంబునకు మర్యాదఁ గావించుదము. అన్నా! ఇచ్చటరథమొక్కండుమాత్రమే శకలీభూతమై యున్నది. ఘోరవేష్టితంబును రుధిరబిందుసిక్తంబునైన యీప్రదేశంబును జూడఁగా నిందు ఘోరావహము సంఘటిల్లినట్లు స్పష్టము. సేనలజాడలు మాత్రము గానరావు. ద్వంద్వయుద్ధమాయని తలంచుటకు నొక్కనివిక్రమంబులు మాత్రమే తోఁచుచున్నవి. ఇదియెల్ల నేకవీరరణవిజృంభణంబుగా నిశ్చయింతును. నిజమెఱుంగనగు'నని కేలొగ్గివచించెను.

ఆమాటలెల్ల నిష్ఫలములయ్యెను. లక్ష్మణుఁడంత సాహసించి రాముని చరణంబులను గవుంగిటఁ గూర్చి 'అన్నా! దేవతలు సుధారసంబును వలె దశరథమహారాజు నిజతపఃఫలంబును నిన్నుఁబడసి నీగుణైకబద్ధుఁడై మనెను. ఆయన యచింతితోపనతమైన నీవియోగంబు కారణంబుగా దేవత్వము నొందెనని వింటిమి. రాజ్యచ్యుతినోర్చి పితృవియోగక్లేశంబును సైచి సత్యంబునుద్ధరించుటకుఁగాఁ జతుర్దశవనవాస వ్యసనంబును వరించితివి. నీవిట్లు గావించుట లోకంబునకు మార్గప్రదీపికార్థముఁ గదా. ఎంతటి

యాపదలువచ్చినను సహనంబును బాయరాదను నీతి నింతకాలము చాటించి యిప్పుడు నీవే యసహనంబును జూపుదువేని లోకము నిన్ననుసరించును. నీవలన నెంత యపకారము రానున్నదో యూహింపుము. అన్నా! లోకంబును దుర్గతిపాలు చేయకుము. లోకశరణ్యుండిట్లయినచోఁ బ్రాణికోటికి నిఁక దిక్కెవ్వరు? ఆపదలందువా? అవి సర్వలోకసహజంబులు. నహుషునికొడుకంతటివాఁడు శక్రునివలన నింద్రలోకచ్యుతిదుఃఖంబొందఁడా? మన కులగురువు వసిష్ఠమహర్షి యెంతటివాఁడో నీకుఁదెలియనిదిగాదు. అంతటివానికిఁగూడ నాపదలు రావయ్యెనా? ఆయన తననూర్గురుకొడుకుల నొక్కనాఁడు విశ్వామిత్రశాపవశంబునఁ గోలుపోవలేదా? భూదేవి యన్ననో సర్వలోకనమస్కృతగాని యేతన్మాత్రురాలుగాదు. ఆమెకుఁ గూడ నప్పుడప్పుడుఁ బ్రకంపనాదులు సంభవించుటలేదా? అనవరతధర్మైకనిరతులై లోకనేత్రంబులనెడి కీర్తిం గాంచి జగత్ప్రతిష్ఠకు నాధారభూతులుగా నున్న సూర్యచంద్రులు సయితము గడచి బ్రదికిరా? వారికిని గ్రహబాధ తప్పదయ్యెనుగదా. మహాభూతంబులకుఁ గూడ క్షయవృద్ధులు గలుగుచున్నవి. దేవత లెంతో శ్రమించి ప్రాణంబు లుంకువపెట్టి యమృతంబును సాధించి జరామరణంబుల దాఁటిరి. వారుమాత్రము సుఖదుఃఖంబులపాలగుటలేదా? అన్నా! నీవెఱుంగని జ్ఞానము గలుగదు. సర్వజ్ఞుండవు నీవు వనటం జెందరాదు. ఎట్టియాపదలు పైకొన్నను యథార్థజ్ఞులు వెనుదీయరు. దుఃఖంబులను జయించుట పురుషకార్యంబు. అన్నా! సుఖదుఃఖములు నేఁడు రమ్మనిన వచ్చునవిగావు. అవి పూర్వకర్మఫలంబులై ప్రాణులఁ బొరయుచుండును. దాఁపరించిన ఫలము సుఖమేగాని దుఃఖమేగాని యనుభవింపక తీఱదు. ఈరహస్యంబును నీవే యుపదేశించితివి. అన్నా! నీజ్ఞానమిప్పుడు శోకసుప్తమయ్యెను. దాని ప్రబోధనార్థం బిట్లు పలికితినిగాని వేఱుగాదు. నీపరాక్రమంబద్వితీయము, అప్రమేయము, నిఖిలలోక సంహారసమర్థము. దానిని దుష్టశిక్షణంబున వ్యయింపవలెనేగాని యొండు సేయరాదు' అని మహాభయభక్తులతో విన్నవించెను.

### జటాయువు రామునకు సీతావృత్తాంతము చెప్పుట.

రాముఁ డావచనంబులు విని యింత శాంతి వహించి 'లక్ష్మణా! సీతాపహారిని బరమధూర్తును మత్క్రోధంబునకు లక్ష్యభూతునిగా నొనర్చి

లోకకళ్యాణంబొనర్చునందాఁక నా యీతాపము చల్లారదు. ఈసమర రహస్యంబును గనుగొందమురా' యని వానిని వెంటఁగొని మఱికొన్ని పదములరిగెను. అటఁ గొండొకచోటఁ బర్వతశృంగమంతటి గృధ్రము నెత్తుటఁ దోఁగుచుఁ బడియుండెను. రాముఁ డాగృధ్రంబును గాంచి 'వీఁడుగో సీతనుహరించిన రక్కసుఁడు ; నాదయితారత్నంబును మ్రింగి మత్తుఁడై యీరూపమున నున్నాఁ' డని పలుకుచుఁ గ్రోధదుర్నిరీక్షణుఁడై భూమి గ్రక్కదలఁ బాదఘాతంబొనర్చి యప్పతగేంద్రునిపయికి విజృంభించెను. ఆపక్షిరాజు రామునిఁజూచి నురుగునెత్తురు గ్రక్కుచు దీనదీనస్వరంబున 'ఆయుష్మంతుఁడా! నేను జటాయువునుగాని రాక్షసుండగాదు. వనాంతరంబున దివ్యౌషధినివలె నీవెవ్వతెను వెదకుదువో యాసీతాదేవిని నాప్రాణంబులను రావణాసురుఁడు హరించెను. మీరిద్దఱు నాశ్రమంబునలేనివేళఁ జూచి యారాక్షసాధముఁడు నీదేవి నపహరింప యత్నించెను. వానిదుండగంబు నోర్వఁజాలక నేను వానిని ఢీకొని పెద్దయుంబోరితిని. అవిగో యచ్చటఁబడియున్న రావణచాపకవచరథసారథులే నాపోరినవిధంబుఁ దెలుపును. తుదకు వాఁడు నన్నుఁ జైకొని నాపక్షంబులను దెగవైచి రాజపుత్త్రిని గొని విహాయసమార్గంబునఁ జనె'నని చెప్పెను.

రాముఁడది విని దుర్భరమగుదుఃఖమొంది చేతివిల్లును జాఱవైచి జటాయువును గవుంగలించుకొని 'మిత్త్రమా! నావలన నీకీదురవస్థ గలిగినందులకెంతయు సంతాపింతును. ఖడ్గఘాతంబులకారణంబునఁ బ్రాణోత్క్రమణస్థితి మన్న నిన్నుఁ బెక్కుమాటల గాసిపెట్టరాదు. ఒక్కటి యడుగుదు. రావణుఁడు నాభార్య నపహరింపగా వానికి నేనేమి యొగ్గొనర్చితిని ? ఆ దుష్టునిచేతఁబడి నాయర్ధాంగి పరితపించెనా ? ఏదేని నాకుఁ జెప్పెనా ? ఆనిశాచరునిరూపపరాక్రమంబులెట్టివి ? వాని వాసస్థానమేది ?' యని యడిగెను. నావుడు 'రామా! రావణుఁడు మాయాప్రభావంబు నాశ్రయించి సుడిగాడ్పులులేపి కాఱుమబ్బులు గలిగించెను. ఆశ్రమంబెల్లఁ బెంజీకట్లు గప్పెను. ఆచీఁకటిలో నతఁడు సీతాదేవి నపహరించి యెత్తికొనిపోసాగెను. వైదేహీదుఃఖారావంబును విని నేను మేల్కాంచి సంగతి గ్రహించి యాపాపాత్ముని నిరోధించితిని. నాయనా! నాప్రాణంబులెగయుచున్నవి ; కన్నులు మూఁతపడెను ; మాటవెలువడదు. సీతాదేవి

నపహరించిన ముహూర్తంబును 'విందు' మందురు. ఆముహూర్తమునఁ బోయినవస్తువు మరల నచిరకాలముననే దొరకును. నీవు నీసీతను శీఘ్రకాలములోనే పడయుదువు. ఆశకుఁడు చేఁపకై యాసపడి గాలంబును మ్రింగెను. వెద్దకాలము మన' డని జటాయువు పలికి రక్తమాంసంబులు గ్రక్కి 'రావణుఁడు విశ్రవసుని యౌరసపుత్త్రుఁ' డనుచుఁ దలవాల్చి కాళ్ళుసాచి ప్రాణంబులు వదలెను.

జటాయు దహన సంస్కారము.

రాముఁడు జటాయుమరణంబునకు నత్యంతశోకకర్శితుఁడై 'లక్ష్మణా! ఏన్ని వేలయేండ్లు బ్రదికినను బ్రాణికిఁ జావుఁజావు తప్పదుగదా. కాలంబు నతిక్రమింపఁ దరముగాదు. ఈపక్షిరాజు నాకొఱకుఁగాఁ దన ప్రాణంబులను గోలుపోయెను. పరోపకారబుద్ధులు మృగపక్షిజాతులందును గలుగుననుటకు వేఱునిదర్శనంబు వలయునే? జటాయువునకైన నాదుఃఖం బింతనరాదు. ఈమాన్యునకు నేను చేతులార దహనసంస్కారమొనర్చి కృతకృత్యుండ నగుదు' నని పలికి, కట్టియలేఱి తెచ్చి చితిపేర్చి యందా శవంబునుంచి 'గృధ్రరాజా! నీమేలుమఱువరాదు. గృహమేధులు బహుయజ్ఞంబులొనర్చి యేలోకంబును బడయుదురో, ఆహితాగ్నులకు నేది సంప్రాప్తమగునో వానప్రస్థులకు నేది లభించునో సన్న్యాసి యెందుఁజనునో భూదాతలు దేనిఁబడయుదురో యాయుత్తమలోకంబులు మత్సంస్కృతుఁడవు నీకగుఁగాక' యని వాయువునుమథించి రగిల్చిన యగ్నిచేత వానికి దహనక్రియ లాత్మబంధువునకుఁ బోలె సమంత్రకంబుగా నొనర్చి, కేసరిమృగంబులను జంపితెచ్చి తన్మాంసంబున వానికిఁ బిండప్రదానంబును బితృదేవతాకమంత్రపురస్సరంబుగాఁ గావించి నదీతోయంబుల లక్ష్మణునితోడ జలతర్పణం బిచ్చి సీతను వెదకువాఁడై నిరృతిదిశనుబట్టి చనెను. జటాయువు రామసంస్కారమహాత్మ్యంబున శాశ్వతపుణ్యలోకమొందెను.

రావణుఁడు సీతాదేవిని లంకకుఁ దెచ్చుట.

అట సీతాదేవి తనదురవస్థను జటాయుదుర్మరణంబును రక్కసుని దుండగంబును దలఁచి తలఁచి నిజదుఃఖరోషంబులను నేత్రకషాయకాంతులఁ దెలుపుచు 'రావణా! మాయామృగవ్యాజంబున నాపతిని మోసగించి దూ

రము పంపి యాయన లేనితరుణంబున నన్ను బలాత్కారముగాఁదెచ్చుట శౌర్యమా ? నీయక్రమంబును నిరోధింపవచ్చిన జటాయువును బుణ్యాత్ముని వధించి మహాపాతకంబు నొడిగట్టితివి. పరాంగనాపహరణనింద నీకుఁ గల కాలము తప్పదు. వడివడిఁబఱతువు. శూరుండవేని నీకింత భయమేల ! నిశాచరా ! నీమేలు గోరుదువేని నన్ను విడిచి పరమదయామూర్తియైన నా పతిని శరణు వేడుము. నావల్లభుఁడు శరణత్రాణదీక్షాధురంధరుఁడు గావున నీ తప్పు మన్నించి నిన్ను రక్షించును. అట్లుచేయవేని నీకు మృత్యువు తప్పదు. ఆసన్నమరణులు రక్తవాహినియైన వైతరణీనదిని నసిపత్రవనంబును దప్తకాంచనపుష్పవైడూర్యపత్రలోహమయకంటకంబైన శాల్మలీవృక్షంబును గాంతురు. అది యెల్లవేని నాచెప్పినట్లొనర్పుము. దవ్వు చని చావు తప్పించుకొందునని తలంతువుగాఁబోలు. కాలపాశంబునకు దవ్వు దాపులు గలుగవు. అది నిన్ను వెంబడించుచునే యున్న' దని చెప్పెను.

రావణుఁడామాటలు చెవిఁబెట్టక గమనవేగంబు నినుమడించి వాయుపథమునఁ జనసాగెను. సీతాదేవికి రక్షణంబెందుఁ గానరాకుండెను. ఏమి చేయుటకు నామెకుఁ దోపఁదయ్యెను. ఆమె యట్లు పరితపించుచు మింటనుండి తనదృష్టినిఁ గ్రిందికి సారించి యచ్చటఁ గొండొక నగాగ్రంబున వానరులేవురుండుటగాంచి వారేనియుఁ దనసంగతిని రామునకు నెఱిగింతురు గాక యను నాసతో నిజాభరణంబుల నొలిచి చీర కొంగుచించి యందవి మూటఁగట్టి దానిని వారినడుమఁ బడవైచెను. ఆమూఁట తటాలున నవ్వానరులమధ్యఁబడెను. వారందులకు నాశ్చర్యపడి తలయెత్తి యసురయొకఁడు కొండొకస్త్రీని నెత్తికొని పోవుచుండుటయు నామె యాక్రోశించుచుండుటయుఁ గాంచి శోకపరీతులై తదేకదృష్టిఁ జూడసాగిరి. వారట్లు చూచుచుండఁగానే యారక్షోవీరుఁడు పంపాసరోవరము దాఁటెను.

రావణుఁడట్లు పంపాసరస్సును దాఁటి లంకాభిముఖుఁడై నదీనదంబులను వనశైలంబులనుగడచి సాగరంబును సమీపించెను. సముద్రుఁడా రాక్షసునికుటిలవర్తనంబును జూడనోపక వైముఖ్యుఁడయ్యెనోయన నిస్తరంగుఁడయ్యెను. గగనస్థులైన సిద్ధచారణు లానిశాచరునిపయి శాపంబులు గురిసిరి. దశకంధరుఁడవియెల్ల లెక్కసేయక కడలి నతిక్రమించి యొడఁ

## కబంధుఁడు.

అంతట రామలక్ష్మణు లందుండి బయనమైరి. మార్గమధ్యమున లక్ష్మణునిఁ దటాలున దైన్యంబు పైకొనెను. అతఁడు పరమఖిన్నుఁడై 'అన్నా! ఏమో నాకు వెఱపు దోఁచుచున్నది; నాయెడమభుజంబు పెల్లదరుచున్నది; దుర్నిమిత్తములు పెక్కుగానవచ్చుచున్నవి; సద్యోభయంబును శంకింతు. అదిగో వంజుళకపక్షి దారుణముగాఁ గూయుచున్నది. ఇది జయసూచకము. అయిననుఁ బరాకువలదు' అని పలుకుచుండఁగా మహాభీకరధ్వని యొకటి రేగి వనమెల్ల మాఱుమ్రోయించెను. అధ్వని వలన వారివ్వరుఁ బోయి

"చ॥ ఉరమునయందుఁ గన్నును బృథూదరదేశమునందు నోరుఁ బ్ర
స్ఫురితభుజద్వయంబుఁ గులభూమిధరోన్నతభావముం గరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్త్వ ఘ
స్మరుఁ డగుచున్నవానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి రచ్చటన్॥"

ఆభూతము యోజనాయతంబులైన తనబాహువులను జాచి యందినగజశార్దూలంబులను బట్టి మెక్కుచు వసవల్చుచుండి రామలక్ష్మణులను జూచి వారివంకఁ దన హస్తములను జాచెను. సూదంటురాతికి నుక్కుతునియలు వోలె దాని కరంబులకు వారు దగుల్కొనిరి. లక్ష్మణుఁడు మహాభీతినొంది 'దీనిహస్తంబులు సమాకర్షణ శక్తిమంతములుగా నున్నవి. దీనికిఁ జిక్కితిమి; తప్పించుకొను వెఱవు దోఁపదు. ఇది యాతకమనలనుఁ బోనీయదు; ఇరువురము మడియుటకన్న నొక్కరైనను దక్కుట యుక్తము. అన్నా! నీవలన నెంతో కార్యము జరుగనున్నది. కావున నన్ను దీనికి బలి యిచ్చి నీవు తొలఁగి చని సీతాదేవిని బడసి పితృపైతామహమైన రాజ్యంబును బాలించుచు సుఖముండుము. నన్ను మఱువవలదు' అని దీనస్వరమునఁ జెప్పెను.

రాముఁడు తమ్మునకు ధైర్యము చెప్పసాగెను. అంతలోనఁ దద్భూతము వారినుద్దేశించి 'మీ రెవరు? దైవము నాకుఁగా మిమ్మిటకుఁ బంపెనా! నానోరు సొచ్చితిరి; ఇకఁ బ్రాణాపేక్ష వదలుఁ' డని మేఘగర్జనధ్వనిఁ బలికెను. దానిస్వరంబునకు రాముఁడులికిపడి 'తమ్ముఁడా! నాక్లేశములెల్ల నేటితో సరిపోనున్నవి. కాలబలంబు నెదిరింపరాదు. కాలవాహినికి రణశౌండీర్యములు సయితము సైకతబంధనంబులగును. ఈభూతము మనలను మ్రింగనున్నాఁడు.

ఇతనిపరాక్రమంబెల్లఁదదీయభుజంబులందు మూర్తీభవించి యున్నది. ఇతఁకు ప్రతీకారసమర్థుఁడు గాఁ డోఁపఁడు. ఇట్టివానిని క్రతుమధ్యకాలంబునఁ జిక్కిన పశువును బోలె వధింపరాదు. హస్తంబులను ఛేదించి యితని నిర్వీర్యు నొనర్చెద మనెను. లక్ష్మణుఁడు వల్లెయనెను. వారంతట నాభూతంబు భుజంబులరెంటిఁ జెరి యొకటి త్రుంచిరి. అది భూనభోంతరాళంబులు పగులునట్లుగా బొబ్బరించి నేలఁబడి నెత్తుట జొత్తిల్లుచు 'ఆర్యా! మీరెవ్వ' రనెను. లక్ష్మణుఁడాభూతంబునకుఁ దమవృత్తాంతంబును సంగ్రహముగాఁ జెప్పి 'కబంధాకారముననున్న నీవెవండ' వనెను.

నావుడు 'రాఘవులారా! మీకు స్వాగతము. నాభాగ్యపరిపాకవశంబున మీసందర్శనము నేఁడు నాకు లభించెను. నన్నుఁగబంధుఁడందురు. నేను తొల్లి దనువంశజాతుండైన శ్రీయనువానికి జన్మించి బ్రహ్మను గూర్చి తపంబొనర్చి వానివలన దీర్ఘాయువ్వను బడసి గర్వోద్ధతుండనై కామరూపబలంబున వివిధరూపంబులు దాల్చి వనాంతరవాసులైన ఋషులను వెఱపించి బాధపెట్టుచుంటిని. కొండొకనాడు స్థూలశిరుఁడను మహర్షి గందమూల సంగ్రహణార్థము వనంబునకు వచ్చెను. నేను రాక్షసరూపంబుఁ దాల్చి వానిని ధర్షించితిని. ఆతపోనిధి నన్ను శపించెను. ఆశాపబలంబున నన్నీయాకారము వదలదయ్యెను. నాతప్పుచెప్పి వానినెంతో మ్రొక్కుకొంటిని. ఆదయానిధి నన్నుఁ గరుణించి 'దశరథరాముఁడు కారణాంతరమున నివ్వనంబునకు వచ్చును. అప్పుడు వానివలన నీభుజములు ఖండితములగును; నీవు దహింపబడుదువు. అప్పుడు నీసహజమంగళవిగ్రహము నిన్నుఁ బొరయు' నని శాపాంతము ననుగ్రహించెను. ఆ పుణ్యకాలంబును బ్రతీక్షించుచుంటిని. అనంతరము మరల దేవేంద్రుని ధర్షించితిని. వేల్పురాయుఁడు నాపై వజ్రాయుధంబును బ్రయోగించెను. దానితాకునకు నాతలయుఁ దొడలును నాయుదరకోశంబు జొచ్చెను. అట్టిస్థితితో జీవింపనోపక 'దేవదేవా! నన్నువధించి పుణ్యముఁ గట్టుకొను' మని వానిని వేడితిని. ఆనిర్జరవల్లభుఁడు నన్ను గని 'బ్రహ్మవరము వమ్ముగారాదుగావున నీప్రాణయంబు చెల్లదు. నీజీవనార్థము నీయుదరంబున దంష్ట్రాకరాళవదనంబును యోజనాయతములైన బాహువులనిచ్చితిని.

నీబాహువులు సమాకర్షణసామర్థ్యము గలిగియుండును. నీచేయిపాఱినంతలో నెట్టిప్రాణియైనను నిన్ను దప్పించుకొన నేరదు’ అని చెప్పి చనెను. నాఁడుసుత యిందు పడి యెట్లో జీవించుచు ఋషివచనంబు నమ్మి యూపిరి పట్టుకొని యున్నాను. నాకు మీరగ్నిసంస్కారంబును గృపసేయవలయు. నాకు దివ్యజ్ఞానముగలదు. అది యిప్పుడు శాపకారణంబున నిప్పులుగప్పిన నిప్పువలె నున్నది. దహనక్రియానంతరం బాజ్ఞానము యథాపూర్వము ప్రకాశించును ; మీకు మతిసాచివ్య మొనర్చి కూర్చు మిత్రుని దెలుపుదును. వానివలన నీయీప్సితార్థము చేకూఱును. నా చెప్పనున్న యతఁడు కొం డొక కారణంబున జగమెల్లఁ గ్రుమ్మరెను. ఆతం డెఱుంగని రహస్యస్థాన ముండదు. ఆతఁడు న్యాయవృత్తుఁడు గావున నీకెంతయు స్నేహపాత్ర మగు’ ననెను.

రామలక్ష్మణులంతట నక్కబంధుని గిరిప్రదరంబున వైచి దహించిరి. కబంధుఁడు దివ్య మాల్యాంబరధారియై విధూమాగ్నికరణిఁ దేజరిల్లుచు లేచి విమానమెక్కి ‘రామా! సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబు లనెడి యుపాయంబు లాఱుగలవు. విజ్ఞులు సమయోచితోపాయంబు నాశ్రయించి కార్యంబును సాధింతురు. ఆపన్నుఁడు సహాయార్థము తనయట్టివాని నే చేరవలయును. సుగ్రీవుఁడను వానరముఖ్యుఁడు ఋక్షరజఃక్షేత్రంబుననున్నాఁడు. సూర్యాంశజుఁడు గావున నతఁ డున్నతవంశప్రసూతియని వేఱఁ జెప్ప నక్కఱలేదు. అతఁడు తనయన్నవలనఁ దఱుమఁబడి పరిభ్రష్టుఁడై కపివీరులనలువురను దోడఁగొని ప్రకృతము ఋశ్యమూక పర్వతము నాశ్రయించి యున్నాఁడు. వాఁడు బలపరాక్రమతేజోశాలియు సత్యసంధుఁడును నీతిసంపన్నుండును దక్షుఁడును బ్రగల్భుఁడు నగుట నీకెంతయు నుపకరించును. రామా! కాలము దురతిక్రమము ; రానున్నది రాకమానదు ; అనివార్యమచింత్యము. సుగ్రీవునితో మైత్రి సేయుము. చెలిమి యగ్నిసాక్షికమగు నేని ద్రోహబుద్ధికి నెడమీయదు గావున నీవు నట్లే యొనర్పుము.

“మ॥ తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమ కార్యంబు ఘటించుచుం బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్

దనుకై యన్యహితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్, వృథా వ్యార్థగం
గముగావించెదు వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యోరికిన్ ॥

అని చెప్పలువచించిరి. సుగ్రీవుండు శూరుండు. అతండు సీతాదేవి నెందున్నను సాధించి తెచ్చి నీకిచ్చును. అదిగో పడమటిచెట్టు నేరేళ్ళవరుస గానగలదు. ఆమార్గము ద్రొక్కి యమృతనిష్యందియైన జంబూఫలంబు లారగించుచుం జనుము. కొంతదవ్వు చనినంతట నిరంతరమధుస్రావియైన నందనవనము గలదు. అదాటిపోయినచోఁ బంపాసరోవరంబును జేరుదువు. అందలి హంసక్రౌంచాదివిహగంబు లెన్నఁడును భయం బెఱుంగవు గావున మీకు బెదరొందవు. వానిమధురరుతములు మీకుప్రీతులవిందగును. ఆకొలని తోయంబులు స్ఫటికనిర్మలంబును వివిధపుష్పమకరందమధురంబునై కమలగంధముల నీనుచుఁ జల్లగా నుండును. ఆనీరు గ్రోలఁగా వగుపోయి యింతనరాదు. అచటి లతాతరుగుల్మంబులు నానాప్రసూనమాలికామనోహరములై కమ్మని తెమ్మరలువీచి మీత్వగింద్రియమును దనర్చును. అందలిపొందామరలు వాడుటనఁగా నెట్టిదో యెఱుంగవు. అవింతకు మీ రాశ్చర్యపడక మానరు. అచటి ప్రసూనంబు లెన్నఁడును రాలవు. ఇదంతయు మతంగమహర్షిప్రభావము. ఆమహానీయుఁ డందుండెను. గుర్వర్థము శిష్యులు వన్యపదార్థంబులను మోచి తెచ్చుచు భారక్లేశమున వారు చెమర్చినప్పుడు వారిస్వేదకణంబులు నేలరాలి తపోవిశేషంబున మొలచి పుష్పించి యందు విరాజిల్లుచున్నవి. అందువలన నవి యెన్నఁడును వాడువాఱక వికసించి యుండును. మతంగమహర్షి గాని వానిశిష్యులుగాని యిప్పుడచట లేరు; శబరియను స్త్రీ యొక్కతె మాత్ర మందుఁ గలదు. ఆమెకు నీసందర్శనభాగ్యంబున స్వర్గప్రాప్తి కాకున్నది. రామా! పంపాపశ్చిమతీరంబున రహస్యాశ్రమపదం బొండు గలదు. మతంగమహర్షి దానిని నిర్మించెను. అందున్న మాతంగులకు లెక్కయే గలుగదు. ఆయాశ్రమ పురోభాగంబున ఋశ్యమూకమున్నది. ఆపర్వతశిఖరంబునఁ బరుండినప్పుడు కలవచ్చెనేని యది తప్పక జరుగును. అనగంబును బాపాత్ముఁడొండె దురాచారుఁడొండె డాయనోపఁడు. ధూర్తులెవరేని యుపేక్షించి యాశైలంబు నారోహించిరేని యారాత్రి నిద్రాసమయంబున వారిని రాక్షసులు వధింతురు. ఆకొండయందు బిలమొకటి గలదు. దానిని బెనురాయి యొకటి కప్పియుండును.

అవిల ప్రాగ్భాగంబున శీతోదక హ్రదమున్నది. సుగ్రీవుఁడు నిజానుచరుల తోడ నచ్చిలంబుననుండు' నని చెప్పి చనెను. రామలక్ష్మణులు వానిమాట ప్రకారము పంపాసరోవరమునకుఁ దరలిరి.

రావణుఁడు సీతాదేవికిఁ బండ్రెండునెలలు గడవిచ్చుట.

అట సీతాదేవి యట్లు బందీకృతయై రాక్షసాంగనలమధ్యఁ జిక్కి సుడిగాలికి నడిసముద్రంబునందలి యోడచందంబునను, వ్యాఘ్రయూథంబెడపి జాగిలంబుల నడుమఁబడిన లేడివలెను, దహాతహాపడుచుఁ బరితపించుచుండెను. రావణుఁడు కొండొకనాఁడు మదనప్రేరితుఁడై యామెకడకు వచ్చి 'సీతా! నీమాధ్యంబునకు మేర గలుగదా! ఎన్నాళ్ళు కన్నీళ్ళఁ దోఁగినను ఫలముగలదా? రారమ్ము నాయంతఃపుర విలాసంబులను జూతువుగాక' యని పిలిచి బదులాడమికిఁ గినిసి యామెను బలాత్కారముగా నీడ్చికొనిపోయి, రత్నచిత్రితకుడ్యంబులతో వజ్రవైడూర్యదంతవికార స్తంభములతో హేమ మయగవాక్షములతో సొబగారు హర్మ్యప్రసాదములందుఁ ద్రిప్పి, మనో హారపుష్కరిణులను జూపి, లతామండపమనోజ్ఞములైన యుద్యానవనంబుల నడిపించి యథాస్థానముజేర్చి 'సీతా! నాకోశంబు నవనిధులచేతనిండి యున్నది గావున ధనమునకుఁ గొదువగలుగదు. ధైర్యపరాక్రమవంతు లగు రాక్షసవీరులు వేనవేలు నాకనుసన్నల మెలంగుదురు. వారినిఁగాలువఁ దరముగాదు. భోగ్యవస్తువులన్ననో యిచ్చటఁ గలుగనివి ముల్లోకములందును లేవు. నాప్రణయంబు గైకొనుము; మాయెల్లరకు నీశ్వరివై విలసిల్లుము. రాముఁడిటువచ్చునని పేరాసతోనున్నావు. ఈలంకాపట్టణము శతయోజన విస్తీర్ణసాగరమేఖలావలయితమై యున్నది. దేవాసురులుఁగూడ నిందు రాఁ జాలరు. నరాధముని సంగతి చెప్పవలయునా? జానకీ! రాజులకు రాజ్యంబు ప్రాణాధికము; అట్టిరాజ్యంబును హస్తగతమైనదానిని గోల్పోయి మునిజనదీనవృత్తినవలంబించి కందమూలపర్ణంబులేరి తిని యడవులంబట్టి ప్రాఁకులాడుచున్న రాముఁడు తలంపునఁగూడ నిందురాఁజాలఁడు. ఆ కించనునికైన నీయడియాసలు మానుము. ఒకవేళ నతఁడెట్లో యిందువచ్చుఁ బో. వచ్చినను నన్నతఁడుఁ బడయఁగలఁడా? మంగళకరీ! నాభుజాపరి పాలితను నిన్ను చతురాస్యుఁడుఁగూడఁ బెనక నేరఁడు. మదవతీ! కొఱ

మాలిన యూహాలకుఁ జిక్కి జవ్వనంబును వ్యర్థసేయకుము. లంకేశ్వరునైన నన్నేలి జన్మసాఫల్యముఁ గాంచుము. నీప్రాక్తనచరితపాపంబులెల్ల వనవాసక్లేశప్రాయశ్చిత్తంబున సమసిపోయెను ; ఇప్పుడు శుభోదయకాలము ప్రాపించెను. ప్రాప్తభాగ్యంబును త్రోసిపుచ్చి పదంపడి పశ్చాత్తాపపడుట వివేకము గాదు. కళ్యాణీ! దుఃఖమేఘపటలిని త్రోచిపుచ్చి నీవదనేందుబింబచంద్రికలను నాయంతఃపురమునఁ బఱచి నాకు సంతసముఁ గూర్పుము. అట్లుసేయుట ధర్మలోపమని వెఱతువా ? పరయోషాసంబంధము శాస్త్రవిహితంబగు. మరుఁడే యిందులకుసాక్షి ; ప్రేయసీ! వేయేల ? ఎవనికిలను ముక్కంటికిఁగూడ వంగినమస్కరింపనో యట్టినాతలలుపదింటితో నీకు మ్రొక్కెదను ; నీ దాసుని బాలింపు' మని బహుప్రకారంబుల ప్రార్థించెను.

సీతాదేవి వాని యసంగతప్రలాపంబులకు శోకకర్శితమానసయై తనకు వానికి నంతరముగా గడ్డిపఱకను త్రుంచి వైచి 'ఏమహనీయుఁడు సత్యసంధుఁడగు దశరథమహారాజునకుఁ బ్రియపుత్త్రుఁడో, ఏధర్మాత్మునిపేరు ముల్లోకములందుఁ గీర్తితమై దురితకలిలంబును హరించునో, యట్టిరాముని కూర్మిపత్ని యిట్టి యవినయోక్తుల విననోపదు. జనస్థానరాక్షసనిర్మూలనవార్తవలన గుండియలు వ్రీలి సడిచెడి పిఱికిపందవై రామలక్ష్మణులకు వెఱచి యరక్షితను దొంగిలితెచ్చితివి. ఇంతకన్న మగవానికిఁ దలవంపుగలదా ? ఇట్టి యనదవు నీవు నీమేటితనంబును బొగడ లజ్జింపవా ? ఉత్తుంగతరంగంబులతాకునకు నదీకూలంబట్లు రామజ్యావిముక్తశితశిలీముఖంబులకు నీతనువు తుత్తునియలై రూపు మాయనున్నది. రావణా ! ఎల్లరకు నజేయుఁడవని విఱ్ఱవీఁగుదువు. రాముని సంగతి యెఱుంగవు గావున నీవట్లనుట వింతగాదు. నీలావు నీబిగువు నీపొగరు సమస్తము నశించుకాలము వచ్చెను. నీకు జీవితశేషమున్నట్లు దోఁపదు. కావుననే యిట్టి దుర్బుద్ధి నీకు జనించెను. ఎవఁడు సంకల్పమాత్రంబున భూనభోంతరాళంబులను తలక్రిందుసేయఁగలఁడో, ఎవఁడు తేఱి చూచెనేని సప్తజలధులింకి బీఁటలు వాఱునో, యట్టిరామునకు సాధింపరానిది గలదా ? ఆమహనీయుఁడు తన సీత నిందుండి కొనిపోఁజాలఁడా ? చరాచరంబు లేకమై నిల్చినను వానికి నడ్డమగునా ? ఇఁక నీజల్పములు మానుము. రాక్షసాధమా! నన్నుఁ దాకనుంకింపకుము. శాలామధ్యస్థాపితంబును స్రుగ్భాండమండితంబును ద్విజమంత్రపూతంబునునైన యజ్ఞ

వేదిని జండాలుఁడట్లు రామకోదండసంరక్షితయు లక్ష్మణపరాక్రమశ్రీకలితయు బతివ్రతాధర్మసంభావితయునైన సీతను నీవు ముట్టుదువేని నీతలయు వేయివ్రక్కలగును. కామాంధకా ! రాజహంసి గగనతరంగిణీకనక కహ్లార క్రీడాపరతంత్రయగుఁగాని కసవుమెసవిజీవించు నీరుకాకివలెఁ బంకంబునఁ బొర్లాడునా? నృశంసా ! నీనీడయేని నాపయిఁ బాఱరాదుపొమ్ము’ అని పరుసంబుగా భాషించెను.

రావణుఁ డామాటలకు గగుర్పాటొంది క్రోధవివశుఁడై ‘సీతా ! స్త్రీవగుట నిన్నోర్చితి ; పదురెండునెలలు గడువిచ్చితి. ఆలోన నీవు నా మనంబు సేయవేని సూదకులు నిన్నువండి భక్షింతురు. ఇదే హెచ్చరిక' యని కఠోరంబుగాఁ బలికి రక్షక రాక్షసాంగనలనుజూచి ‘ఈమత్తకాశినిని గొనిపోయి యశోకవనాంతరంబున నుంచి మంత్ర తంత్ర తర్జనాదిప్రయోగంబుల నాకు వశవర్తినిని గావింపు’డని యాజ్ఞాపించి చనెను. వారు సీతాదేవిని గొనిపోయి యశోకవనంబున నుంచిరి.

### శబరి.

అటు రామలక్ష్మణులు బయలుదేరి వనసౌభాగ్యవిశేషంబుల నవలోకించుచు శబరియాశ్రమముఁ జేరిరి. శబరి వారికి యథార్హపూజలు గావించి కేలుమోడ్చి ‘స్వామీ ! నా యొనర్చిన గురుసేవాఫలంబుగా మీ శుభదర్శన భాగ్యంబు నాకుఁ జేకూరెను. నేఁడు నాకు జన్మసాఫల్యమయ్యెను. నీ దివ్యపదము చిత్రకూటంబును మెట్టిననాఁడే మతంగమహర్షి శిష్యులెల్లను విమానారూఢులై స్వర్గంబునకుఁ జనిరి. వారట్లు పోవుచు ‘శబరీ ! రామ లక్ష్మణులిందు వత్తురు ; వారికి సపర్యలొసంగుము ; రామసందర్శనంబున నీకుఁ బునరావృత్తిరహితపుణ్యలోకంబుగలుగు’ నని సెలవిచ్చిరి. నాఁటి నుండి మీరాక నిరీక్షించుచున్నదాన. మీకొఱకు వన్యఫలంబులను సేకరించియుంచితి' నని వినయభక్తిమధురంబుగా నుడివెను. రాముఁడు సంతోషభరితచిత్తుఁడై ‘శబరీ ! ఇచ్చటిసంగతి కబంధుఁడుచెప్పెను. ఇందలి వింతలఁ జూడఁగోరుదు’ ననెను. అయింతి వారికి నాశ్రమంబెల్లఁజూపి ‘స్వామీ ! భావితాత్ములు నాగురువులు యజించిన యజ్ఞవేది యిదిగో. వారితపఃప్రభావంబున నిది నేఁటికిని వెలుఁగుచున్నది. ఆమహర్షి యుప

వానప్రస్థకృత్యములవలనఁ గదలియాడనైన శక్తిలేకుండెను. అట్లుండియు నమ్మహాత్ముఁడనుదినంబు సప్తసాగరతోయముల స్నానమొనర్చుచుండెను. అది యెట్లు సాధ్యమందురా! ప్రాతఃకాలమునలేచి యాయన సముద్రములను స్మరించును. అవి పొంగి వానికడకు వచ్చును. ఆయన తజ్జలములాడుచుండును. అట్లాయన తోయములాడి యాఱవైచిన వల్కలంబు లవి గో వృక్షాగ్రముల నేఁటికిని దడియాఱవు. దేవకార్యార్థము మహాత్ములు కలువపూలను బుష్పములను గూర్చుచుండిరి. అవిగో యాదండలింకను వాడవాఱవు. మహాత్మా! ఇఁకఁ జూడఁదగినవియు జెప్పఁదగినవియు లేవు. ఆజ్ఞయేని నాయీ తనువును దొఱఁగి నాగురుచరణసాన్నిధ్యముఁ జేరుదు' ననెను. రామలక్ష్మణులు శబరి కోరికయు సంతసించి 'యథాసుఖము పొమ్మ' నిరి. శబరి యంత సమాధి యోగంబునఁ దనుత్యాగమొనర్చి జ్వాజ్వల్యమాన దివ్య శరీరయై స్వర్గంబునకు నిర్గమించెను.

పంపా సరోవర సందర్శనము.

రాముఁడు మునిజనప్రభావంబును జింతించి చింతించి 'లక్ష్మణా! మహాత్ములైన మునుల యాశ్రమంబులను సందర్శించుటవలనను బుణ్యతోయంబులాడి పితృతర్పణంబులొనర్చుటవలనను మన యమంగళంబులెల్ల నేఁటితోఁ దీఱెను; మనకు శుభంబుపస్థితమయ్యెను. నాహృదయము నేఁడు మహోల్లాసవిస్ఫారితమై యలరారుచున్నది. సుగ్రీవునిఁ జూచుతమి యిందు నిలువనీయదు. పంపాసరోవరంబునకుఁ బోవుదము రమ్మ' ని వానిని వెంటఁగొని చని నానాద్రుమపరివృతంబును స్వాదుజలపూరితంబునునై చెందొవలతోడను వెలిదమ్ములతోడను నిందీవరములతోడను జెన్నగాని చిత్రకంబళము పఱచిరోయనఁ దోచుచుండిన యా కాసారరత్నంబును జేరెను.

ఉ॥ భక్తియురక్తియుంగలవి భాసురలక్ష్మణభూమిపుత్త్రికా
వ్యక్తులఁదోడునిల్వ వనవాసనిమిత్తముఁ జేసి ధాత్రినా
ముక్తనిశాటరౌద్రముగఁ బూనిరచించిన దివ్యమూర్తి యు
వ్యక్తవివిక్తవర్తి చరితార్థునిగా ననుఁజేయుఁగావుతన్ ॥

అరణ్యకాండము

సమాప్తము.





# శ్రీ దొడ్డ రామాయణము,

## కిష్కింధాకాండము.



ఉ. ఎంచఁగ నాత్మశక్తి నలువేర్పడ ముత్తెఱఁగై క్రమించి ప్రా
పంచిక నాటకంబు బహుభంగులఁ జిత్రవిచిత్రలీల నా
డించుచు నుండెఁ దన్నటనకీవిని వేషముఁ జోరఁగంటు వీ
క్షించుచునుండు సర్వరముఁ జిన్మయు శాశ్వతు నాశ్రయించెదన్.

### రాముని విరహవేదన.

రాముఁడట్లు పంపాసరోవరంబుఁ జేరి యచటి ప్రకృతిసౌభాగ్య గరిమంబునకు కాంతయు నాశ్చర్యపడి తమ్మునిఁ జూచి 'సౌమిత్రీ! ఉన్నతాగ్ర గ్రస్తురైన వనేందిరమహాశుభప్రదర్శనోత్కంఠయై పాపటఁదాల్చినట్టి వజ్రాలపదకమో యనఁ వొప్పుచున్న పంపాసరోవరంబు వైడూర్యవిమలోదకములతో నిండి నీరలువాఱుచు బహుక్లేశసంతప్తుని నన్ను సంయితము రంజింపఁజేయు చున్నది. ఇది దుష్టసర్పకలితమైనను గమలోత్పలరమణీయము గావునఁ గచ్చిద్దోషగుణావిలంబయ్యును జ్ఞానప్రకాశమానంబు గామందు సత్పురుషుని హృదయంబు వోలె శోభిల్లెడు. ఇందలి పచ్చికబయళ్ళు నానావర్ణమూన సమాకీర్ణములై కాననలక్ష్మికిఁ గాఁ బఱచినరత్నకంబళంబులుగాఁ దోఁచుచున్నవి. తరువులామూలాగ్రము పుష్పితలతావృతంబులై నిరవధికశోభాకుసుమితభక్తాగ్రేసరులను దలపించుచున్నవి. లక్ష్మణా! వసంతలక్ష్మి పుష్పవంతయు ఫలసమృద్ధయునై కమ్మని లేఁదెమ్మెరలను సుఖకరంబుగా వీచుచుఁ గలిమికి జ్ఞానసంగతి యత్యావశ్యకంబని తెలుపుచున్నదియన మాప ని స్థానంకుటాయమనుమా. జలదంబులు తోయంబులనర్థిస్వంబు ప్రాణా

సులను గురియుచుండుటఁ జూడఁగా "పరోపకారమిదంశరీర" మ్మను ధర్మంబును స్వానుష్ఠానపూర్వకంబుగా నిది లోకప్రచారంబొనర్చుచున్నదో యను తలంపు గలుగుచున్నది. ఇందలి శిలాతలంబులు నిజహృదయభాగంబులపయిఁ బెనుప్రాఁకులను బెంచి వానివిరులతోడ భూదేవికిఁ బూజలొనర్చుచుఁ గఠినాత్ములుఁగూడ జ్ఞానవశంబున దయార్ద్రమతులై లోకారాధనపరులగుటఁ జాటుచున్నవి. తమ్ముఁడా! ఏకరాశిగా వాయువు వీచుచున్నను బుష్పంబులుకొన్నిమాత్రమే రాలెను; కొన్ని రాలనున్నవి; మఱికొన్ని పాడువడలవు. ఈవింతపరికింపుము. సర్వసముండైన పరమేశ్వరుని లీలావైచిత్రినిఁ దెలుపుటకు నింతకన్న వేఱు నిదర్శనంబు వలయునా! మధుపంబులు పేరాసతోఁ బూఁదేనెలు దవిలియున్నవి. ఆ యవినీతి నోర్వకయో యన గాలి వీచి వానిని దవ్వు జోపుచున్నది; వాయువెంత వీచినను భంభరంబులు మొగులాలసంజేసి తావువదలక యందే పరిభ్రమించుచు ఝుంకారధ్వనులతో మారుతుని గీర్తించుచున్నవి. భక్తిరసోన్మత్తులు స్థానచలనంబులవలనఁగాని విపర్యయంబులవలనఁగాని భగవత్పరాఙ్ముఖులు గారనుటకీదృష్టాంతము చాలదా? భగవంతుఁడు వైకుంఠమునుండి యవతరించి వచ్చియామ్నాయంబులను ద్విజోత్తముఅముఖంబున వెల్లడించి భక్తిరసంబును వెదచల్లి లోకకల్యాణమొనర్చినట్లుగాఁ బవననటగ్రామణి కంధరనేపథ్యంబును వెడలి వచ్చి మత్తకోకిలకలకలనాదమధురగీతాలాపంబులను సాగించి లతానటీలలితాంగనల నాడించుచు జగత్సభారంజన మొనర్చుచున్నాఁడు. పాదపంబులు మధుకరోత్తంసంబులై శాఖాగ్రములంనుఁ బుష్పదామంబులనుగూర్చి వాయువశంబునఁ దలలూచుటలు చూడఁగా భాగవతులు నీలశిఖాగ్రంబులందుఁ గుసుమమాలలఁగట్టి భక్తిపారవశ్యంబునఁ దలలూచుచు నర్తించుటలు స్మరణకు వచ్చుచున్నవి. లక్ష్మణా!

చ॥ మరుచిరపుష్పితాగ్రములు శుభ్రపలాశపరిచ్ఛదైక సుం
దరములు కర్ణికారములు దర్శనయోగ్యములై కడుంగడుఁ
స్మరణకుఁ దెచ్చెఁ బచ్చవిరుమాలలఁగట్టి శిఖాగ్రమందుఁ బూ
సరములఁచుట్టి సొంపొలయుఁ జాణుల మన్మథరమ్యమూర్తులన్॥

అని కొంతవడి నవ్వనసౌభాగ్యంబును వర్ణించి యాకాసారమందలి కమలేందీవరమత్స్యంబులు నిజప్రేయసీ వదననేత్రదృగ్విలాసంబులను

నట్టియాటలు భార్యావియోగవిరసుని నన్నుల్లసించుటలుగదా. నాజానకి నట్లు మీసతులనుగూడ రక్కసులపహరించియుందురేని మీరిట్లు సయ్యాటలాడుదురా? నీలకంఠములారా! మీచదురులట్లుండనిమ్ము. భర్తలను భార్యలనువర్తించుట లోకసహజము; మీరో సతులకు దాసానుదాసులు. ఇందులకు మిమ్ము నవ్వవలదా? తప్పెంచువారు తమతప్పెఱుంగరు. సరిసరి; నిజము గ్రహించితిని. ఇది మీదోషముగాదు; మిమ్ముపైకొన్న రాగోద్ధతిదోషము. రాగంబునకు మానాభిమానంబులు లేవుగదా. మాయురే! పాదపములారా! ఈదౌర్భాగ్యుఁడు మీకుఁగూడ వింతయయ్యెనా? కానిచో మీరిట్లు నిలువెల్లఁ బుష్పాక్షులుదాల్చి ఱెప్పవ్రాల్పక నన్నుఁ జూతురా? పరదుఃఖంబులకు వింతసేయరాదు. వింతసేసినచో సద్యోవ్యసనము తప్పదు. కావుననేగదా మీప్రసవంబులు మీయవినయఫలంబుగా మధుకరకరోత్కరములై రాలుచున్నవి. శకునములారా! కలస్వనములతోఁ గామోచ్చాటనమంత్రంబులను నాపయిఁ బ్రయోగింతురేల? నేను మీకేమి కొఱగాములొనర్చితిని? కటా! గంధవహా! సర్వాంతర్యామివి; నీకుఁబక్షపాతములు తగవు. ఎల్లరకు శీతసుఖస్పర్శమూర్తివై నాకు మాత్రము పావకప్రతిమానుఁడవగుచున్నావు. ఇది సౌజన్యమా? వాయసమా! నాఁడు పంచవటియందు నింగినిలిచి పరుసంబుగాఁ గూసి నాకు నాసఖీవిశ్లేషంబును గావించితివి. ఆదోషపరిహారార్థమా యిప్పుడు పాదపమెక్కి ప్రహృష్టనాదంబునఁ బ్రియాపునస్సమాగమ సూచకంబుగాఁ గూయుచున్నావు? నీపశ్చాత్తాపబుద్ధి నిక్కమేని నాచెలికడకు నన్నుఁ జేర్చి సుకృతివగుము. మధుపా! పవనప్రకంపమానయై మోమియ్యక త్రిప్పుచున్న తిలకమంజరిని గవయందమకింతువు. ఒల్లనివారిని వలచుట సరసమా? ఉన్మత్తులకుఁ దగవుతగము లేర్పడవనుమాట నేఁడు స్పష్టమగుచున్నది. అశోకమా! విరహులకు నీవు సహజవైరివనుట లోకవిదితము. అట్టి నీకిప్పు డనిలుఁడు తోడయ్యెను. వానిమాటవిని క్షోరకశరంబులను బల్లవార్చులందుఁ గాల్చి నాపయి రువ్వనున్నావు. పరులనువిన్నఁ బాడగుదువుసుమా. చూతమా! పరాగగంధంబును నిలువెల్ల నలఁది విలాసగర్వితుండైన పరాగివలెఁ గాన్పింతువు. నిన్నుఁజూడ భయమగుచున్నది. ఈ వేసమేల? సరోవరమా! రక్తోత్పలంబులనెడి తరుణార్కబింబంబులను పే

జేలు దాల్చినంతనే నీకు విశ్వరూపత్వంబువచ్చునా ? అందని ప్రానిపండ్లకు
నఱ్ఱుచాచి పరిహాసభాజనంబు కావలదు. జడనిధులకుఁ దలవంపులు
తప్పునా ? పుష్కరిణీ ! తీరవనంబనెడి పచ్చపట్టుచీరనుగట్టి కులుకురథాంగ
పయోధరంబులపయికిఁ దీవెజొంపపుఁ జైతాణి సవరించుచున్న నీహొయలు
నేపథ్యరచనావిధానంబున నవలామిన్నలకుఁ బాఠమగును సుమా. బాపురే!
ఈకాసారమునందలి చిఱుతఱగల జననలయంబులు విరహిజనభావనాళిత
జననలయంబులఁ బోలెడు. భళీ ! కర్ణికారవల్లీ ! నీతాతనూలతాసాదృ
శ్యంబునుగోరి పుష్పవిరాజితవైతివిగాని నీ రజోవృత్తినెందు దాఁచెదవు ?
అహో ! శైలరాజా ! నానాధాతువిభూషితుండవై నీకలిమికి విఱ్ఱవీఁగు
చున్నాఁవు. అంతమాత్రాననే లోకము మోసపోవదు. నీయంతస్సారము
రజోమయంబగుట యెల్లరకుఁ దెల్లము. ఈ నీగుట్టును నీపరాగమే రట్టు
చేయుచున్నదిసుమా. రజోవంతులకు శాశ్వతకీర్తి యబ్బునా ? దక్షిణగంధ
వహా ! ఒకచోట నిలువవు ; వనవనాంతరంబులను శైలశైలాంతరంబులను
క్రుమ్మరుదువు. నీదక్షిణనాయకత్వము లోకవిదితము. ఈ త్రిప్పటలిఁకనేని
మానరాదా ? భ్రమరా ! ఒకపువ్వందలితేనెతోఁ దనియక పుష్పాంతరంబు
లకుఁ బయనెత్తుదువేలా ? సరిసరి ; మధువ్రతులకు మది నిలుకడ వచ్చునా ?
మదనమండలేశ్వరా ! ప్రకృతిప్రియురాలు నీవిశ్రమార్థంబందందుఁ దరుచ్ఛా
యలందు నాత్మీయానురాగావస్థాప్రతిభాసములైన నానాసూనతల్పంబులను
రచించి నీరాక వేచియున్నది ; జాగు సేయకు. లతాంగనలారా ! ఒండొరుల
నసడించుచుఁ బ్రసూనభూషణసమలంకృతలై లజ్జమాని పైపయింబడి యౌ
వనికానికి మీమీరూపలావణ్యాతిశయంబులను మధుకరీఝంకారంబులచేతఁ
దెలుపుకొనుచున్నారు. సాధ్వీమణులిట్లొనర్తురా ? ఈర్ష్యాగుణము మీ
కెంతసహజమైనను మానాభిమానమును విడువవచ్చునా ? కారండమా ! నీ
ప్రియురాలితోడ నీవొనర్చు సలిలశుభావగాహము జానకితోడినాజలక్రీడ
ను జ్ఞప్తిచేయుచున్నది. హా ! జానకీ ! నీసమావేశభాగ్యంబు నోచుదు
నేని యయోధ్యను మఱచి యీరమణీయశాద్వల ప్రదేశంబులందును బుష్క
రిణీతీర్థములందును గిరికందరములందును విసుఁగూడి యావజ్జీవంబు సుఖ
ముందు సుమా. ప్రేయసీ ! స్మితపూర్వంబులును సుధాప్రాయంబులును
నైన నీమృదుమధురోక్తులను మఱల వినుకల్మి నాకుఁ గలదా ? తన్వీ !

కౌసల్యా! నీముద్దుకోడలిని బరమపతివ్రతామణిని నాకుఁ దోడుగాఁ బంపితివి. ఆమానవతిని మరల నీకు నప్పగించుభాగ్యంబు తీఱెను. సీతావిరహితంబుగా నిన్ను సందర్శింపఁ జాలను. నామాట మఱచి పొమ్మ' అని తన వియోగవ్యసనంబును బహుభంగుల వెల్లడించి తమ్మునిఁజూచి 'లక్ష్మణా! విరహవేదనాభరంబు నాయంతస్సారంబునెల్ల హరించెను; నేనింక బ్రతుకుట కల్ల; నీవుచని భ్రాతృవత్సలుని భరతునిగూడి సుఖముండు' మని పలికి దుఃఖపీడితుఁడై సొమ్మసిల్లెను.

లక్ష్మణుఁడు వానిని సేదదేర్చి 'అన్నా! నీయట్టిధీరులచిత్తంబులు కలుషాస్పదంబులఁ గానగునా? అతిస్నేహము తడివత్తినిగూడ దహించును. కావుననే 'అతి సర్వత్ర వర్జయే' త్తని చెప్పిరి. అతిదుఃఖంబువలదు. ఎంత విపత్తు వచ్చినను ధైర్యంబు వహింపనగునేగాని డీలుపడఁదగదు. రావణుం డనఁగా మనకేపాటియగు? ఆఖలాధముని సాధించి సీతాదేవిని బరిగ్రహింపఁ జాలమా? అన్నా! ఆరాజపుత్త్రి నెందుదాఁచినను సాధించితెత్తును. అధైర్యంబు వలదు. ధైర్యహీనులు ప్రయత్నభీరువులగుదురు; వారికెట్టి యర్థంబులను సిద్ధింపవు. ఉత్సాహమునకు సాటియైన బలముగలుగదు; ఉత్సాహికి దుర్లభము గలదా? దుర్ఘటంబులుగూడ నుత్సాహిని మఱలింపనోపవు. ఉత్సాహంబు నాశ్రయింతుమేని సీతాదేవి దొరకినట్లేయగును. కృతాత్ములెక్కడ? శోక మోహంబులెక్కడ?' అని ధైర్యోక్తులాడెను. రాముఁడు దుఃఖమోహంబులను గొంతవదలి పంపాపరిసరవనప్రదేశంబునెల్ల జూచుచుఁబోయి ఋశ్యమూకంబును సమీపించెను.

ఋశ్యమూకము.

అచ్చట సుగ్రీవుండను వానరోత్తముఁడు నిజమంత్రులఁగూడి సంచరించుచుండి, తటాలున నమ్మునివేషధారులను ధనుష్పాణులను జూచి తత్తరపాటుచెంది, యేమియుఁదోఁపక క్షణముసేపు అచ్చపడినిలిచి తెలివిగాంచి కుప్పించి యెగచి గిరితటంబులఁదాఁటి రివ్వునఁ బఱచి తన్నగాగ్రమందొక చోటఁజేరి 'వీరెవరో? ఏలవచ్చిరో? వేషంబునఁబట్టి మునులంగాఁదోఁచును హస్తములందు శరచాపంబులున్నవి' అని వారింగూర్చి పలువిధములనూహింపసాగెను. వానిమంత్రులును దలకొకమాటగాఁ బల్కిరి. హను

వరము మీకు సకలేంద్రియసంతర్పణ మొనర్చు పుణ్యము నోచెనా? ఇచటి వనలక్ష్మి యనర్ఘపదార్థపారితోషికంబుల మిమ్మారాధించి సుకృతియయ్యెనా? మహాత్ములారా! మీ రాకవలన ఋష్యమూక చిరతపంబు ఫలించెను. మండలేశ్వరులుగాఁ దోఁతురు. నారచీరెలు మీకునపూర్వశోభను గూర్చుచున్నవి. క్రోధనిశ్వాసపన్నగంబులోయన దోఁచుశరంబులతో నిండి మీ మూఁపుల వ్రేలాడుచున్న తూణీరంబులు మీ విక్రమోన్నతుల నడుగకయే తెలుపుచున్నవి. ఎందుండి యిందు వచ్చిరో యేలవచ్చిరో తెలియదు. సుగ్రీవుండను వానరరాజు భ్రాతృనిష్కృతుఁడై వలసవచ్చి యిందున్నాఁడు. ఆయన మీ నెయ్యముఁగోరి పంపఁగా నిందు వచ్చితిని. నాతండ్రి వాయుదేవుఁడు; నన్ను హనుమంతుఁడందురు. ధర్మాత్ముఁడైన సుగ్రీవునకు సచివుఁడనై యుందును. కామరూపకామగమనంబులు మాకుఁ బుట్టువిద్యలు; రాజాజ్ఞంజేసి నేనీరూపంబు దాల్చి వచ్చితి" నని యర్థవంతములును మధురమధురంబులునైన వచనంబులు పలికెను.

రాముఁడామాటలువిని 'లక్ష్మణా! వెదకఁ బోయిన తీవె పదములు దగిలినట్లాయెను. ఈసుగ్రీవసచివునకు మనసంగతి యెఱింగింపుము. ఇతని సంభాషణము నిర్దుష్టంబును నాతివిస్తరంబును విస్పష్టంబును భావానుమేయమునైయున్నది. వేదంబులమూఁటి నధ్యయనించిన వైయ్యాకరణియైన దండిపండితునకుఁ గాక యొరుల కిట్టిశక్తి లభింపదు. వీని యుచ్చారణ మన్ననో నాతిద్రుతంబు నాతివిలంబితంబు నగుటయేగాక యురస్స్థానంబున నుండి కంఠనాళద్వారంబున మధ్యమస్వరమనోహరమై వెలిప్రాఁకుచున్నది. ఇతఁడు పండితుఁడేగాక మహావక్తయునని దీనివలనస్పష్టము. మఱియొక విశేషము. ఇతనిపలుకు విచిత్రార్థంబును త్రిస్థానవ్యంజనస్థంబునై చంపవచ్చిన పగతునిఁగూడ సన్యస్తశస్త్రునిగా నొనర్చును. ఇంతసమర్థులు దూతలుగాఁగల రాజునకుఁ బడయరాని కార్యసిద్ధులుండునా? ఇట్టికార్యసాధకులు గల రేనిని విజయలక్ష్మి తనకుఁదాన వలచి వచ్చివరించుటబ్బురమా?యని తన మెప్పును దెలుపుచుఁ బలికెను.

లక్ష్మణుఁడు హనుమంతు నామంత్రించి 'మారుతీ! నీవలననెఱిఁగినట్టి సుగ్రీవునియోగంబొనర్తు" మని మాచ్యార్థసూచనంబుగాఁ బలికెను. మారుతి దానిభావంబును గ్రహించి వాలికిఁ బరాజయంబును సుగ్రీవునకు

### రామసుగ్రీవ సమావేశము.

లక్ష్మణుఁ డిట్లు పలుకఁగా హనుమంతుఁడు విని కేలు మోడ్చి 'మహాత్ములారా! వానరేంద్రుఁడే మీదర్శనార్థియై రానుండఁగా మీరే వాని ననుగ్రహించి యిందు వచ్చితిరి. మాఱేఁడుగూడ నిట్టియాపదకే చిక్కెను. సంగతి వివరింతు. సుగ్రీవునకు వాలియను పేరి జ్యేష్ఠభ్రాత గలఁడు. అన్నదమ్ములకు వైరము పొడమెను. అంతట వాలి విజృంభించి తమ్ముని భార్య నపహరించి నతనిని గుట్టలకుఁ దఱిమెను. సుగ్రీవుఁడన్నకు వెఱచి యీ పర్వతంబునకు వలసవచ్చెను. సుగ్రీవుఁడు సూర్యతనయుఁడు. ఆయన మీకు తోడ్పడ నెంతయు సమర్థుఁడు. అనుజ్ఞ యేని మిమ్ము వానికడకుఁ గొనిపోయెద' ననెను. రామలక్ష్మణులు సమ్మతించిరి. హనుమంతుఁ డంతట క్షణములో యథారూపము దాల్చి వారినిద్దఱను దనమూపున నెక్కించుకొని పోయి సుగ్రీవుండున్న బిలద్వారమున వారిని డించి తాను లోనికిఁ జని వృత్తాంతంబెల్ల వానరేంద్రునకు విన్నవించెను. సుగ్రీవుఁడు సమాహితచిత్తుఁడై విని సంతసించి దివ్యమంగళమర్త్యరూపంబును వహించి రామలక్ష్మణులయొద్దకు వచ్చి వారికి యథాశాస్త్రము సర్వసత్కారంబులొనర్చి 'మహాత్ములారా! వానరమాత్రుండనైన నా చెలిమిని మీరు గోరుట నాకు సత్కారలాభంబు ననుగ్రహించుటయే గాని వేఱుగాదు. రామా! మైత్రి నీకిష్టము గావుత. వలతువేని యిదిగో నాయీహస్తంబుం బట్టి నెయ్యంబును మర్యాదానిబద్ధ మొనర్పు' మని చేయి చాచెను. రాముఁడు సుగ్రీవుని హస్తంబును నిజకరంబున గ్రహించి యతని గవుంగిటఁ జేర్చెను. అంతలోన హనుమంతుఁడు ప్రీతిహోత్రంబును గొని వచ్చి యాయిరువురమధ్యమునుంచెను. రామసుగ్రీవు లాయగ్నికిఁ బ్రదక్షిణమొనర్చి యన్యోన్యసఖ్యంబు నగ్నిసాక్షికముగా నొడివైచిరి. సుగ్రీవుఁడంత రాముని సంబోధించి 'రాజశేఖరా! ఇది మొదలు నీసుఖంబు నాసుఖంబుగా నీదుఃఖంబు నాదుఃఖంబుగా భావింతును. నాయన్న వాలి యక్రమవర్తియై నన్నువంచించి నాభార్య నపహరించెను. అతఁడు మహాబలశాలియగుట వానికి నోడి ప్రాణరక్షణార్థం బీదుర్గమప్రదేశంబు నాశ్రయించితిని. అభయప్రదానంబు నాకు ననుగ్రహింపు' మని ప్రార్థించెను. కౌసల్యానందనుఁడు దరహాసకందళితముఖారవిందుఁడై 'సుగ్రీవా! మైత్రికిఁ బరస్పరోపకృతులు ఫలమందురు. వాలి దుష్టవర్తనం

వనుట వానిని వధించి నీతలంపు సేయుము' నని వానికి నమ్మబలికెను. ఈయిరువురునట్లు చెలిమిచేయు సమయంబున సీతావామనయనాంబుజంబును సుగ్రీవుని దక్షిణభుజంబును రావణుని యెడమ నేత్రంబును నేకకాలంబున నదరుపాటు గాంచెను.

సుగ్రీవుఁడాభరణములమూటఁ దెచ్చి రామున కిచ్చుట.

సుగ్రీవుఁడు పరమసంతోషమంది 'రఘునందనా! నీవచ్చినకార్యంబును నా మంత్రిసత్తముడు హనుమంతుఁడు తెలిపెను. నీయీభార్యావియోగరూపదుఃఖం బచిరకాలముననే సమసిపోవును. వేదశ్రుతిని శ్రీమహావిష్ణువట్లు సీతాదేవిని నేను దెచ్చియిత్తును. ఇది సత్యము; నామాట కల్లగాదు. ఏపాపాత్ముఁడు సీతాదేవిని హరించెనో యాకూళ విషమిశ్రిత భక్ష్యభోజియట్లు నశింపక మానఁడు.—ఆ! జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒకనాఁడు నేను నాసచివులనుగూడి యీపర్వతంబుననుండఁగా మామధ్యఁ దటాలున మూటయొకటిపడెను. మేము పరమాశ్చర్యకలితులమై నింగి వంకఁ జూచితిమి. 'హా! రామా! హా! లక్ష్మణా!' యను దీనరోదనము వినవచ్చెను. ఎవరో యని నింపాదిగాఁ జూచితిమి. ఎవఁడో కూళయొకఁడు నాగేంద్రగమనఁ బోని కాంతామణి నొకర్తుకను నిజాంకమునఁ జేర్చి పఱచుచుండెను. ఆమె యల్లాడుచు దూషించుచునుండెను. దవ్వగుటవలన మాటలు సరిగా వినరావు. ఆమె సీతాదేవిగా నుండునని యిప్పుడు నిశ్చయమయ్యెను. ఆమూటను బరికించితిమి. అందుదివ్యరత్నాభరణములుండెను. దానిని దాఁచియుంచితిమి. ఆభూషణంబులనుబట్టి యామెయెవరో తెలియునగు' ననెను. రాముఁడది విని మహాతురమంది 'ఏదీ! ఏదీ! మూట తెప్పింపు' మని వేగిరించెను. సుగ్రీవుఁడు గుహాంతరమునకుఁబోయి యామూఁటను దెచ్చి రామునిమ్రోల నుంచెను. రాముఁడామూటఁగట్టియున్న చేలాంచలంబును గాంచినంతనే చంద్రబింబంబును దుషారమట్లు వానినయనంబులను గన్నీరు గప్పెను. ఆ ధీరుఁడు 'హా! ప్రియా!' యని విలపించుచు నేలఁబడి యామూఁటను నిజవక్షోభాగంబుననుంచి బహువిధంబుల లాలించి ముడివిచ్చి యందలి రత్నాభరణంబులనుగాంచి మహావ్యాకులమంది 'లక్ష్మణా! నా ప్రియురాలి భూషణంబులను గుర్తింతువా?' యనెను. 'అన్నా! నాదృష్టి నిరంతరము

దేవీచరణకమలంబులను దవిలియుండెను. ఆమె నూపురంబులను మాత్రము గుర్తింతును; అని సౌమిత్రి చెప్పెను. లక్ష్మణుని శుద్ధస్వభావంబును గురుపత్నీభక్తియు వానరులకు మహాశ్చర్యప్రమోదంబు లొదవించెను.

సుగ్రీవుఁడు రామునాశ్వాసించుట.

రాముఁడంత సుగ్రీవుని జూచి 'మిత్రమా! రావణుఁడపహరించిన యాకాంతారత్నము నాప్రాణాధికయైన సీతగాని వేఱుగాదు. ఈ యాభరణములే యందులకుఁ దార్కాణము. ఆకూళ నాదయితామణి నేవంకఁ గొనిపోయెనో, ఎవనినిమిత్తమున సర్వరాక్షసలోకంబు వినాశంబొందనున్నదో, ఏబుద్ధిహీనుఁడు సీతాపహరణరూపమైన స్వమరణంబునువరించి మృత్యువునకు వాకిలి తెఱచెనో, యాదుష్టాత్ము నెఱుంగుదువా?' యని దగ్గుత్తుకతో నడిగెను. సుగ్రీవుఁడు ప్రాంజలియై 'మహాత్మా! ఆపాపాత్ముని కులగోత్రంబులుగాని శక్తిసామర్థ్యములుగాని యునికిపట్టుగాని స్పష్టముగాఁ దెలియవు. అయినను సీతాదేవిని వెదకి తెచ్చుటకు వలయుప్రయత్నంబు లెల్ల నొనర్తు; బాసచేసిచెప్పుచున్నాను; వగపుమానుము. ఆర్యవతంసమా! నీయట్టిశూరులెక్కడ? నీచపురుషాశ్రయణీయంబైన లాఘవంబెక్కడ! వ్యసనమందువా? నీయట్లు నేనుఁ గూడ వ్యసనినేగాని యొండుగాదు. అట్లని ధైర్యంబును వదలినచోఁ ఫలమేమి? శోకము జవసత్త్వంబులను హరించునేగాని కార్యమును సాధింపగావు. వానరుండనఁగా నల్పమాత్రుఁడు; అట్టినేనే యిట్టిదుఃఖంబును సహించియుండఁగా మహాత్ముండవును వినీతుండవును ధృతిమంతుండవును నైన క్షత్రియాగ్రణివి నీవెట్లుండవలయును? ధైర్యంబువలన బాష్పధారాప్రవాహము నరికట్టుము. ధృతిగదా సత్త్వవంతుల లక్షణము. మిన్నులుమీఁదబడినను జీవితాంతభయము సంభవించినను ధృతిమంతులు నిబ్బరముగానుందురుగాని బేలతనంబునకు సందియ్యరు. దైన్యహతుఁడు భారాక్రాంతయైన పడవవలె శోకసాగరమున మునుఁగును. రామా! తలతో మ్రొక్కి వేఁడుదును; నామాట విని దుఃఖంబును దిగవైచి ధైర్యకవచంబును దొడఁగుము. దుఃఖభాగులకు సుఖము చిక్కదు. మీఁదుమిక్కిలి వారికిఁ దేజోవినాశప్రాణసంశయంబులు సంప్రాప్తములగును. మహాత్మా! ఇది యుపదేశించుటగాదు; హితముఁ దెలిపితిని. నామైత్రిని

గాపాడింతువేని నా ప్రణయంబంగీకరించి రక్షింపుమాను' మని వ్యసనాత్మక స్వనంబునఁ జెప్పెను.

రాముఁడు సుగ్రీవునకు వాలివధ వాగ్దానముచేయుట.

రాముఁడా యాశ్వాసోక్తులు విని బాష్పధారాపరిప్లుతమైన నిజవదన మండలంబును వస్త్రాంచలమునఁ దడిమొత్తి సుగ్రీవుని సందిటఁగూర్చి 'మిత్ర మా! నీయూరార్పులవలన నాకు ధైర్యము మరలెను. నీవంటిబంధు వాప త్కాలమున దొరకుట మిక్కిలి యరుదు. సీతాన్వేషణంబునకు యత్నిం పుము; ఈవిషయంబున నాపనియేమో వచింపుము; కార్యసామర్థ్యంబును నాయెడ సంశయింపవలదు. వర్షకాలంబున సుక్షేత్రమందు బీజావాపము వలె నాయందు సమస్తకార్యములు ఫలించును. వాలిని వధింతునంటిని. ఆమాట యభిమానసమీరితమైనను సత్యమేగాని వేఱుగాదు. అనృతమునకు నాయెడఁ దావుగలుగదు; నాజిహ్వ కల్లవచింపదు. నీకొఱకును ధర్మము కొఱకు వాలిని సంహరింతును. సత్యముతోడఁ బ్రమాణముచేసి చెప్పు చున్నా' ననెను. సుగ్రీవుఁడు కృతార్థుఁడట్లు సంతసించి 'అనఘాత్మా! దేవతానుగ్రహఫలముగా నీచెలిమి నాకు లభించెను. నీవు సహాయుండవై నిల్తువేని సురరాజ్యముగూడఁ గరస్థమగును; వానరరాజ్యము సంగతి చెప్ప వలయునా! నీమైత్రిం జేసి నిఖిలబంధుమిత్రసత్కృతుండ నైతిని. నీకు సుగ్రీవుండనురూపమిత్త్రుఁడగుట కాలక్రమంబున విదితమగును. ఆత్మ వంతులకు ధైర్యమట్లు కృతాత్ములకుఁ బ్రేమ నైజము. ఏకక్రియాభావే న్మిత్రమనుట వినమా! మిత్త్రులకు శరీరములే వేఱుగాని యాత్మయొక్క టగును. మైత్రికి ధనదారిద్ర్యాది వ్యవస్థగలుగదు; సమయమువచ్చినప్పుడు ప్రాణములుగూడ దానికిఁ దీపుగావు. రామా! ఎద యిచ్చి నాగుట్టు తెలుపుదు వినుము. వాలి నన్ను యౌవరాజ్యమునుండి తొలగించెను; చెప్ప రాని నీచములాడెను. అతఁ డంతతోఁ దనియఁడు; నాభార్యను హరించెను; నామిత్త్రులను బంధించెను. అతఁడిప్పుడు నాప్రాణంబుల నెమకుచు న్నాఁడు. వాని పంపున మీరీవేషంబులతో వచ్చిరని శంకించి భయపడి పఱగెత్తితిని. భయమెట్టివారినైనను వెఱపించును. హనుమంతుఁడు ము న్నగు ఇవ్వానరులు నాకుఁదోడునీడలైరి. వారివలన నాకష్టంబులెల్ల మ్రింగి

ప్రాణములుచేతఁబట్టుకొని యున్నాను. వేయేల ? నాపగచావువిన్నఁగాని నాదుఃఖము శమింపదు. దుఃఖముమాట యటుండనిమ్ము. నాసౌఖ్యమును నా బ్రదుకును వాలిమరణంబునుబట్టి యుండును. అన్నిఁటికి మిత్రుఁడేగతి యని జాలివొడమఁబలికెను.

### వాలిసుగ్రీవుల వైరవృత్తాంతము.

రాముఁడాదీనాలాపంబులు విని 'మిత్రమా ! మీపగకు నిజమైనకారణమేమి ? వాలిగావించినయకార్యంబు నానిలువెల్ల దహించుచున్నది. అయినను వైరమూలంబెఱిఁగి బలాబలంబుల విమర్శించి మేలు సేయుటొప్పును. నాశరంబ ప్రతిహత'మనెను. 'రామా ! నాతండ్రి చన్నంతట జ్యేష్ఠపుత్త్రుఁడగు వాలికిఁ బట్టముఁ గట్టిరి. వానిని సేవకుఁడట్లు నేను సర్వకాలములందుఁ గొలుచుచుంటిని. దుందుభి యను పేరి రక్కసుని వినియుందువు. వానికి మాయావియను పెద్దకొడుకుండెను. వానికిని వాలికిని నొకానొక స్త్రీనిమిత్తము కరిమకరులపోరు గలిగెను. ఒకనాఁటిరేయి మేమెల్లరము మైమఱచి నిద్రించుచుండఁగా నిశీథిసమయంబున నమ్మాయావి కిష్కింధా ద్వారము నొద్దకు వచ్చి మేఘగర్జలు గావించి వాలిని సమరమునకుఁ బిలిచెను. వానరేంద్రుఁడు పరగర్వంబును సుంతయు నోర్చువాఁడుఁగాడు. అతఁడు కయ్యమునకుఁ దరలెను. మే మెంతో వారించి విరమించితిమి. అన్న యొంటిగాఁబోవుచున్నాఁడని తలఁచి వానిని నేను వెంబడించితిని. మేము వచ్చుట వెన్నెట మాయావి చూచి చేరువనున్న మహాబిలము దూఱెను. వాలి క్షుభితేంద్రియుఁడై కనలుచు 'సుగ్రీవా ! శత్రువు బిలము సొచ్చెను; వానిని వధించి వత్తును. అందాఁక బిలద్వారమున మెలకువతో నుండు' మని చెప్పెను. వెంట వత్తునని యెంతో ప్రార్థించితిని. వాలి నామాట వినక తనపాదములమీఁద నాచేత శపథంబును జేయించి నన్నందే యుంచి గుహ సొచ్చెను. ఆబిలద్వారమునుగాచి యొక్కసంవత్సరముంటిని. ఎన్నాళ్ళకు వారిరువురలో నెవ్వరును బయటరారైరి. నాహృదయము తహతహపడసాగెను. ఇట్లుండఁగాఁ గొండొకనాఁడు బిలాంతరమునుండి ఫేనరుధిరంబులు వెలికి నుఱికెను. వెనువెంటనే యాసురగర్జనంబులును వాలియాఱుపులును వినవచ్చెను. నాయన్న హతుఁడయ్యెనని నిశ్చయించి భయచకితుండనై వెనుబండ నొకటఁ దెచ్చి బిలద్వారము మూసివైచి యగ్రజు

నకు జలతర్పణంబులిచ్చి కిష్కింధకువచ్చితిని. వాలిని గూర్చి మంత్రులెంతో గుచ్చియడిగిరి. ఎవరికిని నేను దెలుపనైతిని. ఎట్టకేలకువారు నన్ను నిర్బంధించి కిష్కింధానగరం బరాజకముగా నుండరాదని చెప్పి బలవంతముగా నాకుఁ బట్టముఁ గట్టిరి. కొన్నాళ్ళు చన్నతర్వాత కొండొక నాఁడు వాలి తటాలున నగరమునకు వచ్చెను. అప్పుడు నేను పేరోలగము దీర్చియుంటిని. వాలి నన్నుఁ జూచి కన్నులెఱ్ఱజేసి తూలనాడి మంత్రులను బెదిరించెను. వాలిని నిగ్రహింపసమర్థుఁడనయ్యు భ్రాతృగౌరవంబునను నా ప్రమాదలజ్జాభరణంబునను దన్నిందావచనంబులను సహించి నాయన్నను యథాశాస్త్రము గౌరవించి నాతలనున్న కిరీటంబును వానిపాదముల వ్రాల నుంచి నమస్కరించితిని. ఎందునను వానికోపము చల్లారకుండెను. 'అన్నా! నా భాగ్యవశంబున సుఖముగా వచ్చితివి. ఇదిగో శ్వేతచ్ఛత్రమును బట్టుము; ఇదిగో వీచోపులు వీతును; అనుగ్రహింపుము. నీయానతి నేనొక సంవత్సరపర్యంతము బిలద్వారము కాచియుంటిని. ఒకనాఁడందుండి రక్తము వెడలెను; మాయావి మేఘగర్జనలు వినవచ్చెను. అంతట నేను భయభ్రాంతుఁడనై గుహాద్వారమును బెనుబండతోఁ గప్పివచ్చితిని. పౌరులు బలవంతముగా నాకుఁ బట్టముఁ గట్టిరి. మేమెఱుఁగమిఁ బ్రమాదపడితిమి. బుద్ధిపూర్వకంబించుకంతయైనను లేదు. నాతప్పు మన్నింపవేఁడెద; ఇదిగో నీరాజ్యము. దీనిని గ్రహించి యథావిధి మమ్ములఁ బాలింపుము. తొల్లి యట్లు నీపాదసేవయే నాకుఁజాలును. ఇంతదాఁక నీరాజ్యంబును నాయొద్ద యిల్లడ యుంచినట్లుగా భావింపుము. నీసొమ్మును గాపాడి నీకు నప్పగించుచున్నాను. అన్నా! ఇవంతయు నక్షరాక్షరముల సత్యము. తలతో మ్రొక్కి నీయనుగ్రహంబును యాచింతు' నని సాష్టాంగమొనర్చితిని. వాలి వెడచెవి యిడి నన్ను ధిక్కరించి తనయిష్టులైన పౌరులను మంత్రులను రప్పించి 'మాయావిని వధింప నేను చనుట మీ రెఱుంగుదురుగదా. బలదన్నుఁడు వీఁడు నావెంట వచ్చెను. వాఁడు మమ్ముఁ జూచి గుహఁజొచ్చెను. ఇతనిని ద్వారమునఁ గాపువెట్టి నేను బిలము దూఱితిని. మాయావి యెటు దాఁగినది వెదకుటకు సంవత్సరము పట్టెను. ఎట్టకేలకు వానిని జిక్కించుకొంటిని. మాకు హోరాహోరి పోరయ్యెను. నా దెబ్బకు వాఁడు గుండెలవిసి నెత్తురు గ్రక్కెను. ఆరక్తము బిలమునిండి యుబ్బి వాలక

వెలికి నరికెను. వానిని గడ తేర్చి బయటికి రాయత్నించితిని. ఎంత వెదకినను ద్వారము గాన్పింపదయ్యెను. 'సుగ్రీవా! యని యఱచి యఱచి సొమ్మసిల్లితిని. తుదకట్లో ద్వారప్రదేశమును గుఱుతించి దానిమూఁత బండ నొక్కతన్ను తన్ని పగల్చి యిట్లు వచ్చితిని. ఇతనిరాజ్యాకాంక్ష నన్ను బిలాంతరమున సప్రాణముగాఁ బూడ్చెను. ఈదుర్మార్గు నిందుండనీయరా' దని పలికి కట్టు బట్టతోడ నన్ను గెంటించి నాభార్య నపహరించెను. వాలిభయప్రేషితుండనై భూమండలమెల్లఁ గ్రుమ్మరి పల్లటిల్లితిని. ఎందును నిలువ నీడఁ గానరాకుండెను. అట్లు తిరుగాడుచుండఁగా ఋశ్యమూకపర్వతము వాలికి దురాధర్షమగుట యొకనాఁడు జ్ఞప్తికివచ్చెను. అంతట మేమిట్లు వచ్చి యీనగము నాశ్రయించితిమి. అనఘా! నాకత సవిస్తరముగాఁ దెలిపితిని. ఏయపరాధ మెఱుఁగను; నాయెడ నెట్టి చెడుతలంపును జనింపదు. ఇట్టి యిడుమలపాలైతిని. గిరాగ్రణీ! ఏనీహస్తము సర్వలోకములకు నభయప్రదానమిచ్చునో యానీహస్తమును సుగ్రీవుఁడు నేఁడు శరణుజొచ్చి కృతకృత్యుఁడయ్యె' నని పలికెను. ధర్మసంహితుండును ధర్మజ్ఞుఁడును మహాతేజస్వియునైన రాముఁడాకత సవిస్తరముగా విని యెలనగవుతో 'మిత్రమా! భార్యావియోగదుఃఖ మెట్టిదో నాకుఁ జెప్పనక్కఱలేదు. నీభార్యాపహరణదూషకుఁడెందాక నాశరంబులకు గుఱికాకుండునో యందాఁక మాత్రమే జీవించును. నిన్ను శోకసాగరము నుండి తప్పక యుద్ధరింతు' ననెను.

వాలిబలప్రశంస.

సుగ్రీవుఁడు రామునభినందించి 'మహాత్మా! నీకోపంబునకు ముల్లోకంబులును నీఱగుట నిస్సంశయము. వాలివధ నీకొకలెక్కగాదు. అయినను వానిబలపరాక్రమశౌర్యాదులను బ్రస్తావవశంబున వినిపింతును. వాలి ప్రతిదినంబును బ్రహ్మముహూర్తంబున నిద్రలేచి చతుస్సముద్రజలంబులందు వార్చి సూర్యోదయపూర్వమే యిల్లుచేరును. ఆవానరేంద్రుఁడు పర్వతములతో బంతులాడును; అతఁడవలీలగా విఱిచినమహావృక్షంబులను జూచువేని వాలిభుజాసారంబు తెల్లమగును. దుందుభియనురాక్షసుఁడు సహస్రనాగబలుఁడుండెను. వాఁడు గర్వోద్ధతిఁజెంది యుద్ధభిక్షయిమ్మని రత్నాకరుని గోరెను. సముద్రుఁడు మర్త్యరూపంబున వచ్చి 'దుందుభీ! నీకోర్కెఁ జేయనాకుఁ గాదు. తగువీరుని జెప్పెదు వినుము. శంకరునిమామ హిమ

వంతుఁడను శైలేంద్రుఁడు గలఁడు. అతఁడు నీయిచ్ఛఁదీర్పనోపు' నని చెప్పెను. దుందుభి యంత మున్నిటికి నగి యచ్చోటు వాసి చాపవిముక్త శరవేగంబున హిమవత్పర్వతవనప్రాంతంబునకుఁ జని యందున్న తెల్లబండలను ఏనుగజంబులంతటి వానిని దనకొమ్ములతోఁ గోరాడుచు మేఘగర్జలొనర్చెను. హిమవంతుఁడు నరరూపమువహించి శిఖరాగ్రమునందుండి 'దుందుభీ! నేనంత యుద్ధప్రవీణుండనుగాదు. అదియునుంగాక నాయందు మునులు వసింతురు; వారికిఁ దపోభంగముగలిగింపరాదు. అందుచేత నేనట్టిపనికి దలపెట్టఁగాదు. నన్ను వృథా గాసింపవల' దనెను. అరక్కసి రోషసంరక్తలోచనుఁడై 'లావుచాలమినో భయంబుననో వెనుదీసితివి. నాకుఁబోలు వీరుఁడెవఁడో చెప్పు' మనెను. వాని గర్వోక్తులు విని కొండలరాయఁడాగ్రహమంది 'దుందుభీ! కిష్కింధయందు వాలి గలఁడు. ఇంద్రుఁడు నముచికివలె నతఁడు నీకు ద్వంద్వయుద్ధ మొసంగ నోపు' ననెను. దుందుభి యందుండి తోడ్తోడఁ గిష్కింధానగరద్వారముచేరి మహాభయంకరముగా గర్జించెను. ఆ ధ్వనికిఅంతఃపురస్త్రీజనమెల్లఁ దల్లడిల్లెను. చంద్రుఁడు నక్షత్రంబులతోవలె వాలి శుద్ధాంతస్త్రీలను వెంటఁగొని బహిర్ద్వారమునకు వచ్చి, మదగజంబు వలె వృక్షంబులను విఱచుచు నాఁబోతువలెఁ బుడమిని గిట్టలతో నగల్చుచు నెనుబోతువలె శృంగంబులతో ద్వారంబును రాయుచు మహిషాకారమున నున్న దుందుభిని జూచి 'అసురాధమా! నీవునాకుఁ గ్రొత్తగావు. 'ప్రాణముల తీపగునేని నీగర్వముడిగి చను' మనెను. దుందుభి కన్నులెఱ్ఱజేసి 'ఇంతుల మ్రోల వీరాలాపములు చాలును; మగఁటిమి గలదేని పోరొసంగు' మని గర్జించి పలికె 'ఇప్పుడు సమయము గాదందువేని ప్రొద్దుటివఱకు నా భుజకండూతిని సహింతును. ఈరేయి నీకోరికతీఱ స్వైరకామభోగంబుల గ్రోల్లలాడి నీయంతవానిని రాజుగా వానరరాజ్యంబునకు నియమించి రేప కదరమ్ము. మధువివశుని బ్రమత్తుని నిద్రితుని నిరాయుధుని నీయట్టి మదమోహితునివధించిన భ్రూణహత్యాదోషంబగుఁ గావున రేపటివఱకు గడ విచ్చితి' ననెను. వాలి యంతటఁ దారాప్రభృతుల నంతఃపురంబు నకుఁ బంపి తనతండ్రి మహేంద్రుఁడిచ్చిన కాంచనమాలను గంఠమునఁ దాల్చి యుద్ధసన్నద్ధుఁడై వచ్చి దుందుభిని గొమ్ములం బట్టి దిర్దిర త్రిప్పి పడవైచి మోకాళ్ళఁ జదిపి నరము లొత్తి నేల మోదెను. ఆ వ్రేటునకు దుందుభి

ఎముకలు విఱిగి మూర్ఛయి ప్రాణములు విడిచెను. అంత వాలి వానికళేబరంబునెత్తి యూటాడించి విసరివైచెను. అది యామడ దవ్వునఁ బడెను. ఆవిసరువడికి దానినోటిరక్తబిందువు లీయాశ్రమమునఁ జిందెను. మతంగమహర్షి యిందువసించుచుండి యానెత్తురుబొట్లను బరికించి యానుండగ నొనర్చిన మొఱకెవ్వఁడో యని కోపించి వెలువడి వచ్చి దుందుభికళేబరంబును జూచి తపోదృష్టిచేత సమస్తము గ్రహించి 'వాలీ! ఆశ్రమంబని వెఱువక యీయకార్యంబొనర్చితివి గావున దీనిచుట్టు నామడలోపల నీవు కాలిడుదువేని నీతల వ్రక్కలై నశింతువు. నాయాశ్రమంబుననున్న నీవారు తత్క్షణమ యిందుండి వెడలుదురుగాక. ఒక్కరోజు గడవిత్తును. అనంతర మెవ్వఁడేని వానరుఁడు నీవాఁడిందుండునేని యతఁడు పర్వతాకారుఁడై బహువర్షసహస్రంబులు పడియుండు' నని శపించెను. ఆయాశ్రమంబున నున్న వానరులు తోడ్తోడ నందుండి పఱచి వాలికి నవ్వివరముఁ దెలిపిరి. అతఁడు నిజాపరాధంబునకు ఖిన్నుఁడై మహర్షికి మ్రొక్కి శాపప్రతిగ్రహముఁ బ్రార్థించెనుగాని యామునీంద్రుఁడు కరుణింపఁడయ్యెను. నాఁటనుండి వాలియిటు తలఁగూడ ద్రిప్పఁడు. మేము వానరులమైనను వాలికిఁ బగతులముగావున శాపభయము మాకుఁగలుగదు. ఈరెండు కారణములఁ జేసి మేమిందు సుఖముందుము. రామా! వాలిబలంబును తెలియుటకిది యొక్కటేగాదు; ఇట్టివి పెక్కులుగలవు. నిర్జరులకుఁ గూడ దుష్కరములైన పను లతఁ డెన్నో గావించెను. అతని బలవిశేషము నాకు స్వానుభవసిద్ధము. నీపరాక్రమము విన్నది కన్నది గాదు. వాలిభయమిట్లు పలికించుచున్నది; నిన్నుఁ గ్రిందుసేయుటకుఁగాని వెఱపించుటకుఁగాని యిట్లు చెప్పుటగాదు. నీతేజము నీఱుగప్పిన నిప్పువలె నున్నది. సమయమువచ్చినఁగాని యది ప్రకాశింప' దనెను.

### రాముఁడు తన బలమును సుంత చూపుట.

రాముఁడు చిఱునవ్వు దాల్చి 'మిత్రమా! మావిక్రమంబును గూడఁ జూడు' మని దుందుభికళేబరంబును పాదాంగుష్ఠంబున నెగఁ జిమ్మెను. అదిపదియోజనంబులదవ్వునఁ బడెను. సుగ్రీవుఁడది గాంచి 'రామా! ఈ కళేబరం బిప్పుడెండి తేలికగానున్నది. నాఁడు వాలి దీనినివిసరివైచినప్పుడిది రక్తమాంసభూయిష్ఠమై మహాభారముగానుండెను. మఱియు నతఁడు

సహసపరాక్రాంతుఁడై వాఁడు దీనిని జిమ్మెను. ఇంతమాత్రమునసే మీ యుచుప్రతాపబాహుబలములు నిర్ణయింపరాదు. అదిగో సాలవృక్షము; దాని నొక్కబాణంబున నైవఁగోరుదు. ఇట్లుగోరుట నిన్నుఁబరీక్షించుటకుఁ గాదు. నీభుజాసారంబునకు సంతోషించుటకే ననెను. రాముఁడు విల్లెక్కు వెట్టి శరమొండు సంధించి సాలవృక్షంబును గుఱిచేసి వైచెను. ఆబాణము సప్తసాలతరువుల నొక్కట భేదించి యావలికొండను దూఱి మరలివచ్చి తూణీరముఁజొచ్చెను. సుగ్రీవుఁడాశ్చర్యచకితుఁడై రామునకు సాగిలఁబడి మ్రొక్కి 'మహాత్మా! నాతప్పు క్షమింపవలయు. నీవు మర్త్యమాత్రుండవు గావు; ఒక్కకోలచేత సురలోకము నెల్లఁ గూల్పనేర్తువు; వాలి నీకొకలెక్కగాఁడు. ఖండనంబున నిన్నెదిర్చి నిలువ వీరుఁడు గలుగఁడు. నీసఖ్యంబువలన నాదుఃఖంబు లెల్ల నంతరించెను. శత్రుశేష ముండరాదందురు. ఆ వెంజలిని దీర్చి నాకుఁ బ్రియంబొనర్పు' మని ప్రార్థించెను. రాముఁడంత లక్ష్మణుని జూచెను. సౌమిత్రి నిజాంగీకారంబును సూచించెను. రాముఁడు సుగ్రీవుని వంకమరలి అట్లే కానిమ్మనెను.

### వాలిసుగ్రీవుల ప్రథమయుద్ధము.

అంత వారెల్లరుఁ కిష్కింధకుఁ జనిరి. ఆపురసమీపంబునఁ గీకారణ్యము గలదు. ఆవనమందొక చెట్టుక్రింద రామలక్ష్మణులుండి సుగ్రీవునిఁ బంపిరి. అతఁడు దట్టిగట్టి పోయి వాలిగుహాద్వారంబున భీకరంబుగా గర్జించెను. వాలి యాగర్జనంబు విని గుహాంతరమునుండి వచ్చి సుగ్రీవుని గాంచి వానిని ధర్షించెను.

"మ॥ తరుసంఘంబులఁ బూన్చి యొండొరుల మద్యద్బాహులై వ్రేయని
ష్ఠురవక్షస్స్థల పాతవేగ విరళస్తోకంబులై పోవ న
త్తరుసంఘంబులఁ బెండిరుం గడఁగి మాద్యల్లీల నయ్యుద్ధులుం
బరుషానేక శిలాప్రయోగముల నొంపం జొచ్చి రన్యోన్యమున్॥"

"ఉ॥ ఒండొరుఁబట్టుచుం దిగుచు నొండొరుఁ బాయుచు వ్రేయుచున్ మహో
ద్దండత నొండొరుం దెరలఁ దాఁకుచు నీఁగుచు లోఁగుచుం బలం
బొండొరు మీఱ నొండొరుల యుద్ధతి నైఁపక వీఁకఁ బోరి రా
ఖండలభానుసూను లవిఖండితచండభుజాప్రకాండతన్॥"

అట్లువారు బుధాంగారకగ్రహంబులవలెఁ దలపడి పరస్పరదంతనఖముఖ విఖండితశరీరులై రుధిరధారలఁదడిసి పుష్పితాశోకంబులవలెఁ దోఁచిరి. రాముఁడు విల్లెక్కుడించియు నొండొరుల గుర్తింపఁజాలక ప్రమాదమగునో యని జడిసి విలక్షహృదయుఁడై యూఱకుండెను. సుగ్రీవుఁడు పెద్దయుం దడవు పోరి సోలి పరాజితుఁడై వాలిపేట్లులకు నెత్తురోలుకుచుఁ బఱువెత్తి మతంగాశ్రమముఁ జొచ్చెను. వాలియు నతనిఁగతిపయపదములు తఱిమి 'తప్పించుకొంటివి పో' యని ఛీకొట్టుచు మరలెను.

రాముఁడు సుగ్రీవునోదార్చుట.

రాముఁడంత లక్ష్మణునితోడ మతంగవనంబునకుఁ బోయెను. సుగ్రీవుఁడు వారిని జూచి సిగ్గునఁదలవంచి నేలఁజూచుచు 'నిన్ను నమ్మి యిట్లయితి. వాలినివధింపఁ జాలనని నిజంబు తెలిపియున్న నాకీదురవస్థగలుగదు గదా' అని దీనాస్యుఁడై పలికెను. రాముఁడాపలుకులు విని సుగ్రీవా! కోపము వలదు; రూపాలంకారవేషంబుల మీయిరువుర నేర్పఱుపరాకుండెను. మీయుభయులకంఠధ్వని గూడ నొక్కటిగా వినిపించెను. మీ తనుచ్ఛాయయు మీవిక్రమాలాపములు నేకరూపమున నుండెను. ఈపోలికలు నాకు భ్రాంతిఁగలిగించెను. ప్రమాదంబున మూఁఘాతమొనర్తునో యను శంక మెండయ్యెను. ఏమిచేయుఁదోఁపక విడువనున్న శరంబు నుపసంహరించితిని. ఇది నిజము. నాబాల్యమౌఢ్యంబులఫలంబులగు మదీయాజ్ఞానలాఘవంబులు నీపాటునకుఁ గారణమయ్యెను. ఇందుల కెంతయుఁ జింతింతును. సుగ్రీవా! అభయమిచ్చి నమ్మించితిమి; నమ్మించి చంపుటకన్నఁ బాతకము గలదా? అంతటి దురితంబు నొడికట్టుదుమా? మఱియు మేమిటు నీయధీనులమై యున్నాము; నీవే మాకీవనమున శరణ్యము; ఎట్లు విచారించినను నీమేలు మామేలగును. ప్రమాదవశంబునఁగూడ నీకట్టియెగ్గును గలుగరాదు. నీయెగ్గు మాయెగ్గుఁగదా. మిత్రమా! నన్నెంతమాత్రము శంకింపవలదు. ఈసారి మరలఁజనుము. రణాంగమున నిన్నుగుర్తించుటకుగా నేదేని ధరింపుము' అని వానికి చెప్పి 'లక్ష్మణా! అదిగో గజపుష్పిని పూచియున్నది; అది మహాశుభప్రతిపాదిని; దానిని బెఱికి సుగ్రీవుని కంఠంబున నడియాలముగా నుంచు' మనెను. లక్ష్మణుఁడట్లొనర్చెను. సుగ్రీవుఁడు బలాకామాలికను దాల్చి సంధ్యారాగతోయదంబువలె నొప్పెను.

### సప్తర్షివనవృత్తాంతము.

అంత రామలక్ష్మణసుగ్రీవులును నలనీలతారహనుమంతులును గిష్కింధామార్గముఁ ద్రొక్కిరి. మార్గమధ్యంబున మహారణ్యంబొండుగలదు. రాముఁ డాకాననంబును జూచి 'సుగ్రీవా! ఈవనము మేఘమువలె విస్తరించి యున్నది. దీని నలుక్రేవలఁగదళీవృక్షములు విరాజిలుచున్నవి. దీనిసంగతి యేమి' యనెను. నావుడు 'రామా! తొల్లి యిది యొక ఋష్యాశ్రమము; ఇందు సప్తజనులనెడి మునీంద్రు లేడుగురు కఠినవ్రతులై జలాంతరంబునఁ దలక్రిందుగా మహోగ్రతపంబొనర్చుచుండిరి; సురాసురులకు నైతమిది దురాధర్షము; పక్షులుగూడ నిందు రావు; ఏదేనిఁ బరాకున నిందుఁ జొచ్చినను మరల నదివెలువడదు. దివ్యగంధంబులెప్పుడు నిందు గుబాళించుచుండును; సురకలావతుల గీతికామధురరుతంబు లేప్రొద్దు నిచటఁ జెవుల పండువు సేయుచుండును. ఇందుఁ ద్రేతాగ్నులు చల్లారవు. అవిగో కపోతాంగారుణంబులఁబోనివృక్షాగ్రధూపంబులే యందులకు నిదర్శనము. ఇందుఁ దరువులవిగో ధూమాచ్ఛాదిత శిఖరంబులై వైడూర్యరత్నాల చిఱుఁగొండలవలె తనరారుచున్నవి చూడుము. భావితాత్ములైన యాఋషులకు సప్తకంబునకును నమస్కరించువారికి శరీరవ్యాధులెట్టివియుఁ గలుగ' వనెను. రామలక్ష్మణులామునులకు నెఱిగి హృష్టచిత్తులై చని కిష్కింధాపురముఁ జేరి యథాపూర్వము వృక్షంబుచాటున నుండిరి.

### సుగ్రీవుఁడు వాలిని రెండవసారి యుద్ధమునకుఁ బిలుచుట.

సుగ్రీవుఁడు రామునకుఁ దదీయ ప్రతిజ్ఞను జ్ఞప్తిచేసి వాలియున్నబిలద్వారము డాసి నింగిపగులునట్లు గర్జించెను. ఆధ్వనికి గోవులెల్ల రాజదోషపరామృష్టకులాంగనలువోలె వెలవెలఁబోయెను. రణాంతరంబున నంగంబులు తెగిన హయంబులువలె మృగంబులు మ్రాన్పడి నిలిచెను; సుకృతఫలంబుగా నక్షత్రాకారమున గగనవీథినుండు పుణ్యపురుషు లాత్మీయపుణ్యక్షయానంతరము నేలరాలు పగిది వియచ్చరములైన విహంగమంబులుఁగూలెను. జీమూతగణప్రణాదసన్నిభంబును సర్వభూతప్రకంపనంబునైన యాగర్జన వాలి నిజాంతఃపురమునందుండి విని నష్టకామవికారుఁడును సంజాతమహోగ్రహోదగ్రుఁడునై సంధ్యారాగమువలెఁ దేజరిల్లుచుఁ గమలంబులూడ్చి

కలంచిన హ్రదంబురీతి నాపాదమస్తము కంపమొందుచుఁ బాదఘట్టనంబున భూతలంబును బ్రక్కలించి సమరోన్ముఖుఁ డయ్యెను.

తార వాలికి హితము చెప్పుట.

వాలిభార్య తార యదిగాంచి తత్తరిల్లి పతిని గవుంగలించుకొని 'నాథా! పడకనుండి కోపంబుతో లేచి చనుట శుభముగాదు. భుక్తమైన పూదండనట్లు మీయాగ్రహంబును బరిత్యజింపుము. నామాట వినుము. పోరువలదు. అది తప్పదేని రేపు చనవగు. వైరికి నీవు తీయువాఁడవు గాదు; వైరి నీకన్న బలాఢ్యుఁడు గాఁడు. త్వరయేల? నామాట ద్రోచి పుచ్చవలదు. ఇట్లేలఁ జెప్పెదునందువా? శత్రువు నీకునోడి ప్రాణార్థము మొన్న పఱచెను. అట్టివాఁడింతలోన మగల దాఁడివచ్చెను. ఏదో యపూర్వసహాయసంపత్తియున్నఁ గాని యతఁడింత తెంపు సేయఁడు. వాని నేఁటి గర్జావైఖరివలననే యిది యూహింపవచ్చును. దుర్జయునకు నాకు ఛీయ మేల యందువా? నీకుమించినబలమేదో సుగ్రీవునకు నాశ్రయమై యుండ వలయు. వీరాగ్రణీ! ఇదివట్టి యూహామాత్రముగాదు; నీతనయుఁడంగదుఁడు విహారార్థము వనమునకుఁ బోయెనట. అచ్చట 'అయోధ్యాధీశుని పుత్త్రులు సమరదుర్జయులు రామలక్ష్మణులనువారు సుగ్రీవుని ప్రియంబొనర్చుటకై ఋష్యమూకమునకు వచ్చి'రని చారులు వానికిఁ దెలిపిరట. ఆ సంగతి యంగదుఁడు నాకుఁ జెప్పెను. రాముఁడు విరాధుని విఱిచి ఖరుని ఖండించి దూషణుని ద్రుంచి కబంధుని గడతేర్చెనని విందుము. యుగాంత కాలాగ్నినిబోని యాజగదేకవీరునకు నెదురు లేరందురు. రాముఁడు సాధుజనమందారమనియు నాపన్నజనపరాగతియనియు నార్తశరణ్యుండనియు వానిని వేవిధంబులఁ గీర్తింతురు. జ్ఞానవిజ్ఞానసంపన్నుండును బితృవాక్యనిరతుండును ధాతువర్గంబునకు హిమవంతుఁడువోలె సమస్తకల్యాణగుణంబులకు నిధానంబునగు రామునితో నీకుఁ బగ మేలుగాదు. శూరాగ్రణీ! ఇట్లనుట దోషారోపంబుగా నెంచవలదు. నామాటఁ బాటింపుము. బలీయునితోఁ బగఁబెంచుటకన్న నీతమ్మునకు యౌవరాజ్యముఁ గట్టి రామునితో మైత్రి సేయుట సర్వథా శ్రేయస్కరంబని పరిస్థితులు తోఁపించుచున్నవి. సుగ్రీవుఁడు నీకుఁ దమ్ముఁడుగాని వేఱుగాదు. అతఁడు నీప్రీతికెంతయుఁ బాత్రుఁడు. అతఁడెందున్నను నీవాఁడేగదా! తమ్మునకన్న మిగులు బంధు

ప్రాణనాథా! దానమానసత్కారంబున నతనిని నీవెనుకవానినిగా నొనర్చుము. పగలు సమసిపోవును; అతఁడు నీ నీడనుండును. భాతృస్నేహము తక్క నొండుగతి నీకిప్పుడు గలుగదు. నాథా! నీమేలుఁగోరుదాననుగా నన్ను భావింతువేని నా ప్రియంబు సేయు తలంపు నీకుగలదేని చెవినిల్లుగట్టి నావచించు సాధువచనంబును బరిపాలింపుము. నాపలుకునది జల్పితమైనను బథ్యముగా గ్రహింపుము; నామొఱఁ బ్రసన్నుఁడవగుము. కోపరోషంబులకు వశము గావలదు. శాంతివహింపుము; కోసలేంద్రుని సూనునితో విగ్రహింపవల దని విన్నవించెను.

వాలి తారావచనమును దిరస్కరించి యుద్ధమునకుఁ బోవుట.

వాలి యాపల్కులు విని "చంద్రముఖీ! తమ్ముఁడు తమ్ముఁడందువు. తమ్ముఁడే శత్రువై గర్జించి కయ్యమునకు గాలుద్రువ్వెను. సహించుటెట్లు! స్త్రీలకు భయము సైజము. శూరులు వెఱపెట్టిదో యెఱుంగరు. వీరుఁడు మరణంబునైనను సైచును. గాని శత్రుతిరస్కారంబు నెంతమాత్రమోర్వఁడు. సుగ్రీవుఁడు నన్నుఁ జెనకలేడంటివి. ఇఁక భయమేల! రామునకు వెఱతువా! అతఁడు ధర్మజ్ఞుఁడును గృతజ్ఞుఁడునని చెప్పితివి. అట్టివాఁడు పాపమొనర్చునా! నీభయవ్యసనంబులు నిరాధారములు. తారా! నీభక్తి సౌహార్ద్రంబులకు మెచ్చితిని. నీమతముమాత్రము సేయనోప. నన్ను వెంబడింపవలదు; తోడియింతులఁగూడి మరలిపొమ్ము. ప్రేయసీ! సుగ్రీవుఁడు తమ్ముఁడగుట మఱువను; వానికిఁ బ్రాణభయముండదు. అతని దర్పమడంచివత్తును; వెఱవవల" దని దృఢముగాఁ బలికెను. తార బదులాడ నోడి భర్తను సందిటఁ గూర్చి యంతస్థదుఃఖంబు నడంగ భయాంబువు వెలి పుచ్చక పతికిఁ బ్రదక్షిణమొనర్చి జయార్థము సమంత్రకముగా స్వస్త్యయనముఁ గావించి యంతఃపురంబునకుఁ బోయెను. వాలి పరులకుఁ జెప్పనేర్చియు స్వహితంబును గ్రహింపఁడు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అను సామెత తప్పునా!

రాముఁడు వాలి నేయుట.

వాలి యట్లు భార్యను బంపివైచి సర్పమువలె నిశ్వసించుచు గుహనెడలివచ్చి సుగ్రీవునిఁ గాంచి ధట్టిగట్టి పిడికిళ్లు మూడిచి లంఘించి 'ఓరి పిఱికిపందా! మరలవచ్చితివా! ఇదిగో యీపిడికిటిపోటు తప్పి మనఁబోవు

నుచు గర్జించి సత్తువకొలఁది వానిని మోదెను. ఆతాఁకునకు సుగ్రీవుని నెఱ వెల్ల నెత్తురులు వర్షించెను. ఆతఁడంత గోపోద్దీపితుండై చేరువనున్న సాల వృక్షంబును బెకలించి దానితోడ వాలిని దాడించెను. ఆవృక్షహతికి వాలి సాగరాంతరంబున బరువుతోడి పడవవలెఁ జలించెను. అట్లు వారు పరస్పరజయోత్సాహులై గోళ్ళతో నొక్కుచుఁ బిడికిళ్ళఁ బొడుచుచు మోఁకాళ్ళఁ గ్రుమ్ముచు హస్తంబులఁ బ్రహరించుచు మేఘగర్జనంబుల గావించుఁ బెద్దయుండడవు పోరిరి.

“శా॥ దేహోత్సేక మెలర్ప నుత్థితమదాంధీభూతులై యాహవో
త్సాహవ్యగ్రులు విగ్రహంబు మిగులన్ సంరంభశుంభద్గతిన్
బాహాబాహిని బోరునప్పు డమరెం బ్రౌఢ ద్విపద్వంద్వహే
లాహాస్త ద్వయగాఢ కర్షణ రణోల్లాసంబు విస్పష్టమై॥”

సుగ్రీవుని బలము క్రమక్రమముగా సన్నగిలఁసాగెను. అతఁడు ప్రాణభయవిహ్వలుఁడై దిక్కులు చూడ నారంభించెను. రాముఁడది గాంచి దివ్యశరమొండు సంధించి యంతకుఁడు కాలచక్రంబునువలెఁ దనకోదండంబు నాకర్ణాంతముఁదివిచి వైచెను. ఆబాణము నిప్పులుమియుచుఁ జని వాలివక్షోభాగంబునఁ బవిధారవలె గాఢముగా నాటెను. వానరేశ్వరుఁడు శరవిద్ధుఁడై నెత్తుటఁదోఁగుచుఁ బూచినయశోకంబట్లు నేలఁగూలినను వాని మెడనున్న కాంచనమాలికా ప్రభావంబునఁ దదీయతేజఃకాంతి ప్రాణంబులు తొలఁగవయ్యెను.

వాలి రాముని దూషించుట.

రాముఁడు లక్ష్మణుని వెంటఁగొని వాలియొద్దకుఁబోయెను. వానరేంద్రుఁడు దాశరథిని గాంచి “రామా! మహారాజునకు జనించితివి; ప్రియదర్శనుండవను కీర్తినిగడించితివి; చరితవ్రతుఁడవై కులమునకు వన్నెఁ దెచ్చితివి; నీతేజస్సత్త్వసంపద లెంతనరాదు. అట్టి నీవు పరాఙ్ముఖవధఁ గావింపనగునా? కరుణ వేదివనియుఁ ప్రజాహితైకరతుండవనియు దయామయమూర్తివనియు జితోత్సాహివనియు ధర్మమార్గవర్తివనియు సమస్త భూతంబులు నిన్నుఁగొనియాడుచుండును. ఇంద్రియనిగ్రహము, సత్త్వశుద్ధి, సహనము, దయార్ద్రధర్మవ్రతము, సత్యము, ధైర్యపరాక్రమంబులు, ఆప

దాక్షిణ్యశాస్త్రసంపదను—ఇవి రాజగుణంబులగును. నీసద్గుణములు నిజ కీర్తించులోకి జనముం దలంచి తారావచనముం గూడ లక్ష్యపెట్టక నా హాతుని సుగ్రీవుని దలపడితిని. నేను నీకుఁగాని నీదేశంబునకుఁగాని కీడు చేయలేదు; నీతోడ యుద్ధమునకు రానైతిని; కందమూలంబులు తిని వనాంతరమందు వసింతును. నీకపకారుండఁగాను. అట్టి నన్ను వధింప నేల ? నీ నిజస్థితి యిప్పుడు స్పష్టమయ్యెను. లోకవంచనార్థము ధర్మ కవచంబును దొడఁగి చరింతువు. నీవట్టి దుష్ప్రవర్తకుండవు. గడ్డికప్పిన కూపమువలె లోకులను దటాలున ముంతువు. నీయథార్థరూపంబులెల్ల నేఁడు వెల్లడియయ్యెను. క్షత్రవంశంబున జనించి విద్యాసంపత్తినిఁ బడసిన వాఁ డిట్లొనర్పఁడు. నీసౌమ్యరూపంబునకు లోకమెల్ల భ్రాంతినొందుచున్నది. నీయట్టి మాయామయునిఁ జూడఁబోలదు. కామినీ కాంచన కాశ్యపులు వైరంబునకు మూలమగు. అందొక్కటియును మనకుఁ గలుగదు. రాజులు నయ వినయంబులను నిగ్రహానుగ్రహంబులను యథావిధి నాచరింతురు; వానికి సంకీర్ణదోషంబును బొరయనీయరు. ఎన్నఁడును వారు నిరంకుశపథ ముఁ ద్రొక్కరు. రామా ! కేవలకామప్రధానుండవై కోపంబునకు లోనై గాంచి మర్యాదలుమీఱి శరాసనపరాయణబుద్ధితో సంకీర్ణవృత్తిఁ జరించుట నీకుఁ బాడిగాదు. ధర్మమందు లేశమాత్రము గూడ నీకు శ్రద్ధ గలుగదు ; అర్థవిషయంబున సుంతయును నీకు వ్యవస్థగానరాదు ; ఇంద్రియ వశుండవైతివి ; యుక్తాయుక్తవివేకము నీయెడ శూన్యమనుట యతిశయోక్తి గాదు. ఇట్టివాఁడవు గావుననే యీయకార్యమునకుఁ దెగించితివి. రాజ హంతకునకును బ్రహ్మఘ్నునకును గోఘ్నునకును జోరునకును బ్రాణివధార తునకును నాస్తికునకును బరివేత్తకును నరకము తప్పదు. కొండీఁడును లుబ్ధుఁ డును మిత్రఘ్నుఁడును గురుతల్పగుఁడును బాపలోకంబులకుఁ జనుదురు. ఈదోషంబులన్నియును నీయందు మూర్తీభవించెను. రౌరవంబుగూడ నీకు వెఱచునేమోగదా. రామా ! నన్నుఁ జంపనేల ? మృగయావినోదివై చం పితినందువా ? ఉపయోగింపని దానిని జంపరాదని శాస్త్రము. నేనెట్లు నీకు నుపయోగింతునని తలంచి యీపనిచేసితివి ? నాచర్మము నెందు నుపయో గింపరు ; నా రోమములు పనికిరావు ; నామాంసమును తినరు ; నాయస్థు లను దాఁకరు. 'పంచ పంచనఖా భక్ష్యా' యను శాస్త్రముబట్టి నేను

గూడ నైదుగోళ్ళజంతువ నేయందువా ? పంచపంచ నఖజంతువులలో సేహ పందిని నడవిపందిని నుడుమును గుండేటిని దాఁబేటిని మాత్రమే గ్రహించిరి. వానరంబుల నభక్ష్యపంచనఖజంతుకోటిలోఁ జేర్చి వర్జించిరి. కావున నట్టిసాకుగూడ నీకు గలుగదు. పాపచింతగలదేని యిట్లొనర్తువా ?— అయ్యో ! నాతార యెంతసర్వజ్ఞురాలో యిప్పుడు గ్రహించితిని. ఆకాంతామణి నీకపటనాటక మెఱింగియే కాఁబోలు నన్నెంతో వారించెను. నాయర్ధాంగివచించినహితంబును వినని ఫలంబను భవమయ్యెను. అహో ! రామా ! ధూర్తపతివలన శీలసంపన్నయగు భార్యవలె నధర్మిష్ఠుండవైన నీవలన వసుంధరకుఁ గష్టములెగాక మేలుగలుగునా ? నీయట్టి శఠుఁడు నైకృతికుఁడు క్షుద్రుఁడు మిథ్యాశాంతమూర్తి మహాపాపాత్ముఁ డాదశరథమహారాజగర్భంబున నెట్లుజనించెనోగదా ? కటా ! సదాచారపాశంబును ద్రుంచివైచి మర్యాదనతిక్రమించి ధర్మాంకుశంబును లెక్కసేయక రామమత్తేభము నన్ను హింసించెను. కాకుత్స్థా ! ఆయుక్తంబును బుధగర్హితమునైన యీపాపకార్యంబొనర్చిన నీవు పెద్దలమోమెట్లు చూడనోర్తువు ? నీ విక్రమము నాఁబోటి యుదాసీనులమీఁద విజృంభించునేగాని యపకారులఁ జెనకనోపదుగదా ! రాజసుతా ! నాయెదుట నిలిచి నాకంటఁబడుచు యుద్ధమొనర్చియుండువేని నీలావున నాలావును దెలిసియుండును. మధుమత్తుఁడై నిద్రించువానిని సర్పము కఱచిచంపునట్లు పరాఙ్ముఖుఁడనైయున్న నన్ను చెట్టుచాటున నక్కి చంపితివి. ఇందులకు లజ్జింపవా ? నీ భార్యాపహర్తను వధించుటకుగా సుగ్రీవుని చెలిమిఁగోరి యనపరాధుని నన్నుఁ జంపుటకన్న నాసహాయ్యమేకోరి యుండువేని యాదొంగను జెవిఁబట్టితెచ్చి నీమ్రోలనిడుదుఁగదా. సీతను వెదకి తెచ్చి యిమ్మని నన్నడిగియుండిన దినార్ధములో నీసతిని సాధించి తెచ్చియిత్తుఁగదా ? సుగ్రీవుఁడు నాయనంతరము వానరరాజ్యాధిపతియగుట యుక్తమే గాని యీవిధముగ నన్నుఁజంపి వానికిఁబట్టము గట్టుట నీకుఁ దగవుగాదు. 'జాతస్యహి ధ్రువో మృత్యు' వను సంగతి యెఱుంగుదు. చావునకుఁగా వెఱచుటగాదు ; నీ చేత నెట్లు సమర్థింతువో సమాధానము వినఁగోరుదు. నోరెండుచున్నది ; ఇఁక మాటాడఁ జాలఁనని చెప్పి కాంతి దొలఁగిన సూర్యునిక్రియ వర్షించిన మేఘమట్లు మండిచల్లారిన యగ్నిచందానఁ దేజోహీనుఁడును నిశ్చేష్టుండును నివాతుఁడునయ్యెను.

రాముఁడు వాలికి సమాధానము చెప్పుట.

రాముఁ డానిందావచనంబులనెల్ల శాంతముగా విని 'వాలీ! నీకును నీయట్టివారికిని నిట్టిసంశయము గలుగునని యెఱుంగుదు. ఈసందేహములను దీర్చుటకును నీయవసానంబును బ్రశాంతమయముగా నొనర్చుటకు నిందువచ్చితిని. అభక్ష్యమృగంబును జంపుట ధర్మమాయంటివి. భక్ష్యాభక్ష్యవిచికిత్స వేఁటగాండ్రకుఁగాఁ జెప్పఁబడెను. నేను వేఁటాడుటకుఁగావచ్చి నిన్నుఁజంపనైతి. ధర్మరక్షణార్థము నిన్నుఁజంపితిని. కావున నీయానింద నిరవకాశము. నిష్కారణముగాఁజంపితినంటివి. మనకు వైరములేదనుట సత్యము. ఆదృష్టితోఁజూచినచో నీవధ నిష్కారణపూర్వకమేయగును. ధర్మంబునకు శత్రుత్వమిత్రత్వంబులు గలుగవు. దుష్టత్వమెందున్నను ధర్మము దానిని వదలదు. దుష్టశిక్షణమే ధర్మరక్షణంబగు. నీయందు దుష్టత్వముగలదు గావున నిన్ను వధించితిని. రాజ్యాధికారము వహించిన నీకింతమాత్రము తెలియదా? చెట్టుమాటుననుండి చంపితినంటివి. నీవరబలమునాకుఁ గ్రొత్తగాదు. ఎదుట నిలిచినవాని శక్తినెల్ల నీవు గ్రహింతువు. నీయావరంబును దేవతాంతరరూపమున నేనిచ్చినదేగదా. నాయిచ్చినదానిని నేనే తప్పనగునా! నిన్ను వధించుట తప్పదగుటవలనను నీవరము వమ్ముగారాదుగావునను విస్పష్టోపాయాంతరమున వధించితిని. అధర్మమిందేమియు లేదు. పరాఙ్ముఖుని వధింపవచ్చునాయంటివి. ఎప్పుడు నీవు ధర్మపరాఙ్ముఖుండవైతివో యప్పుడే నీవువధ్యుఁడవైతివి. వధ్యుఁడెందున్న నెట్లున్నను వధింపనగును. అది యధర్మముగాదు. వాలీ! నీగావించిన యధర్మమేమందువా? ధర్మతత్త్వము పరమదుర్జ్ఞేయము. సమస్తభూతాంతరవర్తి యాపరమాత్మ తప్ప నన్యులు ధర్మముయొక్క కలరూపు నెఱుంగనేరరు. పరమధార్మికులకుఁ గూడ ధర్మ రహస్యము సంపూర్ణముగా గోచరింపదు. ప్రాయికముగాఁ బ్రాణులయంతఃకరణము రాగద్వేషమలినావృతమై యుండును. అందువలన ధర్మము వారిచిత్తములందు సమగ్రముగా స్ఫురింపదు. ఒకవేళ స్ఫురించినను దానిని రాగద్వేషములు గప్పిపుచ్చుచుండును. అందువలన వారు విపరీతబుద్ధులై వర్తింతురు. ఎంతపరిశుద్ధముగా హృదయదర్పణముండునో యంత స్ఫుటముగా ధర్మవస్తువందు ప్రతిఫలించును. వాలీ! నీయంతఃకరణము రాగద్వేషకలితమైయున్నది. ఇప్పుడేని వానినవలఁద్రోచి నావచించు

సూక్ష్మార్థమును విని నాయొనర్చినది ధర్మమో కాదో నిశ్చయింపుము. అన్నయు గురువును దండ్రికిసాటియగుదురు. తమ్ముఁడును గుణవంతుఁడగు శిష్యుడును పుత్త్రునకుఁ దుల్యులగుదురు. సుగ్రీవుఁడు నీకుఁ దమ్ముఁడు గావున సుతప్రాయుఁడయ్యెను. వానిభార్యనీకుఁ గోడలగును. కోడలనఁగాఁ బుత్త్రీసమానురాలు. ఆమెతో నీవు రమించుట పుత్త్రికతో రమించుటయ్యెను. ఇది మహాపాతకమగునో కాదో విచారింపుము. అన్నభార్యను దమ్ముఁడును దమ్మునిభార్య నన్నయుఁగూడుట మీ కులాచారమందువా? పతిచచ్చినప్పు డామర్యాదను బాటింపనగునేగాని సభర్తృకయెడ నది పొసఁగదు. ధర్మము నతిక్రమించిన వాఁడు రాజు శిక్షింపక తీఱదు. ధర్మాతిక్రమదోషములు సామాన్యములనియు నుత్కృటములనియు రెండు విధంబులు. ఉత్కృటదోషంబులకు వధయే యనురూపశిక్షయని మన్వాది మహర్షులు విధించిరి. నీదోషము రెండవకోటిలోఁజేరును. ఆకారణంబున నీకిట్టి శిక్షవిధింపవలసివచ్చెను.

శిక్షాధికారము రాజునకుఁ దగుఁగాని నీకుఁదగదందువా? భరతుఁడు రాజ్యపరిపాలన మొనర్చుచున్నాఁడు. పరిపాలనసౌకర్యార్థము రాజులు తమప్రతినిధులను దేశమందచ్చటచ్చట నియమింతురు. మేము నట్లే నియమితులమై ధర్మరక్షణార్థము సంచరింతుము. రాజుయొక్క ధర్మము తత్ప్రతినిధులందు స్వతసిద్ధము. ఆకారణంబున నేను నిన్ను శిక్షించుటయ్యెను.

వాలీ! నీవధకుఁగల లౌకికధర్మాత్మకంబులైన కారణంబులను దెలిపితిని. పరమార్థకారణంబొండుగలదు. అది మహారహస్యమైనను నీకు మనశ్శాంతిని గూర్చునిమిత్తము తెలిపెదవినుము. నిర్జరాదులు రావణాసురునకు నోర్వలేక బ్రహ్మపురస్సరముగా వచ్చి నన్ను శరణుఁగోరిరి. మర్త్యావతారమెత్తి వానిని వధింపుమని ప్రార్థించిరి. దేవతలప్రార్థనము ధర్మయుక్తముగావున నంగీకరించితిని. ఆకార్యార్థము దేవతలు వారివారి యంశంబుల వానరులుగాజనించి నేనవతరించినప్పుడు నాకుఁ దోడ్పడవలసినదిగా నప్పరమేష్ఠి యాజ్ఞాపించెను. బ్రహ్మకట్టడి మేరకు యింద్రుఁడు తన యంశంబున నిన్నుఁబుట్టించెను. నీవు నాకు సహాయపడుటకు మాఱుగా మదవైరితో మైత్రియొనర్చితివి. రావణునితో యుద్ధము జరుగనున్నది.

నీవు నీపై త్రికారణంబున వానిపక్షంబున నుండక తీఱను. ఇది పితృద్రోహమును దేవద్రోహము రెంటునగుఁగదా. ఈ నీపాతకము నిన్నిప్పుడు హరించెను. అజ్ఞానవిమూఢమైన నీయంతరాత్మ కిది యింతకుఁ బూర్వము గోచరింపకున్నను దెలిపిచెప్పితినిగావున నిఁకనైనను నీవు నీయపరాధంబును గ్రహించి ప్రశాంతి నొందుము. వాలీ! నాకార్యము ధర్మమూలమో కాదో తెలిసెనా ?'

మఱియుఁ బాపకర్మలు రాజదండితులగుదురేనిఁ బ్రశాంతపాపులై స్వర్గముఁబడయుదురనియు దండులను శిక్షింపకున్నచో వారిపాపము రాజులను జెందుననియు మనువు శాసించెను. తొల్లి శ్రవణుండనువాఁడు నీవలెఁ బాపమొనర్పఁగా వానికి మాపూర్వీకుఁడు మాంధాత మహాభయంకర శిక్ష విధించెను. ఇట్టి నిదర్శనము లెన్నో గలవు. పాపులకు శిక్షారూప ప్రాయశ్చిత్తము మేలుసేయునేగాని కీడుగాదు.

నిన్నుఁజంపుట హింసగాదాయంటివి. ఆత్మలాభార్థము నిన్నుఁ జంపియుందునేని యది హింసయగును. అట్టికోరికయే నాకు జనింపదు. ధర్మరక్షణార్థము నీకు వధరూపశిక్షయయ్యెను. ఇదిహింసయెట్లగును ? సుగ్రీవునిపై త్రిఁగోరి యిట్లొనర్చుట స్వలాభార్థముకాదాయని శంకింతువా? అన్యసాహాయ్యము నాకు వలయునో లేదో నాచరిత్రయే చెప్పును. మాటమాత్రము చెప్పియున్నచో సీతను దినార్థములోఁ గొనివచ్చి యిచ్చియుండెడు వాఁడనని వచించితివి. నీవు శిక్షార్హుఁడవు. అట్టినీవలన నాకార్యంబును సాధింపరాదు. నిన్నందులకు నియోగించుట ధర్మాతిక్రమమగును. మఱియు నీవలనమేలుపొంది నిన్ను శిక్షించుట కృతఘ్నతయగును. కావున నిన్నుఁ గోరనైతిని. వాలీ! నాతత్త్వంబును నీవొనర్చినయధర్మంబును రాజవిధిని సమస్తము సమగ్రముగా గ్రహించి ప్రశాంతాత్ముఁడవై పొమ్మనెను.

### వాలి తన యపరాధము నంగీకరించుట.

వాలి యామహా వాక్యంబులాకర్ణించి ధర్మస్వరూపంబును నిజాపరాధరహస్యంబును గ్రహించి చేదోయిఁజేర్చి 'రామా! నీవచనంబులు సత్యపూతములు ; సర్వజ్ఞునకు నీకు బదులాడఁగలరా ? అజ్ఞానవశంబునను శరబాధవలనను మతి చెడి నాపలికిననిందావచనంబులను సైచి నన్నుమన్నింప

వేడుదు. రామా! నీయట్టిద్రష్టార్థ తత్త్వజ్ఞుండును ప్రజాహితరతుండును గలు గఁడు. కార్యకారణసిద్ధాంతంబులందు నీబుద్ధి యవ్యయంబును మహాప్రసన్నం బునైయొప్పును. ధర్మబాహ్యుని బాపాత్ముని నన్ను క్షమించితినని ధర్మిష్ఠ మైన నీవాక్కున నుడివి కాపాడుము. మహాత్మా! ఒక్కటి ప్రార్థిం తును. నన్నుఁ గూర్చిగాని తారనుగూర్చిగాని యాత్మబంధువులనుగూర్చి గాని నాకు దుఃఖముగలుగదు. అంగదుఁడను పుత్త్రుఁడు నాకుఁ గలఁడు. ఆకూన నన్నుఁ జూడక నిమిసంబేని నిలువఁడు. వానినెంతో గారాము తోఁబెంచి లాలించుచుందు. నాకై వాఁడు వాపోయి కృశించును. ఆబుడుతను నీచేతనుంచి పోవుచున్నాను. సుగ్రీవునట్లు వానిని రక్షించు భారము నీపయినున్నది. భరత లక్ష్మణులనువలె సుగ్రీవాంగదులను గూడఁ బ్రేమించి రక్షింప వేడుదు. ఇదే నాచరమ ప్రార్థనము. నావలన నాపత్ని తార సుగ్రీవునకు నపకారిణియయ్యెను. అతఁడు నామీఁది యాసును నాతారపయిఁ జూపకుండునట్లు చేయుము. రామా! నీచేతి మరణంబును గోరి యుంటిని. నామనోరథము ఫలించెను; అని సామ సంపన్నముగా వచించెను. రాముఁడు వాలిపయిఁబూర్ణకటాక్షవీక్షణంబుఁ బఱపి 'వానరాగ్రణీ! ప్రారబ్ధము దురతిక్రమణీయము. యథార్హదండన మొనర్చుటవలన రాజును దండితుఁడై దోషియుం సిద్ధార్థులగుదురు. నీపా పంబులెల్ల నశించెను. అంగదుఁడు మావలనఁ బుత్త్రవాత్సల్యంబనుభవిం చును; సంశయము వలదు,' అని యూనివచించెను. వాలి యంతటఁ బ్రహృష్టాంతరంగుఁడై 'పాహి పాహి దేవా!' యనుచు జీవితాంతమోహ మునొందెను.

### తారావిలాపము.

వాలియట్లయినంతట వానిపరివారంబు యూథపంబులుచన్న మృగ కండంబుల చందంబున భయాక్రాంతమై హాహాకారంబుల బరువెత్తి, పతి యవస్థనుఁగా శోకకర్శితయై పుత్త్రునితోడను, సపత్నులతోడను రణ భూమికి వచ్చుచున్న తారను మార్గమధ్యంబున నెదురై 'తల్లీ! వలదువలదు, పోవలదు; మరలిరమ్ము; ప్రతికి యున్న శుభంబులు పడయవచ్చునంద్రు. ఏకపుత్త్రకవు; వానినిఁగాపాడుకొనుము. వాఁడు మనకేని యదేనీకుఁ బుద్ధివేలు. అంతకుఁడు రామరూపంబునవచ్చి వానరేశ్వరుని జంపి కొని

నొవ్వుచున్నాఁడు. వజ్రకల్పమైన రామబాణంబునకు వాలి కూలుటఁ గాంచి మాబలగమెల్లఁ జీకాకుపడి పఱచెను. అమ్మా! ద్వారములు మూయింపుము ; అంగదునకు రాజ్యముఁగట్టుము ; మేమెల్లరము వానిని గొలిచి యుందుము ; జాగువలదు. శత్రువులు కిష్కింధనాక్రమింపనున్నారు. నగరము పగతుఱచేతఁబడెనేని మనకు నిలువనీడయైననుండదు. వాలికి వెఱచి యడవులుపట్టి భార్యావిరహంబునఁ బొగులుచున్న మనజ్ఞాతులు కసి తీర్చుకొన వేచియున్నారు' అని చెప్పెను. తార వారిమాట వినక 'మహానుభావుఁడు నాభర్త చన్నతర్వాత నాకుఁ గొడుకేల? రాజ్యమేల? జీవమేల? నాపతిచరణంబులే నాకు శరణం' బని పలికి, వాలి యొద్దకుఁ జని వానిని గాంచి తలమోదుకొనుచు ఱొమ్ములు గుద్దుకొనుచు 'హా! నాథా! ఇఁక నాగతియేమి? అహో! నీశౌర్యమేమయ్యెను? మాయావిని క్షణమాత్రంబున హరించిన నీబలమేమాయెను? పర్వతంబులతో నోమనగాయలాడుచుందువు ; సప్తవాయువులకు నందని వేగంబునఁ బఱతువు ; ఆలావేమయ్యెను? ప్రళయ జీమూతసంఘాతధ్వనికి మించిన నీగర్జనంబునకు భూతంబులెల్లఁ దల్లడిల్లును ; పరాక్రమంబున దేవాధినాథునిగూడ మెప్పించితివి. అట్టినీకు నేఁడిట్టి గతిగల్గెనా? కటా! జీవితేశ్వరా! వర్షించిన మేఘంబువలె నైతివి. అయ్యో! వలదని యెంతో బతిమాలితిని. నామాటఁ జెవిఁబెట్టవైతివి. భ్రాతృభార్యాపహరణరూప పాతకంబు నీకు మృత్యువయ్యెనా?—హా! రామా! హా! లక్ష్మణా! ధర్మత్రాణులు మీరుగావించినది యకార్యంబనఁజాలము. సుగ్రీవా! ఇందు నీ తప్పేమియు లేదు. నాభర్త యాత్మదోషంబునకు బలియయ్యెను.—హా! వీరాగ్రణీ! నీసతితోఁ బలుకవేల? అపరాధమేదేనిఁ గావించితినా? కయ్యార్త మన్నింపుము. వానరేశ్వరా! నాకన్నఁ బుడమియే నీకుఁ బ్రియతరమయ్యెనా! కాకున్న భూకాంతనిట్లు సర్వాంగ పరిష్వంగమొనర్తువా? నాథా! ధర్మబుద్ధి వెడయని నీవు నీస్వర్గారోహణ మార్గంబునఁ గిష్కింధానగరంబును విశ్రమస్థానంబుగా నిర్మించుకొంటివా? ఒండుటో నిష్ఠురవరంబును త్యజించి చనుదువా? హృదయేశ్వరా! మాతోడ నీవు విహరించుచున్న మధుపూర్ణవనంబుల నెవనివశఁబొనర్చితివి?— హా! సుఖమా! నేఁటితో మనకు ఋణముతీరెను. సంతోషమా! నీకుఁ బగయైతిని ;

దుఃఖమా! నన్నుబలిగొనుము; ప్రాణమా! ఇంక దరలుము.—అగ్గో!
హృదయమా! ఎవని యూసలాలనంబుల నీవు మైమఱచుచుంటివో యా
దయితుండు నేలంగూలుటం జూచియు వ్రీలవుగదా! నీ కాఠిన్యమేమన
వచ్చును? కటకటా! నాథా! నీవలన వానరాంగనలకుం గల్గిన భర్తృ
వియోగక్లేశంబు నేడు రూపుదాల్చి నాకీప్రతీకారంబొనర్చెను. మనో
హరా! స్వర్గకాంతాసమాశ్లేషసుఖంబు మించుగాందలంచి మమ్మెల్ల వది
లితివా? నాథా! దుఃఖముగాని దారిద్ర్యముగాని యెఱుంగని నీతారను
వైధవ్యాగ్నికుండంబునం బడంద్రోసి పోనగునా? జీవితేశ్వరా! మమ్మెల్ల
విన్న మానేం గాక; నీప్రియసుతు నంగదుని దలంపవా? వానికొఱకేని
మరలి రావా? నీకొడుకునకు నింక దిక్కెవ్వరు?—హా! పుత్త్రకా!
నీతండ్రిమురిపెంబులు నీకుం దీఱెను. ఇదే కడసారిచూపు.—నాథా!
బహుదూరప్రయాణంబును సంకల్పించితివి. నీకొడుకు నొక్కసారి శిరము
మూర్కొని యాశ్వాసించి సందేశమేదేని వచించి చనుము. సుగ్రీవా!
నీకోర్కె కొనసాగె ననుచు భర్తను గవుంగలించుకొని విలపించుచుం
బ్రాయోపవేశము నిశ్చయించుకొనెను.

### హనుమంతుండు తారనూరార్చుట.

హనుమంతుం డామెను సమీపించి ‘ప్రాణులు స్వకర్మఫలహేతు
కంబులైన గుణదోషములయొక్క శుభాశుభంబుల ననుభవింపక తీఱదు.
ఒకరి కర్మఫలంబు వేఱొకరికి రాదు. నీకర్మఫలంబునకు నీవు వగచు టగుం
గాని పరులకై విలపింపనగునా? ఇంతకన్న వెఱ్ఱితనము గలదా? సిరిగల
వాండు పరులలేమికిం గరుణింపందగుంగాని దరిద్రుండు కరుణించియు ఫల
మేమి? దేహములు బుద్బుదప్రాయములు. కర్మానుభవమునకుగా నవి
వచ్చుచుండును. భోక్తవ్యము భుక్తమైనంత నేయవి నశించును. ఎవ
రును శాశ్వతముగాదు. అస్థిరమునకై దుఃఖించుట వివేకముగాదు. ప్రా
యోపవేశము నిశ్చయించితివి. అపుత్త్రకస్త్రీలకు సహగమనంబు విచ్చ
గించిరిగాని పుత్త్రవతికిం గాదు. నీసంకల్పము ధర్మసంయుతమో కాదో
సుంత విచారింపుము. అంగదుండు నీకుంగలండు. అపుత్త్రుని జూచుకొను
చుం దత్పరమతివై జీవితశేషమును గడపుము. శరీరంబులు పంచభూతా
త్మకములు; భూతంబులకు సంయోగవియోగంబులు నైజము. తత్కార్యంబు

ఱకుగా దుఃఖింప నేల ? నీపతి సకలశాస్త్రకోవిదుఁడు. దానమాన రక్షిత బహుజీవలోకుఁడు. ఆయన నిజధర్మసాధిత పుణ్యలోకంబులకుఁ జనుచున్నాఁడు. వానికై శోకించుట తగదు. సమస్తవానరభల్లూక రాజ్యంబునకు నీవే నాథవై యంగదాదులకుఁ బ్రియముఁ గూర్పుము. నీయంతనంగదుఁడు రాజ్యభారము వహించుఁగాక. వాలికి జరుగవలసిన యౌర్ధ్వదైహిక క్రియలను వానిపుత్త్రునివలన జరిపింపుము. సంతానముఁగన్న ఫలమదేగదా.

ఉ॥ ఎప్పటికేది యేరికగు నెవ్వరెఱుంగ రెఱింగి యుండియున్
దప్పకొనంగఁ జాలరిది తథ్యము సర్వశుభాశుభంబులున్
జొప్పడుఁ బూర్వకర్మముల చొప్పునఁ దత్పరిపాకవేళలం
దిప్పగిదొటఁ బ్రాప్తము సహించుటయొప్పు సమత్వబుద్ధితో॥

యని యూఱడఁ బలికెను.

తార యామాటలువిని 'అంగదునివంటి కొడుకులు మార్గమందురుగాక; నాకు వారు నాపతికన్న నధికులుగారు ! వానరరాజసంస్కారంబుగాని యంగదపట్టాభిషేకంబుగాని నాపనిగాదు. అందులకు సుగ్రీవుఁడే యధికారి. హరిసత్తమా ! అంగదుని క్షేమలాభంబుల భారము నాపయినున్నట్లు భావింతువు. అది సరిగాదు. సుతునకుఁ దండ్రియే హితుఁడును బంధువు నగుఁగాని తల్లికానేరదు. తండ్రి వెనుక యంతటివాఁడు పినతండ్రి గలఁడు. నాపతిసేవయే నాకు నిహపరసాధనము. నాభర్త వీరస్వర్గంబునకుఁ బోవుచున్నాఁడు. వానిని సేవించుటకై నేనును జనుచున్నా'నని తన నిశ్చయమును దెలిపి వాలి శిరమును దొడపైనుంచుకొని 'నాథా ! నీవైరులకు రణరంగంబున నీవు కల్పించుచుండిన శయనమే నీకు నేఁడు సంప్రాప్తమయ్యెనా ? అదిగో ! నీవీరులు నిన్నుచుట్టియున్నారు. వారికేని పలుకవా ? అయ్యో ! అనాథనుగా నన్నుగావించి డించిపోయెదవా ? కటా ! శూరుని వరించినందునకు నాగతి యిట్లాయెను. తెలివిగలవారు తమకన్యల నెన్నడును శూరుల కీయకుందురుగాక. అయ్యో ! నాథా ! నిన్నుఁజూచి గర్వపడుచుంటిని. నేటితో నాగర్వము నశించెను. నీవే శాశ్వతగతివని నిన్ను మనసార శుశ్రూషించుచుంటిని. ఆవిధము నేటితో నంతరించెను.

దరిలేని శోకసాగరంబున మ్రుంగితిని. ఎందఱుకొడుకులున్నను ధనధాన్యాది భాగ్యంబెంతయున్నను భర్తృహీనకు విధవాగ్రహణంబు గలుగక మానదు. నాథా! లాక్షారాగపరిస్తోమంబునందట్లు రుధిరమండలంబున శయనించితివా! అయ్యో! ధూళిరక్తంబులఁ బ్రుంగిన నీమేను నాకవుంగిటు నిలువదు; నీ యెదనున్నబాణము గాఢపరిష్వంగభాగ్యంబునకు నన్నుఁ దూరమొనర్చుచున్నది. హా! ఎంతదౌర్భాగ్యురాలనోకదా' యని విలపింపఁజొచ్చెను.

వాలి సుగ్రీవునకుఁ గాంచనమాల నిచ్చుట.

అంతలోన వాలి సొంత స్మృతిపడసి చెంగటనున్న యంగద సుగ్రీవులను గాంచి యందు సుగ్రీవుని దగ్గఱకుఁ బిలిచి 'నాయనా! నీకు నేనుజేసిన యెగ్గులను దలంపవలదు. కర్మవశంబున నాబుద్ధి విమోహమొంది నాచేత నట్లుచేయించెను. 'బుద్ధిఃకర్మానుసారిణి' యందురుగదా. బుద్ధిని జయింపరాదా యందువుగాఁబోలు. అంత సత్వశుద్ధి నాకుఁగలుగదు. ఆ కారణంబున దానికి లోనై యీగతిఁ దెచ్చికొంటిని. తమ్ముఁడా! భ్రాతృసౌహార్దసౌఖ్యంబులు మనయిద్దఱకు సమకాలంబుననఁ గలుగరావని దైవసంకల్పంబుగాఁ దోఁచును. రాజ్యము; లక్ష్మి, జీవితము—మూఁడు నొక్కసారిగా నన్ను వీడుచున్నవి. ఇఁక వానరరాజ్యంబును నీవధిష్ఠింపుము. సుగ్రీవా! నాచరమకాలవచనంబొండుగలదు. అది నీకు సమ్మతంబుగాకున్నను నీవు దానిని జేయక తప్పదు. ఈబాలుఁడు నాకుఁ బ్రాణాధికుండగుట నీకు స్పష్టము. ఇతనిని నీగర్భజనితునిగా నెంచి తండ్రిలేనికొఱఁత గలుగనీయక కాపాడుము. తారాపుత్త్రుఁడు పరాక్రమంబున నీకు సాటియగును. రణరంగంబున వాఁడు నీముందు నిలువనోపును. ఈ తార యర్థసూక్ష్మనిశ్చయంబునను భావికాలోత్పాతంబుల సడిఁగాంచుటయందును మిక్కిలి సమర్థురాలు. ఆయింతి యభిప్రాయంబునకు వ్యతిరేకము గలుగదు. ఆబోఁటి నిశ్చయించి వచించునది సంశయింపక చేయుము. వత్సా! రామకార్యంబునకుఁ బూనితివి; దానిని దలఁదాల్చి నిర్వహింపుము. అదిచేయవేని ధర్మదూషితుండవును సత్యదూరుండవు నగుదువు. ఎన్నఁడుగాని రామునవమానింపవలదు; వానికోపంబునకు గుఱియగుదువేని తప్పక నశింతువు. సుగ్రీవా! దేవేంద్రదత్తమైన యీగాంచనమాల నామరణాంతరము సహజకాంతిని బాయదు. దానినిప్పుడే గ్రహింపుమని

చెప్పెను. సుగ్రీవుఁడు తనయన్న సౌహార్దంబున కెంతయు దీనాస్యుఁడై 'అన్నా! నీమాటఁ దలఁదాల్చి యొనర్తు' నని చెప్పి కాంచనమాలికను బుచ్చుకొనెను. అంత వాలి యంగదుని బిలిచి 'నాయనా! దేశకాలంబు లెఱింగి ప్రియాప్రియంబులకును సుఖదుఃఖములకును వ్యగ్రాంతరంగుండవు గాక సుగ్రీవునకు వశవర్తివై యుండుము. వత్సా! నాయందువలె సుగ్రీవునందును బితృభావంబున వర్తింపుము. సుగ్రీవుని శత్రువులతోఁగాని వానిశత్రుమిత్రులతోఁగాని చేదవలదు. అస్నేహంబుగాని యతిస్నేహంబుగాని తగదు. రాజపరమతివై యింద్రియంబులనెల్ల వశమందుంచుకొని మెలంగుము. ఇంతకన్నఁ జెప్పఁదగిన హితవులే' దని బాణవ్యథావ్యగ్రుఁడై తల్లడిల్లసాగెను. వానియనుచరులు చుట్టి 'వానరేంద్రా! గోలభుండను గంధర్వపతితోఁ బదునేను వత్సరంబులు దివారాత్రంబులు పోరి వానిని వధించి మాభయంబులుడిపితివి. వనదుర్గంబులు పరాధీనమగుచున్నవి. ఇఁక మాగతి యేమి?' అని వాపోవసాగిరి.

నీలుఁడు మునుపడవచ్చి వాలియురంబునుండి రామబాణంబు నూడఁబెఱికెను. ఆగాయంబునుండి రక్తధారలు ధరాధరంబునుండి గైరికధాతుమిశ్రజలధారలు వోలెఁ బ్రవహించెను. ఆరుధిరవాహినిని జూచినంతనే తారానయనగోళంబులు బాష్పధారలను బతిదేహధూళిని గడుగుటకో యన వర్షించెను. ఆమె సుతుని జీరి 'పుత్త్రా! నీతండ్రియీమరణావస్థను జూడుము. ఇదియెల్లఁ బాపకర్మభవవైరపరిణామము. నీజనకుఁడు తరుణార్కగాత్రముతోఁ బరలోకమునకుఁ బోవుచున్నాఁడు. వానికి నమస్కరింపు' మనెను. అంగదుఁడు వాలిపాదంబులకు మ్రొక్కెను. అంతటఁ దార పతిపయిఁ వ్రాలి 'నాథా! సంగ్రామయజ్ఞమొనర్చి రామప్రహారణాంబువులందు నవభృథస్నానము గావించితివి. భార్యావిరహితంబుగా నిట్లుచేయుట తగునా? రాజేంద్రా! మృతుండవైనను రాజ్యలక్ష్మి నిన్ను వదలదు. అయ్యో! నాచేలతనమే యింతకుఁ గారణమయ్యెను. నిన్ను యుద్ధంబునకుఁ బోనీయకున్నచో నాకీగతి గలుగదుగదా' యని యేడువసాగెను.

సుగ్రీవుఁడు వాలికై యనుతాపమొందుట.

సుగ్రీవుఁడు తారాదుఃఖంబునకుఁ దాను కారణమగుట కెంతయు వగచుచు రాముని సమీపించి 'రఘువంశోత్తమా! నీప్రతిన చెల్లెను; నాకు

రాజ్యము వచ్చెను. కాని, తారకడుపునఁ జిచ్చు రగిల్చి కిష్కింధానగరంబును శోకసాగరంబున ముంచి యంగదునకుఁ బితృవియోగదుఃఖంబును గలిగించి యెల్లరనొప్పించి పడసిన యీరాజ్యమొండె రాజ్యభోగంబులొండె జీవితమొండె నాకువలదు. నాయన్నకైన నాక్రోధంబిప్పుడు దుఃఖముగా మాఱెను. ఈనెత్తుటికూడు దినుటకన్నఁ గందమూలంబుల జీవితశేషంబును గడపుదును. 'సుగ్రీవా! నిన్ను జంపుటలేదుపొమ్ము' అని నాయన్న నన్నుఁ బ్రాణముతోఁ బంపిన కృతజ్ఞతనుగూడఁ దలఁపనైతిని. నాయట్టి దురాత్ముఁడును గృతఘ్నుఁడును గలుగఁడు. లోభినై యన్నను జేటువాటఁజేసిన యీపాపాత్మునకు నిరయము తప్పదు. భ్రాతృభావసౌజన్య ధర్మంబులు నాయన్నకే తగుఁగాక నావంటి కామక్రోధవశవర్తికిఁ దగవు. ఇంద్రుఁడు విశ్వరూపవధచేత నెంతపాపంబు నొడిగట్టెనో నేనును నాయన్నను జంపి యంతకు వేయిమడుంగులు పాపంబును సంపాదించితిని. ఇంద్రుఁడు వరదాతగావున వానికలుషంబులు స్త్రీలును భూమియు వృక్షంబులును జలంబులును వరాభిలాషపెంపునఁ బంచికొనెను; సురరాజట్లు తనపాపంబును బాపికొనెను. నాకట్టి సుకృతము గలుగదు. నాకర్మము కులనాశకరంబును ధర్మబాహ్యంబును గావున బ్రజలు నన్ను నమ్మి సన్మానింపరు. ప్రజానురాగము లేనివాఁడెట్టి యధికారంబునకును నొంటగాఁడు. భ్రాతృవధారూపమత్తేభము సంతాపదంతంబులను నాయెడఁ గ్రుచ్చి నన్ను హింసించుచున్నది. ఆలు చన్న మఱియొకతెను బడయ వచ్చునుగాని సహోదరుఁడు చన్న మఱియొకనిఁ బడయఁగాదు. అయ్యో! ఈకూన యంగదుఁడు పితృవియోగ దుఃఖంబునకు జీవించునా? అంగదునియందుఁ దారాజీవములు లీనమైయున్నవి. ఇదంతకుఁ జేటుతెచ్చి మొండికట్టియనై నేను మనుటకన్న నాపాపప్రాయశ్చిత్తంబుగా నగ్నికి సమర్పించుకొని నాయన్న కడకేగుదును. వీరాగ్రణీ! నేను లేనికొఱంత నీకుఁగలుగదు. ఈవానరవీరులెల్లరు నీ పనుపు చేయుదురు. నా ప్రణయంబంగీకరింపు' మని రోదనమొనర్చెను.

### రాముఁడు తారా సుగ్రీవుల నూరార్చుట.

రాముఁడు సంతపడి విచారగ్రస్తుఁడై యుండి తారను డాయఁబోయెను. రాముఁడు వచ్చుటఁజూచి వానరమంత్రులు తారను బలిమిఁ

పడివెక్కుచున్నదానిని బలవంతముగా లేవనెత్తి యీవలికిఁ గొనివచ్చెను. ఆకాంతామణి రామునిఁ జూచి శోకసంభ్రాంతశరీరభావయై 'మహాత్మా! నీప్రభావంబు ప్రమేయము ; నీశక్తి దురాసదము ; నీయట్టి జితేంద్రియుండును ధార్మికోత్తముండును గలుగఁడు. దుష్టసంహారార్థము లీలామానుషశరీరంబును గ్రహించితివి గాని నీకు జననమరణంబులు లేవు. మహానుభావా! ఏబాణంబున నాపతిని వధించితివో యాబాణముచేతనే నన్నుఁ గూడ వధింతువేని నేను నాప్రియునొద్దకుఁ బోయెదను. నీవు లోకాభిరాముఁడవు ; వాలిని గూడ రమింపఁజేయుట నీపని యగుఁగదా. నేను లేకున్న నాపతి సంతసింపఁడు. వీరాగ్రణికి నాపతికి వీరలోకంబున నానాశృంగారవతులు గలరందువా ? వారెందఱున్నను నాపతి నన్నే స్మరించుచుండును. భార్యావిరహదుఃఖమెట్టిదో నీకుఁ జెప్పనక్కఱలేదు. జాగు వలదు ; నాపని సేయుము. స్త్రీహత్యయని వెఱతువా ? అభయము వలదు. భార్యాభర్తలకు వేఱుపాటుగలుగదు. పతి తనపతి యాత్మయగును. పతివధవలననే సతీవధయు సిద్ధించెను. నన్నిప్పుడు నీవు వేఱుగా జంపుటలేదు. మఱియు దానములలోనెల్ల భార్యాప్రదానంబుత్తమోత్తమమందురు. నన్ను నావాలికిచ్చుటవలన నీకిట్టిమహాదాన సుకృతంబుగూడ గలుగును. ఎట్లువిచారించినను నాప్రార్థనంబాలించుట నీకు గుణమగునే గాని దోషముగాదు. మఱియొకరహస్యముగూడఁ గలదు. వాలిని వధించుటవలన నీకు వీరవధాదోషము కలిగినను కలుగవచ్చును. నావధము తద్దోషప్రాయశ్చిత్తమగును. రామా! ఆపన్నులను రక్షింతువని దీక్షవహించితివి. ఈయాపన్నురాలిని రక్షింపవలదా ? సమదర్శికి నీకు భేదభావము తగునా ? నీవు చంపనంతమాత్రాననే నేను జీవింతునని తలంపకుము. ఆమాటకల్ల. రేపుకానున్నపని నిప్పుడే చేయఁగోరితిని. అంతమాత్రము నాయందుఁ గనికరింపు' మని దీనాలాపంబులాడెను.

రాముఁ డామాటలెల్ల విని 'వీరపత్నీ! శూరులకుఁ దగనిమాటలు నీనోటరానగునా ? సుఖదుఃఖంబులు పూర్వకర్మఫలములు. వానిననుభవింపకతీఱదు. వానిననుభవించుటకుఁగా జీవులు తత్తద్యోగ్య శరీరములతోఁ బుట్టుచు గిట్టుచు నడుతురు. భోక్తవ్యకర్మంబు నశింపదనుట యీ చుట్టు గొలుసు తప్పదు. దీనికిఁగాఁ జింతించియు ఫలములేదు. నీకొఱకు యువ

రాజు కాఁగలఁడు ; నీసౌఖ్యంబునకు కొదువయుండదు. వాలి మహాశూరుఁ డును ధర్మపరుఁడును గావున వానికి వధాత్మకమరణంబు సంభవించుట తగదని వగతువా ? అతఁ డెంతవాఁడైనను వానికర్మపరిసమాప్తమట్లున్నది. దాని నెవరు తప్పింపగలరు ? బుద్ధిశాలినివి నీకుఁ జెప్పవలయునా ?' యని చెప్పి సుగ్రీవాదులను జూచి 'చచ్చినవారికై మీరిట్లు దుఃఖపరితాపంబులు పడుట మృతులకు మేలుగాదు. ఇఁక జరుగవలసిన కార్యంబులకు నుపక్రమించుట యుక్తము. జ్ఞానవంతులుగూడ నిట్లే పరిదేవనంబొనర్తురేని మీకును బామరులకును భేదమేమి ? సమస్తసృష్టికి నియతి గలదు. నియతి ప్రకారము సర్వకార్యంబులు జరుగుచుండును. భూతంబులు గూడ నియతికిలోనై వర్తించుచుండును. నియతిని దాఁటరాదు. ఎవఁడుఁగాని దేనికిని గర్తగాఁడు. ప్రేరకుఁడునుగాఁడు. సమస్తముఁ గాలానువర్తియై యుండును. కాలమునే నియతియని చెప్పుదురు. కాలము సర్వస్వతంత్రమైనది ; దానికి షడ్భావవికారములుగాని స్వపరతారతమ్యములు గాని దయాదాక్షిణ్యములుగాని బంధుమిత్రాది సంబంధములుగాని గలుగవు. కాలమే యీశ్వరస్వరూపము. కాలరూపుఁడైన యీశ్వరుఁడు సమస్తకారణంబులకును మూలకారణమై యుండియు నిర్లిప్తుఁడుగా సాక్షిమాత్రుఁడుగాఁ దనరారును. సృష్టియెల్ల నీశ్వరునివలనఁ గలుగుచున్నది. అట్లనుటవలన సృష్టికి నీశ్వరుఁడే కారణంబని యూహింపకుము. వానికారణత్వంబు నిమిత్తమాత్రముగా నుండును ; అనఁగా నీశ్వరసంకల్పము సృష్టికిఁ గారణమగుచున్నది. ఈసంకల్పమన్ననో లీలామాత్రమేగాని వేఱుగాదు. ఈలీల యవాఙ్మానసగోచరము. తావన్మాత్రకర్తృత్వముగల యీశ్వరుని వలన వానినైసర్గికశక్తి సృష్టిరూపమునఁ బ్రవర్తిల్లి స్వతంత్రించి వర్తించును. ఆవర్తనంబింద్రియవ్యాపారరూపముగానుండును. ఈవ్యాపారముయొక్క సదసత్పరిణామంబులుగా సుఖదుఃఖములు గలుగుచుండును. ఇంద్రియములు జడములు గావున వానికిట్టి స్వాతంత్ర్యశక్తి యెట్లువచ్చునని శంకింపవలదు. జడములైనను వానికట్టిశక్తి యీశ్వరసాన్నిధ్యమువలననే గలుగుచున్నది. ఈపరమరహస్యమెల్లరకు గోచరింపదు. అది గోచరింపకపోవుటయే యజ్ఞానమగును. ఈయజ్ఞానకారణంబున జనులు తమ సుఖదుఃఖాదులకు నన్యులను గారణభూతులుగా వచింతురు. సుగ్రీవా !

ప్రస్తావవశంబునఁ దత్త్వార్థమును గొంత సూచించితిని. నీవు వ్యథాదుఃఖంబు మాని కర్తవ్యంబు నూహింపు' మనెను.

వాలిదహనసంస్కారములు

రాముని మాటను లక్ష్మణుఁ డందుకొని 'మిత్రమా! సుగ్రీవా! వాలికిఁ బ్రేతకార్యంబులుం నిలువరాదు. దహనసంస్కారంబులకు వలయు శుష్కకాష్ఠంబులను దివ్యచందనాదులను సంతరించుటకుఁగాఁ దారునకు నంగదునకు నాజ్ఞాపింపుము. అన్యులకు ధైర్యము చెప్పవలసిన నీవే యిట్లగుదువేని యంగదునిసంగతి యింకఁ జెప్పవలయునా ?' యని, తారుని జూచి 'నీవు చని శిబిక నెత్తించుకొని వేగమ రమ్ము; శిబికావాహకులను నిశ్చయింపు' మనెను.

తారుఁడు చని శిబిక నెత్తించుకొని వచ్చెను. ఆ శిబిక పక్షిమృగాది నానాచిత్రచిత్రితమై జాలవాతాయనంబులు గలిగి తరుణాదిత్యబింబములఁ బోని కెందామరలతోను బహువిధ పుష్పమాలికలతోను సమలంకృతమై యుండెను. వానరశూరులు కొందఱు వాలిశవంబును వస్త్రపుష్పాది సమస్తాలంకారశోభితంబుగా నప్పల్లకియందుంచిరి. శవవాహకులు పల్లకి నెత్తికొని తరలిరి. వానరసైన్యరోదనంబులును దారాదిశుద్ధాంతకాంతావిలాపంబులును నింగి ముట్టెను. ఆ శిబిక యనురూప విభవంబుతోఁ జితిస్థానము చేరెను. శవమును జితిపైనుంచిరి; అంగదుఁడు కన్నీరునించుచు యథాశాస్త్రము తండ్రికి నగ్నియొసఁగి యప్రదక్షిణము గావించెను. దహనక్రియలు ముగిసెను. అంత సుగ్రీవాదులు నదీతోయంబుల జలతర్పణంబులు గావించి రామునొద్దకు వచ్చి కయిమోడ్పులతో నిలిచిరి.

సుగ్రీవపట్టాభిషేకము.

హనుమంతుఁడు రామునకు భక్తిపురస్సరంబుగా మ్రొక్కి 'పితృపైతామహమైన రాజ్యంబును మీయనుగ్రహంబున సుగ్రీవుఁడు వడసెను. అనుజ్ఞయేని వానరరాజు నగరు ప్రవేశించి సుహృజ్జనసమావిష్టుఁడై కార్యంబు లొనర్పఁ జెల్లును. మీరును గిష్కింధానగరంబునకు విజయముచేసి మీ చేతులార సుగ్రీవపట్టాభిషేకకార్యంబొనర్చి మాయర్చనలందవేడుదు' మని వినయమధురంబుగా నుడివెను. రాముఁ డది విని 'సౌమ్యా! నీకోరిక

కాంతయును సంతసింతును. పదునాల్గుసంవత్సరంబులు పురముగాని గ్రామము గాని నేను ద్రొక్కఁగాదు. మీరు చని యథాశాస్త్రము సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టుఁ డని చెప్పి "సుగ్రీవా! అంగదునకు యౌవరాజ్యాభిషేక మొనర్పుము. శ్రావణమాసము వచ్చెను; వర్షకాలంబాసన్నమైనది. ఇఁక నాలుగుమాసంబులు వార్షికంబులందురు. ఈనాల్గునెలలు సైన్య యుద్యోగంబునకును దగవు. అందాఁక నీవు కిష్కింధనుండుము. నేను నాతమ్మునిఁ గూడి యీపర్వతమందుఁ గాలము గడుపుదును. ఈగిరి కందరము విశాలమును మహారమణీయంబునై యున్నది. అందు గాలియథాసుఖము ప్రసరించును. దాని సమీపంబునఁ గమలోత్పలసమృద్ధంబులును బరిశుద్ధ బహూదకంబులునైన సరోవరంబులుఁ గలవు. ఆచోటు మాకాంతయు నివాస యోగ్యముగా నున్నది. కార్తికమాసము వచ్చినంత నే మనకార్యంబునకుఁ బ్రయత్నింపుము. ఇదే మనసంకేత" మని చెప్పి వారి నెల్లఁ బంపెను.

వానరులు సుగ్రీవునిఁ గిష్కింధకుఁ దోడ్కొనిచనిరి. నగరవాసులు గుంపుగూడి వానికి నతులొనర్చిరి. సుగ్రీవుఁడు వారి నెల్ల యథార్హము సంభావించి తారనూఱార్చి పట్టాభిషేకమంగళంబునకు సిద్ధుఁడయ్యెను. సువర్ణశ్వేతచ్ఛత్రంబును గనకదండంబును ధవళచామరయుగళంబును నానారత్నంబులను మహౌషధులను క్షీరవృక్షంబుల ప్రరోహకుసుమంబులను దెల్లవస్త్రంబులను ధవళానులేపంబులను సుగంధిమాల్య గంధద్రవ్యంబులను మెట్టదామరలను బంగరునేసలను గాశ్మీరపుష్పమధు దధి ఘృతంబులను వ్యాఘ్రాజినంబును వారాహిచర్మపాదరక్షలను దదితరంబులను సమకూర్చిరి. కన్యకలు పదునార్గురు మైపూఁతలును మనశ్శిలామయతిలకంబును గోరోచనంబును దెచ్చిరి. బ్రాహ్మణోత్తములు నానాభక్ష్యభోజ్యంబులవలనను మణికనకవస్త్రంబులవలనను యథావిధి గౌరవింపఁబడిరి. మంత్రవిదులు వీతిహోత్రంబును గావించి దానిచుట్టు దర్భలు పఱచి వ్రేల్చి బంగారు సింహాసనంబున సుగ్రీవుని దూర్పుముఖముగా సమంత్రకంబుగాఁ గూర్చుండఁ బెట్టిరి. సుముహూర్తంబున గజ గవాక్ష గవయ శరభ గంధమాదన మైంద ద్వివిద హనుమ జ్జాంబవాదులు నదీనదసాగరతీర్థంబులు కలిపి వృషభ శృంగంబులతోను బంగారుకలశంబులతోను సుగ్రీవునభిషేకించిరి. వానర

పెరుల సంతుష్టనాదంబులు మాఱుమ్రోగెను. అంత సుగ్రీవుఁడంగదుని పంపిటఁగూర్చి రామాజ్ఞానుసారముగా వానికి యౌవరాజ్యాభిషేకమొనర్చి వానరలోకంబునకు సంతోషముఁగూర్చి రామునొద్దకుఁ బోయి సంగతి వానికివిన్నవించి వానియనుజ్ఞపడసి వచ్చి రుమతోడ సుఖముండెను.

రాముఁడు ప్రస్రవణగిరియందు వసించుట.

రాముఁడు తమ్మునివెంటఁగొని ప్రస్రవణపర్వతంబెల్లఁ గలయందిరిగి యందొక శిఖరంబును గాంచి 'లక్ష్మణా! ఈశిఖరము వివిధవర్ణశిలామయంబును నానాగైరిక ధాతువంతమునై సెలయేళ్ళతోడను జాజిమొల్లమున్నగు పూఁదీవెలతోడను నిండి మహారమణీయముగానున్నది. ఇందలి పక్షిసంతతముల సప్తస్వరంబుల వీనులకు విందుసేయుచున్నవి. అదిగో యటఁ బెద్ద గుహగలదు. దానిచెంగట తామరకొలనున్నది. గుహాప్రవేశమార్గంబీశాన్య దిశయందును తద్ద్వారము నిర్ఋతిదిక్కున నున్నవి. గావున వానజల్లుతగులదు; మఱియు దానిపశ్చిమభాగము మహోన్నతమై పెద్దగోడవలెనున్నది. ఆ వలనఁ జలిగాలి రాఁజాలదు. ఆబిలముముంగిట విరివియైన నల్లబండ గలదు; ఉత్తరభాగంబున విరిసినకాటుకరాశిఁబోని శిఖరమున్నది; దక్షిణంబున కొండవకైలాసమోయనఁనొప్పు శిఖరంబు నానాగైరికధాతు విరాజితము గలదు. తూర్పున జీవతరంగిణి ప్రవహించుచున్నది. ఈప్రాచీవాహిని తాలతమాల హింతాల కేతక వానీర చంపకాశోక తిలక వకుళాభిరామతీరమై త్రికూటంబున జాహ్నవి వలెఁ జెన్నారెడు. నదీగర్భంబున బురద యింతయుఁ గాన్పింపదు. ఈఝురీమతల్లి తీరవృక్షవాటీసమాకలితయై వస్త్రాభరణాలంకృతయగు ప్రమదారత్నంబును దలపించుచు పరస్పరాసక్తచక్రవాక స్తనియుఁ బులిన శ్రోణియు విహగరుతకింకిణీ కలకలనాదయు హంస దరస్మితయునై చూడఁజూడ ముచ్చట గొలుపుచున్నది. ఇంకొకచోట నిందీవరంబులు నొకతావున రక్తోత్పలంబులు నొకచాయఁ బుండరీకంబులుఁ బొంపారుచు నదీభావగతులను దెలుపుచున్నవోయనవున్నవి. నదీరమణికి వనలక్ష్మికూర్చిన మాలికయోయనఁ జందనపంక్తులొప్పారు కిష్కింధయు నిటకుఁ జేరువనున్నది. ఇందు వసింత' మనెను. లక్ష్మణుఁడొప్పెయనెను. వారందు నివాసముండిరి.

రాముని విరహవేదన.

ప్రస్రవణపర్వతంబట్లు ప్రకృతిశోభాసంపదలకు నిలయమై యెంతయు వాసయోగ్యముగా నున్నను రామునకు నచ్చట నెంతయు హాయి గలుగదయ్యెను. అందలి నదీనదంబులును లతాకుటీరంబులును సరోవరంబులును వానికి సుఖప్రతిపాదకంబులగుటకు మారుగా విరహోద్దీపకము లయ్యెను. ఆతాపాగ్ని చాలదోయన్నట్లు చంద్రుఁడు పొడిచివచ్చి మంటలు రేపి రామునకు నిద్రకునుఁ బగసేయసాగెను. రాముఁడట్లు దుస్సహ విరహవేదనాదీనుఁడై పరితపించుచుండఁగా వాని దురవస్థను లక్ష్మణుఁడు గాంచి "వీరాగ్రణీ! డీలుపడనీకగునా? వ్యసనికి నెల్లకార్యంబులు విఫలించుట నీకుఁ దెలియదా? ఏపనియైనను దైవానుకూల్యంబున సిద్ధించును. దైవపరాయణత్వంబున నీకు సాటిగలుగరు. దైవానుగ్రహంబునకు ధర్మనిష్ఠ యెంతయు మూలమగును. ఎల్లధర్మంబులకు నీవు జీవభూతుండవు. ధర్మనిష్ఠయున్నను గార్యసిద్ధికిం బౌరుషప్రయత్నంబు సాధనంబగు. ఇవన్నియు నీయెడ సంపూర్ణంబులు. ఇన్ని గలిగియు నీవు కార్యసాధనంబునకుఁ బ్రయత్నింపక దైన్యంబునొందనగునా? నీవిక్రమంబునెల్ల మూర్తీభవింపఁ జేసి రావణుని సబాంధవవధకు యత్నింపుము. శోకార్తుఁడవైన నిందలకు నోపవు. అన్నా! నీకు రావణుండొక లెక్కగాదు. ఈసంగతి యెఱింగియుఁ జెప్పవలయుందువా? నివురుగప్పిన నిప్పు నాహుతులచేతఁ బ్రజ్వరిలఁ జేయునట్లు ప్రసుప్తమైన నీచిత్తంబును బ్రబోధింతు" ననెను.

వర్షర్తువర్ణనము.

రాముఁడు తమ్ముని విని "సౌమిత్రీ! స్నేహాస్నిగ్ధుండగు వీరునకుఁ దగినట్లు వచించితివి. అదనువచ్చినప్పుడు నాతేజము ప్రకాశించును. దానిగూర్చి సంశయము వలదు. మనయుద్యమంబునకు వర్షాకాలంబడ్డు వచ్చెను. దానిని జననిమ్ము. అంతలోన సుగ్రీవుండును వానిరాచకార్యమును దిద్దుకొని మనకుఁ దోడగును. లక్ష్మణా! అదిగో చూడుము.

"మ॥ ఖరఘర్మోఘ విఘాత సంవిహిత విశ్వోల్లాసమై సంచల
త్స్వరసాంభోద నినాద తూర్యరవమై చంచద్వలాకాగరు
ద్భరలీలానవ చామరస్ఫురణమై పర్జన్య సామ్రాజ్యమో
ప్పె రమామందిరమై యుదగ్రశిఖినీ పింఛాతపత్రంబులన్."

తమ్ముఁడా! గగనకామిని సముద్రజలంబులను రవికరంబులఁ గ్రోలి కార్తికాద్యాషాఢమాసపర్యంతము నవమాసములు చూలుదాల్చి యదిగో యిప్పుడు రసాయనంబును బ్రసవించుచున్నది. మేఘపఙ్క్తులు సోపానంబులట్లు చదలఁజెలువారెడు. ఆమెట్లపయిఁజని సూర్యభగవానుని గొండమల్లెదండలతోను నేలుమద్ది పూమాలలతోను బూజింపనగును. నీరదశకలంబులు వర్షించి యల్పజలవంతంబులగుటంజేసి వెల్లపాటి సాయంసంధ్యారాగప్రసారంబున రక్తమధ్యభాగంబులును బాండురాంతరంబులు గగనభాగవ్రణంబులకుఁ గట్టిన నెత్తురుకట్లో యనయున్నవి. అంబరము సంజకెంజాయ మైపూఁతనలది ననుగాలినిట్టూర్పులు పుచ్చుచు నాపాండురజలదమై కామాతురునిఁ దలపించుచున్నది. ధాత్రియెల్ల ఘర్మపరిక్లిష్టయయి నవవారిపరిప్లుతయునై శోకసంతప్తయైన నాసీతయట్లు బాష్పంబు విడుచుచున్నది. అహో! మేఘోదరనిర్గతంబులై కల్హారశీతల కేతకీ గంధబంధురంబుగా వీచుచున్న యీమందమారుతంబులను దోసిళ్లతోఁ ద్రావనెంతయుఁ దమకమయ్యెడు. ఈ పర్వతరాజు వికచార్జునకుసుమమాలికలను ధరించి మొంగలిపూవెత్తావి గుభగుభల సొబగారుచు శాంతారియైన సుగ్రీవుఁడు నిజపట్టాభిషేకసమయంబునఁబోలె ధారాభిషిక్తుఁడగుచున్నాఁడుగదా. గిరివరాధ్యాపకులు మేఘంబులనెడి కృష్ణాజినంబులను ధరించి జలధారలనెడి యజ్ఞోపవీతంబులను దాల్చి గహ్వరముఖంబులతోఁ బ్రతిధ్వానవేదాధ్యయనంబొనర్చుట వింటివా? లక్ష్మణా! నీలమేఘంబున విడివడక చలించుచున్న యీమెఱుపుఁదీవెను జూడఁగా రావణాంకమునఁ జిక్కి తప్పించుకొనుటకుఁగా విగ్గులాడు సీత తలంపునకునచ్చుచున్నది. తారానిశాకరులను గప్పివుచ్చి దెసలేర్పడనట్లు గ్రమ్మియున్న యీచిమ్మచీఁకట్లు మన్మథారాధన తత్పరులకుఁ గావించు ప్రియమింతనవచ్చునా? సౌమిత్రీ! ఆవిగో కొండమల్లెలు గిరిసానుప్రలంబు బుష్పించి బాష్పసంవృతములై వర్షాగమనంబునకు మహాసముత్సుకత్వమొందుచుఁ బ్రియావిరహశోకాభిభూతులకు నమబోంట్లకుఁ గామసందీపనంబులగుచున్నవి సుమా. తమ్ముఁడా! భూతలంబెల్లఁ బ్రశాంతరజఃపటలమయ్యెను; వాయువుచల్లగా వీచుచున్నది; ఎండవేడిమి చల్లారెను; రాజులదండయాత్ర లుపశమించెను; ప్రవాసులు స్వస్థానములకు జేరుచున్నారు; హంసలు మానససరోవరంబు నభిలషించి పఱచుచున్నవి;

చక్రవాకములు ప్రియాపరిష్వంగమునందుఁ జిక్కెను; మార్గములు వర్షోదక ధారావిక్షితములు గావున యానసంచారంబు లుడిగెను ; సెలయేళ్ళు పక్వ కదంబపుష్పవ్యామిశ్రితంబులును ధాతుతామ్రంబులును నైన నవోదకంబు లతో నిండి మయూరకేకానుప్రయాతములై శీఘ్రతరముగాఁ బ్రవహించు చున్నవి ; జంబుఫలంబులు రసాకులములై ప్రజాచిత్తముల నాకర్షించు చున్నవి ; రసాలఫలంబులు పండి గాలివడికి రాలుచున్నవి; మేఘంబులు పరస్పరము కలహించి విద్యుత్పతాకలెత్తి యొండొంటి ఢీకొని పోరు మత్త గజంబులవలె సముదీర్ణనాదంబులతో గర్జించుచున్నవి ; శాద్వలప్రదేశం బులు వర్షోదకంబుల నాప్యాయంబొందుటంజేసి నెమిళ్ళు పరాహ్ణసమయంబు లందచ్చటఁ జేరి నేర్పుమై నృత్తోత్సవములనొనర్చుటఁ జూడఁగా నెంతయు సంతోషమయ్యెడు. వారిధరంబులు సలిలాతిభారంబునఁజేసి బలాకిబృం దము నూతగాఁగొని మహీధ్రశృంగాగ్రంబులందు నిలిచి నిలిచి బడలికలు వాసి చనుచున్నవి. గర్భధారణార్థము బలాకలు శ్రేణులుగట్టి మేఘంబు నంటి దిరుగుచు గాలికిఁగదలుచున్న గగనకామినీకంఠ పుండరీకమాలవలె దోఁచును. భూకాంతామణి శాద్వలంబను పీతాంబరంబు నారుద్రకీటక లాక్షారసచిత్రితమైన దానిని ధరించి హాయిగా గులుకుచున్నది. యోగ నిద్ర విష్ణువును పొందుటయ్యెను. శైవలిని సాగరమునకై పరుగెత్తుచున్నది; కాంతలు ప్రియుల బిగికౌఁగిళ్లఁ గ్రాలుచున్నారు ; వనాంతమెల్ల మయూర నృత్త రంగమయ్యెను ; వృషభంబులు గోవులవెంటఁ దగిలెను ; పుడమి సస్యవనాభిరామమయ్యెను ; భ్రమరంబులు కడిమిపూఁదేనెసోనలుగ్రోలి మత్తిల్లి యాతరుశాఖలఁ దగిలివ్రేలాడుచు వర్షధారానిపాతంబునఁ దడిసి కైపు తెలియుచున్నవి. శైలవనాభిముఖమై చను మత్తగజము మేఘగర్జ నంబును బ్రతినాగధ్వనిగా శంకించి యుద్ధాభికామంబున వెనుకకు మరలు చున్నది. వనభూమి కదంబసర్జార్జున కుసుమాలంకృతమై యరఁటిపూఁదో ప్పలనెడు పానపాత్రములలో నవోదకమను మధువును నింపి వెమకళ్లు దుష్పానమువలెఁ గానిపించుచున్నది. సలిలంబులు సురేంద్రప్రసాదంబుగా గగనాంతరమునుండి ముత్తెములవలెఁ బత్త్రపుటంబుల రాలుచుఁ బానాతుర ములై యున్న చాతకంబులకు మహా ప్రమోదంబును గూర్చుచున్నవి

షట్పదఝుంకారమనెడు తంత్రీనినాదంబును బ్లవంగవోదీరిత కంఠనాళం బును మేఘగర్జామృదంగనాదంబును మేళగింపఁగా మయూరంబులు కొన్ని పింఛలు విప్పి నృత్యములొనర్చుచుఁ గొన్ని కేకారవములు చేయుచుఁ గొన్ని వృక్షాగ్రముల నధివసించి చూచుచు నుండుటవలన వనాంతరంబెల్ల గొప్ప సంగీతసదనమువలెఁ దోఁచుచున్నది. నానారూపవర్ణప్లవంగంబులు నవధారాభిహతింజేసి నిద్రాభంగమొంది మేల్కాంచి గందరగోళముగా నఱచుచున్నవి. నదీబిబ్బోకవతులు తమచక్రవాకంపు గబ్బిగుబ్బల యుబ్బుల వలన జలమదసమృద్ధంబును దెలుపుచు హద్దులతిక్రమించి భోగద్రవ్యంబులను గైకొని భర్తృసమాగమోత్సుకలై ద్రుతగమనంబునఁ జనుచున్నవి. జలధరంబులు నవవారిపూర్ణములై యొండొంటినొరసి దావాగ్నివలన నల్లవాఱిన బద్ధమూలశైలంబుల కరణినున్నవి. నవాంబుధారాహత కేసరంబులైన సరోరుహంబులను భ్రమరంబులు త్యజించి సద్యోవికచకదంబపుష్పంబులపైఁ దమకంబున వ్రాలుచున్నవి. పర్వతరాజులు నరేంద్రులవోలె ఘనాంబుకుంభాభిషేకంబులంది స్వరూపలక్ష్మితోఁ బ్రకాశించుచు నెంతయు నానందమునుగూర్తురు. సెలయేఱులు ముక్తాహారంబులు శిఖరస్తనతటంబులం బడి తెగి జాఱి బిలాంతరమునఁ దగిలి నిలుచుచున్నవి. అహో! వర్షకాలము సర్వజనాహ్లాదకరమయ్యు నాకెంతో సంతాపమును గలిగించుచున్నదిగదా. కటా! దురంతమైననాశోకంబును మహాదుర్గమంబైన వర్షర్తువును నసాధ్యుండగురావణుని నతిక్రమించుట కల్లగాఁ దోఁచెను. సీతాన్వేషణంబును రావణవధమును సుగ్రీవుఁడు ప్రేరేపించెను. వర్షకాలంబగుట యిప్పుడు వలదంటిని. ఆవానరేంద్రుఁడు పడరానికష్టంబు లొంది చెప్పరాని విరహక్లేశంబనుభవించి బహుకాలంబునకు భార్యా సమాగమసుఖంబును బడసెను. అంతలోన వానికి మరల వియోగవ్యసనంబును గలిగించుట పాడిగాదు. అదియునుంగాక నాపని యొకటిరెండుదినాలలో ముగియునదిగాదు. ఎట్లు విచారించినను వానినిప్పుడే తొందరించుట సరిగాఁ దోఁపదు. శరత్కాలము వచ్చినంతనే సుగ్రీవుం డుపకారకృతజ్ఞుఁడై వర్తించును. లక్ష్మణా! అందాఁక మనము వేచియుండక తీఱదు. ఉపకారికిఁ బ్రత్యుపకారంబొనర్పుట ధీరలోకంబునకు నైజము. అకృతజ్ఞుఁడన్నవో ప్రత్యుపకారంబును దలపెట్టక సాత్త్వికులమనంబు లెరియించును.

సుగ్రీవునకుఁ బ్రత్యుపకారబుద్ధియే గాక సత్పురుషకోపభయంబుగూడఁ గలదు. నేఁటఁజెప్పినమాట నతఁడు తప్పఁడ' నెను. లక్ష్మణుఁడు కృతాంజలియై 'సుగ్రీవుఁడు మీమతంబును దప్పక సేయును. నరేంద్రా! ధీయుండవై యీవేదనోద్వేగంబును సహించి శరదృతువు నెదురుచూచుట యుక్తము.' అని శుభాస్పదముగా నిజాభిప్రాయంబును దెలిపెను. సౌమిత్రి యెంతచెప్పినను రామునకుఁ జిత్తము సంవిత్తము గాదు. అతఁడు లోలోన సీతను దలంచి

"చ. తలరు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు వెగడందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గ్రుం
దలపడుఁ దల్లడంబడరి ధైర్యము దూలిన బెల్లడిల్లు వి
చ్చలవిడిఁ జేర్చు నెవ్వగల సందడి డెందము గంది చేడ్పడున్"

హనుమంతుఁడు సుగ్రీవుని హెచ్చరించుట.

రాముఁడట్లు విరహవేదనా దోదూయమానమానసుఁడై దినము లెంచుచుండెను. అంతలోన గగనతలము విద్యుద్బలాకంబులనుబాసి చంద్రికానులేపనంబునొందెనో యన రమ్యమైతోఁచెను. సారసరుతంబులు మనోహరములయ్యెను. సుగ్రీవుఁడు నిఖిలమనోరథంబులు దీఱ భార్యయగు రుమను తనయభీష్టయగు తారను గూడి కామవృత్తుఁడై యహోరాత్రంబులుపుచ్చుచు ధర్మార్థసంగ్రహమందు శ్రద్ధవహింపక రాజ్యభారంబును మంత్రులపయి మోపి నిరంకుశవృత్తిఁ గ్రీడలఁదగిలియుండెను. అతఁ డర్థతత్త్వజ్ఞుండును గాలధర్మవిశేషవేదియునై యుండియు నట్లగుటు హనుమంతుఁడు చూచి చింతపడి కొండొకనాఁడు వానిని సమీపించి 'వానరరాజ్యలక్ష్మి కులక్రమాగతగా నిన్నుఁ గూడెను. రాజ్యముతోడ యశోరమయు నిన్నువరించెను. మిత్రకార్యమట్లే శేషించియున్నది. ఎవఁడు సమయంబెఱిఁగి మిత్రుల యెడ సాధువృత్తిఁ జూపునో వాని యశోరాజ్యప్రతాపంబులు మూఁడును వెంపొందును. ఏరాజునకుఁ గోశము తఱుగకుండునో యేలినికి సైన్యము వశమైయుండునో యెవనిని మిత్రవర్గము పాయకుండునో యతఁడు రాజగును. మిత్రునకుఁగా సమస్తముఁ బరిత్యజించినను నట్టిత్యాగికట్టి యనర్థము పొరయదు. సమయము జాఱనిచ్చి చేసినమేలు మేలుగా నేరదు.

'ఉ॥ శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చె సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై॥'

రాముఁడు నిర్మలంబగు గగనభాగంబును విమలంబగు చంద్రమండలంబును జంద్రికారమణీయమైన శరద్రాత్రిని జూచి సీతాదేవిని స్మరించి శోకవివశుఁడై 'హా! సారససారవనాదినీ! సారససారవసన్నాదంబుల నాశ్రమములందు రమించు నీవు నేఁడెట్లున్నావోగదా! బాలారత్నమా! సువర్ణసుమంబులను మరపించు వేగిన ప్రసూనంబులనుజూచి నేను చెంతలేమి కెంత పరితపింతువోగదా? కలభాషిణీ! కలహంసకలకలరవంబులకు మేలుకొందువు. ఇప్పుడేరవములు నిన్ను మేలుకొలుపుచున్నవో? మృగశాబాక్షీ! నీవు లేనందున సరిత్సరోవర కాననవిహారంబులు నాకెంతయు వెగటయ్యెనుం హా! మదనమహామండలేశ్వరా! నీవు శరద్గుణనిరంతరుండవగుట యెఱుంగుదును, నన్నుఁబాసి యున్న భామినీమణిని సుకుమారాంగిని బాధింపవలదని విలపింపసాగెను.

లక్ష్మణుఁడు ఫలాహరణార్థమై గిరినితంబములకుఁ జనియుండి వచ్చి విజనస్థలంబున నేకాకిగాఁ గూర్చుండి దుస్సహదుఃఖంబునఁ బరితపించుచున్న రాముని జూచి వ్యసనదీనుఁడై 'ఆర్యా! కామవశంగతమగుటకు నిది తరుణమా? ఇప్పుడు పౌరుషంబును వదల వచ్చునా? ఉత్సాహంబును బాసినమనోధైర్యము గలదా? క్రియాభియోగమనఃప్రసాదంబులను గలిగి దేశకాలంబు లెఱింగి సహాయసామర్థ్యముఁ బడసి భగవదనుగ్రహంబునకుఁ బాత్రులై జనులు నిజాభిమతంబులను సాధింతురు. అట్లుకానినాఁడు చీమంతపనికేఁ గూడఁ గొఱగారు. మానవాగ్రణీ! సీతాదేవికై నీవు దుఃఖింపనేల? ఆమహాభాగధేయ నెవ్వఁడుఁ జెనకనోపఁడు. ఆమెను దాఁకుట బడబానలంబు నంటుటగు' నని యోదార్పులు వచించెను.

లక్ష్మణుఁ డిట్లు హితంబును బథ్యంబును నయప్రసక్తమును ధర్మార్థసమాహితంబును గా వచింప రాముఁ డాకర్ణించి 'కుమారా! ప్రకృత కార్యంబును మఱువలేదు. సహస్రాక్షుఁడు వసుంధరకు సలిలసంతర్ప

ణంబు గావించి సస్యంబులను బండించి తాను గృతకృత్యుండయ్యెను. జలదంబులు స్నిగ్ధగంభీరనిర్ఘోషంబులై గిరితరుశిఖరంబులం దారాడి నీరంబులను విసర్జించి పరిశ్రాంతము లయ్యెను. వృష్టివాతంబులు శీతలంబులును గుటజార్జునగంధసంభరంబులునై మహావేగమున వీచి వీచి వేసరి విరమించెను. మేఘగర్జితంబు లుపశమించెను; గజబృంహితములు వినరావు; మయూరధ్వనులు సన్నగిల్లెను; ఝరీనాదంబులు శమించెను; గిరులు మేఘాభివృష్టంబులై నిర్మలత్వ మొంది గైరికధాతుచిత్రదీప్తి ప్రసారంబునం గుంకుమాంకలిప్తములో యన నొప్పుచున్నవి. నవసంగమసంప్రీడయగు యోషిన్మణి నిజజఘనంబునుబోలె శరన్నదులు పులినభాగంబులను మెల్లమెల్లగా బయలుపఱచుచున్నవి. శరదృతువు తనవిభవంబునెల్ల ఏడాకులరంటిశాఖలందును దారార్కనిశాకరులందును నుత్తమవారణలీలలందును బంచిపెట్టెను. శరల్లక్ష్మి తనచిత్రశోభను రవికరాగ్రప్రతిబోధిత పద్మాకరములందుం దాఁచెను. పవనము సప్తచ్ఛదకుసుమామోదగంధబంధురమై షట్పదగీతాలాపంబులం దవిలి మైమఱచి వీచి మత్తేభంబులమదంబు నినుమడించుచున్నది. హంసచక్రవాకమిథునంబులు నదీపులినప్రదేశంబులందుం జేరి యొండొంటికి నెదురుగా నిలిచి పద్మరజోవకీర్ణములైన తమపక్షములను విదుర్చుచు విహరించుచున్నవి. నభోభాగంబెల్ల నంబుధరవిముక్తమై తుప్పుదుల్పి తోమినకత్తివలె నిర్మలమయ్యెను. మయూరములు ప్రియానురక్తి నొంది యుత్సవము మాని బర్హాభరణంబులను విసర్జించి సన్న్యాసంబును గ్రహించి ధ్యానపరంబులయ్యెనో యన నున్నవి. కుసుమగౌరవంబులును నయనాభిరామంబులును మనోజ్ఞగంధంబులునునైన ప్రియకవృక్షంబులు వనలక్ష్మి గృహదీపికలట్లు ప్రకాశించుచున్నవి. ఏడాకులయరంటిపూవెత్తావులకు గజంబులు గండభాగంబుల మదము స్రవించుచు విషయాసక్తములై వనవిహారతత్పరత మందమందగతులం జరించుచున్నవి. దిక్కులు శప్పువదలి శోభిల్లుచున్నవి; పంకంబులింకెను; భూభాగమెల్ల ధూళీధూసరమయ్యెను; ఆఁబోతులు శరత్కాలగుణాప్యాయితరూపంబుల శోభిల్లుచుఁ బ్రహర్షించి దుమ్మున బ్రుంగి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచు నాలమందలనడుమఁ జేరి ఱంకిల్లుచున్నవి. కరిణీమండలము దీర్ఘసంప్రాప్తమికిఁ జిక్కి మదమత్తగజంబులను బరివేష్టించెను. మయూరంబు లాత్మపింఛా

విభూషణంబులను ద్యజించి నదీతీరంబులకుఁ బోవుటయు వానినిఁ గాంచి యందలి శరత్కాలమదోద్ధతహంసంబులు కూయుటయుఁ జూడఁగా దైవోపహతుఁడగు దరిద్రుని జూచి నదుపమంత్రప్రసిద్ధిగలాఁడు హసించుచందము దోఁచుచున్నది. బురద లేమింజేసి ప్రసన్నంబులైనతోయంబులు గలిగి పులినప్రదేశశోభావంతములై తీరనిషణ్ణగోగణంబులతో సారసారావంబులతో రమణీయంబులు గానున్ననదులను హంసములు మహాసంతోషముతోఁ బ్రవేశించుచున్నవి. అంబుధరంబులకు నోడి బిలములు దూఱి క్షుధార్తిఁ జిక్కి కృశించియున్న ఘోరతరాశీవిషంబులు మెల్లమెల్లఁగా వెలికిఁ బ్రాఁకుచున్నవి. సంధ్య శశికరస్పర్శవలన హర్షోన్మీలితతారకయు రాగవతియునై యంబరమును స్వయముగా డించుటఁ జూడఁగా మహాచిత్రమగుచున్నది. రాత్రి శశాంకవక్త్రయుఁ దారాగణోన్మీలితచారునేత్రయునై జ్యోత్స్నాంశుకమును గట్టి ధవళాంశుకయగు మూర్ఛవలె నొప్పుచున్నది. అంచలు పండినశాలిప్రసవంబులను మెక్కి సంతుష్టములై జాలుగట్టి నింగికి నెగయుటఁ జూడఁగాఁ దెల్లపూమాల గాలి కెగయుచున్నదో యనుశంక జనించుచున్నది. సరోవరము సుప్తైకహంసముఁ గుముదోపేతమునై ఘనవిముక్తంబును బూర్ణచంద్రంబును దారాగణాకీర్ణంబగు నగునంతరిక్షమువలె నున్నది. వాపికలు ప్రకీర్ణహంసపాళుల మేఖలాయుతంబులును ప్రబుద్ధపద్మోత్పలమాలికాభిరామంబులునై దివ్యభూషణంబులతోఁ గైచేసికొన్నయుత్తమాంగనల సిరులను దలపించుచున్నవి. గర్గరగోవృషనాదంబులును వేణుస్వనంబులును బ్రత్యూషపవనంబున మేళవించి వ్యాపించుచున్నవి. నదీతీరంబులు తెల్లగాఁ బూచియున్నట్టియు పలిగాలికిఁ గదలుచున్నట్టియు రెల్లుతో నిండి వెలిపట్టుచీరెఁ గట్టినవనితాజఘనంబులను స్మరణకుఁ దెచ్చుచున్నవి. చంచరీకంబులు వనాంతరముఁజేరి విశృంఖలవృత్తి సంచరించుచుఁ గ్రొందేనెలుఁ గ్రోలి మత్తిల్లి ప్రియులఁగూడి వచ్చి పద్మకింజల్కపరాగమలంది చెలరేఁగి పవనుఁడు సంతరించికొనిపోవుచున్న సుగంధంబును డెబ్బవాట్లు గొట్టుటకుఁగా వానిని వెన్నాడి తఱుముచున్నవి. జలము ప్రసన్నంబగుటయు, కుముదము ప్రభాసంబగుటయు, క్రౌంచస్వనము మధురంబగుటయు, శాలివనము విపక్వంబగుటయు, మారుతము మందమగుటయు, చంద్రమండలము విమలంబగుటయు,—ఇవియెల్ల వర్షకాలముపోవుటను దెలుపుచున్నవి. అదిగో నదులు

మీనోపసందర్శితమేఖలలై కాంతోపభుక్తాలసగామిను లగు కామినులు ప్రభాతంబునవలె మెల మెల్లఁగాఁ బ్రవహించుచున్నవి. నదీవధూటీముఖంబులు చక్రవాకమకరపత్త్రాలంకృతంబులును శైవలగోరోచనసమంచితంబులును గాశదుకూలావృతంబులును నై నూత్నశోభను వహించెను. ప్రఫుల్లబాణాసనచిత్రితంబులును బ్రహృష్టషట్పదవికూజితంబులు నైన వనంబులందుఁ గాముఁడు ధనుర్బాణములు దాల్చి విరహిజనమృగయావినోదియై విహరించుచున్నాఁడు. తోయధరంబులు నదీతటాకంబులను నించి లోకమునకుఁ బరితోషము నొనర్చి నభోభాగమును వీఁగెను. రాజులు పరస్పరవైరామర్షంబులను సాధించుకొనుటకుఁ గాలమనువయ్యెను.”

అని పలికి ‘లక్ష్మణా! సుగ్రీవుఁ డింతదనుక రాఁడు; ప్రతిన మఱచెనా? చక్రవాకమును జక్రవాకివలె నన్నీకాననకు వెంబడించి వచ్చిన ప్రియురాలిని గోల్పోయి శోకాభిహతుండనై వార్షికమాసంబులు నాలుగును నాలుగేండ్లుగాఁ గడపిన నాయెడ సుగ్రీవునకు జాలి గలుగదా? సౌమిత్రీ! రాజ్యమును బోఁగొట్టికొనెను; ఇల్లు వెడలింపఁబడెను; అడవుల నాశ్రయించెను; భార్యను రావణునకు నప్పగించెను; దిక్కులేనివాఁడై శరణుజొచ్చెను’ అని యతఁడు నన్నుఁ దలఁచెఁగాఁబోలు. నీవు కిష్కింధకుఁ జని గ్రామ్యసుఖంబులఁ దగిలియున్నవానిని జూచి, ప్రతిన హెచ్చరించి, యుపకారికాసగలిగించి తప్పుట పురుషాధమత్వంబని తెలిపి, మిత్రులవలన మేలు పడసి వారికిఁ బ్రత్యుపకారం బొనర్పని కృతఘ్నులు మరణానంతరము క్రవ్యాదులకుఁగూడ వెక్కసంబగుదు రని చెప్పి, నేను నా హస్తంబునఁ జాపమును ధరించుట యతఁడు చూడనున్నాఁడేమో రొంటిగ రమ్ము. నా పరాక్రమంబు వానికిఁ గ్రొత్తగాదు. అతఁడు మిన్నకుండుటేలనో తెలియరాదు. కామోపభోగంబులవలన నతఁడు మనలను మఱచి యుండును. వాలి చన్నమార్గ మింకను సంకుచితంబు గాదనియు, నద్దానిని గోరవలదనియు, సత్యము దప్పినచో సబాంధవముగాఁ గూలుదువనియు నా మాటగా సుగ్రీవునకుఁ జెప్పుము. లక్ష్మణా! వేయేల? కార్యస్థితిని బట్టి చెప్పఁదగినదంతయుఁ జెప్పుము; జాగు వలదని సరోషముగా వచించెను.

లక్ష్మణుని సుగ్రీవు నొద్దకుఁ బంపుట.

కామదీనుఁడైయున్న రాముని కోపము సుగ్రీవుని యుపేక్షాభావముచే భగభగమండెను. ఆవీరాగ్రణి యాగ్రహదుర్నిరీక్షుఁడుగాఁ గానిపించెను. లక్ష్మణుఁడదియెల్ల గ్రహించి 'అన్నా! సుగ్రీవుఁడు సాధువృత్తిని దలఁపఁ నేని, వానిరాజ్యప్రాప్తి భార్యాపునస్సమాగమంబులు నీచెలిమిఫలంబులని యతఁడు మఱచునేని, వానరరాజ్యశ్రీ వానికిఁ దక్కదు. వానరేశ్వరుఁడు మతిచెడి గ్రామ్యసుఖాసక్తుఁడై నీయొనర్చిన మేలునకు బదులొనర్పకున్నాఁ నతఁడు వానియగ్రజునిఁ గూడుట సిద్ధము. దుష్టునకు సిరిని గూర్పరాదు. నాకోపము మేరమీఱెను. అసత్యవాది నిప్పుడే మట్టుపెట్టుదును. వాలి సుతుఁడు సీతాన్వేషణకార్యభారము వహించుఁగాక' యని పలికి బాణా సనము నందికొని తరలనుండెను. రాముఁడు వానికెంతయు బెగ్గడిల్లి 'నా యనా! మిత్రవధరూపపాతకంబెన్నఁడు వలదు. ఎవఁడు తనపాపబుద్ధిని వివేకమువలన నణచివైచునో యతఁడే పురుషోత్తముఁడు. సుగ్రీవునితో సఖ్యమాచరించితిమి. ఆ చెలిమినిప్పుడు వదలరాదు. అతఁడు గడవుమీఱె నందువా? అది యంత పెద్దతప్పుగా నెంచవలదు. వానితోఁ బరుషము లాడక సామోపహితముగా భాషింపు' మని యతనికోపమును జల్లార్చెను.

లక్ష్మణుఁడు కిష్కింధకుఁ బోవుట.

లక్ష్మణుఁడు లోలోనఁ గనలుచుఁ గిష్కింధకుఁబోయెను. వానిఁ జూచి యెవఁడో శత్రువు వచ్చెనని వానరవీరులు భయమంది సుగ్రీవునకు సంగతి వినిచిరి. వానరేంద్రుఁడు మన్మథమోహితుఁడై తారతోడిదే లోకంబుగానుండి యామాటలు చెవినిడకుండెను. కపిమంత్రులు విక్ర మెఱుంగఁగోరి యావానరవీరులను మరలఁ బంపిరి. వారు చని ప్రాకారపరిఘాం తరముదాఁటి లక్ష్మణదృష్టిపథమున నిలిచిరి. అంగదుఁడు మాత్రము లక్ష్మణుని గుఱితించి వినయనమ్రుఁడై యతని డాయఁబోయెను. సౌమిత్రి వానిఁ జూచి 'వత్సా! అంగదా! అరిందముఁడైన రామానుజుఁడు భ్రాతృవ్యసన సంతప్తుఁడై వాకిటనున్నాఁడనియు వానివచనము రుచించునేని తగునట్లు వర్తింపుమనియు సుగ్రీవునకుఁ దెలిపి వెంటనే రమ్మనెను.

అంగదుఁడు లక్ష్మణకోపవచనంబులకు శోకావిష్టుఁడై చని సంగతి యెల్లఁ బ్లక్షుఁడు ప్రభావుఁడు ననెడి వానరమంత్రులకు వినిచి వారిని వేఁడి

గొని యంతఃపురమునకుఁ బోయి పినతండ్రికినిఁ దనతల్లికిని బినతల్లికిని నమస్కరించెను. మన్మథమోహంబునకు సారాయికై పుత్త్రోత్సవంబున కై పయికొనుటవలన సుగ్రీవుఁడు వివశావస్థ నుండెను. మంత్రులు వానినిఁ గ్రమక్రమంబుగా సామవచనంబులఁ బ్రసన్నునిఁ గావించి 'రాజేంద్రా ! రామలక్ష్మణులు నీతోసఖ్యంబొనర్చుటయు నీకు రాజ్యంబిచ్చుటయు మఱువవుగదా. వారు సత్యసంధులును మహాభాగులు నగుట నీకుఁ దెలిసిన విషయమేగదా. లక్ష్మణుఁడు ధనుష్కుఁడై మనద్వారంబున నున్నాఁడు. వానికి వెఱచి మనవానరులు గావించుచున్న యఱపులు వినరావా ! తారాసుతుఁడంగదుఁడు వానిపంపున నిటు వచ్చెను. నీవు తోడ్తోడఁ బుత్త్రమిత్త్రబంధుసహితంబుగా లక్ష్మణునొద్దకుఁ జని ప్రణమిల్లి యతని యలుకఁ దీర్పనగును. సౌమిత్రి యేదో రామసందేశమును గొనివచ్చి యుండును. అదియేమో యెఱింగి యొనర్చుటమే' లని చెప్పిరి.

లక్ష్మణుఁడు కుపితుఁడై యుండుట సుగ్రీవుఁడు విని 'పలుకరానిదేమియుఁ బలుకనైతి ; తప్పుసేయలేదు. లక్ష్మణుఁడేల నాపయి నలిగెనో యూహింపరాదు. నాఛిద్రంబులను వెదకు దురాత్ములు మదీయవైరులు గలరు. వారు కానిమాటలు వానికిఁ జెప్పి యుందురని యూహింతును. కారణాంతరమున్నచోఁ దెలుపనగును. రామలక్ష్మణుల సన్నిధానంబున నాకు గోరంతభయముగూడఁ గలుగదు. అయినను మిత్త్రుఁడు కోపగ్రస్తుఁడగుటకు సంభ్రమంబగుచున్నది. మిత్త్రులను సుకరముగా సంపాదింపవచ్చును. వారిని బరిపాలించుట మాత్రము మహాదుష్కరము. చిత్తము చంచలాంచలము ; గోరంత యప్రీతి యొదవినను స్నేహమునకు భంగము గలుగును. మహాత్ముఁడు రాముఁడు నాకుఁజేసిన యుపకారంబునకు విలువయే గలుగదు. వానికిఁ దగు ప్రత్యుపకారంబొనర్ప నాకు శక్యముగాదు. అందులకెంతయు భయపడుదు' నని పలికెను.

హనుమంతుఁడు సుగ్రీవునకు నుద్యోగకాలమును జ్ఞప్తిచేయుట.

హనుమంతుఁడావచనంబులు విని 'వానరేశ్వరా ! ఉపకారిని నీయట్టివారెన్నడును మఱువరు. ఇది నిస్సంశయము. రాముఁడు నీకుఁ బ్రియంబొనర్చుటకుఁగా నిజప్రాణంబులను గూడఁ దలంపక శక్రపరాక్రముని

వాలిని బరిమార్చెను. అట్టిరామునకు నీయందుఁ గ్రోధముదయించునా!
లక్ష్మణుఁడేల వచ్చెనందువా? ఏమఱపాటువలన నీకుఁ గాలము తెలియరాదు.
ఏడాకులయరఁట్లు పూచియేచి శ్యామమై యెంత సొంపు నింపుఁ గూర్చు
చున్నవో చూడుము. ఆకసము మబ్బులెడసి నిర్మలగ్రహానక్షత్రమై యల
రారుచున్నది. దిశలును నదీసరోవరంబులును బ్రసన్నములయ్యెను. శర
దృతువు వచ్చుటయు నుద్యోగకాలమాసన్నంబగుటయు గ్రహింపవు.
నీకు హెచ్చరిక చేయుటకుఁగా రాముఁడు లక్ష్మణుని బంపియుండును.
రాముఁడు భార్యావియోగ దుఃఖార్తుఁడు ; వానిసందేశము పరుషముగా
నుండవచ్చును. అంతమాత్రాననే నీవు కినియవలదు. సంకేతకాలము
దాఁటి యపరాధమొనర్చితివి. నీతప్పునొప్పుకొని లక్ష్మణునిఁ బ్రసన్ను
గాఁజేయుము. వేఱుమార్గము తోఁపదు. మంత్రులు తమ ఱేనికి హితము
వచించుట విధివిధానము. ఆతలంపుతో భయము దక్కి తోఁచినది పల్కి
తిని ; రాముఁడు కోపవివశుఁడై చాపముఁబూనెనేని మృత్యువుగూడ
వెఱచిపాఱును. ఆధీరుఁడు నిసర్గప్రసన్నుఁడు ; మీఁదుమిక్కిలి మహాబల
శాలి. అట్టివానికిఁ గోపముఁగలిగింపరాదు. అదియునుగాక నీవు వాని
కెంతయుఁ గృతజ్ఞతాబద్ధుండవు ; ఆకారణంబునఁగూడ నీవలన వానికి లేశ
మాత్రము గూడఁ గోపము జనింపరాదు. నీవు నీవారినెల్లరను వెంటగొని
చని యొఱిగి భార్యభర్తనువలె వానికి వశవర్తివై యుండుము. రామలక్ష్మ
ణులమాటనుఁ దలంపునఁ గూడ దాఁటవలదు. వారి యస్త్రబలమనోబలం
బులు నీకు విదితములే గదా?’ యని వచించెను.

### లక్ష్మణుఁడు సుగ్రీవునంతఃపురమునకుఁ బోవుట.

సుగ్రీవుఁ డామాటలు విని ‘వత్సా! అంగదా! నీవు చని లక్ష్మణుని
దోడ్కొని రమ్మనెను. అతఁడుచని పిలిచినంతనే లక్ష్మణుఁడు బయలు
దేరి నగరుజొచ్చెను. ఆనగరాంతరమునఁ గానసంబెల్లఁ బుష్పించి
మహామనోహరముగానుండెను. అందలి హర్మ్యప్రాసాదము లొండొం
టితో నొరయుచుండెను. నగరమెల్ల సర్వకామఫలంబులైన వృక్షంబు
లతో నిండియుండెను. బజారులు విశాలములై చందనాగరుసుగంధంబుల
వెత్తావులతో మైరేయమధూవాసనలతో గుబాళించుచుండెను. లక్ష్మణుఁ
డట్టినగరముఁ బ్రవేశించి యంగద మైంద ద్వివిద గయ గవాక్ష గజ

శరభ విద్యున్మాలి సంపాతి సూర్యాక్ష నళ కుముద సుషేణ తార హనుమ
జ్జాంబవతాదుల లోఁగిళ్ళు చూచుచుఁ బోయి పాండురసాలపరిక్షిప్తంబును
దురాసదంబును మహేంద్ర సదనోపమంబు నైన సుగ్రీవుని ప్రాసాదంబును
వీక్షించి తప్తకాంచనతోరణమును దివ్య మాలావృతమును శస్త్రపాణి
సంరక్షితము నైన తద్ద్వారంబును దాఁటి మహేంద్రదత్త నీలజీమూతసన్నిభ
శీతచ్ఛాయావృక్షంబులతో రమణీయమై యున్న యతని గృహంబును
సూర్యుఁడు మేఘంబునట్లు ప్రవేశించి నానాజనసమాకులములైన కక్ష్యలను
గడచి తదీయాంతఃపురము చొచ్చెను. అందు సువర్ణరజితాసనంబులకు
సంఖ్యలేకుండెను; అడుగుభాగమెల్ల వెలలేని దివ్యాస్తరణములతోఁ గప్పఁ
బడియుండెను; సమగీతపదాక్షరమధుర స్వరంబులు తంత్రీగీతములతో
మేళవించి కర్ణరసాయనమొనర్చుచుండెను; రూపయౌవనగర్వితలైన నారీ
మణులు వివిధమాల్యాభరణంబులఁ దైసేసి ఫలములను సంగ్రహించుచుఁ
బుష్పదామములను గూర్చుచు నేత్రపర్వమొనర్చుచుండిరి; సేవకులు తమ
తమ పనులఁ దగిలి యుండిరి. లక్ష్మణుఁడా కాంతామణుల నూపురశిం
జితంబులకును గాంచీనినదంబులకును లజ్జించి సుగ్రీవుని స్త్రీలోలత్వంబునకు
నెంతయుఁ గోపమొంది జ్యానాదము గావించి కాంతాజనప్రదేశంబునకు
దూరముగా నిలిచెను.

తార లక్ష్మణుని కోపముఁ జల్లార్చుట.

ఆధనుష్టంకారంబునకు సుగ్రీవుఁ డుత్తలపాటునొంది యుత్తమాసనం
బునుండి చలించి లక్ష్మణుఁడు వచ్చుట గ్రహించి భయంబున నోట తడి
యారఁగాఁ బ్రియురాలిని దారను జూచి 'ప్రేయసీ! మృదుస్వభావుఁడు
లక్ష్మణుఁడు కోపగ్రస్తుఁడట్లు తోఁచుచున్నది. కారణ మూహింపనో
పుదువా? ఏదేని యప్రియంబును వానికొనర్చితినా? ఏది యెట్లున్నను నీవు
స్వయముగాఁ జని వానిని సాంత్వవచనంబులఁ బ్రసన్నుని జేయుటొప్పును.
మహాత్ములు స్త్రీలయెడ దారుణము వహింపరు. నీవు వానికోపమును
జల్లార్చిన తర్వాత వానిని నేను సందర్శింతు' ననెను.

సీ॥ మదవిహ్వలంబులై మలయుకన్యలతోడ
రవళిల్లు మణినూపురములతోడ

నొండొంటఁ బెనఁగొన్న యురుహారములతోడఁ
ఘలుఘల్లుమనుచున్న కాంచితోడ
నిటలంబుఁ గప్పిన నెఱిముంగురులతోడ
స్తనభారనమ్రమౌ తనువుతోడ
స్విన్నమై సొబగారుచున్న ముఖముతోడ
మొలకనగవుల కెమ్మోవితోడ

గీ॥ నడుగడుగునకు నసియాడునడకతోడ
జెదరి జాఱెడు పయ్యెదచెఱఁగుతోడ
హారువుగొన్న సంభోగచిహ్నములతోడ
దారయరుదెంచె సౌమిత్రిఁ దారసిల్ల.

అట్లు వచ్చిన తారను మదమద్య వినివృత్తలజ్జయై యున్నదానిని లక్ష్మణుఁడు పరికించి స్త్రీలయెడఁ గోపము కారాదని తలంచి తలవంచుకొనెను. ఆయింతి మైత్రీప్రాగల్భ్యంబునఁ దెంపుచేసి 'మనుజేంద్రపుత్రా! కోపమేల? నీయాజ్ఞ నుల్లంఘింపఁడుగదా. శుష్కవృక్షవనంబునఁ బ్రజ్వరిల్లు దావాగ్ని నెవ్వఁడు డాయ సాహసించు' ననెను. లక్ష్మణుఁడా సాంత్వపూర్వకవచనంబులు విని 'భర్తృహితా! నీపతి సుగ్రీవుఁడు కామవృత్తుఁడై ధర్మార్థసంగ్రహములను మఱచుట నీకుఁ దెలియదా? అతఁడు రాజ్యార్థంబులను దలఁపకున్నాఁడు; శోకపరాయణులమైన మాసంగతి మఱచుట వింత గాదు. వానరేశ్వరుఁడు యుద్ధసన్నాహమునకుఁగా నాలుగు నెలలు గడవేర్పఱచుకొని వచ్చెను. అవధి మించిపోయెను; అతఁడా మాటయే తలఁపఁడు. మదమోహంబులు వానికి విస్మృతి నొదవించెఁ గాఁబోలు. ధర్మార్థములెక్కడ? మద్యపానసేవ లెక్కడ? పానాతురులకు నర్థధర్మంబులు నశించుటయే గాక కామము గూడఁ బరిహృతమగును. ఉపకారికిఁ బ్రత్యుపకారమొనర్పమికన్న మహత్తరధర్మలోపము గలుగదు. ఎవఁడిట్టి లోపవశంబున గుణవంతుఁడగు తనమిత్రునకుఁ జేటొదవించునో వాని కామార్థములు నిలువవు. అర్థకామములకు సత్యధర్మాతుఁడగు మిత్రుఁడే మూలమగును. అట్టి చెలిని నర్థకామములకన్నఁ బెద్దసేయుదురు. కార్యతత్త్వజ్ఞవు నీకుఁ దెలియనిది లేదుగదా. ఇక మేమేమి సేయవలయునో నీవే వచింపుము' అనెను.

తార యామాటలవలన సంగతియెల్ల గ్రహించి 'వీరాగ్రణీ! మా మిత్రుఁడు పరాకుచెందకు; మీపనియందే యున్నాఁడు. ఒకవేళ మీ నెయ్యుఁడు కామవశంబున నేదేని రవంత ప్రమాదమొనర్చినను మీరు సహింపవలదా? గుణప్రకృష్టులెన్నఁడేని యలతులపై నాగ్రహింతురా? ఆరయుచు గాక మహాపురుషులకుఁ గోపము తగునా? సుగ్రీవుని ప్రాపకశక్తుఁడైన రాముని కోపమన్న నెట్టిదో నాకుఁ గ్రొత్తగాదు. సీతాన్వేషణ కార్యము సుంతయాలస్యమయ్యెనని వానికిఁ గోపమువచ్చియుండును. మీ కొనర్చిన మేలు మఱువము; మీకార్యము నెఱుంగుదుము. అయినను మన్మథశక్తి మమ్ము కొంచెమేమఱించెను; కామతంత్రంబునఁ దగులని నీబుద్ధి కది గోచరింపదు. మన్మథవశులు దేశకాలంబులనుగాని ధర్మార్థములనుగాని చూడరు. నీతోఁబుట్టువు సుగ్రీవుఁడీతప్పుగావించుటకు నేను చెంతనుండుటయే కారణమయ్యెను. కావున దోషమంతయు నాదిగానున్నది. క్షమింపవేడుదును. ధీవరేణ్యా!

సీ. వేయేండ్లనిష్ఠ గాధేయుఁడర్పింపఁడే
మేనకతగులంబు మేలు చేసి?
చిరతపంబును బుష్యశృంగుఁడు వదలఁడే
కాంతాపరిష్వంగ సౌఖ్యమొలసి?
నాగాభరణుఁడర్ధ నారీశ్వరుఁడు గాఁడె
గిరిసుతా సంగమకేళిఁ గోరి?
తనవ్రతంబెల్ల గౌతమఋషి మానఁడే
యాయహల్యాంకంబు నభిలషించి?

గీ. వాయుపర్ణాంబు శాకనీవారభక్షు
లైన మునులంత వారె జోహారువనఁగ
షడ్రసాన్నపానమదవిస్తారులైన
మాకుఁ గపులకా సాధ్యుండు మన్మథుండు?.

ఆర్యవర్యా! ఈమన్మథవ్యాపారము ప్రాణికోటికెల్ల నైజము. దీనికిఁ బ్రవాసము మహోద్దీపకరమగును. పునస్సంధానమొందదవిషమ గాలక్రమమునఁ గాని వెల్లిదమైన యాతవి శమింపదు. దురత్యయమైన యీప్రకృతికి

వానరమాత్రుఁడు సుగ్రీవుఁడు వశంవదుఁడగుట వింత గాదు. అట్టి యాకపీశ్వరుఁడు మీయెడఁ బరాకుచెందఁడు. సంగతి విచారింపక కోపపడుట ప్రాకృతులకు నగుగాని మీబోంట్లకుఁ దగదు. ధర్మజ్ఞా! ఈమహాకోపసంభ్రమంబులను వదలి ప్రసన్నుఁడవగుము. రామునికొఱకు సుగ్రీవుఁడు తుదకుఁ బ్రాణములనేని త్యజింపనున్నాఁడు. ఆకీశాధీశుఁడు రావణుని రణరంగంబున నోర్చి రోహిణీచంద్రులవలె సీతారాములకు సమాగమమును జేకూర్చును. లంకానగరమందు రక్షోవీరులు కోట్లకొలఁది గలరు. వారు మహాబలపరాక్రమవంతులే గాక కామరూపులునై విక్రమోత్సాహంబుల సాటిలేక విఱ్ఱవీఁగుచుందురు. వారినిమట్టుపెట్టక రావణుని జెనకఁ దరముగాదు. ఆసోకుమూఁకను దాకుటకు వానరపరివారము తగునంతవలయును. వాలివలననే నీసంగతి విని తెలుపుచున్నాను. వానరయూధపంబులకు నాజ్ఞయయ్యెను. ఎల్లరకుఁ బదునైదుదినములు గడపీయఁబడెను. కొందఱువచ్చిరి; కొందఱు వచ్చుచున్నారు. సుగ్రీవుఁడు వారి రాక నిరీక్షించుచున్నాఁడు. కపిసైన్యము చేరినంతనే వానరేశ్వరుఁడు రామకార్యార్థము తరలును. అరిందమా! ఇది కడపటి దినము. నేఁడు సాయంత్రములోన వేనవేలు వానరభల్లూకగోలాంగూలవీరులు నిన్ను సేవింతురు. అయ్యా! కోపరక్తారుణితంబులైన నీనేత్రంబులను జేపూరించి యున్న నీముఖమండలంబును వాలివధాభయవిహ్వలమతులైన సుగ్రీవభార్యాజనంబునకు దహాతివా పాటొదవించుచున్నది. ప్రసన్నుఁడవై మాకెల్ల నభయమొసంగు'మని వినయధర్మపురస్సరంబుగా వచించెను.

### సుగ్రీవ లక్ష్మణాల సంభాషణము.

లక్ష్మణుఁడు తారావచనంబులకు సంతసించి ప్రసన్నుఁడయ్యెను. సుగ్రీవుఁడు నిజభయంబును దడివస్త్రమునువలె విడిచి తన మెడనున్న చిత్రవర్ణశోభితసుగంధిబంధురపుష్పమాలికను ద్రెంచివైచి మన్మథమదంబాడి లక్ష్మణుని డాయవచ్చి 'సౌమిత్రీ! ప్రణష్టలైన శ్రీకీర్తులను శాశ్వతమైన వానరరాజ్యంబును నాకు నెవనిప్రసాదంబున సంప్రాప్తములయ్యెనో ఏదయాశాలియొసర్చిన యీమహోపకారమునకుఁ బ్రత్యుపకారమునొనరింప నాకు జన్మజన్మములకుఁ దరముగాదో యారాముఁడు పరమ ధర్మాత్ముఁడు

కుశలమేగదా? అధమమ్మంతుఁడు పరసహాయ నిరపేక్షముగా రావణుని వధించి సీతను బడయఁగల్గియు వానరసహాయమును గోరుట నాయందు వానికిఁ గల ప్రణయవిశ్వాసంబులను వెల్లడించుటగాని వేఱుగాదు. ఒక్కబాణంబు చేత సప్తమహావృక్షంబులను శైలంబును భూమిని భేదించిన వీరశిఖామణికి నాస్వల్పశక్తి తోడ్పాటెట్లగునో నీవే యూహింపవచ్చును. అయినను వానివెంటవచ్చు మహాభాగ్యము మాకుఁ జేకూఱినందులకెంతయు సంతసించుదుము. మీభృత్యుఁడు నంత కాలాతిక్రమణ రూపమైన యపరాధమొనర్చెను. అది క్షమింపనగును. తప్పుసేయనివాఁడెందుఁ గలుగఁడుగదా!' యని విన్నవించెను.

లక్ష్మణుఁడు పరమసంతోషమునంది 'వానరేశ్వరా! నాథుఁడవును మీఁదుమిక్కిలి వినయసంపన్నుఁడవును నైన నీవలన నాయన్న సనాథుఁ డయ్యెను. సుగ్రీవా! నీయట్టి శౌచార్జవప్రభావసంపన్నుఁడు వానర రాజ్యశ్రీవిభుఁడగుట వింతగాదు. నీసహాయంబున రాముఁడు శత్రువులను మట్టుమాపుట నిక్కము. ధర్మజ్ఞుఁడును కృతజ్ఞుఁడునునైన నీయట్టి యుప రాజ్యాభిసంగ్రామధీరునకు నిట్టివచనంబులెంతయు నుపపన్నములేగదా! మిత్రమా! ఆత్మాపరాధంబు నొప్పుకొనుట నీయందును నాయన్నయందును మాత్రమే గంటిని. నాయన్నకు సాటియైన బలపరాక్రమశాలివి నీవు మాకు సహాయమగుట దేవతానుగ్రహఫలముగాని వేఱుగాదు. సుగ్రీవా! నీమిత్రుఁడు రాముఁ డిప్పుడెంతయు భార్యాపహరణశోకకర్శితుఁడై యుండు చున్నాఁడు. నీవు వచ్చి వాని నాశ్వాసింపనగు. వానివిలాపంబులు సైరింపనోపక నిన్ను పరుషంబులాడితిని. ఆమాటలు మదిలోఁ బెట్టక నన్ను క్షమింపు' మనెను.

సుగ్రీవుఁడు వానర సైన్యార్థము పిలువఁ బంపుట.

సుగ్రీవుఁడంతఁ దన చెంతనున్న హనుమంతునిఁ జూచి 'మహేంద్ర హిమాలయ వింధ్యకైలాస మందర పర్వతంబులందున్న వానరులను బశ్చిమ సముద్రతీర బాలసూర్యవర్ణపర్వతంబులందును సంధ్యామేఘశోభాయమాన మైన యుదయాద్రియందును వసించు వానరులను రప్పింపుము. మఱియుఁ బద్మతాళవనమందుఁ గొందఱున్నారు. వారికి సంగతి తెలుపుము. కాటుక

వర్ణమును నీలమేఘచ్ఛాయను మఱపించునల్లని మేనులుఁగలిగి గజబలోద్ధతులైన వా రంజనాద్రియందుఁ గలరు. మనశ్శిలాగుహాలయందు సువర్ణచ్ఛాయా దేహులు వానరులు వసించుచున్నారు. వారికిని వివరము నందింపుము. మేరుపార్శ్వమందును ధూమ్రగిరియందును మహారుణపర్వతమందును మఱి కొందఱు గలరు. వారి కెఱుక సేయుము. వనాంతరములందును ఋష్యాశ్రమములందును గొందఱుందురు. వారువీరననేల ? పృథ్వీమండలమందున్న వానరులనెల్ల వెంటనే రప్పింపుము. జాగుసేయవలదు. ఇంతకుమున్నే దూతలను బంపియున్నాను. మఱలఁ గొందఱను వాయువేగవంతులను బరలింపుము. నాయిచ్చిన పదునైదు దినముల గడవు నేటితో ముగియును. ఆలోనరానివారు రాజశాసనదూషకులుగా గణింపఁబడుదురు. ఆదురాత్ములకు వధారూపశిక్షతప్పదు' అని యాజ్ఞాపించెను.

వానరవీరులు తోడ్తోడఁబయనమై వాయుమార్గము మెట్టి వనపర్వతంబులందును సరస్సముద్రాంతములందును రాజాజ్ఞనుఁజాటిరి. ప్రలయ కాలమృత్యువునుబోని సుగ్రీవాజ్ఞను విన్నంతనే వానరులు భయగ్రస్తులై యంజనాద్రినుండి మూఁడుకోట్లును, అస్తగిరినుండి పదికోట్లును, కైలాస శిఖరములనుండి వేయికోట్లును, హిమవత్పర్వతమునుండి పదిలక్షలకోట్లును, వింధ్యాచలమునుండి పెక్కువేలకోట్లును, క్షీరసాగరతీరమునుండియు దమాల వనమునుండియు నసంఖ్యాకములుగాను వెడలిరి.

అంతకుమున్నే నీలుఁడు కొందఱను బంపెను. వారప్పుడు వచ్చి సుగ్రీవునకు మ్రొక్కి 'దేవా ! హిమవంతమునుదాఁకితిమి. అందుఁ దొల్లి సర్వదేవతాప్రీత్యర్థము మాహేశ్వరయాగమొనర్చిన పుణ్యక్షేత్రము నుజొచ్చితిమి. ఆక్షేత్రమందు సుప్రసిద్ధమహావృక్షములున్నవి. ఆతరువులందు సుధారుచిరఫలములుగలవు. ఆఫలము మాహేశ్వరయాగహవిర్ద్రవ్యఁదప్రభవంబులనియు వానినిఁ దిన్నవారికి మాసపర్యంతము నాఁకలి దప్పులుండవనియు వింటిమి. ఆఫలంబులను మఱియు నందలి గొన్నింటి దివ్యౌషధులను సురభివంతపుష్పంబులను దేవరవారిప్రీత్యర్థము గొనివచ్చితి' మని చెప్పి యవి సమర్పించి తాముపోయివచ్చిన కార్యమును విన్నవించిరి.

సుగ్రీవుఁడు రామునిఁ సందర్శించుట.

సుగ్రీవుఁ డా కానుకలు గ్రహించి వారిని మంచిమాటల సంతసపెట్టి పంపివైచి 'రామకార్యము సిద్ధించెను; కృతార్థుఁడ నైతి' నని భావించి తారాదిస్త్రీజనమును వీడ్కొని మిఱుమిట్లుగొల్పుచున్న పల్లకిపయి లక్ష్మణునితోడ నెక్కి శిరోపరిభాగంబున శ్వేతచ్ఛత్రంబు విరాజిలుచుండఁగా, నలుకెలంకులందు వెల్లవింజామరలు వీచుచుండఁగా, శంఖారావములును భేరీ, భాంకారములును జెలంగఁగా, మంగళస్తుతులును జైవారంబులును నింగి ముట్టి మాఱుమ్రోయఁగా వానరవీరు లాయుధపాణులై పరివేష్టించినడువఁగా నఖండరాజ్యశ్రీవిరాజితుఁడై తరలి ప్రస్రవణపర్వతముచేరి సౌమిత్రితోడఁ బల్లకినుండి దిగి కయిమోడ్పుతో రాముని సమీపించి వానికి దండప్రణామంబొనర్చెను. రఘువీరుఁడు సుగ్రీవునిఁ గేలఁబట్టి లేవనెత్తి ప్రీతితో సందిటఁగూర్చి బహూకరించి కూర్చుండుమనెను. వానరేంద్రుఁడు రాముని చెంగట నేలపయిఁగూర్చుండెను. కపిసైన్యము మోడ్పుఁ గేలెత్తి నిలిచి తామరమొగ్గలతోడి తటాకంబువలె నుండెను.

రాముఁడంతట సుగ్రీవుని జూచి 'హరిసత్తమా! ధర్మార్థకామంబులను విభజించి యేదియెప్పుడు సేవింపనగునో దానినప్పుడు సేవించువాఁడే స్వధర్మమెఱింగిన రాజగును. ధర్మార్థములనువదలి కామమునుమాత్రమే యెల్లప్పుడును సేవించువాఁడు వృక్షాగ్రమున నిద్రించువాఁడువలె నధఃపతితుఁడై మేల్కాంచును. శరదృతువాసన్నమయ్యెను; యుద్ధోద్యోగంబునకు నిదితగినకాలము; కర్తవ్యమును నీమిత్రులతో నాలోచింపు' మనెను. వాఁడును 'శూరాగ్రణీ! ఎడఁబాసిచన్న శ్రీకీర్తులను శాశ్వతకపిరాజ్యంబును నీయనుగ్రహంబువలనను నీతమ్మునికృపవలనను నాకు మరల దక్కెను. ఉపకారమునకు, బ్రత్యుపకారమొనర్పనివాఁడు పురుషాధముఁడగును. శత్రుసూదనా! భూమండలమునన్న భల్లూకగోలాంగూల వీరులకెల్లరకును సంగతి తెలిపితిని. దేవగంధర్వప్రభవులును గామరూపులునైన వానరవీరులు నూర్లుగా వేలుగా లక్షలుగా నర్బుదములుగా ఖర్వములుగా మధ్యంబులుగా నంతంబులుగా సముద్రంబులుగాఁ బరార్ధంబులుగాఁ దమతమసేనలతో వచ్చుచున్నారు. వారు రావణుని సబాంధవవధఁగావించి సీతాదేవిని నీకుఁ గూర్ప సమకట్టియున్నా' రని సుగ్రీవుఁడు వచించెను.

రాముఁడు సంతసించి వికచనీలోత్పల శుభదర్శనుఁడై 'ఇంద్రునకు వర్షించుటయు సూర్యునకుఁ దిమిరంబులను బోఁపుటయు జంద్రునకు జల్లదనంబును గూర్చుటయు నెట్లు సహజధర్మమో యట్లే నీయట్టి వారికి మిత్రోపకారముధర్మంబగును. ఇది వింతగాదు. నీవు కేవలమిత్రమాత్రుఁడవేగాదు; మిత్రహితోల్లాసివి. నీ సహాయంబున శత్రుమండలహరణంబు నాకు సులభసాధ్యమగును. అనుహ్లాదుఁడు తొల్లి యింద్రుని వంచించి శచీదేవి నపహరించి యాత్మవినాశమొందెను. రావణునకుఁగూడ నట్టిగతి తప్ప' దనెను.

వానరసైన్యము చేరుట.

వారట్లు సంభాషించుచుండఁగా దవ్వునఁ బెంధూళిరేఁగి నింగియెల్లఁ బర్వి సూర్యకాంతిని గ్రసించెను; దిక్కులు తోఁపవయ్యెను; మహీమండలము సశైలవనంబుగాఁ జలించెను; సంగతి యేమోయని చూచుచుండఁగానే కామరూపులైన వానరయూథపులు కోట్లకొలఁది పరివారముతో వచ్చి యాగిరితలమెల్లఁ గప్పిరి. నీలుఁడంతట లేచి యావచ్చినవారినెల్ల సుగ్రీవునకిట్లు నివేదించెను. 'వానరేశ్వరా! ఇతఁడు శతవలి · మహేంద్రపర్వతమునుండి వచ్చెను. ఇతనిబలము పదివేలకోట్లు; అవిగో యందున్న తరుణాదిత్యవర్ణులును శశిగౌరవవర్ణులును బద్మకేశరవర్ణులును ధవళవర్ణులును వీని కోటిలోనివారు. అపరంజిమేనిచాయవాఁ డీతఁడు సుషేణుఁడు, తారతండ్రి; ఇతఁడు దశసహస్రకోటి పరిమితసైన్యముతో వచ్చెను. అల్లతఁడు తారుఁడు. అతఁడు వేయికోట్లవానరులతోఁ జేరెను. ఈతఁడు కేసరి, హనుమంతుని తండ్రి, మహాబుద్ధిశాలి; ఇతఁ డనేకానీకసమావృతుఁడై వచ్చెను. ఈతఁడు గవాక్షుఁడు గోలాంగూలరాజు; వీనిని వేయికోట్ల వానరులు వెంబడించిరి. అతఁడు ధూమ్రుఁడు. వీనివెంట రెండువేల కోట్లు భల్లూకవీరులు భీమవేగవంతులున్నారు. అల్లతఁడు పనసుఁడు; పర్వతాకారులును ఘోరులునైన యావానరవీరులు మూఁడుకోట్లు వాని బలము. ఈతఁడు గయుఁడు పదికోట్లతోఁ జేరెను. మఱియు నశ్వినీసుతులైన మైందద్వివిదులు సహస్రకోటికోట్లతోను, గజుఁడు మూఁడుకోట్లతోను, జాంబవంతుఁడు పదికోట్లతోను, రుమణ్వంతుఁడు నూఱుకోట్లతోను,

గంధమాదనుఁడు పదిలక్షలకోట్లతోను, అంగదుఁడు వేయిపద్మములు నూఱు శంఖములతోను, తారుఁ డయిదుకోట్లతోను, ఇంద్రజానువు పదునొకండు కోట్లతోను, రంభుఁడు దశసహస్ర సహస్రశతంబులుగాఁ బన్నిన యూథంబులతోను, దుర్ముఖుఁడు రెండుకోట్లతోను వచ్చిరి. హనుమంతునంటి వేయికోట్లుగలరు; నలునిక్రింద నూఱుకోట్లున్నారు; దధిముఖుఁడు పదికోట్లను, శరభుఁడును కుముదుఁడును వహ్నియు రంహుఁడును లెక్కకు మీఱినసైన్యముతోను వచ్చిరి. అప్రాకృతులును బ్రాకృతులునైన వానరవీరులు వచ్చి లంఘించుచు గుప్పించుచు గర్జించుచు మహోత్సాహులై రాజాజ్ఞ వేచియున్నా' రనెను.

సుగ్రీవుఁడు వానరసైన్యమును రామునకు నప్పగించుట.

యూథపతులెల్లరు మేఘంబులు సూర్యునివలె సుగ్రీవుని బరివేష్టించి తమతమరాక తెలియించుకొనిరి. వానరేశ్వరుఁ డాసైన్యము నెల్ల రామునకు సమర్పించి 'వానరేంద్రులారా! మీమీ సేనలను శాస్త్రోక్తవిధి నెలయేళ్ళ తీరమున యథాసుఖము విడియింపనగును. అట్లుగానిచో యూథపతికి సేనావిశేషము లేర్పడ' వని చెప్పి రామునివంక మరలి 'వీరశిఖామణీ! నారాజ్యమందలి వానరవీరులెల్లరు వచ్చి విడిసిరి. వీరిబలపరాక్రమంబు విస్తరించిచెప్పనలవిగాదు. ఇందొక్కఁడొక్కఁడే యసాధ్యసాధ్యములను సాధింపఁగలఁడు. ఎట్టిశ్రమకు వెనుదీయరు; ఫలోదయమువఱకు వ్యవసాయమును మానరు; ఎన్నోయుద్ధములొనర్చి గడితేతియున్నారు; దివియందును భువియందును జలాంతరములందును నిరాతంకముగా సంచరింపఁగలరు; ఎంతయు స్వామిహితులు; యథామతి వీరి నాజ్ఞాపింప నగు' ననెను.

రాముఁడంతట సుగ్రీవుని గవుంగిటఁ గ్రుచ్చి 'మిత్రమా! నాప్రియురాలు సీత బ్రతికియున్నదో లేదో, రావణుని నివాసమేదో, యీరెండు సంగతులు మొట్టమొదటఁ దెలియవలయును. సీత జీవించియున్నఁగదా యనంతరకార్యమునకు నవకాశముండును. సుగ్రీవా! ఈవిషయమున నేనుగాని లక్ష్మణుఁడుగాని నియామకులము గాము. సర్వము నీయందున్నది. ఏమిచేయవలయునో నీవే యూహించి యాజ్ఞాపింపుము. నీవు పరాక్రమ

కాలవిదగాని వట్టివాఁడవుగావు; మహాప్రాజ్ఞుఁడవు; నీకుఁ దెలియని కాలవిశేషములేదు; అర్థవిత్తమునందును సుకృతార్థత్వమందును నీసాటిగలుగదు. నాకు లక్ష్మణుఁడెట్లో నీవు నట్లయితివి. ఇఁక నేమిచెప్పవలయు" నని తనభావంబును బహురమ్యముగాఁ దెలిపెను.

సీతాన్వేషణార్థము వానరులను సుగ్రీవుఁడుపంపుట.

అంతట సుగ్రీవుఁడు వినతుఁడను యూథపతిని బిలిచి "వానరాగ్రణీ! దేశకాలనయజ్ఞులును గార్యాకార్యవినిశ్చయకుశలులును రవిచంద్రాత్మజులు నైన వానరులను వెంటఁగొని నీవు తూర్పుదెసగాఁ దరలి గంగాసరయూకౌశికీ యమునాసరస్వతీనదుల పరిసరప్రదేశంబులను మణిస్వచ్ఛజలసమృద్ధమైన శోణనదముయొక్క ప్రాంతారణ్యంబులను మహీదేశంబును శైలకాననశోభితమైన కాలమహీదేశంబును బ్రహ్మమాలవిదేహ మాళవ కాశీ కోసలదేశంబులను మాగధదేశంబును శోకకాయుల రాజధానియు రజతఖనిమయప్రదేశంబును బరిశోధించి రామునిభార్యయు దశరథుని కోడలునైన సీతాదేవి యెందున్నదో సాధింపుము. కొండలను మందర శిఖరంబుల వెదకనంపుము; సముద్రాంతరములు సాధింపఁ గొండలను దరలింపుము; కొండలు మహాపట్టణము లామూలాగ్రము పరిశోధింపనగును. ఒక్కొక్కచోటఁ జెవులులేనివారుందురు; ఒక్కొక్కచోటఁ బెదవులందుఁ జెవులుగలవారు గానవత్తురు. లోహముఖులొకచోట, ఏకపాదులొకచోట, నందందుఁ బురుషాదకులును గర్ణచూడులును హేమాంగులును గలరు. కొన్ని ద్వీపములందు నంతర్జలచరులైన కిరాతులుందురు; కొన్నిటియందు మత్స్యజీవులు గలరు; పులితలయు నరశరీరంబును గలవారు కొన్నిటఁ గలరు. వీరినెల్ల మెలఁకువతో దప్పించుకొని దిరుగవలయును. కొన్నితావులకు వాయుమార్గమునఁ జనవలెయుండును; కొన్నిచోట్లకుఁ దెప్పలమీఁద నీఁదవలసియుండును. మీఁచనుమార్గంబున బంగారుగనులు గానవచ్చును. అదే సువర్ణరూప్యకద్వీపము. రత్నఖనులు గలిగి సప్తఖండములుగా నందు ద్వీపమొకటిగలదు. దానినే యవద్వీపమందురు. ఆ రెండు ద్వీపములను జక్కగా బరిశోధింపవలయును. శిశిరపర్వతము నింగినొరయు శిఖరములతో నొప్పుచుండును; అందు దేవ దానవులుందురు. ఆపర్వతరాజము నెక్కుట

మున్నది. అదిమహాభయంకరమై యుండును. దానినిఁ గడలిగానుండందురు. దానిజలంబులందు నౌర్వకోపప్రభవమైన యశ్వముఖబడబాగ్ని నిక్షిప్తమై యున్నది. ఆయగ్ని వేడిమికి నందలిభూతంబులు గావించుచుండు మహాక్రోశధ్వనులు మీకువినవచ్చును. ఆకడలి యావలిదరికిఁ బదుమూఁడు యోజనములదవ్వునఁ గాంచనపర్వతము గలదు. దానిని జాతరూపశిలయందురు. దానిశిఖరంబున సర్వమూర్తి యాదిశేషుఁడుండును. తెల్లనిమేనుతో నల్లనివస్త్రముతో వేయితలలతో నొప్పుచు భూభారమెల్ల మోయుచున్న యాసర్వభూతనమస్కృతుని సందర్శించు మహాభాగ్యము మీకచటనగును. ఆపర్వతశిఖరంబున మూఁడు తలలబంగారుతాటివృక్షమున్నది. అదే యా మహాత్ముని ధ్వజము. ఆతాలధ్వజము ప్రాచీదిశకునెల్లగాఁ ద్రిమూర్తులేర్పఱచిరి. దానితర్వాత యుదయాద్రి యున్నది. దానియగ్రభాగము నూఱుయోజనములయున్నతమై నింగినొఱయుచుండును. ఆనగమందు సాల తాలతమాలవృక్షంబులును బుష్పితకర్ణికారంబులును మెండుగాఁగలవు. ఆశైలాగ్రతలమందు హిరణ్మయశిఖరము పదియోజనములయెత్తు నొక్క యోజనము విరివిగలది యొకటిగలదు. దానిని సౌమనసంబందురు. శ్రీ మహావిష్ణువు వామనావతారమెత్తి బలిచక్రవర్తివలన మూఁడడుగులనేలఁ గైకొనినప్పుడు తొలిపాదము నీశృంగమందును రెండవపాదము బశ్చిమదిశకు హద్దుగానున్న సౌవర్ణమేరుశిఖరంబున నుంచెను. సూర్యుఁడస్తమించి జంబూద్వీపముయొక్క యుత్తరభాగంబునుజుట్టి యాసౌమనసశిఖరంబునఁ దోఁచు నప్పుడు మేరుదక్షిణపార్శ్వంబున నుండు మనకు వానిసందర్శనమగుచుండును. సూర్యరశ్మి యుదయాద్రిహిరణ్మయతేజముతోఁగలిసినప్పుడచ్చటఁ గాంతిసంధ్యారాగము రక్తవర్ణముగానుండును. ఆశిఖరమందు భాను తేజోమూర్తులును మహాతపస్సంపన్నులునైన వైఖానస వాలఖిల్య మహర్షులు గానవత్తురు. ఉదయాద్రికి సమీపంబున సుదర్శనద్వీపము గలదు. భూమికిని సమస్తలోకంబులకును ద్వారముగా లోకబాంధవుని యుదయస్థానముగా బ్రహ్మదేవుఁడు తూర్పుదెస నేర్పఱచుటవలన దానికిఁ బూర్వదిశ యను పేరు గూడ వచ్చెను. అందాక గలప్రదేశంబులనెల్ల మీరువెదకవలెను. ఆవల సూర్యచంద్రులసంచారము లేమి గావునఁ దద్భాగమంతయుఁ జీకటి గప్పియుండును. అది దేవతలకుఁ దక్క యన్యులకుఁ

జోఁజాలరు. ఆకారణంబున నచ్చట వృత్తాంతము మనకుఁ దెలియదు. మీకొక్క నెల గడువిచ్చుచున్నాను. ఈలోన మీరు నాచెప్పినచోట్లెల్ల వెదకి సీతాదేవి యెందున్నదో రావణుఁడెందున్నాఁడో తెలిసికొనిరండు. గడువు మీఱినచో మరణదండనము తప్పదు. ఎవరు సీతాదేవిని జూచి వత్తురో వారు నిరవధికసుఖంబులం దూఁగాడుదురు' అని చెప్పి వారిని తూర్పుదెసకుఁ బుచ్చెను.

అంత నీలుని హనుమంతుని జాంబవంతుని సుహోత్ర శరారి శరగుల్మ గజ గవాక్ష గవయ సుషేణ ఋషభ మైంద ద్వివిద విజయ గంధమాదనులను మఱియు నగ్నిసుతులైన యుల్కాముఖానంగులను నంగదాదులను బిలిచి 'వానరోత్తములారా! మీరు వెదకనగుతావులఁ గొన్ని వచింతు వినుఁడు. వింధ్య పర్వతమునకుఁజని తత్పరిసరారణ్యంబులను వెదకుఁడు. అవల నర్మదాప్రాంతభూములను జూడుఁడు. అవి మహోరగభయంకరములై యుండును గావున నచ్చట మెలఁకువతో వర్తింపవలయును. తర్వాత వింధ్యాచలసమీప గోదావరీ ప్రదేశంబులను కృష్ణానదీపరిసర భూములను వరదానదీ కాననంబులను మేఖలానదీ మహారణ్యంబులను నుత్పలావతీప్రాంతంబులను జూచి దశార్ణదేశనగరములెల్లఁ బరికించి యవంతీపట్టణమును బరిశోధింపుఁడు. సీతాదేవి యందెచ్చటను గానరాదేని విదర్భ ఋషిక మాహిషిక వంగ కళింగ కౌశిక దేశంబులం జుట్టి నదీనగబహుళంబైన దండకారణ్యమును గాలించి యాంధ్ర పుండ్ర చోళ పాండ్య కేరళ దేశంబులం జూడుఁడు. అచ్చోట్లఁ గూడ వైదేహి గానరాదేని ధాతుమండితంబును జందనవనాభిరామంబునైన సహ్యాద్రికిఁజని దానినెల్లఁ గలయఁ దిరుగుఁడు. అచ్చటగూడ మీయత్నము సిద్ధింపదేని కావేరీనదికిఁ జనుఁడు. ఆనదీమతల్లిని సందర్శించి యందలి నిర్మలతోయము లాడిన వారికి మంగళమగును. దానిప్రక్క భూములం వెదకి మలయపర్వతమునకుఁ బొండు. ఆపర్వతంబున నగస్త్యమహర్షి సూర్యతేజోరాశియై వెలుఁగుచుండును. ఆమహాత్ముని యనుగ్రహంబును బడసి నక్రాభీలయగు తామ్రపర్ణికి నేగుఁడు. అందుండి పోయినచోఁ బాండ్యనగరద్వారకవాటము హేమమయముక్తామణివిరచితమైనది మీకుఁగానవచ్చును. అటనుండిపోయిన సముద్రతీరము

వచ్చును. అదిచేరి తరణోపాయము నాలోచించుకొనుఁడు. ఆసముద్ర జలంబులు మహేంద్రాచల పర్యంతంబానియుండును. ఆపర్వతమునఁ జిత్రవిచిత్రములైన నానాజాతి తరువులుగలవు. ఆగిరీంద్రుని శేష యక్షులు నప్సరసులు సేవించుచుందురు. సిద్ధేశ్వరుఁడు ప్రతిపర్వదివసంబున నచ్చటకు సముద్రస్నానార్థము వచ్చుచుండును. ఆకడలి యావలితీర యందు లంకాద్వీపముగలదు. అది నూఱుయోజనముల విస్తీర్ణము గలిగి చొఱరాకుండును. అదేరావణనివాసస్థానము. ఆదీవినెల్లకడలఁ గలయ వెదకుఁడు. ఆదీవికి నుత్తరభాగంబున దక్షిణమహాసముద్ర మధ్యప్రదేశ మందు నంగారకయను రక్కసి గలదు. అది జంతువులను నీడనుబట్టి యాకర్షించి మ్రింగుచుండును. ఈసంగతి మఱువవలదు. లంకకు నవ్వల నూఱు యోజనంబుల దవ్వున సముద్రాంతరమందుఁ బుష్పితకపర్వతమున్నది. ఆకొండయొక్క యొకవైపు శశిధవళంబుగా మఱియొకవైపు సూర్యారుణంబుగా నుండును. దానిశిఖరములలో నొకటి కాంచనమయముగా నింకొకటి రజతాత్మకముగానుండును. దక్షిణాయనంబునఁ గాంచనమయ శిఖరమందు సూర్యుఁడును రజతాత్మకశృంగమందుఁ జంద్రుఁడునుందురు. ఆశైలరాజము కృతఘ్నులకును బరపీడాకరులకును నాస్తికులకును గానరాదు. ఆపర్వతేంద్రునకు మీరు తలతో మ్రొక్కి యందు సీతాదేవిని వెదకనగును. ఆగిరిని దాఁటినంతట బదునాల్గుయోజనంబుల దూరమున సూర్యవంతమను పర్వతమున్నది. పుష్పితక సూర్యవంత పర్వతంబుల మధ్యనున్న మార్గము మహాదుర్గమము. సూర్యవంతమునకు నవ్వల వైద్యుత శైలము గలదు. అందు సర్వఋతువులందుఁ గోరినఫలములు పుష్కలముగా దొరకును. ఆఫలము లారగించి యచటితేనియలు గ్రోలి సేదదేఱి చనవగును. దానికి నవ్వలఁ గుంజర పర్వతముగలదు. అందు నగస్త్యమహర్షికిగా నిర్మించిన గృహమున్నది. ఆమందిరమును జూచి తీరవలయును. అది పదియోజనముల నిడుపు యోజనము వెడల్పునై బంగారముతోఁగట్టఁబడి యున్నది. దానికి దాఁపిన రత్నములిన్నియని గాని యింతటివని గాని చెప్పఁగిప్పరాదు. దానిని దాఁటి పోయిన భోగవతీనగరముగలదు. తీవ్రదంష్ట్రిఘోరములైన యాశీవిషములాపురంబును సంరక్షించుచుండును గావున దానినెవరుఁ జొఱఁజాలరు. సర్పరాజు వాసుకియందు నివసించుచుండును.

ఆకారంబును గడచినంతట ఋషభమహాపర్వతము వచ్చును. అందు వివిధ చందనవృక్షములు గలవు. వానిలోఁ గొన్ని గోరోచనవర్ణముగాఁ గొన్ని పద్మపత్రవర్ణముగాఁ గొన్ని హారితవర్ణముగాఁ గొన్ని యగ్నివర్ణముగా నుండి చూడచూడ వింతసేయుచుండును. ఆవనమును రోహితులను గంధర్వులు కాచియుందురు. ఆతరువులజోలికే పోవలదు. ఆఋషభపర్వతమందు గంధర్వరాజులు శైలూషుఁడు గ్రామణి శిగ్రువు శుభ్రుఁడు బభ్రుఁడు నను వారేవ్వరు కాపురముందురు. మఱియునచటఁ బుణ్యకర్మంబులవలన స్వర్గజితులైన మహాత్ములు సోమసూర్యాగ్నివపుష్మంతులు పరదుర్ధర్షు లున్నారు. ఆ గిరీంద్రమునకు నవ్వల యమునిరాజధాని పితృలోకము మహా దారుణమైనది యున్నది. ఆ ప్రదేశము నెప్పుడుఁ గాఱుచీకట్లు గప్పియుం డును గావున మీకుఁ జొరఁగాదు. కపిసత్తములారా! పితృలోకమువఱకు మీరుసీతాదేవిని వెదకవలయును. అనంతరము మీగమనశక్తులు సాగవు. ఒక్కమాసము వ్యవధియిచ్చితిని. ఆలోపలనెవఁడువచ్చి 'కనఁబడెను సీత' యని చెప్పునో యతఁడు నాతో సమానముగా నిఖిలభోగవిభవంబు లను జూఱగొనుచు సుఖముండును. మీరెల్లరు నమితబలపరాక్రమవంతు లును నిఖిలసద్గుణసంపన్నవంశసంభవులును గావున మీకు విశేషించి చెప్ప నక్కఱలేదు. సీతాసంప్రాప్తికి సర్వయత్నములు గావింపుఁడ' ని చెప్పి వారిని దక్షిణదిశకుఁ దరలించెను.

సుగ్రీవుఁడు వారినట్లాజ్ఞాపించి తారకుఁ దండ్రియుఁ దనకు మామ యునైన సుషేణుని డాయఁబోయి వానికినమస్కరించి ముకుళితహస్తుఁడై తత్సమీపమున నున్న మరీచిమహర్షితనయులను మారీచాది మహాపరాక్రమ వంతులను జూచి 'మీరెల్లరు రెండులక్షలవానరబలముతో సుషేణుని వెంటఁ బశ్చిమదిసకుఁజని సౌరాష్ట్ర బాహ్లీక శూరదేశములందలి నగరగ్రామముల నెల్ల శోధించి పున్నాగగహనంబును వకుళోద్దాలకాకులంబునైన కుక్షిదేశ మందలి కొంగలిపొదలు వెదకి శీతజలసుభగంబులైన నదంబులను గాంతార ఋష్యాశ్రమంబులను బరిశోధించి నిర్జలప్రాయభూములను జూచి తిమినక్ర భయంకరమైన పశ్చిమసముద్రమునకుఁ జనుఁడు. దాని తీరంబున విహార యోగ్యములైన కేతకీ తమాల నారికేళ వనములు గలవు. వానినెల్లఁ గలయఁ దిరిగి మురచీ జటీనగరంబులను అవంతీపురము నంగలోపానగరముఁ బరి

కించి అలక్షీవనము దాటి వెదకనగును. సింధు సాగరసంగమంబున నూఱు శృంగముల హేమగిరియున్నది. దాని నెత్తమున ఱెక్కలు గలసింహములు గలవు. అవి సముద్రమందలి తిమిమత్స్యంబులను నీటియేనుంగులను బట్టి తెచ్చి తమ గూండ్ల నుంచుచుండును. ఆసింహములగూండ్లచెంత మత్తమాతంగంబులు మేఘగర్జలువోని ఘీంకారములొనర్చుచు తిరుగాడుచుండును. ఆకొండ నెల్లెడల వెదకవలయును. అటనుండి కొంతదవ్వు చన్నంతట పారియాత్ర శిఖరము గానవచ్చును. అది నూఱుయోజనంబుల విస్తృతి గలిగి బంగారుమయమై మిఱుమిట్లు గొలుపుచుండును. అందు నగ్నితేజోవిలాసులైనగంధర్వులు మహాపరాక్రమవంతు లిరువదినాల్గుకోట్లు వసించియుందురు. వారు దురాసదులుగావున మీరువారిని సమీపింపవలదు. అందు రుచిరములైన ఫలమూలంబులు గలవు గాని యవియెల్ల వారికాపుదలలోనుండును; ఫలమును గానీ మూలమును గానీ ముట్టవలదు. మీపనియేమో యంతత్తో చనుము. ఆవలఁ గొంతదవ్వు చనినంతట వజ్రగిరిగలదు. అది వైడూర్యవర్ణము గలిగి వజ్రమువలెఁ గఠినమైయుండును గావున దాని నట్లు పిలుతురు. ఆపర్వతము నూఱుయోజనముల యున్నతమై యుండును. ఆగిరిగుహలెల్లఁ బ్రయత్నపూర్వకముగా వెదకవలయును. పశ్చిమసముద్రమును మూఁడు భాగములు దాఁటిన తర్వాత నాల్గవ భాగములోఁ జక్రవంతపర్వతమున్నది. విశ్వకర్మ తొల్లి సహస్రారచక్రాయుధమును జేసి యందుంచెను. అందే దేవాసురయుద్ధము జరిగెను. అప్పుడు శ్రీమహావిష్ణువు పురుషోత్తమరూపంబున నవతరించి సహస్రారచక్రంబునకు రక్షకుఁడుగానుండిన హయగ్రీవుఁడను దానవుని వధించి యాచక్రంబుతో పంచజనుఁడను దైత్యుని సంహరించి వానియస్థియైన పాంచజన్యంబును గ్రహించెను. ఆ పర్వతమునుండి యఱువది యోజనములు చన్నంతట సముద్రము మహాగాధమైయుండును. అచ్చట సువర్ణశృంగమగు వరాహపర్వతము గలదు. దానిశిఖరంబున జాతరూపమయమైన ప్రాగ్జ్యోతిషనగరమున్నది. అందు దురాత్ముఁడు నరకాసురుఁడు వసించుచుండును. ఆగిరి సానువులు చిత్రవిచిత్రములు; అందలి గుహల విరివి యింతనరాదు. వరాహగిరికివ్వల మేఘవంతపర్వతము గలదు. దానికందరములు సువర్ణాంతరములై వెలుఁగుచుండును; అందలి సెలయేళ్ళు బంగారముతోఁ బొంగారుచుండును. అచటి గజఘీంకారము

ఱుచు వరాహఘుర్ఘురంబులును సింహగర్జనంబులును శార్దూలంబుల బొబ్బరింతలును గుహాలందగిలి ప్రతిధ్వానము లీని వైరిమృగబృంహితఘుర్ఘురాది శంకను గలిగింపఁగా నాసత్త్వంబులు కోపోద్దీపితములై మాఱుపలుకుచుండుటవలన నందుధ్వనులు నిరంతరముగానుండును. పాకశాసనునకు దేవరాజ్యపట్టాభిషేకము నచ్చట గావించిరి. అదిసుత యాకొండ దేవేంద్ర సంరక్షితమైయుండును. దానిని దాఁటిపోఁగా నఱువది వేల పర్వతములున్నవి. ఆవి బాలసూర్యకాంతిఁగలిగి పూఁచియున్న పైఁడివృక్షంబులతో శోభిల్లుచుండును. ఆకొండలనడుమ పర్వతరాజు సావర్ణిమేరువుగలఁడు. అచటి శిలావృక్షాదులును దేవగంధర్వదానవులును సూర్యభగవానుని యనుగ్రహప్రభావంబున బంగారుచాయల నుండును. అచ్చటిసూర్యునకు విశ్వదేవతలును మరుత్తులును అష్టవసువులును దేవతలును సాయంసంధ్యలందు నుపస్థానముగావింతురు. ఆదిత్యుఁడు వారిపూజలంది యస్తాద్రిఁజేరును. సావర్ణిమేరువునకు నస్తగిరికిఁ బదివేలయోజనములదూరము. దానిని సూర్యుడర్ధముహూర్తంబున దాఁటును. ఈరెండుకొండలనడుమ పదితలలబంగారు తాళవృక్షమొకటి గలదు. సావర్ణిమేరువునందు బ్రహ్మకల్పుఁడు మేరుసావర్ణి వసించియుండును. ఆమహాత్మునకు మీరు సాష్టాంగమొనర్చి వానిని సీతావృత్తాంతంబడుగనగును. ఉదయాద్రిమొద లస్తగిరివఱకుగల భాగమునమాత్రమే సూర్యుఁడు నిస్తిమిరమొనర్చి వెలిగించును. అస్తగిరివఱకు మీరుపోనగును. ఆవల మహాంధకారబంధురము. దానిసంగతి తెలియరాదు. ఈతావులెల్ల నొక్కమాసములో వెదకిరావలయును. గడువుమించినచో శిక్షయెఱుంగుదురుగదా. మీరెల్లరు సుషేణునియాజ్ఞ ననువర్తింపవలయును. మీపోవుకార్యము సిద్ధించెనేని మనమెల్లరముఁ గృతకృత్యులమగుదుము. అనుపకారినుపకరించినను జన్మసాఫల్యమగునందురు. ఉపకారివిషయముసఁ జెప్పవలయునా ! రాముఁడు సర్వభూతమాన్యుఁడు ; మనయందు వాని ప్రీతి యింతనరాదు ; మీరో నాకుఁ బ్రియాతిప్రియులు. ఇంతకన్న నేమి చెప్పనగు' నని వారిని బంపెను.

అంతట శతవలిని బిలిచి 'నీవు తగుపరివారముతోడ నొకలి బుద్ధివిక్రమంబులు మెఱయించి మ్లేచ్ఛ పుళింద శూరసేన ప్రస్థల భరత దక్షిణకురు మద్ర కాంభోజ యవన శకారట్టక బాహ్లీక ఋషిక పౌరవ టంకణ

చీన పరచీన విహార దరదాది దేశంబులను హిమవంతమును గాలించి పిదపను. ఇందెచ్చటను సీతారావణులపొలకువ గానరాదేని దేవగంధర్వసేవితమైన సోమాశ్రమంబునకు మహాసానుమంతమగు కాళపర్వతంబునకును జని యందలి కోనలు గుహలు చూడుము. అచ్చటను గానరాదేని సుదర్శనపర్వతమునకుఁ బొమ్ము. అందుండి దేవసఖపర్వతము చేరనగును. ఆశైలరాజము వివిధద్రుమములతో నానాపక్షిగణముతో విరాజిలుచుండును. దానియావల నూఱుయోజనములవఱకుఁ గలప్రదేశము కొండలుగాని నదులుగాని వృక్షములుగాని లేక శూన్యముగానుండును. ఎట్టిప్రాణిని నందు జూడఁబోరు. అందు మీరు తడయవలదు. అది దాఁటినంతట కైలాసపర్వతము మీకుఁ గనుపండువొనర్చును. ఆపర్వతమందు ధవళచ్ఛాయామేదురంబును గాంచనపరిష్కృతంబునైన కుబేరగృహముగలదు. దానిని విశ్వకర్మ తొల్లి నిర్మించెను. అందుయక్షరాజు సర్వభూతనమస్కృతుండగుచు గుహ్యకులఁ గూడి విహరించుచుండును. మఱియు నగ్గిరియందుఁ గొలనొకటి యున్నది. ఆసరోవరము కమలోత్పలములతో నిండి హంసకారండవాది పక్షికలకలస్వనమనోహరమై యుండును. అచ్చర లచ్చట యథాసుఖము విహరింపుచుందురు. ఆకాసారపరిసరప్రదేశములెల్ల వెదకనగును. అందుండి చనిఁ గ్రౌంచపర్వతము వచ్చును. ఆకొండయందుఁ గుమారస్వామి శక్తినివైచి మహాబిలమొండు తొలిచెను. ఆబిలమందు దేవరూపులైన మహర్షులు నిఖిలసురార్చనల నందుచు వసింతురు. దానిని బ్రవేసించుట కష్టతరముగానుండును గావున జాగరూకులై వర్తింపుడు. క్రౌంచశిఖరంబులు కామపర్వత మానసపర్వతంబులను నవి రెండుగలవు. ఆభాగమెల్ల సమవిషమములుగా నుండును. ఆచోటెల్ల వెదకనగును. క్రౌంచమునకు నవ్వల మైనాకపర్వతమున్నది. అందు మయుఁడను దానవుఁడు తనయిల్లు నిర్మించుకొని యున్నాఁడు. మఱియు నచ్చటఁ గిన్నరాంగనల నిలయములు గూడఁ గలవు. అవి యెల్లఁ జూచి మైనాకంబును దాఁటితిరేని సిద్ధసేవితమైనయాశ్రమమొండు గానవచ్చును. అందు నణిమాదిసిద్ధిసంపన్నులైన వైఖానస వాలఖిల్య తపోధనులు గలరు. వారిని నమస్కరించి సీతావృత్తాంతంబు నరయనగును. ఆయాశ్రమమున వైఖానసమను మహాసరోవరము గలదు. ఆకొలనునందు బంగారుకమలంబులును బాలసూర్యకాంతిగల హంస

నను గలవు. మఱియుఁ గుబేరుని వాహనము సార్వభౌమదిగ్గజము కరేణు
వులనుగూడి యందు విహరింపుచుండును. దానికి నవ్వల సూర్యచంద్రుల
ప్రచారములేదు ; నక్షత్రములుగూడఁ దోఁపవు ; మేఘములు సంచరింపవు.
అతావెల్ల సర్వశూన్యము నిశ్శబ్దమయమునై యుండును. అందు స్వయం
ప్రకాశులైన సిద్ధపురుషులుగలరు. వారిదేహకాంతులచే రవిచంద్రకాంతు
లకు మాఱుగా నచ్చోటెల్ల వెలిగించుచుండును. దానియనంతరము శైలో
దమను నది గలదు. ఆయేటి తీరములందు వెదుళ్లు కెక్కి కంగి యిరువరు
లకు రాకపోకలకు మార్గమేర్పఱచుచున్నవో యనఁ గొండకొనలఁ దాఁకుచుం
డును. సిద్ధులీవలివారావలికి నావలివారీవలికి నవ్వెదుళ్లమీఁదుగా వచ్చు
చుఁ బోవుచునుందురు. శైలోదమునకునవ్వల నుత్తరకురుదేశమున్నది.
పుణ్యాత్ములు తమసుకృతము ననుభవించుటకై యచట జన్మింతురు. ఆదేశ
మందలి లతలెల్ల నీలవైడూర్యవర్ణముగా నుండును ; మఱియు నచ్చోటు
బంగారుకమలములుగల నదులతో నిండి యుండును. అచ్చటి సరోవర
ములు రక్తోత్పలములతోను సువర్ణకేసరములుగల కమలేందీవరములతోను
ముక్తారత్నహిరణ్మయములైన పులినతలంబులతోను మనోహరముగా నుం
డును. అచటి నదులయందు రత్నకాంతులంజేసి నగ్నిరాసులవలె వెలుఁగు
చిఱుకొండలుగలవు. అందలి వృక్షంబులు నిరంతరపుష్పఫలవంతములై
కల్పతరువులోయన నర్థులకు వస్త్రంబులను మణిమౌక్తికభూషణంబులను
సువర్ణశయనంబులను పానద్రవ్యంబులను వివిధభక్ష్యభోజ్యలేహ్యంబులను
వరనారీరూపవిలాసవతులను గోరినట్లిచ్చుచుండును. అచ్చట సిద్ధవిద్యాధర
నాగకిన్నరగంధర్వులు గతితేజోవిభ్రాజితులై తమతమప్రియులను గూడి
విహరింపుచుందురు. గీతామాధుర్యమును జవరాండ్రనవ్వులును నచ్చటనే
వినవలయును. వేయేల ! అచ్చటనుండు సర్వభూతంబులును దుఃఖమె
ట్టిదో యెఱుంగక దినదినవర్ధమానశాశ్వతసుఖసంతోషమయులై యుండును.

ఉత్తరకురుదేశంబును దాఁటినంతట నుత్తరసముద్రము గలదు. ఆసా
గరమధ్యభాగంబున సోమగిరియను కాంచనపర్వతమున్నది. ఆశైలరాజము
స్వర్లోక బ్రహ్మలోక విష్ణులోక వాసులైన దేవతలకుఁదక్క నన్యులకు
గానరాకుండును. ఆప్రదేశము సూర్యసంచారరహితమైనను దన్నగ తేజో

విశేషంబున సూర్యుఁడున్నట్లే వెలుఁగుచుండును. సోమగిరియందు విశ్వాత్మకుఁడైన శ్రీమహావిష్ణువును నేకాదశరుద్రాత్మకుఁడైన పరమశివుఁడును నిఖిలదేవాధిపుఁడైన పరమేష్ఠియు బ్రహ్మర్షి సేవితులై నివసించుచుందురు.

ఉత్తరకురుదేశమును దాఁటి యొక యడుగైనను మీరు పెట్టవలదు. ఏలయందురా? మహాశక్తిసంపన్నులైన దైత్యులుగూడ నచ్చటికిఁ బోఁజాలరు. దేవతలు సయితము సోమగిరిని దాఁటరు. ఆగిరివరకుఁ బోయి దానిని సందర్శించి మరలుము. వానరోత్తములారా! తోఁచినతావులెల్ల వివరించితిని. మీదారిలో వెదకనైన చోటెల్లెన్నోయుండును. దేనినిగాని యుపేక్షింపవలదు. ఎట్లేని సీతాదేవినిజూచి రానోపుదురేని రామునకుఁ బ్రియంబును నాకు సంతోషంబును గూర్తురు. మీయత్నము నిండారునేని సమస్తకామఫలంబులు మీహస్తములందుండును. మీరు నిశ్చింతులై భూలోకమెల్ల విహరింపనోపుదు' రని చెప్పెను.

రాముఁడు హనుమంతునిచేతిలో తన ముద్రుటుంగరముంచుట.

సుగ్రీవుఁడట్లు వారివారి నాయాదిక్కులకు నాజ్ఞాపించి హనుమంతునిజూచి 'వాయుపుత్రా! భూనభోంతరాళములందుఁగాని స్వర్గమందుఁగాని జలములందుఁగాని నీగమనంబునకు నాతంకముగలుగదు. అసుర గంధర్వ నాగ మనుష్య దేవలోకంబులలో నీవు చూడనిది లేదు. సముద్రపర్వత ప్రదేశములెల్ల నీకుఁజిరపరిచితములు. గమనవేగమందును దేజోలాఘవము లందును నీవు నీతండ్రికి వాయుదేవునకు సాటియగుదువు. పరాక్రమంబున నీకు సమానులే గలుగరు. బలపరాక్రములకుఁ దగినబుద్ధియు దేశకాలానువృత్తి నీతులును నీయందు సమగ్రములు. ఈకార్యమును సాధింప నీవే సమర్థుఁడవు. ఇది నానిశ్చయము. ఏమిచేయుదువో' యనెను. సుగ్రీవుఁడట్లు కార్యభారమునెల్లఁ దుట్టతుదకు హనుమంతునిమీఁద మోపుట రాముఁడు విని 'అహో! సుగ్రీవుఁడితనినే నమ్మియున్నాఁడు. వీనిశక్తి సామర్థ్యంబు లెఱుంగనిదే వానరేశ్వరుఁ డట్లుపలుకఁడు. ఎల్లరలో నితనినే వానరరాజుమిక్కిలి మన్నించుచుండును. ఇతనివలన నాయిష్టసిద్ధి యగునని తోఁచుచున్న' దని లోలోన వితర్కించి, హనుమంతుని జేరవచ్చి 'మారుతీ! ఇదిగో నాపేరుచెక్కిన ముద్రుటుంగరము. సీతాదేవికి గుఱుతుగా

కీనిని గొనిపొమ్ము. ఈయంగుళీయకంబును జూచునేని యమ్మానవతి నీయెడ భయసంశయంబులు మాని నిన్ను నమ్మును. వీరాగ్రణీ! నీబలపరాక్రమోత్సాహంబులను వింటిని. సుగ్రీవుని మాటలనుబట్టి నా కార్యము నీవలన సిద్ధించునని తోఁచుచున్న'దని పలికి యుంగరంబును వానిచేతనుంచెను. హనుమంతుఁ డా యంగుళీయకంబును దల నిడికొని రామచరణాంభోజములకు నెన్నుదురు సోక మ్రొక్కి ప్రయాణోత్సుకుఁ డయ్యెను. రాముఁడు వానిని మరలఁ బిలిచి 'అతిబలా! నీబలంబును నమ్మియున్నాను. సీతాదేవి నాకుఁ బ్రాప్తమగునట్లొనర్పు' మని చెప్పి వానిని బుత్తెంచెను.

శతవలి యుత్తర దిశఁ ద్రొక్కెను; వినతుఁడు తూర్పుదిక్కునకుఁ దరలెను; సుషేణుఁడు పశ్చిమభాగము పట్టెను; హనుమంతుఁడు దక్షిణ దిశాభిముఖుఁడయ్యెను. వానరవీరులు హర్షనాదములుగావించుచు వీరంబులు పలుకుచు లంఘించుచుఁ దరలిరి. 'రావణునకు నేను చాలనా' యని యొకడు పలికెను. రక్కసుల నుక్కడగించి దేవి నిప్పుడే తెత్తునని యింకొకఁడు వచించెను; క్షోణీగర్భము వ్రక్కలించి పాతాళంబును శోధింతు నని మఱియొకఁడనెను; పర్వతంబులను ధూళీపాళీకరింతునని వేఱొకఁడు చెప్పెను; సప్తసాగరంబులను బుళిక్కించివైతునని యొకఁడు నుడివెను. యోజనము దాఁటుదు నని యొకఁడు, నూఱుయోజనంబు లెగయుదు నని యొకఁడు ననిరి. ఇట్లువారు ప్రగల్భములాడుచుఁ జనిరి.

సుగ్రీవుఁడు భూమండలపరిజ్ఞానము తనకుఁగలిగిన విధముఁజెప్పుట.

రాముఁడంత సుగ్రీవుని జూచి 'మిత్రమా! భూమండలంబెల్ల నీకుఁ దెలిసియున్నట్లు తలంతును. ఇంతపరిజ్ఞానము నీకెట్లుగలిగె' ననెను. నావుడు 'పురుషోత్తమా! నాయన్న వాలి నాపయి దురాగ్రహము వహించి నన్ను వధింపఁదలపెట్టెను; నేను వానికి వెఱచి పఱచితిని. అతఁడు నన్ను మొదట నుదయాద్రి వఱకు దఱిమెను. అచ్చటనుండి దక్షిణదిశకుఁ బఱచితిని. అక్కడకుఁగూడ వెంబడించెను. అందుండి యస్తాద్రికిఁ బాఱితిని. అచ్చటికిఁ గూడ వెన్నంటివచ్చెను; అందుండి యుత్తరసముద్రము దాఁటితిని. అప్పటికిని నన్నతఁడు వదలఁడయ్యెను. ఎందును నాకు శరణ్యంబు గలుగక దిగులుపడి మరణమే శరణమని నిశ్చయించుకొంటిని. అప్పను

నా వెంటనున్న హనుమంతుఁడు నన్నుఁ జూచి 'వానరేంద్రా! మతంగ మహర్షి శాపకారణంబున వాలి యమ్మహాత్మునాశ్రమంబుఁ జొరఁజాలఁడు, ఈసంగతి యిప్పుడు జ్ఞప్తికివచ్చెను. అచ్చటనిర్భయముగా నుండవచ్చు' ననెను. అంతట నేను ఋష్యశృంగము నాశ్రయించి బ్రతికితిని. పైవిధముగా భూమండలమెల్ల నేను సంచరించుటయ్యె' నని సుగ్రీవుఁడు తెలిపెను.

### వానరులు మఱలివచ్చుట.

కపివీరులట్లు తరలి గుంపులు గుంపులుగాఁ జీలి పగలెల్ల నాకాశమును బట్టి నదీనదసరోవనపర్వతనగరాదులను బరిశోధించుచు రాత్రిపూటఁ బుడమికి వచ్చి చేరి కలియఁబలికి కొనుచు నొక్కమాసము వెదకి వెదకి వేసారి మరలి తూర్పునుండి వినతుఁడును బశ్చిమమునుండి సుషేణుండు నుత్తరమునుండి శతవలియుఁ దమతమమూఁకతోఁ బ్రస్రవణాద్రిఁజేరి రామసుగ్రీవులకు మ్రొక్కి 'పర్వతములెల్ల శోధించితిమి; దుర్గమారణ్యంబులు వెదకితిమి; సముద్రంబులు గాలించితిమి; గుహలుదూఱితిమి; ఎందును సీతాదేవి గానరాదు. ఆమెను దక్షిణపుదిక్కుగాఁ గొనిపోయెననిరి. ఆవలను మారుతి చనియున్నాఁడు. దేవికానవచ్చు నేని వానికిఁ గానరానగు' ననిరి.

### దక్షిణదిశకుఁబోయిన వానరుల చరిత్ర.

దక్షిణదిశకుఁ జన్నవారయ్యాప్రదేశములు వెదకుచు వింధ్యాద్రిని జేరి యందలి నదీనదవనబిలదుర్గమంబులెల్ల నెమకి నెమకి యెందును సీతాదేవిని గానక నవ్వలిమార్గముఁ బట్టిరి. వారుపోవుచున్న దారిలో నొకానొకచోట మ్రోడులతోను నిర్జలవాహినులతోను నిండి ప్రాణిసంచారమింతయు లేక సర్వశూన్యముగానున్న ప్రదేశంబొండు గానవచ్చెను. వానరులాచోటు చొచ్చి గిరికందరాదులు వెదకి వాంఛితార్థమునుబడయక నటునిటు దిరుగాడుచుండగాఁ గొంతదూరంబున లతాగుల్మభయంకరమైన తావొకటి గానవచ్చెను. వారచ్చోటికిఁబోయి రక్కసునొక్కనినందుఁజూచి వానిని ముట్టగింప సన్నద్ధులైరి. ఆతఁడును వారిని గాంచి 'చావుమూడివచ్చితిరిగదా' యనుచు పిడికిలి నలవరించి యుతికెను. అంగదుఁడు వానిని రావణుఁడుగా దలంచి యఱచేతఁజఱచెను. ఆవ్రేటునకారక్షోవీరుఁడు నెత్తురుగ్రక్కి పర్వత

మట్లు కూలెను. రావణుని జంపితిమిగదాయని కపీంద్రులెల్లరు సంతసించిరి. ఆ చేరువను గుహయొకటి యుండెను. లంకేశ్వరుఁడు సీతాదేవి నందు దాఁచి యుండునని ప్లవగులు భావించి జయోత్సాహంబులు మెఱయఁగా నాబిలము దూఱి సీతాదేవిని వెదకి యామెనందెచ్చటఁ గానక దీనమానసులై యలసి సొలసి యందొక చెట్టుక్రిందఁ గూర్చుండిరి.

ఋక్షబిలము.

కొంతసేపు చన్నంతట నంగదుఁడు తోడికపులనుగాంచి 'మిత్రులారా! చూడఁదగిన చోట్లెల్లఁ జూచితిమి; సీతాదేవి యెచ్చటను గానరాదు; కాలమో చాలఁ గడచెను; సుగ్రీవుఁడో చండశాసనుఁడు; ఊఱకుండ నిది సమయము గాదు; మఱిమఱి వెదకుఁడు. జనకరాజసుత దొరకునందాక నిద్రాహారంబులు మఱచి శోకతాపంబులకు వెఱవకయాక మీశక్తియెల్లఁ జూపుఁడు. విసివినచోఁ బనిచెడును. ధైర్యోత్సాహంబులు గలవేని కార్యము సిద్ధించునని యందురు. నామాటయురవగునేని యట్లొనర్పుము. వేఱుమార్గము గలిగినఁ దెలుపనగు' ననెను. గంధమాదనుఁడా మాటలువిని 'అంగదునిమాట సేయనగును; కార్యంబనుకూలించు' నని దప్పికి నెండియున్న స్వరమున బలికెను. వానరులు లేచి వింధ్యపర్వతారణ్యభూములను మరల వెదకసాగిరి. ఆపర్వతరాజదక్షిణపార్శ్వము రజతమయమై శరన్మేఘ ధవళకాంతిఁ దేజరిల్లుచుండెను. కొందఱచ్చటకుఁ జని వెదకజొచ్చిరి. అచ్చట ఋక్షబిలమను పెనుగుహయుండెను. ఆబిలము నుండి జలార్ద్రంబులును గమలరాగరక్తపక్షంబులునైన హంససారస చక్రవాకక్రౌంచపక్షులు వెలువడెను; మఱియునందుండి సుగంధము గుబాళించెను. హనుమదాదు లది చూచి విస్మయమంది బిలాంతరమున జలసమృద్ధమైన కూపమో తటాకమో యుండునని నిశ్చయించి తోడివారిని గూడి యందుఁ బ్రవేశించిరి. ఆగుహ గాఢాంధకారబంధురమై సింహశార్దూలాది క్రూరమృగములతో నిండి యుండెను. వానరుల తేజఃపరాక్రమంబు లచ్చట నుపయోగింపవయ్యెను. దారియొకటి గానరాదు. అట్లుండియు వారు జీవితాశమాని సాహసించి యొకరినొకరుపట్టుకొని తడవులాడుచు మఱికొంత దూరము దిగిరి. అచ్చట నొకవిధమైన వెలుతురు గానవచ్చెను. దానిఁబడి మఱికొంతదవ్వు చనిరి. అట నొకమనోహరమైన తోటయు దాని

లోపల నొక కొలను గానవచ్చెను. ఆవనమునందుఁ బ్రవాళప్రసూనసోష్ణ లతాతతులతోఁ బెనగొన్న పున్నాగచంపకాది వృక్షంబులును ద్రాక్ష వాటిమధ్య వైడూర్యవితర్దికలును శాఖాగ్రంబులందు నానావర్ణపక్షిజాతంబు నుండెను. ఆసరోవరము తరుణార్కసన్నిభకాంచన కమలంబులతోను సువర్ణమత్స్యంబులతోను బంగారు తాఁబేళ్ళతోను గ్రిక్కిరిసి నిర్మలతోయ ములదొప్పదోఁగుచుండెను. ఆకొలనునకుఁ జేరువగా నొకమందిరము కాన వచ్చెను. అది బంగారువెండివిమానములు గలిగి పైఁడికిటికీలతో వ్రేలాడు చున్న ముత్యాలజాలరులతో శోభిల్లుచుండెను. ఆమందిర మధ్యభాగంబున జదుక మొకటిగలదు. దానిని బంగారు వెండి యిటుకలతోఁగట్టి యందందు నవరత్నములను దాపిరి. అచటి తరువులందు సువర్ణచంచరీకములు రాజిల్లు చుండెను. ఆమందిరాంతరమున నొకచోట మధుపూర్ణరత్నపాత్రలు, నొకచోట రత్నాలుదాపిన బంగారుమంచములు, నొకగదియందు లోహ పాత్రలు, నొకవంక సుగంధద్రవ్యములు, నొకచాయ ఫలమూలంబుల కుప్పలు, నొకవలన దివ్యాంబరముల పేర్పులు నొకక్రేవఁ జిత్రకంబళములుఁ బడియుండెను. అచ్చటకుఁజేరవఁగా దాపసియోర్తు నారజీరలుఁగట్టి కృష్ణాజినము ధరించి యాత్మీయ తపఃప్రభాపుంజమోయన వెలుఁగుచుండెను. వానరులామెను జూచి భయభ్రాంతులై నిలిచిరి.

హనుమంతుఁడు మాత్రము తెంపుచేసి యామెను డాసి నమస్కరించి 'అవ్వా! ఎవ్వతెవు? ఈబిలమెవ్వరిది? పిపాసార్తులమై నీరెందుఁగానక సాహసించి యిందు దూఱివచ్చితిమి. దీనినిఁ జూడఁగా సురమాయగా నున్నది. ఏమియుదోఁపఁదు. ఈబిలసమీపంబున శూన్యప్రదేశముగలదు. అదియట్లు గానేలనో తెలియ' దని విన్నవించెను. ఆవృద్ధతపస్విని కల యూచి 'వానరోత్తమా! మయుని వినియుందువు గదా. అతఁడు తొల్లి బ్రహ్మనుగూర్చి వేయేండ్లు ఘోరతపంబొనర్చి తద్వరంబున శుక్రాచార్య ప్రణీతశిల్పశాస్త్రజ్ఞానంబును సమగ్రంబుగాఁ బడసి యీకాంచనవనంబును నిర్మించి యిందు వసించుచుండెను. అట్లుండఁగా వానికిని హేమయను నప్సరోంగనకును మైత్రిగలిగెను. ఆసంగతి పురందరుఁడు విని యాగ్రహ పడి మయుని వజ్రాయుధంబునఁ బ్రహరించెను. మయుఁడు పాకశాసను నకు వెఱచి కానవాంతరము పట్టెను. అతఁడుచన్నంతట విరించి యీ

కాల మతిక్రమించెను గావున మాకు మరణదండనము తప్పదు. అయినను రాజుమ్రోలఁ జేరి మాపడినపాట్లెల్ల విన్నవించుకొనక తీఱదు. అట్లు చేయక యిందే యుందుమేని రాజాజ్ఞ నుల్లంఘించుటగును. మరణదండనమునైన నోర్తుము గాని యీపనిచేయ నొల్లము. ఎట్లైని మమ్ము వెలికిఁ జేర్పు' మనెను. నావుడు స్వయంప్రభ వానిరాజభక్తికి మెచ్చి 'మారుతీ! ఈబిలము సొచ్చి సప్రాణముగా వెడలుట దుష్కరము. అయినను మీరు మహాకార్యతత్పరులై వచ్చితిరి గావున మిమ్ము నాతపఃప్రభావంబున నిందుండి వెలికిఁ జేర్చెదను. ఎల్లరుఁ గన్నులుమూసికొనుఁడు ; కనువిచ్చి యిందుండి వెడల సాధ్యముగాదు' అని చెప్పెను.

వానరులు సంతోష వికసితంబులైన తమనేత్రంబులను మూసి పైన హస్తతలంబులను గప్పిరి. స్వయంప్రభ వారిని క్షణములో బిలబహిర్భాగంబునఁ జేర్చి 'అదిగో వింధ్యపర్వతము ; ఇదిగో ప్రస్రవణ - శైలము ; అల్లదిగో మహాసముద్రము. శుభమగుఁ గాక' యని పలికి బిలము చొచ్చెను.

కర్తవ్యమునుగూర్చి వానరులు తర్కించుకొనుట.

వానరులు నాటికిఁ బ్రాణంబులు దక్కెనని సంతసించి వింధ్యాచల నైరుతి భాగంబునమున్న యొక తిప్పపయిఁ జేరిరి. అచ్చటి మావిగున్నలు పూచివసంతము సమీపగతమగుటను సూచించెను. వారది చూచి తమ రాజాజ్ఞను దలంచి చింతానిహతులైరి. అంగదుఁడు తోడికపివర్యులను బల్కరించి 'వానరవీరులారా! సుగ్రీవునిపంపున వచ్చితిమి. మనకిచ్చిన గడువు బిలాంతరముననే చనెను. ఎట్లందురా ? ఆశ్వయుజమాసంబునఁ దొలిపిలుపు వచ్చెను. మనము కొంతతామసించితిమి. అట్లు పదునైదు దినములు గడచెను. అంత లక్ష్మణుఁడు వచ్చి కోపించెను ; మరలఁ బది దినములగడువుతోఁ బిలుపువచ్చెను. ఎల్లదిక్కులనుండి వానరులు చేరుటయు వారి నాయాదిక్కులకు నియమించుటయు మున్నగు వానితోఁ గార్తికము ముగిసెను. మార్గశీర్షమెల్ల సీతాదేవిని వెదకి పుష్యమాసంబున సుగ్రీవునిఁ జేరవలసినట్లు మనకుఁ గట్టడిగావింపఁబడెను. పుష్యమే గాదు మాఘముగూడ దాఁటెను. ఇఁకఁ గర్తవ్యమేమో విచారింపుము. గడువు తప్పినను సీతనుజూచియుందుమేని కొంతయూఱట గలదు. అందులకు

హనుమంతుఁడు కపీశ్వరులతలంపుగ్రహించి 'అహో! అంగదుఁడు వానరరాజ్యమునకే యెత్తువెట్టెను. ఇతఁడు సామాన్యుఁడు గాఁడు. గ్రహణధారణాద్యష్టగుణసంపన్నబుద్ధియును బాహుబల మనోబల యుక్తిబల బంధుబలంబులను చతుర్బలంబులును దేశకాలజ్ఞతాది చతుర్దశగుణంబులును వీనియందు సమగ్రంబులు. ఇతఁడేలనో ప్రమాదపడుచున్నాఁడు. సుగ్రీవునితో వీనికి భేదముతగదు. ఎట్లయినను వీనికిఁ బొత్తు గూర్పనగు' నని లోలోన నిశ్చయించి, భేదోపాయంబవలంబించి వానరులకుఁ గల ఋక్షబిల నివాసాశయంబును మొదట మాన్పి వారుతారని యుపదేశంబును నిరసించు నట్లొనర్చి యనంతరము కోపరూపమైన దండోపాయమనుష్ఠించి 'అంగదా! నీవింత వాఁడవగుట నేరనైతిని. వానరులు చపలచిత్తులగుట యెఱుంగవా? వారికి విపరీతంబులను బోధింప వచ్చునా? కాదని బోధించినను నీబోధనలు సాధ్యములుగానుండవలదా? ఆలుబిడ్డలను దల్లిదండ్రులను విడిచి నీయాజ్ఞకు లోఁబడి యుండెవరుందురు? జాంబవంతుఁడు నీమాట సేయునా? నీలుఁడు నిన్నులక్ష్యపెట్టునా? నామది మరలింప నీకుసాధ్యమా? ఒండుచో నిట్టిదుర్బోధనలను విని సహించియుండను. మఱియు బలవంతుఁడు దుర్బలుని విరోధింపవచ్చునుగాని తద్విపరీతము నీతిగాదు. తావని నమ్మి ఋక్షబిలము నిన్ను రక్షించుననుకొంటివి. ఇది నగభేదికిఁ గూడ సాధ్యముగాదనియా వజ్రివజ్రంబందు ద్వారమాత్రము గలిగింపనోపెననియుఁ దలంచితివా; ఇంతకన్న వెట్టితనముగలదా? లక్ష్మణసాయకంబొండు దీనిని దొప్పనట్లు చీల్చివైవదా? అంగదా! నీవు సుగ్రీవుని విరోధించి యుండుండ నిశ్చయింతువేని వానరు లెల్ల నిన్ను విడనాడి చనుటనిశ్చయము. వారిభార్యాపుత్రులు వారిమొదయందుఁ దోలుకాడుచున్నారు; సకాలభోజనాదికాంక్ష వారి నిందుండి త్వరించుచున్నది. ఈయగచాట్లు వలదని వారియంతరాత్మలు చెవినిల్లుగట్టి చెప్పుచున్నవి. నీవు తుదకు బంధుమిత్రజ్ఞాతులకు దూరమై యొంటిఁజిక్కి దిగులు గుడుచుచు నునుగాలికి దూలు గడ్డిపఱకకన్న హీనుఁడవగుదువు. గడువుమీఱినను రాజునెదుటఁబడుట యుక్తము. రాజాజ్ఞనుల్లంఘించి యిందుండువేని రెండు తప్పులగును. మనలను వెదకుచు లక్ష్మణుఁడు రాకమానఁడు; వానిబాణంబులు మనల బూదిగావింపకమానవు. దుర్మతము మాని వినీతుండవై మాతోడ రమ్ము

నీతండ్రికన్న నీవు గట్టివాఁడవుగావు. వానిగతి నీకు వలదు. సుగ్రీవుని యనంతరము నిన్నుఁ గూడనున్న వానరరాజ్యశ్రీని ద్రోసిపుచ్చవలదు. సుగ్రీవుఁడు కఠినాత్ముఁడంటివి. ఉండుఁగాక. అతఁడు నీకుఁబినతండ్రిగదా! నీయెడ వానిపితృవాత్సల్యము దఱుఁగునా ? నీతల్లి తారయందుఁగల యతని ప్రీతికి మేరగలదా ? వాని ప్రాణంబు లాపెవశమై యుండవా ? ఇన్ని తెలిసియు వానికి వెఱతువేల ? తారకు సుగ్రీవుఁ డప్రియంబొనర్పఁడు. తారాసుతునకు నతఁడెన్నఁడు నెగ్గుతలంపఁడు. ఇంతటనేని నీప్రమాదబుద్ధిని సవరించుకొను' మని గట్టిగాఁబలికెను.

## అంగదుని ప్రాయోపవేశము.

అంగదుఁడామాటలు విని 'మారుతీ! నీకెదురాడనోడుదు. అయినను నాయభిప్రాయముఁ దెలుపుదు; స్థైర్యము నాత్మశుద్ధియు గృతజ్ఞతయు దయాళుత్వంబును ఋజుభావంబును విక్రమంబును ధైర్యంబును సుగ్రీవునందు వెదకినను గానరావు. తమ్ముఁడని నమ్మి ద్వారమునఁ గాపుంచి బిలము మూసిన యన్నకతఁడొనర్చిన మేలువలననే వానిధర్మబుద్ధి తెలియంగరాదా ? అన్న సజీవుఁడైయుండఁగా వానిపత్నినిఁ దనకు మాతృసదృశురాలిని జేఁబట్టిన వాని కెంత యాత్మశుద్ధిగలదో యూహింపరాదా ? తనకు రాజ్యదానమొనర్చిన మహోపకారినిమఱచిన వాని కృతజ్ఞతయెట్టిదో తెలియదా? సుగ్రీవుండు లక్ష్మణునకు వెఱచి సీతాన్వేషణంబునకు మనలఁబంపెను. దీనివలననే వానిధైర్యస్థైర్యవిక్రమ ఋజుభావంబులు విదితంబులు. అట్టి పాపిష్ఠుని గృతఘ్నుని స్మృతిహీనుని జపలాత్ముని జీవితాశగలవాఁడెవ్వఁడు విశ్వసించును ? వానరరాజ్యమును బ్రస్తావించితివి. సుగ్రీవుఁడపత్యుఁడు గాని యనపత్యుఁడుగాఁడు. గుణవంతుఁడో గుణహీనుఁడో కొడుకున్నప్పుడు వానికిఁ గాదని రాజ్యము నతఁడు నాకిచ్చునా ? ఇంతమాత్రము తలంపవా ? పట్టముగట్టకున్నమానెఁ గాక నన్నుమననిచ్చినఁ జాలు. మొదలే నేను మహాపరాధిని ; దానికిఁ దోడుగా ఋక్షబిలనివాసం బుపదేశించితివి. నాయీమంత్రము వాని చెవినిఁబడకమానదు. కంటఁబడిన నన్నతఁడు వధింపక మానఁడు. ఈపని నతఁడు బహిరంగముగాఁ జేయకున్నను రహస్యముగా నైనఁ జేయించును. ఉరిఁబడి చచ్చుటకన్న నిందే ప్రాయోపవేశమొనర్చుట మేలు. నాకు సెలవిచ్చి మీరెల్లరుఁ జనఁదగును.

నేను కిష్కింధకు రాఁజాలను ; బూటకము పలుకట గాదు. రామలక్ష్మణులకు నా నమస్కృతులొసంగి వానరేశ్వరునకు నాకయిమోడ్పు లిచ్చి నాపిన్నతల్లియైన రుమకు నావిన్నపములు చెప్పి నాతల్లిని దారనూరార్పుము. అయ్యో! నాతల్లిని దలంచినంతనే నాదుఃఖము పొరలివచ్చుచున్నది. నా చావు విని యామె జీవింపదు' అని పలికి వృద్ధవానరులకు మ్రొక్కి దుఃఖరోదన మొనర్చి దర్భలు పఱచి యందుఁ బరుండెను.

అంగదుని ప్రాయోపవేశమునకు వానరులు రోదగావించిరి. తారుఁడుగూడ వాని ననుకరింప సంసిద్ధుఁడై స్నానమాడి సముద్రోత్తరతీరంబున దక్షిణాగ్రముగా దర్భలుపఱచి కొని పూర్వాభిముఖుఁడై పరుండెను. వానరులు గుంపులుగూడి రామవివాసంబును దశరథనిర్యాణంబును ఖరదూషణాది సంహారణంబును జటాయుమరణంబును సీతాపహరణంబును వాలివధయు సుగ్రీవుండు తారసించుట రాముఁడాగ్రహించుట సీతాన్వేషణార్థము తామువచ్చుట మున్నగు సంగతులనుగూర్చి పెద్దపెద్దగాఁ బలుకసాగిరి. వారియఱపులు వింధ్యాగుహాంతరములందు మాఱుమ్రోగెను.

సంపాతి.

అందొక గొబయందుండిన గృధ్రరాజు వారియఱపులు విని వెలికిఁ జ్రాకివచ్చి వారలు తీఱిపడియున్న వానరులను జూచి 'అహో! ప్రాణుల యోగక్షేమంబులు తత్తత్కర్మానుసారములనుట సత్యము. ఎప్పటికేది సంప్రాప్తమో ముందుగా నెవరికిని తెలియదు. వానరమాంసభోజనంబును పెద్దకాలంబుగాఁ గోరుదు. అదినేడు చిక్కెను. ఇందొక్కరుని మెక్కి క్షుధార్తిఁదీర్చుకొందుఁ గాక' యని తలంచెను. అంగదుఁ డాపక్షీంద్రుని జూచి భయపడి 'హనుమంతా! సీతాపదేశంబున నిందువచ్చిన వానరులను మ్రింగు నిమిత్తము యముఁడీరూపంబున వచ్చుచున్నాఁడు. అయ్యో! అటు రామకార్య మొనర్పనైతిమి ; ఇటు రాజాజ్ఞ సాగింపనైతిమి; ఇంతలో మనకీవిపత్తు సంభవించెను. జనస్థానంబున జటాయువను గృధ్రరాజు సీతాదేవికిఁ గాఁ దనప్రాణంబులను గోల్పోయెను. తిర్యగ్జంతువులుగూడ రామప్రియార్థము ప్రాణంబుల నుంకవ పెట్టుచుండఁగా మనమట్లు చేయకుండ రాదను నీతి నేఁడుమనకు స్వానుభవసిద్ధము గానున్నది. చావునకు దుఃఖించుటలేదు ; ఇన్నాళ్ళు కష్టపడి యెల్లకాంతారములు వెదకి వెదకి

తుదకు సీతాదేవినిఁ గన్నారఁ జూడకయే చచ్చుటకు దుఃఖమయ్యెడు. జటాయువు రామకార్యార్థము రావణునిచేత మరణించినను మహాపుణ్యాత్ముఁడు గావున సీతాదేవిని సందర్శింప నోఁచెను. జటాయుమరణమే మనకు మృత్యువయ్యెను. అతఁడు జీవించియుండినచో రావణవృత్తాంతము వాని వలన విని యారాక్షసుని సాధించియుందుము. అయ్యో! ఒకరినన నేల? రామవివాసము సీతాపహరణము జటాయువధ వాలి సంహారము సీతాన్వేషణము మనకీచావు సమస్తము దశరథుఁడు కైకేయికిచ్చిన వరములఫలము గదా' యని పలికెను.

అంగదుని దుఃఖదీనోక్తులను గృధ్రరాజు విని నేలఁబడియున్న వానరులకుఁ గలఁగి చింతాక్రాంతుడై 'అయ్యో! నాతమ్ముఁడు జటాయువు మడిసెనా? ఈమాట విన్నంతనే నాప్రాణంబు లెగయుచున్నవి. జటాయువునకు రావణునకుఁ బోరేలఁగలిగెను? గుణజ్ఞుఁడును శ్లాఘనీయుఁడును మహావిక్రమశాలియునైన నాతమ్ముని పేరిన్నాళ్ళకు విననోఁచిన సంతసంబు నీదారుణవార్త హరించెను. సంగతి యెరయుదుఁగాక' యని తలపోసి 'కపివర్యులారా! జటాయువు మరణించెనంటిరి, సంగతియేమి? రాముఁడెవఁడు? నా రెక్కలు రవిరశ్మిసందగ్ధములు గావున నెగురనోపను. ఇందుండి నన్ను మెల్లగా దింపి వివరము వినిపింపు' మనెను. వానరులా మాటవిని 'కపులను మెక్కుటకుఁగా నితఁడీయెత్తువైచెను. మరణసంసిద్ధుల కిదియు నిష్టసిద్ధికరమే యగును. ఎట్లయినను గృతార్థులమైతి' మని గుసగుసలాడ సాగిరి.

అంగదుఁడు లేచిపోయి గృధ్రరాజును శిఖరాగ్రమునుండి దింపి 'పక్షీంద్రా! నీయడిగినసంగతి వినుము. ఇక్ష్వాకువంశరాజు దశరథుఁడుండెను. అతని సుతుఁడు రాముఁడు తండ్రి మాటు సేయ దండకారణ్యమునకు దరలెను. రాముని వెంట వానిభార్య సీతయు నతని తమ్ముఁడు లక్ష్మణుండును వచ్చిరి. వారు జనస్థానంబునమండఁగా రావణుఁడు సీతాదేవిని హరించెను. జటాయువప్పుడచ్చట నుండెనఁట. వానికిని దశరథునకును బరమమైత్రి గలదఁట. ఆగృధ్రరాజు రాక్షసుని యత్నంబు నోర్వక వానిపైదుర్కెనఁట. అయిరువురకు గజకచ్ఛపముల పోరయ్యెనఁట. తుదకు

రక్కసుఁడు గృధ్రరాజును బొలియించి చనెనఁట. రాముఁడు వచ్చి వానికి దహనసంస్కారములొనర్చి భార్యాన్వేషియై కిష్కింధఁజేరి యట నాపినతండ్రియైన సుగ్రీవునితో సఖ్యము గావించి నాతండ్రిని వాలిని వధించి వానరరాజ్యమును సుగ్రీవునకుఁ గట్టెను. సుగ్రీవుని పంపున సీతాన్వేషణ పరులమై యిందువచ్చి చొఱరానిచోట్లెల్ల వెదకితిమి. సూర్యప్రభ రాత్రియందువలె సీతాదేవి యెచ్చోటను గానరాదు. మార్గమధ్యంబున ఋక్షబిలము కానవచ్చెను. తెంపుసేసి యాఁచీకటి గొబచొచ్చి సీతను వెదక నారంభించితిమి. సుగ్రీవుఁడొక్కమాసము గడువిచ్చి మమ్ముఁ బంపెను. ఆగడు వాబిలాంతరముననే చనెను. గడువు మీఱివచ్చువారికి మాతోఁడు మరణము శిక్షగా విధించిపంపెను. అందువలన తోనికి వెఱచి ప్రాయోపవేశము నాశ్రయించితిమి. కాదని కిష్కింధకుఁ జన్నను మాలో నొక్కరేనియు బ్రదుకఁబోరు' అనెను.

అంగదునకు గృధ్రరాజు మిగుల జాలిదూలి 'వానరోత్తమా! జటాయువు నాతమ్ముఁడు. నన్ను సంపాతియందురు. రావణుఁడు నాతమ్ముని వధించెనా ? అయ్యో! ముదిమియు ఱెక్కలు లేమియు నన్నొక యనదనుగావించెను. ఆకారణంబున నీవుచెప్పిన దుర్వార్తను వినియు మిన్నకుండవలసివచ్చెను. తమ్మునిపగఁ దీర్చుకొనుశక్తి నాకిప్పుడు లేమి కెంతయు వగతును. తొల్లి వృత్రాసురవధమప్పుడు నేనును నాతమ్ముఁడును మాపక్షములబలంబుఁ బరీక్షింపఁ గోరి మింటికెగసి యంతరిక్షంబున వేదఘోషలను మంగలధ్వనులను వినుచు రక్తవస్త్రులై గానముచేయుచున్న స్త్రీల నాలకించుచు మండలగతులఁ జనిచని సూర్యుఁడు నభోమధ్యగతుఁడగు నంతకు వానిని డాయఁబోతిమి. అందుండి క్రిందఁజూడఁగా భూమండలంబెల్లఁ బెద్ద బొంగరమువలెఁ దోచెను ; మహారణ్యములు చిఱుపచ్చిక బయళ్ళుగానఁబడెను ; పర్వతంబు లోమనగాయలవలెఁ గాన్పించెను ; నదులు నూలు పోగులవలె నగపడెను ; హిమాచల వింధ్యాచలమేరుపర్వతంబులు సరోవరవిహారపరాయణములైన గున్నయేనుఁగులుగాఁ జూపట్టెను. అంతలోన మాకు భయభ్రాంతులు పైకొనెను ; హృదయము విలోలంబయ్యెను ; దృష్టి తప్పెను ; నిలుపనోపమైతిమి. లోకమెల్లఁ బ్రళయకాలాగ్ని దగ్ధమోయన దోఁచెను. నేను మహాప్రయత్నపూర్వకంబుగా మనశ్చక్షుస్సంధాన

మెఱసి సూర్యునివంకఁ జూచితిని. భానుఁడు భూమండలమంత ప్రమాణముఁ దనకుఁ గాన్పించెను. అంతలో నాతమ్ముఁడు చండగభస్తివేడికి సొమ్మసిల్లెను. వానికి వెన్నాలండనై నా ఱెక్కలతో నతని గప్పితిని. నాపక్షములు కాలిపోయెను. నేనీవింధ్యాద్రియందుఁ గూలితిని. నాతమ్ముని గతి యేమయ్యెనో నేఁటిదనుక తెలియదు. ఇప్పుడు మీవలన వింటిని' అని చెప్పెను.

అంతలోన వానరులెల్ల నటుకువచ్చి 'రావణుఁడెందుండు?' నని యడి
౬౨. సంపాతి వారికి సంతసముఁ గూర్చువాఁడై 'ప్లవంగులారా! వరుణలోకము నాకుఁ గ్రొత్తగాదు; శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారమెత్తి కాలూనినట్టి యూర్ధ్వలోకము నాకు విహారభూమిగానుండెను. దేవాసురయుద్ధమునాఁడు సుధామథనంబును గన్నారఁ జూచి యున్నాను. రామకార్యము మీకన్న నాకుఁ బ్రియతరము. ముదిమివలనను ఱెక్కలు లేమిని నేనిప్పు డెందులకుఁ దగనైతిని. కార్యరూపమున నోపకున్నను మాటరూపమున నేని మీకును మీమూలకంబున రామకార్యమునకును దోడ్పడుదుఁ గాక. కొండొకనాఁడు నేను బిలద్వారమున నుండఁగా 'హా! రామా! హా! లక్ష్మణా!' యను మాటలు నింగినుండి వినవచ్చెను. సంగతి యేమో యని తలయెత్తి చూచితిని. రావణుఁ డొకానొక తరుణీరత్నంబును దివ్యాభరణభూషితను రూపసంపన్నయైన దానినిఁ జంక నిఱికించుకొని విహాయసమార్గంబునఁ బోవుచుండెను. ఆమె యాక్రోశించుచుఁ దానుధరించి యున్న సొమ్ములను దుల్చి పాఱవైచుచు విడివడుటకుఁ బెనఁగులాడుచుండెను. శైలాగ్రంబున సూర్యరశ్మివలె మేఘాంతరంబున మెఱుఁగుచందమున నామె కట్టియున్న పీతాంబరము రక్కసుని మేన నొప్పెను. రాముని పేరు కీర్తించుచున్నందున నామె యేమో సీతగానుండనోపును. రావణుఁడు విశ్రవసుని కొడుకు; కుబేరునకుఁ దమ్ముఁడు; లంకానగరము వాని వాసస్థానము. అది యిటకు నూఱుయోజనంబుల దవ్వున సముద్రాంతరమున నున్నది. దానిని తొల్లి విశ్వకర్మ నిర్మించెను. అతిరమణీయమైన నగరము గలుగును. రవిదీప్తిమంతములైన ప్రాకారములతో హిరణ్మయ ద్వారములతోఁ జెన్నొల్లుచున్న యానగరాంతమునందు రావణాంతఃపురమున సీతాదేవి రాక్షసస్త్రీ

సంరక్షితరై కట్టుపుట్టంబు తడియునట్లుగా విలపించుచున్నది. అచ్చటికిఁ బోవనేర్తురేని మీకు సీతాదేవి కాన్పించును. నేఁగా లంకాపురికిఁ బోయి కృతకృత్యులై సుఖముగా మరలివత్తురు. దివ్యజ్ఞానప్రభావంబున నాచూచి నది చెప్పితిని. వియన్మార్గంబున నంతరములుగలవు. మొదటి యంతర మందుఁ బిచ్చుకలు మున్నగు పక్షులు సంచరించును. అది భూమికి సమీపముగానుండును. రెండవయంతరము కాకులకును ఫలజీవులైన విహంగమంబులకును బోవనైయుండును. దానిపయి మూఁడవయంతరముండును. అది క్రౌంచకారండవాదులకు సంచారయోగ్యమైయుండును. దానిపయి నాల్గవయంతరముగలదు. అందు డేగలు తిరుగాడుచుండును. దానిపై నైదవయంతరమున్నది. అచ్చటుగద్దలు సంచరించును. దానియుపరి భాగంబున నాఱవయంతరముగలదు. అది హంస సంచారయోగ్యమై యుండును. దానిపయి సప్తమాంతరమున్నది. అందు వైనతేయులు పోవుదురు. మా వంశము వినతాసుతుఁడైన యరుణునివలనఁ గలిగెను గావున మాకు సప్తమాంతరమందు విహరించు యోగ్యతగలదు. గరుడునకువలె నాకును దివ్యదృష్టిగలదు. ఇందుండి లంకానగరాంతరమందున్న సీతారావణు లిప్పుడేమి చేయుచున్నది చూచి చెప్పుచున్నాను. మాదృష్టి యాహారబలంబునను నిసర్గశక్తివిశేషంబునను నూఱుయోజనములు పోవును. కోళ్ళు తమపాదమూలమునందలి వస్తువట్లు మేము బహుదూరస్థమైన వస్తువును గ్రహించి భక్షింతుము. ఆపిశితాశనుని నేను స్వయముగా నిప్పుడు పట్టిపెట్టఁ జాలకున్నను బరులవలననేనిఁ జంపింతునేని నాతమ్మునకుఁగాఁ దద్రోహసాధనమని రెండ వాకిఁ గల పగ కొంతకుఁ గొంత చల్లారును. వానరోత్తములారా! ఈలవణాబ్ధి నెట్లు దాఁటనగునో విచారింపుఁడు. ఇది నేయుదురేని సీతాదేవి సందర్శనము మీకగును. మీరు నిష్టసిద్ధిని గాంచి సుఖముగాఁ గిష్కింధానగరము చేరుదురు. నాతమ్మునకు స్వర్గతునకు సముద్రతీరంబున జలతర్పణంబొసర్పవలయును గాన నన్ను మున్నీటిదరికిఁ జేర్చి పుణ్యముఁ గట్టికొనుఁడు" అని చెప్పెను. వానరులంత సంపాతిని సముద్రతీరంబునకు గొనిపోయి జలతర్పణానంతరము వానిని మరల యథాస్థానము చేర్చి సీతాదేవి లంకానగరమునందున్నదని యెఱుంగనోచిన మహాభాగ్యంబున కెంతయు హర్షవివశులైరి.

జాంబవంతుఁడు సంపాతిని సమీపించి 'సౌమ్యా! ఎంతకాలముగా నిందు వసింతువు? రామబాణాగ్నులను లక్ష్మణపరాక్రమంబును దలంపక యింతయోర్చిన మూఢుఁడతఁడెంతటి వాఁడు? వివరంబు వినవలతు' మనెను. నాఁవుడు సంపాతి వారికి సంతసముఁగూర్చువాఁడై 'మిత్రమా! నేను ఱెక్కలు కాలి పడి యఱువదవనాఁడు సుంత తెలివొందితిని. అప్పుడు నేను పడియున్నచోటిదియని కూడ నాకుఁ దెలియకుండెను. కొన్నాళ్ళకు నాయున్నది వింధ్యాద్రియగుట గ్రహించితిని. అప్పుడీపర్వతమునందు నిశాకరుఁడను మహర్షి యుండెను. ఆయన నాకుఁ జిరపరిచితుఁడు గావున నేను మెల్లమెల్లఁగాఁ బ్రాకులాడి వాని యాశ్రమముచేరి యందొక చెట్టుక్రింద వేచియుంటిని. ఆమహాత్ముఁడు జలములాడి యుత్తరాభిముఖుఁడై వచ్చెను. బ్రహ్మదేవుని సమస్తభూతంబులట్లు వానిని వన్యమృగములెల్లఁ గొలుచుచుండెను. ఆమునీంద్రుఁ డాశ్రమము చొచ్చినంతకు రాజు నిజాంతఃపురముఁ బ్రవేశించినప్పుడు తదీయబలంబట్లు వన్యమృగంబులెల్ల వానిసెలవొంది తమతమ నెలవులకుఁ జనెను. అంతకు నమ్మునివర్యుఁడు డాయవచ్చి నన్నుఁ జూచి 'సౌమ్యా! నీఱెక్కలు దగ్ధమైయున్నది; నీచర్మమెల్లఁ బుండువాఱి యున్నది; నీరూపమేర్పడదు. సంపాతివని యూహింతును. ఇట్లు కానేల?' యని యడిగెను. నేను వాక్కుతో వానికి మ్రొక్కి నాసంగతియెల్ల వినిచి 'అయ్యా! ఈదురవస్థకుఁ జిక్కి జీవింపనోపను; మరణము నిచ్చగింతు' నని విన్నవించితిని. నిశాకరమహర్షి ముహూర్తకాలము ధ్యానగతుఁడై 'సంపాతీ! వగవవలదు. ఇక్ష్వాకువంశతిలకుఁడును దశరథప్రియనందనుఁడునైన రాముఁడు పితృవాక్య పరిపాలనార్థము భార్యాసోదర సహితంబుగా వనవాసమువచ్చును. అత్తఱి రావణుండను రాక్షసరాజు రాముభార్యను సీతాదేవి నపహరించి కొనిపోయి యామెను వివిధంబులఁ బ్రలోభించును. ఆపతివ్రతామణి రావణుని నిరసించి నిరశనవ్రతము గ్రహించును. ఆమెకు నింద్రుఁడు సురదుర్లభమైన యమృతాన్నముఁ దెచ్చియిచ్చును. ఆమె యాయన్న మందగ్రభాగంబును వ్రేలముట్టి 'నాభర్తయు నామఱఁదియు జీవించియున్నను దేవత్వమొంది యున్నను వారి కీయన్నముపభోగార్హమగుఁ గాక' అని పలికి దానిని భూమి పైనిడును. అంతతో వారికి క్షుధార్తితీఱును. రాముని పంపున సీతా

న్వేషణార్థము వానరులు వత్తురు. వారికి నీవు సీతావృత్తాంతమును జెప్పు
దువు. ఇట్లు దివ్యజ్ఞానంబున గ్రహించితిని. ఇందే నీవుండి కాలము నిరీ
క్షించుచుండుము. అప్పుడు నీకు ఱెక్కలు యథాపూర్వమగును. నీకిప్పుడే
పక్షములు మొలచి వచ్చునట్లు చేయనోపుదును గాని యట్టి యుత్సాహము
నాకిప్పుడు జనింపదు. నీవలన సర్వలోక హితమైన కార్యము నావచించి
నది కావలసియున్నది. రాముని సందర్శింపవలయునని యెంతో యాస
గలదుగాని యంతవఱకు జీవింపనోల్లను' అని పలికి యామహర్షి నిజాశ్రమముఁ
జొచ్చెను. ఇదిజరిగి యెన్నో యేండ్లు గడచెను. నాఁడు సుత నేనిం
దుండి మీరాక నిరీక్షించుచుంటిని. నేను కదలమెదలఁ జాలను. నా
కొడుకు సుపార్శ్వుఁడు నన్నుఁ బోషించుచున్నాఁడు. గంధర్వులకు గానం
బును సర్పంబులకుఁ గోపంబును మృగంబులకు భయంబు నట్లు మాకు
క్షుద్వ్యథ మిక్కుటము. ఒకనాఁడు నాపట్టి యాహారార్థము చని సూర్యా
స్తమయముదాక మరలిరాకుండెను. ఆఁకలి వెల్లిదమై నాప్రాణములు
పురపురఁబోక్కసాగెను. ఎట్టకేలకు నాసుతుఁడు వట్టిచేతులతో వచ్చెను.
అది గాంచి యెంతో విసివితిని. వాఁడు నాకోప మోర్చి 'నాయనా!
నేను యథాప్రకారము చని మహేంద్రగిరిద్వారము నాశ్రయించి సము
ద్రాంతర జలజంతువులవంక దృష్టినిలిపి కాచియుంటిని. అంతలోఁ గాటుక
రాశివంటి మేనివాఁడు సూర్యోదయప్రభాసమానయైన వనితారత్నము
నొకర్తుకను జంక నిఱికించుకొని గగన మార్గంబునఁ బోవుచుండెను. అపూర్వ
మైన యాహారము దైవయోగంబున సిద్ధించెఁగదా యని యువ్విళ్లూరుచు
వారినిరువురను గ్రహింప నుంకించితిని. ఆపురుషుఁడు నన్నుఁ జూచి
"మార్గము వదలు" మని వినయపురస్సరంబుగా సామవచనంబులతో యా
చించెను. సామోపపన్నులను నీచుఁడు గూడఁ బ్రహరింపఁడు గదా.
దారివదలితిని. ఆతఁడు స్వతేజోవిశేషంబున నింగి నగల్చువాఁడువోలె
మహావేగమునఁ బోయెను. అంతట గగనచరులైన సిద్ధులు నన్ను డాయ
వచ్చి 'నాయనా! దైవ యోగంబున బ్రతికితివి. స్త్రీసహితుఁడు గావున
వాఁడు నిన్నువదలెను. ఇంతకు నీకుఁ గాలము మంచిది. వాఁడెవఁడో
గ్రహించితివా ? రాక్షసరాజు రావణుండు. వాని చంకఁజిక్కి రాలు
చున్న యాభరణములతో జాఱినపుట్టముతో విరిసిన శిరోజములతో

మూర్తిగొన్న దుఃఖదేవతనుబోలి 'హా! రామా! హా! లక్ష్మణా!' యని యేడ్చుచున్న యాస్త్రీరత్నము రామునిభార్య సీతాదేవి. ఆమె నతఁడపహరించుచున్నా' డనిరి. ఇంత ప్రొద్దగుటకును నేను వట్టిచేతులతో వచ్చుటకు నిదికారణ' మని పలికెను. నాడు నా చూచినదానికి విన్న దానికి సరిపోయెను. ఆఘోరవార్త వినియు ఱెక్కలు లేమి మిన్నకుంటిని. దేహబలంబుడిగినను వాఙ్మనోబలంబులు తఱుగవు. ఆ రెండు కరణంబు లెంతమాత్రము మీకుఁ దోడ్పడఁగలవో యంతమాత్రము నావలన మీరు పనిగొనవగును. రాముని కార్యమును నా సొంతకార్యముగా భావింతును. మీరు పౌరుషంబు నాశ్రయించి ప్రయత్నింపుడు. వానరేంద్రుఁడు కోరి యేరి మతిమంతులును బలవంతులును మనస్వులునునైన మిమ్ముఁ బంపెను. అతని యభిమతంబును వమ్ము గానీయవలదు. దేవతలకుఁ గూడ మీరు దురాసదులు. రామలక్ష్మణుల బాణంబులు త్రిలోకరక్షణ శిక్షణంబులకుఁ జాలియున్నవి. రావణుఁ డెంత తేజోబలసమన్వితుండైనను మీకు దుష్కరము గలుగదు. జాగు సేయక కర్తవ్యము నూహింపుడు. బుద్ధిమంతులు నిశ్చితార్థముపట్లఁ దడవు సేయ' రని చెప్పెను.

అంతలోన సంపాతికి ఱెక్కలు మొలిచెను. అతఁడు పరమసంతోషాంతరంగుఁడై నిశాకరమహర్షికి నాత్మలో మ్రొక్కి 'యౌవన ప్రాదుర్భావంబునందట్లు నాకు బలపరాక్రమంబు లుదయించెను. ఋషి వచనము తప్పదు. నాకు ఱెక్కలు మగల వచ్చుటయే యందులకు నిదర్శనము. కార్యసిద్ధియగు; ప్రయత్నింపు' మని పలికి తనపక్షంబుల బలంబుఁదెలియఁ గోరి నింగి కెగసెను.

### దక్షిణసముద్రతీరము.

వానరు లావింతఁజూచి తమ ప్రయత్నసిద్ధియందు విశ్వాసముగలవారై యభిజిన్ముహూర్తము వఱకు వేచి యుండి దక్షిణదిశాభిముఖులై చని, సర్వలోకాభివ్యక్తి నిమిత్తము తీర్చినమేటి యద్దమో యనమన్న దక్షిణమహాసముద్రమును జేరి దాని యుత్తరతీరంబున విడిసిరి. ఆసముద్రంబొకచోట భయంకర నానాసత్త్వసంకులంబుగా, నొక తావున మత్తుంగతరంగపరంపరాఘీలముగా నొకకేడఁ బాతాళవాసి దానవాగ్రణి సందోహసంబాధి

తంబుగా నొకవలన నిస్తరంగమై నిద్రించుచున్నదో యనునట్లునుండెను. ఇట్టి నానాగతులనున్న పారావారంబును గపిముఖ్యులు చూచి దిగులు పడి యొండొరుల మోములు చూడసాగిరి.

అంగదుఁడు వారిమనస్తాపంబును గ్రహించి 'వానరులారా ఇది మీకుఁ దగునా? మనస్సును దుఃఖ వశమొనర్చినచో శక్తి పరాక్రమంబు లుండునా? పగగొన్న పాము శిశువునట్లు విషాదము ప్రాణులను హరించును. దుఃఖమునకు లోఁబడుట కాపురుష లక్షణము. 'విపదిధైర్య' మని చెప్పరా? దుఃఖదీనులకుఁ బురుషార్థములలో నొక్కటియేని సిద్ధింపదు గదా!' యని పలువిధంబుల వారికి ధైర్యంబు నూలుకొల్పెను. వానరులంత గొంతశాంతము వహించి నాటిరేయి యట్లు పుచ్చి వఱువాత మరలఁ గూడి కర్తవ్యము నాలోచింపసాగిరి.

అంగదుఁడు లేచి 'ఈసముద్రంబును దాఁటి లంకాపురిఁ జొచ్చి సీతాదేవిని గాంచి సుగ్రీవుని ప్రతినఁ గాచి రాజభయంబునుండి వానరవర్గంబును రక్షించి కిష్కింధనున్న తనభార్యాపుత్రులకు సౌఖ్యప్రదానమొనర్పనోచినమేటి మనలో నెవఁడేనిఁ గలఁడా? ఎవఁడు నూఱుయోజనంబులు దాఁటు సమర్థుఁడో యతఁడు ముందువచ్చి మాకీయభయంబిచ్చుఁ గాక' యనెను. ఆమాటలు విని కపివర్యులు చిత్తరువులువలె నైరి. అంగదుఁడంతతో విరమింపక 'ప్లవగోత్తములారా! మిన్నకుందురేల? మీబలపరాక్రంబులేమాయెను? ఉత్తమాంశంబుల జనింపరా? లోకపూజ్యులఁ గాంచరా? మీగమనంబునకు నాతంకము గలదా? వినయము మిమ్ముఁ బలుక నీయదుగాఁబోలు. అట్లయిన నొక్కటి యడిగెదఁగాక. ఎవరెవరెంత దవ్వు దాఁటనోర్తురో చెప్పు' మనెను.

పదియోజనంబులు దాఁటుదు నని గజుఁడు పలికెను. ఇరువది యోజనంబు లెగయ నోర్తునని గవాక్షుఁడు చెప్పెను. ముప్పదియోజనంబులు లంఘింతునని గవయుఁడనెను. నలువది యోజనంబులని శరభుఁడు, నేఁబదియోజనంబులని గంధమాదనుఁడు, నఱువది యోజనంబులని మైందుఁడు, డెబ్బదియని ద్వివిదుఁడు, ఎనుఁబది యని సుషేణుఁడు వచించిరి. జాంబవంతుఁడు లేచి 'మీమీలావులు వచించితిరి. నాకుఁగల గతిపరాక్రమము

మునిమివలన సన్నగిల్లెను. అయినను దొంబది యోజనంబులు దాఁటనోపుదును. తొల్లిటి నా శక్తిని దలంచి యిట్లాడ సిగ్గయ్యెడు. శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతార మెత్తి ముల్లోకంబుల నాక్రమించినప్పుడు వాని కొక్కఁగంటను వలగొంటిని. అది యిప్పుడు చెప్పియును ఫలము లేదు. నూఱుయోజనంబులు లంఘించినఁగాని లంకను జేరరాదు. ఏమిసేయుదు' ననెను. అంగదుఁడా మాటనందుకొని నూఱుయోజనములు దాఁటగలను గాని మరలిరానోపుదునో లేదో చెప్పఁజాల' ననెను. జాంబవంతుఁడు వానిని విని 'అంగదా! నీ బల పరాక్రమములు మాకుఁ గ్రొత్తగావు. వేయియోజనములైనను దాఁటిపోయి రాఁ గలవు. నాయనా! మేమింతమందిమి యుండియు యువరాజును నిన్ని కార్యమునకుఁ బంపనగునా? భార్యను భర్తయట్లు రాజును దత్సైన్యము రక్షింపవలయును. ఇది సిద్ధాంతవాక్యము. మఱియు నీవీ కార్యమునకు మూలాధారుఁడవు. మూలము సురక్షితమగునేని ఫలపుష్పాదులు సిద్ధించును. నీవు కార్యసాధనార్థము లంకకుఁ బోవుదువేని మాకిఁక దిక్కెవ్వరు?' అని పలికెను.

అంగదుఁడది విని 'తాతా! నేనుపోరాదంటివి. మఱియెవ్వరును గానరారైరి. ఏమిచేయవలయును? నాఁడు సీతావృత్తాంతముఁ దెలియ లేక ప్రాయోపవేశము నాశ్రయింపఁ దలకొంటిమి. నేఁడావృత్తాంతము తెలిసియు నదే గతి తప్పని దగుచున్నది. ఇంతటఁ గిష్కింధకు మరలుదుమా? అట్లుచని సుగ్రీవునకు నేమని విన్నవింతము? మనమాట నతఁడు మన్నించునా? ఉరిదండనము మనకుఁ దప్పునా? సర్వజ్ఞుఁడవు నీకుఁ దెలియనిది లేదు. తగువెఱవుపదేశింపు' మనెను. నావుడు 'వత్సా! చింత వలదు. నీపని తప్పక కొనసాగును; సందియము వలదు. అఱచేఁ బండిడుకొని యద్దమున వెదకుచున్నాము' అని జాంబవంతుఁడు చెప్పి, యేకాంతముగాఁ గూర్చుండియున్న హనుమంతుని కడకుఁ బోయి 'వీరాగ్రణీ! సర్వశాస్త్రవిదాంవరా! మారుతీ! ఒంటరినున్నావు; పలుకవేల? ఎవని బాహుబలము కశ్యపప్రముఖులైన గరుడుని పక్షబలంబును మించునో, ఎవని వేగపరాక్రమంబులను బక్షీంద్రుఁడు సంతతము కీర్తించునో, ఎవని బుద్ధిబలంబులు సర్వభూత విశిష్టములో యట్టి నీవు విన్నయుండవు గాఁబోలు. హనుమంతా! జగత్ప్రాణునకు జనించితివిగావున నీవు దేవాంశ

సంభూతుఁడవుగాని యేతన్మాత్రుఁడవుగావు. బాలార్కబింబంబును ఫల భ్రాంతితో మ్రింగనుంకించితివి. ఇంద్రుని వజ్రముగూడ నీయందు సమగ్రశక్తిమంతము గాదయ్యెను. కులిశధారాహతిఁబడసి నీవు పర్వత శిఖరంబునఁ బడితివి. అప్పుడు నీహనువు మొక్కవోయెను. ఇంద్రుని చేతను నీతండ్రి ప్రభంజనుండు కినిసి వీచుటమానెను. వాయుస్తంభనంబున ముల్లోకము లల్లాడెను. సురలు సంభ్రాంతులై గుమిగూడివచ్చి నీ తండ్రి నాశ్వాసించిరి. ఆతఁడు ప్రసన్నుఁడయ్యెను. ఎందును నీకు శస్త్ర భయము గలుగదనియు స్వచ్ఛందమరణశీలి వగుదువనియు నాఁడు పరమేష్ఠి నీకు వరములు ప్రసాదించెను. అట్టి మహామహుఁడవు నీవు ప్రాణభయార్తులమై యున్న మమ్ము రక్షింపఁ దలంపవా? ఎవఁడు త్రివిక్రమావతార కాలంబున భూమండలమెల్ల నేకవింశతిపర్యాయములు వలగొనెనో, అమృత మథనసమయంబున నెవఁడు సురప్రార్థితుండై తెచ్చియిచ్చిన మూలికల ప్రభావంబున సుధ పుట్టెనో, యాజాంబవంతుఁడు నేఁడు ముదిమికిఁ జిక్కి సత్త్వహీనుఁడయ్యెను. నీవు దక్క యొరు లిందులకుఁ జాలరు. నీపరాక్రమసందర్శనకాంక్షులై వానరులు వేచియున్నారు. లెమ్ము; సముద్రోల్లంఘన మొనర్పుము; దీనులకు ముదమొదవింపు' మని ప్రేరణోక్తుల వచించెను.

జాంబవంతుని ప్రణయోత్సాహవచనంబులు మనోగతములైనంతనే హనుమంతుని యొడలుప్పొంగసాగెను. అతఁడు వాలమల్లార్చుచు లేచి 'వానరసత్తములారా! ఎడరు మానుడు. 'చూచివత్తువు సీత' నని నాయంతరాత్మ పలుకుచున్నది. ఇదిగో నాదక్షిణబాహువదరుచున్నది.

ఉ॥ మీటినరాయికైవడి నమేయరయంబున గంతువైచి మ
న్నీటివిదాఁటి యాపరమనీచుని రావణుప్రోల వ్రాలి వె
న్గోటలు పేటలుం గడిఁది కోనలు గీనలు రాణివాసముల్
మేటినగళ్ళు కాదువ్రలు మేడలు వాడలు చుట్టి చూచెదన్॥

ఉ॥ భూమిజఁ గాంతు నేనియు విభుండటు సంప్రుటవిన్నవించి చే
తోముదమొప్ప నామెఁ గొని తోడనవచ్చి కపీంద్రుమ్రోల శ్రీ
రామునకప్పగింతుఁ గనరాదగునేని సమస్తరాక్షస
స్తోమముతోడ నప్పురిని దోయిటఁ దెత్తు మరల్ సెబాసనన్!॥

వేమ గుప్పించి యెగయునప్పుడు నా పాదహతికి భూతలంబు క్రుంగఁగావునఁ బర్వతాగ్రము నెక్కి లంఘింతును. నాలంఘనవేగంబునకుఁ బుడమి గ్రక్కదలును; నగంబులు దుల్లును; సముద్రంబు లింకును; మేఘంబులు గ్రమ్మును; గగనచరంబులు మ్రాన్పడును. సురాసురులడ్డము వత్తురుగాక; మతిమొండగుఁగాక. నా గమనము మరలదు. సీతాదేవినో లంకాపట్టణంబునో రెంటి నొకటి చూతునుగాక' అని బింకంబులు వచించెను.

వానరులు ప్రహృష్టాంతరంగులై హనుమంతు నగ్గడించిరి. జాంబవంతుఁడు లేచి 'నాయనా! నీవలన మాదుఃఖమిప్పుడు చల్లారెను. సంతోషమును గూర్చితివి. మహర్షుల యనుగ్రహంబునను వానరవృద్ధుల యాశీర్వచనబలంబునను గురుజనప్రసాదంబునను నీవు సుఖముగా వత్తువుగాక. నీవచ్చుదనుక మేమెల్లరము నొంటికాల నిలిచి కార్యసిద్ధ్యర్థము నీకుఁగాఁ బరమేశ్వరుని ధ్యానించుచుందు' మనెను. హనుమంతుఁ డంత విజృంభించి మహేంద్రపర్వతమారోహించి మనస్సుచేత లంకాపురముఁ జొచ్చెను.

కిష్కింధాకాండము సంపూర్ణము.





# శ్రీ దొడ్డ రామాయణము.

## సుందరకాండము.

చ|| స్థిరమగుభక్తియుక్తి నిరతచిత్తవిశుద్ధియుఁగల్గి యేజగ
ద్గురుచరణాబ్జముల్ గొలువ ఘోరపయోనిధి పల్వలంబుగాఁ
బరఁగ నభీష్టసార్థములు పాటిలెఁ బావని కందు నాజగ
ద్గురు చరణాబ్జము ల్వొనరఁగూర్చుత మాకు సమస్తభద్రముల్ ||

హనుమంతుఁడట్లు మహేంద్రగిరి నారోహించి, మరకతంబులు పఱచినయట్లున్న యచ్చటి చల్లని లేఁబచ్చిక నేలలఁ గొంతవడి విహరించి, మేను పెంచి పూర్వదిశాభిముఖుఁడై తండ్రి యగు వాయుదేవునకును సకలకర్మసాక్షియైన సూర్యునకును నిఖిలసురాధిపుఁడగు దేవేంద్రునకును సృష్టికర్తయైన పరమేష్ఠికిని నమస్కరించి, లంకవంక మరలి బాహువులల్లార్చి బలము కొలంది నప్పర్వతరాజంబును మర్దించెను. ఆతాఁకునకు నగ్గిరీంద్రము ముహూర్తమాత్రము కంపిల్లెను; అందలి తరువుల పుష్పంబులు జలజల రాలి యన్నగంబునొక పుష్పరాశిగాఁ జేసెను; అచటి కాంచన నీల రజతవర్ణశిలలు పిటులు వాఱి కపివీరుని రేఖాప్రతిబింబంబులను బహురూపంబుల నభివ్యక్తీకరించెను; ఆ నగాంతరమునుండి మణిశిలలలోని పత్త జ్వాలలోని నడిమిదైన ధూమ్రజ్వాలతోడి విస్ఫులింగమండి నాదము ధూమరాజిని మించెను; అందలి గుహాంతరస్థ భూతంబులు యార్తారావంబులు రోదసీకుహరంబును దాఁకి మాఱుమ్రోసెను; స్వస్తికలక్షణాంకిత ఫణాభరణంబులైన యాశీవిషంబులు రాయిడి చెంది కోపవివశంబులై విషాగ్ని గురియుచు శిలాతలంబులను గఱచుటంజేసి యవియెల్ల విచ్ఛిన్నలైన యోషధులకుఁ గూడ మిక్కుటమై మండుచు మణిదీపంబులై వడి నప్పర్వతమం

దెల్లెడలఁ బ్రజ్వరిల్లెను. పంచభూతాత్మకమైన శైలము తత్తద్భూతవియోగ కారణంబున విడివడి రూపుమాయుచున్నదో యని శంకాకులురై యందలి ఋషులు హాంటాహంటి నింగికిఁ బ్రాఁకిరి. రక్తమాల్యానులేపనంబులతో మధుమదాఘూర్ణితంబులై కెందామరలం బోలిన నేత్రంబులతో నొప్పుచు పాన భూములందు వేళాకోళములుగానున్న విద్యాధరులు ప్రళయంబయ్యెనని తలంచి భయవిహ్వలులై తడబడుచు సువర్ణమధుపాత్రంబులను వివిధభక్ష్యలేహ్య మాంసంబులను డాలు పిడికత్తి మున్నగు నాయుధంబులను బాఱవైచి, ప్రాణరక్షణార్థము ప్రియులతోఁడ గగనంబున కెగసి యుపరిచరసిద్ధచారణ మహర్షులవలన సంగతి యెఱింగి యప్రమేయశరీరంబుతో శిఖాగ్రంబున నున్న హనుమంతుని జూచి లోలోన సిగ్గుపడిరి.

హనుమంతుఁడట్లు విజృంభించి నడుము సాచి ప్రాణంబులు బంధించి యాత్మీయసత్త్వతేజోవీర్యంబులను మూర్తీభవింపఁజేసి యాకసంబువంక దృష్టి సారించి కాళ్ళువంచి పాదంబులూని చెవులు రిక్కించి తోఁక యల్లార్చి జాంబవదాదులను గాంచి శ్రీరామనిర్ముక్తశరవేగంబున రావణ పాలితంబైన లంకాపట్టణంబునకుఁ బోయి యందు జనకాత్మజను శోధింతును. ఆమె యందుఁ గానరాదేని యదేవేగంబునను నాకంబు మెట్టి యా నాకంబెల్ల గాలింతును. అప్పటికిని నా శ్రమ ఫలింపదేని రాక్షసరాజును రావణాసురుని బట్టికట్టివైతు ; లేదా 'లంకానగరంబును సరావణంబుగా నుత్పాటించి కొనివత్తు' నని పలికి తీవ్రమున నింగి కెగసెను.

సముద్రోల్లంఘనము.

హనుమంతుని వేగోద్ధతికిఁ దన్నగవృక్షంబు లున్మూలితంబులై దూరాధ్వప్రస్థితుని సాగనంపుటకై వెంటఁ జను బంధువులక్రియ నమ్మారుతిని గడుదవ్వు వెంబడించి సముద్రాంతరంబున గూలసాగెను. మారుతి పుష్పావకీర్ణుఁడై మిణుంగురులతోడి కొండవలెఁ దోఁచెను. సాగరంబు విక్షిప్తప్రసూనాకలితమై సనక్షత్రగగనతలంబును బోలెను. పంచాస్యపన్నగంబుల భ్రాంతిని గలిగించు హస్తతలంబులతో నేకకాలసముదిత చంద్రార్కులో యన నొప్పుకందోయితో పూజార్థమెత్తిన యింద్రధ్వజమో యనమండు వాలంబుతో నిజవక్షోభాగహతికి జీలి చిదుపలై కక్షాంతరములఁ బఱచుచు

వాయువుగా వీచు మేఘగర్జాధ్వనులతోడఁ జనుచున్న మారుతింగాంచి రావణవినాశసూచ్యమైన తోఁకచుక్కయే లంకాపురి వ్రాలుచున్నదోయని ఖేచరపక్షులు తలంపసాగిరి. వాని యూరువేగజనిత ప్రచండవాతోద్ధతికి ఉత్తరదిశాగతానిలంబు తోడై వీవఁగా సముద్రుఁడు సుళ్ళుదిరుగుచు నురుగులు గ్రక్కుచు నింగినొరయుచు భ్రాంతచిత్తునిబోలి మహాక్షోభితిని బొందెను. ఆకపివరుఁడు రామకార్యార్థము చనుటకెంతయు సంతసించి దేవదానవగంధర్వులు వానిపయిఁ బుష్పవృష్టిఁ గురిసిరి; సూర్యుఁడు శీతకరుఁడయ్యెను. ఋషులును దిక్పాలురును వానిని వేనోళ్ళఁగీర్తించిరి.

సముద్రుఁడు హనుమంతునకు సాహాయ్యమొనర్చుట.

అట్లు చనుచున్న హనుమంతుని సముద్రుఁడు చూచి 'ఆహా! నేఁడెంతయు నాకు సుదినంబు. నేను సగరునివలనఁ బెంపొందితిని. ఆ మహానీయుఁ డిక్ష్వాకుకులప్రసూతుఁడు. వానివంశము నాకిప్పుడును మాన్య మగును. రాముఁ డావంశ్యుఁడు. అతని కార్యార్థము మారుతి చనుచున్నాఁడు. ఇతనికిఁ దోడ్పడుట రామునకుఁ దోడ్పడుటగును. అట్లొనర్చి కృతకృత్యుఁడ నయ్యెదఁ గాక. ఇతఁడు దవ్వుదాఁటు సమర్థుఁడైన గావున మార్గపరిశ్రాంతుఁడగుట చనదు. ఏకముఖంబున నింతదూరము చనుటయుఁ గష్టతరము. ఎందేని సుంత నిలిచి యీయనఘుఁడు బడలిక వాసిపోవు టొప్పును' అని యాత్మగతంబునఁ దలపోసి, తనగర్భంబున మునిగియున్న మైనాకపర్వతంబును బిలిచి 'గిరిసత్తమా! పాతాళవాసులైన యసురులు పైకి రాకుండుటకై నిన్నిట గడియమ్రానుగా దేవేంద్రుఁడుంచెను. నీవలన సురవైరుల పరాక్రమప్రయత్నములెల్లఁ బొల్లుపోయెను. నీశక్తి యింతని రాదు. ఏవలనఁగోరిన నావలను బెంపుగాఁదువ్వు. ఇప్పుడు నిన్నుఁ గొండొక యర్థంబు వేఁడెదను. కపిచంద్రుఁడు హనుమంతుఁడు రామకార్యార్థమై తెంపునేసి నీపైఁగా వినువీధి నదిగో చనుచున్నాఁడు చూడుము. నేను యథాశక్తి యితనికిఁదోడ్పడి యారూపంబున నాకృతజ్ఞతను ఇక్ష్వాకువంశంబునకుఁ జూపుదుఁగాక. మిత్రమా! నావలెనే నీవును నైక్ష్వాకులకు కృతజ్ఞతాఋణబద్ధుఁడవుగాని వేఱుగాదు. ఎట్లందువా! నాజన్మము వారివలనఁ గలిగెను. నేనుండుటవలన నీవు నాయందు సుఖముండుటయ్యెను.

కావున నీవును వారిని బూజింపక తప్పదు. రాముఁడైక్ష్వాకవు గావునఁ దత్కార్యార్థికిఁ దోడ్పడుట రామునకుఁ దోడ్పడుటే యగును. రాముని సంభావించుటవలనఁ దద్వంశమును బూజించుటగును. ఆమహాత్మునికు నింతకన్న మన మేమియుఁ జేయజాలము. చేయఁదలంచినదానిని సకాలమునఁ జేసిన మేలగును. ఏమో కోరునని జడియవలదు. నీకు మించినదానిని కోరుటలేదు; నాకోరునది నీకొక సంగతిగాదు. నీటిలోనుండి పైకి రెమ్ము. నీ శిఖరాగ్రంబున హనుమంతుఁడు సుంత విశ్రమించి శ్రమ వాసి చనుఁగాక. అతిథిసత్కార మింతమాత్రమేని చేయఁజాలని మనజీవిత మేల? మిత్రమా! నాసంగతి యటుండనిమ్ము. నీవు సామాన్యుండవు గాదు. హిరణ్మయశిఖరంబులు గలిగి దేవగంధర్వ సేవితుండవై ప్రశస్తిగాంతువు. అట్టి నీవిప్పుడు లోకోత్తరుఁడైన యతిథి వచ్చునప్పుడు మఱియు మిన్నకుండనగునా? నావచించినది గావించుటవలన నీ గౌరవంబు పెంపొందును. అంతియగాదు. రాముఁడు శ్రీమహావిష్ణువే గాని వేఱొకఁడు గాదు. అట్టివాని పూజ లన్నప్పుడెల్లఁ గలుగవు. అప్రార్థితముగా మనకు నేఁడిట్టి భాగ్యంబు గల్గుట మనపూర్వసుకృతఫలంబు గాని యన్యంబుగాదు. సీతాదేవియన్ననో పరమపతివ్రతారత్నము. అట్టి మహాత్మురాలి కిప్పుడిట్టి యాపదవచ్చెను. సీతారాముల నిమిత్తంబీయనఘుఁ డనన్యసాధ్య కార్యంబు నకుఁ దెంపు జేసెను. ఇంతకన్న నాత్మార్పణము గలుగదు. ఇవన్నియుఁ దలపోసి నాప్రణయంబొనర్పు' మనెను.

మైనాకుఁడు.

మైనాకుఁ డామాటతోడ నభోవీథికిఁ బెరిగెను. వాని శిఖరకాంతులు నీలమేఘమండలంబును సువర్ణచ్ఛాయాకలిత మొనర్చెను. హనుమంతుఁ డాచింతకు నచ్చెరువొంది తనదారికి నడ్డముగానున్న కొండలరాయుని జూచి 'ఔరా! నాతోత్రుపనికి భంగపాటుగలిగింప నున్నాఁడు కానిమ్ము' అని కృతనిశ్చయుఁడై పవనుఁడు జీమూతంబును వలె నతఁడప్పర్వతేంద్రుని బోమ్ముతోఁ ద్రోపాడెను. ఆత్రోపు వడిని బట్టి హనుమంతుని గమన వేగంబును మైనాకుఁడు గ్రహించి ప్రమోదపులకాంకితుఁడై మనుష్య రూపమున దాల్చి 'మిత్రమా! నిన్నడ్డగింపవచ్చిన వాఁడఁ గాను. నీశీలం బెఱుంగుదును. అన్యదుస్తరమైన సముద్రలంఘనంబును సమకట్టితివి.

దప్పినవాఁటుట గొప్పశ్రమయగును. నాశిఖరంబులందు సుంత విశ్రమించి చనుము. ఈపాటి తోడ్పాటు నీకొనర్చఁగా సాగరప్రేరితుండనై వచ్చితిని. సముద్రుఁడు సగరునివలన వృద్ధిఁ గాంచెను. సగరుఁ డిక్ష్వాకువంశ్యుఁడు. రాముఁ డావంశమున జనించెను. నీవు రామకార్యార్థము పోవుచున్నావు. కిక్కింతమాత్రమేని గావించి నీద్వారా రామునకును వానిద్వారా ఇక్ష్వాకు వంశంబునకును దనకృతజ్ఞతను జూప సముద్రుఁడు సంకల్పించి నన్నిందు లకుఁ బ్రేరేచెను. మావేడికో లంగీకరింపుము. స్వాదుకందమూలఫలంబులు పలయునన్ని నాయందుఁ గలవు. ఇచ్చవచ్చినవాని నారగించి యలసటలు వాసి తీరలుము. హరిసత్తమా! నిన్నిట నాపుటకుఁ గారణాంతరము గూడఁ గలదు. తొల్లి కృతయుగంబునఁ బర్వతంబు లెల్ల రెక్కలం గలిగి గరుడానిలవేగవంతములై యెల్ల దెసలు సంచరించుచుండెను. అవియట్లు విచ్చలవిడిఁ దిరుగుచుఁ దప్పితాకి తలమీదఁ బడునోయని దేవర్షిభూతంబులు భయక్లిష్టలాయెను. దేవేంద్రుఁడు వారిభయంబు మాన్పుటకుఁ గా వజ్రాయుధంబున వేనవేలపర్వతంబుల పక్షంబులను ఖండించి నాపైకిఁ గూడ నడిచెను. నేను వాయుదేవు నాశ్రయించితిని. ఆమహాత్ముఁడు నన్ను దవ్వు విసరి సముద్రాంతరమునఁ ద్రోసి నా రెక్కలం గాపాడెను. నీవో యాయనఘుని సుతుఁడవు; ఆకారణంబున నాకుఁ బరమపూజ్యుండవైతివి. అదియునుంగాక యుత్తము లెందును బూజ్యులగుదురు. దేవాంశ సంభూతుండ వగుటవలనను దేవకార్యార్థము ప్రాణంబును గూడఁ దృణీకరించితివి గావునను నీ వెల్ల విధముల నుత్తమోత్తముండవనక తీఱదు. ప్రాకృతుఁడు సయితము అతిథియైనప్పుడు పూజార్హుఁడు కాఁగా నీయట్టివాని సంగతి చెప్ప నేల? మారుతీ! నిఖిలధర్మవేత్తవు నీకుఁ దెలియని ధర్మములుండా? మాయిచ్చు నాతిథ్యంబు నీకు ననవసరము గావచ్చును. అయినను మా ప్రేమను ద్రోయరాదుగదా' యనిచెప్పెను.

హనుమంతుఁడు వాని ప్రార్థనము విని 'నగసత్తమా! నీ కెంతయు సంతసించితిని. నీ యాదరణోక్తులవలననే నీయిచ్చు సపర్యలెల్ల నాకయ్యెను. కార్యత్వర నిలువనీయదు. ప్రాగ్దుక్తంకకము నన్నే లంకాపురము చేర వలయును. అదియునుంగాక యొండెటోటఁ గాలూనక రామబాణగతిఁ జనుదు నని ప్రతినచేసి వచ్చితిని. ప్రతిజ్ఞాభంగము గారాదు. నన్నుఁ

గోపింపకు' మని పలికి పాణితలంబున వానిని బుడికి తదీయానుమతిని బడసి విఘ్నము తప్పినందులకుఁగా సంతసిల్లి ప్రయాణము సాగించెను. మైనాక సముద్రులు హనుమంతుని నాశీర్వచనంబుల సత్కరించి యతనిఁ దగలించిరి. దేవర్షి సిద్ధచారణముఖ్యులు వాని కార్యపరత్వంబును వేనోళ్ళ నుగ్గడించిరి.

ఇంద్రుఁడు మైనాకునకు మెచ్చి వచ్చి 'సౌమ్యా! హనుమంతుని తీవ్రసాహసంబును జూచి యతనికేమి ముప్పువచ్చునో యని ప్రాణంబులఁ జేతఁబట్టుకొని తహతహపడుచున్నాము. నీసౌజన్య మిప్పుడు తెలిసెను. నీకెంతయుఁ బ్రీతుండనైతిని; అభయవరమిచ్చితి' నని పలికి చనెను. అప్రార్థితముగా సిద్ధించిన యామహావరంబునకు మైనాకుఁడు పరమ సంతోష మందెను. అనాయాచితోపకారులకు శుభంబులు నిత్య సిద్ధములుగదా.

సురస.

మైనాకుఁడట్లు చన్నంతనే దేవగంధర్వ సిద్ధమహర్షులు నింగిఁ గూడి మంతనము సలిపి నాగమాతయైన సురసను రప్పించి 'కళ్యాణీ! వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు సముద్రోల్లంఘనము దొరకొని యదిగో పోవుచున్నాఁడు. వానిబలపరాక్రమంబులఁ దెలియఁ గోరుదుము. నీవు మహాఘోరరాక్షసివై దంష్ట్రాకరాళాస్యము నప్పళించి వానికి నెదురై యతని ప్రయాణంబును ముహూర్తమాత్రము భంగపఱుపుము. ఉపాయంబున నిన్ను జయించి యతఁడు చనునో యేమిచేయునో చూతమ' మనిరి. సురస యంతట లోకభయావహ మహావికృతాకార రాక్షసియై హనుమంతు నడ్డగించి 'వానరసత్తమా! క్షుధార్తనై మాడుచున్న నాకు నాహారంబుగా నిన్ను దేవతలు ప్రసాదించిరి. మాఱాడక నానోరుచొచ్చు' మనెను. హనుమంతుఁడు చేదోయి మొగిడ్చి 'రాక్షసీ! దశరథాత్మజుఁడు రాముఁడు తండ్రిపంపు పేర భార్యాసహోదర యుతుఁడై దండకారణ్యమునకు వచ్చెను. అచ్చట వానికి రాక్షసులతోడ బద్ధవైరము సంభవించెను. కొండొకనాఁ డామహాత్ముఁడు కార్యాంతరాసక్తుఁడై చనియుండఁగా వానిభార్యను సీతాదేవిని బరమపునీతురాలిని రావణాసురుఁ డపహరించి తెచ్చెను. ఆమెను వెదకుటకుఁగా రామునాజ్ఞఁ జనుచున్నాను. నీవును రామరాజ్యవాసివిగాని యొండుఁగాదు. దానికిఁ దోడ్పడుట ప్రజలకెల్ల విధి విహితము.

గావున్న రాజద్రోహమగును. నా మాట పాటింపవేని నేను పోయి సీతాదేవిని జూచి యావార్త రామునకుఁ దెలిపి మరలి వచ్చి నీయిచ్చ చేయుదును. అందాక నివారింపుము' అని చెప్పెను. సురస కాదనెను. అంత హనుమంతుఁడు తనపొడవుఁ దగ్గించి చిటుతరూపము దాల్చి యారక్కసి నోరుమాత్రే వెలువడి వచ్చి 'దక్షప్రజాపతిసుతా! సురసా! నీముఖంబున జొచ్చితిని. నీకోరిక ప్రాణి నీవదనంబు దూఱకతీఱదు. అది బ్రహ్మవరము. దానిని సత్యమొనర్చితిని; ఇఁక నన్నువదలు' మనెను. సురస తొల్లిటి రూపము వహించి 'సౌమ్యా! యథాసుఖము చనుము; కార్యసిద్ధి యగుఁగాక; రామునితో సీతనుగూర్పు' మని పలికి చనెను. హనుమంతుని బుద్ధిపరాక్రమంబులకు భూతంబులు వానిని సాధువాక్యంబులఁ బ్రశంసించెను.

### సింహిక.

పవనాత్మజుఁడట్లు సురసను వీడ్కొని వారిధారాభిషిక్తంబును ఖగసేవితంబును దుంబురాది సంచారశోభితంబును మహేంద్రధనుర్విరాజితంబును విమానప్రచారరమణీయంబును వజ్రాశనిసమానపావకప్రభాశోభితంబును నై యున్యాది గ్రహనక్షత్ర చంద్రార్క తారాగణంబులతో విరాజిలు చుండునో జితస్వర్గులైన మహాభాగు లెందు నక్షత్రరూపంబునఁ బ్రకాశించుచుందురో భూలోకంబునుండి దేవతార్థము హవ్యంబును గొని పోవుటకు నగ్నిహోత్రుని కయ్యది మార్గమో యయ్యాకాశపథంబున బ్రొక్కి గరుత్మంతుఁడు వోలె జివ్వునఁ జనసాగెను. అట్లు పోవుచుండగా సింహికయనురాక్షసి కామరూపిణి జూచి క్షుధార్తయై ఛాయాగ్రాహిణి గావున వానినిఁ దనీయఛాయంబట్టి యీడ్చెను. ప్రతివాతంబున నావల దాను సమాకర్షింపఁబడుట యెట్లొ యని తెలిసికొని కారణమేమోయని నలుదిక్కులు పరికించి క్రిందికిఁ జూపు సారించెను. సముద్రాంతరమున నొక మహాజంతువు వికృతమైనది లేచి నోరప్పళించి యుండెను. హనుమంతుఁడు దానిని గాంచి దక్షిణసముద్రాంతరమున ఛాయాగ్రాహిణియను మహాజంతువుగలదని నాఁడు సుగ్రీవుఁడన్న భూత మిదిగా నుండనోపునని తలంచి తనశరీరమును బెంచెను. సింహికయుఁ బాతాళాంతరసన్నిభంబుగాఁ దన నోరు విచ్చి ప్రళయమేఘంబు కైవడి గర్జించుచు హనుమంతుని దఱుమఁ జొచ్చెను. మారుతి క్షణములో మహాప్రాంశురూపుఁడై [illegible]

రాహువక్త్రంబునుబోలె దాని ముఖబిలముఁజొచ్చి తీక్ష్ణములైన నిజ నఖాగ్రంబులచేత తదీయమర్మంబులం జీల్చి యది నోరుమూయుటకున్న మనోవేగంబున వెలువడి వచ్చెను. ఆభూతము తెలివితప్పి నీటఁబడి సమసెను. ఆకాశచారిణులైన భూతంబులు సింహికపాటుఁగాంచి 'భళి భళీ! నీయీకార్యము వినువారికిఁ గూడ వెఱపుఁ గలిగించును. ఇట్టిమెఱుఁగు వాని ధైర్యంబును దలంపునకుఁ గూడ నందని సూక్ష్మదృష్టియుఁ దక్షు నిశ్చయశక్తియుఁ గార్య కౌశలంబును గల మేధావికిఁ బడయరాని యర్థ ముండునా ! శుభమగుఁ గాక' అని వానినభినుతించిరి.

ఆ లం బ న ప ర్వ త ము.

అంజనీసూనుఁడట్లు సింహికను ఖర్జించి కొంతదూరము చనఁగా నటకుఁ గొండొకమేర మలయోపవనంబులును లంకాద్వీపంబులును నదీసాగర సంగస్థానంబులును గానవచ్చెను. ఆధీరాగ్రణి యంత నంత యా 'యీరూపంబుతో నింత వేగంబునఁ జనుదునేని రక్కసు లాశ్చర్యవశులై హాహాకారము లొనర్తురు. కార్యము చెడు' నని తలపోసి వీతమోహుఁడైన జీవుఁడు శరీరత్యాగమొనర్చి తొంటిరూపంబును బొందినట్లు బలిగర్వనిర్వా ణార్థము శ్రీమహావిష్ణువు వామనరూపము దాల్చినట్లు పూర్వాకారము వహించి త్రికూటపర్వతశిఖరాగ్రస్థ లంకానగరమువంక దృష్టి నిలిపి విచిత్ర కూటసమన్వితంబును నారికేళక్రోద్దాలక కేతకీవన సమలంకృతంబునైన యాలంబపర్వతము మీఁద వ్రాలెను.

లం కా న గ ర ము.

లంకానగరము త్రికూటశిఖరాగ్రతలంబున నిర్మితమై గగనతలంబునఁ గట్టినదియను భ్రాంతిని గలిగించుచు వివిధరాజోద్యానంబుల తోడను, బుష్పభారవినమ్ర పవమానప్లవమాన వల్లికాల్లోలిత లతాగృహంబులతోడను, బూచిమేచి సొబగారుచున్న పూపందిరులతోడను, బద్మోత్పల హంస కారండవ సంకులంబులైన నడబావులతోడను వివిధశిలాసోపానమనోహర సరోవరంబులతోడను మనోజ్ఞమై, సాగరసమానదీర్ఘపరిఘావృతమై పర దుష్ప్రవేశమగుచు నింగి నొరయు ప్రాకారంబులు గల్గి, గాలికిఁ గదలి యాడుచు ఊని నిరంకుశత్వంబును జాటుచున్నవో యన నున్న పతాకలతో,

కోష్ఠము మిఱుమిట్లుగొల్పుచున్న సువర్ణరత్నఖచిత బహిఃద్వారబంధురమై యసదృశవిభవాభిరామముగా నుండెను.

లంకానగరోత్తరద్వారము.

హనుమంతుఁడు సుంతవడి నాలంబనాద్రియందు నిలిచి యందుండి తరలి లంకానగరోత్తరద్వారము చేరి 'అహో! విధివిధానమెట్లో తెలియ రాదు. అంగద నీల సుగ్రీవులు దక్క యన్యు లీసముద్రమును దాఁట లేరు. లంకయన్ననో సురలకుఁ గూడఁ జొరరాదు. ఇందువచ్చుటయు దీనిని జయించుటయు సాధ్యమా? రాముఁడు పరాక్రమమూర్తి యగుట సత్యమేగాని యాయనమాత్ర మిందేమి సేయఁగలఁడు? రాక్షసులు నిసర్గ క్రూరులు; వారియెడ సామోపాయంబులు పొసఁగవు; ధనసమృద్ధులు గావున దానోపాయము వారియందుఁ జెల్లదు; బలగర్వితులుగాన భేదో పాయంబునకు లొంగరు; పోరన్న వారికిఁ జెర్లాటము గావున దండోపాయ మునకు నిసుమంతయు నవకాశముగలుగదు. పర్యవసానమెట్లున్నదో గదా! అటటా! ఈవిచారము నాకేల? సీతాన్వేషణార్థినై వచ్చితిని. ఆమె బ్రతికియున్న నిట్టియూహలు సేయనగును. నావచ్చినపనిఁ జూచికొందుఁ గాక — పురమెట్లు ప్రవేశింపవలెను? రావణునికంటఁ బడితినా యతఁడు నన్నువదలఁడు; నావచ్చిన కార్యము చెడును. ఒరుల కంటఁ బడక నగరప్రదేశములు వెదకుటెట్లు? సీతాదేవిని జూచుటెట్లు? దూతనై యిందు వచ్చితిని. దూతలవైక్లబ్యమునఁ జేసి సిద్ధప్రాయములైన కార్య ములు గూడఁ జెడుట గలదు. అట్టినింద నాకు రాకుండు మార్గమేది? అపరాహ్ణమగుచున్నది. ఇప్పుడే లంకాపురమును బ్రవేశింతునా? యీ రూపము తగునా? హరిస్వరూపమును దాల్పవలయునా? ఎట్లయినను రాక్షసుల కంటఁబడరాదు. నేను గూడ రాక్షసినై వారి నేమరింతునా? మాయావులు వారంతమాత్రాన నే మోసపోదురా? వాయువు నిరా కారుఁడు. అతఁడు గూడ వీరిని గను భ్రామి యందు విహరింపనోపఁ డనఁగా నేనెంత వాడను! — చీఁకటిపడుదనుక వేచి యుందునా? సరిసరి; రాత్రులందు వారు మధుమదోన్మత్తులై యుందురు; చీఁకటియు నాకుఁ దోడ్పడును. ఇదే యుక్తోపాయము' అని లోలోన వితర్కించు కొని కర్తవ్యము నిశ్చయించి రవియస్తమించినంతనే మార్జాలమాత్ర

కాయుఁడై ప్రదోషంబునఁ గోఁతులట్లు దుముకులాడుచు మెలమెల్లగా సాద్వారమెక్కి, లోపల వెండిస్తంభములమీఁదఁ గట్టియున్న యేడెనిమిది యంతస్తులమేడలను సువర్ణగవాక్షములు గల వానిని గాంచి యాశ్చర్యపరవశుఁడై కొంతవడికి నెమ్మది వహించి 'ఇంతదవ్వు దాఁటి నిరాంతకముగా వచ్చితిని. సీతాదేవిని గాంతు' నని సంతసించి, యంతలోన వేఱొండు తలఁచి 'కటా! లంకయెక్కడ? వానరులిందు వచ్చుటెక్కడ?' అని విషాదమొందెను.

లంకిణి.

అంతలోనఁ జంద్రుఁడు మారుతికి సాచివ్యమొనర్చుటకో యన సరసము నుండి యెగయునంచవలెఁదోఁచుచుఁ దారాగణమధ్యవర్తియై శంఖప్రభాక్షీర మృణాళశోభలను బరిహసించుచు విరాజిల్లెను. హనుమంతుఁడు ధైర్యము వహించి యాద్వారంబును దాఁటి చనఁదలంచి లోనఁగాలూనెను. తటాలున వాని యెదుట రక్కసి యొకర్తు నిలిచి 'ఎవఁడవురా నీవు? ఇందేలవచ్చితివి? ఊపిరితీయకమున్న కలరూపు తెలుపుము. కోఁతి యెక్కడ? పరదుష్ప్రాప్యమైన లంకయెక్కడ?' అని గద్దరించి యడిగెను. వికృతాస్యయు భయంకరనేత్రయునైన యారక్కసిని మారుతి చూచి 'నీయడిగిన యర్థంబును వచింతుఁగాని నీవెవ్వతెవో యీద్వారమందేల నున్నావో నన్ను బెదరించుటేలనో మున్ను నాకుఁ జెప్పు' మనెను. నావుడు 'వానరా! రాక్షసేశ్వరుని బంటురాలను. లంకిణియందురు. పురరక్షణార్థము నన్ను నియమించిరి. నన్నుఁ గాదని చలిచీమయును లోనఁ జొరఁజాలదు. మాటలు వేయునేల? నా వ్రేటుతిని చావకమున్న నీవృత్తాంతము చెప్పనగు' ననెను. 'లంకిణీ! ఈనగరసౌందర్యంబు నామనంబును హరించుచున్నది. ఇందలి వనారణ్యసౌధవిశేషంబులు గాంచి నావచ్చిన దారిఁ జనుదు' నని హనుమంతుఁడు బదులాడెను. అంత నయ్యసుర ఱంపిల్లి యఱచేత వానిని జఱచెను. వాయుపుత్త్రుఁడు మహోగ్రహంబొందియు స్త్రీహత్యాదోషంబునకు వెఱచి యెడమపిడికిటఁ దావన్మాత్రంబా రక్కసిని పొడెను. ఆమాత్రపు వ్రేటునకే యది విలవిలఁ బోయి నేలఁగూలి భయవిహ్వలయై 'మహాబాహూ! పాహి పాహి ఓడితిని. వానరుండెన్నఁడు వచ్చి నన్ను జయించునో నాఁడు రాక్షసలోకంబునకు భయంబగునని తొల్లి బ్రహ్మ నాకు

వరమిచ్చెను. అది నేఁడు సంప్రాప్తమయ్యెను. దురాత్ముఁడు రావణుఁడు సీతారూపమృత్యువును రాక్షసులపాలికిఁ దెచ్చెను. వానరోత్తమా! ఇఁక నిన్నడ్డగించువారు లేరు. యథామతి లంకాపురంబెల్ల విహరించి వచ్చిన కార్యంబును నెఱవేర్చికొను' మని పలికి యోసరిల్లెను.

### లంకానగర పరిశోధనము.

హనుమంతుఁ డట్లు లంకారాక్షసిని నిర్జించి, వైరిపురంబును ద్వారము గుండఁ జొఱరాదను నీతిశాస్త్రంబును స్మరించి, ప్రాకారమెక్కి చననిశ్చ యించి, ప్రయాణ గృహప్రవేశ వివాహకాలంబులందుఁ గుడిపాదంబును ముందు పెట్టరాదు గావునను వామచరణంబూనుట వైరికి నశుభంబు గావునను నెడమకాలు మందుంచి ప్రాకారముదాఁటి లోపలఁ బ్రవేశించి, ముక్తా పుష్పవిరాజితంబును, శస్త్రపాణిసేవితంబునైన రాజమార్గంబును ద్రొక్కి, నిరంతర తూర్యఘోషలతో హసితధ్వనులతో నొప్పుచున్నవియుఁ బద్మ స్వస్తికవర్ధమాననామకసంస్థాభేదంబుల నిర్మితంబులైనవియు నగు రాక్షస గృహంబులను నొండొంటి మించియున్న వానిని వీక్షించుచు, మద్యపాన వివశులై మంద్రమధ్యమతారస్వరంబులఁ బాడుచున్న రాక్షస స్త్రీల మృదుమధురగానంబులు వినుచు, మత్తకాశినులు మందమందగతుల సౌధంబు లారోహించునప్పుడు మ్రోఁగుచున్న తదీయ కాంచీనూపురకంకణరవంబు లాలకించుచు, భటుల సింహనాదంబులను వేదపాఠకులఘోషలను నింపొదవఁగా నాకర్ణించుచు, దీక్షితులను జటాధారులను బోడులను గోచర్మాంబరులను దిగంబరులను దర్భముష్టిప్రహరులను నభిచారికక్రియావేత్తలను గూటముద్గర ఖడ్గముసలచాపశతఘ్నీహస్తులను ననేకాక్షులను ననేకకర్ణులను లంబోదర పయోధరులను గరాళదేహభుగ్నవక్త్రులను వికటాంగ వామనాంగులను నానాపరిమాణ శరీరులను వివిధవర్ణకవచధారులను జూచుచుఁ జనిచని, శత సహస్రసంఖ్యాక రక్షోవీరసైన్యంబు నేమరించి మధ్యమగుల్మంబును దాఁటి, పుండరీకాభిరామపరిఘాపరివేష్టితంబును, మహోన్నత ప్రాకారావృతంబును, నై పర్వత శిఖరాగ్రంబున విరాజిల్లుచున్న, రావణగృహంబుఁ జొచ్చి, యందు దివ్యగానంబులను వినుచు, వివిధవర్ణహయంబులను జతుర్దంతదంతావళంబులను, బంజరాంతరస్థ నానారూప విహంగమంబులను, విలోకించుచుఁ బోయి, సువర్ణప్రాకారపరివేష్టితమై ముక్తామణిజాలంబులఁగై సేసి యున్న

యతని యంతఃపురంబును గృష్ణాగరుగంధంబులను గుబాళించుచున్న దానిని బ్రవేశించెను.

సీ॥ "నలువ చెందొవలఱేకులకు నన్నువువెట్టఁ
గోరి కావించిన గుళికయనఁగ,
అఖిలద్విజశ్రేష్ఠమగు చకోరచయంబు
తపముసమ్మల్ల సత్ఫలమనఁగ,
జిగురుజొంపము నునుజిగియొప్ప నుదయాద్రిఁ
బొలుపారు నవకల్పభూజమనఁగ
బూర్వపయోరాశి పొంతఁ గెంజాయచె
న్నొదవిన పవడంపుఁ బొదరునంగ

తే॥ నరుణరుచిఁదనమండల మతిశయిల్లఁ
బొడిచి దివిఁబ్రాకి దీధితులడరఁజేసి
యంతకంతకు నెక్కుచు సంతమసముఁ
గాలుకొననీక చంద్రుండు గ్రాలెనపుడు" ॥

అట్లు రేఱేఁడు చంద్రికావితానమును బఱచి మెల్లమెల్లగా గగన మధ్యస్థుఁడై అచ్చతీటి లోకంబుల మనస్తాపంబులను జల్లార్చుచుఁ జలధి నుప్పొంగించుచు బంచభూతంబులకు నపూర్వశోభను గలిగించుచు మంద రాద్రి ప్రభాలక్ష్మిని నగుచుఁ బ్రదోషసాగర కాంతిని బరిహసించుచుఁ గాసారకమలద్యుతిని విరసించి ప్రకాశించుచు రజతపంజరస్థ హంసవలె మందరకందరస్థ సింహముకైవడి మదపుటేనుంగుమీఁది వీరశిఖామణి చంద మున శోభిల్లెను. గబ్బిగొమ్ములకోడెలు తలలతో మన్ను గాసులను మరుమహా ఘుటియు మదగజంబులు తమ శిరంబులందు మన్నిడుకొనుటయు సమీహి రాతుని శృంగంబులకు నోడిపోయన దోఁచెను. వానివాడికి వెఱచి చీకట్లు వలసవోయెను. కామినీకాముకుల ప్రణయకోపంబులు సన్నగిలెను; వీణాగానంబులు శ్రవణసుఖంబుగాఁ జెలరేగెను. పతివ్రతలు భర్తలంగూడి నిదురించిరి. రక్కసులు రౌద్రవృత్తులై యొండొరు సల్లసమాడుచుఁ గొందఱును, భుజంబులను బెనవైచి జల్పంబులు పలుకుచుఁ గొందఱును మధుపానవివశులై పరస్పరముఁ దూలనాడుచుఁ గొందఱును యథేచ్ఛా

విహారంబులకుఁ దొడఁగిరి. రాక్షసాంగనలు వేసరక మైపూఁతలు రాయుచు గొందఱును దమతమ సొబగులకు లోలోన సంతసించుచుఁ గొందఱు నుండిరి. అందందుఁ బ్రౌఢాంగనాజన విరహాగ్నినిశ్వాసంబులు కడు దీర్ఘములై యుష్ణములుగా నుండెను. బుద్ధిమంతుల మనోహరసంభాషణంబు లొక చోట మతవిచారంబు లొకవంక పౌరముఖ్యుల వ్యవహార తర్కంబు లొక వలను హితాహితాచార పరిశీలన చర్చ లొకచాయను శ్రుతిపథమగుచుండెను. విశదాంతరంగలగు నారీమణులు కొందఱు యథోచితాలంకారసమంచితలై నిజశృంగారచేష్టలవలనఁ బతులమెప్పువడయుచుఁ బానాసక్తలై యుండిరి. శౌండీర్యవతులు కొందఱు నిశీథకాలంబునఁ బ్రియులబిగికవుగిళ్ళఁ జిక్కి వ్రీడాభరమును జూపుచుండిరి. మఱికొందఱు కాంతామణులు తమతమ మనోహరులయంకతలంబు లారోహించి మురిపంబులందుచుండిరి. ప్రౌఢలు కొందఱు నృత్తసంగమోత్సుక ప్రస్తవస్త్రలై సువర్ణరేఖలోయనఁ దోఁచిరి. పాండురాంగకంబులు విరహక్లేశంబును ముఖపద్మంబు లంతర్భావ పర్యటనంబులను స్పష్టీకరించుచుండఁగా వామహస్తతలకీలిత కపోలలై కొందఱు తలోదరులు చింతావతారలోయనఁ గానవచ్చిరి. అభిసారికలు కొందఱు తెల్లముసుఁగులువైచి సంకేతస్థానంబులకు వడివడిఁ జనుచుండిరి.

హనుమంతుఁ డట్లు హావభావవిలాసవివశలైన రాక్షసాంగనలను తెప్పఱఁ గాంచి యందొక్కర్తునందేనిఁ బరమాభిజాతలక్షణంబులొండె రాజకుల యోగవర్తనంబులొండెఁ గ్లేశక్రోధపరితాపధ్యానచిహ్నంబు లొండెఁ గానక 'అయ్యో! ఎందఱినో చూచితి; ఒక్కతెగూడ సీతాదేవిగాఁ దోఁపదు. సనాతనధర్మంబున నిల్చి రామదర్శనోత్కంఠితయు వియోగభరసాస్రకంఠితయునై యిందుఁజిక్కి పంజరస్థపికలకంఠివలె విహ్వలించుచు మేఘాచ్ఛాదిత చంద్రరేఖవలెను ధూళిధూసరహేమరేఖక్రియను విస్రస్తలావణ్యవిహీనయై చెక్కుగట్టి లోలోన నెలవాలుచున్న బాణరేఖ పగిదిఁ బయికి గాంభీర్యమువహించియు నంతరంగంబునఁ గుములుచు వాతోద్ధూతమేఘరేఖక్రియఁ గృశీభూతయై రామహృదయంబునఁ బ్రతిబింబించుచుండు రామామణి యెందున్నదో' యని చింతించి యచ్చోటువాసి ప్రహస్త మహాపార్శ్వుల గృహంబులు పరిశోధించి యంబరచుంబియైన కుంభకర్ణుని నివేశమును వెదకి విభీషణమందిరంబును గలయఁజూచి మహోదర

విరూపాక్ష విద్యుజ్జిహ్వ విద్యున్మాల వజ్రదంష్ట్ర శుకసారణాదుల నిల యంబులు గాలించి యింద్రజిద్భవనంబును బరీక్షించి జంబుమాలి సుమాలి రశ్మికేతు సూర్యకేతు వజ్రకాయ ధూమ్రాక్ష సంపాతి ప్రముఖరాక్షసపుంగవుల నివాసంబు లొక్కొక్కటిగా విలోకించి యెందును సీతాదేవీ లక్షణంబులుంగల స్త్రీని గానక తుదకు రావణమందిరము ప్రవేశించెను.

రావణమందిరము.

ఆ మందిరము రజితమయంబును సువర్ణరేఖాసమలంకృతంబును నై పెక్కు తొట్టికట్లు గలిగి వివిధ దేశాగత మాతంగ తురంగములతో నిండిన గజాశ్వశాలలతోను, రజత దంతమయ రథశాలలతోను నిండియుండెను. ప్రతి కక్ష్యాంతరంబునను లక్షలకొలఁదిభటులు క్రూరాయుధపాణులై పహరా యిచ్చుచుండిరి. భేరీభాంకారములు నిరంతరముగా నుండెను. హనుమంతుఁడందు మెల్లఁగాఁ బ్రవేశించి లతాగృహంబులను జిత్రశాలాగృహంబులను క్రీడాగృహంబులను దారుపర్వతకంబులను గామగృహంబులను దివాగృహంబులను నొక్కొక్కటిగాఁ బరికించుచుఁ జని యొకచోట మయూరస్థానసంకులంబును, ధ్వజయష్టిసమాకీర్ణంబును, వివిధరత్నమండితంబునగుచు,నిర్మాతృకౌశల్యంబునకుఁ బరమావధియో యన నొప్పుచు, మందర పర్వతంబునకు సాటిగా విరాజిల్లుచున్న యుత్తమ భవనంబు నొక్కటి గాంచి, యది నానారత్నరచిత సువర్ణవికారద్వారములు గలిగి వైడూర్య రచిత విహంగమ మనోహర కనకగవాక్ష సమలంకృతమై విద్యుల్లతాపఙ్క్తి మనోభిరామ వర్షాకాలమేఘము ననుకరించుచు మణిమరీచికింఛోళీసముద్దీపితమై రశ్మిమాలిపగిదిఁ దేజరిల్లుచు నుండుటఁజూచి రావణుని మహదైశ్వర్యంబునకుఁ బరమాశ్చర్యమొంది లోకపాలర లక్ష్మి వారిని దిగనాడి యందు నివసించుచున్నదో యని తలంచెను.

హనుమంతుఁ డావింతలు గాంచుచు నెంత దవ్వుచన్నను దన్మందిరము తుది గానరాకుండెను. అతఁడట్లు పోవుచుఁ గొండొక యెడఁ బహు రత్నశ్రీప్రకాశమానమైన విమానంబును వివిధకుసుమావకీర్ణమై పుష్పాఢి గప్పిన పర్వతంబును బోలి, లావణ్యవతీసమన్వితమై మెఱుంగులతోడి మేఘంబును దలపించుచు బహుధాతుచిత్ర నగాగ్రంబువలెను గ్రహచంద్ర

భుగభుగను వాసనలకుఁ బరిమితియే లేదు. అంతరాళము ప్రకృతికాంతకు పూలయంగడియో యన నొప్పెను. అందు దీపంబులు జూదంబున నోడిపిక్కఁ వంచేసి కదలక ధ్యానస్థితినుండు ధూర్తులవలె నిశ్చలత్వమొంది వెలుంగుచు వివిధరత్నంబులను సముద్దీపితంబులు గావింపఁగా సమ్మందిరమెల్ల మెఱయుచున్నదో యన నుండెను. వాయువు సుఖముగా వీచి త్వగింద్రియంబులకును లావణ్యవతీజన దివ్యమంగళవిగ్రహంబులు నయనేంద్రియంబులకును మధురగానంబులు శ్రవణేంద్రియంబులకును వివిధసుగంధంబులు ఘ్రాణేంద్రియంబులకును రుచ్యములైన భక్ష్యంబులు జిహ్వేంద్రియంబులకట్లు సకలేంద్రియములకు నందు ననాయాచితముగా సంతుష్టి గలుగుచుండెను.

అట్లు నిసర్గలక్ష్మికిఁ బుట్టిల్లుగా శోభిల్లుచున్న యమ్మందిరాంతరమునందు రావణుని భార్య లొకవంకను దదీయబలపరాక్రమవిజితరాజకన్యక లొకవైపున నుండిరి. అందొక మృగాక్షి నదీమధ్యంబున నళినీపత్రంబు నట్లు కనకవిపంచిని గవుంగలించుకొని నిద్రించుచుండెను. ఒక యువతీమణి దాలపుత్రకునట్లు గుమ్మెటను వక్షతలంబున గూర్చి పరుండియుండెను. ఒక సుందరి చిరాగతప్రియతమునట్లు పటహము సందిటఁ గూర్చి శయనించెను. ఒక కాంతామణి యేకాంతమున వల్లభునట్లు పిల్లంగ్రోవిని నంకమునఁ జేర్చియుండెను. ఒక యొయ్యాలాడి యెలఁబ్రాయపుఁ బ్రియుని నొకకేల ముద్దుసుతుని నొకకరమున గూర్చునట్లుగా నిరుకరంబులందు డిండిమంబుల రెండు పొందించి యుండెను. ఎలనాగలుకొందఱు మదిరావివశలై మోహావశంబునఁ దమకన్యాత్వంబును రావణునకుఁ గానుక యిడినట్లు మైమఱచి నిద్రించుచుండిరి. కొందఱి నుదుటిబొట్టు మాసియుండెను. కొందఱి నూపురంబులు తావు దప్పియుండెను. కొందఱిహారంబులు జారి వేలఁబడియుండెను. కొందఱు మిటారులు నిజముక్తాహారములు వ్రీలి యెదచెట్టఁ బఱచినకతన మిఱుఁగుఱులతోడి వ్రాఁచీవెలవలెఁ గానిపించిరి. వస్త్రంబులు తొలఁగి కొందఱును బూమాలలు దిగి కొందఱును దాయమారగఁ బడియుండిరి. కొందఱు మద్యమదోద్రేకలై సపత్నీజనముఖంబులను శత్రువదనంబులుగా భ్రమించి సారెసారెకుఁ జవిగొనఁగా వారును నట్టిస్థితియందే యున్నకతన నదంతయు భర్తృకృతంబులుగా నెంచి ప్రత్యాహ్వానంబు లొనర్చుచుండిరి. ఒకతె వేఱొకతె బొమ్మ తలగడగాఁ బరుండెను.

సీ॥ ఐరావతముతోడి పోరాటములనాఁటి
దంత వ్రణములతోఁ దంపసిల్లి,
పాకశాసనుతోడి భండనంబులనాఁటి
వజ్రంపుగీఁటుల వాసిగాంచి,
కైలాసశైలంబుఁ గదలనెత్తిననాఁటి
శివపాదహతులతోఁ జెన్నుమీఱి,
శ్రీమహావిష్ణునివీకఁ బోరిననాఁటి
చక్రాంకితంబుల జూఁజువాఱి,

గీ॥ నవ్యకనకరత్నాంగద నద్ధములయి
సమధికబలపరాక్రమసంస్థలనఁగ
దర్పితారిదంభోళికాద్వయమనంగ
రాణమించునితని బాహువ్రజంబు లలరె?.

అహో! కోపసంతప్తంబులై మందరపర్వతాంతరమున నిద్రించుమహాసర్పంబులఁ బోలు నితని భుజంబులు దేవదానవయక్షగంధర్వాదులకు క్షోభకరంబులనుట వింతయే? వీని నఖాంగుష్ఠంబులు శుభలక్షణలక్షితంబులై మహైశ్వర్యసంపన్నుఁడని తెలుపకయే తెలుపును సుమా. చూతపున్నాగవకుల మదిరావిశేషంబు లితనికిఁ బ్రియపానీయంబులని వీని నిట్టూర్పువాసనల వలన స్పష్టమగుచున్నది. దశకంధరుఁడనియు వింశతిబాహుండనియు నితనిఁ జెప్పిరి. ఏకవక్త్రుఁడును ద్విబాహువుగా నున్నాఁడు. కామరూపిగావున నితఁడు స్త్రీజనసమ్మోహనార్థ మీరూపంబును ధరించెఁ గాఁబోలు. వీనికిరీటము స్వస్థానమునుండి సుంత తొలఁగి యున్నది; ఇతఁడు నిద్రావశుఁడనుట స్పష్టము" అని తలపోయుచుండఁగా వానిదృష్టిని దత్సమీపంబున నేకాంతవిన్యస్త శుభశయనాంతరస్థ యగు కాంతామణి సర్వమంగళసంపన్న యోర్తు సమాకర్షించెను. ఆమె ధరించియున్న ముక్తామణిభూషణంబులును నామె శరీరకాంతియుఁ బరస్పరజిగీషఁ బ్రకాశించుచు గృహాంతరమెల్ల వెలిగించుచుండఁ దదీయ రూపయౌవనసంపద లొండొరు మత్సరించుచున్నదో యని దోఁచుచుండ నత్తలోదరి జగదేకసుందరిగా నొప్పారుచుండెను. మారుతి యామెను హఠాత్తుగాఁ జూచి సీతాదేవినిగా భావించి పరమానందమునొంది,

ఉ. ఎక్కడ జన్మమైనరూప నవయౌవనసంపద యుల్లసిల్లఁ దెం
డెక్కిన ప్రావృషేణ్యలత నెంతయుఁ గోమలదివ్యగాత్రయై,
యెక్కడి సుందరీమణులకెల్ల విలక్షణమైన సొంపుతో
నొక్కటి నొప్పు నియ్యువిదశుద్ధ త్రిజగంబుల గన్గొనంగనే !

అహో ! ఈభాగ్యదేవతకై రాముఁడిట్లాడుట యేమివింత ?' అని తలపోయ సాగెను. అంతలోఁ దాని పరామర్శబుద్ధి వికసించెను. మారుతియంతఁ బర్యాలోచనపరుఁడై,

చ. పతి నెడబాసినట్టివ్యధ పాతకిచేఁబడినట్టిదుఃఖమున్,
హృతయమునాశోకనిందయును నేకముగాఁ గుమిగూడి యొప్పుటన్
మతిచెడి కీనయై యసువు మానఁగనుండెను సీతమోద ? యా
తతసుఖ నిద్ర లేద ? మృదుతల్పశయానము లేద ? యక్కటా !

చ. చిలుకుబుటాణిచీరలును చిత్రవిచిత్ర విలేపనంబులున్,
విలసిత తారహారములు వేడ్కలువింతలు నాటపాటలున్,
పొలుపులు స్వప్నమందయినఁ బ్రోషితభర్తృక యాపతివ్రతా,
తిలకము రామభూవిభునిదేవి తలంచునె తద్వియుక్తయై ॥

ఇంకేల ? ఆమానవతీరత్న మాపటిచో రావణాంతఃపురమునఁ బరుండునా ? అకటా ! నాబుద్ధిజాడ్యమునకెంతయు సిగ్గయ్యెడు' అని నిశ్చయించి యచ్చోటు వాసి కొండొకస్థలమునకుఁ జనెను.

పానభూమి.

అచ్చోటు చందనకస్తూరికా పంకిలమై కర్పూరపరాగలహరిఁ నెత్తావుల వెదఁజల్లుచు ముక్తాఫలరంగవల్లికా శోభాయమానముగా నుండెను. అందు నర్ధమాత్రభక్షితంబులైన మైరేయ మహిష వరాహ మయూర కుక్కుట మాంసంబులను, దధిసౌవర్చల లవణసంస్కృతమైన సూకర ఖడ్గమృగ చకోర మత్స్యమాంసంబులను, వివిధపాయసంబులను, నానామద్య భక్ష్య భోజ్య లేహ్య పేయంబులను గలిగిన సువర్ణమణి పాత్రల గుంపులు గుంపులుగాఁ బఱచి యుండెను. మఱియు వివిధముక్తారత్నంబులు చెలఁగుచు నక్షత్రరాశి యవతరించెనో యను శంకను గలిగించెను. హనుమంతుఁ డా

చిహ్నములెల్లఁ జూచి పానప్రదేశముగా దానిని గ్రహించి యచ్చోటఁ నిలువక చని యావలిగదులెల్లఁ బరికించెను. ఎందును సీతాదేవి గానరా దయ్యెను. 'కటా! పానవివశలై వేళాకోళముగాఁ బడియున్న రావణాంతఃపురస్త్రీలను గాంచు దౌర్భాగ్యంబు నాకు సంప్రాప్తమయ్యెను. ఈ ధర్మలోపమువలని పాపము తీఱుటెట్లు? ఇట్టికామోద్దీపకములు దృష్టిపథమగుచున్నను నాహృదయంబు సుంతయుఁ జలింపకున్నది. సర్వేంద్రియప్రవృత్తికి మనస్సు కారణంబగును. అది నిలుకడచెందునేని దృష్టిమాత్రంబునఁ బాపంబు బొరయదందురు. ఇన్నిచూచుచున్నను నామనస్సు చలింపదు. ఇంతియేచాలు' అని తనకుఁ దానే సమాధానము చెప్పుకొని 'అయ్యో! ఈ చింతలతోఁ గాలము గడచుచున్నది. సీతాదేవిని గాననైతిని. ఆమె యెందుండునో?' యని కొంతవడి తలపోసి 'సరిసరి; చక్కఁగా నూహించితిని. రాక్షసులమధ్య నామెయుండదు. ఏజాతి యాజాతినే కలసి యుండును. ఇది మఱచి కాలమెల్ల రిత్తపుచ్చితిని. నాశ్రమయు వ్యర్థమయ్యెను. రక్కసులనడుమ నుండదుపో, మఱెందుండును? ఆమెను రావణాసురుఁడు తెచ్చెననిరి. అతనిపురమెల్ల గలయవెదకితిని; ఎందును ఆమె గానరాదు. అవమానమునకు వెఱచియో రక్కసులబాధలకునోడియో యామె ప్రాణపరిత్యాగ మొనర్చియుండును. జీవించియున్న నొకచోటఁ గాకున్న నొకచోటనేని కానరాకుండునా? మానవతులకు శీలరక్షణమునకన్నఁ బ్రాణములు తీపుగావు. సీతాదేవి మానవతులలోన మానవతి, కావుననే యామె వనవాసక్లేశమునకు వెఱువక పతివెంటవచ్చుటయ్యెను. నేనిందుండి యెంతవెదకినను ఫలముండదు. ఇఁకఁ దడయఁజనదు. సుగ్రీవాదులు నన్ను నిరీక్షించుచుందురు. అయ్యో! వట్టిచేతులతో వారికడకుఁ బోవుటెట్లు? వారికేమని చెప్పుదును? వానరేశ్వరుఁడు చండశాసనుఁడు; అతఁడిచ్చిన గడవెన్నడో చనెను. శుభవార్తనేని వినిపింపనోపనైతిని. నన్నతఁడు మన్నింపఁడు. నీవే దిక్కని జాంబవదాదులు నన్ను నమ్మి పంపిరి. వారికెంతో యెల్లిదమైతిని. తోడివారు తెలియనేయక మానరు. నేనుగూడ మానరక్షణార్థము సీతాదేవివలె నాత్మహత్య గావించుకొనుట మేలని కొండొకసేపు చింతించి, యంతలోన ధైర్యము వహించి 'అహో! ఈ నిర్వేదము తగునా? సమస్తసంపదలకును నిఖిలశుభంబులకును నిర్వే

దము లేకుండుటయే మూలమని తెలిసియుఁ బ్రమాదపడుచున్నాను. నా వచ్చినపని యెంతమాత్రము నుజ్జగింపరాదు. ఇంకను జూడవలసిన చోట్లుండవచ్చును. ఇంతవఱకు లతాగృహ చిత్రశాలా క్రీడామందిరంబులను జూచనైతిని. ఉద్యానవనములవంకఁ జనలేదు; విమానములన్నే మిగిలియున్నవి. ఈతావులెల్లఁజూతుఁగాక. ఇవి యవి యననేల? రావణదేశమెల్లఁ బరిశోధింతుఁగాక' యని నిశ్చయించుకొని పాతాళగృహములు దూఱి చైత్యాలయములుచూచి విమానములు శోధించి సందుగొందులు వెదకి గోష్పాదమంత ప్రదేశమునుగూడ విడువక నగరాంతరమెల్లఁ బరికించి 'కటా! రావణుఁడు బందిగొన్న విద్యాధరాంగనలను నాగకన్యలను నిర్జరకాంతలను నందందుఁ గాంచితిని. సీతాదేవిమాత్రము గానరాదు. ఏమి సేయుదు' నని శోకసంవిగ్నమానసుఁడై ప్రాకారము దాఁటి వచ్చి 'హా! రామా! నీకుఁ బ్రియంబుఁ గూర్తుగాక మని తెంపుసేసి మున్నీటిని బల్వలంబుగా నెంచి దుర్గమంబైన లంకానగరంబుఁ జొచ్చి వాయువునకుఁ గూడఁ జొరరాని రావణాంతఃపురము ప్రవేశించి వెదకదగినచోట్లెల్ల వెదకితిని. నీ దేవి వైదేహి యెందును గానరాదు. ఆమె యీదురాత్ముని మాయలకు లొంగదు. ఇదిసత్యము. అమానుషప్రభవయు నధ్యాత్మవేత్తయగు జనకరాజు నింటఁబెరిఁగినదియు నిన్నుఁగూడినదియునైన యాపరమకళ్యాణి యాక్రించును గడగంటనేనిఁ జూచునా? చూడదు. మమ్మెట్టికిఁ జూపదు పతిమయ్యెను?

సీ. నీయస్త్రభీతుఁడై నింగినిబఱతెంచు
 రావణునోడిజాతి రాలెనొక్కొ?
ఉల్లోలకల్లోలముదధిరాజముఁగాంచి
 యెదవ్రీలి ప్రాణంబులేదనొక్కొ?
పిశితాశనవంకబిగ్గియొత్తిడిఁజేసి
 నలిగి యసువులనుఁబోలఁగానొక్కొ?
ఈర్ష్యాభయభ్రాంతులేఁచి ప్రేరేఁపింప
 రక్కసియింతులు మ్రెక్కిరొక్కొ?
గీ. దిక్కుగానకదీనాతిదీనయగుచు।
 నెడపటుగ్గి గుండానఁదాఁబడియెనొక్కొ?

పంజరాంతరశుకివోలె బందిఁగాంచి ।
నుర్విగర్భోన దుఃఖించుచున్నదొక్కొ ?॥

అయ్యో ! ఏమిసేయుదు ? ఏదియుఁదోఁపకున్నది. వారాకసరాష్ట భూవిభుఁడువ్విళ్ళూరుచుండును. ఆశాపాశము వానిని నిలఁబెట్టియున్నా, ఆహారము పట్టుపోగుకన్న సున్నితమై తాకినఁదెగును. అట్టివాని యోహాభారమున సీతాపతి యెన్నాళ్ళూరియాడుచుండును ? సుగ్రీవుడు మాకిచ్చిన గడువుపఱకు రాముఁడు వేచి యనంతరము నిరాశాపరుఁడై ప్రాణత్యాగమొనర్చియుండునా ? ఆయనయెట్లో గుండె బాయిచేసి బ్రతికియుండినను నేను వట్టిచేతులఁ వెళ్ళికిల వైచితినేనిఁ దోట్తోడ హృదయము వ్రీలిచచ్చును. వానితోడ లక్ష్మణుండంతరించును ; రామలక్ష్మణులగతి విని భరతశత్రుఘ్నులు విలువ్రనఁ గూలుదురు. తనయులకుఁగా వారితల్లులు మగ్గి మడియుదురు. సుగ్రీవుని కృతజ్ఞతాబుద్ధి యతనిని మననీయదు. అంగదుఁడు పినతండ్రిననుగమించును. అయిదువురకైన దుఃఖంబున వానరలోకమెల్లఁ గలఁబ బ్రద్దలుచేసికొని సమసిపోవును. నేనుచనుట యిరువంశంబుల దుష్కరణాంతంబునకు గారణమగును. ఈఘోరపాతకంబు నొడిగట్టుటకన్న నేనిందే తారసింతు నేని నన్ను నిరీక్షించుచు రాముఁడును వానిననుసరించి లక్ష్మణాదులును గొంతకాలముండిన నుండనగును. ఇదే యుక్తమార్గముగాఁ దోఁచుచున్నది. ఏవిధముగా నేనిట జీవింపనగు ? సరిసరి ; వానప్రస్థాశ్రమమును స్వీకరించి నియతిఁబూని వృక్షమూలనివాసినై చేతికిఁ జిక్కిన కాయలో పండ్లో తిని రామస్మరణ మొనర్చుచుందును. చావుగల్గునేనిఁ దలతోడ దానిని గ్రహింతును. ప్రేయసీవిరహాగ్ని రాముని పెద్దకాలము మననీయదు. ఆకఠోరవార్త చెవిఁబడుటకు మున్నే నేను కడతేరుటమేలు, ఇది యాత్మహత్య యగునా ? కాదు కాదు, ఎన్నడును గాదు. అదిగో రాత్రి ముగియనున్నది. జాగుపలదు'.—అనికొంత తడవు పరితపించి వెండియు ధైర్యముగాంచి ఏమీ ! 'జీవన్ పశ్యతి భద్రాణి' యని నాయంతరాత్మ పలుకుచున్నది. ఇందేమో యర్థము గలదు. శుద్ధాంతఃకరణము సూచించునట్టి యుపదేశంబును ద్రోయరాదు.అట్లని నాతలంపుమాని యెంతకాలమున్నను ఫలమింతేగదా. అయినను జూతుఁగాక. సీతాదేవి గాన్పింపదేని రావణుని లోకవిద్రావణుని వధించి పగదీర్చుకొందును ; లేదా వానిని

యజ్ఞపశువునువలెఁ బట్టి బంధించి హోమార్థము రామునొద్దకుఁ గొని పోయెదను.' అని తీర్మానించుకొని యుత్సాహియై తలయెత్తిచూచెను. ఎదుట నశోకవనము గానవచ్చెను. ఆవనమును గాంచి 'అయ్యో! లంకా నగరమెల్ల వెదకితినిగాని యీవనమును మాత్రము చూడనైతిని. దీనిని గన్నంతనే యడియాస లేలనో నాయెడఁ బొడముచున్నవి. దైవయోగ మెట్లున్నదో తెలియదు. దైవము తోడ్పడునాఁడు దుర్ఘటములు గూడ సులువుగాఁ గొనసాగును. ఇందాఁక పౌరుషంబు నాశ్రయించి పడరాని పాట్లు పడితిని. నాశ్రమయెల్ల నిరర్థకములయ్యెను. ఇఁక దైవము నాశ్రయింతుఁగాక. అంతకన్న దిక్కు గలుగదు' అని కృతనిశ్చయుఁడై,

'నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ,
దేవ్యైచతస్యైజనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో,
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః'

అని వారికి మ్రొక్కి సుగ్రీవుని నమస్కరించి 'మీయెల్లరపయి భారమువైచి మీయాజ్ఞఁగొని యీయశోకవనముఁ బ్రవేశించుచున్నాను. నాకుఁగార్య సిద్ధి ననుగ్రహింపుఁడు. దృష్టాదృష్టసమస్తభూతములారా! నామనంబు నెఱుఁగుదురు. స్వయంభువగు బ్రహ్మయుఁ గులిశపాణియైన సురరాజును సర్వవ్యాపి వాయుదేవుండును తపోగరిష్ఠులైన మహర్షులును నాకుఁబ్రసన్ను లగుదురు గాక. ఏయార్యారత్నముయొక్క దంతపఙ్క్తి కుందకుట్మలముల బోలుననియు నాసాగ్రము గంధఫలిని దలపించుననియు చెప్పిరో, యే కళ్యాణి శుచిస్మితయుఁ పద్మపలాశలోచనయునై ప్రసన్నతారాధిప దర్శ నానందమును గలిగించు నని విందునో, యామంగళదేవత యాలోకపావని నాకు గనుపడుఁపు సేయుఁగాక. పాపియు నీచుండును నైన రావణుఁడు దుర్మతియై ధర్మమేది యేకాకిగానున్న యేయబలామణిని బలాత్కారముగా నపహరించి తెచ్చెనో యాపతివ్రతాతిలకము రాముని దేవి నాకుఁ బ్రసన్న యగుఁగాక.

మ. శరణన్నంబగవానినైనఁదగఁబజ్జంజేర్చి మన్నించి శ్రీ
ద్భరణత్రాణపరుండవై పరమవాత్సల్యంబునం బ్రోచు స

త్కారుణామూర్తిని నిన్ను నమ్మి కొలఁదిందర్కింపక త్యంత దు
స్తరకార్యంబును బూనితిజ్జె దెరవోకింతంజూపవే రాఘవా ॥

అ శో క వ న ము.

అని ముహూర్తకాలము ధ్యానించి సమాహితచిత్తుఁడై గుప్పున లం ఘించి యయ్యశోకవన ప్రాకారం బెక్కి సహజరూపంబును గుదియించి చిఱుతయై వివిధకుసుమాభరణంబుల దొడవి సొబగారుచు నామనిరాకకున్గా నున్న చంపకాశోకాది నానాతరుజాలముతోను వివిధలతాలతులతోను జిలు వాఱి జొలరాకున్నదియు భృంగఝంకార మయూర రుత శుకపికారావ కోలాహలమయమై యున్నదియునైన యయ్యారామంబును దూఱి వృక్షంబు నుండి వృక్షంబునకు నెగయుచుఁ దీవెనుండి తీవెకుఁ బ్రాకుచు జ్యాముక్తనా రాచవేగంబున సీతాదేవిని వెదక నారంభించెను. హనుమంతుని వడిఁకిఁ దరు కోటరనిద్రావివశవిహగంబులు మేల్కాంచి భయభ్రాంతులకుఁ జిక్కి కట కట నెగయఁగా వాని ఱెక్కలగాలికి పూలవానగురిసి వనేందిర యతనికిఁ గుసు మార్చన చేయుటగానుండెను. ఆకపివర్యులట్లు పూలఁదోగుచున్న యక్కపి వర్యుని గాంచి వసంతుఁడు వచ్చెనో యని భూతంబులు భ్రాంతినొందెను. మారుతివడికి వృక్షంబులు కొన్ని నిర్ధూతపత్రశిఖరంబులును విశీర్ణఫలపుష్పం బులును నై జూదంబున వస్త్రాభరణంబులను గోల్పోయి దిగమొలనున్న ధూ ర్తులఁ దలపించెను. కపీంద్రుని లాంగూలహస్తచరణమర్దితమై యాతోట విరిసిన నెరులతో నలిగిన మైపూతలతోఁ బ్రచుంబిత బింబాధరముతో నఖ దంతక్షతాంకిత తనూలతతో నొప్పు యువతీరత్నమును బోలెను. అందలి నడబావులు సుధాకమనీయ నీరంబులఁ బిక్కటిల్లుచు సువర్ణ సోపానరమ్య ములై నీడలువాఱుచు ముక్తాప్రవాళ స్ఫాటిక మయవితర్దికా కుట్టిమంబు లను వలువలంకులఁ గలిగి పూచి సొంపెసలారుచున్న కమలేందీవరంబులతో నిండి చక్రవాక హంససారసారవమనోజ్ఞములై యుండెను. అచ్చటకు సమీపంబునఁ గ్రీడాపర్వత మొకటి యున్నతశిఖరములతో శిలాగృహముల తో వివిధవృక్షవాటికలతోఁ జెన్నుమీఱుచుండెను. అందుండి జాఱి ప్రవహించు సెలయేటి జలంబులు మార్గమధ్యంబున వృక్షశాఖానిరుద్ధములై వడి తఱిగి నిలిచి వెనుకకు సుంత మరలుటఁజూడఁగా, బ్రియుని యంకంబు నుండి పొలయల్కమై జాఱి వడివడిఁ జనుచుండఁగా బంధువులడ్డమై చేతు

ప్రొద్దుటం జేసి సుంత యాగి కోపమునుమాని మరలుచున్న కాంతామణులు దలంపునకు వచ్చుచుండిరి. ఆక్రీడాపర్వతము వెంబడి యుపవనంబొకటి యుండెను. అందలి తరువులుపూచి యేచి విరిసి విచ్చిన పత్త్రములలో యున నొప్పుచుండెను. అవిటపంబుల నడుమ శింశుపావృక్షమొండు తీవ కొంపంబులం బెనగొని సూర్యరశ్మికిం గూడ నెడమీయకుండెను. దానికిం జేరువగా నశోకవృక్షంబొండు వివిధతరువాటికా సమావృతమై పుష్పభార వినమ్రలతాతతులు చుట్టి మెలమెల్లగా వీచు పూవింజామరము లందుచు రాజభోగంబు లనుభవించుచున్నదో యన నుండెను.

హనుమంతుం డాయుపవనశోభ కొంతయు వింతగొని మెలమెల్లగాంజని పుష్పితాగ్రంబును నరుణాంకురపల్లవంబునైన యాశింశుపావృక్షంబునెక్కి హాని యాకుజొంపంబుల నడుమ డాసి యశోకవృక్షముచాయం జూపు సారించెను. అంతలోన సూర్యభగవానుని రాక సూచించుచు నరుణుం డుదయించెను. అరుణోదయంబునం జీకట్లు జ్ఞానోదయంబునం దమఃపటలములవోలె మాయమాయెను.

ఆయశోకవృక్షముక్రింద నొకమూల నొకానొక స్త్రీ మలినవస్త్రంబును ధరించి, శుక్లపక్ష ప్రథమదివసచంద్రరేఖవలెం గృశించి, ధూళిధూసరయై ధూమచ్ఛన్నశిఖిజ్వాలపగిదిం దోఁచుచు, నలంకారంబు లుడిగి, తామరలులేని కొలనువలెం జాంపెడసి, యంగారకగ్రహపీడిత రోహిణికైవడిం గష్టావస్థకుం జిక్కి నిట్టూర్పులు పుచ్చుచుం, గన్నీటిధారలు గురియుచుం, గుంఱుగాని కునకంబులమధ్యం జిక్కిన లేడికిల్లరీతిం బ్రియజనంబును బాసి రాక్షసాంగనల నడుమంబడి వగచుచు, సంస్కారములేమి నెఱులుజడగట్టి కృష్ణసర్పమువలె జఘనతలంబున వ్రేలాడుచుండంగా దుఃఖదీనావతారమై యాయసం దోఁచుచు, నెడసిన సిరివోలెం దఱిగిన శ్రద్ధకైవడిం బ్రతిహతయైన యాసపగిది భిన్నమొందిన సిద్ధికరణి సకలుషయైన బుద్ధిక్రియ దూఱుంగాంచిన కీర్తివడి మఱచినవిద్యమాడ్కి చెన్నఱి సన్నగిలి సందిగ్ధస్మృతి యట్లు నిర్ణయింప రాకుండెను. హనుమంతుం డామెగాంచి,

“సీ॥ పటిమెయిల్ గప్పినంబాడతి నునుంగాంతి
గదలిన యమృతాంశు కళయుబోలెం

పెనుమంచుమీఁదబర్విన వికాసముదప్పి
చెఱువుగుండిన సరోజిని విధమున,
ధూమంబునొదలినఁ దుఱుఁగలి మెఱుఁగులు
సలఁగిమాసిన దీపకళిక పగిది,
ధూళిపైఁబొఱసిన దొంగలించుటమాని
లావణ్యమెడసిన లతిక భంగి,"
గీ॥ సహజలావణ్యమును బాసి సన్నగిల్లి,
దుఃఖదీనావతారగాఁ దోఁచుచున్న
యీమె యిచ్చోట నిట్లుండ నేలనొక్కొ?
గుట్టు నేర్పడఁగఁ దెలియు టెట్లులొక్కొ?॥

అని కొండొక తడవు విచారగ్రస్తుఁడై, సంస్కారహీనుని వచనంబు సిద్ధాంతంబును బొందిన దానిని బండితుఁడు పూర్వోత్తరసందర్భ విమర్శ బలంబున గ్రహించుపగిది సీతాభిలక్షణంబులను దాను విన్న వానిని స్మరించి 'ప్రోషితభర్తృకలైన పతివ్రతలు నైసేయరు. ఈమెయం దాలక్షణంబులు గానవచ్చుచున్నవి. అదిగో వృక్షశాఖాగ్రంబున వ్రేలాడుచున్న ఆసాస్త్ర లీమెదిగాని యొండుగాదు. ఎట్లందువా? ఈమె నెమ్మేను ధూళిఁబ్రుంగి యున్నను నందు భూషణాంకములు మాయవు. ఈగుర్తులనుబట్టి యట్లు నిశ్చయింతును. ఈమె గట్టియున్న పుట్టము ప్రకృతము నలిగి మాసియున్నను నాఁడు ఋశ్యమూకపర్వతంబున సొమ్ములనుగట్టి పడవైచిన పీతాంబరము చెఱఁగునకు సరిపోలుచున్నది. అది సీతాచేలాంచనమని రాముఁడే నిశ్చయించెను. సీతారాములనురూపులనిరి. అంగప్రత్యంగసౌష్ఠవంబును బరిశీలించినచో వీరొండొరులకు నెంతయుఁ దగియున్నారు. సతీవిరహంబున రాముఁడట్లు పతివియోగంబున నీమెయుఁ గ్రుంగియున్నది. ఎన్నివిధముల నాలోచించినను నీమె సీతయనియే దృఢపడుచున్నది' అని నిశ్చయించి 'హా! రామా! ఈకళ్యాణివియోగము నెట్లు భరించుచున్నావు? దేవీ! నీ రాముని లోకాభిరాముని బాసియెట్లు జీవించుచున్నావు? అమానుషప్రకృతులు గావున మీకీయెడరు సహింపనోపిరో, యెడఁబాసి దవ్వైయున్నను మీరొండొరు మనోనేత్రంబులఁ జూచుచుండుటవలన సైరింపఁ జాలిరో యూహింపరాకున్నది. ఏతన్మాత్రులకిది తరముగాదు. దాశరథీ! ఆపన్న

రాణిని రక్షింపఁజాలనైతి నని వగతువు; అర్ధాంగికై యలమటింతువు. నీ పరితాపంబును జూచి సహింపఁజాలమైతిమి. ఈమె సంతాపము మ్రాల నీవొక పాటిగాదు. పురుషసింహుండవు గావునను బంధుమిత్రసహితుండ వగుటను నీవుకష్టములోర్చుట వింతగాదు. అబలామాత్ర రాలీమె యనన్య సహాయయై పాలసుదింద్లనడుమఁజిక్కి పడు నిడుమలు మాఁబోంట్లకుఁగూడ దుఃఖంబును గలిగించుచున్నవి. తల్లీ! లోకనాయకుని జీవితేశ్వరికి నీకును నాపదలు తప్పవయ్యెనా? కాలమెవ్వారికిని దురతిక్రమము. అందులకై వగచి ఫలములేదు. మీకడగండ్లు లోకకల్యాణార్థంబగును. నీకీదురవస్థ యికఁ బెద్దకాలముండదు. రాముని పరాక్రమంబును లక్ష్మణుని బుద్ధి విశేషంబును నమ్మి యీయాపదలోర్చుచున్నావు. నీవిశ్వాసము నిరర్థకము గాదు. నీకుఁగా నెవఁడు సుగ్రీవునిచెలిమిఁగోరి వానికి వానరరాజ్యాది మహాభ్యుదయంబులు సమకూర్చెనో, ఎవనిపంపున దురంతమైన సాగరంబును దాఁటి నేనిందువచ్చితినో, యామహనీయుఁడు నిన్నతికాలంబునందే వడయును. ఏ కోదండపాణికి విరాధవధయు ఖరదూషణసంహారంబును వాలి ఖండనంబును లీలామాత్రములయ్యెనో యాతేజశ్శాలికి రక్కసులు లెక్కగాదు. దాహార్తుఁడు చలిపందిరికిఁబోలె రాజ్యభ్రష్టుఁడు తత్పునఃప్రాప్తికి వలె రాముఁడు నీకొఱకు సర్వప్రయత్నములు చేయుచున్నాఁడు. తల్లీ! పద్మపరాగంబులఁబోని యాగక్షేత్ర పరాగంబులు గప్పిన పుణ్యక్షేత్రంబున జన్మించి ధర్మాత్ముఁడగు మిథిలాధినాథునకుఁ బ్రియసుతవై వెలసి బహువరాజితైన దశరథునకుఁ బెద్దకోడలవుగాఁ బరఁగి జగన్నాథునిఁ బతిగా వరించి వానికి సహధర్మచారిణివై యుండి వానిపతివ్రతా ధర్మంబు నుద్ధరించుచున్న నిన్ను బందిగొన్న కూళ చిరకాలము మనఁడు. నామాట తప్పదు.' అని వివిధగతులఁ బరితపింపసాగెను.

సీతాదేవిని బెక్కురూపముల రాక్షసాంగనలు చుట్టియుండిరి. ఒకతె యేకాక్షిగానుండెను; ఒకతె యేకకర్ణగానుండెను; చెవులులేనిది యొకతె చేటలంతచెవులదియొకతె, వెన్నువంక ముక్కుగలది యొకతె, పెద్దతలది యొకతె, నిడుదమెడది యొకతె, బోడితలది యొకతె, చింపిరితలది యొకతె, వేయేల! వికృతము లెల్ల రూపుదాల్చెనోయన వారు వెలసియుండిరి. వాని నడుమ నఱమోడ్పుకందోయితో నామెయుండెను. అట్టిదురవస్థలోనుండియు

నామె తనపతి ప్రతిబింబము నిజహృదయదర్పణంబునఁ జూచుచున్న కారణమునఁబోలు తదీయ ముఖమండలము మాత్రము శోభాభిరామముగానుండెను.

సీతాదేవిని గంటినను సంతోషమునకును రామపత్నికి నట్టిదురవస్థ కలిగెనను విషాదంబునకును హనుమంతుఁడు చిక్కి డోలాయమానహృదయుఁడై లోలోన నేమోతలపోయుచు నిర్నిమేషదృష్టి నుండఁగా వాని వెనుపార్శ్వమునఁ బెనుధ్వని యుత్పన్నమై యతని నాకర్షించెను. సంగతి యేమోయని మారుతిచూపు నావంకకు మఱలించి, వేదాధ్యయనఘోషలును మంగళవాద్యంబులును జెలరేఁగఁగాఁ గాంచనకరదీపికలనుబట్టి రాక్షసాంగనలు కొందఱు ముందునడచుచుండఁగా మఱికొందఱు చంద్రముఖులు సువర్ణదండచామరములను మృణాళనాళంబులఁబోని తమహస్తతలంబుల ధరించి నిజకంకణధ్వనిలయవృత్తికి ననువుగా వీచుచుండఁగా హేమజలపాత్రంబులను మద్యమణిపాత్రలను గొందఱు మందగమనలు గైకొని వెంటనంటిరా, జీకాకుగొన్న కేయూరహారములతో విశీర్ణములైన శిరోజములతో వాడిన నెమ్మోముఁ దమ్ములతోఁ జెవరిన నుదుటిబొట్టులతో ససియాడు నడకలతో గొందఱు మత్తకాశినులు బలిసి కొలుచుచుండఁగాఁ గరణీయూథముమధ్య గజరాజుచందంబున వారినడువఁ జేరి రావణుఁడు వచ్చుటఁగాంచి యతఁడేమిసేయునో చూతునుగాకమని యవ్వానరేంద్రుఁడు వృక్షాగ్రమునుండి దిగి దాని యాకులలోఁ దాగెను.

రావణుఁడట్లు వచ్చుట సీతాదేవిచూచి, పెనుగాలికి దూలుకదళివలె వడఁకుచు నూరువులతో నుదరంబును గప్పి బాహువులతో వక్షోభాగంబును మఱుగుచేసి తలంపులు ప్రేళ్ళుదాఁటి రామసన్నిధానంబునకుఁ బఱగెత్తుచుండఁగా మదగజంబులదండడిఁ గలంగిన తామరకొలను వలె హృదయము దుందుడుకు చెందుచుండఁగాఁ జల్లారిన నిప్పుపగిది శుష్కించినవాహిని మాడ్కి మహాదైన్యము వహించి దశగ్రీవపరాభవార్థము పతిని ప్రార్థించుచున్నదోయనఁ జేదోయి గీలించి మిణుకరింపసాగెను.

రావణుఁడు సీతాదేవిని ప్రణయించుట.

దశకంధరుఁడట్లు తరలి వచ్చి దీనయు నిరానందయునైయున్న యా పరమపతివ్రతాతిలకంబును సమీపించి యామెను ఱెప్పవాల్పకఁ జూచి యాశ్చర్యపరవశుఁడై చిత్తంబును సంవిత్తంబు గావించి 'కాంతామణీ!

స్తనోదరంబులను గప్పిపుచ్చి తనూలతను దాచెదవేల ? సర్వలోకమనోహారిణీ ! నీసౌందర్యలహరింబడి నాహృదయము పోవుచున్నది. ఈశ్వరివై నన్నుద్ధరింపుము. నాప్రణయము ననుగ్రహింపుము. వెఱవవలదు. పరస్త్రీగమనము దోషమని నీతిశాస్త్రంబులఁ బల్కరింతువా ? అదిమాకుఁగులవిద్యగాని వేఱుగాదు. కులధర్మము నాచరించుట యెన్నడును బాపము గాదు. కామినీ ! నిన్ను బలాత్కరింతునని తలంతువుగాఁబోలు. అట్టిభయము వలదు. నీవలపును విలిచి నిన్నుఁ బొందుదును. దేవీ ! నాయెడఁ బ్రణయినివగుము. నా పరిచర్యలందుము ; నామనంబు సేయుము. కళ్యాణీ ! ఏకవేణీవ్రతమేల ? ఈ మాసినచీరెను గట్టనేల ? కోమలీ ! శిరీషకుసుమకోమలమైన నీతనూలతను గటికనేలఁ బడవైతువు. ఇంత కఠినతపమేల ? ఉపవాసంబులవలన మనశ్శరీరంబులను రెంటిని వాడించుచున్నావు. యౌవనవతికి నీకిది తగునా ?

"సీ॥ గండుమీలకుఁబుట్టి కాముబాణములతోఁ
గలసియాడెడునట్టి కన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ బెరిఁగి లేఁదీఁగెల మెచ్చక
యున్నట్టి మృదుకరములుఁ
జిగురులతో సంధిసేసి యంబుజముల
నైనెత్తిచునట్టి పదతలములుఁ
గలకంఠములచేతఁ గఱచినవిద్య వీ
ణలకిచ్చునట్టి తిన్ననియెలుంగు
తే॥ నత్తెఱంగునరేఖయు నవ్విధంబు
గలుపచందంబు నమ్మొయికలికితనము
నట్టిచెన్నునుఁజూడ నీయందకాక
కలవె యొరులకునెందైన జలజనేత్ర !"

సుందరీలలామా ! ఎలప్రాయము భోగార్హము. అదియును సతతము గాదు. దానం జేసి బుద్ధిమంతులు తత్కాలోచితార్థంబులకై ప్రాకులాడుదురు. ఎప్పుడేది యనుభవింపనగునో యప్పుడు దాని ననుభవింపవలయును. ఒంటిచో జీవితము వ్యర్థము మఱియు ప్రకృతికి విరుద్ధమైన యాచరణము

దుఃఖావహమేగాక ధర్మదూషణము నగును. కోమలీ! అమూల్యంబులైన చీనిచీనాంబరములును, నపూర్వములైన చందనాగరుద్రవ్యంబులును, నసంఖ్యములైన నవరత్నాభరణంబులును, విచిత్రములైన మాల్యంబులును, నీకుఁ గోరినవి గలవు. కాంతామణీ! నన్నుఁ గూడి యుత్తమాసనశయనంబుల సుఖింపుము. మత్తకాశినీ! పాఱిననీరు మరల రానట్లు చన్నయౌవనంబు మఱల రాదు. శుభదర్శనా! నలువ నిన్ను సృజించి యుపరతుండయ్యెను. ఆకారణంబున నినుఁబోలు సుందరీమణి మఱియొకతె గలుగదు. వైదేహీ! నీరూపయౌవనంబులు పితామహునకుఁ గూడ మరులుగొల్పును. బింబాధరా! ప్రత్యంగమనోహారిణివగు కతన నీయవయవములలో దేనియందు నాదృష్టి వ్రాలునో యందే యది నిలుకడఁ గాంచుచు మఱలించినను మఱలకున్నది.

"ఉ॥ ఆలముసేసి నాతగులమాఱడిఁ బుచ్చగనేల బేల! న
న్నేలి యనంతభోగముల నిచ్చమెయిన్ విహరింపు నిత్య ల
క్ష్మీలలితాలవాలమగు జీవనమంతయు నీమొగంబు కాఁ
బాలనసేయు మిప్పరముభామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్ ॥"

మైథిలీ! పరపురుషుండను సంశయము వలదు. ఉత్తమాంగన లెందఱో నన్నుఁ గూడి యున్నారు. అందఱిలో నిన్ను మిన్నగాఁ జూతును. విలాసినీ! నాపరాక్రమం బప్రతిద్వంద్వము. సురాసురులు గూడ నాకునోడి దిక్కులుపట్టిరి.

"మ॥ వనితా యేనొకపల్కుఁ బల్కెదఁ జతుర్వారాశి మధ్యంబునన్
ఘనబాహాబలమొప్ప నన్ను నెదురంగా నొక్కఁడున్ లేమి యె
వ్వనికిం దెల్లము, నన్ను దాఁకుమగలన్ వజ్రాహతిం గూలు శై
లనికాయంబన మద్భుజాసమదలీలన్ గీటడంగించెదన్ ॥"

శోభనాకారా! నీమోడి వీడి సాలంకృతవై నీమంగళరూపసందర్శనోత్కంఠంబులైన నానయనంబులకుఁ బ్రీతిఁ గావింపుము. కాంతామణీ! ఇష్టభోగంబులఁ జాఱలాడుచుఁ గోరిన మద్యంబు లానుచుఁ గ్రీడింపుము. నీమాట కాదనుగాని నీచేతికి నడ్డముగాని యుండదు. కళ్యాణీ! రాజ్యముతోడ సిరిని బాసి నారచీరలు గట్టి యాకులునలములుఁ దినుచుఁ నడవులందు బ్రాకులాడు రామునివలన నీకేమి సుఖము గలుగును? నామాట విని నన్నుఁ

కూడి సుఖింతువేని నీజనకుఁడును సంతోషించును. తండ్రులు తమబిడ్డల సుఖంబును దమసుఖముగా భావింతురు. నీవిట్లు కష్టపడుటవలన నీతండ్రి మేనఁ జిచ్చురగుల్చుచున్నావు. కళ్యాణీ! రాముడింతదాక జీవించియుండు నని నిన్ను దెట్లు! అతఁ డెన్నడో దుఃఖనిహతుఁడై యుండును. ఒక వేళ మొండివై బ్రదికియున్నను నిన్నుఁ బడయఁ జాలఁడు. ఇదినిజము. జయించి నాకున్నను నక్షించియేని పడయరాదాయని తలంతువా! ఆ యడి యాస మానుము. ముల్లోకములు వచ్చి నాకుఁ బాదాక్రాంతమైనను నిన్ను వదలను. మంగళస్వరూపిణీ! నీ నిస్తులవిలాసములు నాహృదయం బును హరించెను. నిన్నుఁ గన్న నాకంటికి శుద్ధాంతకాంతామణులలో నొక్కరును వింకితము గారైరి. జానకీ! వారెల్లరు నిన్ను లక్ష్మినిఁబోలె సేవింతురు. అదిగో వసేందిర లతాగృహంబుల నలంకరించి మధుకరఝం కారమంగళవాద్యంబులను మ్రోయించుచు మన సమాగమశుభక్షణంబును నిరీ క్షించుచున్నది. మదిరాక్షీ!

"సీ॥ తెలిగన్నుఁగవ కాంతి పొలుపారనించుకఁ
గనువిచ్చిచూచినఁ గావెయబల!
చెలువంపునెమ్మోము వెలమిసొం
పినుమడిగా నల్లనవ్వినఁగాదె యింతి!
దంతమౌక్తికరుచి దలకొనమంజుమాట
పలికినగాదె యుత్పలదళాక్షి!
యుల్లంబు సరసత దొల్లంబుగా లీల
నైకొన్నగాదె పంకరుహవదన!"

గీ॥ తలలుపదింట నీపాదాబ్జములకు మ్రొక్కి
వేడుచున్నాఁడ నలివేణి వాడిమిడి
వలపుతో నన్నుఁ జేకొని తలచినట్లు
కామునేలఁగాఁగాదె లోకంబుకంటి!

అని నిజమనోరథము తేటపడఁ బల్కెను.

సీతాదేవి యామాటల్కెల్ల విని వ్యసనవ్యగ్రాంతరంగ యయ్యెను.

"సీ॥ వెఱవక నన్ జూచె వీఁడని యెదఁ గలం
షించిన నొండొండ చెపుట బాడమె
ననుచితకృత్యంబు నాచరించువిధాత్ర
బలిమికి నెవ్వేఱపాటు దోఁప
నిచ్చట దిక్కు లేరెవ్వరు నాకను
భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమి యుపాయంబు లేమి నా
ననమున వెల్లదనంబుగదుర"

గీ॥ వ్యసనమంతంతకును మించి యాపగాక
పొంగి నీరయి ప్రవహించి యంగమెల్ల
ముంచివైచుచుండఁగ నమ్మించుబోడి
యిట్లని వచింపగారాని యట్లుదోచె ॥

సీతాదేవి రావణుని తిరస్కరించుట.

సీతాదేవి యట్లు దుఃఖపీనయయ్యుఁ గొండొకవడికి శాంతి వహించి పతివ్రతలకుఁ బరపురుషునితోఁ బ్రత్యక్షసంభాషణంబులు తగవు గావున గడ్డిపఱక నొండు త్రుంచి తనకును రావణునకును మధ్య వైచి 'నీమనస్సును నావంకనుండి స్వజనము వంక మఱలింపుము. పరసతీప్రణయము తగదు. నన్ను నీవు గోరుట పాపి మోక్షలక్ష్మిని గోరుటగును. ఏకపతివ్రతనైన నకార్యము తలంచిన వానికి నాయురైశ్వర్యంబులు దక్కవు. జాతిరత్నము వన్నెమాయదు' అని పలికి వెన్ను మరలించి 'నిశాచరా! అన్యసతులు నీభార్యలట్టివారు గారా? వారియెడఁ జెడబుద్ధి తగునా? ఆత్మ పత్నుల వలనఁ దనివిచెందని చంచలేంద్రియులకన్న శఠులు గలరా? పెద్దలు బుద్ధి గఱపరా? వారుచెప్పినను వినవా? ఆ పథ్యావచనంబులయెడ మిథ్యా గౌరవంబును బాటింతువా? రాక్షసవినాశకాలము దాపరించి యిట్లు గావించుచున్నదా? రాజు నీతిరహితుండును నకృతాత్ముఁడు నగునేని వాని రాజ్యము సిరిసంపదలతోఁ దులదూగుచున్నను జేటొందక మానదు. నీయపరాధఫలంబుగా లంకానగరము సమస్తభాగ్యనిధానమైనది యచిర కాలంబున నాశ మొందనున్నది. దీర్ఘదృష్టిహీనులు స్వాపరాధంబుల వలననే నశింతురు. పాపకర్ముల వినాశంబునకు బ్రాణిలోకమెల్ల సంతసించును.

రావణా! నీ యైశ్వర్య సంపదలు నన్నుఁ బ్రలోభింపఁ జాలవు. ప్రభ యలభాస్కరునట్లు సీత రాఘవుని విడిచి మనఁజాలదు. లోకనాథుని పత్న్యుపభుజాశ్లేషంబుల మన్ననఁగాంచిన యీ తనూలత యితరులకౌఁగిటి నొదవునా! విదితాత్ముండును వ్రతస్నాతుండును నైన విప్రునకు వేదవిద్య వలె రామునకుఁ గూర్చుభార్య యన్యులకు సాధ్యమగునా! ఎడసి యలమ టించు కరేణుకను గజరాజుతోడను వలెఁ బతివిరహఖిన్నను నన్ను రాముని తోఁ గూర్చుట సాధు కార్యమగును గాని యిన్నాడుట గాదు. నీకుఁ బ్రాణంబులు తీపగు నేని, లంకాధిపత్యంబు నింకఁ గొన్నాళ్ళు గోరుదువేని రామునితో మైత్రి యొనర్పుము. ఆ పురుషోత్తముఁడు నీయపరాధశతంబు లను మన్నించును. ఆయన ధర్మాత్ముఁడును శరణాగతవత్సలుండు నగుట లోకవిదితము. వానియనుగ్రహపాత్రతఁ గాంచి సుఖముండుము. నీకొఱకు నేనుఁ గూడ వానిని బ్రార్థింతును. మనఃకాలుష్యలౌల్యంబులు మాని శుద్ధాంతఃకరణుండవై యనన్యప్రేరితంబుగా నాత్మార్పణముఁ గా వింతువేని నిన్నా యనఘుఁడు రక్షించును. ఒండుచో దుర్మరణంబు నీకుఁ దప్పదు. దిక్పాలురను జయించితినని విఱ్ఱవీఁగవలదు. ఆలోకవీరునకు నీ వొక లెక్కగాదు. రామలక్ష్మణాంకితబాణంబు లాశీవిషంబులవోలె నిప్పులను గ్రక్కుచున్నవి. నీ లంకాపురంబును బూడిదచేసి రక్కసుల రక్తము ద్రావనున్నవి. నా భర్త యిందు రాఁజాలఁడంటివి. ముల్లోకంబు లందు వానికిఁ బోరాని తావు గలుగదు. ఇట్టి సముద్రములు వేనవేలైనను వానికి దుస్తరములు గావు. నన్నుఁ బడయడంటివి. ఈమాట్యము వలదు. నిన్నుఁ బుట్టించిన దైవముగూడ వానికి నడ్డుపడ నేరదు. నీభుజపరాక్ర మంబులను బెద్దసేసి పొగడుకొంటివి. అట్టివాఁడవేని నాపతికి వెఱచి దొంగవై పొంచియుండి నన్నుఁ గొనిరానేల! వాఁడు నీవు వానికంటఁ బడియుందువేని నీగతి ఖరునిగన్న దుర్గతియై యుండదా! ఈశరీరంబు లావు సిగ్గులయదా! రవికిరణంబులు పడి యునీరమునట్లు రామబాణంబులు నీప్రాణంబులను హరించుట సిద్ధము. కాలహతుఁడవు గావున నన్ను నిర్బం ధించితివి. ఎందఱో కాంతారత్నములను బందిగొంటినందువా! ఆపాపము నేఁడు మూర్తీభవించి నిన్ను మ్రింగనున్నది. ఎందుదాఁగినను దప్పించు కొనఁజాలవు' అని పరుషంబుగా బలికెను.

ఆ మాటలకు రావణుని ముఖము జేవురించెను; వాని నేత్రము లగ్ని గోళకములయ్యెను. అతఁడు కోపంబు నడఁచి పెట్టి,

"ఉ. బుద్ధులు సెప్ప నెల్ల నటుంబోవిడు మెమ్మెయినైన సౌఖ్యసం
సిద్ధి యొనర్ప నాకు నెడ సేసినఁ దాపము రూపుమాపు నా
వృద్ధియకోరుదేని నవివేకివినీవని నన్నునిట్లసం
బద్ధములైనవాక్యములు పల్కక నామది సేయుము నింపుతోడ॥"

కోమలీ ! బుజ్జవంబులకుఁ బూఁబోఁడులు బుజమెక్కుదురు. తిరస్కృతిని వరించి యిందు వచ్చినవాఁడ గాదు. సుందరీ ! నీపయిఁగల నావిరాళి నీ వెక్కసపుమాటలనెల్ల సహించి సారథి విపథంబుఁ ద్రొక్కినహయంబు నట్లు నాయాగ్రహంబును లాగి పెట్టుచున్నది. కోపింపఁదగినచోటఁ గూడ నది దయాస్నేహంబులను బుట్టించును. ఈమాటలొండు పల్కెనేని తద్రక్త మాంసంబులెన్నడో కాకఘూకంబులకు బలియై యుండును. మిథ్యావానప్రస్తుని నమ్మి చెడిపోకుము. నామాట విను' మని రాగరసమగ్నుఁడై వచించెను.

నావుడు వైదేహి భ్రుకుటీకరాళవదనయై 'అసురాధమా !

సీ॥ ధర్మరహస్యంబుఁ దగవిచ్చి చెప్పిన
సంతయు నీచెవిసోకదయ్యె
నీతిగాదని కడునిష్ఠురంబాడిన
మనసు గోరంతయు మరలదయ్యె
నిహపరంబులు రెండు నెడమాటఁ దెలిపిన
గాసంతయును జంకుగలుగదయ్యె
చెడిదంపుమృత్యువువడి గావుగొనుచున్న
వీరసంపుటూహలు వీడవయ్యె
ఆ॥ వె॥ హితము లొక్కటేని నింపుగామియెగాక
వెగటుదోఁచుటయ్యె వింతగాఁగ
జావుమూడియున్నఁ జవిచూపె బుద్ధులు
పెద్దలాడుమాట సుద్దిగాదు !

రావణా! కామమోహితుండవై కండ్లు గప్పియున్నావు. నామాట వినుము. ఇంద్రియంబులకు వశుండవై యధఃపతనముఁ బడయవలదు. నీ వలన నీకులంబెల్ల నాశము గానున్నది. బెదరింపులు గావు. సత్యము పలుకుచున్నాను. నాపతి దయాసముద్రుఁడు. ఆమహనీయునకు శరణు గావింతువేని నీపాపఫలంబులెల్లఁ దొలంగును; మీఁదుమిక్కిలి మహాభ్యుదయంబులు పడయుదువు. పాపమొనర్చితినని గాని నన్నుఁ బరిభవించితి నని గాని వెఱవవలదు. ఆ కరుణాత్ముఁడు మహాపకారులనుగూడ మన్నించును.

సీ॥ అర్థార్థులకునిచ్చు నపరిమితార్థంబు
మోక్షార్థులకునిచ్చు మోక్షలక్ష్మి
భోగార్థులకునిచ్చుఁ బూర్ణభోగంబులు
నాయురర్థులకుఁ జిరాయువిచ్చు
ధర్మార్థులకునిచ్చు ధర్మతత్పరబుద్ధి
జ్ఞానార్థులకునిచ్చు జ్ఞానసిద్ధి
శరణార్థులకు నిచ్చు సకలార్థసంపద
లార్తార్థులకునిచ్చు నభయకరము
గీ॥ అర్థిజనపారిజాతంబు ననఘమూర్తి
పరమకళ్యాణచరితుండు నిరుపముండు
శిష్టరక్షణ దుష్టసంశిక్షణుండు
వినతపాపౌఘపరిహారి విమతహారి ॥"

రావణా! నీవొనర్చిన దుండగంబునుగూడ మఱచి నీయెడఁ గనికరించి యింత చెప్పుచున్నాను. నామాట వేయకున్న వేమగునందువా?

శా॥ 'మర్యాదోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథన విద్యాపారగుల్' రాఘవుల్
దోర్వీర్యంబునఁ జూపి నీశిరములం దుండించి లంకాపురిన్
సర్వధ్వంసముచేసి కొందురు ననున్ సత్యంబుగా రావణా!

అని నాటఁబలికెను. రావణుఁడు పటపటఁబండ్లుగీఁటి 'సీతా! నీ ప్రల్లదంబు లింకఁ జాలు; రెండునెలలు గడవిచ్చితిని. ఆలోన నీవు నన్ను

నీభర్తనుగా వరింపవేని నిన్ను సజీవంబుగాఁ దఱిగి రక్కసులు వండి భక్షింతురని దారుణంబుగా నుడివెను. వానితర్జనంబులను విని యచ్చటకు వచ్చిన దేవగంధర్వ కన్యకలు వికృతేక్షణలై రక్షోనాథుని వెఱపున శోకార్తనోపక వక్త్రనేత్రసంజ్ఞలతో నామె నూఱడించిరి. సీతాదేవి వ్యసనరోషంబులను లోలోనఁ గుదియఁబట్టి 'రావణా! నీమేలుగోరువా రిందెవ్వరును గానరారు. ఉన్నచో నిన్నీయకార్యమునుండి మరలింపరా? రామపత్నిని మోహించువాఁడు జడుఁడు గాని ప్రజ్ఞాశాలి గాఁజాలఁడు. నన్నాడిన నీదుర్భాషల పాపఫలంబు నీకుఁ దప్పదు. ఎందుఁబోయినను నిన్ను రాముఁడు వదలఁడు. నీవరంబులు నిన్నుఁ గాచు ననుకొంటివి గాఁబోలు. ఆమాట కల్ల. రాము నెదురింతువా? మత్తగజంబును ఢీకొన్న కుందేలుగతి నీకగును. నేటి నీబింకంబులు నాఁడు నన్ను దొంగిలి తెచ్చు నప్పుడేమాయెను! దుష్టా! మోహవీక్షణంబులను నాపయి నెఱపకుము. పతియానతిలేదనియుఁ బాతివ్రత్యరూపతపోబలంబు తఱుగుననియు వెఱచి మిన్నకుందును. ఒండుచో నీనాలుక వ్రీలదా? నీ నయనంబు లురలవా? నీవు నీరుగావా? చావుమూడి నన్నిట్టు తెచ్చితివి. నీజీవితాంతమింకను గొన్నాళ్ల గలదు. అట్లు కానిచో నాఁడు రామలక్ష్మణులు నాచెంతనుందురు; నీవు రూపుమాసియుందువు. మాయామృగంబును గల్పించి రామలక్ష్మణులను దవ్వుపంపి నన్ను దొంగిలి తెచ్చిన నీదియుఁ బౌరుషమా?' యని నొక్కి వక్కాణించెను.

ధాన్యమాలిని రావణుని కోపముఁజల్లార్చుట.

ఆమాటలతోడ రావణుని కన్నుల నిప్పులు రాలెను; వానిమకుటాగ్రము చలించెను; నిలువెల్ల గగుర్పాటుచెందెను. రక్షోనాథుఁడు నిశ్వసించుచు సీతాదేవిని జూచుచుఁజూచి దరిద్రునకుఁగా నామాటవినవు. సూర్యుఁడు ప్రాతస్సంధ్యనట్లు నిన్నిప్పుడే రూపుమాపుదుఁ జూడు' మని భీషణంబుగాఁ బలికి కాపున్న రాక్షసాంగనలను గాంచి 'ఈయింతిని నెట్లయినను నాకు వశవర్తినిగాఁ జేయుఁడు. అనులోమప్రతిలోమకృత్యంబులు వలయునేని వెనుఁదీయ వలదు' అని యాజ్ఞాపించి మఱియేమో పలుక నుండెను. అంతలోన వానికనిష్ఠభార్య ధాన్యమాలిని యనునది వానిని గవుంగిటఁగూర్చి 'నాథా! వివర్ణయు గృపణయు మీఁదుమిక్కిలి మానుషియునైన యీకాంత నీకేల?

" సీ. లలితంబులగుమట్టియల చప్పుడింపార
నంచకైవడి నడనల్లవచ్చి,
మొదమేని నెత్తావి ముడియంగఁ బర్వంగ
సగముమాలించి నైమకుపఁ దిగిచి,
సోలెమునెలతీఁగలీలఁ గ్రాలుచు వింత
చెలువంబు దలకొనఁ జేరనిలిచి,
తెలిగన్నుఁగవను నెచ్చెలిమైనఁ జూచు న
వ్వొలయంగ సరసంపుఁబలుకు పలికి,
గీ. మెఱుఁగు చెయ్యుల రాగంబు మెయికొనంగ,
నెడఁదసోగయించు మాటల నెలమి మిగుల,
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁతలుండ,
నీరసాకార నియ్యింతిఁ గోరనేల? "

రాక్షసేశ్వరా! నీబాహాబలార్జిత దివ్యభోగంబులకు నిక్కాంత కొఁదు. ఈదోషము దీనిని పుట్టించిన వానికిగాని నీకుగాదు. మఱియు,

" సీ. పతిమెఱింగినఁ దన ప్రాణంబు పైవచ్చు
ననుభయంబున మల్లడఁబడుచుండ,
జనులుగాంచిన మానము దూలుఁదనక ను
ప్పులిలోటమున మోము ప్రల్లగిలఁగ,
బోటికిఁదోఁచిన జాలియుఁ దేకువయును
వెగడునఁ జెయ్యులు వీడుపడఁగ
బంధుల కగపడ్డఁ బాయునన్యాయమను
కలఁక మైఁజెమటలు గ్రమ్ముదేర,
గీ. క్రీడవెసఁగొతుకంబిరియాడ రతుల
వచ్చలఁ గొనియాడ నేరని జారపాండు
హృదయమునకింపునేయమి నెఱుకగలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. "

నాథా! ఈ వృథాయాసము వలదు. రావమ్ము పోవుదమనెను. దశకంధరుఁడంత మద్యోత్సువదలి మందమందగతులఁ దనయంతఃపురమునకుఁ జనెను.

రాక్షసాంగనలు సీతాదేవిని గాఱించుట.

రావణుఁడు చనుటే తడవుగా నందు కాపున్న రాక్షసాంగనలు సీతాదేవిని ముట్టడించిరి. 'సీతా! మరీచ్యాది ప్రజాపతులలో నొకండగు పులస్త్యునకు మానసపుత్త్రుఁడైన విశ్రవసునకుఁ దనయుండును సత్కులప్రసూతుండును రాక్షసేశ్వరుండునగు రావణునకు భార్యవగుట నీపురాకృత సుకృతఫలంబగు. నామాట విను' మని యేకజట బోధించెను. 'తలోదరీ! ముప్పదిమూఁడుకోట్ల దేవతలవలన నోడిగంబు గొనువాఁడును నిశ్శాత్రవుండును నైన లంకేశ్వరుఁడు వలచివచ్చిన నాడొల్లని నిర్భాగ్యురాలుండునా!' యని హరిజట చెప్పెను. 'సీతా! ఎవని ధాటకు నోడి వేఁడివెలుఁగు చలువలఁ జేఁడయ్యెనో, ఎవనిముంగిట వరుణుఁడు కలయంపిఁ జల్లుచుండునో, ఎవనికిఁ బవనుఁడు బంటయి తేఁదెమ్మెరలు వీచుచుండునో, అగ్ని యెవని బానసపుటిల్లు పాయఁడో, ధనపతి యెవనికిఁ గోశాధికారియో, జాబిల్లి యెవనికి ఛత్త్రముఁ బట్టుచుండునో, సురపతి యెవనికిఁ దాంబూలపేటికాహరుఁడైయుండునో, యముఁడెవని ద్వారమున నిల్చి కాపుగాయుచుండునో, యట్టి వీరగ్రామణి కోరినప్పుడు వానియెదయెక్కి సమస్తభోగంబు లనుభవింపనొల్లని వెఱ్ఱిగలదా? జానకీ! నీకుఁగా మండోదరినిగూడ రాక్షసేశ్వరుఁడు త్యజింపనున్నాఁడు. ఇంతకన్న నాడుదానికేమి వలయును. ఇంతటివైనను నీమోడి వీడు' మని ప్రఘసన యుపదేశించెను. 'సీతా! నీయట్టి నిర్భాగ్యురాలు గానరాదు. ఇంటికివచ్చినసిరికి మోకాలడ్డమిడుచున్నావు. నీబేలతనము మాని మామాట సేయు' మని వికట గఱవెను. 'జానకీ! కొందఱు సిరిని కోరుదురు; అభిజాత్యము కొందఱకుఁ బెద్దయగును. మఱి కొందఱు రూపును వలతురు; ఈడుజోడును గొందఱు చూతురు; విద్యను గొందఱు భావింతురు. ఇవియెల్లనొక్కచోటనుండుట యరుదు. ఇవన్నియుఁ గలవాఁడు భర్తయగుటకన్న స్త్రీకి భాగ్యము వేఱొకటిగలుగదు. రాక్షసేశ్వరునందు నివియెల్ల సుస్థిరములై యున్నవి. అట్టివానిని నీవొల్లకుండుట యెంతో వింతయగుచున్నది. మానుషివిగావున మనుష్యునందే నీమది రమించునా? నీస్వభావనైచ్యము నేమందు? మైథిలీ! రామరామయని కలవరింతువు. ఎక్కడి రాముఁడు? అతఁడిందు రాఁగలఁడా? వచ్చినను నిన్నుఁ బడయఁగలఁడా? ఎట్లోవచ్చునుబో, రాజ్యభ్రష్టుఁడై నిలువనీడలేక గహ

వాంతరములు దాఁటి కందమూలములు దిని పల్లటిల్లు నతఁడు నీకట్టి సౌఖ్యము గూర్పనోపునో విచారింపవా? దిక్కులేని దీనునకుఁగాఁ బనవుటేల?' యని దుర్ముఖి వచించెను. తదితరులు తలకొకమాట నుడివిరి.

సీతాదేవి వారినెల్ల విని 'రాక్షసాంగనలారా! మీరు నన్నిట్లు నాక్షేపింపవలదు. మీమాటలు విననోపను. రామపత్ని యన్యునిఁదలంపున నేనిఁ గోరదు. నాపెయితుఁడు దీనుఁడనిరి. ఆ మహనీయుఁడు దీనరక్షకుఁడుగాని దీనుఁడు గాఁడు. శచీదేవి శక్రుని, అరుంధతి వసిష్ఠుని, రోహిణి చంద్రుని, లోపాముద్ర యగస్త్యుని, సుకన్య చ్యవనుని, సావిత్రి సత్యవంతుని, శ్రీమతి కపిలుని, మదయంతి సౌదాసుని, కేశిని సగరుని, దమయంతి నలుని, సువర్చల సూర్యుని, నెడఁబాయనట్లు సీత రాముని విడనాడదు. నన్ను మీరు ఖండించి భక్షింతురు గాక, మఱియొకటి చేయుదురుగాక. మీకు లోబడుట కల్ల' యని ఖచితముగాఁ బలికెను. అంత వారు చుట్టుకొని మూతులు నాకుచు మెటికలు విఱుచుచు ఖడ్గంబులు ఝుళిపించుచు నోరు ఒప్పలించుచు వివిధగతుల భయపెట్టఁ దొడఁగిరి. వారి వెఱపులకు విసివి యామె యందుండి లేచి శింశుపావృక్షమువంకఁ బోయెను. వినత యనునది యామెను వెంబడించి చుఱచుఱఁ జూచుచు 'సీతా! నీసతీత్వము చాలు; 'అతిసర్వత్ర వర్జయే' త్తనిరి. ఏదిగాని మితిమీఱరాదు. రక్షోనాయకుఁ డేతన్మాత్రుఁడు గాఁడు. వానికిఁ బ్రతివీరుఁడుగలుగఁడు. అంతటి వానిని భర్తగా వరింపక కేవల కృపణుండును నరమాత్రుఁడును నైన రాముని యం దింత మమత చేయుదువేల? వైదేహీ! నీరాము నింక మఱచి రాక్షసేశ్వ రుని యొడఁ జేరుము. సమస్త సంపదలు నిన్ను సేవించును. ఇది చేయవేని నిన్ను సప్రాణముగా దిగమ్రింగుదు' ననెను. వినతమాట నందుకొని వికట యనునది పిడికిలిముడిచి గర్జించుచు వచ్చి 'దుష్టమతీ! ఇంచాఁక నీవదరులు సైచితిమి. కాలపురస్కృతంబును హితంబునైన మాట యొక్కటి చెప్పెద వినుము. నీవు సముద్రమధ్య రక్షోవీర రక్షిత లంకానగరంబున నున్నావనుట మొదట గ్రహింపుము. ఇది దేవతలకుఁ గూడ దురాసదమని తెలిసికొనుము. రాముఁడిందు వచ్చుటగాని నిన్ను పడయుటగాని సాగదని యెఱుంగుము. వెఱ్ఱిదానా! ఎలప్రాయంబును రిత్తపుచ్చకుము. నామాట వినుము. కల్ల యేడ్పులు వలన ఫలము లేదు. అడియాసలు మాని సంతోషవతివై రాక్షస

రాజునకుఁ బ్రీతిఁగూర్చి సుఖముండుము. రాక్షసేశ్వరివై గ్రాలుదువు. అట్లు చేయవేని నీగుండియ లిప్పుడే పెఱికి భక్షింతు' ననెను. అంతలోనఁ జండోదరియనునది శూలముఁ ద్రిప్పుచు వచ్చి 'దీనిని జూచినదిసుత నానోరు చవులూరుచున్నది. అడ్డములెమ్మి, దీని నంజుడు తినవలయు' నని పయికి నుఱుకనుంకించెను. నిలువునఁ బ్రాణములు తీయుమని యొకతెయు, ఖండఖండంబులుగా ఛేదించి పంచిపెట్టుమని యింకొకతెయు, దీనిచావునఁగాని మనకీ కష్టము తీఱదని వేఱొకతెయుఁ, గుంభిలాశక్తికి బలియిమ్మని యింకొకతెయు నోటికివచ్చినట్లాడిరి. అంతలోన రాత్రియయ్యెను. వారు సొమ్మసిల్లి నిద్రించిరి.

## సీ తా వి లా ప ము.

ఆ బెదరింపులకు వైదేహి జడియక లోలోనఁ గుందుచు శింశుపాశాఖను బుష్పభారమున వంగి యున్నదానిని బట్టుకొని యశ్రుధారాపరిక్లిన్ననేత్రయై రాముని గొండొకసేపు ధ్యానించి పెనుగాలికి దూలుకదళివలె నేలపడి తెలివొంది లేచి 'హా! రామా! హా! లక్ష్మణా! హా! కౌసల్యా! హా! సుమిత్రా! మీసీతగతి విందురా! రక్కసుల బాధలు దుస్సహములయినను మొండి ప్రాణములు దరలకున్నవి. కాలము తీఱకున్నఁ బ్రాణము పోదనుమాట సత్యముగాదోఁచుచున్నది. హా! నాథా! నీ వియోగదుఃఖకాలకూటజ్వాలలు నిలువెల్లఁ బ్రాఁకి నన్నుదహించుచున్నవి. నీముఖారవిందముఁజూచి సంతసించు కలిమియు, నీమృదుమధురసుధామయోక్తులు విని యానందించు భాగ్యంబును, నీసేవలొనర్చు సంపదయు సమస్తము నేటితోఁ దీఱెను. నీవచ్చునట్టి యాస సన్నగిల్లెను. ఇఁక జీవింపఁ జాలను. నీయాజ్ఞలేదని ప్రాణపరిత్యాగమునకు వెఱచి యిన్నాళ్ళు జీవించితిని. ఇప్పుడు నాజీవము తనకుఁదాన సమసిపోనున్నది. హృదయేశ్వరా! జన్మజన్మాంతరములందుఁగూడ నిన్నే వలతును. నన్ను మఱువవల' దని యున్మత్తవలెఁ బ్రమత్తవైఖరి భ్రాంతాత్మరీతి విలపించుచు 'ప్రాణేశ్వరా! శరణన్న వైరినిగూడ రక్షింతువు. నాఁడు కాకాసురుని కాచిన నీదయ నేఁడు నీసీతపయిఁ గలుగదా? కలుగునేని నిందురావేల? చతుర్దశరక్షోవీరుల నొక్కండ జక్కాడిన నీకు రావణుఁడెంత మాత్రమో యెఱుంగుదును. నాయునికిఁ దెలియక మిన్నకుండునా? నాసంగతి జటాయువు నీకుఁదెలుప

శ్రేనా? అయ్యో! ఆపుణ్యాత్ముఁడు నీవు వచ్చులోనఁ గడతేరెనా? కానిచో లంకాప్రవేశమెన్నడో నామావశిష్టముగాదా? రావణుని పేరు మాసి యుండదా? రాక్షసగృహములందు మృతభర్తృకల దీనారావంబులు మాఱుమ్రోయుచుండవా? శ్మశానవాటికలు ఘోరదుర్గములై యుండవా? ఇఁక నాగతి నీకుఁ దెలియుటెట్లు? నాథా! రావణుఁడు నిర్ణయించిన కాలము సమీపించుచున్నది. రక్కసులకు దయాదాక్షిణ్యములు గలుగవు. అన్నంత నత్రేఁద్రోనన్నును. ఆలోన రక్షింపవేని నన్ను మఱువవచ్చును.

ఉ. రక్కసు లుక్కుమీఱి పడరానిపిధంబున గాసిపెట్టఁగా
దిక్కఱి దీనురాలనై బ్రతుకుటెన్నిక యింతయుఁగానలేక యీ
చక్కని వంతలం జివికి చావఁగనున్న యనుంగురాలిపై
నక్కటికంబు నీయెడ సుమంత జనింపదె జీవితేశ్వరా!

నాథా! నన్ను విడిచి క్షణమైనను నుండఁజాలవు. ఇన్నాళ్ళు నీ సతీవియోగంబు నెట్లోర్చుచున్నావు? అయ్యో! ఈతలంపు నాగుండియల నగల్చుచున్నది. ఈయమంగళము శాంతించుఁగాక. రాజర్షి వి గావున వైరాగ్యమూని నావియోగంబును సహించుచున్నావు. నాథా! ఎవ్వతెకుఁగాఁ బరులకు సాధ్యముగాని శాంభవధనుర్భంగకార్యంబును గావించితివో, ఎవ్వతె తోడిదే లోకముగా భావింతువో యట్టి నీసీతకు నిఁక దిక్కెవ్వరు? నీచరణంబులు నమ్మితిని; నీవు వత్తువని రక్కసులిడ్డ బాధలోర్చితిని; నిన్నుఁ జూతుగదాయని ప్రాణంబుల నిలువఁబెట్టితిని. ఇఁక మనజాలను.

ఉ. ఎవ్వరితోడఁ జెప్పుదు మఱెవ్వరు నామొఱయాలకింతు రిం
కెవ్వరు నాకు దిక్కగుదు రీవెత లెన్నడు బాయు దక్కటా!
ఇవ్వనరాశివేష్టితమహీవలయైక శరణ్యమూర్తి వీ
వివ్వలఁ దయార్ద్రశుభదృష్టి నొకించుక చూపకుండినన్॥

నాథా! నీసతి రక్కసులకు బలియయ్యెనను దుర్వార్త నీకు గలిగింపనోపను. ఆజ్ఞయిమ్ము. నాథా! చరితవ్రతుండవై యయోధ్యకుఁ జని సుఖముండుము. కౌసల్యా! ఇదే నీకుఁ గడసారి సాష్టాంగము; సుమిత్రా! ఇదే నీకు వందనము. లక్ష్మణా! నాయపశబ్దవచనంబులు మఱచి నన్ను

మన్నించి నీయన్ననుగను బెప్పవలెఁ గాపాడుము' అని పలికి వేణీవస్త్ర మురిత్రాడు గావించి

మ. శరణత్రాణపరాయణైకమతియై సాక్షాత్పరంజ్యోతియై
వరదుండై మునిసేవ్యమానపదుఁడై వాత్సల్యపాథోధియై
చిరధర్మవ్రతియై తనర్చుభువనక్షేమంకరాకారుఁ డీ
తరుణిన్ దీనఁబతివ్రతన్ దనదుసీతం గూర్మి మన్నించుతన్॥

అని నిజపతికి మ్రొక్కి ప్రాణత్యాగంబునకు సాహసించెను. అంత లోన నామె వామనయన భుజోరువు లొక్కసారిగా జలించెను. మఱియు నామె చీఱె తటాలున జాఱెను. సీతాదేవి యాశుభనిమిత్తములనుగాంచి వాతాతపంబులకు వాడిన తీఁగె వానకువలెఁ గాంతివహించెను. ఆమె ముఖమండలము రాహువిముక్త చంద్రబింబంబు పగిదిఁ దోఁచెను. భూపుత్త్రి యంతటఁ దన దారుణారంభము నుజ్జగించి యాశుభనిమిత్తముల భావం బేమో యని యాలోచింపసాగెను.

43.10-67 త్రిజటాస్వప్నము.

అంతలోనఁ ద్రిజటయను పేరి రక్కసి మేల్కాంచి తోడికాపుకత్తెలను బల్కరించి 'వింతస్వప్నమయ్యెను. రాముఁడు శుక్లమాల్యాంబరములు ధరించి లక్ష్మణద్వితీయుఁడై దంతిదంతరచితంబును హంససహస్రయుక్తము నైన శ్వేతశిబికారాజము నధిరోహించి యంతరిక్ష మార్గంబునఁ జనుదెంచి లంకలోనిడిసి చతుర్దంతమత్తేభంబుమీఁద నగరమెల్ల సంచరించి సీతాదేవి యొద్దకు వచ్చినట్లును, జనకసుత యంతలోన శుక్లాంబరముదాల్చి యాదంతావళముపయినున్న పతియొడిలోఁ జేరినట్లు నగ్గజేంద్రము లంకానగరము మీఁదుగా నింగిఁ జనినట్లును, జానకీదేవి వినువీధిఁ బోవుచుఁ గరములుచాచి సూర్యచంద్రబింబంబులను బట్టినట్లును, రాముఁడు సమస్తబ్రహ్మాండంబును సచరాచరంబుగా మ్రింగినట్లును గలగంటిని. మఱియు పాలవెల్లియు దానిమధ్యప్రదేశంబున శ్వేతపర్వతంబును దదుపరిభాగంబునఁ జతుర్దంతదంతావళంబును దాని మూపురంబున రాముఁడును గానవచ్చిరి. అంతలోన నా మాపు వేఁగోకవంక మఱలెను. అచట రాముఁడు ప్రాఙ్ముఖుండై

మహోన్నతాసనంబునఁ గూర్చుండి యుండుటయు వానిపాదపద్మంబులకు సురవరకిరీటాగ్రరత్నంబులు నీరాజనంబులిచ్చుటయును, బరమేష్ఠి మహర్షి ప్రకస్తసహితుండై వచ్చి సర్వతీర్థంబుల వానినభిషేకమొనర్చుటయు గాంచితిని. సీతాదేవి శుక్లమాల్యాంబరానులేపంబులఁ గైసేసికొని రామునిచెంత నుండెను. అంతలో నాదృష్టి మఱియొకవంకకు దిరిగెను. అచట రాముఁడు లీలామానుషవిగ్రహంబును వదలి శ్రీమహావిష్ణుస్వరూపుండై శంఖచక్రాది దివ్యచిహ్నంబులను ధరించి దివ్యాసనంబు నధిష్ఠించి యుండెను. చరాచరభూతాత్మకంబును సురగరుడోరగపన్నగ గంధర్వాదులును పలువురును వానికి సాష్టాంగ మొనర్చి 'జయజయ! దేవా! పరాత్పరా! పరంధామా! దీనరక్షామణీ! శ్రీవత్సవక్షా! పుండరీకాక్షా! శంఖచక్రగదాధరా! సర్వలోకేశ్వరా! అవ్యయా! నిత్యనిరంజన నిర్గుణస్వయంప్రకాశా! శరణు శరణు' అని కైవారంబులు సలిపిరి. అచ్చరలు నేర్పుమెఱయ నర్తించిరి; గంధర్వాదులు పాడిరి. బ్రహ్మాండకటాహవిస్ఫోటనంబుగా వివిధవాద్యంబులు మ్రోసెను. అంతట నమ్మహావిష్ణువు మర్త్యరూపముఁదాల్చి రాముఁడై సీతం గూడి పుష్పకవిమానంబునెక్కి యుత్తరదిక్కుగాఁ జనెను. నేను దక్షిణదిశకు మరలితిని. రావణుఁడు తైలములోమునిఁగి గన్నేరుపూసరులుదాల్చి రక్తాంబరములుగట్టి పుష్పకవిమానంబునుండి తటాలున నేలఁగూలినట్లు వానిని నొకానొక స్త్రీ నల్లనిచీరగట్టి బోడతలతోనున్నది పట్టియీడ్చినట్లు నతఁడు భ్రాంతచిత్తాకులేంద్రియుఁడై నూనెఁ ద్రావి గాడిదలబండియెక్కి దక్షిణాభిముఖుఁడై పోవుచు మార్గమధ్యంబున రథంబు నుండి దొర్లి తలక్రిందుగాఁ గాఁబడి భయమోహితుఁడై లేచి యున్మత్తునివలె దుర్వాక్యంబులు ప్రలపించుచుఁ జనిచని మలదుర్గంధబంధురంబును గాఢతిమిరమయంబును నైన కూపంబునఁ గూలినట్లు నంతలోనచ్చటకు నొకనల్లని వనిత వచ్చి వాని మెడకుఁ ద్రాడుతగిల్చి దక్షిణదిశగా నీడ్చినట్లు నుండెను. నేను విభ్రాంతినైతిని. అంతలోన రావణుఁడు వరాహంబును నింద్రజిత్తు మకరంబును గుంభకర్ణుఁడు మహోష్ట్రంబును నెక్కి యమదిశఁ బట్టిరి. రావణునిపుత్త్రులు తైలసముక్షితులై వారిననుగమించిరి. రాక్షసులెల్లను రక్తమాల్యాంబరములు ధరించి నూనెలు గ్రోలుచుఁ బాడుచు నుండిరి. లంకానగరము వానరవాలాగ్నిసందగ్ధమై సగోపురతోరణంబుగా సవాజిరథకుంజరంబుగా సము

ద్రమునఁ గూలెను. రాక్షసాంగనలు నూనెద్రావి వేళాకోళముగా నగుచు నఱచుచు భస్మమాత్రావశిష్టయైన లంకాపురిలో దిరుగాడు చుండిరి. విభీషణుఁడు మాత్రము తెల్లవస్త్రంబులు గట్టి మంత్రులనల్వురఁగూడి శైలోత్తుంగ చతుర్దంతమాతంగంబు నధిష్ఠించి శ్వేతచ్ఛత్రంబునీడ శంఖారావదుందుభి నిర్ఘోషంబులు ప్రతిధ్వను లీనుచుండగా విరాజిల్లుచుండెను. సఖులారా! ఇట్టి కలఁగంటిని. వఱువాతవచ్చిన కల కల్లగానేరదు. ఇఁక మీదుడుకులు విరమించి మీప్రాణంబులను రక్షించుకొనుము. రాముఁడేన్మాత్రుఁడు గాఁడు. ఆమహానీయుఁడు రావణుని సరాక్షసంబుగా వధించి సీతాదేవిని గొనిపోవును. నామాట నిజము. మీరు గన్నుగానక రావణునాజ్ఞకు లోఁబడి పలుకరానిమాటలాడి సీతాదేవిని నొప్పించితిరి. ఆమెనిప్పుడైన నభయదానముఁ బ్రార్థించి ప్రాణంబులను దక్కించుకొనుఁడు. దుఃఖార్తులంగూర్చి యిట్టికలగన్నచో వారిదుఃఖంబులు చల్లారుననియు వారికి నపరమితసంతోషమగుననియుఁ జెప్పుదురు. నేటితో సీతామనస్తాపము చల్లారెనని తలంపుము. మనము తెలివిలేక యొనర్చిన దుడుకులామె మఱచి మనల ననుగ్రహించునాయని శంకింపవలదు. ఆమె నవనీతహృదయ గావున మీయెడఁ గనికరించును. మైథిలి మీప్రణిపాతంబులకుఁ బ్రసన్న కాకున్నచో మీకు ముప్పు దప్పదు. మనకు వేఱొండు శరణము గలుగదు. మఱియొకమాట.. జనకపుత్త్రిని జక్కఁగాఁ జూడుము. అంగవైరూప్యముగాని ఛాయావైగుణ్యముగాని యామెకుఁ గలుగవు. కీడుగాంచనుండు వారికట్టివి జనించును. అదిగో పింగళపక్షి శాఖాగ్రమెక్కి మధురంబుగాఁ గూయుచు బంధుజనాగమంబును సూచించుచున్నది. అల్లదిగో గరుడపక్షి రెక్కలు పఱచి ప్రదక్షిణముగావించి వితపంబున వ్రాలి పలుకుచు నాసన్నబంధుదర్శన శోకవినాశంబులను దెలుపుచున్న' దని వచించెను. రాక్షసాంగనలు దిగాలు పడియుండిరి. త్రిజట యట్లు తోడి రాక్షసాంగనలకుఁ బలికి సీతాదేవి యొద్దకు వచ్చి 'అమ్మా! నీకు శుభస్కరమైన కలఁగంటిని. నేటితో నీవన శల్లఁ దీఱెనని భావింపుము.

"క. నాకల నిక్కలయయ్యెడు। శోకింపకుమమ్మ నీవు సుందరి! పుణ్య
శ్లోకు జితశోకు నతుల వి। వేకుఁ బ్రియునిఁబొందఁగలుగు వేగమె నీకున్"

నారార్ణను.

### సీతాసందర్శనము.

హనుమంతుఁడు శింశుపావృక్షాంతరమందుండి రావణుని తర్జనంబు లను విని రాక్షసస్త్రీల మందగంబులనుజూచి సీతాప్రత్యుత్తరంబును త్రిజటాస్వప్న వృత్తాంతంబును సమగ్రముగా నాలకించి 'ధన్యధన్యుఁడనైతిని. నా సందేహంబులెల్ల సమసెను. ఏశుభదర్శననిమిత్తము వచ్చితినో యా మంగళశీలఁ గన్నారఁజూచితిని. నాకష్టంబులెల్ల ఫలించెను. ఈమె నిరాశావశయై ప్రాణనాశంబునకు సాహసించియున్నది. జాగుసేయరాదు. సర్వభూతహితుండైన రాముని సేమంబు విన్న నీమెకుఁ గొంత యూఱటగల్గును. అట్లుచేయు నేని యీసుకుమారి దుఃఖదగ్ధయై నశించును. అనంతరము రాముఁ డిటు వచ్చియు ఫలముండదు. పతిసంగతిఁ దెలిసినచో వానిరాక తలఁపైనను ప్రాణంబులీమె బిగియపట్టికొనియుండును. ఈమె సుఖంబున్న వార్త విని రాముఁడును జీవించును. ఇంతదూరము వచ్చి యీమెతో మాటాడక పోవుట యుక్తముగాదు. సీతయేమిచెప్పెనని రాముఁడు నన్నడుగ నేమనుదు. 'చూచివచ్చితినే గాని మాట్లాడలే' దన్నచో నామాట నెవ్వరును నమ్మరు; ఒకవేళ నమ్మినను నన్ను నవ్వుదురు; రామునకు నాయెడ విసువును గోపంబును జనించును. ఈమెను బల్కరించి నావచ్చిన సంగతి తెలిపి యేమి చెప్పునో విని పోవుదుఁగాక; రాక్షసులీమెను జుట్టియున్నారు. వారు తొలఁగినపుడుకు నేకాంతసంభాషణంబునకుఁ దడవు కుటయుఁ గానరాదు. ఏమి సేయుదు! వైదేహిని జూచియు ఫలము గలుగకున్నది. సూర్యభగవానుఁ డుదయించువేళయు నయ్యెను. అయ్యో! ఈమె నాశ్వాసించి చను టెట్లు? ఎట్లయినను సాహసించి యీమెను బల్కరింతునా! ఏభాషతో మాట్లాడుదు? వానరభాష యీమెకుఁ దెలియదు. దేశభాషతో మాట్లాడు దునేని మాసంభాషణంబును రాక్షసాంగనలు విందురు; దానఁ జేటగును. అమరవాణి తప్ప యొండుభాష తగునని తోఁపదు. దేవభాష రక్కసులకుఁ దెలియదు. సీతాదేవి రాజస్త్రీగావునను జనకునింటఁ బెరిఁగెఁగావునను సంస్కృతంబు నేర్చియుండును. అయ్యో! ఈతలంపుగూడఁ గార్యకారిగాఁ దోఁపదు. వానరుఁడు సంస్కృతంబును మాట్లాడుట వింతగానుండును. ఈమె నన్ను నమ్మఁబోదు. రావణుఁడిట్లు మాయపన్నెనని తప్పక యీ పతివ్రతామణి భావించును; నావంకకేనిఁ గన్ను సారింపదు. నావచ్చిన

కార్యము చెడును. ఒకవేళ యీమె నన్నుఁజూచి నామాటలువిని భయ పడి యఱచునేని రాక్షసస్త్రీలు జాగ్రతపడి నన్ను బంధింప యత్నింతురు, వారికోలాహలంబును విని రావణుని బలగంబు సాయుధంబుగా నామీఁదికి వెడలును. వారిని నోర్తునేని నిప్పుడే యుద్ధమగును. ఎట్లో వారు నన్నుఁ జిక్కించుకొందురు. నేనిందే చివికి చావనగుదు. అంతట రామసుఖవార్త నీమెయు నీమెసుఖవార్తను రాముఁడు నెఱుంగనేరక యిరువురుఁ గృశించి తనువులు బాయుదురు. అంతియగాదు. నాకారణంబున రక్కసు లీమె నిప్పుడే వధించినను వధింపవచ్చును. ఈమెను జంపుదురేని మాప్రయత్నం బులెల్ల నంతతో నంతరించును. దైవమా! ఏమిసేయుదు? రామసుగ్రీవులు నన్ను నమ్మి పంపిరి. మోయరాని భారము తలఁదాల్చి వచ్చితిని. ఎట్లో సీతాసందర్శనభాగ్యంబు లభించెను. అది లభించియు నాప్రయాసము ఫలకారి కాకున్నది. దేశకాలంబు లెఱిఁగి వివేకముతో వర్తింపవలయు ననియు నట్లుచేయని పండితమాని దూతవలనఁ బండనున్న కార్యంబు గూడఁ జెడునని యు బెద్దలు వచింతురు. అట్టినింద నాకు నేఁడు రానున్నది. ఈ యాపద తప్పునెట్లో నావచ్చినపని కొనసాగునెట్లో యూహింపరా' దని కర్తవ్యతా జడుఁడై కొంతవడి మిన్నకుండి యంతలో నొక యూహ స్ఫురింపఁగాఁ దానిని గూర్చి విమర్శించి కృతనిశ్చయుఁడై 'మహాపుణ్యవంతమైన యిక్ష్వాకువంశంబున దశరథుఁడు పుట్టి రాజ్యంబధిష్ఠించి నిజగుణంబులవలన నరపాలలోకంబును దపోవిశేషంబున మహర్షిప్రపంచంబును బరాక్రమంబువలన సురలోకంబును మెప్పించి చక్రవర్తి పదంబునకు మెఱుఁగులిడి చతురబ్ధి పరీతమేదినీవలయంబును గనుసన్నలఁ బాలించుచుండుటయు, వానికిఁ బట్టమహిషియైన కౌసల్యాదేవివలన దైవప్రసాదంబుగా ధార్మికోత్తముఁడు రాముఁడను వాఁడు జనించి ధర్మసంస్థాపనదీక్షాపరుఁడై విశ్వామిత్రయాగముఁగాచి యహల్యాశాపవిమోచనంబు గావించి ముక్కంటివింటిని ద్రుంచి జనకరాజసుతను సీతాదేవిని గ్రహించి పరశురాముగర్వమోడ్చి యయోధ్యా నగరము చేరుటయు, నచ్చట వాని పినతల్లి కైకేయి నిజపతిని వంచించి పూర్వదత్తవరంబులను గోరి యానెపంబున రామ వివాసంబును భరతపట్టాభిషేకంబును వరించుటయు, దశరథుఁడు కైకేయీమనంబు సేయనొల్లక యు సత్యభంగమునకు వెఱచియు దల్లడమందుచుండఁగా రాముఁడాసంగతి

విని పిత్రువచన పరిపాలనార్థము చేతిలోని రాజ్యంబును గూడ దిగనాడి సీతాలక్ష్మణులతోడ వెడలి వనంబునాశ్రయించుటయు, రాముఁడట్లు పరిపరి కంటకంబులఁ గడపి ఖరదూషణాదులను గడపి చిత్రకూటాశ్రమమందుండఁగా మాయామృగము సీతాదేవి హృదయంబు నపహరించుటయు నక్కురంగంబునకై రామలక్ష్మణులు చని యుండఁగా రాక్షసేశ్వరుఁడు రావణుఁడు బగవేషము కొనువాఁడై రామపత్ని నేకతంబయున్న దానిని దొంగిలించుటయు రాముఁడు మరలి వచ్చి సతిని గానక శోకపరీతుఁడై యామెను దురంత కాంతారంబులందును భీకరగిరిగహ్వరంబులందును వెదకుచు ఋశ్యమూకపర్వతంబునకు వచ్చుటయు నచ్చట దాశరథికి సుగ్రీవునితో మైత్రి గలుగుటయు వాలిని సంహరించి వానరరాజ్యంబునకు సుగ్రీవు నధిపతినిగాఁ జేయుటయు, సుగ్రీవుఁడు కొండొకనాఁడు హఠాత్తుగాఁ దనయెదుటఁబడిన నగలమూటను రామునకుఁ జూపుటయు, రాముఁడు వాపోవుటయు నవ్వానరేంద్రుఁడు కృతజ్ఞతాబద్ధుఁడై సీతాన్వేషణార్థము సమస్త దిక్కులకు వానరులను దరలించుచు నస్మదాదులను దక్షిణదిశకుఁ బంపుటయు మేము మార్గమధ్యంబున జటాయువునొక్క యన్న సంపాతిని సందర్శించి వానివలన రావణుని దుండగంబు వినుటయు గృధ్రరాజవచన ప్రకారము వానరులపంపున నేను శతయోజనాయత సాగరంబును దాఁటి లంకాపట్టణంబెల్లఁ గలయ వెదకి యెట్టకేల కిందువచ్చి యిట రామవర్ణిత రూపవర్ణ లక్షణాన్వితయైన యామెను జూచుటయు నయ్యెను. నేను ధన్యధన్యుండ నైతిని. రామా! ఇదంతయు నీయనుగ్రహభాగ్యముగాని వేఱుగాదు. నీవు సాక్షాన్మహావిష్ణువవు. శిష్టరక్షణ దుష్టశిక్షణార్థము లీలామానుష విగ్రహుండవైతివనుట సత్యము.

“మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హారణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం బ్రాపింపరాకుండు న
ప్తగమార్గంబునయందు నిశ్చలుఁగఁగా సాక్ష్యంబై యొనాఁ॥”

"మ. అణువో కాక గడుఁగ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో భిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ కుంఠితప్రత్యయా
ర్గణులై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులం దత్త్వవి
క్షణముం జేసెద రట్టి విష్ణుని నినుఁగ సర్వాత్మకుం గొల్చెదఁగ"

అని కీర్తించి మిన్నకుండెను.

సీతాదేవి యదంతయు విని యచ్చెరువొంది యావృక్షాగ్రంబు శాఖలలో డాగియున్న చిఱుకోతిని జూచి 'కలలో వానరసందర్శనం బాసన్న దుఃఖసూచకమందురు. నేఁడు కోతిని జూచితిని. ఏమి రామున్నదో? యని వగచుచు సొమ్మసిల్లి కొండొకవడికిఁ దెలివొంది 'హా! రామా! హా! లక్ష్మణా' యని విలపింపఁ బోయి, రాక్షసస్త్రీలు వింటురేమోయను భయంబున దుఃఖంబును లోలోన నడఁచి దురపిల్లి కలలు నిద్రించువారికి గలుగును. నాకును నిద్రకును నెన్నాళ్ళనుండియో పగయయ్యెను. సుఖమున్నఁగాని నిదుర రాదు. రామవిరహ రాక్షస పీడాదుఃఖ కుండంబునఁ బడి సుడియుచున్న నాకును సుఖంబును నిద్రయుఁ గలుగవు. కావున ఇది స్వప్నముగానేరదు. స్వప్నముగాకున్నను నిరంతరము రాములగ్నచిత్తనై తదేకమతితోఁ దన్నామామృతాక్షరంబు లుచ్చరించుచు నద్దివ్య మంగళమూర్తిని ధ్యానించుచు నుందును గావున నాధ్యానావలంబనమూర్తి నాకన్నులకుఁ బొడగట్టుటయు నాస్మరణవాక్యంబుల ప్రతిధ్వను లిట్లు వినవచ్చుటయు గావచ్చును. భ్రాంతి యిట్లుసేయుట గలదు. ఇది కేవలము భ్రాంతి యనియుఁ జెప్పఁదరముగాదు. భ్రాంతి మనోగతమాత్రమై యుండునుగాని స్వరూపముఁదాల్చి ప్రత్యక్షగోచరముగాదు. అదిగో వానరుఁడు కానవచ్చుచున్నాఁడు; అతఁడు నోరువిచ్చి పలుకుటఁ జూచుచున్నాను. దీనికేమనవలయు? ఇది యేమో యూహింపరాకున్నది. భగవతీ! వాగ్దేవి! ఈ వానరునిమాటలు నిజమగుగాక! ఇది రాక్షసమాయ గాకుండుగాక' యని లోలోనఁ దలపోయసాగెను.

### సీతాహనుమంతుల సంభాషణము.

హనుమంతుఁ డంత వృక్షంబునుండి దుమికి నమస్కారపూర్వకంబుగా డాయవచ్చి కయిమోడ్చి 'తల్లీ! మలినాంబరంబును ధరించి [illegible]

భార్యంబును బట్టి యేమో చింతించుచుదువు. అలలకు వెఱచి పద్మసీయ తమ్మి పూరేకులనుండి కాఱునట్లుగా శోకబాష్పంబులు నీనేత్రగోళంబులనుండి స్రవించుచున్నవి. మంగళకరి ! దేవతాంగనవో యసురవనితవో నాగకన్యవో గంధర్వకాంతవో యక్షప్రమదవో కిన్నరివో యెఱుంగఁ గోరుదు. కళ్యాణీ ! చంద్రుని బాసి పుడమి నవతరించిన రోహిణివా ? అలుక నొందెఁ బాలయలుకనొంది వసిష్ఠు నెడసి వచ్చిన యరుంధతివా ? అమ్మా! నీ పేరేమి ? నిన్నుఁగన్న పుణ్యాత్ము లెవరు ? నిన్నుఁ బైకొన్న భాగ్యశాలి యెవఁడు ? ఇట్లు వగవనేల ? బంధుమరణంబునకు దుఃఖింతువా ? దేవతాస్త్రీలకు రోదన దీర్ఘోచ్ఛ్వాసంబు లుండవు ; మఱియు నిర్జరులకు భూస్పర్శము గలుగదు. నీవు భూమిపైనిలిచి నిట్టూర్చుచు విలపించుచుంటం జేసి నిర్జరాంగనవు కావనుట సత్యము. నీశుభలక్షణాంతరంబులను జూడఁగా రాజస్త్రీవనియు నందును బట్టపురాణివనియు నూహింపనగు. ఏకళ్యాణిని రాక్షసాధముఁడు రావణుఁడు జనస్థానంబునందుండి చెఱగొనివచ్చెనో యా సీతాదేవి వగుదువేని యాసంగతి తెలుపుము ; వినఁదమకింతు. శుభంబగుఁ గాక. నీ యతిమానవరూపంబును నీ దైన్యగతిని నీ తాపసవేషంబును జూడఁగా రామమహిషివని నిశ్చయింపనగు' నని వినయమధురంబుగాఁ బలికెను.

సీతాదేవి రామనామశ్రవణమాత్రంబునఁ బ్రహృష్టచిత్తయై 'జనక మహారాజునకు సుతనై రామునకు సతినై దశరథునింట ద్వాదశవర్షంబులు పతితోడ సమస్త మానుష భోగంబులను జూఱలాడి పదుమూఁడవయేటఁ బతికి యువరాజ్యాభిషేకము కానున్న సమయంబున దైవోపహతనై భర్తతోడ వివాసదీక్ష వహించి నారచీరలుఁగట్టి వనము నాశ్రయించి పతివ్రతాధర్మంబును సంరక్షించుకొనుచుండఁగా నెవతెను రావణుఁడు చెఱగొని వచ్చెనో యాదీనురాలను. రాక్షసాధముఁడు నాకు రెండు మాసములు గడవిచ్చి పోయెను. నా జీవితాంతము దినములలోనున్న' దని చెప్పి నూర్చెను. మారుతి యామెకు మహాదుఃఖ మంది 'దేవీ ! రాముఁడు కుశలమున్నాఁడు. ఆసంగతి నీకు దెలుపుటకుఁగా నన్నిటఁ బంపెను. వాని దూతనై యిటువచ్చితిని. నిగమంబులకు నెవఁడు ప్రతిష్ఠితుఁడో యెవని

బ్రహ్మాస్త్రాది వివిధాస్త్రంబులు సేవించుచుండునో యాదాశరథి నీ రాముఁడు నీ నేమంబును నాముఖంబున నరయుచున్నాఁడు. మీవెంటవచ్చిన లక్ష్మణుఁడు తనయభివాదంబులను నా ద్వారా నీ కొనర్చుచున్నాఁ' డనెను. సీతాదేవి యాశుభవార్తకుఁ బ్రముదితాంతరంగయై 'జీవన్ పశ్యతి భద్రాణి' యనుమాట నాయెడ నేఁడు సార్థమయ్యెను. ఎంతయు సంతసించితి' నని పలికి మిన్నకుండెను. అంత హనుమంతుఁడు మెలమెల్లగా నామెను డాయ సాగెను. అందులకు నామె సంశయవ్యాకులాత్మయై 'కటా! రాక్షస మాయలకు జేలువోయి చెప్పరానిమాటఁ జెప్పితిని. ఇంత యవివేకము తగునా?' యని దుఃఖకృశయై చేతికొమ్మను విడిచి నేలఁ గూలఁ బడెను. హనుమంతుఁ డామె తలంపు గ్రహించి నమస్కరించి యేమియు పలుకక నుండెను. సీతాదేవి వెచ్చనూర్చుచు 'నాఁడు సన్న్యాసివై జనస్థానంబున నన్ను మోసగించితివి. నేఁడు వానరుండవై వచ్చితివి. నీమాయలు నాకుఁ గ్రొత్తగావు. నిశాచరా! ఉపవాసకృశయై గోడుగుడుచుచున్న యబలామాత్రురాలి నిట్లు గాసింపఁ జెల్లునా?' యని పలికి యంతలోన మాటలుడిగి 'కటా! నిష్కారణంబుగా నిన్ను సంశయించుచున్నాను గాఁబోలు. వానరాగ్రణీ! నిన్నుఁ జూచినంతనే నామనస్సునకు నెంతో యూఱటు గల్గుచున్నది. కారణంబూహింపఁ జాలను. రామునిదూతవేని నీకు శుభమగుఁగాక. హరిసత్తమా! రామకథలు నాకుఁ బరమప్రియంబులు. నాదయితునిగుణంబులను కొంత వివరించి నాకు శ్రవణపేయం బొనర్పుము. సౌమ్యా! రామలక్ష్మణులు కలలోఁ గాన్పించినను జాలునని తల్లడించుచుందును. స్వప్నముగూడ నన్ను మత్సరించెను. నేఁడు నీవు కటాలున వచ్చి వారికుశలవార్తను వినిచితి' వని పలికి యంతలోన నూహాంతరగ్రస్తయై 'భ్రాంతాత్మ లెండమావుల వెనువెంటఁ బఱతురు. నాస్థితి యిప్పుడట్టిదిగాదు గదా. భ్రాంతి పైకొన్నప్పుడు స్వప్నజ్ఞానంబులుండవు. స్వజ్ఞానమును నాయెదుటనున్న యీవానరజ్ఞానంబును రెండును నాకుఁ గలవుగావున నిది భ్రాంతికార్యము గాదని వితర్కించుచు మిన్నకుండెను. హనుమంతుఁ డామె మనంబు నూహించి తత్సంశయము వాప నమకట్టి,

మ॥ స్మితపూర్వోక్తియు శాంతియుం గుణకృపాస్నిగ్ధాంతరంగంబు నా
శ్రితవాత్సల్యము నార్తరక్షణమునే శ్రీమంతునింబాయ వో
తతమా నెవ్వనికేలునీడఁ దిరమై ధాత్రీతలంబుండు న
మ్మతిమంతుండిటు పంప దూతనయియమ్మా! వచ్చితిక్ నీకుఁగాక్ ॥

తల్లీ! నన్ను హనుమంతుఁ డందురు. నీతోఁడిదేలోకంబుగానున్న నీనాథుఁడు లక్ష్మణసుగ్రీవులతోడను వేనవేలు కపివీరులతోడను సముద్రంబును దాఁటి యిందు రానున్నాఁడు. నామాటనమ్ముము. నన్ను సంశయింప వలదనెను.

## చిరపరీక్ష.

సీతాదేవి యంతతోఁ దనివినొందక యింకను బరీక్షింపఁ దలంచి రామునితో నీకెందుఁ బొందు గలిగెను? నరవానర సమాగమంబెట్లొదవెను? లక్ష్మణుని జూచితివా? వారి లక్షణంబులను వినిపింతువా? అట్లైన నాకు నూఱటగలుగుఁగాక యనెను. నావుడు 'తల్లీ! రామలక్ష్మణ సంకీర్తన పుణ్యంబును నాకుఁ జేకూర్చితివి. ఇది నాసుకృతపరిపాకంబుగా భావింతును. తొంబదియాఱంగుళంబుల పొడవు గలిగి, నీలనీరదంబు నిగనిగలఁ దేలు తనూచ్ఛాయతోఁ గమలపత్త్రంబులఁ బోని కందోయితో శ్రీవిలాసంబులగు వీనులతో విపులంబులైన మూఁపులతో నాజానుబాహువులతో రాజిల్లుచుఁ గంబుగ్రీవుఁడు విశాలవక్షుండును సమవిభక్తాంగుండును నై పొచ్చెములేక పొలుపొందు నేత్రాంచల నఖ హస్తపాదతలంబులు బింబారుణ వర్ణస్నిగ్ధంబులై వెలయుచుఁగాఁ గంఠసీమయందు రేఖాత్రయం బలంకరింపఁగా సంగుష్ఠమూల లలాట పాదహస్తతలంబులందు శుభరేఖాచతుష్టయం బొప్పారఁగా శుభలక్షణలక్షిత దంష్ట్రానామకదంతంబులు నాలుగు గ్రాలఁగా భేరీఘాంకారనిస్వనుండై వేదవేదాంగంబులును నిఖిల కళలును దన్ను గొలిచి యుండఁగా ధనుర్విద్యాపారంగతుఁ డను కీర్తిఁగాంచి యేమహానీయుఁడు వెలుఁగుచుండునో, ఎవనియందు సౌజన్యసదాచారంబు శిరసై యుండునో, ఎవనిని ధర్మావతారంబని యుగ్గడింతురో, బుధసేవాపరోపకారంబు లెవనికి దినకృత్యంబులో, కృతజ్ఞతామతియున్న యెవనింజేరియుండునో, కర్మగతిజ్ఞుండన్న యెవనిఁ జెప్పవలయునో, శాస్త్రానుసారంబుగా ధర్మార్థకామంబు లనుష్ఠించుచు దేశకాలవిభాగజ్ఞుండును సర్వలోక ప్రియం

వరుఁడును నియతాత్ముఁడును నై యెవఁడు తేజరిల్లుచుండునో, ద్యుతియు, ధృతియు, బుద్ధియు, నీతియు, వీర్యంబు నెవనియందుఁ దిరములై ప్రకాశించుచుండునో, వశియనియు, వాగ్మియనియు, శ్రీమంతుండనియు, యశస్వియనియు, జ్ఞానసంపన్నుండనియు, శుచియనియు, సమాధిమంతుండనియు, ధర్మపరిరక్షితుండనియు, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుండనియు, స్మృతిమంతుఁడనియు, ప్రతిభాశాలియనియు, సాధుశిఖామణియనియు, నదీనాత్ముండనియు, విచక్షణుండనియు, సజ్జనాభిగమనపాత్రుండనియు, సదైకప్రియదర్శనుండనియు, నెవనిని బహువిధంబుల వర్ణించి స్మరించి జన్మసాఫల్యంబును గాంతురో, గాంభీర్యంబున సముద్రంబును ధైర్యంబున హిమవన్నగంబును వీర్యంబున విష్ణునిఁ బ్రియదర్శనంబున సోమునిఁ గ్రోధంబునఁ గాలాగ్నిని సహనంబున భూమినిఁ ద్యాగంబున ధనదుని సత్యంబున ధర్ముని దలపించుచు సమస్తకళ్యాణగుణాభిరాముఁడై యెవఁడు శోభిల్లుచుండునో యట్టి కౌసల్యానందవర్ధనుని నిక్ష్వాకుకులప్రదీపకుని రాముని వర్ణింప వాణియుఁ జాలదనఁగా నేనెంతవాఁడను. తల్లీ !

"సీ॥ చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్క శంకించు
బలుకఁడెన్నఁడు మృషాభాషణములు
కలుషవర్తనులున్న కడ కేనియుఁ జనండు
కలిమికుబ్బడు లేమికలుగఁ డాత్మఁ
దలయెత్తిచూడఁ డెవ్వలనఁ బరస్త్రీల
ధైర్యంబువిడఁ డెట్టి దద్దఱటుల
నోటులసంపదకునై యుపతపింపఁడు
లోన నిందింపఁ డెంతటి నీచునైన
గీ॥ మిన్నకయచూడఁ డాకలికన్నకడుపు
సర్వభూతదయోదయోత్సవమొనర్చ
నిగమఘంటాపథైకాధ్వనీనబుద్ధి
బ్రహ్మవిద్యానవద్యుండు రాఘవుండు ॥"

తల్లి రాముని వెంట సతనితమ్ముఁడు లక్ష్మణుఁడు గలఁడు,

రోదనంబులకు మ్రాకులు గూడ విలపించెను. అయ్యో! వాని యనుతాపం బిట్లని చెప్పఁగాదు. ఆధీరుఁ డయ్యాభరణంబుల నెదగూర్చి పరిపరివిధంబుల దురపిల్లి హా! ప్రేయసీ! అని మూర్ఛిల్లెను. ఎట్లో వానిని సేద దేర్చితిమి. అచలంబునకు భూకంపంబట్లు వానికి నీవలనిదుఃఖంబయ్యెను. అగ్నిపర్వతమువలె రాముఁడు నిరంతరము లోలోనఁ గుములుచుండును; నిదుర యెట్టిదో యెఱుఁగఁడు. ఆహారవిహారంబు లింతయు వానికి రుచింపవు. సుగ్రీవునాజ్ఞను దలదాల్చి మేము వింధ్యాద్రికి వచ్చి యట నొక బిలంబునఁ జిక్కుపడి వెలికి రానోపక శోకదీనులమైతిమి. మాకు మాఱేఁడు నెలదినముల గడవిచ్చెను. ఆగడువెల్ల నందే యంతరించెను. గడవు దాటుటయు నిన్నుఁ గానకుండుటయుఁ దలంచి, యింటికిబోయి సుగ్రీవుని మరణదండనంబునకు బలియై బంధుగుల మ్రోల మడియుట కన్న నందే జీవితశేషంబును గడపఁ దీర్మానించుకొంటిమి. కొందఱు మాలోఁ బ్రాయోపవేశమునకు సిద్ధమైరి. అత్తఱి బిలాంతరంబుననున్న యోగిని యొకర్తుక మమ్ముఁ గరుణించి యందుండి వెడలించెను. అచ్చట మాకు సంపాతిసందర్శనం బొదవెను. అతఁడు వానితమ్ముఁడైన జటాయువుయొక్క దుర్మరణంబును మావలన విని పెల్లు దుఃఖించి రావణునిదుండగంబును సహింపనోపక నీయునికిఁ దెలిపి లంకకుఁ బొమ్మని మమ్ముఁ బ్రేరేపించెను. మేమెల్లరము సముద్రతీరమున విడిసితిమి. సాగరము మహోత్తుంగతరంగాభీలమై దరియరాకుండెను. వానరులకుఁ గాలుచేతులు చల్లఁబడెను. నేను తెంపుచేసి శతయోజనవిస్తీర్ణమైన సాగరంబు దాఁటి రాక్షసాకులమైన లంకానగరంబును రాత్రిపూటఁజొచ్చి చొఱరానిచోట్లెల్ల నిన్ను వెదకి వేసారి నిరాశ చెంది తుట్టతుద కివ్వనంబుఁ బ్రవేశించితిని. రావణుఁడిందు వచ్చుటాదిగా నీవు పడు పాట్లెల్లఁ జూచితిని. తల్లీ! నేను రామదూతనై వచ్చితినిగాని వేఱుగాదు. నన్ను వాయుసుతుండనియుఁ బేర్కొందురు. కారణమేమందువా? నా తండ్రి కేసరియనువాఁడు మాల్యవంతమునుండి గోకర్ణపర్వతంబునకుఁ గొండొక కార్యార్థియై చనియుండఁగా నాతల్లిని వాయుదేవుఁడు వరించెను. వానికి నేను బుట్టినకతన నన్నట్లందురు. నన్ను శంకింపవలదు. రాఘవుండచిరంబ వచ్చి రావణుని సబాంధవంబుగా వధించి నిన్ను గైకొనును. ఈమాట తప్ప' దని నాటఁ బలికెను.

వియోగకారణంబున నాపతికి నాయెడ స్నేహము పోయెనుగదా? వానరాగ్రణీ! నన్నీదుఃఖసాగరంబునుండి నాభర్త యుద్ధరించునుగదా? కౌసల్యాసుమిత్రలయు భరతశత్రుఘ్నులయు కుశలవార్త లందవచ్చుచున్నవు గదా? నన్నుఁగూర్చినశోకము నాపతికిఁగార్యాంతరములందు నంతరాయముఁ గలిగింపదుగదా? నావిముక్తికిగా భరతుఁడు భ్రాతృవత్సలుఁడు సేనఁ బంపునా? సుగ్రీవుఁడు వానరసేనాసమేతంబుగా నిందు వచ్చునా? లక్ష్మణుఁడు రౌద్రాస్త్రంబులను బఱచి రాక్షసకులంబును రూపుమాపునా? ప్లవగశేఖరా! నాహృదయేశ్వరుని హేము సువర్ణరోచులం గాయుచుఁ గమలవాసనలీనుచు నుండునది నావియోగశోకంబునఁ జేసి జలక్షయంబున నిదాఘతప్తతామరసమువలె దైన్యము నొందదుగదా? ఏధీరుఁడు ధర్మార్థ దేశంబున రాజ్యంబును ద్యజించి వృథా భయచింతలకు పుమంతయు నెడమీయక నిండుమనంబుతో నన్ను వెంటఁగొని కాననసీమలకు వచ్చెనో యా యుదారమూర్తి నేఁడు ధైర్యవిలోలుఁడు గాఁడు గదా? కన్నవారి కన్న మిన్నయైన మక్కువతో నన్ను మన్నించు నాదయితునకు నాయెడ నేఁడు వాత్సల్యం బెంతమాత్రము కలదో చూతమని ప్రాణంబుల బిగియఁబట్టి యున్నదాన' నని మహార్థవంతమైన వచనంబులు వచించి పతినిగూర్చిన ప్రియోక్తులు మరల వినఁ గుతూహలయై యుండెను.

హనుమంతుఁ డామె తలంపును గ్రహించి 'అమ్మా! నీయునికి తెలియక నీపతి తహతహపడుచున్నాఁడు. నేను చని సంగతి తెలుప్రక్కే తడవుగా నీ జీవితేశ్వరుఁడు వానరసేనాసహితుండై యిందు వచ్చును. మున్నీటిని దాఁటనోపునా యని శంకింతువు గాఁబోలు. ఆమహానీయుఁ డొక్కకోలచేత సాగరజలంబులనెల్ల నింకించి దాఁటివచ్చును. రాక్షసులో యని యందువా? మృత్యువునకుఁ గూడ మృత్యువైనవానికిఁ బిశితాశనుల నెంత మాత్రము? నీబంది తొలఁగునో లేదో యను నెంజలి వలదు. దినములేగాని మాసములు గూడ నక్కఱలేదు. నీకు నేఁడే విముక్తియైనట్లు భావింపవచ్చును. నీపతిస్థితిని గూర్చి యడిగితివి. ఏమని చెప్పుదు! ఆయన మాంసాదులను ముట్టఁడు; ఫలమూలంబులను మాత్ర మారగించును. అవియుఁ గడుపారఁ దినఁడు; దినమున కొకపూట సాయంకాలమున బహుకష్టముతో నొండు రెండు కేవల శరీరధారణార్థము భుజించును. ఈరా

కుట్టఁగాక ; ఋతువులు పైనఁబడుచుఁ గాక ; కీటకంబులు గఱచుఁగాక ; మైమఱచియుండును. శరీరజ్ఞానమే వానికిఁ గలయట్లు దోఁపదు. ఏలయందువా ! ఆయన నిన్నే తలంచుచు నీతోడిదే లోకంబుగా భావించుచు నీయందే లీనుఁడై యుండును. దానంజేసి వానిబుద్ధి బహిర్గతముగాదు. అందువలన వానికి శారీరకజ్ఞానంబు భ్రాంతిగా గలుగదు. పరాయత్తచిత్తవృత్తుల స్థితి యంతేగదా. నీపతి నిదురమెట్టిదో యెఱుఁగఁడు. అలసిసొలసియేనిఁ గన్ను గూర్కుడాయనిన నదియును గానరాదు. అప్పుడప్పుడు ఉలిక్కిపడును ; హా సీతా ! యని కలవరించును. మనోహరమైన ఫలమో పుష్పమో కానవచ్చినప్పుడు ‘ప్రేయసీ’ అని నిట్టూర్చును. అహర్నిశంబు లిట్లు వానికి గడచుచున్నవి. ఇట్లుండియు నిన్నుఁ బడయుటకుఁగా సమస్త ప్రయత్నములు చేయుచున్నాడ’ని వచించెను.

సీతాదేవి హనుమంతుని విని వెచ్చనూర్చి ‘వానరాగ్రణీ ! నాపతి కుశలంబును దవీయశ్శోకపరాయణత్వంబును దెలుపుచున్న నీపలుకులు విషసంసృష్టామృతంబుగా నయ్యెను. ఐశ్వర్యవ్యసనాదు లతిమాత్రంబైన నాఁడు ప్రాణికి మైమఱపు గలుగు. జీవులు పాశాబద్ధులట్లు దైవపహ్యాతులగుచుందురు. దైవంబును దాఁటరాదు. ఇది సత్యము. నిదర్శనమువలయునేని మేమే తార్కాణము. మున్నీటి నట్టనడుమ తటాలున నోడపగిలి నీటఁబడి యీది యీది సొమ్మసిల్లినవాఁడు వోలె నాపతి దుఃఖసాగర నిర్మగ్నుఁడై దొప్ప దోఁగుచున్నాఁడు. వానియెడ రెప్పుడు తీఱునో, యా వీరాగ్రణి రావణుని సరాక్షసంబుగా వధించి లంకానగరంబు నున్మూలించి నాకన్నుల కఱవెన్నఁడు తీర్చునో తెలియరాదు. నాకు రావణుండిచ్చిన గడువు సమీపించుచున్నది. ఆలోన నాదయితుం డిందు రావలయునని తెలుపుము. ఆవలవచ్చియు ఫలము గలుగదని విన్నవింపుము. ఆనాఁటి నన్నుఁ జెఱఁబెట్టి పదిమాసములాయెను. నాజీవితావధి యిఁక రెండుమాసములుగా వాఁడు నిర్ణయించెను. అన్నంత వాఁడొనర్చెను. మారుతీ ! రావణానుజుని విభీషణుని జూచితివా ? ఇందఱు రక్కసులలో నతఁడొక్కండు మాత్రము నాయెడ జాలిఁగాంచెను. ఆ విభీషణుఁడు రాక్షసేశ్వరుని దుండగంబునకు నసహ్యపడియు నెదురొడ్డి నిలుపనోపక ‘అన్నా ! సీతాదేవిని

గొనిపోయి రాములకు నప్పగింపు' మని సామోపాయంబునఁ జెవినిల్లుఁగట్టి
వానికిఁ జెప్పెను. ఆ చెనఁటి యామాట యింపుసేయఁడు. రావణుఁడు
కాలవశంగతుఁడు గావున వానిని మృత్యువు వెదకుచున్నది. కపీంద్రా!
విభీషణునకు నలయను పేరి జ్యేష్ఠపుత్రిక గలదు. ఆబిడ తనతల్లి పంపఁగ
నాయొద్దకు వచ్చి యీవృత్తాంతంబెల్లఁ జెప్పిపోయెను. వింధ్యుఁడను
రాక్షసుఁడు వయోవిద్యావృద్ధుఁడును బ్రజ్ఞాశీలవంతుఁడును నైన వాఁడొ
కఁడు గలఁడు. అతఁడు గూడ రావణునకు హితముఁ బలికెనఁట. ఎవరెంత
చెప్పినను దురాత్ముఁడతఁడు సరకుచేయఁడు. మారుతీ! నాపతి నన్నచిర
కాలంబున గైకొనును. ఏలయిట్లందు నందువా? నాయంతరాత్మ విని
ర్మలమై యున్నది. ఇంతకన్న వేఱు నిదర్శనమేల? నాపతియందుఁ బౌరు
షోత్సాహంబులును దయాసత్యంబులును గృతజ్ఞతా విక్రమంబులును మూర్తీ
భవించియున్నవి. అనన్యసాహాయ్యుఁడై యర్ధముహూర్తకాలంబునఁ జతుర్దశ
సహస్రరాక్షసవీరానీకంబును బరిమార్చిన వీరాగ్రణి నెదిరించి మనువాఁడు
గలుగఁడు. వ్యసనంబులు నాదరియనని గలంప నేరవు. శక్రమహిషియగు
శచీదేవికివలె రామప్రభావంబు నాకు స్పష్ట' మని పతికి కన్నీరు నించెను.

గమనోపదేశము.

హనుమంతుఁడామె వగపుఁజూచి 'అమ్మా! కాలహరణంబేల?
దయచేసి నావీపు నధిష్ఠింపుము. క్షణములో నిన్ను నీపతియొద్ద నుంతు.
మోయఁగలవాఁడను శంకవలదు. లంకానగరంబును సరావణంబుగా
మోయఁగలను. నామాట విని నాభుజంబు నధిరోహింపుము. వైశ్వానరుఁడు
హుతహవ్యంబును గొనిపోయి శక్రునకు నిచ్చుకరణి నేను నిన్నుఁ గొనిపోయి
ప్రస్రవణపర్వతంబున నున్న రామునకు నొసంగుదు. రోహిణి చంద్రు
నట్లు నీవు నీపతిని గూడి సుఖింతువు. రక్కసు లడ్డగింపరా యని యందు
వా? వాయుసుతుని పట్టువడఁ జిక్కించుకొనువారు లేరు. సముద్రమో
యందువా? అది నాకొక కాల్వపాటియగును. ఆయాసము నీకు గొంచెమై
యుఁ గలుగదని కయిమోడ్చి విన్నవించెను. సీతాదేవి హర్షవిస్మితయై
'హనుమంతా! నీవు క్రోఁతివగుట నీమాటలే తెలుపుచున్నవి. గండుమిల్లి
లేవు; నన్ను మోచికొని పోదువా? ఈఁగ యేనుంగును మోయుటగాదో'
యనెను. మారుతి యామాటవిని నిజస్వరూపంబును జూపి 'తల్లీ! అక్క

యేని లంకానగరంబును సపర్వతవనంబుగా సాట్టప్రాకారతోరణంబుగాఁ పెకలించి రావణునితోడఁ గొనిపోదును. భయంబుడిగి ప్రసన్నవై రామలక్ష్మణుల శోకంబు నుడిగింపు' మనెను.

### ఆత్మనిశ్చయము.

మేరుమందర సంకాశంబును దీప్తానల ప్రభా భాసురంబును వజ్రదంష్ట్ర నఖాభీలంబును నైన యా యాకారంబును సీతాదేవి గాంచి 'మారుతీ! నీ బలసత్త్వంబు లెఱుంగుదు. ప్రాకృతుండవేని శతయోజనవిస్తీర్ణ సాగరంబును దాఁటియుందువా? నీపలుకు పుచ్చుకొనువారుగాని నిన్నెదిర్చి జయించు వారుగాని గలుగరు. ఒక్కమాట వినుము. రామోద్యోగంబునకు మన కార్యంబు విఘ్నకారులు గారాదు. నీవే యాలోచింపుము. మఱియు నీవెంట నేను రానొల్లను. ఏలయందువా? నీవేగంబునకు బెగ్గడిల్లి జారి సాగరాంతరంబునఁ బడినను బడుదును. మున్నీటిలోఁ బడిన నన్ను జలజంతువులు మ్రింగకమానవు. వెండియు నీవు నన్ను మోసికొనిపోవుట రక్కసులకుఁ దెలియకుండదు. వారు రావణునితోఁ జెప్పక మానరు. వాఁడు ససైన్యంబుగా నిన్ను ఢీకొనక విడువఁడు. ఒక్కండవేని వారికెల్ల జవాబు చెప్పనోర్తువు. నేను నీమూఁపున నున్నంతకాలము నీవిజృంభణంబునకు నిరోధంబుఁ గలిగించుచుందును. ఒకప్రక్క నన్నుఁ గాపాడుటయు నొకవంక వైరులను మార్కొనుటయుఁ గడిఁది కార్యము. నీప్రాణంబులకే ముప్పురావచ్చును. అంతియగాదు. జయాపజయంబులు నిశ్చయింపరాదు. నీవు పరాజితుండవేని నేను రాక్షసహస్తగత నగుదును. ఆకూళలు నిర్దయామతులై నన్నుఁ గసిదీర్చికొందురు. ఇంతదూరము నీవచ్చినకార్యము వినశించును. ఎదిరించిన వారిని మట్టుపెట్టుదునందువా? అంతపని చేయఁ గలవుగాని యది రాముని యశస్సునకు మచ్చ తెచ్చుటగును. ఎట్లు విచారించినను నీమాట ప్రకృతము యుక్తముగాఁ దోఁపదు. నీవు చని నాసంగతి రామునకుఁ దెలిపి వాని నిటకు శీఘ్రముగాఁ గొని వచ్చుట గుణవంతమగును. రాఘవాదుల ప్రాణంబులు నన్నాశ్రయించి యున్నవి. నాకుఁ గీడు కలుగు నేని వారెల్లరు శోకనిహతులై ప్రాణసంగ్రహంబును బరిత్యజింతురు. ఇదియును గాక పరపురుషస్పర్శ నాకుఁ గారాదు. ఇది నా వ్రతము. దీనికి

భంగముం గలిగింప నొల్లను. రావణసంస్పర్శ కాలేదాయని యడుగవచ్చును. అది బలాత్కారకృతముగాని స్వేచ్ఛాకృతముగాదు. నాండు తప్పించు కొన శక్తి చాలనయ్యెను; తప్పించు వారును మందల లేరైరి. మారుతీ! నీకుం దెలియని ధర్మము గలుగదు. ఒక్కటి వినుము. ఇంతి యిల్లువాసిన చేని దానినెంతో శంకింతురు. ఇది లోకసహజము. నన్ను రావణుం డపహరించి తెచ్చెను. ఈసంగతి దాచినను దాంగదు. వాండు క్రూరుం డును గామవివశుండు నగుట జగద్విదితము. వానిచేతంబడి యతనియింట నింతకాలముంటిని. ఇప్పుడు నేను స్వతంత్రించి వత్తునేని నాభర్త నన్ను శంకింపక గ్రహించునా? మారుతీ! రావణుండు నన్ను బలాత్కారము గాం దెచ్చెనని లోకంబు తలంపదు. సీత రావణునివెంటం బరారియయ్యె నందురు. ఈనింద పాయకమున్నె నన్ను నాభర్త గ్రహించునేని వానికి మోయరాని తలవంపు మూంటగట్టుదురు. నాదయితుని తేజోవిక్రమాదు లకుం గళంకమగును. రాముండంతటివాండే పరారియైన భార్యను మరల గ్రహింపలేదా యని జనులు తమ యపమార్గంబునకు మమ్మొరవుగను వ్యాఖ్యాన చేయుదురు. చెడుదారికి మేము మార్గప్రదర్శకుల మగుదుము. ఈ మచ్చ కలకాలముండును. నాజీవితేశ్వరుండు దండెత్తి యిందువచ్చి లోకకంట కుని బరిమార్చి నాపాతివ్రత్యంబును లోకప్రదర్శనంబుగాం బరీక్షించి నన్ను గ్రహించునేని యది నాకు మేలగుటయేగాక ధర్మప్రతిపాదనము గూడ నగును. మారుతీ! సకలధర్మశాస్త్రవేత్తవును లోకజ్ఞుండవును నైన నీకు నేను చెప్పవలయునా?' యని తనమతంబును సూచించెను.

ఆ న వా లు.

హనుమంతుం డావచనంబులు విని 'తల్లీ! సాధ్వీభావ పాతివ్రత్య ధర్మంబులకు ననురూపంబుగా వచించితివి. పరపురుషసంస్పర్శ తగదనుట రామపత్నికి నుపపన్నమేగదా. ఈ పరమధార్మిక వచనంబు లొండుచోట నంతగా వినంబోలము. నీక్లేశంబులం జూచితిని; రావణ దౌష్ట్యంబును గన్నారంగాంచితిని; నీవాడినతిరస్కృతులు వింటిని. ఇవన్నియును నిరవ శేషంబుగా రామునకు విన్నవింతును. మీ యిరువుర సంతాపంబును జూడం జాలక మీకు శీఘ్రసంయోగంబును గూర్చి మీయెడరు బాపు తలం పున నట్లంటిని. మీకీర్తికిం గళంకముగారాదు. నీ చెప్పినట్లొనర్తును. నేను

యిచ్చి నిన్నుఁ గాంచి నీభావం బెఱిఁగి నందులకు గుఱుతుగా నేదేని నాకనుగ్రహింపుము. నీవిచ్చుగుఱుతు నామాటలకుఁ బ్రాణము వోసి రాముని నిలుపఁబెట్టును' అనెను. సీతాదేవి యది విని వానరేశ్వరా! తగవాలుఁ గోరితివి. చెప్పెద వినుము. నేనును నాపతియుఁ జిత్రకూటంబున నుండఁగా నొండొకనాఁడు మందాకినీప్రాంత సిద్ధాశ్రమోపవనంబులందు విహరించి బడలిక చెంది యొకచోటు చేరితిమి. నాపతి యంకమున నేను గూర్చుంటిని. అప్పుడు నాయెడ కొక్కకాకి గంతులువేయుచు మాంసకాంక్షియై తననిశితతుండంబున నావక్షస్థలముఁ జీఱెను. మంటిగడ్డవైచి దాని నదల్చితిని. ఎంతచేసినను దానిదుండగము నది వదలదయ్యెను. దాని పాలబడికిఁ గినిసి జారుచున్న మొలనూలు నొకచేత సవరించుచు నక్కాకంబును దఱుమ నుంకించితిని. నాచిడిముడిపాటునకును నా యబలత్వంబునకును మన్నాథుఁడు పరిహసించెను. నేను లజ్జావనతముఖినైతిని. నాపతి నాయలుకఁ దీర్చి నన్ను సంతసపెట్టెను. అంత నేను సుంతపడి నాపతితొడ తలగడగాఁ బరుండి నిదదేఱి లేచితిని. నాపతి యంతట నాతొడపయిఁ బరుండి కనుమూర్చెను. ఆకాకి తన దుండగంబును యథాపూర్వమారంభించెను. నాయురమునుండి రక్తబిందువులు నాపతిపై రాలెను. ఆయన కనువిచ్చి చూచి సంగతి గ్రహించి పాదతాడితాశీవిషంబుపగిది నిశ్శ్వసించుచుఁ దానుగూర్చుండియున్న దర్భాసనమునుండి పుడక యొండు గైకొని దాని నభిమంత్రించి వైచెను. ఆపుడక బ్రహ్మాస్త్రమై ప్రళయాగ్నికరణి మండుచు నవ్వాయసంబును వెన్నంటి దఱిమెను. అది భయార్తమై ప్రాణరక్షణార్థము పరుగిడి దానితండ్రియైన యింద్రుని శరణుఁజొచ్చెను. ఆ శచీపతి సంగతివిని రామబాణమునుండి రక్షింపఁ దనకుఁ దరముగాదనెను. అంతట నది దేవతల నాశ్రయించెను. వారు నట్లే పలికిరి; మహర్షుల ప్రాపుఁగోరెను. వారును మావలనఁ గాదనిరి. అది యట్లు త్రిజగంబులఁ ద్రిమ్మరి యొండును రక్షకుని గానక కట్టకడకు నాపతి యడుగులఁబడి 'పాహి పాహి దేవా! దీనశరణ్యా!' యని కుయ్యిడెను. నాపతి శరణత్రాణదీక్షాపరుఁడు గావున నవ్వాయసంబును వధార్హమైనదానిని గనికరించి 'వాయసమా! నీదుండగము మన్నింపఁ దగినదిగాదు. అయినను శరణుఁ జొచ్చితివి గావున నిన్ను రక్షింపక తీఱదు. నేను వైచిన

బ్రహ్మాస్త్రము వ్యర్థముగా మరలదు. నీయంగకములలో నేదేని నొకటి దానికి నర్పించి నీప్రాణములు రక్షించుకొను' మని యుపాయము చెప్పెను. అది తన దక్షిణనేత్రము నయ్యస్త్రరాజమునకు సమర్పించి ప్రాణంబులను దక్కించుకొనెను.

సీ॥ ఆనాఁడు కాకిపైనలిగి బ్రహ్మాస్త్రంబు
నంపిన ప్రేమ యేమాయె నను,
గోరంత నొప్పిని గొండంతగా నెంచి
యాదరించువలపేమాయె నను,
దయకన్న మించిన ధర్మంబులేదని
యాడినబోధ లేమాయె నను,
ప్రాణంపుఁ బ్రాణంబుపగిది నిన్నోమ్ముదు
నన్న నాఁటిపలుకేమాయెనను,
ఆ॥వె॥ శివునివిల్లు దునిచి చేకొన్న మోహంబుఁ
బరశురాముసివలని భయములుడిపి,
కాచినట్టి కరుణగలుఁగదాయె నను
వేఁగుఱుతులేల? వీరవర్య! ॥

చూడామణిదానము.

మారుతీ! నాపతితో నట్లు విన్నవించి లక్ష్మణునిజూచి 'నాతప్పు మన్నింపుము; నన్నుపేక్షింపవలద' ని చెప్పుము. అయ్యో! పాపఫలం బిట్లు నన్ను వేధించుచుండఁగా నెవరేమి సేయఁగలరు?' అని సాశ్రునేత్ర యయ్యెను. జాలిగుఱియుచున్న యవ్వచనంబులను హనుమంతుఁడు విని శోకవివశుఁడై 'అమ్మా! నీపతి నీయెడ విముఖుఁడుగాఁడు. సత్యముతోడఁ జెప్పుదు. రామలక్ష్మణులు నీకుఁగా వగచువగపునకు జాలుగూడ నీఱగుచున్నవి. అల్పకాలంబున నీదుఃఖంబులెల్ల సమసిపోవును; నీవు నీపతి యొడిఁ జేరుదువు. ఆచింత వదలి రామలక్ష్మణసుగ్రీవాదులకు మతి యే దేనియుఁ జెప్పఁదగినది గలదేని సెలవిమ్ము' అని సాగిలఁబడి మ్రొక్కెను. సీతాదేవి తనదుఃఖంబునడఁచికొని 'మిత్రవరేణ్యా! కౌసల్యానందవర్ధనుండును లోకనాయకుండును నైన నాపతికి నా సాష్టాంగప్రణామంబు లర్పిం

చేపుచునుము. నీవున్నచో నాదుఃఖమునకుఁ గొంత యుపశాంతి గలుగును. నీవు పోవుదువేని నాప్రాణంబులు మఱల నెరియఁజొచ్చును. సముద్రము దరిగానరాదు. వైనతేయునకును వాయువునకును నీకును దక్క యన్యుల కది దాఁటరాదు. రామలక్ష్మణులు దీని దాఁటి రా నుపాయమేమి గలదు? రావణుని బరిమార్చి నన్నుఁ గొనిపోయి నాపతియొడిలో నుంచఁగలవుగాని యది మాకుఁ గీర్తికరముగాదు. రాముఁడు నిజబలపరాక్రమంబులను జూపి దైత్యులను నిర్జించి జయశాలియై నన్నుఁగొని యయోధ్యకుఁ జనుట యశస్కరమగును. అందులకుఁ దగు సన్నాహంబును గూర్పు' మనెను. హనుమంతుఁ డామె తలంపు నెఱిఁగి 'తల్లీ! వానరరాజు సుగ్రీవుఁడు కృతనిశ్చయుఁడై యున్నాఁడు. నన్ను మించిన వానరయోధులు వేనవేలుగా వాని యాజ్ఞకు వేచి యున్నారు. కార్యార్థము సామాన్యముగా నుత్తములను బంపరు. నాయట్టి యల్ఁతికే యీసాగరము దాఁటి రానైయుండఁగా వీరాతివీరులకు వానరుల కిది యొక లెక్కయగునా? ఈ చింతా సందేహములు వలదు. రామలక్ష్మణులు దీనిని దాఁటు తెఱవడిగితివి. ఉపాయాంతరమేదియుఁ గలుగదేని వారు నామూపు నధిరోహించి యిందు రాఁగలరు. రాఘవుల బాణార్చులకీనగర మింధనప్రాయము గానున్నది. రాక్షసులకు దుర్మరణము ప్రత్యాసన్నమయ్యెను. నేను చని రామునకు సంగతి యెల్ల విన్నవించుదాఁక యోర్చియుండుము. ఇఁకఁ దడవుగా' దని యూఱడి పల్కెను. వైదేహి యాపలుకులు విని 'వానరోత్తమా! వృష్టివలన వసుంధర యర్ధసంజాత సస్య యట్లు నీ ప్రియవచనంబుల వలన నే నొకింత యుల్లసిల్లుదును. శోకాభికర్శితములైన నా యీగాత్రములతోఁ బురుషసింహుని నాపతిని సంస్పృశించు మహాభాగ్యంబును నాకుఁ జేకూర్పుము. మారుతీ! కాకవృత్తంబును జెప్పి చూడామణి నానవాలుగా నిచ్చితివి. మఱియు నొకటి వినుము. ఒకనాఁడు నానుదుటి బొట్టు కరఁగి మాసిపోగా నాపతి యది చూచి నాయెదుటనున్నఁ జలువఱాతిపయి మణిశిలలోఁ జుక్కఁ దీర్చెను. ఆచుక్క నా లలాటమందుఁ బ్రతిఫలించి తిలకప్రాయమయ్యెను. ఇది వానికి జ్ఞప్తిసేయుము. మారుతీ! నీచేతనిడిన చూడామణి యిన్నాళ్ళు నాప్రాణంబులను నిలిపెను. దానిని నేఁడు నీహస్తగతమొనర్చితిని. నాపతిని మరలఁ జూతునను పేరాసతో రక్షించుకొన్ని

చెకలించి సలిలాశయంబులను గలంచి క్రీడాపర్వతంబులను గూల్చి లతామండపంబులఁ నుస్మూలించి చిత్రగృహంబులను శిథిలమొనర్చి రణాకాంక్షాతిని గోరుచున్న నిజభుజంబులను రాయుచు నయ్యారామ ముఖద్వారంబున నిలిచెను.

వృక్షంబుల ఫెళఫెళధ్వనులును బక్షుల వికృతారావంబులును లంకావాసులకు సంత్రాస సంభ్రాంతము లొదవించెను. సీతారక్షక రాక్షసాంగనలు నిద్రావశలైయున్నవారు తత్తరపడి లేచి వనమెల్ల నాకస్మికంబుగా నట్లగుట చూచి తన్ముఖద్వారంబున నున్న పెనుభూతంబును బోని కపివర్యుని గాంచి భీతచిత్తలై వైదేహిని డాయఁ జని 'సీతా! ఇతఁ డెవండు? ఎందుండి వచ్చెను? ఎవరు పంపిరి? ఏలవచ్చెను? సంగతి తెలుపు'మని యొత్తియొత్తి యడిగిరి. సీతాదేవి వారియాగడంబులు విని 'పాముకాళ్ళు పామునకు దెలియునట్లు రాక్షసమాయలు వారికే తెలియవలయును. రాక్షసులు కామ రూపులందురు. మీవాఁడెవఁడో యీరూపమును దాల్చి వచ్చెఁ గాఁబోలు' ననెను. రాక్షసస్త్రీలు భీతలై కొందఱు దిక్కులు పట్టిరి; కొందఱు రావణునొద్దకుఁ బఱచి సంగతి యెల్ల వివరించి 'సీతయున్న వృక్షము దక్క తక్కిన వనమెల్ల నాశన మయ్యెను. జానకీరక్షణార్థము వాఁడు దానిని విడిచియుండును. ఇందేమో రహస్యము గలదు. ఈమహాపరాధి తీవ్రదండార్హుఁడుగాని యొండు గాదు. వాఁడు సీతతో మాట్లాడినట్లుగూడఁ దోఁచుచున్నది. ప్రాణంబులు తీసియగునేని వాఁడట్లు చేసియుండఁడని చెప్పిరి.

జంబుమాలి.

రావణుఁడు కోపసంవర్తితేక్షణుండై హుతాగ్నివలె మండుచు, దీప్తదీపంబునుండి స్రవించు మంటలతోడి తైలబిందువులను బోని యస్రబిందువులు నేత్రగోళంబులనుండి రాలఁగాఁ బటపట పండ్లు గీఁటి రాక్షసవీరుల వంక జూఁచి 'ఇంకను గదలరా? ఆకూళను బట్టి కట్టి కొనిరండ'నెను. ఆమాటతోడ నెనిమిదివేలు రక్షోవీరులు కూటముద్గరపాణులై తరలి యశోకవనికా బహిర్ద్వారంబున నున్న హనుమంతుని మీఁదికి మిడుతలగ్నికుండంబు మీఁదికివలె నురికి వివిధగతుల వానిని బ్రహరించిరి. మారుతి యా ప్రేటులు

మంతుని తామ్రవర్ణముఖమండలము శరక్షతరక్తవ్యాప్తమై శరత్కాల సంఫుల్లంబును భాస్కరరశ్మివిద్ధంబును నైన రక్తోత్పలంబును బురుడించెను. కేసరి కోపోద్వేగియై సమీపంబుననున్న పెనుబండ నెత్తి బలముకొలఁది జంబుమాలిపై విసరెను. రాక్షసవీరుఁడు దానిని మార్గమధ్యంబుననే పదిశోలలు వైచి తునియలుగావించెను. హనుమంతుఁడు తన ప్రయోగంబట్లు వ్యర్థంబగుటకు నెంతయుఁగినిసి మహోన్నతంబైన సాలంబొండు సమూలంబుగాఁ బెఱికి గిఱగిఱద్రిప్పివైచెను. దానినిగూడ జంబుమాలి నాల్గుశరంబులచేఁ దుండించి గ్రౌదుసాయకంబులు మారుతిభుజంబులందును నొక్కభల్లంబును వానివక్షోభాగంబునను నాటి యతనిని నొప్పించి యార్చెను. శ్వసనసూనుఁడు మహోగ్రమూర్తియై పరిఘాయుధంబును బాహుబలంబు కొలఁది త్రిప్పి జంబుమాలియురంబున మోఁదెను. ఆ వ్రేటుపడి యయ్యసురవీరుఁడు ముద్దయైకూలెను. రాక్షసభటులు తమనాయకుని పాటుఁ గాంచి చెల్లాచెదరై పఱచి యాసంగతి లంకేశ్వరునకుఁ దెలిపిరి. అతఁడు మహాకోపప్రచండమూర్తియై యమాత్యపుత్రుల నేవురను రప్పించి హనుమఁతుని మీఁదికిఁ బంపెను.

## మంత్రిపుత్త్రులు.

అతివీర్యవిక్రములైనవారు కాలానలజ్వాలలకరణి మండుచు ధనువులం సారించుచు నేను నేనని వంతులాడుచు జననీజనక సుహృద్బాంధవాదులు వారించుచున్నను వినక ధ్వజపతాకసేనాసమేతులై వచ్చి రథధ్వనులు గర్జితంబులుగా మేఘంబులకరణి బాణవర్షముఁ గురిపించుచు హనుమంతుని ఢీకొనిరి. వాయుసుతుం డయ్యంపవానలో మునిఁగి వృష్టిసంవృతశైలరాజువలెఁ దోఁచుచు గగనంబున కెగచి వారిలక్ష్యంబునకుఁ గూడ నందక యందే కొంతవడి నిలిచి వారిని బలువగల నాడించి నేలవ్రాలి ముష్టిఘాతంబులఁ గొందఱను, పాదతాడనంబులఁ గొందఱను, జేతిచఱపులఁ గొందఱను, బొమ్మపోటులఁ గొందఱనుఁ, దొడతాపులఁగొందఱను, నానావిధంబుల నురుమాడి నఖాగ్రంబులఁ గొందఱఁజీల్చి సింహనాదమొనర్చెను. రక్కసులుకొందఱు కూలిరి; కొందఱు దిక్కులు బ్రాకిరి. గజంబులు విక్షతంబుగాధ్వానంబులుగావించుచు డొల్లెను. వాజులు నిలువున వ్రాలెను ; రథంబులు తుత్తునియలై నేలఁబఱచెను ; నెత్తురు వాహిణులుగట్టి పాఱెను. లంకానగరమందెల్ల వికారారావంబు లెగసెను.

వివశులై గగనతలంబునకు లంఘించి ముద్గరంబులతో హనుమంతుని యురంబును దీవ్రంబుగా మోఁదిరి. కేసరి నేలకు దుమికి సాలవృక్షంబొండు పెకలించి దానితో వారితలలు వ్రీలనడిచెను. వారిరువురును నెత్తురులు గ్రక్కి ప్రాణంబులఁబాసిరి. అంతఁ బ్రఘసుఁడు పట్టిసంబును బూని వానర వీరుని దాఁకెను ; భాసకర్ణుఁడు శూలంబును బట్టి ఢీకొనెను. హనుమంతుఁడు గిరిశిఖరంబు నొండు పెకలించి దానితో వారిని మర్దించెను. వారు నెత్తురుగుజ్జయి నశించిరి. అంతమారుతి చెలరేఁగి హయంబులతో హయంబులను గజంబులతో గజంబులను దాడించి వానిని దలలు పగిల్చిద్రొక్కించెను. రథంబులపై రథంబులను వేయఁగా నవి చూర్ణమయ్యెను ; భటులెచ్చటివారచ్చటఁ జచ్చి పడిరి. సమరక్షోణియెల్ల హతములైన హయములతో గుజ్జయిన గజంబులతోఁ దుత్తునియలై పడియున్న రథంబులతోఁ గ్రొక్కిళ్ళనలిగి వసవల్చుచున్న రక్కసుల శవంబులతో నిరవకాశమై దర్శన భయంకరముఁగా దోఁచెను. హనుమంతుఁడట్లు గావించి ప్రజాక్షయకాలాంతక మహోగ్రాకృతిఁదాల్చి యథాపూర్వము బహిర్ద్వారంబున సంస్థితుఁడై యుండెను.

అక్షకుమారుఁడు.

రావణుఁడు దుర్ధర్షాదులగతికిఁ జుఱచుఱఁబొక్కుచుఁ గట్టెదుటనున్న నిజసుతుని నక్షకుమారుఁడను వానిని వీక్షించెను. అతఁడు పితృభావంబును గ్రహించి కాంచనచిత్రకార్ముకంబు ధరించి హవిరుదీరిత పావకసంరంభియై లేచి, తపస్సంగ్రహసంచయార్జితంబును బ్రతప్తజాంబూనదజాల శోభితంబును రత్నవిభూషితధ్వజపతాకాభిరామంబును మనోజవతురంగ సప్తక సంయోజితంబునునై సురాసురులకుఁ గూడ ధృష్యమాణముగాక తూణాసి శక్తితోమరధనుఃకవచాది సమస్తోపకరణంబులతో నిండియున్న రథంబును వ్యోమచరమైనదాని నధిరోహించి వెనువెంట నడచుచున్న మత్తమాతంగంబుల బృంహితంబులును తురంగంబుల ఖురధ్వనులును రథాంగనేమిస్వనంబులును రోదసీకుహరంబు నగలించుచుండఁగా నయ్యశోకవన బహిర్ద్వారంబును గూర్చి చని - యటఁ బ్రలయకాలాగ్నికరణి నిలిచియున్న మహాగంభీర మూర్తిని హనుమంతుని గాంచి విస్మయసంభ్రమంబు లంది వానిపరాక్రమంబునకుఁగాఁ దనయెదజనించిన మెప్పును బహుమాన దృష్టిరూపంబున

భావించి స్వపరబలంబులను విమర్శించి హిమాంతంబున సూర్యుఁడట్లు వర్ధిల్లి యుద్ధంబున నతని జయించుట కష్టతరమని నిశ్చయించి సమాహితాత్ముఁడై వానిని దాఁకెను. వారిసమాగమంబునకు సురాసురులెల్ల సంభ్రాంతులైరి; ధాత్రీతలము పెనురొదగావించెను ; చండభానుండపరితాపహీనుఁడయ్యెను ; వాయువు నిశ్చలవృత్తి నాశ్రయించెను ; అచలంబులు చలించెను ; గగనము ఘోషించెను ; సాగరము సంక్షోభించెను. అక్షకుమారుఁడు తపసమాధిసంయోగ విమోక్షణశక్తులేర్పడ నురగంబులఁబోని విశిఖంబుల మూఁటిచే హనుమంతుని శిరము గుఱిచేసి వైచెను. మారుతి శరక్షత జలధారలఁ దోఁగుచు బాలభాస్కరుని భంగి భాసిల్లుచు వైరికి మెచ్చి మేను పెంచి నిజబల పరాక్రమంబులు దీపింపఁగా శత్రుసైన్యంబును జూచుఁజూచి సింహనాదంబొనర్చి భుజంబులు విసరి తొడలు జాడించి నింగి కెగసెను. అక్షకుమారుఁడు వానిని వెన్నంటి మేఘుఁడు శిలావృష్టిని బర్వతంబుపయి వలె నతని పయి బాణవృష్టిని గురిపించెను. హనుమంతుఁడు తనలాఘవంబును చూపుటకో యన నయ్యంబకంబుల మధ్యవ్రేటుపడక కొండొకలెడవు వాయువట్లు సంచరించి 'అహో ! ఇతఁడు బాలుఁడయ్యును వివిధయుద్ధోపాయ పరిజ్ఞాతగాని యేతన్మాత్రుఁడుగాఁడు. వీనిపరాక్రమంబునకు దేవాసురులుసయితము భీతిల్లుట వింతగాదు. ఉపేక్షింతునేని యితని పరాక్రమము రాజుచున్నయగ్నివలెఁ బెచ్చుపెఱుగును. తోడ్తోడ వీనిని వధించుట యుక్తముగానున్నది.' అని తలపోసి వాని రథాశ్వంబుల నెనిమిదింటిని అఱచేతఁ జఱచెను. ఆతాపునకు గుఱ్ఱంబులు నీల్గెను ; రథము తుత్తునియలై కూలెను. అక్షకుమారుఁడు రథంబునుండి దుమికి ఖడ్గకార్ముకంబులు చేతఁబట్టి, తపోవిశేషంబున దేహత్యాగమొనర్చి దివికేగు ఋషీంద్రుని కైవడి నింగికెగసెను. అట్లు వచ్చిన యారక్షోవీరుని పాదంబులను హనుమంతుఁ డొడిసిపట్టి వానిని గిర్రన త్రిప్పి నేలబాదెను. అక్షకుమారుని బాహువులు విఱిగి తొడలు చీలి కటిభాగము తునిగి శిరస్సు వ్రీలి సంధిబంధంబులు సడలి ముద్దయి కూలెను. జ్యోతిశ్చక్రంబున నిలిచి వారియుద్ధంబుఁ జూచుచుండిన వ్రతులును మహర్షులును భూతంబులును యక్షపన్నగాదులును మారుతికిఁ బరమాశ్చర్యమొందిరి. హనుమంతుఁడట్లు గావించి యథా

హనుమదింద్రజిత్తుల యుద్ధము.

రావణుఁడు పుత్త్రమరణంబును విని లోలోన దుఃఖించి వ్యసనక్రోధకషాయనేత్రుఁడై యింద్రజిత్తును రావించి 'వత్సా! పితామహప్రత్తదివ్యాస్త్రంబులు నిన్నారాధించుచున్నవి. మఱియుఁ దపోరక్షితుండవును ధనుర్విద్యాభిరక్తుండవును దేశకాలవిభాగజ్ఞుండవును సుక్షేమబుద్ధిశాలివి నావారిలో నీకు సాటిలేరు. నిన్నోర్చువాఁడెట్టి ముల్లోకంబులందును గానరాఁడు. నీ శస్త్రవిద్యానైపుణ్యంబిట్టనరాదు. నీ పేరు చెప్పిన సురాసురులు శోకింతురు. నీలావు దేవేంద్రుఁడు పెక్కుసార్లు చవిచూచెను. రణావసరంబున నిన్నుఁ దలంచి నేను మనశ్శ్రమంబును బాయుచుందును. వత్సా! సంగతి వింటివి గదా? జంబుమాలి చచ్చెను; మంత్రిపుత్త్రులు మడసిరి; నీతమ్ముఁడక్షకుమారుఁడు హతుఁడయ్యెను. రాక్షసవీరులు వేనవేలు రణహతులై సమసిరి. ఒక్కవానరుఁడింత యొనర్చెనని చెప్పుటకుఁగూడ సిగ్గగుచున్నది. వానిబలపరాక్రమంబులను విమర్శింప నేర్చువాఁడెట్టి భవదన్యుఁడు గానరాఁడు. రాక్షససైన్యంబును గుంపులుగుంపులుగా వానిపయికిఁ బంపుట మిడుతలదండును దావాగ్నిమీఁదికిఁ బంపుటగానున్నది. వజ్రశరీరుఁగాన వానిపయి వజ్రాయుధమును బ్రయోగించియు ఫలముండదు. అగ్నికల్పుఁడు గావున వానిఁ శరఘాతంబు లేమియుఁ జేయఁజాలవు. ఈసంగతులు మదినుంచి దివ్యాస్త్రబలము నాశ్రయించి కార్యవిఘాతము కానట్లు వర్తింపుము. అపాయముఁ గాదవనట్లు చేయుము. నిన్నిప్పుడు వానరుతోడి యుద్ధంబునకుఁ బంపుట యుత్తమకార్యము గాకున్నను రాజధర్మంబును బట్టి యది యవశ్యంబయ్యెను. రణవిజయంబును జేకూర్పు' మని చెప్పెను.

ఇంద్రజిత్తు తండ్రికిఁ బ్రదక్షిణంబు గావించి రణోత్సాహియై రథం బారోహించెను. అతఁడు రథంబెక్కినంతనే దిక్కులు కలుషవంతము లయ్యెను; మృగంబులు విపరీతారావంబులు గావించెను. మహర్షులును సిద్ధులును యుద్ధవిలోకనోత్సుకులై జ్యోతిశ్చక్రంబున బారులుతీరిరి.

హనుమంతుఁడు బ్రహ్మాస్త్రబద్ధుఁడగుట.

ఇంద్రజిత్తు హనుమంతుని సమీక్షించి ధనుష్టంకారముఁ గావించెను; మారుతి దానికి జవాబుగా సింహనాదంబొనర్చెను. అంత నిరువురుఁ బెం

బధిష్ఠించి రాజిల్లుచున్న రాక్షసేశ్వరుని పయిఁ జూపు నిలిపి 'ఆహా! ఇతనిరూపధైర్యాదు లేమనవచ్చు! ఇతఁడు సమస్త శుభలక్షణలక్షితుండు గాని యొండుగాదు. ఈరావణుఁడేవో బలవత్తరమైన యధర్మంబొక్కటి హేయమైన రాక్షసాధిపత్యముఁ బడసెను. కాకున్న నితఁడు సురలోకాధిపత్యమునకుఁ దగును గదా. క్రూరకర్మఫలం బెవ్వరికిని దప్పదు. ఇతఁ డలిగెనేని జగంబెల్ల నేకార్ణవంబగుట వింతగాదు' అని లోలోనఁ దలపోయ సాగెను. రాక్షసేశ్వరుఁడును తనయెదుటనున్న కపివర్యుని జూచి తదీయతేజోవిశేషంబునకు భయపడి

మ. అలకైలాసగిరీంద్రముం గదిపి మై యట్టిట్టు లూఁటాడఁగాఁ
జలముం బూనిశపించినట్టి బలరాజన్మూర్తి నందీశుఁడో?
ఖలుఁడౌ బాణుఁడొ యిట్లు వింతకపియై కాలానలంకాప్రకా ;
దలపోయం బెఱిఁగిందు వచ్చెనను సంధర్షింపఁగానోపునే?

అని చింతించి ప్రహస్తుని జూచి 'ఈదురాత్ముఁ డెవఁడో? ఎందుండి వచ్చెనో? యేలవచ్చెనో? అశోకవనంబు నక్కైల భగ్నమొనర్చెనో? రాక్షసాంగనలఁ దర్జింప నేలకో? విచారింపు' మనెను. ప్రహస్తుఁ డంత హనుమంతుని చాయ మరలి 'కపిగ్రామణీ! భయము వలదు; శుభంబగుఁగాక; ఊఱటనొందుము. ఎవని పంపున నిందు వచ్చితివో? ఇంద్రుఁడు పంపెనా? కుబేరుఁడు ప్రత్తెంచెనా? యమవరుణులలో నెవరేనిఁ దరలించిరా? అల విష్ణువు మాతగా నిన్ను నడపించెనా? యథార్థము చెప్పుము; నిన్ను విడిచి పుత్తుము. వానరుండవుగాఁ జూపట్టుదువు. నీతేజమున్నతో పరమాద్భుతంబును గలిగించుచున్నది. అసత్యం బాడినచోఁ బ్రాణములు దక్కవు. పరుల పంపునఁగాక నీవే వచ్చితివేని నీవచ్చినకార్యమేమి?' యని యడిగెను. హనుమంతుఁ డాప్రశ్నము విని రావణునివంక మరలి 'పరుల పంపఁగా రాలేదు. నేను నిజముగా వానరుఁడనేగాని మాయావానరుండను గాను. రాక్షసేశ్వరా! నిన్ను సందర్శించు తలంపుతో వచ్చితిని. నీ సందర్శనంబు దుర్లభముగాఁ దోఁచెను. మార్గాంతరముగానక నీదృష్టి నాకర్షించు నిమిత్తము నీకు మహాప్రియకరమైన యశోకవనంబు నట్లు గావించితిని. నాతలంపు గ్రహింపనేరక రక్షోవీరులు నన్నుదాకిరి. ఆత్మరక్ష

ణార్థము వారితోఁ బ్రతియుద్ధం బొనర్చితిని. అస్త్రపాశంబులతో నన్ను బంధింప నెవరికిని సాధ్యముగాదు. పితామహుఁ డట్టి వరంబును నాకుఁ బ్రసాదించెను. ఆకారణంబున బ్రహ్మాస్త్రముగూడ నాయెడ ఫలకారి గాదు. అయినను నిన్ను సందర్శించు తలంపుతో దానికిఁ గట్టువడి రక్కసులకుఁ జిక్కితిని. నాతలంచినట్లు వారు నన్నిటకుఁ గొనివచ్చిరి. నా వచ్చిన కార్యమేమంటివి. ఒకానొక రాజకార్యార్థినై వచ్చితిని. లంకేశ్వరా! నీకు నిహపరశ్రేయస్కరమైన మాటయొక్కటి చెప్పెదను వినుము. వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడామాట నీకుఁ జెప్పుమనెను. నీకు భ్రాతృసమానుఁడు సుగ్రీవుఁడు తనకుశలంబును దెలిపి ధర్మార్థహితమైన సందేశంబు పంపఁజేయుచున్నాఁడు. ఆసందేశము నాలకింపుము. 'సర్వలోకబంధువు దశరథమహారాజు గలఁడు. వానిజ్యేష్ఠకుమారుఁడు రాముఁడు పితృనిదేశంబున స్వదేశంబును బాసి ధర్మరక్షణార్థము భార్యను దమ్ముని వెంటఁగొని దండకారణ్యముఁ జొచ్చెను. అచ్చట రామునిభార్య విదేహరాజతనయ సీతాదేవి పతివ్రతాతిలకము కొండొకనాఁడు తటాలున మాయ మయ్యెను. రాముఁడు భార్యాన్వేషణపరుఁడై తమ్మునితోడ ఋశ్యమూక పర్వతంబునకు వచ్చి నన్నుఁ జేరెను. నేను సీతాన్వేషణార్థము ప్రతిన యొనర్చితిని. అందులకుఁ బ్రత్యుపకారంబుగా రాముఁడు నాకు వానరరాజ్యాధిపత్యంబును దానఁజేసెను. నాయన్న వాలి నీకుఁ గ్రొత్తగాదు. అతఁడు నిష్కారణంబుగా నన్నుఁదఱిమి నాభార్య నాక్రమించెను. ఆ యధర్మము కారణంబుగా రాముఁడొక్క కోల నతని వధించి తద్రాజ్యంబును నాకుఁ గట్టెను. అంతట సీతాన్వేషణార్థము వానరుల నెల్ల దిక్కులకుఁ బంపితిని. ఆమె లంకాపట్టణంబున నుండుట తెలియవచ్చెను. ఆమెను జూచుటకుగా హనుమంతుఁడు శతయోజనవిస్తీర్ణసాగరంబును దాఁటి లంకకువచ్చి యా పతివ్రతాతిలకంబును సందర్శించెను. రాక్షసేశ్వరా! నీవాఁడనిశాస్త్రంబులు గలుఁగవు; ధర్మస్వరూపంబును జక్కఁగా నెఱుంగుదువు. మీఁదుమిక్కిలి మహాతపశ్శాలివి. అట్టి నీవు పరదారను నీయింట నిరోధింపనగునా! భవాదృశులు ధర్మవిరుద్ధంబులును నపాయబహుళంబులును మూలఘాతుకంబులు నైన కర్మంబు లొనర్తురా! రాజనీతిని బట్టి గూడ నీచేఁత యుక్తముగాదు. ఎట్లనఁగా ? అధికునితోడి పోరుతగదు. రాముఁడేతన్మాత్రుఁడు గాఁడు.

వానికి నమస్కరించి సేవించుచున్నారి ముల్లోకంబుల గలువారు. వాని శత్రుండవు నీ
కుఁ దన్నిటో దేవాసురులకుఁగూడ సాధ్యుఁడుగాఁడు. అత్యహితంబు
మఱచి యుత్సాహముఁ గ్రొక్కినవాఁడు ధర్మనిహతుఁడై నశించుచు. లం
కేశ్వరా! వానరేంద్రుఁ డీసందేశంబును నీకుఁ బుత్తెంచెను. ఈ త్రికాలహిత
వాక్యంబులను పరిగ్రహించి సీతాదేవిని రామునకిచ్చి సమస్తసుఖభోగంబు
లను బడయుము. నావచ్చిన కార్యము తీరెను; శేషము రామాధీనము.
దశకంధరా! నీవు పంచవటీ పర్ణగిరి నాని వచ్చితివి గాని సీతాదేవినిఁ గాని
యింకను గ్రహింపమికిఁ జింతయయ్యెను. అత్యంతంబును విషసంయుక్తంబైన
యన్నంబును దిని మనిన మనుజుఁగాని సీతాదేవిని దక్కించుకొని మన
జాలఁడు. నీవు కఠోరతపంబొనర్చి దీర్ఘాయువు సార్జించితివి. దానికిఁ గీడు
గలిగింప వలదు. వరబలంబున నవధ్యుండనని తలంపకుము. నిగ్రహము నీ
జోలికి రాలేకుండునుగాక; అసురులు నీవలను జూడ నేరకుండుదురుగాక;
యక్షరాక్షసాదులకెల్ల నీ వజేయుండవే యగుదువు గాక. అంతమాత్రాన
విఱ్ఱవీఁగవలదు. నీవరము పరిచ్ఛిన్నముగాని సర్వావసరత్వ మైనదిగాదు.
సుగ్రీవుఁడు వానరుఁడు; రాముఁడు నరుఁడు; నరవానరులవలనఁ జావు రా
కుండునట్లు నీవువరము బడయలేదు. ఈసంగతి మఱువవలదు. ధర్మమెంత
యొనర్చినను దానివలన నధర్మంబు పరిహృతంబుగా నేరదు. నీధర్మఫలంబు
లెల్లభుక్తమై నశించెను. ఇఁక నధర్మఫలంబులు నిన్ను చైకొనచున్నవి.
అందువలననే నీకిట్టి బుద్ధి జనించెను. బాహుబలంబును నమ్మి చెడవలదు.
నీయట్టి వీరులను పదునాల్గువేలమంది నేకాకిగా నర్ధముహూర్తమున హత్య
మార్చిన రామునికడ నీసాములు సాగవు. వాలిశక్తి నెఱుంగుదువు. అట్టి
వాఁడుగూడ రామునకు నొక్కకోలకుఁ జాలఁడయ్యెను. రావణా! ఇఁక
యెల్లఁ బరామర్శించి హితమార్గంబవలంబింపుము. రావణా! నీవనఁగా నీ
బలిమనఁగా నెంతమాత్రమో గ్రహించితివా? మీయెల్లరకు నేనొక్క
రుండేఁజాలుదు. రాముఁడింతమాత్రము రాఁబనిలేదు. సీతాపహా
స్వయముగా వధింతునని యాయన బాసచేసెను. కావునఁ దత్ప్రతిజ్ఞాభంగము
గావింప నొల్లక మిన్నకుందును. రాక్షసేశ్వరా! సీతారూపకాలపాశంబు
నఱుక్కఁ దాల్పవలదు. ఆమె సర్వలంకావినాశినియైన కాళరాత్రిగా
గ్రహింపుము. నీనగరము సీతాతేజోవిదగ్ధంబును రామక్రోధానలదగ్ధ

భూతంబును గాకమున్నె మేలుకొనుము. సర్వరాక్షసవినాశంబునకుఁ గార
కుఁడవు గావలదు. రామప్రతాపంబు నెఱుంగుదుఁగావునను దూతనై
వచ్చితిని గావునను దెలిసినంత హితంబు గఱపుట నాకుఁ గర్తవ్యమయ్యెను.
వానరుండను గావున మీయిరువురకు మధ్యస్థము వహించి నిష్పాక్షికముగాఁ
దోఁచినది చెప్పితిని. నామాట వినుము. రాముఁడు పంచభూతాత్మక
చరాచర సమస్తలోకసృష్టిస్థితిసంహారకుఁడనియు విష్ణుపరాక్రమశాలియని
యు, వానితో విగ్రహించి బ్రతుకనోర్చుప్రాణి గరుడోరగసిద్ధవిద్యాధరు
లందుఁగాని, మఱియేభూతంబులందుఁగాని, నేకాలంబునను గలుగదనియు
స్పష్టముగా నెఱుంగుము. అట్టివానికి విప్రియంబొనర్చిన నీకుఁ బ్రాణము
దక్కునా? చతురాస్యుఁడడ్డుపడుఁగాక; ముక్కంటి తోడగుఁగాక;
వేయికన్నులవేల్పు వచ్చుఁగాక, ఎవరు వచ్చినను రామవధ్యుని రక్షింప
నోప' రని సమీరితంబుగాఁ బలికెను.

### విభీషణోపదేశము.

సామీరికి రావణుఁడు మండిపడి 'ఈకోఁతిని రూపుమాపు' మనెను;
ఆమాటకు విభీషణుఁడు కడుంగడు నొచ్చి 'లంకేశ్వరా! కోపము మాని
నీతమ్మునిమాట నవధరింపుము. దూతను జంపరాదు. రాజాజ్ఞ ధర్మబాహ్యం
బును లోకగర్హితంబునగునేనిఁ జేటుతప్పక వచ్చును. నీవెఱుంగనిధర్మము
గలదా? రాజధర్మవిశారదులును బరావరజ్ఞులును బరమార్థవేత్తలునైన పండి
తులు నీయట్టివారు కోపవశులగుదురేని శాస్త్రాభ్యాసమెల్ల వట్టిశ్రమయగును
గదా. రాక్షసేశ్వరా! ప్రసన్నుఁడవై యుక్తాయుక్తములు నిశ్చయించి
దూత దండ్యుఁడేని యథార్హశిక్షను విధింపు' మనెను. రావణుఁడు తమ్మునిఁ
జూచి 'విభీషణా! పాపాత్ములను వధించుట పాపముగాదు. ఈవానరుఁడు
పాపిష్ఠుఁడు వధార్హుఁడ' నెను. బుద్ధిమతాంవరిష్ఠుఁడవ్విభీషణుఁడామాట
యధర్మమూలంబును బహుదోషయుక్తము ననార్యజుష్టంబునగుటఁ గాంచి
'లంకేశ్వరా; ఆగ్రహమువలదు. దూతలెట్టివారైనను వధ్యులుగారని
పెద్దలు వచింతురు. అతఁడకార్యంబొనర్చుఁగాక; అప్రియంబాడుఁగాక
ఏమిచేసినను దూతను వధింపరాదు. వానిని శిక్షింపఁ దలంతువేని మా
ర్గాంతరములు గలవు. వానికి నంగవికారమొనర్చుటో, వానినిఁ గొఱ
డా వ్రేటుపాలుచేసి పురము వెడలఁగొట్టించుటో తగును. అదియుఁగాదేని

తలగొఱిగించిరో వెన్నునముద్ర వైచియో వానిని తఱుమనగును. ఏశాస్త్రము గాని దూతవధ నంగీకరింపదు. ధర్మవాదంబునను లోకవృత్తంబునను శాస్త్ర విచారంబునను బుద్ధిగ్రహణంబునను నద్వితీయుండవై సురాసుర పూజలందు చుండు మహామహిమోన్నతుండ వీవే యిట్లాచరింపఁదగునా? శాస్త్రచర్చ యటుండనిమ్ము. ఇతనిఁ జంపిన మనకగు లాభ మేమి? చంపఁదలంచినచో నితనిని బంపినవానిని జంపనగును. సాధువో యసాధువో దూత పరప్రేషితుఁడై వచ్చును; చెప్పుమన్నమాటలు పలుకును. అట్లుచేయని నాఁడతండు దోషియగును. ఈసంగతి తెలిసియు మనమిట్లు వర్తింపనగునా? నేఁడితని వధింతుమేని రేపుమనకు దూతగా నెవండు చనును? రణశౌండీరా! నీవైరులు రామలక్ష్మణులుగాని యితఁడు గాఁడు. వారిని దెమల్చినగాని నీభుజకండూతి పాయదు. వారు రావలయునన్న నితఁడుపోయి సంగతి యెల్ల వారికిఁ దెలుపవలయును. ఆకారణంబునఁగూడ నితని విడిచిపుచ్చఁ దగియున్నది. ఆశతుల నెల్లని నిఁదురప్పించి నీమగంటిమి నెఱపి దిగంత విశ్రాంతకీర్తిని బరిగ్రహింపుము. మిడుతమీఁద బ్రహ్మాస్త్రము కూడదు. నీ కోర్కె తీర్చుకయ్యము రానున్నది. వీరులట్టి రణంబును వరింతురు. ఆపని సేయుము. ఈ యలఁతికోతిని ముట్టవలద'ని ధర్మార్థయుక్తియుక్తముగాఁ జెప్పెను. రావణుఁ డామాటలు గారవించి 'తమ్ముఁడా! నీ చెప్పినట్లు చేయుదము. కోఁతులకుఁ దోఁక పరమభూషణంబు. వాలమును గాల్చి యితనిఁ దఱిమివేయుదము. ఇతనియంగవికృతి వానిమిత్రులకు హెచ్చరిక యగుఁగాక' యని పలికి కింకరులను బిలిచి 'ఈకోఁతిరాయని తోఁకకు నిప్పుపెట్టి యామంటలతోడ నితనిని బుష్పరథంబుమీఁద నూరేగింపు' మని యాజ్ఞాపించెను.

## లంకాదహనము.

ఆమాటతోడ రక్కసులు హనుమంతుని మూఁగి నూనెలోఁ దడిపిన చిఁపిరిగుడ్డలు వానితోఁకకు చుట్టి నిప్పు ముట్టించిరి. ఆవింత చూచుటకై రాక్షసు లాబాలవృద్ధము కూడిరి. వాయుపుత్రుఁ డయ్యవమానంబును రామకార్యార్థము సహించి రాక్షసకృత్యములెల్ల నోర్చియుండెను. వారట్లు గావించి మారుతుని బుష్పరథంబుపయి నెక్కించి శంఖంబులు పూరించుచు భేరులు మ్రోయించుచు సింహనాదంబులు గావించుచు భుజంబులు తట్టుచుఁ బలువిధంబులఁ బ్రేలుచు వానిని బురమెల్లఁ ద్రిప్పిరి.

అటు సీతాదేవి యాసంగతిని రాక్షసాంగనలవలన విని మహాచింతా క్రాంతయై,

మ. పతిసేవాపరతంత్ర నేని వ్రతసంబద్ధాత్మ నేనిం దప
స్స్థిత నేనిం బరిశుద్ధ నేని విభుదాక్షిణ్యానురాగాశ్రయో
న్నత నేనిన్ సిరిచోతు నేనియు స్వధానాథుండు తాఁజల్లనై
మతిమంతున్ హనుమంతుఁగావుతను నస్మత్ప్రార్థనాప్రీతుఁడై॥

యని వైశ్వానరు నుపాసించెను. వాలము భగభగమండుచున్నను వేడిమి గాని బాధగాని మారుతికి గలుగదయ్యెను. సామీరి యాచిత్రముఁబరికించి 'అహో! ఇదంతయు రామమహిమగాని యొండుగా' దని నిశ్చయించి సోఁకుఘూఁకరుఁ దగు ప్రతీకారంబొనర్చువాఁడై యయ్యరదంబునుండి యెగచి లంకాపట్టణంబెల్ల దహింపసాగెను; మంటలు నింగి ముట్టెను. బురుజులు ఢెళ ఢెళధ్వనులతోఁ గూలెను; సౌధంబులు చదరమయ్యెను. ప్రాసాదాంతరస్థలైన స్త్రీలును శిశువులును గన్నులు గమరి సెగలకుఁ దాళ లేక మహాదీనారావంబులు గావించిరి. కొందఱు నిలువునగాలుచుఁ బైడి కంబములు గాదోఁచిరి. కొందఱు కీలలఁ జిక్కి మాఁడి చచ్చిరి. జ్వాలలు నాలుకలు చాచి గాలికిఁ బ్రాఁకసాగెను. మంటలొకచోటఁ గుంకుమ వర్ణంబుగా, నొకచోటఁ గింశుకవర్ణంబుగా, నింకొకచోట నీలవర్ణంబుగాఁ బ్రజ్వరిల్లెను. క్షణములో లంకయెల్ల వికృతాకారము దాల్చెను.

సీతాదేవి యట్లు వైశ్వానరు ధ్యానించుచు దీనయై యుండుటసురమ యను రాక్షసాంగన గాంచి యామెకు లంకాదహనవృత్తాంతమెల్ల వినిపించి 'దేవీ! హనుమంతునకుగా దిగులు వలదు. ఆమేటికి గోరంతయు నెగ్గు గలుగ' దని పలికెను. ఆయుపలాలనంబుల వైదేహి సుంత స్వస్థచిత్త యయ్యెను.

హనుమంతుఁ డట్లు విజృంభించి ప్రహస్తునియిల్లు కాల్చి మహా పార్శ్వుని గృహంబునకు నిప్పువెట్టి వజ్రదంష్ట్రునిలోగిలి దహించి శుకుని సౌధంబునకు నగ్గిదరికొల్పి సారణుని యావాసంబును దగులవెట్టి యింద్ర జిత్తునిమేడ నీఱుగావించి జంబుమాలినివేశంబును సుమాలిగీమును రశ్మికేతుప్ర

భవనంబును సూర్యశత్రుని యాలయంబును హ్రస్వకర్ణ వజ్రదంష్ట్రుల ప్రాసాదంబులను లోమశుని సద్మంబును యుద్ధోన్మత్తుని వేశ్మంబును మత్తుని మందిరంబును ధ్వజగ్రీవుని నగళ్లను విద్యుజ్జిహ్వుని నికేతనంబు హస్తిముఖ కరాళ పిశాచ శోణితాక్ష కుంభనికుంభకుంభకర్ణాదుల హర్మ్యంబులను బూది గావించి నానారత్నవిభూషితంబును మేరుమందరసంకాశంబును సర్వమంగళ శోభితంబును నైన రావణాంతఃపురంబున నగ్ని జొనిపి ప్రళయకాలమేఘగర్జాసంకాశసింహనాదం బొనర్చెను. రావణునకు నోడి యందాఁక తలయొగ్గి యతనిఁ బరిచరించుచుండిన యగ్నియు వాయువు నప్పుడు దేవతేజోవృద్ధికి నదనగుట గ్రహించి యొండొరుఁ దోడ్పడిరి. వాయువు వీతిహోత్రుని గృహగృహాంతరములకుఁ గొనిపోయెను. మేడలు కాలి పుణ్యక్షయంబున మింటనుండి రాలు సిద్ధవిమానంబులవలెఁ గూలెను. గగనాంతరమునుండి పడు మెఱుంగులోయన స్త్రీలు విశీర్ణ కేశజాలంబులతో హర్మ్యపరతలంబులనుండి క్రిందఁ బడసాగిరి. కాలరుద్రుఁడని కొందఱును, యముండని కొందఱును, రాక్షసవినాశార్థము రూపుదాల్చిన పరమేష్ఠి ప్రచండాగ్రహంబని కొందఱును రక్షోవిధ్వంసనార్థమై యనంతావ్యక్తాచింత్యాద్వితీయవైష్ణవతేజంబు స్వమాయాకల్పితవానరరూపంబున వచ్చెనని కొందఱును దలకొకరీతి చెప్పఁ జొచ్చిరి. దేవగంధర్వసిద్ధవిద్యాధరులు వివిధగతుల మారుతుని నుగ్గడించిరి. విభీషణుని మందిరముతక్క లంకానగరం బెల్ల దగ్ధమయ్యెను.

### హనుమంతుఁడు సీతాదేవికై విచారపడుట.

హనుమంతుఁడట్లు మహోగ్రమూర్తియై లంకాపురం బెల్లఁ దగులం బెట్టి మున్నీటి నీట వాలాగ్నులఁ జల్లార్చి మరలివచ్చి పురమెల్ల దగ్ధమగుట గాంచి మహాభయగ్రస్తుఁడై 'అయ్యో! కోపవివశంబును మహాప్రమాదం బొనర్చితిని. కోపము సర్వపాపంబులకు మూలంబు; అది గురుహత్యకు వెనుదీయదు. సాధుతిరస్కారమునకు జంకదు. వాచ్యావాచ్యంబు లెఱుంగదు; కార్యాకార్యంబులు గణుతింపదు. సర్పము కుబుసంబునట్లెవ్వాఁడు కోపంబును క్షమాబలంబున నిరసించునో యతఁడొక్కఁడే పురుషుండగును. ఒడలుమఱచి యింత యొనర్చితిని. దేవి కెగ్గుకల్గెనేమో తెలియదు. అట్లగునేని నా శ్రమయెల్ల వ్యర్థంబగును. మాయెల్లరి సర్వారంభములకు మూలభూతమైన సీతాదేవి

చన్నచో నింకమాకుఁ జేయఁదగిన కార్యమేమిగలదు? నాభయము నిజమగు నేని నగ్నికి నాహుతియగుటో బడబాముఖము దూఱుటో మున్నీటి జంతువుల క్షుధాగ్నిఁ దీర్చుటో నాకు మేలగును. ఈజీవమేల? కటా! కార్యవిఘాతకుఁడనై సుగ్రీవుని జూచుటెట్లు? ఏమొగముతో రామలక్ష్మణులను డాయనోర్తు? క్రోఁతిచేఁతలను మాటకు నూటిగా నటించితిని. హా! రజోగుణమా! నీవనవస్థితంబు ననీశంబునగుట నేఁడు స్పష్టమయ్యెను. తగులంబడుదువుగాక. నీకారణంబున మహాపతివ్రతామణి సీతాదేవియు నామెతోడ రామలక్ష్మణులును వారివెంట సుగ్రీవాదులును నశించుటయ్యెను. కటా! ఎంతకుఁ దెచ్చితి' నని పరిపరివిధంబులఁ బరితపింపసాగెను.

హనుమంతుఁడు సీతాదేవిని మరల సందర్శించి వీడ్కొనుట.

అంతలోన శుభనిమిత్తములు కొన్ని దోఁచెను. హనుమంతుఁ డవి చూచి 'ఎంతవెఱ్ఱి! నిప్పును నిప్పు దహించునా? ఆత్మతేజోభిరక్షితయై యుండు సీతాదేవిని రామపత్నిని బతివ్రతామణిని వీతిహోత్రుఁడు మాత్రము చెనకనోపునా? అగ్ని సర్వదాహకుఁడయ్యు రామప్రభావంబునను దేవీపుణ్యాతిశయంబునను నన్నే యింత చల్లచూపు చూచినప్పుడు భూసుతావిషయంబున వేఱువర్తింపఁ' డని తలపోయుచుండఁగా సీతాదేవి సురక్షితగా నున్నదని గగనస్థితచారణాదుల వచనంబులు చెవిఁబడెను. హనుమంతుఁడు పరమానందమొంది యామెను మగుడ సందర్శించి తల్లీ! నీవు క్షేమముగా నుండుట నాభాగ్యవిశేషంబని' పలికి నమస్కరించి యనుజ్ఞవడసి రామదర్శనోత్సుకుఁడై యరిష్టపర్వతం బారోహించెను.

అరిష్టపర్వతము.

ఆకొండలరాయఁడు వనరాజి యనెడి పీతాంబరంబుఁ గట్టి శిఖాగ్రలంబమాన మేఘమాలాపరిధానంబును సంతరించి నిర్ఝరిణీధ్వానవేదాధ్యయనం బొనర్చుచు నిష్ఠాగరిష్ఠుండై సెలయేటిగుయతంబులనెడు సంగీతంబులకును గీచకనాదంబులనెడు వేణుగానంబులకును గలంగక మహోన్నత దేవదారువృక్షబాహువులెత్తి ఘోరతపోవ్రతంబుపూనియున్న పరమమునీంద్రునివలె నొప్పారుచుండెను. నగాధిపతిగావున నతండు మారుతి పాదస్పర్శంబునకు గనలి రోయనఁ బన్నగోచ్ఛ్వాసరూపంబున నిట్టూర్చుచు శిఖోపరితలవారిద

మాలారూపజృంభణబాష్పంబు లొనర్పసాగెను. హనుమంతుఁ డప్పర్వతాగ్రంబున నిలిచి రామసందర్శనోత్సాహియై మేను పెంచి సాగరోత్తరదార్థము నింగికెగచెను. వానియూపువడికి శిరలు చూర్ణమయ్యెను. వృక్షంబులు వజ్రహతంబులువోలెఁ గూలెను; కందరస్థసింహంబులు మిన్నులు వ్రీ మీఁదఁ బడుచున్నవోయని భయభ్రాంతములై పెల్లు గర్జించెను; విద్యాధరాంగనలు క్రీడలు చాలించి జాఱుపయ్యెదలతో వ్రేలాడు నాభరణంబులతోఁ జడలరుఁ బ్రాకిరి. దశయోజనవిస్తారమును ద్రింశద్యోజనోన్నతంబు నైన యాశైలంబు నేలపాటుగాంచెను. మారుతి యట్లు గగనంబునకు నుద్గమించి చంద్రకుముదమనోహరంబును సూర్యకారండవశోభావహంబును బుధశ్రవణనక్షత్రకలహంసవిరాజితంబును నభ్రశైవాలశ్యామలంబును బునర్వసు మహామీనకలితంబును నంగారకభూరిమకరాకులంబును నైరావత మహాద్వీపయుతంబును నై నునుగాలికిఁ జలించుచున్న శశికిరణంబు లనెడి శిశిరాంబువులు గలిగి భుజంగ యక్షగంధర్వప్రబుద్ధకమలోత్పలమై యున్న నంతరిక్ష మహాసాగరంబును బెనునావవలెఁ దరింపఁ జొచ్చెను. అట్లు సపక్షపర్వతంబువలె మహావేగంబున వచ్చుచున్నవానిని జూచి పెనుభూతంబు మ్రింగ వచ్చుచున్నదోయని వెఱచి సూర్యుఁడు తిరోహితుండయ్యెను; చంద్రుఁడు మేఘాంతరముల డాఁగి తొంగి తొంగి చూడసాగెను. చుక్కలయదుఱుపాటు వానిమినుకులు సూచించుచుండెను.

### అంగదాది సమాగమము.

హనుమంతుఁడు శరవేగంబునఁ బఱచి మైనాకంబును దాఁటి మహేంద్రంబును డాయవచ్చి రవిమండలవిస్ఫోటముగా నార్చెను. అచ్చట గుమిగూడి మారుతిరాకకుఁ దహతహపడుచు నిలువెల్లఁ గన్నులుగాఁ జూచుచుఁ బ్రాణంబులఱచేత నిడుకొనియుండిన యంగదాదు లాగర్జనంబు దవ్వున విని హనుమంతుని కంఠధ్వనియని గుఱితించి యాసలు క్రేళ్ళుదాఁటు మును గాళ్లనుండిరి. జాంబవంతుఁడు ప్రీతసంహృష్టమానసుండై 'కపీంద్రులారా! మనహనుమ కృతకృత్యుండై వచ్చుచున్నాఁడు. ఆసంగతి వానికంఠధ్వని వలననే స్పష్టమగుచున్నదనెను. వానరులు సంతోషాతిశయంబున గంతులు వేయుచు వృక్షంబులెక్కి కొందఱును, పర్వతశిఖరంబారోహించి కొందఱును, జేరుమాలలు విసరుచు గొందఱును, జిఱుకొమ్మలువిఱిచి యాడించుచు

ందఱు నుండిరి. అంతలోన హనుమంతుఁడు దృష్టిగోచరుఁడయ్యెను. నరులు చేమోడ్పులొనర్చి వానిని సంభావించిరి. మారుతి పర్వతాగ్ర మున వ్రాలి తోడి వానరులిచ్చిన ఫలమూలాద్యుపాయనపూర్వకపూజలంది బవదాదివృద్ధులకు మ్రొక్కి,

ఉ॥ చూచితిఁజూచితిన్ జనకసూనఁ ద్రిలోకశుభస్కరన్ యశ
శ్శ్రీచరితన్ రమాప్రతిమ సీతను రామునిజీవితేశ్వరిన్
నీచులురక్కసుల్ బలసినిర్దయులై యిడునట్టిబాములన్
సైచుచు లంకలోఁ జివికి చాఁగసైన పతివ్రతామణిన్ ॥

అని సీతాదేవీ వృత్తాంతంబును దనచరిత్రను సంగ్రహముగాఁజెప్పి ంగదునిఁ గవుంగిలించుకొనెను. అమృతముఁబోని యావచనంబులను వానరులు కర్ణపుటంబులఁ గ్రోలి మైమఱచి యార్చుచుఁ గిలారించుచు దుము చు వాలములు విసరుచుఁ బలుపోకలనుండిరి. అంగదుఁడు హనుమంతుని ంభావించి 'వానరోత్తమా! మాప్రాణంబులను గాచితివి ; నీవలనఁ గృతా ర్థులమైతిమి. నీరాజభక్తియు నీధైర్యపరాక్రమంబులును లోకాతీతములు. రామునకు సంతోషముఁగూర్ప నోచిన నీపుణ్యం బింతనరాదు. నీపేరు కలకాలము వెలయును. సీతాదేవి యెట్లున్నది ? ఏమిచెప్పెను ? ఆమె వృత్తాంతము విన నువ్విళ్ళూరుచు' ననెను. నావుడు 'యువరాజచంద్రమా! మహేంద్రగిరినుండి నాపోవుట మీరు చూచితిరి. అట్లు పోవుచుండఁగా మార్గమధ్యంబున మహాపర్వతంబొండు మున్నీటనుండి తటాలునఁబెఱిగి నన్ను విరోధించెను. వానిగర్వంబు రామకార్యార్థినైన నాకు మహాకోపముఁ గలి గించెను. ఆనగంబును బుగ్గాడిచేయఁ దలఁచి నావాలంబునఁ బ్రార్చితిని. అంతలోన నప్పర్వతేంద్రుఁడు నాతలంపు గ్రహించి 'వత్సా ! నీతండ్రి వాయుదేవుఁడు నాకుఁ జిరమిత్రము. నాపేరు మైనాకుఁడు. తొల్లి పర్వ తంబులకు ఱెక్కలుండెను. ఆకారణంబున నవి భూమండలంబెల్లఁ గ్రుమ్మరుచు సమస్తభూతంబులకు బాధకరములయ్యెను. అందులకు నింద్రుఁడు కనలి లోకోపకారార్థము నగంబుల ఱెక్కలను వజ్రంబుచేత ఖండింప సాగెను. ఒకనాఁడు నావంతు వచ్చెను. అప్పుడు నీతండ్రి వాయుదేవుఁడు నన్నుఁ గనికరించి వీచి సముద్రాంతరమునవైచి కాపాడెను.

ఉపకారికిఁ బ్రత్యుపకారంబొనర్చుట సజ్జనసంప్రదాయము. వాయుదేవునకు నాయొనర్చఁదగిన ప్రత్యుపకారము గలుగదు. మఱియు నమ్మహానుభావునకు యథాశక్తి నాకృతజ్ఞతను జూపునవసరము నేఁటి దనుక నాకుఁ బ్రాపింపదయ్యెను. నాభాగ్యవశంబుననో యన నంతటివాఁడవు నీవు తదీయాత్మజుండవు నేఁడు గానవచ్చితివి. నిన్ను సత్కరించి నాకృతజ్ఞతాఋణముఁ దీర్చికొనదలంచితిని. నిన్ను సన్మానించుటకుఁ గారణాంతరము గూడఁ గలదు. శ్రీమహావిష్ణువు దుష్టశిక్షణ శిష్టరక్షణార్థము దేవర్షిగణ ప్రార్థితుఁడై లీలామానుషవిగ్రహము ధరించి రామరూపంబున జనించెను. అట్టిమహనీయుని కార్యార్థము చనుచున్నావు. రామదూతవునీకుఁ జేయరాని సత్కృతులుండునే ?' యనెను. మైనాకునిసౌహార్దము నెంతయు మెచ్చి నాకార్యత్వరను వానికిఁ దెలిపి తదనుమతిఁబడసి యురువడించి మఱి కొంతదూరమేగితిని. అప్పుడు నాగమాత సురస యనుపేరిది నన్నడ్డగించి 'హరిసత్తమా ! ఆఁకలి దుర్భరముగానున్నది. దేవతలు నిన్ను నాకు నాహారంబుగా నిచ్చిరి. బహుకాలమునకు నాయభీష్టము సిద్ధించెను. ఇదిగో నిన్ను మ్రింగి యాఁకటిచిచ్చఁ దీర్చుకొందు' నని నోరప్పళించెను. ఆయంతరాయమునకు నెంతయు విషణ్ణవదనుండనై పరాక్రమంబునకుఁ దడవుగాదని తలంచి కయిమోడ్చి 'దేవీ ! నావిన్నపము నన్నింపుము. దశరథసుతుఁడు రాముడు భార్యాసోదరయుతుఁడై దండకారణ్యంబుననుండఁగా వానియిల్లాలిని సీతాదేవిని దురాత్ముఁడు రావణుఁ డపహరించెను. ఆమె యెందున్నది తెలియరాదు. రాముని పంపున నామెను వెదకఁ బోవుచున్నాను. పతివ్రతాన్వేషినై పోవుదు గావున నాసేత స్త్రీమాత్రురాలికి నీకును నెంతో యాదరణీయము గావలయును; అదియునుగాక నాయట్లు నీవును రామరాజ్యంబున వసింతువు. రాజకార్యంబెల్లరకు సమాదరణీయము. ఈధర్మంబులను పాటించి నాకు మార్గము వదలుము. కాదందువేని నేనుపోయి వచ్చునందాఁక నిదానింపుము. నేను మరలివచ్చి నీకోర్కెఁ దీర్తు' నని వినయముతోఁ జెప్పితిని. అభూతము నాప్రణయంబు నొప్పరికించి 'నాచేయి చిక్కినవాఁడు నన్నుమించిపోఁజాలఁడు. ఈ వరమును నాకు బ్రసాదించిరి. ఆఁకలి పెల్లిదముగానున్న' దని పలికెను. ఆసురస పదియోజనముల యెత్తుండెను. అదియెట్లు మ్రింగునో చూతునుగాకయని నేను పదునైదు యోజన

ముల పొడవు పెరిగితిని. అది నన్ను మ్రింగ నోరువిచ్చెను. అంత నేను అప్పపాటుకాలములో నంగుళమాత్ర ప్రమాణుండనై దానినోరు చొచ్చి మరల వెడలివచ్చితిని. సురస యంతట స్వరూపముఁ దాల్చి 'సౌమ్యా! అర్థసిద్ధి నీకగుగాక ; యథాసుఖము పోయిరమ్ము ; నీకెంతయుఁ బ్రీతనైతి' నని వచించి దారియిచ్చెను. భూతంబులు సాధువాక్యంబుల నన్నుఁ బ్రశంసించెను. అంత నేను గమనోన్ముఖుండనై రెట్టించిన వేగముతోఁ బఱవ సాగితిని. అట్లు పోవుచుండఁగా నొకచోట నా వేగము తటాలున నాగెను. ఏదో నన్నాకర్షించినట్లుతోఁచెను. సంగతి యేమని నలువలంకులు పరికించితిని. ఎందు నేవియుఁ గానరాదు. కారణంబూహింపజాలకయుఁ గదలనేరకయు విఘ్నంబయ్యెననియు దుఃఖించుచుఁ దలవాల్చి క్రిందివంకఁ జూచితిని. సముద్రజలంబులందు పెనుభూతంబొండు భీమాకారముగలది కానవచ్చెను. ఆభూతంబెలుగెత్తి 'మహాకాయా! ఎందుఁబోయెదవు? ఆఁకలిగొని యున్నదాన ; బహుకాలముగా నాహారము దొరకదు. నాకుఁ దృప్తి గావింపు' మని భీకరంబుగా నఱచెను. అప్పుడు నాకు సుగ్రీవుని హెచ్చరిక జ్ఞప్తికి వచ్చి యది ఛాయాగ్రాహి కానోపునని యూహించి 'భూతమా! నీయిచ్చ సేయు' మని తనువును బెంచితిని. అది నిజవదన గహ్వరంబును మఱిమఱి విచ్చెను. నేను తటాలునఁ జిఱుత రూపముఁ దాల్చి దానికడుపుసొచ్చి నఖాగ్రంబుల దానియురంబు వ్రచ్చి గగనంబునకు నుద్గమించితిని. అది గుండియలు వ్రీలి చచ్చెను. ఆకాశచరులు సిద్ధ చారణులు నన్ను మెచ్చి 'అహా! ఛాయాగ్రాహి సింహిక రూపుమాసెను. నేఁడు సుత మన ప్రచారంబులకు నిరోధములేలంగ' నని పలికిరి. వారి వచనంబులవలన తద్భూతము నాతలఁచినట్లు సింహికయను పేరి ఛాయాగ్రాహి యగుట గ్రహించి పయనంబును సాగించి మునుమునుచీఁకట్లు క్రమ్మువేళకు లంకాపురముఁజేరి యందు కాలూనితిని. అంతలోనఁ గల్పాంతఘనసన్నిభయైనరక్కసియొర్తు బొబ్బరించుచు నాపైకినురికెను. మండుచున్నయగ్నింబోని శిరోజంబులతో భయాకారయై యున్నదానిని డాకేలుపిడికిట మర్దించితిని. అదియార్తేటునకు నోలమాసగొని 'వీరాగ్రణీ! నన్ను లంకయందురు. రావణాధిష్ఠితనై లంకానగరంబునకుఁ గావుదల యుందును. నన్ను నిర్జించితివిగావున రాక్షసజయశ్రీ నిన్ను వరించెను' అని పలికి తొలఁగి చనెను.

అంత నేను చిఱుకోఁతినై లంకానగరముఁ జొచ్చి యెల్లకడలు వెదకి వెదకి వేసారి యెందును సీతాదేవిని గానక యపారశోకసాగరంబున మునిఁగితిని. నాఁటి నామనోవ్యాకులతఁ బిట్లని చెప్పఁదరముగాదు. కొంతవడి కట్లు ఖిన్నుండనై యుండి తలయెత్తి యెదుటఁ జూడఁగా తత్సమీపంబునఁ గాంచనమయ ప్రాకారము గానవచ్చెను. అటకుఁబోయి ప్రాకారమెక్కితిని. దాని లోపల బహుపాదపవనంబొండుండెను. నేనావనంబుఁ జొచ్చి యందున్న మహోన్నతశింశుపావృక్ష మెక్కితిని. అవ్వృక్షంబునకుఁ జేరువగాఁ గాంచన కదళీవనముగలదు. తత్సమీపంబున నశోకవృక్షమొకటి యున్నది. దాని నీడ నొకానొక స్త్రీ కడుమాసినచీరఁగట్టి మూర్తీభవించిన శోకమోయనఁ జూపట్టుచు ధ్యానగతయై యుండెను. హరిణకంబును బెబ్బులులట్లామెను రాక్షసస్త్రీలు చుట్టి బెదరించుచుండిరి. ఆమెయే సీతాదేవి గానుండునా యని తదీయలక్షణంబులను బరీక్షించుచు నదేకమతినై యుంటిని. అట్లున్న నన్నుఁ దటాలునఁ గాంచీనూపురధ్వనులు కలంచెను. సంగతియేమో యని యావంకఁ జూడఁగా రాక్షసవర్గము మహాపరిభవముతో నావలను వచ్చుట కానవచ్చెను. నేను మిగుల నుద్విగ్నుండనై నారూపంబును మఱి మఱి గుదియించి చిఱుపక్షివలె నాకులలో దాఁగితిని. కొంతవడికి రావణుఁడు భార్యలతోడను బరివారముతోడ నటకు వచ్చెను. అతఁడట్లయ్యశోకవృక్షము డాయవచ్చినంత నే నందున్న నాతిమణి తొడలుముడిచి యురోజంబులను హస్తంబులతోఁ గప్పి గడగడవడఁకుచు మృత్యువుఁగన్న జీవివలె నయ్యెను. ఆమెనుంజూచి నాకు గుండెలు నీరయ్యెను. అంతలోన రావణుఁడు చేరవచ్చి తలతోఁ మ్రొక్కి 'సీతా! నామాటవినుము; నన్నుఁ ద్రోయవలదు. నావలపుఁ దీర్పవేని నీవు మనుట కల్ల. ఇంతకాలమోర్చితిని; ఎన్నాళ్ళకు నీమనస్సు గఱుగదు. ఇఁక రెండునెలలు గడువిత్తును. అప్పటికిని నీవు లోనుగావేని నీరుధిరంబులు రక్కసులు వెచ్చవెచ్చగాఁ ద్రావుదు'రనెను. ఆమాటలేమని చెప్పుదు? ఆమె కోపగన్నిరీక్షయై 'దురాత్మా! దశరథనరేంద్రుని కోడలిని రామునికూర్మి పత్నిని నన్నిట్లు దుర్భాషలాడు నీనాలుక త్రెళ్లదా? దుష్టా! నాపతిని వీరశిఖామణిని గనుబ్రామి దొంగవై నన్నుఁ దెచ్చితివి. నీమగంటిమిఁ బొగడనేల? నారాముఁడు నీకుసాటిగాఁడని ప్రేలుదువు. ఆమహానీ

యుని పాదదాస్యంబునకేని నీవు తగుదువా ? ఇంతటనేని వానికి శరణిల్లుము. ఆదయానిధి నిన్ను రక్షించును' అని రోషకషాయస్వరంబున నుడివెను. ఆమాట లిప్పుడును నాకర్ణరంధ్రంబులఁ బ్రతిధ్వను లీనుచున్నవి. రావణుఁడు చితిహుతాశనుకైవడి మండిపడుచు నామెను బిడికిటఁబొడిచి చంపనుంకించెను. అంతలోన వానిభార్యలలో నొకతె ధాన్యమాలిని యను పేరిది యడ్డుపడి యచ్చికబిచ్చికంబుల నతని కోపంబును జల్లార్చి వానినింటికిఁ గొనిపోయెను. సీతాదేవికిఁ గాపున్న రాక్షసాంగన లామెను బహుభంగులు గర్జనతర్జనంబుల గాఱించి సొలసి నిద్రావశలైరి. ఆమె నిజదురవస్థకు వెసివి ప్రాణపరిత్యాగంబునకు సమకట్టి యాపాదము వ్రేలాడుచున్న కేశపాశంబు నురిత్రాడుగా సంతరించి దారుణక్రియకు నుద్యమించెను. అత్తఱి త్రిజటయను రక్కసి మేల్కాంచి తాఁగన్న స్వప్నవృత్తాంతము జెప్పి రామునకు జయంబును రాక్షసకులంబునకు వినాశంబును దప్పదనియు రామబాణంబుల బారినుండి రక్కసులను రక్షింప సీతాదేవితప్ప యొరులు గలుగరనియు వైదేహిని మెప్పించి రానున్న ముప్పును రాక్షసులు తప్పించుకొనుట యుక్తమనియు సీతాదేవి యచిరకాలముననే నిజపతిని గూడనున్నదనియుఁ దెలిపెను. సీతాదేవి కొంతయూఱట గాంచి నిజోద్యమంబును సడలించి 'త్రిజటా! నీస్వప్నము సత్యమగునేని నీకు మేలొనర్తు' ననెను.

సీతాదేవిని గాంచిన సంతోషంబెల్ల నామె తలపెట్టిన దారుణోద్యమంబును జూచినంతనే యెట్లోపోయి నాప్రాణంబు లెగయసాగెను. ఏమి చేయుటకుఁ దోఁపకుండెను. త్రిజటాస్వప్నవృత్తాంతంబున నామె సుంత నెమ్మదివహించెనుగాని తదీయాంతరంగంబున దుఃఖాగ్ని మాత్రము చల్లారకుండెను. ఆసంగతి యామె నిట్టూర్పు పొగసెగలవలన నూహించి తడవు సేయక యామె నూరార్పఁదలంచి వెఱపుదోఁపక కొంతవడి చింతించి యిక్ష్వాకువంశంబునభివర్ణించి రాముని స్తుతించితిని. ఆమె యదివిని వెఱగంది నావంకఁ జూచి నాపుట్టుపూర్వంబులు విచారించెను. నాకతయెల్ల విన్నవించి యానవాలుగా రామాంగుళీయకంబు నొసగిఁ తల్లీ ! అనుజ్ఞయేని రామలక్ష్మణులకడకుఁ గొనిపోవుదు' నంటిని. రాముని యుంగరమును జూచి యామె నన్ను విశ్వసించి 'వత్సా ! నీతలంపు తగదు. రాముఁడు స్వయముగా నన్నుగ్రహింపవలయును. ఒండుమార్గము భవ్యము

గాఁదనెను. అంత నేను మ్రొక్కి 'తల్లీ ! నావచ్చినందులకు గురుతుగా నేదేని యనుగ్రహింపు' మంటిని. ఆమె తన చూడామణిని దీసి నాచేత నుంచి మఱికొన్ని సంగతులు చెప్పెను. అంత నేను సీతాదేవికి మ్రొక్కి యనుజ్ఞవేడితిని. ఆమె కన్నీరు నించి 'నా గతి యిట్లయ్యెనని రామునకుఁ దెలుపు' మని గద్గదస్వనంబునఁ బలికెను. నేనంతట నామెను వీడ్కొని నారాక రాక్షసులకుఁ దెలుపుటకును రావణునితోడ సంభాషించు నవసరముగలిగించుకొనుటకును, దగునుపాయంబును చింతించి మేను పెంచి యశోకవనంబును బాడుచేసితిని. రాక్షసాంగనలు భీతలై చని రావణునకు సంగతి వినిచిరి. రాక్షసులు పెక్కురు నాపయి దాఁడివచ్చిరి. వారినెల్లఁ బరిమార్చితిని. అంతట జంబుమాలి యెత్తివచ్చెను. వానిని రూపుమాపితిని. మంత్రిపుత్త్రులేవురు సపరివారంబుగా దాఁకిరి. వారినెల్లఁ గూల్చితిని. సేనానాయకులుకొందఱు తలపడిరి ; వారిని హరించితిని. రావణుపుత్త్రుఁ డక్షకుమారుఁడు ఢీకొనెను. వాఁడు నుగ్గునూచమై నశించెను. తుట్టతుదకు నింద్రజిత్తువచ్చి దార్కొనెను. మా యిరువురకు గజకచ్ఛపముల పోరయ్యెను. అతఁడు నన్ను జయించు మార్గాంతరముఁ గానక నాపయి బ్రహ్మాస్త్రంబును బ్రయోగించెను. కార్యార్థము నేను దానికి బద్ధుండనైతిని. నన్నుఁ బట్టికట్టి రావణుకడకుఁ గొనిపోయిరి. నాతలంపు సమకూడెనని లోలోన సంతసించి నాయుదంతమెల్ల వానికిఁ దెలిపి సుగ్రీవునిమాటగా రావణా ! రామునకు నాకు మైత్రి యొదవెను. వానిపని నాతలపయినున్నది. నీవును మాకుఁ గ్రొత్తగాదు గావున మున్నుగా నాదూతను నీకడకుఁ బంపితిని. లంకానగరము సరాక్షసముగా నిర్మూలముగాక మున్నే సీతాదేవిని రామునకు నర్పించి మనుమార్గము వెదకికొనుము' అని వచించితిని. రాక్షసేశ్వరుఁడు కన్నులెఱ్ఱచేసి చుఱచుఱఁ జూక్కి నన్ను వధింప నాజ్ఞాపించెను. అంతలోన రావణుని తమ్ముఁడు విభీషణుండనువాఁ డయ్యధర్మవచనంబు నోర్వలేక తెంపుచేసి 'అన్నా ! దూతను వధింపరాదు. ఏలిక చెప్పిపంపినమాటలు దూతవచించును ; అట్లు చేయకున్న నతఁడు స్వామిద్రోహుఁడగును. దూతను శిక్షించుట యావసరమగునేని విరూపకరణశిక్షావిధానమును మాత్రము శాస్త్రమంగీకరించును. ధర్మబుద్ధి నాలోచింపు' మని వచించెను. రావణుఁ డామాటలు విని నిజ

మతేము నుజ్జగించి తోఁకఁగాల్చి నన్ను పంపుమనెను. రక్కసులు గుడ్డ పేలికలు తెచ్చి నానెలోముంచి నాతోఁకకుఁ జుట్టి రగిల్చిరి. నేను కోప వశుండనై బంధములు త్రెంచివైచి చెలరేఁగి లంకానగరమెల్ల దహించి నా వాలార్చులను సముద్రజలంబులఁ జల్లార్చితిని. ఆగ్రహంబునఁజేసి యప్పుడు నాకు నొండుతలంపు జనింపకున్నను గోపమొకకొంత యుపశమించినంతనే సీతాదేవిమాట జ్ఞప్తికివచ్చి నానేత యామెకుఁ గూడ నెగ్గయ్యెనేమోయని తహతహపడసాగితిని. అంతలోన నాకాశవాణి సీతాదేవి సురక్షితయని పలికెను. ఆమెను మరల సందర్శించి తదనుజ్ఞవడసి యిందువచ్చితిని. మీయనుగ్రహంబున సుగ్రీవుని కార్యము సఫలమయ్యెను. ఇఁకఁగర్తవ్యము నూహింపుము. లంకానగరంబును సరాక్షసంబుగా మాడ్చివచ్చుటకు నే నొక్కండఁ జాలుదు. ఐంద్రాస్త్రంబునుగానీ రౌద్రాస్త్రంబునుగానీ వాయవ్యాస్త్రంబునుగానీ వారుణాస్త్రంబునుగానీ తుదకు బ్రహ్మాస్త్రంబునై నను లెక్కసేయను. మీయానతిలేమి మిన్నకుంటిని. నేనేగాదు ; ఈ పనికిఁ జాలినవారు మనలో నెందఱోగలరు. అంగదునకిది యొకసంగతియగు నా ? నీలుని యూరువేగంబు లంకానగరంబు నువ్వెత్తుగానూది వైవదా ? పితామహవరోత్సుకులును నమృతప్రాశనులునునైన యశ్విపుత్త్రులు మైంద ద్వివిదులు రావణుని సబలంబుగాఁ గాల్చి రాఁ జాలరా ? ఈసంగతి యటుండనిమ్ము. సీతాదేవివంటి మహోత్తమురాలిని గనివిని యుండము. ఆరూపంబు నక్కాంతివిభవంబులు లోకాతీతములు. సమస్త శుభలక్షణంబులు మూర్తీభవించి యారూపను దాల్చెననవచ్చును. ఆమె యపర లక్ష్మిగాని యొండుగాదు. రామునకు నామెయు నామెకు రాముఁడును గడుంగడు గూడినవారు. అట్టి తల్లిని బందిగొనఁగా నద్దురాత్మునిమది యెట్టు లొప్పెనో యూహింపరాదు. ఆమహనీయురాలు పడుకష్టంబు లిన్నియన రాదు. రక్కసులు చుట్టుఁగూడి యెన్ని బాములు పెట్టుచున్నను నప్పతివ్రతామణి హృదయము కించన్మాత్రమేని చలింపదు. ఆమె నిరంతరము రామలీనచిత్తయై తదేకధ్యానగతినున్నది. ఆమెభక్తిని తదీయ మనోనిశ్చయమును జూచి నాకు సిగ్గయ్యెను. ఆమహనీయురాలి పాదాబ్జంబులకు సాష్టాంగమొనర్చి కృతకృత్యుండనైతి' నని సాశ్రుకంఠంబుతో వచించెను.

వానిమాట నంగదుఁడందుకొని 'ఇంతబలపరాక్రమంబులుగల మనము సీతాదేవిని గాంచియుఁ బట్టిచేతులతోఁ బోవఁదగదు. మనలను జూచి 'నా సీతయేది?' అని రాముఁడు తప్పక యడుగును. అప్పుడేమి చెప్పఁగలము. ఆమెను గొనిపోయి రామునకు నర్పించుట యుక్తముగాఁ దలంతును. జాగు సేయక గగనమార్గంబునఁ జని రావణుని గూల్చి సీతాదేవిని గొనివత్తము లెండ' నెను. అతనిమాటకు జాంబవంతుఁ డడ్డుపడి 'అంగదా! నీ తెంపునకు సంతసింతుము గాని నీ తలంపును మాత్రము మెచ్చను. సీతాదేవిని వెదకి రమ్మని మనల నాజ్ఞాపించిరి. ఆజ్ఞ మీఱరాదు. చూచిరమ్మన్నవారు తీసికొని రమ్మని చెప్పలేరైరా? వారిభావంబు వేఱుగానున్నది. అదియునుంగాక రాముఁడు సీతాపహారిని స్వయముగా వధింతు నని ప్రతిజ్ఞ గావించెను. వానిమాట పొల్లుపోరాదు. మనము పని యంతంబెల్ల వారికి విన్నవింతము. అనంతర కార్యంబును వారే నిర్ణయింతురు' అనెను. వానరులు వల్లెయని యందుండి యొక్కపెట్టున నెగచి గగనమార్గంబునఁ జని నందనవనంబును బోని మధువనంబును జేరి యందలి తేనెలను గ్రోల నాసపడి యాజ్ఞవేడిరి. యువరాజు వారి ప్రణయంబు విని జాంబవదాది కపివృద్ధుల యనుమతితో మధుభక్షణంబునకు నానతి యిచ్చెను.

మధువన ధ్వంసము

వానరులు వృక్షంబులకు నెగసి క్రిందఁదేనెలు గుత్తుకలంబంటి గ్రోలి ఫలమూలంబులు యథామతి నారగించి సంతోషపరవశులై యాడుచుఁ బాడుచు దుముకుచు బొర్లాడుచు నొండొరుల ద్రోపాడుచుఁ గోఁతి చేతలెల్లఁ జూపుచు విచ్చలవిడి విహరింపసాగిరి. వారి చెయువంబులకు వనమెల్లఁ బాడయ్యెను. వనరక్షకులు చూచి వచ్చి కపుల నడ్డగించిరి. ఆకోఁతిమూక యాగక తద్రక్షకులను బట్టి కట్టి కొట్టి చీకాకుపఱచెను. అంత వారు చని తమనాయకునకుఁ దధిముఖుఁడను వానికి సంగతి తెలిపి వనసంరక్షణము మా వలనఁ గాదనిరి. దధిముఖుఁడు మధువన వినాశంబునకుఁ బెల్లు కసరి వచ్చి యాపయత్నించి మాటసాగక మరలిపోయి సుగ్రీవునకు సాష్టాంగమొనర్చి 'వానరేశ్వరా! నీ తండ్రితాతలకాలంబునుండి యీవనమును గాపాడుచుందును. సురాసురులుగూడ దానిని జొరరు. ఇన్నాళ్ళ నా శ్రమయెల్ల నేటితో సరిపోయెను. మనవానరులే దానినిప్పుడు పాడుగావించిరి.

యంగదుఁడు మందలనుండి చూచుచున్నాఁడు. వలదన్న వనరక్షకులను మీదిరి. అడ్డగింపఁ బోయి నేను చావు తప్పి వచ్చితిని. మధువు నెల్ల నుడ్చి త్రాగినఁ ద్రాగుదురుగాక. వనమును నేలపాలుచేయ నేల ? అడి గిన వెక్కిరింతురు ; అడ్డగించిన ద్రోపాడుదురు ; బెదరించిన వాలములుఁ జూపుదురు; పయిదుముకుదురు; పల్లటీలు వేయుదురు; ఈదుండగము సహింప రాదని వలవల నేడ్చెను.

రామలక్ష్మణు లనతిదూరంబుననుండి యామాటలు విని సుగ్రీవా ! ఇతఁడు నీవనపాలకుఁడా ? దుఃఖింప నేల ? సంగతియేమి ?' అని మహా కుతుకముతో నడిగిరి. నావుడు వానరేశ్వరుఁడు చిఱునవ్వు ధాల్చి 'దక్షిణ దిక్కునకుఁ బంపిన యంగదాదులు వచ్చి మధువనముఁ జొచ్చి యందలి తేనెలెల్ల నుడ్చి త్రావి వేళాకోళము చేయుచున్నారఁట. వారు తమ కార్యంబును సాధించివచ్చిరని యూహింతును. కానిచో నిట్టిది సేయ సాహసింపరు. వారితోడ హనుమ చనెను. కార్యసాధనశక్తియు బుద్ధి నైపుణ్యంబును బరాక్రమోత్సాహంబులును విద్యావినయసంపదలును వాని యందు సుప్రతిష్ఠితంబులు. జాంబవదంగదాదులు నడుపఁగా హనుమం తుఁడు వెంటనుండఁగా మనవానరులకు సాధింపరాని కార్యము గలుగదు. సీతాదేవిని జూచివచ్చి' రనెను. శ్రవణసుఖావహమైన యామాటకు రామ లక్ష్మణులు పరమామోదమందిరి. సుగ్రీవుఁడంత దధిముఖునిజూచి 'వన పాలాగ్రణీ ! మనవానరులు కృతకృత్యులై వచ్చిరి. వారినడ్డగింపవలదు. ఆదుండగములను మన్నించితిని. నీవుచని యథాపూర్వముండుము. వారి జోలికిఁ బోవలదు. హనుమదాదులను జూడఁదమకించుచున్నానని మాత్రము చెప్పు' మనెను. అతఁడు రామలక్ష్మణసుగ్రీవులకు మ్రొక్కి వాయు పథంబునఁజని యువరాజును డాసి 'అంగదా ! సుగ్రీవునకు మీరాక నెఱిం గించితిని. అతఁడు మీ సేతలెల్ల సమ్మతించి మిమ్ము త్వరగా రమ్మనెను. జాగు సేయక పొమ్మని చెప్పెను. అంగదుఁ డామాట విని వానరులను జీరి 'ఇక దడయరాదు, మనరాక రామలక్ష్మణులకుఁ దెలిసెను. కృతకర్ములు గావున మిమ్ము నాజ్ఞాపింపనోపను. కర్తవ్యంబు నూహింపు' డనెను. వానరు లామాటవిని 'వానరేశ్వరా ! ప్రభువులు సామాన్యముగా నైశ్వర్య

మదోన్మత్తులై యుండరుగాని యిట్లు వినయసంపన్నులుగారు. నీవినయమే నీశుభాగమనంబును దెలుపుచున్నది. నీయాజ్ఞ తలదాల్తు' మని పలికి యంత్రోక్షిప్తపర్వతంబులకరణి గగనంబునకు నుద్గమించి ప్రచండవాయుప్రేరితమేఘంబులవడి గర్జించుచుఁ జనిరి.

సీతావృత్తాంత నివేదనము.

అట సుగ్రీవుఁడు రాముని డాయఁబోయి 'రఘుచంద్రమా! శుభము, శుభము. సీతాదేవిని వానరవీరులు చూచివచ్చుచున్నారు. నేటికి నాకుఁ గొంత యూఱటగల్గె' నని చెప్పుచుండఁగా గపిపటలము మిడుతదండువోలె వ్రాలెను. హనుమంతుఁడు మునుపడవచ్చి రామునకు నమస్కరించి 'చూచితిని సీతాదేవిని. ఆతల్లి నియతరాయై సుఖమున్న' దనెను. అమృతప్రాయమైన యాశుభవార్తకు సంతోషంబును సీతాక్లేశములకు దుఃఖమును జనించి వెనగొని రామలక్ష్మణులను వివశులనుగా నొనర్చెను. రాముఁడు సుంత సమాళించుకొని 'హనుమంతా! దేవి యెందున్నది? ఏదేని చెప్పెనా? వివరము విన(దమకింతు' ననెను. మారుతి రామునకు మరల నమస్కరించి,

"'మ. జననాథోత్తమ! యేనుబూని భవదాజ్ఞాలీల చెల్వంబు మ
జ్జనకుండైనసమీరదేవుకృపయుఁ సత్త్వోన్నతుం జేయఁగా
ఘనవాస్తుంగతరంగసంగత మహాగ్రాహోరగాత్యుగ్ర ద
ర్శనమై పేర్చుపయోధి దాటితి జనాశ్చర్యైకసంపాదినై॥"

"'ఉ॥ ఆలవణాబ్ధిమధ్యమునయందుఁ ద్రికూటనగంబుమీఁద ను
త్తాలవిశాల హేమమణిధామసముజ్జ్వలమైనలంకయం
ప్రోలాగిఁ గంటి నెంతయు నపూర్వము తద్విభవంబు దేవ! య
చ్చోఁ లలితాంగి నారసితిఁ జొచ్చి యనేకవిచేష్టితంబులన్॥"

అట్లు లంకాపట్టణంబెల్లఁ గలయ వెదకి రావణాంతఃపురంబును బరిశోధించి యెందును దేవినిగానక ఖిన్నుండనై తత్సమీపంబుననున్న యశోకవనంబుఁ జొచ్చి యట నొకయశోకవృక్షంబుమూలంబున నేకవేణీధరయై మహాదైన్యముతో నన్ను యొక నారీరత్నంబును గంటిని. ఆమె రాక్షసాంగనావలయితయై వారిబాధలకుఁ దూలుచు హిమాగమంబున దామర తెంకివోలె

వివర్ణాంగయై మరణంబును నిశ్చయించినట్లుండెను. స్వామీ! ఆమెస్థితి యేమని వచింతు ?

“సీ॥ కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాఁకెక్కిన
కమ్రకపోలభాగములు గలిగి,
యవశమై యొఱఁగిన యంగవల్లి కపాంత
నున్నభూమీరుహంబూఁతగాఁక,
వెడలు నిట్టూర్పులవేఁడిమిఁబడినన
య్యధరపల్లవము గారాకుఁబోలఁ
దలఁపులసందడి దండడించినతాల్మి
గదిరి శిరఃకంపగతుల బెరయఁ॥”

తే. చిత్తమెందోవిలీనమై చెదరకుంట
తెప్పపాటుగల్గనిచూపు చెప్పుచుండఁ
గేవలశలాకమాత్రయై ఖేదమట్లు
తనువుదాల్చెనోయనఁదోఁచెఁదలిరుబోఁడి!॥

ఆమెను జూచినంతనే నాదుఃఖము వెల్లివిరిసెను. రావణుఁడు దేవకన్యకలఁ బెక్కురఁ బందిచేయుట వినియున్నకారణంబున నాచూచిన యాస్త్రీరత్నము సీతాదేవియో కాదోయను సంశయము జనించెను. నా సందేహము వీఁడుమార్గమేదోయని తలపోయసాగితిని. అంతలోన రావణుఁడచ్చటకువచ్చి ‘సీతా!’ అని పల్కరించి యసభ్యవచనంబులు కొన్ని ప్రేలెను. ‘సీతా!’ అనుమాట చెవిఁబడినంతనే నాకుఁ బోయినప్రాణములు మరలవచ్చినట్లయ్యెను. ఆమెను జూచిన సంతోషము తదీయదురవస్థావలోకనంబునను రావణ దుర్వచనశ్రవణంబునను క్షణములో సన్నగిలి పట్టరాని దుఃఖముగాఁ బరిణమించెను. ఖలుఁడారక్కసుండట్లు పలుకఁగా నామె మోముద్రిప్పి యిరువురమధ్యఁ బుడకనొకటి త్రుంచివైచి ‘దురాత్మా! దశరథనరేంద్రుని కోడలిని రాముని కూర్మిపత్నిని నన్నిట్లు దుర్భాషలాడు నీనాలుక వ్రీలదా? దుష్టా! నాపతిని వీరశిఖామణిని గనుఁబ్రామి నన్నుదొంగిలితెచ్చిన నీమగంటిమిని బొగడసిగ్గుగాదా? నారాముఁడు నీకు సాటిరాఁడని ప్రేలుదువు. ఆ మహనీయుని పాదదాస్యంబునకేని నీవు తగుదువా?’ అని రోషకషాయ

స్వరంబునఁ బలికెను. ఆ నిశాచరుఁడు కోపవివశుఁడై యామెకు రెండు మాసంబులు గడువుపెట్టి చనెను. అంతటఁ గాపుఁదలయున్న రాక్షసాంగనలు సుంతకనుమోడ్చిరి. అది యవసరంబుగా నామెయొద్దకుఁజని నారాక నెఱింగింతుగాక యని మొదటఁ దలంచితిని. అదియు నొకయసురమాయగా నామెతలంచి భయభ్రాంతయై యఱచునేమో, అట్లు గావించుచో నాగుట్టు రట్టయి నావచ్చినకార్యము చెడునేమో, యనునూహలు తలనూపి నాప్రయత్నము నాకపెట్టెను. గత్యంతరమేమాయని కొంతవడి చింతించి కృతనిశ్చయుండనై యిక్ష్వాకువంశంబు నభివర్ణించితిని. ఆమె నావంకఁ జూచెను. అంతట నేను వృక్షాగ్రమునుండి దిగి యామెకు నమస్కరించి నాకత విన్నవించితిని. అంతమాత్రాననే యామెనన్ను విశ్వసింపక చిరపరీక్షగావించెను. వట్టిమాటలు చాలవని నిశ్చయించి నీవు నాయొద్ద నిచ్చిన యుంగరంబును జేతికిచ్చితిని. ఆయంగుళీయకంబును జూచినంతనే యామెముఖమండలంబు పరమవికాసమొందెను. ఆదేవి యాయుంగరమును గన్నులనద్దుకొని యురమునఁగూర్చి నన్నుడాయఁ బిలిచి మనస్సువిచ్చి తనపాటులెల్లఁ దెలిపి కాకాసురవృత్తాంతంబును మనశ్శిలతో గండపాళిఁ దిలకంబును దీర్చిన రహస్యంబును నానవాలుగాఁ జెప్పి రావణుఁడు రెండుమాసములు గడువుపెట్టెననియు ననంతరము తనజీవితము కల్లయగుననియు సాశ్రుకంఠయై నీకు విన్నవింపుమని దోయిలొగ్గి చెప్పెను. ఆమెను గొంతవడి నూరార్చి తరలనుంకించి 'ఇంకేదేనిఁ జెప్పనదిగలదా?' యని పలికితిని. అప్పుడామె చూడామణిని నా చేతనుంచి 'మారుతీ! దీనిని జూచి కొంతయూఱటఁ జెందుచుంటిని. నా ప్రాణంబు నిప్పుడు నీకరమందుంచితిని. ఎట్లుచేయుదువో' యని వలవల నేడ్చెను. ఆమెనోదార్చి నారాకను రక్కసులకుఁ దెలుపుటకును సందర్భమైనచో రావణునితో సంప్రతించుటకును దగువెఱవు తలపోసి యశోకవనంబును నిర్మూలించితిని. రక్కసులు కొందఱు నాతోఁబోరవచ్చిరి. వారినెల్లఁ బరిమార్చితిని. ఎట్టకేలకు రావణాత్మజుఁడింద్రజిత్తువచ్చి నాపయి బ్రహ్మాస్త్రంబును బ్రయోగించెను. బుద్ధిపూర్వకముగా దానికిఁ గట్టువడితిని. అంతనన్ను రక్కసులు బంధించి రావణుమ్రోలకుఁ గొనిపోయిరి. నాతలంపు సమకూడెనని సంతసించి వానికిఁజెప్పదగిన హితములెల్లఁ బలికితిని. ఆకూళ నామాటలకుఁ గోపపడి నన్నుఁ జంప నాజ్ఞాపించెను. అంతలోన వానితమ్ముఁడు విభీషణుఁడడ్డుపడి దూతనుజంపరాదని

వానిమతమును మరలించెను. రావణుఁడు తనయాగ్రహంబును బట్టజాలక నాశోకకు నిప్పంటించి నన్నుఁదఱుమ నాజ్ఞాపించెను. రక్కసులట్లే చేసిరి. ఆనిప్పుతో నేను లంకానగరమెల్లఁ దగులబెట్టి నాతల్లిని మరల సందర్శించి యిందు వచ్చితిని. స్వామీ! నా శ్రమయటుండనిమ్ము.

చ. అతిశయదుఃఖవేదన గతాగతజీవనమాత్రయై దురా
కృతలగురాక్షసాంగనల యీసుకుఁజిక్కి కృశించి యేడ్చుచున్
సతతము రామ రామయని సంస్మరణంబొనరించుచున్న నీ
సతిని బతివ్రతామణిని జయ్యనఁ బ్రోవవె! రాఘవేశ్వరా!

యనిపలికి చూడామణి నిచ్చి సాష్టాంగమొనర్చెను.

రాముఁ డారత్నంబునక్కునఁ గదియించి సీతాపునస్సంగమసుఖం బబ్బినట్లు సుమంతసేపు కనుమోడ్చి యశ్రుపూర్ణలోచనుండై 'సుగ్రీవా! ఈరత్నంబును జూచినంతనే నాహృదయంబు ద్రవించుచున్నది. నామామ గారు జనకమహారాజు నావివాహకాలంబున నియ్యనర్ఘరత్నంబును దేవేంద్రదత్తమైనదానిని నా ప్రియకు సీతకొసంగెను. ఈమణిరాజంబును జూడఁగా నాతండ్రియు నామామయు నాకన్నులమ్రోలఁ బొడగట్టుచున్నారు. నాప్రియురాలిని సందిటఁగూర్చినట్లున్న'దని చెప్పి మారుతివంక మరలి 'హనుమా! పిపాసాతురునకు జలంబులట్లు విరహాతురునకు నాకుఁ దప్పి దీఱునట్లుగా నాదేవి మఱియేమని వచోమృతంబును బంపెనా' యని యడిగి 'లక్ష్మణా! నాజీవితేశ్వరిని గాననోచక తదీయచూడామణిని మాత్రము చూడ నోచితిని. ఇంతకన్న దుఃఖముగలదా? యని వాపోయి 'హా! దేవీ! జనకరాజతనయా! నీగతి యిట్లయ్యెనా?

శా॥ ఘోరాకారులు కామరూపులు మహాక్రూరాత్మకుల్ రాక్షసుల్
వారయ్యో! నినుబందిఁగాఁగఁగొనిరే? వామాక్షిరో! తద్వ్యథా
భారంబోర్వఁగలేక నీయసువు లేపాటొందెనో? యార్తవై
యేరీతిన్ననునాత్మలోఁదలతువో? యెబ్భంగి వాపోదువో?

అని కన్నీరు జాలువాఱ దుఃఖించి 'మారుతీ! దివ్యౌషధంబున రోగినింబలె మత్ప్రియావచనామృతంబున నన్నుద్ధరింపుము. అట్లేని

జీవింతుఁగాక' యనెను. నావుడు హనుమంతుఁడు 'స్వామీ! ఏమి చెప్పుదు?

చ॥ కలఁగునుమాటిమాటికిని, గంటికిఁగావెను నీరుగాఱఁగాఁ
వలవలనేడ్చు, మూర్ఛిలు, దివంబునుజూచును, ధ్యానచిత్తయై
బలుకును రామరామయని, బాహువులెత్తి నమస్కరించు, హా!
తలఁపవె నీదుపత్నినను, దైత్యునకున్ నను నిచ్చితేయనున్ ॥

ఉ॥ హా! యను, రామరామయను, నార్తజనంబుల పాలికల్పకం
బా! యను, మందభాగ్యపయినక్కటికం బిసుమంత నీకురా
దా! యను, నేరమెంచనగునాయను, నిన్నుఁ గఁజూచుకల్మి లే
దాయను, నావిపద్దశకు నంతమెఱుకింతయుఁ గల్గదాయనున్ ॥

శా॥ ఏమోపల్కఁగఁబోవు, దుఃఖమున మాటింతేనియున్ రామి చిం
తామందీకృతచేష్టయై పుడమిఁబాదాంగుష్ఠమున్ రాయు నె
మ్మోమున్ వ్రాల్చును వెచ్చనూర్చు నెదపై మోపుం గరాంభోజమున్,
స్వామీ! యామెను జూఁడదోఁచెఁ గఠినవ్యాపారసంసిద్ధగాన్ ॥

ఆమె తలంపు గ్రహించి 'తల్లీ! దారుణమువలదు. నామూఁపు నారోహింపుము. క్షణములో నిన్నుఁగొనిపోయి నీరామునొద్దనుంతు' నంటిని. అమాటవిని 'హనుమంతా! పరపురుషస్పర్శ నాకుఁగారాదు. రావణుని చేతఁబడలేదాయని యందువుగాఁబోలు. కాలమునకుఁ గట్టువడితిని. అది నామనఃపూర్వకముగాదు. నాస్థితిని రాజపుత్రులకు నెఱింగించి దుఃఖసాగరంబునుండి నన్నురక్షింపుమని నామొఱగా నాపతికి విన్నవింపు' మనెను. ఆమె మహాపాతివ్రత్య ధర్మంబునకు నచ్చెరువంది పయనమైతిని. ఆమెనన్ను మరలఁబిలిచి 'హనుమంతా! చాలడస్సియుందువు. ఎందేని నొకరహస్య ప్రదేశమున నేడు సేదఁబాసి రేపు చనుము. నీవుండుటవలన నిమ్మందభాగ్యకుఁ గొంత యూఱటగలుగును. నీవు తరలుదువేని నీవెంట నాప్రాణంబులుగూడఁ దరలును. మారుతీ; లంకానగరమునకు రావలయు నన్నచో శతయోజనవిస్తీర్ణసాగరంబును దాఁటి రావలయును. ఇంతదవ్వు దాఁటు శక్తి గరుత్మంతునకును వాయువునకును మాత్రము గలదనిరి. నీవు నంతటి వాఁడవగుట నేఁడు గంటిని. అన్యులకు నిదిసాధ్యము గాదు.

ఏమియుందోఁపదు. ఈసంశయములెల్ల మాని నామూపునెక్కి రమ్మని మరలఁ జెప్పుదువు. ఒక్కమాట వినుము. అట్లుసేయుట రావణుఁడట్లు రాముఁడు నన్నపహరించుటగును. ఈమచ్చ నాకును నాపతికినిఁ గలకాల ముండును. అపకీర్తికన్న మరణమే గుణవత్తరము. నాభర్త యిందువచ్చి నన్ను దొంగిలితెచ్చిన ఖలుని వధించి నిజపరాక్రమంబును బ్రకటించి జయశ్రీతోడ నన్ను గ్రహింపవలయును. ఒండు తలంపవలదు. ఆహావశూరుని నాపతినిఁ గార్యానురూపపరాక్రమప్రదర్శనంబునకుఁ బ్రేరేపు' మనెను. వానరవీరుల శక్తిసంపదలును సుగ్రీవుని నిశ్చయంబును నీవియోగదుఃఖంబును నాటఁజెప్పి యామె నెంజిలిఁ బాపి 'తల్లీ! రాముఁడు నీమనోభిరాముఁడు ధనుష్పాణియై లక్ష్మణుని తోడను వానరసైన్యంబుతోడను వచ్చి లంకాద్వారంబున నిలుచుట యచిరకాలముననే విందువు. మీవనవాసవ్రతము సమాప్తముగానున్నది. అయోధ్యానగరము పట్టాభిషేకసంభారంబులను గూర్చి మీరాకకు నెదురుచూచుచున్న' దని ధైర్యంబు పలికి వచ్చితిని. దేవా! నీవ్యసనంబునకుఁగా నామెకుఁ గలిగిన యెదకింతెనరాదు. నన్నుఁ జూచుట, మీకుశలంబు వినుట, తనయెడ నీప్రేమతఱుఁగదని గ్రహించుట, నీవువచ్చి గ్రహింతురని నమ్ముట—ఇవి యామెను నిలువఁబెట్టియున్నవి.

ఆ॥ వె॥ కడుపుఁగూర్కుమాని కడలేనివగఁగుంది
పుడకవోలెజిక్కి పుల్లగిల్లి
చూచువారిగుండె సున్నమైపోఁదోఁచుఁ
నామెపాటువెప్పనలవి యౌనె?

స్వామీ! ప్రసన్నహృదయుండవగుము. దేవీప్రణామంబులివిగో యని సాష్టాంగ మొనర్చెను.

సుందరకాండము

సమాప్తము.

---





# శ్రీ దొడ్డ రామాయణము.

## యుద్ధకాండము.

చ॥ శివుఁడని శ్రీవిభుండనియుఁ జిన్మయుఁడంచు ననంతశక్తి నా
వివిధరుచిప్రభేదముల వేఱొనరించుచు దేనిఁగొల్తు రే
ప్రవిమలదివ్యతేజము ప్రపన్నుల కయ్యయిమూర్తిఁదోఁచుఁదా
నవిషయమయ్యునట్టి మహిమాద్భుత తత్త్వము నాశ్రయించెదన్ ॥

### —♦ రాముఁడు సీతావృత్తాంతము విని దుఃఖించుట. ♦—

రాముఁడట్లు సీతావృత్తాంతంబును సాంతంబుగా నాలకించి సుగ్రీవాదులు విననట్లుగా 'అశక్యలకుఁ దలంపనేని యందని కడిఁదికార్యంబును హనుమంతుఁడు సాధించెను. శతయోజనవిస్తీర్ణమగు సాగరంబును దాఁటుట, సురదుష్ప్రవేశ్యమైన లంకానగరముఁ జొచ్చుట—యివి యేతన్మాత్రములు గావు. వీనింబట్టి యితని బలపరాక్రమంబుల నూహింపనగును. అశోకవనికాభంగము లంకాదహనమును స్వామినియుక్తములు గావు. అయినను వానిని స్వతంత్రించి గావించుట స్వామిగౌరవోన్నతికగును. చెప్పినంత చేయువాఁడు మధ్యమభృత్యుఁడగును. చెప్పినదిగూడఁ జేయనివాఁడధమభృత్యుఁ డనఁబడును. చెప్పినదేగాక కార్యానుకూల్యంబులగు నితరంబులను గూడ నొనర్చి యాత్మగరిమంబును స్వామిప్రాభవంబును బ్రకటించు నతఁడుత్తమభృత్యుఁడగును. స్వామికార్యమును గావించి సుగ్రీవుఁడును సీతను సందర్శించి నన్నులక్ష్మణుని రాఘవులను సీతఁడాత్మహత్యాదోషమునుండి తప్పించెను. ఇతనివలన ధర్మరక్షితులమైతిమి. ఇతని మేధావిత్వంబును బుద్ధి

ధైర్యంబును గార్యపరత్వంబు నింతనరావు. ఇంత ప్రియంబొనర్చిన యీ సు
కృతుకిఁ బ్రతిప్రియంబుఁ దగినంత గావింపఁ జాలమికిఁ జింతయగుచున్నది.
ఏమియిచ్చినను వీనియుపకారఋణము తీఱదు. సర్వస్వప్రదానముగూడ
నందులకుఁజాలదు. ఇతని నాలింగనపూర్వకముగా సంభావింతు' నని పలికి
హనుమంతుని బిగికౌఁగిటఁగూర్చి 'వానరేశ్వరా! సీతావృత్తాంతము తెలిసెను.
అంతమాత్రాననే సంతోషముగాదు. కార్యశేష మెంతో గలదు. సముద్ర
మును దాఁటుట మనకార్యనిశ్రేణికి మొదటిమెట్టుగానున్నది. ఇది తలఁచి
నంతనే దిగులయ్యెడు. అగాధమును మహోత్తుంగాభీలమునైన యీసముద్ర
మును దాఁటి దక్షిణతీరముఁ జేరనేర్తుమా? సాగరోత్తరణము గావించివచ్చి
రావణునిసాధించి నాసతిని గ్రహింతునని శపథముగావించితిని. సీత యీ
మాట నమ్మి సముద్రతరంగములఁబోని తలంపులనుండును. నామాట నెఱ
వేఱునా?' యని శోకసంభ్రాంతుఁ డయ్యెను.

—♦ సుగ్రీవుఁడు రామునకు ధైర్యము పలుకుట. ♦—

సుగ్రీవుఁ డది గాంచి 'వీరాగ్రణీ! ప్రాకృతులట్లు నీవు పరితపింపరాదు. కృతఘ్నుఁడు స్నేహంబును వలె నీవు నీసంతాపంబును దిగనాడి ధైర్యమవలంబింపుము. ఆర్యవర్యా! నీవిట్లు సంతాపపడఁ గారణమూహింపరాకున్నది. సీతాదేవినిగూర్చియందువా? ఆమె వృత్తాంతము తెలిసెను. ఎట్లైన నమ్మహాశీలవతిని గొనివత్తుము. ఆమెయెడఁ గావించిన యకార్యమునకు దుఃఖింతువా? అకాల మృత్యుదంష్ట్రాంతరవిలగ్నుఁడై యున్నాఁడు. వానిచావు దినములలోనున్నది. ఎంతవిచారించినను నీయీవ్యసనంబునకుఁ గారణము గానరాదు. రామా! మతిమతాంవరుండవని విజ్ఞులు నిన్ను వచింతురు. నీ యెఱుంగని ధర్మములేదు. ప్రాజ్ఞుఁడవును బండితుండవు నైన నీవిట్లు దైన్యమొందఁ దగదు. యోగి మోక్షవిరోధిబుద్ధి నట్లు నీవు నీయుత్సాహబాధకబుద్ధిని ద్యజించి ధైర్యము వహింపుము. సముద్రము మహోత్తుంగతరంగాభీలము నక్రమీనసమాకులము నైన నగుఁగాక. శతయోజనంబులు దాఁట వలసియున్న నుండుఁగాక. ఒక్కగంతున లంకాపురము బురుజులమీఁద వ్రాలి దురాత్ముని రావణునిఁ బరిమార్పఁగా మేమింతమందిమి యుండగా నీవు శోకింతువేల? శోకంబున దైన్యము దాన నుత్సాహహానియు నగును.

నిరుత్సాహము కానున్నకార్యమునుగూడఁ జెఱచును. ఉత్సాహహీనునకు దుఃఖమేగాక యాపదలుగూడ సంభవించును. రామా! మనవానరవీరుల శక్తిసంపద లింతనరావు. వారిస్వామిపరత్వంబును శంకింపవలదు. నీకుఁగా నగ్నినుఱుకుదురు ; ప్రాణములిత్తురు. ఇది నిక్కముగాని యౌదార్యమాట గాదు. నీవిప్పుడు కృతోత్సాహివై మమ్మెల్లరఁగూడ నుత్సాహపఱతువేని క్షణములో రావణవధయు సీతాసంప్రాప్తియుఁ జేకూఱును. వానరబల మెల్ల దండెత్తి చనవలయును. వారిలోనందఱును సముద్రమును లంఘింప నోర్వరు. ఆకారణంబున సేతుబంధన మవశ్యమగుచున్నది. దానింగూర్చి కర్తవ్యమును నిశ్చయింపుము. ఏనాఁడు త్రికూటశిఖరమందుఁ గాలూనుదుమో యానాఁడే రావణుని చితిమంటలు చెలరేగును. సేతుబంధనము గావింపనిచో సురాసురులుగూడ లంకను సాధింపఁజాలరు. రాజేంద్రా! సేతువును గట్టుచే తడవుగా మనవారు లంకను లగ్గలకెక్కింతురు. ప్రాజ్ఞచంద్రమా! శుభాశుభములెల్ల నిప్పుడు నీబుద్ధిననుసరించి యున్నవి. శోకమునుమాని కార్యోత్సాహి వగుదువేని నీకుఁగాఁజేతులు చాచి యున్న విజయశ్రీతోడ సీతనుగూడుదువు. పురుషులెందును శౌర్యప్రధానులు. సమయమునఁగాని శౌర్యము నిరర్థకము. శూరులైనమహాత్ములు వినష్టప్రణష్టంబులకు శోకింపరు. రామా! జగదేకవీరుని నిన్నుఁ బ్రతిఘటించు వాఁడు గలఁడా? అదియునుగాక

చ. అతులితవిక్రమోన్నతుఁడు నాహవదుర్జయుఁడాత్మతుల్యుఁడా
తతభయభక్తిసంగతుఁడు తమ్ముఁడు తోడయి వెంటనుండఁగా,
శతరణవీరులైన కపిచంద్రులు కోట్లకుఁ గోటులుండఁగా,
హతమతి రావణుండు నిమిషార్థములోపల పేరుమాయఁడే?

మ. జగదేకప్రథితప్రతాపగరిమన్ స్థాపించి వీరాతి వీ
రగణప్రాణహరప్రచండతరశస్త్రాస్త్రంబులంగల్గి యీ
వగశోకింతువదేల? యయ్యసుర నీవాలారుభల్లంబులన్
దెగిపోనేయుము చేయుము మొయ్యనను వైదేహీమనస్తోషమున్.

వీరాగ్రణీ!

ఉ. కొందలమంది డీలుపడి కొండొక సేతకుఁ గాకయిట్లు చం
పందగినట్టి శత్రువును బాపిని దండనచేయకున్న యీ
చందము పాడిగాదు, పలుచందన మౌ మనకెల్ల దేవియుం
బందురి ప్రుఁదు నీకతనవాటిలుఁ జెప్పఁగరానికష్టముల్ ॥

క్షత్రియాగ్రణీ! ఇఁక దుఃఖంబు నుమాని క్రోధంబునాశ్రయింపుము. రాజులు తమ యుద్యోగంబును మానుదురేని మఁదభాగ్యులగుదురు. దండనంబువకుఁ గార్యంబగునట్లు మండనంబునకుఁ గాదు. ఇఁక జాగువలదు. శుభనిమిత్తంబులు పెక్కు తోఁచుచున్నవి. నామనంబును బరమప్రసన్నతను గాంచెను. కార్యసిద్ధికి మనః ప్రసాదము ప్రధానశుభలక్షణ' మని బహువిధ ధైర్యోత్సాహ వచనంబుల నుడివెను.

—♦ హనుమంతుఁడు లంకాదుర్గమాదులఁగూర్చి రామునకుఁ జెప్పుట. ♦—

రాముఁడాపలుకులెల్ల నాలకించి హనుమంతుని వంక మరలి 'తప శ్శక్తిని వ్యయించియో సేతువును బంధించియో గాక జలంబుల నింకించియో మఱియొక విధముననో సముద్రతరణంబు గావింపనగును. దానిం గూర్చి యాకులపడవలదు. హనుమంతా! నీవు యథేచ్ఛగా లంకానగరమెల్లఁ గలయఁజూచితివి. అందలి దుర్గంబులను సైన్యపరిమాణంబును ద్వారదుర్గ రక్షణవిధానంబునుఁ బ్రాకారపరిఘాదినిర్మాణవైఖరిని రక్షోవీరులను, వేయేల లంకాస్వరూపంబును వినఁగోరుదును. నీవు చూచినది నాకుఁ బ్రత్యక్ష గోచరమగునట్లుగా వివరింపు' మనెను.

నావుఁడు 'స్వామీ! అవధరింపుము. లంకానగరం బతివిశాలమై లక్షోపలక్షరక్షోవీరపరిరక్షితమై రథగజతురగాదులఁ గ్రిక్కిరిసి పరదుష్ప్రవేశముగానుండును. ఆనగరంబునకు నలువలంకుల నాలుగు మహోన్నత ద్వారములుగలవు వానికవాటములు లోహమయములై యభేద్యముగా నుండును. మహాభయంకరములైన వివిధమారణయంత్రంబులను దద్ద్వారంబులకు నిరువైపుల నమర్చియున్నారు. శత్రుసైన్యము దలపడినంతనే యా యంత్రములు శిలాభల్లాద్యనేక ప్రాణహరసాధనంబులను గురిసి పరబలంబును ధ్వంసముగావించును. ఒక్కొక్కద్వారంబున శతసహస్రంబుగా ముద్గ

రాదులు రక్షోవీరాయుతములై యుండును. వారొక్కొక్కరుఁ గాలాంతకుని దలపింతురు. ఆపురంబును మహోన్నతసౌవర్ణప్రాకారంబు వజ్రవైడూర్యవిరచితమైనది పరివేష్టించి దుర్గమముగానున్నది. ఆప్రాకారము చుట్టు పెద్దపరిఘలున్నవి. వానిలోతుపాతులు తెలియరావు. అవి యత్యంతశీతజలసంపూర్ణములై మహామీనకనక్రసమాకులముగా నుండును. వానికి దాఁటుటగా ద్వారములకుఁ గట్టెదుట దారునిర్మితమార్గములున్నవి. ఆ మార్గములు యంత్రబలంబున వలసినప్పుడు లేచుచు వ్రాలుచు నుండును. పరిఘాంతరప్రదేశములందు దారుమార్గముల యిరుపార్శ్వంబుల రక్షకభటగృహములు గలవు. ఆదారుమార్గములలో నొక్కటి మహాదృఢము బలిష్ఠమునై బంగారుస్తంభములమీఁదఁ గట్టఁబడి యున్నది.

రాజేంద్రా! ఎన్నికార్యంబులున్నను రావణుఁడు సేనావిషయంబునఁ బరాకుచెందఁడు. అతఁడు ప్రతిదినము సైన్యమునెల్లఁ బరామర్శించుచు రణోత్సాహముఁ గూర్చుచునుండును. సోమరితనంబును వానిచెంతకుఁ గూడరానీయఁడు. రావణుని పేరు చెప్పినంతనే పదాతిమొదలు సేనాపతి వఱకు వణఁకుదురు. వానియాజ్ఞమీఱినవారికి బ్రతుకులులేవు. సైనికులందు స్వపరతారతమ్యములు గలుగవు, ఎల్లరి నేకదృష్టితో నతఁడు పాలించును. వారికి సాహసవిక్రమాదుల ననుసరించి మన్ననలు గలుగుచుండును.

లంకానగరము జలపర్వతవన పరిఘాప్రాకారదుర్గచతుష్టయ సంకలితమై త్రికూటపర్వతాగ్రంబున నున్నది. అందుజలదుర్గము శతయోజన విస్తీర్ణము. దానిని దాఁటుటకు నోడలు మున్నగు తరణోపాయములు లేవు. ఆపురము పర్వతాగ్రస్థాపితముగావున నిసర్గముగా దానికిఁ బర్వతదుర్గమునుఁ బర్వతము ననుసరించి వనదుర్గంబును సమకూడెను. పరిఘాప్రాకారదుర్గముల సంగతి విన్నవించితిని.

లంకానగరమునఁ బూర్వద్వారమందుఁ బదివేల రాక్షసయోధులు ఖడ్గశూలాద్యాయుధహస్తులై కాపుందురు; దానిదక్షిణద్వారంబున వీరాతివీరులు లక్షమంది చతురంగబలసమేతులై రక్షించుచుందురు; పశ్చిమద్వారంబునఁ వివిధాస్త్రకోవిదులైనశూరులు చర్మకవచఖడ్గంబులనుదాల్చి పహారా

వానరవాహినీపతి సుగ్రీవుఁడా సంవిధాన నైపుణ్యంబునకు నాశ్చర్య పడి ప్రస్థానంబు నాజ్ఞాపించెను. వానరులు యుద్ధోత్సాహులై గిరిగుహా శిఖరవనాంతరములనుండి మిడుతలదండువలె నొక్కుమ్మడి యెగచి పఱచి గిరికీలు తిరుగుచు గంతులువైచుచు గర్జించుచు సింహనాదంబు లొనర్చుచు ఢింకంబు లాడుచు సుగంధిఫలంబులను భక్షించుచుఁ దేనియలానుచుఁ బ్రసూనమంజరీపరిశోభివృక్షంబులఁ బెకలించి విలాసంబుగా నాడించుచు నొండొరు నొత్తుచుఁ ద్రోపాడుచు బడుచు లేచుచు నధిక్షేపించుచు 'ఇదిగో రావణుఁబరిమార్తు' మని అంకిల్లుచు దక్షిణదిశఁబట్టి నడచి లతాద్రుమయుతంబునుఁ బ్రఫుల్లకమలకల్హారసరోవరగణమణీయంబును బహుతటాకవనశోభితంబును నైన సహ్యాద్రిని సమీపించిరి. అప్లవగసమూహసాగరం బనంతంబును ఘోషభీకరంబునై యున్నను మార్గాంతరసంగరజనపదంబులకు గోరంతయేని బాధగలుగకుండెను.

—* లక్ష్మణుఁడు నిజజయసూచకంబులను రామునకుఁ దెల్పుట. *—

అట్లు సహ్యాద్రిని సమీపించి సంతేటు లక్ష్మణుఁడు ధాతికాది మహాశుభనిమిత్తంబులఁ బెక్కింటిఁ గాంచి 'అన్నా! అచిరకాలముననే నీవు రావణవధాపూర్వకంబుగా భూపుత్రిని బడసి సఫలమనోరథుండవై సమృద్ధార్థయగు నయోధ్యను బొందుదువు. శుభనిమిత్తంబులట్లు సూచించుచున్నవి. అదిగో చూడుము. వాయువు సేనానుసారియై యనుకూలగతి మెల్లమెల్లగా సుఖముగా వీచుచున్నాఁడు. మృగవిహగధ్వనులు మధుర మధురంబుగా వినవచ్చుచున్నవి; దెసలెల్లఁ బ్రసన్నములయ్యెను; లోకబాంధవుఁడు విమలుఁడై తేజరిల్లుచున్నాఁడు. కిష్కింధానగరంబునకు నాగ్నేయభాగంబున నున్న లంకాపట్టణంబును గూర్చి పోవుచున్న నీకుఁ బృష్ఠభాగంబున శుక్రుఁడు ప్రసన్నకాంతియుతుఁడై ప్రకాశించుచున్నాఁడు. పురశ్శుక్రయోగమైనచో యాత్రా ప్రతిషేధమగును. ఇది యట్టిదిగాదు గావున నెంతయు మనకార్యమునకు ననుకూలము. నేఁడు ఫాల్గుణ పూర్ణిమ ప్రవర్తిల్లుచున్నది. శుక్రుఁడు మేషస్థుఁడై యున్నాఁడు; నీవు కర్కాటకమున జనించితివి. కర్కాటమునకు మేషము దశమస్థానమగును. అది మిక్కిలి యనుకూలము. సర్వవేదపారంగతుఁడగు భార్గవుఁడు పాపగ్రహ

సంయోగవిశిష్టుఁడై శోభిల్లుచున్నాఁడు. సప్తర్షులు మహాతేజస్కులై ధ్రువంబునకుఁ బ్రదక్షిణ సంచారమొనర్చుచున్నారు. ఇక్ష్వాకువంశ్యులకుఁ బ్రధానకూటస్థుఁడైన త్రిశంకుమహర్షి విశ్వామిత్రసృష్ట సప్తర్షివర్గాంతర్గతుఁడైయున్న వసిష్ఠునితోఁగూడి వెలుగుచున్నాఁడు. ఇక్ష్వాకులకుఁ గుల నక్షత్రమైన విశాఖాబుక్షము కించన్మాత్రముగూడ దుష్టగ్రహసంబంధముఁ బొరయక విమలమై విరాజిల్లుచున్నది. ఇవన్నియు మనకు శుభసూచకములగును. వైరిపక్షము విచారింతము. నైరృతదైవతాకంబగు మూలానక్షత్రము రాక్షసుల నక్షత్రమగును. అది ధూమకేతుస్పృష్టమై పీడావశముగానున్నది. అంతకాలంబున మృత్యుగ్రస్తుల నక్షత్రము దుష్టగ్రహపీడితంబగుచుండును. దానంజేసి యిప్పుడు యీగ్రహస్థితి రాక్షసవినాశంబును సూచించును. మఱియు నీరము నిర్మలమై రుచిరవంతముగానున్నది ; వనంబులు ఫలపూర్ణములై నయనోత్సవముఁ గావించుచున్నవి ; వృక్షంబులు ఋతుధర్మాను సారంబుగాఁ బుష్పించి నెత్తావులను వెదచల్లుచున్నవి. ఇవన్నియు మనకు విజయసూచకములగును. తారకాసురయుద్ధంబున నిర్జరసైన్యమట్లు నేఁడు మనవానరసైన్యము మహోత్సాహప్రకాశవంతమైయున్నది. ఆర్యా! ఈ పరమశుభనిమిత్తంబులకు నెంతయు సంతసింపనగు' నని యాశ్వాస వచనంబులు పలికెను.

—♦ వానరాదులు సముద్రతీరము చేరుట. ♦—

వానరచమూకరచరణసముద్భూతధూళిపటలంబు రేఁగి నభోంతరాళంబు వ్యాపించి సూర్యమండలంబును దిరోభవించి యకాలతమఃకాండంబులఁబఱచి లోకభయావహమయ్యెను. సేనాతరణసమయంబుల వాహినులు నిరుద్ధ ప్రవాహగతులై యుబికి గట్టులకెగఁబ్రాకియుండి దండుచన్నంతనే కట్టతెగినట్లు తటాలున బొరలి విపరీతప్రవాహభ్రాంతిని గొలుపుచు హుటాహుటి బహుయోజన దూరము పఱచి పాఱసాగెను. ఆకపిసైన్యము మార్గాంతర మందలి విమలాంబుసరోవరంబుల నీదిదాఁటుచుఁ బర్వతంబులకుఁ దోలఁగి చనుచు సమప్రదేశంబులందుఁ బఱచి నడచుచు రేయుంబవలు పయనము సాగించి సహ్యశైలంబు నతిక్రమించి మలయాచలంబును వెనువైచి మహేంద్రగిరి నెత్తమ్మున విడిసెను. రాముఁడాపర్వత శిఖరమెక్కి కూర్మ మీన

సమాకులజలార్ణవంబును గాంచి యందుండి దిగివచ్చి లక్ష్మణ సుగ్రీవులను వెంటఁగొని తరంగమాలికలను వీచి శిలాతలంబులఁ గడుగుచున్నదోయని దోచుచున్న సముద్రంబు తీరంబుచేరి 'వానరేశ్వరా! కడలి గట్టుచేరితిమి. ఇఁక మనకాల్నడకలు సాగవు. ఇచ్చట సాగరుఁడు మహోత్తుంగతరంగాభీలుఁడుగా నున్నాఁడు. తరణోపాయము విచారింపుము. సేనను వదలి చనరాదు. శత్రువులు దాఁగి యుండి సందుదొరకినఁ బ్రహరింతురు. పహరావారికి హెచ్చరిక సేయు' మనెను.

వానరసైన్యమట్లు విడిసి యుల్లోలకల్లోలమైన యాకడలిని గాంచి 'ఈవారాశి యక్షోభ్యముగానున్నది. దీని యవ్వలిదరి గానరాదు. తిమి తిమింగలమకరమత్స్యకచ్ఛపాభీలమై సంధ్యాకాలములందు నిజఘోరరూపంబును జూచి బెగ్గడిల్లు ప్రాణిలోకంబునకు నవ్వుటలోయన నెలినురువులను గ్రక్కుచుఁ జంద్రోదయంబున నానందవశముననోయన నూర్మిమాలికల నాడించుచు ఫణిఫణాగ్రరత్నప్రదీప్తమై శింశుమారాదిమహాసత్త్వములకు సమాశ్రయమై నిజశరణత్రాణపరాయణత్వమును బ్రకటించుచు నానాశైల సమాకులము నగాధము నైయున్న యీ యర్ణోరాశిని జూచినంతనే ధైర్యకవచములు జాఱుచున్నవి. శీకరంబులు శశికిరణంబులసోకున నగ్నికణంబులఁ బోలి గగనభాగంబున నక్షత్రంబులట్లు సముద్రాంతరమున రాజిల్లుచున్నవి. గగనసామ్యమును గోరిఁ గాబోలు సముద్రము తనయందు నాగాసురులకు నిరవిచ్చెను. ఆకాశంబున మేఘపరంపరాసంఘట్టనధ్వనులట్లు సాగరాంతరమున వీచికామాలికాసంఘర్షణధ్వనులు చెలఁరేగి భేరీనినదంబుల మ్రోయుచున్నవి. గగనసాగరంబులకు నంతగాభేదము గానరా' దని యొండొరు చెప్పుకొని విస్మయపడసాగిరి.

—* రాముఁడేకాంతమున సీతకై శోకించుట. *—

రాముఁడంత నేకాంత మాశ్రయించి సీతాదేవిని తలఁచి 'కళ్యాణీ! కాలముతోడ శోకము సన్నగిలుట లోకసహజము. నాయందది విపరీతమగుచున్నది. ప్రేయసీ! నీవు దవ్వగుటకు దుఃఖించుటగాదు. ఆ విధ దుఃఖము ప్రస్థానముతోడ సమసెను. నిన్ను రక్కసుఁడు దొంగిలి తెచ్చుటకుఁగా దుఃఖించుటగాదు. ఆదుఃఖము రావణశిరఃఖండనంబునఁ గాని

చల్లారదు. కాంతామణీ ! నీజవ్వనమెల్ల రిత్తపోవుచున్నది. చన్నప్రాయము మఱలరాదు. అందులకుఁగాఁ బెల్లు దుఃఖింతును. అనిలా ! నీవు సర్వాంతశ్చరుండవు ; నీవేగమింతనరాదు. నాప్రణయమాలకించి నాప్రియురాలి మీఁదుగాఁ వీచివచ్చి నన్ను దాఁకుము. దాననాకుఁ బ్రియాసంస్పర్శసుఖమబ్బును. చంద్రా ! నీసందర్శనంబున నాప్రియాముఖబింబదర్శనభాగ్యప్రాప్తిని భావించుచున్నాను. ప్రేయసీ ! నీ విరహము దుర్భరమగుట నిజము. ఎట్లో దానిని సహించుచున్నాను. దుర్భరతరమైనది మఱియొకటి గలదు. అదితలఁపున మెదలినప్పుడెల్ల నాప్రాణంబు లవిసి విఱియుచున్నవి. వలదన్నను వినక భోగంబులనెల్ల దిగనాడి నాతోడిదేలోకంబుగా భావించి నారచీరలు గట్టి నావెంటఁ దగిలి గహనాంతరములఁజొచ్చి కడుపారదినిగాని కన్నార నిద్రించిగాని యెఱుంగక పడరానియిడుమలు పడితివి. నేను చెంతనుండుటవలన నట్టివెతలనంతగా సరకుచేయవైతివి. నాపరోక్షమున నిన్ను రాక్షసాధముఁ డపహరించినప్పుడు వానిని నీపాతివ్రత్యాగ్నికి నింధనప్రాయమొనర్ప నోర్చియుఁ బతిభక్తింజేసి యట్లుగావింపక నన్నుఁ దలంచి 'హా ! నాథా !' యని నీవిడిన దీనాలాపము నాహృదయమెల్ల నలమి నా యంగకంబుల నేర్చుచున్నది. ఆవ్యథాగ్నిని సహింపఁ జాలకున్నాను. జీవితేశ్వరీ ! మారుఁడను వీతిహోత్రుఁడు నీవియోగాగ్నికుండమున నన్నుఁ ప్రోచిభవచ్చింతారూప జ్వాలలను రేపి రాత్రిందివము నన్ను దహించుచున్నాఁడు. ఈ దీనుని గనికరింపవా ? ఈతాపమోర్వఁజాలను. దీనికి నంతముగానరాదు. మున్నొకటి యాశ్రయమునఁ గాని యిది చల్లారునట్లు దోఁపదు. సీతా ! మనమిరువురము నేకశయ్యావ్రతమనుష్ఠించితిమి. ఇప్పుడావ్రతము వీఁగిపోయెను. తత్ప్రాయశ్చిత్తార్థము నుపదేశింపవా ? కళ్యాణీ! నీవు పుడమిఁగలవని వింటిని. ఆవార్తనాకుఁ బరమజీవసాధనమయ్యెను. నీరింకిన కేదారము వాడి నశింపనుండియు జలపూర్ణపరిసరకేదారంబు తేమకు నూపిరితోనుండునట్లు నాభాగ్యదేవతవైన నీవియోగంబునకుఁగాఁ గృశించి నశింపనుండి నీవు జీవించియున్నవార్త విని ప్రాణములు నిలిచియున్నవి. కటా! శత్రుజయమెన్నడో శతపత్త్రాయతేక్షణను నిన్ను నిఱుపేదసిరింబలెఁ గాంచుటెన్నడో గదా. హా ! జానకీ !

ఉ॥ కన్నులకాంక్షతీఱ నినుఁగాంచెడు కల్మిలభించు టెన్నఁడో?
ఎన్నఁగరాని బాధలు శమియింపఁగ నిన్నెదఁగూర్చు టెన్నఁడో?
తిన్నగ నీదు కెంపెదవి తేనియలం జవిచూచు టెన్నఁడో?
అన్నులరాణిరో! మనకునైన వియోగము పాయు టెన్నఁడో?

దేవీ! యజనభూమిసంభవా?

చ॥ జనకుని కూర్మిపుత్త్రివయి జానగు కోసలరాజమౌళికిన్
బనువున ముద్దుకోడలుగఁ బాటిలి నాకు ననుంగుపత్నివై
తనరెడు నీకుఁ గూడ నలదైత్యునిచేఁబడి దిక్కులేక యి
య్యనువున శోకతాపముల యార్తిఁ గృశించుట తప్పదయ్యెనే?

కళ్యాణీ! నీలనీరదంబును శరత్కాలశశిరేఖవోలె రక్షోగణంబును నీవు త్రోపాడి వచ్చి నాయెదుట నుదయింపరాదా? నిన్నుఁ గన్నుల నద్దుకొని తాపము వీడి సుఖింతును గదా.

చ॥ మగువ! శిరీషసూనసుకుమార! నిసర్గకృశాంగకా! నెటా
దిగులుపవాసముల్ బెడగుదేశముఁ గాలవిపర్యయంబు నొ
క్కగతిఁ గూడి యేచ సుడిగాలికివీచి జలంబుబాసి వే
సఁగి నడియెండలోనుడికి జాజులేఁ దొగరేక నైతివే?

దేవీ! సాధ్వీమణీ! నాయెడఁ బ్రసన్నవై వాడిననీయంగకంబులతో నుత్కంఠకంఠాశ్లేషసౌఖ్యంబు నొదవించి నీయానందబాష్పంబులతో నాకు సంతోషరాజ్యపట్టాభిషేక మొనర్పవా?' అని యలమటింపసాగెను. రాముని వ్యసనంబుఁ జూడనోపకనోయన నంతలోనఁ జండభానుఁడు మందరుచియై యస్తమించెను.

రావణుఁడు లంకాదురవస్థకుఁ జింతించి మంత్రులతో నాలోచించుట.

అటు రావణుఁడు లంకాపురముపాటు తలఁచి 'అహో! నేను జీవించి యుండఁగాఁ గోతిమాత్రుఁ డిందు వచ్చి యింతఁ గావించెను. ఇంతకన్న నవమానము గలదా? రణోచ్చానములైన నాయీబాహువులేల? నా బ్రదుకేల?' యని లజ్జపడి సేనాపతులను రావించి 'రక్షోవీరులారా! వానరమాత్రుఁ డెంత గావించెనో లంక యేప్పాటు పడెనో చూచితిరిగదా.

వాఁడు సీతను సందర్శించి పోయెను. ఇఁక గర్తవ్యము నూహింపుఁడు ; మీమత మొసవర్తును. బుద్ధిమంతులు కూడి నిశ్చయించినయర్థము ఫలప్రదము గాక మానదు. పురుషు లుత్తమమధ్యమాధములని ముత్తెఱంగుల నుందురు. తత్తల్లక్షణంబులనుబట్టి వారిని వివేకింపనగును. ఉత్తముఁడు తనకు హితులును మంత్రనిర్ణయసమర్థులును నైన వారితోడనో, తనసుఖదుఃఖంబులకు సంతోషపరితాపంబులొందుమిత్రులతోడనో తనమేలుగోరునట్టి బంధువులతోడనో సంప్రతించి యర్థమును నిశ్చయించి ఫలభారమును దైవముమీఁద వైచి కార్యనిర్వహణమునకు సమకట్టును. మధ్యముఁడు పరసహాయము నపేక్షింపక తాను స్వయముగాఁ బూర్వోత్తరసందర్భములను బరామర్శించి దైవముమీఁద భారమువైచి కార్యోన్ముఖుఁడగును. అధముఁడన్ననో గుణదోషంబులను విమర్శింపఁడు ; దైవవ్యపాశ్రయమును లక్షింపఁడు ; త్వరపడి కార్యమారంభించును ; అదిదుదముట్టులోన నంతరాయమేమాత్రము గల్గినను బ్రయత్నము విరమించును. పురుషులెట్లో మంత్రములు గూడ నట్లే త్రివిధమగును. శాస్త్రదృష్టియు నైకమత్యముఁ గల మంత్రముత్తమమగును. అర్థనిర్ణయభాగంబున మతభేదము గలిగినను సాధనావస్థయందు నైకమత్యముగల మంత్రము మధ్యమమగును. ఆద్యంతము భిన్నమతమై యైకమత్యస్ఫురణయే లేని మంత్ర మధమమగును. మీరెల్లరును మతిమంతులరు గావున శాస్త్రదృష్టితో నైకమత్యభావముతోఁ గార్యార్థమును నిశ్చయింపఁగోరుదు. మీనిశ్చితార్థము నాకుఁ గర్తవ్యమగును. మఱియొకమాట. జరిగినదానిఁ గూర్చి విమర్శించుట గతజలసేతుబంధనమగునని కొందఱు భావింతురు. ఆమత మంత సమాదరణీయముగాదు. ఉత్తరార్థ నిశ్చయమునకుఁ బూర్వార్థ పరిజ్ఞానము మిక్కిలి తోడ్పడును. ఈ సంగతి మఱువవలదు. రాముఁడు లంకపై దాడి వచ్చును. వానిబలపరాక్రమములు జనస్థానవృత్తాంతమే చాటుచున్నది. వానివెంట వానరులు వేలకొలఁది వత్తురు. కపులెంతటివారో మీరే యూహింపనగును. ఆవిషయమై సందేహమున్నచో నేటిలంకాపరిస్థితి నిశ్చయించును. సముద్రమును దాఁటుటెట్లందురా ! రాముఁడు దివ్యాస్త్రసంపన్నుఁడు ; ఒక్కకోలతో మున్నీరు నింకించి దాఁటును ; లేదా, సేతుబంధనముగావించి వచ్చును. ఎట్లోమనకు వానికి వైరము పొసఁగెను. ఈవైరాగ్ని తుది

ముట్టక చల్లారదు. మాలో నెవరును వెనుదీయరు. ఈసందర్భము లెల్లఁ బర్యాలోచించి మనకును మనపురంబునకును హితవగు వెరవు నూహింపు మనెను.

సేనాపతులందఱులేచి 'దేవా! వివిధశాస్త్రాస్త్రప్రహారదక్షులైన యోధానుయోధులు లక్షలకోలఁదినుండఁగా రాక్షసానీక మనంతముగా నుండఁగా నీవిట్లు డీలుపడనేల? పాతాళగతభోగవతీపురంబును ముట్టి పన్నగులనోర్చి జయశ్రీని బందిగొన్న నీవిక్రమంబును, కైలాసగిరీంద్రము నూటాడించిన నీబాహుబలంబును, కుబేరుని డెసలుకుఁ దఱిమి పుష్పకవిమానంబును గైకొన్న నీపరాక్రమంబును, దానవేశ్వరుని, మయుని భయభ్రాంతునిగాఁ జేసి తదీయపుత్త్రికారత్నంబును మందోదరిని భార్యగాఁ జేకొన్న నీ సాహసంబును, మధుదానవవీరుని బాధాక్రాంతునిగాఁ జేసిన నీవీర్యంబును రసాతలవాసులను వాసుకి తక్షకాదుల నురుమాడి వశవర్తులుగా నొనర్చిన నీతేజంబును నేఁడేమాయెను? అక్షయబలులై శూరశిఖామణు లనుపేరు వడసి తపోలబ్ధవరగర్వోన్నతి విఱ్ఱవీగుచుండిన కాలకేయ దానవులంతటి వారు నీతో మత్సరించి సంవత్సరము పోరి తుదకుజితులై శరణుచొచ్చి యాత్మదోషపరిహారార్థమును భవద్దయార్ద్రస్నేహ సంపాదనార్థమును వివిధ మాయలను నీకుఁ గఱపి తమప్రాణములను దక్కించుకొనరా? ఈసంగతి లోకమెఱుంగదా? వేయేల? మృత్యువన్న జీవలోకమెల్ల నడ్డుడుకును. అట్టి యమునిపై దండెత్తి మృత్యుదండమహాగ్రాహంబును శాల్మలీద్రుమమండితంబును కాలపాశతరంగాభీలంబును కాలకింకరపన్నగసంకులంబును నైన తన్నగరసాగరంబుఁజొచ్చి మిత్తినోర్చి యత్యంతవిజయంబునంది జగజ్జేగీయమానకీర్తినాపాదించితివి. అట్టివీరాతివీరునకు నీకు నరమాత్రుఁడు రాముఁడు గీముఁడు నేపాటి యగు? ఆయలఁతికై యింతమంతన మేల? దేవా! నీవునీ గద్దె దిగకయే విజయలక్ష్మిని గ్రహింతువు. ఏ స్థిరమతి మహేశ్వరుని మెప్పించి మహానర్ఘవరంబులఁ బడసెనో, శక్తితోమరంబులు మహానక్రమీనంబులుగాఁ ప్రేవులు శైవలంబుగా గజంబులు భూరికచ్ఛపంబులుగా హయంబులు మండూకంబులుగా రుద్రాదిత్యులు మకరంబులుగా మరుద్వసువులు మహోరగంబులుగాఁ బదాతిపులినంబుఁ గలిగి రథాశ్వగజజలరాశితో నిండి యక్షోభ్యమైన దేవబలసాగరంబును జొచ్చి కలంచి యింద్రుని మీ

సాలఁబట్టి తెచ్చి యేధీరాగ్రణినీ మోసలనిడెనో యావీరశిఖామణి నీపుత్రరత్నమింద్రజిత్తు నీదండనుండగా నయ్యలఁతిని లెక్కింపనేలా ? రక్షోనాథా ! నిక్కముగా నీకిట్టిబెగడు కలుగదు. మాధైర్యోత్సాహశక్తిసంపదలఁ బరీక్షింప నిట్లందువు.

మ॥ నరమాత్రుండఁటతాను, కోఁతులఁట సైన్యంబెంచఁగా, ఘోరసా
గరమున్ దాఁటి యనన్యసాధ్యయగు లంకందాఁకి లోకైక భీ
కరరక్షోబలమున్ జయించునఁట, యీగాథల్ వినన్ నవ్వరే ?
ధరలోనిట్టి బిభీషికల్ గలఁచునే దైత్యేశ ! నీవర్గమున్ ?

అని వచించిరి.

అంతఁ బ్రహస్తుఁడనువాఁడు లేచి 'రాక్షసేశ్వరా ! దేవదానవగంధర్వులుగానీ పతగోరగపిశాచంబులుగానీ నిన్ను దర్శింపఁజాలరు. కోఁతిమూఁకసంగతిపలుకనేల ? నాఁటిహనుమంతుని నేఁతలందువా ? మేము పరాకునుంటిమి. అందువలన వానిమొండగములుసాగెను. ఒండుచో వాఁడు ప్రాణంబులతో జనియుండఁడు. ఆజ్ఞయేని యీక్షణమ చని శైలశైలాంతరములు వనవనాంతరములు వెదకి భూమండలంబు నవానరంబుగా నొనర్చి వత్తును. రజనీచరాగ్రణీ ! నీలెంక ప్రహస్తుఁడుండఁగా నీదిక్కున వ్రేలు చూప నోర్తురా ?' యనెను. దుర్ముఖుఁడనువాఁడతని మాట నందుకొని 'రక్షోనాథా ! ఆకోఁతి మనకుఁగావించిన తలవంపుమన్నింపరాదు. ఊరుపేరులేని వానరుఁడు వచ్చుట లంకచొచ్చుట రాక్షసాంతఃపురములను బరిభవించుట—ఇవివిన్ననగరా ? నాడుసుత నాయొడలు మండుచున్నది. దేవరవారియాజ్ఞకు వేచియున్నాను. ముదలయేని యిప్పుడ చని రసాతలము జొచ్చినను సముద్రాంతరమున డాఁగినను వారినెల్లఁ జిక్కించుకొని వధించి వత్తు' ననెను. వజ్రదంష్ట్రుఁ డనువాఁడులేచి 'నాయీపరిఘ మాంసశోణితరూషితమైనది సాక్షిగాఁ జెప్పుచున్నాను. దొంగకోఁతిని పెద్దచేసి పలుకుచున్నారు. ఇంతకన్న వెఱ్ఱితనముకలదా ? వానిజోలిమాలి మనవైరమునకు మూలమైనరాముని వానితోనున్నలక్ష్మణసుగ్రీవులను దలంపుము. మనకు మగఁటిమిగలదేని వారియెడఁ జూపనగును. ఒక్కపూఁట నాకు సెలవిమ్ము. వారిని భూతంబులకు బలిపెట్టి కోఁతులుగీతులగునట్లొనర్చి వత్తును. ఒక

మాట ; శత్రువులనుపాయంబున జయించుట యుక్తము. ఏకవాక్యము లేకయే కార్యసిద్ధియగును. మార్గమందురా ? నాకుఁ దోఁచినది విన్నవింతును. మనము కామరూపులము ; తలఁచినరూపముఁ దాల్పనోపుదుము. మనలోఁ గొందఱు మనుష్యరూపంబులు ధరించి రాముకడ్డకుఁబోయి భరతుఁడు పంపఁగా వచ్చిన పదాతులమని రామునకు నమ్మఁబలుకవలయును. అతఁడు వారిని జేరఁదీసి మాట్లాడుచుండును. అంతలోనఁ గొందఱము గగనస్థులమై యస్త్రశస్త్రంబులనుఁ గురిపించి వానరసైన్యంబును జీకాకుపఱుపవలెను. ఆగందరగోళములో మనవారు తెంపుచేసి కపిసైన్యమును జెండాడవలయును. రామలక్ష్మణులుగూడ నత్తుములయుద్ధములో నశించినను నశింతురు. ఒకవేళ తప్పించుకొందురేని కపిసైన్యమెల్ల నశించుటవలన నసహాయులై వెఱపుగానక ప్రాణపరిత్యాగమొనర్తురు. ఇంతకన్న మంచిదారిదోఁపదు' అనెను. నికుంభుఁడనువాఁడు లేచి 'ఇంతయేల ? మీరెల్లరు నిందే యుండుడు. నేనొక్కఁడఁజని వారిపీఁచమడఁచి వత్తు' ననెను. అంతనున్న నికుంభాదులందఱు నేననేనను లేచి పరిఘప్రాసశక్తిశూలాద్యాయుధములను వారివారిచేతి వానిని ద్రిప్పుచుఁ బ్రయాణోన్ముఖులైరి.

## + విభీషణోపదేశము +

విభీషణుఁడు వారి దీవ్రమాపి కూర్చుండఁబెట్టి ముకుళితహస్తుఁడై రావణుని సమీపించి 'అన్నా ! సామదానంబులకుఁ గానికార్యములపట్ల దండోపాయము శరణీయమని పండితులు వచింతురు. ముందుగా దండోపాయంబును బ్రయోగింపరాదు. మఱియు నది విషయాసక్తులై మైమఱచియుండు వారియెడను, ముట్టడించిన శత్రువులయెడను, దైవము ప్రతికూలముగానున్నవారియెడను ఫలకారియగునుగాని తదితరులయెడ నుపయోగింపదు. అన్నా ! రాముని వధించివత్తుమని మనవారు వచించుచున్నారు. వధించుట యటుండనిమ్ము. వానినెదిరింపనైన నెదిరింపఁగలరా ? అతనిసంగతి యెఱింగిన వారిట్లుపలుకరు. ఆయన నిరంతరము నప్రమత్తుఁడై యుండును. వానిని మోసగింపఁ దరముగాదు. మఱియు నమ్మేటి విజిగీషువును జితరోషుఁడును బలశాలియునై మెలఁగుచుండును. అట్టిదురాధర్షునిఁ జెనక సాధ్యముగాదు. కావున రాక్షసమాయల నమ్మి త్వరపడవలదు. రాక్షసబలము లేదాయనవచ్చును. రాక్షసులు మహాబలశాలురనుట నిక్కము. వారికన్న

బలాఢ్యులుగలరు. అదిమఱువవలదు. హనుమంతుఁడే యిందులకు నిదర్శనము. అన్యులకుఁ దలంపునఁగూడ తరింపరాని ఘోరసాగరంబును శతయోజనవిస్తీర్ణముగలదాని నతఁడొక్కగంతున దాఁటెను. ఇంతదుష్కరకర్మ మొనర్చిన యతఁడెంతటి వాఁడో మీరే యూహింపనగును. అన్నా! ఏపనిగాని దైవానుకూల్యము గలిగినఁ జక్కపడును; దైవము ప్రతికూలించినప్పుడు గోగంతపనియైనను గాదు. హనుమంతుని సాగరోత్తరణమునుబట్టి వానికి దైవమనుకూలమగుట స్పష్టము. స్వపరబలంబులను బరిగణింపక కయ్యమునకుఁ గాలు ద్రవ్వరాదు. మనవారు తమబలపరాక్రమంబులనే యుగ్గడించుచున్నారుగాని యెదిరిసంగతిని దలంపరు. మన ఖరదూషణు లెంతటివారో, వారికిజోడగువీరులు మనలో నెందఱుగలరో నేనుచెప్పనక్కఱలేదు. అట్టిఖరదూషణులును వారివెంటఁ బదునాల్గువేలరాక్షసవీరులును దినార్ధములో రామునిచేత మడిసిరి. అతనిశక్తిసంపదలెట్టివో మీరే తెలపోయుఁడు. అన్నా! అన్నిఁటికి ధర్మమే మూలము. ధర్మవ్యతిక్రమ మెవ్వనికిని దగదు, ధర్మవ్యతిక్రాంతుఁడు సుఖమెన్నఁడుఁ బడయఁడు. ధర్మానుసారికి సమస్తసంపదలు చేకూఱును. ధర్మము రాజవశమైయుండును. రాజుధర్మమును దప్పినఁ బ్రజలు నట్లగుదురు. 'యథారాజా తథా ప్రజా' యన వినమా? నీవు రాక్షసేశ్వరుఁడవు గాని యేతన్మాత్రుఁడవు గావు. రాక్షసులు నిసర్గతమఃప్రధానులు గావునఁ జీటికి మాటికిఁ జెలఁరేఁగి ధర్మాతిక్రమణంబునకు సాహసించుచుందురు. వారిని దిద్ది చక్కచేయుభారము నీయెడనున్నది. వారుత్రొక్కునట్టి యపమార్గములను రాజు సమ్మతింపరాదు. ప్రకృతము విచారింతము. రామునితోడ యుద్ధమును దలపెట్టిరి. ఈ యుద్ధము ధర్మమా? వానితో మనకుఁ బగయేలవచ్చెను? ఖరదూషణాదులను నిష్కారణముగా నతఁడు వధించుటయే వైరమూలమని చెప్పుదురుగాఁబోలు. నిజము విచారింపవలయును. రాముఁడు మనవారిమీఁద దాఁడి వెడలి రాలేదు. ఆయన పితృవాక్యపరిపాలనవ్రతమనుష్ఠించి భార్యాద్వితీయుఁడై కాననంబులకు వచ్చి మునివృత్తి నుండెను. వానిరూపసంపదకు శూర్పణఖ కామమోహితయయ్యెను. ఏకపత్నీవ్రతుఁడు గావున రాముఁడామె మత మంగీకరింపఁడయ్యెను. శూర్పణఖ వానియెడ నీర్ష్యామత్సరంబులువహించి వానికెగ్గుగావింప సమకట్టెను. ఆయన యందులకు నాగ్రహించియు స్త్రీ

గావున వధింపనోడి యంగభంగముమాత్రము గావించి శూర్పణఖను తఱిమెను. అది పగఁబూని ఖరదూషణులకు బొంకి వారిని రామునిమీఁదికిఁ బురికొల్పెను. వారు నిజమువిచారింపక శూర్పణఖను నమ్మి రామునిధర్షించిరి. ఆశూరుఁ డాత్మరక్షణార్థము వారితోఁ బోరవలసివచ్చెను. రణరంగంబున ఖరదూషణాదులు మడిసిరి. శూర్పణఖ యంతతో మిన్నకుండక నీకడకు వచ్చి కల్లలాడి నీయెదలో శాత్రవభావంబును స్త్రీ మోహంబును రేఁకెత్తించెను. నీవు క్రోధవివశుండవై పగదీర్చుటకుఁగా రామునిపత్ని నపహరించి తెచ్చితివి. ఆయన తనసతియెందుఁ బోయెనో తెలియక దేశమెల్ల వెదకించి తుదకు సంగతి యెఱింగి పత్నీసంరక్షణార్థము లంకపై దాఁడివెడల నిశ్చయించి వానరబలసమేతముగా వచ్చుచున్నాఁడు. అన్నా! ఇందు రాముని నేరమేమి గలదో యాయన యధర్మమేమిచేసెనో మనవైరమునకుఁ గారణమెవ్వరో వ్యవసాయాత్మకబుద్ధితో నీవే యూహింపుము. పరదారగమనంబు మహాపాతకమగుననియు దానివలన నాయుక్షీణము సర్వనాశనముఁ గలుగుననియుఁ శాస్త్రంబులు ఘోషించుచున్నవి. అనుభవముగూడ నట్లె బోధించుచున్నది. కావున నిట్టియకార్య మెవ్వరికినిఁ గాదు. మీఁదు మిక్కిలి రాజుసంగతి చెప్పవలయునా? అన్నా! ఎట్లో ప్రమాదపడితివి. 'ప్రమాదోధీమతామపి' యని గలదు. తప్పును సవరించుకొనుట ప్రాజ్ఞుల లక్షణము. తప్పనెఱింగియుఁ దాని నూర్జితపఱచుట విజ్ఞులకుఁగాదు. అన్నా! నావిన్నపమాలకించి యాత్మదోషపరిహారార్థము సీతను రామునకు నప్పగించి యతనితో నెయ్యమొనర్పుము. ఈసేఁతవలన నీకీర్తి ముల్లోకములవ్యాపించును. నీప్రవర్తనము లోకమునకు సన్మార్గప్రదీపకమగును. ధర్మము నుద్ధరించినవాఁడవగుదువు. అన్నా! లౌకికదృష్టితో విచారించినను రామునితోడి పగమేలుగాఁ దోఁపదు. ఆయన మహావీర్యసంపన్నుఁడు. వానిశక్తిసంపదలు లోకాతీతములు. మించినవైరితో విరోధించుట లగ్గుగాదు. నామాట వినుము. సీతనుగొనిపోయి రామునకు సమర్పింపుము. ఎల్లవిషయముల నీకు మేలగును. జాగువలదు; 'ఆలస్యమమృతంవిష' మ్మందురు గదా. రాముని కఠోరబాణాగ్నులు లంకను గూల్పకమున్నె యీపనిచేయుము. నీవట్లు చేయవేని యంతతో నీకొక్కఁగొనసాగదు. రాముఁడు రాక్షసోన్మూలనపూర్వకంబుగా సీతను బరిగ్రహించును. అన్నా! భ్రాతృప్రీతి నన్నాఱ

కుండనీయదు. ఆకారణంబున నింత తెంపుచేసి చెప్పితిని. ఇచ్ఛకములు వినవలదు. నీమతము మాఱుదేని నీవు శరత్కాలరవిదీప్తివలె మహాతీక్ష్ణం బులును సవ్యాగ్రపుంఖంబులును నమోఘంబులునునైన రామవిశిఖంబులకు గుఱియగుదువు. కోపమువలదు. తామసి తా మసియగునందురు. కోపము నిఖిలసుఖంబుల సమస్తధర్మంబులను హరించును. శాంతము పరమశ్రేయ స్కరము. దానివలన ధర్మంబును ధర్మంబువలన సంతోషకీర్తిసంపదలును వర్ధిల్లును. అన్నా! నాయెడఁ బ్రసన్నుండవై నావచనమొనర్చి ధర్మము నుద్ధరించి పాపమెడసి ప్రపంచమునకు సన్మార్గదర్శకుండవును, రాక్షస లో కంబునకుఁ బ్రాణదాతవునై చిరకాలము యశఃకీర్తులఁగూడి సుఖముండుము' అని విన్నవించెను. రావణుఁడు తమ్మునివిని వివిధములైన తలంపులచిక్కు నకుఁ జిక్కి యేమియుఁబలుకక నాటికి సభచాలించి యంతఃపురమునకుఁ బోయెను.

## —* రావణ ద్వితీయసభ. *—

మఱునాటి యుదయంబునఁ దూర్యనాదంబులు చెలరేఁగెను; విద్వజ్జ నులు పరివేష్టించి యర్హాసనంబు లలంకరించిరి; కుశాగ్రమతులగు మంత్రి పుంగవులు కొలువైరి; ప్రమదారత్నంబులు కరకమలంబుల వీచోపులు ధరించి నిలిచిరి; నృత్తగీతాదివాద్యంబు లారంభమయ్యెను. రాజవిజయా ర్థము పుణ్యపుణ్యాహమంత్రంబులు పఠింపఁబడుచుండెను; మంత్రవేత్తలు దధిఘృతపుష్పాక్షతల నభిమంత్రించుచుండిరి; కార్యకరణదక్షులు వేచి యుండిరి. సభామండపము గంధర్వలోకమునకు సాటియగుచు దేవనగరంబు తోఁ బంతగించుచు భోగిభవనంబు నపహసించుచుఁ బరిఢవిల్లెను. రావ ణుఁడు యథాకాలమునఁ బ్రవేశించి పేరోలగము దీర్చెను.

## —♦ విభీషణపరితాపము. ♦—

విభీషణునకు నాటిరేయియెల్లఁ గన్ను కూర్కకుండెను; వివిధ భావంబులు తలసూపి వానినెంతయుఁ గలంచెను; ధర్మము బహురూపంబుల గోచరించి యతనిని హెచ్చరించెను; రాష్ట్రము రూపుదాల్చివచ్చి ప్రాణ ప్రదానముఁ గోరెను. అతఁడిట్టి చింతలతో రేయెల్లఁ బుచ్చి తీవ్రసంతాప తప్తుఁడై 'అహో! ఏమిసేయుదు; చెప్పఁదగినదంతయుఁ జెప్పితిని. ఎందు

నను నాయన్నమతము మరలునట్లు దోఁపదు. ఎన్ని వ్రతము లాచరించినన గఠోరతపంబు లెన్ని యొనర్చినను నాయన్నను రజోమాలిన్యంబింకను వదలదు. నాయన్న పాషండుఁడు గాఁడు. అతఁడు ప్రతిదినముఁ గోటిశివలింగంబలకు నర్చనలు గావించుచుండును. మందమతియుఁ గాఁడు; వానిశాస్త్ర పరిజ్ఞానమునకు మేరగలుగదు; భూతదయ లేదాయనుటకు బంధుమిత్రాదులందఱకెంతయు నెనరుంచును. ఇట్టి వాఁడయ్యు నతఁడిట్లుగావించుట పూర్వకర్మ దుర్వాసనావిశేషము గాని వేఱుగాదు. ఎంతటివారికిని బుద్ధి యప్పుడప్పుడు ప్రసుప్తమై మూఢమగుటగలదు. అట్టిది ప్రబోధంబున వికసించుటయుఁ గలదు. నాయన్న బుద్ధి నేఁడు ప్రసుప్తమైయున్నట్లు దోఁచుచున్నది. వానికి యథాశక్తి ప్రబోధ మొనర్ప నేని నాధర్మమును దప్పటగును. అతఁడు వినఁడా? నాధర్మమును నేను నిర్వర్తించుటగును; ఫలము నాయధీనముగాదు. అత్యంతగాఢదుర్వాసనావిష్టులు తత్ఫలము ననుభవింపక తీఱదు. అట్టివారియెడ నీశ్వరుఁడుగూడ ననీశ్వరుఁడగునందురు' అని తలపోసి కృతనిశ్చయుఁడై సభామండపంబునకుఁ జని సింహాసనాధిష్ఠితుఁడైయున్న యన్నకు జయశబ్దపూర్వకముగా నమస్కరించి యథాసనంబునఁ గూర్చుండెను. కొంతవడికి నెల్లరుఁ దమతమకార్యములు విన్నవించి యాజ్ఞలు వడసిచనిరి. మంత్రులు మాత్రము నిలిచిరి.

—* విభీషణుఁడుమరల హితముపదేశించుట. *—

విభీషణుఁడది యవసరంబుగా రాక్షసేశ్వరుని డాయఁ బోయి 'అన్నా! నానిన్నటివిన్నపమేమాయెను. సీత లంకానగరముఁ జొచ్చినది మొదలు పెక్కులుగా నశుభనిమిత్తంబులు గానవచ్చుచున్నవి. సమంత్రకంబుగా వ్రేల్చినను వీతిహోత్రంబులు విస్ఫులింగములను జిమ్ముచుఁ బొగచూఱునే గాని చక్కఁగా వెలుగవు. అగ్నిహోత్రశాలలందును మహానసములందును వేదాధ్యయనస్థానములందును బెనుబాములు ప్రాకులాడుచున్నవి. హోమార్థము తెచ్చిన యాజ్యపురోడాశాదులకుఁ జీమలెక్కుచున్నవి. ఆలపొదుగులెండెను; వీరకుంజరంబులు మదముడిఁగెను; అశ్వంబులు దీనదీనముగా సకిలింపసాగెను; వానిముందువైచిన గ్రాసమట్లేయున్నది. ఓష్ట్రఖరాదులు రోమములను రాల్చుచుఁ గన్నీరు నించుచు రోదనములు గావించుచున్నవి; వానికిఁ జేయు చికిత్సలెల్ల వ్యర్థమగుచున్నవి. వాయసము

లెందుఁజూచినను గుంపులు గుంపులుగాగూడి యఱచుచుగుంపులు గుంపులుగా విమానాగ్రంబులందు వ్రాలుచున్నవి. గృధ్రములు గుంపులుగుంపులుగా వ్రాలనియిల్లు మననగరమందొక్కటియుఁ గానరాదు. వఱఁడులు ప్రాతస్సాయంసంధ్యలరెంట నగరంబు సమీపించి యమంగళంబుగాఁగూయుచున్నవి. మాంసాశనములైన శునకాదిమృగంబులు నగరద్వారంబులందు బారులు దీఱి పిడుగుమ్రోతలఁబోని ధ్వనులు గావించుచున్నవి. ఈదుర్లక్షణంబులకుఁ దగినట్లుగా వనభంగలంకాదహనాదులు గలిగెను. ఈ దుర్నిమిత్తంబులను గాంచి మనవారిలో నెఱుకగలవారు భయపడుచున్నారు. ఇట్టి శకునంబుల ఫలాఫలంబులు సర్వశాస్త్రవేత్తవు నీకుఁ దెలియనివి గావు. దోషంబులకుఁ గొన్నింటికిఁ బ్రాయశ్చిత్తంబులను నిశ్చయించిరి. ప్రాయశ్చిత్తములొనర్చి దోషములను బాసి బాగుపడుటయుఁ గన్నారఁ జూచుచున్నాము. కావున నావచించిన దుర్నిమిత్తంబులకుఁ దగునుపశాంతిఁ గావింపుము. రాష్ట్రమందుఁ గలకలమును బెరుఁగనీయరాదు. అది తలయెత్తుటకుమున్న శాంతులొనర్చి ప్రజలకుఁ బ్రశాంతిఁగూర్చుటొప్పు. శాంతి యేమందువా ? ఏసీత లంకానగరంబును మెట్టినది మొదలుగా నివియెల్లఁ గలుగుచున్నవో యాసీత నిందుండి తొలగించి రామున కొప్పగించుటయే యిందులకు నుత్తమోత్తమ శాంతియగును. అన్నా ! తెలిసియో తెలియకో తోఁచినంత పలికితిని. నీమేలును రాష్ట్రముమేలును గోరి యిట్లుచెప్పితిని గాని యొండుతలంపుతోఁ గాదు. నాయెడ నేరమెంచవలదు. నావచించిన దుర్నిమిత్తంబుల నంతఃపురస్త్రీజనమెల్లఁ బరికించి తహతహపడుచున్నది. వారి వలనఁ గూడ నాసత్యాసత్యము తెలియంగనగును. ఈసంగతి మనమంత్రులకు మాత్రము తెలియదా ? నీకువెఱచి వారు మిన్నకున్నారు. భ్రాతృవాత్సల్యము నన్ను మిన్నకుండనీయదు. అన్నా ! చక్కగా నాలోచించి యుక్తమగునట్లు చేయు' మని ప్రసాదస్తుతివచనంబుల హితముపదేశించెను. వాని వచనంబులు మృదులంబులును యుక్తిసహితంబులు నగుటయేగాక హితంబులును త్రికాలశుభప్రదంబు నగుటకు మంత్రులెల్లరు లోలోన సంతసించిరి. రావణుఁడుమాత్రము మహాక్రోధవివశుఁడై 'వట్టిభీషికలు రావణునిఁ గలఁచునా ? పిఱికిగుండెలను గొట్టుగూడఁగలఁచును. నాయెడ నట్టివి సాగవు. జమునకు నైతము వెఱువని రావణుఁడిట్టి యుపేక్షణీయంబులకు భయపడఁడు.

సీత నాచేతఁజిక్కెను. ఆయింతిని రాముఁడు కలలోఁగూడఁ బడయఁజాలఁడు. ముల్లోకములు వానికిఁ దోడై వచ్చుఁగాక. అతఁడు నన్నోర్చిపోనేర? డని గంభీరంబుగాఁ బలికి విసువు చూపుచు సభ చాలించిచనెను.

—♦ రావణ తృతీయ సభ ♦—

నాఁటిరేయి రావణుఁడు నిద్రకుఁ బగయయ్యెను. సీతామోహము పెక్కురూపంబులఁ దాల్చి వానికిఁ గలువరము కలిగించెను. విభీషణుని వచనంబులు తిరస్కారభావమయంబులను భ్రాంతి పైకొనెను. ఆపల్కులొక్కొక్కటియు శూలమై నాఁటి వానిని నాపాదమస్తము నొప్పించెను; మంత్రులతూష్ణీభావము వానికోపాగ్నిని జెలరేపెను. రావణుఁడట్లు వివిధభావంబులకుఁజిక్కి యారేయెల్లఁగడపి పూర్వమునకన్న మున్నుగా లేచి, హేమజాల మణివిద్రుమ మాలాసమలంకృతంబైన రథంబారోహించి ఖడ్గధారులు కొందఱు ముందు నడువఁగా, వివిధవికృతవేషధరులుకొందఱు పార్శ్వభాగంబులందు వచ్చుచుండఁగా, అతిరథుల రథగజంబులు పృష్టభాగంబు నంటి రాఁగా నాశ్వికులు హయంబుల నధిరోహించి ధారామండలగతులఁ ద్రొక్కించుచుండఁగా గదాపరిఘంబులను శక్తితోమరంబులను శూలాయుధంబులను ధరించి కొందఱు కొలుచుచుండఁగాఁ బూర్ణచంద్రుఁడువలె శ్వేతచ్ఛత్రంబు శిరోపరిభాగంబున విరాజిల్లుచుండఁగా, స్ఫటికదండచామరంబు లిరుదండల వీచుచుండఁగాఁ దరలి వచ్చి సభామందిరముఁ జొచ్చి వైడూర్యరచితంబును బ్రియకచర్మాచ్ఛాదితంబును నైన సింహాసనంబును జయజయధ్వానులతోడ నధిష్ఠించి బురుసాపట్టు దిండుపయి నొఱఁగి రక్షోవీరులను కొనిరమ్మని దూతలకుఁ గనుసన్నల నాజ్ఞాపించెను. వారు తోడ్తోడఁజని ఱేనియాజ్ఞను బ్రకటించిరి. గృహాంగణంబులనుండి కొందఱును, శయనంబులనుండి కొందఱును, విహారవనంబులనుండి కొందఱును, రాక్షసవీరులు వేనవేలుగాఁ దరలి గజాశ్వరథాదులమీఁద హుటాహుటివచ్చి ద్వారంబునఁ దమతమ వాహనంబులను విడిచి సింహంబులు గిరిగుహాంతరంబును బోలె నమ్మందిరాంతరముఁ జొచ్చి ప్రభుపాదంబులకు నమస్కరించి యథార్హప్రతిపూజలంది కాంచనాసనంబులందుఁ గొందఱును, దర్భాసనములందుఁ గొందఱును, భూభాగంబునఁ గొందఱును యథోచితంబుగాఁ గూర్చుండిరి. అంతలోనఁ గార్యనిశ్చయకుశలులైన పండితులు గూడిరి. వారిని మంత్రిముఖ్యులు చేరిరి. శుకప్రహస్తులును గుంభకర్ణవిభీషణులును

వచ్చి ఱేనికి మ్రొక్కి తన్నియమితాసనంబులను గైకొనిరి. సభామందిర మట్లు రక్షోవీరసంకీర్ణమయ్యును నిశ్శబ్దమయముగా నుండెను ; శ్వాసోచ్ఛ్వాసంబులుగూడ వినరాకుండెను.

రావణుఁడు సభ నెల్లఁ గలయ విలోకించి సేనాపతియైన ప్రహస్తుని వంక మరలి 'ధనుర్విద్యాపారంగతులైన రథికులును హస్తిప సాదిపదాతులును మహోజాగరూకులైయుండ నదనయ్యెను. ధర్మార్థకామంబులనెడి మూఁడింటిలో దేనినిప్పుడు మన్నింపవలయునో తీర్మానింపవలసియున్నది. అర్థనిశ్చయభాగంబున సుఖదుఃఖంబులను లాభనష్టంబులను హితాహితంబులను బరామర్శించి తత్త్వార్థంబును నిశ్చయింపనగును. ఆభారమెల్ల మీపయి మోపితిని. కార్యసమర్థులు మీరువిమర్శించి నిశ్చయించిన యర్థమీనాఁటి వఱకుఁ బొల్లుపోదు. మీతోడ్పాటు గలంతకాలము జయలక్ష్మి నన్నుఁ బాయనోపదు' అని పలికి కుంభకర్ణుని వంకమరలి 'తమ్ముఁడా! నీవు నీయాఱు మాసములనిద్రఁబుచ్చి నేఁడే నీ సభకువచ్చితివి. ఇంతలో జరిగినవృత్తాంతము నీకుఁదెలిసియుండదు. కోసలేంద్రునితనయుఁడు రాముఁడనువాఁడు భార్యాద్వితీయుఁడై రాక్షసభూమియగు జనస్థానముఁ జొచ్చి నిష్కారణముగా మనఖరదూషణాదులను సంహరించెను. ఆమందభాగ్యుని శిక్షించు నిమిత్తము వానిసతిని సీత నపహరించి తెచ్చితిని. భావాభావమధ్యయుఁ బృథులశ్రోణియు శరచ్చంద్రబింబాస్యయు నగు నమ్మగువ యపరంజిబొమ్మయో మయనిర్మితమాయయో యన నొప్పుచు నపూర్వశోభావహయై క్షణక్షణంబు నాకు నూత్నరుచులనుగలిగించుచున్నది. ఆసుందరీచరణారవిందంబులును నయ్యింతి నయనేందీవరంబులును నన్ను మదనవివశుఁడనుగా నొనర్చెను. కామునకు సమయాసమయంబులు గలంగవుగదా. క్రోధామర్షశోకసంతాపాద్యనుచితసమయంబులందు సయిత మతండు తనపని మానఁడు. నా క్రోధము వలసపోయెను ; నాశోకము సన్నగిలెను. నేను వానికిఁ గైవసమైతిని. ఆయింతి నా ప్రణయమును నిరాకరించెను. ఆడుదియు ననియు నావలఁచినదనియు నయ్యవమానంబును సహించి కొంతకాలము వ్యవధియిచ్చితిని. ఆలోనఁ గోఁతియొకఁడు సాగరంబును దాఁటి లంకానగరముఁ జొచ్చి సీతను జూచి యశోకవనంబునుగూల్చి నగరంబును గాల్చి చనెను. నరమాత్రులకు రామలక్ష్మణులకు మనము వెఱవఁబని లేదు. తలంపునఁ

గూడ వారు మనలను జెనకనోపరు. తమ్ముఁడా ! నాడు దేవాసురయుద్ధంబున సకలలోకభయావహంబుగాఁ బోరి నాకు జయశ్రీనిగూర్చిన మీరుండఁగా నొరులకు నేను వెఱవనేల ? అయినను గాలగతిని గార్యగతిని నెఱుంగరాదు. రామలక్ష్మణు లాకోఁతివలన సీతావృత్తాంతము విని సుగ్రీవాదివానరుల సహాయముతో లంకపయి దాఁడివెడలి సముద్రతీరమున విడిసియున్నారు. మనచారులవలన నిది తెలిసెను. తమ్ముఁడా ! సీతను వదలుటకు మనకులధర్మ మొప్పదు ; రాజనీతియుచ్చగింపదు. కావున నప్పడంతిని వదలరాదు. దాశరథులను బరిమార్పక మానరాదు. ఈరెండు కార్యంబులకు ననువైనవెఱవున్ను నిశ్చయింపుము' అని నిజమతంబును సూచించుచు రక్షోవీరులమతంబు నెఱుంగువాఁడువలెఁ బలికెను.

—♦ కుంభకర్ణుఁడు రావణు నుపాలంభించుట. ♦—

అది విని కుంభకర్ణుఁడు చుఱచుఱఁ బొక్కుచు 'అరసి పనిచేయుదురు. నీ మతము విపరీతముగానున్నది. సర్వజ్ఞత్వంబును వహింతువు. ఇచ్చవచ్చినట్లు చేయుదువు. దారితప్పినప్పుడు మీరువారందువు. నాడు సీతను బలాత్కారముగా నపహరించు నాడు మేమేమైతిమి ? మాలో నొక్కనికైనను నీమర్మముఁ దెలిపితివా ? అప్పుడు గాని సలహా లిప్పుడేల ? న్యాయమును విమర్శించి నిశ్చితార్థమతియై కార్యమునకుఁ బూనువాఁడు శుభముఁ బడయును. నీయట్టివానికి సంతాపము తప్పదు. సత్కర్మంబులను గూడ నుపాయంబున సాధింపనగును. ఒండుచో నవి విమమించి యపాత్రాన్నదానమువలె దోషదాయకంబులగును. ప్రాణికి బుద్ధిబలమొక్కటే ప్రధానముగాదు ; దానికిఁ దోడు స్థైర్యముండవలయును. అవిరెండు జతగూడిననాడు జయము స్వతస్సిద్ధమగును. కేవల బుద్ధిబలమెంతయున్నను జపలచిత్తులకుఁ బరాభవము తప్పదు. శత్రువులు సమయాన్వేషులై యుందురు; చపలమతులు వారికి సందుఁగలిగింతురు ; అదనుదొరికినంతనే వారుత్క్రమింతురు. క్రౌంచపర్వతమెక్కడ ? అంచలెక్కడ ? అవి యాకొండలరాయని దాఁటుటకుగా నేండ్లుపూండ్లు ప్రయత్నించి కోరిక నెఱవేఱకుండెను. ఎట్లో షణ్ముఖుఁ డాకొండను దొలిచెను. అదిసందుగా హంసలప్పర్వతేంద్రునధిగమించెను. బుద్ధిశాలియగు నీవు డీనీతిని గ్రహింపవలదా ? అన్నా ! సీతాపహరణం బనాలోచితమేగాక యపాయకరముగాఁ గూడ దోచుచున్

అట్టియకార్య మొనర్చియు నీవిందాఁక జీవించుట మాభాగ్యవిశేషము గాని వేఱుగాదు. ఒండుచో రామునిచేతఁబడి విషమిశ్రామిషభోక్తవలె నెన్న డో యంతరించి యుందువు. నీ సేఁతకిప్పుడు వగచి ఫలముగలుగదు. భావి కార్యంబును వినుము. తగునోతగదో యీపనిచేసితివి. దీనిని నిలఁబెట్టక తీఱదు. ఇప్పుడు సడలుదుమేని మనపరాక్రమంబునకు మాయని మచ్చ యగును ; ఎల్లరకుఁ జుల్కనగుదుము. అంతకన్నఁ దలవంపుగలదా ? నీ కార్యమును సాధించుట మదన్యులకుఁ దరముగాదు. అన్నా ! ఓడకుము. నేనొక్కండ నీమతంబును సమకూర్తును. సురపతి వచ్చుఁగాక ; గ్రహ పతి యడ్డగించుఁగాక, అనిలానలులెత్తి వత్తురుగాక. మఱొక్కరు వత్తు రుగాక. నేను ఱొమ్మిచ్చి నిలిచి వారినెల్లఁ బరిమార్తును. పర్వతాకారుని నన్నుఁ జూచినంతనే ప్రాణులప్రాణంబులు తల్లడిల్లును ; నాసింహనాదం బునకు వైరులగుండియ లవిసిపోవును ; నాపరిఘాప్రహారంబుఁ గాంచి మనిన ప్రాణియింతవఱకులేదు. రాముఁడు లావరి యగుఁగాక ; శస్త్రాస్త్ర విద్యయందు మేటియగుఁగాక ; నాపయి శరవర్షముఁ గురిపించుఁగాక. అంతమాత్రాననే యతఁడు నన్ను జయింపనోపఁడు. వాఁడు తొలిబాణము వైచి రెండవబాణమును సంధించులోపలనే వానిరుధిరంబు లానుదును. భయమువలదు' అని ధైర్యంబు నెలకొల్పెను.

## —♦ మహాపార్శ్వుని ప్రగల్భములు ♦—

కుంభకర్ణుని మాటను మహాపార్శ్వుఁడందుకొని 'దేవా ! మధుపానార్థి యై తేంపుసేసి వెనుబాములపొదదూఱి యీప్సితార్థమును సంతరించియు సేవింపకుండు వెఱ్ఱిగలఁడా ? నీవలపుఁ దీర్చికొనుము. సీత సమ్మతింపదందువు గాబోలు, అదియొక మాటగాదు. కుక్కుటక్రమములేదా ? ఎట్లేని నీకోర్కిఁ బడసి పరితోషమందుము. తర్వాతిసంగతులను జూచికొందము. మీన మేషములెంచవలదు. రానున్నది రాకమానదు. అందులకుగా జంకేవల మేమి ? రాముఁడు గీముఁడు నీయడుగునుగూడఁ గదలింపలేడు. ఇంద్రజి త్కుంభకర్ణులుతోడైయుండఁగా ముల్లోకంబులనుగూడ నీకుఁ బాదాక్రాం తమొనర్పమా ? సామమని దానమని భేదమని ముక్కడులు వచింతురు. అవి యెల్లఁ బిటికిపంద లాత్మభయంబును గప్పిపుచ్చుటకుగాఁ పన్నినపాకులఁగాని

వేఱుగావు. రణశూరులు దండోపాయంబును దక్క నొండుఁగౌరవింపరు. దండము సర్వకార్యసిద్ధికరము. 'నేఁటితలంపుమాని నీయభీష్టంబును దీర్చికొను'మని విఱ్ఱవీఁగుచుఁ బ్రగల్భంబులాడెను.

రావణుఁడు మహాపార్శ్వునకుఁ దలయూఁచి 'వీరావతంసమా! నీ స్థైర్యోత్సాహంబులకు నెంతయు సంతసింతును. రావణునకు భయము గలదో లేదో జగద్విదితము. అకుతోభయుఁ డభీష్టసిద్ధికి వెనుదీయ నేలయని శంకింపవచ్చును. సంగతివినుము. తొల్లి యొకానొకనాఁడు నేను పరమేష్ఠి దర్శనార్థంబు చనుచుంటిని. మార్గమధ్యమునఁ బుంజికస్థలయను నచ్చరలేమ యెదురయ్యెను. ఆకసంబున నగ్నిశిఖవలె వెలుఁగుచు వచ్చుచున్న యా సుందరాంగిని జూచినంతనే నాకు వలరాచవేదు రెగచెను. ఆనవలామణిని బలాత్కరించి దిగంబరఁగావించి యభీష్టముఁ దీర్చికొంటిని. ఆచాన వాడి నడిచెడిన తామరతూఁడువలె విన్నఁబోయి స్వయంభువునొద్దకుఁ బోయెను. చతురాస్యుఁడు నాయెడ నాగ్రహించి 'ఎన్నఁడేనిఁకఁ బరసతిని బలాత్కరించి రమింతువో యాక్షణంబ నీతల నూఱువ్రయ్యలగు' నని శపించెను. ఆ శాపంబునకు వెఱచి సీతను బలాత్కరింపకున్నాను. అనన బోఁడి తనమోఁడిని నేఁడుగాకున్నను రేపైనను వీడి నన్నుఁగూడును. రాముఁడిందు వచ్చి తనను గ్రహించునను పేరాస యాయింతిని నామతంబునకు నిచ్చగింపనీయకున్నది. ఆయాస నిరాశయగునేని సీత తనంతటతానే నన్ను వలచును. రాముఁడిందు వచ్చుట కల్ల; నాసంగతి యతఁడెఱుఁగునేని యిందుఁ రాఁగలలోఁ గూడఁ దలంపఁడు. కాదని వచ్చినను గాలునిపరమగునేగాని ప్రాణములతోఁ బోఁజాలఁడు. అతఁడు కందరాంతరసుప్తసింహంబునట్లు నన్ను లేపుచున్నాఁడు. మృత్యువును దాఁకిఁ తట్టి మేల్కొలిపినవాఁడు మనునా? నాబలోద్ధతిని వానరసైన్యమెల్ల సూర్యోదయంబున నక్షత్రమండలమట్లు మాయనున్నది. కుబేరుఁడంతటివాఁడు స్వభుజాపరిపాలిత లంకాపురిని నాకు సమర్పించి చనెనఁగా రాముఁడు గీముఁడేపాటి యగు' నని స్వోత్కర్షముగాఁ బలికెను.

— విభీషణుఁడు మూఁడవసారి రావణునకు హితము బోధించుట —

విభీషణుఁడు వారిప్రగల్భములెల్ల విని 'రాక్షసేశ్వరా! సీతను వల

చుట పెనుబాముసు వలచుటగుసు. పర్వతశిఖరాకారులును దంష్ట్రాన ఖాయుధులును నైన వలీముఖులు లంకలో నడుగిడుటకు మున్నే, రామ కార్ముక నిర్ముక్త వజ్రోపమ శిలీముఖంబులు రాక్షసముఖ్యుల తలలను దఱుగు టకు మున్నే, మైథిలిని గొనిపోయి దాశరథికి నొప్పగింపుము. వారవీరి యుత్సాహ వచనంబులను విని చెడవలదు.' వేయేల !

"శా॥ నీకంఠార్పిత కాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కాకస్సంచయ కాళరాత్రి గళబద్ధోదగ్ర కాలాహి క
న్యాకారాగతమృత్యు వీజనకకన్యన్ వేగ నొప్పించి లో
కైకత్రాణుని రామునింగనుము నీకీబుద్ధికాకుండినన్ ॥"

అని పలికి ప్రహస్తుని వంకc దిరిగి 'ప్రహస్తా ! రామబాణశక్తి నెఱుంగవుగావున నిట్లాడుదువు. కుంభకర్ణుcడుగానీ యింద్రజిత్తుగానీ తుదకు రాక్షసేశ్వరుcడుగానీ రాము నెదుట నిలువనోపరు. నీయాదురుపదేశంబును రాముcడు విన్నచో నిన్ను మననీయుcడు. సూర్యుcడడ్డుపడినను దేవేంద్రుని యొడిలో దాcగినను బాతాళముc జొచ్చినను రాముcడు నిన్ను విడువcడు. ఱేcడు ప్రమాదపడినను మంత్రియగువాcడు తనయేలికకు హితముచెప్పుట ధర్మము. నీయట్టి మంత్రిని గని విని యెఱుంగము. మీరెల్లరు దేహబలమును నమ్మి గగనమందిరనిర్మాణములు గావించుచున్నారు. అధర్మబుద్ధికి స్వర్గము లభించినను లభించునుగాని మీతలంపు మాత్ర మెన్నడును ఫలింపదు. మన మెల్లరము నేకముఖంబునc దలపడినను రాముని జయింపc జాలము. వాని కోలయొక్కటి మనలనెల్ల వీచి సముద్రాంతమునc బాఱవైచును. రాముcడు ధర్మప్రధానుcడు ; అతనిధర్మ కవచంబును భేదింప మన తరముగాదు. అతcడు మహారథుcడు ; మనయాటలు వానిమ్రోల సాగవు. అతcడు లోక రంజకుcడు ; చీటికిమాటికి నాగ్రహింపcడు ; వానియాగ్రహము ప్రళయ కాలానలతిరస్కారిగా దహించును. వానిప్రతాప బలోన్నతులను విరాధ కబంధవాలివధలు వేనోళ్ళc జాటుచున్నవి. వానికార్యదక్షత యెట్టిదో వానివెంటవచ్చుచున్న వానరసైన్యమే ప్రకటించుచున్నది. అట్టివానితో విగ్రహింపనగునా ? రాక్షసేశ్వరుcడు సప్తవ్యసనాభిభూతుcడై హితా హితంబులు పరికింపక రాక్షసవినాశకార్యమును దలపెట్టెను. మీరు వానికి

హితశత్రువులుగాక నిక్కపుమిత్రులైనచో నిట్లుపదేశింతురా ? ఇట్టి యిచ్చకములాడుదురా ? రామవైరసర్పంబు మహాదీర్ఘమైనది. వేయితలలు విచ్చి మనఱేనిని జుట్టుకొనెను. అది ముట్టక మున్నె యితనిని గాపాడఁ దగును. ఱేఁడు దుష్పథంబును ద్రొక్కినప్పుడు వానిని భూతావిష్టునివలెఁ జుట్టి పట్టి యెట్లయినను మంచిమార్గంబునకుఁ ద్రిప్పుట మిత్రుల కార్య మగును. రావణుని సొమ్ము దినుచు వానివలన సమస్తలాభములు పడయు చు నున్నారు. ఆపత్కాలంబున వానికి మేలొనర్పరేని గృతఘ్నులగు దురు. లక్ష్మణసాగరము ఘూర్ణిల్లి రామబడబాగ్నిని రేపెను. ఱేఁడా బడబానలపరిదగ్ధుఁడు కానున్నాఁడు. ఎట్లేని నితని నుద్ధరించుట మీకగు ను. ప్రహస్తా! లంకాపురంబునకుఁను దస్వామినకును దదీయరాక్షసలోకంబు నకును హితముఁగోరి యింతగాఁ జెప్పుచున్నాను. అధర్మము వలదు ; ధర్మమును మన్నించి సీతాదేవిని రామున కిప్పింపుఁడు' అనిచెప్పెను.

—♦ ఇంద్రజిత్తు విభీషణు నధిక్షేపించుట ♦—

ఇంద్రజిత్తు విభీషణునకు నెంతయు లోలోనఁజింతిల్లి 'చిన్నాయనా! నిన్ను భయము పైకొనెనని తలంతును. కాదేనిఁ బౌలస్త్యుం డిట్లాడునా ? నీయట్టి పిటికి మాకులంబున నీవొక్కరుండవ కానవత్తువు. ఒండుగలుగఁడు. కటా ! రాచబుడుతలను బెద్దచేసి యింతగాఁ బలుకుదువు. నీకెంతయు వగపగుచున్నది. వారు మనలోఁ గూనకుఁగూడఁ జాలరు. నీపిటికితనము నిన్నింతగాఁ బలికించుచున్నది. మమ్ము భయపెట్టవలదు ; మేము భయపడు వారముగాము. ఐరావతదంతంబులనూడ్చి యింద్రుని బందిజేసి నిర్జరుల నోర్చి జయశ్రీని సిగపట్టితెచ్చి రాక్షసేశ్వరుని మ్రోల నిలిపిన యీయింద్ర జిత్తు రాచకూనలకు వెఱచునా ?' యనెను. నాపుడు 'నాయనా ! ఇంద్రజి! పసివాఁడవు ; నీబుద్ధి యింకను బరిణతిగాదు ; హితాహితవివేచనశక్తి నీకు సమగ్రముగాఁ గలుగదు. కేవలము దేహబలము నాశ్రయించి పలుక వలదు. రాక్షసకులంబునకు రానున్న ముప్పును విప్పి చెప్పితిని. ఇంతటనైనను గ్రహింపరు. మీకన్నులుగప్పిన వ్యామోహము తొలఁగదు. వత్సా ! నామాట విని హితమొనర్చి నీ తండ్రిని రక్షించుకొనుము. అట్లు చేయవేని నీవు నీతండ్రికిఁ బుత్త్రరూపంబున జనించిన శత్రుఁడవగుదువు. పితృనాశం బును గోరు దుర్బుద్ధి వధ్యుఁడగును. ఇంద్రజి! నిన్ననేల? బాలుని మంత్ర

సభకు రావించిన వాని ననవలయును. ఇది యతని దోషముగాని నీదోషము గాదు. మూఢా! గర్వపడుటవలన ఫలములేదు. గురుశిక్ష యింతనీకుగలుగదు. నిసర్గక్రూరస్వభావంబునకు బాల్యమౌఢ్యాదులు తోడ్పడి నిన్నిట్లు పలికించుచున్నవి. బ్రహ్మదండప్రతిమంబులును జ్వాలాభీలంబులునునైన రామబాణంబులనోర్చు ప్రాణిగలుగదు' అని వానిని మందలించి 'రాక్షసేశ్వరా! కూనల కూఁతలకు సంతసింపవలదు. నామాటవినుము. సీతాదేవిని ధనకనకరత్నాంబర పురస్సరంబుగా రామునకు సమర్పింపుము. ఒండుచో మనకు శుభముగా' దని దశకంధరునితోఁ జెప్పెను.

## —♦ రావణుఁడు విభీషణుని నిర్భర్త్సించుట ♦—

రావణుఁడు రోషకషాయనేత్రుఁడై పండ్లు పటపటగీఁటి 'విభీషణా! నీగుట్టు గ్రహించితిని. 'జ్ఞాతిశ్చేదనలేనకి' మ్మను సామెతను సార్థకమొనర్చితివి. జ్ఞాతులు తమవంశ్యుల మేలెన్నఁడును గోరరు. వారికి నాలుకయందమృతంబును హృదయంబున విషమునుండును. సందుగన్నచో ద్రోహము చేయక మానరు. వారితోడికూడిక నాగుబాముతోడి చెలిమియగును. జ్ఞాతిని నమ్మి బాగుపడినవాఁడు గలుగఁడు. ఈజ్ఞాతివైరము మృగాదులందుఁగూడఁ గలదు. హస్తిగీతలు జ్ఞప్తికివచ్చుచున్నవి. గజంబులు జ్ఞాతినినమ్మి పాశహస్తుల యురులంజిక్కి చెడునట్లు నేను నిన్ను నమ్మి చెడనుంటిని. ఇప్పుడు మేలుకొంటిని. గోవులయందు సంపత్తియు బ్రాహ్మణులయందు తపస్సును స్త్రీలయందుఁ జాపల్యంబు నెట్లో యట్లే జ్ఞాతులయందు నీర్ష్యాద్రోహంబులు నైజంబులు, సాక్షాద్వైరితోనైనను గుపితసర్పంబుతోనైనను సహవాసము చేయవచ్చును గాని హితశత్రువగు జ్ఞాతితో నెన్నఁడు నుండరాదు. సౌమ్యా! నాయైశ్వర్యాదులు నీకన్నుఁగుట్టుచున్నవి. నీయట్టిదుష్టులతోడ చెలిమి గావించిన వారికిఁ దామరాకుమీఁది జలబిందువులగతి తప్పదు. మధుకరము పూఁదేనెను గ్రోలు నంతవఱకుఁ బుష్పంబును జుట్టిచుట్టి తిరుగుచుండునట్లు దుష్టులు తమయీప్సితంబులు తీఱువఱకు మిత్రులచెంత నుందురు. అనంతరము వారిని దిగనాడుదురు. అనార్యులసౌహృదంబు గజంబుల స్నానంబువలె దూష్యమే గాని వేఱుగాదు. శరన్మేఘంబు వర్షించు నదివోలె గర్జాడంబరములను గావించునేగాని చినుకుఁబడనీయనట్లు దుష్టులు

నెయ్యము నభినయింతురేగాని యుపకరింపరు. విభీషణా ! భ్రాతృవాత్సల్యము నిన్ను రక్షించెను. నీముఖముఁ జూడనోపను. ఈతత్క్షణమ నీవిందుండి వెడలి పొమ్ము' అని తిరస్కారభావంబును జూపెను.

### — విభీషణుఁడు రావణునితో నిష్ఠురములాడి తరలుట —

విభీషణుఁడట్లు తిరస్కృతుఁడై ప్రక్కనున్న నల్వురు రక్కసులతోడ నింగికి నెగచి 'రావణా ! అన్నవు గావున నీయందుఁ బితృభావముఁ జూపితిని. ధర్మంబును బరిహరించితివి ; నిష్కారణముగా నాయందు దోషమారోపించి నన్ను దూషించితివి. ఇవి సహింపరావు. దశాననా ! నీ మేలుగోరి నావచించినహితము నీకు రుచింపదు. కాలవశులైన యకృతాత్ములకట్టిది రుచించునా ? రాజా ! ఇచ్చకము లాడువారు పెక్కురుందురు; హితంబునుపదేశించువారు మిక్కిలి యరుదు. హితంబైనను నప్రియంబగు నేని దానినిఁ బలుకనెవ్వరు సాహసింపరు. ఒకానొకఁడు సాహసించి పల్కినను దానిని వినువారు మిక్కిలియరుదు. నీసిరిని గోరలేదు ; నీమడిమాన్యంబులకుఁ జేయిఁ జాపలేదు. ధర్మము దూష్యమగుట సహింపఁజాలక నీసంగతి తెలిసియు దెంపుచేసి తోఁచినమాట చెప్పితిని. గృహంబగ్నికిఁ జిక్కినట్లు నీవు కాలపాశమునఁదగులుట చూచి యుపేక్షింపఁ జాలక యింతగాఁ జెప్పితిని. మృత్యువు సమాసన్నమైననాడు శౌర్యబలదర్పంబు లెవ్వియుఁ గొఱగావు. అవి సైకతబంధంబులట్లు క్షణములోఁ దెగి నశించును. వానిని నమ్మి నీవు మహాప్రవాహంబును ఢీకొనదలఁచుచున్నావు. అన్నా! అది నీకుమేలు గానేరదు. నిన్ను రక్షించుకొనుము ; నీవారిని నీపురంబును గాపాడుకొనుము. ఇదే నేను పోవుచున్నాను. ఆసన్నమరణు లాప్తవాక్యంబు నరుంధతిని దీపనిర్వాపగంధంబును వినరు కనరు మూర్కొనరు' అని పలికి తన దారిఁబట్టెను.

### — విభీషణ శరణాగతి. —

అట సుగ్రీవుఁ డేదో తలపోయుచు నట్టె నింగివంక దృష్టి సారించి యుండెను. వానికంటికిఁ దటాలున నైదుగురు గగనతలంబునఁ గాన్పించిరి. అందొకఁడు ముందు వచ్చుచుండెను. వానిని వెన్నాడి నల్వురు వచ్చు

చుండిరి. సుగ్రీవుఁడు వారిని నింపాపిగాఁ జూచి 'ఎవరో రాక్షసులుగా నున్నారు. మారహాస్యంబుల నెఱుంగుటకో మమ్ముఁ బ్రహరించుటకో దైత్యేశుఁడు వీరిని బంపియుండనోపు' నని తలంచి వారిరాకను వానరులకు నెఱింగించెను. కపివ్యూహంబునఁ గలకలము జనించెను. వారెల్లరు శిలలును సాలంబులును గైకొని మునుగాళ్ళ నిలిచిరి.

ఆగగనచరులు వానరబలమందలి యలజడి విని తమగమనంబు నాపి యందే నిలిచి 'వానరులు మనలను శంకించినట్లుగా నున్నది. తటాలునఁ జనినచో వీరు పైఁబడవచ్చును. వీరి సంరంభంబెల్ల రాజభక్తిం జేసిగాని మనపై ద్వేషబుద్ధివలనఁ గాఁజాలదు. రాముఁడు పరమదయామూర్తి యగుట లోకవిదితము. శరణన్న నతఁడెట్టివారి నేనిఁ జేకొనును. రాముఁడొక్కఁడఁ డంగీకరించినంతనే ఫలములేదు; వానియనుచరులు గూడ నంగీకరింపవల యును. రాజులనెప్పుడుగాని యెవ్వరును స్వతంత్రించి నేరుగఁ గాఁడాయ రాదు. వారిని తదీయాంతరంగభూతులద్వారా శరణుచొచ్చుటొప్పు నని పెద్దలు వచింతురు గదా' యని వితర్కించుకొని ధర్మశాస్త్రానుగుణముగాఁ గార్యమును నిశ్చయించి వారిలో మునుపడవచ్చుచున్న యతఁడు చేఁదోయి శిరమునఁ జేర్చి 'పురుషకారభూతులైన సుగ్రీవాది వానరేశ్వరులకునుఁ బరప్రాప్యుఁడైన రామునకును విభీషణుఁడు నమస్కరించుచున్నాఁడు. పుట్టువుచేత రాక్షసుఁడును వృత్తిచేత నృశంసుఁడును రాక్షసాధిపత్యముచేత మదోన్మత్తుఁడును నామాక్షరములచేతనే లోకకంటకుఁడని తెలియఁబడు చున్న వాఁడును నెవఁడో యట్టి రావణుని తమ్ముఁడనై యుందును. నన్ను విభీషణుఁడందురు. ఆరావణుఁడు సీతాదేవిని గర్భవాసాదిక్లేశాభావంబుగా జనించుటం జేసి యత్యంత సౌకుమార్యయైనదానిని జనస్థానమందు నేకాకిగా నున్నదానిని హరించి యాయకార్యంబునకు నడ్డుపడిన జటాయువును వధించి తనదురవస్థకు వాపోయి వివశయైయున్న యాదీనురాలిని లంకానగరమందు నశోకవనాంతంబున వికృతభయంకరాకారలైన రాక్షసాంగనలమధ్య బంది గావించెను. ఆదేవి దుఃఖదీనయై పడరాని క్లేశములు పడుచున్నది. నా యన్నదౌష్ట్యంబునోర్వక యామెను మరలఁ గొనిపోయి తద్భర్తకు నప్ప గించి రమ్మని యుక్తియుక్తముగా బహువిధంబుల వానికిఁ బ్రబోధించితిని. కాలచోదితుఁడైన ముమూర్షువునకు నౌషధంబట్లు వానికి నాహితవచనంబులు

రుచింపవయ్యెను. అతఁడు నన్ను సభాంతరంబునఁ బరుషంబులాడి వెడల నడచెను. అయ్యవమానంబునోర్వక భార్యాపుత్త్రులనుగూడ విడిచి రాముఁడే శరణమని యిందువచ్చితిని. ఏమహాత్ముఁడాపన్నజనరక్షణైకదీక్షాధురంధరుఁడో, ఏకరుణాసముద్రుఁడు భక్తానుగ్రహార్థము రఘువంశంబున నవతరించెనో యా దీనజనకల్పకంబునకు రామునకు ఈభక్తుని విభీషణుని విన్నవింపు' మని యార్తస్వరంబున బిగ్గఱగాఁ బలికెను.

సుగ్రీవుఁడా ప్రార్థనంబులను విని 'రక్కసులమాయలింతనరాదు. వారికి నీతినిషిద్ధములు గలుగవు ; కార్యార్థమెంతకును సాహసింతురు. వైరియందేమాత్రము సందుగల్గినను వారు దానిగుండ దూఱి విజృంభించి ముప్పుగావింతురు. రాముఁడు శరణాగతవత్సలుఁడగుట లోకప్రసిద్ధము. శరణన్నఁ బగవానిని గూడఁ జేరదీయును. ఒండుతలఁపఁడు, వినఁడు. రాముని యీదయాస్వభావము నూతగొని గీరు మమ్మెల్లరను బరాకున నపకరింప వచ్చిరిగాని వేఱుగాదు. ఇతఁడు రావణానుజుఁడగుట తానే చెప్పుకొనెను. రావణుఁడు రామునకు వైరియగుట జగద్విదితము. అట్టివాని తమ్ముఁడు రామునకు శరణన్న నమ్ముటెట్లు ? అన్నకు హితముఁ బలికెనఁట. అతఁడామాట వినక గర్హించెనఁట. అదియోర్వక తోఁబుట్టువును త్యజించి శరణార్థియై వచ్చెనట. ఈమాటలు నమ్మఁదగునా ? నమ్మదముపో ; ఇతని వైరాగ్యము నిరుపాధికముగాదు గావున వీని శరణాగతియు బరమార్థశరణాగతి కాఁజాలదు. పాపమితఁడు నిక్కముగా శరణార్థియై వచ్చెనేమో ? 'అతిస్నేహః పాపశంకీ' అన్నట్లు రాముని యెడ నాకుఁగల స్నేహాతిశయ మితని నిట్లు శంకించుచున్నదేమో ? అయినను మెలఁకువపడుట మే'లని వితర్కించుకొని లక్ష్మణుని వెంటఁగొని రాముని కడకుఁబోయి 'స్వామీ ! రావణుని తమ్ముఁడఁట విభీషణుఁడనువాఁడఁట నల్వురరక్కసులను వెంటఁగొని వచ్చి నిన్ను శరణుగోరుచున్నాఁడు. రామా ! కార్యాకార్యవిచారమును సేనాసన్నివేశంబు నుపాయప్రయోగముఁ జారప్రేషణము' నను నాల్గిఁటియందు నెవఁడు పరాకుచెందఁడో వానికి మంగళమగును. రక్కసులు కామరూపులగుట లోకప్రసిద్ధము. వారిమాయలిట్టివనరాదు. వారికి నంతర్ధానశక్తిగలదు గావున నన్యగోచరులై ప్రహరింతురు ; మాయావులుగావున వారికపటోపాయంబుల నెఱుంగరాదు. వారి నెన్నడును విశ్వ

సింపఁజనదు. ఇతఁడు రావణప్రేషితుఁడై యీమాయఁబన్ని వచ్చెనేమో యని సందేహింతును. ఇట్టివారికిఁ జోటువిత్తురేని వారు నమ్మించి మిత్ర భేదమును గలిగించియో సమయమువేచి వంచించియో ప్రహరించి తమస్వామి కార్యమును సాధింతురు. శత్రువర్గమునుండివచ్చినవానిని రాఁదీసినచో శత్రుబలముతగ్గి మనబలముహెచ్చదా యనవచ్చును. మిత్రులుపంపునట్టి బలంబును నమ్మవచ్చును ; ఆటవికజనబలంబును విశ్వసింపవచ్చును ; మూల బలంబును రాఁదీయవచ్చును ; కూలికిఁగావచ్చుబలంబును గ్రహింపవచ్చును; వైరిబలంబును మాత్రము చేరనీయరాదు. ఇతఁడు శత్రుకోటిలోనివాఁడగు టయే గాక మనవైరికిఁ గూర్మి తమ్ముఁడు గానున్నాఁడు. రావణప్రేషి తుఁడై వీఁడు వచ్చియుండును. ఇట్టివారిని మొట్టమొదటనే నిగ్రహిం చుటమేలు. అట్లుగాక రాఁదీయుదుమేని నితఁడుఁమనలనేమరించి గుడ్ల గూబ కాకులనువలె మనసైన్యమును బరిమార్పవచ్చును. రావణుఁడెంత క్రూరుఁడో జగద్విదితము. వానితమ్ముని స్వభావము వేఱుకానేరదు. వీరి నెల్ల నిందుండి మరలనీయక వధించుటమేలుగాఁ దోఁచు' ననెను.

రాముఁడా వచనంబులు సావధానముగా విని సమక్షముననున్న వానరముఖ్యులను జూచి 'సంగతి వింటిరిగదా. కార్యసంకటములందుఁ బదుగురుఁ గూడి విమర్శింపనోపుదు. ఎవరును సర్వజ్ఞులుగారు ; ఒకరు తలంపని యూహ మఱియొకరికిఁ దోఁచుచుండును ; మోమోటములుగాని యిచ్చకములుగాని తగవు. బుద్ధిమంతులును సమర్థులును శ్రేయఃకాములు నైన వారు తమమతంబును దాఁపకచెప్పుట ధర్మమగును. ఈవిషయమున మీమీతలంపులేమో తెలుపనగు' ననెను. ఆవానరముఖ్యులు చేతులు జోడించి 'దేవా ! నీయెఱుంగని ధర్మముగాని నీకుఁ దోఁపని యూహగాని యుండదు, నీయందు సత్యము సుప్రతిష్ఠితము. అనృతము నీయెదుటకుఁ గూడ రాఁజాలదు. అసంబద్ధము లెన్నఁడును నీకు స్ఫురింపవు ; ధార్మికుల లో నుత్తమోత్తముఁడవు. నీకుఁదెలుపఁ గలవారుగలరా ? స్నేహ మర్యాదల వలనను మాకుఁగీర్తిగౌరవంబులు కూర్చుతలంపునను మమ్మడుగు దువు. అడిగినప్పుడు మిన్నకుండరాదు. మతిసంపన్నులు మంత్రులు గలరు, వారియభిప్రాయములే మాయభిప్రాయములగు' ననిరి.

అంత నంగదుఁడు లేచి 'పగతుఁడైనను నమ్మవచ్చునుగాని యతనివల నున్న వాని నెన్నఁడును నమ్మరాదందురు. విభీషణుండు మనశత్రుపువలని వాఁడు ; వానిని వెనువెంటనే విశ్వసించుట నీతిగాదు. చరాచరసమస్త సృష్టియందు మంచిచెడుగులు రెండును మిళితమై యుండును ; ఏదియుఁ గేవల సద్గుణవంతమే గాని, కేవలదుర్గుణదుష్టమేగాని కానేరదు. ప్రతి దియు మిశ్రమముగా నుండును. గుణదోషంబులను బరామర్శించునప్పు డా రెంటిలో గురుత్వ లఘుత్వములను బరికించి గ్రహించుటో నిగ్రహించు టో నిర్ణయింతురు. విభీషణునిఁగూడ నీదృష్టితోఁ బరామర్శించి యుక్తా యుక్తములు నిశ్చయింపనగు' నసెను.

అంత శరభుఁడు లేచి 'పరిచయమున్నఁగాని తత్త్వము తెలియరాదు; తత్త్వ మెఱింగినఁగాని గుణదోషంబులను విమర్శింపరాదు. విభీషణుఁడు క్రొత్తవాఁడు; వానిగుణదోషంబులను బరిశీలింపవలయునన్న నతని నెఱుంగ వలయును. అతఁడు మనతోఁ గొంతకాలము కలసి మెలసి యున్నఁగాని వానితత్త్వము బోధపడదు. అట్లు కలసిమెలసియుండుటకు వాఁడు మనలోఁ జేరవలయును. మనలోఁ జేర్చుకొందుమేని వానిగుట్టు మనమెఱుంగు లో పలనే యతఁడు మనగుట్టు గ్రహించి మనకు ముప్పుగావింపవచ్చును. కావునఁ ద్వరపడి యతనిని రాఁదీయఁ జనదు. ఇట్టి సందర్భములలోఁ జారదృష్టి నాశ్రయించుట నీతియగును. సూక్ష్మగ్రాహియైన చారునొక్కని విభీ షణు కడకుఁ బంపి వానివలన నతని నెఱిఁగి తర్వాత యథాయుక్తము వర్తించు టొప్పు' నసెను.

అంతట జాంబవంతుఁడులేచి 'శరభుని సలహా యంత యుక్తముగాఁ దోఁపదు. తత్త్వగ్రహణ మంత సులభముగాదు. ఆమరణాంతము తమ మర్మమును దాఁచి వర్తించు నేర్పరులు గలరు. అట్టివారితో నేండ్లు పూండ్లు పుచ్చినను వారిహృదయము తెలియరాదు. చారుఁడు పోయి మహూర్తమాత్రములో విభీషణుని తత్త్వమును గ్రహించి రాఁగలఁడా ? వానియభిప్రాయమును మన మనుసరింపనగునా ? రామా ! ఈవిచారము మనకేల ? రావణుఁడు నీకు బద్ధవైరి; మఱియు నతఁడు నిసర్గపాపి, ఈతఁ డాతని తమ్ముఁడు ; అంతియగాదు ; వానికడనుండి వచ్చెను. ఈరెండు

కారణంబులచేతనే విభీషణుఁడు సంశయనీయుఁ డగుచున్నాఁడు. రావణునిఁ ద్యజించుటకుఁగా నితఁడు వచించినది యంత యుపపన్నము గాదు. అదియు మనసంశయమును బలపఱచును. విచారించుకొలఁది నాకు విభీషణుని గూర్చి సంశయము హెచ్చుచున్నది గాని తగ్గ దనెను. ఇతర వానరపుంగవు లును తలకొక మాటగాఁ బలికిరి.

అంత హనుమంతుఁడు లేచి 'స్వామీ ! వాదనైపుణ్యప్రదర్శనార్థము పలుకుటగాదు ; సచివులతోఁ బంతగించి మాటాడుటగాదు. దురభిమాన ప్రేరితుఁడనై నుడువుటగాదు. నీయందలి గౌరవంబున నాదోఁచినయర్థము విన్నవింతును. కులగోత్రములనుబట్టి వ్యక్తులను నిశ్చయింపఁ దగదు. విషము నుండి యమృత ముదయింపదా ? గుణదోషంబు లంతసులభముగాఁ దెలియ రావు. సమయమునెడిసానఁ దీర్చినఁగాని యవిస్పష్టపడవు. చొఱనిచ్చినఁ గాని సంగతి తెలియదు ; సంగతి తెలిసినఁగాని చొఱనీయరాదు. విని యోగమూలకగుణదోషవిచారం బన్యోన్యాశ్రయ దోషగ్రస్తము ; కావున నంగదునిమతమంగీకరింపఁ జాలను. శరభుని చారదృష్టియు సంగతముగాదు. దూరగతులైనచోఁ జారులనుబంపుటయు, వారు సమక్షపరోక్షంబులఁ బరి శీలించుటయు నగును. కట్టెదుటనున్న వానివిషయమున నట్టివిమర్శకు నవ కాశములేదుగదా. కాలముగానికాలంబునఁ దావుగానితావునకు విభీష ణుఁడు వచ్చుటంబట్టి యతని శంకింపవలదు. శరణార్థులకు దేశకాలవివక్ష గలుగదుగదా. ఇతఁడు రావణప్రేరితుఁడై వచ్చెననియు నితనిశరణాగతి కపటనాటకమనియుఁ జెప్పిరి. రాక్షసులయెడ నట్లు శంకించుట తప్పు గాదుగాని విభీషణునియెడ నెంతమాత్రమట్టిదానికిఁ దావులేదు. ఇతనిని నేను స్వయముగాఁజూచితిని. వీనికిని రావణునకు జరిగినసంవాదంబును జెవు లారవింటిని. అందుచేత నింత దృఢముగాఁ జెప్పగల్గుదు. నాఁడు లంకా సభలో నితఁడు రావణునకుఁ జెవినిల్లుగట్టి హితమెంతో బోధించెను. సీతా దేవిని నీకు సమర్పించి నీతోడ మైత్రి యొనర్పుమనియు నొండుచోఁ జెప్ప రాని ముప్పువాటిల్లు ననియు జంకుకళంకుల మాని వచించెను. దూతను సంహరింపుమని రావణుఁ డాజ్ఞాపింపఁగా నితఁడడ్డుపడి పెక్కునీతులుపలికి వానియుద్యమమును వారించెను. ఇతఁడు రావణునకు రుచింపఁడు. ఆ కారణంబున రాక్షసేశ్వరుఁడు వీనిని దఱిమివయుండును. కావున నితఁడు

పల్కినది నిజముగాఁ దోఁచును. తిరస్కృతుఁడిందు రానేల యని యడుగవచ్చును. ఖరదూషణాదులవధయు వాలిసంహారంబును సుగ్రీవపట్టాభిషేకంబును వీనికి విదితములు. ఫలాపేక్షతో నితఁడిందువచ్చెను. ఇది వింతగాదు. స్వామీ ! వీనిస్వరమును వింటిరిగదా ; వీనిముఖలక్షణములఁ బరికించితిరిగదా. ఆస్వరము నిక్కముగా నార్తస్వరమో గాదో యూహింపుము. ఆర్తుఁడు కాఁడేని విభీషణుఁడట్లు గద్గదవచనంబు లాడఁడు. ఆనార్తుని వాక్సరణి యనర్గళమైయుండును. వేషధారులముఖము ప్రసన్నముగానుండదు. విభీషణుని ముఖమెంతో ప్రసన్నముగా నున్నది. అంతర్మర్మంబు లెంత దాఁచినను దాగవు ; అవి ముఖదర్పణంబునఁ బ్రతిఫలింపక మానవు ; మఱియు వేషధారులను భయము వెన్నాడియుండును. వారంత తెంపు చేసి రారు. విభీషణుఁడు రావణనిర్భర్త్సితుఁడగుట నిజముగావునను, వానికి ఫలాపేక్షగలదు గావునను నీచరిత్ర కొంతకుగొంత విని కార్యసిద్ధి నీవలన నగునని నమ్మి నినుఁ జేరవచ్చెఁ గావునను వీనిని నిగ్రహింపక యనుగ్రహింపనగు' నని విన్నవించెను.

రాముఁడంతట సుగ్రీవాదుల నామంత్రించి 'మీమతములు వింటిని. మీరెల్లరు నాశ్రేయమును గోరుట నిర్వివాదాంశము. మీమాటలు కాదనరాదు. అయిన నొక్కటి వచింతును. శరణన్నవానికిఁ జేయిచ్చుట పరమధర్మము. వాఁడు దోషియగుఁగాక, ద్రోహియగుఁగాక. వానిని విడువఁజాలను. ఈధర్మమును సత్పురుషులు మిక్కిలి యాదరింతు' రనెను. సుగ్రీవుఁడు మరల లేచి 'ఆపత్సమయంబున నగ్రజుని దిగనాడి వచ్చినకృతఘ్నుని ద్రోహినిఁ జేరఁదీయవచ్చునా ?' యని గట్టిగాఁ బలికెను. రాముఁడామాట విని చిఱునగవుచూపుతో లక్ష్మణునిఁజూచి 'ధర్మసూక్ష్మము లంత సులభముగాఁ దెలియరావు. సర్వశాస్త్రంబులను బఠించి పెద్దల నెంతో సేవించినవారు గూడ ధర్మనిశ్చయంబునఁ బ్రమాదపడుటగలదు. విభీషణుండు వానియన్నను వదలివచ్చుటవలనఁ గృతఘ్నుఁడు కానేరఁడు. అట్లు సేయుటయందు సూక్ష్మతరమైన రాజధర్మముగలదు. అదిలోకవ్యవహారసిద్ధమేగాక ప్రత్యక్షముగాఁ గూడఁ గానవచ్చును. రాజధర్మములనుబట్టి జ్ఞాతులును బరిసరదేశరాజులును శత్రువులుగా గణింపఁబడుదురు. సమయమువచ్చినప్పుడు వారు చేయిచూపకమానరు. ఎఱుకగలరాజు లట్టివారి

నొకకంటఁ గనిపెట్టి యుండును. విభీషణుఁడు రావణునకు జ్ఞాతిగాని వేఱుగాదు. రావణుఁడు జ్ఞాతిని శంకించి తఱిమెను. ఇందు వింతయేమిగలదు? శత్రుబలసంగ్రహణార్థము విభీషణుఁడు వచ్చియుండ రాదాయనిరి. విభీషణునకు రాజ్యముగలుగదు; మనమో రాజ్యమాసించి వచ్చినవారముగాదు. కావున వానికిని మనకును వైరకారణములేదు. వానికట్టి తలంపుగలదనుటకుఁ గూడ నవకాశములేదు. అన్నకుఁగా వచ్చియుండ రాదా యనవచ్చును. జ్ఞాతియని వెఱచి యితనిని దఱిమినయన్నకుఁగా నితఁడు వచ్చుటగునా? చేరనిచ్చినచో యేమరించి యితఁడెగ్గుచేసి చనఁడాయని శంకించిరి. ఇతఁడు మనయొద్దకు నాత్మలాభార్థియై వచ్చుచున్నాఁడు. హనుమంతుని యీయూహానిజము. అట్టితలంపు గలవాఁడాపలోదయము మనలను వదలఁడు. వానియభీష్టసిద్ధికి మనతోడ్పాటవసరము. కావున నట్టిశంక వలదు. రాక్షసుల కింత విమర్శజ్ఞానమా యనవచ్చును. వారిలోఁ గూడఁ బండితులు గలరు. తెలివి యొకరిసొమ్ము గాదుగదా. జ్ఞాతివైరమట్టిదేని భరతాదులసంగతియేమని తలంతువా? నావంటి కొడుకులును భరతునివంటి తమ్ములును నీవంటిమిత్రులు నెల్లెడలఁగలుగరు. మనవలె నెల్లరును ధర్మబుద్ధి నుందురని భావింపవల' దనెను.

సుగ్రీవుఁడంతట రామునకు నమస్కరించి 'స్వామీ! ఎవరెంతచెప్పినను రావణునిపంపున నితఁడిందు వచ్చెననుట నిజము. ఈప్రచ్ఛన్నవేషి మనలను బ్రహరించిపోవును. ఇతఁడు రావణుని తమ్ముఁడు. విత్తొకటియైనఁ జెట్టు వేఱొకటి కాఁజాలదు' అనెను. రాముఁడు సుగ్రీవుని తత్త్వము గ్రహించి 'వానరేశ్వరా! విభీషణుఁడు నీచెప్పినట్టివాఁడే యగునుగాక. అతఁడు నన్నేమి చేయఁగలఁడు? వానివలన గోరంతయెగ్గు గూడ రాఁజాలదు. వలతునేని రాక్షసలోకమెల్ల క్షణములో నీఱగును. సుగ్రీవా! ఒకానొకడు కొండొకకపోతము తనభార్యను హరించి మహాపకార మొనర్చియు మరలవచ్చి దానిని శరణువేడఁగా నయ్యది వానిని సత్కరించుటయే గాక తనమాంసంబును గోసి వానికి భక్షింపఁబెట్టెనఁట. ముక్కిడిపక్షి యింత యుదారస్వభావముఁ జూపఁగా జ్ఞానజీవుల సంగతి చెప్పవలయునా? శరణన్నప్పుడు శత్రువువైనను వధింపరాదు. అన్యుల ప్రస్తావమేల? ఆర్తి

నొండె భీతినొండె శరణన్నవానినిఁ బ్రాణము లిచ్చియైనను రక్షించుట కృతాత్ములకు ధర్మమగును. భయంబుననో యజ్ఞానంబుననో కామవశంబుననో శరణార్థిని రక్షింపనివాఁడు మనినంతకాలము లోకగర్హణంబును మరణానంతరము నిరయంబును బొరయును. ఎవఁడు శరణాగతుని నిరసించునో వానిపుణ్యమెల్ల నశించును. ఇది గండుమహర్షి వచనము. ఆఋషి యుపదేశము ప్రత్యవాయపరిహారమాత్రమే గాక ధర్మిష్ఠంబును యశస్కరంబును స్వర్గ్యంబు నగును. వానిమాట శిరముతో గ్రహించి యనుష్ఠింతును. వేయేల! ఎవఁడుగానీ 'నీవాఁడ' నని యొక్కసారి ప్రపత్తి చేయునేని వాని నభయదాన పూర్వకంబుగా రక్షింతును. ఇది నావ్రతము. సుగ్రీవా! ఆనుకూల్యసంకల్పము, ప్రాతికూల్య ధర్మవర్జనము, రక్షించుననెడి విశ్వాసము, రక్షకసమాశ్రయము, ఆత్మసమర్పణము, దైన్యప్రదర్శనము అని శరణాగతి యాఱువిధములు. శరణాగతికి భక్తి జీవగఱ్ఱయగును. భక్తియనఁగా గాఢప్రేమ, అది సోపాధికము నిరుపాధికము అని రెండు విధములు. ఆర్తులు నర్థార్థులును సోపాధికభక్తిచేయుదురు. జిజ్ఞాసువులును జ్ఞానులును నిరుపాధికభక్తి చేయుదురు. నిరుపాధికభక్తి యుత్తమోత్తమము. ఒక్కసారి ప్రపత్తిచేసినఁ జాలునంటిని. ఆమాటకు నపార్థము కల్పింపరాదు. ఒక్కసారి నీవాఁడనన్నవాఁడు కార్యసిద్ధిపర్యంతము నట్టిభావముతో నుండి యనంతరము నన్ను మఱచి యథాపూర్వము వర్తింపరాదా యనియు, అట్టి వానినిఁగూడ సర్వకాలము రక్షింతువా యనియు శంకింపవచ్చును. నీశంకించునట్టివారు గలరు. వారెల్లరు నావచించిన సోపాధికభక్తులగుదురు; వారిభక్తి యాయుపాధిగలంతకాలమే యుండును. వారిభక్తి నాయందెంత మాత్రమో వారిరక్షణభారముఁగూడ నంతమాత్రమే నాకగును. ఇది మఱువరాదు. విభీషణుఁడు సోపాధిక భక్తుఁడగుఁగాక; వేషధారి యగుఁగాక. అతఁడు నాకుభక్తిచేసెను. వానిని దప్పక కాపాడుదును. విభీషణుఁడే గాదు. ఆరావణుఁడే వచ్చి శరణన్నచో వానిని గూడఁ గాపాడుదును. సుగ్రీవా! మీశంకలెల్ల మాని దోడ్తోడఁజని విభీషణు నిటకుఁ గొనిరమ్ము' అని నిండుమనంబుతోఁ బలికెను.

సుగ్రీవుఁడు మహాశ్చర్యమొంది 'ధర్మజ్ఞా! సత్యమొక్కటే నీకుఁ బ్రధానమని తలంచితిని, సత్యమెంతో భూతదయయు నంతగా నీయందు

సుప్రతిష్ఠితము. నీధర్మిష్ఠవచనంబులు నాసంశయములనెల్ల నుడిపెను. నాయంతరాత్మ ప్రశాంతమయ్యెను. విభీషణుఁడు మాలోనొకఁడగుఁగాక' యని పలికి వానిని దోడిరాఁజనెను. విభీషణుఁడు సుగ్రీవుని సత్కరించి రాముఁడు తనకు నభయమిచ్చుట యవ్వానరేశ్వరునివలన విని మహాసంతుష్టుఁడై పాదంబులు మునుపడవచ్చుట భక్తిమర్యాద గాదుగావునఁ బూర్వకాయమును వంచి నేలఁజూచుచు నంతరిక్షమునుండి సహచరులతోడ దిగివచ్చి రాముని పాదపద్మంబులవ్రాలి 'రావణానుజుఁడను; అన్నవలనఁ దిరస్కృతుఁడనై లంకను ద్యజించి మిత్రకళత్రాదులను వదలి సర్వభూతశరణ్యునకు నీకుఁ బ్రపత్తి చేసితిని. నీవే నాకుఁదిక్కు; ఇతఃపరంబెఱుఁగ; నాజీవితాదులు సమస్తము భవదధీనము' అని భక్తినమ్రభావంబులు పిఱిగొనఁబలికెను.

రాముఁడు సాంత్వవచనంబుల వానినోదార్చి కరుణాసాంద్రవీక్షణంబులతనిపై నెఱపి 'విభీషణా! రావణాదుల బలాబలంబులు వినఁగోరుదు' ననెను. విభీషణుఁడు కయిమోడ్చి 'స్వామీ! రావణుఁడు కఠోరతపంబొనర్చి నలువను మెప్పించి వానివలన మేటివరములు వడసి గర్వోద్ధతుఁడయ్యెను. ఆవరంబులబలంబున నతఁడు గంధర్వోరగరాక్షసాది సర్వభూతంబులను బాధింపను వధింపను శక్తుఁడయ్యెను. వానితమ్ముఁడు కుంభకర్ణుఁడనువాఁడు నాకన్నపెద్ద యొకఁడు గలఁడు. అతఁడును వరప్రభావంబునఁ దేజోవీర్యంబుల నప్రతిముఁడై యున్నాఁడు. శక్రుఁడు గూడ వానినోర్వఁజాలఁడు. రావణునకుఁ బ్రహస్తుఁడను పేరి సేనానాయకుఁడు గలఁడు. వానిని గూర్చి హనుమంతుఁడు చెప్పలేదా? ఆప్రహస్తుఁడు కుబేరసేనానిని మాణిభద్రుని క్షణములో నోడించెను. రావణునకు నింద్రజిత్తు అనుకొడుకు గలఁడు. వాఁడు బద్ధగోధాంగుళిత్రాణుఁడై యభేద్యమైన కవచంబును దొడఁగి విల్లుపూని రణరంగంబును జొచ్చి తటాలున నదృశ్యుఁడై శత్రువులనుబరిమార్చును. అతఁడు సంగ్రామసమయవ్యూహంబుల నగ్నిహోత్రుని దనిపి వరంబులు వడసి త్వత్ప్రభావంబున నట్టిశక్తిమంతుఁడయ్యెను. వీరుగాక రావణునకు సేనాపతులు పెక్కురుగలరు. వారిలో మహోదర మహాపార్శ్వకంపనాదులుముఖ్యులు. వారెల్లరు మహాబలపరాక్రమశాలురు; స్వామికై ప్రాణంబులిచ్చియున్నారు. వారియాజ్ఞకు

లోఁబడి పదివేలకోట్లు రాక్షసవీరులు లంకానగరంబునఁగలరు. ఈబల సహాయంబున రావణుఁడు దిక్పాలురనోడించి దేవతలను జీకాకుపఱచెను. రథగజతురంగంబులకు లెక్కయేలేదు' అని విన్నవించెను.

రాముఁడా వివరమును సాంతముగా విని సంతసపడి లోలోనఁజింతించి 'విభీషణా! రావణుని బలపరాక్రమంబులు తెలిసెను. వానిని సబాంధవముగా వధించి నిన్ను లంకాధినాథునొనర్తు; ఇది సత్యము. దశగ్రీవుఁడు రసాతలముఁజొచ్చుఁగాక; పాతాళము దూరుఁగాక; బ్రహ్మలోకమునకుఁ బఱతెంచుఁగాక; ఎందు దాఁగినను వానిని ప్రాణములతో వదలను. ఆక్రూరుని సపుత్త్రబలబాంధవంబుగా వధింపక రాముఁడయోధ్యవంకఁ దలత్రిప్పఁడు. నాతమ్ములయాన' యనెను. ఆవచనంబులకు విభీషణుఁడు ప్రహృష్టాంతరంగుఁడై రామునకు సాఁగిలఁబడి 'స్వామి! నీకార్యంబునకు నేను యథాశక్తి తోడ్పడుదు; శక్తివంచనచేయక నీవైరివర్గంబుతోఁ బోరుదు' నని విన్నవించెను. రాముఁడు విభీషణుని లేవఁదీసి కవుంగిటఁగూర్చి లక్ష్మణునిచేత సముద్రజలంబులు తెప్పించి రావణానుజుని రాక్షసరాజుగా నభిషేకకార్యమొనర్పించెను. రాముఁడట్లు నూత్నాగతుఁడైన విభీషణునెడఁ జూపిన సద్యఃప్రసాదము వానరవర్గంబున కెల్ల నాశ్చర్యసంతోషంబు లొదవించెను. వారు సాధువాదంబుల వానినెంతయుఁ బ్రశంసించిరి.

విభీషణుఁడట్లు ప్రసాదితుఁడై ప్రశాంతచిత్తమొందెను. హనుమత్సుగ్రీవులు వానికడకుఁజని 'మిత్త్రమా! సాగరము మహాక్షోభ్యముగా నున్నది. మనసైన్యము దానిదాఁటువెఱవు చెప్పు' మనిరి. విభీషణుఁడు వారిని యథార్హముగ సత్కరించి 'సముద్రుఁడు సగరునివలన రూపనామంబులు గాంచెను. మనరాజు సగరవంశ్యుఁడుగావున వానికి సాగరుఁడు కృతజ్ఞతాబద్ధుఁడు. రామకార్యంబు నతఁడు తప్పక యొనర్చును కావున వానిని మనరాజు శరణొందవలయు' ననెను. అంత సుగ్రీవుఁడు రామలక్ష్మణులయొద్దకుఁ బోయి విభీషణునివచనముఁ దెలిపి సముద్రునుపాసింప వేఁడెను. రాముఁడందులకు నవ్వి సుగ్రీవుని సన్మానించి 'లక్ష్మణా! ఇది మీకు సమ్మతమా' యనెను. లక్ష్మణాదులు దోయిలొగ్గి 'నరపుంగవా!

వేఱువేఱువుపోఁపదు. సేతునిర్మాణంబునఁ దప్ప యన్యవిధంబున సముద్రంబును దాఁటఁ దరముగాదు. సముద్రుఁడు ప్రసన్నుఁడైనఁగాని యీతలంపు కొనసాగదు. విభీషణునివచనము కార్యసాధనక్షమమని భావింతుము. అట్లు సేయఁ బ్రార్థింతు' మనిరి.

### —♦ శుకుని రాయబారము. ♦—

అట రావణుఁడు మంత్రులతో నాలోచించి శత్రుసైన్యంబును బరీక్షించి వచ్చుటకుఁగా శార్దూలుఁడను వానిని బంపెను. వాఁడు గగనమార్గంబున వచ్చి సముద్రతీరంబున విడిసియున్న వానరసైన్యంబునెల్లఁ గలయ విలోకించి లంకకుఁ జని 'దేవా! వానరసైన్యము పదియామడదూరము పఱచి రెండవసముద్రమువలెఁ బొర్లి లంకపై నడువనున్నది. రామలక్ష్మణులు దివ్యాయుధసంపన్నులై సాగరతీరంబుననున్నారు. సైన్యముఁజొచ్చి వారి గుట్టెల్ల నెఱుంగఁ దడవులేదు. తగుదూతలనుబంపి విశేషంబులెఱుంగుట యుక్తము. తొలుదొల్తనే యుద్ధమారంభించుటకన్న సామదానభేదోపాయంబులను బ్రయోగించి చూచుట మే' లనెను. రావణుఁడంతఁ గర్తవ్యంబును నిశ్చయించి శుకుడను రాక్షసుని రావించి 'అర్థవిదాంవరా! నీవు తోడ్తోడ సుగ్రీవుని కడకుఁ జని వానికి నావచనంబుగా నిట్లుపలుకుము:— 'వానరేశ్వరా! నీవు సూర్యవంశంబున జనించితివి. అట్టి సత్కులప్రసూతికి నీకు నిష్కారణవైరముతగదు. నీబలపరాక్రమంబు లద్వితీయములు. అట్టి నీవు తుచ్ఛబలశాలిని రాము ననుసరించుట యుక్తముగాదు. ఇది యాత్మగౌరవంబునకెంతయుఁ గళంకమగును. కయ్యమునకు వియ్యమునకు నెయ్యమునకు సమత్వము వలయునందురు. ఎట్లు విచారించినను మీపొందు సరిగాదు. అదియునుంగాక బ్రహ్మకుఁ బౌత్త్రుఁడవును ఋక్షరజసునకుఁ బుత్త్రుండవు నగుటంజేసి నీవు నాకుబంధుఁడవగుదువు. బంధువులు కాదని వారి వైరితోఁ గూడుట ధర్మవిరుద్ధము. ఫలార్థులై ధర్మవిరుద్ధమొనర్చు వారు గలరు. అట్టి కోరిక నీకుఁగలదేని యాయలఁతి వలన నీకేమి కాఁగలదు? ఫలాభిలాషఁగాకున్నను భయంబునఁ జేసి రామునితోఁ గూడితి నందువా? ఆముక్కిడి వలన నీవెఱచునట్టి యనర్థమేమి? సుగ్రీవా! రాముఁడు నీకు సహజవైరియగును. ఎట్లందువా? నీయన్నను వాలిని జంపినవాఁడు నీకు

వైరిగాక మిత్రుఁడగునా ? అట్టి శత్రువుతోఁ గూడ నీమదియెట్లొప్పెను. వాలి నాకుఁ బరమమిత్రము. నామిత్రుని తమ్ముఁడు నాకు భ్రాతృసముఁడగును. అట్టి నాతోఁ బ్రణయము గావించుటకు మాఱుగా వైరము వహింప నీకగునా ? నేను రాముని భార్య నపహరించి తెచ్చుట మనవిరోధమునకుఁ గారణముగాఁ గల్పింతువా? రాముఁడు నరుఁడు; నీవో వానరుఁడవు ; నర వానరులకు నెట్టి సంబంధము గలుగదు. వానికార్యమును నీవు మోయుట గాదు. మఱియు సీతాపహరణంబున నీకుఁ గోరంత హానియుఁగలుగదు. మాట యిచ్చితి నందువా ? అరయక త్వరపడి యాడినమాట హానికరమగు నేని దాని నుజ్జగించుట శాస్త్రానుమతమగును. రాజధర్మము నట్లే చెప్పును. లంకానగరము దేవగంధర్వులకుఁ గూడఁ జొఱరాదు. అసాధ్యంబును సాధింపయత్నించి భంగపడి యవమానమొందుట కన్న మొట్టమొదటనే ప్రమాదమును సవరించుకొనుట బుద్ధిశాలి లక్షణము':—శుకా! ఈమాటలు పొల్లుపోక వచింపుము. నీముఖంబున జంకుకళంకులుం దోఁపరాదు. నీ స్వరము శ్రావ్యముగా నుండవలయును. మెలఁకువతో వర్తింపు' మని చెప్పి పంపెను.

అంతట శుకుఁడు పక్షియై యెగసి గగనమార్గంబున వానరులున్న యెడకుఁ జని యంతరిక్షమందే నిలిచి సుగ్రీవుఁడు వినునట్లుగా రావణసందేశంబును వాకొనెను. వానరులు చెలరేఁగి వియత్తలంబునకు నుద్గమించి వానిని బట్టి నేలకుఁ ద్రోసి పీడింపసాగిరి. శుకుఁడాబాధనోర్వఁజాలక 'హా రామా ! దూతనుజంపరాదు. నీవానరులచేతఁబడి చావనున్నా' నని మొఱపెట్టెను. రాముఁడాయార్తధ్వని విని సంగతి విచారించి వానరులను వారించి శుకుని విడిపించెను. వాఁడు చావుతప్పించుకొని విలూనపక్షంబులతో నింగికెగసి 'సుగ్రీవా ! రాక్షసేశ్వరునకుఁ బ్రతిసందేశముఁ బంపవా ?' యనెను. సుగ్రీవుఁడు తలయూచి 'శుకా ! రావణుఁడు నాకు మిత్రుఁడుగాఁడు ; దయనీయుఁడును గాఁడు. వానికి నేనుపకారబద్ధుఁడనుగాదు ; అతఁడు ప్రత్యుపకారమును నావలనపేక్షింపఁ గారణముగలుగదు. ప్రియుఁడాయనిన నదియుఁ గాఁడు. మాకు భ్రాతృసమత్వమేలాటిదిలేదు. మీఁదు మిక్కిలి మీఱెఁడు నాకు శత్రువగును. ఎట్లందువా? వాలినావైరియగుట లోకవిదితము. నావైరిచెలికాఁడు నాకువైరిగాక

యుండగునా ? మఱియు రాముఁడు నాకు సహానుబంధుఁడు. వానివైరి నాకును వైరియేగదా. వాలివలె మీ ఱేఁడును వధ్యుఁడగును. వానిని సుతసోదరబంధుమిత్త్రంబుగా వధింపనున్నాను. వానిపురము నీఱుగానున్నది. ఇదిగో వానరసేన తరలనున్నది. అతఁడెందు దాఁగినను రాముఁడు వానిని వదలఁడు. రామునిబారిఁ బడినవారిని ముల్లోకంబులు గూడ రక్షింపఁజాలవు. చీఁకుముదుసలిని జటాయువును నిరాయుధుని జంపుట శౌర్యముగాదు. ఏకాకిగానున్న యబలామణిని దొంగిలించి తెచ్చుట మగతనము గాదు. మీ దొరకు వినాశకాలమువచ్చెను. శుకా ! ఇదే నాప్రతిసందేశ' మనెను. శుకుఁడు లంకామార్గము ద్రొక్కెను.

## —♦ దర్భశయనము. ♦—

రాముఁడట్లు విభీషణాదుల ప్రేరణంబును మన్నించి సముద్రోపాసన తత్పరుఁడై కడలితీరంబున దర్భలుపఱచి ప్రాఙ్ముఖుఁడై సరిత్పతికి నమస్కరించి, యే తనకుడిభుజము భుజగభోగమ్ముదులమైయుండునో, ఏది సీతాదేవికి హంసతూలికా శయనాంతరమునఁ దలగడగా నమరుచుండెనో, ఏది శత్త్రువులకు శోకంబును మిత్త్రశరణాగతులకుఁ బరమానందమును గూర్చెనో, యాకుడిభుజంబునుఁ దలగడగా నిడుకొని శయనించి 'సాగరతరణమో నా మరణమో' యను దృఢసంకల్పముఁ బూని కాయికవాచికమానసిక నియమపూర్వకంబుగా సాగరునిఁ బ్రార్థింపసాగెను. అట్లు మూఁడహోరాత్త్రములుగడఁచెను. సాగరుఁడెంత ప్రార్థించినను సాక్షాత్కరింపకుండెను. రాముఁడు సముద్రునకు మహాగ్రహమొంది 'లక్ష్మణా ! సాగరునిగర్వముఁ జూచితివా ! నేను ప్రార్థించుకొలఁది నితఁడు మహాభీలమూర్తియగుచున్నాఁడు గాని ప్రసన్నుఁడుగాఁడు. ఓర్పు మన్నన ఋజువర్తనము ప్రియవచనము మున్నగునవి నిర్గుణుల మ్రోల రాణింపవు. అట్టిగుణంబులను నశక్తలక్షణంబులనుగాఁ వారుబరిగణింతురు. మఱియు లోకము నిరంకుశవర్తనునట్లు శమాదిసద్గుణసంపన్నుని గౌరవింపదు. ఆత్మస్తుతిపరనిందాపరులకుఁగల పలుకుఁబడి యథోచితవాదులకుఁ గలుగదు. యశఃకీర్తులుగాని జయంబుగాని మంచితనంబువలనఁ జేకూఱుట మిక్కిలి యఱుదు. ఓర్పువలన నితనికిఁ జులకనైతిని. ఇతని భ్రాంతి వీఁడుగాక ; మద్బాణార్చుల

నితనిజలంబులింకఁగాక; వీనియుదరంబుననున్న మీలు మొసళ్లు తాఁబేళ్ళుఁ దెట్టెలుగట్టి తేలియాడుఁగాక ; వానరులు కాల్నడక లంకఁజేరుదురుగాక' యని ధనుర్బాణంబులు గైకొని యుగాంతకాలాగ్నికరణిఁ బ్రజ్వరిల్లుచుఁ బిడుగులవానయో యన్నట్లు దీప్తానలశరవర్షంబుఁ గురిపించెను.

మ॥ శరవహ్నిన్ జలమెల్ల నుడ్డుడికిబాష్పంబయ్యె, గర్భస్థ భీ
కరదర్వీకరముల్ విషంబులుమిసెన్, గ్రాహాదిక వ్రాతముల్
దెరలెన్, బైఁబయి శంఖశుక్తివితతుల్ తేలాడె, విభ్రాంతిఁ జెం
దిరి పాతాళనివాసి దైత్యదనుజుల్ దిక్కేది యొక్కుమ్మడిన్ ॥

రాముఁడంతతోనుండక క్షణక్షణప్రవర్ధమాన కోపోద్దీపితుఁడై మహోగ్రవేగంబు వహించి బ్రహ్మాస్త్రంబును సంధించి జ్యావల్లి నాకర్ణాంతముఁ దివిచెను.

మ॥ వడఁకెన్ భూమి, చలించెఁగొండలు, నభోవక్షంబు రెండయ్యె న
ల్గడలన్ జీఁకటిగప్పె, జంద్రతపనుల్ కంపిల్లి వక్రించి, ర
య్యుడుసంఘాతము రాలె, నింగిమొఱసెన్, బ్రోద్యద్గతిన్ వాయువుల్
సుడియైవీచెను వైద్యుతాగ్నులురలెన్ శుష్కించెనంభోధియున్ ॥

## —♦ సముద్రుఁడు ప్రత్యక్షమగుట. ♦—

లక్ష్మణుఁడా బ్రహ్మాస్త్ర సంధానంబును గాంచి సర్వలోకప్రళయం బగు నని భీతిల్లి 'వలదువలదు ; శాంతింపు' మని రామునిఁ బ్రార్థించి తత్కరకోదండంబును బట్టుకొనెను. రాముఁడు తమ్ముని ప్రార్థనంబును వినియు సముద్రుఁడు వెఱచి యోజనదూరము పఱచుటఁ జూచియు బాణ ప్రయోగంబునఁ జగించెను. అంతలోన మేరుపర్వతంబునుండి దివాకరుఁడు వోలె సాగరాంతరమునుండి మహావ్యక్తి యొకటి యావిర్భవించి వచ్చి 'రామా ! సముద్రుఁడు సాష్టాంగమొనర్చుచున్నాఁడు. భూతంబులు తమ స్వభావంబును మానవు. నైజంబును మానివర్తించుట మర్యాదాతిక్రమ మగును. నేను జలభూతంబు నగుట నీవెఱుంగుదువు. అన్యులకు నేను దాఁటరాకుండుట నాస్వభావమైయున్నది. విపరీతధర్మంబును నేనవలం బించుట నీవును సహింపవు. నీకార్యము నిలుపరాదు ; నామర్యాద

త్రొక్కరాదు. సేతుబంధనంబున నివిరెండుఁ జేకూఱును. పార్థివేంద్రా! అట్లుగావింపుము. మీఁకు నాయందలి జలజంతువులవలన నెట్టిబాధయుఁ గలుగ' దనెను. నావుఁడు 'సాగరా ! నీచెప్పినట్లు చేయుదు. నాబాణ మమోఘము. దానిని సంధించితిని ; ఎందువదలనగు' నని రాముఁడడిగెను. సముద్రుఁడు కయిమోడ్చి 'రామా ! ఇటకు సమీపంబున ద్రుమకుల్యమను ప్రదేశముగలదు. ఆభీరప్రముఖులు మహాక్రూరకర్ము లందునివసింతురు. వారిస్పర్శ నాకెంతయు దుస్సహముగా నున్నది. నీశరంబును వారిపై వదలనగు' నని వచించెను. రాముఁడట్లు గావించెను. ఆబాణమచ్చటి దస్యులను బూదిచేసి రసాతలము దూఱెను. ఆరంధ్రముగుండ పాతాళ గంగ యుద్భవించెను. ఆగంగోద్భవ ప్రదేశంబును వ్రణకూపమనిరి. ద్రుమ కుల్యము బాణాగ్నిభస్మీకృత తరులతాదికమగుటంజేసి దానిని మరుకాంతార మనిరి. ఆచోటట్లగుట రాముఁడు గాంచి 'నిరంతరము ఫలమూలసస్యవంత ముగా సుగంధి మూలికాభిరామముగా' నుండుమని దానికి వరమనుగ్ర హించెను. ఆప్రదేశము నాటఁగోలె నట్లే యయ్యెను. సముద్రుఁడంతట 'సౌమ్యా ! సేతుబంధనంబునకు నలుఁడుదక్క యన్యులు చాలరు. అతఁడు వానితండ్రియైన విశ్వకర్మవలన సమస్త శిల్పవిద్యలునేర్చి యంతటివాఁ డయ్యెను. నీవు నిర్మించు సేతువును మునుగకుండునట్లు ధరింతు' నని పలికి యంతర్ధాన మొందెను.

## —♦ సేతుబంధనము. ♦—

నలుఁడంతటలేచి 'దేవా ! సముద్రునిమాట సత్యము. సేతు నిర్మాణ శక్తి నాకుఁగలదు. ఆసంగతి యేలనో మఱపువచ్చెను. అజ్ఞయేని గార్య మారంభింతును. వానరులెల్ల వలయుసన్నాహముఁ గూర్తురుగాక' యని విన్నవించెను. రాముఁడట్లే కానిమ్మనెను. కపివర్యులు తరలి వివిధవృక్షం బులను బెనురాళ్ళను గొనివచ్చిరి. కొందఱు చని యంత్రసహాయంబునఁ బర్వతములను దెచ్చిపెట్టిరి. కొందఱు నిమ్నోన్నతంబులను జక్కచేయ సాగిరి. నలుఁడు పదియోజనముల వెడల్పు నూఱుయోజనంబులనిడువు నూలు పట్టి గుర్తులుంచి సేతుబంధనమునకు నారంభించెను. తొలిదివసంబునఁ బదు నాల్గు యోజనంబుల దూరము కట్టసాగెను. రెండవనాఁడిరువదియోజనంబు లును మూఁడవనాఁడిరువదియొక్క యోజనంబులను గట్టిరి. నాల్గవ

నాఁడిరువదిరెండు నైదవ నాఁడిరువదిమూఁడు యోజనంబులు నిర్మించి యైదు దినములలో సేతునిర్మాణమును బూర్తి గావించిరి. ఆకట్ట సువేలాచలము దాఁకెను.

—♦ దక్షిణతీరము చేరుట. ♦—

అనంతరము రాముఁడు లక్ష్మణసుగ్రీవసహితుఁడై సేనాగ్రభాగంబునఁ దరలెను. వానరసైన్యము వారివెంట నడచెను. దారియిమ్ముచాలక కపీంద్రులు కొందఱు జలంబులదిగి యీదిరాసాగిరి; కొందఱు గగనమార్గముఁ బట్టిరి. అట్లు కపిసైన్యము దక్షిణతీరముచేరి యందు విడిసెను. దేవగంధర్వ సిద్ధచారణమహర్షిముఖ్యులు సేతునిర్మాణంబునకు మహాశ్చర్యమొంది రాముని డాయవచ్చి ఇనకులావతంసమా!

ఉ॥ త్యాగము శాంతభావము దయాగుణముల్ ఋజుమార్గవర్తనం
బీగతనంబు నీమెయిరహించె, జగద్ధితధర్మ రక్షణో
ద్యోగికినీకు శత్రుజయమెయ్యన నయ్యెడుఁ బెద్దకాల మీ
సాగరమేఖలాయత రసాతలమేలు మఖండసంపదల్ ॥

అని దీవించి చనిరి.

వారట్లు విడిసియుండఁగాఁ బ్రచండవాయువు మహోద్ధతివీఁచెను; వసుంధరామండలము కంపిల్లెను; పర్వతాగ్రంబులువడఁకెను; మహామహీరుహంబులు తటాలున దునిసికూలెను; గాఢిదమబ్బులు ప్రేలి పరుషంబుగా గర్జించి రక్తమిశ్రవర్షంబులుఁకురిసెను; సంధ్య రక్తచందనవర్ణముఁ దాల్చి మహాదారుణముగాఁ దోఁచెను; రవిబింబము నిప్పులు వర్షించెను; మృగపక్షులు సూర్యునకు నెదురై దీనారావంబులు గావించెను; సూర్యపరివేషము హ్రస్వమును గృష్ణరక్తాంశుపర్యంతమునై మహారూక్షంబుగాఁ దోఁచెను; భానుమండలాంతరమున నల్లనిమచ్చగానిపించెను; కాకశ్యేనగృధ్రంబులు క్షుద్రపతంగులవలనఁ గూలజొచ్చెను; సృగాలంబు లమంగళరవంబులు గావించెను. రాముఁడానిమిత్తంబులను జూచి సౌమిత్రిని గవుంగలించుకొని 'నాయనా! ఈలక్షణంబులనుబట్టి చూడఁగా భూమండలమెల్ల రక్తమాంస కర్దమంబున బ్రుంగునట్లు తోఁచుచున్నది. మనసైన్యములెల్ల శీతోదక

సంపూర్ణంబులును ఫలమూలబహుళంబులునైన వనప్రదేశములఁజేర్చి గరుడవ్యూహముఁదీర్చి జాగరూకులమై యుండవలయు' నని చెప్పెను,

—♦ వానరవ్యూహ రచన. ♦—

రాముఁ డామాట చెప్పుటే తడవుగా భేరీమృదంగధ్వనులు లంకానగరమునుండి తుములంబుగా వినవచ్చెను. వానరు లాధ్వనులకుఁ బ్రతిధ్వనులుగా సింహనాదంబు లొనర్చిరి. రాముఁడు తలయెత్తి లంకాధ్వజపతాకలను గాంచి సీతాదేవిని దలఁచి 'కటా ! జానకీ ! అంగారకునిచేత రోహిణివలె రావణునిచేత నిరుద్ధవైతివా ?' యని కన్నీరునించి యది దుఃఖమునకు సమయముగాదని వెచ్చనూర్చి 'లక్ష్మణా ! అదిగో చూడుము లంకానగరము త్రికూటశిఖరాగ్రస్థమై నింగినొరయుచున్నది. విశ్వకర్మ తననేర్పునెల్ల నిప్పురనిర్మాణంబున వ్యయించెఁ గాఁబోలు. విమానములతోఁడి యిప్పురంబును జూడఁగాఁ బాండురాభ్రరమ్యమైన గగనంబు తలంపునకు వచ్చును. ఇందలి వనంబులు ఫలపుష్పసమృద్ధంబులై చైత్రరథప్రతిమంబులుగానున్నవి. విహంగంబు లవిగో ఫలరసంబులను గ్రోలి మైమఱచి తూఁగుచున్నవి. మధుకరంబులు మధుపానవివశములై ఝుంకారంబు లుడిగెను. పికంబులు పల్లవము లారగించి లతాడోలిక లూగుచున్నవి' అని చెప్పి వానరసేనాపతులను జీరి 'అంగదా ! నీలుని గూడి నీవు నీసేనతోడ వానరవ్యూహ వక్షోభాగంబున నుండుము. ఋషభుఁడు వ్యూహదక్షిణపార్శ్వంబును గాచును ; గంధమాదనుఁడు సవ్యభాగంబున నుండును. నేనును లక్ష్మణుండును శిరోభాగంబున నుందుము. జాంబవత్సుషేణులును వేగదర్శియుఁ గుక్షిస్థానంబును రక్షింతురు ; సుగ్రీవుఁడు పృచ్ఛభాగంబును గాపాడు' నని వచించెను. వానరనాయకు లట్లు గావించిరి.

—♦ వానరబలంబునెఱుంగుటకు శుకసారణులు వచ్చుట. ♦—

శుకుఁడట్లు వియన్మార్గంబున లంకకుఁ జనఁగా రావణుఁ డతనిఁ జూచి నవ్వుచు 'శుకా ! నీ ఱెక్కలు విఱిచిరా ? కోఁతిమూఁకకుఁజిక్కితివా ? య' నెను. నాపుఁడు 'దేవా ! నీయాజ్ఞప్రకారము చని సుగ్రీవునితో నీమాటలెల్ల మహావినయముతోఁ జెప్పితిని. వానరులెల్లఁ గుపితులై నింగికెగసి నన్నుఁ బట్టి కొట్టసాగిరి. సుగ్రీవుని ప్రతి సందేశమునకు వలను

గాదయ్యెను. విరాధుని విఱచి కబంధుని గాల్చి ఖరునిహరించిన మహావీరుఁడు సేతువుఁగట్టి సముద్రము దాఁటి లంకాద్వారమున నున్నాఁడు. దేవదానవులకు సంధికుదిరినను గుదురవచ్చును గాని వానరరాక్షసులకు సంధి కుదరదు. అదిగో వానరులు లంకాప్రాకారము లెగఁబ్రాకుచున్నారు. ఇఁకఁ దడయరాదు. సీతనిచ్చుటో యుద్ధమొనర్చుటో రెంటి నొకటి సేయుఁ' డనెను.

రావణుఁ డామాట తోడఁ గన్నులెఱ్ఱజేసి 'ముల్లోకంబు లొక్కటై వచ్చినను సీతను విడువను. నాశక్తి సంపదలెఱుంగక రాముఁడు నాపై దాఁడివెడలెను. రానిమ్ము. నాబాణంబులు తూణీరంబుల నిలువకున్నవి. సూర్యోదయంబున గ్రహచంద్రతారలువలె నావిక్రమాటోపంబున రాముఁడును వానికోతిమూఁకయు బరాబరి గానున్నారు. రణరంగమనెడి సభాంతరాళమునఁ జాపంబనెడి వీణను జేపట్టి శరకోణంబులతో జ్యానాద వైరిరోదన బాణతలధ్వనులనెడి మంద్రమధ్యమతారస్వరంబులు మూఁడు మేళవించి పలుకునట్లు వాయించి వినువారికిని జూచువారికిని మహాహ్లాదముఁ గూర్తుఁగాక. సహస్రాక్షుఁడు నాకుఁజాలఁడనఁ గా రాముఁడా నన్నోర్చు వాఁడు' అని గంభీరస్వరంబునఁ బలికి, చెంతనున్న శుకసారణు లనుమంత్రులను జూచి 'రాముఁడు సేతువుఁ గట్టెనఁట. ఇది యభూతపూర్వము. వానరసైన్యము సముద్రమును దాఁటెనఁట. ఇది యంతకన్నఁ జిత్రము. మీరు తోడ్తోఁబోయి యీవార్తల సత్యాసత్యములెఱిఁగి రహస్యంబుగా వానరసైన్యముఁజొచ్చి యాసేనాపరిణామమెంతో దానిపరాక్రమమెట్టిదో వానరముఖ్యులెవ్వరో రామసుగ్రీవుల మంత్రులెవ్వరో కనుఁగొని యుద్ధముఖంబుననిల్చు శూరులెవ్వరో గ్రహించి సేతునిర్మాణవిధానముఁజూచి వానరులనివేశంబులఁ బరికించి రాముని వ్యవసాయ వీర్యప్రమాణంబులు విచారించి రండుపొండ' నెను.

—* శుకసారణులు పట్టుబడి విడుదలనొందుట. *—

శుకసారణులు వానరరూపంబులు ధరించి శత్రుసైన్యముఁ జొచ్చి పరీక్షింపసాగిరి. విభీషణుఁ డారక్కసులగుట్టు గ్రహించి వారినిద్దఱను బట్టి తెచ్చి రాముని మ్రోల నిలిపి రావణమంత్రు లీశుకసారణులు మన రహ

స్యంబు లెఱేఁగివోవఁ బ్రచ్ఛన్నవేషంబుల వచ్చిరి' అని విన్నవించెను. శుక
సారణులు జీవితాశవదలి గడగడ వడఁకుచుఁ గై మోడ్పుగావించి 'సౌమ్యా!
విభీషణుని మాట నిజము' అనిరి. రాముఁడు నవ్వి శుకసారణులారా!
భయపడవలదు. నిరాయుధులను దూతలను వధింపము. మీవచ్చిన కార్య
ముఁ గావించి కొనిపొండు. ఏదేనిఁజూడవలసియున్నచో విభీషణుఁడే
మీకయ్యవి యెల్లఁ జూపును' అని పలికి 'విభీషణా! వీరు శత్రుపక్షచారు
లైనను నిజముఁ బల్కిమన్ననఁ గోరిరి; వదలిపుచ్చు' మని, మరల శుకసార
ణులవంక మరలి 'మీరు లంకకు సుఖముగాఁబోయి యేబలంబు నాశ్ర
యించి మీరాజు నాభార్యనపహరించెనో యాబలంబులెల్లఁ జూడవచ్చితి
ననియు రేపు ప్రాతఃకాలంబున లంకాప్రాసాదబహిర్ద్వారంబులు సరాక్షసం
బుగా శరవిధ్వంసితములు గానున్నవనియు వానికి నామాటగాఁ జెప్పు' మని
వచించి వారినిఁ బంపెను.

—♦ శుకసారణులు వానరబలంబును నిర్ణయించుట ♦—

శుకసారణులు రావణునొద్దకుఁబోయి 'దేవా! నీయాజ్ఞ మేరకుఁజని
వానరసైన్యముఁ జొచ్చి వైరివ్యూహమును బరికించుచుంటిమి. విభీషణుఁడు
మమ్ము గుఱుతించి బంధించి రాముని కడకుఁగొనిపోయెను. ఆధర్మాత్ముఁడు
మమ్ముఁ గరుణించి విడిచిపుచ్చెను. చావు దప్పి వచ్చితిమి. రామలక్ష్మణ
సుగ్రీవవిభీషణు లొక్కచో నుండిరి. అనలువురకు మన లంకాపట్టణము
చాలదని తోఁచును. సేతుబంధనము కల్లగాదు. వానరసేన సముద్రమును
దాఁటెననుటయు నిజము. వారెల్లరు యుద్ధోత్సాహులై యున్నారు. వారితో
వైరము వలదు. సీతనొసంగు' మనిరి.

రావణుఁడు వారికి నవ్వి 'శూరులనోట నిట్టి పేలములురావు. కోఁతుల
తాపులకు వెఱచితిరిగాఁబోలు. నన్ను జయించు మేటిగలఁడా?' యని
పలికి సారణుని వెంటఁగొని యనేకతాళవృక్షంబులయెత్తై నింగినొరయు
చున్న బురుజుమీఁదకుఁ బోయి యపారమైన వానరసైన్యసాగరంబు నవ
లోకించి 'సారణా! ఇందు శూరులెవ్వరో బలవంతులెవ్వరో రణరంగంబున
నిల్చువారెవ్వరో సుగ్రీవుఁ డెవ్వని మాటఁ బాటించునో, యగ్రసేనా నా
యకులెవ్వరో యేర్పడ వివరింపు' మనెను. సారణుఁడు మునువ్రేల

నొక్కొక్కనిఁ జూపుచు 'దేవా! అదిగో యచ్చట వేనవేలుయూథపులతోఁ గూడి లంకాభిముఖుఁడై సర్వశాఖాముఖసేనాగ్రభాగంబున నిలిచి లంకానగరము సప్రాసాదతోరణంబుగాఁ గంపిల్లునట్లు ఱంపిల్లుచున్న యామల్లుని నీలుఁడందురు. అతఁడే వానరసేనానాయకుఁడు. అల్లదిగో చేతులు పైకెత్తి లంకాపురిఁజూచి విజృంభించుచు వాలమల్లార్చి నేలఁగొట్టుచున్న యాపర్వతశిఖరాకారునిఁ బద్మకింజల్కసమానవర్ణుని నంగదుఁడందురు. ఇతఁడు వాలిపుత్త్రుఁడటు. వీనిని వానరయౌవరాజ్యాభిషిక్తుని గావించిరఁట. నీతోడి యుద్ధమునకు నువ్విళ్లూరుచున్నాఁడు. హనుమంతుని లంకాగమన సీతాసందర్శనాదులకు నితనిబుద్ధియే కారణమనిరి. అంగదుని వెనుకనున్న యతనిని నలుఁడందురు. ఇతఁడు సేతువును నిర్మించెనఁట. వీనివెంటఁ బది నూఱుకోట్ల యెనిమిదిలక్షలసైన్యమున్నది. ఆసేనాసాహాయ్యముతో నితఁడొక్కఁడే లంకానగరంబును రూపుమాపఁగోరుచున్నాఁడు. అల్లదిగో తెల్లని మేనివాఁడు. వానిపేరు శ్వేతుఁడఁట. వానిప్రతిభాశక్తి ముల్లోకంబులఁ గీర్తింపఁబడునఁట. తెల్లనినల్లనిపసపువన్నెతోక వెంద్రుకలుగల యల్లతనిని గుముదుఁడందురు. అతఁడు గోమతీతీరనానాశిఖాభిరామ సంకోచపర్వతంబునుండి వేయిలక్షలవానరసేనతో వచ్చెనఁట. వాఁడు మహాచండకోపనుఁడు ; కయ్యమునకుఁ గాలుత్రవ్వుచుండును ; వానినిఁ జూచుటకే వెఱతురు. దీర్ఘలోచనంబులును గపిలవర్ణంబును గల యల్లయతని రంభుఁడందురు. వానివెంట వింధ్యాచల కృష్ణగిరి సహ్యసుదర్శన పర్వతవాసులైన వానరులు నూఁటముప్పదిలక్షలమందివచ్చిరఁట. నిడుపాటిచెవులు గలిగి యావులించుచుఁ దిర్యగ్దృష్టిఁ జూచుచున్న యల్లతఁడు శరభుఁడఁట. వాఁడు మృత్యువునకుఁ గూడ వెఱువఁడనిరి. వానివెంట సాల్వేయపర్వతవాసులు నలువదిలక్షల వానరవీరులు వచ్చిరి. అదిగో మేఘమువలె నాకాశమెల్లఁ గప్పి భేరీసన్నాదంబులు గావించుచున్న యాపర్వతాకారునిఁ బనసుఁడందురు. వానివెంటఁ బారియాత్రశైలవాసులైన వానరు లేఁబదిలక్షలు వచ్చిరి. ఇల్లిదిగో యిచ్చట రెండవసముద్రమోయన వ్యాపించియున్న ప్లవంగసేనకుఁ దేజముఁ గూర్చుచున్న యతనిని వినతుఁడందురు. పర్ణసానదీతీరవాసు లరువదిలక్షలు వానిక్రిందనున్నారు. అల్లతనినిఁ గ్రోధనుఁడందురు. అతఁడు కయ్యమునకు నిన్నుఁ బిలుచుచున్నాఁడు చూడుము.

ఆ గైరికవర్ణశరీరుని గవయుఁడందురు. వాఁడు డెబ్బదిలక్షలవానరబలమునకు నధిపతి. నాచెప్పిన వీరెల్లరును గామరూపులగుటయేగాక మహాబలపరాక్రమములు గలిగి సమరదుర్జయులను పేరుగాంచిరి. ఇఁక రామార్థము జీవితంబునుగూడఁ ద్యజించియున్న వానరయూథనాథులను వినుము. ఎవని వాలము నేల జీరాడుచు రవికిరణకాంతి వెలుఁగుచున్నదో యవ్వానిని హరుఁడందురు. అంతటిఘోరకర్ముఁడు గలుగఁడు. వాడు వేనవేలుగా సుగ్రీవకింకరులను దోడ్కొని లంకను లగ్గలకెత్తుదునని వచ్చుచున్నాఁడు. రాక్షసేశ్వరా! నల్లని యాభల్లూకంబులను జూతువా? మేఘంబులనడుమఁ బర్జన్యుఁడువోలె భల్లూకంబులమధ్యనున్న యతఁడు ధూమ్రుఁడట. వానిది ఋక్షవంతము. అల్లతఁడు జాంబవంతుఁడు మహాయూథపముఖ్యుఁడు. అతఁడు నేటివాఁడు గాఁడు. దేవాసురయుద్ధంబున నవ్వీరుఁడు దేవేంద్రునకుఁ దోడ్పడి వానివలనఁ బెక్కువరములు గాంచెను. అంతటి రణశౌండీరుని వినఁబోము. వానిసేనయన్నదో క్రౌర్యంబున రక్షఃపిశాచంబులను మించును. అల్లచ్చటఁ గూర్చుండి కుప్పించుటకోయన నున్నవాఁడు దంభుఁడు. ఆ పెనుభూతంబును జూతువా? వానిని సన్నాదుఁడందురు. అంతపెద్దమేనిమృగంబు చతుష్పాదలోకంబుననే గలుగదు. వాఁడడుగువైచిన యోజనదూరము సాగును. అతఁడులేచి నిక్కినచో యోజనమెత్తుండును. సన్నాదుఁడు వానరులకెల్లఁ బితామహుఁడఁట. తొల్లి యతఁడు దేవేంద్రునెదిర్చి వ్రేటుపడక వచ్చెనఁట. అల్లతనిని క్రోధనుఁడందురు. వాఁడగ్నిదేవునకు గంధర్వాంగనయందు జనించెనఁట. క్రోధనుఁడు నీయన్న కుబేరునకు విహారస్థానమైన హిమవత్పర్వతంబున నుండునఁట. వేయికోట్ల వానరులు వానివెంటవచ్చిరి. అల్లతనిని గేసరియందురు. అతఁడే హనుమంతుని తండ్రి; తొల్లి మునులు శంబరాసురునిబాధలోర్వక వానిపయికిఁ గేసరిని బురికొల్పిరి. ఇతఁడు నిమిషార్థమున నయ్యసురవీరుని హరించెను. ఈకేసరి గంగాతీరమున నుశీరబీజపర్వతమున నుండును. వేయిలక్షల వానరులు వానిని గొలుచుచున్నారు. అదిగో యచ్చట కెంధూళి రేగి సుడివడి తిరుగుచున్నది చూడుము. అది ప్రమాథి యనువాని శిబిరము. అల్ల వచ్చువాఁడు గవాక్షుఁడు. వానిక్రింద నూఱులక్షలగోలాంగూలు లున్నారు. లంకేశ్వరా! మేరుపర్వతముచుట్టు నఱువదివేల సువర్ణశిఖరిణులు గలవు. ఆ కొండలయందు గపిలముఖులును

ధవళముఖులును తామ్రముఖులును బింగళముఖులును దీక్ష్ణదంష్ట్రలును జతుగ్ధంష్ట్రలును గలరు. వారెల్లరు నదిగో శతవలినిజుట్టి నడచుచున్నారు. శతవలి జయార్థము నిత్యసూర్యోపాసనము చేయుచుండును. వీరుగాక గజ గవయ గవాక్షాదు లొక్కరొక్కరు పదికోట్ల కోతిదండును నడుపుచున్నారు' అని చెప్పి విరమించెను.

అంత శుకుఁడు ప్రారంభించి 'దేవా! అదిగో యచ్చట మదపుటేనుంగులలో గంగాతీరవటవృక్షంబులలో హిమవత్పర్వతప్రాంత సాలావనిజంబులలో యననుండు మహాకాయులెల్లరును సుగ్రీవునియనుచరులు. వారు కిష్కింధానగరము నుండి వచ్చిరి. వారెల్లరును దేవగంధర్వజులు; వారికిఁ గామరూపశక్తిగలదు. అదిగో దవ్వునఁ గానవచ్చుచున్న సుందరాకారులయ్యిరువురు కుమారులు మైందద్వివిదులు. వారు పరమేష్ఠి ప్రసాదంబుగా నమృతంబును గ్రోలిరి. వారికి సంగ్రామంబున సాటిగలుగరు. వారిప్రక్కనున్న యయ్యిరువురు సుముఖ దుర్ముఖులు. ఆయిద్దఱును మృత్యుసూనులు పరాక్రమంబునఁ దండ్రినిబోలుదురు. అల్లతఁడు హనుమంతుఁడు. వాని సంగతినీకుఁ దెలిసియేయున్నది. వానిప్రక్కనున్న మేఘశ్యాములుని బుండరీకాయతలోచనుని దివ్యపురుషుని జూడుము. ఆమహనీయుఁడు ధర్మంబును వదలఁడు; ధర్మంబును వాని నాశ్రయించియుండును. వేదవేత్తలకుఁ దలమానికమై బ్రహ్మాస్త్రాదిసమస్తాస్త్రంబుల బడసి యసదృశతేజః పరాక్రమశాలియైన యాయనే రాముఁడు. వానిభార్యనే నీవపహరించి తెచ్చిన సీత. రాముని దక్షిణపార్శ్వంబున నున్న యాదాసుఁడు సువర్ణ దేహచ్ఛాయయు విశాలవక్షంబునుఁ దామ్ర నేత్రంబులును నీలకుంచితమూర్ధజంబులును గలవాఁడు లక్ష్మణుఁడు. అతఁడు రామునకుఁ బ్రాణంపుఁ బ్రాణమైయుండును. వాని పార్శ్వమున నున్న యల్లతఁడు మనవిభీషణుఁడు. విభీషణుని లంకాధిపతిగా రాముఁడభిషేకించెను. రామవిభీషణుల నడుమనున్న యతఁడు సుగ్రీవుఁడు. రాక్షసేశ్వరా! సుగ్రీవవక్షోభాగంబునఁ దనరారుచున్న సహస్రకమలమాలికను జూతువా? దేవదుర్లభమైన యామాలికను ధరించిన వానికిఁ బరాజయము గలుగదు. రాముఁడు వాలిని వధించి యాకాంచనమాలను వానరరాజ్యంబును సుగ్రీవున కిచ్చెను. సుగ్రీవుని సైన్యమును లెక్కింపఁ దరముగాదు. నూఱులక్షలు కోటియగును;

నూఱువేలకోట్లు శంఖమగును; నూఱువేలశంఖములు మహాశంఖమగును; నూఱువేల మహాశంఖములు బృందమగును; నూఱువేలబృందములు మహాబృందమగును; నూఱువేలమహాబృందములు పద్మమగును; నూఱువేల పద్మములు మహాపద్మమగును; నూఱువేలమహాపద్మములు ఖర్వమగును; నూఱువేలఖర్వములు మహాఖర్వమగును; మహాఖర్వములు నూఱువేలు సముద్రమగును; నూఱువేలు సముద్రము లోఘమగును; ఓఘములు నూఱువేలు మహౌఘమగును; సుగ్రీవునిసైన్యము వేయికోట్లు నూఱుశంఖంబులును వేయిమహాశంఖంబులును నూఱుబృందంబులును వేయిమహాబృందంబులును నూఱుపద్మంబులును వేయిమహాపద్మంబులును నూఱుఖర్వంబులును వేయిసముద్రంబులును వేయి యోఘంబులును కోటిమహౌఘంబులునని చెప్పిరి. అది జలనిధివలెఁ బఱచి లెక్కింపరాకున్నది. రాక్షసేశ్వరా! క్రూరగ్రహమువలె మహాదీప్తిమంతమైయున్న యీవానరవాహినినిఁ జక్కఁగాఁ బరికింపుము మనకు జయముదప్ప తద్విపరీతముగలుగకుండు సంవిధానంబొనర్పు' మనెను.

రామలక్ష్మణసుగ్రీవాదులను వానరమహాసైన్యంబును జూచినంతట రావణునకు లోలోన సుంత బిడియము జనించెను. అతఁడు దానిని గప్పిపుచ్చి 'శుకసారణులారా! ఎంతకాలము మనినను మీప్రజ్ఞ వికసింపదుగదా. రాజులు నిగ్రహానుగ్రహసమర్థులు. వారియెదుటఁ దదనుజీవితులైన మంత్రులు లోటిపలుకులు పలుకవచ్చునా? మనవైరులనభివర్ణింప మీనోరెట్లాడెను? రాజనీతిశాస్త్రమందెల్ల సారభూతమైన దేదియన్నచో భృత్యకార్యమనవచ్చును. దాని నిప్పటికిని మీరెఱుంగరైతిరి. నీతిశాస్త్రంబులు చదువరా? గురువృద్ధులను సేవింపరా? అట్లుచదివి సేవించియుండియు మీతెలివితేఁటలింతమాత్రమైనచో మీశ్రమయెల్ల వ్యర్థమేయగును. కాలమును వృథపుచ్చినవారైరి. ఎఱింగియు ననుష్ఠింపరేని వట్టిజ్ఞానభారమును మోయుచున్న మందభాగ్యులగుదురు. ఇట్టిమూఢులు మంత్రులుగానుండియున్నను నేనును నారాజ్యముఁ జెడకుండుట దైవికముగాని వేఱుగాదు. వెఱ్ఱులారా! శుభాశుభంబులు నాయాజ్ఞానువర్తనములగుట యెఱుంగరా? ఎఱింగియు మీరిట్లు వదరుటఁ జూడఁగా మృత్యువు మిమ్మావేశించి నట్లున్నది. దావాగ్ని చుట్టిన వృక్షంబులు జీవించిన జీవింపనగుఁగాని రాజకోపపరామృష్టులు సేమమందరు. తొల్లిఁటి మీయుపకృతులు నేఁడు మిమ్ము రక్షించెను. మీయట్టి

యవివేకులు మంత్రిపదవికిఁ దగరు. మిమ్ము స్థానభ్రష్టులఁ జేసితిని, కృతఘ్నతా స్నేహపరాఙ్ముఖతలనెడి పెనుముద్రలను మీనొసఁట ముద్రించి యింతతో మిమ్ము విసర్జించితిని. తెలివిగలవారికి వేఁటువధ యనవసరము; పోపొమ్ము' అని వారిని బంపివైచి యాంతరంగిక మంత్రులను రప్పించి కర్తవ్యమాలోచించి వారికి సెలవిచ్చి మహా మాయావియైన విద్యుజ్జిహ్వుని రావించి 'నీశక్తిని బరీక్షింప నేఁడవసరమయ్యెను ; రాముని తలవంటి తలనొకటి కల్పించి యాశిరమును శరచాపంబులను గైకొని నావెంట రమ్ము' అని చెప్పి వానికిఁ బారితోషికముగా మహానర్ఘరత్నఖచితహార మొకటి యిచ్చి పంపెను. వాఁడు చని క్షణములో రావణుఁడు చెప్పినట్లు గావించెను.

—♦ రావణుఁడు సీతాదేవికి రాముని దలనుజూపుట ♦—

అంత రావణుఁడశోకవనంబునకుఁ బోయి సీతాదేవిని సమీపించి 'మంగళస్వరూపిణీ ! ఎవనిమీఁది నీప్రణయము నాప్రార్థనలకు నడ్డుపడుచుండెనో యారాముఁడు నీభర్త కడతేఱెను ; నీగర్వమూలము విచ్ఛేదితమయ్యెను. ఇఁక నీవే నన్నుఁ బ్రార్థించి నాయక్కునకు నెక్కు కాలము వచ్చెను. మూఢా ! ఇంతటనేనిఁ దెలివి తెచ్చుకొని నీమాఢ్యము వదలి నామనంబుచేసి నీసపత్నులనెల్లఁ బాలింపుము. చచ్చినవాఁడు మరలరాఁడు; వానికై వగచియు ఫలములేదు. జన్మము పురుషార్థసాధనార్థముగాని వేఱొకటికిఁగాదు. పురుషార్థములలోఁ గామము వయోవతులకుఁ బ్రధానమగును. దానికి నోచనైతివి. ఎంతయల్పపుణ్యవతివో గదా. నీవు జడమతివగుట నీచర్యలే చాటును. అట్టిదానవయ్యు సర్వజ్ఞవలె గర్వించి వర్తింతువు. వృత్రుఁడట్లు నీపతి వధితుఁడయ్యెను. సంగతి వినుము. రాముఁడు నన్ను వధింపఁ దలఁచి సుగ్రీవప్రణీతమహావానరబలసమేతుఁడై సూర్యాస్తమయ సమయంబునకు సాగరోత్తరతీరమునకు వచ్చి యందు విడిసెను. వానిసేనయెల్ల మార్గశ్రాంతమై మైమఱచి నిద్రించెను. అప్పుడు నామంత్రిప్రహస్తుఁడు రాక్షససైన్యమును వెంటఁగొని పోయి వానరయూథంబును జీకాకుపఱచి నిద్రావశుఁడై యుండిన రామునిఁ దలద్రుంచెను. విభీషణుఁడు తప్పించుకొనఁ జూచెనుగాని వానిచదురులు సాగవయ్యెను. అతనిని బట్టి

బంధించి తెచ్చిరి. సుగ్రీవుఁడు విగతగ్రీవుఁడాయెను; జాంబవంతుఁడు కాళ్ళుతెగి చచ్చి పడెను; మైందద్వివిదులు నడుములు విఱిగి చచ్చిరి; పనసుని బనసపండునువలెఁ దఱిగిరి. దరీముఖుఁడు దరీద్వారముజొచ్చెను; కుముదుఁడు మోడ్చెను; అంగదుఁడు గదాహతుఁడయ్యెను; మదగజంబుల త్రొక్కిళ్ళకును హయఖురఘాతంబులకును బెక్కురువానరులు నెత్తురు గుజ్జయిరి; భల్లూకములు నైజగుణప్రదర్శనార్థమోయన వృక్షఁబులఁ బ్రాకెను; వనంబులు వెదకి పర్వతాంతరములు శోధించి వానరుల పొలకువయే లేనట్లు గాంచిరి. లక్ష్మణుఁడు శవంబులక్రింద నెందో పడియుండెనో పాతాళంబునకుఁ బఱచెనో యూహింపరాదు. సీతా! నీకు బొంకుటగాదు, ఇదిగో చూడు' మని వచించి చేరువరాక్షసభృత్యునిఁ జీరి 'విద్యుజ్జిహ్వుఁడు రణరంగమునుండి రాముని తలఁ దెచ్చెను. దానితోడ వానిని వెంటఁగొని రమ్మ' నెను. విద్యుజ్జిహ్వుఁడు క్షణములోవచ్చి రాముని శిరస్సును శరచాపంబును రావణుమ్రోల నుండి వానికి సాష్టాంగమొనర్చెను. రావణుఁడు వానిని మన్నించి 'వీరాగ్రణీ! రామునితలను సీతయెదుటఁ బెట్టుము. ఈ నిర్భాగ్యురాలు నిజవల్లభుని దురవస్థఁజూచుఁగాక' యనెను. వాఁడట్లు గావించెను. అంతరావణుఁడు విద్యుజ్జిహ్వునిచేతనున్న శరచాపంబుల నంది కొని 'సీతా! ఇదిగో నీరాముని కోదండము; అభిజ్ఞానార్థము వింటిని పయితము తెచ్చి' దనెను.

## సీతాదుఃఖము

సీతాదేవి యాతలవంక దృష్టిసారించి యందునిజపతినయనముఖ కేశ కేశాంతదేశసామ్యముఁ గాంచి చూడామణిని గుఱుతించి హనుమంతుఁడు చెప్పిన రామసుగ్రీవసఖ్యంబును దలఁచి కురంగశాబవమువలెఁ బనవుచు 'హా! కైకేయీ! నీకోర్కె తీఱెనా? కలహకారిణీ! నీకారణంబునఁ గులనందనుఁడు కూలెనుగదా. రఘువంశంబునకు నకాలమృత్యుదేవత వైతివి, కటా! సర్వలోకప్రియుఁడు రాముఁడు నీకేమియొగ్గుచేసెను?' అని మహారోదనముఁ గావించి తెగిన కదళివలె నేలఁగూలి కొండొక తడవునకుఁ దేఱి రాముని శిరంబును మూర్కొని 'హా! మహాబాహూ! నీవీరవ్రతము సాకల్యమయ్యెనా? అయ్యో! నీమరణంబుఁ జూచుటకుఁగా నింతకాలము

జీవించితివా ? నాథా ! స్త్రీదోష కారణంబునఁ దత్పతికి ముందుచావుగలుగు నందురు. నేనెట్టి దోషంబును గావింపలేదు. నాకిట్టిది గలుగనేల? జీవితేశ్వరా ! శోకసాగరంబునుండి నన్నుద్ధరింప నింతదూరమువచ్చి నాకుఁగా నీప్రాణంబులను గోల్పోయితివిగదా. హా ! కౌసల్యా ! నీపుత్త్రవియోగ దుఃఖమెట్లు సహింతువు ? నాథా ! చిరజీవివని నిన్ను జ్యోతిష్కులు నమ్మఁ బలికిరి. ఆమాట బొల్లుపోయెనా ? కాలవిశేషము వారిమదిఁగప్పి నాడట్లు పలికించెనా? ఎల్లభూతంబులకుఁ గాలము కారణమగును ; కాలమునకు నసాధ్యముగలుగదు. నాథా ! నీయట్టి యుపాయజ్ఞుఁడు లేదంటిరి. ఎల్ల నీతిశాస్త్రంబులమర్మము నీకు హస్తామలకము ; నీసాటిసమర్థుఁడు గలుగఁడు. అట్టివాఁడవయ్యు నిట్టిచావు చావనేల ? పరాకుచెందితివా ? కాలమట్లు గావించెనా ? అకటా ! వైధవ్యకాళరాత్రి ! నన్నిఁకఁ బొరిగొనుము. నాథా ! ఏకపత్నీవ్రతుఁడవని పేరుగాంచితివి. నీప్రేమ నారూపంబున మూర్తీభవించినట్లుగా నన్ను మన్నింతువు. అట్టినీవు నీసతినిబాసి పృథ్వీసమాశ్లేషముఁ గోరనగునా ? హా ! కోదండమా ! నేనును నాప్రియుఁడును నిన్నెన్నోవిధంబుల గంధమాల్యాదులతోఁ బూజింతుము. నిన్ను నమ్మి యరణ్యమునకు వచ్చితిమి. మమ్ము నేడు త్యజించితివా ? అనఘా ! తండ్రితాతలతోడి స్వర్గసుఖముఁగోరి చనితివి. ఈబాలను బాల్యంబుననే నిన్నాశ్రయించినదానిని నీయర్ధాంగిని నీసహచారిణినిఁ దలఁపవైతివిగదా. ఇఁక నాగతియేమి ? వివాహకాలంబున నీవు నాకరముఁ బట్టుకొని నీవుగావించిన ప్రమాణవచనమేమి నిన్నడ్డగింపదయ్యెనా ? ఆమాట మఱచితివా? మఱచినచో నిప్పుడైనను దానిని దలఁచి నన్నుఁగూడ నీవెంటఁగొనిపొమ్ము. సత్యైకవ్రతునకు నీకు మచ్చరాఁజనదు. కటా ! ఏదివ్యమంగళశరీరము చందనాది మంగళద్రవ్యచర్చా విశేషంబు లందుచుండెనో, దేనినాశ్రయించి నేను లోకాతీతపరిష్వంగసుఖంబు నొందుచుంటినో యాదివ్యమంగళ శరీరంబును నేడు క్రవ్యాదుల పాలొనర్చితివా ? నాథా ! వీతిహోత్రుఁడు నీయాగంబులను బ్రతీక్షించుచుండెను. వానిఋణముఁ దీర్పవైతివిగదా. అయ్యో! ప్రాణేశ్వరా ! మనము ముగ్గురము వివాసము వచ్చితిమి. లక్ష్మణుఁడెట్లో యిలుచేరును. నిన్నుఁగూర్చి నీతల్లి వానినడుగకమానదు. ఆమె నీకుఁగాఁ బ్రాణంబులు విడుచును. కటా ! దైవమా ! ఆపదలకుఁగా మమ్ముఁ

బుట్టించితివా? నాథా! ప్రహస్తుఁడెక్కడ? నీవెక్కడ? నక్కచేత నాగేంద్రము తునిగెనా? అయ్యో! జీవితేశ్వరా! నీసతియే నీకుమృత్యువయ్యెను. ఈకులపాంసురాలిని బెండ్లాడకున్న సుఖముందువుగదా.
హా! దైవమా!

శా॥ పట్టశ్రీఁదొలఁగించి గుట్టలవసింపంజెట్టి దైత్యాలితోఁ
గట్టుల్కల్ పురికొల్పి మమ్మెడపి లంకంబందిరయ్యెచావఁగాఁ
జెట్టనన్నిటుద్రోసి నావిభునిరాజీవాక్షునిన్ మ్రింగితే?
కట్టా! కట్టడిదైవమా! యిపుడు నీకందోయి చల్లారెనే?

ఉ॥ కన్నెప్రదానకార్యము విఘాతమొనర్చితినో? జడాత్మనై
పున్నముసేయనో? యకట! పూర్వభవంబున నేమిచేసితో?
తిన్నగఁగానిమాటల సతీపతిబంధముఁ బాపినానొ? కా
కున్నను భోగకాలమున నొందునె భర్తృవియోగదుఃఖముల్?.

అని పెద్దయుందడవు వాపోయి 'రావణా! నన్ను నాపతిపైఁ బడవైచి దంపతీసమాగమ మహాకళ్యాణ మొనర్పు' మనెను.

—♦ సరమ సీతాదేవికిఁగలరూపుచెప్పియూరార్చుట. ♦—

అంతలోన ద్వారియొకఁడు వచ్చి 'దేవా! జయము, జయము. ప్రహస్తుఁడు వచ్చెను; మంత్రులు గార్యాతురులై తహతహపడుచున్నారు' అని విన్నవించెను. ఆమాటతోడ రావణుఁ డయ్యశోకవనము దటాలునవదలి బిరాన నిజసభామండపమునకుఁ బోయెను. అతఁడు చనుటే తడవుగా రామునితలయు విల్లును మాయమయ్యెను. అత్తఱి విభీషణునిభార్య సరమ యనునది యచ్చటకు వచ్చి సీతాదేవి రాక్షసమాయలు నేరక దుఃఖవివశ యగుటఁ జూచి జాలిగొని 'దేవీ! రావణునివ్యూహమెల్లఁ జూచితిని. రావణునిమాట నమ్మవలదు. రాముని నిద్రాసమయంబునఁ జంపిరనుట వట్టి కల్ల. జయలక్ష్మివిరాజమానుఁడు నీపతి సుఖమున్నాఁడు. నిన్ను వెఱపించుటకుఁగాఁ గ్రూరుఁడు రావణుఁ డీమాయఁ బన్నెను. రాక్షసమాయలకుఁ జిక్కి వగవవలదు. నీశోకము నేటితోఁ దీఱెను; శుభంబులు నిన్నుఁ గూడనున్నవి. నామాట నిజము. నీకుఁ బ్రియము వచింతు వినుము.

రాముఁడు సేనాసమేతముగా సముద్రదక్షిణతీరంబున విడిసి యున్నాఁడు, రామలక్ష్మణులను వానరసైన్యంబు నిప్పుడే చూచివచ్చితిని. రావణుఁ డిప్పుడింత హుటాహుటి నేలఁబోయెనో యూహింతువా? రామునిరాకకు లంకానగరమెల్లఁ దల్లడిల్లుచున్నది. రావణుఁడు మంత్రులతో నాలోచింపఁ జనె' నని చెలికాఁడ మేర్పడఁ బలికెను.

అంతలోన భేరీధ్వనులు పెల్లున మ్రోసెను. సరమ యాధ్వనులు విని 'దేవీ! అవిగో భేరీభాంకారములు సంగరోత్సాహంబును బురికొల్పుచున్నవి. అవిగో గజఘంటానాదంబులును రథనేమిస్వనంబులును హయహేషలును వాద్యధ్వనులును రోదసీకుహరంబున గల్పుచున్నవి. జలంబుల వలన సముద్రమువోలె సైన్యంబులవలన రాజమార్గంబులు నిండి నిబిడీకృతము లైనవి. రాకపోకలకుఁ గూడ నెడము గలుగదు. అమ్మా! అనతికాలంబున నిన్ను జయలక్ష్మియు రక్కసులను మృత్యువును గవుంగలింపనున్నారు. ఊఱడిల్లుము, రామునియంక మలంకరింతువు. దేవీ! నీయానందబాష్ప వర్షంబున నీవిభునిమనస్తాపమును దీర్చెదవు. నెలలుగా సంస్కారమేది పెనగొని జఘనంబున వ్రేలాడుచున్న నీవేణీభరంబును నీభర్త ముడివిప్పును. ఉదితచంద్రబింబంబునుబోని నీరామునిముఖబింబంబును గాంచి సర్పంబు కుబుసంబునువలె నీవు నీదుఃఖంబును విడుతువు. సస్యశ్యామలమైన ధాత్రి వర్షంబునయట్లు నీవు నీపతిసమాగమంబున నుల్లసింతువు. ఏప్రభాకరుఁడు హయంబువోలె మండలగతి మేరుగిరీంద్రముఁ జుట్టి చరించుచుండునో, ఏ లోకబాంధవుఁడు చరాచర సమస్తప్రపంచంబునకుఁ గారణభూతుఁడో యామహాత్ముని సూర్యభగవానుని శరణిల్లుము. ఆమహనీయుఁడు నీకు నిఖిల శుభంబులిచ్చు' నని యూరార్చి 'అమ్మా! విహాయసగమనము నాకుఁ జిర్వాటమగును. రహస్యముగా రామునొద్దకుఁజని నీకుశలము వానికిఁజెప్పి వత్తునా?' యని స్మితపూర్వకంబుగాఁ బ్రస్తావించెను. సీతాదేవి యా వచనంబులకు సుంతప్రసన్నయై 'సరమా! నీచెలిమికి సంతసింతును; నీ శక్తిసంపదలువింటిని. నాకుఁగా నీ వెంత కార్యమైన నొనర్తువు; సందియములేదు. నాకుఁ బ్రియమొనర్చు తలంపు నీయెడ స్థిరమేని రావణు నొద్దకుఁజని వానియుద్యమంబు లెఱింగిరమ్మా. శత్రురావణుఁడైన రావణుఁడు మాయాబలమాశ్రయించి సారెసారెకు నాకు మనోవిభ్రమముఁ గలి

గించుచున్నాఁడు. వానియాజ్ఞవలన రక్షకాంగనలు నన్నెంతయు గాసిం తురు. వారిని సహింపఁ జాలకున్నాను. నా ప్రాణములు పిడికిటనున్నవి. నామదికి స్వస్థత గలుగదు. రావణుని ప్రయత్నములు తెలుపుదువేని నీ కెంతయుఁ గృతజ్ఞతనైయుందు' నని వ్యసనకలుషస్వరంబున వచించెను. సరమ యామెకెంతయు జాలిపడి యామెకన్నీరు తుడిచి 'దేవీ! నీ యిచ్చ సేయుదు; దుఃఖింపవల' దని చెప్పి రావణాంతికమునకుఁ జనెను. జనక రాజసుత సరమాగమనంబునకు నెదురుచూచుచుండెను. సరమ యట్లు పోయి వచ్చి పద్మమెడసిన లక్ష్మివలెనున్న వైదేహిని సమీపించెను. జనక సుత సరమను గవుంగిటఁగూర్చి తనయాసనంబున గూర్చుండఁబెట్టి సంగతి యడిగెను. సరమ యామెకు శుభముపల్కి 'అమ్మా! నిన్ను వదలి పెట్టుమని రావణునకు వాని తల్లి కైకసి చెవినిల్లుఁగట్టి బోధించెను. రావణమంత్రులలోనెల్లఁ బరమవృద్ధు డవిద్ధుఁడుఁగూడ నట్లే వానికుపదేశిం చెను. ఎవరెంత చెప్పినను లుబ్ధుఁడు ధనంబునుబోలె నతఁడు నిన్నువదల ననెను. రావణుని యీనిశ్చయమువిని వానికిట్టి పట్టుదలగలుగుట తన్మృత్యువునకే యని తలఁచి వచ్చితి' ననెను.

—♦ మాల్యవంతుఁడు రావణునకు హితంబు చెప్పుట ♦—

సీతాసరమలిట్లు సంభాషించుచుండఁగా వానరభేరీధ్వనులును శంఖ రావంబులును సింహనాదంబులును గ్లొల్లుమనెను. ధరణీతలమెల్లఁ గంపిల్లె ను. వానరసైన్యము లంకాపురముఁజేరెను. రావణుఁడాసంగతి విని మంత్రులను బిలిచి 'హనుమంతుని చేష్టలుచూచి సేతుబంధనము విని వానర బలంబునుగాంచి మీరెల్లరు నిరుత్సాహులైయున్నట్లు తోఁచుచున్న'దని నిందాగర్భముగాఁ బలికెను. ఆమాటను రావణుని తల్లికిఁ బినతండ్రి మాల్య వంతుఁడు సహింపక లేచి 'రావణా! విద్యావంతుఁడైనరాజు నీతిశాస్త్రం బును బాటించును. నీతిశాస్త్రజ్ఞుఁడు కాలము ననుసరించును. అట్టివానికి నిష్కంటక చిరకాలరాజ్యపాలనభాగ్యమొదవును. అతఁడు స్వపరబలంబు లను గుర్తించి తనకుఁ బ్రాబల్యమున్నచో వైరిశిరంబునఁ బాదమూనును; అనువుగానిచో సంధిచేయును. ఈదృష్టితోఁ బ్రకృతమును విమర్శింతుమేని రామునితోటిసంధి శ్రేయస్కరమగును. ఈవైరమునకెల్ల సీత మూలముగా

సున్నది. ఆమెను వానికిచ్చి వేయుము. లోకమెల్ల రామువిజయకాంక్ష నున్నది. ఇప్పట్టున నీవు వానితో విరోధించుట తగవుగాదు. రావణా! ధర్మాధర్మంబులు నిన్న నేడువచ్చినవి గావు. అవి సృష్టితోడఁబుట్టెను. వానికి సర్వనాశనమెన్నడును లేదు. ధర్మము తలయెత్తినప్పు డాకాలము ను కృతయుగమందురు. అప్పుడధర్మము తలవంచియుండును. అధర్మము పైకొని ధర్మమడుగంటిన కాలమును గలియుగమందురు. కాలము రాజవశమై వర్తించును.

నీవు ధర్మంబు నెన్నడును మన్నింపవైతివి. నీదిగ్విజయ సంరంభమే యిందులకు సాక్షి. ఇంతటికి నీవిషయాసక్తిబుద్ధి కారణమగుచున్నది. విషయాసక్తుఁడవై యగ్నికల్పు లగుఋషులనెందఱనో నొప్పించితివి. వారితపోవహ్ని యీరూపముదాల్చి వచ్చెను. దేవగంధర్వయక్షరాజకాంతలనెందఱనో చెఱఁబట్టితివి. ఆపాపముపెచ్చుపెరిఁగి నీ రాజ్యమెల్ల నావరించెను. వరబలంబును దలఁచి గర్వింతువు. నీవరములు నాకుఁ గ్రొత్తగావు. ఆవరబలంబున దేవదానవాదులకు నీ వవధ్యుఁడవగుట నిజము. వానరాదులు దేవదానవాదులు గాదుగదా. నరునివలని చావులేకుండునట్టి వరమును నీవుపడయవుగదా. అదియునుంగాక దివ్యంబులు నంతరిక్షంబులును భౌమంబులునైన యుత్పాతంబులు పెక్కుగాన వచ్చుచున్నవి. ఇవియెల్ల రాక్షసవినాశనసూచకంబులుగాఁ దోఁచును. అవిగో చూడుము మేఘంబులు వికృతాకారంబులు దాల్చి యత్యుగ్రంబుగా గర్జించుచు లంకపై రుధిరవర్షంబులు గురియుచున్నవి. గజాశ్వంబులు రోదనములొనర్చుచుఁ గన్నీరు నించుచున్నవి. ధ్వజంబులు నిట్టనిలువున విఱిగిపడుచున్నవి ; గృధ్రజంబుకంబులు గుంపులుగట్టి లంకాపురిఁ జొచ్చి వికృతముగా నఱచుచున్నవి. నల్లనిస్త్రీలు రాక్షసగృహములు చొచ్చి కట్టెదుట నిలిచి తెల్లనిపండ్లు తేటపడ వికవికనవ్వుచు బెదరించుచు నమూల్యవస్తువులను దొంగిలి పోవుచున్నట్లు స్వప్నములగుచున్నవి. కుక్కలు పూజాగృహములందుఁ జొఱబడి హవిస్సును దిని పోవుచున్నవి. ఆవులకు గాడిదలు పుట్టుచున్నవి. మూషికంబులు ముంగిసలకు నెయ్యమయ్యెను. పిల్లులు పులులఁ జేరుచున్నవి; శునకసూకరంబులకుఁ జెలిమి వాటిల్లెను. రక్షఃకిన్నరనరలోకక్కైరి ఆరక్తపాండుర పాదకపోతంబులు కాలచోదితములై

రాక్షసవినాశసూచక సంచారంబులు గావించుచున్నవి. తియ్యని పల్కులు పల్కు శారికలు చీచీకూచీయని పరుషంబుగాఁ గూయుచున్నవి. మృగ పక్షులు కలహప్రియములై యొండొంటిఁ దాఁకుచు సూర్యునెదుట నిలిచి రోదనములు చేయుచున్నవి. మృత్యువు కృష్ణపింగళకరాళవికటరూపం బున బోడతలతో రక్షోగృహంబులందుఁ బ్రాతస్సాయంసమయంబుల సంచ రించుచున్నాఁడు. ఏతాదృశదుర్నిమిత్తంబులు పెక్కయ్యెను. రావణా! చక్కగా నాలోచించి యథాసుఖము వర్తింపు' మనెను.

రావణుఁ డా మాటలు విని కన్నులెఱ్ఱచేసి బొమలుముడివెట్టి గుడ్లు త్రిప్పుచు 'మాల్యవంతా! నీకింతపరపక్షపాతముండుట తెలియదు. తండ్రి తఱుమగా వనములాశ్రయించి మ్రుక్కుడి కోఁతులతోఁ గూడి బ్రదుకునట్టి నరాధము నంతపెద్దచేసి పలుక నీనోరెట్లాడెను? రాక్షసేశ్వరుఁడు నీకంటికిఁ దాళఁడా? సజాతీయు వీరమత్సరము నిన్నుఁ బైకొనెనా? లంచములకు దోయిలొగ్గితివా? సీతను వదలుమందువా? రామునకుఁ దలయొగ్గుమందు వా? ఈమాటలికనాడకు. రామునిగతిఁగన్నారఁ గాంతువుండుము. రాముఁ డెంతబలవంతుఁడేని యతఁడు నాతలలు తఱిగిననాఁడు చూతముగాక. రామునిని వాసిబలంబును బ్రాణములతో మరలనీయను. ఈమాటబాసచేసి చెప్పుచున్నా' నని సగర్వముగాఁ బలికెను. మాల్యవంతుఁడు రావణమౌఢ్య గర్వంబులకు సిగ్గుపడి మఱుమాటాడక యింటికిఁబోయెను.

—♦ రావణుఁడు నిజసైన్యంబును దీర్చుట ♦—

రావణుఁడట్లు తన పెక్కుసమును వెడలఁగ్రక్కి మంత్రులతో సం ప్రతించి తూర్పుద్వారమునఁ బ్రహస్తుని దక్షిణద్వారమున మహోదర మహా పార్శ్వులను బశ్చిమద్వారంబున నింద్రజిత్తును నుండ నాజ్ఞాపించి మహా పరాక్రమశాలియైన విరూపాక్షుని ననేకరాక్షసవీరులతోడ నగరమధ్య గుల్మంబున నుండఁ బంచి తాను శుకసారణులతోడ నుత్తరద్వారమును రక్షింపనిశ్చయించి యట్లు తానురచించిన లంకాపురగుప్తికార్యసంవిధానం బునకు లోలోన సంతసించుచుఁ గృతార్థుఁడట్లు భావించుచు నంతఃపురము నకుఁ జనెను.

### — రాక్షససైన్యముంగూర్చి వానరులు రామునకుఁ దెలుపుట —

అట రాముఁడు శుకసారణులను బంపివైచి కర్తవ్యము నాలోచించుచుండెను. అత్తఱి అనలాదులు వచ్చి వానికి మ్రొక్కి 'దేవా ! విభీషణునియాజ్ఞప్రకారము వానిమంత్రులమైన మేము నలువురమును బక్షిరూపంబులఁ దాల్చి లంకాపురమునకుఁ బోయి తద్ద్వారరక్షణసంవిధానంబెల్లఁ జూచి వచ్చితిమి. ప్రహస్తుఁడు సేనాసమేతుఁడై తూర్పుగవను గాచియున్నాఁడు. మహోదర మహాపార్శ్వులు దక్షిణద్వారమును రక్షించుచున్నారు. ఇంద్రజిత్తు పశ్చిమద్వారంబునను రావణుఁ డుత్తరద్వారమును గాపాడుచున్నారు. నగరమధ్యమగుల్మరక్షణార్థము విరూపాక్షుని నియమించిరి. గజయోధులు సహస్రమును రథికులు దశసహస్రంబును సాదులు వింశతిసహస్రంబును కాల్బల మొక్క కోటియు రావణునిదండ నుండును. ఒక్కొక్క రాక్షసునిక్రింద పదిలక్షలరక్కసి సిబ్బందిగల' దని విన్నవించిరి. విభీషణుఁడు వారిమాటల నందుకొని 'పూర్వము రావణుఁడు కుబేరునితో యుద్ధముచేయుటకు వెడలినప్పుడు తనవెంట నరువదిలక్షలరాక్షససైన్యంబును గొనిపోయెను. నాటిబలము నేటిదానిలో సహస్రాంశము గూడఁ గాదు. ఇట్లు వైరిబలమును బ్రశంసించుట భయోత్పాదనార్థముగాఁ దలఁపవలదు. శత్రునిరసనార్థమునకు వలయుసన్నాహంబును రోషంబును గలిగించుటకుగా వచించితిని. ఈనాయవినయంబును సైచి యుచితరీతి వ్యూహంబులు పన్ని వైరిని దెగటార్పు' మని సవినయంబుగా బలికెను.

### — ప్రతివ్యూహ రచన —

రాముఁడు వైరివ్యూహక్రమమెల్ల విని దీర్ఘముగా నాలోచించి ప్రహస్తుని ఢీకొనుటకుగా నలునిని, మహాపార్శ్వాదులను దాఁకుటకుగా నంగదుని నింద్రజిత్తుపైకి హనుమంతుని వానరవీరసహితంబుగాఁ జన నియోగించి లోకవిద్రావణుఁడైన రావణుని దాను లక్ష్మణునితోడ మార్కొన నిశ్చయించి విరూపాక్షునిమీఁదికి సుగ్రీవజాంబవద్విభీషణులనాజ్ఞాపించి 'వానరులెల్లరుఁ బ్రకృతము మర్త్యరూపములనున్నారు. యుద్ధంబున మనబలముఁ బరబలము నేర్పడి యుండవలయును. కావున మనవారెల్లరును నైజమైన వానరరూపంబున నుండుట యుక్తము నీలాంగదహనుమత్సుగ్రీవులును

సౌమిత్రియు విభీషణుఁడును నరరూపముతోన యుద్ధమొనర్తురు.' అని వచించి సువేలాద్రిని జూచి 'ఈశైలేంద్రము ధాతుశతచిత్రమై మహామనోహరముగానున్నది. ఈరాత్రి మనమచ్చటఁ బుచ్చెదము. లంకాపురమచ్చటనుఁ జక్కఁగాఁ గానిపించును. ఆరాక్షసాధముని పేరు విన్నంతనే నా శరీరమెల్ల మండుచున్నది. ఆదురాత్మునకుఁగా రాక్షసలోకవధ యవసరమయ్యెను. చెఱుకుతుద వెన్నఁ బుట్టి చెఱుకునఁదీపెల్లఁ జెఱుచునట్లుగా నీకూళ జనించి రాక్షసకులంబున కెల్లఁ జేటు తెచ్చె' నని పలికి సువేలాచలమారోహించెను. వారివెంట సుగ్రీవ విభీషణులు చనిరి. వారివెంట లక్ష్మణహనుమదాదులు తరలిరి. రాముఁడట్లాపర్వతమెక్కి గగనంబున వ్రేలాడుచున్నదో యనన్న త్రికూటశిఖరాగ్రస్థ లంకాపురమును జూచి తన్నగరప్రాకారములమీఁద బారులుతీఱి రెండవప్రాకారమువలెనున్న నల్లని నిశాచరులను బరికించెను. అంతలోన సూర్యుఁడు సంధ్యారాగప్రతిరంజితుఁడై యస్తమించెను. రాత్రి పూర్ణచంద్రాలంకృతయై తోఁచెను.

## —• రావణసుగ్రీవుల ద్వంద్వయుద్ధము •—

నాఁటి రేయి యట్లుగడచెను. తెల్లవాఱి రావణుఁడు శశిరక్తరాగసువర్ణాంబరము ధరించి సంధ్యారాగసంవీత మేఘంబువలె దీపించుచు రత్నాభరణభూషితుఁడై యైరావతదంతాగ్రసముత్కృష్టకిణాంకితవక్షంబునందు రక్తచందనము లఁది లంకాగోపురశిఖరమారోహించి శ్వేతచ్ఛత్రంబు నీడ నిలిచి యిరుప్రక్కలవీచుచున్న వీచోపుల మందమారుతసుఖంబు ననుభవించుచు నలువలంకులు జూచుచుండెను. సుగ్రీవుఁడు వానిని జూచి చుఱచుఱఁ బొక్కి కుప్పించి యెగచి యతఁడున్న గోపురము మీఁదదుమికి 'రాక్షసాధమా! లోకనాథుఁడైన రాముఁడెవనిని సఖుఁడుగా భావించెనో యా సుగ్రీవునిగా నన్నెఱుంగుము. ఆపార్థివేంద్రుని తేజోవిశేషంబున వాని దాసుఁడు నిన్నిఁక వదలఁడ'ని పలుకుచు యతని కిరీటంబును దటాలున నేలఁ బడఁదన్నెను. రావణుఁడు మహోగ్రమూర్తియై 'సుగ్రీవా! అపగతగ్రీవుఁడవైతి' వనుచు నవ్వానరేశ్వరుని బట్టి పడద్రోసెను. సుగ్రీవుఁడు లేచి చెండువలె నెగచి రాక్షసేశ్వరుని బాహువులతోఁ బట్టి పడవైచెను. అంతవారిరువురకు హోరాహోరి పోరాటమయ్యెను. ఒకరొకరిని బిగిఁ

చోదవేఁడుకినుకం గడుబె
ట్టిదముగఁ బెనఁగిరి చలంబుడింపక కడిమిన్ ॥

అంత రావణుఁడు సోలి మాయాబలము నాశ్రయించి సహస్ర రావణులు గాఁదోఁచెను. సుగ్రీవుఁడది గాంచి నింగి కెగచెను. రావణుఁడు వానిరాకకుఁగాఁ బేరాసతో నుండెను. వానరేశ్వరుఁడు రాక్షసనాయకు నేమరించి రామునకు యుద్ధౌత్సుక్యముఁ గలిగించుటకుఁగా వాయువేగంబున వానరసైన్యముఁ జొచ్చెను.

రాముఁడంతట సుగ్రీవుని సందిటఁ గూర్చి 'మాటమాత్రము నాతోఁ జెప్పకయే యింతసాహసం బొనర్చితివి. రాజులిట్లు సాహసింపరాదు. సాహసప్రియా ! నీకుగా మాయెల్లరకు నెంత తహతహమయ్యెనో యూహింతువా ? ఇంక నిట్లుచేయవలదు. మిత్రమా ! నీకు గోరంతయెగ్గు గల్గియున్నచో నాకు సీతయేల ? భరతాదులేల ? సుగ్రీవా ! నాశంకించిన విపత్తు నీకువాటిల్లియుండు నేని నేను రావణుని సపుత్త్రంబుగా వధించి విభీషణునకుఁ బట్టముఁ గట్టి భరతునకు నయోధ్యారాజ్యంబప్పగించి దేహత్యాగంబొనర్తు' ననెను. వానరేశ్వరుం డావచనంబులు విని 'రాఘవా ! నీభార్యనుహరించినట్టి యాదుష్టుఁడు కంటఁబడినంతనే నాసహనంబు వలసపోయెను ; కోపవశుండనైతి' ననెను.

## —♦ కపిసేనా సన్నాహము ♦—

రాముఁడంత సుగ్రీవు నభినందించి 'సౌమిత్రీ ! వాయువులు పరుషంబుగా వీచుచున్నవి ; వసుంధరాతలంబెల్లఁ గంపిల్లుచున్నది ; పర్వతాగ్రంబు లూఁగుచున్నవి ; వృక్షంబులు విఱిగి విసరిపడుచున్నవి ; మేఘంబులు క్రవ్యాదంబులట్లు క్రూరంబుగా గర్జించుచు రుధిరబిందువులను వర్షించుచున్నవి ; సంధ్య రక్తచందనాభమై పరమదారుణంబుగాఁ దోఁచుచున్నది; సూర్యమండలంబు వహ్నిశకలంబులను రాల్చుచున్నవి ; ఈదుర్నిమిత్తంబులు వానరరాక్షసవీరుల వినాశంబును సూచించును. ఇకఁ వడయరా' దని వచించి పర్వతాగ్రంబునుండి దిగివచ్చి సంగ్రామంబునకు నాజ్ఞయిచ్చెను.

కపివీరులు క్షణములో లంకాపురిని ముట్టడించి తమతమ నియమిత స్థానంబుల నిలిచిరి. రాముఁడు ఉత్తరద్వారముఁ జేరెను. నీలమైందద్వివిదులు పూర్వద్వారంబు నాక్రమించిరి. అంగద ఋషభ గజ గవయ గవాక్షులు దక్షిణద్వారము గాంచిరి. హనుమంతుఁడు ప్రమాథి ప్రఘసులతోఁ బశ్చిమద్వారము ముట్టెను. రామహనుమంతులకు నడుమగను గాకాక్షిన్యాయంబునఁ దోడ్పడువాఁడుగా ఉత్తరపశ్చిమద్వారంబుల మధ్య లక్ష్మణసుగ్రీవు లుండిరి. విభీషణుండు నలుగడలఁ దిరుగుచుఁ గపిసైన్యంబును బ్రోత్సాహపరుచుచుండెను. అట్లు వానరానీకంబు ముట్టడించుటవలన లంకాపురంబు వాయువునకుఁ గూడ దుష్ప్రవేశమయ్యెను.

—• అంగదుని రాయబారము •—

రాముఁ డట్లు సేనాసన్నివేశంబొనర్చి మంత్రులతో సంప్రతించి రాజధర్మంబును దలంచి విభీషణానుమతంబును బడసి యంగదుని రావించి "సౌమ్యా! నీవు లంకాప్రాకారంబును లంఘించి రావణునొద్దకుఁబోయి నా మాటగా వానికి నిట్లు చెప్పుము. 'భ్రష్టశ్రీకా! ఏవరబలంబునఁ ద్రుళ్ళి నీవు దేవర్షి గంధర్వనాగయక్షరాజలోకంబునకు నింత యపకారంబొనర్చితివో యావరబలంబెల్ల నేఁడుఁ బాపము నిండిననాఁడే నశించెనని గ్రహింపుము. రాక్షసా! నావలననాఁడుండక పాపంబెడసి దేవర్షిరాజర్షులు పడయు లోకంబును బొందనున్నావు. నాఁడు సీతాపహరణార్థము నీవు పన్నిన మాయలెల్ల నేఁడు చూపనగును. ఇంతటనేని సీతను సమర్పించి శరణొందుదువేని నిన్ను రక్షింతును. అట్లుచేయవేని లోకంబరాక్షసంబగును. ధర్మాత్ముఁడు విభీషణుఁడు నన్ను శరణుజొచ్చెను గావున నతఁడు లంకామహైశ్వర్యంబు నిష్కంటకంబుగా ననుభవింపనున్నాఁడు. మూర్ఖులమాట నమ్మి చెడవలదు. దుర్మార్గులకు రాజ్యలక్ష్మి దక్కదు. ఎందుఁ జన్నను నీవు జీవించుటకల్ల. నీతోడ రాక్షసలోకంబెల్ల శూన్యము గానున్నది. నీయపరక్రియలు గావించువారుగూడ నుండరు గావున మును ముందుగా నీవే యాపనులెల్ల నీచేసుకొనుము. లంకానగరంబు నీ కిఁకఁ జూడఁబోవు గావున నీ కడసారిచూపుగా దాని నెల్లఁ గలయ విలోకింపుము. నీ ప్రాణంబులు నాచేతనున్నవని యెఱుంగుము.’

అంగదుఁ డామాటతోడ నెగసి సచివులంగూడి యవ్యగ్రుఁడైయున్న రావణుని మ్రోల మూర్తిగొన్న యగ్నిహోత్రునికరణి వ్రాలి 'రాక్షసేంద్రా! కోసలేశ్వరుండైన రాముఁడు పంపఁగా వాలిసుతుఁడంగదుఁ డిట్లు దూతయై వచ్చెను. నా తండ్రి సెలవుంగుదువు; నన్ను వినియుందువు' అని తన్ను తెలిపికొని రాముని వచనంబులెల్లఁ దెలిపి, 'రావణా!

చ॥ హరికతలాలకించుచు నహర్నిశముల్ హరిరూపవైభవ
స్మరణనుబుచ్చుచున్ విమలమానసులై హరికీర్తనాది త
త్పరతను గాలముంగడపుభక్తుల నిర్దయ నేచినట్టి నీ
దురితము నేడునీయసువుఁద్రుంపఁగనున్నది నిక్కమింతయున్ ॥

ఇంతటనైనను నీయకార్యంబులకుఁ బశ్చాత్తాపమొంది జగన్నాయకుని రాముని శరణువేడి మేలు పడయు' మని వచించెను.

ఆమాటలకు రావణుండు కోపవివశుండై 'ఈ దురాత్ముని బట్టి వధింపు' మని నొక్కినొక్కి యాజ్ఞాపించెను. ఆేని యాజ్ఞకు బదులాడ నోపక నలువురు రాక్షసు లయ్యంగదుని బట్టుకొనిరి. వానరవీరుఁడు వారికి నవ్వి యన్నలువ్వురను దనజంకలలోనితికించుకొని కుప్పించి ప్రాసాదంబుపైకి నెగసెను. ఆవడిలో వారునలువ్వురుఁ జంకలనుండి జాతి తలక్రిందుగాఁబడి చచ్చిరి. అంగదుని పాదహతిక్రిఁ బ్రాసాదము ప్రీలి వజ్రభిన్నహిమగిరి శృంగంబువలె డుల్లెను. కపివీరుఁడంతట రాక్షసహృదయవిదారణంబుగా వానరలోకప్రమోదంబుగా సింహనాదంబొనర్చి యొక్కగంతున రాముని చెంత వ్రాలెను. రావణుఁడయ్యవజ్ఞకుఁ గ్రోధమూర్ఛితుండై వెచ్చనూర్చెను. రాక్షసవీరులందు మహాశ్చర్యభయంబులు ప్రాఁకెను.

## —♦ ద్వంద్వయుద్ధము ♦—

రావణుఁడంతఁ బ్రాకారంబు మీదికివచ్చి వానరసేనాసన్నివేశంబును గలయంజూచి యుద్ధంబునకు నాజ్ఞయిచ్చెను. రాక్షససింహనాద భేరీరావశంఖధ్వను లుప్పతిల్లి బోరుకలంగెను. వానరసైన్యంబునుండి 'రాజా జయతిసుగ్రీవ' అను జయశబ్దంబులు నింగి ముట్టి ప్రతిధ్వనులీనెను. ఇరుదళంబులు తలపడెను. రాక్షసులుకొందఱు ప్రాకారంబెక్కి భిండిపాల

నొప్పించెను. ద్వివిదుఁడు వ్రేటుపడి చెలరేఁగి సాలవృక్షంబుతో మర్దించి వైరిని రథాశ్వసహితంబుగాఁ గూల్చెను. విద్యున్మాలి సుషేణునిపయిఁ గాంచనాలంకృత సాయకంబులను గురియించి సింహనాదమొనర్చెను. సుషేణుఁడు పెనుగొండనెత్తివైచి వైరిరథంబును బుగ్గిపాడిగావించెను. అంత విద్యున్మాలి రథంబునుండి దుమికి గదాహస్తుఁడై సుషేణుని మీఁదికి నుఱికెను. అతఁడు క్రోధసమావిష్టుఁడై పెనుబండనెత్తి యెదిరిపై విసరనుండఁగా నవ్విద్యున్మాలి వానరవీరుని రొమ్మపై గదచేఁ దాటించెను. సుషేణుఁడా వ్రేటులిని కోపవివశుఁడై తనచేతిబండను సత్తువకొలఁది విసరి రాక్షసవీరునివక్షోభాగంబున వైచెను. వాఁడు దానితాకువడి నలిగి నశించెను. అట్లాద్వంద్వయుద్ధంబున రణరంగమెల్లఁ దునిసిన ఖడ్గంబులతో విఱిసిన గదలతో భగ్నములైన శక్తితోమరముసలంబులతో నుగ్గునూచమైన రథంబులతోఁ దెగిన గజవాజిశవంబులతో నిండి మహాభీభత్సముగా నుండెను. అంతలోన సూర్యుఁడస్తమించెను.

రాత్రియగుటఁ నిశాచరులు విక్రమించి యెక్కడివానరుల నక్కడనే పడమోఁదుచుఁ జేఁజిక్కినవారిని జీల్చి భక్షించుచు మహాకోలాహలంబు గావించిరి. వానరులును మహోగ్రమూర్తులై కుప్పించి యెగసి హయంబులను జఱచుచు ధ్వజంబులను ద్రుంచుచు రాక్షససేనను బహువిధంబులఁ గలంచిరి. పరాగపటలంబు తురంగఖుర రథనేమిసముద్ధతమై రేఁగి యుభయసేనను గనుగప్పెను. దానంజేసి స్వపరవివక్షకు నవకాశము గలుగదయ్యెను. తెల్లవాఱునందాఁక ప్రాణంబులు దక్కునాయని సమస్తభూతంబులు బెగ్గడిల్లెను. రక్కసులు కొందఱు ప్రళయకాలసముద్రఘోషలు గావించుచు రామునిఁ దలపడిరి. దాశరథి యగ్నిశిఖోపమశిలీముఖంబులు వైచి యమశత్రు మహాపార్శ్వ మహోదర మహాకాయ వజ్రదంష్ట్ర శుకసారణులను మర్మములు నాటనేసెను. ఆబాణహతులకుఁ దాళఁజాలక వారురణరంగము వదలి చని తమప్రాణంబులను దక్కించుకొనిరి. మఱికొందఱు కార్చిచ్చునందు మిడుతలవలె రామబాణాగ్నులఁ బడి మడిసిరి. ఆరాత్రి రామకోదండవిముక్తసువర్ణపుంఖవిశిఖవిశీర్ణాంతరిక్షమై విస్ఫులింగములతోడి శరద్రాత్రివలె నొప్పెను.

—♦ ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశబద్ధులచేయుట. ♦—

అంగదుఁ డింద్రజిత్తును దాఁకి తదీయ హయసారథులను వధించెను. రావణి యంతటఁ దిరోహితుఁ డయ్యెను. సర్వభూతభయావహపరాక్రమశాలియైన యింద్రజిత్తట్లగుటఁ జూచి రామలక్ష్మణు లంగదుని మెచ్చిరి; సుగ్రీవ విభీషణు లవ్వానరవీరుని బ్రశంసించిరి. రాముఁడు వానరులను బిలిచి 'ఇంద్రజిత్తు బ్రహ్మవరోద్ధతుండై ముల్లోకంబులఁ బెల్లగాటించెను. వానికిప్పుడు మృత్యువు ప్రత్యాసన్నమైయున్నది. మీచేతి చావునకుఁగా నతడిందువచ్చెను. అట్లని మీరు పరాకుచెందవలదు. ఓర్పువదలక సుగ్రీవునిఁగాచియుండు' మనెను. రాముఁడట్లు చెప్పుచుండఁగా గగనంబునుండి పిడుగులట్లు బాణంబులు వర్షించెను. రామలక్ష్మణులు నాగపాశబద్ధులైరి. వారినిలువెల్ల రక్తధారలను గ్రుమ్మరించెను. వారు పుష్పితపలాశవృక్షంబు లట్లు దోఁచుచు మూర్ఛనొందిరి. వారిదురవస్థకు వానరసైన్యము హాహారవములుగావించెను. సుగ్రీవాదులు మహార్తులై రామలక్ష్మణుల చుట్టు మూఁగి కన్నీరునించుచు దిగాలుపడి నిలిచిరి.

ఇంద్రజిత్తు తనకార్యంబునకు లోలోన నుప్పొంగుచు రాక్షసానీకంబునకుఁ బ్రమోదముఁ గూర్చు తలంపుతో 'ఖరదూషణహరులారా! నేఁడు మీలావేమయ్యెను? దేవపక్షులారా! మీకుచేవగలదేని మీ రామలక్ష్మణులను రక్షించుకొనుము. ఎవనికారణంబున నాతండ్రికి నిద్రకఱవయ్యెనో ఎవని నిమిత్తంబున నాజనకుండు చింతాదీర్ఘదివసంబులు గడపుటయ్యెనో ఎవనికి వెఱచి లంకానివాసులు వర్షవాహినులకరణి నిరంతరాకులులై యున్నారో ఎవఁడు రాక్షసలోక సమున్మూలనంబును సంకల్పించి వచ్చెనో యా రాముఁడు దీర్ఘనిద్రావశుఁ డయ్యెను. రామపరాక్రమంబును లక్ష్మణవిక్రమంబును వానరవీర్యంబును శరత్కాలమేఘచయంబయ్యె' నని యెలుఁగెత్తి పలికి నీలునిఁ దొమ్మిది బాణంబుల మైందుని శరత్రయంబున ద్వివిదుని మూఁడుకోలల జాంబవంతునొక్కట హనుమంతుని బదింట గవాక్షుని రెంట శరభుని న్నాల్గింట నంగదుఁ బెక్కింట నొప్పించి యార్చి లంకాపురము జొచ్చి పేరోలగమున్న తండ్రికి నమస్కరించి కయిమోడ్చి 'రామలక్ష్మణులను వధించితి' నని చెప్పెను.

రావణుఁ డామాటతోడ గద్దెనుండి దుమికి కొడుకును గవుంగిటఁ గూర్చి శిరంబు మూర్కొని 'నాయనా! నాయనా! రామలక్ష్మణులు నిహతులైరా? ఎట్లెట్లు? అని మహాతురముతో నడిగెను. ఇంద్రజిత్తు తనకార్యంబెల్ల వినిపించెను. రావణుఁడు పరమసంతోషచిత్తుఁడై నిట్టూర్చి సుతనెంతయు నభినందించెను.

—♦ విభీషణుఁడు సుగ్రీవాదులకు ధైర్యము చెప్పుట ♦—

అట రామలక్ష్మణుల దురవస్థను విని విభీషణుఁడు వచ్చి యావివశులను బరివేష్టించి దుఃఖించుచున్న హనుమదాదులను జూచి 'సుగ్రీవా! అధైర్యంబునకియ్యది సమయముగాదు; ఇట్టివేళలందు నధికస్నేహముగూడఁ జగదు; దానివలనఁ బ్రాణోపద్రవము గావచ్చును. వైకల్యంబు సర్వకార్యవినాశకరముగావున దానిని వదలి రామానుచరమైన మనసైన్యంబునకు హితమార్గముఁ జింతింపుము. రామలక్ష్మణులకుఁ బ్రాణభయంబు గోరంతయు లేదు. వీరియందు మృతలక్షణంబొక్కటియుఁ గానరాదు. వీరు మూర్ఛాక్రాంతులైరి. వీరు తేఱువఱకు జాగరూకులరై యుండుము. వారికిఁ బ్రజ్ఞగలిగినంతట మనభయంబు లుడుగును. సుగ్రీవా! వానరులు కన్నులు విచ్చి వికృతంబుగా దెసలు చూచుచు గుసగుసలాడుచున్నారు. ఇది పలాయనసూచనగా నూహింతును. వారిభయంబు మాన్పవత్తు' నని చెప్పి యావంకకుఁ బోయెను.

—* రావణుని సంతోషము. *—

రావణుండట నిద్రజిత్తును బంపి సీతాదేవికిఁ గాపుదలగానున్న త్రిజటాది రాక్షసస్త్రీజనంబును రావించి 'రామలక్ష్మణులిద్దఱు నింద్రజివలన హతులైరి. ఈసంగతి యయ్యంగనకుఁ దెలిపి యాకాంతను బుష్పకవిమానముపయి నెక్కించుకొనిపోయి రణరంగమునఁ బడియున్న నయ్యిరువురను జూపింపుము. ఎవనియాశ్రయంబు గలదని సీత యిన్నాళ్ళు విఱ్ఱవీఁగుచు నామతంబును నిరసించుచుండెనో యతఁడు నేఁడు తమ్మునితోడ మడిసెను. ఇఁకనైన నయ్యింతి యడియాసలు వదలి స్వయముగా వలచి వచ్చి నన్నుఁ గవయుఁగాక' యని వారికి నాజ్ఞాపించి యాత్మసంతోషమును బట్టఁజాలక లంకాపురమెల్ల నలంకరింపఁజేసి ధ్వజపతాకలెత్తించి

"ఇంద్రజిత్తు రామలక్ష్మణులను వధించెనని చాటఁజనిచెను.

—* సీతాదేవి రామలక్ష్మణులనుజూచి ప్రలాపించుట *—

రావణుని యాజ్ఞప్రకారము రాక్షసాంగనలు పుష్పకవిమానంబు నశోకవనికిఁ గొనిపోయి యందుసీతను త్రిజటను గూర్చుండఁబెట్టి రణరంగమునకుఁ దెచ్చిరి. సీతాదేవి విమానంబునందుండి నేలఁగూలియున్న వానర సైన్యంబును బరమసంతోషముతోనున్న రాక్షసానీకంబును శరచాపంబులను జారవిడిచి బాణతల్పంబునఁ బడియున్న రామలక్ష్మణులనుగాంచి యయ్యిద్దరును మృతులనిభావించి,

సీ॥ వైధవ్యదుఃఖంబు వలదనియెడి కన్య
సాముద్రికోక్తులు సమసెనొక్కొ,
హయమేధయాజినియనుచుఁ దానన్నట్టి
తాపసనూక్తులు తారెనొక్కొ,
నిత్యమంగళవంచు నెమ్మివచించిన
జ్యోతిషశాస్త్రంబు జాదమెనొక్కొ
ధన్యవనుచునన్ను దైవారఁజెప్పిన
కాలజ్ఞులపలుకుల్ కల్లలొక్కొ,
గీ॥ పద్మరేఖాసమంచిత పాదపద్మ
వెలఁగి సామ్రాజ్యపట్టాభిషిక్తయగుట
పట్టమహిషియౌననొదవించు వాక్యలొక్కొ
కానిచోనాకు నిప్పాటు కలుగునొక్కొ.

హా! దైవమా! ఈవిపరీతంబునకు నేమనవలయు? అయ్యో! సూక్ష్మంబులును సమంబులును నైన నీలసరోజంబులతోను, నొండొంటితోఁగల యనిబొమవిండ్లతోను, రోమహీనంబులై వట్రువగానుండు పిక్కలతోను, విరళంబులుగాని దంతకుట్మలంబులతోను, ఉపచితంబులైన నేత్రపార్శ్వ లలాట ఫలకంబులతోను, తద్విధహస్తపాద గుల్ఫోరువులతోను, వర్తులంబులును నఖస్నిగ్ధంబులును నైన యంగుళంబులతోనుఁ, బరస్పరము రాయుచు జీవంబులును మగ్నచూచుకంబులును గల చందోయితోను, లోఁతయిన నాభితోను, మాంసలంబులైన పార్శ్వవక్షోభాగంబులతోను, రత్న

శోభావంతమైన మైఁదీఁగెతోడ, మృదులంబులైన యంగరుహంబులతోడ, నేలపయి సమగ్రంబుగా నానుచున్న పాదాంగుళంబులతోడ, యవాకార రేఖాంకిత పాణిపాదంబులతోడ, జెలువారుచెలువ పతితోడఁ బట్టాభిషిక్త యగు ననిరి. ఆమాటలెల్ల నేఁడు నాయెడ వితథీకృతములయ్యెనా ?

హా ! నాథా !

సీ. ఉవ్వెత్తుగా భూమినూదివైవఁగఁజాలు
నయ్యనిలాస్త్రమేమయ్యెనొక్కొ,
క్షణములో మున్నీటి జలముఁగ్రోలఁగఁజాలు
నయ్యనలాస్త్రమేమయ్యెనొక్కొ,
వసుధాతలము నెల్ల వార్ధిఁజేయఁగఁజాలు
నవ్వారుణాస్త్రమేమయ్యెనొక్కొ,
అఖిలలోకమహాభయంకరస్వైగ్రాలు
నస్త్రమండలమదేమయ్యెనొక్కొ,
గీ॥ కటకటా ! యివియెల్ల నొక్కటిగ నేఁడు
మోహరంబుననినుడించి పోయెనొక్కొ ?
ఒండుచోఁగంటఁబడినశత్రుండుతాను,
ప్రాణములతోడఁ జనుటయెబ్బంగిఁగల్గు ?

జీవితేశ్వరా ! నీకంటఁబడినవైరి జీవంబుతోఁ బోఁజాలఁడని యెఱింగి మాయావి యింద్రజిత్తు తానదృశ్యుండై మిమ్మింతయొనర్చెనా ? హా ! రామా! హా లక్ష్మణా ! ఈపాపిష్ఠురాలికై పడరాని పాట్లుపడి యిందువచ్చుట మీ చావునకేనా ? మీయిరువురపాట్లుచూడఁగా గాలంబులకు నసాధ్యంబు దైవంబునకు నెదురు లేదనుట స్పష్టమగుచున్నది. హా ! కౌసల్యా ! నీ సుతుఁడు వ్రతస్నాతుఁడై యెప్పుడువచ్చునోయని దినములు లెక్కపెట్టుచుందువు. నేటితో నీయాసలెల్ల వీటఁబోయె' నని బహువిధంబుల వాపోవసాగెను.

సీతాదేవి యట్లు వగచుట త్రిజట చూచి 'దేవీ ! ఇంత వెత్తియుందువా ! సజీవులకై యిట్లు విలపింతువేల ? రామలక్ష్మణులు చావరు. ఏల

యందువా ? వారు మరణించియుండు నేని దివ్యవిమానము నిన్ను మోయదు. మఱియు సేనాని చచ్చునేని సైన్యంబెల్ల నుత్సాహోద్యమంబులు మాని కర్ణధారుఁడులేని యోడ జలంబులందట్లు పరిభ్రమించును. వానరసైన్యమం దెట్టి సంభ్రాంతంబును గానరాదు. సేనయెల్ల నిరుద్విగ్నంబుగా నున్నది. మఱియు వానరయోధులముఖంబులు కోపపరీతంబులును హర్షపర్యుత్సుకంబులునై యున్నవి. శుభోదయంబులైన యీయనుమాన ప్రమాణంబులనుబట్టి నీవు స్వస్థచిత్తవు గానగును. అమ్మా ! నీకు నే నెప్పుడు బొంకియెఱుంగను. నీవలనన ట్టియర్థంబును గోరనైతిని. నీపతివ్రతాధర్మము నన్ను వివిచెను. దాననీకుదాసురాలనైతిని. నామాటనమ్ముము. రామలక్ష్మణులు బ్రతికి యున్నారు. ముమ్మాటికి బ్రతికియున్నారు. వారినిఁజంప నన్యులకుఁగాదు. వేయేల ! వారిముఖమండలంబులను జక్కఁగా జూడుము. మృతలక్షణం బొక్కఁటేనిగలదా ? వారుమూర్ఛాగతులైరి. ఇంతమాత్రానకే యిట్లు వగవ నేల ?' యని యూరార్చెను. సీతాదేవి కయిమోడ్చి 'చెలీ ! త్రిజటా ! నీమాట నిజమగుఁ గాక' యనెను. అంతలోన విమానంబును మరలించి యశోకవనంబునకుఁ గొనిపోయిరి. సీతాదేవి యందుండి దిగి వనముజొచ్చి రామలక్ష్మణులను దలఁచి తలఁచి లోలోన దురపిల్లఁజొచ్చెను.

—• రాముఁడు లక్ష్మణునికై శోకించుట •—

అట రాముఁడంతలోన సుంతదేఱి శరవిద్ధుఁడై నెత్తుటఁదోఁగుచుఁ జెంతఁబడియున్న తమ్ముని జూచి 'అకటా ! లక్ష్మణా ! యుద్ధనిర్జితుండవై ధరాతలంబునఁ గూలియున్న నిన్నుఁ జూచు దౌర్భాగ్యంబు నోచితినా ? అయ్యో ! ఇఁక నాకు సీతయేల ? ప్రాణంబులేల ? అహో ! లక్ష్మణా ! సీతకుసాటియైన నారీమణి దొరకినను దొరకుఁగాని నీయట్టితమ్ముఁడు దొరకఁడు. నీవుచనఁగా నేనుండ నేల ? ఇదిగో నీవెంట నేనుఁ గూడ వచ్చుచున్నాను. తమ్ముఁడా ! నిన్ను విడిచి యయోధ్యకు నేనెట్లుపోనేర్తును? కౌసల్యా సుమిత్రలకు నేమని పల్కుదును ? పుత్రదర్శనలాలసయై పిల్లను బాసిన లేడివలెఁ బరితపించు మన్న నీతల్లిని సుమిత్రాదేవి నెట్లాశ్వాసింప నోర్తు ? 'నీవెంటఁబంపిన నాసుతుని వదలివచ్చితివా ?' యని యాయమ్మ యడుగకమానదు. ఆమాటతోడ నాప్రాణంబులు తరలును. నాఁడచ్చటఁ

జచ్చుటకన్న నేఁడే యిచ్చటఁ బ్రాణంబులు త్యజించి నీవెంటవచ్చుట మేలుగదా. తమ్ముఁడా ? ఇఁకనన్నాదార్చు వారెవ్వరు ? లక్ష్మణా ! ఎచ్చోట రాక్షసనివహంబును రూపుమాపితివో యచ్చోటనే నీవు శత్రు నిహతుండవై శయనించుటయ్యెను. తమ్ముఁడా ! శరవిద్ధుండవై నిజశోణితంబులఁ బ్రుంగి తెలివితప్పి బాణతల్పంబును వరించితివా ? నాయనా ! పలుకవేల ? శరంబులు జీవస్థానంబులందు నాటినిన్ను పలుకనీయవా ? అయ్యో ! నీబాధయెట్టిదో నీచూపులే చెప్పుచున్నవి. లక్ష్మణా ! నన్ను నీవు వనంబునకు వెంబడించినట్లు నిన్ను నేను పరలోకంబునకు వెంబడింతును. కటా ! తమ్ముఁడా ! ఈయనార్యుని దుర్నయము నిన్ను బలిగొనెనా ? కానున్న నీకిట్టిచావు గలుగునా ? నాయనా ! నీనోట పరుసంబుగాని విప్రియముగాని వినియెఱుంగను. బాణప్రయోగవేగంబున సహస్రబాహువు కార్తవీర్యుఁడుగూడ నీకు సాటిగాఁడు. నీశరంబు లమోఘములు. అట్టి నీకు నేఁడిట్టి పాటు సంభవించెనా ? విభీషణా ! లంకాధిపతినిగా నిన్నొనర్తునంటిని. అదియిఁకఁగల్ల ; నాయసత్యవచనము నన్ను దహించుఁ గాక. సుగ్రీవా ! ఇఁక జాగుసేయక కిష్కింధకుఁబొమ్ము. రావణుఁడు పగపట్టియుండును ; వానిని మఱువవలదు. అంగదా ! నలనీలాదులతోడ సముద్రమును దాఁటుము. హనుమంతా ! నీవొనర్చిన యనన్యసాధ్యకార్యం బెన్నటికి మఱపురాదు. జాంబవద్గవాక్షులారా ; మీయుద్ధవిక్రమంబునకు సంతసించితిని. మైందద్వివిదులారా ! మీకష్టంబులకు ఋణపడితిని. వానరేశ్వరా ! చెలిమియు సౌహార్దంబు నెంత చేయింపఁగలవో యంతగావించితివి. పురుషప్రయత్న మెంతచేయగలదో యంత చేసితిమి. ఇంతకు దైవము దాయయయ్యెను. వానరవీరులారా ! మీయీచెలికానికిఁగా మీరు ప్రాణంబులను ద్యజించి పోరితిరి. ఎల్లరిశ్రమలు నేఁటితోఁదీఱెను. ఇఁకఁజనసెలవిచ్చితిఁ బొండు' అని పరిపరివిధంబుల వాపోయి మూర్ఛిల్లెను.

ఇట్లుండ వానరు లెక్కడివారక్కడఁ దటాలున చెలరేఁగి యాయుధంబులు విసరివైచి యొండొరు నీడ్చుకొనుచుఁ బడ్డవారిని దాఁటుచుఁ బఱవఁ జొచ్చిరి. సుగ్రీవుఁడదిగాంచి కారణమూహింపనేరక యంగదు నడిగెను. అతఁడు దవ్వునఁ గాటుకకొండవలె భీషణమైయున్న వ్యక్తిని జూపి యావచ్చు విభీషణుని ఇంద్రజిత్తుగాఁ వానరులుభావించిరనియు

జీఁకటియు గిలియు వారికట్టి భ్రాంతిగలిగించెననియుఁ గపులెల్ల భీతులై పఱవ నున్నారనియుఁ జెప్పెను. సుగ్రీవుఁడు సంగతి గ్రహించి వానరుల భయంబులుడుప జాంబవంతునిఁ బంపెను. అంతలోన విభీషణుఁడువచ్చెను. సుగ్రీవుఁడు వానితో 'విభీషణా! నీకు లంకారాజ్యాధిపత్యము తప్పదు' అనివచించి సుషేణుని బిలిచి 'మూర్ఛితులైన రామలక్ష్మణులను వలయుపరి వారముతోఁ గిష్కింధకుఁగొనిపొమ్ము. నేనిందుండి రావణుని సపుత్త్ర బాంధవముగా వధించి సీతాదేవిని దొడ్కొనివత్తు' ననెను.

## —♦ గరుడుని సందర్శనము ♦—

సుషేణుండామాట విని 'వానరేశ్వరా! దేవాసురయుద్ధంబును నేను కన్నారఁ జూచితిని. అప్పుడు దానవులు మాయాబలం బాశ్రయించి తీవ్రశరంబుల దేవతలను బ్రహరించిరి. సురలు కొందఱు మూర్ఛాక్రాంతులైరి; కొందఱు ప్రాణములేసిరి. అప్పుడు బృహస్పతి వచ్చి మృత సంజీవిన్యాది మంత్రంబులవలనను దివ్యౌషధములవలనను వారినెల్లదేర్చెను. సంజీవకరణి విశల్యకరణి యనుమూలికలు రెండుగలవు. అవి చంద్రగిరి ద్రోణపర్వతంబులందు దొరకును. అనగంబులు క్షీరాబ్ధిలోఁ దొల్లిదేవదానవు లమృతంబును మథించినచోటనున్నవి. వానరులుదక్క యన్యులామూలిక లను సాధింపజాలరు. హనుమంతునిబంపి యామూలికలు తెప్పింపనగు' ననెను.

అంతలోన,

సీ॥ పెనుగాలిచెలరేఁగి ఫెళఫెళార్భటిపీచె
మెఱుఁగుతోడిమెఱయిళ్ళు విఱిసిపోయె
నుల్లోలకల్లోల ముదధినీరంబరమ్మ్యో
క్షోణీతలంబెల్ల క్షోభనొందె
లంకాపురాంత సాలంబులెల్లెడఁ ద్రెళ్లె
సౌధాగ్రశిఖరముల్ సడలికూలెఁ
గెంధూళిచీఁకట్లు గీముగావ్యాపించె
నంతరిక్షంబంత నల్లలాడె

గీ॥ పఱచియున్నట్టి యిరుసేన భ్రాంతిఁ జిక్కి
దిక్కుఁదోఁపక నెంతయు నుక్కుఁబాసి
విహ్వలాయత్త మైయల్లె వెఱచిసోలె
క్షణములో శిబిరాలఁ జీకాకు ప్రాఁకె॥

ఎల్లరు నట్లు తహతహపడుచుండఁగాఁ దటాలున నొకవ్యక్తి యగ్నివలెమండుచున్నది నింగిఁదోఁచెను. అవ్వ్యక్తినీడ సోఁకినంతనే రామలక్ష్మణుల నాగపాశంబులు సడలెను. అవ్వ్యక్తియు సమీపించి రామలక్ష్మణుల మోముదమ్ములను దడవి వారిదేహమెల్ల నిమిరెను. వారు క్షణములోపల యథాపూర్వము నిసర్గఛాయాస్నిగ్ధశరీరులై లేచిరి. వారి తేజోవీర్యంబులును బలోత్సాహంబులను బుద్ధిస్మృతులును ద్విగుణప్రభావంబును దాల్చెను. రాముఁడావ్యక్తిని జూచి 'మహాత్మా! నీయనుగ్రహంబున మాకీయాపద దొలంగెను. నిన్నుఁగాంచినంతనే మాతండ్రితాతలు దశరథాజమహారాజు లిందు వచ్చినట్లు హృదయంబెంతయుఁ బ్రసన్నమగుచున్నది. దివ్యమాల్యాంబరంబులను దాల్చి మహానిర్మల వస్త్రంబును ధరించి యలౌకికరూపంబునఁ దేజరిల్లుచున్న నీవెవండవో వినగోరుదు' ననెను. ఆవ్యక్తి యానందబాష్పంబుల నించుచు 'కాకుత్స్థా! నీసఖుండను, నీప్రియుండను; నీకు బహిఃప్రాణమై యుందును. నన్ను గరుత్మంతుఁడందురు. మీకుసహాయార్థము వచ్చితిని. క్రూరకర్ముండైన యింద్రజిత్తు మిమ్ము నాగపాశంబుల బంధించెను. ఆపాశంబులవదలింప మదన్యులకుఁ దరముగాదు. ఆనాగంబులు రౌద్రవేయంబులుగాని సామాన్యములుగావు. విషోల్బణంబులైన యాపన్నగంబులింద్రజిన్మాయాప్రభావంబున బాణాకృతిఁ దాల్చి మిమ్ముఁ బొందెను. రామా! నీసత్యవ్రతంబును నీధర్మజ్ఞతయు నేఁడు మీయిరువురను రక్షించెను. ఇఁక భయములేదు. మీపాటువిని హుటాహుటి వచ్చితిని. రణమందిఁక నేమాత్రముఁ బరాకుచెందవలదు. రాక్షసులు కపటయుద్ధము నర్తురు. అది వారికి నైజము. మీరో ధర్మయుద్ధమొనర్తురు. ధర్మమే బలము. పోయివచ్చెద; సెలవిమ్ము. నాచెలిమికి కారణంబు నిప్పుడడుగవలదు. వీరాగ్రణీ! కృతకృత్యుండవైనంతట యీసంగతి నెఱుంగుదువు. లంకానగరంబును బాలవృద్ధావశేషంబుగావించి రావణుని వధించి సీతాదేవిని బొందుదు' వని పలికి వారికిఁ బ్రదక్షిణనమస్కారమొనర్చి యయ్యిరువు

రను సందిటఁ గూర్చి పీడ్కొని వియన్మార్గము మెట్టెను. వానరవీరులు పరమామోదవశులై వాలములు విదిర్చి సింహనాదంబులు గావించిరి. భేరీధ్వనులు చెలరేఁగెను. కపియోధులు భుజంబులాస్ఫాలించి వృక్షంబులను బెకలించి చేతఁబట్టి లంకాద్వారంబులను ముట్టడించిరి.

## —♦ రావణ సంతాపము: ♦—

వానరుల బొబ్బార్పులు విని రావణుండు వితాకుచెంది కపిసైన్యసంతోషకారణంబేమో యని సంగతి విచారించి రాఁ గొందఱ నాజ్ఞాపించెను. వారు చని ప్రాకారమెక్కి వానరసైన్యమెల్ల సుగ్రీవాధిష్ఠితమై యుండుటయు రామలక్ష్మణులు శరబంధముక్తులై యథాసుఖముండుటయు జూచి భయవిహ్వలులై వెలవెలంబోవుముఖంబులతో రావణునొద్దకువచ్చి వానికి సంగతి విన్నవించిరి. రాక్షసేశ్వరుఁడు విన్నఁబాటుచెంది 'కటా! ఇఁక రాక్షససేనకు ముప్పుదప్పదు. వాసుకితేజఃస్ఫూర్తులైన నాగపాశంబులబారింబడి జీవించినవారెవ్వరుం గలుగరు. అవిగూడ నేఁడు వీరియెడ నిరర్థకములయ్యెను' అని నిట్టూర్చి ధూమ్రాక్షునిఁబిలిచి 'వీరాగ్రణీ! నీవు ససైన్యంబుగాఁ బోయి రాముని వధించి రమ్మ'ని యాజ్ఞాపించెను.

## —♦ ధూమ్రాక్షుని యుద్ధము ♦—

ధూమ్రాక్షుఁడు రావణునకుఁ దలయొగ్గి తరలెను. వాని వెంట బద్ధఘంటులును ఘోరరూపులునైన నిశాచరులు వేనవేలుగా శూలముద్గర గదాపట్టస దండాది వివిధాయుధహస్తులై మేఘనిర్ఘోషములు గావించుచు రథంబులెక్కి కొందఱును హయంబులారోహించి కొందఱును మదగజంబులధిష్ఠించి కొందఱును జనిరి. ధూమ్రాక్షుఁడట్లు మహాసేనాసముపేతుఁడై పశ్చిమద్వారమువంకఁ బోయెను. మార్గమధ్యమున వాని రథశీర్షంబున మహాగృధ్రము వ్రాలెను; కుణపాశనంబులైన పక్షులు తద్ధ్వజాగ్రంబుల వ్రాలి యందుండి నేలరాలెను; రక్తప్లుతమైన శవమొండు వికృతరోదనంబొనర్చుచు వానిసమీపంబునఁ దటాలునఁ దోఁచెను; మేఘంబులు రుధిరంబులను వర్షించెను; వాయువు నిర్ఘాతధ్వనితోఁ బ్రతిలోమముగా వీఁచెను. ధూమ్రాక్షుఁడాయుత్పాతంబులకు వ్యధితుఁడయ్యు ధైర్యోత్సాహంబులు వదలక రణభూమి చొచ్చెను.

రాక్షససైన్యంబు దృక్పథమైనంతనే వానరులు ప్రహృష్టులై కిలాకిలించిరి. రక్కసులుం వారికి జవాబుగాఁ ప్రతిగర్జలుగావించిరి. ఇరువాగులు తలపడెను. వానరులశిలాహతులకు నిశాటులు ముద్దలైకొందఱును నెత్తురులు గ్రక్కి కొందఱును బ్రక్కలుజీలి కొందఱును బ్రేవులురాలి కొందఱును గూలిరి. ధ్వజంబులు విరిగెను ; రథఖురంబులు ద్రెళ్లెను ; హయంబులు సాదిసహితంబుగా డొల్లెను. రక్షోవీరుల ఖడ్గప్రహారంబులకు వానరులు విఖండితహస్తులై కొందఱును విదారితాంఘ్రులై కొందఱును బడిరి. వానరోద్వేగము పెచ్చు పెరిగెను. ఆధాటికి నోర్వక రక్షోబలము పాఱఁదొడంగెను. ధూమ్రాక్షుఁడు తనసైన్యంబట్లగుటకుఁ గోపవశుఁడై వానరానీకము పఱుంబడి చెండాడసాగెను. వాని దాడికిఁ గపిసేన దిక్కులు పట్టెను. హనుమంతుఁడది చూచి మహాగ్రహోదగ్రమూర్తియై పెనుబండ నెత్తి ధూమ్రాక్షుని రథముపై వైచెను. రక్షోవీరుఁడు రథంబునుండి దుమికి యావ్రేటు తప్పించుకొనెను. వాని రథము చక్రకూబరధ్వజాశ్వంబులతోడఁ చూర్ణమయ్యెను. హనుమంతుఁ డంత మహాభూరుహంబును బెకలించి దానితోడ రాక్షససైన్యమును మర్దించెను. అసురవీరులు తలలుపగిలి నెత్తురులు గ్రక్కుచు నేలఁగూలిరి. రాక్షసబలమునట్లు మారుతి గావించి పర్వతశిఖరంబునుగొని ధూమ్రాక్షుని గవసెను. అతఁడు గదాహస్తుఁడై వాయుసుతునిమీఁదికి నుఱికి వానితలమీఁద దానినివైచి యార్చెను. హనుమంతుఁడు వ్రేటుపడియు లెక్కచేయకతనచేతిబండను వైరిశిరంబునఁ బడవైచెను. రక్షోవీరుఁ డగ్గిరిశృంగతాడితుఁడై వికలాంగములతో నేలఁగూలెను. వాఁడు చచ్చినంతనే వానరులు చెలరేఁగిరి. రాక్షసులు భీతిల్లి లంకఁ జొచ్చిరి.

## —• వజ్రదంష్ట్రుని యుద్ధము •—

ధూమ్రాక్షునిచావు రావణుఁడు విని పన్నగమువలె నిట్టూర్చి వజ్రదంష్ట్రుని బిలిచి వైరిని నిర్విశేషముగావించి రమ్మని పంపెను. అతఁడు చతురంగబలసమేతుఁడై యంగదుడున్న దక్షిణద్వారము దాఁకెను. అచ్చట వానరరాక్షసులకు ఖడ్గాఖడ్గి బాహాబాహి ఘోరయుద్ధమయ్యెను. ఉభయబలంబులందును వేనవేలు చిత్రవిచిత్రవధలఁ బాత్రులైరి. వానరవిజృంభ

ణంబునకు భీతిల్లి రాక్షసులు పలాయనోన్ముఖులైరి. వజ్రదంష్ట్రుఁడు కోపోద్దీపితుఁడై వజ్రంబునుబోని ధనూరత్నంబును దాల్చి యంగదుని దాఁకెను. అయ్యిరువురును సింగంపుగొదమలవలె మదపుటేనుంగుల రీతి వివిధాస్త్రములఁ బెద్దకాలము పోరిరి. అసురవీరుఁడు వానరసింహుని వేయిశరంబుల నొప్పించెను. కపీంద్రుఁడు వైరిపయిఁ బెనువృక్షంబును వైచెను. రక్షశ్శూరుఁడు దానిని ద్రుంచివైచెను. అంగదుఁడంత భూరిశైలంబును దెచ్చి యెదిరి తలపయి వైచి యార్చెను. వజ్రదంష్ట్రుఁడు రథంబునుండి దుమికి యా వ్రేటు తప్పించుకొనెను. అంగదుఁడంత రెట్టించినకోపంబుతో మఱియొండు పర్వతంబునుగొనివచ్చి వజ్రదంష్ట్రునిపై వేసెను. వాఁడు దానితాకుపడి నెత్తురు గ్రక్కి మూర్ఛిల్లి తేఱి గదాయుధంబును దిర్దిరఁ ద్రిప్పి యంగదుని యురంబునఁ బ్రహరించెను. అంతట నిరువురు ముష్టియుద్ధంబునకుఁ గడంగిరి. వారి పోరు బుధాంగారకులపోరువలె నయ్యెను. ఇరువురుఁ బెద్దయుండడవు పెనఁగి యలసిసొలసి చదికిలఁ బడిరి. అంగదుఁడు దండతాడిత పన్నగంబు క్రియ విజృంభించి నిశితఖడ్గంబున వజ్రదంష్ట్రుని శిరంబుఁ దఱిగెను. వాఁడు నేలఁగూలెను. వానిపాటుం గాంచి హతశేషులైన రక్షోవీరులు తలలు వాల్చి లంకకుఁ బరుగెత్తిరి. వానరసైన్యంబంగదుని జయజయధ్వానముల నుగ్గడించెను.

## అకంపనుని యుద్ధము

వజ్రదంష్ట్రునిగతి రావణుఁడు విని ప్రోలనున్న బలాధ్యక్షుని జూచి "సర్వశస్త్రకోవిదుండైన యకంపనుఁడు దుర్ధర్షులైన రాక్షసవీరులతోడ యుద్ధంబునకుఁ బోవుఁగాక. అతఁడు శత్రుదళహనన స్వబలరక్షణక్రియాదక్షుండును సమరప్రియుండును మీఁదుమిక్కిలి నామేలుగోరువాఁడునై యున్నాఁడు. ఆవీరశిఖామణి రామలక్ష్మణులను వధించి సుగ్రీవుని జయించి వానరసైన్యంబును రూపుమాపి వచ్చుఁగాక" యని యాజ్ఞాపించెను. అకంపనుఁడు ఱేనియాజ్ఞ విని రణంబునకుఁ దరలెను. అతఁడట్లు పోవుచుండఁగా మార్గమధ్యంబున వానిరథాశ్వములు హఠాత్తుగా దైన్యమొంది నిలచెను ; మఱియు నతని వామనయనంబదిరెను ; వానిముఖము వైవర్ణ్యమొందెను ; వానికంఠధ్వని గద్గదాయత్తమయ్యెను ; గాలి రూక్షముగా వీఁచెను ; మేఘంబు లున్నట్లుండి గప్పెను.

"క॥ మాసెనభోమణి నక్కలు
గూసెంగలయంగ దెసలఖంబలుచాయల్
సేసెంబఱమొయిళులడరి
మ్రోసెందమయంతఁదూర్యము లపధ్వానులై"

అకంపనుఁ డాయుత్పాతంబులను గాంచియు లెక్కసేయక కదనక్షోణిఁ జొచ్చి వానరసైన్యంబును దాఁకెను. వానరరాక్షసవీరులు రామరావణార్థము తమ ప్రాణంబులనుగూడఁ ద్యజించియుండిరి గావున నిరుసైన్యంబులకు మహారౌద్రసంగ్రామమయ్యెను. ఇరుపక్షంబులవారుఁ బరస్పర జిగీషాపరులై యార్చుచుఁ బేర్చుచుఁ బోరిరి. వారిపాదఘాతంబులఁ గెంధూళిపటలంబులు రేగి దట్టంబుగా నావరించి స్వపరవివక్ష యేర్పడనీయకుండెను. కంఠధ్వనులనుబట్టి యొండొరు గుఱుతించుచుఁ దుములయుద్ధ మొనర్చిరి. రణరంగంబెల్ల నుభయదళరుధిరకర్దమంబును శవమయంబునై ద్వివిదుం భీతిగొలిపెను. కుముదుండొకవంక నలుండొకవైపున మైందుఁ డొకయోర ద్వివిదుండొకచాయఁ జెలరేఁగి రక్కసుల వధింపసాగిరి. అకంపనుండది గాంచి తనరథంబు నాయావంకకుఁ దోలించుచు బాణవర్షంబున నయ్యాయి వారిని నొప్పించెను. వానరులాశరపాతంబునకు నోడి పఱతెంచసాగిరి. కపిసైన్యంబట్లు రక్షోవీరునిచేతఁ బడి తల్లడిల్లుట హనుమంతుఁడు చూచి వాని మీఁదికి విక్రమించెను. అకంపనుఁడు మారుతిపై శరధార వర్షించెను. ఆబాణవృష్టిని గేసరి సరకుచేయక మేదినీతలంబు గ్రక్కదలఁ బాదఘట్టం బొనర్చి దిక్కులద్రునట్లుగా నార్చి పట్టపగటినూర్యునిపగిది దుర్ధర్షుఁడై యకంపనుని మార్కొని శైలంబొండు గిఱగిఱద్రిప్పి వైచెను. అకంపనుం డాశైలంబు నర్ధచంద్రబాణంబున ఖండించి యార్చెను. హనుమంతుఁడంత రోషదర్పాన్వితుఁడై పెద్దమద్దిచెట్టును వ్రేళ్ళతోడఁ బెఱికి తెచ్చి దానితోడ శత్రుగజగజారోహరథరథిక పదాతులను జూర్ణమ్మొనర్చెను. వానియుద్ధతికి వెఱచి హతశేషులైన రాక్షసులు పాఱఁజొచ్చిరి. అకంపనుఁడు తనసైన్యస్థితికి విషాదక్రోధపరవశుండై హనుమంతునిఁ బదునాల్గు క్రూరనారాచంబుల నొప్పించెను. మారుతి శరవిద్ధుఁడై పుష్పితాశోకంబు కరణి విధూమాగ్ని చందంబునఁ దేజరిల్లి మహోన్నతపాదపంబును బెకలించి తెచ్చి రక్షో

వీరుని శిరంబు వ్రీలపోదెను. ఆ వ్రేటుతోడ నకంపనుఁడు తలవ్రచ్చి చచ్చెను. వానిమరణంబునకు రాక్షసవీరులెల్ల భూకంపంబున వృక్షంబులట్లు కంపిల్లుచు నాయుధంబులను బాఱవైచి విరిసినతలలతోఁ దహదహపడు హృదయంబులతో జిఱుచెమటలు గార్చు శరీరంబులతో నిట్టూర్పులతోఁ దిరిగి తిరిగి చూచుచు నొండొరుఁద్రోపాడుచుఁ బాఱి లంకాపురముఁ జొచ్చిరి. వానరులు జయజయధ్వనులు గావించిరి. దేవతలు హనుమంతుని నభినందించిరి. రామలక్ష్మణ సుగ్రీవులు వానిని బ్రశంసించిరి. మారుతియట్లు వీరలక్ష్మీ విరాజితుం డయ్యెను.

## —♦ ప్రహస్తుని యుద్ధము ♦—

అకంపనునివధ రావణునిఁ బెద్దయు విచారసాగరంబున ముంచెను. అతఁడు పఱువాతలేచి మంత్రులతో నాలోచించి నిజసైన్యంబునకు ధైర్యోత్సాహములు గలిగించు తలంపునఁ జని లంకానగరమెల్లెడల వానరనిరుద్ధమగుటఁ జూచి మహాకుపితుఁడై సభాస్థానమునకు వచ్చి యుద్ధవిశారదుఁడైన ప్రహస్తుని రప్పించి 'రణశౌండీరా! పట్టణమెల్ల శత్రుసైన్య నిరుద్ధమై పీడింపబడుచున్నది. ఈముట్టడిని వదలింప నేనో కుంభకర్ణుఁడో నీవో యింద్రజిత్తో నికుంభుఁడో తప్పయన్యులు చాలరు. నీవు తడవుసేయక సేనా పరివృతుండవై చని విజయమొందిరమ్ము. మీసింహనాదంబులకుఁగోఁతులు దెసపట్టును. ప్రహస్తా! అట్లువానరసైన్యంబు పాఱినంతట రామ లక్ష్మణులు నిరాలంబులై నీచేతిలో సులభముగాఁ జిక్కుదురు. జయాపజయంబులు నిశ్చయింపరావు గావునఁ దెలిసి తెలిసి ముప్పును వరింపనేలయని శంకింపవలదు. మనము యుద్ధమును మానినను మనవైరులు మనలను మననీయరు. యుద్ధముచేయుదుమేని జయము మనకుఁ గలిగిన గలుగవచ్చును; మనవారి ప్రాణమానంబులు దక్కవచ్చును. ఈవిచారము దీర్ఘముగాఁ జేసితిమి. యుద్ధమే శ్రేయమని నిశ్చితమయ్యెను. ఈయూహ నీకు నచ్చునో లేదో దాపకఁ దెలుప వచ్చును. ఏది మేలని నీవు తలఁతువో యది నాకును సమ్మతమే' యనెను. నావుడు 'రాక్షసేశ్వరా! ఈవిషయమును గుశలమతు లయిన నీమంత్రులెల్లఱుఁ గూడి వితర్కించిరి. మాకుఁ బరస్పర మత భేదము గలిగెను. సీతను గొనిపోయి రామున కిచ్చుట మేలని నా నిశ్చయము. అట్లుచేసినచో యుద్ధము సమసిపోవును. ఒండుచో నది తప్పదు.

లంకేశ్వరా ! ప్రాణభయంబున నిట్లనుటగాదు. నీవలన దానమానసాంత్వనంబు లందితిని. నాప్రాణంబులు నీయధీనమొనర్చితిని. సమయము వచ్చినప్పుడు వెనుదీయువాఁడఁగాదు' అని పలికి సమక్షముననున్న సేనానాయకుని జూచి 'రాక్షసబలంబునెల్ల నాయత్త పఱుపుము. నాబాణాగ్నులు వానరబలంబును భస్మీభూతమొనర్చుఁగాక' యనెను.

ముహూర్తమాత్రంబున రాక్షససింహనాదంబులు చెలరేఁగెను. జయావహ హోమగంధంబులును బ్రాహ్మణార్చనపుష్పాదిగంధంబులును గలసి పురంబెల్ల మనోహరముగా వీఁచెను. రాక్షసవీరులు విజయప్రద మంత్రాభిమంత్రిత వివిధ పుష్పమాలికలను ధరించి కవచంబులు దొడిగి ధనుర్లతలుబూని రాక్షసేంద్రునకుఁ బ్రదక్షిణమొనర్చి ప్రహస్తుని బరివేష్టించిరి. జయభేరులు పెల్లున మ్రోఁగెను. దివ్యరథము నేమిఘట్టనంబుల భూమినగల్చుచు వచ్చి యెదుట నిలిచెను. ప్రహస్తుఁడారథమారోహించెను. తోడ్తోడఁబర్జన్యనిర్ఘోషములఁబోలు దుందుభిధ్వనులును రాక్షససింహనాదంబులును జెలరేఁగెను. అంతలోన వానిమంత్రులు నరాంతకుండును కుంభహానువును మహానాదుండును సమున్నతుండును వచ్చి వెంటనిలిచిరి. ప్రహస్తుఁడట్లు మంత్రిసేనాసమాయుతుఁడై రణరంగమునకుఁ దరలెను.

సీ॥ జంబుకంబులనలజ్వాలల వెలిగ్రక్కె,
వికృతరావంబుల వీనులవిసె,
సురియుచువాయువుల్ పరుషంబుగావీచె,
గగనంబుకురిసె నుల్కాప్రతోళి,
గ్రహములొండొరుదాఁకి కాంతిహీనములయ్యె,
వర్షించె రక్తముల్ వారిధరము,
గద్దయొకటి ధ్వజాగ్రస్థలంబున వ్రాలె,
సారథిచేకోల జాఱిపడియె,

గీ॥ సమముగానున్న నేల నశ్వములు మ్రొగ్గె
మాంసశోణితభుక్కులై మనెడిపులుగు
లతని రథమునట్టెనపసవ్యముగఁజుట్టె
నప్పుడేవానితేజంబు కప్పుదాల్చె॥

ప్రహస్తుఁడాయశుభంబులను జీరికిఁగొనక యుద్ధోన్ముఖుఁడై చనెను. వానరసైనికులు వృక్షశిలాద్యాయుధపాణులైరి. రాముఁడు ప్రహస్తుని రాకఁజూచి 'విభీషణా! ఈమహాకాయుఁడు ప్రబలసేనాసమేతంబుగా వచ్చుచున్నాఁడు. ఇతఁ డేపాటివాఁడో' యని సస్మితముగా ననెను. నాఁడు 'రామా! ఇతనిని బ్రహస్తుఁడందురు. రావణుని సేనానాయకులలో నితఁడు పేరుగాంచెను. రాక్షససైన్యములో మూఁడవ భాగంబితని యాజ్ఞలోనుండును.

తే॥గీ॥ వీర్యశౌర్యపరాక్రమోద్వేగియనుచు,
నుత్తమోత్తమసకలాస్త్రవేత్తయనుచు,
వెలుఁగుదోపని వీరాగ్రవీరుఁడనుచు,
రాక్షసేశ్వరుఁడితని గారాముసేయు॥

అని విభీషణుండు చెప్పెను.

అంతలోన నుభయసేనలు దాఁకెను. రాక్షసులు శూలచక్రపరిఘాదులతో వానరులను బ్రహరించిరి. కపివీరులు చెలరేఁగి రక్కసులను గుంపులుచేసి వృక్షశిలాదులతో మర్దించి పెక్కురఁ గూల్చిరి. కొందఱు నిశాచరులు ముష్టిఘాతంబులొందియు దంతంబులు ప్రీలియుఁ గన్నులఁగవియు నెత్తురులు గ్రక్కుచుఁ బడిరి.

రాక్షససైన్యంబట్లగుటఁ జూచి ప్రహస్తుని మంత్రులు విజృంభించి వానరానీకంబుపయి దుమికిరి. ద్వివిదుం డదిగాంచి పర్వతశిఖరంబొండు గొనివచ్చి నరాంతకుని వైచి యార్చెను. అరక్షోవీరుఁ డాప్రేటుపడి నెత్తురు ముద్దయి చచ్చెను. దుర్ముఖుండు మహావృక్షంబును గొనివచ్చి సమున్నతుని మోఁదెను. వాఁడు తలప్రీలిడొల్లెను. జాంబవంతుఁడు ఘోరశిలతో మహానాదునియురము వ్రయ్యచేసెను. వాఁడుగుండెలుచీలిపడెసెను. తారుఁడు దొమ్మియుద్ధంబున గుంభహనువును హరించెను.

ప్రహస్తుఁడు వానిమంత్రులగతిఁగాంచి కటకటంపడి ధనుర్ధరుఁడై పుంఖానుపుంఖంబులుగాఁ దీవ్రశిలీముఖంబులను బఱపి వానరానీకంబును గలగుండుచేయసాగెను. నీలుఁడు వాని నెదిరించెను. ప్రహస్తుఁడు కోపోద్దీపితుఁ

డై సర్పంబులఁబోని తీవ్రశరంబుల నాకర్ణాంతము దివిచి నీలునిపై వైచెను. ఆబాణంబు లవ్వానరవీరుని దేహంబుఁ దూటాడి యెడసి నేలఁబడుచుండెను. ఆవీరవరులకు నట్లు పెద్దకాలము గజకచ్ఛపముల పోరు జరిగెను. నీలుఁడు ప్రహస్తుని తేరిగుఱ్ఱంబులను వధించి వానిచేతివింటిని దుంచెను. ప్రహస్తుఁడు విరథుఁడును విధన్వియునై ముసలంబును గైకొని నీలునిపయికి నుఱికి యతనిని లలాటభాగంబునఁ బ్రహరించెను. నీలుఁడు నెత్తుటఁదోఁగుచు మహావృక్షంబుతోఁ బ్రహస్తుని వక్షంబును బగిల్చి వానిశిరంబును వ్రయ్యలుచేసెను. ప్రహస్తునివధఁగాంచి రాక్షససైన్యమెల్లఁ జీకాకుగా రావణునొద్దకుఁ బఱచి చింతావశంబున మూర్ఛితులోయన నోరెత్తక నిలిచిరి.

### — రావణుని తొలియుద్ధము —

రావణుఁడు సంగతి గ్రహించి శోకక్రోధవివశుండై రాక్షసముఖ్యులఁ జూచి 'ఇంద్రబలసమానుండైన నా సేనానాయకుని వానరులు పొరిగొనిరి. ఇఁక వారియెడ నిర్లక్ష్యబుద్ధిని జూపరాదు. ఈఁగలకు శలభంబులు బలియైనట్లుగా నున్నది. నేనే స్వయముగా యుద్ధంబునకుఁ బోవుదుగాక' అని పలికి రథమారోహించెను. భేరీశంఖపణవాద్యాయుధంబులు ఘల్లున మ్రోఁగెను; వందిమాగధాదిస్తవంబులు ప్రతిధ్వనులీనెను; శైలజీమూతనిభాకారులైన రాక్షసులు చుట్టుఁ గొలువుసేరిరి, రావణుండట్లు రక్షోవీర పరివేష్టితుఁడై భూతగణసమాయుక్త రుద్రుండువలె వెడలెను. వానరసైన్యము రావణునిరాకఁ జూచి పర్వదినమహాసముద్రమువలె రొదసేయుచుఁ బాదప శైలంబులను హస్తతలంబుల ధరించి యుద్ధోత్సాహముతో నుండెను.

రాక్షససైన్యంబట్లువచ్చుట రాముఁడు చూచి 'విభీషణా! నానా పతాకధ్వజశస్త్రంబులతోఁ బ్రాసాసిశూలాయుధంబులతో నడగొండలఁ బోనిమదపుటేనుంగులతో రాక్షససైన్యంబు వచ్చుచున్నది. సేనాని యెవఁడో' యనెను. నాపుడు 'రామా! రావణుండు స్వయముగా యుద్ధంబునకు వచ్చుచున్నాఁడు. అదిగో బాలార్కముఖకాంతిదీపింప గజారూఢుఁడై పరమాటోపంబుతో వచ్చుచున్నయతండు రావణునిపుత్త్రుఁ డకంపనుఁడనువాఁడు. ఆవంకరథస్థుఁడై శక్రచాపంబునుబోని ధనస్సును బట్టి జ్యాటంకారంబు గావించుచు వచ్చుచున్నయతఁడింద్రజిత్తు. ఈవంక రథ

గతుండై సమస్తనాగంబు గాలించుచు వచ్చుచున్న యతండు వింధ్యాచలాకారుఁ డతికాయుఁడు. ఉల్లసిత బాలార్కసన్నిభంబగు నేత్రకాంతిఁ గలిగి ఘంటానినాదప్రశస్తంబైన కరీంద్రంబు నధిష్ఠించి వచ్చుచున్నయతండు మహోదరుండు. కాంచనచిత్రాభరణభూషితుండై సంధ్యాభ్రగిరివలెనున్న యశ్వంబు నారోహించి ప్రగ్రహ మహోజ్జ్వలప్రాసంబును హస్తాగ్రంబునధరించి వచ్చుచున్నయతండు పిశాచుండు. శరద్ఘనాభవృషభేంద్రంబు నెక్కి విద్యుత్కాంతిసన్నిభంబగు శక్తి ధరించియున్న యతండు త్రిశిరుండు. ఆ పన్నగేంద్రసన్నిభుఁడు కుంభుఁడనువాఁడు. జాంబూనదవజ్రభూషితమైన సధూమపరిఘంబును బూనియున్న యతండు నికుంభుండు. ఇతఁడే రాక్షససైన్యముఖ్యుఁడు. ఇంతటి యుద్ధోత్సాహకర్ముఁడు గలుగఁడు. చాపబాణఖడ్గనిబిడీకృతంబును ధ్వజాలంకృతంబును నై యగ్నిరాశివలె వెలుంగుచున్న యరదంబు నెక్కి వచ్చుచున్న యతనిఁ జూచితివే? ఇతనిని నరాంతకుఁడందురు. వీఁడు గిరిశృంగంబులతోఁ బోరాడి భుజబలంబునఁ దీర్చఁగలఁడు. వివిధాకారభూతపరివేష్టితుండై కిరీటకుండలంబులు ధరించి యరదంబుపయి సూక్ష్మశలాకశ్వేతచ్ఛత్రంబునీడ సూర్యునివలె వెలుఁగుచున్న యతండు రాక్షసేంద్రుఁడు రావణుఁడు' అని విభీషణుండు వివరించి చెప్పెను.

రాముఁ డావచనంబులు సాంతముగా విని రావణునిఁ జక్కఁగాఁ జూచి 'విభీషణా! రావణుని దివ్యతేజము తేజఃప్రతాపంబునుఁ జాటుచున్నది. తేజఃపుంజంబైన యితనిరూపము తేరిచూడరాకున్నది. దేవదానవులందు నింతటి తేజశ్శాలి గలుగఁడు. ఇతని పరివారముగూడ నోజోవంతమై యున్నది. ఘోరగణావృతుఁడైయున్న యితండు యముఁడట్లు తోఁచును. దురాత్ముఁడు దైవవశంబున నాయెదుటఁ బడనున్నాఁడు. సీతాపహరణసంభవమైన మదీయ కోపాగ్ని నేఁడు చల్లారుఁగాక' యని శరచాపంబులు ధరించి లక్ష్మణసహితుఁడై యుండెను.

రావణుఁడు గొప్పవీరులను గొందఱఁ బిలిచి 'రాక్షససైన్యమెల్ల నా వెంటవచ్చుట వానరులు చూచి పట్టణాంతరమెల్ల నరక్షితంబని తలంచి వారు పురముఁజొచ్చి యకార్యంబు లొనర్తురు గావున మీరు చని చతుష్పథగృహంబులందును బురద్వారములందును జాగరూకులరై యుండుఁ' డని వారిని బంపి, కపిసైన్యముఁ జొచ్చి తిమింగిలంబు సముద్రజలంబునట్లు కలంప

సాగెను. సుగ్రీవుఁడు రక్షోనాథునెదుర్కొని యతనిపైఁ బెనుబండను రువ్వెను. రావణుండా శిలను నిశితవిశిఖంబులఁ దుత్తునియలు గావించి మహాహికల్పశరంబును సంధించి యాకర్ణాంతము దివిచి సుగ్రీవవధార్థము ప్రయోగించెను. ఆబాణము రావణబాహుముక్తమై విస్ఫులింగజ్వాలనంబులతో ఝంఝానిలవేగంబునవచ్చి కుమారప్రయుక్తయైన శక్తియల క్రౌంచాద్రినివలె సుగ్రీవుని భేదించెను. వానరేంద్రుఁడు వ్రేటువడి కిలకిలఁ గూసి ప్రజ్ఞతప్పి పుడమిపయి వ్రాలెను. వానిపాటునకు రాక్షసులు ప్రహృష్టులై సింహనాదంబు లొనర్చిరి. సుగ్రీవుఁడట్లగుట గవయ గవాక్ష ఋషభ జ్యోతిర్ముఖ నళులు చూచి కోపవివశులై శరీరంబులు పెంచి శైలంబులఁ గైకొని యెక్కుమ్మడి రావణుని దాఁకిరి. రాక్షసేశ్వరుండు వారువైచిన నగంబులనెల్ల శరంబులతో ఖండించి యాకపివీరులను జాంబూనదపుంఖబాణంబుల నొప్పించెను. గవాక్షాదులు తద్బాణభిన్నగాత్రులై నేలఁ గూలిరి. అంత రావణుఁడు వానరసైన్యంబునెల్ల శరవృష్టిముంచెను. కపులెల్లఁ జీకాకుపడి కేకలిడుచు రాముని శరణొల్లిరి

## —♦ రావణ హనుమంతుల యుద్ధము ♦—

రాముఁడంత ధనుష్పాణియై వానరరక్షణార్థము యుద్ధరంగంబునకుఁ బోవసమకట్టెను. లక్ష్మణుఁడు వానికి నడ్డువడి కేలొగ్గి 'అన్నా! ఈదురాత్ముని వధించుట నీకు లీలామాత్రమగును. నీతోడియుద్ధంబునకు నితఁడు తగఁడు. అనుజ్ఞయిమ్ము; వీనికావరంబు నడంచివత్తు' ననెను. రాముఁడందులకు సమ్మతించి 'నాయనా! రావణుఁడు మహావీరుఁడు; వానిపరాక్రమము రణరంగంబున మహాద్భుతంబుగా నుండును. వానియలుకకు ముల్లోకంబులు గూడ భీతిల్లును. ఆత్మీయచ్ఛిద్రంబులను సవరించుకొనుచు వైరిచ్ఛిద్రంబులను వెదకి వానిని బ్రహరింపుము. సమాహితబుద్ధిని వదలవలదు. చక్షుశ్చాపంబులచేత నాత్మరక్షణమొనర్చుకొనుచు యుద్ధమొనర్పు' మనెను. లక్ష్మణుఁ డన్నకు మ్రొక్కి భీమంబును దీప్తంబునునైన చాపంబును గైకొని రావణుఁడున్న యెడకుఁ దరలెను. సౌమిత్రి యట్లు వచ్చుట హనుమంతుఁడు చూచి వానికి నడ్డుపడి 'నేనుండఁగా నీకీకష్టమేల?' యనుచు రావణునిపయికి నుఱికి తదీయరథంబుపయిఁ జేరి దక్షిణభుజమెత్తి 'రావణా!

నానావృక్షంబులు పెఱికి వైరిపై వైచెను. దశగ్రీవుఁడు వానినెల్ల వాడి కోలలఁ ద్రుంచి నీలుని మీఁద బాణవృష్టిఁ గురిపించెను. నీలుఁడు నిజ రూపంబును ప్రాస్వీకరించి రావణుని ధ్వజాగ్రముమీఁదవ్రాలి సింహానా దంబొనర్చి వానికి గుటేయియ్యక తదీయ ధ్వజాగ్ర ధనురగ్ర కిరీటాగ్రము లందు సంచరింపసాగెను. నీలుని లాఘవంబునకు రావణుఁడు సంభ్రాం తుఁడై యాగ్నేయాస్త్రంబును సంధించి 'నీలా ! మాయలు చాలనేర్చితివి ; నీలాఘవంబును మెచ్చితిని. వలఁతివేని నీప్రాణంబుల నిప్పుడు దక్కించు కొను' మని బాణంబును వదలెను. అయ్యస్త్రంబు నీలుని యురంబుఁ జొచ్చెను. వానరవీరుఁడు తదీయజ్వాలానిర్దహ్యమానుఁడై క్రిందఁబడియు స్వతేజోవిశేషంబునను దండ్రియైన యగ్నిహోత్రుని యనుగ్రహంబునను బ్రాణహాని నొందక మోఁకాళ్లమీఁద నిలిచి విసంజ్ఞామాత్రుఁ డయ్యెను.

## —♦ రావణ లక్ష్మణుల యుద్ధము ♦—

రావణుఁ డంత లక్ష్మణునిమీఁదికి సేఁగి ధనుష్టంకారమొనర్చెను. సౌమిత్రి వానిఁ జూచి 'వానరులతోడి యుద్ధమేల ? రా రమ్మ' ని పలికి జ్యానాదము గావించెను. దశకంఠుఁడు మహోగ్రమూర్తియై 'లక్ష్మణా ! చావుమూడి వచ్చితివి. ఇదిగో యమపురికిఁ దరలనున్నా' వనెను. నావుడు 'పాతకాధమా ! ప్రభావవంతులు ప్రగల్భింపరు. నీబలపరాక్రమంబుల నెఱుంగుదును. శరముంబట్టితిని. తడవేల ?' యని సౌమిత్రి యనెను. రావణుఁ డామాటతోడ సప్తనారాచంబులను లక్ష్మణునిపై వైచెను. లక్ష్మ ణుం డాబాణంబులను బ్రతిశరంబులువైచి ద్రుంచెను. రావణుఁడు మఱల తీవ్రశరంబుల వైచెను. లక్ష్మణుఁడు శరవృష్టిఁ గురిపించి వైరిబాణంబుల నెల్ల ఖండించి నిశ్చలుఁడై నిలిచెను. రావణుఁడు లక్ష్మణశరప్రయోగ లాఘవంబునకు విస్మయమొంది తీవ్రాశుగపరంపరలఁ బఱపెను. లక్ష్మ ణుఁడు వజ్రంబులఁబోని శితాగ్రశరంబులను వహ్నిజ్వాలలు గ్రక్కుచున్న వానిని సంధించి వదలెను. రక్షోనాథుఁ డాబాణంబులను ద్రుంచి బ్రహ్మ దత్తంబును గాలాగ్ని ప్రభావిరాజితంబునైన దివ్యశరంబును సంధించి సౌ మిత్రిలలాటము గుఱిచేసివైచెను. లక్ష్మణుఁడు రావణసాయకార్తుఁడై శరచాపంబులు దిగవైచి మూర్ఛిల్లి తేఱి వైరిచేతిచాపంబును ఖండించి మూఁ

డమ్ములు వైచి వానిని నొప్పించెను. రావణుఁడు బాణపీడితుఁడై సొమ్మసిల్లి తేటి బ్రహ్మదత్తయైన శక్తిని సౌమిత్రిపై వైచెను. ఆశక్తి విధూమాన లంబుక్రియ వెలుంగుఁచు నిప్పులుగ్రక్కుచు వానరులు చూచి తల్లడిల్లిరి. అది లక్ష్మణుని యురంబు సొచ్చి దూఱి రావణుని చేరెను. సౌమిత్రి మూర్ఛాక్రాంతుఁడయ్యెను. రావణుండతనిఁ జేరబోయి చేతులతోఁబట్టి లేవనెత్త నుంకించి 'అహా! హిమాద్రి మందర మేరుపర్వతంబుల నూటాడించిన నా భుజంబు లితని నెత్తలేకున్నవి గదా' యని తలంచుచుండఁగా, హనుమంతుఁడు డాయవచ్చి యయ్యసురేశ్వరునిఁ బిడికిటఁబొడిచెను. ఆ వ్రేటుతోడ రావణుఁడు వ్రాల్చి మోకాళ్ళపయిఁ బోరగిలఁబడి నయనశ్రవణాననంబులగుండ నెత్తురుగ్రక్కుచుఁ బొరలాడి చేష్టలుడిగెను. హనుమంతుఁడంతట లక్ష్మణు నెత్తుకొని పోయి రామునొద్దనుంచెను.

—♦ రామరావణ యుద్ధము ♦—

అంతలోన రావణుఁడు మూర్ఛదేఱి విల్లుబూని కోఁతిమూకను పికాపికలు గావింపసాగెను. వానరులతని ధాకకు నోర్వక దిక్కులుపట్టఁ జొచ్చిరి. రాముఁడదిగాంచి రావణుని మీఁదికి నడరనుండెను. హనుమంతుఁడు వానిని సమీపించి 'శ్రీమహావిష్ణువు గరుత్మంతునట్లు నీవు నాపయి నెక్కి సమాహితుఁడవై వైరితోఁ బోరవగు' నని విన్నవించెను. దాశరథియట్లు గావించి వజ్రనిష్పేషనిస్వనంబుగా జ్యానాద మొనర్చి,

మ॥ అలదేవేంద్రునిచాటుదాగినను నయ్యాదిత్యుప్రాపొందినన్
జ్వలనుంజేరిన మృత్యువుందరిసినన్ శర్వాత్మకుండైన య
య్యలికాక్షుఁ శరణిల్లిగొల్చినను దైత్యాధీశ! నీప్రాణముల్
నిలువన్నేరవు మచ్ఛరాభిహతులన్ నిక్కంబు మమ్మాటికిన్ ॥

ఎవ్వని శక్తితోఁ బ్రహరించితివో యతఁడే యిప్పుడు నిన్ను సబలంబుగా బూడిద గావింపనున్నాఁడు. ఉత్తలపాటు వలదు. ఏరాముఁడేకాకిగా జనస్థానవాసులైన రక్షోవీరులను బదునాల్గువేలమందిని వధించెనో యా రాముఁడే యీతఁడని గ్రహింపు' మని వచించెను.

రావణుఁ డా మాటలకు నుడ్డుడికి రామునివాహనంబుగానున్న హనుమంతుని పయిఁ గానానలశిఖోపమంబులైన బాణంబులు వైచి వానిని గాఱించెను. దాశరథి రోషప్రచండుఁడై తీవ్రశరంబులఁ బఱచి దశకంఠుని రథచక్రహయధ్వజఛత్రంబులను శూలఖడ్గంబులను సారథిని ఖండించి దంభోళినిబోలు బాణంబొండు గ్రహించి తదీయభుజాంతరంబును ప్రహరించెను. పిడుగునకునోండె వజ్రాయుధంబునకునోండె సుంతేనియుఁ జలింపని రావణుం డాబాణహతికిఁ జలించి చేతివింటిని జాఱవిడిచి మూర్ఛాక్రాంతుఁడయ్యెను. రాముఁడంత నర్ధచంద్రబాణంబున వానికిరీటంబును ద్రుంచి, నిర్విషంబగు పన్నగంబువలె మంటచల్లారిన యగ్నికరణిఁ గాంతిఁదొఱఁగిన భాస్కరునిభంగి నిస్తేజస్వియై యున్న రావణునిఁ జూచి 'రాక్షసేశ్వరా ! యుద్ధపరిశ్రాంతుని గొట్టుట ధర్మముగాదుగావున నిన్నింతతో వదలితిని. లంకకుఁ బోయి సేదతేఱి రమ్ము. అప్పుడు నాబలంబును జవిగాంచనగు' ననెను. విరథుండును విగతధన్వియు హతసారథియు బాణపీడితుండును నైన యారావణుఁడు లజ్జావనతవదనుండై లంకాపురిఁ జొచ్చెను. రావణపరాజయంబునకు సమస్తభూతంబులును ఋషులును సంతసించెను.

—♦ రావణుఁ డాత్మగతంబున విచారపడుట ♦—

రావణుఁడు సేదదేఱి కొలువు దీఱి, సింగంబునుగాంచినగజంబుక్రియ గరుత్మంతుని జూచిన పన్నగంబువలె రామునకు బెగ్గడిల్లుచుఁ, గ్రొక్కాఱు మెఱుఁగులో బ్రహ్మదండంబులో తేజస్సారములోయను భ్రాంతినిగలిగించిన తద్బాణంబులను దలఁచి తలఁచి తత్తరిల్లుచుఁ 'గటా ! మనుష్యమాత్రుండు నన్నోడించెను. శలభము శరభరాజును జెనకుటయ్యెను. నాయొనర్చిన తీవ్రతపంబులెల్ల వ్యర్థములేగదా. నరమాత్రులనుఁ బురుగులుగా గణించితి గాని వేఱుగాదు. దేవదానవ గంధర్వ యక్ష రాక్షస పన్నగాదుల వలనఁ జావుగలుగకుండునట్లు చతురాస్యు నర్థించి వరంబులు పడసిన నాఁడు గూడ మనుష్యులను దలంపనైతిని. కటా !

సీ॥ అనరణ్యుశాపాగ్ని కవసరంబయ్యెనో
వేదవతీవాక్కు వెలసెనొక్కొ ?

పార్వతీశాపంబు పైకొనకున్నదో
నందీశువాక్యంబు లందదొక్కొ ?
నలకూబరునిమాట నెలకొనకున్నదో
చతురాస్యవచనంబు సాగుటొక్కొ ?
అమరాంగనలయేడ్పు లాకృతిదాల్చెనో
సురలశోకంబులు సోఁకెనొక్కొ ?

గీ॥ మునులతిట్టులుగుమిగూడి మొనసెనొక్కొ
రాచకన్నెలదూషణల్ రాచుటొక్కొ
పూర్వదుశ్చరితంబులు పొల్లువోక
సరిదిగాఁబండుతటి యిప్పుడయ్యెనొక్కొ ?

అయినను వెఱవరాదు. విజయార్థము సర్వవిధంబుల యత్నింప వలయును.' అని నిశ్చయించి సేవకునిఁబిలిచి గోపురశిఖరంబులును జర్యా ప్రదేశంబులును రాక్షసవీరసురక్షితంబులగుఁగాఁక. ప్రతిరక్షోవీరుఁడును ప్రాణంబులు తెగించి యుద్ధమొనర్ప సమయంబయ్యెను. ఈగండముతప్పిన చోఁ గలకాలము మనకెదురేయుండదు. అయ్యో ! కుంభకర్ణునకు నిప్పుడే నిద్రావసరంబయ్యెను. కాకున్నచో నాకీభయమే గలుగదుగదా. బ్రహ్మ శాపము తప్పదు. శాపవశుఁడుగాఁడేని నాతమ్ముఁడు చింతాకులుని నన్నిట్లు విడిచి సుఖంబుగా నిద్రించునా ? అయ్యో ! ఆనిద్రకును మేరగలుగదు. ఒక్కొక్కసారి యతఁడు తొమ్మిదిమాసంబులు నిద్రించును ; ఒక్కొక్క సారి యాఱుడునెలలు నిద్రించును. ఈసారివాఁడు నిద్రావశుఁడై నేటికిఁ దొమ్మిది దినములగుచున్నది. ఇంతలో నతండు నిద్రలేచుట కష్టతరము. అట్లని యూఱకుండరాదు. ఎట్లేని వానిని మేల్కొలుపుము. నాయట్లు వాఁడు శాపహతుండు కాఁడుగావున నతఁడు రామలక్ష్మణులను వానరులను సంగ్రామంబున వధింపనోపును. అకాలప్రబోధము మేలుగాదందురా ? ఏమిచేయనగును ? ఆపత్కాలమున నక్కఱకురాని పరాక్రమమేల ? రాక్షసరాజ్యంబునకు ముప్పుగలుగనుండఁగా నతఁడు గ్రామ్యసుఖరతుఁడై నిద్రించుటతగదు. వానినిప్పుడు లేపుట యంతశోకకారణముగాఁ దోఁపదు' అనెను.

—♦ కుంభకర్ణుని నిద్రలేపుట ♦—

శ్రేనిమాటకు బదులాడలేక రాక్షసులు కొందఱు గంధమాల్యభక్ష్యాదులం గైకొని కుంభకర్ణనివేశంబునకుం జని యోజనాయతమైన తద్ద్వారంబు దాఁటి గుహాకారముననున్న యతని మందిరముం జొచ్చిరి. అట్లు జొచ్చి వారు ముందునకుం బోవ యత్నించిరిగాని కుంభకర్ణుని యుచ్ఛ్వాసనిశ్వాసంబులు వారిని డోలికలవలె నూయసాఁగెను. వారట్లు కొంతవడి పెనఁగులాడి ఎట్టకేలకు లోనికిఁబోయి యమ్మందిరాంతరంబునం బఱచిన పర్వతంబువలెఁ బరుండి గాఢనిద్రనున్న యాభీమదర్శనుని గాంచి యసువులు పిడికిటఁబట్టుకొని తాము తెచ్చిన మృగమహిషవరాహమాంసరాసులను అన్నరాసులను నెత్తుటిబానలను మద్యభాండంబులను వానికట్టెదుట నుంచి వానియొడలెల్లఁ జందనమలఁది సుగంధిమాల్యంబులతో గప్పి ధూపంబులుఁవేసి జోహారువులు పలికిరి. ఆశబ్దములు వానిచెవిలో దూరకుండెను. అంతట మేఘగర్జనంబులను శంఖారావంబులను గావించిరి. అవియు వ్యర్థయయ్యెను. చెవియొద్దఁజేరి యేకగ్రీవముగా నఱచిరి. ఆయఱపులుఁగూడ నిరర్థకమయ్యెను. వానినిబట్టి యిట్టటు కదలించిరి; అందులకునతఁడు మేల్కొనకుండెను. ఉపాయాంతరముగానక గుదియలతోను ముసలంబులతోను గదలతోను దాడించిరి. అప్పటికి నతఁడు లేవఁడయ్యెను. పెనువృక్షంబులను దెచ్చి పైనవైచిరి. నందులకు నతఁడు చలింపకుండెను. ఉష్ట్రగజహయఖగంబులను గుంపులుచేసి కొఱడాలతోఁ గొట్టుచు నంకుశంబులతోఁ బొడుచుచు వానిపయికిఁ దోలి భేరీఝాంకారధ్వనులుగావించిరి. ఆప్రయత్నముగూడ ఫలింపదయ్యెను. అంత వారు క్రోధావేశులై వానితలవెండ్రుకలు లాగియు చెవులుకొఱికియుఁ గర్ణరంధ్రంబులందు జలకుంభంబులను దోర్లించియు నెంతో శ్రమపడిరి. ఏమిచేసినను గుంభకర్ణుఁడు మేల్కొనఁడయ్యెను. ఎట్టకేలకు వారు తెగించి గజసహస్రంబును దోలితెచ్చి వానిని ద్రొక్కించిరి. కుంభకర్ణునకు నదియెల్ల జిఱుపురువులు మేనఁ బ్రాకినట్లుండెను. వాఁడు నంత కనులిచ్చి చేతులుచాచి నోరువిచ్చి యావులించి లేచి యెదుటనున్న మాంసరాసులను మ్రింగి రుధిరమద్యభాండంబులు ద్రావి తృప్తుఁడట్లు దోఁచెను. రక్కసులంత భయంబు దక్కి వానికి సాష్టాంగమొనర్చి చుట్టు నిలిచిరి. కుంభకర్ణుఁడు వారిని జూచి "నన్ను నిద్రలేపినగారణమేమి?

రాక్షసరాజు కుశలమేగదా ? ఉపద్రవమురాదుగదా ! సంగతి చెప్పుము. అంతయింతపనికి నాయన్న నన్ను మేల్కొలుపఁడు' అనెను. యూపాక్షుఁడు మున్నాడి చేతులు జోడించి 'వీరాగ్రణీ ! దేవతలెవ్వరును మా జోలికిరారు. దైత్యదానవగంధర్వాదులెవ్వరును మావంకఁ దలయెత్తిఁ ద్రిప్పరు. మర్త్యమాత్రునివలన రాక్షసలోకంబునకెల్ల ముప్పుసంభవించెను. మేమెల్లరము భయాభిహతులమై వెఱవుదోఁపకున్నాము. తొలుదొల్త కోఁతి యొకటి వచ్చి లంకానగరంబెల్లఁ గాల్చి యక్షకుమారుని వధించి చనెను. ఇప్పుడట్టికోఁతులు కోట్లకొలఁది వచ్చి లంకను ముట్టడించెను. వానికెల్ల నరమాత్రుఁడు రాముండనువాఁడు నాయకుఁడై యున్నాఁడు. అతనిభార్యనే మనయేలికవారు హరించి తెచ్చినది. ఆరామునితో లంకేశ్వరుఁడు పోరి చావుతప్పి పఱచివచ్చెను. రావణుఁడు చచ్చెననుతలంపుతో వానిని రాముఁడు వదలెను. ఒండుచో మనఱేఁడు పేరుమాసి యుండును' అని విన్నవించెను.

కుంభకర్ణుఁ డా యుదంతమెల్ల విని పండ్లుగీఁటి 'యూపాక్షా ! రాముని వధించి వానినెత్తురు ద్రావి వానరమాంసరుధిరంబులతో రాక్షసానీకంబునకు విందొనర్చి తర్వాత నాయన్నను జూతుఁగాక' యని గంభీరంబుగాఁ బలికెను. మహోదరుఁ డారోషవచనంబులు విని కయిమోడ్చి 'మహాబాహూ ! అన్నగారితో సంప్రతించి యనంతరము శత్రుజయంబునకు దొరకొనుటయొప్పు' అని విన్నవించెను. అందులకు కుంభకర్ణుఁడు సమ్మతించి రావణమందిరంబునకుఁ బయనమయ్యెను.

—♦ కుంభకర్ణునిఁజూచి వానరులు బెగ్గడిల్లుట ♦—

కుంభకర్ణుని మహోన్నతాకారంబును గాంచి వానరులు కొందఱు భయభ్రాంతులై మూర్ఛిల్లిరి ; కొందఱు నేలఁబరుండిరి ; మఱికొందఱు రామునిచాటు చొచ్చిరి. వానరసైన్యంబట్లు తాఱుమాఱగుటకుఁ గారణభూతమైన యామహోన్నతవ్యక్తిని రాముఁడు పరికించి 'విభీషణా ! భూమండలంబునకెల్ల నెత్తినట్టి పెనుధ్వజమోయననున్న యీతండెవఁడు ? ఇట్టిభూతంబు నెన్నఁడును జూచి యెఱుంగ' ననెను. నా వుఁడు 'రామా ! ఇతఁడే కుంభకర్ణుఁడు. ఇంతటిప్రమాణభూతుఁడు మఱియొకండు

గలుగఁడు. ఇతనినోర్చుటకుగా దేవదానవ పన్నగ రాక్షస గంధర్వ విద్యాధర కిన్నరులొక్కటై దాడివచ్చి పెక్కుసార్లు నిర్జితులై చనిరి. ఇతఁడు యమునినిగూడ నిర్జించెను. రణరంగంబున నితఁడు శూలపాణియై నిల్చెనేని త్రైలోక్యసంహారక కాలుని దలపించును. వీనిబలమెల్ల నైసర్గికమే గాని రావణునకువలె వరదానఫలముగాదు. ఇతఁడు పుట్టినతోడనే క్షుధార్తుఁడై వేనవేలుగా సత్వంబులను మ్రింగెను. వీనిభక్షణవిధానంబునకు జనులు భీతులై దేవేంద్రునకు మొఱలిడిరి. సురపతి యితనిని వజ్రాయుధంబునఁ బ్రహరించెను. దంభోళి మొక్కవోయెనేగాని యీకుంభకర్ణుఁడు సుంతయుఁ జలింపఁడయ్యెను. అంత శచీపతికి నితఁడలిగి సర్వప్రాణి హృదయనిర్భేదంబుగా నార్చి యైరావతంబును దాఁకి దాని దంతంబులను బెకలిచి యింద్రునియురంబున నొక్కమోఁదుమోదెను. ఆతాపునకు శతక్రతువు సొలి తెప్పరిల్లి తనకుమొఱలిడవచ్చిన ప్రజలను వెంటఁగొని ప్రజాపతియొద్దకుఁ బోయి 'దేవా! కుంభకర్ణునివలన లోకంబెల్లఁ బ్రజాశూన్యము గానున్న'దని కుయ్యిడెను. ప్రజాపతి రక్కసులనెల్ల రావించెను. వారితోడఁ గుంభకర్ణుఁడును బోయెను. వానిఁ గాంచి పితామహుఁడు సయితము భయమంది సముదాయించుకొని 'కుంభకర్ణా! లోకవినాశార్థము విశ్రవసువుఁడు నిన్నుఁ గాంచెనా? అనెను. అంతలోనఁ గుంభకర్ణుఁడు పూర్వవరఫలంబుగా నిద్రావశుఁడై విరించిమ్రోలఁబడెను. రావణుఁడు తమ్మునకుగా సంభ్రాంతుఁడై 'దేవా! చేతులారఁ బెంచిన సువర్ణఫలవృక్షంబును ఫలింపనున్నదానినిఁ దటాలునఁ ద్రుంపనగునా? ఇతఁడు నీకు మునిమనుమఁడుగాని పెఱగాఁడు. వీనిని గనికరించి యితని నిద్రాజాగరణంబులకు నియతిఁగావింపు' మని వేఁడెను. పరమేష్ఠి యందులకుఁ బ్రీతుఁడై 'ఆఱుమాసములునిద్రయు నొక్కనాఁడు జాగ్రత్తయు వీనికగుఁగాక' అని వాక్రుచ్చెను. నాఁడుసుత యితఁడట్లుండును. రావణుఁడు నీపరాక్రమంబునకు నోడి యాపన్నుఁడై నిద్రించుచున్నయతనిని మేల్కొలిపెను. వానరభక్షణార్థమితఁడు వచ్చుచున్నాఁడు. వానరులకు భయంబుఁ దీర్పవలయును. ఇది భూతముకాదనియు మహాయంత్రమనియుఁ బలికి వారి భయంబుడుపనగు' నని విభీషణుఁడు చెప్పెను.

రాముఁడంతట నీలుని రక్షించి 'కపినాయకా! సైన్యంబునెల్ల ప్రత్యూహ

ములుగాఁ దీర్చి పురద్వారంబులను జర్యాగృహంబులను జక్కఁగా నాక్రమింప నాజ్ఞాపింపుము. ఎల్లరును శైలశృంగవృక్షాదులను గైకొని సిద్ధముగా నుండ నగు' ననెను. క్షణములోపల నీలుఁడట్లు గావించెను.

## —♦ రావణకుంభకర్ణ సమావేశము ♦—

కుంభకర్ణుఁడు ద్వారము దాఁటి రావణునొద్దకుఁ బోయెను. రాక్షసేశ్వరుఁడు తమ్మునిరాకకు సంతసించి లేచి యెదురేగి వానినాలింగనపురస్సరంబుగా సత్కరించి తోడితెచ్చి తనపీఠిచెంతఁ గూర్చుండఁ గోరెను. కుంభకర్ణుఁడు రావణునకు మ్రొక్కి కూర్చుండి 'అన్నా! నన్ను లేపవలసినంత యవసరమేమి వచ్చెను? ఎవఁడిప్పుడు ప్రేత గానున్నాఁడు?' అని యడిగెను. నాపుడు 'నాయనా! రాముఁడు సుగ్రీవాదివానరసహితుఁడై సముద్రముదాఁటి లంకాపట్టణము ముట్టడించెను. అదిగో చూడుము మననగరంబెల్ల వానరార్ణవముగానున్నది. రాక్షసముఖ్యులు పెక్కురు వానరులచేత మడిసిరి. తమ్ముఁడా! మనరాష్ట్రమును మహాభయము మ్రింగనున్నది. లంకానగరంబును గాపాడుము. వీరాగ్రణీ! కోశమెల్ల వ్యయమయ్యెను. రాక్షసశూరులు పెక్కురు నామావశిష్టులైరి. స్త్రీలును బాలురును వృద్ధులును మాత్రము లంకయందు శేషించియున్నారనవచ్చును. ఈ విపత్తునుండి లంకను రక్షించుట భవదన్యులకుఁ దరముగాదు. నీయన్నకుఁగా నీవీకార్యంబు నొనర్పనగును. కుంభకర్ణా! ఇతఃపూర్వమెన్నఁడును నిన్నిట్లు కోరలేదు. దేవాసురయుద్ధంబులందు నీవు చూపిన పరాక్రమంబును మఱలఁ జూపనవసరమయ్యెను. నీయెడ నాకుఁగల స్నేహసంభావంబులు నీకుఁ దెలియనివి గావు. నీబలంబును నమ్మి యీరాక్షసరాజ్యంబును బరిపాలింతును. రణప్రియా! ఝంఝానిలంబు శరన్మేఘంబులనువలె నీవు శత్రుసైన్యంబును బటాపంచలొనర్చి రాక్షసలోకంబునకుఁ బ్రియంబును హితంబును గూర్చి శాశ్వతకీర్తినిబడయుము' మని విన్నదనంబుతోఁ బలికెను.

## కుంభకర్ణుఁడు రావణునకు హితముచెప్పుట ♦—

కుంభకర్ణుఁడు రావణుని విని 'అన్నా! నాతలచినంత సంభవించెను. హితులను వినని ఫలంబు నొందితివి. దుష్కృతులకుఁ బతననిరయంబుల

తప్పదు. వీర్యాంధుండవై హితాహితంబులను విచారింపక సీత నపహ
రించితివి. గుణదోషవిచారంబు నీబుద్ధికి రుచింపదయ్యెను. పౌరా
పర్య విచారహీనుండు చేటొందకమానఁడు. దేశకాల విరుద్ధకర్మంబుల
విపరీతంబులై యపరిశుద్ధులు వ్రేల్చినట్టి హవిస్సువలె వ్యర్థములగును
రాజు తనమంత్రులతోఁ జక్కఁగా నాలోచించి స్వబలంబతిశయించినప్పుడు
దండంబునుఁ బరస్పరబలంబులు సమానమైనప్పుడు సంధియుఁ జేయుటొప్పు
ను. వైరిబలము మించిననాఁడు దానము నాశ్రయింపవలయును. ఉత్తమ
మధ్యమాధమంబులైన దండసంధానదానకర్మంబులకు మూఁడింటికిని దేశకా
లాత్మద్రవ్యప్రయోజనంబు లనెడి యోగంబులకు నైదింటికినిఁ గల సంబంధ
మును బరిశీలించి యెవఁడు కార్యంబును సాధించునో యతఁడే సమర్థుఁడును
సన్మార్గవర్తియు నగును. సమర్థుఁడు మంత్రుల మతంబెఱిఁగి హితులను
విని శాస్త్రదృష్టితోఁ గార్యోన్ముఖుండగును. ప్రతికార్యంబునకును గాల
నియతిగలదు. అది చక్కఁగా నెఱిఁగి వర్తించువారికి నెగ్గు వాటిల్లదు.
ప్రాతఃకాలంబున ధర్మంబును, మధ్యాహ్నంబున నర్థంబును, సాయంకాలంబునఁ
గామంబును, సేవింపనగు నని నిశ్చయించిరి. ఈవిషయంబున మతాంతరము
గూడఁగలదు. ఎట్లందువా ? ఉదయంబున ధర్మార్థంబులను, మధ్యాహ్నం
బున నర్థధర్మంబులను, సాయంకాలంబునఁ గామార్థంబులను నిట్లొక్కొక్క
కాలంబున రెండేసి సేవింపనగు ననిరి. ధర్మార్థకామంబులను మూఁటిని
సాయంకాలముననే సేవింపవచ్చునని మఱియొకమతము గూడఁగలదు. ఎల్ల
మతములందుఁ గాలనియతిమాత్రము గలదు. ఈమతములనెల్ల వదలి సర్వ
కాలంబులందును గామంబునే సేవించువాఁ డధముండగును. అట్టివాని
శాస్త్రజ్ఞానము నిరర్థకము. సామాన్యులకే యింత నియతికలుగఁగాఁ బ్రజా
రక్షణభరణవహులైన రాజులసంగతి చెప్పవలయునా ? మంత్రాలోచనం
బును గాలానుకూల ధర్మార్థకామానుష్ఠానక్రమంబును జతురుపాయప్రయోగ
దక్షతయు గలవానికిఁ గీడు రాఁ జాలదు. రాజు మూఢుఁడగునేని పశుప్రా
యులు పెద్దలగుదురు. వారిని విని ప్రభువు చేటొందును. ఏలిక యాత్మ
శ్రేయముఁ గోరునేని మందబుద్ధులకుఁ జెవియొగ్గక యట్టివారిని దవ్వున
నుంచుట యుక్తము. హితశత్రువులైనమంత్రులుందురు. వారు వైరి
వశులై తమ వానికి విపరీతంబులను బోధింతురు. ఇట్టికూళల రహస్యంబు

లను మంత్రకాలంబున వారివ్యవహారములను బట్టి గ్రహించి యేఁడు వర్తింప వలయును. వైరిగుట్టు తెలియక యాత్మరక్షణంబునఁ బ్రమాదబుద్ధి గలిగి యుండు రాజు కష్టంబులనేగాక స్థానభ్రంశంబును గూడఁ బొందును. అన్నా ! ఈరాజనీతులు నీకుఁ దెలియనివిగావు. తెలిసితెలిసి నీవు మన తమ్ముని విభీషణుని వినక యిట్లేల యొనర్చితివో యూహింపరాదు. వాని మాటకుఁ బెడచెవి యిడితివి. ముఖప్రియులను మన్నించితివి. తత్ఫల మిప్పుడు ప్రాప్తమయ్యెను. ఇంతకన్న నేమిచెప్పనోపుదు ? ఇది సరిగాదేని నీయిచ్చచేయు' మని చెప్పెను.

రావణుఁడు బొమముడివెట్టి 'కుంభకర్ణా ! అన్నలు తమ్ములకుఁ బూజ్యులును గురువులు నగుదురు. నాకు నీవు నీతిగఱపుట పాటియగునా ? నీతివిమర్శనంబునకు నిదిసమయంబుగాదు. నీకుఁ గంఠశోషవలదు. భ్రాంతి వలననో చిత్తవిమోహంబుననో బలవీర్యగర్వోద్రేకంబుననో యీపనిచేసితిని. దానిని గూర్చి మాటిమాటికి దెప్పుటవలన ఫలము లేదు. కర్తవ్యంబు నూహింపుము. కుంభకర్ణా ! నీకు నాయెడ భ్రాతృభావంబు గలదేని నీబల పరాక్రమంబులను నీవెఱుంగుదువేని ప్రకృతము యుద్ధమేకర్తవ్యమని తలంతు వేని నీవిక్రమంబును జూపి నాయక్రమదోషంబును హరింపుము. మహా విపత్సాగరంబునఁ గ్రుంగి దీనుఁడై యుండువానికిఁ జేయూఁత యిచ్చి తేర్చుట మిత్రులకగును. అట్టివారలే సెయ్యురును బంధువులు నగుదు' రనెను.

— కుంభకర్ణుఁడు యుద్ధసన్నద్ధుఁడగుట —

కుంభకర్ణుఁ డాదారుణవచనంబులు విని 'అన్నా ! కోపము వలదు ; నెమ్మదివహింపుము. నేను జీవించియుండఁగా నీకు దుఃఖమేల ? నీకింత పరితాపముఁ గలిగించిన యారాముని వధించి వానితలఁ దెచ్చి నీమ్రోల నిడుదుఁ గాక. రాక్షసలోకంబు పరితోషమొందుఁగాక ; వానరులు నామావశిష్టులగుదురు గాక. నన్నుఁజంపిగాని రాముఁడు నిన్నుఁజెనక నోపఁడు. అందాఁక నీకు చింతయేవలదు. అన్నా ! ఆజ్ఞయిమ్ము. ముల్లోకంబులకు సమరభిక్షయిచ్చి వత్తును. ఈనరాధములను వధింప నాయుద్ధము

లేల ? నాభుజదండములు చాలవా? అన్నా ! నీవైరులను హరించి యఖండ యశచ్ఛత్త్రంబునీడ నిన్ను నిలుపుదును భయంబువలదు. అన్నా ! నేను కన్నారఁ జూతునేని దేవతలు తల్లడిల్లుదురు; గ్రహనక్షత్రంబులు రాపడెదు ను ; సప్తసముద్రంబు లింకును ; పర్వతంబులు పుప్పొడియగును. ముల్లో కంబులును నాకొక్కపూట కూటికిరావు. రాతోఁ బోరు మగఁడుగలఁడా? ఇదిగో యిప్పుడే పోయి వైరిరక్తంబులాని దప్పి తీర్చికొనివత్తు. అన్నా ! శంకాసంతాపంబులు మాని యథారుచి మద్యంబులు గ్రోలి నీపనులు చూచు కొనుము. సీత నిన్ను స్వయముగా నాశ్రయించుతటి యయ్యెనని తలంపు' మనెను.

—♦ మహోదరుఁడు కుంభకర్ణుని దూఱుట ♦—

కుంభకర్ణుఁడు పలికిన మంత్రిజనతిరస్కారవచనంబులకు మహోద రుఁడు కనిసి యిట్లనియెను. 'కుంభకర్ణా ! ఉత్తమకులంబున జనించినంతనే పెద్దగుణంబులు రావు; గర్వోద్ధతులకుఁ గార్యాకార్యజ్ఞాన మంతగానుండదు. నీమాటలే నీయల్పబుద్ధిని తెలుపుచున్నవి. రాక్షసేశ్వరుని కార్యమును నిందించితివి. రక్షోనాయకునకుఁ గల దేశకాలవిభాగజ్ఞానంబును స్వపర వృద్ధిక్షయజ్ఞానంబును బాలునకు శాస్త్రానభిజ్ఞునకు నీకెట్లు గోచరించును ? కేవల పశుబలమాత్రుఁడుగూడఁ దగదనుకార్యంబును వివేకియొనర్పఁడనఁగా దశముఖుని సంగతి వేఱఁచెప్పనేల ? ధర్మాధర్మంబులవలన హితాహితఫలం బులు నియతంబుగా వచ్చునంటివి. సీతాపహరణకార్యం బధర్మమనియుఁ దత్ఫలంబుగ నీయాపదఁగలిగెననియు సూచించితివి. ధర్మార్థకామంబులకు ఫలనియతి గలదనుటకుఁ బ్రమాణమేమి? యాగాదులు ధర్మకార్యములఁగదా? అవి నీమతప్రకారము సుఖఫలదంబులేగదా? వానిని జేయునప్పుడు శరీరా యాసరూపదుఃఖము తాత్కాలికముగానైనను గలుగుచుండుటలేదా? పరద్ర వ్యాపహరణాదులు నీతిబాహ్యంబులును నధర్మకార్యంబులు నగునేని వాని వలన దుఃఖము రావలయునుగదా? అట్లొనర్చియు సుఖపడినవా రెందఱులేరు? లోతుపాతు విచారింతుమేనిఁ గర్మంబులకు ఫలనియతి గాన్పింపదు. సత్క ర్మంబులకు దుష్టఫలంబును దుష్టకర్మములకు సత్ఫలంబును గలుగుటగలదు. కావున ధర్మాధర్మంబులకు ఫలంబవ్యవస్థితముగానున్నది. కామమన్ననో జంతురాశికెల్ల సహజము. కామిగానివాఁడు మోక్షకామిగా నేరఁడన విసమా?

ఎల్లకర్మంబులకుఁ గామము బీజభూతమై ప్రవర్తిల్లును. కామములేకున్న చ జగచ్చక్రమే యాఁగిపోవును. కామప్రేరితులై కర్మంబులొనర్చుచ తదనుగుణఫలంబులఁ బొందుదురు. ఈఫలంబన్ననో యైహికంబనియు నా ముష్మికంబనియు రెండు విధములు. ఐహికము సద్యఃఫలముగావునఁ బ్రా యికముగా దానినే యపేక్షింతురు. ఇట్టి సద్యఃఫలంబును గోరి రాక్ష రాజు సీతాపహరణముఁగావించెను. ఇందు విపరీతమేమి గలదు ? ఆకార్య బును మంత్రు లనుమతించుట దోషమెట్లగును ? మనకేడ విమృశ్యకా యని యెట్లు చెప్పఁ గలవు ? కుంభకర్ణా ! పరదోషంబులను లెక్కించుట కన్న నాత్మదోషంబును గ్రహించుట వివేకమగును. మనకేనియండెట్టి దోషంబును నిరూపింపఁదలంచితివో యాదోషము నీయందుండుట గ్రహింప వైతివి. ఎట్లందువా ? వీరలు యుద్ధంబునకు సమస్తబలయుక్తముగాఁ బోవుదురు. నీవో యేకాకిగాఁ బోనున్నావు. ఆత్మబలమే తోడంటివి. ఇంతకన్న నవిమృశ్యకారితన ముండునా ? రాముఁడేతిన్మాత్రుఁడు గాఁడు. జనస్థానవాసులసు బదునాల్గువేలమంది నొక్కరుఁడే గూల్చెను. అట్టివాని పయికి నీవేకాకిగాఁ జనఁదగునా ? రాముని పరాక్రమంబును వినఁదలఁతువేని నాఁడు జనస్థానమందు హతశేషులైన మనివారినడుగుము. రాముని పేరు విన్నంతనే వారిప్పుడును భయపడుచున్నారు. దివ్యతేజోమూర్తియుఁ గ్రోధదురాసదుండును మృత్యువునువలెఁ దేఱిచూడరానివాఁడునునైన రాము నెదుట నిలుచుటకుఁగూడ మనసైన్యంబు బెగ్గడిల్లుచున్నది. అలంతులు గర్వాంధులై వలంతులను గొద్దిచేసి చని మిడుతలగ్నికుండంబున యట్లు వారి చేతిలోఁ బడి నశింతురు.

—♦ మహోదరుఁడు రావణునకు సలహాచెప్పుట ♦—

అట్లుపలికి రావణువంక మఱలి 'రాక్షసేశ్వరా ! సీతకై యింత వలంతయేల ? ఆయింతి నీయొడిలోఁ గూర్చుండుటకు వెఱనులేదా ? మహో దర ద్విజిహ్వసంహ్రాదికుంభకర్ణవితర్దనులు రామవధార్థము చనిరని పురమెల్లఁ జాటింపుము. మేము పోయి రామునితో యథాశక్తి పోరుదుము. రామ లక్ష్మణులు జితులగుదురేని మనతలంపు తనంతటతానే కొనసాగును. మా మోక్షోపాయంబులకు నవకాశమేయుండదు. అట్లుగాక మేము జితులమై

శత్రుమేని రామశరఘాతసంజనితరుధిరసంప్లుతశరీరులమై తన్నామాంకితబాణంబులునిండినమేనులతోడ వచ్చి రామలక్ష్మణులను భక్షించితిమని చెప్పుచు నీపాదంబుల వ్రాలుదుము. అప్పుడు నీవు సంతోషంబును వహించి మమ్ము సత్కరించి యావార్తను బురమెల్లఁ జాటించి పరివారంబును ధనవస్తువాహనంబులతోడను భటులను మాల్యాంబరవీరానులేపనంబులతోడను బహూకరింపుము. ఈసంగతి క్షణములో సీతచెవిఁబడును. అప్పుడు నీవు చని యాయింతినోదార్చి ధనధాన్యరత్నప్రదానంబుల నామె చిత్తంబును హరింపుము. ఆకాంతామణి గత్యంతరంబుగానక నీకు వశమగును. స్త్రీల చిత్తము చంచలాచంచలము. రంజనీయుఁడైన భర్తయున్నంతకాలము కామిని వానినే దవిలియుండు. అతఁడు వినష్టుఁడైనచో నైరాశ్యయై పరాధీనయగును. ఇది వారిస్వభావము. నైజము తప్పదుగదా. ఇట్లు చేయుదువేని నీకోరిక సులభముగా నీడేరును. చిరకీర్తినిగాంతు' వనెను.

—♦ కుంభకర్ణుఁడు మహోదరుని నిందించుట ♦—

కుంభకర్ణుఁడు వానిని నిరసించి 'అన్నా! ప్రహస్తాదులవలెను నీవు భయపడుచున్నావు. నీభయంబును మాన్పెదను. సుఖముండుము. నిష్ఫల తోయదంబులయట్లు వృథాగర్జనంబులు చేసిన ఫలంబులేదు. శూరులు తమశక్తిని గార్యరూపంబునఁ జూపుదురు. వారెన్నడు నాత్మశ్లాఘనంబులు గావింపరు' అని పలికి 'మహోదరా! భీరువులును బుద్ధిహీనులును దురహంకారులు నైన పండితమానులను నీబోటివారిని విని రాక్షసరాజు సంతాపంబును దెచ్చికొనెను. యుద్ధమన్నంతనే వెలవెలఁబోవునట్టి భవాదృశులిచ్చకంబులకుఁ దక్క నొండొకదానికిఁ గొఱగారు. మీమాటవినుటవలన సేనిబొక్కసమెల్ల వ్యయమయ్యెను; రాక్షససైన్యమెల్ల నశించెను. ఇదంతయు మిత్రవేషంబునఁజేరిన నీయట్టి యమిత్రుల సహచర్యఫలముగదా. మీదుర్నయఫలంబు శత్రుజయంబునఁగాని తీఱదు. మీరు తెచ్చిన మచ్చను మాపుటకుగా నిదిగో పోవుచున్నా' ననెను.

—♦ రావణుఁడు కుంభకర్ణు నభినందించుట ♦—

రావణుఁడు పకపక నవ్వి 'తమ్ముఁడా! నీమాట నిజము. యుద్ధమన్న మహోదరుఁడు వెలవెలఁబోవును. రణభీరువగుట నితఁడు రణము

వలదనుచున్నాఁడు. ఇంతటి పిఱికి మనకులమునఁ బుట్టఁడు. వీనిమాటలు మనకేల ? నీయట్టి బలవంతుఁడు నావాఁడైయుండఁగా నేను వెఱతునా ? జయశ్రీ నిన్ను వరించుఁ గాక. పాశశూలహస్తుండవై రణరంగముఁజొచ్చి యరిసైన్యంబును నురుమాడి యాబుడుతలను గడుపారఁ దిని రమ్ము. నిన్నుఁ జూచినంతనే వానరులు దిక్కులు పట్టుదురు ; రామలక్ష్మణులకు గుండెలు వ్రీలు' నని పలికి నాటికి గండము తప్పి రెండవ జన్మమెత్తి నట్లతండు తలంచెను.

కుంభకర్ణుఁడు ప్రదీప్తతప్తకాంచనభూషితంబును వజ్రప్రతిమంబును దేవదానవగంధర్వయక్షకిన్నరసూదనంబును శత్రురక్తదిగ్ధంబును నైనిప్పులు గ్రక్కుచున్న సర్వకాలాయసమహాశూలంబును గ్రహించి 'అన్నా ! నా సైన్యమిందే యుండును. నేనొంటిఁజని వైరిమాంసరక్తభక్షణంబున నా యాఁకలిదప్పులఁ దీర్చికొని వత్తు' ననెను. నావుఁడు 'నాయనా ! వానరులు మహాదుష్టులు ; ఒంటిగాఁ జిక్కువారని నేమఱియుండువారిని వారుపట్టి కొఱికి వధింతురు. ససైన్యంబుగాఁ జను'మని పలికి సింహాసనంబునుండి దిగివచ్చి రత్నమాలను దమ్మునికంఠమునవైచి కాంచనాంగదకేయూరాంగుళీయక చంద్రహారపుష్పమాలికలు వానికిఁ దొడవెను. కుంభకర్ణుఁ డన్నను గవుంగలించుకొని వానికిఁ బ్రదక్షిణనమస్కారంబు గావించి తదీయాశీర్వచనంబులంది భేరీశంఖనినదంబులు చెలంగుచుండఁగా మత్తమాతంగతురంగరథిక సైన్యంబులు వెంబడించుచుండఁగా రాక్షసీపుష్పాంజలులఁ దోఁగుచు సంగ్రామంబునకుఁ బోయెను.

కుంభకర్ణుఁ డట్లు వెడలినంతనే మేఘంబులు గార్దభారుణంబులై యుల్కాశనివర్షంబులు గురిసెను ; భూమండలము ససాగరంబుగాఁ గంపిల్లెను ; సృగాలంబు లగ్నులఁ గ్రక్కుచు ఘోరారావంబులు గావించెను ; విహంగంబు లపసవ్యగతుల సంచరించెను ; గృధ్రంబులు మార్గమధ్యంబున బారులుతీఱి వ్రాలెను ; నింగినుండి మండుకొఱవియొకటి ఫెళఫెళ మ్రోయుచు వాని మ్రోలఁబడెను ; సూర్యుఁడు నిష్ప్రభనొందెను ; వాయువు పరుషంబుగా వీఁచెను. అతని వామనయనబాహువు లదరెను. రక్షోవీరుఁ డాయుత్పాతంబులను లెక్కసేయక ప్రాకారము లంఘించి వానరసైన్యంబునకు దృష్టిగోచరుండయ్యెను.

### కుంభకర్ణునిగాంచి వానరులు భయమందుట

ఆఱున్నూరువిండ్లయెత్తును నూఱువిండ్లలావును గలిగి బండిచక్రంబులంతలై నిప్పులుగురియుచున్న కన్నులతోఁ జేటి చూడరాక ప్రళయమేఘగర్జనంబు లొనర్చుచుఁ గాటుకరాశివలె వచ్చుచున్న యాపెనుభూతంబును జూచి వానరులు భయమంది చెదరినయభ్రంబులవలెఁ గొందఱు పాఱచొచ్చిరి; కొందఱు నఱికినసాలవృక్షంబులవలె నేలఁబడిరి; కొందఱు సముద్రనీరంబుఁ జొచ్చిరి; కొందఱు నింగికి నుద్గమించిరి; కొందఱు బొరియల దూఱిరి; కొందఱు గిరిగహ్వరంబు లాశ్రయించిరి. వానరసైన్యంబెల్ల నట్లు చీకాకుపడి చెల్లాచెదరగుట యంగదుఁడు చూచి 'నిలునిలుము. ప్రాణంబులకై పరువెత్తుట మగతనము గాదు. మీ సేతలు విన్న మీయిల్లాండ్రే గేలి సేయరా! మానవంతులకు నవమానముకన్న మరణము గలదా! ఉన్నతవంశంబులఁ బుట్టినమీ రిట్లు పిఱికిపోనగునా! మీ బీరంబులేమాయెను? మీ ప్రగల్భంబు లెట్లువోయెను? కపులు పిఱికిపందలను ప్రవాదంబును మోయుచు జీవింతురా! వలదువలదు; ఇది మనకుఁ దగదు. సత్పురుషసేవ్యమైన శూరమార్గంబు ద్రొక్కి వైరినినిర్జించి చిరకీర్తి నొందుము. కాలముతీఱు నేని రణరంగంబునఁ బ్రాణంబులు వదలి వీరస్వర్గంబునఁ బడయుము. జయకాంతనో స్వర్గకాంతనో పడయనగుఁగాని యీ పనితగదు. మందుచిచ్చుమీఁదికి మిడుతవలె రామునిమీఁదికిఁ గుంభకర్ణుఁ డడరెను. అతఁడు జీవముతో మఱలఁడు. క్షణభంగురమైన ప్రాణార్థము చిరార్జితకీర్తిని వ్యయింపవలదు. శరీరికి జననమరణంబులు నైజములు. వానికై యింత దిగులేల?' యని పలికి వారిని మెల్లమెల్లఁగా మరలించెను. అంతలోన హనుమంతుఁ డచ్చటికు వచ్చెను. వానిని జూచినంతనే వానరులకు ధైర్యంబు పునఃప్రతిష్ఠితమయ్యెను. ఋషభ శరభ మైంద ధూమ్ర నీల కుముద సుషేణ గవాక్ష రంభ తార ద్వివిద పనసాదులు మారుతిని మున్నిడుకొని కుంభకర్ణుని దాఁకి వృక్షపర్వతవర్షంబులఁ గురిసిరి. కుంభకర్ణుఁడు మహోగ్రమూర్తియై గదతోడ వారిని వివిధగతులఁ బ్రహరించి నేలఁగూలిన వారినిఁ బదులుగా ముప్పదులుగా బట్టియెత్తి కబళించుచు సమరక్షోణియెల్ల విహరింపసాగెను.

—♦ కుంభకర్ణ హనుమంతుల యుద్ధము ♦—

ద్వివిదుఁడు పర్వతంబొండు తెచ్చి కుంభకర్ణుని పయి విసరెను. అది గురి తప్పి రాక్షససైన్యము పయిఁబడి గజతురగరథపదాతులఁ బెక్కింటిఁ జూర్ణము గావించెను. రాక్షసరథికులు కనరి భయంకరసింహనాదంబు లొనర్చుచు మృత్యువునుంబోని శరంబులు వైచి వానరులకు పెక్కుర శిరఃఖండన మొనర్చిరి. హనుమంతుఁడు గగనగతుఁడై శైలశృంగంబులను వివిధవృక్షంబులను గుంభకర్ణుని తలపై వర్షించెను. రక్షోవీరుఁడు శూలంబుచేత వానినెల్లఁ దట్టివైచి కపిసైన్యము పయిఁబడెను. హనుమంతుఁడు కొండొక మహీధ్రంబును తెచ్చి కపిసేనాసాగరంబును గలంచుచున్న కుంభకర్ణునిపై వైచెను. ఆ కొండ తాఁకునకు రక్షోనాయకుఁడు మేదోరుధిరార్ద్రగాత్రుఁడై సుంత సంక్షోభించి శూలంబును గిఱగిఱ ద్రిప్పి మారుతివక్షస్థలము గురిచేసి వైచెను. సామీరి యా వ్రేటుతిని నెత్తురువమిసి యుగాంతమేఘగర్జారవభీకరంబుగా నఱచి మూర్ఛిల్లెను. రాక్షసులు సంతోషించి సింహనాదంబు లొనర్చిరి. వానరులు భయగ్రస్తులై పిక్కబలముఁ జూపసాగిరి.

—♦ కుంభకర్ణుఁడు సుగ్రీవుని మూర్ఛితునిఁ జేసి కొనిపోవుట ♦—

వానరులకలకలంబును విని యంగదుఁడు గిరిశృంగంబునుఁ గొనివచ్చి మహోద్వేగంబునఁ గుంభకర్ణునితలపై వైచెను. అసురశూరుఁడు క్రోధదగ్ధుఁడై శూలంబున వానరవీరుని బ్రహరించెను. అంగదుఁడు రణమార్గవిశారదుండుగావున లాఘవంబుమెయి నవ్వ్రేటుఁ దప్పించుకొని యఱచేతఁ గుంభకర్ణుని నురమునఁ జఱచెను. రాక్షససింహుఁడు మూర్ఛిల్లి తేరి కపినాయకుని నెడమపిడికిటఁ బొడిచెను. అంగదుఁడు విసంజ్ఞుఁడై నేల వ్రాలెను. కుంభకర్ణుఁడంత సుగ్రీవుని మీఁదికి నురవడించెను. కపిరాజు పర్వతంబొండు తెచ్చి ప్లవంగులను భక్షించుచుఁ దద్రక్తదిగ్ధాంగుఁడై మేను విదిర్చి యెదుటనున్న యారక్కసి మేటిని డాయ వచ్చి 'కుంభకర్ణా! అలంతులను బట్టి మెక్కుట గొప్పకార్యము గాదు. లావు గలదేని నాతోఁ బోరు' మనెను. కుంభకర్ణుఁడు కికకిక నవ్వి కోఁతిరాయా! నీసంగతి నాకుఁ గ్రొత్తగాదు. పట్టిగర్జలేల?' యనెను. సుగ్రీవుఁడంత నప్పర్వతంబును గుంభకర్ణుని పయి వైచెను. అది వజ్రంబుఁబోని వానియురము

వాఁకి తుత్తునియలయ్యెను. కుంభకర్ణుఁడు కోపావతారమోయన నెగడి భీకరంబుగా గర్జించి తటిత్ప్రకాశమాననిజశూలంబును గిఱగిఱఁద్రిప్పి సుగ్రీవుని గుఱిచేసి విసరెను. అంతలోన హనుమంతుఁడు తెప్పరిల్లి యచ్చటకు దుమికి యాశూలంబును మార్గమధ్యంబున వడిచిపట్టుకొని మోఁకాఁటదానిని విఱిచి వైచెను. కుంభకర్ణుఁడు తనశూలంబట్లగుటకుఁ గనలి లంకామలయ శృంగంబులు బెకలించి సుగ్రీవుని పయి వైచెను. వానరేశ్వరుఁ డాద్రెబ్బకు మూర్ఛిల్లెను. కుంభకర్ణుఁ డదిగాంచి 'ఈవానరేశ్వరుని హరింతునేని రామలక్ష్మణులను సవానరంబుగా హరించినట్లగు' నని తలఁచి వానినెత్తు కొనిపో నుంకించెను.

హనుమంతుఁడు కుంభకర్ణునితలంపు గ్రహించి 'ఇప్పుడేమిచేయనగు? వానరరాజు పట్టువడెను. కుంభకర్ణుని వధించి కపివల్లభుని విడిపింతునా? రాజవిమోచనంబునకు వానరసైన్యము సంతసించునుగదా?—ఏమి నామంద బుద్ధి; సురాసురులొక్కటై చిక్కించుకొన్నను వానరరాజు విడివడివచ్చును. అంతసమర్థునకుఁ గుంభకర్ణుఁడొక లెక్కగాదు. ప్రకృతము మూర్ఛా గతుఁడు గావునఁ బ్లవగేశ్వరుఁడు తనస్థితిని గ్రహింపఁడు. ఈయసహాయ శూరుఁడు మూర్ఛదేఱి సంగతి గ్రహించెనేని యాత్మసంరక్షణముఁ గావించు కొని తనసైన్యంబునకు హితమొనర్చి వైరిని బెనుబాములువెట్టి చిరకీర్తిఁగాంచును. వానరేంద్రుఁడు దేఱుదనుక తదీయసైన్యంబును విచ్చిపాఱుచున్న దానిని సమకూర్తుఁగాక' యని లోలోనవితర్కించి నిశ్చయించి యట్లొనర్ప సాగెను.

—♦ సుగ్రీవుఁడు మూర్ఛతేఱి తప్పించుకొనివచ్చుట ♦—

కుంభకర్ణుఁడు సుగ్రీవునెత్తుకొని లంకాపురముఁజొచ్చి మేడలనుండి యుఁ జర్యాగృహంబుల నుండియు గోపురంబులనుండియుఁ దనపైఁ గురియు చున్న పుష్పసుగంధజలంబులఁ దొప్పఁదోఁగుచు రాజమార్గంబునఁ జనసాగెను. సుగ్రీవుఁడాసుగంధజలంబులకును జల్లగాలికిని సేదతేఱి నిజస్థితిని గ్రహించి 'సరిసరి! ఇందులకుఁ బ్రతీకారమేమి?' అని సుంత తలపోసి కృతనిశ్చ యుఁడై గోళ్ళతోఁ గుంభకర్ణుని శ్రవణంబును ఱక్కి దంతంబులతో వాని ముక్కు కొఱికి పార్శ్వములుచీల్చెను. కుంభకర్ణుఁ డందులకుఁ గోపించి

సుగ్రీవుని నేలపైవైచి కాలరాయనుండెను. అత్తఱి వానరేశ్వరుఁడు తప్పించుకొని గగనంబునకు నుద్గమించి రామునిఁ జేరెను.

—♦ కుంభకర్ణుఁడు రామునిచేఁ మూర్ఛితుఁడగుట ♦—

కుంభకర్ణుఁడు వికృతుఁడై నెత్తురులు గార్చుచు సెలయేళ్ళతోడిపర్వతంబో సంధ్యాకాలమేఘంబో యనఁ దోఁచుచు ముద్గరహస్తుఁడై యందుండి మరలి రణరంగముఁజొచ్చి తనవారుపగతులనాక చేఁజిక్కినవారినెల్లఁ బట్టి మెక్కుచు సెలవులనుండి కాఱుచున్న మేధశ్శోణితంబులతోఁ బ్రళయాంతకునిఁ దలపించుచు సంగ్రామక్షోణియెల్ల విహరింపఁ జొచ్చెను. వానరసైన్యము వానికి జడిసి రాముని శరణుచొచ్చెను. కుంభకర్ణుఁడంత దాశరథిమీఁదికి నురికెను. రాముఁడు రౌద్రాస్త్రంబును సంధించి కుంభకర్ణుని రొమ్ముగుఱిచేసి వైచెను. అసురవీరుఁడు శరవిద్ధుఁడై చేతిగదను జాఱవిడిచి కుంత సొమ్మసిల్లి యంతలోనఁ దెప్పిరిల్లి యార్చి నిరాయుధుఁడు గావునఁ బర్వతశిఖరంబునెత్తి రామునిపయి రువ్వెను. రాముఁ డాశిఖరంబును మార్గమధ్యమందే శరంబులఁద్రుంచెను. కుంభకర్ణుఁడు విజృంభించి రెండు వందల కపివీరుల నొడిచి పట్టుకొని కబళింపనుండెను. రాముఁడతని ధైర్యసాహసంబులకు మెచ్చవడి తీవ్రశరంబులు వైచెను. కుంభకర్ణుఁడు మూర్ఛామూర్ఛితుఁడై నేల వ్రాలెను.

లక్ష్మణుఁ డంత రామునిఁ జేరఁబోయి 'అన్నా! వీఁడు రుధిరమత్తుఁడై స్వపరవివక్షసేయక చేఁజిక్కినవారినెల్ల మ్రింగెను. ఇతని నిఁక లేవనీయరాదు. లేవనిచ్చినచో వానరభక్షణముచేయును. వీనిని ద్రొక్కిపట్టుటొప్పు' ననెను. రాముఁడందులకు సమ్మతించెను. అంతట కపివ్రాతము కుంభకర్ణునిపై బడి వానిని ద్రొక్కిపట్టెను రక్షోవీరుఁడు కొంతవడికి దెప్పిరిల్లి మదగజంబు మాఁటీనివలె వానరులను విదలించి వైచెను. ప్లవంగులు గాలికిఁ బండుటాకులువలె దవ్వునరాలిరి. రాముఁడదిగాంచి 'ఈ దుష్టుని మననీయరా' దని ధనుష్టంకారమొనర్చెను. కుంభకర్ణుఁ డాధ్వని సహింపక రామునిమీఁదికి విజృంభించెను. ఐక్ష్వాకవు వానిని జూచి 'కుంభకర్ణా! ఇదిగో యీవింటిని జూడుము. ఇంద్రుని గెల్చితి నని విఱ్ఱవీఁగవలదు. మహార్తకాలంబున నిన్ను వధించిపుత్తు' ననెను. కుంభ

కర్ణుఁడు వికారముగా నవ్వి 'నీవేనా రాముఁడవు ? సరిసరి ; ఇతఁడు విరాధుఁడుగాఁడు కబంధుఁడునుగాఁడు ; కుంభకర్ణుఁడని యెఱుంగుము. ఇదిగో యీముద్గర నీప్రాణంబులను హరింపనున్నది. నాముక్కు చెవులు పోయెనని గేలిసేయవలదు. వానికై నాకు నిసుమంతయుఁ జింతలేదు. నీలావు చూడఁ గోరుదు. నీ పౌరుషవిక్రమంబు లెఱింగి యనంతరము నీమాంసరక్తంబులఁ దనివొందుదు' ననెను.

## —♦ రాముఁడు కుంభకర్ణుని సంహరించుట ♦—

రాముఁడు మహోగ్రహమొంది యేబాణము సప్తసాలంబులను ద్రుంచి వాలినివధించెనో యాబాణంబును సంధించి యాకర్ణాంతముఁ దివిసి కుంభకర్ణుని పయి వదలెను. రక్షోవీరుఁ డాశరహతికి నుంతయుఁ జలింపక ముద్గరంబు నవలీలగాఁ ద్రిప్పుచు రామునిపై నురవణింపసాగెను. రాముఁడు తనబాణము వమ్మగుటకు రోషకషాయనేత్రుఁడై వాయవ్యాస్త్రంబును సంధించి వైచి కుంభకర్ణుని దక్షిణబాహుదండంబును ఖండించెను. వాఁడు పెల్లార్చుచు రెండవచేత వృక్షంబొండు పెకలించితెచ్చి విజృంభించెను. దాశరథి యైంద్రాస్త్రంబున వాని రెండవబాహువును గూడఁ ద్రుంచెను. వానిచేతులురెండు తెగి గిఱగిఱఁదిరుగుచు నడ్డమువచ్చిన శిలావృక్షశైలవానర రాక్షసులనెల్ల నుగ్గునూచముొనర్చుచుఁ బోయిపోయి దప్పెనఁబడెను. కుంభకర్ణుఁడు విగత బాహువయ్యు బిట్టఱచుచు రామునిమీఁదికి దుమికెను. రాముఁ డర్ధచంద్రబాణద్వయమువైచి వానిపాదంబులరెంటిఁ దఱిగెను. హస్తపాదంబులు చన్నను గుంభకర్ణుఁడు మిన్నకుండక బడబాముఖంబునుబోని నిజాస్యము నప్పళించి గర్జించుచు రాహువు చంద్రునిమీఁదికివలె రాఘవునిమీఁదికి నుద్వేగించెను. రాముఁడు శితాగ్రశరంబులను వాని నోటినిండగుప్పించి సూర్యజ్వలనప్రకాశమానమైన దివ్యబాణంబునువైచి వానిశిరంబును ద్రుంచెను. కుండలద్వయమధ్యగతమై యుండిన యాశిరస్సు బాణవేగంబున గగనంబునకెగచి రాత్రిపూటఁ బునర్వసునక్షత్రద్వయమధ్యగత చంద్రబింబంబు ననుకరించి యందుండి యెగచి కోటగోడపయి దటాలునఁబడెను. దాని పాటునకు లంకలోని చర్యాగృహపురద్వారప్రాకారంబులు విఱిగి కూలెను. రక్షోవీరునికళేబరంబెట్టు వ్రాలునోయని వానరులు భీతులై

యొండ్డొరఁ ద్రోపాడుచుఁ దవ్వుచనిరి. వాని మొండెము సముద్రాంతమునఁ బడి యందలి గ్రాహమీనసర్పంబులకుఁ బ్రాణగొడ్డ మయ్యెను.

కుంభకర్ణునివధకు దేవతలు సంతసించిరి ; నిఖిలభూతంబులు రాము నగ్గడించెను. రాక్షసులు రామునకు వెఱచి యెలుగెత్తి పెనురోదనంబులు గావించిరి. వానరులు దాశరథినిఁ బూజించిరి.

—♦ రావణుఁడు కుంభకర్ణునకుగా విలపించుట ♦—

హతశేషులైన రాక్షసులు చని 'లంకేశ్వరా ! కుంభకర్ణుఁడు రామ తేజంబుననడంగెను. వానిమొండెము సగము సముద్రములో సగము గట్టునఁ బడియున్నది. అతనితల లంకాద్వారమును నిరోధించియున్నది' అని విన్న వించిరి. రావణుఁ డామాటతోడ నిలువున మూర్ఛిల్లి కూలెను. దేవాంత నరాంతకాదులు పెనురోదనంబులు గావించిరి. లంకానగరమెల్ల రోదన ధ్వనులతో మాఱుమ్రోఁగెను. రాక్షసేశ్వరుఁడు మూర్ఛదేఱి హా ! తమ్ముఁడా ! రిపుభయంకరా! నన్ను వదలిపోయితివా? ఇఁక నాదుఃఖంబును నాబంధువులదుఃఖంబును దీర్చువాఁడెవఁడు ? కటా ! నేఁడు నాకుడిభుజము పడిపోయెను. ఆభుజబలము నాశ్రయించి దేవాసురులనెల్ల ధిఃకరించు చుంటిని. అయ్యో ! తమ్ముఁడా ! నీమాట చెప్పిన సురాసురులు తల్లడిల్లు దురు. సమరక్షోణిని నిన్నుఁ గాలాగ్నిరుద్రప్రతిమునిగాఁ దలంతురు. వీరాతివీరుని నిన్ను నరమాత్రుఁడు రాముఁడెట్లు వధింపనోపెనో యూ హింపరాకున్నది. వజ్రాయుధంబునకుఁ గూడ నెడవీయని నీమేను రామబాణమెట్లు చొఱనేర్చెనో ? కుంభకర్ణా ! నిహతుని నిన్నుఁ గాంచి గగనస్థులైన దేవర్షులు గావించు హర్షాతిరేకసింహనాదంబులను వినవా ? తమ్ముఁడా ! నీవు లేని రాజ్యము నాకేల ? సీతయేల ? నిన్నుఁ బాసి జీవింప నొల్లను. నిన్నుఁజంపిన వానిని రూపుమాపనేని నాజీవితము వ్యర్థమనక తప్పదు. ఏదేవతలు నాకు వెఱచి నాపాదాక్రాంతులైరో యాదేవతలే యిప్పుడు నన్నుఁ బరిహసించుచున్నారు. ఈబ్రదుకేల ? అయ్యో ! విభీ షణా ! నీవన్నంతయయ్యెను. నీమాటవిననిఫలము నాకు సంప్రాప్త మయ్యెను. నీకు నాయొనర్చిన యపకారంబున కెంతయుఁ జింతింతు' నని యాకులాంతరాత్ముఁడై మహాదైన్యమొంది వివిధగతుల వాపోయి దుఃఖభరం బున నేల వ్రాలెను.

## —♦ త్రిశిరుండు రావణునకు ధైర్యము చెప్పుట ♦—

అట్లు శోకాభిహతుఁడై యున్న రావణుని త్రిశిరుఁడు డాయవచ్చి "రాక్షసేశ్వరా ! దైవయోగంబునకు ధీరులు దురపిల్లరాదు. కుంభకర్ణుఁడు చన్నంతనే లంకారాజ్యము వీరశూన్యమయ్యెనే ? ఎవరోయేల ? ముల్లోకంబులకు నీవొక్కరుండవే చాలవా ? ప్రాకృతుండట్లు నీవు విలపింపవలదు. బ్రహ్మదత్తమైన రథకవచశస్త్రాదులు నీకుండఁగా నొరులఁ దలంపనేల ? వాఁడు నిరాయుధంబుగా దేవదానవులను జయించితివి. ఇప్పుడు సాయుధుండవై తివేని నిన్నునోర్చువారెవరుందురు ? లంకేశ్వరా ! నరమాత్రునకుగా నింతవంతయేల ? ఆజ్ఞయిమ్ము. నేనిప్పుడ చని గరుత్మంతుఁ డురగులను వలె సురపతి శంబరాసురునట్లు విష్ణువు నరకాసురునిక్రియ నీ శత్రువుల నెల్ల క్షణములో హరించి వత్తు" నని యుత్సాహవచనంబులు పలికెను. త్రిశిరునిమాట నందికొని దేవాంతక నరాంతకాతికాయులు నేను నేనని లేచి రణోత్సాహగర్జనంబులు గావించిరి.

## —♦ దేవాంతకనరాంతకమహాపార్శ్వాదుల యుద్ధము ♦—

అంతరిక్షరణ నిపుణులును మాయావిశారదులును బ్రవరవిజ్ఞానులును లబ్ధవరులునైన తనకుమారులు దేవాంతకాదులట్లు పలుకఁగా రావణుఁడు మిక్కిలి ప్రీతినొంది వారిని సందిటఁగూర్చి దీవించి మహోదరాదులైన తన తమ్ములను వారికి రక్షణార్థము నియమించి యెల్లరను యుద్ధంబునకుఁ దరలించెను. మహోదరుఁడై రావతకులసంభవంబును నీలమేఘచ్ఛాయావిలసితంబునైన సుదర్శనమహాగజం బధిష్ఠించి వివిధాయుధ తూణీర సమాకలితుఁడై యస్తాచలగతసూర్యుఁడట్లు వెలుఁగుచు ముందునడచెను. త్రిశిరుఁడు మూఁడు తలలందు మూఁడు రత్నకిరీటముల ధరించి జాతిహయంబులు పన్నిన రథంబు నారోహించి సకలాయుధసంపన్నుఁడై విద్యుదుల్కా శక్రచాప సమలంకృత శృంగత్రయశోభాయమాన హిమాద్రిని దలపించుచుఁ బయనమయ్యెను. అతికాయుఁడు ప్రాసాసిపరిఘాంకులంబును దూణీరబాణాసన దీప్తంబునునైన మేటితేరెక్కి రాక్షసవీరపరివృతుఁడై నడచెను. నరాంతకుఁ డుచ్చైశ్శ్రవఃప్రఖ్యమైన శ్వేతాశ్వంబు నధిష్ఠించి వజ్రఖచితపరిఘమునుబట్టి శిఖివాహనాధిష్ఠశక్తిధరుఁడోయన నొప్పుచు వారిని వెంబడించెను. మహోదరమహా

పార్శ్వాలు చతురంగబలసమేతులై తోడఁజనిరి. రాక్షసవీరులెత్తిపట్టినఖడ్గంబులు శారదాభ్రప్రతీకాశధవళంబులై గగనస్థిత హంసపంక్తివలె నుండెను.

"చ॥ వెలిగొడుగుల్ శరద్ఘనవిలాసము దోఁప నంబర
స్థలి మెఱయం గిరీటమణిజాలమరీచులు భానుదీప్తులన్
గెలువఁగ విస్ఫులింగపటుకీలలు గ్రైదువులీన సేనతో
వెలువడి రాప్పలన్ దెసలు వ్రీలఁగఁ జేయుచు నన్నిశాచరుల్॥"

వానరవీరులు రక్షస్సైన్యంబునుజూచి యాత్మీయపరాక్రమాటోప ప్రదర్శనంబునకుఁ దఱివచ్చెనని పరమానందభరితులై వృక్షశైలంబులను గైకొని సింహనాదంబును గావించిరి. ఇరువాగులుఁ దలపడి యోహారిసాహరింబెనంగి పోరసాగిరి. రాక్షసులు పింజపింజగఱచి వేయు బాణంబులను వానరులు శిలావృక్షంబులతోఁ బ్రహరించుచు వైరి రథగజాశ్వంబులను జెండాడిరి. అసురవీరులు విజృంభించి శూలముద్గరఖడ్గప్రాసశక్తిప్రముఖంబులతో వానరుల నెచ్చటివారి నచ్చటనే మర్దింపఁ జొచ్చిరి. కపిమల్లులు తెంపు సేసి యెదిరిసేన దూఱి యందిన వారినెల్ల ముష్టిఘాతంబుల నొర్చిరి. ఆ వేటులకు రక్కసులు పెక్కురు నెత్తురుగ్రక్కి కన్నీనికలురవి తలలు వ్రచ్చి మడిసిరి.

సీ॥ పుష్పొడియైకూలె భూరిథరంబులు
చిఱుకొండలుగ వ్రాలె సింధురములు
తుండతుండంబులై దొఱగనశ్వంబులు
కలగుండుగాసోలెఁ గాల్బలంబు
తునియలైపడిచెను దోమరఖడ్గముల్
చదలఁ బ్రాకెను ఛత్రచామరాళి
రుధిరాస్థిమస్తిష్క పృషులమయ్యెనుక్షోణి
తండమై మొండెముల్ మెండుకొనియె

గీ॥ అధికదుర్గంధవాసనలతిశయిల్లి
నిలువరింపరానట్లుగా నిండుకొనియె
రౌద్రభీభత్సరసములు రణముఁజొచ్చి
విచ్చలవిడిగావిహరించువిధముదోఁచె ॥

నరాంతకుఁ డంతట శక్తిని గైకొని యొక్కుమ్మడి యేడువందలు కపివీరులను బరిమార్చి ప్రావృట్పయోదంబు కరణి నిరంకుశవృత్తి సమరభూమి యెల్ల విహరింపసాగెను. వాని వేగంబునకు వానరులు భయభ్రాంతులై తెచ్చపడి గావుగొమ్మని యార్పించుకొనుచున్నారోయన నిలిచి బిట్టఱచిరి. సుగ్రీవుఁ డాకేకలు విని యావలను నంగదుని బంపెను. వాలిసుతుండు నరాంతకుని దాఁకి నిలునిలుమని వాని నదలించెను. అసురశూరుఁ డౌదలకడచి భుజంగమంబువలె నిట్టూర్చుచుఁ బ్రాసంబును గిఱ్ఱున ద్రిప్పి యంగదుని వైచెను. అది కపివీరుని వక్షోభాగముదాఁకి తుత్తునియ లయ్యెను. తారాపుత్రుఁడు త్రాఁకువడి చెలరేఁగి యఱచేత నరాంతకుని హయంబును జఱచెను. ఆ గుఱ్ఱము తలపగిలి దవుడలు చీలి గ్రుడ్లురలి నాలుక వెలువరించి నిట్టనిలువునఁ బ్రాణంబులు విడిచి నేలఁగూలెను. నరాంతకుఁడు దుమికి యంగదుని శిరంబున బిగుపిడికిట మోఁదెను. కపివీరుఁడు తలపగిలి నెత్తురు గార్చుచు నంతసొమ్మసిల్లి తేఱి రక్కసుని యుక్కునకు నక్కజపడి ముష్టి సవరించి వైరియురంబున నొక్కతాపు తాపెను. ఆదెబ్బతోడ నరాంతకుని ఱొమ్ము పగిలి గుండియలు నేలరాలెను. వాఁడు తోడ్తోడ దంభోళితాడిత కుధరంబట్లు కూలెను.

నరాంతకుని చావు విని దేవాంతక త్రిశిర మహోదరు లొక్కుమ్మడి శక్తిత్రయంబుఁబోలె నంగదునిఁ దాఁకిరి. కపివీరుండును మహావిటపంబును దేవాంతకునిపై విసరెను. దానినిఁ ద్రిశిరుఁడు మార్గమధ్యంబునఁ ద్రుంచెను. అంగదుఁడంత నింగి నిలిచి వృక్షశైలంబులను వారిపై దొర్లింపసాగెను. త్రిశిరుఁడు వానినెల్ల ఖండించివైచి తీవ్రబాణంబుల నంగదుని నొప్పించెను. మహోదరుండు తోమరముతోఁ గపివర్యుని యురమ్మున గ్రుమ్మెను. దేవాంతకుఁడు పరిఘతో వానిని బ్రహరించెను. ఏకకాలంబున రక్షోవీరులు మువ్వురట్లు పైఁబడినను వాలిసుతుఁ డీషన్మాత్రము గూడ వ్యథచెందక మహోద్వేగంబున నెగచి మహోదరుని గజంబు నఱచేతఁ జఱచెను. ఆ మత్తేభము గ్రుడ్లురవి ఘీంకారమొనర్చుచు ద్రెళ్ళెను. అంగదుఁడు దాని దంతంబులఁ బెఱికి దానితో దేవాంతకుని మస్తంబున నొక్కటి వడ్డించెను. ఆయాసురవీరుఁడు లాక్షారసంబుఁబోని రుధిరంబులను గ్రక్కి సొమ్మసిల్లి తెప్పిఱిలి పరిఘంబుతో వైరిని దాడించెను. అంగదుఁడు వ్రేటుపడికి

మోఁకాళ్ళమీఁద వ్రాలి లేవసంకించెను. అత్తఱి వానినుదుటు వాడి తూపులు మూఁడు త్రిశిరుఁడు నాటెను.

అంగదు నొంటిచేసి రాక్షసవీరులు ముగ్గురు మార్కొనుట హనుమంతుఁడు చూచి నీలునితోడ వచ్చి వానికిఁ దోడ్పడెను. అంత నీల త్రిశిరులకును దేవాంతక హనుమంతులకును నంగదమహోదరులకును ఘోరయుద్ధమయ్యెను. హనుమంతుని ముష్టిఘాతంబునకు దేవాంతకుఁడు తలపగిలి నేలఁ గూలెను. నీలుఁడు వైచిన మహాపర్వతంబు పాటునకు మహోదరుఁడు ముద్దయి పడిసెను. హనుమంతుఁడట్లు దేవాంతకుని నెడపి త్రిశిరునిదాఁకి పెద్దయుండడవు పోరి వానినిఁ గ్రిందఁబడవైచి యతని కత్తితోన వానితలలు మూఁటి దఱిగివైచెను. నగాంతకాదులు నలువురు చచ్చుటఁ జూచి మహాపార్శ్వుఁడు క్రోధమూర్ఛితుఁడై వానరసైన్యంబు పైఁబడెను. వానిని ఋషభుఁ డెదిర్చెను. అయ్యిరువురకును ఖడ్గాఖడ్గి బాహాబాహి పెనుపోరయ్యెను. ఋషభుఁడు మహాశైలంబును దెచ్చి మహాపార్శ్వుని పయివైచెను. వాఁడు నుఱినుఱియై చచ్చెను.

—◆ లక్ష్మణాతికాయుల యుద్ధము ◆—

అతికాయుఁడంత నిరారావంబులు గావించుచు వానరసైన్యముఁ జొచ్చెను. నడగొండవలెనున్న వానినిజూచి కుంభకర్ణుఁడు లేచివచ్చెనో యని వానరులు పరమభీతులై యొండొరుచాటున నొదిగియొదిగి రాముని శరణుచొచ్చిరి. దాశరథి యాభీషణాకారునకు విస్మయమంది 'విభీషణా! వేయిగుఱ్ఱంబుల తేరిపై నిలిచి ప్రాసశూలతోమరపరివేష్టితుఁడై భూతకోటితోడి యపరరుద్రుఁడోయను భ్రాంతినిగలిగించుచు ధ్వజాగ్రంబున రాహువు గ్రాలుచుండఁగాఁ, దీవ్రబాణకాంతులు చతుర్దిశాదీప్తంబులై రాజిల్లుచుండఁగా, దశహస్తాయతంబులైన ఖడ్గంబులు రెండు నుభయపార్శ్వంబుల దేజరిల్లుచుండఁగా, మృత్యుజిహ్వాలంబోని శక్తులసుబట్టి త్రిణతంబును హేమపుష్పంబులైన కార్ముకంబును ధరించి, రక్తపుష్పమాలికలుందాల్చి, ప్రళయకాలునివలె నోరప్పళించి, వానరలోకవిద్రావణుఁడై వచ్చుచున్న యాతఁ డెవండో' యనెను.

నావుడు 'రామా! ఇతని నతికాయుఁడందురు. వీఁడు రణకౌశల్యంబునఁ దండ్రిని దలపించును. విద్యాసంపత్తియు వృద్ధసేవాపరత్వంబును సర్వాస్త్రజ్ఞానంబును వీనికిఁ గలవు. ఇతఁడు రథంబునుగాని గజంబునుగాని హయంబునుగాని యారోహించి యుద్ధమొనర్చునప్పుడు వీనిధనుర్విద్యావిశేషంబును జూచితీఱవలయును. మంత్రమందొండె నీతిశాస్త్రమందొండెఁ జతురుపాయప్రయోగంబునఁ దొండె నితఁడు మహాసమర్థుఁడు. ధాన్యమాలిని వలన రావణుఁ డితనిఁగాంచెను. ఈరణశౌండీరుని బాహుబలమాశ్రయించి లంకానగరంబు నిర్భయముగానుండును. ఇతఁడు ఘోరతపంబాచరించి బ్రహ్మవలన దివ్యాస్త్రదివ్యకవచంబులను సూర్యప్రభాభాసురమైన యీరథంబును బడసెను. పరమేష్ఠివరప్రభావంబున నితఁడు సురాసురులకు నవధ్యుఁడు. ఇతనిచేత మడిసిన దేవదానవులకు లెక్కయే గలుగదు. ఇతనిపేరు చెప్పిన యక్షులు పక్షులవలెఁ బఱతురు. వీనిశరఘాతికి జంభారి దంభోళి స్తంభించెను; వరుణపాశంబు ప్రతిహతమయ్యెను. పరాకువలదని విభీషణుఁడు చెప్పెను.

ఆలోన నతికాయుఁడు తన్నెదిర్చిన కుముదద్వివిదమైందనలశరభులనుఁ దీవ్రబాణంబుల నొప్పించెను. వానరవీరులు వైరిబాణపరంపరానిహతులై నిలువెల్ల జల్లెడక్రంతలుగాఁ బరవశులై ప్రతిక్రియ నేరకుండిరి. అతికాయుఁడు వారిని జూచి 'ప్రతిక్రియకునోపని పందలఁ దాఁకరా' దని పలికి ధనుఃకలాపియై రామునొద్దకుఁ బోయి 'రామా! నీవానరులు భయార్తులైరి. అట్టి పిరికిపందలతో నాబోట్లకు యుద్ధము తగదు.

"మ॥ శరచాపంబులుఁగేలఁబూని రథినై సంగ్రామమర్దించి భూ
వర! నీపైనిదెవచ్చినాఁడ మొదలన్ వారాశిపై వాలిపై
ఖరుపై నేసినకోలవేయుమిటఁ జక్కంగ్రమ్మ నాయమ్మ లిం
కొరుపైఁ బాఱవు దేవదానవజయోద్యోగాభిమానంబునన్ ॥"

యనిపలికెను. వానిగర్వోక్తులకు లక్ష్మణుఁడు సంక్రుద్ధుఁడై తూణీరంబునుండి బాణంబుఁదివిచి సంధించి దిక్కులు గ్రక్కదలునట్లుగా జ్యానాదంబు గావించెను. రక్షోవీరుండతనిఁ జూచి 'సౌమిత్రీ! పసికందువులు విక్రమంబులకుఁ దగరు. కాదని యట్టివారు త్వరపడినను వారికి హితముచెప్పుట

నా బోఁట్లకగును గాని వారితో యుద్ధమొనర్ప రాదు. నా శరవేగంబును హిమవన్నగ భూమ్యాకాశంబులు సయిత మోర్వనోపవనఁగా నీవెంతవాఁడవు ? తెలిసి తెలిసి మృత్యువునోరు దూఁగవలదు. నీబాల్యవిచేష్టితంబులు మాని శరచాపంబులు పాఱవైచి మరలిపొమ్ము. అట్లుచేయవేని నాయీ నిశితశరంబులు నీరుధిరంబులానుట నిజ' మని పలికి వింట బాణముఁ గూర్చెను.

అతికాయుని యుపాలంభనంబులను లక్ష్మణుఁడు కినిసి 'దురాత్మా ! ప్రగల్భంబులవలనఁ బెద్దకాఁ జాలవు. శూరు లాత్మబలంబును జూపుదురు గాని జల్పంబులాడరు. లావుగలదేనిఁ జూపుము. నీవెంతవాఁడవో చూచి యనంతరము నాబలంబును బ్రదర్శింతును. పండినతాటిపండు పెనుగాలికి రాలి చిదుపలగునట్లు నీతల వ్రయ్యలు గానున్నది. బాలుఁడనో వృద్ధుఁడనో నీపాలిటికి మిత్తినై వచ్చితి' ననెను. అతికాయుఁడు లక్ష్మణునిపయి నాశీవిషతుల్యశరంబును వదలెను. రఘూత్తముఁడు దాని నర్ధచంద్రబాణంబునఁ ద్రుంచివైచెను. రక్షోవీరుఁడంత బాణవర్షంబును గురిపించెను. సౌమిత్రి వానినెల్ల ఖండించి శితభల్లమొండు సంధించి యాకర్ణాంతముఁ దివిచి వైరిలలాటంబున వైచెను. అతికాయుఁ డావేటునకుఁ జలించి తెప్పరిల్లి 'లక్ష్మణా! నీబాణప్రయోగకౌశలంబును మెచ్చితిని. నాకుఁ దగినవైరివే' యని పలికి యొండు మూఁడు నైదు నేడులుగా శరంబులు వింటఁగూర్చి సౌమిత్రిపై వదలెను. మృత్యుసమానంబులును గాంచనపుంఖంబులును రవితేజోవంతంబులు నైన యాబాణంబులను లక్ష్మణుఁడు ప్రతిశరంబుల భిన్నాభిన్న మొనర్చెను. అతికాయుఁడు మఱియొండు తీవ్రసాయకంబును లక్ష్మణుని యురంబున నాటెను. సౌమిత్రి యాబాణంబును బెఱికివైచి యాగ్నేయాస్త్రంబును బ్రయోగించెను. అతికాయుఁడు సూర్యాస్త్రయోజితశరంబును వైచెను. అయ్యస్త్రంబులు రెండును పరస్పరము దహించికొని నిస్తేజములై నేలవ్రాలెను. అతికాయుఁ డంత నైషీకాస్త్రంబును వైచెను. లక్ష్మణుఁడు దాని నైంద్రాస్త్రంబునఁ బ్రహరించెను. రక్షోవీరుఁడు యామ్యాస్త్రంబును వదలెను. లక్ష్మణుఁడు దానిని వాయవ్యాస్త్రంబున దట్టివైచి శరవర్షంబును గురిపించెను. ఆబాణంబులు నిశాచరుని మేనుతాఁకి తునిగి వ్రాలెను. తనబాణంబులట్లగుట లక్ష్మణుఁడు చూచి యాశ్చర్య

వశుఁడయ్యెను. అంతలోన వాయుదేవుఁడు వచ్చి 'లక్ష్మణా! అతికా యుఁడు బ్రహ్మదత్తకవచంబునుదొడిఁగి యున్నాఁడు, ఆకవచంబును భేదింపరాదు. బ్రహ్మాస్త్రంబున దక్క మఱొక్కట నితఁడుచావఁ' డనెను. లక్ష్మణుఁ డంత బ్రహ్మాస్త్రంబు నభిమంత్రించి వైచెను. చంద్రార్క తారాగణంబులు భీతిల్లెను; దిక్కులు చలించెను; భూమ్యాకాశంబులు వడంకెను. అయ్యస్త్రము మిడుంగుఱులు గ్రక్కుచు నగ్నిహోత్ర రాశివలె రాసాగెను. అతికాయుఁడు తన్నివారణార్థము వివిధనిశితప్రతి శరంబులు వైచెను. అయ్యడ్డంకులకు బ్రహ్మాస్త్రంబు నిలువక గరుడానిల వేగంబున వచ్చెను. నిశాచరుఁడు గదాశక్తికుంతాసిశూలములతో దాని నెదిరించెను. అమ్మహాస్త్రము వానినెల్లఁ ద్రోచివైచి వానిశిరంబును ఖండించెను. అతికాయుఁడు మేరుకుధరంబువలెఁ గూలెను. వానరులంతఁ జెలరేగి రక్కసులను దఱిమితఱిమి వేటాడిరి. అసురులు గీపెట్టుచు లంకాపురము దూఱి రావణునకు సంగతి వినిపించిరి.

రావణుఁడు దుఃఖదీనుఁడై 'కటా! ఈవిపరీతం బూహింపరాదు. ధూమ్రాక్షుఁడు దునిగెను; అకంపనుండణగెను; ప్రహస్తుఁడు పరిమారెను. కుంభకర్ణుఁడు కూలెను. రాక్షసశూరులెందఱో రణజితులై చచ్చిరి. ఇంద్రజిన్నాగపాశము గూడ నెగ్గదయ్యెను. ఇదంతయు రామలక్ష్మణుల ప్రభావమో మాయయో మోసమో తెలియరాదు. ఎవనింబంపినను దిరిగి రాఁడు. రామాస్త్రమహిమ యింతనరాకున్నది. వారిని వధించు వీరశిఖామణి కానరాఁడు. నారాయణుఁడే రాముఁడుగా నవతరించెనా? కాకున్న నాబలంబిట్లగునా? అహో! ఏనాడును మూతపడని లంకాద్వారంబు లీ నరమాత్రునకు వెఱచి నేఁడు తెఱవవు. ఏమిసేయనగు' నని లోలోనఁ జింతించి చుట్టియున్న రక్కసులను జూచి 'రక్షఃపుంగవులారా! అప్రమత్తులై యిఁక మీరు మిమ్మును మీపురంబును గాపాడుకొనుము. అశోక వనంబును గాపాడుము. ఆవన ప్రవేశనిష్క్రమంబులకు నెవనికి సందియ్య వలదు. గుమ్మములెల్ల మాటిమాటికి గస్తీ తిరుగుచుండుము. మాఁడెంబులను మఱువవలదు. వానరు లెప్పు డేమి సేయుదురో నాకు వెనువెంటఁ దెలుపుచుండుము' అని యాజ్ఞాపించి గృహాంతరముచొచ్చి సుతసోదరాది మరణంబునకు సంతాపించుచుండెను.

—♦ ఇంద్రజిత్తు రెండవ యుద్ధము ♦—

ఇంద్రజిత్తు తండ్రికడకు వచ్చి 'నాయనా! ఇంద్రజిత్తు బ్రదికి యుండఁగా నీకీదుఃఖమేల? ఇదిగో రామలక్ష్మణుల శరీరంబులను జల్లెడక్రం తలుగాఁజేసి వధించి శరతల్పంబులఁ బరుండఁ బెట్టి వత్తుఁ జూడుము. నా శరనిహతుఁడు బ్రతికి యెఱుంగను. ఓదార్పులాడుదునని తలంపకుు. నా పౌరుషంబు సాక్షిగా నావరంబులు సాక్షిగాఁ జెప్పుచున్నాను. నాఁడు వామనుం డట్లు విజృంభించి ముల్లోకంబుల విస్మయపరమొనర్పనేని యింద్రజిత్తని నన్నుఁ బిలువవలద'ని బీరంబులు పలికి తదనుజ్ఞాతుఁడై ఖరా యత్తరథం బధిష్ఠించి ధవళచ్ఛత్రంబునీడఁ గూర్చుండి, ప్రాసముద్గర గదా ఖడ్గకుఠారధారులు రాక్షసవీరులు గజాశ్వంబులెక్కి శంఖంబులు పూరించు చు భేరీభాంకారములు గావించుచు వెంటరాఁ గింకరులు హేమచామరం బులు వీచుచుండఁగా సమరక్షోణిఁజొచ్చి తనచుట్టును రక్కసులను గా వుంచి హోమాభిక్రియకుఁ దొడంగి పత్త్రంబులకుమాఱుగా శస్త్రంబులఁజేర్చి తాండ్రపుడకలసమిధలు గూర్చి లోహితవస్త్రంబును గార్ష్ణాయస స్రువం బును సంతరించి గంధమాలాపురస్సరంబుగా హవిస్సును సంస్కరించి వ్రేల్చి కృష్ణచ్ఛాగంబును హోమమొనర్చెను. సమిధలను రగిల్చినంతనే యగ్ని హోత్రుఁడు విధూమార్చియై ప్రదక్షిణావర్తశిఖల హవిస్సును బ్రతి గ్రహించి విజయము సూచించెను. అంత నింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబును జపించి నిజరథచాపంబుల నభిమంత్రించెను. వాని యుగ్రకర్మంబునకు నభోభాగము గ్రహేందుతారకంబుగాఁ బరిత్రాసమొందెను.

ఇంద్రజిత్తట్లు గావించి రాక్షసులను బిలిచి మీరుయిచ్చవచ్చినట్లు కోఁతులను జెండాడనగు నని చెప్పి తాను చాపబాణాసిరథాశ్వసూతసహి తంబుగా నంతర్ధానమొంది యొక్కొక్క కోలతో వానరులను బదులను ముప్పదులనుగా గూల్చుచు వివిధాస్త్రంబులఁ గపిసైన్యమునెల్లఁ గలంచెను. వానరులు శరవిద్ధాంగులై నిస్స్వరారావంబులు గావించుచు గుప్పలుకుప్పలు గాఁ గూలిరి. అంత రావణి బ్రహ్మాస్త్రమంత్రాభిమంత్రిత ప్రాసశూల బాణంబులతో హనుమత్సుగ్రీవాంగద గంధమాదన జాంబవత్సుషేణ గజ

గవాక్షాది వానరముఖ్యుల నొప్పించి రామలక్ష్మణుల మీఁద శరవృష్టిఁ గురిపించెను.

రాముఁడాబాణవర్షంబును సహించి 'లక్ష్మణా! అంతర్హితుఁడై యింద్రజిత్తు బ్రహ్మాస్త్రబలంబున నింతచేయుచున్నాఁడు. కంటికిఁ గానరాఁడు గావున వాని నిప్పుడు వధింపఁ దరము గాదు. మఱియు బ్రహ్మవరంబు వమ్ముగారాదు. మనస్సంక్షోభము మాని యీశరవృష్టి నోర్చియుండుము. రావణి యింతచేయుచున్నను మనము మిన్నక నేలబడి యుండుమేని జయశ్రీ యబ్బెనని యితఁడు కుతూహలియై లంకాపురికిఁ జనును' అని పలికి తమ్మునితోడఁ దానును శరపీడితుఁడై ధరాతలంబున విశ్రమించెను. ఇంద్రజిత్తు సాయాహ్నమైదుగడియలలో నింతకార్యంబు గావించితి నని సంతోషించి సింహనాద మొనర్చి లంకాపురముఁ జొచ్చెను.

రామలక్ష్మణులమూర్ఛకు వానరబలమెల్ల విహ్వలత్వమొందెను. విభీషణుండది చూచి 'కపీంద్రులారా! ప్రమాదపడవలదు. రామలక్ష్మణులు మూర్ఛితులుగారు. పరమేష్ఠివరంబు నుద్ధరింప నట్లభినయించుచున్నారు. ఇంతమాత్రానకే యీగోలయేల?' యని వారికి ధైర్యోత్సాహములు గొలిపెను. హనుమంతుఁడు బ్రహ్మాస్త్రగౌరవార్థము ముహూర్తమాత్రము కట్టువడియుండి బంధవిముక్తుఁడై విభీషణుని డాసి 'మనవారిలో నెవ్వరెవ్వరు బ్రతికియున్నారో చూతము రమ్మ'ని వానిని వెంటఁగొని రాత్రియగుటఁ గొఱవులు దగిల్చి రణరంగమెల్లఁ గలయఁ దిరిగి తోఁకలు తెగి చేతులు విఱిగి కాళ్ళు తునిగి తొడలు వీడి మెడలేది నానాగతులఁ బడియున్న వారిని జూచుచుఁ జనిచని జాంబవంతుని సమీపించెను. విభీషణుండతని గాంచి 'ఆర్యా! ఈబాణంబులు నీప్రాణంబులను హరింపవుగదా' యనెను. జాంబవంతుఁడు మాటునవ్వడి నతఁడు విభీషణుండుగా గ్రహించి 'విభీషణా! శరవిద్ధుఁడనుగావున గన్నెత్తిచూడఁజాలను. కంఠధ్వనిని బట్టి నిన్ను గుర్తించితిని. అంజనాదేవియు వాయుదేవుఁడు నెవ్వనిగని సుప్రజలైరో యా వానరోత్తముఁడు హనుమంతుఁడు సుఖమున్నాఁడో' యనెను. నావుఁడు 'జాంబవంతా! రామలక్ష్మణులను గూడ వదలి మారుతి నడిగితివి. అతనియందు నీకుఁ గల ప్రేమ తుదకు రామునందుఁ గూడ లేనట్లు స్పష్టము'

అని విభీషణుఁడు పలికెను. ఆమాటవిని 'నాయనా ! విభీషణా ! పక్షపాతంబున నిట్లనుట గాదు. హనుమంతుఁ డొక్కఁడు సుఖమున్న మనవారెల్లరుఁ జచ్చినను బ్రదికియున్నట్టే యగును. అతఁడు చన్నచో మనమెల్లము బ్రదికియుఁ జచ్చినవారమగుదుము. వాఁడు జీవించియున్న మాకును జీవితాశ గలదు. ఆకారణంబున వాని నే యడిగితి' నని జాంబవంతుఁడు చెప్పెను.

## హనుమంతుఁడు సంజీవినిఁ దెచ్చుట

అంత హనుమంతుఁడు తనపేరు చెప్పి జాంబవంతునకు నమస్కరించెను. ఆవృద్ధకపీంద్రుఁడు మారుతికంఠధ్వని విని పునర్జన్మమెత్తినట్లు భావించి 'నాయనా ! ఇటురా ; ఈవానరులనెల్ల రక్షింపుము. జరుభిందులకుఁ జాలరు. నీపరాక్రమప్రదర్శనంబునకు సమయంబు వచ్చెను. కపిసైన్యంబునకు బ్రమోదంబును రామలక్ష్మణులకు సుఖంబును గూర్పుము. నీవు త్రోడ్తో హిమవన్నగంబునకుఁ జని యందు ఋషభకైలాసశిఖరంబులమధ్య దేదీప్యమానంబుగా వెలుఁగుచుండు నోషధీపర్వతంబును జేరుము. అందు విశల్యకరణి మృతసంజీవని సావర్ణ్యకరణి సంధానకరణి యనుపేరి దివ్యౌషధులు నాల్గుగలవు. ఆనాల్గింటిని శీఘ్రముగాఁ గొనివచ్చి వీరివారిని బ్రదికింపుమ' నెను.

హనుమంతుఁ డామాటవిని పర్వకాలసముద్రంబట్లుప్పొంగి గగనంబునకు నుద్యమించెను. వాని పాదపీడనంబునకుఁ ద్రికూటపర్వతశిఖరంబులు చూర్ణమయ్యెను. వాని యూరువేగంబునకు నందలితరుజాలము పెళ్ళగిలి యొండొంటినొరసి రాజిపడిదగ్ధములయ్యెను ; లంకాద్వారంబులు సంచలనంబొందెను ; గృహగోపురంబు లురవిపడెను. మారుతి యట్లు నింగికెగసి రాక్షసభయంకరంబుగా నార్చి రామునకు నమస్కరించి భుజంగమంబుఁబోని తనవాలంబును లేవనెత్తి నడుమువంచి చెవులుముడిచి బడబాముఖంబునుబోని నిజవక్త్రంబును విచ్చి బాహువులు సాచి యుత్తుంగతరంగాభీలసాగరంబునుదాఁటి పర్వతంబుల నతిక్రమించి వనంబులు గడచి నానాప్రస్రవణకందరనిర్ఝరిణీసమాకులంబును శరన్మేఘశిఖరాభిరామంబును నైన

హిమవత్పర్వతముఁ జేరి దేవర్షి సేవిత పుణ్యాశ్రమంబులను సందర్శించుచు బ్రహ్మకోశంబును రజితాలయంబును శక్రాలయంబును రుద్రశరమోక్షణ స్థానంబును హయగ్రీవక్షేత్రంబును బ్రహ్మకపాలంబును యమకింకరాలయ ంబును వజ్రాలయంబును గుబేరస్థానంబును సూర్యనిబంధనక్షేత్రంబునుం బ్రహ్మాసనంబును శివధనుఃక్షేత్రంబును పాతాళప్రదేశబిలంబును జూచుచుఁ జనిచని కైలాసఋషభపర్వతంబుల నడుమ నగ్నిహోత్రమువలె దీపించు చున్న యోషధి పర్వతంబున వ్రాలెను. ఓషధులు వానికి వెఱచి తిరోహితములయ్యెను. హనుమంతుఁడందు నోషధులనెల్ల వెదకి వెదకి వేసారి క్రోధోద్దీపితుఁడై బొబ్బార్చి కన్నులెఱ్ఱచేసి 'నగేంద్రమా! రామునియందుఁగూడ నీకు ననుకంపజనింపదా? అట్లేని నిన్నుఁ బెల్లగించి విశీర్ణమొనర్తుఁ జూడు' మని పలికి యాపర్వతంబును సమూలంబుగా లేవదీసి యెత్తుకొని యాకాశ గతుఁడై రెండవసూర్యుఁడట్లు తేజరిల్లుచు వచ్చి త్రికూటపర్వతంబున వానర సేనామధ్యంబున వ్రాలి విభీషణుని గవుంగలించుకొనెను. దివ్యౌషధి గంధము సోకినంతనే రామలక్ష్మణులు విశల్యులైరి. హరిప్రవీరులు మూర్ఛితులైయున్న వారలేగాక యుద్ధారంభమునుండి నాటిదనుక నిహతులై యున్నవారుగూడ గాఢనిద్రనుండి ప్రాతఃకాలమున యథాసుఖము మేల్కాంచినట్లు లేచిరి. రాక్షసబలంబునఁ జచ్చినవారి నప్పుడప్పుడే మున్నీటఁ ద్రోయుచుండిరిగావున వారికట్టి భాగ్యముగలుగదయ్యెను. వానరబలంబెల్లఁ దేఱినంతట హనుమంతుఁ డాపర్వతంబును యథాస్థానముచేర్చి రాముని కడకు వచ్చెను.

—♦ వానరులు లంకను గాల్చుట ♦—

సుగ్రీవుఁడమ్మహాబలుని మన్నించి 'కుంభకర్ణాదివధావ్యాకులుఁడై రావణుఁడుండును. అతఁడిప్పుడు రణంబునకురాఁడు. ఈరాత్రి మనవారిలో బలాఢ్యులును వేగవంతులునైనవారు లంకాపురమును జూఱకొందురుగాక' యనెను. వానరముఖ్యులు కొందఱు దివిటీలుగైకొని ద్వారరక్షకులనుదరిమి లంకాపురముఁజొచ్చి బురుజులందును బ్రాసాదములందును నిప్పుపెట్టిరి. ఒకచోటఁ బెనుగొండలఁబోని మేడలు కూలసాగెను; ఒకచాయ విపణులు కాలి బూదియగుచుండెను; ఒకవంక ప్రవాళమౌక్తికంబులు భస్మరాసు లయ్యెను. ఒకమోర గజవాజరథశాలలు నొకచక్కి శరచాపఖడ్గశాలలును

ధగద్ధగాయమానార్చుల వెలిఁగెను. లంకానగరంబెల్ల వహ్నికుండముగా మాఱెను. ఆ తఱి రక్కసులు కొందఱు సువర్ణకవచంబుతో నిద్రించు చుండిరి; కొందఱు పుష్పదామ చీనిచీనాంబరములు దాల్చి మద్యపాన వశులై కాంతామణుల కవుగిండ్లఁ జిక్కియుండిరి. మఱికొందఱు రణశ్ర మంబునఁ జేసి చేతిఖడ్గంబులతో నశ్లేపడియుండిరి. వారెల్లరును దజ్జ్వాలా వృతులై యెచ్చటివారచ్చట నశ్లే మాడిరి. నిద్రావశలైయుండిన స్త్రీలా సెగలకు మేల్కాంచి దిక్కు దోఁపక యెలుఁగెత్తి యొకప్రక్క రోదనం బులు గావింపసాగిరి. చంటిబిడ్డలయేడ్పులకు మేరలేకుండెను; పెంపుడు పక్షుల సంభ్రాంతారావంబులు మాఱుమ్రోసెను. మత్తగజంబులు బంధంబులను ద్రెంచి వీధులఁబడి పొగనూరి ఘీంకరించుచు నడగొండలవలెఁ ద్రెళ్ళెను. లంకాదహనజ్వాలలు సముద్రజలాంతరంబునఁ బ్రతిబింబించి యపూర్వరక్తిమను గూర్చెను.

సీ॥ ప్రళయకాలాగ్నులు ప్రబలియొక్కుమ్మడి
భూనభోంతరమెల్లఁ బొదివెనొక్కొ
సంవర్త జీమూత సంఘంబులొక్కటై
మించుఁదీవెలఁ గ్రుమ్మరించెనొక్కొ
ముక్కంటి నేత్రాగ్ని మున్నాడి వెలిఁ బ్రాఁకి
విశ్వంబుఁ గాల్పఁగా వీఁగెనొక్కొ
తోయధిగర్భంబుఁ ద్రోపాడి బడబంబు
లంకాపురిని జొచ్చెలాగిదొక్కొ
ఆ॥వె॥ అనుచు రాక్షసాళి యాబాలవృద్ధంబు
బెగ్గడిల్లి వడఁకి వగలఁగుంది
దిక్కుగానకెందు దీనాతిదీనులై
మ్రానుపాటుఁ జెంది మ్రగ్గెనందు.

## — యూపాక్షాదుల యుద్ధము —

రావణుఁ డాకోలాహలంబును జూచి వానరుల దుండగంబునకుఁ గ్రోధసందగ్ధుఁడై కుంభకర్ణసుతులను గుంభనికుంభులను యుద్ధంబునకుఁ బంపెను. వారితోడ యూపాక్ష శోణితాక్ష ప్రఘసకంపనాదులు

వివిధాయుధపాణులై తరలిరి. వానరసైన్యం బాయసురబలంబును జూచి
యుచ్చైర్నాదములు గావించుచు యుద్ధసన్నద్ధమాయెను. ఉభయసేనలుఁ దల
పడివివిధగతులఁ బోరిరి. అంగదుఁడు ప్రకంపనునిబట్టి చీల్చి పరిమార్చెను.
శోణితాక్షుఁ డంతవానిని దాఁకెను. అయ్యిరువురు బెద్దయుండడవు పోరిరి.
అంగదుఁడెట్టకేలకుఁ జెలరేగి వైరిఖడ్గంబునొడిసి లాగి యాకత్తితోన వానిని
జాజెపుఁగోతగా నఱికెను. శోణితాక్షుఁడు దెబ్బతినియు గదత్రిప్పుచు
నంగదుని వెంబడించెను. అంతలోన యూపాక్షు ప్రఘసులు వానికిఁ
దోడైరి. అంగదుఁ డొక్కఁడయ్యు నమ్మువ్వురకు జవాబుచెప్పసాగెను.
అంగదునికిఁ దోడుగా మైందద్వివిదులు వచ్చిరి. అంత నంగద ప్రఘసులకును
యూపాక్ష ద్వివిదులకును మైందశోణితాక్షులకును రోమహర్షణమైన మహా
ఘోర యుద్ధమొనరెను. ఎట్టకేలకు రక్షోవీరులు ముగ్గురు మ్రగ్గిరి.

## —♦ అంగద కుంభుల యుద్ధము ♦—

రాక్షససైన్యము భీతిల్లి కుంభునివంకకుఁ జూచెను. అతఁడు తన
వారికి ధైర్యముపలికి విల్లుపూని తీవ్రశరంబులఁ బఱపెను. ఆబాణంబులు
తాఁకి ద్వివిదుండు విహ్వలాంగుఁడై నేలఁగూలెను. తమ్ముని పాటునకు
మైందుఁడు పెల్లుకసలి పెనుబండను గొని వచ్చి కుంభునిపై విసరెను. అతఁ
డారాతి నైనుబాణంబుల వ్రక్కలుగావించి క్రూరనారాచంబొండు వాన
రోత్తముని వక్షంబున గ్రుచ్చెను. మైందుఁడు మర్మస్థానంబున శరవిద్ధుఁ
డై మూర్ఛిల్లెను. మేనమామ లిరువురునట్లగుట యంగదుఁడు చూచి మహా
గ్రహమొంది కుంభునిమీఁదికి నురవణించెను. రక్షోవీరుఁడు వాడిశరం
బులు మూఁడువైచి కపినాయకుని నొప్పించెను. అంగదుఁడు వానిపై
రాళ్లవానఁ గురిసెను. కుంభుఁ డాశిలావృష్టిని దట్టివైచి రెండమ్ము లంగ
దుని భ్రూభాగంబున నాఁటెను. అంగదుని నుదుటినుండి రక్తము స్రవించి
యతని కన్నులఁ గప్పివుచ్చెను. వానరోత్తముఁ డారక్తము నొకచేతఁ
ద్రోసివైచుచు నొకచేతఁ జేఱువనున్న మహాభూరుహంబును బెకలించి
కుంభునిపై విసరెను. అసురవీరుఁడు సప్తబాణంబులను వైచెను. అంగ
దుఁడు శరవిద్ధుఁడై బిట్టార్చి మూర్ఛిల్లెను.

## కుంభ సుగ్రీవుల యుద్ధము

అంగదుఁడు మూర్ఛిల్లుట రాముఁడు విని తత్సహాయార్థము జాంబవదాది వానరోత్తములను బంపెను. వారు మూర్తీభవించిన కోపరసంబోయన దీపించుచు శిలావృక్షంబులను గైకొని కుంభునిమీఁదికిఁ జనిరి. నదీప్రవాహంబును బెనుపర్వతంబువలెఁ గుంభుఁడా వానరులను బాణౌఘంబున నరికట్టెను. చెలియలికట్టను దాఁకిన మహోదధికరణి వానరులు మున్నడ నోపక నిలిచిరి.

సుగ్రీవుఁడంత రాక్షసబలంబుఁ జొచ్చి.

"మ॥ తలలుం జేతులుఁ గాళ్ళునుం దనువులున్ ధాత్రీస్థలిం బెక్కుతి
ట్టలుగావించి రథప్రతానములు ఘోటశ్రేణులున్ వారణా
వలులుం జెవ్వడఁ బైపయిం దఱిమి దుర్వారైక దర్పోద్ధతిం
జలముం జేవయుఁ జూపె నుద్భటభుజాసంరంభ రౌద్రంబుగాన్॥"

అట్లు నిశాచరబలంబు నురుమాడి సింగంబు గజంబు మీఁదికిఁ బోలెఁ గుంభునిపైకి నుఱికి మహాశైలంబులను ధవాశ్వకర్ణాదివృక్షంబులను బెకలించి తెచ్చి వానితో నయ్యసురవీరుని బ్రహరించెను. కుంభుఁడును వానినెల్లఁ దీవ్రబాణంబులచేత ఖండించి వైచెను. సుగ్రీవుఁడు స్వప్రయత్నంబు వ్యర్థమగుటకు నెంతయు నలిగి కుప్పించి యెగచి కుంభునిరథంబుపై వ్రాలి వానిచేతివిల్లుఁ బట్టి విఱిచి 'కుంభా! నీవీర్యంబును నీబాణవేగంబును మహాద్భుతంబులు. ప్రభావంబున నీవు రావణుని బోలుదువు. సాహసాదివిక్రమంబుల నిన్నుఁ బ్రహ్లాదబలిదేవేంద్ర కుబేరవరుణులకు సాటిచేయవచ్చును. బలంబున నీవు నీతండ్రిని దలపింతువు. జితేంద్రియుని మనోవ్యథలువోలె నిన్ను సామాన్యులు గలంపఁజాలరు. నీలావు చూడ వచ్చితిని. నీపరాక్రమంబెల్లఁ జూపుము. నీపెదతండ్రి రావణుండు వరబలంబు నాశ్రయించి దేవదానవులనోర్చెను. నీతండ్రి కుంభకర్ణుఁడు కేవలశారీరబలంబుననే సురాసురులను జయించెను. నీవన్ననో ధనుర్వ్యాపారంబున నింద్రజిత్తును బలపరాక్రమంబుల రావణుని మఱపింతువు. శక్రశంబరులకువలె మనకిప్పుడు జరుగనున్న మహాసమరంబును నిఖిలభూతంబులు గాంచుఁగాక. కుంభా!

అలసిసొలసియున్నావు. అట్టివానితోఁ బోరి వానిని జయించుట దూఱు నకేయగుఁ గాని కీర్తికిగాదు. సుంతబడలికలు వాసి రమ్ము' అని పలికెను.

ఆనిందాగర్భవచనంబులకుఁ గుంభుఁ డాజ్యాహుతవహ్నికరణిఁ బ్రజ్వరిల్లి సుగ్రీవు నొడిచిపట్టి నలిచలిచేయఁ జూచెను. వారిరువురకు గజకచ్ఛపంబుల పోరయ్యెను. వారిపాదఘాతంబులకుఁ బుడమిసడలి క్రుంగెను. సుగ్రీవుఁడు కుంభు నెత్తి సముద్రాంతమున వైచెను. అతఁడెగిరివచ్చి వానరేంద్రుని యురంబున ముష్టితో నడఁచెను. కపీంద్రుఁడు ప్రతిఘాత మొనర్చెను. ఆ వ్రేటుతోడఁ గుంభుఁడు నోరప్పళించి యసువులు దొలంగెను.

## —♦ నికుంభహనుమంతులయుద్ధము ♦—

కుంభునిచావునకు వానితమ్ముఁడు నికుంభుఁడు చుఱచుఱఁ బొక్కి సంగ్రామ సన్నద్ధంబును బంచాంగుళి ముద్రాంకితంబును వజ్రవిద్రుమ భూషితంబును నైన మహాపరిఘంబుఁ బట్టి గిఱగిఱ ద్రిప్పుచు సింహనాదం బొనర్చెను. ఆత్రిప్పువడికి వాతగ్రంథులు సడలెను. అది మహాఘోషతోడ విధూమాగ్నికరణి భాసిల్లెను. నికుంభుఁ డట్లాపరిఘను ద్రిప్పి హనుమంతు నెపై వైచెను. అవి వానియురంబు దాఁకి నూఱుచిదుపలయ్యెను. మారుతి యావ్రేటునకు సుంతచలించి సమాహితుఁడై పిడికిలి సంతరించి నికుంభునెద నడంచెను. రక్షోవీరుఁడు వక్షము వ్రీలి నెత్తురు చిమ్ముచున్నను లెక్క చేయక హనుమంతుని సందిటఁబట్టి లేవనెత్తి పగులనేయనుంకించెను. మారుతి వానిబాహుబంధంబును విడిపించుకొని యతనిని బడవైచి నలఁగఁద్రొక్కి మెడత్రిప్పి విఱిచి వైచెను.

## —♦ రామ మకరాక్షుల యుద్ధము ♦—

కుంభనికుంభుల ఘోరమరణంబును రావణుఁడు విని కటకటంపడి మకరాక్షుని యుద్ధమునకుఁ బంపెను. వాఁడు ససైన్యంబుగాఁ దరలి 'ఇదిగో కార్చిచ్చు శుష్కేంధనంబులను వలె రామలక్ష్మణులను వానరసేనా సహితంబుగాఁ బరిదగ్ధమొనర్తు' నని ప్రగల్భము లాడుచు రణరంగముఁ జొచ్చి కపివర్గంబును జించి చెండాడెను. వానరులు భయభ్రాంతులై పాఱ

దొడంగిరి. వారినతఁడు వెన్నాడి తఱిమి తఱిమి కొట్టసాగెను. రాముఁడు బాణవర్షముఁ గురిసి వానియుద్ధతి నాపెను. మకరాక్షుఁ డంత రామునిఁ జంక మరలి 'రామా! రారమ్ము; ద్వంద్వయుద్ధ మొసంగుము. నా కార్ముకనిర్ముక్త శితశిలీముఖంబులు నీప్రాణంబులను హరింపఁ ద్వరపడుచున్నవి. దండకారణ్యంబున నాతండ్రిని ఖరునొంటిచేసి హరించితివి. నాఁడు నేనులేమి నిందాక జీవించితివి. ఆకొన్నసింగంబు లేడినట్లు నేను నీకొఱకు కాచియున్నాను. మాటలేల ? రారమ్ము. మనయుద్ధంబును జూడ సమస్తలోకంబులు తమకించుచున్నవి. అస్త్రసంగ్రామమో గదాయుద్ధమో బాహాబాహిరణమో నీకేదియభ్యస్తమో యదిచేయనగు' నని పరుషగంభీరంబుగాఁ బలికెను.

రాముఁ డా గర్వోక్తులను విని 'రాక్షసా ! వృథాప్రగల్భంబులవలన జయము చేకూఱదు. దండకారణ్యంబున నీతండ్రిని జంపిన పగసాధింప వచ్చితివిగదా. అతఁడు చన్నవలనను నీవును బోనున్నా' వనెను. మకరాక్షుఁడు కోపప్రచండుఁడై రామునిపయి శరపరంపరలు గురిసెను. రాముఁడు ప్రతిశరంబులు వైచి వానినెల్ల దుత్తునియలు గావించెను. వారి యుద్ధముఁ జూడఁగోరి దేవదానవాదు లాకసంబునఁ దీరిరి. రామమకరాక్షులు నేఁతకు మాఱునేఁత యొనర్చుచు క్షణక్షణప్రవర్ధమాన తేజోవిశేషులగుచు రణరంగమెల్ల శరాచ్ఛాదితమొనర్చిరి. రాముఁడు మకరాక్షుని విల్లు ద్రుంచి తదీయ రథాశ్వసారథులను హరించెను. మకరాక్షుఁడు విరథుఁడై నేలనిలిచి యుగాంతకాలాగ్నిప్రభాదుర్నిరీక్ష్యంబును సర్వభూతసంత్రాసకరంబునైన మహాశూలంబును ద్రిప్పి రాఘవుని వైచెను. దాశరథి బాణత్రయంబున దానిని ద్రుంచెను. రాముని లాఘవంబునకు గగనస్థులు సాధువాదంబులు పల్కిరి. మకరాక్షుఁడు తనశూలమట్లగుటకు మండిపడి ముష్టి సవరించి రామునిపయికి నురికెను. రాముఁడాగ్నేయాస్త్రంబున వానిని సంహరించెను.

## —♦ ఇంద్రజిత్తు మూఁడవ యుద్ధము ♦—

మకరాక్షుఁడుగూడ చన్న సంగతి రావణుఁడు విని పండ్లుగీఁటి యౌడుగఱచి కర్తవ్యమాలోచించి యింద్రజిత్తును రావించి 'నాయనా! రామలక్ష్మణులు నీకుఁదక్క నన్యులకు సాధ్యులుగారు. దృశ్యాదృశ్య

యుద్ధంబులందు నీకు సాటిగాబుగాఁడు. ఇంద్రజేతకు నీకు పేరులెక్కగా దనెను. ఇంద్రజిత్తు తండ్రియాజ్ఞఁ దలఁదాల్చి యజ్ఞభూమికిఁ జని యథావిధి హోమముఁ గావించి దేవదానవరాక్షసతర్పణంబులు సలిపి యంతర్ధానశక్తిని బడిసి రథారూఢుఁడై లంకనుండి వెడలి 'కామిథ్యామునులను వధించి నాతండ్రికిఁ బ్రీతియొనర్తుఁ గాక ; ఉర్వీతలంబు నిర్వానరంబగుఁగాక' యని పలికి రణరంగముఁ జొచ్చి యంతర్హితుఁడై సంతతధారాపాతంబుగా రామలక్ష్మణులమీఁదఁ దీవ్రబాణవృష్టిని గురిపించెను. రాజపుత్త్రులు తమయస్త్రశక్తినెల్ల మెఱయించి దివ్యాస్త్రంబులు వైచిరి. ఇంద్రజిత్తు ధూమాంధకారంబును గల్పించి నింగియెల్లఁ గప్పి యందుఁ దానదృశ్యుండై యుద్ధమొనర్పసాగెను. దానంజేసి రాఘవులబాణంబులకు నతఁడు గుఱిగా నుండెను. అతఁడమ్మాయాప్రభావంబున నక్షతుండగుచుఁ దనక్రూరనారాచంబులచేత రామలక్ష్మణుల నిలువెల్లఁ జించుచుండఁగా వారాయుద్ధరతి సహింపఁజాలక చెరియొకబాణంబు నభిమంత్రించి వైచిరి. ఆశరద్వయము జివ్వునఁ జని యంతర్హితుండై యున్న యింద్రజిత్తును వెదకివెదకి సాధించి వానిమర్మస్థానంబులను భేదించి తదీయరక్తసిక్తములై నేలరాలెను. ఇంద్రజిత్తు కడుంగడు నురవడించి యొకచో నిలువక సమరభూమియెల్లఁ దిరుగుచు బాణంబులను బుంఖానుపుంఖంబులుగా వైవసాగెను. వానరులు గుంపులు గుంపులుగాఁ గూలఁజొచ్చిరి. ఇంద్రజిత్తుగావించు మాయాయుద్ధంబునకు లక్ష్మణుఁడు కుపితుఁడై 'అన్నా ! ఇఁక మిన్నకుండరాదు. బ్రహ్మాస్త్రంబు వైచి రాక్షసలోకంబునెల్ల భస్మీభూతమొనర్తు' ననెను. రాముఁడామాటవిని 'తమ్ముఁడా ! ఒక్కకూళకుఁగా రాక్షసులనెల్లఁ బరిమార్చుట యుక్తము గాదు. ఉదాసీనుని రణభీరువై దాఁగిన వానిని వధించుట రణధర్మము గాదు. ఈనికాతుని వధించు యత్నమొనర్చెదము. మాయాబలంబు నాశ్రయించి యజేయుండ నని యితఁడు విఱ్ఱవీఁగుచున్నాఁడు. రామబాణమెందున్నను వదలదను సంగతి యితండెఱుఁగఁడు' అని పలికెను. రామసంకల్పంబు నింద్రజిత్తు గ్రహించి వెంటనే రణరంగమును వదలి లంకకుఁజనెను.

## —• మాయాసీతను వధించుట •—

ఇంద్రజిత్తట్లు చన్నను కుంభకర్ణాదివీరవధాస్ఫూర్ణము వానిని నిలువ

నీయదయ్యెను. అతఁడు క్రోధతామ్రేక్షణుండై పశ్చిమద్వారంబునఁ బురము వెలువడి వచ్చి నికుంభిలాయాగంబొనర్ప నిశ్చయించి తన్నిర్విఘ్న పరిసమాప్తిగా నుపాయంబూహించి మాయాసీతను సృజించి రథంబుమీఁద నెక్కించి యామెను వానరులమ్రోలఁ జంపుతలంపుతోఁ జనెను. ఇంద్రజిత్తు మరలవచ్చుట కపివీరులు గాంచి యుద్ధసన్నద్ధులైరి. హనుమంతుఁడు దురాసదమైన పర్వతంబును గైకొని సేనాగ్రభాగంబునకు వచ్చి, జడలు కట్టినకచభారంబుతో నుపవాసంబులఁజిక్కిన నెమ్మొనితో మాసినకట్టుపుట్టముతో నింద్రజిద్రథంబుపయినున్న స్త్రీనిజూచి యామెయందు సీతాదేవిపోలికలుంగాంచి 'సీతాదేవి నీకూళి యిట్లుతెచ్చిన తలంపేమో' యని తలపోసి యామెకుఁగా దుఃఖంబును వానికటుకుఁదనంబునకుఁగాఁ గోపంబును బొంది రావణిమీఁదికి నురికెను. రావణాత్మజుఁడొకచేత నామె శిరోజములుపట్టి యొకచేతఁ గత్తిదూసెను. ఆమె రామా! రామా! యని విలపింపసాగెను. హనుమంతుఁడు దుఃఖోద్విగ్నుఁడై 'హా! దురాత్మా! పరమపతివ్రతామణిని స్త్రీను గేశజాలముఁ బట్టి యీడ్చి చంప నుంకింతువా? అసురాధమా! ఈయకార్యంబు నొనర్ప లజ్జింపవా? ఇలువాసి రాజ్యం బెడసి పతిసంరక్షణంబునకు దవ్వయి రక్కసిచేతఁజిక్కి వగచుచున్న దీను రాలి నిట్లొనర్ప ధర్మమా? ఈమె నీకేమికొగ్గు గావించెను? ఈమెకు గోరంతనొప్పిగల్గెనేని నీవు జీవింపవు. నీతలంపు లోకగర్హితము. ఆకారణంబున లోకవధ్యుండవైతివి. స్త్రీహత్యాపాతకులు పోవుపట్టి కుత్సిత లోకంబు నిన్ను నిరీక్షించుచున్నది' అని పరుషంబుగా నుడివి వానిని దాఁకెను. హనుమంతుని వెన్నాడి వానరసైన్యంబు నురవడించెను. ఇంద్రజిత్తు వారినెల్లఁ దీవ్రబాణసంక్షుభితులుగా నొనర్చి 'హనుమంతా! ఎవతెకు, గా మీరెల్లరు లంకపయి దాడివచ్చితిరో యాపాపాత్మురాలి నిదిగో నీ కట్టెదుట వధించుచున్నాను చూడుము. ఏనాఖడ్గంబీమె వెచ్చని నెత్తుట త్రావనున్నదో యా యీఖడ్గము రామలక్ష్మణసుగ్రీవవిభీషణులరక్తంబును నీరక్తంబును వెనువెంటఁ ద్రావును. స్త్రీవధయంటివి. రణశాస్త్రజ్ఞానము గోరంతగల్గినచో నిట్లాడవు. శత్రువులకు నెన్నివిధంబులఁ బీడఁ గలిగింపనగునో యవి యెల్ల రణశాస్త్రంబంగీకరించును. మావైరికి సీతావధకన్నఁ బీడాకరకార్యము లేదు' అనిపలికి గోడుగోడుమను చున్న యామెను గుత్తుక

తెగవైచి 'వానరా! మీరామునిప్రియురాలి గతిఁ గన్నారఁ జూచితివి గదా. ఇఁక మీశ్రమ యెల్ల నుడుగవచ్చు' నని వచించి సింహనాద మొనర్చెను. వానరులు శోకత్రాసపరీతులై పాఱఁజొచ్చిరి. హనుమంతుఁడు వారిని మరలించి యసురసైన్యము నురుమాడి దుఃఖకోపంబులు పట్టఁజాలక పెనుబండ నెత్తి యింద్రజిత్తుపై వైచెను. సారథితనరథంబును దాతి గుఱినుండి తొలఁగించెను. ఆబండ గుఱితప్పి యందున్న రక్కసులమీఁదఁ బడి వారినెల్ల ముద్దగావించి భూమివ్రచ్చి పాతాళముఁ జొచ్చెను. వానరులు వివిధగతుల గర్జించుచు శిలావృక్షంబులు గైకొని పిశితాశనులను గలంచిరి. ఇంద్రజిత్తు నిజసైన్యదురవస్థఁ జూచి క్రోధప్రచండుఁడై నిశిత సాయకంబులఁ గపివీరులఁ బెక్కుర వధించెను. రాక్షసులు విజృంభించి కోఁతిదండుఁ జొచ్చి చేఁజిక్కినవారిని మట్టుపెట్టసాగిరి. వానరులును జెలరేఁగి యసురులను జీకాకుపఱచిరి. రాక్షసులు వారి దాడికి నోర్వలేక పఱచిరి.

హనుమంతుఁ డిట్లుగావించి 'వానరోత్తములారా! రామునకుఁ బ్రియంబొనర్పఁ గోరి జనకరాజసుతను ఖైదునుండి వదలించుటకుగా సర్వత్యాగ మొనర్చి యిందువచ్చి రాక్షసులతోఁ బెనుపోరునకు సమకట్టితిమి. మనయెదుటనే యామెను ఖలుఁడింద్రజిత్తు వధించెను. ఇఁక మనయుద్ధము నిరర్థకము. సీతావధను రామసుగ్రీవులకు విన్నవించి వారియాజ్ఞ సేయుట యుక్త' మని పలికి వానరసైన్యంబును మరలించి దుఃఖభారంబున నడువలేక నడిచి రామునొద్దకుఁ బోయెను.

అట రాముఁడు వానరరాక్షస యుద్ధారావంబులు విని జాంబవంతుని బిలిచి 'వానరేశ్వరా! అదిగో యావంకనుండివచ్చు యుద్ధధ్వనులు చెవులఁ గీడ్పఱచుచున్నవి. అచ్చట హనుమంతుఁడు దుష్కరయుద్ధ మొనర్చుచున్నట్లు తలంతును. నీవటకుఁ బోయి యొంటరిగాఁ బోరుచున్న మారుతికిఁ దోడ్పడు' మనెను. జాంబవంతుఁ డామేరకు వానరసైన్యము వెంటఁగొని పశ్చిమద్వారమువంకకుఁ దరలెను. వానికి మారుతి మార్గమధ్యంబున నెదురయ్యెను. అతనిని జుట్టి కపివీరులు రోజుచు వచ్చుచుండిరి. హనుమంతుఁడంత జాంబవదాదులను మరలించి వేవేగ రామునొద్దకుఁ బోయి

బోరున నేడ్చుచు 'ఖలుఁడింద్రజిత్తు సీతాదేవిని బట్టితెచ్చి రణరంగంబున మాకట్టెదుట నామె గొంతుకోసెను. అది చూచి యుద్భ్రాంతుండనై యేమియుఁ దోఁపక యిందు వచ్చితి' నని పలికెను.

## — లక్ష్మణ విలాపము —

రాముఁ డామాటతోడ భిన్నమూలమైన వృక్షమట్లు తటాలున నేలఁ గూలెను. వానరులు వానిని పద్మోత్పలసుగంధిసలిలంబులఁ దేర్చసాగిరి. లక్ష్మణుఁడు వానిని నిజహస్తంబులతోఁ గూర్చియెత్తి తొడపై నిడుకొని 'కటా! ధర్మపదనిష్ఠుని వ్యసనపరంపరలు పైకొనుటఁ జూడఁగా వింత యగుచున్నది. ఆవ్యసనంబులన్నియో సామాన్యములగునేని యెట్లో సహింపనగును. ఎల్లయనర్థంబులనుఁ దలఁదన్నునట్టి భార్యావధరూప మహానర్థకము సంభవించెను. దీనినోర్చుటెట్లు? ధర్మపరుఁ డిట్లగుటయు నధార్మికుఁడు రావణుఁడు సుఖైకభోగియగుటయుఁ జూడఁగా భ్రాంతిగలుగుచున్నది. ధర్మము సకలానర్థకంబులనుండి రక్షించుననిరి.* ఆమాట నేఁడు కల్లయయ్యెను. ఇఁకనదానిని మన్నింపనేల?' యని చింతించి కలుషితాంతఃకరణుఁడై 'అన్నా! ధర్మము ధర్మంబని కలువరించి హస్తగతరాజ్యంబును ద్యజించి యిన్ని కడగండ్లు తెచ్చికొంటివి. ఆకైకేయీదశరథులు నీకింత యెగ్గుగావించిరని వారియెడ నుంతేనియుఁ గలుషబుద్ధిని వహింపవు. జితేంద్రియత్వసన్న్యాసంబులకు మార్గప్రదీపకుండవై వెలసితివి. అట్టి నిన్ను నీధర్మవృత్తి యిట్టివ్యసనంబులనుండి రక్షింపనినాఁడు దానియందు లోకంబునకుఁ బ్రమాణబుద్ధి జనించునా? నామట్టుకు నేనిఁక ధర్మంబును నమ్మఁజాలను. ధర్మమనునది యుండుటయు దానిని నమ్మినచో సుఖమగుటయు నమ్మనినాఁడు దుఃఖమగుటయు శాస్త్రసమ్మతమనిరి. పెద్దలు నట్లే నొక్కి వచించిరి. అది కేవలలోకవ్యవహారార్థము నిర్మితమైన శశవిషాణముగా భావింతును. నేనే గాదు; నీవృత్తియు నీగతియుఁ గన్నారఁ జూచిన వారెవ్వరీవచనంబును విశ్వసింతురు?!

ధర్మాధర్మంబులకు సుఖదుఃఖములు ఫలంబులగునేని యీవిపరీతమున కేమందువు? ఏనిర్ణయంబునకైనను బ్రత్యక్షానుమానశాబ్దంబులను బ్రమాణంబు

లను గ్రహింతుము. ధర్మాధర్మంబులు కంటికిగోచరించునవి గావు గావున వానిని నిశ్చయించుటకుఁ బ్రత్యక్ష ప్రమాణం బుపయోగింపదు. అతీంద్రియంబుల ననుమాన ప్రమాణంబున సాధింపవలయునందువా ? కార్యమును బట్టి కారణము నూహించుట యనుమాన ప్రమాణమగును. నీవు ధర్మంబును జవదాఁటవు. అట్టి నీకుఁ బుట్టువు మొదలు నేఁటివఱకు దుఃఖములే గాని శుభంబులు గలుగవు. దీనిఁబట్టి యెట్లూహింపవలయును ? స్త్రీవైరి రావణాసురుఁడన్ననో యతఁడు పుట్టువుదొట్టి గావించిన యధర్మంబులకు మేరయే లేదు. అట్టివాఁడు నిత్యకళ్యాణ పరంపరల సుఖించుచున్నాఁడు. దీనిఁ బట్టి యేమితలంపవలయు ? మీయిరువురజీవితంబులను బట్టి విచారించినచో ధర్మాధర్మంబులకు సుఖదుఃఖంబులు ఫలంబులనుటకు మాఱుగా దుఃఖసుఖంబులు ఫలంబులని నిశ్చయింపక తీఱదు.

అట్లుకాదేని నీవే యధర్మవర్తివనియు నతఁడే ధర్మమూర్తియనియు నైనఁ జెప్పవలయును. అట్లగునేని శాస్త్రములను మూటగట్టవచ్చును. ఏలయందువా ? పరస్త్రీహరణాదు లధర్మంబులని శాస్త్రముఁ ఘోషించును. రావణుఁడు పరస్త్రీహరణాదు లెన్నోచేసెను. అధర్మమునకు వ్యవస్థితమైన దుఃఖరూపఫలమొక్కటియు వానికిఁ గలుగదు. ఇఁక శాస్త్రమును నమ్ముటెట్లు ? శాస్త్రమునకును లోకానుభవంబునకును సంబంధము గానరాదు. స్వానుభవంబును గాదని యెవరో వ్రాసిన దానిని నమ్మి కష్టపడనేల ? ధర్మాధర్మంబులకు వ్యవస్థితసుఖదుఃఖంబులు ఫలంబులగునేని లక్షణాన్వయమగును. తద్విపరీతము వ్యాప్తిభంగమగును. మీ యిరువురయందు విపరీతఫలవ్యాప్తి గానవచ్చుచున్నది. ఇదియుఁ దద్భావంబునే దృఢపఱచును.

శబ్దప్రమాణ మెంతమాత్రము నిలుచునో చూతము. ధర్మాధర్మములు కర్మస్వరూపములా ? కర్మజన్యాతిశయములా ? కర్మస్వరూపములగునేని యాకర్మములే స్వయముగా బాధింపవలయును. ధర్మాధర్మంబుల విషయంబున నట్టిదిగానరాదు. ఎట్లందువా ? ఒకనిని జంపినప్పుడు చంపుటయనుకర్మము చంపుపర్యంతము మాత్రముండి యాకార్యముతోడ నడియు నశించుచున్నది. నష్టమైనదానివలన బాధగలుగనేరదు. ధర్మాధర్మరూప

కర్మములు తత్తత్కార్యపర్యంతమాత్రలై నశించిపోవును. నామావశిష్ట ములు ఫలకారులుగా నేరవు. ధర్మాధర్మములు కర్మస్వరూపములుగావని యుఁ గర్మజన్యాతిశయములనియు వచింతువా ? కర్మములు క్షణికములు ; క్షణికములవలనఁ గాలాంతరఫలము గలుగనేరదు. కావునఁ గర్మజన్యఫలము గలుగుట దుస్తరము. కర్మములు స్వయముగా ఫలమునీయవనియు దత్కా రయితృసాక్షిభూతమైన దైవను ఫలమిచ్చుననియుఁ బలుకుదువా ? అట్లగు నేని సర్వకర్మములకు దైవప్రేరకమగును. ఎవనివలనఁ బ్రవృత్తిగలుగు నో యతఁడే తత్ఫలభాగి కాకమానఁడు. అప్పుడు కర్తయగు జీవునకుఁ గర్మఫలసంబంధముగలుగదు. రాజాజ్ఞను భటుఁడట్లు దైవప్రేరకంబును జీవుఁడగు కర్త యొనర్చును. భటునికార్యఫలంబు రాజునకుఁ జెందునట్లు జీవునికర్మఫలము దైవమునే చెందును. జీవుడు నిర్లిప్తుఁడై యుండును. అవి కర్మజన్యాదృష్టరూపంబులనియు ఫలంబు నవియే కలిగించుననియుఁ జెప్పు దువా ? అట్లగునేని అవి స్వయముగా ఫలంబు నిచ్చునా ? పరాశ్రయం బున నిచ్చునా ? అదృష్టమసద్భూతము. అసద్భూతమనగా లేనిదనుట గదా. లేనిది యుండుట ఫలమునిచ్చుట యెట్లు పొసగును ? కావున నయ్యవి స్వయముగా ఫలము నిచ్చునని చెప్పుట యుక్తముగాదు. ధర్మాధర్మంబులు పౌరుషాశ్రయమున ఫలప్రదములగునందురా ? అట్లగునేని యవి దుర్బ లంబులు నసమర్థంబులునగును ; పౌరుషమే బలవత్తరమగును. ఆపక్షమున దుర్బలములైన వానిని సేవించుట వృథాశ్రమగదా ? బలవత్తరమైన పౌరు షము నాశ్రయించుట యుక్తముగదా ? ధర్మాధర్మముల తత్త్వమంతసులభ గ్రాహ్యము గాదనియు, వట్టియూహలకునందనట్టి విషయంబులనుగూర్చి విపరీతవ్యాఖ్యలు చేయరాదనియుఁ దత్త్వదర్శనులు లోకోపకారార్థము నిశ్చయించినమతమే పరమయోగ్యమనియు, వారిమతప్రకారము ధర్మమే పరమాశ్రయణీయ మనియు ధర్మమే సత్యము సత్యమే ధర్మమనియు వచింతురా ? సత్యదూరుఁడు ధర్మబాహ్యుఁడగుఁగదా ? ధర్మబాహ్యుఁడు శిక్షణీయుఁడుగదా. నాఁడు దశరథుఁడు నీకుఁబట్టముఁ గట్టెదనని నిండు సభలోఁ బలికి తప్పెను. అట్టిసత్యదూరుని నీవెట్లు సహించితివి ? ఆయన యసత్యమాడుటయేగాక వంశక్రమాగతధర్మమునకు వ్యతిక్రమమొనర్చి పెద్ద వానిరాజ్యమును రెండవకొడుకునకుఁ గట్టెను. అంతియగాదు. కడఁపారఁ

గన్న సుతుని వనములపాలుచేసెను. దశరథుఁడు జీవకారుణ్య హీనుండను టకు వేఱు నిదర్శనము వలయునా ? అట్టివానిని గౌరవింతువు. ఇది సత్య పరిపాలనమగునా ? అన్నా ; నీచరిత నాకుసుంతయును బోధపడదు. ఇవి తలంచుకొలఁది నాబుద్ధి తాఱుమాఱగుచున్నది.

ధర్మాధర్మములుగలవుపో, అవి త్రికాలాబాధితములు గాఁజాలవు. కావున వానిని గాలానుసారముగాఁ బాటింపనగునేగాని వేఱుగాదు. దృష్టాంతమువలయునా ? శచీపతి సురరాజుగాని సామాన్యుఁడుగాఁడు. ధర్మానుష్ఠానము వానికెంతో ముఖ్యమగుఁగాని వేఱుగాదు, అట్టివాఁడు విశ్వరూపమహర్షిని జంపి తత్పాపపరిహారార్థము యజ్ఞమాచరింపఁడా ? యజ్ఞకార్యము ధర్మమైనను మునిహననము ధర్మముగాదుగదా. కావున సురేంద్రుఁడు కాలానుసరముగా ధర్మాధర్మంబులను బాటించెను. ఒండు చోఁ గర్తకు చేటగును. ఇది నిస్సంశయము.

ధర్మమనునది యొకటి కలదనుటే యసంగతము ఒక వేళనట్టిది గల దన్నను నదే ప్రాధాన్యముగాదు. అన్నిటికి నర్థము మూలము. అర్థహీనుఁడు ధర్మాచరణమునకు సమర్థుఁడు గానేరఁడు. ఇది సర్వజనవిదితము. అర్థసంపాదనంబునకు రాజ్యమెంతయుఁ దోడగును. దానిని బుద్ధిపూర్వకముగాఁ ద్యజించితివి. ఈకార్యము ధర్మమూలవిచ్ఛేదముగాదా ? రాజ్యమువలన నర్థమెట్లువచ్చునందువా ? జనులు స్వార్జితంబున నాఱవభాగము నీనికి సమర్పింతురు. ఆదాధనమునుగూర్చి స్వధర్మమైన ప్రజాపరి పాలన మొనర్చును. అర్థములేనినాఁడు భృత్యాదులను భరింపఁదరముగాదు. పరివారములేకున్న రాజ్యపాలనంబు పొసఁగదు. అర్థమును నిరసించుట ధర్మమును నడ్డగించుటయేగాక దోషమును వరించుటగూడనగును. ఎట్లందు వా ? ప్రాణులెల్ల సౌఖ్యార్థము శ్రమింతురు. అర్థమువలన సుఖము చేకూఱును. కావుననే 'జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు ధనమువిద్యఁగూర్పఁ దలపవలయు' నని పెద్దలు వచించిరి. ధనము దొరకని నాఁడు శౌర్యాదులొనరించిరైనను దానిని సాధింపుచున్నారు. నీవో యింటికి వచ్చిన సిరికి మోకాలొడ్డితివి.

"క॥ ఏవరునకు విత్తముగల, వాఁడవుఁడు కులీనుఁడధికుఁ డార్యుఁడతండే,
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచనంబుననిలుచున్,"

అని బాల్యమునందే గఱచితిమి. ఇది యెఱిఁగి యెఱిఁగి రాజ్యంబును నిరసింప నీవదియెట్లొప్పునో యూహింపరాదు.

మఱియు నర్థవంతుని ధర్మకామార్థములు మూఁడు వలచి సేవించును. అర్థవిహీనుని వంకయేని యవి తలద్రిప్పవు. ఇదియునుగాక నర్థమువలన శమదమహర్షక్రోధాదులెల్ల శోభిల్లును. నిర్ధనునకు నవియుండియు రాణింపవు. అర్థమైహికసుఖములేగాక యాముష్మికసుఖమును గూడ సంపాదించును. ఇహపరసుఖసాధనభూతమైన యాది దుర్దినంబున సూర్యుఁడట్లు నీయెడ నభావమయ్యెను. అన్నా! చేయనేల? ధర్మమే పరమముగా భావించి యర్థమును నిరసించిన నీదోషము ప్రాణాధికయైన నీభార్యను హరించెను. గడచినదానికి వగచి ఫలములేదు. ఇంతకు నింద్రజిత్తు కారణము. వానిని విడువరాదు. అన్నా! నావగపట్టఁజాలక యేమో ప్రేలితిని, మహాత్ముల త్రోవలు తెలియనువాఁడ. ఋషులు వానింగూర్చి యథామతి నూహింతురు. ఆజ్ఞయిమ్ము; సీతానిధనప్రతీకారంబుగా లంకానగరంబును సరాక్షసేంద్రముగా దహింతు' నని రాముని ప్రార్థింపసాఁగెను.

## —♦ విభీషణుఁ డింద్రజిత్తుమాయను తెల్పుట ♦—

అంతలోన విభీషణుండచటకు వచ్చి దుఃఖపరవశుఁడైన సౌమిత్రిని గన్నీరునించుచు మూఁగియున్న వానరులను దమ్ముని చేతులలో వ్రాలియున్న రాముని జూచి వ్యథాక్రాంతాంతరంగుఁడై సంగతియేమని విచారించెను. లక్ష్మణుఁడు వానిని జూచి బాష్పప్లుతలోచనుఁడై 'ఏమని చెప్పుదు? ఇంద్రజిత్తు చేసేతల సీతాదేవిని వధించెను. అది హనుమంతుఁడు కన్నారఁ జూచి వచ్చి చెప్పెను. మాస్థితి యిట్లయ్యె' నని హీనస్వరమునఁ బలికి మఱియేమో చెప్పనుండెను. విభీషణుఁడు వానిమాటకు నడ్డపడి 'రామా! ఇంత వెఱ్ఱితనముండునా? మున్నిటనిలుకింపవచ్చునుగాని సీతాదేవిని వధింపనగునా? మఱియు రావణుండది యెంతమాత్రము నిచ్చగింపఁడు. ఆ దురాత్ముని భావము నాకు స్పష్టము. ఎన్నో విధముల బ్రతిమాలినను సీతా

జీవిని విడువనుగూడ సమ్మతింపని వాఁడామెవధకు నిశ్చయించునా ? వధ సంగతి యటుండనిమ్ము. ఆమెను దాఁకి బ్రదుకుదురా ? రాక్షసమాయ కా మెయెడ సాగదు. ఇంద్రజిత్తుమాయ నెఱుంగక హనుమంతుఁడు మోస పోయెను. వాని ప్రమాదము మీకు దుఃఖకారణమయ్యెను. సంగతి వినుము. లెక్కింపఁదగిన వీరుఁడింద్రజిత్తు దక్క లంకలో నెవ్వరును లేరు. ఇంద్రజిత్తు తనబలంబునెల్ల వ్యయించి గత్యంతరముగానక జయార్థియై నికుంభిలాలయంబునకుఁ జని యచ్చట మహాహోమముఁ గావింపఁ దలపెట్టెను. అతఁ డచ్చటకుఁ జన్నచో మనవానరులతో ఢీకొను ప్రతివీరుఁడు లేఁడు. అతఁడు వచ్చునందాక మిమ్ముల నేమరింపఁ దలఁచి మాయాసీతను గల్పించి వధించెను. వానిమాయలకు మీరు మోసపోయితిరి. మఱియొక సంగతి గలదు. వాఁడు తనహోమంబును నిర్విఘ్నపరిసమాప్తిగావించి వచ్చునేని వానిని గెలువరాదు. హోమవిఘ్నమును శంకించి యాజిత్తులమారి యీపన్నుగడ పన్నెను. వాని హోమంబును సాగనీయరాదు. మనము మునుమున్న నికుంభిలాలయంబునకుఁ బోయి వానియత్నంబును భంగపఱచుట యొప్పును. రామా ! భ్రమారచిత మైన యీసంతాపంబును మానుము. లక్ష్మణుని వెంట మమ్ముఁ దరలింపుము. మేము చని నిశితశరంబుల వానినిఁ గూలంతుము. వాఁడు హోమంబును జాలించి యుద్ధముఖుఁడగును. ఎప్పుడు వాని యీహోమము భంగమగునో యప్పుడు వానికిఁ జావు సిద్ధము. జాగువల' దని నొక్కి చెప్పెను.

రాముఁడు దుఃఖవశుఁడు గావున విభీషణుని జక్కగా విని గ్రహింప లేక' మిత్రమా ! నీవచించినది నాకు బుద్ధిస్థముగాదు. మఱల వివరింపు' మనెను. విభీషణుఁడట్లే గావించి 'ఇంద్రజిత్తు బ్రహ్మవలన బ్రహ్మశిరో నామకమహాస్త్రంబును గామగమనరథాశ్వంబులను బడసెను. అతఁడు నికుంభిలాహోమంబును నిర్విఘ్నముగా నొనర్చివచ్చునేని వానివలన మన యెల్లరకు మరణము సిద్ధము. ఆహోమంబును బ్రారంభించి తత్పరిసమాప్తికిఁ బూర్వమే యతఁడు సాయుధుఁడై యెవనితో యుద్ధమొనర్చునో యతనివలన వాఁడు గడతేరును. హోమపరిసమాప్త్యనంతరము వానినెవ్వఁడుఁ జెనకఁ జాలఁడు. ఇది విరించి వరము. జాగుసేయరాదు. ఇంద్రజిత్తును వధింతు మేని రావణుఁడు చచ్చినట్టే యగు' ననెను.

రాముఁ డావచనంబులు విని 'విభీషణా! ఇంద్రజిత్తు మహా మాయావి. మాయాబలంబునకుఁ దోడుఁగా బ్రహ్మాస్త్రబలముగూడ వానికిఁ గలదు. అంతటి రణవిద్యాంసులు పెక్కురు గలుగరు. అదృశ్యుఁడై వాఁడు గగనాంతరమున నిలిచి యుద్ధ మొనర్చునప్పుడు వానిని గుఱుతించి వేయ శక్యముగా' దని పలికి 'లక్ష్మణా! సుగ్రీవహనుమజ్జాంబవదాదులను గూడి సకలసేనాసమేతంబుగాఁ జని మాయాబలవిశారదు నింద్రజిత్తును వధింపుము. విభీషణుఁడు నీవెంటనుండు' ననెను. లక్ష్మణుఁడు ఖడ్గకవచాదులు ధరించి కాంచనాలంకృత ధనుర్బాణంబులు పట్టి యుద్ధసన్నద్ధుఁడై రాముని పాదంబులకు నమస్కరించి 'అన్నా! నాయాశరంబులు రావణిని జించి చెండాడు' నని పలికి వానికిఁ బ్రదక్షిణముగావించెను.

ఉ॥ ధర్మముతోడునీడయి సదానిను రక్షణసేయుఁగాత్రితక్
కర్మలసాక్షి నీకెలనుగాచెడుగాత సమస్తదిక్పతుల్
నిర్మలు నిన్ను బ్రోచుత మునీంద్రులదీవెన లొనుగాత, యా
దుర్మతి నీశరార్చులకుఁ దూలినశించెడుగాత, లక్ష్మణా!

అని దీవించి పంపెను.

అంతట లక్ష్మణుఁడు నికుంభిలానామకచైత్య వృక్షంబు నొద్దకుఁ బోయి యటఁ జిత్రవిచిత్ర వ్యూహాభీలంబును ధ్వజగహనంబును మహారథదురాసదంబునునై చీఁకట్లు గప్పినట్లు దట్టముగానున్న శత్రుసైన్యంబును జూచెను. విభీషణుఁడు లక్ష్మణునితో 'వీరాగ్రణీ! అదిగో యచ్చట యింద్రజిత్తు యాగమొనర్చుచున్నాఁడు. అచ్చటకుఁ బోవుటకై యారాక్షససైన్యమును మొదటఁ బరిమార్పవలయును. అంతట నింద్రజిత్తు కంటఁ బడును. వానినప్పుడు మారింపు' మనెను.

## — నికుంభిలాయాగభంగము —

లక్ష్మణుఁడంతట,

"మ॥ పటునారాచపరంపరా ప్రసరదర్పంజేర్పడంజేర్చి త
ద్భటసంఘంబును ఘోటకవ్రజము శుంభత్స్యందనౌఘంబు న
ద్భటకుంభిప్రకరంబునుం బొదివి విధ్వంసంబు గావించి నే
త్తుట జొత్తిల్లెడునట్లు చేసెను సమిద్భూభాగమత్యుగ్రతక్॥"

వానరులును శిలావృక్షధరులై రక్కసులను గవిసిరి. రక్షోవీరులు గదా ఖడ్గశక్తితోమరహస్తులై ఢీకొనిరి. ఇరుదళంబులకుఁ మహాతుములంబైన యుద్ధమయ్యెను. హనుమంతుని ప్రేటులకు రక్కసులుక్కచెడి పడిరి. హతశేషులైన యసురులు మారుతిని ముట్టడించి యీఁటెలతోఁ గసెలతో శతఘ్నముద్గరంబులతో బరశ్వధ పిండివాలంబులతో వానిని బ్రహరించిరి. హనుమంతుఁడు క్రోధావతారుఁడై యందఱకు నన్నిరూపంబుల ఘోరసంగ్రామమొసంగెను. వానియుద్వేగంబునకు రాక్షసులు చెల్లాచెదరై యఱచుచుఁ బఱచిరి. ఆయలజడి యింద్రజిత్తును గలంచెను. వాఁడు సారథి వంకఁ జూచి 'హనుమంతుఁ నుపేక్షింపరాదు.' అని పలికి రథమెక్కి యావంకకుఁ బోయెను' విభీషణుఁడది చూచి 'లక్ష్మణా! అదిగో యింద్రజిత్తు రథగతుఁడై హనుమంతుని వధింపఁ బోవుచున్నాఁడు. జాగువలదు. జీవితాంతకకరంబులైన శరంబుల వానిని సంహరింపు' మని పలికి యాచోటికి సౌమిత్రిని దోడ్కొని పోయెను. లక్ష్మణుఁడట్లు పోయి 'రావణాత్మజా! రారమ్ము యుద్ధంబునకు; సరియైనసమరమిమ్ము' అనెను.

—♦ ఇంద్రజిత్తు విభీషణుని మాటుట ♦—

ఇంద్రజిత్తు విభీషణుని జూచి 'రాక్షసజన్మమెత్తితివేగాని నీకుఁ గులాభిమానము గూడ గలుగదు. లంకలోఁబుట్టి పెరిగి లంకానాశనంబును గోరు నీయట్టి ఖలుఁడుండఁడు. నాకుఁ బినతండ్రివయ్యుఁ గొడుకుపైడ ద్రోహము సంకల్పించితివి. దుర్మతీ! బంధుత్వంబును బాటింపవు; సౌహార్దంబును దలంపవు; కులధర్మంబుల లక్ష్యపెట్టవు. స్వజనంబును ద్యజించితివి; అంతతోనుండక వైరినాశ్రయించితివి; బంధువులకు శోచనీయుండవును సాధువులకు నిందనీయుండవు నైతివి. స్వజనసంవాసమెడసి నీచనరాశ్రయముఁ గోరుటకు లజ్జింపవా? నీమతిచెడెనా? పురుషుఁడు గుణహీనులైనను దనవారినే గూడునుగాని యొరులను గుణాధిక్యులైనను డాయఁ జనఁడు. పరుఁడు తనవాఁడగునా? ఇంతమాత్రము దోఁపదా? ఎవఁడు తన్నుగానక స్వపక్షమెడసి పరపక్షముచేరునో వాఁడు తుట్టతుదకు వారివలననే నశించును. నిశాచరా! నిన్ను రావణానుజుఁడనుటకు సిగ్గగుచున్నది. నీవు విమర్శమెఱుఁగక నాతండ్రి నిన్ను సాకి సంత

రించెను. నైజము నిలువనీయదు. కావున నే నావైరిని నాహోమనాశార్థము న్యగ్రోధమూలంబునకుఁ గొని తెచ్చితివి. నీయట్టి దుర్మతియు దయారహితుండును శిలాకఠినహృదయుండును గూఢాపకారియు మఱియొండు గలఁడా?' యని పరుషంబుగాఁ బలికెను.

నావుడు 'దుష్టా! నన్నెఱింగియు నిట్లాడ సిగ్గులేదా? రాక్షసకులంబున జనించినను నాశీలము సాత్త్వికమే గాని యాసురము గాదు. అధర్మదారుణకర్మంబులు నాకు రుచింపవు. ధర్మచ్యుతుండును బాపనిశ్చయుండు నగు వాఁడన్నయగుఁగాక మఱియొకండగుఁగాక; వానిసహవాసము పాతకమునకే యగును. రోగగ్రస్తుఁడట్టివానినిఁ జేతికిఁ జుట్టుకొన్న పామునట్లు విసర్జింపవలయును. ఒండుచోఁ జేటొందును. హింసయుఁ బరధనహరణంబును బరస్త్రీగమనంబును మహాదురాచారములు. ఆపాపము లొనర్చు వానిని మండుచున్న యింటినట్లు వదలి దవ్వుపోవలయునందురు. మేలుగోరు వానిని శంకించుటయు నట్టి పాపమే యగును. ఈదుర్గుణములెల్ల నీతండ్రియందు సుస్థిరములు. అతఁడు మహర్షుల నెందఱనో నిష్కారణంబుగా వధించెను. ఇంతకన్న హింసగలుగదు; దేవతలనుగొల్లగొనెను; కన్నెల నెందఱనో చెఱిచెను. దీర్ఘక్రోధంబును బద్ధవైరంబును వాని నెడఁబాయవు. అన్యులమేలు సహింపఁడు. ఈదోషంబు లొండొండే జీవితైశ్వర్యంబులను హరించును. అన్నియుఁ గూడినేనిఁ జెప్పవలయునా? నీతండ్రియందు సుగుణంబులు లేవాయని యడుగవచ్చును. మేఘంబులు పర్వతంబులనువలె దోషంబులు గుణంబులను గప్పివుచ్చును. ఈదృశదోషదూషితుండు గావున సోదరుండనక వానిని త్యజించితిని. దుర్మతీ! నీవును నీతండ్రియు రాక్షసలోకవినాశంబునకుఁ గారణభూతులైతిరి. నీకంఠంబునఁ గాలపాశము తగిలియున్నది. ఆసన్నమరణుని నిన్ను నిందించియు ఫలములేదు. ఇఁక నికుంభిలాహోమమును మఱచిపొమ్ము. మాయాసీతను గల్పించి వధించి రామలక్ష్మణులను మోసగించితివి. నాకడ నీజిత్తులు సాగవు. శూరుఁడవేని లక్ష్మణునితోఁ బోరుము. అదిగో యమదూతలు నీయూడిగంబులకుఁ గాచియున్నారు. బాగుచేసియు ఫలములే' దనెను.

## —♦ ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధము ♦—

ఇంద్రజిత్తు క్రోధదుర్నిరీక్షుఁడై 'ఇదిగో చూడుము నాలావు-

ఆకసంబు వర్షంబునట్లు నాకార్ముకము బాణంబులను గురియుచున్నది. నా బాణాస్త్రములు తూలరాశింబోలె మిమ్ము దహించును. మీరుగా యమలోక ద్వారంబులను దెఱచియున్నారు.' అని విభీషణు నదిర్చి పలికి 'లక్ష్మణా! మొన్నటిసంగతి యింతలో మఱపయ్యెనా? నాటిరాత్రి మచ్ఛరవిద్ధులై శరణార్థులట్లు వ్రాలి పరితపించితిరి. తిరుగ నాతోడి యుద్ధంబునకు రా మీకు సిగ్గులేదా? మృత్యువు మిమ్ము నిలువనీయదు గాంబోలు' ననెను. లక్ష్మణుండామాటలకు వికారమొందక 'రాక్షసా! వాచాలతచాలును. మాటలు నోటితీఁటఁ బాపునేగాని కార్యమొనర్పవు. అన్నంత చేయువాఁడే నేర్పరి. పదరులు కొఱగానులకునగు. మమ్ము జయింప నీతరము గాదు. కార్యరూపంబున సాధింపఁజాలని దానిని వాగ్రూపంబున సాధించి తృప్తిచెందుము. దొంగయుద్ధమొనర్చినందులకు గా లజ్జింపక యెత్తిపొడుతువా? వీరు లెదుట నిల్చి పోరుదురు. పిఱికిపందలకు దొంగయుద్ధము లగును. ఎదయిచ్చి నిలిచితి; వలతివేని రమ్ము' అని వచించెను.

ఇంద్రజిత్తు క్రోధమూర్ఛితుండై

"చ॥ రణమున నుగ్రసాయకపరంపర భానుకులం బరామ ల
క్ష్మణ ముజగంబవానరము గా విలునేర్పును మద్భుజావిజృం
భణమునుమాపి తండ్రిమదిఁ బుట్టినచింతఁ దొలంగఁబట్టి కూ
ర్పణఖకు నిట్లుబాటిలిన బన్నమునీఁగుదు నేనవశ్యముక్ ॥"

అని వచించి,

లక్ష్మణునిమీఁదఁ దీవ్రశరంబులఁ బఱపెను. ఆబాణంబులు క్రుద్ధసర్పంబులపగిది విషజ్వాలలఁ గ్రక్కుచు సౌమిత్రి నిలువెల్ల గాడెను. లక్ష్మణుండు నెత్తుట జొత్తిల్లి విధూమాగ్నిక్రియఁ దోచెను. అందులకు నింద్రజిత్తు సంతసించి సింహనాదమొనర్చి 'లక్ష్మణా! ఇవిగో నీజీవితాంతశరంబులు వచ్చుచున్నవి. కాకులును గ్రద్దలును నీకుగాఁ దారాడుచున్నవి. అనార్యా! దురాత్ముండైన రామునకుఁ దమ్ముండనని నిక్కవలదు. వేయిరాములు గూడ నీకిప్పుడడ్డపడఁ జాలరు. నీరామభక్తి రక్షించునేమో చూతము. ఇదిగో నీతలఁదఱుగుచున్నాను. నీమొండెమును జూచి నీరాముఁడానందించుగాక' అనెను. లక్ష్మణుఁ డాబీరంబులకుఁ జలింపక 'కవితా

ధోరణిచాలు. బింకంబులేల ? ఇదిగో నిన్ను వధించుచున్నా' నని శిత శరంబులైదు సంధించి యాకర్ణాంతముఁ దివిచి వైరియురము గుఱిచేసి వైచెను. ఆశరంబులు క్రూరసర్పంబులవలెఁ జని రక్కసుని వెన్నురంబున నాటెను. ఇంద్రజిత్తు కఱుకుటమ్ములు మూఁడు లక్ష్మణుని పైవైచెను. వారట్లు పరస్పరజిగీషామతులై యెడతెంపులేని బాణవర్షంబును గురియించిరి. ఇరువురును బలపరాక్రమవిక్రాంతులును సర్వశాస్త్రకోవిదులును బరమదుర్జయులును గావున వారిపోరు సమమై నభోభాగంబున గ్రహంబుల పోరువలె గహనాంతరంబునఁ గొదమసింగంబుల జగడంబుక్రియ శంబరాసురమహేంద్రుల సంగ్రామము కరణి నుండెను.

"సీ॥ పటుభల్లనికరంబు పరఁగినఁ బఱియలై
యఱవఱలయ్యెడు నరదములును
నానార్ధచంద్రబాణవ్రాత మడరినఁ
దునియలై మేదినిఁ దొరఁగుకరులు
శాతనారాచపుంజంబులు నిగిడినఁ
గుదురులై కూలెడు ఘోటకములు
వివిధాస్త్రతతులు వర్షినఁ గండలై వందఁ
దఱిగినట్లుండు పదాతిచయము
తే॥ నగుచు భీభత్సరౌద్రమహాద్భుతములు
మూర్తిమంతంబులుగ నిరుమొనలరక్త
మాంసమేదోస్థిమస్తిష్కమయతఁ జూడ
ఘోరరూపంబులై పరిక్షోభమొందె ॥"

అంత లక్ష్మణుఁడు దివ్యబాణంబును సంధించి ధనుష్టంకారమొనర్చి యసురను వైచెను. ఇంద్రజిత్తు తజ్జ్యాలతానిర్ఘోషమువిని వెలవెలనై రామానుజునిఁ జూచెను. అతని వెల్లఁబాటును విభీషణుఁడు పరికించి 'లక్ష్మణా ! వైరిముఖవైవర్ణ్యమును జూతువా ? ఇఁక జాగువల' దనెను. అంతలోన నబ్బాణము రావణాత్మజుని యెద నాటెను. వాఁడు మహార్త కాలము సంక్షుభిత సకలేంద్రియుఁడై తెలివితప్పి మూర్ఛిల్లి తేఱి చుఱచుఱఁ బ్రాక్కుచు సౌమిత్రిమీఁదికిఁ జెంగలించి లక్ష్మణుని నేడుశరంబులు వైచి

హనుమంతుని బదింటనొప్పించి విభీషణునిమీఁద నూఱమ్ములుసారించెను. లక్ష్మణుఁడు నవ్వుచు 'రావణాత్మజా! ఇంతేనా నీభుజసార' మని వచించి ఘోర శరంబొండు సంధించి తివిచివైచెను. దానితాకుపడికి నింద్రజికవచము తుత్తునియలై రాలెను. అతఁడు భిన్నకవచియు శరవ్రణాంకితుండునై కొండొకతడవు మూర్ఛాపాటు చెంది యుండి లక్ష్మణుని పయి శరసహస్రము వైచెను. వాని వ్రేటులకు దాశరథికవచము వ్రీలి విశీర్ణమయ్యెను. అట్లు వారు సేఁతకు మాఱుసేఁత గావించుచు బిట్టార్చుచుఁ బెద్దయుండడవు పోరిరి. వారి జ్యాలతాధ్వనులు నిర్ఘాతధ్వనులవలె మ్రోయుచు వేఱ్వేఱ వినవై తత్తత్సైన్యంబునకు వెఱపు గలిగించుచుండెను. వారిశరీరంబులు వ్రణాంకితములై విశీర్ణపర్ణంబులును రక్తపుష్పాక్రాంతములునైన శాల్మలీ కింశుక వృక్షంబులను దలపింపసాగెను. రుధిరప్లుతములైన వారియంగంబులు జాజ్జ్వల్యమానాగ్ని హోత్రంబుల కరణి నుండెను.

వారట్లు హోరాహోరి బోరుచుండఁగా విభీషణుఁడు వానరసైన్యము వంక మరలి 'మీయుపేక్షాభావము నూహింపఁజాల. ప్రహస్తకుంభకర్ణాది రాక్షసవీరులను జయించిన మీబలపరాక్రమంబులు నేఁడెట్లుపోయె? మిన్నకుందురేల? సంగతి యెఱుంగరా? రావణునకు గతి ఇంద్రజిత్తుదక్క మఱియొండు లంకలోఁగలుగఁడు. ఇతనిచావు రావణుని చావగును. రాక్షసమహావీరసాగరంబును జొచ్చితిరి; భుజబలంబును జూపితిరి; దరి చేరనున్నారు. ఇఁక గోష్పదమంత దవ్వుగలదు. అదిదాటుదురేని రేవు డాయుదురు. ఇంద్రజిత్తు నాయన్నకొడుకగుట నాకునుగొడుకగును. పుత్త్రవధకు జంకితిని. కావున్న మీకీశ్రమయే యుండదు. వానిపై నాచేతులాడమిఁ దద్వధాకార్యంబును లక్ష్మణునకు వదలితిని. ఇంద్రజిసైన్యమును జించిచెండాడరేల?' యని కపివీరులకు యుద్ధోత్సాహముఁ గలిగించెను.

శాఖాచరు లంతట వాలంబులాడించి సింహనాదంబు లొనర్చి యసుర సైన్యముఁజొచ్చి హస్తతలంబుల మోఁదియు దంతంబులఁ గొఱికియు నఖంబులఁ గీటియు వైరిబలంబును నొప్పించిరి. వారును మహోగ్రులై శర పరశుపట్టిస యష్టి తోమరముఖ్యాయుధంబులతో ఢీకొనిరి. ఉభయపక్షములకు బొమ్మియుద్ధము మహాతీవ్రముగా జరిగెను. జాంబవంతుఁడొకవంక

హనుమంతుఁడొకవంక విజృంభించి జంభారివంబోలి పోటులు పొడిచి పెక్కుర గడపిరి.

“సీ॥ కాలువలై పాఱు కీలాలజలములఁ
దేలిపోయెడు మృతదేహములును
బ్రేవులప్రోవుల నెల్లెడఁజిత్రిత
చ్ఛాయంబులగు మాంససంచయములుఁ
గరిహయంబుల కళేబరముల క్రిందఁ గొం
డొకతోఁచు భటగాత్రనికరములును
దలలపెంట ఱచులో మిలమిలమెదలెడు
కరపదంబులనవఖండములును
తే॥ రౌద్రభీభత్స రసతరంగభంగి
నపుడు సమరాంగణము ఘోరమయ్యెఁజూడ
వానరాసుర వీరాగ్రవర్గములను
యుద్ధసంరంభమత్యంత ముద్యహిల్ల ॥”

ఇంద్రజిల్లక్ష్మణులు క్షణక్షణ విజృంభమాణపరాక్రమాటోపదుర్నిరీక్షణులై మేఘాంతరచంద్రసూర్యులట్లు బాణజాలాంతర్హితులగుచు శరసంధానవిమోచనంబు తేర్పడనట్లు పోరిరి. వారిబాణంబు లాకాసంబును గ్రిక్కిరిసి కప్పుటవలన రవికిరణదీప్తి జల్లెడక్రంతలగుండవచ్చునట్లు ధరాతలంబునఁ బ్రసరించెను. వాయువు వీచుటమానెను ; అగ్ని జ్వలింపదయ్యెను; క్రూరజంతువులు భయంకరముగాఁ గూసెను ; మహర్షులు భయగ్రస్తులై లోకంబులకు స్వస్తివచనంబులు పలుక సాగిరి ; యుద్ధావలోకనార్థము వచ్చియున్న చారణగంధర్వాదులు విత్తాకుచెందిరి.

లక్ష్మణుఁడు వైరిరథాశ్వంబులను నాల్గుబాణంబుల నొప్పించి యొక్కటఁ తత్సారథిని ద్రొల్లనేసెను. ఇంద్రజిత్తు సారథ్యమును తానే వహించి యొకవంక రథాశ్వంబుల నడుపుచు నొకవంక నెదిరికి జవాబుచెప్పుచు యుద్ధమొనర్చెను. వానిశక్తిసామర్థ్యంబుల కెల్లరు నాశ్చర్యపడిరి. రథమునడుపుట యుద్ధమొనర్చుట యను రెండు నొక్కటేకకాలంబునఁ జేయ

కాదు గావునను సందుఁజూచి లక్ష్మణుఁడు తన్ను నొప్పించుచుండెఁ గావునను నట్టిసురవస్థకు నింద్రజిత్తు దుఃఖమందెను. అతని ముఖవైవర్ణ్యము నుపలక్షించి వానరులు మహాసంతోషమంది లక్ష్మణునిఁ గొనియాడిరి. ప్రమాథి శరభ రభసగంధమాదనులు నల్వురు నొక్కటఁ బరాక్రమించి యింద్రజిద్రథాశ్వంబుల నాల్గింటిని దలలుదన్ని పగిల్చి కూల్చిరి. మండోదరీసుతుఁడంత నేలకు దిగి సౌమిత్రిపై శరవర్షము గురిసెను. రామానుజుఁడు ప్రతిశరంబుల వైరిబాణజాలంబు నరికట్టెను. ఇంద్రజిత్తు తనసైన్యమును జూచి 'బాణాచ్ఛాదితమై రవిరశ్మి ధరాతలంబునఁ బ్రసరింపదు ; చీఁకట్లు కప్పినట్లయ్యెను ; ఇదేసందుగా నేను రథాంతరమును గైకొనివత్తు ; అందాక వానరులకుఁ దగుయుద్ధమొసంగుచుండుఁడు. నాపోక వైరులెఱుంగరాదు. ఎఱిఁగిరేని నన్నడ్డగింతురు. నేనిందున్నట్లే మీరు వారితో యుద్ధమొనర్పు'డని పలికి లంకాపురంబునకుఁ జని హేమభూషితరథంబు నెక్కి మాయ హృదయవేదియు నాప్తుఁడునైన సారథితోడవచ్చెను. వాని నేర్పునకు నెల్లరు నక్కజపడిరి.

ఇంద్రజిత్తట్లు యుద్ధసన్నద్ధుఁడై వచ్చి యడ్డమున్న వానరసైన్యంబు నెల్లఁ గలంచెను. కపివరులు చీకాకుపడి వెఱచి లక్ష్మణుని శరణుచొచ్చిరి. సౌమిత్రియంతమునాఁడి నేర్పుమీఱ నొక్కకోలచేత వైరి శరాసనంబును ద్రుంచిన నతండు వేఱొండు విల్లు గ్రహించెను. దానినిగూడ లక్ష్మణుఁడు శరత్రయంబునఁ ద్రుంచి యాశీవిషోపమ శరపంచకంబు నయ్యసురయురంబు గుఱిచేసి వైచెను. ఆసాయకంబులు జివ్వఁజని యింద్రజిత్తు శరీరంబును జూటాడి రక్తోరగంబుల పగిది వెడలివచ్చి నేలవ్రాలెను. ఇంద్రజిత్తు ఛిన్నకవచుఁడయ్యు నోటనెత్తురు గ్రక్కుచుండియు వెన్నుచూపక మఱియొండు కార్ముకంబును గైకొని లక్ష్మణునిపై శరవర్షము గురిసెను. లక్ష్మణుఁ డాబాణంబులనెల్ల నందందే నివారించుచు రాక్షసుల నొక్కొక్కని మూఁడేసి తూపులఁ బరిహరించి వాఁడికోల నొక్కట రావణి నొప్పించి వాని సారథి తల ద్రుంచెను. సారథి చన్నను తద్రథాశ్వంబులు దారితప్పక మండలాకారంబుగా రథంబును ద్రిప్పసాగెను. వాని శిక్షావిధానంబునకు నెల్లరు మెచ్చిరి. ఇంద్రజిత్తు పండ్లుగీటి లక్ష్మణునిపయిఁ దీవ్రశరంబులు పదివైచెను. అవి లక్ష్మణుని తాఁకి తునియలై రాలెను. అతఁడుపేక్ష్య

కవచంబుఁ దొడిగిఁయుంట నింద్రజిత్తు గ్రహించి వానిలలాటంబున శరత్ర యము నేసెను. లక్ష్మణుఁడు బాణార్దితుఁడయ్యు నేతకు మాఱు నేతగా నైదుశరంబులింద్రజిల్లలాటంబున నాటెను.

ఇంద్రజిత్తట్లొక ప్రక్క లక్ష్మణునితో యుద్ధముచేయుచునే విభీష ణుని బాణత్రయంబున నొప్పించెను. అతఁడు కోపవివశుఁడై గదఁబూని రావణిరథాశ్వంబులఁ గూల్చెను. ఇంద్రజిత్తు నేలకు దుమికి కన్నుల నిప్పుకలు రాల్చుచు జేఁజాపున రథశక్తినందికొని నీల్గి బలముకొలఁది దానినిఁ బినతండ్రిపై విసరెను. అది యగ్నిజ్వాలలు గ్రక్కుచు రాసాగెను. లక్ష్మణుఁడు దానిని మార్గమధ్యముననే పది తునియలు చేసెను. శక్తి యట్లగుటకు నింద్రజిత్తు మహోగ్రహము వహించి యమదత్తమహాబాణంబును గూర్చి విభీషణుని నేసెను. లక్ష్మణుఁడదిగాంచి సురాసురదుర్జయంబును దుర్విషహ్యంబునైన కుబేరదత్తబాణంబును వదలెను. ఆరెండు నొంటొంటి నొరయుటవలన ధూమవిస్ఫులింగమయ దారుణాగ్ని యుద్భవించి సర్వభయా వహముగాఁ దోఁచెను. ఆబాణంబులు మహాగ్రహంబులు వోలె విచిత్ర గతులఁ బెనఁగులాడి నేలఁగూలెను. లక్ష్మణుఁ డంత వారుణాస్త్రంబును బ్రయోగించెను. ఇంద్రజిత్తు రౌద్రాస్త్రంబున దానిని బ్రతిహతమొనర్చి యాగ్నేయాస్త్రమువైచెను. లక్ష్మణుఁడు సౌరాస్త్రంబున దానిని వారించెను. ఇంద్రజిత్తంతట నాసురాస్త్రంబును వైచెను. అది నిజప్రభావంబున ముసలముద్గరగదాశూలఖడ్గాదులను వేనవేలుగాఁ గ్రుమ్మరించుచు మహాభీల ముగా రాసాగెను. లక్ష్మణుఁడు దానిని మహేశ్వరాస్త్రంబున వారించి హుతాశనసమస్పర్శంబైన యైంద్రాస్త్రంబును సంధించి ప్రలయకాలయమ మహోగ్రాకారుఁడై యాకర్ణాంతముఁ దివిచి 'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది। పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్' (దశరథరాముఁడు ధర్మాత్ముఁడును సత్యసంధుఁడునుఁ బౌరుషంబున సాటి లేని వాఁడు నగునేని' శరమా! నీ వీ రావణాత్మజుని బరిమార్తువుగాక) అని పలికి దానిని వదలెను. ఆ బాణము చని యింద్రజిత్తుశిరంబును ద్రుంచి వైచెను. అతనికళేబరము దవ్వునఁ బడెను. విభీషణాదులు సింహనాదం బులు గావించిరి; నింగినున్న దేవర్షిగంధర్వాదులు సంతోషపరవశులై జయజయధ్వను లొనర్చిరి; పుష్పవృష్టికురిసెను. రక్షోగణము సనిచెడి

హేతియాయుధంబులను బాఱవైచి పఱచి మున్నిట దూఱియు బర్వతంబుల దాగియు లంకఁజొచ్చియు నానావిధమయ్యెను. 'లక్ష్మణోజయతి' యను ధ్వనులు పిక్కటిల్లెను. వానరులొండొరుఁ గవుంగిలించుకొనుచు గుప్పించుచు గంతులువైచుచుఁ గోఁతిచేష్టలు గావించుచుఁ దమసంతోషంబును దెలిపుచ్చిరి.

లక్ష్మణుఁడట్లు రావణాత్మజుని సంహరించి విభీషణ హనుమజ్జాంబవదాదులతోడ రామునికడకుఁ జని వానికిఁ బ్రదక్షిణనమస్కారముగావించి చెంగట నిలిచెను. విభీషణుఁడాత్మసంతోషమునుఁ బట్టజాలక 'లక్ష్మణుఁ డింద్రజిత్తును బరిమార్చె' నని రామునితోఁ జెప్పెను. రాముఁడు పరమానందమొంది 'లక్ష్మణా! నీకెంతయు సంతసింతును. మహాకార్యమొనర్చితివి. ఇఁక రావణుఁడు చచ్చినట్లే' యని యతనిని గవుంగిటఁగూర్చి తొడపయిఁ జేర్చి శిరము మూర్కొని యొడలు తడవి నిలువెల్ల గాయపడియుండుటకు వెచ్చనూర్చి సుషేణుని బిలిచి 'నాతమ్ముఁడు శరవిద్ధుఁడై గానిపడుచున్నాఁడు. వానికి స్వస్థతగూర్పుము. విభీషణుఁడును వానరులు నట్లే యున్నారు. ఎల్లరకుఁ జికిత్సచేయు' మనెను. సుషేణుఁడు దివ్యౌషధిని దెచ్చి లక్ష్మణునకు వాసనచూపెను. దానిని మూర్కొన్నంతనే లక్ష్మణుని దేహముఁదు నాటియున్న ములుకులు జలజలరాలి వానిగాయములు మానెను. విభీషణాదులు నట్లే స్వస్థులైరి.

## —♦ రావణుని పుత్త్రశోకము. ♦—

హతశేషులు చని 'రాక్షసేశ్వరా! నీకొడుకు నింద్రజిత్తును లక్ష్మణుఁడు విభీషణసహాయంబున మాకన్నులమ్రోల వధించె' నని రావణునకుఁ దెలిపిరి. ఆకఠోరవార్త చెవి సోకినంతనే రావణుఁడు మూర్ఛిల్లి దీర్ఘకాలంబునకుఁ దెప్పరిల్లి 'హా! వత్సా! పదునొక్కండువేల ధనుర్ధరుల నేకాకిగా ధర్షింతువు. దేవేంద్రునిఁ ద్రుటికాలంబున జయించితివి. అట్టి నీవు నేఁడు లక్ష్మణునకుఁ జిక్కితివా? నాయనా! మృత్యువుగూడ నీకు జెగ్గిల్లును. తండ్రీ! యముఁడు నేఁడు తనపగఁ దీర్చుకొనెనా? వానిపజ్జఁ జేరితివా? నీవలన నతఁడు నాకిప్పుడు బహుమతుఁ డయ్యెఁగదా. హా

గ్రణి ! సమరమరణంబు శూరులకు నపేక్షణీయము గావున నీకుగా వగచుట తగదు. ఎవఁడు తనస్వామికిఁ బ్రాణంబు లిచ్చునో వాఁడు తప్పక స్వర్గంబునుఁ బడయును. నీవు వీరస్వర్గంబును జూఱగొంటివి గావున నెంతయు నశోచ్యుండవు. దేవతలారా ! దిక్పాలులారా ! మహర్షులారా ! ఇఁక మీరు గుండియలపైఁ జేయివైచి సుఖముగా నిద్రింపవచ్చును. హా ! నాయనా ! నీవులేని కారణంబున ముల్లోకంబులును నాకు శూన్యములయ్యెను. హా ! సుతా ! యూథపతి మరణంబునకుఁ గరేణుకానిచయార్తరావంబులు గిరిగహ్వరాంతరంబునందువలె నీచావునకు రాక్షసకన్యాజనార్తధ్వను లంతఃపురమందెల్ల మాఱుమ్రోయుచున్నవి. అయ్యో ! ఇది సహించుటెట్లు ? హా ! వత్సా ! యౌవరాజ్యంబును ద్యజించి లంకానగరంబును వదలి రాక్షసవర్గంబును విడిచి తల్లిదండ్రుల బాసి భార్య నెడసి యెందుఁ బోయితివో గదా ! కటా ! నాకుఁ బ్రేతకార్యంబు లొనర్పవలసిన నీకు నేనే యాకార్యము లొనర్చుటయ్యెనా ? ఇంతవైపరీత్యముఁ గావింపనేల ? పట్టీ ! నాకు మనశ్శల్యంబులైన రామలక్ష్మణసుగ్రీవులను బ్రాణములతో వదలి నాయిడుము లుడుపకయే మమ్మెల్ల దిగనాడితివా ?' అని బహుప్రకారంబుల విలపించి పుత్రవ్యసన శోకాగ్నులఁ గ్రాగసాగెను. వాని దశాస్యంబులును భ్రూకుటీకుటిలంబులై యుగాంత మకరమహోర్మిసాగరంబులను బురుడించుచుండఁగా, తదీయ వదనగహ్వరంబుల నుండి యాపులింతలతోడ ధూమాగ్నులు వెలివ్రాఁకుచుండఁగా, సహజరక్తిమంబులైన తన్నేత్రంబులు క్రోధాగ్నివలన మఱిమఱి యెఱ్ఱనై మహాఘోరంబుగాఁ బ్రజ్వరిల్లుచుండఁగా, నిసర్గఘోరమైన తదీయాకారము క్రోధవహ్నిమూర్ఛితమై క్రుద్ధరుద్రాకారంబుగాఁ దోఁచుచుండఁగా మండు దీపంబుల నుండి తైలబిందువులు మంటలతోడ స్రవించునట్లు తన్నయనగోళంబులనుండి జ్వాలాభీలబాష్పంబులు రాలుచుండఁగా, రాక్షసవీరులు త్రిప్పునట్టి తిలయంత్రంబుల ధ్వని ననుకరించునట్లుగాఁ బటుపటుఁ బండ్లుఁ గీటుచు రావణుఁడు జరాచరసంహారోద్యోగి కాలాంతకునివలె మహాభయోత్పాదిదై గాన్పించెను.

—♦ రావణుఁడు సీతావధకై యశోకవనంబునకుఁ బోవుట ♦—

రావణుఁ డట్లు క్రోధ దుర్నిరీక్షణుఁడై 'రాక్షసులారా ! ఏండ్లు

పూండ్లుగా ఘోరతపంబొనర్చి చతురాస్యుని మెప్పించి తద్వాక్యాన నపూర్వవరంబులు వడసి భయం బెట్టిదో యెఱుంగక యిందాక మంటిని. ఇప్పుడు నరమాత్రునివలన నాకు సంకటము గలిగెను. ఇఁక జాగువలదు. సూర్యసమప్రభాభాసురకవచంబును గొనిరమ్ము. బ్రహ్మదత్తమైన యక్కవచంబును ధరించి రథమెక్కి సమరక్షోణికిఁ బోయెదఁగాక. నన్నెదిరించు వీరుఁడెవఁడో చూతము. వీరవర్యులారా! తడవుసేయవలదు. రామలక్ష్మ[illegible]చమడంతు' నని పలికి పండ్లు పటపట గీఁటి 'రామా! నరాధమా! పుత్రుఁడు స్త్రీహత్యాభీరువై మాయాసీతను కల్పించి వధించినందులకే యింతతల్లడిల్లితివి. ఇదిగో యిప్పుడు యథార్థసీతావధమును గన్నారఁ జూడుము. నీ సీతానురాగము నేఁటితో సమసిపోనున్న' దని గద్దెనుండి దుమికి ఖడ్గము నూనిపట్టి యశోకవనమునకుఁ దరలెను. వాని వెంట నతని భార్యాజనంబును మంత్రివర్గంబును బఱచెను.

రావణుని యాగ్రహంబునకు రాక్షసులు సంతోషపరవశులై సింహనాదంబులొనర్చుచుఁ బరస్పరసమాశ్లేషములు గావించుచు 'రాక్షసేశ్వరా! నీధాకకు దిక్పాలురు గూడ నిలువరైరి. ముల్లోకంబులును యథోచితపారితోషికపూర్వకంబుగా నీయనుగ్రహంబును విలుచుచున్నవి. బలపరాక్రమంబుల నీకు సాటిగలుగరు. నరమాత్రులఁ జేర్కొననేల ?' యనుచు పొగడసాగిరి.

—♦ జానకీ భయవిలాపములు ♦—

రావణుని దుష్టమతంబును వానిమిత్రులు గ్రహించి వలదని విన్నవించిరి. ఎవరేమిచెప్పినను రావణుఁడు వినక యంగారకుఁడు రోహిణిమీఁదకుపలె సీతాదేవిమీఁదకు గదలెను. సీతాదేవి యావార్తవిని దుఃఖవశయై 'కటా! ఈదురాత్ముఁడు నన్ను వధింపవచ్చుచున్నాఁడో రామలక్ష్మణులను వధించి యాక్రూరవార్త నాకుఁ జెప్పవచ్చుచున్నాఁడో యూహింపరాకున్నది. రెండవపక్షమేని యామహావీయుల వినాశంబునకుఁ గారకురాలనైన నేనువెనువెంటనే దగ్ధనగుదుఁగాక. అట్లుగాక పుత్రశోకకర్శితుఁడై రామలక్ష్మణులమీఁది పగను నాపయిఁ జూప వచ్చుచున్నాఁడేని బుద్ధిజాడ్యఫలంబు నాకు దాపరించుటగును. ఎట్లన నాఁడు హనుమంతుఁడు నన్ను మూఁపున

నెక్కించుకొనిపోయి నానాథుని మ్రోల నిడుమనని యెంతో యుపదేశించెను. అట్లు గావించియుందునేని నా ప్రియుని యొడిలో నుండి యుందు. ఈయుద్ధంబును దత్సంబంధ దుఃఖంబులును దప్పియుండును. అయ్యో! మందభాగ్యలకు మేలు గలుగునా? నన్ను వధించిన వధించుఁగాక. అందులకుఁ జింతగలుగదు. నానాథునకుఁ జేటొదవియుండునేని కౌసల్యాగర్భంబునఁ జిచ్చుగూర్చిన దాననగుదు. ఏకపుత్త్రక యామె విదీర్ణహృదయ గాక మానదు. అయ్యో! మంథరనాటిన విషబీజమెంత గావించెనో యూహింపరాకున్న' దని లోలోన విలపింప సాగెను.

—♦ సుపార్శ్వుని హితోపదేశము ♦—

అత్తఱి సుపార్శ్వుఁడను పేరి సచివుఁడు రావణుని డాసి చేతులొగ్గి 'రాక్షసేశ్వరా! సాక్షాత్కుబేరునకుఁ దమ్ముండవుగా జనించితివి. మహాకులప్రసూతులు ధర్మంబునెడయరాదు. మీఁబోంట్లకుఁ గ్రోధము తగదు. అందును స్త్రీహత్య నీకెంతమాత్రముఁ బాడిగాదు. శూరాతిశూరఖ్యాతిని గడించి రాక్షసలోకాధీశత్వ మొంది వేదములెల్ల నధ్యయనించి, శాస్త్రంబులను సాకల్యంబుగాఁ బఠించి వ్రతస్నాతుండవైతివి. కర్మకలాపంబును నియతితో ననుష్ఠింతువు; అట్టి నీవెడ? స్త్రీవధయెడ? దేవా! సీతామోహము నీమనంబును హరించెను. సర్వోపాయంబుల నీకోరికను దీర్చుకొనుటొప్పును. సీతాసంహారంబున నీకు వాంఛాసంహారంబగుఁ గాని యభీష్టసిద్ధి యగునా? నీకోపంబునకు రాముని గుఱిచేయుము. నేఁడు కృష్ణచతుర్దశి; యుద్ధప్రయాణంబున కీదినము తగియున్నది; రేపు దాడివెడలి విజయశ్రీతోడ సీతాదేవిని బడయుము' అని విన్నవించెను. రావణుఁ డామాటలు పాటించి మరలి వచ్చి సభామండపముఁ జొచ్చి క్రుద్ధసింహమువలె నిశ్వసించుచు సింహాసనమధిష్ఠించి సేనాధ్యక్షులకుఁ జేదోయి కీలించి 'యోధాగ్రేసరులారా! మీరు మీమీచతురంగబలంబులతోడ యుద్ధంబునకు నుపక్రమింపనగును. రామవధ మనకుఁ బ్రధానము. మీబలపరాక్రమంబులనెల్ల వానిమీఁద వినియోగింపుము. మీచేతనే యతఁడు చచ్చెనా పదివేలు. అట్లుగాఁదేని మీతోడఁబోరిపోరి లావఱియుండు. అతనిని నేను సమస్తలోకసమక్షంబున రేపటిదినము సులభముగా వధింతు' ననెను. వారవ్వాచనంబులను దలతో గ్రహించి సర్వసైన్య సమేతంబుగా యుద్ధసన్నద్ధులైరి.

## —♦ రావణ మూలబలధ్వంసము ♦—

వానరులకును రాక్షసులకు ఘోర యుద్ధమయ్యెను. ఆ పోరు సూర్యోదయముతోడఁ బ్రారంభమై క్షణక్షణంబునకుఁ దీవ్రతఁదాల్చెను; నెత్తురులు వెల్లివిరిసెను. రక్కసుల వ్రేటులకును బోటులకును వానరులు సొక్కి రాముని శరణిల్లిరి. ఆ తేజశ్శాలి కపిసేనావిహ్వలత్వముఁ గాంచి రోషకషాయనేత్రుఁడై యసురసేనాసముద్రముఁమీఁద ఘోరశరదంభోళీ వర్షముఁ గురిసెను. రక్కసులు సూర్యుని మోల గ్రీష్మమేఘంబు లట్లయిరి. ఝంఝానిలవేగంబును కూలినవృక్షంబులును విరిగినకొమ్మలును బ్రకటించునట్లుగా రామశరప్రయోగవేగంబును విఱిగినరథంబులునుఁ దెగిబడిన మాతంగంబులును గూలిన యశ్వంబులును బ్రకటించెను. ఆసమరసమయంబున రాక్షసులు తలలు తెగి యంగంబులు విఱిగి పడుటమాత్రము కానవచ్చెనేగాని రాముఁడు కదలినట్లు గూడ దోఁపకుండెను. పంచభూతాత్మకమైన తమశరీరంబు లందేయుండి యింద్రియార్థంబుల ననుభవించు జీవాత్మను బామరులు గాననట్లు రాక్షసులు తమమధ్యనుండి తమరి నట్లు గాఱించుచున్న రాముని గానరైరి. రాముఁడు తనసర్వవ్యాపకత్వంబును జూపుటకో యనఁ బ్రతిరాక్షసుని మోలఁ దోఁచెను. వారు భ్రమాస్పదులై 'వీఁడుగో రాముఁడు పట్టుఁడు కొట్టుఁడు' అనుచు తమలోఁ దమరినే చంపుకొనిరి. రామునివిల్లు వానిహస్తతలంబున దిర్దిరఁదిరుగుచుఁ దతీయ కాంచనకార్ముకగా ద్రద్యుతులవలన నూహింపఁబడుచుండెను. రామచక్రంబు స్వశరీరనాభంబును సత్కార్చిశ్శరారవంబును నేమికార్ముకంబును జ్యాఘోషతటి నిర్ఘోషంబునుఁదేజోబుద్ధిగుణప్రభంబును దివ్యాస్త్రగుణ పర్యంతంబునునై కాలచక్రంబు క్రియఁ దేజోవిరాజమానమై దర్శనభయంకరముగా నుండెను. ఏఁడుకోట్ల రథంబులును బదుమూఁడుకోట్ల మత్తమాతంగంబులును బదికోట్ల సాదివాజినంబులును నూటనలువదియైదుకోట్ల యెనుబదిలక్షల పదాతులును దివసాష్టభాగకాలంబులోపల రామశరాగ్నిశిఖాపరంపరలఁ బరిదగ్ధమయ్యెను. హతశేషులు తమయుత్సాహంబులను మాని లంకాపురముఁ జొచ్చిరి. రణక్షోణి యెల్ల గజాశ్వశవంబులతోను విశీర్ణరథాంగంబులతోను గ్రొన్నెత్తురులు గ్రక్కుచున్న పదాతులతోనునిండి ప్రళయకాలరుద్రుని గ్రీడాస్థానమోయన మహాభీలమై తోఁచెను. దేవగంధర్వసిద్ధమహర్షులు రాముని పరాక్రమంబును

వేనోళ్ళ నుగ్గడించిరి. రాముఁడట్లు మహారణంబొనర్చి చెంతనున్న సుగ్రీవ విభీషణహనుమదాదులను జూచి 'గాంధర్వాస్త్రప్రయోగంబున నింతటిమాయఁ గావించి రక్కసుల నురుమాడితినని తలంపవలదు. ఇదియెల్ల నస్త్రప్రయోగకౌశల్యవిశేషమేగాని మాయాకార్య మెంతమాత్రముఁ గాదు. ఇట్టి సామర్థ్యము నాకును శివునకును దక్క యన్యులకుఁ గలుగ' దనిచెప్పి వారిసంశయంబును బాపెను.

## — రాక్షసస్త్రీరోదనములు —

రావణుని మూలబలంబెల్ల నవ్విధంబున రణరంగంబున రామునిచేత నీల్గుట విని లంకానగరమందలి రాక్షసాంగనలు గుములుగూడి భర్తలకై కొందఱును, పుత్రులకై కొందఱును, బంధువులకుఁగాఁ గొందఱును, బరిపరివిధంబులఁ బరిదేవనంబులు గావించుచు 'అయ్యో! కులపాంసురా లా శూర్పణఖ మనకెల్ల నెన్నరానిబాములు తెచ్చెఁగదా? ఆచెనఁటి వనంబునకుఁ బోనేల? రాముని గామింప నేల? మహాతేజోరాశియు బురుషోత్తముండును నైన రాముఁడేడ? మహాపాతకి శూర్పణఖ యేడ? కటా! మనదౌర్భాగ్యమెల్ల నీశూర్పణఖారూపంబున నవతరించెఁ గాఁబోలు. అయ్యో! ఈ దరిద్రురాలికతన రావణుఁడు రామునితో మత్సరించి సీతను వలచి యా జనకరాజసుతను బందిగొని వచ్చెను. ఈశూర్పణఖాపిశాచి చచ్చియున్నచో నింతముప్పు మనకుఁ గలుగ నేరదు. రావణుఁడు సీతను వలచుట యాత్మమరణంబును వలచుటయ్యెను. ఆ సాధ్వీమణి యితని కెన్నఁడును స్వాధీన గాదు. రాముఁ డజేయుఁడు. విజయలక్ష్మి వానికిముందు నడచుచుండును. రామబలపరాక్రమంబులెట్టివో విరాధఖరదూషణాదులగతియే చాటుచున్నది. అదిగో వాలికబంధులు లోకాంతరమందుండి రామవిజయంబును జాటుచున్నారు. వాలికోడి దిక్కుమాలి ప్రాణరక్షణార్థము ఋష్యమూకము నాశ్రయించి యుండిన సుగ్రీవునకు వానరరాజ్యాభిషేక మొనర్చిన యాకార్యమే రామవిజయప్రకటనంబునకుఁ జాలదా? రామునకు జయము సిద్ధమనుటకు వేనవేలు నిదర్శనంబులు గలవు. అయ్యో! ఇంతేల? నాఁడు విభీషణుఁడు ధర్మార్థసహితంబుగా సర్వరాక్షసహితంబుగా యుక్తియుక్తంబుగాఁ జెవినిల్లుకట్టి చెప్పినను రావణుఁడు మోహావశంబున దానిని వినఁడయ్యెను. తత్ఫలము నేఁడిట్లు పరిణమించెను. ఒండుచో లంకానగర

మీక్రియ శవమయశ్మశానవాటియై యార్తరావములతో మాఱుమ్రోయదు గదా. మహాబలుండైన కుంభకర్ణునిగతియు దుర్ధర్షుండైన యతికాయుని పోకయు బ్రియసుతుండైన యింద్రజిత్తుని దుర్మరణంబును వేనోళ్ళ రామ ప్రభావంబును బ్రకటించుచున్నను రావణు డింకను రామతత్త్వంబును గ్రహింపఁడు. ఇతని కేమనవలయుఁ! హా! తనయా ! హా ! నాథా ! హా! సోదరా !' అని లంకానగరము గావించు మహార్తనాదంబులేని రాక్షసేశ్వ రుని చెవిసోకవా ? రథంబులెల్ల నుగ్గునూచమయ్యెను ; వాజిశాలలు పాడు కడెను ; గజబృంహితంబులు వణఁగెను ; ఉక్షోపలక్షులుగాఁ బడాతులు కూలిరి. రుద్రుఁడో విష్ణుఁడో కాలాంతకుఁడో యీ రామరూపంబును దాల్చి మనవారినెల్ల మ్రింగవచ్చెను. ఇతఁడు మనుష్యమాత్రుఁ డైతే మాత్రముఁ గానేరఁడు. మనుష్యుఁడెక్కడ ? రాక్షసలోక సంహార మెక్కడ ? ఇఁక మనకు జీవంబులు దక్కవు. మనభయంబు లింతనరావు; అనాథలమైతిమి ; గోడుగోడుమనుచున్నాము. రావణుఁడు వరగర్వాం ధుఁడై తన్ను మ్రింగనున్న భయంబును గూడ నెఱుంగఁడు. అతఁడు రాముని బారిఁబడెను. వానిని ముక్కంటిగూడ రక్షింపనోపఁడు. ఉత్పా తంబులుగూడ రావణవినాశంబునే సూచించుచున్నవి. రావణుఁడెంత కఠోరతపంబొనర్చిన లువను మెప్పించి దేవదానవరాక్షసాదులవలనఁ దనకు భయంబు రాకుండునట్లు వరంబును గోరెనేగాని మనుష్యుల సంగతిరేపే తలంపఁడు. బ్రహ్మయు వానికోరినవరంబు ననుగ్రహించెను. రాక్షసేశ్వ రుఁ డంతట మహోద్ధతి వహించి ముల్లోకంబులను గాసిఁజేయుచుటయు దేవత లాబాధలోర్వఁ జాలక పితామహుని శరణుజొచ్చుటయు నప్పరమేష్ఠి వారి భయంబుడుప నోపక మహాదేవుని జూపుటయు సురలటకుఁ బోయి వానికి మ్రొక్కుటయు నద్దేవదేవుఁడు ప్రసన్నుఁడై 'అమరులారా ! వెఱవకుఁడు. అచిరకాలంబున స్త్రీయొకతె జనించి రాక్షసవినాశకారిణియై మీకు హితం బొనర్చు' ననుటయు వింటిమి. ఆస్త్రీ యీసీతయే కావలయును. ఈ పోటి కారణంబున రావణుఁడు సబాంధవముగాఁ గూలనున్నాఁడు. రావ ణుని దుష్కార్యఫలంబుగా మనకెల్ల శోకాయత ఘోరాంతకము ప్రాప్తింప నున్నది. మనలను రక్షించు దక్షుఁడు గలుగఁడు. దవాగ్నివేష్టిత వనాంత రంబునఁ జిక్కిన కరిణీయూథంబు వోలె మహావిపత్పరివృతులమైతిమి.

ప్రాణంబులపై నిఁక గోఱయాసలు వలదు. విభీషణుఁడు మహాత్ముఁడు గావున రామున్న యొగ్గు గ్రహించి రక్షకుని జేరి సుఖమందెను. పాపాత్ము లకు నట్టిమేలుగూడునా ?' యనుచుఁ దమభయదుఃఖంబులను వెలిపుచ్చుచు నొండొరు గవుంగలించుకొని యెచ్చెస్స్వనంబుల దారుణంబుగా రోదనం బులు గావించిరి.

## —♦రావణుఁడు రెండవసారి యుద్ధమునకుఁ బోవుట♦—

రావణుఁ డాదుఃఖరోదనంబులను విని వేచ్చనూర్చి ముహూర్త కాలము మౌనమూని యాడుగఱచి నయనంబులు క్రోధాగ్నికణంబులను వర్షించుచుండఁగా దుర్దర్శునుఁడై సమీపంబుననున్న విరూపాక్షాదులను జూచి నవ్వి 'ఇదిగో చూడుము రామలక్ష్మణులను గృతాంతనితాంతా వేశులఁ గావింతును ; శత్రురక్తంబులతో ఖరకుంభకర్ణాదులకుఁ దర్పణంబు లొనర్తును ; అంతరిక్షంబెల్ల మద్బాణజలదావృతమై నిరవకాశమగుఁగాక. దిక్కులు గాఢతమోపగ్నంబగుఁగాక ; వానరులు తండోపతండంబులుగాఁ గూలుదురుగాక ; రణభూమినశరవానరముఖంబులతో గప్పి సనాళపద్మా లంకృతయోయను భ్రాంతిని గలిగించుఁగాక ; భర్తలకుఁగా సోదరులకుఁగాఁ బుత్త్రులకుగా విలపించుచున్న రాక్షసస్త్రీల కన్నీరు శమించుఁగాక ; మాంసాశనమృగపక్షులకు నాటిపండువగుఁగాక. రథంబు నాయత్తమొనర్చి మదీయ ధనూరత్నంబును గొనివచ్చి యందిమ్ము ; లంకానగరంబున మిగిలి యున్న నిశాచరులెల్లరు నావెంట వత్తురుగాక' యని గంభీరస్వరంబునఁ బలికెను.

సేనాధ్యక్షులు వెనువెంటఁ దగలి లంకాపురంబెల్ల దిరిగి యింటింట దూటి రాజాజ్ఞను జాటిరి. రాక్షసులు ఖడ్గధరులై కొందఱును ముసల హస్తులై కొందఱును శూలపాణులై కొందఱును గదలుపూని కొందఱును పాశంబులదాల్చి కొందఱును బల్లెంబులఁగైకొని కొందఱును జక్ర పిండి వాలకుఠారాదినానావిధాయుధంబులను గ్రహించి మఱికొందఱును వెడలిరి. ఆఱుగుఱ్ఱంబులఁ గట్టినరథము వచ్చి యెదుట నిలిచెను. రావణుండా రథంబెక్కి రాక్షససేనాపరివృతుఁడై మహాపార్శ్వాదులు వెంటనంటిరా

సింహనాదంబులు బోరుకలంగుచుండఁగా సకలజీవరాశిని మ్రింగనున్న కాలాంతకుని భంగిఁ బ్రజ్వలించుచు నుత్తరద్వారము దాఁటెను.

అత్తఱి సూర్యుఁడు కాంతి దొఱంగుటయు దిక్కులు తమోగ్రస్తంబు లగుటయుఁ బక్షులు ఘోరంబుగాఁ గూయుటయు భూమిచలించుటయు మేఘంబులు నెత్తురువానలు గురియుటయు హయంబులు మార్గమధ్యంబునఁ బడఁబడుటయు ధ్వజాగ్రంబున గృధ్రవ్రాలుటయు నక్కలు భయంకరము గా నఱచుటయు మున్నగు నుత్పాతంబులు దోఁచెను. రావణుని వామ నయన భుజంబులదరెను; వానిముఖము వివర్ణమయ్యెను; అతనిస్వరము నిష్కారణముగా సన్నగిల్లెను. ఆకాశంబుల్కాపాతములను వర్షించెను. రాక్షసేశ్వరుఁ డాయశుభనిమిత్తములను జీరికి గొనక రణరంగముఁ జొచ్చెను.

వానరులు రక్కసులనెదిర్చి నిలిచిరి. ఇరుమొనలకుఁ దుములయుద్ధ మయ్యెను. రావణుఁడు వానరసైన్యముఁ జొచ్చి కాంచనపుంఖ శరంబు లను వేనవేలుగాఁ గురియించెను. ప్లవగులు తలలుతెగి కొందఱునుఁ గుండియలువ్రీలి కొందఱును బ్రక్కలు చీలి కొందఱును డొల్లిరి. రక్షో నాథుని రథంబేవంక చనెనో యావంకనున్న వానరులు వాని ధాటిని సహింపఁజాలరైరి. క్షణములో రణరంగమెల్ల వానరశవంబుల పేర్పులతో నిండెను. హతశేషులైన కపివీరులు బాణార్దితులై దవాగ్నులఁ దగులుకొన్న గజంబులక్రియ ఘీట్టఱచుచుఁ బరుగులెత్తసాగిరి.

## —• సుగ్రీవ విరూపాక్షుల యుద్ధము •—

సుగ్రీవుఁ డదిగాంచి వానరులను మరలించుటకుగా సుషేణునిఁబంపి తాను రాక్షససైన్యంబు మీఁదికి నుఱికి యూథపతులు చేఁజేతల నందించు చున్న పర్వతపాదపంబులతో మేటిరక్కసుల నొక్కుమ్మడి జక్కాడి యుక్కిరిబిక్కిరి గావించెను. హతశేషులు వానిదాడికి నోర్వలేక కేకలు వైచిరి. విరూపాక్షుఁ డాయఱపులువిని తనపేరు చాటించుచు గజారూఢుఁ డై వచ్చి సింహనాదంబుఁ గావించి సుగ్రీవుని దాఁకి వానిపయిఁ దీవ్రనారా చంబులు వైచి రాక్షసుల భయంబులుడిపెను. సుగ్రీవుండును విరూపాక్ష బాణవిద్ధుఁడై మహాక్రోధముదాల్చి మహాభూజంబును బెకలించి వైరిగజంబు

శిరంబుపై వైవ నమ్మాతంగంబు ఘీంకారంబొనర్చుచు ధనుర్మాత్రదూరము బఱచి పడి మృతినొందెను. విరూపాక్షుఁడంతఁ గ్రిందికి దుమికి సుగ్రీవునకు నభిముఖుండై నిలిచి యాటోపించెను. వానరేశ్వరుండు వాని కెంతయుఁగనలి పెనుబండయెత్తి యెదిరిపై వైచెను. రక్షోవీరుఁడు తొలఁగి వ్రేటు తప్పించుకొని కపిరాజును ఖడ్గంబుతోఁ బ్రహరించెను. సుగ్రీవుఁడు ఖడ్గహతికి ముహూర్తమాత్రము ప్రజ్ఞతప్పి తేఱి యుద్వేగించి పిడికిలి నలవరించి విరూపాక్షుని పెన్నురంబున మోదెను. విరూపాక్షుఁడు దండతాడిత సర్పంబుపగిది చెలరేఁగి వానరేశ్వరుని కవచంబును దుత్తునియ లొనర్చెను. సుగ్రీవుఁడు ఖడ్గహతులకు నోర్వఁజాలక సొమ్మసిలి కాళ్ళుచాచి నేలఁబడి తెప్పరిల్లి లేచి హస్తతలంబున వానినిఁ బ్రహరించెను. విరూపాక్షుఁ డాతాపు తప్పించుకొని వానరాధిపుని వక్షోభాగంబున ముష్టితోఁ దాఁచెను. సుగ్రీవుఁడు విరూపాక్షుని లలాటంబున నఱచేతఁ జఱచెను. ఆవ్రేటుతోడ నయ్యసురవీరుఁడు నెత్తురులు గ్రక్కి నేలఁగూలి దిద్దిరఁ దిఱిగి బొబ్బరించి ప్రాణంబులు విడిచెను. వానరులు చెలరేఁగి యసుర సైన్యంబును నుఱుమాడిరి.

## —♦ సుగ్రీవ మహోదరుల యుద్ధము ♦—

విరూపాక్షుని మరణంబును రాక్షససైన్య వినాశంబును రావణుఁడుం విని దైవవిపర్యయంబునకుఁగా వ్యథాక్రాంతుఁడై మహోదరా! ఇఁక నీవే నాయడియాస ; నీపరాక్రమంబును జూపి శత్రువులను రూపు మాపుము. నాయన్నంబుఁ దిని జీవింతువుగదా ; స్వామిహితంబునొనర్పఁగా సమయము వచ్చెను. యుద్ధమెట్లొనర్తువో యనెను. మహోదరుఁడు మాటతోడఁ దెంపుచేసి శలభంబగ్నిసట్లు శత్రుసైన్యంబును జొచ్చి తీవ్రబాణపరంపరలేసి వానరుల హస్తపాదోరువులు ఖండింపసాగెను. వానరులు నసిచెడి బెదరి కొందఱు పఱచిరి ; కొందఱు సుగ్రీవు నాశ్రయించిరి. వానరేశ్వరుఁడు నిజసేనాపరాజయంబునకు మహోగ్రుఁడై కొండంతబండను మహోదరుని పయినేయ వాఁడు దానిని మార్గమధ్యంబుననే తీవ్రశరంబుల ఖండించెను. ఆశిల తుత్తునియలై చెదరి గ్రద్దలు నేల వ్రాలునట్లు రాలెను. సుగ్రీవుఁ డంత మహావృక్షంబును బెకలించి వేసెను. దానినిగూడ మహోదరుఁ

డల్లీగావించెను. వానరేశ్వరుఁడు క్రోధమూర్ఛితుఁడై చెంతఁ బడియున్న పరిఘ నందికొని హస్తలాఘవంబేర్పడ దానిని గిఱగిఱ ద్రిప్పివైచి వైరిరథాశ్వంబులను గూల్చెను. మహోదరుఁడు విరథుండై గదఁబూని సుగ్రీవుని దాఁకెను. అట్లు వారు కలియఁబడి యాఁబోతులవలె బోరాడసాగిరి. గదాపరిఘంబు లొండొంటిదాఁకి విఱిగిపడెను. సుగ్రీవుఁడు ముసలంబును చేకొనెను. మహోదరుఁడు మఱియొక గదనుగైకొనెను. అవియు భిన్నాభిన్నములయ్యెను. అంత వారు ముష్టియుద్ధంబునకుఁ గడఁగి నొండొరుఁ జఱచుచుఁ బడుచు లేచుచు సందిటఁబట్టి యెత్తివైచుచుఁ బెద్దయుం దడవుపోరి సొమ్మసిల్లిరి. మహోదరుఁడంతట ఖడ్గంబును బలకను జేకొనెను. సుగ్రీవుఁడు కత్తియు డాలును గ్రహించెను. అట్లు వారు సాయుధులై రోషగర్జనంబులు గావించుచుఁ దలపడి మండలగతులఁ బరస్పరముఁ జుట్టుచుఁ బోరిరి. మహోదరుఁడు పరాక్రమోద్ధతిమీఱి సుగ్రీవుని ఖడ్గంబునఁ బ్రహరించెను. ఆ వ్రేటును సుగ్రీవుఁడు డాలుచేతఁ దట్టివైచి యాకత్తినే లాగికొని యవసరముఁజూచి దానిచేతనే వానితలను ద్రుంచివైచి సింహనాదంబుఁ గావించెను. మహోదరుఁడు పెనువృక్షమువలె నేలఁగూలెను. వానిపాటునకు రక్కసులు వెలవెలఁబోయి పరుగెత్తసాగిరి. అంతరిక్షగతులైయున్న సురసిద్ధయక్షసంఘంబులునుఁ బృథ్వీతలగతభూతవర్గంబును సుగ్రీవుని బ్రస్తుతించెను.

## —• అంగద మహాపార్శ్వుల యుద్ధము •—

మహోదరుండట్లు చచ్చుట మహాపార్శ్వుఁడు విని కటకటంబడి యంగదుని సైన్యము పయిఁబడి ఝంఝానిలము ఫలంబులను ద్రుంచి దవ్వ జోపుఃటుగా వానరవీరశిరంబులు ద్రుంచి వేయసాగెను. కపివర్యులు వాని ధాకకు నోర్వక విషాదవిముఖులైరి. అంగదుఁడు తనసైన్యంబట్లగుటఁ జూచి పర్వకాలసముద్రమట్లు మహోద్వేగియై యినుపగుదెఁబట్టి మహాపార్శ్వునిపయి విసరెను. దాని తాకువడి నతఁడు సారథితోడ మూర్ఛ నొంది రథంబునుండి డొల్లెను. అంతలోన గవాక్షజాంబవంతులు కపిసేనాంతరమునుండి వచ్చి పర్వతశిఖరంబులఁబోని భూరిశిలలుగైకొని మహాపార్శ్వుని రథతురంగంబులనెల్లఁ గూల్చిరి. అసురవీరుఁడు వెల్లదరి జాంబ

వంతుని వక్షంబున మూఁడుశరంబులను నాటి గవాక్షునిఁ బెక్కింట నొప్పించెను. అంగదుఁడు వానికిఁ బరమకుపితుండై మహాఘోరపరిఘంబును గైకొని రెండుచేతులఁబట్టి గిఱగిఱఁద్రిప్పి యసురపైవైచెను. దానితాఁకునకు మహాపార్శ్వునిచేతి విల్లును శిరస్త్రాణంబును దునిగిపడెను. అంతనంగదుఁడు విజృంభించి రక్షోవీరునిఁ గర్ణమూలంబున నఱచేతఁ జఱచెను. మహాపార్శ్వుఁడు గండ్రగొడ్డిట నంగదునిపైఁ వైచెను. కపివల్లభుఁ డావ్రేటు తప్పించుకొని ముష్టి యలవరించి వైరియురంబునఁ గ్రుమ్మెను. మహాపార్శ్వుఁడు వజ్రపాతంబుఁబోని యాముష్టిఘాతంబునకు గుండియలు వ్రీలి నెత్తురు గక్కి డొలఁగెను. వానరులు లంకాపురవిస్ఫోటంబుగా సింహనాదంబు లొనర్చిరి.

—♦ రామరావణుల యుద్ధము ♦—

రావణుఁడు తనసేనాపతుల మరణంబునకును దనవైరులైన దేవతలు సంతసించుటకును వానరులు చెలరేఁగి సింహధ్వనులు గావించుటకును మహావిషాదకోపంబులొంది 'ఇఁకఁ దడయరాదు ; ఇదిగో రామలక్ష్మణులను వధింతుఁ జూడుము. ఏవృక్షంబునకు సుగ్రీవాది వానరవీరులు చిఱుకొమ్మలై వెలయుదురో, యేభూరుహంబునకు సీతాకాంత దివ్యపుష్పమై తనరారునో యా రామవిటపంబును తుత్తునియలొనర్తు' నని బింకంబులు పలికి తనరథంబును దాశరథిమీఁదికిఁ దోలెను. ఆరథధ్వనికి దశదిశలు మాఱుమ్రోసెను ; ధరాతలంబెల్లను సనదీగిరికాననంబుగా సవరాహమృగద్వీపంబుగా సంచలించెను. అట్లు రావణుఁడు విజృంభించి సుదారుణంబును మహాఘోరంబునునైన తామసాస్త్రంబును రామునిఁ గుఱిచేసి వైచెను. దాని తీవ్రతకు వానరులు పెక్కండ్రు దగ్ధులై పండుటాకులవలె రాలిరి. అంత రాముఁడు యుద్ధసన్నద్ధుఁడై దిక్కటాహవిస్ఫోటంబుగా ధనుర్నిష్వాదం బొనర్చెను. ఆ జ్యానినదంబునకు రావణుఁడు క్రోధవివశుఁడై తీవ్రశరంబులను బరంపరలుగాఁ బ్రయోగించెను. రాముని వింటినారిధ్వనియు రావణుని శరంబులవేగధ్వనియుఁ గూడి యకాలప్రళయమేఘగర్జలఁ దలపించెను. వానరులును రక్కసులును భయవిహ్వలులై గుంపులు గుంపులుగాఁ బడిరి. శశిసూర్యుల మ్రోల రాహువట్లు రామలక్ష్మణులయెదుట

రావణుఁడు దోఁచెను. లక్ష్మణుఁడు రావణునితోఁడియుద్ధముఁగోరి ముందునకు వచ్చి విల్లు దివిచి యగ్నిశిఖోపశరంబులను రాక్షసేశ్వరునిపయి నేసెను. రావణుఁ డాబాణంబులను మార్గమధ్యముననే ప్రతిబాణంబులచేత సంహరించి లక్ష్మణుఁడేయు బాణంబునకు బాణంబు రెంటికి రెండుగా మూఁటికి మూఁడుఁగాఁ బదింటికిఁబదిగా నిజహస్తలాఘవం బేర్పడఁ బ్రతిశరంబులు వైచుచు వైరిభల్లంబులనెల్లఁ ద్రుంచుచుఁ గొంతసేపు వానితోఁ బోరి యనంతరము వానినెడసి రాముని దాకి కన్నులనిప్పులు రాల్చుచు వానిపయి శరవర్షముఁ గురిసెను. రావణ ధనుర్ముక్తములై మహావేగంబునఁ దనవంక వచ్చుచున్న శరధారను రాముఁడు ఖండించెను. అంత నిరువురు నొండొరులపయి వాడికోలలను గురిపించిరి. అట్లు వారు పరస్పర జిగీషులై సవ్యాపసవ్యమండలగతులఁ జిత్రచిత్రంబుగాఁ దిరుగుచుఁ బ్రళయకాల యములోయన భయంకరమూర్తులై పెద్దయుండడవు పోరిరి. రామరావణధనుర్ముక్తశరంబులు జ్వాజ్వల్యమానంబులగుచు నింగిఁబఱచి విద్యున్మాలాసమాకులమేఘంబును దలపించెను ; అట్లు పఱచిన కోలలనడిమసందులంబట్టి గగనతలంబు గవాక్షితమోయనఁ దోఁచెను ; రణరంగమెల్ల గాఢాంధకారమయ మయ్యెను. ఇరువురును శస్త్రవిశారదులును మేటి విలుకాండ్రును దివ్యాస్త్రకోవిదులును గావున యుద్ధంబున సమానముగా విహరింపసాగిరి. ఏవైపునవారు మండలగతులఁ దిరుగుదురో యావైపునుండి బాణపరంపరలు వాతోద్ధూతసముద్రకల్లోలములువోలె నెగచి చిమ్మసాగెను. రావణుఁడు రాముని లలాటంబునఁ దీవ్రనారాచమాలికను నాటి యార్చెను. రాముఁ డాభల్లంబులను లెక్కసేయక రౌద్రాస్త్రమంత్రంబులను జపించుచు వేనవేలు సాయకంబులను రావణునిపయి గుప్పించెను. ఆశరములెల్ల రావణుని కవచంబును దాఁకి నేలరాలసాగెను. రాముఁడది గాంచి యాశీవిషంబులఁబోని బాణంబులను సంధించి రాక్షసేశ్వరుని లలాటంబును గుఱిచేసి వదలెను. వానినెల్ల రావణుఁడు ప్రతిశరంబుల వారించెను. రామబాణంబు లట్లు నిరుద్ధములై యైదుతలలపాములవలె నూర్చుచు నేలఁగూలెను. అంత రావణుఁ డాసురాస్త్రంబును బ్రయోగించెను. అయ్యస్త్రంబునుండి సింహవ్యాఘ్రముఖంబులును గంకకాకవక్త్రంబులును గృధ్రశ్యేనవదనంబులును సృగాలాస్యంబులును నీహామృగముఖంబులునుగల

తీవ్రబాణంబులు వేనవేలుగా వెడలి నోరప్పళించుచుఁ బంచాస్యమహోగ్ర సర్పంబుల పగిది భయంకరములై తోఁచుచు రాముని పయికి రాసాగెను. రాముఁ డాగ్నేయాస్త్రంబును బ్రయోగించెను. అందుండి యగ్నిదీప్తముఖంబులునుఁ సూర్యముఖంబులునుఁ జంద్రార్ధచంద్రవక్త్రంబులును ధూమకేతుముఖంబులును గ్రహనక్షత్రముఖంబులును మహోల్కాముఖంబులును గల శరంబులుప్పతిల్లి మెఱుఁగునాల్కలల్లార్చుచువచ్చి రావణప్రయుక్తబాణంబులను దాఁకి వానినెల్లఁ దునియలొనర్చెను వానరులు తమసంతోషంబులను గోలాహలధ్వనుల వెల్లడించిరి.

రావణుఁడు తనయస్త్రంబట్లు వమ్మగుటకుఁ గనలి మయవిహిత రౌద్రాస్త్రంబును బ్రయోగించెను. అందుండి ద్యుతిమంతంబులును వజ్రసారంబులునైన గదాశూలముసలంబులు ప్రళయఝంఝానిలవేగంబున వెడలసాగెను. రాముఁడు గాంధర్వాస్త్రంబున వానిని బ్రతిహతమొనర్చెను. రావణుఁడు క్రోధఘూర్ణితాక్షుఁడై సౌరాస్త్రంబు నేసెను. అందుండి దేదీప్యమాన చక్రంబులు వెడలి గగనతలంబెల్లఁ గ్రమ్మి వేనవేలు చంద్రసూర్యగ్రహంబులొక్కటఁ బొలిచెనో యనఁ దోఁచుచు దిగ్దిగంతర నభోభాగంబులనెల్ల వెలిఁగించెను. రాముఁడు ప్రతిశరంబులు వైచి వానినెల్ల నడంచెను. రావణుఁడు మహోగ్రుఁడై పదిశరంబులవైచి రాముని మర్మస్థానంబులను గాటించెను. రాముఁడవి లెక్కసేయక రావణుని మర్మస్థానములందు క్రూరనారాచంబులు నాటి వానిని నొప్పించి సుంత విరామముఁ గోరెను.

—♦ రావణ లక్ష్మణుల యుద్ధము ♦—

లక్ష్మణుఁడు మునుపడవచ్చి వాడియమ్ము లేడువైచి మనుష్యశీర్షకమైన రావణధ్వజమును దుండించి యొక్కకోల వానిసారథితలఁ దెగటార్చి యేనుతూపుల వానిధనుస్సును ఖండించెను. విభీషణుఁ డంతలోన సందుకొని నీలమేఘనిభంబులునుఁ బర్వతోపమంబులునైన రావణుని రథాశ్వంబులను గదతోఁ బ్రహరించి మట్టుపెట్టెను. రావణుఁడు క్రిందికి దుమికి క్రోధమూర్తియై దీప్తాశనినిఁబోని శక్తినిగొని విభీషణునిపయి వేసెను. లక్ష్మణుఁడు దానిని బాణత్రయంబున భేదింపఁగా నది తుత్తునియలై విస్ఫులింగ

ములను గ్రక్కుచు మహోల్కాతతివలె నేలం గూలెను. రావణుం డంబులకు మహాగ్రహంబు నొంది కెట్టించినపూనికతోం గాలదురాసదంబును స్వతేజః ప్రదీప్యమానంబునునైన మహాశక్తిని ధరించి విభీషణుని గుఱిచేసి గిఱగిఱ త్రిప్పసాగెను. దానినిజూచి విభీషణుఁడు ప్రాణసంశయమందుట లక్ష్మణుఁడు గ్రహించి వానికి నడ్డముపోయినిలిచి రావణునిపయి బాణవర్షముం గురిపించెను. లక్ష్మణజ్యాముక్త శరపరివృతుండై రావణుఁడు విముఖీకృతవిక్రముండగుచుం జేయిం గదలింపనేరక 'లక్ష్మణా! విభీషణుని దప్పించితివిగదా ? ఆఫలంబును నీవే యనుభవింతువుగాక. మద్బాహుపరిఘోత్సృష్టమై వచ్చుచున్న యీమహాశక్తి నీహృదయ రుధిరంబు లాని గాని తనియదు' అని వచించి మయమాయాబలనిర్మితయు ఘంటాష్టకవిరాజమానయు నమోఘయునైన దానిని విసరివైచి యార్చెను. ఆశక్తి పిడుగుమ్రోంతతో లక్ష్మణునిమీఁదికి నురికెను. రాముఁడదిచూచి 'స్వస్త్యస్తు లక్ష్మణాయ మోఘాభవ హతోద్యమా' యని పలికెను. ఆశక్తి యురగరాజుజిహ్వవలె దీప్యమానమహాద్యుతితో వెడలి లక్ష్మణుని వక్షోభాగముం జొచ్చెను. సౌమిత్రి శక్తిహతుండై పండుటాకువలె నేల వ్రాలెను.

## — రామ రావణ ద్వితీయయుద్ధము —

రాముఁడు తమ్ముని దురవస్థకు దుఃఖితుండై కన్నీరు నించుచు ముహూర్తమాత్రము నిర్విణ్ణతం దాల్చెను. ఆశక్తిని లక్ష్మణుని యురంబునుండి పెకలింప వానరవీరులు సమర్థులుగాకైరి. రాముఁడంతలోన వ్యసనంబు నణంచివైచి యుగాంతపావకభీకరమూర్తియై రెండుచేతులంబట్టి యాశక్తిని విఱిచివైచి రావణప్రసారితములై తన మర్మస్థానములను భేదించుచున్న వాలుతూపులను సహించుచుం దమ్మునిం గవుంగిలించుకొని వానరవీరులను జూచి 'మీరెల్లరు లక్ష్మణునిజుట్టి కాచియుండుము ; చాతకంబునకుం జిరకాంక్షిత వర్షకాలమేఘసందర్శనంబట్లు నాపరాక్రమంబునకుం జిరకాలేప్సితమైన సమయము సంప్రాప్తమయ్యెను. పాపాత్ముఁడును బాపనిశ్చయుఁడునైన యీదశగ్రీవుని దునిమెట్టింతును. వేయేల ? రాముఁడో రావణుఁడో యొక్కఁడు మిగులును. ఇరువురము మనంబోలము. రాజ్యవినాశదుఃఖంబును వనవాసక్లేశంబును దండకారణ్య పర్యటన ఖేదంబును

వైదేహీహరణవ్యసనంబును దమ్మునకైన నిరయోపమ మహాఘోరశోకంబును గూడి నానిలువెల్ల నేర్చుచున్న యీమంటలు రావణ రక్తధారాప్లుతములై చల్లారును గాక. ఎవని నిమిత్తము వాలిని వధించి సుగ్రీవునకుఁ బట్టముఁ గట్టి కపిసైన్యంబును గూర్చి యిటు తెచ్చితిమో, ఎవనికై మహోత్తుంగ తరంగాభీలసముద్రంబున సేతువును నిర్మించి మున్నీటిని దాఁటివచ్చితిమో యాపాపాత్ముఁడిప్పుడు నాకంటియెదుట నిలిచెను. కంటివిసంబుగల పాప ఱేని దృష్టిపథంబునఁ బడిన వాఁడువోలె నాదృష్టిపథగతుఁ డిఁక జీవింపఁడు. వానరవర్యులారా! మీరెల్లరుఁ బర్వతాగ్రముల స్వస్థముగాఁ గూర్చుండి నాకును రావణునకును జరుగనున్న యుద్ధంబును విలోకింపు చుండుము. నేను నిక్కముగా రాముఁడనగుట దేవర్షిచారణగంధర్వలును ముజ్జగంబులును నేఁడు గ్రహించుగాక. దేవమర్త్యతిర్యగ్జడంబులెల్ల భూమి గలంతకాలము మాయుద్ధమును నానాగతులఁ జెప్పుకొనుచుండుగాక' అని పలికి యుద్ధాభిముఖుఁడై తప్తకాంచనభూషణంబులైన శితబాణంబులను సంధించి రావణుని గుఱిచేసి యేసెను. రావణుఁడు రాముని పయి దేదీప్యమానంబులైన శరంబులను ముసలంబులను దదితరవివిధాయుధంబులను మేఘము జడివానవలెఁ గురిసెను. రామరావణశరంబు లన్యోన్యము దాఁకి పోరి పడసాగెను. ఆబాణంబుల తీవ్రాగ్రంబులు తఁనిగ్గి యుల్కావర్షముగా రాలెను. వారిజ్వాలతలఘోషంబులకు సమస్తభూతంబులును దల్లడిల్లెను. రావణుఁడట్లు కొంతవడిఁ బోరి రామబాణవృష్టి వికీర్ణమానుఁడై భయార్తిభావవిహ్వలతఁ గాంచి వాతోద్ధూతవలాహకము భంగిఁ దటాలునఁ బలాయనమయ్యెను.

### —♦ రాముఁడు లక్ష్మణునికై శోకించుట ♦—

రాముఁడంత లక్ష్మణునిపంక మరలి నెత్తుటఁదోఁగుచున్న యతనికై వగచుచు సుషేణుని బిలిచి 'భిషగ్వరా! రావణబలనిహతుఁడై భూమి పయిఁబడి సర్పమువలె బొర్లాడుచున్న నాతమ్మునకు నెంతయుం దుఃఖమయ్యెడు. నాకుఁ బ్రాణాధికుఁడైన లక్ష్మణుఁడిట్లు నెత్తుట జొత్తిల్లుచుండుటఁ జూచుచుఁ బ్యాకులాత్ముఁడనైన నేనెట్టు లోర్వ నోర్తు?

సమరవిఖ్యాతుండును శుభలక్షణలక్షితుండు నైన నాతమ్ముండు నా దురదృష్ట వశంబునఁ బ్రాణంబులు వాయు నేని నాకు సుఖమేల? జీవమేల? నా కట్టెదుట నాతమ్ముండు నిహతుండగుటకు లజ్జించెనో యనఁగా నా పరాక్రమము వెనుదీయుచున్నది; విల్లు హస్తాగ్రమునుండి జాఱుచున్నది; సాయకంబులు సత్త్వహీనములయ్యెను; దృష్టి బాష్పావిలమై కానరాదు; స్వప్నయానంబునందువలె గాత్రంబులు వెనుకకు లాగుచున్నవి; అవయవంబులు కదలియాడవు; దుఃఖము దుర్భర మగుచున్నది; మూర్ఛ యయ్యెడు. ఇఁక యుద్ధమేల? జీవితమేల? అయ్యో! లక్ష్మణా! భార్యల నెందఱనో సంపాదింపవచ్చును; మిత్రులం డేనిఁ గలుగుదురు. తమ్ముఁడు మాత్రము దొరకఁడు' అని వ్యసనకలుషస్వాంతంబునఁ బలికి విలపింప సాగెను. సుషేణుఁ డావ్యసనంబును సైరింపనోపక 'రామా! వగవనేల? లక్ష్మణుఁడు చావఁడు. అదిగో చూడుము వానిముఖము వికృతంబునుగాని వివర్ణంబునుగాని కళాహీనమునుగాని పొందదు. వాని యఱచేతులందలి రక్తిమ పాయదు; వాని నేత్రంబులు ప్రసన్నంబులై యున్నవి. వాని గుండె యాడుచున్నది చూడుము. మృతులం దీలక్షణములు విపరీతములై యుండును. దుఃఖము వలదు' అని పలికి హనుమంతుని జూచి 'మారుతీ! ఓషధిపర్వతంబునకుఁ జని తచ్ఛిఖరాంతముననున్న విశల్యాసువర్ణసంజీవసంధానకరణులను గొని రమ్ము' అనెను. హనుమంతుఁడు తొంటియట్ల తోడ్తోడఁ జని యప్పర్వతంబుఁ జేరి యామూలికను గొనివచ్చెను. సుషేణుఁడు వాని చేత లక్ష్మణుని దేర్చి యెల్లరకు నానందముఁ గూర్చెను.

రాముఁ డానందబాష్పంబులను గురియుచుఁ దమ్మునిఁ గవుంగిటఁ బొదివి 'నాయనా! మాభాగ్యవశంబున మరల జీవించితివి. నీవు బ్రదుకవేని నాకీ యుద్ధమేల? విజయమేల? తుదకు సీతయైన నేల?' అనెను. లక్ష్మణుఁ డామాటలకు నడ్డుపడి 'అన్నా! రావణునివధించి విభీషణునకుఁ బట్టముఁ గట్టుదు' నని ప్రతినచేసితివి. సాధుజనులు మాటఁ దప్పరు. ప్రతిజ్ఞాపరిపాలన మేగదా మహాత్త్వలక్షణము? నాకై నీ విట్లు నైరాశ్య మొందుట యిఁకఁ జాలు. సింగంబుకంటఁబడిన మత్తేభము బ్రదికిన బ్రదుకుఁగాని నీ బాణపథగతుఁడైనవాఁడు జీవించునా? సూర్యుఁ డస్తమించులోన రావణుని చావుఁ జూడఁ గోరుదు. రావణవధ నీకు సమ్మతమేని విభీషణునకుఁ

బల్కినమాట సేయఁదలంతువేని రాజవరేణ్యుఁడైన జనకరాజు యొక్క ముద్దుకూతు సీతాదేవినిఁ బడయుభావము నీకు ముమ్మాటికిఁ గలదేని యొండు తలంపక నామాటమన్నింపు' మనెను.

## — ♦ రామ రావణుల మూడవ యుద్ధము ♦ —

అంతలోన రావణుఁడు మఱియొకరథంబెక్కి రాహువు రవిమీఁదికి వలె రాముని పయికి నురవడించి వజ్రోపమంబులైన శరంబులను గురిపింప సాగెను. రాముఁడును రావణుపయి దీప్తానలసన్నిభంబులైన బాణంబులను బ్రయోగింపఁజొచ్చెను. రథగతుఁడై రావణుండును ధరాగతుఁడై రాముండు నొండొరులతో యుద్ధమొనర్చుచుండుట దేవాదులు పరికించి యది సరిగాదనిరి. వారిమాట దేవేంద్రుఁడు విని తనసారథిని బిలిచి 'మాతలీ! నారదధనుఃకవచబాణశక్తులను గొనిపోయి రామునికొసంగి వానికిఁదోడ్పడు' మనెను. మాతలి యంతటఁ గాంచనచిత్రాంగదంబును కింకిణీశతభూషితంబునుఁ దరుణాదిత్యసంకాశంబును వైడూర్యమణికూబరంబును హేమజాల విభూషితంబును శ్వేతచామరయుక్తంబును సువర్ణదండధ్వజంబును హరిత వర్ణాశ్వబంధురంబును నైన రథంబును ధనుఃకవచాదులతోడ స్వర్గమునుండి గొనివచ్చి 'రామా! ఐంద్రములైన యీరథచాపకవచబాణశక్తులను మహేంద్రుఁడు నీకుఁబంపఁగాఁ గొనివచ్చితిని. ఈరథంబు నారోహింపుము; నేను సారథ్యము వహింతును; పాకశాసనుఁడు దానవులనువలె నీవు రావణుని వధింతు' వనెను.

రాముఁడారథంబునకుఁ బ్రదక్షిణనమస్కారంబొనర్చి దాని నారోహించెను. అంత రామరావణులకు నద్భుతంబును దుములంబును రోమహర్షంబునైన ఘోరయుద్ధమొనరెను. రావణుఁడు గాంధర్వాస్త్రము నేసిన రాముఁడు గూడ గాంధర్వాస్త్రము నేవైచి దానిని బ్రహరించెను. రావణుఁ డేయస్త్రమును వైచునో రాముఁడుగూడ నయ్యస్త్రము నేవైచి దానినిఁ బ్రతిహతమొనర్చుచుండెను. రావణుఁడు తనయస్త్రంబులెల్ల నిరర్థకంబు లగుటకుఁ బరమక్రుద్ధుఁడై మహాఘోరమగు రాక్షసాస్త్రమును బ్రయోగించెను. అయ్యస్త్రము రావణధనుర్ముక్తమై విషవహ్నులుం గ్రక్కుచున్న తీవ్రసర్పంబులుగాఁ బరిణమించి నోరువిచ్చి రామునిపయికి నురికెను. అట్లు

దీప్తభోగంబులై విషాగ్నులఁ గ్రమ్మరించుచుఁ దనపయికివచ్చుచున్న యాపన్నగంబులను రాముఁడు చూచి గారుడాస్త్రంబును బ్రయోగించెను. అందుండి వేనవేలు గరుడపక్షు లుద్భవించి యాపన్నగంబుల నెగఁదన్నుకొని పోయెను. రావణుఁడు తనయస్త్రంబట్లు ప్రతిహతంబగుటకు మండిపడి ఘోరశరవృష్టిని వర్షించి రాముని నొప్పించి మాతలినిఁ బ్రహరించి యింద్రరథధ్వజంబు నొక్కఁకోలఁ గూలనేసి యశ్వంబుల తనువెల్ల జల్లెడక్రంతలుగా నొనర్చి విజృంభించి బుధుఁడు రోహిణిమీఁదికివలె రాముని మీఁదికి నడరి ధూమాగ్నులమండుచున్న సముద్రముకై వడి భయంకరాకారుఁడై తోఁచుచు దివాకరమండలంబును దాఁకనున్నాఁడోయనఁ గానిపించెను.

భాస్కరుఁడు కాంతివిహీనుఁడై కత్తివలె శ్యామలవర్ణముఁ దాల్చి కబంధాకార ధూమకేతు సంసక్తిఁబొంది మహాపరుషంబుగాఁ దోఁచెను. ఇక్ష్వాకువంశరాజుల నక్షత్రమైన విశాఖా నక్షత్రంబు నంగారకుఁ డాక్రమించెను. దేవదానవచారణగంధర్వు లీ వికృతంబులనుజూచి విషణ్ణులైరి. విభీషణాదులు దుఃఖమొందిరి.

రావణుఁడు చెలఁరేగి యిరువదిహస్తంబులతోను బాణపరంపరలు ప్రయోగింపసాగెను. ఆశరంబులు నఖశిఖపర్యంతము నాటుటవలన రాముఁడు బాణసంధానమునకుఁగూడ నోపక భ్రుకుటీలలాటుండును సంరక్తలోచనుండునై చూడ్కులచేత లోకంబులను దహింపనున్నాఁడో యనఁ దోఁచెను. రామునిముఖవైఖరిఁగాంచి సమస్తభూతంబులు బెగడొందెను. మేదినీతలము వడఁకెను ; పర్వతంబులు చలించెను ; సముద్రుఁడు సంక్షోభించెను ; విహంగంబులును మేఘంబులును నింగిఁబర్వి ఘోరధ్వనుల గావించుచు మహోత్పాతంబులను సూచించెను ; రావణుండును భయవిహ్వలుఁ డయ్యెను.

రామరావణులట్లు మహోగ్రమూర్తులై ప్రాణంబులకుఁ దెగించి పోరిఁ బోరింబోరటఁ గాంచి తమతమ పక్షపాతంబులు వెల్లడిగా నమరులు దాశరథికిని నసురులు దశకంధరునకును జయవచనంబులు పల్కిరి. రావణుఁడు కన్నుల నిప్పులు రాల్చుచు శూలంబును బట్టి దిగ్దిశాస్ఫాలనంబుగా సింహనాదముఁ గావించి,

మ॥ వినుమా నాదు ప్రతిజ్ఞ రాఘవ ! భుజావీర్యంబు దీపింపఁగా
నిను సీతమ్మఁ గృతాంతవాసమునకున్ నేనిప్పుడే పంపి దై
త్యనికాయ ప్రముదంబుఁ గూర్చెద సురల్ త్రాసార్తులై నల్దెసల్
చనఁగాఁ గోతులు తల్లడిల్లఁ ద్రిజగత్సంభావనల్ మ్రోఁగఁగన్॥

అని పలికి యాశూలంబును బ్రయోగించెను. అది ఘంటాష్టధ్వనుల మ్రో యుచు విద్యుజ్జ్వాలాప్రదీప్తమై యుగాంతవహ్నిచయంబోయన మండుచు యమునకుఁ గూడ వెఱపుగలిగించుచు రామునిమీఁదికి నురికెను. దాశరథి దానిని వారింపఁ బెక్కు బాణములనేసెను గాని యవియెల్ల దావాగ్ని యందు శలభంబులట్లు భస్మీభూతములయ్యెను. రాముఁడు తనశరంబు లట్లగుటకు మహోగ్రమూర్తియై మాతలి తెచ్చియిచ్చిన శక్తిని బ్రయోగిం చెను. దాని తాఁకునకు రావణుని శూలము ఖండఖండములై కూలెను. అంత రాముఁడు వజ్రకల్పములైన భల్లంబులఁ బెక్కు సారించి దశగ్రీవుని హయంబుల నొప్పించి వానియురస్స్థల లలాటంబులందు మూఁడేసి యమ్ములు గ్రుచ్చెను. రాక్షసేశ్వరుఁడు నెత్తుటఁ జొత్తిల్లి సంఫుల్లాశోకంబువహిఁ దోఁచెను.

రావణుఁడట్లు శరార్దితుఁడై మహాక్రోధము వహించి రాముని పయి బాణసహస్రంబును వర్షించెను. దాశరథి నిశాచరశరతాడితుఁడై త్రోక త్రొక్కిన త్రాచుచందంబున నిశ్వసించుచు యుగాంత భాస్కరతేజో విరాజమానంబులైన యుగ్రబాణంబులను గ్రహించి 'రాక్షసాధమా ! జనస్థానంబున నొంటిగానున్న నాభార్యను నాపరోక్షంబున దొంగిలించి పఱచివచ్చిన నీవును బరాక్రమశాలివే ? పతినిబాసి దీనయై మహావిపినంబున నేకాకిగానున్న యబలామాత్రురాలి నపహరించినందులకుఁగా లజ్జింపవా ? నీశౌర్యము స్త్రీలమ్రోలనేగాని పురుషులమ్రోలఁ జెల్లునా ? పరస్త్రీలను జెఱపట్టు మేటిబంటు నీయట్టివాఁడు గలుగఁడు. వినాథస్త్రీజనంబు విష యంబునఁ గాపురుషకర్మంబొనర్ప లేశమాత్రము వెనుదీయవు ; శాస్త్ర మర్యాదను బాటింపవు ; మానంబు విడిచితివి ; సదాచారంబుఁ ద్యజించి తివి ; దర్పోద్ధతుండవై నీమృత్యువును నీవే తెచ్చుకొంటివి. ఇన్ని యకా ర్యంబు లొనర్చియు 'నావంటి శూరుఁడు లే' డని యేతులవోదువు శూరం

డవును గుబేరసోదరుండవును దపోబలాపిసము స్తదర్పసమధికుండవు నగుటఁ గదా సీతాపహారరూప మహాశ్లాఘ్య యశస్కర కర్మంబు నొనర్చితివి. ఏగర్వము నిన్నిట్లు లోకగర్హితంబును బరమాహితంబునైన దుండగంబునకుఁ బ్రేరేపించెనో యాగర్వముయొక్క ఫలమిప్పు డనుభవింపుము. నీవు సీతను మత్సమక్షంబున ధర్షించియుండువేని యప్పుడే యచ్చటనే నీతలలం రాలియుండును. దురాత్మా ! నాఁడు జీవితకాలశేషమునుండి తప్పించుకొం టివి. నేఁడు చావు మూడి నాకంటఁ బడితివి. ఇదిగో నిన్ను యమసాద నంబునకుఁ దరలించుచున్నాను. దీప్తకుండలాలంకృతంబైన నీశిరంబును మచ్ఛరచ్ఛిన్నమై ధరాతలంబునఁబడి బొర్లాడు దానిని క్రవ్యాదిమృగంబులు కాలఁదన్ని నేలనీడ్చుకొని పోనున్నవి. నీయురఃక్షతంబునుండి చిప్పిలనున్న రుధిరంబులు గృధ్రంబుల విదాహముఁ దీర్చుఁగాక' అని పలికి శితశిలీముఖం బుల నతని నాటనేసెను. మఱియు రామునకు వీర్యబలహర్షోత్సాహం బులు రెట్టించెను ; దివ్యాస్త్రములెల్లఁ బ్రాదుర్భవించెను. ఆ శుభచిహ్నంబు లకు రాముఁడు మహోత్సాహియై నిజశరప్రయోగలాఘవంబును మెఱయిం చెను. వానరులు శిలావర్షముఁ గురిసిరి. రావణుఁడు రామశరవర్షంబునకును గపులశిలావృష్టికిని డస్సి విఘూర్ణహృదయుం డయ్యెను. ఎప్పుడు వాని మనస్సు వైక్లబ్యమునందెనో యప్పుడే యతఁడు చాపగ్రహణశరసంధానం బులకు సమర్థుఁడుగాక మోడయి నిలిచెను. ఆవిపరీతంబును దత్సారథి పరికించి రావణుని రణరంగమునుండి మెలమెల్లగాఁ దొలగించెను.

—♦ రావణుఁడు తనసారథిని దూషించుట ♦—

రావణుఁడు కొండొకతడవునకుఁ దెలివొంది తనసారథి సేత గ్రహించి మృత్యుప్రేరణ మోహవశంబులఁ జేసిఁ బెల్లు కినిసి 'దుర్మతీ ! ఈరావ ణుండు వీర్యహీనుండనియో యశక్తుండనియో తలంచితివా ? నాపౌరు షంబు లేదనని భావించితివా ? పిఱికినైతిననుకొంటివా ? ఏకారణంబున నాకిట్టి యవజ్ఞ గావించితివి ? చిరసమార్జితమవియ యశోవీర్యపరాక్రమం బులకు క్షణములోఁ దీఱని మచ్చగలిగించితివి. రావణుఁడు వెనుదీయఁ డను లోకవిశ్వాసమెల్ల నీటఁబుచ్చితివి. ప్రఖ్యాతవీరుని విక్రమరంజితుని శత్రువుల మ్రోలఁ గాపురుషునిగాఁ జేసితివి. దుర్బుద్ధీ ! పగతుని లంచము

నకు లోఁబడితివా ? అట్లుకాకున్న నిట్టిదొనర్తువా ? నా మేలుగోరువాఁ డెవ్వఁడేని యిట్లొనర్చునా ? నాకడఁ బెద్దకాలముగా నుండుట మఱువవేని నా యొనర్చిన యుపకారంబులు నీకు విస్మృతిప్రాయంబులు గావేని, వైరి నన్ను వెదకి రాకమున్నె నారథంబును వానికి సభిముఖంబు గావింపు' మని నిందాపూర్వకముగా నాజ్ఞాపించెను. సారథి యాపరుషవచనంబులు విని 'రాక్షసేశ్వరా ! భయంబునఁగాని మౌఢ్యంబునఁగాని వైరికి లోఁబడిగాని ప్రమాదంబునఁగాని యట్లు చేయుటగాదు. నీమే లెంతయుఁ గోరుదు. నీచేసినయుపకారంబుల మఱువలేదు. నీహితంబునుగోరి నీకీర్తిని గాపాడ దలంచి నీయెడఁ గూర్మిఁజేసి యట్లొనర్చితిని. నిండుమనస్సుతో నీకు నా యొనర్చిన ప్రియంబిక్కారణి నప్రియమయ్యెను. ఇది కాలవిశేషముగాని వేఱుగాదు. ఎన్నడును నన్ను సంశయింపవు. నేఁడు నిష్కారణంబుగా నాకు దోషము మూటఁగట్టితివి. అయినను నా సేఁతకుఁ గారణము వినుము. నీవు పెద్దయుఁదడవు పోరి సొమ్మసిల్లితివి. నీయెడ యుద్ధానుకూలసౌఖ్యము ప్రహర్షంబులు సన్నగిల్లెను. రథాశ్వంబులును డస్సి దైనదీనములై వర్షమునఁ దడిసిన గోవులట్లు ఘర్మపరిశ్రాంతము లయ్యెను. రాక్షససేనయం దెల్లఁ బ్రతికూలనిమిత్తములు గానవచ్చెను. సారథి దేశకాలపరిస్థితులను శుభాశుభనిమిత్తంబులను స్వపరరథికుల భావంబులను బలాబలంబులను దైన్యఖేదహర్షంబులను గ్రహించి సమవిషమప్రదేశంబుల నెఱిఁగి సమయాసమయంబును విమర్శించి వైరిఛిద్రంబులను బట్టి కాలానుగుణముగా రథంబును నడుపవలయును. రాక్షసేశ్వరా ! ఇవియెల్ల యెఱుంగుదుఁ గావునను రథికరథాశ్వంబులకు విశ్రాంతి యవసరంబని తోఁచెఁ గావునను నే నట్లొనర్చితిని. ఇదంతయు నీయందలి స్నేహమువలనఁ గావించితినిగాని యొండు గాదు. ఇదిగో నీయాజ్ఞ యొనర్తు ; త్రిశుద్ధికి నీపంపు గావించి నీఋణముఁ దీర్చికొందు' ననెను.

## —♦ ఆదిత్యహృదయోపదేశము ♦—

రావణుఁ డావచనంబులకు హృష్టచిత్తుఁడై సారథిని బహువిధంబులఁ బ్రశంసించి 'సూతాగ్రణీ ! మనరథంబును రామాభిముఖంబుగా నడపుము. రావణుఁడు వైరిని వధింపక మఱలఁడుగదా' యని రణోత్సాహోక్తులాడి వానికి హస్తాభరణంబును బారితోషికముగా నిచ్చెను. సారథి యంత

రథంబును రామాభిముఖంబుగాఁ దోలెను. రావణుఁ డట్లు రణోత్సాహియై మరలవచ్చుట రాముఁడు చూచి 'ఇతఁడు సామాన్యుఁడు గాఁడు. నా పరత్వంబును బ్రకటింపకయే యితని నిగ్రహించు మార్గము గలదా?' యని లోలోనఁ దలపోయసాగెను.

అంతలోన నగస్త్యభగవానుఁడు యుద్ధవిలోకనార్థియై దేవతలతోఁ డ వచ్చుటకు వచ్చి రాముని చింతాకారణంబు నూహించి వానిని సమీపించి 'నాయనా! నీతలఁపు చిక్కు గ్రహించితిని. మర్త్యావతారము గ్రహించితివి గావున మర్త్యభావంబును వదలరాదు. రావణుఁడు దుర్జయుఁడనుట నిజము. వానిని జయించుటకుఁ బరమరహస్యము వినుము. వత్సా! సనాతనంబును బవిత్రంబును సర్వశత్రువినాశకమునైన మంత్ర మొండుగలదు. అది యెంతయు నీకు జయప్రదమగును. నిత్యము నవ్యయంబు సఫలదంబును బరమ శుభకరంబును సర్వమంగళ మాంగల్యంబును సమస్తపాపప్రణాశనంబును జింతాశోకప్రశమనంబును నాయుర్వర్ధనంబును బరబ్రహ్మ ప్రతిపాదకంబును నైన యీమంత్రంబును నీకు నుపదేశింతును. ఎవనిని బరమాంతరంగభక్తు లుపాసింతురో, ఎవ్వఁడు సర్వోపాస్యుఁడో, ఎవ్వఁడు నిరతిశయదీప్తిమంతుఁడో, ఎవనివలన లోకంబులు క్రియాపరత్వ మొందునో సకలవ్యవహారాధిష్ఠాత యెవఁడో, ఎవని తేజస్సు సమస్తేతర తేజస్సులను బరిభవించి ప్రకాశించునో, ఎవ్వనివలనఁ జంద్రాదులు దీప్తిమంతులగుదురో, ఎవ్వఁడు సమస్తలోక నియామకుఁడై తనరునో, ఎవ్వఁడు మూలాది బ్రహ్మరంధ్రాంతయోగాధారభూమికలకు నధిష్ఠాయకయగునో, ఏ మండలాంతర్వర్తిపురుషుఁడు నిఖిలదేవతలకు నాత్మభూతుఁడో, ఎవ్వఁడు వృష్టిరూపంబున సమస్తభూతంబులకు నిష్టాన్నప్రదాన మొసంగునో, ఎవఁడు త్రిమూర్తిస్వరూపంబున దేజరిల్లునో, షణ్ముఖశరీరకుం డెవఁడో, ప్రజాపతిశబ్దవాచ్యుఁ డెవఁడో, మహేంద్రస్వరూపంబున నిరవధికైశ్వర్యంబు లెవఁడు గూర్చునో, ప్రసిద్ధసకలప్రదుఁ డెవఁడో, జగత్సంహారక కాలమూర్తియు సర్వనియంతయగు యముడును, అమృతమూర్తియైన సోముఁడును, ఉదకస్వామియైన వరుణుండును, సమస్తపితృదేవతలును, ధ్రువాద్యష్టవసువులును, హంసాది ద్వాదశసాధ్యులును అశ్వినీదేవతలును సప్తసప్తిమరుత్తులును మనువులు శరీరాంతస్థ ప్రాణాది వాయువులును అగ్నిదేవుండును బ్రాణకోటిప్రాణంబును బుతుకర్త

యుండై యెవఁడొప్పారునో యా మహాత్ముని స్తోత్రరూపకమైన యీమం
త్రమింతటిదని వచింపరాదు. దీనిని ఆదిత్యహృదయమందురు.' అని చెప్పి
యిట్లుపదేశించెను.

"నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తుతే ॥ 1

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయేనమః ।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥ 2

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమోనమః సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః ॥ 3

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః ।
నమః పద్మప్రబోధాయ ప్రచండాయ నమోస్తుతే ॥ 4

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాఽదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥ 5

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయాఽమితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయేనమః ॥ 6

తప్తచామీకరాభాయ హృదయే విశ్వకర్మణే ।
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥ 7

అగస్త్యభగవానుఁ డిట్లాదిత్యహృదయస్వరూపంబు నుపదేశించి 'రామా ! ఈమంత్రప్రతిపాద్య దేవతయే సర్వసృష్టిస్థితిలయకారకుండును సకలయజ్ఞసమారాధ్యుఁడును నై తనరును. వేయేల ! లోకమందుఁ బ్రాణికోటికెల్లఁ గ్రియాతత్సాధనంబులను గూర్చు భగవంతుఁ డితఁడే గదా. కష్టములు వచ్చినప్పుడుగాని కాంతారాది దుర్గమమార్గంబులందుఁ జిక్కినప్పుడుగాని భయహేతువులు గలిగినప్పుడుగాని యీమంత్రమును జపించినచో సర్వాపదలు సమసిపోవును. ఈమంత్రజపంబునకు నధికారినియమము లేదు. ఎల్లరు దీనిని జపింపవచ్చును. నీవు దీని నేకాగ్రమతితో సంకల్పపూర్వకముగా ముమ్మాఱు జపించి కార్యమునకుఁ గడంగుము ; రావణుని దప్పక వధింతు' వని పలికి చనెను.

రాముఁ డంతఁ బ్రయతాత్ముఁడై యాదిత్యునియందు దృష్టినిలిపి యాచమించి మంత్రంబును జపించి మరల నాచమించి శుచియై నిలిచెను. రాముఁడు శ్రీమన్నారాయణాంశసంభూతుఁడైనను లోకప్రబోధనార్థమై యాదిత్యమండలాంతర్యామియైన భగవంతు నట్లు స్తుతింపఁగా నమ్మహాత్ముఁడు దేవతాపరివేష్టితుఁడై వచ్చి 'రామా! రావణవినాశకాలం బాసన్నమయ్యెను. త్వరసేయుము' మని పలికి యంతర్హితుఁ డయ్యెను. అంత రాముఁడు విల్లు పూని రావణవధోద్యుక్తుఁడయ్యెను. అంతలోన రావణుని రథము ఘంటాకింకిణీనినదంబులతో మహావేగంబున నప్రదక్షిణంబుగా వచ్చెను. రాముఁడు వజ్రాభిహతికిఁ బర్వతంబు పెట్లి మ్రోఁగుటోయన ధనుష్టంకారమొనర్చి 'మాతలీ! అదిగో చూడుము వైరి రథము వేగాతిశయజనితప్రమాదవశంబునఁ గాఁబోలు అపసవ్యముగా వచ్చుచున్నది. ఇది వినాశహేతువనుట తప్పదు. ఇట్టిప్రమాదంబునకు నెడమీయక మనరథంబును వైరిరథంబునకు నభిముఖంబుగాఁ బోనిమ్ము. వాయువు మింట వ్రేలినమబ్బునట్లు రావణుని వధించి పుత్తును. దైన్యప్రమాదంబులొందక మనోదృష్టులను నిలిపి వాగెలు చక్కఁగాఁ బట్టి రథము నడుపుము. పురందరుని సారథికి నీకుఁ జెప్పవలయునా? యుద్ధసమయము గావున నిది జ్ఞప్తి చేయుటగాని యుపదేశించుట గాదు సుమా!' యనెను.

మాతలి రామునివచనప్రకారమొనర్చెను. వానిరథచక్రోద్ధతికి రేఁచిన దుమారముయొక్క తాఁకువడికి రావణునిరథము చలించెను. అసురేశ్వరుఁడు మహోగ్రహమొంది కెంజాయలు గురియుచున్న తన కన్నులనువిచ్చి తేఱి చూచి నిజరథాభిముఖుఁడై నిలిచిన రామునిపయి వాడితూపులు పఱపెను. రాముఁడును వైరిధర్షణామర్షణంబులకు ధైర్యరోషంబులు వహించి మాతలి కొనివచ్చియిచ్చిన యైంద్రశరాసనశరంబులను గ్రహించెను. వారట్లు పరస్పర వధోద్యోగులై పంచాస్యగజంబులపగిది నొండొరు దాఁకిరి.

అత్తఱి రావణుని రథంబుపయి రుధిరంబులు వర్షించెను; సుడిగాడ్పులు మహాతీవ్రములై వీచి యప్రదక్షిణంబుగాఁ జుట్టెను; గృధ్రంబులు గుంపులుగూడి రావణుని తేరు ననుసరింప సాగెను; లంకానగరము పట్టపగటింటనే సంధ్యారాగగ్రస్తమై యుండుచున్నట్లు దోఁచెను; నిర్ఘాతం

బులును మహోల్కలును ఫెళఫెళధ్వనులలో రాలెను. రావణుడున్న చోటు చలించెను; వైరి సైన్యప్రహరణార్థము రక్కసులెత్తినచేతు లట్లే నిల్చుకొని కదలవాయెను; రవికిరణంబులు రక్తనీలధవళపింగళవర్ణంబులై రావణుని తనువెల్లఁ గప్పెను; సృగాల గృధ్రంబులు నోటనిప్పులు గ్రక్కుచు రావణుని కట్టెదుట భయంకరముగాఁ గూయసాగెను. పెంధూళులు రేగి రాక్షసేశ్వరుని గన్నులు గప్పెను; మబ్బు వ్రేలకయే యుల్కాశనులు రాక్షససైన్యము మీఁదఁ గురిసెను. దిక్కులును విదిక్కులును దమోగ్రస్తమయ్యెను; అంతరిక్షము పాంశువర్షతిరోభూతమైఁ జూడరాకుండెను; శారికలు ఘోరముగాఁ గూయుచు నొండొంటితోఁ బోరుచు రావణుని రథంబుపయి నూర్ణకోలఁది పడుచుండెను; రక్షోనాథుని రథాశ్వంబులు జఘనంబులనుండి విస్ఫులింగంబులను నేత్రకోణంబులనుండి జలధారలను నిరంతరముగా విసర్జింపసాగెను. రక్కసు లీ మహోత్పాతంబులనుఁ జూచి తమ హానికి దిగులొందిరి. రామునకు శుభనిమిత్తములు పెక్కులయ్యెను. దాశరథి శకునకోవిదుండు గావునఁ దన్నిమిత్తంబులను గాంచి యాత్మవిజయంబును రావణవినాశంబును నిశ్చయించి హర్షనిర్వృతులఁ బడసి విక్రమించెను.

రామరావణులకు సర్వలోకభయావహంబుగా సంగ్రామం బావహిల్లెను.

"మ. కరిగాత్రంబుల ఘోటకాంగకములం గప్పెన్ సమిద్భూమి యా
చ్చెరువైయుండఁగ రథ్యసూతరథికశ్రేణీవపుఃఖండముల్
దొరగం దుత్తుమురయ్యెఁ గాల్బలములస్తోకప్రవాహంబులై
పరగెన్ రక్తనదుల్ పిశాచకులమంభఃకేళిలోలంబుగాన్॥"

వారి పోరు చూచుచు నుభయపక్షవీరులు నిర్నిమేషులై నిలిచిరి. రావణుఁడు రామరథధ్వజంబును గుఱిచేసియేయ నబ్బాణంబు నట్టనడుమ రథశక్తిందగిలి విఱిగి కూలెను. రాముఁడు రావణునకుఁ గినిసి యత్యంత తేజోవిశేష జ్వాజ్వల్యమాన తీవ్రబాణంబును సంధించి రావణుని ధ్వజంబును గుఱిచేసి పైవ నచ్ఛర హతికి రాక్షసేశ్వర రథధ్వజము రెండుఖండములై కూలెను. రాముని యాటోపంబునకు రావణుఁడు కోపవివశుఁడై బాణా

వక్షముఁ గురిపించి దాశరథి రథాశ్వంబులను నొప్పించెను. ఆ హయంబులు శరహతంబులయ్యు సుంతయుఁ జలింపకుండెను. రావణుఁ డదిచూచి మఱింతగనలి మాయాబలంబు నధిష్ఠించి గదాపరిఘంబులను జక్రముసలంబులను గిరిశృంగంబులను వృక్షంబులను మఱియు నానావిధాయుధంబులను రామునిపయిఁ గురిపించెను. వివిధశస్త్రమయమైన యావర్షము రామ శర పరిహృతమై దవ్వు చని వానరసైన్యము పయి రాలెను. ఆకాశమెల్ల రావణ బాణనిరవకాశమయ్యెను. రాముఁడు రావణునకు నవ్వి శరసంధానమొనర్చి యసురేశ్వరుని బాణంబునకుఁ బ్రతిబాణంబులు లక్షోపలక్షలుగాఁ గ్రుమ్మరించెను. గగనభాగము రామరావణ శరనిబిడమై యపరాకాశమావరించెనో యనఁ దోఁచెను.

ఆవీరశిఖామణులను జూచి సమస్తభూతంబులు నివ్వెఱగందెను. వారిసారథులు తమతమ నేర్పు మెఱయించుచు మండలప్రత్యాగత వీథీ గతులఁ జిత్రచిత్రంబుగా రథంబులను నడపి మఱలఁ బరస్పరాభిముఖులైరి. అరదంబులు కాఁడితోఁగాఁడియు ధ్వజంబుతో ధ్వజంబును దాఁకెను. హయంబు లొంటొంటిముఖంబుల దరిసెను. రాముఁడంత విల్లు దివిచి నాల్గు శరంబులు వైచి నిజరథాశ్వంబులకు నడ్డునిలిచియున్న వైరిరథతురంగంబుల నాల్గింటి నవ్వల జోపఁగా రావణుఁడు కోపోద్దీపితుఁడై రామునిఁ జెక్కుటమ్ముల నొప్పించి వజ్రపాతంబులట్టి శిలీముఖంబులను మాతలిమీఁద నేసెను. అవి వానిని మునుముట్టవయ్యెను. రాముఁడు మాతలికై కోపవ్యసనంబులు గాంచి వాలుతూపులు పెక్కు సారించి రావణునిఁ జలింపఁజేసి తోడ్తోడ నతనిపయి నూర్లార్లుగా శరంబులను గుప్పించెను. రావణుఁడు కోపోగ్రమూర్తియై గదాముసలంబులను వర్షించి రాముని నొప్పించెను.

గదాదినిస్వనంబులకును శరపుంఖపాతంబులకును సప్తసాగరంబులు ఘూర్ణిల్లెను; పాతాళవాసులు కంపిల్లిరి; భూతలంబు సశైలవనకాననంబుగాఁ జలించెను; సూర్యుఁడు కాంతిదొఱఁగెను; వాయువు వీచుటమానెను; దేవ గంధర్వాదులు భయగ్రస్తులై 'గోబ్రాహ్మణులకు మేలగుఁగాక; లోకంబులు శాశ్వతంబుగా నుండుఁగాక; రాముఁడు రావణుని జయించుగాక' అని స్వస్తివాచకంబులు పలుకుచు జపమొనర్పసాగిరి. 'ఆకాశంబునకు నాకా

శంబును సముద్రంబునకు సముద్రంబును సాటియగునట్లు రామరావణ యుద్ధంబునకు రామరావణయుద్ధమే సాటి' యని చూడవచ్చి నింగి నున్న వారెల్లరు సాశ్చర్యంబుగాఁ బలికిరి.

"సీ॥ రథకరితురగోష్ట్రపృథివీపరాగంబు
దెసలనాకసమున దీటుకొనియె
బాణాదిహేతి సంపాతజాతములగు
మంటలర్కాంశుల మరలఁ ద్రోఁసె
హాస్తికపాలరథావయవములు భగ్న
ములగు రవము లుగ్రముగఁ జెలఁగె
వివిధసేనాగాంగ విదళనంబునఁ గ్రమ్మి
రక్తపూరములు ఘోరంబులయ్యె
గీ. అతిశయప్రౌఢిరాఘవ రాక్షసేంద్ర
చండసైన్యద్వంద్వంబునుద్దండసమర
గతులవెక్కసంబొనరించె ఖచరసాధ్య
సిద్ధులకు ముక్కుపై వ్రేలు చేరెనపుడు॥"

అంత రాముఁడు పన్నగంబునుబోని శరంబొండు సంధించి శ్రీమంతంబును కుండలమండితంబునైన రావణుని శిరంబును ద్రుంచెను. ఆతల క్రింద పడుటయే తడవుగా రావణునకు మఱొండు తల మొలచెను. దానిని గూడ రాముఁడు ఛేదించెను; వెనువెంటనే మఱియొకటి మొలచెను. రాముఁడు నూటొక్కసార్లు రావణుని తలలు ద్రుంచుటయు నవి వెనువెంటనే మొలచుచుండుటయు నసురేశ్వరుఁడు చావకుండుటయుఁ గాంచి 'అహో! ఏమి యీవింత! మారీచుని బరిమార్చిననాఁడుగాని ఖరదూషణులను ద్రుంచిన నాఁడుగాని విరాధుని విఱిచిననాఁడుగాని కబంధుని గడతేర్చిననాఁడుగాని మఱియెన్నడుగాని నాశరంబులు వమ్ముగుట యెఱుంగను. అట్టివిగూడ నేఁడితనియెడ వ్యర్థమయ్యెనుగదా' యని చింతించి రెట్టించిన పట్టుదలతో మరల వానిపయి శరవర్షముఁ గురిపించెను. రావణుండును రెగించి గదాముసలంబులను రామునిపయి వర్షించెను. అట్లు వారు కొంతవడి నేలనుండియుఁ గొంతపడి నింగినుండియు మహాభయంకర యుద్ధమొనర్చిరి. ఫాల్గుణశుద్ధ

చతుర్దశినాఁడు లంకాదహనము, పూర్ణిమనాఁడు రాముఁడు సముద్రతీరముచేరు టయు బహుళ ప్రథమా ద్వితీయా తృతీయలందు దర్భశయనంబును బహుళాష్టమినాఁడు సువేలాచలారోహణంబును నవమినాఁడు యుద్ధప్రారంభము నయ్యెను. నాఁటనుండి అమావాస్యవఱకు విరామమెట్టిదో యెఱుంగని యా రణంబప్పుడు మహాఘోరమై వర్తిల్లెను. పర్యవసానమెప్పుడో యెట్లో యని సురాసురులు తహతహపడసాగిరి.

యుద్ధమన్నినాళ్లుజరిగినను రామునకు జయంబు గలుగమి మాతలి చూచి వీరాగ్రణీ ! ఇతికర్తవ్యతామూఢుఁడట్లు వర్తింతువేల ? రావణుని నుపేక్షింతువా ? రామా ! దైవసూచితమైన రావణవినాశకాల మాసన్నమయ్యెను. బ్రహ్మాస్త్రము గలుగదా ?' అని జ్ఞాపకపఱచెను. రాముఁ డట్లు మాతలివలనఁ ప్రబోధితుఁడై బ్రహ్మాస్త్రంబును గ్రహించి వేదోక్త ప్రకారము దాని నభిమంత్రించి సంధించెను.

—♦ రావణవధ ♦—

రాముఁ డమ్మహాస్త్రంబును గూర్చినంతనే భూతంబులెల్ల భయమందెను ; వసుంధరామండలము వడఁకెను ; దశరథసూనుఁడంత నయ్యస్త్రంబును గర్ణాంతముగాఁ దివిచి వదలెను. అది రాక్షసేశ్వరుని హృదయంబును జీల్చి దూటివచ్చి తూణీరముఁ జొచ్చెను.

"శా॥ రామాస్త్రక్షతరక్తధారలాలుకన్ రక్షోవిభుండంత సు
త్రామోదంచిత వజ్రభిన్నమగు గోత్రక్ష్మాధరంబోయనన్
భూమింగూలె శరాసనంబు శిథిలీభూతత్వమొందంగ ను
ద్దామాక్రందము సేయుచున్ విగళితాంతస్సారసంచారుఁడై ॥"

"మ॥ ధరణీభూధరదిగ్గజాహిపతు లుద్యత్త్రాసులై క్రుంగి రు
ద్ధురభీతిన్ హతశేషదైత్యగణముల్ దూలెం బ్రమోదించె వా
నరయూథంబులు సిద్ధసాధ్యసురులానందించి రేపార న
చ్చరలుం గౌతుకమొంది యాడిరి సముచ్చద్గేయహృద్యంబుగాన్ ॥"

"మ॥ మొరసెన్ దివ్యమృదంగవాద్యములు సమ్మోదంబుగా గంధమే
దరమై చల్లనిగాలివీచె దెసలుం దోడ్తోన నాకంబు సుం

దరనైర్మల్యమునొందె భూతములు నుద్యత్ప్రీతిమైఁ జేర్చె ది
క్కరినాదంబులుమించె భద్రము సమగ్రంబయ్యెఁ జంచద్గతిన్ ॥"

—♦ విభీషణుఁడు రావణునిగూర్చి దుఃఖించుట ♦—

అట్లు రామరావణ యుద్ధంబమావాస్యలోఁ బరిసమాప్తమయ్యెను. విభీషణుఁ డంత రామునిఁ బ్రస్తుతించి రణరంగము వంకఁ దలఁ ద్రిప్పెను. రావణుని శవము వాని దృష్టిపథగతమయ్యెను. ఆశవంబును జూచినంతనే విభీషణుని పూర్వవైరంబులెల్ల దిగజారెను. అతఁడు నిర్భర దుఃఖవివశుఁడై 'అకటా! అన్నా! శూరాతిశూరుండవనియు నసదృశ పరాక్రమశాలివనియు నిఖిలశాస్త్రవేత్తవనియు రాజనీతిజ్ఞశిఖామణివనియు జగద్విఖ్యాతిని గాంచితివి. అట్టివాఁడవయ్యుఁ గామమోహావశంబున హితంబు వినక ఘోరమృత్యువు నోట దూఱితివి. అన్నా! సీతాపహరణంబు పాపకరమేగాక రాక్షసకులవినాశహేతుభూతంబు గూడ నగునని నాపల్కిన మాటకుఁ బ్రహస్తుఁడు ప్రహసించెను; ఇంద్రజి నవ్వెను; అతికాయనరాంతకులు గేలిసేసిరి. ఎల్లరుఁ దమగర్వఫలంబు ననుభవించిరి. అన్నా! నీసంగతి యన్యులవంటిదిగాదు. నీపతనము సూర్యుఁడు నేల రాలినట్లుగాఁ జంద్రుఁడంధకారంబున మునిఁగినట్లుగా నగ్ని చల్లారినట్లుగా నయ్యెను. నీచనుటవలన నుత్సాహశక్తి నిరాశ్రయయయు బ్రపంచము శూరశూన్యము నయ్యెను. అహో! శౌర్యంబనెడి క్రుఁగుపేటు నాశ్రయించి పెరిగి తపస్సనెడి చేవతోఁ దనరారి స్థైర్యంబను చిగురుటాకు జొంపంబులు దాల్చి సాహసంపుఁ బూవులు పూచి చెన్నొలయుచుండిన రావణవృక్షంబును రామఝంఝూనిలంబు సమున్మూలమొనర్చెనుగదా. కులవంశవంశంబునః గోపాపరగాత్రంబును బ్రసాదహస్తంబునఁ గలిగి తేజోవిషాణంబులఁ జెనకరాకుండిన రావణమత్తగజంబు క్షణములో నిక్ష్వాకుసింహనిహతమై నేలఁ గూలెను. పరాక్రమోత్సాహంబులనెడి మహార్చులు గ్రాలఁగా, నిట్టూర్పు ధూమంబెగయఁగాఁ స్వబలప్రతాపదుస్సహమై మండుచుండిన రాక్షసాగ్ని రామపయోధర సంసిక్తమై చల్లారెను. రక్కసులనెడి కొమ్ములును మూఁపురంబును నాఁడోఁకయుఁ గలిగి చెలరేగుచు వైరుల నురుమాడుచు గర్వంబున మదగజరాజంబునుబోలి విషయలౌల్యరూపకర్ణనేత్రంబులువిచ్చి యథేచ్ఛావిహారంబులనుండిన రావణవృషభేంద్రమును రామవ్యాఘ్రము

గావుఁగొనెను. కటా! అన్నా! నీకై యెంతయు దుఃఖింతు' నని విభీషణుఁడు విలపింపసాగెను.

— రాముఁడు విభీషణునోదార్చుట —

రాముఁ డది చూచి 'విభీషణా! రావణునికిఁగా వగవఁ గారణము లేదు. అతఁడు వీరస్వర్గంబును జూఱగొనెను. జంకుకళంకులులేని యట్టి వీరమరణంబెల్లరకు సిద్ధింపదు. క్షత్రధర్మస్థిరులై రణరంగంబునఁ బ్రాణంబులర్పించిన వీరులకుఁగా దుఃఖింపనేల? ఎవని పేరుచెప్పినంతనే ముల్లోకంబులుఁ దల్లడిల్లుచుండెనో యట్టి మహాపరాక్రమశాలి కాలవశతనందినందులకై శోకించుట యుక్తముగాదు. యుద్ధంబున జయమేగలుగుననెడి నిశ్చయములేదు గదా. శూరునకు జయలక్ష్మియో స్వర్గలక్ష్మియో యొకటి చేకూఱుట సిద్ధము. వీరస్వర్గము పూర్వాచరిత మార్గమేగాని నూత్నపథము గాదు. వీరస్వర్గశ్రీసమాశ్లిష్టుని గూర్చి వలపు తగదు. మఱియు జనన మరణంబులు శరీరధారులకు సహజంబులు. లోకవ్యవహారంబును బట్టిగాని శాస్త్రదృష్టిని బట్టిగాని జ్ఞానమార్గమును బట్టిగాని నీదుఃఖంబునకుఁ గారణము గానరాదు. అశోచ్యమునుగూర్చి శోకించుట వెఱ్ఱితనమగును. విభీషణా! సర్వముఁ దెలిసియు నీవిట్లు దుఃఖింపనగునా? చింతలుమాని కర్తవ్యముఁ జేయు' మనెను.

నావుడు 'రామా! దేవదేవేంద్రులవలనఁ గూడ నోటమి యెఱుంగని రావణుఁడు సముద్రము చెలియలికట్టనుంబలె నిన్నుఁ దాఁకి విఱిఁగెను. ఈ రాక్షసేశ్వరుఁడు చేసిన దానము లిన్ననరావు; ఈయన గురుజనంబు నెంతో భక్తితోఁ బూజించెను; ఈ దానవాగ్రణి యనుభవింపని భోగము గలుగదు; భృత్యులను బోషించుటయందుఁ గాని మిత్రులకు ధనమిచ్చుటందుఁ గాని యింతటివాఁడు లేఁడనిపించుకొనెను. ఇతనిని విరోధించి యోటుపడక పోయినవీరుఁడు నీవు దక్క యన్యులులేరు. మఱియు నితఁడాహితాగ్నియు మహాతపస్సంపన్నుండును వేదపారగుఁడును మహాకర్మశూరుఁడునై తనరెను. అట్టివానికిఁ బ్రేతత్త్వపరిహారార్థముగా నౌర్ధ్వదైహికక్రియలు యథోచితముగా జరుపుటకు ననుగ్రహింపు' మని విభీషణుఁడు కోరెను. రాముఁడు వానితలంపును గ్రహించి 'విభీషణా!

ఎంత వెఱ్ఱివాఁడవోయి నీవు ! వైరము మరణపర్యంతమేగాని యనంతరము చెల్లునా ? ఆవల దానివలన ఫలమేమి ? ఇతఁడిప్పుడు నీకెట్లో నాకు నట్లే యని గ్రహింపుము. యథోక్తసంస్కారంబు లెల్ల వీనికిఁ గావింపుము. రావణుఁడు మహాతపశ్శాలియనియుఁ వదాన్యోత్తముండనియుఁ బరమకర్మ ఠుండనియు వచించితివి. నీవచించినది సత్యము. అయిననొక్కటి గ్రహింపుము. ఇతండివియెల్ల సోపాధికబుద్ధితో నొనర్చెను' అట్లుగాక వీనినెల్ల నిరుపాధికబుద్ధితో నితఁడు చేసియున్నచో నిట్టిగతి యితనికి రాఁజాలదు. సోపాధికకర్మంబులకు లౌకికసంపదలు చేకూఱునేగాని మోక్షభాగ్యంబు గలుఁగనేరదు. లౌకికసంపదలకు నంతముగలదు. ఈరహస్యమెఱింగి వర్తించువాఁడు శాశ్వతసుఖమునందును. రావణుఁ డీరహస్యమెఱింగియుఁ బూర్వదుర్వాసనాబలవిశేషంబును జయింపనేరక దుర్గతిఁజెందెను. ఇట్టి దుర్వాసనలు పూర్వకర్మవశంబున దుర్వారములైనను వానినిఁ జిరాభ్యాస వైరాగ్యాది ప్రయత్నంబులవలన నివారింపనగును. అట్లొనర్చువారు క్రమక్రమముగా సంశుద్ధచిత్తులై యుత్తమగతి నొందుదురు. రావణునకుఁ గల ధైర్యోత్సాహ సాహసాదులీవంకకు మరలి యుండినచో నతఁడు మహాత్ములకెల్లఁ దలమానికమై యుండు' నని చెప్పెను.

## —♦ రావణ శుద్ధాంతకాంతా పరిదేవనము ♦—

అంతలోన రావణుని భార్యలు పతిమరణదుఃఖప్రేరితలై వారించినను నిలువక యంతఃపురమునుండి యుత్తరద్వారంబున వెడలి దూడలఁ బాసిన గోవులపగిదిఁ బసవుచు విరిసిన కేశజాలంబులతో రణభూమిఁ జొచ్చి 'హా ! రాజపుత్రా !' యని రామునిఁ జేర్కొనుచు 'హా ! నాథా !' యని భర్తను దలఁచి విలపించుచుఁ గబంధాంకంబును శోణితకర్దమంబును నైన యయ్యాజితలంబెల్ల వెదకి పతినిగాంచి తెగినతలలక్రియ వానిపయిం బడి, భర్తృశరీరంబును గవుంగిటఁ గూర్చి యొకతెయు, వానిచరణంబులఁ బట్టి యొకతెయు, వాని కంఠంబును సందిటఁ జేర్చి యొకతెయు, వాని భుజంబులెత్తి యురంబున నుంచుకొని యొకతెయు, వానిశిరస్సు నంకంబున నిడి యొకతెయు నిట్లందఱు నన్నివిధంబుల వానిని జుట్టి హిమజలంబులఁ బోని కన్నీరు నించుచుఁ బెనురోదన మొనర్చిరి. అట్లు

వారు క్షణక్షణవర్ధమానదుఃఖవివశలగుచు 'హా! నాథా! హా! జీవితేశ్వరా! సురాసురోరగాదులవలనఁ గూడ భయంబెఱుఁగని శూరునకు నీకు నేఁడు మనుష్యమాత్రునివలనఁ జావు సంప్రాప్తమయ్యెనే? నీధాటకు ముల్లోకంబులు తల్లడిల్లుచుండెను. నీకనుసన్నల దిక్పతులు వర్తించుచుండిరి. ఆపరాక్రమాదులు నేఁడేమయ్యెను? అయ్యో! హితులను వినక సీతను దెచ్చితివి. తత్ఫలముగా నీవును నీరాక్షసలోకంబును నీఱయ్యెను. నాథా? నీతమ్ముని మాట వినియున్న నిట్టిచేటు వాటిల్లదు. కాలవశంబునఁ జేసి కాకున్నచోఁ దమ్ముని నట్లవమానింతువా? వానిమాట విని సీతను రామునకు నప్పగించియుండినచో మూలహరమైన యీనాశనము మనకెల్లఁ దొలఁగియుండెడిది; విభీషణుని మనస్సు చెల్లియుండును; రాముఁడు మనకుఁ గూర్మిమిత్రమై యుండును; మాకీవైధవ్యము తప్పియుండును. క్రూరబుద్ధిం జేసి సీతను బలాత్కారముగాఁ గొనివచ్చి బందిచేసి నీకును మాకును రాక్షసకులంబునకును నేకకాలంబున నిట్టిచేటు గలిగించితివి. అయ్యో! నిన్ను నిందింపనేల? ఎల్లధర్మంబు లెఱింగియు నీవిట్లు వర్తించుట కాలవశంబునఁ గాక మఱియొకటిఁ గాదు. దైవము దాయమైననాఁ డెవరేమి చేయఁగలరు? దైవోపహతునకు సర్వబలముగాని విక్రమబలంబుగాని నిరర్థకములు; దైవగతిని మఱలింపఁదరముగాదు' అని పలువిధంబుల రోదనంబులు గావించిరి.

## మందోదరీ విలాపము

అంతలోన మందోదరి యటకు వచ్చి శవమై పడియున్న భర్తను జూచి 'మహాభాగా వైశ్రవణానుజా! నీకోపంబునకుఁ బురందరుఁడు గూడ వడఁకును. నీభయంబున సురాసురమహీసురచారణగంధర్వాదులు దిశలు ప్రాఁకిరి. రాక్షసేశ్వరా! అంతటివానిని నిన్ను మనుష్యమాత్రుఁడు జయించెనని వినుటకు లజ్జింపవా? పరాక్రమ విజిత త్రైలోక్యరాజ్యశ్రీ విరాజమానుండవైన నిన్ను వనగోచరుఁడైన మర్త్యుఁడు వధించుటకన్న నాశ్చర్యము గలదా? మానవలోక దుష్ప్రాప్యదేశము నందుండియుఁ గామరూపివయ్యు రామునివలన నోటుబడితివా? నీపరాక్రమం బసదృశము; నీబలం బనంతము. అట్టి నిన్ను వధించుట మనుష్యమాత్రుని కార్యము గాదు.

రాముఁడు జనస్థానంబున ఖరదూషణాదులను జతుర్దశ రాక్షసబలముతోడ సంహరించిననాఁడే యతఁడు మనుష్యమాత్రుఁడు గాఁడని యూహించితివి. దేవతలకుఁ గూడఁ జొరరాని యీలంకానగరంబునకు వానరమాత్రుఁడు హనుమంతుఁడు వచ్చినప్పుడే మాయామోహదృఢమై మేము వ్యథితచిత్తుల మైతిమి. వానరులు మహాసాగరంబునకు సేతువును గట్టిరని విన్నంతనే మాగుండియలు నీరయ్యెను. ఎవఁడు సర్వాంతర్యామియయి పరమాత్మయయి షడ్భావవికారరహితుండును సనాతనుండును బరాత్పరుండును నై యుండియు వివిధచిత్రజగన్నిర్మాణలీలాలాలసుఁడగుచుఁ దద్రక్షణార్థముఁ బురుషకారకర్మసంసర్గవంతుఁడగుచు గదాశంఖచక్రంబులు ధరించి వైకుంఠంబున వెలయుచుండునో, ఎవనివక్షోభాగంబున శ్రీవత్సలాంఛనం బొప్పారుచుండునో, వాగర్థంబులువలె సిరియు శివుండును నిరంతరం బవినాభావంబున నుందురో, యట్టి పరిచ్ఛేదరహితుండు సత్యపరాక్రముఁడు శ్రీమహావిష్ణువు రామరూపంబున నవతరించి వానరులుగా నవతరించిన దేవతలతోఁగూడి లోకహితార్థము సర్వలోకవిరోధులైన రాక్షసులను బరిమార్చెననుట ముమ్మాటికి సత్యము. నాథా ! ఏ యింద్రియంబులను మొదట జయించి తర్వాత ముల్లోకంబుల నోడించితివో యాయింద్రియంబులు పూర్వవైరంబును బురస్కరించుకొని సమయము వేచి నిన్నుఁ దటాలున నోడించెను. ఆకారణంబున నింద్రియంబులకు లోఁబడితివి. తత్ఫలముగా నీకిట్టి దుర్మరణము సంభవించెను.

రామునితోఁ బగవలదని చెవినిల్లుగట్టి చెప్పితిని. నామాటఁ బాటింపవైతివి. రాక్షసేశ్వరా ! పరస్త్రీవిమోహము సర్వవినాశకరమని శాస్త్రంబు లుద్ఘోషించును. సీతాదేవి కేవల స్త్రీమాత్రురాలని భావింపవలదు. ఆమె పతివ్రతాతిలకంబును జగన్మాతయు గాని వేఱుగాదు. అట్టి మహనీయురాలిని జెఱపట్టు దుర్మతులుందురా ? పతివ్రతయగు నేని నన్నేల దహింపదయ్యెనందువా ? అతల్లి వసుంధరవలె క్షమావతి గావున నిన్నట్లు గావింపదు. ఆమె నీకుఁ గీడు దలంపకున్నను నీయకార్యదోషంబును సీతాతపఃప్రభావంబును నిన్నుహరించెను. ఎప్పుడు నీవప్పరమపతివ్రతాతిలకంబును స్పృశించితివో యాక్షణమందే నీవు దగ్ధుండవై

యుండవలయును. అట్లుగానందులకుఁగా గారణంబు నూహింపలేక దేవతలింద్రాగ్ని సహితంబుగా వెఱఁగందుచున్నారు. సుకృతదుష్కృతులకుఁ దత్ఫలములుతప్పదు. కాలానుగుణ్యముగా నవి గలుగుచుండును. సద్యఃకాలముననే యవిగలుగనందున వానిని నిరసింపఁదగదు. విభీషణుఁడు రామాశ్రయరూప సుకృతినొనర్చి శుభముఁబడసెను. నీవో సీతాపహరణరూపపాపంబు నొనర్చి యీగతిఁ దెచ్చికొంటివి. నాథా! సీతయెడ నీకిట్టి బుద్ధిజనించుట నీ దుష్కృతపరిపాకముగాని వేఱుగాదు. ఆమెరూపంబును జూచి మోహవశుండవైతివా? రూపలావణ్యంబులందు సీతాదేవిని మించిన ప్రమదలెందఱో నీకుఁగలరు. ఒరులసంగతియేల? రూపచాతుర్యాదులందు సీతాదేవికి నేనుసాటిరానా? అట్టిప్రియురాలు నీకుండఁగా నీవక్కాంతను గామింపనేల? మోహము గన్నుగప్పి యింకచేసెను. ప్రాణులకు నిర్నిమిత్తమరణము గలుగదు. మైథిలి నీచావునకు నిమిత్తమాత్రురాలయ్యెను. కటా! మనోహరా! సీతారూపమృత్యువును వరించి దానినెంతదవ్వునుండి మోసి తెచ్చికొంటివి? నేటితో సీతాశోకముడిగెను; ఆమె యిఁక రామునిగూడి యథాసుఖము విహరింపగలదు.

నాగతి యేమయ్యెనో చూతువా? నీకంటికినింపుఁ గూర్చుటకై చిత్రవిచిత్రమాల్యాంబరాదులను గైసేసి నిన్నుఁగూడి యొనలేని సంపదలఁ బొలుపారుచుఁ గైలాసమందరమేరునగసీమలందునుఁ జైత్రరథవనాంతరములందును దేవోద్యానములందు విమానవిహారములు సల్పుచు దేవభోగంబులనుభవించుచుండిన నీ మందోదరికి నేటితో నట్టి కామభోగములెల్లఁ గలవయ్యెఁగదా? నాఁటిసంపదలను నేఁటి దుఃఖములను గాంచి రాజ్యలక్ష్మి నిక్కముగాఁ జంచలయగుట గ్రహించితిని. హా! రాజా! ఏనీచారువక్త్రము సుకుమారంబును సమున్నతంబును నై చంద్రశ్రీకమలసౌందర్యంబుల మెచ్చక సూర్యతేజోవిరాజమాన కిరీటసమలంకృతిని గాంచి రక్తాధరంబుతోను మాణిక్యకుండలంబులతోను దీపించుచు మదవ్యాకులలోలాక్షంబును వివిధమాలికా శోభావహంబును నై మొలకనగవు తేఁటమాటల నింపు గూర్చుచుండెనో యానీవక్త్రము నేఁడు రామభల్లనిర్భిన్నమై నెత్తుటఁ దోఁగుచు మేదోమస్తిష్కంబులను గార్చుచు రథపరాగరూక్షంబై పడియుండుటఁ

జూడనోచిన నాదౌర్భాగ్యంబు నేమనవలయునోగదా ? హా ! నాథా ! నీకు నిరయంబును నాకు వైధవ్యంబును గలుగునని కలలోఁగూడఁ దలంపనైతిని. మయునకుఁ బుత్త్రినై రాక్షసేశ్వరునకు నిల్లాలినిగాఁ దనరి ఇంద్రజిత్కిఁ దల్లినిఁగా నోచిన నాభాగ్యమున కెంతయు గర్వించితిని. స్త్రీకిఁ దండ్రియు భర్తయుఁ గుమారుండును గాలానుసారముగా రక్షకులగుదురు. అట్టి యండఁ నాకు దీఱెను.

హా ! ప్రాణేశ్వరా ! ఇంద్రనీలచ్ఛాయాస్నిగ్ధమై శైలోన్నతిఁ దనరి కేయూరాంగద వైడూర్యముక్తాదామపుష్పహారంబులఁ దేజరిల్లుచు విహారసమయంబులందు నత్యంత రమణీయంబును సమరకాలములందు మహాదీప్తవంతమునై వివిధాభరణంబుల కలిమి మెఱుంగులతోడి తోయదముక్రియఁ దనరారుచుండిన నీ తనువు తీవ్రబాణపరంపరాకలితమై తాకుటకుఁ గూడ నలవిగాక నాకుఁ గడసారి పరిష్వంగభాగ్యమును దవ్వయ్యెను గదా. నాథా ! ఇదంతయుఁ గలయో జాలమో గానోపును. కానున్న నీకును మరణమా ? లోకలోకాంతర రత్నరాసులకు నెవనిబొక్కసంబులు చాలవయ్యెనో, ఎవనిపేరు చెప్పిన మాత్రాన ముజ్జగంబులుఁ దల్లడిల్లునో, లోకపాలు రెవనికి నూడిగంబు సేయుటయ్యెనో, ఎవని బాహుబలంబునకు ముక్కంటికైలాసగిరి యోమనగాయ యయ్యెనో, ఎవనిపరాక్రమప్రచారంబునకు సురాసురయుద్ధంబులు పెనుషక్కులై వెలయునో, ఎవనిని లోకవిద్రావణుండనియు భూతవిరావణుండనియు వచింతురో, ఎవని యోజోదర్పంబు లింతనరావో, ఎవనిధాకకు నెఱచి నివాతకవచులు ప్రణమిల్లిరో, ఎవనిని స్వాతంత్ర్యప్రతిష్ఠాపనాచార్యుఁడందురో, సమస్తమాయ లెవని ననుసరించి వర్తించునో, ఎవనిశుద్ధాంతంబులు దేవాసురరాజకన్యకామణుల వలనఁ గిక్కిఱిసి యున్నవో, ఎవనికిఁగా శత్రుస్త్రీనయనంబులు నిరంతరాశ్రుధారలఁ గురియుచుండునో, ఎవనివలన లంకారాజ్యము సనాథమయ్యెనో, ఎవఁడు తనతలలు శివారాధనంబునకుఁ బుష్పంబులుగా నర్పించెనో ఎవనివలన సమస్తకామభోగంబులను జూఱకొనుచుంటిమో యట్టి రథికోత్తముని మహాప్రభావశాలిని మనోహరునిఁ గోలుపోయియు జీవించియున్నాను. అహో ! నా ప్రాణంబులెంత మొండివో ? నన్ను వజ్రసారంబున నిర్మించిరో ? రాక్షసేశ్వరా ! ఉత్తమశయనంబులను విడిచి రేణుపాటలమైన యీ

కట్టికిసేలను వరించితివా ? అయ్యో! పుత్త్రమరణశోకంబున బొగులుచున్న నాకు నీచావు పుంటిపయి ముల్లిడుచుటయ్యెను. నీవుగలవని యేదుఃఖంబును సైరించితిని. ఇఁక నాజీవమేల ? నాథా ! నాథా ! నీసుందోదరి నిట్లు కడలేని వ్యసనసాగరంబునఁ ద్రోయనగునా ? రాక్షసేశ్వరా ! దుర్గమంబును మహాదీర్ఘంబునైన చోటికిఁ బోవువారు సతినిఁ బాసి యొంటరిగాఁ జనరు. నన్ను వదలి పోయెదవేల ? ఏయపరాధకారణంబున నన్నుఁ ద్యజించితివి ? నీవు వలదన్నను నీవెంటవచ్చుచున్నాను. నాయెడఁ బ్రసన్నుఁడవై నన్ను సయితము గొనిపొమ్ము. నిన్నుఁ బాసి మనఁ జాలను. అయ్యో ! దీనయు దుఃఖభాగయునైన యీమందభాగ్యపయిఁ గరుణజనింపదా ? నాథా ! పలుకవేల ? కులమర్యాదను బాటింపక యిల్లువెడలి ముసుఁగుగూడఁ దాల్పక వచ్చితినని నాపయిఁ గోపమా ? నావలె భ్రష్టలజ్జావకుంఠితలై వచ్చియున్న యీనీసతులయెడ లేని యాగ్రహము నాయెడఁ జూపవేల ? నాథా ! నీవు సమస్తక్రీడాసంభోగంబులను గూర్చుచుండిన నీ ప్రియలిట్టు లనాథలై విలపించుట వినుచు నూఱకుందువేల ? వారియందలి నీయాదరము సన్నగిల్లెనా ?

రాక్షసేశ్వరా ! పతివ్రతలును ధర్మపరలును గురుశుశ్రూషాపరలునైన కులాంగనలకు నీవొక్కట వైధవ్యముఁ గూర్చితివి. వారిశోకాభితప్తశాపంబు నీకిట్లు సంప్రాప్తమయ్యెను. పతివ్రతలకంటనీరు నిష్కారణముగాఁ బుడమిపయి నొలికింపరాదనియు నట్లుగావించినచోఁ దత్ఫలము తప్పదనియు వచింతురు. ఆమాట నేఁడు సత్యమయ్యెను. నీయకార్యఫలముగా మాకెల్లరకు నిట్టిగతిగలిగెను. అయ్యో ! శూరాగ్రసరుండవై యుండియు స్త్రీచౌర్యనైచ్యకార్యంబునకు నెట్లొడంబడితివి ? నాథా ! ధీరులు ప్రాణహానియైన నోర్తురుగాని మానహానినోర్వరు. మాయామృగంబును జూపి రాముని దవ్వుచేసి వానిపరోక్షంబున వానిసతిని దొంగిలించితివని లోకమెల్ల నిన్ను దూఱుచున్నది. ఈనింద నీకుఁ గలకాలముండును. దీనినెట్లోర్తువో గదా ? అయ్యో ! ఎన్నఁడును లేని యీపిఱికితనము నీకు నాఁడు గలుగుటఁ జూడఁగా నదియే నీవినాశకాల సమాసన్న ప్రథమలక్షణమని తోఁచుచున్నది. నాథా ! నీవు వీరస్వర్గమును వరించితివి ; రణరంగంబునఁ బ్రాణంబులు దొఱఁగితివి. అందులకు శోకింపరాదు. స్త్రీమాత్రురాలను

గావున నాహృదయము కారుణ్యపరివర్తనమొంది యేర్చుచున్నది. నాథా! నీవు నీసుకృతదుష్కృతంబులరెంటిని వెంటఁగొని నీస్థానంబునకుఁ దరలితివి. నిన్నుఁగూర్చి దుఃఖింపఁగాదు. నీయట్టి జీవితేశ్వరుని బాసి బ్రతుకనోచిన నాదుష్కృతికి దుఃఖింతును. నాథా! మిత్రులను విసవైతివి; తమ్ముని నిరసించితివి; ఇచ్చకంబు లాదరించితివి; మాకీగతిఁ గలిగించితివి. నీల జీమూతసంకాశంబును బీతాంబరశోభితంబు నై మాకన్నులకు విందొనర్చుచుండిన నీతనువును రుధిరాప్లుతమై స్వగాత్రంబులను బాఱవైచి దీర్ఘనిద్రఁ గాచుచున్న కతన నీ దయితారత్నము మొఱలు వినరావా? దత్తుఁడును మహావీర్యసంపన్నుఁడును నపరాఙ్ముఖుఁడును నైన సుమాలికిఁగూర్చు దౌహిత్రిని నీ మందోదరిని గన్నెత్తిచూడవా? నాథా! నీవు గ్రుంగినంతనే సూర్యుఁడెట్లు చెలఁరేగి లంకాపురిపయి వెలుఁగుచున్నాఁడో చూడుము. ఇంత యవమానము పయికొన్నను నిద్రించుచుండఁదగునా? లే లెమ్ము; వీరాగ్రణీ! శత్రుసంహారోద్యమంబున నెయ్యది నీకుఁ బరమసాధనముగా నుండెనో దేని తేజస్సునకు నోడి చండభానుఁడు దాఁగుచుండెనో, వజ్రవజ్రంబుగూడ దేనికి సాటిగాదో, దేనిని నీవు నిత్యముఁ బూజింతువో, యా కాంచనాలంకృత పరిఘంబు రామబాణచూర్ణితమై నేలఁబఱచియున్నది చూడుము. నాథా! ఎంత మొఱపెట్టినను మేల్కొనవు. అయ్యో! నాకన్న ధరయే నీకుఁ బ్రియతర కాఁబోలుం. కాకున్న నన్ను వదలి సర్వాంగముల ధర నాలింగనమొనర్తువా? అయ్యో! మానవతికి నింతకన్నఁ దలవంపుగలదా? ఇఁక నాజీవము నిలువ' దనుచు వివిధగతుల విలపించి మూర్ఛాక్రాంతయై పతిశవంబుపయిఁ బడెను. సపత్నులు మందోదరిని లేవఁదీసి 'దేవీ! శరీరైశ్వర్యంబులు స్థిరములుగావు; వానికి మార్పాటుగలుగుచుండును. ఈ సంగతి నీకుఁ దెలిసితెలిసి వగవనేల!' యని యాశ్వాసించిరి. వారి యూరార్పులకు మందోదరి నిట్టూర్పులు ప్రతివచనంబులయ్యెను.

## — రావణ దహనసంస్కారములు —

రావణస్త్రీజనరోదనంబును రాముఁడు విని 'విభీషణా! వీరినెల్లరను బురంబునకుఁ బుచ్చి నీయన్నకు నుత్తరక్రియలొనర్పు' మనెను. విభీషణుఁడామాటవిని రామునిభావంబు నెఱుంగఁ గోరి 'నాయన్న ధర్మంబును

ద్యజించెను; క్రూరుఁడై ప్రాణివధఁగావించెను; కల్లకు వెఱువఁడు; పర దారాభిమర్శనము వానికి నిత్యక్రియయయ్యెను; ఇట్టి పాపాత్మునకు రావణునకు సంస్కారక్రియలు గావింపఁజాలను. ఇతఁడు నాకు భ్రాతృరూప శత్రువై వర్తించెను. ఇతఁడు గురుభావంబునఁజేసి పూజ్యుఁడైనను దురాచారుఁడు గావున నిగ్రహణీయుఁడయ్యెను. జ్యేష్ఠునకు సంస్కారం బొనర్పమికిఁ బెద్దలు నన్ను నిందింతురందువా? ఇతనిసంగతి యెఱింగినవారు నన్ను మన్నింతురేగాని నిందింప' రనెను.

రాముఁ డావచనంబు విని 'విభీషణా! నీతోడ్పాటువలన నాకీవిజయము చేకూరెను. ఇంతప్రియంబొనర్చిన నీకు హితంబుచెప్పుట నాకుఁ బరమధర్మమగును. రావణుఁడు నీవచించినట్టి వాఁడేయగుఁగాక. 'మరణాంతాని వైరాణి' యని వచించిరి. చచ్చినవారియెడఁ బగసాధించుట సాధుమతముగాదు. మనము వచ్చినకార్యము తీరెను. ఇఁక నతని చెయిదంబులు తలఁపవలదు. అతఁడు నాకుఁ గావించిన యపకారములో శతాంశముగూడ నీకొనర్పలేదు. అట్టి నాకే యతఁడు బంధువైనప్పుడు నీకుఁ గూడ బంధువేయని చెప్పనేల? ఎల్లచింతలు మాని యితనికి సంస్కారక్రియలొనర్పుము. ఇట్లు చేయుట నీకుఁ గీర్తికరమగు' ననెను.

విభీషణుఁడంత రావణసంస్కారక్రియలకు దొడఁగెను. ఋత్విజులు చందనకాష్ఠంబులతోఁ జితినిచేర్చి పద్మకంబులు వట్టివేళ్ళు మున్నగు గంధద్రవ్యంబులనుగూర్చి, దానిపయి తెల్లరోమంబులజింకచర్మంబును బఱచి, యంత్యేష్టిని వేదవిహితంబుగాఁజేసి, యథాశాస్త్రము పితృమేధసంస్కారమొనర్చి, చితికి నాగ్నేయదిశ వేదినిగల్పించి, యందుఁ బశ్చిమభాగంబున గార్హపత్యంబును దూర్పదెస నాహవనీయంబును దక్షిణపార్శ్వంబున దక్షిణాగ్నిని స్థాపించి దధిమిశ్రఘృతపూర్ణ హోమపాత్రలను సంతరించి, యా శవపాదముపయి సోమలతనుదెచ్చిన శకటంబును దాని తొడలనడుమ యజ్ఞార్థము వద్లుదంచు రోలునుబెట్టి, యర్ఘ్యోపోట్ల దారుపాత్రంబులను నరణిని నుత్తరారణిని రోఁకలిని నితరపాత్రలనుంచి, శ్రుతిస్మృతివిహితంబుగా భాగంబును వధించి హోమముగావించి దానిచర్మంబును నేతిలోఁ దడిపి రాక్షసేశ్వరుని గప్పిరి. రాక్షసులు విభీషణసహితంబుగా గంధమాల్య వివిధాం

బరముతో రావణునలంకరించి దుఃఖదీనమానసులగుచుఁ జితిపయిఁ బేలాలు చల్లిరి. అంత విభీషణుఁడు మంత్రసహితంబుగా నగ్ని నొసఁగి స్నాన మొనర్చి తడివస్త్రంబుతో వచ్చి ప్రేతావాహనార్థము దూర్వోదకమిశ్రిత తిలలు పుడమినుంచి సలిలదాన మొనర్చి సాష్టాంగనమస్కారముచేసి రావణుని పత్నుల నాశ్వాసించి పురంబునకుఁ జనుమని వారికి బహువిధసాంత్వ వాక్యములు పలికి వారిని సాగనంపి రాముని యొద్దకు వచ్చెను.

## —♦ దేవాదులు భయముడిగి చనుట ♦—

దేవగంధర్వదానవులు యుద్ధదర్శనార్థము వచ్చియున్న వారు దిగులుడిగి సంతోషహృదయంబులతోఁ దమతమవిమానము లెక్కి రామపరాక్రమంబును రావణఘోరవధంబును వానరయుద్ధకౌశలంబును సుగ్రీవుని మంత్రంబును లక్ష్మణుని యనురాగంబును వేనోళ్ళఁ గీర్తించుచు శుభకథలు చెప్పుకొనుచు స్వస్థానంబులకుఁ జనిరి.

రాముఁడంత మాతలిని గారవించి దేవేంద్రదత్తదివ్యరథంబును గొని పొమ్మని సెలవిచ్చెను. మాతలి రామునను మతితోఁ దరలెను. రాముఁడట్లు మాతలిని బంపి సుగ్రీవునిఁజేరి వానిని గవుంగిటఁగూర్చి 'వానరేశ్వరా నీసాహాయ్యంబున జయము చేకూరె' నని పలికి 'లక్ష్మణా! ఇఁక శిబిరంబునకుఁ బోవుదము రమ్మ'ని వానిని వెంటఁగొని పోయెను.

## —♦ విభీషణపట్టాభిషేకము ♦—

వారట్లు శిబిరముఁ జొచ్చినంత రాముఁడు తమ్మునిజూచి 'లక్ష్మణా! అనురక్తుఁడును మహోపకారియునైన విభీషణునకు లంకారాజ్యాభిషేకముఁ గావింపుము. ఆమహోత్సవముఁ జూడ నువ్విళ్ళూరుదు. ఈ కోరిక నాకెంతయుఁ బ్రియముగానుండెఁ' ననెను. లక్ష్మణుఁడు వల్లెయని సముద్రజలంబులకై సువర్ణకలశంబులతో మనోవేగవంతులగు వానర ప్రముఖులను బంపెను. వారుతోడ్తోడ సాగరనీరంబులు గొనివచ్చిరి. లక్ష్మణుఁ డంత విభీషణుని సింహాసనంబునఁ గూర్చుండఁ బెట్టి సువర్ణఘటజలంబుల వాని నభిషేకించెను. ఆకార్యమునకు విభీషణుని మంత్రులు ననుచరులును సంతసించి యాలంకేశ్వరుని శిరంబున నక్షతలును మోదకంబులును లాజలును

దివ్యపుష్పంబులును మంగళార్థముంచి పారితోషికంబు లర్పించిరి. విభీష ణుఁడాకానుకలను బరిగ్రహించి తెచ్చి రామలక్ష్మణులకు సమర్పించెను. రాముఁడును విభీషణుని ప్రీత్యర్థము వానినిగ్రహించి చెంతనున్న హనుమం తుని జూచి 'సౌమ్యా! రాక్షసరాజయిన యివ్విభీషణుని యనుమతింబడసి లంకాపురమునకుఁ జని విజయవాక్యంబును సీతకుఁ బలికి నేను సుగ్రీవలక్ష్మణ సహితంబుగాఁ గుశలముండుటయు రావణుఁడు నాచేతఁ జచ్చుటయుఁ దెలిపి ప్రతిసందేశమును గొని రమ్ము' మనెను.

## —♦ హనుమంతుఁడు సీతాదేవికడకుఁ బోవుట ♦—

హనుమంతుఁ డావచనముఁ దలఁదాల్చి విభీషణానుమతుఁడై చని యశోకవనంబున వృక్షమూలంబున రాక్షసస్త్రీలమధ్యఁ గ్రూరగ్రహపీడిత యైన రోహిణివలె సంతోషహీనయై యున్న సీతాదేవిని గాంచి తనపేరు చెప్పి నమస్కరించి నిశ్చలుఁడై సంకుచితగాత్రంబున నిలిచెను. సీతాదేవి వానిని మొదట గుఱుతింపఁజాలక కొండొకతడవు మిన్నకుండి యెట్టకేలకు జ్ఞప్తికిఁ దెచ్చికొని సంతసించెను. హనుమంతుఁ డామె ముఖలక్షణంబు లనుబట్టి యామె తనయెడఁ బ్రసన్నయగుట పరికించి 'దేవి! రామసుగ్రీవ లక్ష్మణులు సుఖమున్నారు. రాముఁడు శత్రువులను హరించి సిద్ధార్థుఁడై తనకుశలంబును నామూలకంబుగా నీకు నంపిచ్చుచున్నాఁడు. విభీషణుని సాహాయ్యంబునను వానరులతోడ్పాటునను లక్ష్మణుని నీతిబలంబునను రాముఁడు రావణుని బరిమార్చి యిట్లు నీకుఁ జెప్పుమనెను. 'దేవీ! నీకుఁ బ్రియవార్తను బంపుచున్నాను; వినిసంతోషింపుము. ధర్మజ్ఞా! నా భాగ్యవశంబున నిందాఁక జీవించియున్నావు. కానిచో నాశ్రమయెల్ల వ్యర్థమై యుండును. సీతా! విజయలక్ష్మి మనపైఁ గటాక్షించెను. ఇఁక దుఃఖమెడసి స్వస్థచిత్తవగుము. శత్రుహస్తగతవైన నిన్ను విడిపింప దృఢ వ్రతముఁబూని నిదురగూడ మాని మహోదధికి సేతువును నిర్మించితిని. రావణుఁడు హతుఁడయ్యెను; నామాట కొనసాగెను. లంకానగర మిప్పుడు విభీషణుని యధీనమయ్యెను. నీవిఁక స్వగృహమునం దున్నట్లుగా భావిం పుము. నీసందర్శనార్థము విభీషణుఁడు రానున్నాఁడు' అని విన్నవించెను.

సీతాదేవి యావచనంబులు విని ప్రహర్షమొంది లేచి యేమో చెప్ప బోయి యానందనిరుద్ధకంఠయై తహతహపడసాగెను. హనుమంతుఁ డది చూచి 'దేవీ! ఏమో లోలోనఁ దలంతువుగాని పలుకవుగదా' యనెను. నావుడు 'మారుతీ! మన్నాథవిజయాకర్ణన సంతోషాతిశయము నన్నుఁ బలుకనీయదు. ఇంత ప్రియవార్తను తెచ్చిన నిన్ను నభినందింపఁ దగువచ నంబు లెంతయూహించినను స్ఫురింపకున్నవి; ఏదేని యమూల్యవస్తువు నొసంగి నీకుఁ బ్రీతిఁ గూర్తునాయన్న నందులకుఁ దగినది కానరాదు.' అని హర్షగద్గదవచనంబులం బలికెను. హనుమంతుఁడు చేదోయిఁ గూర్చి 'భర్తృ విజయకాంక్షిణీ! ఇట్టి స్నిగ్ధవచనంబుఁ బలుక నీకేయగును. సారవంతం బునుఁ బ్రీతిపురస్సరంబునైన నీ మాటయే చాలును. అంతకు మించిన సత్కృతిలేదు' అనెను. సీతాదేవి పరమప్రీతయై 'హనుమంతా! ఆ కాంక్షాయోగ్యతా సన్నిధి మత్పదవత్త్వరూపవాక్యలక్షణంబులతోఁ గూడి నట్టియు విన్నంతనే హృదయంగమమై యానందమునుగూర్చునట్టి మాధుర్య గుణమును గలిగినట్టియు గ్రహణ ధారణ స్మరణాద్యష్టాంగబుద్ధిపూర్వకమై నట్టియు వచనంబును బలుక నీకేతగును. నీయట్టి పరమధార్మికునిఁ బడసి యయ్యనిలుఁడు నిక్కముగాఁ బుత్త్రవంతుఁడయ్యెను. బలశౌర్యసత్త్వ విక్రమసామర్థ్యంబులును దేజఃక్షమాధృతిస్థైర్యవినీతత్వంబులును దయాజ్ఞా నంబులును నీవలన శోభిల్లుచున్నవి. ఇది నిక్కము; స్తుతివాక్యముగా' దనెను. మారుతి యామెకుఁ దలతో మ్రొక్కి 'తల్లీ! తొల్లి నేనిటవచ్చి నప్పుడు నీచుట్టునున్నయీరాక్షసాంగనలు నిన్నాడిన కఠోరతర్జనగర్జనం బులు నాశ్రవణాంతరములందు నేఁడును మాఱుమ్రోయుచున్నవి. వీరికిఁ గ్రూరవధతక్క యొండు శిక్ష తోఁపదు. అనుజ్ఞయేని నాపగఁదీర్చుకొం దును. పతియేదైవమని తద్వియోగశోకంబున బందియై కృశించుచున్న నీ యెడ సుంతయు జాలి చూపని యీకూళలకుఁ దగుప్రాయశ్చిత్తము గావిం పక తీఱదు. ఈ వరము నాకు ననుగ్రహింపుము. మంగళస్వరూపిణీ! ఈభయంకరాకారలను పిడికిళ్ళఁ బొడిచి చేతులఁజిదిమి కాలఁదన్ని మో కాళ్ళమోఁది కోఱలుడుల్చి చెవులుదఱిగి ముక్కులు వ్రచ్చి కేశంబులరాల్చి పట్టికొట్టి క్రూరవధగావించునందాక నా క్రోధము చల్లారదు. యశస్వినీ! నీకింతయెగ్గు గావించిన వీరి నూఱకపోనీయఁగా' దనెను. మైథిలి

యామాటలువిని 'హనుమంతా! వీరెల్ల రావణునిఁ గొలిచి యుండురు. పరసేవాపరులకు స్వాతంత్ర్యములేదు. ఇట్టివారు స్వామియాజ్ఞ నొనర్పక తీఱదు. పరాధీనులకార్యములకుఁ గోపపడుటతగదు. కాలికిగా వీరింత యొనర్చిరేగాని నాయెడఁబగచేసికాదు. మఱియు జీవులకు సుఖదుఃఖంబులు వారివారి పూర్వసుకృతదుష్కృతఫలంబులుగా సంప్రాప్తమగుచుండును. ప్రాప్తంబు ననుభవింపక తీఱదు. నాతొల్లిపాపంబు ననుభవించు కాలము వచ్చి నాకిట్టియిడుమలు కలిగెనని నానిశ్చయము. ఇదియునుంగాక యొకని యాజ్ఞవలన వీరు నన్నిట్లు కష్టపెట్టిరో యతఁడు సమసెనని చెప్పితివి. వానితోడ వీరిదుండగములుగూడ సమసెను. ఇఁక వీరివలన నాకు బాధలు రావు. ఒకవేళ వీరు స్వతంత్రించి యట్లు నన్ను బాధించియున్నను వీరికిఁ బ్రత్యపకారము తగదు. నిదర్శనార్థము కథయొకటి గలదు వినుము. ఒకానొకవ్యాధుఁడు వేఁటకై యరణ్యాంతరమున సంచరించుచుండెను. వానిని బెబ్బులి వెన్నాడి తఱిమెను. వాఁడాపులికి భయపడి చేరువనున్న చెట్టు మీఁది కెక్కెను. ఆపులి చెట్టుక్రిందికి వచ్చి పొరచూచి వృక్షాగ్రంబున నున్న భల్లూకమును గాంచి 'ఋక్షమా! ఈవ్యాధుఁడు మనమృగకులమున కెల్ల శత్రువు; వీనినిఁ బడఁద్రోయుము' మనెను. నావుడు 'వ్యాఘ్రమా' ఇతఁడు నాయున్నచోటికి వచ్చెను. అట్టివానిని ద్రోయుట ధర్మహాని' యని పలికి యది నిద్రించెను. వ్యాఘ్రమంతట వ్యాధునిజూచి 'వ్యాధాగ్రణీ! నిన్ను రక్షింతును; ఈనిద్రించుచున్న యెలుంగును బడఁద్రోయుము' మనెను. వాఁడాయెలుంగునుఁ బడఁద్రోసెను. భల్లూకమంతలో మేల్కొని యభ్యాసవశంబునఁ గొమ్మలను బట్టుకొని క్రిందపడదయ్యెను. అంతట వ్యాఘ్రము భల్లూకముతో 'ఋక్షమా! నామాటవినని ఫలముఁ గంటివి గదా? ఇఁకనైనఁ గృతాపరాధునిఁ బడఁద్రోయుము' మనెను. భల్లూకంబవ్వచనము విని 'వ్యాఘ్రమా! అపకారికిఁగూడ నుపకారమొనర్చుట సజ్జనలక్షణంబగు. నీమాట నాకిచ్చగింపదనెను. అంత నవ్వ్యాఘ్రంబడియాసలు మాని చనెను. మారుతీ! సజ్జనులు వధార్హులయెడ సయితము నెనరూనవలయును. ఇది నామతము. మఱికి తగినఁగదా స్థానమపేక్షింతురు? దండ్యులను గనికరించుట ధర్మశాస్త్రవిరోధమందువా? 'దుష్టాపి శరణాగతో రక్షణీయ' అని విశేషశాస్త్రముగలదు. ఆర్యులావచనంబును బాటింతురు.

హింసాస్వభావులను శిక్షింపకుండుట దోషమందువా? తప్పుచేయని ప్రాణి సృష్టిలోనే గలుగదు. ప్రతివ్యక్తి యంతోయింతో దోషమొనర్చును. దోషాచరణము నైజముగానున్నది సుమా' యనెను. హనుమంతుఁడు పరమాశ్చర్యమంది 'యశస్వినీ! నీవు రామునకు ధర్మపత్నివగుట యుక్తమే గదా; ప్రతిసందేశము నను గ్రహింపుము; రామునొద్దకుఁ బోయెద' ననెను. నావుఁడు 'వానరోత్తమా! నా పతినిఁ జూడఁగోరుదు' నని యామెచెప్పెను. 'ఆర్యా! శచీదేవి హతవైరియైన దేవేంద్రునట్లు నీవు నీరాముని బూర్ణచంద్రాననుని నవశ్యము చూతు' వని హనుమంతుఁడు వచించి సాక్షాల్లక్ష్మి వలెనున్న యామె యనుజ్ఞ వడసి రామునొద్దకుఁబోయి 'రామా! ఏదేవి నిమిత్తమింత ప్రయత్నమొనర్చి సేతువు గట్టి యాఫలోదయము శ్రమింగితివో యాదేవిని జూడనగును. శోకాతిశయంబునఁ జిక్కి కన్నీరు గార్చి గార్చి స్రుక్కియున్న యా కళ్యాణి నీజయవృత్తాంతంబునకు సంతోషవికాసమొంది పూర్వపరిచయంబునఁజేసి నామాట నమ్మి 'కృతార్థుఁడైన నా పతినిని లక్ష్మణుని జూడఁగోరుదు నని పలికె' ననెను.

## సీతారాముల సందర్శనము

రాముఁడు కన్నీరు నించి నిట్టూర్చి నేలఁ జూచుచుఁ 'గటా! రావణునియింట నింతకాలమున్న సీతను బరిగ్రహింతునేనిఁ దీజనిలోకాపవాదమగును. నిర్దోషురాలిని ద్యజింతునేని మహాదోషము పొరయును. ఏమి సేయుదు' నని సుంత చింతించి 'విభీషణా! నీవు చని సీతకు శిరస్స్నానాదికములు గావింపించి దివ్యాంగరాగసమస్తభూషితనుగా నయ్యింతి నిటకు వెంటనే తోడ్కొని రమ్మ'ని వానిని బంపెను. విభీషణుఁడు తనస్త్రీలను వెంటఁగొని సీతాదేవికడకుఁబోయి రామాజ్ఞను వారివలన నామెకుఁ దెలిపెను. వైదేహి యామాట విని 'నాయీవేషంబుననే నాభర్తను జూడవలతు' ననెను. ఆమాట విని 'అమ్మా! భర్తయు రాజునగువాని వచనము సేయుటొప్ప' ని వారు చెప్పిరి. ఆమె వారిమాట నంగీకరించెను.

అంత విభీషణుని స్త్రీజనంబామెకు నభ్యంగనస్నానమాచరించి యనర్ఘవస్త్రాభరణంబులు దొడిగి చీనాంబరముగప్పిన పల్లకిపయి నామె నెక్కించుకొని రామునొద్దకుఁ గొనివచ్చిరి. విభీషణుఁ డామెరాకను

రామునకు నెఱింగించెను. రావణవధపూర్వక సీతాసమాగమమునకుంగా సంతోషంబును దైత్యునింట నామె యుండుటకుంగా రోషంబును దన హృదయంబునాక్రమించుటంజేసి ద్వైధీభావమునకుం జిక్కియున్న యా రాముఁడామాటవిని చింతాసమాధినుండి లేచి 'రాక్షసరాజా! వైదేహి నిటుగొని ర' మ్మనెను. వేత్రహస్తులు బెత్తములెత్తి వానరభల్లూక రాక్షసుల నవ్వలకుఁదోలి దారితీయసాగిరి. ఆదండడి వాయువేగసంక్షుభిత సాగరధ్వని ననుకరించెను. రాముఁడది గాంచి చుఱచుఱచూచి 'విభీషణా! ఈకలకలమేల? వీరెల్లరు నావారేగాని పరులుగాదుగదా. స్త్రీలకు సదాచారమే యావరణమగునుగాని, గృహములుగాని, వస్త్రములుగాని, ప్రాకారములుగాని, బురఖాలుగాని, మఱియెట్టివిగాని యావరణములు గాఁజాలవు. బంధుమరణాదిదుఃఖసమయములందును, రాజ్యక్షోభాదివిపత్కాలములందును, రణరంగములందును, స్వయంవర యజ్ఞ వివాహోత్సవములందును, స్త్రీలు బరపురుషులకంటఁ బడుట దోసముగాదు. సీత యిప్పుడు రణభూమియందుండుట యేగాక మహాకృచ్ఛ్రస్థితిలోనున్నది; మీఁదుమిక్కిలి నేను చెంతనున్నాను. ఇట్టి సందర్భమునఁ బరపురుషసందర్శనదోషమును శంకింపనేల? ఈ యల జడిమాని సీతను గొనిరమ్ము. ఆయింతి నన్ను నామిత్రులను జూచుఁగాక' యనెను. లక్ష్మణ సుగ్రీవ హనుమంతు లావచనంబులను విని 'కటా! ఈ మాటలనురాగరహితంబు' లని లోలోన దుఃఖించిరి. విభీషణుఁడును జింతాపరుఁడై యెండుసేయలేక సీతాదేవిని దోడి తెచ్చెను.

సీతాదేవి లజ్జాసంకుచితాంగయై చని భర్తనుజూచి నిజచేలాంచలంబున మోముఁ గప్పి 'ఆర్యపుత్రా!' యని తన యంతస్తాపంబును రోదనపూర్వకంబుగా వెలార్చి, చిరకాంక్షితప్రియదర్శనలాభంబునను హర్షవిస్మయంబులను సూచించు సహజస్నేహవీక్షణంబుల నతని వంక సారించెను. సీతాదేవి కంటఁబడినంతనే రామునిహృదయాంతర్గతమైన కోపము ప్రజ్వలించెను. దాశరథి కోఱచూపుచూచి 'మంగళస్వరూపిణీ! పౌరుష ప్రతిష్ఠాపనార్థము రణమొనర్చి శత్రువధాపూర్వకంబుగా నిన్ను సాధించితిని. నాశ్రమమెల్ల ఫలించెను; నాప్రతిన కొనసాగెను; సర్వస్వతంత్రుఁడనైతిని. నాపరోక్షంబునఁ జలచిత్తుఁడు రావణాసురుఁడు నిన్నపహరించుటనిమిత్తముగాఁ గలిగిన యవమానంబు దైవసంపాదితమైనది పురుషప్రయ

త్నంబున నివారితమయ్యెను. అవమానము గలిగినప్పుడు దానినిఁ బౌరుష బలంబునఁ దొలఁగింపలేని తేజోవిహీనునకుఁ బురుషార్థములెవ్వియుఁ జేకూఱవు. హనుమంతుఁడు సముద్రలంఘన లంకాదహనాది శ్లాఘ్యకర్మములవలన దనపౌరుషంబు నుద్ధరించెను. సుగ్రీవుఁడు నాకు హితముఁగోరి వానరసేనాసహితంబుగా నాకుఁ దోడ్పడి యవక్రవిక్రమముఁ జూపి పడినశ్రమయెల్ల సఫలమయ్యెను. రావణుఁడగ్రజుఁడైనను గుణహీనుఁడగుట వలన వానిని ద్యజించి యనన్యప్రేరితముగా నాయొద్దకువచ్చిన భక్తుని విభీషణుని ప్రయాసము పండుటయ్యె' ననెను.

రాముఁడట్లు పరుషగర్భముగాఁ బలికిన పలుకులను సీతాదేవి విని వ్యాకులాంతరంగయై బొటబొటఁ గన్నీరు నించెను. దాశరథి దుఃఖదీనను జూచి మఱింతకోపము వహించి బొమముడివెట్టి కోఱచూపుచూచి 'సీతా! అవమానము సంప్రాప్తమైనప్పుడు తన్నివారణార్థ మేమి చేయనగునో దానినెల్లఁ జేసితిని; రావణుని సంహరించితిని; నిన్ను సాధించితిని. సుమంగళీ! వీర్యవంతులైన మిత్రులతోడ్పాటుతో నాయొనర్చిన యీఘోరయుద్ధము నీకొఱకుగాదు; సదాచారస్థాపనార్థమును లోకాపవాద నివారణార్థమును మదీయ వంశకీర్తిపరిరక్షణార్థము నింతచేసితిని. ఈసంగతి స్పష్టముగా గ్రహింపుము. సీతా! నీవు పరగృహనివాసంబునఁ జేసి సందిగ్ధస్వచారిత్రవైతివి. అట్టి నీవు నాకట్టెదుట నిలుచుట నేత్రరోగిమ్రోల దీపముండుట గానున్నది. జనకాత్మజా! నాకు నీతోఁబనిలేదు; దిక్కులు పదిగలవు; ఏదెసయిష్టమో యాదెసకుఁ బోనగును; ఆజ్ఞ యిచ్చితిని. సత్కులప్రసూతుఁడును దేజస్వియు నైన వాఁడు పరగృహోషితను సాదరంబుగా గ్రహింపఁడుగదా. నీవు రావణాంకపరిభ్రష్టవై వచ్చితివి. వానిమన్మథవికారదృష్టికిఁ బాత్రవైతివి; చెడిపెవని లోకము తలంప నవకాశమిచ్చితివి. అట్టి నిన్నుఁ గులగౌరవముఁ గోరువాఁడు మరల గ్రహించునా? అవమాననిరసనార్థము నిన్నుసాధించితినే గాని నీయందలి యనురాగము వలనఁగాదు. సీతా! అనాలోచితముగా నిట్లాడుచున్నానని తలంపకుము. నేను విడిచినచో నీకు భరణపోషణంబు లెట్లందువా? లక్ష్మణునియొద్దనో భరతునొద్దనో, సుగ్రీవునొద్దనో విభీషణునొద్దనో నీకెందిష్టమో యచ్చట నుండి యథాసుఖము జీవింపుము. సీతా! దివ్యరూపయు మనోహరాంగకయు నైన యింతి

చేఁజిక్కినప్పుడు కేవల చపలుఁడు రావణుఁడు మన్మథవశుఁడు గాకుండునని యూదిపల్కినను నమ్ముదురా ?' యని పరుసంబుగా నుడివెను.

ప్రియవచనంబుల నోదార్పఁదగిన సీతాదేవి యాకఠినోక్తులను విని గజేంద్రహస్తాభిహతసల్లకీవిధంబున వడంకుచు నశ్రుధారలు వర్షించి కన్నీరు తుడిచికొని 'వీరాగ్రణీ ! ప్రాకృతుఁడు ప్రాకృతనువలె నీవు నన్నిట్టి వినరాని పరుషంబులు పలుకనేల ? నీశంకించు దోషము నాయెడఁ గలుగదు. నా శీలమే తోడుగా వచించుచున్నాను. దుష్టస్త్రీ దుర్వృత్తిని దలఁచి స్త్రీజాతినెల్ల నిందింపవచ్చునా ? నన్ను నీవు నిక్కముగా నెఱుంగుదువేని నీకిట్టి శంకయే జనింపరాదు. రావణుని దేహస్పర్శము నాకుఁ దగులదా యని యందువా ? వలచి వానిని నేను స్పృశింపలేదు ; దైవఘటనంబువ నట్లు సంభవించెను. అదియు నావివశావస్థయందుఁ గలిగెను. ఇందు నాదోషమేమియున్నది ? అన్నిటికిని మనస్సు ప్రధానము. నామనస్సు నాఁడును నేఁడును నీయందే లీనమై యున్నది. ఆకూళ నాతనువును దాఁకినను నామనస్సును దాఁకఁ జాలఁడు గదా. పిన్నతనంబునుండి యొండొరుఁ గూడి యెడఁబాపు లేక మనమిరువురముఁ బెరిఁగితిమి. ఇన్నాళ్ళచెలిమి నాస్వభావంబును నీకుఁ దెలుపనిచో నిఁక నీకు నాతత్త్వమెట్లు స్పష్టపడును ? నీవే యిట్లన్నయెడల నేను హతనేగదా. ఇట్టి తలంపు నీకుఁ గలదేని నన్ను వెదకనంపుటేల ? నాఁడు హనుమంతునివలన నీమనంబును దెలిపియున్నచోఁ బ్రాణసంశయమైన యీరణంబును గావించు మహాశ్రమ నీకు దక్కియుండును ; నీమిత్రులకు నింత కష్టమియ్యవలసిన యవసరముండదు. నరశార్దూలా ! కోపము ననుసరించుట యల్పులకునగుఁగాని వలఁతులకుఁ గాదు. స్త్రీజాతినెల్లఁ జిన్నచూపునఁ జూడకుము. వృత్తజ్ఞా ! నేను జనకరాజునకు జనించుట వ్యాజమాత్రమే గాని వేఱుగాదనుట మఱచితివి ; నా ధాత్రీగర్భజత్వమును బాటింపవైతివి. అగ్నిసాక్షికంబుగా నాఁడు నన్నునీవు గ్రహించుటయు విస్మృతమయ్యెను. నాభక్తిగాని నాశీలముగాని నీకుఁ దార్కాణములు గాకున్నవి' అని దుఃఖదీనస్వరంబునఁ బలికి, చెంత నున్న లక్ష్మణుని జూచి 'సౌమిత్రీ ! నాయీదుఃఖమునకుఁ జితియే పరమౌషధమగును. దాని నొనగూర్పుము. వల్లభునినోట మిథ్యాపవాదమును

విని జీవింపనోపను. నాభర్తయే నన్నిట్లు జనసమూహము మ్రోలఁ ద్యజించినప్పుడు మన నేల ? వహ్నియే నాకు శరణమగుఁ గాక' యనెను.

## —♦ సీతావహ్నిప్రవేశము ♦—

లక్ష్మణుఁడు మహాదైన్యమొంది రాముని వంకఁ జూచి యాకార్యము వానికి సమ్మతమగుట తదీయాకారసూచనంబులవలన గ్రహించి యొండు పలుకనేరక చితిని బేర్పించెను. సీతాదేవి అంత నధోముఖుఁడైయున్న రామునకుఁ బ్రదక్షిణమొనర్చి భగభగమండుచున్న యగ్నిహోత్రమును జేరి దేవతలకుఁ బ్రణమిల్లి బ్రాహ్మణులకు నమస్కరించి 'నామది యెన్నఁడేని యు నాపతిని బాసి చరింపదనుట నిజమేని, నాయెడ నాభర్త శంకించు దోషము నిరవకాశమేని, నేను మనోవాక్కాయకర్మంబుల నాపతి నతిచరింపనేని, నేను శుద్ధచారిత్రనగుదునేని, సర్వధర్మజ్ఞుఁడైన నాపతియే నా పరదైవంబుగా భావింతునేని, సూర్యచంద్రానిలంబులును దివారాత్రంబులును బ్రాతస్సాయంసంధ్యలును భూదేవియు నితరదేవతలును నాపాతివ్రత్యంబు నంగీకరింతురేని యీయగ్నిహోత్రుఁడు నన్ను రక్షించుగాత' అని వచించి చితిని వలగొని శరీరాభిమానముఁ ద్యజించి యయ్యగ్నికుండముఁ జొచ్చెను. సీతాదేవికి నందున్న వారాబాలవృద్ధము భయాకులితులై హాహాకారము గావించిరి. ముల్లోకంబులును విషాదాశ్చర్యమగ్నము లయ్యెను స్త్రీజనరోదనము పెల్లరయ్యెను. రాముఁడును బాష్పవ్యాకులాక్షుఁడయ్యెను.

## —♦ దేవతలు రాముని స్తుతించుట ♦—

అంతలోన నచ్చటకుఁ బరమేష్ఠియుఁ బరమేశ్వరుఁడును యమవరుణధనదేంద్రులఁ గూడి విమానారూఢులై హుటాహుటివచ్చి రామునెదుట నిలిచిరి. ఇంద్రాదులు చేతులెత్తి 'రామా ! హుతాశనోన్ముఖయైన సీత నిట్లుపేక్షింప నీకు దగునా ? దేవాదిదేవుండవగుట మఱచితివా ? ఎవని వలన సమస్తలోకములు జనించునో, ఎవనికి నుత్తమోత్తముఁడను బిరుదు గలదో, త్రికాలాబాధ్యమూర్తియై యెవఁడుండునో, యట్టి పరాత్పరుఁడవు నీవు కేవలప్రాకృతుఁడట్లు నటింపనేల?' యని పలికిరి. రాముఁ డావచనం

ములను విని 'నేను మనుష్యమాత్రుండననియు దశరథాత్మజుండననియు భావింతునే గాని మీరన్నభావము నాకుఁగలుగదు. మీవచనమెట్లు పరమార్థమగునో యూహింపఁజాలి' ననెను.

### —• బ్రహ్మ రాముని స్తుతించుట •—

నావుడు పితామహుఁడు మునుపడవచ్చి రామా! 'ఎవ్వఁడు స్వయంప్రకాశస్వరూపుఁడై తనరునో, ఎవనికి సృష్టిస్థితిసంహారంబులు లీలామాత్రములో, అక్షరంబును సర్వమయంబును సత్యంబును నిత్యమునైన పరమాత్మయెవఁడో, పరమప్రాప్యుఁడెవఁడో, సర్వవ్యాపియయ్యు లోకసంహారార్థ మాత్మ మాయాశక్తి నధిష్ఠించి యెవఁడు కార్యానురూపరూపంబుల నయ్యయికాలంబుల నవతరించుచుండునో, ఎవఁడు క్షరాక్షరములకన్న మత్తముఁడో, బుద్ధ్యాదులెవనివలనఁ బ్రవర్తించునో, ఎవఁడు భూతకోటికిఁ దత్తత్కర్మానురూపఫలంబు లిచ్చుచుండునో, నామరూపతీతుఁడయ్యు నెవఁడు బహునామంబులఁ గీర్తింపఁ బడుచుండునో, ఎవనిని సర్వలోకసమాశ్రయణీయుండనియుఁ బరమాప్తుండనియు సనకాది మహర్షులు నిరంతరము స్తుతింతురో, సర్వముఁ దానయ్యుఁ దద్భిన్నముగా నెవఁడు వెలుంగుచుండునో, వేదాత్మకుఁడెవ్వఁడో, వేదంబులుగూడ నెవనినూహింపఁ జాలవో రాత్రిందివములెవ్వని నిమేషోన్మేషములో, ఎవ్వఁడూహాతీతుఁడగుట వలన విశ్వమూర్తిగా భావింపఁబడునో, ఎవఁడు లక్ష్మితోఁడగూడి వాగర్థంబులక్రియ నవినాభావంబుతోఁ బ్రవర్తిల్లునో, యట్టి శ్రీమన్నారాయణ మూర్తివి నీవగుట తలంపవా? దేవదేవా! జగన్నివాసా! లోకకళ్యాణార్థము లీలామానుషరూపంబుఁ దాల్చితివి. సాక్షాల్లక్ష్మిదేవి యీసీతారూపంబున నవతరించెను. రామా! నీవచ్చినకార్యము సమాప్తమయ్యెను. నీసందర్శనంబునఁ జెక్కుడు కడతేరిరి. నీకీర్తనస్మరణంబులు వేనవేలునకు శాశ్వత ఫలదాయకంబులగును. నిన్నుభక్తిసేయువారికెందును సేగిలేదు. నీభక్తులకు నందని ఫలము గలుగదు.' అని వచించెను.

### —• అగ్నిదేవుఁడు సీతాదేవినిదెచ్చి రామునకు సమర్పించుట •—

అంతలోన నగ్నిదేవుఁడు మర్త్యరూపముఁ దాల్చి చితినుండి లేచి

తరుణాదిత్యసంకాశయుఁ దప్తకాంచనభూషణయు రక్తాంబరధరయు నీల కుంచితమూర్ధజయు నక్లిష్టమాల్యాభరణయు మనస్వినియు నైన బాలారత్నం బు నొడిసిపట్టుకొని వచ్చి 'రామా! ఇదిగో నీసతి సీతాదేవి; ఈబిడ నిర్దో షురాలు; ఈసాధ్వీమనోవాక్కాయసంకల్పాదులెల్ల నిరంతరము నీయందే మగ్నమై యుండును. భవదన్యుని గలలోఁగూడఁ దలంపదు; రావణుని దుండగంబు లీసాధ్వీమణిమోల సాగవు; అతఁడు తనరాజ్యంబు నిత్తునని ప్రలోభించెను; ప్రాణంబులు బలిగొందునని బెదరించెను; మఱియెన్నో యుపాయములు పన్నెను. అతఁడెంతచేసినను భూపుత్రిహృదయము నీ చరణధ్యానమునుండి యీషన్మాత్రముగూడఁ దొలఁగలేదు. ఈమె విశుద్ధ భావయు నిష్పాపయు నగుట నీకు మాత్రము తెలియదా? అపవాదనిరస నార్థము నీవిట్లు గావించుట మేమెఱుంగమా? ఒండుతలంపక నీసీతను బరి గ్రహింపుము. నామాటకు నెదురాడవల' దని చెప్పెను.

## —♦ రాముఁడు సీతాదేవిని బరిగ్రహించుట ♦—

రాముఁడు కన్నీరు నించుచు ముహూర్తమాత్రంబాలోచించి 'సీత నిక్కముగా నిర్దోషురాలగుట నాకు స్పష్టము. అయినను రావణునింట బహుకాలముండుట వలన లోకాపవాదము తప్పదని తలంచి తన్నివారణార్థ మీకుసుమకోమలాంగి నిట్టి కఠినపరీక్షకు బ్రోత్సహించితిని. ఈమంగళ కరి యాత్మపాతివ్రత్యమును స్థాపించి నాకీర్తి నుద్ధరించెను. ఇట్లు చేయక నాయంతరాత్మయే సాక్షిగా నియ్యింతిని బరిగ్రహింతునేని లోకము నన్నుఁ గామాత్మునిగా భావించునేగాని ధర్మాత్మునిగా భావింపదు. మఱియు లోకము నాచరితను దార్కాణగా గొని వ్యవహరించును. ఇన్నియనర్థము లకు వెఱచి గుండె రాయిచేసికొని యిట్లు వర్తించితిని. జనకాత్మజకు నాచారలోపముండునా? సీత యనన్యహృదయయు మద్భక్తయు మచ్చిత్త పరివర్తనయు నగుట నాకుఁ దెలియదా? నాయర్ధాంగి యగ్నిఁ జొచ్చుట సత్యప్రతిష్ఠాపనార్థమును లోకప్రత్యయార్థమునగునని యెంచి యాకాంతను వారింపనైతిని. ఆత్మతేజోరక్షితయైన యీలోకకళ్యాణిని రావణుండతి వర్తింపఁగలఁడా? సముద్రము వేలాతిక్రమము నొనర్చిన నొనర్చుఁగాక; వేయు మంది రావణులొక్కటయి వచ్చిన వత్తురుగాక; సీతను ధర్షింపఁజాలరు,

ఈసాధ్వీమణిని ముట్టుట ప్రదీప్తాగ్నిశిఖను ముట్టుటగును. ఈ జగన్మంగళకరి రావణుని యలంతిసిరులకు భ్రమించునా ? వేయేల ? నేనును నాసీతయు ననన్యులము. ఈజనకాత్మజను త్రైలోక్యవిశుద్ధచిత్తను బరిత్యజించుట కీర్తిని గీర్తిమంతుఁడు త్యజించుటయే గదా. నాసతి సహజశుద్ధయయ్యు లోకపావనులైన మీవచనంబులఁజేసి శుద్ధతరయై వాసిగాంచెను. మీమాటఁ దలఁదాల్తు' నని పలికి సీతను గౌఁగిటఁ గూర్చెను.

## —♦ మహేశ్వరుఁడు రాముని గొనియాడుట ♦—

అంత మహేశ్వరుఁడు మున్నాడి 'రామా ! ముజ్జగంబుల నావరించి యున్న రావణభయరూప గాఢాంధకారము సమసెను ; లోకంబులు నీవలన మరలఁ దేజోవంతములయ్యెను. భరతుఁడు నిలువెల్లఁ గన్నులుగా నిన్నుఁ బ్రతీక్షించుచున్నాఁడు ; యశస్విని నీతల్లి నిన్నెదురు చూచుచున్నది ; కైకేయి నీకుఁగా నెంతయుఁ బశ్చాత్తాపదీనయై యున్నది ; సుమిత్రాదేవి నిన్నుఁజూడ నువ్విళ్ళూరుచున్నది. ఇఁక నీవయోధ్యకుఁజని భరతునాశ్వాసించి కౌసల్యకు నానందముఁ గూర్చి కైకేయీమనస్తాపంబును దీర్చి సుమిత్రకుఁ బ్రీతిఁజేసి పట్టాభిషిక్తుండవై బంధువుల యుల్లంబులు పల్లవింపఁగా నిక్ష్వాకుకుల ప్రతిష్ఠాపనకరులైనఁ బుత్త్రులఁబడసి యశ్వమేధంబులవలన సురలకు సంతృప్తిఁగూర్చి సీతతోడఁగీర్తినిసయితము పొంది సర్వజనానందకరముగాఁ జిరకాలము రాజ్యమేలి వైకుంఠమునకుఁ దరలుము. అదిగో దశరథుఁడు మర్త్యలోకంబున నీకుఁ దండ్రిగా వెలసినవాఁడు విమానారూఢుఁడై స్వర్గంబునుండి వచ్చియున్నాఁడు. నీవలన నతఁడు కృతార్థుఁడై యింద్రలోకంబును బొందెను. నీవును నీతమ్ముఁడు లక్ష్మణుఁడును వానికి నమస్కరింప నగు' ననెను.

## —♦ దశరథసందర్శనము ♦—

రామలక్ష్మణులు వారిరువురు తండ్రికి విమానశిఖరమున నున్నవానికి నమస్కరించిరి. దశరథుఁడు ప్రాణాధికుఁడైన పుత్త్రుని రాముని రెండు చేతులఁ గూర్చి యెత్తి యంకంబునఁజేర్చి 'నాయనా! నీవు లేనికారణంబున స్వర్లోకసుఖంబులును దేవర్షిసన్మానంబులును నాకు సంతోషకరములు గావు.

పుత్రా! నీవనవాసదీక్ష సాకల్యముగా నెఱవేఱెను. నిన్నుఁ జూడఁగా నాకు నేఁడు పండువగుచున్నది. నిన్ను గుట్టలకుఁ దోలుటకుఁగాఁ గైకేయి యాడినమాట లిందాఁక నన్ను మఱిమఱియేర్చుచుండెను. ఇప్పుడు నిన్నుఁ జూచినంతనే నీహారమునుండి భాస్కరుడట్లు తద్దుఃఖమునుండి విముక్తిఁ గాంచితిని. తొల్లి యష్టావక్రుఁడు వానితండ్రిని జనకసభయందు వంది వివాదపరాజితుఁడై వందురుచున్నవాని నుద్ధరించినట్లు నీవు నన్నుఁ దరింపఁ జేసితివి. నాయనా! రావణవధార్థము దేవతలు నాఁడు నీపట్టాభిషేకమునకుఁ గారణాంతరముగా విఘ్నమొనర్చుట యిప్పుడు గ్రహించితిని. నిన్నుఁ జూచి కౌసల్య సంతోష సముజ్జీవితయగుఁగాక. ఎవరు నిన్నుఁ బట్టాభిషేకజలంబులఁ దడిసియున్న వానినిఁ జూడనోర్తురో వారెల్లరు సిద్ధార్థులుగదా. రామా! శుచియు ధర్మవత్సలుఁడునైన భరతునితోడి నీ పునస్సమాగమముఁ జూడ నువ్విళ్లూరుదును. వత్సా! దేవతలకోర్కెఁ దీర్చితివి; ఋషుల మనస్తాపంబులను జల్లార్చితివి; ఉడివోని కీర్తిగావించితివి. ఇఁకఁ బట్టాభిషిక్తుండవై తమ్ములఁగూడి చిరకాలము సుఖముండు' మనెను.

రాముఁడు దశరథునకుఁ గేలొగ్గి 'ధర్మజ్ఞా! నాఁడు నావివాసముఁ గోరిన కైకేయికి నాగ్రహించి 'కులటా! ఆమాట మఱలఁ బలుకుదువేని నిన్నును నీకొడుకును ద్యజింతు' నని శపథపూర్వకంబుగా వచించితివి. ఆ శాపము కైకేయీభరతులకు సోకకుండు నట్లనుగ్రహింపు' మని ప్రార్థించెను. దశరథుఁడట్లే యనుగ్రహించి లక్ష్మణుని గవుంగిటఁగూర్చి 'నాయనా! నీవు సీతారాములను శుశ్రూషించి నాకు మహాప్రీతిఁ గావించితివి. ఎల్ల పురుషార్థములు నీకు సంప్రాప్తములయ్యెను. రాముఁడు నీయెడఁ బ్రసన్నుఁడగుఁగాక; నీకు యశోధర్మంబులను స్వర్గసుఖమహిమానంబులను సిద్ధించుఁగాక. సుమిత్రానందవర్ధనా! రామశుశ్రూషకన్న మంగళకరమైనది నీకు మఱొండు గలుగదు. రాముఁడు సర్వలోకశుభాభిరతుఁడు. వాని నిద్దేవేంద్ర మహర్షి సిద్ధులేగాక ముల్లోకంబులును బూజించును. సౌమ్యా! అవ్యక్తము నక్షరముఁ బరమగుహ్యము వేదవేద్యమునైన యాపరబ్రహ్మము రామరూపంబున జగత్కళ్యాణార్థ మవతరించెనని బ్రాహ్మణులు వచింప

వింటిమిగదా. సీత శ్రీమహాలక్ష్మి యనిరిగదా. ఆయ్యిరువురను సేవిం చుచు గురుశుశ్రూషావిధానంబునకు మార్గప్రదీపకుండవై శాశ్వతధర్మంబును దిగంతవిశ్రాంతకీర్తిని బడసి చెన్నారు' మని పలికి, సీతాదేవిని జల్కారించి 'విదర్భరాజపుత్రీ ! రాముని వచనంబులకు నాగ్రహింపకుము. నీమేలు గోరి నీవిశుద్ధచరిత్ర లోకప్రచారమగుటకుఁగా నతఁడట్లొనర్చెను. కళ్యాణీ ! పతిశుశ్రూషావిధానంబును లోకంబునకుఁ గఱపితివి. నీకుఁ దెలియనట్టియు పలుకఁ దగినట్టియు ధర్మములేదు. అయినను గూర్మిమిన్నకుండనీయదు. నీకు రాముఁడే పరదైవత' మని వచించి వారినెల్ల వీడ్కొని యింద్రలోకమునకుఁ బోయెను.

## —♦ ఇంద్రుఁడు మృతవానరులను బ్రదికించుట ♦—

దేవేంద్రుఁ డంతట డాయవచ్చి 'రామా ! దశరథుఁడు పుత్రకామేష్టియజ్ఞ మొనర్చిననాఁడు నీవు మాకొసంగిన యభయప్రదానము రావణవధారూపంబున నేఁడు మాకు సమకూరెను. మాకష్టములెల్లఁ దీరెను ; కృతకృత్యుల మైతిమి. మావలనఁ గానగుకార్యంబున్నఁ దెలుప గోరుదు' ననెను. రాముఁ డాసురేశ్వరునకు సీతాలక్ష్మణసహితంబుగాఁ గృతాంజలియై 'అమరాధిపా ! నాయెడఁ బ్రీతుఁడవేని మన్నిమిత్తము పరాక్రమించి రణరంగంబునఁ బ్రాణంబులు గోల్పోయిన వానరులెల్లరును బునర్జీవితులగునట్లు ప్రసాదింపుము. వారట్లు పునర్జీవితులై బలపౌరుషసంపదలం గలిగి చిరాయురారోగ్యవంతులై పెద్దకాలము సుఖముందురు గాక. వారి వనభూములెల్ల నిరంతర ఫలమూలసమృద్ధములై తనరుఁగాక' అనెను. ఆమాటకు సురపతి మిగుల సంతసించి 'వత్సా ! ఇట్టి వరంబుఁగోరుట రాఘవునకే తగును. అవయవములెల్ల నుగ్గునూచమై తనువులంవాసి లోకాంతరగతి నొందిన వారిని మరల బ్రతికించుట యేతన్మాత్రకార్యముగాదు. మాట తప్ప రాదు ; నీకోర్కెకు నడ్డుగలుగదు. నీయిచ్ఛయగుఁ గాక' యని వచించి చనెను. వానరులు చచ్చిపడియున్నవారు దీర్ఘనిద్రనుండిమేల్కొనిన లేచిరి. అవ్వింతకు హతశేషులు మహాశ్చర్య మొందిరి.

అంత దేవతలెల్లరు గుమిగూడి వచ్చి 'వీరాగ్రణీ ! అయోధ్య నిన్ను నిరీక్షించుచున్నది. వానరులను వారివారి నెలవులకుఁ దరలించి యనురక్తయు

దపస్వినియునైన యాసీతాదేవి నాశ్వసించి తల్లులమనస్తాపంబులు దీర్చి శత్రుఘ్నుని సందిటఁ గూర్చి భరతుని తాపసవృత్తి నుడిపి పౌరులకు నానందసుఖంబును జేకూర్పు' మని పలికి వారిని వీడ్కొని చనిరి.

## —♦ రామవిభీషణుల సంభాషణము. ♦—

రామాదులెల్లరు నాఁటిరేయి హాయిగా నిద్రించిరి. తెల్లవాఱినంతట విభీషణుఁడు వచ్చి 'రాఘవా! స్నానీయజలంబులు సిద్ధముగానున్నవి. అలంకారకోవిదలైన పద్మేక్షణలు వచ్చి యంగరాగవస్త్రాభరణ దివ్యగంధ మాల్యాదులతో వేచియున్నారు. నన్ననుగ్రహించుటగా నివి పరిగ్రహింపు మనెను. రాముఁడామాటవిని 'మిత్రమా! స్నానార్థము సుగ్రీవాదులను బిలువుము. నామది యిందులేదు. అది భరతుని కడనున్నది. చతుర్దశ వర్షవ్రతము తీఱినమఱునాఁడే వానిని జేరుదు నంటిని. అట్లుచేయకున్నచో నతఁడు తనశరీరంబు నగ్నికి సమర్పింతు ననెను. అతఁడన్నంత చేయును. అట్టితమ్ముని మనంబు చేయుట ముఖ్యము. అందాఁక నాకెట్టి సుఖోపచారములు వలదు. అయోధ్య యిటకెంతో దవ్వు; మార్గమన్ననో మహాదుర్గమము; తడవులేదు; ఇప్పుడే తరలనున్నా' ననెను. విభీషణుఁ డాతలంపు విని 'పార్థివాత్మజా! ఇది యెంతపని? దీనికై చింతయేల? నేఁడే నిన్న యోధ్యానగరముఁ జేర్తుఁగదా. ఎట్లందువా? మాయగ్రజుఁడైన కుబేరునకు బుష్పకవిమానముగలదు. అది కామచారి. రావణుఁడు కుబేరుని గొల్లకొట్టి యావిమానంబును హరించి తెచ్చెను. అది యిప్పుడు లంకయందున్నది, కుబేరుఁడువచ్చి దాని నిమ్మని యడిగెను. మీకొఱకు దాని నుంచితిని. అది క్షణములో మిమ్ము మీకోరినచోటికిఁ గొనిపోవును. ఆవిషయమై విచారమే వలదు. ప్రాజ్ఞమణీ! నీయెఱుంగని యర్థము గలుగదు. భర్తల మనంబు సేయుటకన్నఁ బ్రియతరకార్యము నీకులేదు. నాభక్త్యాదులు నీయెడకెక్కవేని నీయనుగ్రహంబునకు నేను పాత్రుఁడనేని నాయందు నీకు నిండుమనంబు గలదేని నేఁడిందు నిలిచి నాయర్పించు పూజలను సీతాలక్ష్మణ సహితంబుగాఁ బరిగ్రహించి చననగును. అన్నియు సిద్ధముగానున్నవి గావునఁ గాలహరణమగు ననుశంక వలదు. నాసపర్యలను ససైన్యసుహృద్గణంబుగా గ్రహింపవేఁడుదును. రాఘవా! నాయెడ నీకుఁగలప్రేమంజేసి

నీవు నా ప్రణయంబు నియ్యకొందువని నమ్మి యిట్లు విన్నవింతును. నీలాలసంబును నాభక్తియుఁ గూడి యిట్లు పలుకరించుచున్నవి! నీభృత్యమాత్రుని సాహసంబును మన్నింపు' మని మహావినయముతో నుడివెను.

రాముఁ డాపలుకు లాలకించి రాక్షసవానరాదులెల్లరు వినునట్లుగా 'సౌమ్యా! నీవొనర్చిన సహాయంబువలనను రణరంగమున నాకుఁగా నీవు చూపిన పరాక్రమంబువలనను నన్నెంతో పూజించితివి. ఇంతకన్నఁ బూజలుగలవా? రాక్షసేశ్వరా! నీమాటయెన్నడును గాదనఁజాలను. ఎవఁడు నావివాసమువిని మహాదుఃఖదీనుఁడై చేతనిడినరాజ్యంబునుగూడ నువ్వెత్తుగాఁ ద్యజించి నావ్రతమును మాన్పి నన్ను మరలించు దృఢసంకల్పంబులతోఁ జిత్రకూటమువఱకు నన్ను వెన్నాడి వెదకుచువచ్చెనో? ఎవఁడు నన్నుఁజేరి చేతులొగ్గి 'అన్నా! అయోధ్యకు మరలివచ్చి మమ్మెల్లఁ బాలింపు' మని నయవినయసాష్టాంగప్రణామపూర్వకంబుగాఁ బ్రార్థించెనో, ఎవ్వనిమనంబును నేను నాదీక్షార్థము నొప్పించితినో యట్టి నాతమ్ముని భరతునిఁ జూడ నాహృదయము త్వరపడుచున్నది. అదియునుగాక కౌసల్యాసుమిత్రలును కీర్తిమతియైన కైకేయియు వసిష్ఠాదిగురుజనంబును మిత్రులను బట్టణవాసులును నాకన్నుల మెలంగుచున్నారు. మఱియు నాచతుర్దశవర్ష వివాసవ్రతము తీఱెను. ఆమఱునాఁడే భరతుని జేరుదునంటిని. అట్లు చేయకున్నచో భరతుఁ డన్నంతయొనర్చును. విభీషణా! నాకుఁ జన ననుజ్ఞయిమ్ము. నీవు పుష్పకవిమానము నిచ్చుటవలననే నీవొనర్పనున్న సపర్యలెల్ల నాకు సమగ్రముగా నందెను. వేఱుతలంపక విమానమును రావించి నన్నుఁ ద్వరగాఁ దరలింపు' మని చెప్పెను.

విభీషణుఁ డొండు పలుకక విమానమును రప్పించి 'స్వామీ! ఇదిగో విమానము. ఆజ్ఞయేమి?' అని సాదరంబుగా విన్నవించెను. రాముఁడు సుంత యాలోచించి 'విభీషణా! నాకార్యంబును సాధించినది వానరులే యని నీకుఁ జెప్పనక్కఱలేదు. లంకాపురము సురలకుఁ గూడ సాధింపరాదను ప్రతీతి ముల్లోకంబులఁ బ్రాఁకియున్నది. అట్టిదాని నివ్వానరులు సాధించిరి. ఇది యేతన్మాత్రకార్యముగాదు. వీరికిఁ దగుసన్మానము దోఁపదు. వీరినెల్లవిధంబుల బహూకరింపుము. కృతజ్ఞతామతులుగావున వీరు

నీకెంతయుఁ బ్రీతులగుదురు. ఈసేతవలన నీదాతృత్వమును మిత్రసంగ్రహణకారిత్వంబును దయార్ద్రత్వంబును వెల్లడియగును. ఎల్లరకుఁ గీర్తిపాత్రుండవగుదువు. రాక్షసేశ్వరా! రాజు మహాశౌర్యవంతుఁడైన నగుఁగాక; అతఁడౌదార్యాది ప్రీతికరగుణవిహీనుండగునేని వానినిఁ దన్నైనికులు ప్రాణమిచ్చి కొలువరు. అంతియగాదు; తఱిచూచి త్యజింతురు. ఈసంగతి నీవు చక్కఁగా గ్రహించి వర్తింపవలయు' నని లక్ష్మణాదులమ్రోల స్నేహపురస్సరముగా నుడివెను.

## —♦ అయోధ్యాగమనము. ♦—

విభీషణుఁడు రామునితలంపు గ్రహించి వానరులను యథాయోగ్యముగా రత్నాదికముల సన్మానించెను. అంత రాముఁడు సీతాదేవిని లజ్జావినతయై యున్నదానిని తనకేలఁబట్టి లక్ష్మణునితోడ విమానమారోహించి 'వానరోత్తములారా! మీరు మీమిత్రునికార్యమును సమకూర్చితిరి; ఇఁక మీమీనెలవులకుఁ బోనగును. సుగ్రీవా! మిత్రుఁడును బంధువునగువాఁడేమిచేయనగునో యదియెల్లఁ గావించితివి. ఇఁకనీసేనను వెంటఁగొని కిష్కింధకుఁబోయి సుఖముండుము. విభీషణా! నాయిచ్చిన రాక్షసరాజ్యంబును యథాన్యాయ మనుభవింపుచు సుఖముండుము. నిన్నెవ్వరు నోర్వఁజాలరు. నాపోవ ననుమతింపుము. ఇదే మిమ్మెల్లర వీడ్కొనుచున్నా' నని వారివారికిఁ దగినట్లు పలికెను.

సుగ్రీవవిభీషణాదులు కయిమోడ్పులు గావించి 'అయోధ్యకు మేమును రాఁగోరుదుము. అనుజ్ఞ యిమ్ము. మావలన నచ్చటి నగరవనంబులకుఁగాని జనులకుఁగాని బాధగలుగనియట్లు వర్తింతుము. దశరథాత్మజా! నిన్నుఁగన్నతల్లికి మ్రొక్కి నీపట్టాభిషేకమహోత్సవమును గన్నారఁ జూచి మాతావులకుఁబోయెద' మనిరి. రాముఁ డామాట విని 'మీయభిమతంబట్టిదేని రండు పోవుదము. సీతాలాభమువలన నాకుఁ గలిగిన ప్రియము భరతసందర్శనంబునఁ దరమై మీతోడిపురః ప్రవేశంబునఁ దమమై దనరుఁగదా. సుగ్రీవా! నీవును విభీషణుఁడును మీమీపరిజనముతోడ విమానమారోహింపనగు' నసెను. ఎల్లరు విమానమెక్కిరి. అది నింగికెగసి యతివేగంబున దారిపట్టెను.

## — రాముఁడు సీతాదేవికి మార్గాంతర విశేషంబులఁ జెప్పుట. —

రాముఁడట్లు చనుచు సీతావినోదార్థం బయ్యాచోట్లు చూపుచు 'వైదేహీ! ఇదిగో లంకాపురము ; అదిగో త్రికూటపర్వతము, కైలాసశిఖరంబును మెచ్చని యాపర్వతముమీఁద విశ్వకర్మ యీలంకానగరంబును నిర్మించెను. సీతా! అదిగో రణభూమి మాంసరక్తకర్దమమైయున్నదానిని జూచితివా? అందు వానరులును రాక్షసులును పెక్కురు పడిసిరి. విశాలాక్షీ! అల్లదిగో భస్మరాశి. ఎవఁడు బ్రహ్మవరగర్వోద్ధతుఁడై లోకకంటకుఁడుగా నుండెనో యారావణుఁడు నీనిమిత్తంబున నాచేతఁజచ్చి బూదియైనచోటదిగో. అదిగో యిచ్చట కుంభకర్ణుఁడు నాచేత నీల్గెను. అచ్చట నీలుఁడు ప్రహస్తుని బరిమార్చెను ; ఇచ్చట హనుమంతుఁడు ధూమ్రాక్షుని ద్రుంచెను. ఆచోట విద్యున్మాలి సుషేణునిచేతఁ జూర్ణమై పడెను. లక్ష్మణుఁడు రావణాత్మజుఁడైన యింద్రజిత్తును హరించిన తావదిగో. ఇచ్చట విరూపాక్షుని నంగదుఁ డంత మొందించెను. ఇట మహాపార్శ్వమహోదరులు పడిసిరి. అకంపనుఁడిందుఁ గూలెను. ఈయెడ రాక్షసులు పెక్కురు కూలిరి. మందోదరి వేయిమందిసవతులతోడ రావణునిపైఁబడి రోదనము చేసినచోటుదిగో. తలోదరీ! ఇదిగో సముద్రతీరము. సముద్రమును దాఁటిన నాటిరేయి మేమిందు వసించితిమి. నీయర్థము నీలుఁడు నిర్మించినసేతు వదిగో చూడుము. ఈకార్యము సామాన్యులకుఁ దరముగాదు. వైదేహీ! అపారము నక్షోభ్యమునైన యీవరుణాలయము శంఖశుక్తినిషేవితమై యెట్లు గర్జించుచున్నదో వినుము. మైథిలీ! నీకొఱకు హనుమంతుఁడు సముద్రమును దాఁటునప్పుఁడు వానివిశ్రమార్థము సాగరగర్భమునుండి తటాలునఁ బొడిచివచ్చిన మైనాకపర్వత మదిగో చూడుము. సేతునిర్మాణమునకుఁ బూర్వము సముద్రుఁడు నాకుఁ బ్రసన్నుఁడైన చోటదిగో. అల్లదిగో మహాదేవుఁడు నాకుఁ గార్యసిద్ధిని బ్రసాదించినచోటు. విభీషణుఁడు నన్ను శరణఁజొల్లినచోటిదిగో. సీతా! విచిత్రకాననరమ్యమైన యీనగరమును గంటివా? ఇదే కిష్కింధానగరము సుగ్రీవుని రాజధాని. ఇదిగో యిచ్చట వాలిని వధించితిని.' అనెను.

సీతాదేవి కిష్కింధానగరంబును జూచి ప్రణయసాధ్వసంబులు పిరిగొనఁగా 'అనఘా! సుగ్రీవాదివానరులప్రియరాండ్రతోడ నయోధ్యా

నగరముఁ బ్రవేశింపఁ గుతుకమగుచున్న' దని నుడివెను. రాముఁ డందులకు సమ్మతించి కిష్కింధానగరంబున విమానంబును నిలిపి 'సుగ్రీవా! వానరు లెల్లరుఁ దమతమభార్యలతోడ నయోధ్యకు రావలయునని సీత కోరుచున్నది. నాప్రియసిమనంబు సేయుము ; జాగువల' దనెను. సుగ్రీవుఁడు విమానము నుండి దిగి యంతఃపురమునకుఁబోయి తారను జూచి సీతాసంకల్పంబును రామునాజ్ఞను దెలిపెను. తార వెంటనే పయనమై వానరస్త్రీలకు సంగతి వినిపించెను. వారును సీతాదర్శనకాంక్షలై వచ్చిరి. సీతాదేవి యవ్వాన రాంగనలనెల్ల విమానమెక్కించెను.

అంత నవ్విమానము వాయుపథమునెట్టి ఋశ్యమూకపర్వతము చేరు వకు వచ్చెను. రాముఁడు ప్రియురాలిని జూచి 'దేవీ! కాంచనధాతు మయమై మెఱుంగులతోడి మేఘంబు క్రియఁ జెన్నారుచున్న యీయద్రి రత్నంబును జూతువా? దీనిని ఋశ్యమూకపర్వతంబందురు. ఇందే నా కును వానరరాజు సుగ్రీవునకు మొట్టమొదట సమాగమ మయ్యెను. వాలి వధను నేను ప్రతినచేసినచోటిదే. అదిగో పంపాసరోవరము. ఇందలి కాననంబు లెంతచిత్రతరములో చూడుము. ప్రేయసీ! నీవియోగంబునకు గా నేనిచ్చట నెంతో విలపించితిని. ఈసరస్తీరముననే ధర్మచారిణియైన శబరను సందర్శించితిని. ఇదిగో యిచ్చటఁ గబంధుని యోజనాయత బా హువుల వానిని సంహరించితిని. విలాసినీ! ఈవటవృక్షరాజమును జూ డుము. ఇచ్చటనే గదా మహాత్ముఁడైన జటాయువునకును లోకకంటకుఁ డైన రావణునకును నీనిమిత్తము ఘోరయుద్ధమయ్యెను. సీతా! అదిగో యయ్యాశ్రమమును గుర్తింతువా? అచ్చటనేగదా నాకును ఖరదూషణాదు లకును బోరయ్యెను. జానకీ! ఈపర్ణశాల జ్ఞప్తియున్నదా? ఇచ్చటనే గదా పాపాత్ముఁడు రావణుఁడు నిన్ను దొంగిలికొనిపోయినది. అదిగో గోదావరీనదీమతల్లి ; అల్లదిగో యగస్త్యమహర్షి యాశ్రమము ; అల్లదిగో సుతీ క్ష్ణమహర్షి యాశ్రమము. వైదేహీ! అదిగో శరభంగాశ్రమప్రదేశము. నాఁడు దేవేంద్రుఁడు మనకిందు సందర్శనమిచ్చుట మఱచితివా? ఇదిగో విరాధుని గూల్చిన తావు. అదిగో యత్రిమహర్షి తాపసాశ్రమము. అన సూయాదేవి నిందు నీవుసందర్శించితివిగదా. అదిగో చిత్రకూటపర్వతము.

భరతుఁడు నన్ను సందర్శించి రాజ్యమును గైకొనుమని ప్రార్థించినచోటదిగో. అదిగో యమునాతరంగణీ.' అని చెప్పసాగెను. అంతలోన భరద్వాజాశ్రమము సమీపించెను. రాముఁడయ్యాశ్రమంబును జూచి 'సీతా! ఇందు నిల్చి యీతపోధనునకు నమస్కరించి తరలుద' మనెను. విమానమదిగెను. రాముఁడు పాదచారియై యాశ్రమము జొచ్చెను.

అత్తఱి భరద్వాజమహర్షి నిజాశ్రమంబున సుఖాసీనుఁడై చుట్టియున్న శిష్యవర్గమును సంప్రతించి యిట్లు చెప్పుచుండెను. వత్సలారా! తత్త్వవిషయమును దెలియఁగోరితిరి, వినుఁడు. చరాచరాత్మకమైన సృష్టియెల్లఁ బుట్టుచుఁ బెరుగుచు నశించుచున్నది. ఈజననస్థితిలయంబులనుఁ గన్నారఁ బ్రతిక్షణముఁ జూచుచున్నాము. దీనింబట్టి విమర్శింపఁగా సృష్టియెల్ల నశ్వరమేగాని స్థిరముగాదని యనుభవసిద్ధమగును. ఈసృష్టి స్వాభావికమని కొందఱందురు; వీరిని నిరీశ్వరవాదులనిరి. పృథివి జలము తేజము వాయువు నాకాశము ననెడి భూతములైదు గలవనియు యీపంచమహాభూతములు తన్మాత్రరూపంబు నొండొంటితోఁ గూడుచుండుననియు, ఆ సమ్మేళనంబున సృష్టియేర్పడుచున్నదనియు వాని కలయిక వివిధభాగములుగా నుండుననియు దానింబట్టి సృష్టియు వివిధరూపంబులుగా నున్నదనియు ఆపంచభూతసమ్మేళనంబు గలిగినప్పుడు సృష్టియనియు నవి యట్లు కలిసియున్నంతకాలము స్థితియనియు నయ్యవి మరల విడివడినప్పుడు లయమనియు ఈసమ్మేళనముతోడనే యాయారూపంబులు తమకుఁదామె వ్యాపారించుచుండుననియు అంతియగాని యారూపంబులలో జీవుఁడను నొకశక్తి ప్రవేశించి వాని నాటాడించుననుట బూటకమనియు, ఈజననస్థితిలయంబులు స్వతస్సిద్ధములుగావున వానిని నిలుపరాదనియు ఈరహస్యమును గ్రహించి వ్యక్తులు తమయిష్టానుసారంబులను యథామతి ననుభవింపనగుననియు, ఇదియే జీవితపరమావధియనియు, నిరీశ్వరమతసిద్ధాంతము. మఱియు ధర్మాధర్మంబులనునవి యాయావ్యక్తిసంఘంబులు తమతమసాంఘిక హితార్థ మేర్పఱచికొనిన తాత్కాలికనిబంధనములేగాని వేఱుగావనియు, ధర్మమువలనఁ బుణ్యము, నధర్మమువలనఁ బాపము వచ్చుట, అట్టి పాపపుణ్యములఫలము ననుభవించుట, వాని యనుభవార్థము దత్తదుచితమైన పరజన్మములు గలుగుచుండుట యను వచనంబులెల్ల బూటకములనియు పాపమునులేదు; పుణ్య

మును లేదనియు పాపపుణ్యములే బూటకమనుచుండఁగాఁ దత్ఫలానుభవమునకుఁ బరజన్మములు లేవని వేఱుగాఁ జెప్పనక్కఱలేదనియు, జీవితావధి యన్ననో తత్తద్భూతసమ్మేళన వ్యవస్థితినిబట్టి యుండుననియు కుమ్మరి కుండలుచేయునప్పుడు కొన్ని చాలకాలముండుట ; కొన్ని తోడ్తోడనే పగిలి పోవుట ; చూడఁగా నిట్టి తారతమ్యము మృత్తికా మర్దనాదులను బట్టియుండు నట్లుగానే జీవితంబులును దన్మాత్రల సమ్మేళన విశేషమునుబట్టి కొలఁది కాలమో, బహుకాలమో యుండుననియు అందువలన జీవితకాలమును నిర్ణయింపఁ దరముగాదనియు వారువాదింతురు.

—♦ సేశ్వరమతవాదము ♦—

సృష్టియనునది కార్యమైయున్నదనియు, కార్యమునకుఁ గారణ ముండకతప్పదనియు అభావమునుండి భావము గలుగదు కావున సృష్టికి మూలము గలదనక తీఱదనియు సేశ్వరమతమూలసూత్రము. ఈమూలమును బరబ్రహ్మమనియుఁ బరమాత్మయనియు భగవంతుఁడనియు నానావిధములఁ బేర్కొందురు. ఆపరమాత్మకు రూపనామక్రియలు లేవు. అట్లుండియు నది సర్వవ్యాపియు నవ్యయమునై శాశ్వతముగా స్థిరముగానుండును. అనఁగా దానికి జననవృద్ధి స్థితి పరిణామాది వికారములు లేవు. ఆపరమాత్మ చైతన్యస్వరూపియై తేనెయందు మాధుర్యమువలె సృష్టి నెల్ల వ్యాపించి యుండును. తేనెనుండి మాధుర్యంబును వేఱుచేయరానట్లు పరమాత్మను సృష్టినుండి వేఱుచేయరాదు. ఈచైతన్యము శక్తిమంతమని చెప్పకయే స్పష్టము. ఈశక్తినే ప్రకృతి యనిరి. చైతన్యము చలనాత్మకము ; అది దానికి నైజము. ఈచలనవ్యాపారమునే కర్మమనిరి.

ఈచైతన్యశక్తియొక్క నైజకార్యమైన చలనమును దాని తీవ్రతను బట్టి సత్త్వమని రజస్సని తమస్సని మూఁడుగా బుద్ధిగ్రాహ్యానిమిత్తము విభజించిరి. ఈమూఁడుగుణములు సర్వదా యాశక్తియందిమిడియుండును. తత్కారణంబున దానినిఁ ద్రిగుణాత్మిక యందురు.

ఈచలనవ్యాపారము చైతన్యశక్తికి నైజమైనను అది యప్పుడప్పుడు సంతగ్గినట్లై యుండుటయు మరలఁ జలించుటయుఁ గలదు. అది యంత

స్థినమై యున్నప్పుడు ప్రళయమనిరి. అది చలించినప్పుడు చలనవ్యాపారము కర్మమగును. కర్మముతోడ ఫలముగలుగును. ఆఫలమే సృష్టియనిరి.

ఈశక్తికి నిట్లు చలనాదులెప్పుడు గలుగును? ఎట్లుగలుగు? ఏలఁ గలుగు ననుప్రశ్నలు మూఁడు తప్పకవచ్చును. ఈవిచారమే వేదాంతమనిరి. ఎప్పుడుగలిగెనను ప్రశ్నకుఁ గాలనిర్ణయము చేయుట సాధ్యముగాదు కావున అనాది యనిరి, ఎట్లుకలిగెను? ఏలకలిగెను? అను ప్రశ్నలకు జవాబుచెప్పుటకు నెవనికితరముగాదు. ఎట్లుకలిగెనను ప్రశ్నకు జవాబుగా నది అతర్క్యమనియు ఏలఁ గలిగెననుదానికి జవాబుగా అది లీలయనియు వచించిరి. ప్రకృతియొక్క చలనాత్మకవ్యాపారమైన కర్మము తీవ్రము మధ్యమము మందము అని మూఁడు విధములు. ఆతారతమ్యములను బట్టి సృష్టి వివిధరూపంబులుగా నుండును. ఆకారణముచేతనే 'గహనా కర్మణోగతిః' యని పల్కిరి.

సృష్టి యిట్లు పలువిధములుగా నున్నను పరమాత్మ యంతటను వ్యాపించియేయున్నను, ఆవరణతత్త్వమనుజెట్టి వస్తువును జడమనియో చరమనియో వర్గీకరించిరి.

ఈచైతన్యశక్తి వ్యాపారమైన కర్మ మొకసారి ప్రారంభమైనతర్వాత అది ప్రలయాంతము వఱకు నవిచ్ఛిన్నముగా జరుగుచుండును. ప్రళయ కాలమందుఁగూడ నది బీజరూపంబుననుండి మరల సృష్ట్యారంభమునఁ బూర్వవాసనలతోఁ బ్రచురమగును.

సృష్టియెల్లను గర్మఫలమగుటవలన తదంశభూతులైన మనుష్యాదులు గూడ కర్మఫలమేయని స్పష్టము. ప్రాణులీకర్మమనెడి సుడిలో నొకసారి పడినఁ బిదప నందుండి వెలువడుట యంతసులభముగాదు, అట్లు వెలువడు వఱకుఁ దత్తత్కర్మానుభవయోగ్యములైన జన్మములు పరంపరగా వచ్చుచుండును. ఆసుడినుండి వెలువడుటయే మోక్షమగును. ఈకర్మప్రవాహము నే సంసారమనిరి. సంసారమనఁగా జననమరణరూప చక్రమనియుఁ జెప్పవచ్చును.

ఈచైతన్యశక్తిని సమష్టిరూపంబునఁ బరాశక్తియనియు వ్యష్టిరూపంబున జీవశక్తియనియు మహాకాశఘటాకాశములన్నట్లు పేర్కొందురు. అనఁగా

ఆవరణభేదమునుబట్టి యిట్టివిభేదమును సులభగ్రాహ్యార్థము కల్పించిరి.

ఈకర్మఫలమును ఆరబ్ధమనియు అనారబ్ధమనియు రెండుగా విభజించిరి. ఆరబ్ధమనఁగాఁ దత్కాలజన్మములో ననుభవింపవలసిన పూర్వకర్మఫలభాగము. అనారబ్ధమనఁగా అనుభవించినదిపోఁగా మిగిలియుండి యుత్తరోత్తరజన్మములలో ననుభవింపవలసిన పూర్వకర్మఫలభాగము. ఈప్రారబ్ధకర్మమును భోగింపక తీఱదు.

ప్రతికర్మమునకుఁ దద్రూపఫలమును దానికి ననుగుణమైన వాసనయు రెండును జనించుచుండును. ఫలము భుక్తమై నశించును. వాసనయన్ననో తద్రూపకర్మమునకునంకురమై జన్మాంతరమందు సంతఃకరణమును వాసనారూపంబున నావరించి తత్తత్కాలంబులలో దత్తత్కర్మములకుఁ బ్రేరేపించును. ఈవాసనలు శుద్ధవాసనలనియు మలినవాసనలనియు పూర్మకర్మమును బట్టి రెండువిధములు. ఈద్వివిధవాసనలు సూక్ష్మములనియు మధ్యమములనియు గాఢములనియు మఱల మూడువిధములు. ప్రారబ్ధకర్మముయొక్క తీవ్రతనుబట్టి యీవిభాగము గలిగెను. సూక్ష్మవాసనలంకురించి తోడ్తోడ నశించును. అవి కార్యరూపముగాఁ బరిణమింపవు. మధ్యమవాసనలు కార్యరూపంబుగాఁ బరిణమింప నోపును. ఈమధ్యవాసనలు మంచివైనచో ఆ వాసనాప్రేరణఫలములైన గార్యములును మంచివిగానే యుండును. కార్యము మంచిదైనప్పుడు దానిఫలములుగూడ మంచివై యుత్తరోత్తర యాత్మకళ్యాణమునకు సహాయపడును. అవి మలినవాసనలైనచో నవికార్యముగాఁ బరిణమించి దుష్టఫలకారులగుచు నాత్మకళ్యాణమునకు నాటంకము లగుచుండును. మలినవాసనలు కలిగినప్పుడు వానిని శాస్త్రజ్ఞానముచేతనో సజ్జనసాంగత్యముచేతనో యరికట్టి కార్యరూపమునొందకుండునట్లు చేయవచ్చుననిరి. దీనినే పురుషప్రయత్నమందురు. ఈవాసనలు గాఢమైనవగుచో వానిని మరలింప నీశ్వరుఁడు గూడ సమర్థుఁడుగాఁడు. ఆరూపమైనకార్యములును దద్రూపఫలమును సంభవింపక తప్పదు.

ఎల్లకర్మములకుఁ బ్రేరేపించునది యొకటిగలదు. దానికే క్లేశమందురు. ఈక్లేశము అవిద్యయనియు, అస్మితయనియు, రాగమనియు ద్వేషమనియు, అభినివేశమనియుఁ బంచవిధములు.

కర్మఫలము తోడ్తోడనే యనుభవమునకు రావచ్చును ; లేక కాలాంతర జన్మాంతరములందు ననుభవమునకు రావచ్చును. ఈ తారతమ్యము కర్మముయొక్క తీవ్రతనుబట్టి యుండును. సద్యఃఫలమునకు నందికేశ్వర విశ్వామిత్ర మార్కండేయాదులు దృష్టాంతము. జన్మాంతరఫలమునకు నహుషుఁడు దృష్టాంతము.

కర్మఫలములైన సంస్కారములును దద్రూపవాసనలు నతఃకరణము నంటియుండును. ఒక్కొక్కజన్మము ఏకరూపసంస్కార తద్వాసనల ఫలముగా నుండవచ్చును. లేక, అనేకసంస్కార తద్వాసనలఫలముగా నుండవచ్చును. ఈరహస్యము నెఱుంగరాదు. ఏకసంస్కారతద్వాసనాఫలమైన జన్మము ఏకరాశిగా జరుగును. అనేక సంస్కార తద్వాసనాఫలమైన జన్మము పెక్కుతాఱుమార్లతోఁ గడచును.

కర్మవిపాకము జాతి ఆయువు భోగము అని మూఁడు విధములు. ఆ కారణంబున జీవునకు దేవమర్త్యతిర్యగాదిజాతి తనువులును అల్ప మధ్యమ పూర్ణాయువులును వివిధరూపభోగములును గలుగుచున్నవి. ఒకజాతితనువు వచ్చినప్పు డాజాతికి ననుగుణమైన వాసనలే వ్యవహరించును. ఆజీవి భావికాలంబున ననుభవింపవలసిన వాసనలెల్ల నప్పుడు లీనమై యుండును. ఆ జీవి యప్పటి తనువును వదలి వేఱొక తనువును దాల్చినప్పుడు దానికి సంబంధించిన వాసనలు వ్యవహరించును.

ఈవిషయమైనరహస్యము లింక నెన్నోగలవు. అవియెల్ల ననుభవవేద్యము లగుచుండును. గాఢవాసనావృతులైన వారి గతియేమి యన వచ్చును. ఏజీవిగాని కేవలము మలినవాసనామయముగానే యుండదు. ఏదోకొంచెము మంచివాసన గలిగియుండును. ఆవాసన పరిమళించు తఱి వచ్చినప్పుడు చిత్తము మంచిమార్గమున నుండును. అప్పుడు వానితలంపులును కార్యములు మంచివిగానే యుండును. అట్టి సమయంబున వానికి దైవానుగ్రహము గలిగెనేని వాని యావాసన సత్త్వవంతమై క్రమక్రమాభివృద్ధిగాంచి తుదకు జ్ఞానయోగ్యతనుగూర్చి మోక్షయోగ్యునోనర్చు. దుర్వాసనావృతుని యెడ దైవానుగ్రహము గలుగుట విపరీతముగాదా యన

వచ్చును. కేవలదురాచారుఁడు సయితము భగవంతుని శరణుఁజొచ్చెనేని వానిని సర్వేశ్వరుఁడు తప్పక యుద్ధరించును. ఇది పరమేశ్వరుని వ్రతమై యున్నది. కావున నిట్టిశంక వలదు. శుద్ధవాసనజనింపనిదే దైవచింతనము గలుగదు. ఎప్పుడు దైవచింతనము గలుగునో యప్పుడే యతఁడు శుద్ధవాసనాయుక్తుఁడగుచున్నాఁడు. అట్టివానిని భగవంతుఁడు రక్షించుటయందు వింతయేమి గలదు ? ఎంతటి వాఁడైనను ప్రారబ్ధము ననుభవించియే తీఱవలయును. ప్రారబ్ధానుభవమునకు యోగ్యముగా శరీరము లాయాదేశకాలపరిస్థితులతోఁ బొడమచుండును. ప్రారబ్ధము సుఖదుఃఖాది ద్వంద్వరూపంబున నుండును. ఈద్వంద్వములు భుక్తములై గాని నశింపవు. వానిని దొలఁగఁ ద్రోయరాదు. తొలగించుకొనవలయునవనెడి యత్నముగూడ వెఱ్ఱితనమేయగును. కావున వానిని సహించియే తీఱవలయును. ఈజ్ఞానము మెట్టమొదట స్థిరముకావలయును. ఇది యెప్పుడు స్థిరమగునో యప్పటి నుండి మనస్సు సుఖదుఃఖాదుల వంకకనే తలద్రిప్పదు. దాని ఫలమేమందురా? వీని కల్లోలము మనస్సును గలవరపెట్టకుండును. ఇది మొదటిమెట్టు.

అట్లగునేని జపతపోదానాదులవలన ఫలమేమి ? యనవచ్చును. అవి మనస్సును మరలించును. అప్పుడు భోక్తవ్యకర్మముయొక్క తీవ్రత కాన్పింపదు. అంతియగాని అవిభోక్తవ్యమును బలాగ్ణముగా హరింపజాలవు.

ప్రారబ్ధవిషయమై యిట్టినిశ్చయము గలుగుఁగాక. శరీరము నిరంతరము నేదో యొకకర్మమును జేయుచునే యుండును. అది దాని స్వభావము. కర్మమెప్పుడున్నదో దానివెంటనే తత్ఫలముండును. అఫలము ననుభవింపక తప్పదు. దానికై మరల శరీరము రాకమానదు. శరీరముతోడఁ బునఃకర్మము ప్రారంభమగును. ఈచక్రము నిలుచుటయెట్లు ? అని యడుగవచ్చును. శరీరముల రాకపోకలు పట్టి కర్మములవలనఁ గలుగుట లేదు. కర్మఫలాభిసంధివలన నవిగలుగుచున్నవి. ఫలాభిలాషయెప్పుడు లేదో యప్పుడే ఫలానుభవకారణము నశించును ; అనుభవింపవలసిన ఫలమెప్పుడు లేదో యప్పుడే శరీరధారణము తప్పును. కర్మములకుఁ గారణమేమి యని విచారింపఁగాఁ గోరికయే కారణమని తేలుచున్నది. ఈకోరికనే సంకల్పమందురు. కర్మములను జేయకుండుట సాధ్యముగాదు గావునను కర్మమునంటి ఫలముండును గావునను గర్మములను జేయుచుండియుఁ దత్ఫ

లము ననుభవింపకుండు మార్గమెట్లో యని యడుగవచ్చును. నిష్కామ కర్మమే దీనికి నుపాయమనిరి. ఎల్లకర్మములుం గొలందొల్త సకామరూపం బుననే యుండును. కావునం గర్మములను జేయుచుం దత్ఫలము నీశ్వరార్పణ మొనర్చుచు రావలయును. ఇట్లు చేయుచురాఁగాఁ గొంతకాలము నకుఁ గర్మఫలమందే విరక్తిగలుగును. అప్పుడు ఫలకాంక్షయే యుదయింపదు. కర్మములు మాత్రము యథావిధి జరుగుచుండును. దీనినే యభ్యాసయోగ మందురు.

ఎప్పుడు నిష్కామకర్మయోగబుద్ధి సిద్ధించునో యప్పుడు వానికి అహంకారమమకారములు నశించును. వానికర్మములెల్లఁ గేవల లోకోపకార పరములై యుండును. ఇట్లుచేయుట కర్మఫలసన్యాస మందురు.

సన్యాసము కర్మఫలసన్యాసమనియు సర్వకర్మసన్యాసమనియు రెండు విధములు. కర్మఫలసన్యాసమునుగూర్చి పైనఁ జెప్పితిని. సర్వకర్మసన్యాస మనఁగాఁ గర్మములు చేయకుండుటకాదు. అట్టిది సాధ్యమేగాదని మున్నే చెప్పితిని. మఱియది యెట్టిదనఁగా సంకల్పరహితముగాఁ గర్మములను సాగనిచ్చుట సర్వకర్మసన్యాసమనఁ బడును. ఫలసన్యాసమునకు సంకల్పముగలదు. ఇందు సంకల్పమేలేదు. వీనిరెంటికిఁ గలభేదమిదే. కర్మఫలసన్యాసియొక్క బుద్ధి కొంతకుఁగొంత ఫలదృష్టితోనుండును. ఇతనిబుద్ధి కేవలము తన్మయతనొంది యుండును. ఇట్టివానిని స్థితప్రజ్ఞుఁడందురు. ఇతఁడు విజ్ఞాని కావునఁ బ్రారబ్ధము ముగియునంతవఱకు శరీరముతోనుండి తర్వాత ముక్తుఁడగును. దీనిని విదేహముక్తియందురు.

ముక్తియనఁగా నేమోయని యడుగవచ్చును. పరమాత్మ కేవలానందస్వరూపము. పరమాత్మయొక్కయంశమైన జీవాత్మకూడ స్వభావము చేతఁ గేవలానందస్వరూపమని దీని నెఱింగి యాస్థితిని స్వానుభవసిద్ధముచేసి కొనుటయే ముక్తియగు. జీవాత్మకు బంధకత్వమేలేదు. అట్లున్నను అజ్ఞానవశంబున జీవాత్మను బద్ధుఁడుగాఁ దలంతురు. ఈభ్రాంతిపోవుటయే ముక్తి. ఇదే సేశ్వరమతసారాంశము.

నిరీశ్వరవాదులవాదము అనుభవమునకు నిలువదు. వారిమతమును మీరుకలలోఁ గూడఁ దలంపవలదు. రెండవమతమే సిద్ధాంతము. ఆ మత

మును విశ్వసించి మేమెల్లరము వర్తింతుము. మాయనుభవముగూడ నిట్టి సిద్ధాంతమునే దృఢపఱచుచున్నది. మీరు నట్టి విశ్వాసముతోనే పరిశ్రమ చేయవలెను. తత్త్వము కేవలబుద్ధిగ్రాహ్యము గాదు. అది యింద్రియా తీతము. ఇంద్రియాతీతమైనదానిని నట్టియింద్రియములతో నిశ్చయింప యత్నింతురు. ఇంతకన్న మౌఢ్యము లేదు. ఏవిషయమునుగూర్చియైన మొదట విందురు. విన్నంతనే దాని నుపేక్షింపరు. విన్నదానిం గూర్చి పర్యాలోచింతురు. ఆలోచింపఁగా నిగ్గుదేలినదానిని సాధింప యత్నింతురు. అది సిద్ధమైనంత ననుభవింతురు. ఈనాల్గింటినే తత్త్వశాస్త్రమందు శ్రవణ మనన ధ్యాన సిద్ధులందురు. మీకిప్పుడు శ్రవణజ్ఞానముగలదు.

ఇఁకఁ దరణోపాయమునుగూర్చి వినుము. జననమరణ రూపమయిన యీసంసారము జీవునకుఁ దప్పిపోవుటయే మోక్షమనఁబడును. ఈమోక్షము ఆత్మసాక్షాత్కారమువలనఁ గలుగును. ఆత్మసాక్షాత్కారమనఁగా నేమి యని యడుగవచ్చును, ఆత్మయనెడి వస్తువుదక్క మఱియొక్కటి యేదియు లేదనియు, ఆయాత్మ నాయందును నీయందును సమస్తచరాచరమందును నున్నదనియు, రూపభేదము గాన్పించుచున్నను దానిమాత్రముననే వాని యంతరమందున్న యాత్మగూడ భేదమని భావించుట భ్రాంతియనియు, గ్రహించి యభ్యేదతత్త్వమును స్వానుభవసిద్ధము గావించుకొనుటయే యాత్మసాక్షాత్కారమగును. ఈ యాత్మనే పరమాత్మయనియుఁ బరబ్రహ్మ మనియు నానావిధములఁ జెప్పుదురు.

ఈసాక్షాత్కారమును బడయుటకుగా నాల్గుసాధనములనుఁ జెప్పిరి. వానినే యోగములందురు. గుణస్వభావమునుబట్టి యాయాయోగము నభ్యసింపవలయును. అట్లుచేయని నాఁడు ఫలముగలుగక పోవుటయే గాక విపరీతఫలముగూడ సంభవించి పతనము గలుగును.

ఈనాల్గుయోగములలో జ్ఞానయోగము వితర్కవిచారపూర్వకమై యుండును. రాజయోగము ప్రాణబంధనపూర్వకమయి యుండును. భక్తియోగము కేవల ప్రేమపూర్వకము. కర్మయోగము కర్మఫలత్యాగ రూపకము.

సర్వయోగములకుఁ జిత్తశుద్ధియుఁ జిత్తైకాగ్రతయుఁ గావలయును. ఇవి కలుగనినాఁడు యోగము ఫలింపదు. కర్మయోగము వలనఁ జిత్తశుద్ధియు రాజయోగమువలనఁ జిత్తైకాగ్రతయుఁ గలుగును. కావునఁ గర్మయోగ రాజయోగములు రెండును జ్ఞాన భక్తి యోగములకు రెంటికి నంతర్భాగము లనవచ్చును. ఇట్లు విభజింపఁగా జ్ఞానభక్తియోగములు రెండుమాత్రము శేషించును. ఈరెండుఁగూడ పర్యవసానంబున నొక్కటే యగును. అయినను అనుష్ఠానసౌకర్యార్థము వానింగూర్చి వేర్వేఱ వచింతు వినుము.

చిత్తము ఏకాగ్రమగుటకుఁగా దానికొక్కదని యొకటి యాలంబనము వలయును. ఆలంబనములేనిచోఁ జిత్తమొకచోట నిలువదు. అది దాని నైజము. జ్ఞానయోగమందుఁ జిత్తాలంబనమునకు అవ్యక్తము వస్తువగును; భక్తియోగమందు వ్యక్తము అనఁగా సర్వేశ్వరుని యవతారాదు లాలంబనమగును. అవ్యక్తమందుఁ జిత్తమును నిలుఁపుట క్లేశతరము; వ్యక్తమందుఁ జిత్తమును నిలుపుట సులభము.

కర్మయోగమందు మఱియొకరహస్యముగలదు. కర్మయోగులు కొందఱు లోకసంగ్రహార్థమయి పాటుపడుదుమనుచు విరుమరలేక శ్రమించుచుందురు. ఇది కేవల భ్రాంతిగాని యొండుగాదు. ఈశ్వరుఁడే సర్వలోకసంగ్రహ మొనర్చుచుండును. ఈకార్యమును భగవంతుఁ డాయాయవసరములనుబట్టి స్వయముగా నవతరించియో, అధికారపురుషులను బుట్టించియో జరుపుచుండును. మనబోంట్లకెల్ల లోకకళ్యాణమునకన్న నాత్మకళ్యాణమే పరమార్థమగును. ఆత్మకళ్యాణంబున లోకకళ్యాణము గూడసిద్ధించిన సిద్ధింపవచ్చును. ఆత్మకళ్యాణమును సాధింపలేనివారు లోకకళ్యాణము సాధింతుమనుట యుట్టికెక్కలేనివారు స్వర్గారోహణకై యత్నించుటగును.

అట్లగునేనిఁ బురుషుఁడు లోకోపకారకార్యమే తలంపఁగూడదని శంకింతురా? నావచించిన దానితాత్పర్య మదిగాదు. ఆత్మకళ్యాణము వృద్ధియగుఁకొలఁదిఁ దత్ఫలముగా లోకకళ్యాణముగూడఁ దనంతటతానే యానుషంగికముగాఁ గలుగుచుండును. లోకోపకృతినిఁ జేయఁదలంచుట యందు నీసంకల్పమేమి? సృష్టినెల్ల నుద్ధరింతుగాక అను సంకల్పముతో గాని, భూతములయెడఁగల కరుణతోఁగాని పాటుపడుదువా? లేక, సృష్టి

యెల్లను బ్రహ్మమే గావున సృష్టి నారాధించుట బ్రహ్మము నారాధించుట యనుభావముతోఁ బాటుపడుదువా ? మొదటి పక్షమేని, నీసంకల్పము నందే యహంకారదోషము గలదు. ఆదోషమున్నంతకాలము నీ చేతలు నిర్వ్యాజకములు గాఁజాలవు. సవ్యాజక కార్యములు నిష్కామకర్మములు కానేరవు. నిష్కామములు గాని కర్మములవలనఁ జిత్తవిక్షేపమగునే గాని చిత్తశుద్ధిగలుగనేరదు. నీకర్మయోగము చిత్తశుద్ధ్యర్థమై యుండఁగాఁ జిత్త విక్షేపము గలుగునాఁడు నీకు యోగభంగమగును గదా ? అట్లుగాక రెండవ పక్షమగునేని, నీచరిత్ర పరమశ్లాఘ్యమగును ; నీ యోగము సమగ్రసిద్ధిని బడయును.

వత్సలారా ! సంగతిని వివరించితిని. మీమీ నైజమెట్టిదో మున్ముందుగాఁ జిరపరీక్ష గావించుకొని, యందులకు ననుకూలమైన యోగము నభ్యసించి పరమార్థము నొందుము.

వత్సలారా ! సర్వము గుణముల కార్యమని స్వభావవాదులందురు. గుణమనఁగా స్వభావము. అది యొకవస్తువు నాశ్రయించి యుండునే గాని ప్రత్యేకించి యుండనేరదు. గుణముగలవాఁడు గుణియగును. ఈ స్వభావవాదులు చెప్పునట్టి స్వభావమునకు నాధారమైనదేదో అనగా స్వభావి (గుణి) యేదో వారు వచింపరు. ఇట్లు కప్పిపుచ్చుట సత్యము గాదు. ఈరహస్యమును గ్రహింపక లోకులు భ్రాంతి చెందుదురు.

వత్సలారా ! కర్మఫలము ననుభవింపక తప్పదంటిని. దానిని దప్పించుకొనుట నరులకే గాదు కేవలవిష్ణ్వంశసంభూతుఁడై లోకోద్ధరణార్థమవతరించిన శ్రీరామచంద్రుఁ డంతటివానికిఁ గూడ సాధ్యము గాలేదు. అసాధ్యములకై పరితపింపరాదు.'

ఇట్లు భగద్వాజమహర్షి పలుకుచుండఁగా రాముఁ డచ్చటకు వచ్చి భరద్వాజునకు నమస్కరించి 'మహాత్మా ! అయోధ్యానగరము సుభిక్షమా ? మాతల్లులు సుఖమా ?' యని యడిగెను. భగద్వాజుఁడు రామపునర్దర్శనంబునకు సంతసించి 'నాయనా ! నేటికిఁ బదునాల్గుసంవత్సరములనాఁడు చైత్రశుద్ధ పంచమీదివసంబున నీ వయోధ్యానగరమును వదలి వనవాసమునకు దరలితివి.

నిన్నటితో నీచతుర్దశవర్షవనవాసవ్రతము సమాప్తమయ్యెను. నిన్ను మరలఁ జూడనోచినందుల కెంతయు సంతసింతును. రామా! సర్వముఁ దెలిసియు నన్నడుగనేల? భరతుఁడు దేహసంస్కారాదులు వదలి పంకదిగ్ధాంగుఁడై జడలువిప్పక తదేకవ్రతముతో నీపాదుకలనుముందిడి ప్రజాపాలనము చేయుచు నీరాక నిరీక్షించుచున్నాఁడు. మీవారెల్లరు సేమముగా నున్నారు. రామా! పితృవాక్యపరిపాలనార్థము కైకేయీవచనంబును తలఁ దాల్చి చేతిలోని రాజ్యంబును ద్యజించి భోగములెల్లఁ దృణీకరించి నారచీరలుగట్టి కీకారణ్యంబులను వరించి సీతాలక్ష్మణసహితంబుగాఁ దరలి వన్యమూలంబుల జీవించుచుఁ గాల్నడకవచ్చిన నిన్ను నాఁడు చూచినంతనే నాకు దుఃఖము దుర్భరమయ్యెను. ఎట్టకేలకు వైరిని నిర్జించితివి; చరితార్థుఁడవైతివి; మిత్రగణబాంధవంబుగా సుఖమువచ్చితివి. నిన్నిప్పుడు జూచినంతనే నాయానందము మేరమీరెను. రామా! నీపడినయిడుమలెల్ల నాకు స్పష్టములు. అయోధ్యనుండి చైత్రశుద్ధపంచమినాఁడు తరలితివి; నాటిరేయి తమసాతీరమునఁ గడచెను; షష్టినాడు శృంగబేరిపురముఁ జేరితివి; సప్తమియెల్ల వనస్పతిమూలమునఁ జనెను. అష్టమినాఁడింటు వచ్చితివి; నవమియెల్ల యమునాతీరమునఁ గడచెను; దశమినాఁడు చిత్రకూటముఁ జేరితివి. నాటిసాయాహ్నమున సుమంత్రుఁడు నీవచ్చినరథముతోడ నయోధ్యచేరెను. నాటిరేయి దశరథుఁడు పరలోకగతుఁ డయ్యెను. ఏకాదశినాఁడు వానికళేబరమును తైలద్రోణియందు నిక్షేపించిరి; ద్వాదశినాఁడు దూతలను భరతునికై పంపిరి. త్రయోదశీచతుర్దశు లాదూతలకు మార్గమధ్యమునఁ గడచెను. వారు పూర్ణిమనాటిరేయి కేకయనగరముఁ జేరిరి. ప్రతిపత్తునాఁడు భరతుఁడు పయనమయ్యెను. మార్గమధ్యమున నేఁడుదివసములు చనెను. అతఁడు బహుళనవమినాఁడు సూర్యోదయముతోడ నయోధ్యప్రవేశించెను, నాఁడే దశరథునకు దహనసంస్కారములు జరిగెను. ఆవలఁబదుమూఁడవనాటితో సరిగా వైశాఖశుద్ధపంచమితో జేని శ్రాద్ధకర్మములు పూర్తియయ్యెను. దేశాచారప్రకారము షష్టినాఁడు దహనదేశశోధనముఁ గావించిరి. భరతుఁడు నీయొద్దకు రానిశ్చయించి మార్గశోధనార్థము కర్మాంతికులను సప్తమినాఁడు తరలించెను. వారు దశమీపర్యంతము నాల్గుదినములు మార్గశోధనము గావించిరి. ఏకాదశినాఁడు భరతుఁడు బయలుదేరెను. అతఁడు నాటి

రాత్రి గంగలో విడిసి ద్వాదశినాఁడిచ్చటకు వచ్చి త్రయోదశినాఁడు నిన్నుఁ జేరెను. చతుర్దశీపౌర్ణమాసీప్రతిపత్తులు వానికి నీతోడఁ జిత్రకూటమందుఁ గడచెను. వైశాఖబహుళద్వితీయనాఁడు భరతుఁడయోధ్యకు మరలి చతుర్దశినాఁడప్పురముఁ జేరెను. నీవు వైశాఖబహుళపంచమినాఁడు చిత్రకూటమునుండి తరలి యత్రిమహర్షి యాశ్రమముఁజేరి యచ్చటఁ బదిసంవత్సరములు నొకటిన్నఱమాసము పుచ్చి తర్వాత పంచవటికిఁ జనుదెంచితివి. అటు నీవనవాసవ్రత చతుర్దశవర్షములలోఁ బదమూఁడవయేఁడు గడచెను. నీవచ్చటనుండఁగా ఋషిజనంబాత్మరక్షణార్థము నిన్ను శరణు గోరెను. వారియాజ్ఞమేరకు ఖరదూషణాదులను సంహరించి మునులమనంబానర్చితివి. పదునాల్గవసంవత్సరారంభమందు మారీచుఁడు రావణప్రేరితుఁడై మాయామృగంబుగా వచ్చి నిన్ను మోసగించెను. అదిసమయంబుగా రావణుఁడు సీతాదేవి నపహరించెను. ఆమెకై దుఃఖించుచు నామెను వెదక నారంభించితివి. వైశాఖమాసంబున నీకు సుగ్రీవునితో సఖ్యమయ్యెను. ఆషాఢంబున వాలిని వధించితివి. శ్రావణభాద్రపదంబులు ఋశ్యమూకంబున గడచెను. ఆశ్వీజంబున సైన్యోద్యోగము ఫాల్గుణశుద్ధచతుర్దశినాఁడు లంకాదహనము జరిగెను. మఱునాఁడు సువేలాచలమారోహించితిరి. ఆమఱునాఁడు యుద్ధమారంభమాయెను. నాటిరాత్రి నాగపాశమోక్షణంబులు ద్వితీయనాఁడు ధూమ్రాక్షునివధయుఁ దృతీయంబున వజ్రదంష్ట్రునివధయుఁ జవితినాఁడు మొదలు దశమిలోపలఁ గుంభనికుంభమకరాక్షులవధయు, ఏకాదశి మొదలు లక్ష్మణుఁడింద్రజిత్తుతోఁ బోరి వానినిఁ ద్రయోదశినాఁడు సంహరించుటయు నయ్యెను. ఫాల్గుణామావాస్యఁబున నీవు రావణుని వధించితివి. చైత్రశుద్ధప్రతిపత్తునాఁడు వానికి దహనసంస్కారాదులుజరిగెను. ద్వితీయనాఁడు విభీషణపట్టాభిషేకంబును సీతాపునఃప్రాప్తియు దేవతాప్రస్థానాదులును జరిగెను. తృతీయనాఁడు తరలి చవితినాఁడు కిష్కింధచేరి నేడిందువచ్చితివి. రామా! నాతపోబలంబున నాఁడుసుత నేటిదనుక నీదినవృత్తాంతమెల్ల గనుచుంటిని. వత్సా! నీవు నేడిందు నిలిచి నాయిచ్చునట్టి యాతిథ్యముగ్రహించి రేపగడ నయోధ్యకుఁ దరలుము. ఏదేనికోరికయున్న దెలుపనగు' ననెను. రాముఁడు వానికి శిరముతో మ్రొక్కి 'మహాత్మా! నా పోనున్న యయోధ్యామార్గమునందలి వృక్షంబులెల్ల నకాలామృతఫలవంతము

లై మధువులు స్రవించునట్లు ప్రసాదింపు' మని కోరెను. భరద్వాజుఁడట్లే యగుఁగాక' అనెను. ఆమాటతోడ వృక్షములెల్లఁ గల్పతరువులోయన సర్వకామఫలసమృద్ధము లయ్యెను. ఎన్నడును బూచికాచియెఱుంగని భూరుహంబులుగూడఁ బూఁజొంపంబులతో పండ్లగుత్తులతో నిండారెను.

## —• రాముఁడు భరతునొద్దకు హనుమంతుని బంపుట •—

రాముఁడు నాఁడట నిలిచి హనుమంతుని బిలిచి 'మారుతీ! అయోధ్యానగరంబునకుఁ జని మాతల్లులయు గురుజనాదులయు సేమము విచారించి రమ్ము. నీపోవుమార్గంబున శృంగిబేరపురము గలదు. అందు గుహుఁడను పేరి నిషాదపతి యున్నాఁడు. అతఁడు నాకు నాత్మసముఁడు. వానికి నా కుశలముఁ దెలుపుము. నాసుఖాగమంబునకు నతఁడెంతయు సంతసించును. వానివలన నయోధ్యామార్గంబును భరతునివృత్తాంతంబును నీవెఱుంగఁగలవు. భరతునకు నా సేమము వినిచి సీతాపహరణముమొదలు నేటిదనుక జరిగిన వృత్తాంతమెల్ల వినిపించి 'రాముఁడు శత్రువర్గమును జయించి యనుత్తమ యశోవిరాజియై మహాబలశాలులైన మిత్రులతోడ వచ్చుచున్నాఁడ'ని చెప్పి ఆమాటలు విన్నంతనే యతనిభావం బెట్లుండునో తన్ముఖలక్షణంబులను బట్టియు దృష్టినిబట్టియు మాటలనుబట్టియు నూహించి రమ్ము. పావనీ! సర్వకాలసమృద్ధంబును హస్త్యశ్వరథసంకులంబును బితృపైతామహంబునునైన రాజ్యంబు ననుభవించుచున్నదానిని వదలుట యెంతటివానికైనను గష్టము గాను. భరతుఁడు దానింతకాలముగా ననుభవించుచున్న రాజ్యంబును వలచునేని యది వానికే యగుగాక. మేమయోధ్యకు రాకమున్నే వాని హృదయము నెఱుంగుట మే' లని చెప్పెను.

## —• హనుమద్భరతుల సమావేశము •—

హనుమంతుఁడు కామరూపిగావున మర్త్యరూపముఁదాల్చి విహాయసపథముఁ ద్రొక్కి గంగాయమునాసంగమంబును దాఁటి శృంగిబేరపురము జేరి గుహునిఁ జూచి 'నిషాదేశ్వరా! నీసఖుఁడు రాముఁడు సత్యపరాక్రముఁడు సీతాలక్ష్మణసహితంబుగా భరద్వాజాశ్రమంబునకు వచ్చియున్నాఁడు. అంచుండి రేపు తరలివచ్చును. తనసేమము నీకుఁ దెలుప నన్నుఁ బంపఁగా

వచ్చితి' నని వానికి వచించి యందుండి వెడలి గగనమార్గంబునఁ బరశురామ తీర్థమును వాలుకీ గోమతీ నదుల నతిక్రమించి సాలవనంబును గడచి యందందలి ప్రజాప్రకీర్ణగ్రామంబులను గాంచుచుఁ జనిచని స్త్రీబాలవృద్ధనిబిడమైనదియు నందనోద్యాన చైత్రరథమహామహీరుహంబులతో నిండియున్నదియు నైన నందిగ్రామము చేరువనున్న వృక్షవాటిని డాసి, యచ్చట వల్కలంబులుగట్టి కృష్ణాజినోత్తరీయుఁడై జడలుదాల్చి పాదుకలు మున్నిడుకొని యాత్మానుసంధానతత్పరుఁడై ఫలమూలాద్యాహారంబులఁ జేసి కృశించియు బ్రహ్మర్షి తేజంబున వెలుఁగుచుఁ గాషాయవస్త్రధారులైన మంత్రులమధ్యఁ గూర్చుండి యేదో నిరీక్షించుచున్నవాఁడు వోలె నున్న భరతుని సమీపించి కయిమోడ్చి 'రాజా! రాముఁడు తనసేమంబును దెలుపుటకుఁగా నన్నుఁ బంప నిటవచ్చితిని. నేటితో నీదుఃఖమెల్లఁ దీఱెను. అచిరకాలంబున నీవు నీయన్నను గూడి సుఖముందువు. రాముఁడు తనభార్యయైన సీతాదేవిని లంకాధీశుఁడు రావణుఁడపహరింపఁగా వానిని వానరసహాయంబున వధించి తనసతిని మరలఁబడసి సర్వార్థసిద్ధుఁడై మహాబలశాలులైన మిత్రులఁగూడి వచ్చుచున్నాఁడ'ని పలికెను. ఆశుభవార్త చెవిసోకినంతనే భరతుఁడు సంతోషవివశుఁడయ్యెను. రాముఁడట్లు హనుమంతుని ముందుగాఁబంపక తానేవచ్చి తటాలున భరతునికంటఁబడియున్నచో యాకైకేయీసుతుని స్థితియేమైయుండునో యూహింపనగును.

భరతుఁడు కొండొక తడవునకు మూర్ఛతేఱి హనుమంతుని గవుంగిటఁ గూర్చి యానందాశ్రువుల వానిని జలకమాడించి 'సౌమ్యా! ఈప్రియవార్తను నాకువినిపింపఁగా దయతో నిటవచ్చిన దేవతవో మనుష్యుఁడవో యూహింపఁజాలను. ఈసువార్తవినిచినందులకుఁ బ్రత్యుపకృతిగా నీకు లక్షగోవులను నూఱుగ్రామంబులను సాలంకారశుభాచారవివాహయోగ్యకన్యారత్నంబుల బదునార్గుర నిత్తును. పదునాలుగేండ్లనాఁడు వనవాసము వరించి చన్ననాయన్న మరలవచ్చుచున్నాఁడను ప్రియవార్తను వినఁజేసిన నాభాగ్యమే భాగ్యము. 'బ్రదికియున్న నూఱేండ్లకేని శుభముఁ బడయవచ్చు' ననెడి నానుడి నాయెడ నేఁడు సార్థకమయ్యెను' అని వచించి వానిని బుష్పాసనంబునఁ గూర్చుండఁబెట్టి 'మిత్రమా! నాయన్నకు వానరులతో నెట్లు చెలిమియయ్యెనో వినఁగోరుదు' ననెను.

నావుడు రాజా ! వినుము. నీవు చిత్రకూటమునుండి వచ్చిన తరువాత రాముఁడాపర్వతమును వదలి సీతాలక్ష్మణులఁగూడి దండకారణ్యముఁ జొచ్చెను. అచ్చట విరాధుఁడను పేరి రక్కసుఁడు వారిని ధర్షించెను. రామలక్ష్మణులు వానిని సంహరించి తచ్ఛవంబును బూడ్చి సాయంసమయమునకు శరభంగాశ్రమముఁ జేరిరి. రాముని సందర్శించినంతనే శరభంగమహర్షి 'అహో ! కృతార్థుఁడనైతి' నని పలికి తనువుఁ ద్యజించి దివంగతుఁడయ్యెను. రాముఁడయ్యాశ్రమమునులకు నభివాదము లర్పించి తరలి జనస్థానము చేరెను. రామాదులటు నుండఁగాఁ గొండొకనాఁడు శూర్పణఖయను పేరిరక్కసి రాముని జూచి తద్రూపవిలాసంబులకు మోహితయై కామాతురంబున వానినాశ్రయించెను. ఆ యవినీతకు రాముఁడాగ్రహించి స్త్రీమాత్రురాలుగావునఁ దానిని జంపనోడి తన్నాసాశ్రవణపుటంబులను దమ్మునివలనఁ దఱిగించెను. ఆరక్కసి యాక్రోశించుచుఁ జని జనస్థానమునవున్న తనవారికిఁ గుయ్యిడెను. అందున్న రాక్షసులు పదునాల్గువేలమంది యొక్కుమ్మడి రాముని దాఁకిరి. రాముఁడనన్యసహాయంబుగా వారినిఁ దన్నాయకులైన ఖరదూషణాదులను మూఁడుగడియలలో రూపుమాపి దండకారణ్యతాపసి జనసంతాపంబు లుడిపెను. శూర్పణఖ తనయవమానంబును దనసోదరులైన ఖరదూషణాదుల వధయు సహింపనోపక లంకాధిపతియైన తనయన్నకు రావణాసురునకు మొఱలిడి వానిని రామునిపయికి జెలరేపెను. రావణుఁడు పగఁబూని రాముని శిక్షింప నిశ్చయించి విధానమూహించి మారీచుఁడను పేరి రాక్షసు నాశ్రయించెను. అతఁడెట్టకేలకు రావణుని మతము సేయువాఁడై రత్నమయమాయామృగమై సీతాదేవీదృష్టిపథంబున విహరింపసాగెను. దేవి యాలేడిని మక్కువచేసి దానినిబట్టితేర రాముని గోరెను. రాముఁడు ప్రియురాలికిఁ బ్రీతిఁగూర్చువాఁడై విల్లుపూని యమ్మాయామృగంబును వెంబడించెను. అది పెక్కుజిత్తులు పన్ని గుఱియాక రామునిఁ గడుదూరమీడ్చెను. రాముఁడెట్టకేలకుఁ గోపమువహించి శితశరంబును సంధించి తివిచి వదలెను. ఆమృగము వ్రేటువడి 'హా! లక్ష్మణా !' యనుచు రామస్వరంబున బిట్టఱచి నీల్గెను. సీతాదేవి యాకూయి విని రామునకు నెగ్గు శంకించి భయవిహ్వలయై రామునొద్దకు లక్ష్మణుని బలవంతముగాఁ బంపి పతిలీనహృదయయై దిగులు గుడుచుచు నొంటరిగా

నుండెను. ఆసమయంబున రావణుఁడటఁ బొంచియుండి తనవ్యూహము
ఫలించెనని సంతసిల్లి యంగారకుఁడు రోహిణినట్లు సీతాదేవిని ధర్షించి
బలాత్కారముగా నామెనుబట్టి యెత్తుకొని గగనమార్గముఁ ద్రొక్కెను.
ఆదౌష్ట్యంబును జటాయువను పేరి గృధ్రరాజు చూచి యోర్వలేక రావణుని
గవిసెను. వారికి ఘోరయుద్ధమయ్యెను. రావణుఁడు జటాయువును బడఁ
గొట్టి సీతాదేవినెత్తికొనిచనెను. అతఁడు చనుట ఋశ్యమూకపర్వతాగ్ర
మున నుండినవానరులు కొందఱుచూచిరి. రావణుఁడట్లు సీతాదేవి నప
హరించి తనలంకానగరముఁ జేరి యందామెను బందిచేసి తన్మనంబుసొహరింప
నెన్నోమాయలుపన్నెను. ఆమె వానియెడఁ గన్నెనియు నిగిడింపదయ్యెను.
అంతనతఁడామెపయిఁ గినుకవహించి యశోకవనాంతరమున నామెను బంది
చేసి రాక్షసస్త్రీలను గాపుంచెను. రాముఁడు మాయామృగమును వధించి
మఱలామఱలిఁ దనయాశ్రమమార్గము ద్రొక్కి మార్గమధ్యమున లక్ష్మణునిగాం
చి సీతనొంటిగా వదలివచ్చినందులకు దుఃఖించి తమ్మునితోడ నాశ్రమముచేరి
యందు సీతనుగానక వ్యసనవ్యగ్రాంతరంగుఁడై యామెను వెదకుచు వచ్చి
మార్గాంతరంబున జటాయువును జరమావస్థనున్న వానినిజూచి తన్ముఖంబున
సంగతి కొంతవిని వానికెంతయు శోకక్లిష్టుఁడై యాగృధ్రరాజు మాతం
డ్రికిఁ జిరమిత్రమగుట యెఱింగి వానికి సంస్కారాదులొనర్చి గోదావరీ
పరిసరవనభూములు వెదకుచు నచ్చట కబంధునిగాంచి వాని వచనంబున
ఋశ్యమూకపర్వతము చేరెను. అచ్చట సుగ్రీవుఁడను వానరోత్తముఁడు
తన యన్నయైన వాలివలనఁ దఱుమఁబడి వలసవచ్చియుండెను. రామ
సుగ్రీవులందు సంధించి కలియఁ బలుకుకొనిరి. రాముఁడు సుగ్రీవునకు
నభయప్రదానమొనర్చి వాలిని సంహరించి వానరరాజ్యంబునకు సుగ్రీవుని
రాజుగాఁజేసెను. సుగ్రీవుఁడు ప్రత్యుపకారార్థము సీతాదేవిని వెదకు
నిమిత్తము వానరులను గోట్లకొలఁది యెల్లదెసలకుఁ బంపెను. నేనును మఱి
కొందఱమును వింధ్యాద్రిదిశఁ ద్రొక్కి మార్గమధ్యంబున దెన్నుగానక చిక్కి
శోకవశులమై పరితపింపసాగితిమి. అచ్చటనే మాకిచ్చిన గడువెల్లఁజనెను.
అంతలోన మాయదృష్టవశంబుననో యన సంపాతియనువాఁడు జటాయువుని
యన్న మాకుఁ గాన్పించి సీతాదేవి లంకానగరంబున రావణుని యింటనున్న
దని తెలిపెను. లంకకుఁబోవలయునన్నచో శతయోజన విస్తీర్ణమైన

సముద్రమును దాఁటవలయును. సముద్రమును దాటుట లంకఁజొచ్చుట సీతాదేవిని జూచివచ్చుట యొక్కొక్కటి కడిఁదికార్యముగాఁ దోఁచెను. మావారు శోకహతులైరి. నేను తెంపుచేసి నూఱుయోజనంబులెగసి సముద్రము దాఁటి లంకఁజొచ్చి సీతాదేవిని సందర్శించి యభిజ్ఞానార్థము రాముఁడు నాచేతికిచ్చిపంపిన రత్నాంగుళీయకంబు నామె కర్పించి యామెకు నాయెడ విశ్వాసమును గలిగించి యామె గుఱుతుగాఁ దనపతికిమ్మని యిచ్చిన శిఖామణిని గొనివచ్చి రామునకు నొసంగితిని. రాముఁడు మైథిలీవార్తను విని జీవితాంతమును బొందినవాఁడమృతంబునవలె జీవించెను. రావణుని దుండగంబునకు రామునియెడ జనించిన కోపమింతనరాదు. ఆయన త్రిజగద్దహనోద్వేల ప్రలయకాలాగ్నికరణి నయ్యెను. అంతట లంకమీఁదికి దాడివెడలితిమి. నీలుఁడనుపేరి వానరుడు రామునాజ్ఞమేరకు సముద్రమున సేతువు నిర్మించెను. వానరసైన్యమెల్ల దానివలన సముద్రము దాఁటి లంకను ముట్టడించెను. మాకును రాక్షసులకును ఘోరయుద్ధమయ్యెను. రాక్షససేనానాయకుఁడైన ప్రహస్తుఁడు నీలునిచేత నస్తమించెను. రావణానుజుఁడైన కుంభకర్ణుని రాముఁడు స్వయముగా వధించెను. రావణాత్మజుఁడైన యింద్రజిత్తు మహామాయాబలసంపన్నుఁడు లక్ష్మణుని దాఁకి ఘోరయుద్ధమొనర్చి చచ్చెను. రాక్షసవీరులనుగొందఱను సుగ్రీవాదులు మర్దించిరి. కట్టకడపట రామరావణులకు ఘోరయుద్ధమయ్యెను. రాముఁడు బ్రహ్మాస్త్రమువైచి రావణుని సంహరించెను. అంతట నింద్రయమవరుణులును నలువయు మహేశ్వరుండును స్వర్గస్థుఁడైన మీతండ్రి దశరథుఁడును వచ్చి రాముని సన్మానించి వరంబులిచ్చి చనిరి. సిద్ధచారణగంధర్వఋషులు వానినిఁ గీర్తించిరి. ఇంద్రవరబలంబున వానరులు చచ్చిపడియున్నవారు పునర్జీవితులైరి. ఎల్లరముఁ బ్రహృష్టాంతరంగులమై రామునితోడఁ బుష్పకవిమానంబుమీఁద గిష్కింధకువచ్చి యందుండి భరద్వాజాశ్రమముఁ జేరితిమి. రాముని నీవు రేపు పుష్యనక్షత్రంబున సందర్శింతు' వనెను.

భరతుఁడు మహాసంతోషమంది కృతాంజలియై 'అహో! ఎన్నాళ్లకు నామనోరథ మీడేఱె' నని ప్రియవచనంబులు పలికి తమ్మునిఁ జూచి 'శత్రుఘ్నా! అన్నగారు వచ్చుచున్నారు. సమస్త దేవాలయములందు

యథావిధి నర్చనాదులు జరుగవలయును. నగరాంతరచతుష్పథమండపంబులను సుగంధమాల్యాదులతో సక్రమముగా నలంకరింపవలయును. సూత వైతాళిక వాదిత్రజనంబును వేశ్యామేళంబును వివిధమంగళవాద్యపురస్సరంబుగా నన్నగారికి నెదురేగుదురుగాక. ఈశుభవార్తను నగరమెల్లఁ జాటింతురుగాక' యనెను.

### — భరతుఁడు రామునకు నెదురేగుట —

సూర్యోదయంబులోపల నయోధ్యానందిగ్రామంబులకుఁ గల దారి చక్కఁ జేయఁబడెను ; అయోధ్యానగర వీధులెల్ల శీతజలసిక్తములై లాజాపుష్పసుగంధవాసనలతో నిండెను ; నగరము ధ్వజాలంకృతమయ్యెను; గృహంబులనెల్ల నలంకరించిరి ; మార్గములందుఁ జిత్రవిచిత్ర పుష్పతోరణంబులనుగట్టి పంచవర్ణంబుల ముగ్గులు తీర్చి సుగంధంబును చల్లిరి. భద్రగజంబు ముందునడచెను. దానివెంట సైన్యంబును దానిని వెన్నాడి మంత్రులును బ్రాహ్మణక్షత్రియముఖ్యులును గురుజనంబును దరలిరి. వారిని సువాసినీమండలంబనుగమించెను. రాజబంధువులు కొందఱు హేమదామాభిరామంబులైన కరిణీకరులను జంటచేసి యెక్కి పయనమైరి. మహారథులు రథంబులధిరోహించి వెడలిరి. శక్తిప్రాసాదిహస్తులై పదాతులు కదలిరి. కౌసల్యయుఁ గైకేయీ సుమిత్రలును దదితరదశరథపత్నులును బల్లకీలమీఁద జనిరి. అశ్వఖురఘట్టనధ్వనులును రథనేమినినదంబులును భేరీధ్వానంబులును శంఖారావంబులునుఁ దుములమై చెలఁగెను. భరతుఁడు రామపాదుకలను దలనిడుకొని శుక్లమాల్యోపశోభిత శ్వేతచ్ఛత్ర చామరంబులను గొని బయలుదేరెను.

భరతుఁడట్లు సపరివారంబుగాఁ గొంతదవ్వుచని తటాలున నిలిచి 'మారుతీ ! కోఁతులకుఁ జిత్తచాంచల్యంబు సహజమందురు. అట్టిది నేఁడు నిన్నుఁ బైకొనదుగదా ? సంశయింపనేలయందువా ? ఆర్యపురుషుఁడు కానరాఁడేల ? నీ చెప్పినవానరులు కామరూపులేరీ ?' యని యడిగెను. హనుమంతుఁడు చిఱునవ్వు వహించి 'రాజా ! భరద్వాజమహర్షిప్రసాదంబున వృక్షజాలమెల్ల నిరంతరప్రసూన ఫలరమణీయమై మధువులు వర్షించుచున్నది. ఈసంగతి నల్లదిగో భ్రమరఝుంకారములే చాటుచున్నవి. ఋషి

పత్త్రముఁ డావిధంబున వానరులకుఁ గావించినవిందునఁ దగిలి వారున్నారు. అవిగో వినుము వానరకోలాహలములు. కపిసైన్యము గోమతీనదిని దాఁటుచున్నట్లు దోఁచును. అల్లదిగో వాలుకీనదియందు ధూళిరేఁగుచున్నది; ప్లవంగులు దానిని గడచుచున్నారు, అదిగో పుష్పకవిమానము. దానియందు సీతారామలక్ష్మణులును సుగ్రీవవిభీషణులు నున్నా' రని పలికెను.

—♦ రామ భరతుల సమాగమము. ♦—

అంతలోన 'రాముఁడు రాముఁ' డని పెల్లు రొదపుట్టెను. స్త్రీలయు బాలురయు యువకులయు వృద్ధులయు హర్షాతిరేకకోలాహలధ్వనులు నింగిముట్టెను. ఎందున్నవారందే వాహనంబులనుండి దిగి విమానము వంకఁ జూడసాగిరి. భరతుఁడు కయిమోడ్పుతో 'అన్నా! అన్న మేరకు వచ్చి మా ప్రాణంబులు రక్షించితి' వని సాష్టాంగనమస్కార మొనరించెను. అంతలోన విమానము నేలవ్రాలెను. రాముఁడు చేసేత భరతునందికొని యంకమునఁ గూర్చి కవుంగిటఁ గదియించి శిరము మూర్కొని పరమానందవశుఁ డయ్యెను. భరతుఁడు లక్ష్మణుని సంభావించి వైదేహికి నమస్కరించి సుగ్రీవజాంబవదాదులను గాఢాలింగనపూర్వకంబుగా గౌరవించి సుగ్రీవునితో 'వానరేశ్వరా! మాకు నీవైదవ తోఁబుట్టువవైతివి. ఉపకరించు నతఁడే మిత్త్రుఁడు; అపకారము కాపురుషలక్షణ' మని పలికి విభీషణుని జూచి 'లంకాధీశ్వరా! రామునకు నీవొనర్చిన మేలింతనరాదు. ఇదంతయు మా భాగ్య' మని సామవచనంబులు పలికెను. శత్రుఘ్నుఁడును రామలక్ష్మణులకును సీతాదేవికిని మ్రొక్కెను. రాముఁడంతటఁ దల్లికిని సుమిత్త్రకునుఁ గైకేయికినిఁ దదితరమాతృవర్గంబునకును నమస్కరించి వసిష్ఠమహార్షికిఁ బ్రణమిల్లెను. పౌరులు ముకుళితహస్తులై 'మహానుభావా! కౌసల్యానందవర్ధనా! రామా! స్వాగత' మనిరి. రాముఁడు వారినెల్ల నాదరించెను.

భరతుఁడు పాదుకలను దెచ్చి రాముని పాదంబులకుఁ దొడవి 'రాజా! ఇల్లడగా నాయొద్దనుంచిన నీరాజ్యమిదిగో యప్పగించితిని. నీవు మరల నయోధ్యకు వచ్చి రాజగుటఁ జూడనోచి జన్మ సాఫల్యమొందితిని. నాకోర్కెలెల్లఁ దీఱెను. నీకోశకోష్ఠాగారంబులను బురంబును బలంబును నీమహత్వంబున దశగుణంబుగా వర్ధిల్లెను. వానినెల్ల నీకుమరల నప్పగించితి'

అని పలికి నమస్కరించెను. భరతుని భక్తివిశేషంబునకు వానరులెల్లరు హర్షాశ్రువులు నించిరి ; విభీషణునికంట నానందబిందువులు గురిసెను.

—♦ జటావిసర్జనము ♦—

రాముఁడంతట భరతునిఁ దనయొడిలోనే కూర్చుండఁబెట్టుకొని వాని యాశ్రమమైన నందిగ్రామమునకు విమానముమీఁద సర్వసేనాసమేతంబుగాఁ బోయి యవ్వాహనంబునుండి దిగి 'విమానరాజమా ! ఇఁక నీవు నీకుబేరునిఁ జేరుము ; అనుజ్ఞ యిచ్చితి' ననెను. ఆవిమానంబుత్తరాభిముఖమై చని యలకాపురముచేరెను. రాముఁడావిమానంబును బంపి నిజపురోహితునకును వసిష్ఠునకును బ్రణమిల్లి వారితోడ నుచితాసనంబులఁ గూర్చుండెను. భరతుఁడు సమీపించి కేలుమోడ్చి 'అన్నా ! నీయాజ్ఞ మీఱనోపక వృషభరాజము వహింపఁదగినభారంబును లేఁదూడయట్లు నీ రాజ్యభారంబును మోయరానిదాని నిన్నాళ్ళు మోసితిని. దానినిఁక వహింపఁజాలను. రాజ్యము బహుఛిద్రమయమగుట సహజము. దానిని సకాలంబున సంవృతంబొనర్పనిచో నదినిలువదు. ఆకార్యంబునకు నేను చాలను. శక్తిహీనుఁడు తనకుమించినకార్యము దొరకొనుట హానియగును. దశరథమహారాజు నిజతపఃఫలంబుగా నిన్నుగాంచి పెంచి కులక్రమాగతమైనరాజ్యంబు నీచేత నుంచెను. దానిని నీవువహింపవేని ముంగిటనాఁటి పెంచినకల్పతరువు ఫలోదయకాలంబున నశించినచో దానినిబెంచినవాఁడెంతకుందునో నేఁడు నంతగా దురపిల్లును. తండ్రిమనమును నొప్పింపవలదు. మఱియు నీపట్టాభిషేక మహోత్సవంబును జూడ లోకమెల్లఁ దమకించుచున్నది. మా ప్రణయ మొప్పరికింపక నీరాజ్యము నంగీకరించి మాకోఱఁతలుదీర్చి యెంతకాలము జ్యోతిశ్చక్రము[illegible]నో భూమియెందాఁకనుండునో యందాఁక సుస్థిరముగా సమస్తభూతకల్యాణావహముగా మమ్మెల్లఁ బాలింపు' మని వచించి కూర్చుండెను.

అంతలోన క్షౌరకులువచ్చి రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు నలువురకు క్షురకర్మలు గావించిరి. రాముఁడు నాఁడరణ్యకాండములో 'భరతుఁడు స్నానమొనర్చుదాఁక నేను నీరుముట్ట' ననిపలికెను. ఆమాటకు సరిగా

మొదట భరతుని జలకము లాడించిరి. అనంతరము లక్ష్మణసుగ్రీవవిభీష ణాదులకు మజ్జనంబు లాయెను. రాముఁడు కట్టకడపట నీరాడి జడలు విచ్చి తేజోవిరాజమానమైన సింహాసనంబు నధిష్ఠించెను. దశరథునిభార్యలు చేతులార సీతాదేవి నలంకరించిరి. కౌసల్యాదేవి పుత్రవాత్సల్యమేర్పడఁగా వానిమిత్రులైన వానరులయొక్క భార్యలను ప్రయత్నపూర్వకంబుగా నలంకరించెను. సారథి సుమంత్రుఁడంత సర్వాంగశోభితరథంబును గొని వచ్చెను. రాముఁడారథమారోహించెను. సుగ్రీవహనుమదాదులు స్నాతులై పురవిలోకనార్థము చనిరి. వానరేశ్వరుని పత్నులును మర్కటాంగనలును పట్టణంబును జూచునిమిత్త మొకవంకఁ బోయిరి.

## —• రాముఁడు మంత్రివర్గమును సన్మానించుట •—

దశరథునిమంత్రు లశోకాదులు పట్టాభిషేచనద్రవ్యములు సమకూర్చి రామునకును దన్నగరంబునకును వృద్ధికరములైన పనులెల్ల వసిష్ఠునితో సంప్రతించి యాభారము వానిపయివైచి రామునొద్దకుఁ బోయి జయజయవచనంబుల వాని నాశీర్వదించిరి. మంగళోక్తులు చెలరేఁగెను; స్వస్తికంబులు మాఱుమ్రోఁగెను; తూర్యనినదంబులు బోరుకలఁగెను. కన్యకామణులు సువర్ణాక్షతలపళ్లెరంబులను గరపద్మంబులఁ దైకొని ముందు నడచిరి; వారి వెంట నాలుమంద వెడలెను; దానివెనుక బ్రాహ్మణులు మోదకంబులఁ గొని తరలిరి.

## —• అయోధ్యాప్రవేశము •—

రాముఁడు తనజనకునిమంత్రులను జేరఁబిలిచి సుగ్రీవునితోడి తన సఖ్యంబును వాయుసుతుని ప్రభావంబును వానరపరాక్రమంబులను రాక్షసబలవిశేషంబులను విభీషణశరణాగతిని వివరించుచుఁ జతురంగబలసమేతంబుగా నయోధ్యానగరముచొచ్చెను. రామునిదర్శనమైనంతనే నగరవాసులు నిజానందంబులను దెలుపుటకుఁగా మహోన్నతధ్వజములెత్తిరి. రాముఁడు మహావిభవపూర్వకంబుగాఁ దనదండ్రిగృహము చొచ్చి కౌసల్యాసుమిత్రలకు మ్రొక్కి కైకేయిని సమీపించి 'తల్లీ! నీవు నన్ను వనంబునకుఁ బంపుటయు రాజ్యంబును భరతునకిప్పింపఁ దలంచుటయు ననెడి యీరెండు

తలంపులందు నీవాత్సల్యం బెవ్వనియెడ మిక్కుటమో గ్రహింపఁజాలక లోకము విపరీతభావంబునకుఁ జిక్కెను. నాతలమోయనున్న భారంబు నెల్ల భరతుని తలపైనుంచి నాజీవితంబును సుఖముగాఁగడపు నిమిత్తము నన్ను వనాంతరంబునకుఁ బంపితివేగాని వేఱుగాదు. ఈనీవాత్సల్యంబునకు నేనెంతయుఁ గృతజ్ఞుండ నైతిని. జీవితముయొక్క పరమోద్దేశము సుఖమే గదా. ఈఋణముఁ దీర్పఁజాలను. ఇందులకుఁ బ్రతికృతిగానిదే నీరాముఁడు నీకు సాష్టాంగంబొనరించుచున్నాఁడ'ని పలికి సాగిలఁబడి నమస్కరించి, భరతుని బిలిచి 'నాయనా! నామందిరంబున సుగ్రీవుని విడియింపు' మనెను. భరతుఁడట్లు గావించి 'వానరేశ్వరా! రామపట్టాభిషేకార్థము దూతలను దరలింపు' మనెను. సుగ్రీవుఁడు వానరోత్తములను నల్వుర రావించి వారి చేతికి రత్నఖచితసువర్ణకలశంబులు నాలుగిచ్చి 'మీరు నల్వుర నాల్గుదిక్కులకుఁజని నాల్గుసముద్రముల నీరముఁగొని వేఁగువాతనే యిచ్చటఁ జేరవలయు' నని యాజ్ఞాపించెను. వారు వెనువెంటనే గగనమార్గముఁ బట్టిరి. జాంబవదాదులు చని యేనూఱునదులనుండి జలంబులను గొనివచ్చిరి. తెల్లవాఱులోపల సుషేణుఁడు తూర్పుసముద్రజలంబులను ఋషభుఁడు దక్షిణసముద్రజలంబులను గవయుఁడు పశ్చిమసముద్రజలంబులను నళుఁడుత్తరసముద్రజలంబులను దెచ్చెను. అభిషేచనపదార్థము లెల్ల సిద్ధమయ్యెను.

## — శ్రీరామపట్టాభిషేకము —

వసిష్ఠుఁడు బ్రాహ్మణపరివేష్టితుఁడై వచ్చి రాముని సీతాసమేతంబుగా రత్నమయపీఠిఁ గూర్చుండఁబెట్టి యష్టవసువులయ్యమరేశ్వరునకు వలె వామదేవ జాబాలి కాశ్యప కాత్యాయన సుయజ్ఞ గౌతమ విజయులతోఁ గూడి ప్రసన్నసుగంధిబంధురజలంబుల నప్పురుషోత్తమునకు నభిషేకమంగళ మొనర్చెను. ఋత్విజులును గన్యకామణులును మంత్రిపౌరయోధులును గ్రమముగా రామునకు నభిషేకము లొనర్చిరి. లోకపాలురు నలువురు వసిష్ఠాహూతులై సమస్తదేవతలతోడఁ జనుదెంచి నేలనడుగిడరాని కారణంబున గగనతలమందే నిలిచి దివ్యౌషధిరసంబులతో రామునభిషేకించిరి. శత్రుఘ్నుఁడు శ్వేతచ్ఛత్రంబును బట్టెను. సుగ్రీవవిభీషణు లిరుపార్శ్వంబులఁ జేరి చామరములు వీచిరి. సమస్తరత్నరచితసహస్రకమలముక్తాహారంబును

హాసప్రేఁడు వాయుదేవుని మూలంబున రామునకు సమర్పించెను. దేవ గంధర్వులు పాడిరి; అచ్చరలాడిరి; పుడమి సస్యవతియై శోభిల్లెను; వృక్షములు మధురఫలంబులను గురిసెను; నగరమెల్ల సుగంధపుష్పమనోహరమయ్యెను.

పట్టాభిషిక్తుఁడైన రాముని నభినందించుటకుఁగాఁ గౌశిక యవక్రీత గార్గ్య గాలవ కణ్వాదులు పూర్వదిశనుండియు స్వస్త్యాత్రేయ నముచి ప్రముచ్యత్రి సుముఖ విముఖాదు లగస్త్యపురస్సరంబుగా దక్షిణదిశనుండియు నృషద కవష ధౌమ్య రౌద్రేయాదులు శిష్యులతోడఁ బశ్చిమదిశనుండియు వసిష్ఠ కశ్యప విశ్వామిత్ర గౌతమ జమదగ్ని భరద్వాజు లుత్తరదిశనుండియు వచ్చిరి. రాముఁడు వారినెల్ల యథార్హము సత్కరించెను. ఆఋషిపుంగవులు మహాసంతుష్టులై 'రామా! నీరాజ్యకాలంబున రోగంబులు తలచూపకుండుఁగాక; జీర్ణసత్వంబులకు సయితము మృత్యుభయము లేకుండుఁగాక; మానవులు వపుష్మంతులై తనరారుదురుఁగాక; నారీమణు లరోగప్రసవలగుదురుఁగాక; పర్జన్యుఁడు కాలవర్షములు వర్షించుఁగాక; గోవు లమృతంబును పిదుకుఁగాక; వాయువు స్పర్శసుఖముగా వీచుఁగాక; ఈతిబాధలు లేకుండుఁగాక; ఎల్లప్రాణులు హర్షాంబుధి నోలలాడుచుండుఁగాక' అని దీవించి చనిరి.

రాముఁడంతట బ్రాహ్మణులకు లక్షతురంగంబులను సవత్సకంబులుగా లక్షగోవులను నూటాఁబోతులను త్రింశత్కోటిహిరణ్యంబులను నానాభరణంబుల నొసంగి కాంచనమాలను సుగ్రీవునకును వైడూర్యరచితసువర్ణాంగదంబుల నంగదునకును నొసంగి యింద్రుఁడిచ్చినముక్తాహారంబును సీతాదేవి చేతికి నందించెను. ఆ కళ్యాణి తనపతిహృదయంబు నూహించి వానరుల వంకను భర్తవలనను జూడసాగెను. ఇంగితజ్ఞుఁడు రాముఁడు ప్రియురాలిని జూచి 'దేవీ! పౌరుషంబును విక్రమంబును బుద్ధియు దదితరసుగుణంబులు నెవ్వనికి సహజాలంకారములో, ఎవనికి నీవు మిక్కిలి సంతసింతువో, యవ్వీరశిఖామణికి దీనినొసంగు' మనెను. సీతాదేవి యయ్యనర్ఘహారంబును హనుమంతునకు నిచ్చెను. వాయుసుతుఁడు చంద్రాంశుగౌరవమైన యాదివ్యహారమును దాల్చి శ్వేతాభ్రమువలనఁ బర్వతరాజుకరణి

నొప్పెను. అంతరాముఁడు ద్వివిదమైంద నీలులను సత్కరించి తదితరులకు యథార్హము ప్రతిపూజలు గావించి సుగ్రీవా! ఈ జాంబవదాదులు నా కొఱకుఁ బ్రాణములు త్యజించిరి. వీరి నెల్లఁ బ్రీతితోఁ జూడుము. ఎన్నఁడు గాని వీరికి నీవలన విప్రియముగారాదని పలికి వానిని వేమాఱుగఁ గౌఁగిటఁ గ్రుచ్చి, విభీషణునకు నిక్ష్వాకుకులధనమైన శ్రీరంగరాజవిమానంబునిచ్చి, 'ధర్మజ్ఞా! లంకానగరంబును ధర్మబుద్ధితోఁ బరిపాలింపుము. ఎన్నఁడును నీ హృదయంబు నధర్మమువంక మరలనీయవలదు. రాజులు బుద్ధిమంతులగుచు రేని రాజ్యంబులు శాశ్వతములై యుండును. నీవును సుగ్రీవుండును నన్ను మఱువవలదు. నాయందు మీరు నిండుప్రీతిని నెఱపఁగోరుదు. సుఖము గాఁ బోయి రమ్మనెను. ఋక్షవానరరాక్షసులు రాముని మధురవచనంబులు విని సాధువాదంబులు పలికి 'రామా! నీబుద్ధి యవక్రము; నీవీర్యము మహాద్భుతము; నీపలుకులు మధురమధురంబు' లని ప్రశంసించిరి. హనుమంతుఁడు రామునకు సాష్టాంగమాచరించి 'స్వామీ! నీయందు నాకుభక్త్యనురాగంబులు సుస్థిరములైయుండుఁగాక ; నాచిత్తము నిన్నెడఁబాయకుండుగాక ; నీకథమహీతలంబున నెంతకాలముండునో యంతకాలము నేను మనుదునుగాక; నీచరితామృతమును శ్రవణపుటంబులఁ గ్రోలుచు సుఖముండుఁగాక' యని కోరెను. రాముఁడు నిజాసనంబునుండి లేచి 'హనుమంతా! నీవు నాకుగా నొనర్చిన యొక్కొక్కకార్యమునకును నా ప్రాణముల్లెల్ల నర్పించినను జాలవు. నీబుణముఁ దీర్పఁ జాలను. నీకుఁ దగిన ప్రత్యుపకృతి యేదో దోఁపదనుచుఁ దనకంఠమందుండిన చంద్రహారంబును వాని కంఠంబునవైచి 'మారుతీ! నీకోరినకోరికలెల్ల సఫలమగును. లోకమున్నంతకాలము నాకథయుండును ; నాకథగలంతకాలము నీవు జీవింతువుగాక ; నీకీర్తినెల్లరు నుగ్గడింతురుగాక' యని వచించెను. వానరులావాక్యంబులకు మహాసంతోషమొంది సారెసారెకు రామునకు మ్రొక్కిరి. సుగ్రీవవిభీషణులు సాశ్రునేత్రులు దుఃఖసమ్మూర్ఛితులునై రాముని వీడ్కొని చనలేక చనిరి.

అట్లు రాముఁడు వారినెల్ల సాగనంపి లక్ష్మణుని బిలిచి 'సౌమిత్రీ! మనతండ్రి నాఁడు నాకుఁ బట్టాభిషేకప్రయత్నముగావింపఁగాఁ 'తమ్ముఁడా! నాతోడ నీవునిప్పుడమినిఁ బాలింపు'మని నాపల్కినపలుకు మఱువవు

గదా. ధర్మజ్ఞా! మన్వాదిపూర్వరాజన్యపాలనంబునఁ బెంపొందినదియు మనతండ్రితాతలయాదరంబును బడసినదియునైన యీరాజ్యమునకు నీవు యువరాజవై నాతోడ నీవుఁగూడ రాజ్యభారంబును వహింపుము' అని యాజ్ఞాగర్భమైన యనునయోక్తులు పలికెను. రాముఁడెంత చెప్పినను లక్ష్మణుఁడువినక 'అన్నా! పెద్దవాఁడు భరతుఁడుండఁగా నీమాటధర్మమగునా?' యని విన్నవించి భరతునకు యౌవరాజ్యాభిషేకమొనర్పుమని రాముని ప్రేరేపించెను. భరతునకు యువరాజ్యపట్టముఁ గట్టిరి. అంతట బుషీంద్రులును రాజన్యులును బంధుమిత్రసుహృజ్జనంబును యథాగౌరవంబులంది తమతమస్థానంబులకుఁ దరలిరి.

రాముఁడట్లు పట్టాభిషిక్తుఁడై రాజ్యభారమును వహించి జ్ఞాతిబంధుమిత్రవర్గంబు నెల్లవిధములఁ దనుపుచు వేదోక్తధర్మప్రతిష్ఠాపనక్రియాభిరతుఁడై శాస్త్రోక్తములైన వివిధయజ్ఞములు గావించుచుఁ బ్రజారంజనకార్యము లొనర్చుచు సర్వజనసమ్మతుఁ డయ్యెను. వానిరాజ్యమందు స్త్రీలకు వైధవ్యదుఃఖము దూరమయ్యెను; ఆధివ్యాధులు కఱవయ్యెను; దొంగతనములుగాని యాపదలుగాని కానరాకుండెను; అకాలమరణవ్యతిక్రమము లరుదయ్యెను; పరస్పరవైరంబు లస్తమితములాయెను; దేశమెల్ల రామమయముగాఁ దోఁచెను. మేఘములు కాలవర్షములు వర్షింపసాగెను; పాడిపంటలు హెచ్చుపెరిగెను; వృక్షములు నిరంతరము ఫలపుష్పభరితములై గ్రాలెను; నాలుగు వర్ణములవారుఁ దమతమ గుణకర్మజ్ఞులై స్వధర్మపరతఁ దనరిరి; ఎల్లయధర్మములకు మూలమైన లోభమును దత్కారణభూతమైన కామమును వలసపోయెను; నిగమాగమంబు లపార్థవిపరీతార్థప్రతిపాదనదుర్జనపీడావిముక్తములై యథార్థతేజోవిలసితములయ్యెను; శూన్యవాదములును సందిగ్ధప్రలాపంబులును గుత్సితమతంబులును సాంకర్యంబులును విప్లవప్రబోధనంబులును నెందుఁగానరావయ్యెను; ధర్మము నాల్గుపాదంబులఁ జరించెను; ఎల్లరును జిరాయురారోగ్యభోగభాగ్యసంపదలఁ దులఁదూగుచు నైకమత్యము గలిగి పరస్పరశ్రేయోభిలాషులై రామకథలతో దినములు పుచ్చుచు సుఖముండిరి.

యుద్ధకాండము సమాప్తము.







# శ్రీ దొడ్డ రామాయణము.

## ఉత్తర కాండము.

మ॥ సిరినేనిన్ సుఖమేనిఁ బ్రాణపదమై చెన్నారుసజ్జీవితే
శ్వరి నేనిం ద్యజియింపనోడరిల రాజన్యుల్ ప్రజారంజనా
ధ్వరదీక్షాపరులంచు నేర్పె నెవఁడా ధర్మవ్రతున్ సత్క్రియా
చరణావ్యగ్రమతిన్ నుతింతు నెద సాక్షాత్కార సంసిద్ధికై॥

రాముఁడట్లు పట్టాభిషిక్తుఁడై కొండొక నాఁడపరాహ్ణంబునఁ దమ్ములంగూడి సుఖోపవిష్టుఁడై యుండఁగా నంతరిక్షమునుండి 'సౌమ్యా! రామా! నీయాజ్ఞప్రకారము కుబేరునొద్దకుబోయితిని. ధనదుఁడు నన్నుఁ జూచి 'విమానమా! మహాత్ముఁడైన రాముఁడు దుర్ధర్షుఁడునైన రావణుని మహాదురాత్ముని బుత్త్రమిత్త్రబంధుపరివారసహితంబుగా ఘోరరణంబున నెన్నఁడు నిర్జించెనో నాఁడే నీవుఁ గూడ నిర్జితమైతివి. రావణునివధ మాకెల్లరకుఁ బరమప్రీతికరమయ్యెను. నీవా రాఘవునిఁ జేరి తదీయ లోకసంచారంబులకుఁ బరమయోగ్యవాహనమవై వానియొద్దనే సుఖముండుము. నీవిట్లు చేయుట నేనెంతయుఁ గోరుదునని చెప్పి నన్ను మరలఁ బంపెను. వాని యాజ్ఞప్రకార మిందు వచ్చితిని. నావంక తలయెత్తి చూడుము, ధనదుని శాసనము మేరకు నిన్ను మోయుచు నీయానతి యొనర్చుచు సర్వభూతంబులకు నదృశ్యంబుగాఁ జరింతు' నని పలికెను. రాముఁడావచనంబులు విని 'విమానవరా! నీకు స్వాగతము. ధనదుఁడట్లు వచించుటంబట్టి యిఁక నీయందు వృత్తదోషము గలుగదు' అని చెప్పి లాజాపుష్పసుగంధి ధూపంబుల నప్పుష్పకంబును బూజించి 'సౌమ్యా! తలఁచినప్పుడు రమ్ము;

ప్రకృతము యథేచ్ఛఁజనుము. ఎందును నీకుఁ బ్రతిఘాతముగలుగదని చెప్పెను. పుష్పకవిమానమంతట రాముని వీడ్కొని చనెను.

రాముఁడంతట తమ్ములఁగూడి రాజ్యభారము వహించుచుఁ బూర్వాహ్ణంబులందు రాజకార్యంబులను యథాధర్మము శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుచు మధ్యాహ్నసమయంబుల సీతాదేవితోడ నంతఃపురమందుఁ బుచ్చుచు సాయంకాలములందు దేవీద్వితీయుఁడై యారామవిహారంబులు సలుపుచు నుండెను. సీతాదేవియుఁ బౌర్వాహ్ణికంబులైన దేవకార్యంబులను దీర్చి తనయత్తలకెల్ల యథాగ్రపూజలుగావించి విచిత్రాభరణాంబరయై మధ్యాహ్నసమయంబులందుఁ బతిసేవలఁ దగిలియుండుచుండెను. రాముఁడా కళ్యాణవతిని నిజభాగ్యదేవతనుగా మన్నించుచుండెను.

అట్లు సీతారాములొండొరుఁగూడి చిరసుఖంబులఁ ఓలలాడుచుఁ బెద్దయుంగాలము పుచ్చిరి. ఇట్లుండఁ గొండొకనాఁడు లక్ష్మణుఁడు సీతారాములయొద్దకువచ్చి నమస్కరించి 'చిత్రకారుఁడు మనముకోరినట్లు వీథికయందన్నగారి చరిత్రను లిఖించెను; చూడనగు' నని విన్నవించెను. రాముఁడామాటవిని 'వత్సా! లక్ష్మణా! గురుజనవిరహవిధురయైన దేవిని వినోదపెట్టుటకుగా నిట్టిది సంకల్పించితిని. చిత్రకారుఁడెందాఁక చిత్రించెనో గదా?' యనెను. నావుఁడు 'అన్నా! వదినెగారియగ్నిశుద్ధిపర్యంతము చిత్రించినాఁడని లక్ష్మణుఁడు పలికెను. అదివిని 'ఇట్టియపవాదశ్రవణహేతుభూతమైన పాపము శమించుగాఁక. పుట్టువుతోడనే పరిశుద్ధయైన సీతకుఁ బావనాంతరము లేల? తీర్థోదకంబును వహ్నియు మఱియొకదానివలన శుద్ధిఁగోరునా? లోకప్రత్యయనార్థమై నాఁడు దేవి యట్లొనర్చుటయ్యెను' అని రాముఁడు తమ్మునకుఁ బలికి 'దేవీ! దేవయజనసంభవా! ఇది నీకు యావజ్జీవితమైనదయ్యెను. దీనికిగా వగవకుము; అనివార్యమశోచ్యము. కళ్యాణీ! కులధనులకు లోకరంజనమునకన్నఁ బ్రియతరము లేదు. అదే నాఁడు నానోట ననౌచిత్యంబును బల్కించి నీకు నగ్నిప్రవేశక్లేశమును గలిగించెను. శిరమునఁ దాల్పనైన నిసర్గసురభిప్రసూనంబును బాదతలంబున మెట్టిన మొఱకునైతిని' అని యోదార్పఁగాఁ బలికెను. సీతాదేవి పతిహృదయంబును గ్రహించి వానిమది నట్టి తలంపు

నుండి మరలుచున్నదై 'నాథా! మీచరిత్రమును జూతు' మని చిత్రశాలకు వానిని నడపించెను. లక్ష్మణుఁడు సీతారాముల నందు వదలి కార్యాంతర ములకుఁ జనెను.

—• చిత్రశాలాసందర్శనము •—

సీతారాములు చిత్రశాలఁ జొచ్చిరి. సీతాదేవి యందొకచిత్రమును నిర్వర్ణించి 'ఎవరువీరు? మింట సందులేకుండునట్లుగాఁ గ్రిక్కిరిసి నిలిచి యార్యపుత్త్రుని స్తుతించుచున్నట్లగపడుచున్నా' రనెను. రాముఁడిదివిని 'దేవీ! ఇవి సరహస్యజృంభకాస్త్రంబులు. ఇవి భృశాశ్వమహర్షి నుండి విశ్వామిత్రునిఁ జేరెను. ఆమహనీయుఁడు వీనిని నాకనుగ్రహించెను. ఈ దివ్యాస్త్రములకు నమస్కరింపుము. హిరణ్యగర్భాదిదేవతలు వేదవిహితా ర్థంబులను అనుష్ఠాన నియమాపాదనమూలకంబుగా సంస్థాపింపఁదలఁచి వేన వేలువర్షంబు లుగ్రతపంబులొనర్చిరి. వారియాత్మతేజములు తపోమయము లైన యీయస్త్రముల రూపంబున సాక్షాత్కరించెను. ఇవి తప్పకుండ నీ ప్రసూతిని సేవించు' ననెను. సీతాదేవి 'మహాప్రసాద'మని యావచనం బును దలతో గ్రహించి యయ్యస్త్రములకు నమస్కరించెను.

అంత రాముఁడవ్వలిచిత్రితంబును జూపి 'ఇది మిథిలావృత్తాంత' మనెను. సీతాదేవి యాచిత్రముపై దృష్టినిలిపి 'వికసన్నవనీలోత్పలశ్యామ లంబును గోమలస్నిగ్ధమనోహరంబునైన దేహసౌభాగ్యముతో, నవలీలగా విఱిచిన ముక్కంటి వింటితోఁ, గాకటి తొడవుతో, సొబగారుచున్న యార్యపుత్త్రుని సౌమ్యసుందరశ్రీని మానాయనగారు విస్మయ స్తిమితలోచ నుఁడై చూచుచున్నాఁడు' అనెను. రాముఁడామాట నందికొని 'ఇదిగో చూడు మీతండ్రిగారు గౌతమశతానందులను గులపురోహితుని మున్నిడు కొని విశ్వామిత్రులకును వసిష్ఠులకును బూజలొనర్చుచున్నాఁడు. జన కులకును రఘువులకును వియ్యంబు గలుగుటకు సంతసింపనివాఁడుండునా? ప్రేయసీ! లోకములోఁ గన్యనిచ్చు దాత యొకండును గ్రహించువాఁడు మఱియొకఁడును గానుండును. ఇచ్చుట యిచ్చుటకుఁ బుచ్చుకొనుటకు రెండిటికిఁ గౌశికుడే కర్తయయ్యెను. ఇది వింతగదా' యనెను. సీతాదేవి చిత్తరువు వంకనే దృష్టినిలిపి 'వీరుగో మీరు నలువురును గోదాన మంగళ

మాచరించి వివాహదీక్షను వహించినవారు. అహో! ఆతావుననే యా సమయముననే యిప్పుడున్నానని తలంచుచున్నా' ననెను. రాముఁడా మాట విని ప్రేయసీ! కమనీయ కంకణాంకితంబును మూర్తిగొన్న మహోత్సవంబును నైన నీకరము శతానందునిచేత దత్తమై యేసమయంబున నన్ను హర్షాంబుధి నోలలార్చెనో యాసమయ మెన్నడో చన్నను ప్రకృతము నడచుచున్నట్లే నాకును మహోత్కంఠమగుచున్నది గదా' యని పలికి యావలిచిత్తరువును జూపి 'వీఁడుగో భగవానుఁడు పరశురాముఁడ'నెను. సీతాదేవి వానిని జూచి భయపడసాగెను. రాముఁడు వానికి నమస్కరించి 'ఇదే యయోధ్యచేరితి' మని చెప్పి కన్నీరు నించుచుఁ గ్రొత్తగాఁబెండ్లాడి వచ్చిన మమ్ములను నాయనగారును దల్లులును లాలించినయుపలాలనంబులు మఱచినను మఱపునకు రావు. మనకింక నట్టి దినములు వచ్చునా? జానకీ! శైశవమును దాఁటుచున్నదని తెలుపుచున్నవో యననుండిన చిన్నచిన్నవియు నొండొంటికి వేరుపడియున్నవియు నైన దంతకుట్మలములతో, ముంగురులతో, ముగ్ధాలోకనములతో, సొబగారు వక్త్రమండలముఁగలిగి, లలితలలితంబులును జంద్రికాప్రాయంబులును సహజవిలాసమనోహరంబులును లాలతీమాధురంబులు నైన నిజాంగకంబుల నీవుమనతల్లులకెంతయు నింపుఁగూర్చుచుంటివి. నాటిసంగతులు తలంచినంతనే నాకు వ్యసనము దుర్భరమగుచున్న'దనెను.

సీతాదేవి యావలి ప్రతిమను 'జూపి నాథా! ఇది మంథరగదా' యనెను. రాముఁడామాట విననట్లు నటించి యావలఁ జూపుచు 'దేవీ! ఈగారవృక్షము జ్ఞప్తియున్నదా? శృంగిబేరపురంబున నిషాదపతియైన గుహునితోడి నెయ్య మీ చెట్టుక్రిందనే గదా మనకుఁగలిగె' ననెను. మంథరాప్రస్తావము కైకేయీనిందోపక్రమమునకుఁ గారణంబగుననియు దానికి నవకాశమీయరాదనియుఁ బతియట్లు వర్తించెనని సీతాదేవియూహించి లోలోన నవ్వి యావలిచిత్తరువును జూపుచు 'ఇక్ష్వాకువులు ముదిమిపై కొన్ననాఁడు తమరాజ్యలక్ష్మిని బుత్త్రులకొసఁగి జటాధారణకందమూలాశనాదిరూపమైన యేయారణ్యకవ్రతంబును దాల్తురో యాకఠినవ్రతంబును లేఁబ్రాయంబుననే ధరించిన తావిదేగదా?' యనెను. రాముఁడెందులకు నేమియు మాటాడకుండెను. సీతాదేవి యవ్వలఁ జూపి నాథా! ఇదిగో ప్రసన్నపుణ్యసలిలభాగీరథీభగవతి' యనెను. రాముఁడావంకఁ జూపునిలిపి

'దేవీ! భాగీరథీ! తొల్లి సగరుఁడు హయమేధయాగమును సంకల్పించి తురంగమును వదలఁగా నయ్యధ్వరాశ్వమును శక్రుఁడు హరించుటయు దానిని వెదకుటకు నతనిపుత్త్రులు దండ్రియాజ్ఞమేరకు భూతలమునెల్ల జల్లెడగాఁ ద్రవ్వుచుఁ జనిచని తుదకుఁ గపిలమహర్షి కోపాగ్నిఁబడి దగ్ధులగుటయు ననంతరము భగీరథుఁడు గరుడవచనంబున బోధితుఁడై వారికంతయుఁ జింతించి స్వశరీరక్లేశంబును దృణీకరించి కఠోరతపంబొనర్చి నిన్ను భువికిఁ గొనివచ్చి భస్మరాసులై యున్న తనతాతతండ్రులను నీతోయంబులఁ గృతార్థుల నొనర్చుటయు లోకప్రసిద్ధము. అందువలన నిన్ను రఘువులు తమకులదేవతనుగా నారాధింతురు. తల్లీ! నీవు నీకోడలైన సీతయందు సమంచితియుం బోలె శుభంబు ననుధ్యానింతువుగాక' అని యానదికి నమస్కరించెను.

సీతాదేవియు నన్నదికి మ్రొక్కి 'నాథా! భరద్వాజులవారు తెలిపిన చిత్రకూటమార్గమందు యమునాతీరంబుననున్న శ్యామయను పేరి మఱ్ఱివృక్షమిదిగో. ఈప్రదేశము జ్ఞప్తియున్నదా?' యనెను. రాముఁడావృక్షంబు నట్టేచూచి 'ప్రేయసీ! దీని నెట్లు మఱతును? దారినడచుటవలని ఖేదంబున సడలి నలిగి పరిమృదితమృణాళీదుర్బలంబులైన నీయంగకంబులను నాయురంబునఁ గూర్చి నాయొసంగిన విరియని బిగికౌఁగిలింతలు సంవాహనంబుగాఁగా నెచ్చట నీవు సుఖనిద్రను గాంచితివో యాచోటు మఱచినను మఱపునకు వచ్చునా?' యనెను.

అనంతరము వింధ్యారణ్యముఖంబున విరాధునితోడి రామునిపోరాటము చిత్రింపఁబడి యుండెను. సీతాదేవి దానిని వదలి యవ్వలిచిత్తరువుఁ జూపి 'నాథా! నీచేతివిసనకఱ్ఱను నాకు గొడుగుగాఁ బట్టి యెండసోఁకకుండునట్లుగాఁ జేసి నన్ను నడిపించి తెచ్చిన యాదక్షిణారణ్యప్రవేశారంభమును జూతె' మనెను. రాముఁడామెకు నయ్యాచోట్లు చూపుచు 'ప్రేయసీ! ఇవిగో గిరినదీతటస్థవైఖానసతపోవనంబులు. ఇందు శాంతులును నాతిథేయపరములును నీవారముష్టిపచనులును నైన గృహమేధుల కుటీరనిలయములను గంటిమి. ఈప్రదేశములు మఱవరావు. ఇదే జనస్థానమధ్యంబునఁ బ్రస్రవణపర్వతము. ఈకొండలరాయఁడు నీలపరిసరారణ్యముల యొత్తిడితోడి గోదావరి గహ్వరముఖంబుల మ్రోగించుచుండఁగా నిరంతరాసారవర్షం

బులఁ గ్రమ్మ గూఢమేఘములచేఁ గడుంగడు కార్కొని సొబగారుచుండును. కళ్యాణీ! ఈ పర్వతమందు లక్ష్మణుఁడు సేవించుచుండఁగా మనము హాయిగాఁ గడపిన యాసుదినంబులను స్మరింతువా? ఇచ్చటి సరసనీరను గోదావరిని దలంతువా? దానియుపాంతప్రదేశములందలి మన విహారవర్తనంబులను స్మరింతువా? ప్రేయసీ!

"ఉ॥ ఒక్కొకకేలఁ దన్మయతఁ గోయనఁ గౌఁగిలి చిక్కఁ దిద్దుచున్
జెక్కును జెక్కు నేర్పడని చేరిక పెంపున మెల్లమెల్లగా
నొక్కక్రమంబుగల్గక యదో యదొ యాదటఁ బక్కికొ గ్రహిన్
గ్రక్కనయామముల్ మనపరాకునఁ బోఁదుదిముట్టె రాత్రియే॥

అని వచించి యావలి చిత్తరువును జూపుచుఁ 'ప్రేయసీ! ఇది పంచవటి; ఇది శూర్పణఖ' యనెను. ఆమాటతోడ సీతాదేవి వెలవెలనై శూర్పణఖానిమిత్తంబునఁ బూర్వము కలిగిన విరహవ్యథను దలంచి భయభ్రాంతయై 'కటా! ఇంతవట్టే నీదర్శనము' అని వ్యసనకలుషస్వరంబున నుడివెను. రాముఁడు సీతాదేవిని గౌఁగిటఁ గూర్చి 'ప్రేయసీ! వియోగంబునకు వెఱచెదవు; ఇది చిత్తరువుగదా' యనెను. సీతాదేవి విన్నయై 'నాథా! ఏదైననుగానీ దుర్జనంబసుఖంబును గలిగించును గదా' యని బదులాడెను. ఆమాటతోడ రాముఁడును బ్రచలితాంతరంగుఁడై 'అయ్యో! జనస్థానవృత్తాంత మిప్పుడు జరుగుచున్నదివలెనె నాకుఁదోచుచున్న' దని నిట్టూర్చి యావలదృష్టిసారించి 'పాపాత్ములగు రాక్షసులు మాయాకనకమృగరూపంబునఁ గావించిన వంచనావృత్తాంతమిది. ఆవేత యసురలోకసమున్మూలనంబునఁ గూడఁ జల్లారక సంక్షోభించినంతనే పేర్చుచున్నది. దేవీ! మారీచుని సంహరించివచ్చి నీవు లేనిజనస్థానంబును గాంచి శోకాతిభారంబున వికలకరణుఁడనై నాగావించిన ప్రలాపంబులకు మేరయే లే' దనెను. సీతాదేవి కన్నీరునించుచు 'అహో! రఘుకులానందుఁడు నాకారణంబున నింతతల్లడిల్లెనుగదా' యని లోలోన దుఃఖింపసాగెను. రాముని నేత్రగోళంబులనుండి బాష్పంబు ధారలుగట్టి తెగినముక్తామణిసరంబును దలఁపించుచు నుడ్డిపడి ప్రస్విన్నబిందువులై దొరలసాగెను. వానియావేగము హృదయాంతరమున నెంత యడఁచిపెట్టినను దాగక వానియధర నాసాపుట కంపంబువలన స్పష్టమగుచుండెను. నిసర్గ

ధీరప్రకృతియైన రాముఁడుగూడ నెన్నఁడో గల్గిన దానిని దలఁచి ప్రాకృతుఁడువలె శోకించుట జూడఁగా దయితావిరహవ్యథ యెట్టి వారికిని దుస్సహమని తోఁపక మానదు.

రాముఁడు నిట్టూర్చి 'దేవీ! నాటి ప్రియావియోగజనిత దుఃఖాగ్ని తీవ్రమయ్యుఁ బగఁదీర్చుకొను నాశోర్కితో సహించుటయ్యెను. అది నేఁడు విపక్షమై యెదగుట్టుఁ బుండువలె సెలవాటి మనస్సు నేర్చుచున్న'దనెను. సీతాదేవియుఁ గన్నీరు నించుచు 'నాథా! నీవిప్పుడుచెంతనున్నను నాటి దుర్భరవియోగదుఃఖము తలఁపుమాత్రననే శూన్యశూన్యనుగా నన్నుఁజేసి నాహృదయంబును దహించుచున్న'దని గద్గదస్వనంబునఁ బలికెను.

రాముఁడంతట నవ్వలి చిత్రపుపుజూచి 'ఇదిగో యిది మన్వంతర పురాణగృధ్రరాజు మహానుభావుఁడు నాయన జటాయుని చరిత్ర పరాక్రమోదాహరణ' మని యందుఁ జూపు నిలిపి 'నాయనా! విహంగరాజా! నీవంటి మహాతీర్థము పరమాపన్నపరిత్రాణార్థము ప్రాణంబులను సయితము తృణీకరించు సాధువు మఱి లోకఁ దుండునా?' యనెను. సీతాదేవియు 'నాయనా! నీ యపత్యస్నేహమును నిరూఢము గావించి' తని వానికి నమస్కరించెను.

అంత రాముఁడు జనస్థానంబునకుఁ బడమటఁ గుంజకంతమను చేరి దండకారణ్య భాగమున దనుకబంధనివాసమును ఋశ్యమూకపర్వతంబున మతంగమునియాశ్రమస్థానంబును శ్రమణయను సిద్ధశబరిని పంపాసరోవరంబు నొక్కటొక్కటిగాఁ జూపించి 'దేవీ! ఈసరోవరమందలి మదకలమల్లికాక్షపక్షవ్యాహూత స్ఫురదురుదండ పుండరీకంబులను బ్రరూఢ నీలోత్పలమనోజ్ఞ ప్రదేశంబులను జక్కగాఁ జూడఁ జాలనైతిని. ఏలయందువా! నాకన్నీరు నాదృక్పథము నడ్డగించెను. భావ్యబిందువునకు బిందువునకు మధ్యకాలములో దీనిని జూచితిని. అంతమాత్రననే దీనిమనోహరత్వమింతనరాదని నాకుఁదోఁచెను' అనెను.

సీతాదేవి యావలి ప్రతిమను జూచి 'ఈయన యామహాత్ముఁడు హనుమంతుఁడు. ఈయన రావణహృతనైన నన్ను సమాశ్వసించి నా

వార్తను నీకుఁ దెలిపి నిన్ను నిలిపెను; మఱియు విభీషణునకు నీతోడ సఖ్యముఁ గూర్చెను; మూర్ఛితుని లక్ష్మణుని బ్రదికించెను; భరతునకు భ్రాతృసమాగమముఁ దెల్పి వాని ప్రాణములు నిలిపెను. చిరనిర్విణ్ణజీవలోకము నిట్లు సముద్ధరించిన మహోపకారి మహాభాగుఁడైన యీమారుతి ఋణముఁ దీర్పఁ జాల' ననెను. రాముఁ డామె మాట నందికొని 'దేవీ! వీనిపరాక్రమ కారణంబునఁ గదా మనము లోకంబులును గోడు గడచి మేలుగనుట' య్యెనని హనుమంతుని బ్రశంసించెను.

సీతాదేవి యావలిచిత్తరువును జూచుచు 'నాథా! ఈకొండపే రేమి? ఇందలిపూఁచినకదంబముమీఁద నెమళ్ళు తాండవించుచున్నవి. ఇదిగో ఈచెట్టుక్రింద ననుభావసౌభాగ్యమాత్రావశిష్టమై ధూసరమైన శ్రీతోడి నిన్ను మూర్ఛితుని లక్ష్మణుఁడు పట్టుకొని వావిచ్చి యేడ్చుచున్నట్లు చిత్తరువుగానిపించుచున్నది. సంగతియేమి? యని యడిగెను. రాముఁ డామెవంక మరలి ప్రేయసీ! నీలస్నిగ్ధనూత్నతోయవాహంబులు బొదివిన శిఖరంబులతో నర్జునపుష్పపు నెత్తావులతో నొప్పుచున్న యీపర్వతంబును మాల్యవంతమందురు. దీనిని దలంచినంతనే నీవియోగము మరల సంప్రాప్తమైనట్లు తోచుచున్న'దనెను. సీతాదేవి రామునివంక మరలి 'నాథా! ఈచిత్తరువును జూడఁగా మరలఁ బ్రసన్నగంభీరవనవీథులందు విహరింపను భాగీరథీ పవిత్రశీతలజలంబులాడను గోరిక యగుచున్న' దనెను. రాముఁ డాపలుకులకాంతయు సంతసించి 'దేవీ! నీతలఁచినట్లే యగుఁగాక. బడలినట్లు తోఁచుచున్నది; ఈకిటికీచెంతఁ గుబోయి కూర్చుండుద' మనెను. సీతాదేవియు 'నాథా! బడలికవలన నిద్ర నన్నుపహరించుచున్న' దనెను. నావుడు 'ప్రాణేశ్వరీ! శ్రమభయంబులఁ బొడమిన స్వేదబిందువులతోఁ గూడి శశికిరణంబులతాకునఁ జెమర్చునట్టి చంద్రమణిహారంబును బోని నీభుజలతను సంజీవంబుగా నాకంఠమునఁ జేర్చి నన్నుండగొని రమ్మ' నెను. సీతాదేవి యట్లే యొనర్చెను. రాముఁడు మహానందపరవశుడై 'అహో! ఇది సుఖమో దుఃఖమో నిశ్చయింప జాలను; విబోధమో సుప్తియో తెలియరాకున్నది. నిద్రావస్థయగు నేని సుఖసాక్షాత్కారప్రతిభాసముండదు. అట్టి ప్రతిభాస నాకు సమగ్రముగాఁగలదు. కాఁబట్టి యిది నిద్రకాఁజాలదు. నిద్రావస్థకాకున్న నవిషవ్యాప్తిఫలమై యుండునా? అట్లగు నేని

సుఖప్రతీతియే గలుగదుగదా ? మదకార్యమా ? ఏమోచెప్పఁజాలను. దేవీ !
నీవు తాఁకినప్పుడెల్ల నాయింద్రియములన్నియుఁ దమవ్యాపారమునుడు
గును ; అంతియగాదు ; ఒకవిధమైన వికారము నాచేతనను జైకొని రాత్నిము
వలెఁ గ్రిప్పి యున్మూలించును. ఇది మాత్రము చెప్పఁగలను ; అంతకు
మించి యిదియిట్టిదని చెప్పఁజాలను' అని వచించెను.

సీతారాములపరస్పరాంతఃకరణసాక్షికమైన యన్యోన్యానురాగము
గోదావరీవనదర్శనాదులవలన సముద్దీపితమై గాఢాలింగనానుభావితమై వారి
నివువురనట్లు తన్మయచిత్తులనొనర్చెను. రామునివచనంబులకు వైదేహి లో
లోన సంతసించి 'తమప్రసాదము స్థిరము ; ఇంతకన్న మఱేమున్న'దని
నిజకృతజ్ఞతను దెలుపఁగా రాముఁడావినయోక్తికి నెంతయు నలరి 'ప్రేయ
సీ ! నీమృదుభాషణములు విరహాక్లాంతమైన జీవకుసుమంబునకు వికాస
మును గల్గించి యిట్లనిచెప్పరాని తృప్తినిఁబుట్టించును. అంతియగాదు.
అవిశ్రవణంబులకు నమృతంబులును మనస్సునకు రసాయనంబులునై సకలేం
ద్రియమోహముఁ గూర్చును' అని వచించి యామెను మెలమెల్లగాఁ గిటికీ
చెంతకుఁ గొనిపోయెను. అంత వారిరువురు నచ్చటఁ గూర్చుండిరి. సీతా
దేవి పరుండఁ దలఁచి యేమో వెదక సాగెను. రాముఁడామెతలంపును
గ్రహించి 'ప్రేయసీ ! ఏమి వెదకెదవు ? మనవివాహసమయమునుండి నే
రామభుజముఅశ్యచే ననుపాశ్రితమైనది నీకు నింటనున్నను వనాంతరమం
దున్నను శైశవయౌవనంబులరెంట సుఖస్వాపకరమగునో యారామభుజము
నీకుఁ దలాపిగా నుండఁగా నొండువెదకనేల ?' అని తనబాహువును దల
కడగా నిడెను.

సీతాదేవి యంత రామభుజంబును దిండుగాఁజేసి నిద్రనొందెను.
రాముఁడట్లు తనయురంబున వ్రాలి నిదిరించుచున్న ప్రియురాలిపయి స్నే
హార్ద్రదృష్టిని నిలిపి 'సఖీ ! నాకుగృహలక్ష్మివియు నాకన్నులకు నమృతవ
ర్తివియునై వర్తింతువు ; నీకుసుమకోమల గాత్రస్పర్శము నాశరీరంబునకుఁ
జందనచర్చకన్న నధికసుఖంబు నిచ్చును. ప్రేయసీ ! నీబాహులత నాకం
ఠంబునకు శిశిరమసృణమౌక్తిక సరమై కూర్చిన యానందమును జెప్పనాతరం
ముగాదు. జానకీ ! నీవు నాకు సర్వాకారహృదయంగమవై తనరుదువగదా.

భవదీయమెద్దిదైనను నాకుఁ బ్రియమగును. నీవియోగము మాత్రము దుస్సహము' అని తనయంతస్థమైన యనురాగమును గ్రుమ్మరింప సాగెను. సీతాదేవి నిద్రలో 'హా! నాథా! ఎటనున్నావు; ఎటనున్నా' వని కలువరించెను. చిత్రదర్శనముచేఁ గలిగిన విరహభావన దేవికి నట్లు నిష్కారణ భయముఁ గొలుపుట రాముఁడు గ్రహించి నామెను స్నేహముతోఁ బరామర్శించుచు 'సుఖదుఃఖంబులయందు రెంట నెయ్యది యేకరూపతనుండునో, సర్వావస్థలయందేది యనుగుణమో, హృదయము విషయాటవిబడి పఱచు నప్పుడు దానికి విశ్రామస్థానమేది యగునో, దినములు గడచుకొలఁది యేది పరిపక్వమై యింపుఁగూర్చునో, యేదియనురాగసారమో యాదాంపత్య భద్రసారంబు నెట్లేనియు నెంతో యాశింతురు. దానిని వర్ణింపవాక్కు చాలదుగదా' యని తలపోయుచుండెను.

## —♦ దుర్ముఖుఁడు ♦—

రాజులు స్వపరదేశాంతర రహస్యములను దెలిసికొనుటకుఁగాఁ గొందఱను నియమింతురు. అట్టివారిని వేగులనియుఁ జారులనియుఁ జెప్పుదురు. ఈచారులు ప్రచ్ఛన్నవేషంబుల దేశదేశాంతరములు తిరుగుచు నందందలి విశేషంబులను దమ ఱేనికి నప్పుడప్పుడే యందఁజేయుచునుందురు. రాముని కాలమందుఁగూడ నట్టివారుండిరి. వారికెల్ల దుర్ముఖుఁడనువాఁడు ముఖ్యుఁడుగా నుండెను. దుర్ముఖుని సత్ప్రవర్తనమునుబట్టి వానిని రాముఁడు శుద్ధాంతచారిగా నియమించెను. ఆకారణంబున దుర్ముఖునకు రాజదర్శనము కోరినప్పుడెల్ల నిరాతంకముగాఁ గలుగుచుండెను.

దుర్ముఖుఁడు యథాపూర్వము నగరమెల్లఁ బ్రచ్ఛన్నవేషంబున సంచరించి యందలి గుసగుసలువిని

చ॥ పరమపతివ్రతామణి యపాంసులరత్నము సీతయేడ? దు
ర్భరము నవాచ్యముక్ శ్రవణదారుణఘోరము దూఱిదేడ? యే
[illegible]ఫలంబుగాఁ గడిఁదిదూషణ మిట్టిదిగల్గెనో? కటా
[illegible] సంగమందుఁ నిప్పుఁ జెదలంటెను వింతలకెల్లవింతయై॥

ఉ॥ విన్నది విన్నయట్లు నృపవీనులఁ బల్కుట మాకువృత్తిగా
నెన్నదుటం గరంచెబెవిధి ; నేఁడది కాదని త్రోసిపుచ్చినా ?
ఇన్నినాళ సచిత్తమున నింగలముం దగిలింపఁజేసినా ?
తెన్నొకయింతదోఁపదు పతిత్రపణంబగు నేమిసేయుదున్ ॥

అని లోలోనఁ జింతించి మఱునాఁడు రాజాంతఃపురమునకు వచ్చి సీతాద్వితీయుఁడైయున్న రామునకుఁ దనరాకను ప్రతీహారి వలన విన్నవించి యాజ్ఞపడసి లోనికిఁ జనుచు 'అయ్యో! ఈనిర్భాగ్యునకు నింతకన్న మఱొక కొలువు దొరకదయ్యె' నని వ్యసనపడుచు డాయంబోయి 'దేవా! జయము జయము' అనెను. రాముఁడు వానివంక మరలి 'దుర్ముఖా! సంగతి యే' మనెను. వాఁడు 'దేవా! దేశమెల్లఁ బ్రశాంతముగానున్నది. జనులెల్ల దేవరవారిని బ్రశంసించుచున్నా' రనెను. రాముఁడామాటల నిచ్చగింపక 'దుర్ముఖా! స్తుతివచనంబులు మాని దోషమేదేని విన్నఁ జెప్పుము. దోషంబులను వెనువెంటనే సవరించుట రాజులకు విధియగును. కానిచో నట్టివి యగ్నికణము వలె రాజభవనమునుండి రాష్ట్రమెల్ల దహించు' ననెను. దుర్ముఖుఁడు! కన్నీరు నించుచుఁ జెవి జేరి యేమో చెప్పెను. రాముఁడామాటలు విని 'అకటా! ఈవచనదంభోళి యతిఘోరముగా నాపయిఁ బ్రాలె' నని మూర్ఛిల్లి కొంతవడికిఁ దేఱి 'అయ్యో! సీతాపరగృహావాసమూషణంబు అమానుషసులభవహ్నిప్రవేశాద్యుపాయంబులచేత నాఁడు ప్రశమితమయ్యె మరల దైవదుర్విపాకంబువలన నాలుకవిషమువోలె నేఁడు విస్తరిల్లెను. ఈమందభాగ్యుఁ డేమిసేయ నగు' నని తల్లు విలపించి కొంత విమర్శించుకొని 'సీత మహాపతివ్రత యగుట నాకు స్పష్టము' ఆట్టి యనిందితచరిత్రను విడనాడుట ధర్మము గాదు. విడనాడనేని లోకాపవాదము దుస్తరమగును. శీలభ్రంశమునకు నన్నే యుదాహరింతురు. అంతియగాదు. 'యథారాజా తథాప్రజా' యనువచన మక్షరాక్షరముల సత్యము. మఱియుఁ బెద్దలసన్మార్గవర్తనముల కన్న వారియందలి దోషలేశములను జనులు క్షణములో ననుసరింతురు. ఇది లోకసహజము. ఎల్లరను నియమింపవలసిన రాజునందే దోషము నూహింతురేని జను లుత్పథమును ద్రొక్కక మానరు. ఎల్లయనర్థములకు నేను గారణభూతుఁడ నగుదును. సులభమో, దుర్లభమో, న్యాయమో

యన్యాయమో యేమైన నగుఁగాక లోకారాధనము రాజులకుఁ దీరని వ్రత
ము. రాజ్యప్రశాంతి కీవ్రతము నెట్టని యూఁతకఱ్ఱగానున్నది. ఆ కారణము
ననే నాతండ్రి యభిమతతమములైన స్వప్రాణములను బ్రాణాధికుఁడనైన
నన్ను విడనాడి యీవ్రతమును సాధించెను. 'అవశ్యం పితురాచార్యః'
అను నానుడి గలదు. ఇదియునుంగాక మాకుఁ గులగురువును బరమాప్తుఁడు
నైన వసిష్ఠభగవానులు ఋష్యశృంగుని యజ్ఞార్థము దవ్వుచని యుండియుఁ
బ్రజానురంజనము మఱవవలదని నాకు నాజ్ఞ పిచ్చేసిరి. జగత్కారణభూతుఁ
డైన సూర్యభగవానువంశమునజనించినట్టి మన్వాదిభూమిపాలురు చూపించిన
శుద్ధచరితకు తద్వంశభవుఁడనైన నావలననే మచ్చవచ్చునేని నాయునికి
కాల్పనా ? అట్టి యధన్యుఁడుండనేల ?' అని నిశ్చయించుకొని నిద్రించు
చున్న సీతవలను దృష్టి నిలిపి 'దేవీ ! దేవయజనసంభవా ! హా ! స్వజ
న్మానుగ్రహపవిత్రితవసుంధరా ! నిమిజనకవంశనందినీ ! నీకిట్టి పరిణామము
గలిగెనా ! నీనీశీలమును సర్వసాక్షియైన యగ్నిదేవుఁడు ప్రకటించెనో,
క్షత్త్రియుని బ్రహ్మత్వంబు నంగీకరించుటకు నిదానమైన వసిష్ఠభగవానుఁడే
నీశీలమును వేనోళ్ళఁ జాటెనో, పతిదేవతలైన నారీరత్నములకెల్ల నధిదేవత
యోయన నొప్పునట్టి యరుంధతియే నీశీలమును గూర్చి నొక్కి పల్కెనో
యానీశీలమును లోకము మెచ్చదయ్యెనా ? రామమయజీవితా ! మహారణ్య
వాసప్రియసఖీ ! హా ! ప్రియస్తోకభాషిణీ ! ఇట్టియవాఙ్మానసగోచరగుణగ
ణంబులు గలిగి నిఖిలజగద్వందనీయవై శోభిల్లు నీకును నిట్టి పరిణామమా !
హా ! జగన్మంగళీ ! నీయపాంగదృష్టిమాత్రంబున సమస్తలోకములు పావన
ములగును. అట్టి నీయందు జనోక్తులు మలీమసంబులయ్యెను. నీమహిమ
యెక్కడ ? ఈమూఢులెక్కడ ? ప్రేయసీ ! నీవలన సమస్తజగము దిక్కు
గలదిగానున్నది. నీవో దిక్కులేనిదానవై డిందనున్నావు. విధివిలసిత
మెంతవిషమమో యూహింపరా' దని లోలోనఁ జింతించి దుర్ముఖా !
లక్ష్మణాదులను దోడ్కొని రమ్మని యాజ్ఞాపించెను.

దుర్ముఖుఁడు రాముని ముఖలక్షణంబులను స్వరవిశేషంబును బరికించి
'అగ్నిపరిశుద్ధురాలును గర్భస్థితపవిత్రరఘుకుల సంతానయునైన దేవిగారిని
దుర్జనుల దూఱునకునోడి యేలినవారేమి తలచితిరో' యని హీనస్వరమునఁ
బలికెను. రాముఁడదివిని 'దుర్ముఖా ! పౌరజానపదులు దుర్జనులెట్లగుదురు ?

ఇక్ష్వాకువంశము జనులకెంతయు నశ్లీలమాయెను ; దైవయోగంబున నిందకు సందు కలిగెను ; నిందానివారణార్థము గావించిన యగ్నిశుద్ధికర్మ యేమయ్యెనందు వా ? ఎచ్చటనో జరిగినదాని నెవ్వరు నమ్మెదరు ! బాగుసేయక నావచిం చినది సేయు'మని వానినిఁ బంపివైచి సీతయెడ దృష్టిని నిలిపి 'దేవి ! నీ రాముఁడు నీయెడ మహాభీషణకర్ముఁడును క్రూరుఁడు నయ్యెను. ఎట్లం దువా ? శైశవమునుండి చేతులారఁ బోషించి పెంచిన ప్రియురాలిని, ఎల్ల కార్యములకు నన్నే యిల్లుగా నొనర్చి సదన్యమును దలఁపని దానిని, నన్ను నమ్మి నాయెద నిట్లు హాయిగా నిద్రించుచున్నదానిని, దయుత్తాపన్నమును నిన్ను నూనని పెంపుడు శకుంతికనువలె మృత్యువునకు నిచ్చుచున్నాను. ఇంతకన్న నృశంసుఁ డుండునా ? దేవీ ! ఈపాతకికి నీకు మైలయగు' నని సీతశిరంబునెత్తి యావలనుంచి బాహువులాగికొని 'మృగారత్నమా ! అపూర్వకర్మచండాలుని నన్ను వదలుము. చందనమను భ్రాంతితో దుష్ట శాకవిషద్రుమమును జేరితివి. అయ్యో ! నాకిప్పుడు జీవలోకము తల క్రిందయ్యెను ; నాజీవితప్రయోజనమెల్ల నంతరించెను ; లోకమెల్ల జీర్ణా రణ్యమువలె వట్టిచెల్లకాఁడయ్యెను ; సంసారము నిస్సారముగా మారెను ; దిక్కులేనివాఁడనైతిని. ఏమిసేయుదు ? ఇఁక గతియేమి ? అయ్యో ! ఇట్టి విలాపము ధన్యజనసులభముగుఁగాని యీనిర్భాగ్యునకుఁ గాదు. ఏల యందురా ? ఈ రాముని మేనఁ జైతన్యము వివిధదుఃఖంబుల ననుభవించు టకుఁగాఁ గూర్పఁబడెనుగాని వేఱుగాదు. అందువలననే నాప్రాణములు వజ్రకీలాయితములై యెంతఘోరవిపత్పరంపరలు వచ్చినను నశింపక నా మర్మములనెల్ల వ్రక్కలించుచున్నవి. ఈనిర్భాగ్యునకు మరణముగూడ శరణముగాకయ్యెను. హా ! తల్లీ ! అరుంధతీ ! సీత యెట్టిదో నీ వెఱుం గుదువు గదా ! నీమాటగూడ నేఁడు ప్రమాణము గాదయ్యెఁగదా ! హా ! వసిష్ఠవిశ్వామిత్రులారా ! త్రికాలజ్ఞులు మీరైనవారుఁ గూడి మాకు ముడి పెట్టితిరి. మీసంకల్పములు విధిహతుఁడైన రామునివలనఁ బొల్లుపోవుటయ్యె ను. అగ్నిదేవుఁడా ! పుణ్యపాపంబులకు నీవు ప్రమాణమగుదువు. నీ పరీక్షగూడ వ్యర్థమయ్యెను. హా ! దేవీ ! భూతధాత్రీ ! నీకన్న సుతా రత్నంబునకు నెట్టి మచ్చవచ్చెనో చూతువా ! హా ! మామా ! జనకా ! పితృకల్పుఁడవు నీవు నీసుతనుగూర్చి వినరానిమాటను విననోచితివిగదా !

హా! నాయనా! నీకోడండ్రలోనెల్ల నెవ్వతెను నీవు మిక్కుటముగాఁ గూర్మి చేయుదువో యాసీతను నిరాకరించుటవలన నిన్నుఁగూడ నీరాముఁడు నిరాకరించుచున్నాఁడు. తల్లులారా! మీ ముద్దుకోడలి కేగతి గల్గెనో కంటిరా? హా! పరమోపకారీ! లంకాపతీ! విభీషణా! నీవు నీవారినెల్లఁ ద్యజించి పడరానియిడుమలపడి యొనర్చిన మహోపకారమెల్ల బూడిదెలోని హోమమయ్యెను. ప్రియసఖా! సుగ్రీవా! ఎవతెను మరల నన్నుఁ జేర్చుటకుఁగాఁ బ్రాణములను సయితము తృణీకరించి ప్రయాసమొందితివో యదియెల్ల నిట్లయ్యెను. హా! సౌమ్యా! ఆంజనేయా! నాఁడు నీవు సీతావృత్తాంతంబును నాకుఁదెలిపి నా ప్రాణములు నిలుపుట యీకష్టమునకేనా? హా! త్రిజటా! నీయుపకారముల్లెల్ల నెట్లయ్యెనో చూడుము. రామహతకునివలన మీరెల్లరు నవమానితులైతిరి. ధర్మదారపరిత్యాగసాహస వ్యవసాయనిష్ఠురుఁడైన యీపాపాత్ముఁడు మీపావననామంబుల నుచ్చరింపనైనఁ దగఁడు. ఏలయందురా? కృతఘ్నుఁడును దురాత్ముఁడునైన యీరాముఁడు మహాత్ములైన మిమ్ముఁ జేర్కొనుటవలననే మీకుఁ బాతకము సోకుటగును. కృతఘ్నుఁడెట్లందురా? ఖరదూషణాదిరాక్షసవీరులతోడి పెనుపోరులందు నాయీశరీరంబునఁ గలిగిన వ్రణముల నే కాంతామణి తనగాఢాలింగనసుఖదానమిచ్చి మాన్పి మహోపకృతి యొనర్చెనో యాప్రసన్నహృదయ గావించిన యుపకారంబునకు నిట్టియుపకారమొనర్చువాఁడు కృతఘ్నుఁడుగాక మఱేమగును? ఇంతటి దురితాచరణధూసరస్వభావుఁడు దురాత్ముఁడుగాక యెుండగునా? వేయేల? ఆద మఱచి నాయెద వ్రాలి నిదురఁగూలియున్న దానిని నిండుచూలాలిని నా సౌభాగ్యదేవతను బ్రియను బిశితాశనులకు బలిగాఁ బాఱవైచు వాఁడెట్టివాఁడో యూహింపరాదా?' అని పలువిధంబుల దురపిల్లి సీతాపాదపద్మంబులను శిరముతోఁ దాఁకి 'దేవీ! ఇదిగో రాముఁడు తనశిరముతో నీచరణాబ్జములను గడసారి తాకుచున్నాఁడు' అని యొండు రెండడుగులు చని నిలిచి

ఉ॥ కలికినిఁబాయ దూఱు సమకట్టు, నితాంతపునెయ్యమన్నహో
బలిమిని నష్టగించి యొకపాదము నేనియు సాగనీయ, దు
ర్యేలగతియయ్యె నాకు నిపుడేక్రియనింకఁ జరింతు, నక్కటా!
తలఁపునుగూడ నన్నెడసి తారె నిదేమివిచిత్రమోగదా!

అని కొంతవడిఁ జెనఁగి యెట్టకేలకు వినిశ్చితాత్ముఁడై 'వసుంధరాదేవీ ! జనకరఘువంశంబులకు రెంటికి నేకకళ్యాణి సర్వమంగళాకరమై తనరాయనో ఏపతివ్రతామణి పుణ్యశీలము వీతిహోత్రానలవలనఁ గూడ స్థాపితమయ్యెనో, ఏమాన్యచరిత దేవయజనపుణ్యభూమియందుఁ బుట్టువుఁ గాంచెనో యట్టి సుగుణరాశిని నీప్రియసుతను నీకే యర్పించుచున్నాఁడ' నని వచించి యందుండి నిర్గమించి ద్వారమునొద్దకుఁ బోయెను.

## —♦ రాముఁడాత్మనిశ్చయంబును లక్ష్మణునకుఁ దెలుపుట ♦—

లక్ష్మణాదులు దుర్ముఖుని పిలుపు విని వచ్చి యత్తఱి ద్వారముదగ్గఱ వేచియుండిరి. రాముఁడు వారినిఁ జూచి కన్నీరు నించుచు సంగతియెల్ల వారికి వినిపించి 'తమ్ముఁడా ! లక్ష్మణా ! వేఱు తలఁపక రథము మీఁద సీతను గొనిపోయి భాగీరథీతటంబున వదలి రమ్ము. నాయనా ! సీతయందు దోషమును శంకించి యిట్లు చేయుటగాదు. జానకి యాజన్మపరిశుద్ధురాలగుట నేనెఱుంగుదును. ఈసంగతి తెలిసియున్నను లోకమునకు వెఱచి నాఁడా కుసుమకోమలాంగి వహ్నిశుద్ధయై తనపాతివ్రత్యమును స్థాపించుదనుక నేను గ్రహింపనైతిని. ఇదియెల్ల నీవు కన్నారఁ జూచియే యున్నావు ఆపరీక్ష గూడ నేఁడు పనికిరాదయ్యెను. వట్టిమాఱువలనిఫలమింత తెంపు సేయదందువా ? సతీపతుల వియోగమునకు మొత్తముమీఁదఁ బరస్పరానురాగవిశ్లేషము కారణమగును. మాయిరువురయందు నట్టిదానికి నవకాశమే గలుగదు. సీతకైనమనముపడినపాట్లవలననే యాకాంతామణియందు నాకుఁ గల యనురాగవిశేషము స్పష్టమగును. సీత సర్వసుఖములను ద్యజించి నాతోడఁ గాంతారములు దూఱి యెనలేనియిడుములు గుడిచి బందియై నిరశనవ్రతమూని ప్రాణత్యాగమునకు సమకట్టి నావచ్చుట విని జీవముల నిలువఁబెట్టి తుదకు దైవయోగంబున నన్ను మరలఁబొంది సంతసించుటవలననే యాయింతికి నాయెడఁగల యవ్యాజానురాగము విదితమగును. మాకు నొండొరులయెడఁ బ్రేమకలదో లేదో యనుటకు నింతకన్న నిదర్శనముల వలయునా ? వాక్కునెడఁబోలె స్త్రీలయెడలఁ గూడ దోషారోపణము నిష్కారణముగాఁ గలుగుచుండుననియు, లోకము సహస్రముఖిశాసని యు దానినోపమాయరాదనియు మూఢలోకనిందను బెద్దచేసి యస్థానగని

ద్యజించుట ధర్మముగాదనియు నీవు తలంచుచున్నట్లు నీచూడ్కులవలన నూహింతును. వత్సా! వినుము. తగవుతగవులను జనులు సాధారణముగా విచారింపరు. పెద్దలను బ్రమాణముగా గ్రహింతురు. పెద్దలేదిచేసినఁ దాము నదే చేయఁదురు. పెద్దలప్రమాదములను గూడ వారు ప్రమాణబుద్ధితో స్వీకరింతురు. ప్రజకు ఱేఁడు పెద్దలలోఁ బెద్దయగును. వానిచర్య రాజ్యమునకెల్లఁ బ్రమాణమగును. రాజవర్తనము తీవ్రాసిధారావ్రతచర్యకన్నఁ గష్టతరమై యుండును. కావున రాజు నిరంతరము మెలఁకువతో వర్తించుచు గోరంతప్రమాదమునకుఁ గూడ నెడమీయకుండవలయును. సీతయెడ దూఱుజనించెను. ఏలజనించెనో జనులనే యడుగవలయును. దూఱుపడినదానిని నేను గ్రహింతునేని ప్రజలెల్ల నిట్టిపట్ల నన్నే ప్రమాణముగా గ్రహింతురు. కల్లనిజములు విచారింపరు. అవిచారితముగా నింద్యలనుగూడ గ్రహించుటవలనఁ గులటలకు సర్వస్వాతంత్ర్యమిచ్చుటగును. అందువలన వర్ణసాంకర్యాది వివిధానర్థములు పొరయును. పతివ్రతను ద్యజించుట పాతకము గాదాయనియందువా? లోకముకొఱకిట్టి త్యాగమవసరమగును. పెద్దలచరిత్ర విచారింపుము. వారు సమయమువచ్చినప్పుడు తనుప్రాణములనుగూడఁ ద్యజించి లోకమునకు సన్మార్గదీపకులై వెలసిరి. అట్టివారి త్యాగప్రభావముచేతనే లోకము కొంతకుఁ గొంత నివాసయోగ్యమైయున్నది. కావున ఱేఁడు తనప్రజయందు విపరీతబుద్ధి జనింపకుండునట్లు వర్తింపవలయును. లోకమంత శుద్ధిగా వర్తించునాయని శంకింతువా? చరాచరసమస్తలోకము ప్రకృతిపరిణామముగాని వేఱుగాదు. ప్రకృతియన్ననో త్రిగుణాత్మకయై యున్నది. అందు సత్త్వము రాగద్వేషరహితమై నిర్మలముగానుండును. రజస్తమస్సులు రాగద్వేషప్రపూరితములై యుండును. రాగద్వేషములు తాత్కాలికప్రయోజనమును బాటించునేగాని దీర్ఘవిచారము చేయవు. సత్త్వప్రధానములు లోకమందు మిక్కిలి యఱుదుగానుండును. జగమెల్లఁ బ్రాయికముగా రజస్తమోగుణములచేతనే నిండియుండును. ఈరెండు గుణములకు వివేచన తక్కువగావునను దాత్కాలికస్వార్థపరములై యవియుండునుగావునను జ్ఞానులు వానికి హద్దులు నియమించిరి. ఆగుణములు తమహద్దుల నతిక్రమింపకుండునట్లు వానిపయిఁ గాపుదారినుంచిరి. ఆకాపుదారినే రాజందురు. రాజులు రాజసికతామసి

కులకొఱకేగాని సాత్త్వికులకొఱకుఁ గాదు. సాత్త్వికులు నియతేంద్రియ వ్యాపారులై యుందురు. ఇది వారికి స్వాభావికము. అందువలన వారి నొకరు నియమింపఁ బనిలేదు. రాజులు రాజసికతామసికులుఁ గావునను రాజసికతామసికులు ప్రపంచమందు బహుసంఖ్యాకులై యుందురుగావునను వారిగుణములు స్వభావముచేతనే నిరంతరము రగులుచు సముద్రతరంగముల వలెఁ బైఁపయిఁ బొరలుచు గార్చిచ్చువలెఁ జేరువనున్నదానినెల్ల గ్రసించు చుండును గావునను, బాలకులు వారిమ్రోల మహాజాగరూకులై వర్తింప వలయును. పరాకులుగూడ రాజసతామసికులు విమర్శింపరు. ఎన్నఁడును వారిబుద్ధికి విశృంఖలత్వము గలుగరాదు. వారితోడి వ్యవహారము నిప్పు తోడి చెలగాటమనవచ్చును. కావున ఏఁడేవఁగఁగూడ నట్టితత్త్వములందు విపరీతబుద్ధికి నవకాశమీయరాదు. ఇదియును గాక యిక్ష్వాకువంశము తొలినుండి యెట్టిమచ్చఁగానదు. ఆవంశమునుపయి జనులకుఁ బ్రేమగౌరవంబు లత్యధికములు. అట్టివంశమునకు నావలనఁ గళంకమగుటగాని దానియెడ జనులకు నసూయ పొడముటగాని తగదు. ఇవియెల్లఁ దలపోసి యాత్మ సుఖంబును నిరసించి ప్రాణంపుఁ బ్రాణంబును గోలుపోవ నిశ్చయించితిని. రాజ్యమెల్ల నాశనముచేయుటకన్న నేనొక్కరుఁడఁ గ్లేశపడుట మేలు. సుఖదుఃఖములు మరుమరీచికలవంటివి. ఎఱుకగలవారు సుఖదుఃఖములకు బందీగారు. నాతలఁపు దారుణముగా భావింతువా ! ఒండువిధమున నేను వర్తింతునేని లోకమును గలకాల మావరించుముప్పు నూహింతునేని నా తలఁపు క్రూరమైనది కానిది నీకే విదితమగును. నిరపరాధినియైన సీత నిట్లు కడగండ్లు గుడుపవచ్చునా యని శంకింతువు గాఁబోలు. సీత నిర్దోష రాలగుట ముమ్మాటికి సత్యము. నాకార్యము సీతను వెతలఁ ద్రోయునను టయు నిజము. అయినను సీత మహావిజ్ఞురాలుగాని మొండుగాదు. ఆ యింతికి నాతత్త్వము తేఁటతెల్లము. తాత్కాలికవియోగక్లేశ మాచానకు నొకకొంతవగను మొదటఁ గలిగింపకమానదు. అయినను గాలక్రమమునే నయ్యింతి నిజమును గ్రహించి శాంతివడయును. లక్ష్మణా ! తత్త్వమెల్ల దాఁపకచెప్పితిని. ఇఁకనీవు మాటాడక నామాటసేయుమ' మని చెప్పి తన మందిరమునకుఁ జనెను.

## — సీతావివాసము —

లక్ష్మణుఁ డంతటఁ జని రథంబునాయత్తపఱచి తెచ్చి యాచిత్రశాలాద్వారమున నిలిపి లోనికిఁజని యప్పుడే మేల్కాంచిన సీతాదేవికి నమస్కరించి 'రథమాయత్తముగానున్నది ; నదీవనగిరులను విలోకింపఁదరలనగు' ననెను. సీతాదేవి యావచనము విని నామనోహరుఁడు నాకోర్కెను వెనువెంటనే తీర్పననుగ్రహించెనని లోలోన సంతసించి మునిపత్నులకు నిచ్చుటకుగా నమూల్యవస్త్రాభరణంబులను గైకొని రఘుకులదేవతలకు నమస్కరించి గర్భభారమున నడవలేక నడచి పోయి తేరెక్కెను. రథము వెంటనే తరలెను.

రథము కదలినంతనే యశుభములు పెక్కులయ్యెను. సీతాదేవి యాదుర్నిమిత్తములను బరికించి 'సౌమిత్రీ ! దుశ్శకునములు గానవచ్చుచున్నవి. నయనమదురుచున్నది ; గాత్ర ముత్కంపమందుచున్నది ; హృదయమస్వస్థను బొరయుచున్నది ; ఔత్సుక్యము సన్నగిల్లెను ; మిక్కుటమైన యధృతి గైకొనెను ; పుడమియెల్ల శూన్యముగాఁ దోఁచుచున్నది. ఈ విపరీతము లేలకో తెలియరాదు. ఏది యెట్లున్నను మీయన్నగారికి శుభమగుఁగాక ; నాయత్తలుమున్నగువారికి సుఖమగుఁగాక ; పౌర జానపద సమస్తప్రాణులకుఁ గుశలమగుఁగాక' అనుచు నంజలిపూర్వకముగా దేవతలను బ్రార్థించెను. ఆమాటలకు లక్ష్మణునిహృదయము దుఃఖోద్వేగంబునఁ బొగిలి లోలోన సురియ సాగెను. అతఁడు వెలికిమాత్రము ధైర్యము వహించి శిరముతోడ నామెకు నమస్కరించి శివమగుఁగాక' అనెను.

రథము గోమతీతీరమందలి యాశ్రమప్రదేశముఁ జేరెను. ఆరాత్రి వారందుగడపిరి. లక్ష్మణుఁడు వఱువాత లేచి సారథిని మేల్కొలిపి 'సుమంత్రా ! రథముఁ ద్వరగాఁ బన్నుము ; ఎల్లనినేఁడు భాగీరథీజలంబులను సేవింపవలయు' ననెను. సుమంత్రుఁడు క్షణములో రథమాయత్త మొనర్చెను. సీతాలక్ష్మణులు రథమారోహించుటే తడవుగా హయఁబులు మింటఁబర్వెను. వారు పాపవినాశని యైనగంగానదిని జేరిరి. ఆపూఁట నాటఁ గడచెను.

## —• లక్ష్మణ విలాపము •—

అనంతరము లక్ష్మణుండు సీతాదేవికడకువచ్చి యెలుఁగెత్తి రోదనము సేసెను. ఆమె యాయపూర్వమునకు చింతయు విశాకము జెంది 'ధర్మజ్ఞా! చింతింపనేల? నాకుఁ జిరాభిలషితమైన జాహ్నవీతీరమును జేరితిమి. ఈ హర్షకాలంబున నాకు విషాదమును గలిగింతువేల? రామపార్శ్వమును వదలి రెండురాత్రు లుండుటకుఁగా శోకింతువా? నాదయితుండు నాకు జీవితాధిపుఁడు; వానిని వదలియుండుట నాకుమాత్రము కష్టమేగదా. అయినను మహాత్ములసందర్శన లాభమునుగోరి యిందువచ్చితిని గావున నొండురెండు నాళ్ళ వియోగమును సహింపకఁ దీఱదు. వేలతనము వలదు. గంగను దాటించి తాపసజనసందర్శనభాగ్యమును నాకుఁ జేకూర్పుము. ఆమహర్షులకు నమస్కరించి యందొకరాత్రి వుచ్చి మరలఁబురమునకుఁ జనుదము. నా ప్రియునిచూచుతమకము నన్నుఁగూడఁ ద్వరించుచున్న' దనెను.

లక్ష్మణుండు తనదుఃఖము నడచికొట్టి పడవను సిద్ధపఱపించి సీతాదేవి నందెక్కించి తానెక్కి సారథియైనసుమంత్రునితో రథమచ్చట నేయుంచుమని చెప్పి దుఃఖనిహతుండై యుండెను. పడవ యావలగట్టు చేరెను. లక్ష్మణుండు పడవనుండి తానుదిగి సీతాదేవిని దించి కన్నీరునించుచుఁ బ్రాంజలి యొనర్చి 'నాయెడలో మహాశల్యము నాటెను. ఇప్పుడు నాకుఁ జావు వచ్చినచో నెంతో మేలగును. ఇంతెట్టి లోకనిందితకార్యమునందు నియోగింపఁదగదు. తల్లీ! నాయెడఁ బ్రసన్నవగుము. నాయందుఁ బాపమారోపింపవలదు' అని దండప్రణామమొనర్చి విలపింపఁ దొడఁగెను. సీతాదేవి మహాసంవిగ్నచిత్తయై 'లక్ష్మణా! నీచర్య యూహింప రాకున్నది. సంగతియేమి? ఱేనియాజ్ఞఁ దలఁచి దుఃఖింతువా? వానియాజ్ఞ యేమో చెప్పుము. ఆజ్ఞాపించుచున్నా' నని సుంత తీవ్రముగా నడిగెను. సౌమిత్రి దీనహృదయుండై తలవంచి 'జనకాత్మజా! పురజనపదములందు నిన్నుఁ గూర్చి యున్న మహాదారుణాపవాదమును రాముండు విని సంతప్తహృదయుండై నన్నుఁ బిలిచి సంగతి తెలిపి యంతఃపురమునకుఁ బోయెను. దేవీ! ఱేని యెు[illegible]చ్చరగిల్చినమాటలను నేను నీమ్రోలఁ బలుకరాదు. దేవీ! నా[illegible] త్యజింపఁబడితివి. దీనికిఁ బౌరాపవాదభీతియేగాని వేఱు

గాదు. ఒండు తలంప వలదు. ఆశ్రమాంతములందు నిన్నుఁ బాఱవైచి పోవు మహాపాతకము నానొసఁట వ్రాసియున్నది. కఠోరగర్భగుర్వికి నీకిట్టి దారుణ రాజశాసనమును దెలుప వెఱతును. ఈజాహ్నవీతీరంబున మహాపుణ్యవంతమును రమణీయతరంబు నైన బ్రహ్మర్షి తపోవనముగలదు. అందు మాతండ్రికి నిష్టుఁడును సఖుఁడును యశశ్శాలియు మీఁదుమిక్కిలి విప్రుఁడునైన మునిపుంగవుఁడు వాల్మీకిమహర్షి గలఁడు. ఆమహాత్ముని పాదచ్ఛాయఁజేరి యుపవాసపరైకాగ్రవై రాముని హృదయమందు నిలిపి పతివ్రతాధర్మమందు నిలిచి సుఖముండుము. దేవీ! ఇట్లు చేయుదువేని నీకు మహాశ్రేయమగు' ననెను.

వైదేహి యాదారుణవచనంబులు విని విషాదవివశయై ముహూర్తకాలము సంజ్ఞ తప్పియుండి తేఱి కన్నీరు నించుచు 'లక్ష్మణా! నాయీ శరీరము దుఃఖములకొఱకే నిర్మింపఁబడెను. తొల్లి నేను మహాపాపములొనర్చితినో పత్నీవియోగమొనర్చితినో గావలయును. ఒండుచో నీజన్మంబున నాకు శుద్ధసమాచారకు రాజపత్నికి నిట్టి నిందాబహిష్కారములు గలుగునా? సౌమిత్రీ! పూర్వము దుఃఖమెంతపైకొన్నను రామపాదానువర్తిని గావున వాయెడరునడచి వనవాసమోర్చితిని. ఇప్పుడు విజనీకృతనైతిని; ఆశ్రమవాసమెట్లొనర్పనేర్తు? ఎవరికో యిట్టియెగ్గు నేనొనర్చితిని; దానిఫలము నాకిప్పుడు సంప్రాప్తమయ్యెను. సౌమిత్రీ! రాజవంశంబునకును నాభర్తకును దలవంపుతెచ్చిన నేనిట్లు జీవించుటకన్న జాహ్నవీతోయంబులకుఁ బ్రాణంబు లర్పించుట మేలగును. సౌమిత్రీ! రాజాజ్ఞ యొనర్చితివి; ఇఁకఁ జనుము. నేను నాయత్తలపాదములకుఁ దలతో మ్రొక్కితినని వారికిఁ జెప్పుము. 'రఘుకులదీపికా! నీవు ధర్మవత్సలుఁడవగుట లోకవిశ్రుతము; నీసీత పరిశుద్ధచరితయగుట నీకు స్పష్టము; మఱియు నీసతికి నీయెడఁ బరాభక్తిహితంబులుండుట నీకుఁ గ్రొత్తగాదు. అట్టినీవలననే యపకీర్తిభయంబునఁ ద్యజింపఁ బడితిని; ఇట్టి యపవాదము సంభవించినప్పుడు నా విన్నవించునది యేమియుండును? నీవే నాకుగతి; స్వామీ! నీవు నీతమ్ములయందెట్లో పౌరజానపదులయందు నట్లే యుండవలయును. ఇదే నీకుఁ బరమధర్మము. ఇంతకన్న కీర్తి యొండులేదు. పౌరజనులు ధర్మవంతులైన

జాలును. నేను నాశరీరజీవితంబులకు శోకించుటలేదు. స్త్రీకిఁ బతియే దైవమును బంధువును గురువును బ్రాణాధికుఁడు నగుఁ గావున వానికై పత్ని యెంతైనను సహించుటొప్పు' నని నావిన్నపంబుగా రామునకుఁ దెలుపుము. నావంకఁ జూడు' మనెను.

లక్ష్మణుఁ డామెకుఁ బ్రదక్షిణదండప్రణామంబు లాచరించి బిట్టేడ్చుచుఁ 'దల్లీ ! నీరూపమెట్టిదో యింతదాఁక నేనెన్నఁడుగాని జూచియెఱుంగను. నీచరణాబ్జములందే నాదృష్టి యుండును. నావచించిన విషాదవార్త వలన నీరూపము క్షణములో మాఱియుండును. ఇందులకు సంశయములేదు. అయినను రామరహితయై వనంబుననున్న నిన్నిప్పుడు చూడనేర' నని పాల నమస్కరించి శోకభారసమన్వితుఁడై పడవయెక్కి యుత్తరతీరముఁజేరి పడవ నుండి దిగి పిచ్చివాఁడువోలె సారెసారెకుఁ దిరిగి తిరిగి చూచుచుఁ బోయెను.

—• వాల్మీకియాశ్రమము •—

సీతాదేవి యట్లు పతివలనఁ బరిత్యక్తయై యచ్చోటఁబడి తనదౌర్భాగ్యమును దలఁచితలఁచి వెక్కివెక్కి యేడువసాగెను. ఆతఱి మునిబాలకులు కొందఱు పుష్పాదులకుఁగా నచ్చటకు వచ్చియుండి యామెరోదనంబును విని యటకుఁబోయి పూర్ణగర్భవతినందుఁ గాంచి వడివడి నాశ్రమంబునకుఁజని దమగురువునకు మ్రొక్కి 'స్వామీ ! ఎవతొకతె రాజపత్ని మనయాశ్రమవనాంతమున మహారోదనమొనర్చుచున్నది. ఆమె స్వర్గచ్యుతిఁగాంచిన దేవతయో లక్ష్మియోయనఁ దోఁచును. ఆవేశలాఁగి యిట్టి దుఃఖశోకములకుఁ దగినది గాదు. నదీతీరమున నొంటిగా ననాథస్త్రీవలె దీనయై యున్నది. మనుష్యాంగనగా నెంతమాత్రముఁదోఁపదు. ఆమెకు దిక్కున్నట్లు దోఁపదు. ఆమెను జూచినంతనే మాగుండియలు నీరయ్యెను. మీరే యామెకు దిక్కు కానగు' నని విన్నవించిరి. అమాని యాబాలకులనువిని యంతర్ముఖుఁడై సంగతియెల్ల గ్రహించి సీతాదేవి పడియున్నచోటికి వచ్చి దుఃఖదీనయై యున్నయామెను జూచి 'జనకరాజసుతా ! రామపత్నీ ! స్వాగతము. నీవు పతివ్రతామణివగుట త్రిజగద్విశ్రుతము ; నీవిందువచ్చిన కారణమును దపోబలంబునఁ గంటిని. పట్టీ ! నీయందెట్టిపాపమును లేదు. అమ్మా ! వగవవలదు. జన్మాంతరకర్మమువలన నీకిప్పుడీ యాపద గలిగెను.

ఎవరికినిఁ గర్మఫలము తప్పదు. సంగతి వినుము. తొల్లి సురాసురులకు యుద్ధము పొడమెను. సురలు విజృంభించిరి. అసురులు దిక్కుదోఁపక తమగురువైన శుక్రుని శరణుగోరిచనిరి. అత్తతి శుక్రుఁడు మృతసంజీవినిని సంపాదింపఁగోరి తీవ్రతపంబాచరించుచుండెను. అసురులట్లు రాఁగా శుక్రుని తల్లి సంగతివిని వారికి శరణొసంగెను. అందులకై శ్రీమహావిష్ణువు మహోగ్రహమొందిఁ దుష్టులకు శరణిచ్చితివి గావున నిన్ను వధింపకమానననిపల్కి చక్రము ప్రయోగించెను. దానితాకునకు నామె యసువులు దొఱఁగెను.

'స్త్రీమాత్రురాలిని వధింపరాదను సంగతిగూడఁ దలపోయక నాకుఁ బత్నీవియోగమును గలిగించితివి గావున నీకున్ట్లేయగుఁ గాక' అని యామె భర్త భృగుఁడు శపించెను. ఆశాపఫలముగా నిప్పుడు నీకును నీభర్తకును వియోగదుఃఖము సంభవించెను. అమ్మా ! ఒకరిసంగతియేల? నాకతవినుము.

## —• వాల్మీకి చరిత్ర •—

'పట్టీ ! పూర్వము పంపాతీరంబున శంఖుఁడన్నుపేరి మునియొకఁ డుండెను. అతఁడు పెద్దకాలము తపమాచరించి సిద్ధిఁగాంచి గోదావరీ తోయంబులఁ గృతావగాహుఁడై తత్సమీపారణ్యమునఁబడి చనుచుండెను. అది వైశాఖమాసము ; మిట్టమధ్యాహ్నమయ్యెను ; వేడివెలుఁగు మిడిమిడి వెలుఁగుచుండెను. శంఖుఁడామెండవేడిమి సహింపలేక యొకచెట్టు నీడఁ జేరెను. అంతలోఁ గిరాతుఁడొకఁడు ధనుర్ఖడ్గములఁ దాల్చి రెండవయముఁడు వోలె నచ్చటికి వచ్చి శంఖుని బెదరించి వాని సర్వస్వమును హరించి యతనిఁ నందుండి గెంటించెను. శంఖుఁడు గత్యంతరము గానక మరల నెండలోఁ బడి కాలియున్న యిసుముమీఁద నాలుగడుగులు పెట్టుచుఁ బాదములు పురపురఁబొక్కఁగా సహింపలేక చేరువనున్న పచ్చికమీఁద సుంత నిలుచుచుఁ గిరాతుని భయంబున మరల దారిపట్టి నాలుగడుగులుపెట్టుచు నంతలో మరలఁ గాళ్ళుకాలఁగా వస్త్రమును బఱచి దానిపయిఁగొంచెమాగుచు 'హా ! దైవమా !' యని వ్యసనపడుచుండెను. వానిదురవస్థకు శిలాకఠినహృదయుఁడైన యాకిరాతునకుఁగూడ జాలియయ్యెను. వాఁడంతట శంఖునికడకువచ్చి తానపహరించిన వాని పాదరక్షలు వానికిచ్చి పొమ్మనెను.

శంఖుఁడందులకు సంతసించి 'వనచరా ! నీపూర్వపుణ్యవిశేషంబున నీకీయుపకారబుద్ధి యింతమాత్రమేని యుదయించె' నని పలికి వానిని దీవించెను. ఆకిరాతుఁడామాట విని 'ఆర్యా ! నాపూర్వవృత్తాంతమును సవిస్తరముగాఁ దెలుపు' మని యాశంఖునడిగెను. నాతఁడు 'ఓయీ ! ఎండవలనిబాధ సహింపరాకున్నది. ఎండేనియుఁ గొంచెము నీడయు నీరును గలచోటికిఁ జని సావకాశముగా నీయడిగిన యర్థంబుఁ జెప్పెద' నని శంఖుఁడు వచించెను. తత్సమీపంబున ఫలసమృద్ధమైన కపిత్థవనంబును దాని మధ్య నిర్మలజలాశయంబు నుండెను. ఆకిరాతుఁడు శంఖునచ్చటికిఁ దోడ్కొని పోయెను. ఆమునిపుంగవుఁడు నీరాడి మాధ్యాహ్నికకార్యంబులు దీర్చి యించుక విశ్రమించెను. అంతలోన నక్కిరాతుఁడు పండిన పండ్లుకొన్ని తెచ్చి శంఖునకిచ్చెను. అతఁ డవి యారగించి నీడతేట తరుమూలంబునఁ గూర్చుండి యిట్లనియెను.

'ఓయీ ! పూర్వము నీవు బ్రాహ్మణజాతియందు శ్రీవత్సగోత్రంబున స్తంభుడను పేర జన్మించి శాకలగ్రామమున నివసించుచు వేదవేదాంగములెల్లఁ బారాయణ మొనర్చితివి. కొంతకాలంబునకు నీకు దుర్జనసహవాసమయ్యెను. తత్ఫలముగా నీవు పాపమార్గముఁ ద్రొక్కి మహాపాతకియైన యొకానొక వేశ్యాంగనను వలచి దానివలలోఁ జిక్కి స్వధర్మకర్మములకు దూరుఁడవై కాంతిమయి యను పేరి నీయిల్లాలిని బరమసాధ్వియు మహాసౌందర్యవతియునైన దానిను పేక్షించి యథేచ్ఛ విహరింపసాగితివి. నీ భార్య సాధ్విగావున నీయనాదరణము నోర్చి నీపెట్టుబాధలను సహించుచు నీకును నీయుంపుడుగత్తెకును సర్వశుశ్రూషలు చేయుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు నీవు జిహ్వాచాపల్యంబునఁ జేసి బఱ్ఱెపెఱుఁగుతో ముల్లంగియు నూఁబిండితో ననుములను గలిపి వండినభక్ష్యములను భక్షించితివి. తత్ఫలముగా నీకు వాంతివిరేచనములు గలిగెను. అంతియగాదు ; క్రమక్రమముగా మహావ్యాధిగ్రస్తుఁడవైతివి. నీవు రోగపీడితుఁడవైనంతనే యావేశ్యాంగన నిన్నుఁ ద్యజించి యన్యుని గూడెను. అది నీసొమ్మెల్ల హరించి నీయిల్లు గుల్లచేసెను గావున నీయొద్ద చికిత్సార్థ మొక్క కాసుగూడ లేదయ్యెను. ఎప్పుడు కష్టములు పైకొనెనో యప్పుడు నీకు యథార్థస్థితి స్పష్టమయ్యెను. అంతట నీవు నీపత్నిని డాయఁబిలిచి 'సాధ్వీ ! కామాం

ధుఁడనై నేను నీకొనర్చినయవినీతిఫలం బనుభవమునకు వచ్చెను. ఈచెనఁ టిని మన్నింపు' మని యామెను వేడితివి. కాంతిమయి నిన్నెంతయు నూరార్చి 'నాథా! జీవులు తమ ప్రాక్కృతకర్మఫలంబు ననుభవింపక తీఱదు. నాయీక్లేశములకు నీవు కారణముగావు; వగవవల' దని చెప్పి యామె నీకు మలమూత్రములు గడుగుచు నీవ్రణములలోనిపురుగులను దీసివేయుచు మహాభక్తితో నీకు సమస్తోపచారములు గావించుచుండెను. వేయేల? నీకుగా నీసతి నిద్రాహారంబులను మానెను. అంతియగాదు. నీకుగా నామె మ్రొక్కని దైవమే లేదు.

ఇట్లుండఁగా వైశాఖమాసము వచ్చెను. అప్పుడొకనాఁడు దేవలుఁడనుపేరి ముని యెండవేడిమికి డస్సి నీయింటికి నతిథియై వచ్చెను. పతియాజ్ఞలేక సతి యతిథిని సత్కరింపరాదుగావున నీభార్య నీతావునకు వచ్చి సంగతి తెలిపి యనుజ్ఞ వేడెను. నీవు సమ్మతించితివి. కాంతిమయి యామునికి నాతిథ్యమొసఁగి వానిపాదములు గడిగి యాపుణ్యోదకంబులను బరమౌషధంబుగా నీకొసఁగెను. దేవలుఁడు నాఁడెల్ల నీయింటనుండి మఱునాఁడు చనెను.

కొన్నాళ్ళకు నీకు సన్నిపాతమావరించెను. నీభార్య నీనోరుతెఱచి యౌషధమును లోనికిఁ బోయనుండెను. నీవు తెలివితప్పియుండి యామె వ్రేలిని గట్టుక్కున గొఱికితివి. అదితునిగి నీకుత్తుకకు నడ్డుపడెను. ఊపిరాడక నీవు గిజగిజతల్లడిల్లి ప్రాణములు వదలితివి. కాంతిమయి తనచేతికంకణమును శేషించియున్నదానిని విక్రయించి యాధనముతో నీకు దహనక్రియలు సలిపి నీతోడ సహగమనమొనర్చి శాశ్వతపదవిఁ జేరెను. కాంతిమయి నీకింతసేవలు చేసినను నీవు నీయవసానకాలంబున నీకింతటి వెతలు తెచ్చిపెట్టిన యావెలయాలినే తలంచుచుఁ బ్రాణములు విడిచితివి. ఆ కారణంబున నిప్పుడు నీవు రత్నాకరుఁడనుపేరి కిరాతుఁడవుగా జన్మించితివి. నాఁడు దేవలుని యాతిథ్యమునకు నంగీకరించినసుకృతఫలముగా నిప్పుడు నీకీపాటిధర్మబుద్ధియేని జనించెను. ఆమహాత్మునిపాదోదకమును గ్రోలిన పుణ్యకారణంబున నిప్పుడు నాతోడిసమావేశమును నీపూర్వచరిత్ర వినుకోర్కియు నీకయ్యెను. నాఁడు నీవు నీపాన్పుపయిఁ బ్రాణంబులను వదలిన

కారణంబున నీకీజన్మంబున భూతలశయనము చెప్పఁడెను. ఆవేశ్య నీ కిప్పుడు భార్యయయ్యెను.

ఇఁక నీభావిగతిని వినుము. ఒకానొకసర స్తీరంబునఁ గృణుండను మహాముని మహోగ్ర తపంబొనర్చుచుండును. వానికన్నులనుండి వీర్యము పొంగును. ఆవీర్యమును నాగకన్య యొక్క ఋతుకాలంబున భుజించును. దానిగర్భంబున నీవు జనించి వ్యాధవృత్తి నవలంబింతువు. వైశాఖమాసంబున నీవు నాకుఁ బాదరక్షలు దానమిచ్చినఫలంబుగా నుత్తరజన్మంబున నీకు సప్తమహర్షులతో సమావేశమగును. ఆమహనీయులవలన నుపదేశమంది నీవప్పుడు కఠోరతపంబొనర్చి వాల్మీకినాఁబరగి లోకోత్తరకావ్యమొనర్తువు.'

పక్షీ! దేవలుఁడు చెప్పినట్లుగా నేనీజన్మంబునఁ గిరాతుఁడనై వ్యాధమార్గమవలంబించి యుంటిని. నాకు శూద్రాంగనతోడఁ దగులాటమయ్యెను. మాయిరువురకుఁ బెక్కుమంది బిడ్డలు గలిగిరి. వారిపోషణార్థము తెరవులు గొట్టుచుంటిని. ఒకనాఁడు ద్రవ్యాపహరణార్థము యథాప్రకారము దారిఁగాచి యుండఁగా ఋషులేడుగు రాదారిని వచ్చిరి. నా చేతి గండ్రగొడ్డలిని ఝుళిపించి వారిని బెదరించి నిలునిలుమంటిని. వారట్లే నిలిచి నన్ను దగ్గఱకు రానిచ్చి 'బ్రాహ్మణాధమా! ఇంత యాయాసమేలరా?' యనిరి. కలరూపువారికిఁ దెలిపితిని. వారు నవ్వి 'కిరాతా! నీవిట్లు తెరవులుకొట్టి కొనుపోవు ద్రవ్యమును నీయాలుబిడ్డలనుభవించుచున్నారుగదా. చౌర్యము మహాపాతకములలో నొకటియగుట విందువుగదా. నీచౌర్యమువలన నీకుఁ బాతకము తప్పదుగదా. ఆపాతకములో నీయాలుబిడ్డలేమేనిఁ బాల్గొందురా? ఆసంగతిని విచారించితివా? ఇప్పటికి విచారింపవేని నింతనైనను నీవు వారికడకుఁ బోయి వారిని వేర్వేఱఁ బిలిచి యడిగిరమ్ము. నీవచ్చుదాక మేమిందే యుందుము; కాలుగూడఁగదలింపము; కదలినచో మాకుఁ బంచమహాపాతకమగును' అనిరి.

నేను వారిని నమ్మి యింటికిఁ బోయి నాభార్యాపుత్రులను బిలిచి ప్రత్యేకముగా నొక్కరొక్కరిని మునులుచెప్పినట్లడిగితిని. వారొక్కరొక్కరు మమ్ములను బోషించు భారము నీతలమీఁదనున్నది. ఎట్లు సం

పాడించుచున్నావో మాకుఁదెలియదు. నీకర్మములఫలముతో మాకు జోలి లేదు. పాపకర్మములొనర్చి మమ్ముఁ బోషింపుమని మేము కోరితిమా ?' యని పలికిరి. నేను వెంటనే మరలి యామునిపుంగవులకడకు వచ్చి సంగతి యెల్ల వారికి విన్నవించి నాచేతిధనుర్బాణకుఠారంబులను గ్రిందవైచి వారిపాదములఁ బడితిని. వారు నాయెడఁ బసన్నులై తమసంగతిని దెలిపి,

"మ॥ ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను సంఖ్యావంతునింగాఁగ, దా
యల సన్మిత్రులఁగా, నగోచరముఁ బ్రత్యక్షంబుగాఁ, బ్రాణహా
త్కాలనంబైనమహావిషం బమృతముంగాఁ, జేయుసత్కర్మ ము
జ్జ్వలనిస్తారనిధివై భజింపుము వయస్యావాంఛితార్థాప్తికిన్."

మఱియు దానిదానిఋతువులో నాయావృక్షము ఫలమిచ్చునట్లు కర్మములును వానివానికాలము వచ్చినప్పుడు ఫలంబునొసంగుచుండును. శుభమునుగోరు వాఁడు పుణ్యకర్మములనే చేయుచుండవలయును. పురాకృతపుణ్యంబు లాపదలనుండి రక్షించును. ఎల్లశుభములలో నాత్మకళ్యాణ ముత్తమోత్తమము. కావున నాత్మకళ్యాణార్థము నీకు భగవన్నామము నుపదేశించుచున్నాము. దానిని సంస్మరించి కృతార్థుఁడవగుము' అని చెప్పి రామనామము నుపదేశించిరి. అప్పుడు నాకు నోరుతిరుగక రామనామంబును వ్యత్యస్తాక్షరముగా మహానిష్ఠతో స్మరించుచు బాహ్యప్రపంచమును మఱచి తపంబొనర్చితిని. నాపయిఁ బుట్టలు పెరిగెను.

ఇట్లు పెద్దకాలము చనఁగా సప్తమహర్షులు తిరిగివచ్చి నన్ను లేచి రమ్మనిరి. పుట్టనుండి వెడలివచ్చితిని. వల్మీకమునుండి వెడలినకారణంబున నన్ను వాల్మీకి యనిరి.

అంతట నేను చిత్రకూటముఁ జేరితిని. నేనచ్చటనుండఁగా నీవును రామలక్ష్మణులు నచ్చటకు వచ్చితిరి. పుత్రీ ! ఇది జ్ఞప్తియున్నదా ? తర్వాత నాయాశ్రమము నిత్తమసానదీతీరమున నేర్పఱచికొంటిని. ఇచ్చటకు నారదమహర్షి యొకనాఁడు వచ్చెను. ఆమహాత్ముఁడు నాయిచ్చిన యతిథిపూజ లనుగ్రహించి సుంతతడవుండెను. పెక్కువిషయములను గూర్చి సల్లాపించితిమి సందర్భవశంబున రాజులఁ గూర్చి ప్రస్తావమయ్యెను.

భూలోకములోనున్న రాజులందఱిలో నెవఁడు గుణవంతుఁడును వీర్యవంతుఁడునై ధర్మమెఱిఁగి సత్యముఁబాయక దృఢవ్రత సద్వంశాచారసంపదఁగలిగి సర్వభూతహితబుద్ధియు ప్రియైకదర్శనత్వముననెడి దివ్యభూషణములను ధరించి ధీరుఁడును జితక్రోధియు ద్యుతిమంతుఁడును సహనశీలియునై తనరారుచుండునో, ఎవనికోపమునకు దేవతలు సయితము బెగ్గడిల్లుదురో యట్టి రాజసింహునిఁ జెప్పుమంటిని. నారదమహర్షి యట్టే యోచించి "మునిసత్తమా! నీవచించినగుణములెల్ల నొక్క మనుష్యమాత్రుని యందుండుట మహాదుర్లభము. అమానుషమూర్తిమాత్రమే యివి తగును. అయోధ్యాపతి దశరథరాముఁడు గలఁడు. వానియందు నీవచించిన గుణములే గాక మఱికొన్ని విశేషాంశములు గూడఁగలవు. వేయేల! ఎల్లకళ్యాణగుణములు మూర్తీభవించి యారూపమున నవతరించెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. వానియాకారము తద్గుణములకుఁ దగినట్లేయున్నది. నిగనిగలాడు శ్యామలవర్ణమును సమవిభక్తాంగములను గలిగి విపులాంసములతో దీర్చిదిద్దినట్టి శిరస్సుతో శుభలక్షణలక్షితలలాటముతో నమ్మంగళమూర్తి విరాజిలుచుండును. వాని నేత్రంబులకు నరవిందములు దీటురావు; వాని గ్రీవమునకు శంఖమును బోల్చినఁ బోల్పవచ్చును. ఆజానుదీర్ఘబాహువులు నున్నతగండభాగములు వానికిఁ బెట్టని భూషణములు. ఆకారమునకుఁ దగిన ప్రజ్ఞయుఁ బ్రజ్ఞకుఁదగిన శాస్త్రజ్ఞానము, జ్ఞానమునకుఁ దగిన యారంభముఁ బ్రారంభమునకుఁ దగిన ఫలసిద్ధియు వానియందే గానవలయును. అతఁడెఱుంగని ధర్మముగలుగదు; ఆర్తత్రాణము వానికి దీక్షగానున్నది. వాని సంకల్పములెల్ల నాత్మలాభార్థముగాక పరోపకారార్థమై యుండును. బొంకుటగాని యాడినమాట తప్పుటగాని యతఁడెఱుంగఁడు. ఇంతటి వాఁడయ్యు నతఁడు నిగర్వమూర్తియై తనరారును. సమదర్శియన్న వానినే చెప్పవలయును. అతఁడిక్ష్వాకువంశమున దశరథమహారాజునకుఁ బట్టమహిషియైన కౌసల్యాదేవియందు జనించి లోకారాధనమొనర్చుచున్నాఁడు" అని చెప్పి నాసత్కృతులంది చనెను.

అమ్మా! రాముఁడంతటివాఁడు గాని యేతన్మాత్రుఁడుగాఁడు. ఆయన నిన్నిట్లుసేయుట దయమాలిగాదు. నీవియోగము వానికెంతో దుస్సహమై యుండును. అయినను బురుషకారమునకన్న దైవము బలీయము.

'చ॥ గురుఁడు గురుండు, వాలు శతకోటి, సుపర్వులు వాహినీపతుల్,
సురభవనంబు కోట, మధుసూదనుఁడున్ సయిదోడు, దంతి ది
క్కరిపతిగాఁగ నొప్పుబలఘాతియు డాయలకోడెనాజిలో;
శరణము దైవమే; పురుషశక్తి నిరర్థకమెన్నిభంగులన్.'

అని పెద్దలు వచించిరి. కావున రామునియందు నీవు వైమనస్యముఁ జెందవలదు. అమ్మా! నాయాశ్రమసమీపంబునఁ దపోవ్రతులుంగలరు; వారు నిన్ను సర్వవిధములఁ గాపాడుదురు. భయసంశయములు మాని నా వెంట రమ్ము. నీవచ్చట నీస్వగృహంబునవలె సుఖముందు' వని పితృవాత్సల్యముతో వచించెను.

సీతాదేవి యమ్మునివచనంబులకుఁ బరమాద్భుతమంది వానికి సాష్టాంగ మొనర్చెను. వాల్మీకియంతట నామెను మెలమెల్లగాఁ దనయాశ్రమమునకుఁ గొనిపోయెను. అంతలో మునిపత్నులు వచ్చి వానికి నమస్కరించిరి. వాల్మీకి వారికి సీతాదేవి నప్పగించి 'ఈమె రామపత్ని సీతాదేవి దశరథునికోడలు జనకునిపుత్త్రిక మహాపరిశుద్ధచరిత్ర; కారణాంతరమునఁ బతిపరిత్యక్తయై యీమె యిందువచ్చెను. ఈమెను బుత్త్రికనువలెఁ బోషించుభారమును వహించితిని. మీకు నాయెడ గౌరవము గలదేని మీ రెల్లరు నీమెయెడలఁ బరమస్నేహవాత్సల్యంబుల నెఱపుచు నీమెను సర్వవిధంబులఁ బోషింపనగు' నని చెప్పి జానకిని బుజ్జగించి తనయాశ్రమాంతరముఁ జొచ్చెను.

లక్ష్మణుఁ డవ్వలిగట్టునుండి యదియెల్లఁ జూచి దుఃఖదీనాత్ముఁడై సారథితో 'సుమంత్రా! రామునకుఁ గలిగిన సీతాసంతాపదుఃఖమింతనరాదు. ఇంతకన్న దుఃఖతరమైనది వానికిఁ గలుగఁబోదు. ధర్మజ్ఞుఁడును సత్యసంధుఁడునైన రామునకుఁ బతివ్రతామణియుఁ బ్రియురాలునైన తనపత్నితో నిట్లు వియోగము సంభవించుట దైవఘటితముగాని వేఱుగాదు. దైవము దురతిక్రమమగుట నేఁడు గ్రహించితిని. దేవాసురగంధర్వరాక్షసేశ్వరులనుగూడఁ గొనగోటఁ జిమ్మివైచిన మహాపరాక్రమశాలి సయితము దైవగతికి లోఁబడెనుగదా. సుమంత్రా! నాఁటిచతుర్దశవనవాసము ప్రియాసహచర్య

మునఁజేసి రామునకు సంతకష్టముగాదు. నేఁడు ప్రియసఖాసి యాయన
యుండుటయ్యెను. ప్రాణములను హరింప నిట్టి దుఃఖమొక్కటే చాలును.
దీనికిఁ దోడుగా మహాపవాదము సంధిల్లెను. ఇఁకనాయన్న తెఱఁగు చెప్ప
వలయునా?' అని యెలుగెత్తి యేడ్చెను.

## —◆ సుమంత్రుఁడు రాముని కాలనిర్ణయము తెలుపుట ◆—

సుమంత్రుఁడు వానిపరిదేవనంబులను విని 'సౌమిత్రీ! సీతారాముల
కైన యీవియోగమును గూర్చి నీవు సంతాపపడవలదు. కాలము వచ్చి
నప్పుడు నీకును మీయన్నకును సయితము వియోగము గలుగును. ఈ
సంగతిని గాలజ్ఞులు పూర్వమే వచించిరి. ఈసంగతి యెఱింగియు రాజాజ్ఞఁ
జేసి యెందుఁబలుకనైతిని. నేఁడు నీదుఃఖమును జూచి యోర్వలేక గుట్టుఁ
జెప్పుచున్నాను. అత్రిమహర్షి సుతుఁడు దుర్వాసమహర్షి వసిష్ఠాశ్రమమున
నొకవర్షముండెను. అప్పుడు దశరథమహారాజు గురుసందర్శనార్థ మయ్యా
శ్రమమునకుఁ బోయెను. వారు మువ్వురు పెక్కువిషయములఁ గూర్చి
ముచ్చటించుకొనిరి. అంతలో మధ్యాహ్నమయ్యెను. దశరథుఁడు దుర్వా
సునకు మ్రొక్కి 'మహాత్మా! నావంశ మెంతకాలముండును? నాపుత్త్ర
లకు రామలక్ష్మణాదులకు నాయుఃప్రమాణ మెంత? రామునకు నెంతసంతా
నము గలుగును? వారియాయుఃప్రమాణ మేమి?' యని ప్రశ్నించెను. దుర్వాస
మహర్షి సుంత ధ్యానగతుఁడై 'రాజేంద్రా! తొల్లి దేవాసురయుద్ధ
మప్పుడు దైత్యులు సురనిర్జితులై భృగుపత్ని నాశ్రయించిరి. ఆమె
వారికి నభయమిచ్చెను. వారచ్చట సుఖముండిరి. విష్ణువందులకు మహా
క్రుద్ధుఁడై చక్రమును బ్రయోగించెను. అది యామెతల ద్రుంచెను.
భృగుమహర్షి తనపత్నిమరణంబునకు నాగ్రహించి 'జనార్దనా! క్రోధమూ
ర్ఛితుఁడవై స్త్రీయని వెఱవక నాపత్ని నిజంపితివి గావున నీవు మనుష్యలో
కంబునఁబుట్టి యచ్చట బహుకాలము పత్నీవియోగదుఃఖము ననుభవింతువు
గాక' అని శపించి యంతలోఁ దన వేగిరపాటునకుఁ బశ్చాత్తాపమంది విష్ణువు
నారాధించెను. వైకుంఠుఁడు భక్తవత్సలుఁడుగావున భృగుమహర్షికి నభ
యమిచ్చి 'మునీంద్రా! లోకములమేలుకొఱకు నీయిచ్చిన శాపంబును గ్ర
హించుచున్నాను' అని వచించెను. దశరథా! ఆశాపము చేతను విష్ణు

విష్ణువు నీకు రాముఁడను పేరి పుత్త్రుఁడుగా జనించెను. రాముఁడయోధ్యాపతియై దీర్ఘకాలముండి బ్రహ్మలోకమునకుఁ బోవును. అతఁడు పెక్కుహయమేధయాగము లొనర్చి యనేకరాజవంశంబులను స్థాపించును. వానికి సీతయందు సుతులిద్దఱు జనింతురు. వారికిఁ బట్టముఁ గట్టుదురు' అని చెప్పెను. ఈసంగతి యచ్చటి మునులు చెప్పగా వింటిని. విధివిధానమిట్లుండగా నీవు సీతారాములకుఁగా దుఃఖిలపనేల?' యని వానినూరార్చెను.

—♦ లక్ష్మణుఁడు రామునాశ్వాసించుట. ♦—

అంత లక్ష్మణసుమంత్రులు తరలి సూర్యాస్తమయకాలమునకుఁ గేశిపురముఁజేరి యారాత్రి యందుఁ గడపి తెల్లవాఱి బయలుదేఱి మధ్యాహ్నమునకు నయోధ్యఁ జేరిరి. నగరమును జూచినంతనే లక్ష్మణుని దుఃఖము పొరలెను. 'అయ్యో! రామునకు నేనేమని చెప్పుదు' ననువంత వానికి దుర్భరమయ్యెను. లక్ష్మణుఁడు తన వ్యసనమునెల్ల లోలోన నణఁచిపెట్టి రామమందిరముఖద్వారంబున రథంబునుండి దిగి దీనాస్యుఁడై లోనికిఁ జని యటు నుచితాసనంబునం గూర్చుండి దీనుఁడైయున్న యన్నకు మ్రొక్కి 'ఆజ్ఞ నెఱవేర్చితిని. కాలగతి యిట్లున్నది. అనివార్య మశోచ్యము. వృద్ధిక్షయములును సంయోగవియోగంబులును జననమరణంబు లవినాభావంబులు. ఇవి తప్పని సరణులుగావున నెఱుకగలవారు భార్యాపుత్త్రమిత్త్ర ధనాదులందు విశేషముగా మమకారము సేయరు. అన్నా! నీవు లోకములనెల్లా శాసింపనేర్తువు. అట్టి నీవే నీమనస్సును విచ్చలవిడి వదలిన నన్యులసంగతి జెప్పనేల? అపవాదంబునకు వెఱచి ప్రాణంపుఁ బ్రాణమైన సీతాదేవిని ద్యజించితివి. అట్లుచేసి యిట్లు దుఃఖింతువేని నిదియంతకన్న పెద్దయపవాదమగును. ధైర్యమును వహింపు' మని నయవినయపూర్వకముగా విన్నవించెను.

రాముఁడు మహాప్రీతుఁడై 'లక్ష్మణా! నీపలుకులు సత్యములు; నీ ప్రబోధనమునకుఁ బరితోషించితిని; నీయుచితోక్తులచేత ధైర్యముఁబడసితిని; సంతాపమెల్ల నిరాకృతమయ్యెను; అను నీతుఁడనైతిని. సౌమ్యా! మనస్సు ననువర్తించు నీవంటిబంధువు వికాలములో దొరకుట మిక్కిలి దుర్లభము. తమ్ముఁడా! నాల్గుదినములుగా రాజ్యకార్యముల సంగతియే తలంపనైతిని.

ఇందులకొంతయుఁ బరితాపమగుచున్నది. రాజు ప్రతిదినము సక్రమముగాఁ జారకార్యములను జరుపఁడేని యతఁడు నరకము పాలగును. నృగమహారాజంతటి సత్యసంధుఁడు ఫిర్యాదుకొఱకుఁ దనయొద్దకువచ్చిన బ్రాహ్మణులకు వెంటనే దర్శనమీయని కారణంబున మహాపదఁ జెందెనని వింటిము. రాజెన్నఁడును బరాకు చెందరాదు. మంత్రిపురోహితులకు హెచ్చరిక చేసి కార్యార్థులఁ బిలువనంపు' మనెను. లక్ష్మణుఁడట్లే యొనర్చెను. నాఁటి నుండి రాజ్యకార్యములు యథావిధి జరుగసాగెను.

## —♦ లవణాసురుఁడు. ♦—

ఇట్లుండ నొకనాఁడు రాముఁడు ప్రాతఃకాలక్రియలు తీర్చి సభకు వచ్చినంతనే సుమంత్రుఁడతని డాయవచ్చి 'యమునాతీరమహర్షులు భార్గవచ్యవనాది మునీంద్రపురస్కృతులై భవద్దర్శనార్థమువచ్చి ద్వారమున నున్నా' రని తెలిపెను. రాముఁడామాటతోడ లేచి ద్వారముదగ్గఱకుఁ బోయి వారిని యథావిధినర్చించెను. ఆమహర్షులును సర్వతీర్థాంబుపూర్ణములైన తమకలశములలోని జలంబును రామునిశిరమునఁ బ్రోక్షించి ఫలమూలాద్యుపహారంబులిచ్చి వానిని దీవించిరి. రాముఁడు వారినిఁ దోడి తెచ్చి యర్ఘ్యాసనంబులఁ గూర్చుండఁ బెట్టి 'మహర్షులువచ్చినకార్యము నాన తీయనగును. ఋషులమతంబుఁ జేయుటకన్న బరమధర్మము నాకుఁ గలుగదు' అని విన్నవింపఁగా నమ్మహర్షులు మహాహ్లాదమొందిరి. అంత చ్యవన మహర్షి తక్కినవారిని బురస్కరించుకొని 'రామా! ఐక్ష్వాకులకుఁ దగినట్లు వచించితివి. భయార్తులమై యిందువచ్చితిమి. తొల్లి లోలాపుత్త్రుఁడు మధుఁడను పేరి మహాసురుఁడుండెను. అతఁడు రాక్షసుఁడయ్యు ధర్మబుద్ధిఁ జరించుచుండెను. ఆకారణంబున వానిని సురలును భూసురులును బ్రశంసించుచుండిరి. వాఁడు శివునిఁగూర్చి పెక్కుసంవత్సరములు ఘోరతపంబొనర్చి వానిని మెప్పించి యామహాదేవునివలన శూలమొందు పడసెను. నీలలోహితుఁడు వానికి శూలంబును గ్రహించుచు 'అసురోత్తమా! ఎందాక నీవు ధర్మమార్గమును దొలఁగకుందువో యందాక యీశూలము నీచేఁ బ్రయుక్తమై నీవైరులను దునుమాడి మరల నిన్నుఁ జేరుచుండును. ధర్మవ్యతిక్రమ మొనర్తువేని యిదినిన్ను వీడి నన్నుఁ జేరు' నని పలికెను. మధుఁడావరంబు

నకు సంతసించి ముక్కంటికి సాగిలఁబడి మ్రొక్కి 'దయానిధీ! మావంశ మెంతకాలముండునో యంతకాల మీశూలము మమ్మొడఁబాయకుండునట్లు వరమనుగ్రహింపు' మని కోరెను. కపర్ది వానిప్రణయమాకర్ణించి 'అవర మీయరాదు; భక్తునికోరిక వృథసేయరాదు. నీయనంతరము నీసుతుఁ డొకఁడు దీనిని ధరించి మహాకీర్తిఁ గాంచును. ఈశూలము వానికరస్థమై యున్నప్పుడు వానినెవ్వరును జయింపఁజాలరు. వాఁడెన్నఁడేనియు శూల విహీనముగాఁ బోరునకుఁ జనునేని వాఁడుతప్పక వైరివలన నిహితుఁడగును. ఇది మమ్ముఁజేరు' నని వానిని వీడ్కొనెను.

మధుఁడు రావణుని చెల్లెలైన కుంభీనసయనుదానిని బెండ్లాడి యా యింతివలన లవణుఁడనుపేరిపుత్త్రుని గాంచెను. ఆ లవణుఁడు పుట్టువు దొట్టి దుష్టాత్ముఁడై పాపంబులకు వెఱవక చరింపసాగెను. మధుఁడు తన కొడుకునకు నెంతయు నేవగించి యాశూలమును వానికొసంగి దానిసంగతి తెలిపి వానికిఁ బట్టముఁగట్టి తానుమనస్తాపము దీరనోయన వార్థిఁజొచ్చెను. లవణుఁడు శూలప్రభావంబునకు గర్వించి కన్నుగానక లోకములనెల్ల గాఱించుచున్నాఁడు. వాని బాధకుఁ గులాంగనలు వెఱచి ప్రాణత్యాగ మొనర్చుచున్నారు. లవణునివలన మాబోఁటి తాపసులు కుడుచుచున్న యిడుమలిట్టివనరావు. రామా! నీవే మాకుగతియని యిందు వచ్చితిమి. భయార్తులనెందఱనో కాచితివి. లోకవిద్రావణుఁడైన రావణునివధించి జగంబులకు మేలుకూర్చితివని విని యిందువచ్చితిమి. ఆరాక్షసాధముని వలని భయంబుడిపి మమ్ము రక్షింపు' మనిరి.

రాముఁడు వారిప్రణయంబును విని కృతాంజలియై 'ఋషిసత్తము లారా! మీకుఁగా నెంతయు వ్యసనమయ్యెడు. రావణునితోడ రాక్షస బాధలెల్ల సమసెనని తలంచితిని. మఱల నిద్దురాత్ముఁడు తలసూపెను. ఈ శూళ యెందుండును? ఇతని యాహార వ్యవహారములేమి?' యని మహా వినయముతో నడిగెను. 'రామా! లవణాసురుఁడు మధువనంబున వసించు చుండును. కంటఁబడిన సత్త్వములెల్ల నతఁడు దిగమ్రింగును. తాపసుల మాంసమన్న నతనికి మృష్టాన్నమగును. అతఁడు నిరంతరము రౌద్రమూర్తి యై వ్యవహరించుచుండును. సింహ వ్యాఘ్రసృమర మృగ ద్విప మనుష్యాదులు

వేలకొలఁదియైనఁగాని వానికి నొక్కపూటకుఁ జాలవు. వానిమండగ మింతనరా' దని చెప్పిరి. రాముఁడు సుంత తలపోసి 'మహాత్ములారా! ఇఁక మీభయంబుల మానుఁడు. ఆయసురాధముని వధింతు' నని ప్రతిజ్ఞా పూర్వకముగాఁ బలికి వారికి నభయదానమిచ్చి, తమ్ములవంకఁ జూచి 'మీలో నెవరు లవణాసురుని వధించి వత్తు' రనెను. భరతుఁడులేచి 'అన్నా! అనుజ్ఞయిమ్ము, నేను పోయి వానిని వధించి వత్తు' ననెను. శత్రుఘ్నుఁడు వానికి నడ్డమువచ్చి 'అన్నా! భరతుఁడు మిమ్ముఁబాసి జటావల్కలధారియై శాకాహారవ్రతమూని పదునాలుగేండ్లు గడపెను. ఇంతలోన వానికి మీ యెడఁబాపు మరలఁ దగదు. నేను చని లవణాసురునుక్కడించి వత్తును; అనుజ్ఞ యిమ్మ' ని నమస్కరించెను.

## —♦ శత్రుఘ్ననకు మధురరాజ్య పట్టాభిషేకము గావించుట ♦—

రాముఁడు శత్రుఘ్ననకు సంతసించి 'వత్సా! నీయిచ్ఛ నేరవేరును. నీవు శూరుఁడవును గృతాస్త్రుండవును సమర్థుఁడవు నగుట యెఱుంగుదు. వైరిని సంహరించి తద్రాజ్యంబునకుఁ దగిన వానిని రాజుగా నియమింప వలయును. ఒండుచోఁ బాతకమగును. తమ్ముఁడా! నీవు చని లవణా సురుని ద్రుంచి వానిరాజ్యంబును ధర్మమార్గంబునఁ బాలింపుము. నామాట జవదాటరాదు. ఇదిగో యిప్పుడే వసిష్ఠాదిమహాత్ములు వచ్చి నీకు మధు రాజ్యపట్టాభిషేకంబును సమంత్రకంబుగా నొనర్తు' రనెను. శత్రుఘ్నుఁ డావచనంబులు విని 'కటా! నాదుడుసుడనమునకుఁ దగు శిక్ష యయ్యెను. పెద్దవానికి నడ్డుపోరాదనిరి. అది నడిచేయని దోషమునకుఁ బరిహారముగా నాకీశిక్ష విధింపఁబడెను. కాదందునేని రెండవనేరమగును. దానికెంతటి దండన గలుగునో తెలియదు' అని లోలోనఁ జింతించి 'అన్నా! నా యజ్ఞానంబును సైరింపుము. పెద్దవానినిఁ గాదని రాజ్యమేలుట చిన్నవానికిఁ దగదు. ఈయధర్మమునుండి నన్ను రక్షింపు' మని గోణగసాగెను. రాముఁడు వాని తలఁపులు గ్రహించి 'శత్రుఘ్నా! నీకు సంతసించితిని; వెఱవ వలదు' ని చెప్పి యభిషేకకార్యము నాజ్ఞాపించెను. క్షణములో నభిషేచన ద్రవ్యములు చేరెను. వసిష్ఠాదిపురోహితులును నిగమాంతవేత్తలైన ఋత్వి జులును గూడిరి. శత్రుఘ్ననకు మధురాజ్యపట్టాభిషేకమంగళము సమాప్త

మయ్యెను. పౌరజానపదులసంతోషములు వెల్లివిరిసెను. కౌసల్యా కైకేయీ సుమిత్రలును దదితరరాజస్త్రీలును గుమారుని దీవించిరి. యమునాతీర ఋషుల సంతాపములు చల్లారెను.

## — లవణాసురునిమీఁదికి శత్రుఘ్నునిబంపుట —

రాముఁడంతట శత్రుఘ్నుని నంకమునఁగూర్చి దివ్యశరంబొండు వానికిచ్చి 'నాయనా! పరమేష్ఠి తొల్లి యీయస్త్రంబును నిర్మించెను. దీనిచేత మధుకైటభులు కూలిరి. ఇది నాకు లభించెను. ఇట్టి శరోత్తమము చేత నుండియు రావణునితో నంతఁగాఁ బోరాడవలసివచ్చెను. కారణమేమందువా? దీనిని బ్రయోగింతునేని రావణుఁడు దుంగుట నిజము. అంతతో నిలువదు; సమస్తభూతంబులకు మహోపద్రవమగును. అందులకు వెఱచి దీనిని దశకంధరునిపయిఁ బ్రయోగింపనైతిని. ఇది నీకు గల్గుటవలన లవణ సంహార మొక విషయమేగాదు' అని చెప్పి తత్ప్రయోగసంహారము లుపదేశించి 'వత్సా! లవణునియొద్ద శివదత్తమైన మహాశూలముగలదు. ఆ యాయుధము వానిచేతిలోనున్నంతకాలము వానిని జయింపరాదు. వాఁడాహారార్థము వనములఁగ్రుమ్మరు నప్పుడు శూలంబు నింట నుంచిచనును. అట్టితఱి వేచి వానినెదిరించినచో నీకు జయము తప్పక సిద్ధించును. యుద్ధమునకుఁగా నీవు వచ్చియుండుట యేమాత్రము తెలిసినను వాఁడు శూలము నేమఱియుండఁడు. శూలధారియైన లవణుని ఢీకొన్న వైరికిఁ జావునిక్కము. ఈరహస్యములనెల్ల మఱవక వానితోఁ బోరుము. వాఁడు వనాంతరము నుండి శూలనిరాకృతుఁడుగా వచ్చునప్పుడు పురబహిర్భాగంబున వానిని నీవు మార్కొనవచ్చును. వాఁడు నీశరంబులకు నొగులవచ్చును. అట్టి సమయంబున వాఁడు శూలార్థము నిన్నేమఱించి పురముఁ జొఱఁ బ్రయత్నించును. అప్పుడు నీవు ద్వారముననిలిచి వానినడ్డగించి తత్పురప్రవేశంబునకు నెడమీయక వానితో యుద్ధమొనర్పుము. నాయనా! శితికంఠుని శూలప్రభావంబును వైరిరహస్యంబును నీకార్యక్రమమును జక్కఁగా వింటివిగదా. నాల్గువేలగుఱ్ఱములను రెండువేలరథంబులను వేయిగజంబులను బదివేలభటులును నటనర్తకులను వెంటఁగొని పర్యాప్తధనవాహానుండవై తరలుము. ఎల్లవిధముల నీసేనాబలంబును సంతసపెట్టుచుండుము. నిడుద పయనం

బలుకరాదు; మందు వేసవిలో దండును నడపింపవలదు. విడిసినచోట్లనెల్ల నీవు స్వయముగా నీసేనను జక్కగా విచారింపుము. నీపోవుమార్గమందు నీసేన వలన నెవ్వరికిని బాధకలుగరాదు. జాహ్నవీనదిని దాఁటి నంతనే దాని యావలిగట్టున సేననెల్ల విడిసి యొంటరిగా నీవు చని మధువనము జొచ్చి పొంచియుండి లవణుఁడు కంటఁబడినంతనే వాని నడ్డగించి సంహరింపు' మని చెప్పి వానికి బోవ ననుజ్ఞ యిచ్చెను.

## —♦ కల్మాషపాదుని చరిత్ర ♦—

శత్రుఘ్నుఁడు తల్లులకు మ్రొక్కి రామునకుఁ బ్రదక్షిణనమస్కారము లొనర్చి భరతలక్ష్మణులకు నెఱిగి వసిష్ఠునివలనగాని సర్వసేనాసమేతముగా బయలుదేఱి మూఁడునాళ్లలో సురనదిని జేరి దానియవ్వలితీరంబున సేనను విడిసి యొంటిగాఁ జని వాల్మీకిమహర్షిని సందర్శించి తావచ్చిన కార్యముఁ దెలిపి 'మహాత్మా! ఈరేయి యిందుఁగడప ననుజ్ఞ వేఁడుచున్నాను' ననెను. వాల్మీకిమహర్షి యామాటకు నవ్వి 'నాయనా! పెఱవాఁడవట్లు జంకనేల? రాఘవులకు నాయాశ్రమము స్వగృహముగదా?' యని యర్ఘ్యపాద్యాదుల నిప్పించి ఫలమూలభోజనంబు లారగింపఁ బెట్టి వానినెంతయు నాదరించెను. శత్రుఘ్నుఁడు మార్గశ్రమము దీఱినంతట నమ్మునిపుంగవునిఁ జేరి 'మహాత్మా! ఈవనమందెల్లెడల యూపస్తంభములున్నవి. ఇది యొకప్పుడు యజనభూమియై యుండనోపు. ఇందెవ్వరు మఖంబు లొనర్చిరో?' యనెను. నావుఁడు 'వత్సా! మీవంశమువాఁడు సుదాసుఁడనుపేరి రాజొకఁడుండెను. వానికి వీరసహుఁడను పుత్త్రుఁడు కలిగెను. వానికి బాల్యమునుండి వేఁటయందభిరుచి మెండుగానుండెను. ఒకనాఁడతఁడు మృగయార్థము వనమునకుఁ జనెను. అప్పుడు రాక్షసులిద్దఱు బెబ్బులుల రూపముదాల్చి వనాంతరమెల్లఁ జీకాకుపఱచి కంటఁబడినమృగములనెల్లఁ బట్టి మ్రింగుచుండిరి. వారి కతన వనమెల్ల నిర్మృగమయ్యెను. వీరసహుఁడు వనమెల్లఁ గుమ్మరియొండు నొక్కజంతువునైనను గానక యాగ్రహమూర్తియై వచ్చుచుండఁగా నప్పెబ్బులు లెదురయ్యెను. ఆరాజసింహుఁడందొకదానిని గోలవైచి త్రోసి తనకోపమును జల్లార్చుకొనెను. రెండవపులి సయిదోఁచపాటునకు వ్యాకులమంది నిజరూపంబును దాల్చి 'రాజా! నిన్నిమిత్తమే నామిత్రుని జంపితివి.

ఇందులకుఁ బ్రతిక్రియయొనర్తుఁ జూడు' మని పలికి యచ్చోటనే యంతర్హితుఁడయ్యెను. వీరసహుఁడు భయంబంది సంగతియెల్ల వసిష్ఠునకు విన్నవించి వానియుపదేశమున నిచ్చటఁ గ్రతుశాలలు నిర్మించి యశ్వమేధయాగమొనర్చెను. అయ్యసురుఁడు పూర్వవైరము మదినిడి యజ్ఞావసానకాలంబున వసిష్ఠరూపంబున నచ్చటకు వచ్చి 'మాంసభోజనముపయిఁ గోరికయయ్యెను; శీఘ్రముగా దానిని తెప్పించి యిమ్ము; ఒండు విచారింపవలదు; మరల వత్తు' నని చెప్పిపోయెను. సౌదాసుఁడది యెల్ల నిక్కముగాఁ దలఁచి తన వంటవానినిఁ బిలువనంపెను. రాక్షసుఁడు సూదకరూపంబున వచ్చెను. రాజు వానికి సంగతిఁ దెలిపి 'గురువులవారికిఁ బరితోషమగునట్లుగా సామిషమావిష్యస్వాదుభోజనంబును దయారుచేసి శీఘ్రముగాఁ గొనిర' మ్మనెను. ఆవంటవాఁడు చిత్తమనిచెప్పి చని మనుష్యమాంసమును వండి తెచ్చెను. అంతలోన నిక్కమైన వసిష్ఠుఁడు వచ్చెను. రాజు వానికిఁ దనభార్యయైన మదయంతిచేత నమ్మనుష్యమాంసమిశ్రభోజనంబును బెట్టించెను. ఆయన్నము నరమాంసమిశ్రితమగుట వసిష్ఠుఁడు గ్రహించి క్రోధావిష్టుఁడై 'ఇట్టి భోజనముఁ బెట్టితివిగావున నీవు నిట్టిదే తినువాఁడవగు' మని శపించెను. సౌదాసుఁడందులకు మహోగ్రమొంది 'అయ్యా! నీకోరినది వంటవానికిఁ దెలిపితిని, వాఁడేమిచేసెనో నాకుఁ దెలియదు. నిష్కారణముగా నన్ను శపింపనగునా?' యని పలికి ప్రతిశాపమిచ్చుటకుఁగా హస్తతలంబున నీరు పుచ్చుకొనెను. మదయంతి యడ్డుపడి 'నాథా! వసిష్ఠభగవానులు మనకుఁ గులగురువు; మీఁదు మిక్కిలి దేవతుల్యుఁడు. వానికిఁ బ్రతిశాప మీయరా' దని వానిని వారించెను. సౌదాసుఁడు భార్యమాట విని తనచేతి యుదకంబునుఁ దేజోబలసమన్వితమైన దానిని నిజచరణాగ్రమున విడిచెను. ఆనీరుపడి వానిపాదంబులు గన్బగభావమొందెను. నాఁడుమొదలు వానినిఁ గల్మాషపాదుఁడనిరి. వసిష్ఠుఁడు యోగదృష్టివలన నిజము గ్రహించి జాలినొంది 'రాజా! నావచనము పొల్లుపోదు; నీవు నిర్దోషివగుట గ్రహించితిని. పనురెండుసంవత్సరములనాటికి నీవు శాపవిముక్తిఁ గాంచి సుఖముందువు. జరిగిన దానికి వగవవలద'ని చెప్పి చనెను. సౌదాసుఁడు భార్యతోడఁ బదురెండువత్సరములు శాపఫలమనుభవించి యనంతరము యథాపూర్వము రాజయి సుఖముండెను. వత్సా! సౌదాసుని నాఁటి యజ్ఞయూపంబులిందు

గుదుము. సురరాజ్యవిజయార్థము నీవు వచ్చుటయూ గ్రహించితిని. నర
లోకరాజులనెల్ల నోర్చితిగదా యనంతరము దేవలోకము పయి దండు వెడల
నగు' ననెను. మాంధాత యింద్రుని భావమును గ్రహించి 'సురేశ్వరా !
పృథ్వీపతులలో నన్నెదిరించువాఁడు లేఁడు. ఎదిరించినవారినెల్ల నోడించి
యిందువచ్చితి' ననెను. పాకశాసనుఁడామాట విని 'రాజేంద్రా ! మధు
వనమందు లవణాసురుఁడు గలఁడు. వాఁడు నీయాజ్ఞకు లోఁబడెనా ?'
యని యడిగెను. మాంధాత యామాటతోడ దల వ్రాల్చి మాటాడక
మరలి మధువనముఁజేరి యొకయెడ దండు నిలిపి తనరాకను దూతముఖంబున
లవణునకుఁ దెలిపెను. ఆరక్షోవీరుఁడు కటకటంపడి వచ్చిన యాదూతను
సంహరించెను. మాంధాత తనదూతరాకకుఁగా దడవు నిరీక్షించి తానే
పోయి లవణునిపయి శరంబులఁ గురిసెను. లవణుఁడు నవ్వి తనచేతి
శూలంబును విసరెను. దాని తాకునకు మాంధాత సబలుండుగా భస్మీ
మయ్యెను. వత్సా ! శత్రుఘ్నా ! లవణునిచేతి శూలబలమంతటి యప్ర
మేయము గావున రాముఁడు నీకన్నిహెచ్చరికలు వచించెను. నీవు రేపకడ
లవణుని దప్పక చంపుదువు. వాఁడు శూలహీనుఁడుగానుండుట చూచి
పోరునకుఁ గడంగుము. నీ యీకార్యము లోకమంగళకరమగు" నని చ్యవన
మహర్షి వచించెను.

శత్రుఘ్నుఁడు ప్రభాతమున లేచి యాహ్నికంబులు దీర్చి మునిజనా
దీవనలంది సాయుధుఁడై తరలి యమునానదిని దాఁటి మధుపురద్వారముఁ
జేరి లవణాసురుని వేచియుండెను. ఆరక్షోవీరుఁడు మధ్యాహ్నవేళకు
వనాంతరమునుండి వివిధమృగశవంబులను గొని పురద్వారమునకు వచ్చి శత్రు
ఘ్నునిజూచి 'ఎవఁడవురా నీవు ? కాలము తీఱి వచ్చితివా ? నాయీనాటి
భోజనంబునకు నరమాంసము కొదువగానుండెను. ఆకొఱతయుఁ దీఱెఁబో.
దుర్మతీ ! కన్నుఁగానక వచ్చితివా ? అన్యప్రేరణంబున వచ్చితివా ?' యని
మిక్కిలి యుల్లిదముగాఁ బల్కెను. ఆమాటలకు శత్రుఘ్నుని కన్నులెఱ్ఱ
నయ్యెను ; వానినిలువెల్లనుఁ దేజఃకాంతులుఁగురియసాగెను. రాఘవుఁడట్లు
మహాక్రుద్ధుఁడై 'దుర్మతీ ! ప్రల్లదములేల ? దశరథసూనుండును రాముని
యనుజుండునైన శత్రుఘ్నుఁడు నీతోడి ద్వంద్వయుద్ధమునకు వచ్చెనని

యెుఱుంగుము. సర్వప్రాణులకుఁ బ్రాణగొడ్డమవైన నీవు నేటితో నాచేత నంతరింపనున్నావని గ్రహింపు' మని పరాక్రమభీకరంబుగాఁ బలికెను.

లవణాసురుఁడు గోపకషాయలోచనుఁడై 'సరిసరి ! స్త్రీకారణంబున నామాతులుని రావణుని జంపిన రాముని తమ్ముఁడవా ? పెద్దకాలముగా నున్న నాకోర్కి నేఁడు దీఱుటయ్యెను. రావణకులక్షయమొనర్చి నీయన్న మాయెల్లరకుఁ దీఱని తలవంపుఁ గూర్చెను. ఆమచ్చ నేటితో మాయ నున్నది. ముహూర్తముండుము ; ఇదిగో యిప్పుడే వచ్చి నీకోరిన యుద్ధ మొసంగుదు' నని పలుకుచు లోనికిఁ జన నుంకించెను. శత్రుఘ్నుఁడు వాని నడ్డగించి 'ఓరీ ! నిశాచరా ! ఎచ్చటకుఁ బోయెదవు ? దొరకక దొరకక నేఁడు యదృచ్ఛగా దొరకితివి. నిన్నువిడుచుట లేదు. అట్లువిడుతునేని మందమతినగుదును. రా రమ్మ'నెను. లవణాసురుఁడు తటాలున నిలిచి వైరి నెదుర్కొని యదల్చి చేరువనున్న మహావృక్షంబును బెకలించి యా భూరుహంబు నతనిపయి వైచెను. శత్రుఘ్నుఁడాభూరుహంబును నూఱు తునియలు గావించెను. లవణాసురుఁడు నిజోద్యమము వ్యర్థయగుటకు నెంతయు సంతాపాగ్రహములొంది పెక్కుపాదపంబులను జేసేతఁబెకలించి యెదిరిపైఁబడ వేసెను. శత్రుఘ్నుఁడావృక్షంబులనుగూడ నందందే ఖండించి యసురవీరునిమీఁద నంపవానఁ గురిసెను. లవణుఁ డాశరహతులకు వికల వికల నవ్వి మహోన్నతధరారుహంబు నొండున్మూలించి కైకొని దుర్దాంత రయంబున దానిని విసరి వైరిశిరము దాకనేసెను. శత్రుఘ్నుఁడు ప్రేటు పడి మూర్ఛనొందెను. అతని పాటుఁగాంచి ఋషులును దేవగంధర్వాప్స రసలును బెగడొంది హాహాకారములొనర్చిరి. శత్రుఘ్నుఁడు హతుఁ డయ్యెనని లవణుఁడు భావించి శూలముమాటఁ దలంపక యాదమఱచి యొక్కెడఁగూర్చుండి తానుదెచ్చినమృగంబులను హాయిగా మెక్కసాగెను.

శత్రుఘ్నుఁడు కొంతవడికిఁ దేఱి లేచి సాయుధుఁడై పురద్వారమున నిలిచి దివ్యము నమోఘంబును యుగాంతకాలాగ్నిదీప్తమునైన శరంబును బూనెను. అదిమాచి భూతంబులెల్ల బిట్టులికి పరమేష్ఠినిజేరి 'దేవేశా ! శరణు, శరణు. యుగక్షయకాలము సంప్రాప్తమయ్యెను. దేవతలకును లోకంబులకును గాలముతీఱె' నని మొఱవెట్టిరి.

పితామహుఁడు వారిని విని సంగతి యేమన 'దేవా! లవణాసుర వధార్థము శత్రుఘ్నుఁడు మహాశరమును బూనెను. దాని తేజస్సునకు మే మెల్లరముఁ గలగుండుపడి రక్షణార్థమిందు వచ్చితి' మని వారు విన్నవించిరి. పలువ వారిభయంబులుడిపి మీరుచని విష్ణుతేజోమయమైన యాశరంబు లవణునిహరించుటఁ జూడు' మని వారిని బంపెను. వారు మరలి వచ్చి చదలఁగూడి తచ్ఛరప్రభావవిలోకనోత్సుకులై యుండిరి. శత్రుఘ్నుఁడు సింహనాదమొనర్చి లవణాసురునిఁ బోరనకుఁ జీరెను. ఆయసురవీరుఁడు క్రోధమూర్ఛితుఁడై వానిని దాఁకెను. శత్రుఘ్నుఁ డాదివ్యశరమును సంధించి యాకర్ణాంతముదివిచి లవణాసురుపేరురము గుఱిచేసి యేసెను. ఆ బాణము జ్వాలలు గ్రక్కుచు మహోగ్రాకృతిఁ జని వైరియురంబును వ్రీల్చి దుస్సి రసాతలముఁజొచ్చి మరలఁ దూణీరముఁజేరెను. వజ్రహతికి మహాశైలమట్లు తద్బాణహతికి లవణుఁడు దొర్లెను. వాఁడుపడుతే తడ వుగాఁ దదీయశూలము దేవతాదులసమక్షంబున దివ్వనెగచి చని రుద్రునిఁ జేరెను.

అంతటఋష్యాదులు శత్రుఘ్నుని డాయవచ్చి 'రాఘవా! నీవలన మాదిగులెల్లను నేటితోదీఱె' నని వానిని వేవిధంబులఁ బ్రస్తుతించి దీవించి 'వత్సా! ఈమధుపురంబును నీవు తోడ్తోడఁ బ్రవేశింపు' మని పలికిరి. శత్రుఘ్నుఁడు వారిని నమస్కరించి వీడ్కొని నిజసైన్యమున్నయెడకుఁ బోయి రామునకు సంగతి వినిపించుటకుఁగా వాయువేగవంతుల నయోధ్యకుఁ దరలించి తాను మధుపురముఁ జొచ్చెను. శత్రుఘ్నుఁడందుఁ గాలిడినంతనే యాపురమెల్ల నూత్నశోభను వహించెను.

—♦ వాల్మీకికి బ్రహ్మప్రత్యక్షమగుట ♦—

అట వాల్మీకి మహర్షి కుశలవ జననాంతరము కొండొకనాఁడు మధ్యాహ్న స్నానార్థము శిష్యులఁగూడి తమసానదికిఁ బోవుచు మార్గమధ్య మున వ్యాధునొకనిఁ జూచెను. ఆకిరాతుఁడు జంటనున్న క్రౌంచపక్షులలో నొకదానిని ఋషిచూచుచుండగానే యేసెను. ఆపక్షి శరవిద్ధమై నెత్తుట జొత్తిల్లుచు నేలఁద్రెళ్ళి ఱెక్కలు విదిర్చి గిజగిజలాడి ప్రాణంబులఁ దొఱ గెను. రెండవపక్షి దానికై యొక్కపెట్టున విలపింపసాగెను. వాల్మీకి

మహర్షి యడిరియెల్లఁ గన్నారఁజూచి కడుంగడు జాలినొందెను. వాని యంతస్తాపము పొరలి బహిర్గతమయ్యెనోయనఁ దన్ముఖంబునుండి యప్ర యత్నముగా,

'మానిషాద! ప్రతిష్ఠా స్త్వమగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్॥'

అనుశ్లోకము వెలువడెను. ఆఋషిచంద్రుఁ డందులకు మహాశ్చర్యమంది జలకమాడి యాశ్రమమునుజేరి యావింతనే తలఁచు చుండెను.

అత్తఱి బ్రహ్మ వానియెదుటఁ దోఁచి 'మునిచంద్రమా! వింతవలదు, నీవు వాగ్బ్రహ్మమందుఁ బ్రబుద్ధుండ వైతివి. నాతలంపుననే వాగ్దేవి యసంకీర్ణయైన యనుష్టుప్ఛందోరూపంబున నిట్లు నీ యం దావిర్భవించెను. ఇఁక నీవు రామచరిత్రంబును సమగ్రముగా వర్ణింపుము. నీవచనం బనృత రహితమై నూత్నఛందోబద్ధమై వేద ప్రమాణంబుఁ బడయును. నీప్రతిభా చక్షుస్సు అలౌకికసంస్కారోపహితంబును నప్రతిబద్ధముఁ గావున రహ స్యార్థములు సయితము నీకు స్ఫురించును. నావరబలంబునంజేసి యాదికవి వైతి' వని పలికి యంతర్ధానమొందెను. అంతట నమ్మహర్షి వాగ్బ్రహ్మ పరిణామమైన రామాయణంబును రచింపఁ దొడఁగెను.

ఆదికావ్యమైన యీరామాయణంబు సంపూర్ణావస్థకు వచ్చునంతటికిఁ గుశలవులు విద్యాభ్యాసయుక్తవయస్కులైరి. ఆమహర్షి వారికిఁ దన కృతినిఁదాళలయ గాన పూర్వకముగా వాచోవిధేయము చేసెను. వారా గ్రంథమును జక్కఁగా వల్లించి తదాశ్రమమునకువచ్చుచుండు మహర్షుల మ్రోలఁబాడుచు వారికి నింద్రియతర్పణ మొనర్చుచు నుండిరి.

## —♦ వాల్మీకి శత్రుఘ్నులు ♦—

శత్రుఘ్నుఁడు మధురాపురం బధిష్ఠించి పదురెండువత్సరములు రాజ్య మేలి యంతట రామసందర్శనంబును గోరి రాజ్యమును మంత్రిపురో హితాదులకు నప్పగించి కొలఁది పరివారముతోఁ దరలి మార్గమధ్యమున నున్న వాల్మీకిమహర్షిని సందర్శించి వానికి నతిథియై నాడందు నిలిచెను.

వాల్మీకియు రాఘవుని సగౌరవంబుగా సత్కరించి పెక్కుకతలు వినిచి ‘రాఘవా! లవణాసురుని జంపి మహాదుష్కరకార్య మొనర్చితివి. ఆ కూళవలన మడిసిన రాజన్య లిందఱనరాదు. అట్టిదురాత్ముని నీవు లీలా మాత్రముగా గెడపి జగంబుల భయంబుడిపితివి. నీతేజోవిశేషంబున లోకంబులకుఁ బ్రశాంతి గూరెను. రావణునివధకు మహాప్రయత్నం బవసర మయ్యెను; ఎట్టి ప్రయత్నములేకయే యవలీలగా నిట్టి సుమహత్కర్మంబు నీ వొనర్పుటయ్యెను. ఆకూళచచ్చుటంజేసి దేవతలకును మాబోంట్లకునుఁ బరమప్రీతి యొదవెను. అంతియగాదు. ఎల్లభూతంబులుగూడ సంత సించుటయ్యెను. వీరాగ్రణీ! మీయుద్ధంబును నేను వాసవ సభనుండి సమగ్రముగాఁ జూచితిని. వత్సా! నీకై యెంతయుఁ బ్రీతి నాయెద నయ్యెను. శిరమును మూర్కొనుట స్నేహముయొక్క పరమావధి యగు’ నని పలికి వానితల మూర్కొనెను. అంతలోన భోజనసమయమయ్యెను. ఎల్లరు భుజించి హాయిగాఁ గూర్చుండిరి.

వారట్లు సుఖాసీనులై యుండఁగాఁ గుశలవు లచ్చటకు వచ్చి రామ చరిత్రంబును దంత్రీలయసమాయుక్తముగాఁ ద్రిస్థానకరణాన్వితముగాఁ బాడిరి. లక్షణోపేతమును సమతాల సమన్వితంబునైన వారిగానము మధుర మధురమై యెల్లరయుల్లంబులఁ గొల్లగొనెను. రామకథయెల్ల శత్రుఘ్ను నకుఁ దనకన్నులమ్రోల నప్పుడు జరుగుచున్నట్లయ్యెను. అతఁడు బాష్ప లోచనుఁడై మైమఱచి తెలివొంది సారెసారెకు నిట్టూర్పసాగెను. శత్రు ఘ్నుని యనుచరులు గీతిసంపదకుఁ దలలు వ్రాల్చి భళిభళియనుచుఁ దొల్లిటి యుద్ధంబు నప్పుడు విని స్వప్నము ననుభవించుచున్నామోయని తలంచి గాయకులెవ్వరో తెలియఁగోరిరి. శత్రుఘ్నుఁడు వారిమాటవిని ‘ఈ మహర్షియాశ్రమంబున వింతలెన్నో గలవు. ఇవి తెలియ మముబోంట్లకు గా’ దని వారికి సమాధానముచెప్పి నాఁడందుపుచ్చి తెల్లవాఱి పౌర్వా హ్ణికక్రియలు తీర్చి మహర్షికిఁ బ్రాంజలియై ‘మహాత్మా! రామసందర్శన లాలస హెచ్చిదముగానున్నది. తరలననుజ్ఞఁగోరుదు’ ననెను. వాల్మీకి వానినిఁ గవుంగిటఁగూర్చి దీవించి సాగనంపెను.

## —♦ రామశత్రుఘ్నులు ♦—

శత్రుఘ్నుఁడట్లు వాల్మీకిని వీడ్కొని రథారూఢుఁడై వడివడిఁజని యయోధ్యానగరముఁజేరి నగరుజొచ్చి మంత్రులనడుమఁ గొలువున్న యన్నకు సాష్టాంగమొనర్చి 'మీయాజ్ఞ నెరవేర్చితిని. అన్నా! నిన్నువదలి పదురెండేండ్లు చనెను. ఇకఁ నిన్నువిడిచి యుండఁజాలను; నాయెడఁ బ్రసన్నుఁడవగుము. ఈద్వాదశవర్షప్రవాసము నాకుఁ దల్లినిబాసిన బిడ్డకు వలెఁ గడచె' ననెను. రాముఁడు వానిని లేవఁదీసి యంకమునఁ గూర్చి 'నాయనా! రాజులకు విప్రవాసములు గలుగుచుండును. క్షత్రధర్మమును మనము దాఁటరాదు. ప్రజాపరిపాలనము మనకు విధియైయున్నది. అందులకు వెఱవరాదు. నిన్నుఁబాసియుంట మాకుఁగూడ నొప్పిదేగదా. అయిన నేమి సేయనగు? అనివార్యమశోచ్యము. మధునగర మంతదూరముగాదు. ఇచ్చవచ్చినప్పు డిందు నీవు వచ్చుచుఁ బోవుచు నుండనగును. వేఱుతలంప వలదు. ఏడురాత్రంబు లిందుండి మరల నీరాజ్యంబునకుఁ జనుము. రాజులకు రాజ్యపాలనముకన్న మించిన ధర్మములేదు. ఎవరుగాని స్వధర్మంబునకు భంగకరముగా నడవరాదుగదా' యనెను. శత్రుఘ్నుఁడు దీనాస్యుఁడై యేడురాత్రు లందుండి మఱల మధుపురికిఁ జనెను.

## —♦ బ్రాహ్మణుఁడు మృతబాలునిఁగొని రామునొద్దకువచ్చుట ♦—

అనంతరము కొండొకనాఁడు బ్రాహ్మణుఁ డొకఁడు మృతబాలకు నెత్తుకొని యయోధ్యానగరరాజద్వారంబునకు వచ్చి 'హా! పుత్త్రా! మమ్ము వదలి పోయితివా? కటా! దేహాంతరమున నేనెంతపాపమొనర్చితినో తెలియరాదు. కానక గన్నపుత్త్రుని నిన్నుఁ దటాలునఁ గోలుపోవు దౌర్భాగ్యంబూఱక గలుగదు. అయ్యో! నీకింకనుఁ బంచవర్షములేనియు నిండవు. అకాలమృత్యువు నిన్ను మ్రింగి నాకడుపులోఁ జల్లారని నిప్పు దగిల్చెను. ఇఁక నీతల్లి మనఁబోదు; నీశోకము నన్ను హరించును. నాయనా! అనృతంబును దలంచిగాని యాడిగాని యెఱుంగను; చలిచీమకుఁగూడ నపకారంబొనర్పను. తుదకిట్టిచేటుపాలైతిని. పితృకార్యములనిర్వర్తింపవలయు సుతుఁడే ముందుగాఁ జచ్చుట యేరాజు కాలమందుఁ గలుగదు. ఇట్టి

విన్నదియుఁ గన్నదియుఁ లేదు. ఇట్టి యీఘోరదర్శనము రామరాజ్యమందు నేఁడు సంభవించెను. ఇదంతయు రాముని దుష్కృతఫలముగాని వేఱుగాదు. హా! రామా! నీవు జీవించియుండఁగానే నాసుతుని మృత్యువు మ్రింగెను. ఈసుతశోకంబున నేనును నాపత్నియు నీద్వారమందే ప్రాణంబులఁ దొఱఁగుదుము. రామా! బ్రహ్మహత్యను మూటఁగట్టుకొని తమ్ములఁగూడి దీర్ఘకాలము సుఖముండుము. నీతోడ నైక్ష్వాకు రాజ్య మనాథగతి నొందెను. రాజు ధర్మాతిక్రముఁడైనఁ దద్దోషము ప్రజలఁబొరయు నందురు. నీవృత్తము సరియైనది గాకున్నను వాని రాష్ట్రజను లకార్యము లొనర్చినను దత్పాపము రాష్ట్రమునెల్ల వేవిధంబుల భయాక్రాంత మొనర్చును. ఈరెంట నేదో యొకటి గలుగకున్నచో నా కొడుకున కకాలమరణంబును నాకు సుతశోకంబును గలుగనేర వని పెల్లురోదన మొనర్ప సాగెను.

రాముఁ డాపరివేదనంబులను విని దుఃఖసంతప్తుఁడై మంత్రులను వసిష్ఠాది మహర్షులను నిగమవేత్తలను దమ్ములను బిలిపించెను. మంత్రులెనమండ్రు గురుఁ జేరిరి. తమ్ములు వచ్చిరి. మార్కండేయ మౌద్గల్య వామదేవ కాశ్యప కాత్యాయన జాబాలి గౌతమ నారదులు సమావేశమైరి. వసిష్ఠ వామదేవాదు లరుదెంచిరి.

## —♦ బ్రాహ్మణబాలకుని యకాలమరణ విచారము ♦—

అట్లువచ్చిన మహర్షులకు రాముఁడు కృతాంజలియై సంగతియెల్ల వారికి వినిపించెను. నారదుఁడు వృత్తాంతమంతయు విని 'ధర్మగ్లానివలన విపరీతంబులు గలుగుచుండును. ప్రాణులెంతకాలము స్వధర్మంబున నుండునో యంతకాల మిట్టియరిష్టములు గలుగఁజాలవు. ఈపరమతత్త్వ రహస్యము యుక్తివాదమునకు నందదు. ప్రాణులకుఁ బ్రారబ్ధకర్మానుభవయోగ్యముగాఁ దనువులు గలుగును. కర్మము గుణానుగుణముగానుండును. గుణములనుబట్టి కర్మరూపమైన యుక్తధర్మమును నిర్ణయించిరి. ఈనిర్ణయము దేశకాలపరిస్థితులనుబట్టిగూడ నుండును. కాలమును కృతయుగమని త్రేతాయుగమని ద్వాపరయుగమని కలియుగమని నాల్గుగా విభజించిపల్కిరి.

అందుఁ గృతయుగమందుఁ దపోరూపకర్మము బ్రాహ్మణులకుమాత్రమే ధర్మమైయుండెను. త్రేతయందు క్షత్రియులుగూడ నందులకు నధికారులై తత్తపోమహిమంబునఁ బ్రజలనుఁ బ్రోచుచుండిరి. మఱియు ధర్మమునకు నాల్గుపాదములుగలవు. అది కృతయుగంబున నాల్గుకాళ్ళఁ జరించుచుండును. త్రేతయందు సత్యమనెడిపాదముతెగి ధర్మము మూఁడుకాళ్ళ వర్తించును. సత్యము సన్నగిల్లుటఁజేసి యధర్మదేవత మునుగాలిడును. అధర్మదేవత తల చూపినంతనే తేజస్సు మందగించును. ద్వాపరంబున ధర్మము ద్విపాదిగా నుండును. ఆయుగంబున వైశ్యులు తపంబొనర్తురు. కలియుగంబున ధర్మమేకపాదంబున నుండును. అప్పుడు శూద్రులుగూడఁ దాపసులగుదురు. ధర్మవైపరీత్యంబునఁ జేసి కలికాలంబునఁ గలుగువింతల నూహింపరాకుండును. త్రేతయైనయిక్కాలంబున నీరాజ్యమందు శూద్రుఁడెవఁడో తెంపుచేసి తపం బొనర్చుచున్నాఁడు. అట్టియధర్మాచరణఫలంబుగా నిట్టియకాలమరణము గలిగెను. ఒండగునేని యిట్టిఘోరఫలము గలుగనేరదు. ఏరాజ్యమందు ధర్మగ్లానియుండెనో యకార్యాచరణమెుండెఁ బ్రవర్తిల్లునో యారాజ్యము తప్పక నశించును; దాని యేలికయు నరకముపాలగును. ఇది పరమ సత్యము. ముప్పురాకమున్న మేలుకొనుము. తడవుసేయక శూద్రతపస్వి యెుందున్నను వెదకి వానిని సంహరించి నిన్నును నీరాజ్యంబును రక్షించుకొనుము. ఇది హింసకానేరదు. ఈ పని సేయుదువేని ధర్మము వర్ధిల్లును. ధర్మముతోడ నాయువు పెంపుచెందును. తత్ఫలముగాఁ జచ్చినబాలుఁడు మరల జీవించును' అని వచించెను.

అంత నందొకఁడు లేచి 'మహాత్మా! నీవు త్రికాలవేదివగుట లోకప్రసిద్ధము. నీ యెుటుంగని యర్థంబు గలుగదు. జీవితసాఫల్యంబునకు ధర్మాచరణమునకన్న నుత్తమోత్తమమార్గము లేదనుట సత్యము. అయినను నాకొక్కసంశయము గలిగెడు. సాహసించి యడుగుదును. నాయీ యవినీతి నైరింపనగును. మోక్షము సర్వప్రాణులకుఁ బరమప్రాప్యము. దానిని బడయుటకు నెల్లరు నర్హులు. దత్ప్రాప్తికిఁ జిత్తశుద్ధిముఖ్యము. మనోనిగ్రహమునఁగాని చిత్తశుద్ధిగలుగదు. మనోనిగ్రహము తపస్సు వలనఁ జేకూఱు నందురు. కావునఁ దపస్సు సర్వజనులకు ననుష్ఠేయమేయని

చెప్పకయే స్పష్టమగుచున్నది. మోక్షము బ్రాహ్మణాది వర్ణత్రయమునకే యని వచింతురేని తపోనుష్ఠానమునకు వర్ణవ్యవస్థ గలుగును. అట్టినియతిని జెప్పరైరి. మఱియు మోక్షము పరమేశ్వరానుగ్రహంబున సంప్రాప్తమగును. సర్వేశ్వరుఁడు బ్రాహ్మణాది వర్ణత్రయమునకే మోక్షము నిచ్చువాఁడగునేని వానికి రాగద్వేషవైషమ్యములు గలవనక తప్పదు. భగవంతుఁడు సర్వగుణాతీతుఁడని పెద్దలు వచించిరి. మర్త్యులకేగాక చతుష్పాత్తులకుఁగూడఁ బరమేశ్వరుఁడు మోక్షంబనుగ్రహించెనని విందుము. నా యీతలఁపుఁజిక్కును దీర్పవేఁడుదు' ననెను.

వసిష్ఠుఁడంత లేచి 'మిత్రమా! శూద్రులకు మోక్షము లేదనుటగాదు. మోక్షము నీవన్నట్లు సర్వప్రాణులకుఁ బ్రాప్యమే యగును. అందులకుఁ గొందఱు తగుదురు, కొందఱు తగరను జాతిమతవ్యవస్థ లేదు. మోక్షము సర్వప్రాణిప్రాప్యమైనను దత్సంపాదనమార్గము వారివారిగుణంబులను బట్టి భేదించుచుండును. అన్నిరోగములకు నేకమూలికాప్రయోగము కానట్లు సర్వజనులకు నొక్కమార్గము సరిపడదు. మోక్షమునకుఁ జిత్తైకాగ్ర్యము ప్రధానమని నీవే సూచించితివి. చిత్తము త్రిగుణాత్మకమై యుండును. అందు సత్వగుణము నిశ్చలస్థితిని గూర్చును. రజస్తమస్సులు మహాసంచలనంబు నొదవించును. సంచలంబు నశింపవలయునన్నచో రజస్తమస్సుల నడఁచిపెట్టవలయును. అడఁచిపెట్టుట హఠాత్తుగాఁ జేయరాదు; క్రమక్రమముగా సాధింపవలయును. రజస్తమస్సులకు సంచలనరూపకర్మము నైజముగావునఁ దన్మార్గమునే యనుష్ఠించి క్రమక్రమముగా నకర్మ వికర్మములను విడనాడుచు సుకర్మములాచరించుచు ఫలాభిసంధి మానుచు వచ్చినచో రజస్తమస్సుల దుందుడుకులు సమసిపోయి సత్త్వగుణములు పెంపొందును. సత్త్వగుణాభివృద్ధితోడ మనోనిశ్చలత్వము కొంతకుఁగొంత సిద్ధించును. దానిని మఱిమఱి పెంపుచేయుటకుఁ దపస్సు మహోత్తమసాధనమగును. అట్టిస్థితి కలుగుటకుఁ బూర్వము తపోవ్రతము ఫలకారి కానేరదు. శాస్త్రవిధి నుల్లంఘించి కేవలము స్వేచ్ఛాప్రేరితుఁడై వర్తించువానికి సిద్ధిగాని సుఖముగాని యుత్తమగతిగాని గలుగదు. ఇది శాస్త్రవచనము. మిత్రమా! ఎట్టిస్థితికి వచ్చినప్పుడు తపస్సు సహకారియగునో గ్రహించితివా? శూద్రులకుఁ దపస్సు కూడదనుటకుఁ గారణము వినుము.

ఎవనియందుఁ దమోగుణ మత్యంతముగా నుండునో వానిని శూద్రుఁడందురు. చాతుర్వర్ణ్యవ్యవస్థ మనుష్యులందేగాదు. జంగమస్థావరంబులందును గలదు. తమోగుణంబునకుఁ దపస్సు కానిమార్గమని మున్నే తెలిపితిని. ఎవనికేది కూడునో దాని ననుష్ఠించుట వానికి ధర్మమగును. కూడనిదానిని జేయుట యధర్మమగును. శూద్రుఁడు తనతత్త్వంబునకుఁ గూడని శ్రోవత్రోక్కుట యుత్పథమగును. ధర్మవ్యతిరేకంబునంజేసి యూహింపరాని యెగ్గులొదవును. ప్రజలను ధర్మమార్గంబున నడపించుట రాజులకు విధియైయున్నది. ఈరాజధర్మంబు నొప్పరికించు వాఁడు చేటొందక మానఁడు. 'రాజా! రాష్ట్రకృతంపాపి మ్మవ విశమా!

మిత్రమా! మఱియొకరహస్యము వినుము. ఈజాతివిభేదము లెల్ల నుపాధులకేగాని యాత్మకుఁగావు. ఆత్మయన్ననో సర్వగుణాతీతమును నిర్లిప్తమునునై నిఖిలోపాధులందు నేకరాశినుండును. ఉపాధి యెంత స్వచ్ఛముగానుండునో యాత్మప్రకాశమంత తేజోవంతమై యుండును. ఆత్మప్రకాశము పూర్ణముగాఁ బ్రసరింపవలయునన్నచో నుపాధిని మహోనిర్మలవంతముగా నుంచవలయును. ఉపాధులు గుణములనుబట్టి యుండును; గుణములు పూర్వకర్మానుసారముగా వచ్చును. ఉపాధిని బరిశుభ్రమొనర్పవలయుననఁగా నయ్యుపాధికి మూలమైనగుణమును బరిశుభ్రపఱచుట యగును. ఈగుణశుద్ధి యన్ననో యాహారవ్యవహారములవలనఁ గలుగును. తమోగుణము రజోగుణముగా మార్పుచెందవలయునన్నచో నందులకుఁ దగిన యాహారవ్యవహారములుగలవు. రజోగుణము సత్త్వగుణముగా మారుటకుఁ దదుపయుక్తములైన యాహారవ్యవహారములు గలవు. మొదటిదానికి యోగ్యములైనవి రెండవదానికిఁ గూడవు. అట్లే రెండవదానికి యోగ్యములైనవి మొదటిదానికిఁ దగవు. ఈమర్మమెఱుంగక యెవఁడేని మొదటి తరగతికిఁ జేరినవాఁడు రెండవతరగతికి నియమించిన యాహారవ్యవహారముల ననుష్ఠించునేని వానియనుష్ఠానము స్వభావవిరుద్ధమైయుండును గావునఁ గోరినఫలము రాకపోవుటయేగాక విపరీతఫలముగూడవచ్చును. అట్టివాఁడు స్వధర్మవిరుద్ధాచారపరుఁడనఁ బడును. అట్టి నడతవానికి మేలు చేయుటకుబదులుగాఁ గీడు సేయును గనుక యెఱుకగలవారు వాని నట్టి

యుత్పథమునుండి మాన్పి యుక్తమార్గమున వర్తింపఁజేయనగును. ప్రజలను వారివారిధర్మములందు వర్తింపఁజేయుభారము రాజుపయి మోపిరి. అందువలన రాజు తనధర్మమును విధివిహితముగా నెఱవేర్పక తీఱదు. ఎచ్చట తమోగుణము ప్రధానమైయుండునో యచ్చట శూద్రత్వముండునని మున్నె చెప్పితిని. శూద్రునకుఁ దపస్సు హితము గాదని నిషేధించిరి. నిషిద్ధమార్గమును ద్రొక్కినప్పుడు వానిని శిక్షింపక తప్పదు. ఈశిక్ష వానిమేలునకే యగును గాని యొండుగాదు.

అట్లగునేని శూద్రునకు మోక్షాగ్రస్థితి యెట్లుగలుగునని ప్రశ్నింపవచ్చును. ఏదియైనను సక్రమాభివృద్ధిఁ జెందవలయును. అది స్వభావానుసారమగును. శూద్రునందుఁ దమస్సు ప్రధానము గావున దానిని మొదట రజస్సుగా మార్చుకొనుమార్గమనుష్ఠించి రజస్సును తర్వాత సత్త్వముగా మార్పయత్నింప వలయును. అందులకు నొకజన్మము చాలదుగదా యనవచ్చును. అందులకుఁ గాలనియతిని నిర్ణయింపఁదరముగాదు. ఈమార్పెల్ల నొక్కజన్మములోనే కానగును. లేక వేనవేలు జన్మములకుఁగూడ సిద్ధింపకుండ వచ్చును. అదంతయుఁ బ్రయత్నదర్ఢిమనుబట్టి యుండును.

తమస్సు రజస్సుగా మారుటకుఁ గర్మయోగమును బరమసాధనముగా గ్రహించిరి. అది వారిస్వభావమునకు సరియైయున్నది. తమోగుణవంతుఁడామార్గమును ద్రొక్కక వేఱుమార్గమును ద్రొక్కినప్పుడు కీడు మిన్నకుండునేని తమోగుణవంతుఁడు చెడుటయేగాక వాఁడు పరులకు నపమార్గదర్శి యగును. జనులొకరినిజూచి యొకరు వర్తించుచుందురేగాని ప్రతివిషయంబును బరామర్శించి వర్తింపరు. ఇది లోకసహజము.

నావుడు 'మహాత్మా! శూద్రాది నీచయోనులందు జనించియు నుగ్రతపంబులొనర్చి మహర్షులైన వారెందఱో గలరు. జాతియే ప్రధానమగునేని అట్టి మహర్షులుగూడ స్వజాతిధర్మవ్యతిక్రమ మొనర్చిన వారే యగుదురుగదా. వారిని శిక్షింపరేల? ఏజాతి లోఁబుట్టినను గుణము ప్రధానమ్మగుచున్నదనియు, సత్త్వగుణప్రధానులెల్లరుఁ దపస్సునకు యోగ్యులగుదు

రనియు దీనివలన స్పష్టమగుచున్నది. మఱియు సత్త్వగుణప్రధానుఁడు గాని వాఁడు తపస్సునకే యత్నింపఁడనియుఁ జెప్పనగును" అని యతఁడడిగెను.

వసిష్ఠుఁడు :—మిత్రమా! తపోపరులెల్లరు సత్త్వగుణప్రధానులే యని యన రాదు. రావణాదులు ఘోరతపంబొనర్ప లేదా? వారిని సత్త్వగుణప్రధానులని చెప్పఁగలవా? వారిచరిత్రయెల్లఁ దద్విపరీతంబును దెల్పుచున్నదిగదా; సంగతి వినుము. తపస్సు గూడ గుణములను బట్టి త్రివిధమగును. తత్ఫలము గూడ నట్లే త్రివిధమగును. తపస్సునకు ముఖ్యాంగము మనోనిశ్చలత్వము. ఇది సాత్త్వికరాజస తామసికులకు మువ్వురకును గలుగవచ్చును. అది తాఁబూనిన కార్యంబును బట్టుదలతో సాధించుటకుఁ దోడ్పడును. అంతమాత్రాననే తనియరాదు. ఎవని తపస్సు శాస్త్రవిరుద్ధంబును ఘోరంబునై తనశరీరంబునే గాక యంతశ్శరీరస్థుఁడైన భగవంతునిగూడఁ గృశింపఁ జేయునో వానితపస్సు ఆసురమైన తపస్సగును. అట్టిది యాత్మకళ్యాణసిద్ధికిఁ దగదు. ఆత్మహితముఁగోరువాఁడు కార్యాకార్యవ్యవస్థితియందు శాస్త్రంబును బ్రమాణంబుగా గ్రహించి శాస్త్రవిధానోక్తమైన కర్మమునే చేయవలయును. శాస్త్రంబు ధర్మంబును విధించును. ధర్మముయొక్క ముఖ్యోద్దేశము ప్రజాధారణయే గావునను బ్రజలయందు గుణంబునుబట్టి తారతమ్యము గలదు గావునను వానినెల్ల విమర్శించి యుత్తమమువిూదఁ బ్రజాధారణకు ననుకూలంబుగా ధర్మంబులను శాస్త్రము విధించుచున్నది. ఆవిధానంబు నెఱిఁగి వర్తించువారు శుభంబునొందుదురు. ఎల్లరకు శుభం బొనగూర్చుటకే శాస్త్రమున్నదని మఱువరాదు.

మిత్రమా! మఱియొకమాటగూడ గలదు. జీవులు శాపాది కారణంబులఁజేసి శూద్రతిర్యగాదియోనులందు జనించుటయు నుత్తమగుణయోగ్యసాధనంబుల ననుష్ఠించుటయు ముక్తిఁబడయుటయుఁ గలదు. ఇట్టివెల్ల విశేషాంశములగును. వానిని నిదర్శనంబులుగాఁ గొని స్వభావస్వధర్మ

విరుద్ధముగా వర్తింపరాదు. ఈరహస్యములెల్ల స్థూలబుద్ధికి గోచరింపవు. ఎవనియందుఁ దగుసాధనసంపత్తియుండునో వానికిట్టి వన్నియుఁగరతలామలకములగును. భూతదర్పణమునకు గోచరించు సూక్ష్మార్థములు వట్టిగాజు పెంకునకుఁ దెలియవుగదా. కొందఱు కేవలాహంకారాంధులగు వారింత మాత్రము తలపోయక కంటికిఁగానరానట్టియు యుక్తికి నందనట్టియు విషయంబులను దత్త్వార్థదర్శనులు ప్రతిపాదించినవానిని గల్లలని వచింతురు. ఇట్టివారిని మిథ్యాచార్యులందురు. వారిని నమ్మినచో గ్రుడ్డివానిని నమ్మిన గ్రుడ్డివానిగతి తప్పదు' అని వివరించెను. ఆవచనంబులను సభలోని మహనీయులెల్లరు సత్యము సత్యమనిరి.

—♦ శంబూకుఁడు ♦—

అంత రాముఁడు లక్ష్మణునిఁజూచి 'తమ్ముఁడా! నీవు వెంటనేపోయి ద్వారమందున్న యాబ్రాహ్మణునోదార్చి యాబాలునికళేబరంబును తైలద్రోణియందు పెట్టించి యుచిత సుగంధద్రవ్యములఁగూర్చి పదిలపఱచిరమ్ము' అని చెప్పి విమానరాజంబును సంస్మరించెను. ఆవిమానము తలఁపులోఁడ వచ్చి మ్రోల నిలిచెను. రాముఁడంతట నందున్నమహర్షులకు మ్రొక్కి వారినిఁ దగుమర్యాదలతో వీడ్కొని రాజకార్యములందు భరతలక్ష్మణులను నియమించి ధనుస్సాయక తూణీరాదిసంపన్నుఁడై విమానమెక్కి తూర్పు దెసఁబట్టిపోయి యందుండి యుత్తరాభిముఖుఁడై హిమవంతమునెట్టి యచ్చట నుండి దక్షిణదిశఁద్రొక్కి చనిచని శైలపర్వతోత్తరతటంబున మహాసరోవరము చేరువఁ దలక్రిందుగా ఘోరతపంబొనర్చుచున్న యొకతాపసిని జూచి డాయఁబోయి 'తపోవ్రతా! దశరథరాముఁడు నిన్నడుగుచున్నాఁడు. ఏ యర్థంబునుగోరి తపంబొనర్తువు? స్వర్గమును వరింతువా? అపూర్వవరంబులను గోరుదువా? ఎవనిఁగూర్చి తపంబొనర్తువు? నీవెవ్వఁడవో నిజము చెప్పు' మని యడిగెను. ఆతపోవ్రతుఁడు లేచి రామునకు మ్రొక్కి 'దేవా! నాపేరు శంబూకుఁడందురు. శూద్రయోనియందు జనించితిని. సశరీర దేవత్వంబునుగోరి తపంబొనర్చుచున్నాను' అని వినయమధురంబుగా నుడివెను.

రాముఁడంతట నొఱనుండి కత్తి దూసి కుడిచేతఁ బూని 'కుడిభుజమా! జాగువలదు, మృతుఁడైన విప్రబాలకుఁడు జీవించుకొఱకు ఋషీంద్రుల

యాజ్ఞప్రకారము శూద్రమునిమీఁద గృపాణమును వదలుము. జాలియం దుపం ! అయ్యో ! దుర్భరగర్భఖిన్నయైన దయితను గుట్టలకుఁ దోలిన రామునకును జాలికినిఁ గడుదూరము. అట్టిరాముని గాత్రమవైన నీకును జాలియా !' యనుచు ఖడ్గమును విసరెను. ఆకృపాణము శూద్రముని కంఠంబును ద్రెంచివైచెను. ఆమునిశరీరమునుండి దివ్యపురుషుఁ డొకఁడు లేచి 'స్వామీ ! సాష్టాంగము. నీవు దండధారివై యమునినుండి నిర్భయ మిచ్చిన యావిప్రశిశువు జీవించెను. నాకును శుభంబు చేకూరెను. ఇదిగో శంబుకుఁడు నీచరణరాజీవంబులకు మౌళిఁ జేర్చుచున్నాఁడు. సాధు జనసంగమంబువలనఁ జావుగల్గినను భవతారకంబగుఁగదా' యనెను.

రాముఁ డంతట 'శంబుకా ! దండ్యులను దండించుట కేవల ధర్మసంస్థాపనార్థముగాని మత్సరార్థముగాదు. నీవు నీయుపాధికిఁ దగనికర్మంబు ననుష్ఠించి యన్యులకుఁ జెడదారిం జూపుట జేసి దండ్యుఁడ వైతివి. నీ దోషము రాజదండనంబున సమసెను. నీవొనర్చిన మహోగ్రతపస్సు వృథవోదు. ఎందు నిర్భరానందమోదంబులు నిండుకొనియుండునో, పుణ్యసంపదలెందు నిరవైయుండునో, దేనినిగోరి నీవింతగాఁ దపంబొనర్చితివో యా వైరాజకనామలోకంబులు తేజోమయములైనవి నీకుఁ జిరకాలోపభోగ్యములగుఁగాక' అని వచించెను. శంబుకుఁడు కయిఁగూర్చి 'స్వామీ ! ఈ మహిమ మీప్రసాదంబునకు ఫలముగాని తపస్సునకుఁ గాదు. అయిననట్లనరాదు, తపస్సే నాకు మహోపకార మొనర్చెను. ఎట్లందువా !

''చ॥ వెదకుదురెల్లవారలు భువిన్ నిను భూతపతిన్ శరణ్యునిన్,
వెదకుచు నన్ను దుర్వ్రతులు నీవరుదెంచితి నూఱులామడల్
ఇదియె తపఃప్రభావము మహిష్ఠము ; గాక యయోధ్యనుండియున్
బదమిడుదేల వెండియును భానుకులాగ్రణి ! దండకాటవిన్ !''

కావున దేవా ! సత్కర్మము శుభంబుల నీయకమాన' దనెను.

రాముఁడామాట విని 'ఏమి ! ఇది దండకారణ్యమా !' యని సాశ్చర్యముగాఁ గలయఁ దిలకించి 'అవిగో పలాశనీరంధ్రమై చీఁకట్లు గ్రక్కుచున్న యా ప్రదేశంబులును దురాలోకరూక్షములైన యావిశంకట

స్థలంబులును నీటి రవడులుచేత దిక్కులం మాఱుమ్రోయించుచున్న యీ సెలయేళ్ళును, దీర్ఘములతో నాశ్రమంబులతో గిరులతో నదులతోఁ గూడిన యీగర్భకాంతారంబులును దొల్లి నాకుఁ జిరపరిచితంబులుగాఁ దోఁచుచున్నవి సుమా' యని పలికెను. శంబూకుఁ డామాటనందుకొని 'దేవా! ఖరదూషణాదిరాక్షసులను బదునాల్గువేలను దేవరవారు హరించిన చోటిదిగో. ఈజనస్థానము రాక్షసశూన్యమగు కారణంబున మముబోటిభీరు జనులకుగూడఁ నిర్భయసంచారము కలిగెను. దేవా! ఈజనస్థానపర్యంత దీర్ఘారణ్యంబులందలి వినోదంబులు దేవరవారి కటాక్షవీక్షణంబునకుఁ బాత్రమై యున్నవి. కొన్నిచోట్లు నిష్కూజస్తిమితంబులై భయాశ్చర్యంబులను బుట్టించును ; కొన్నితావులు ప్రోచ్చండ సత్త్వధ్వని భీషణములై వెఱగందఁజేయును ; కొన్నియెడలు గాఢనిద్రాగత దీర్ఘాయత సర్పశ్వాసవిషాగ్ని సందీప్తములై నయనంబులకు మిఱుమిట్లు గొల్పును ; లోపల నెందో మినుకు మినుకులాడుచున్న నీటిపడియలతోడి లోయలను జూడక తీఱదు ; దప్పిచేత బెండువాఱి యెండు మార్గముఁ గానక మైమఱచి నిద్రించుచున్న కొండశిలలచెమ్మటలఁ ద్రాగుచున్న తొండలతో నిండియున్న ప్రదేశములు కొన్నిగలవు. ఇట్లు నిర్మానుషత్వ నిర్జలత్వ భయానకత్వములైన యీప్రదేశంబులను క్షణవినోదముగాఁ జూడనగు' ననెను.

రాముఁ డాయాచోట్లను జూచి "ఈతావులను జూచినంతనే మాయాకురంగవంచనమును సీతాపహరణము మున్నగు నాటివృత్తాంతములెల్ల దర్శనానుభవములు రెండు నొక్కసారిగా నాకు మరల నగుచున్నవి. ఆరామ ప్రియయైన నాప్రియను వైదేహిని గూడి యీకాంతారములెల్ల నేననుభవించినవే గదా. ఇంతకన్న నాకు భయాకారణమేమి గలదు" అని కన్నీరునించి,

"కం॥ తేనియతావి గుబుల్కొను
కానల నీతోడనుండుఁ గాపురమును చే
గాను విహరించె జానకి
హా! నెయ్యంబిట్టిదార యబలకు నాపై॥""

కటా ! అట్టి యవాఙ్మానస గోచరప్రణయముగల దానినిగూడ నేను ప్రమాణీకరింపనైతిని. నాతోడ నున్నంతనే యాచెలికి వనవాసదుఃఖానుభవ మెట్లు తీఱునందురా ! ఏది యెవనికిఁ బ్రియజనమగునో యది వానికెంతో వింతద్రవ్యమగును. అది స్వయముగా నేమియుఁజేయకున్నను దత్సాన్నిధ్యమాత్రముననే మనస్సంతాపములెల్లఁ దీఱుచుండును. ఇది లోకసహజమే గదా' అని తలపోయసాగెను.

శంబూకుఁడు మరల రామునిఁ బల్కరించి 'దేవా ! నిర్జలత్వాదులను జేసి దురాసదములైన యీదక్షిణారణ్యములనుఁ జూచు క్లేశము చాలును. మదకల మయూరకంఠకోమలకాంతిని నిరసించి వెలుంగుచున్న పర్వతములతో నిండి, యెడతెంపులేమి నల్లనినీడలఁ గ్రమ్ముచున్న లేఁతవృక్షంబుల గుబురులచే నలంకృతములై బెదరొందని వెక్కుతెగల జింకకదుపులచే శోభించుచుఁ బ్రశాంతగంభీరములై యున్న యీజనస్థాన మధ్యమారణ్యముల నిఁక సందర్శింపనగును. ఇందు సమద శకుంత క్రాంత వానీరపుష్ప సురభి శీత స్వచ్ఛ తోయంబులతో నిండి ఫలభరపరిణామశ్యామజంబూని కుంజంబులవలని యడ్డంకులకు రొదచేయుచున్న నదులెన్నో యున్నవి. మఱియు నిందలి గుహాంతరములనున్న గోదమయెలుఁగుల యంబూకృతములు ప్రతిస్రోతలవలనఁ బెంపుచెంది వినోదముఁ గూర్చుచుండును. మఱియు నేనుఁగుగున్నలు చీల్చుటంజేసి చెదరి యిందుగుగ్రంధులొడ్చునట్టి గంధంబులు శిశిరకటుకషాయములై యిచ్చట నెంతో మనోహరముగానుండు' ననెను.

రాముఁడు కన్నీరు నడఁచికొని 'అయ్యో ! వైదేహీ విరహకాతురుఁడనైన నాకుఁ బరిచితప్రదేశ పరిభ్రమణంబున శోకముద్దీపితమై వెలువడక మానదు. ఇది యన్యు లెఱుంగనేల !' యని లోలోనఁ దలపోసి, 'శంబూకా ! నీదారులు శుభములగుఁగాక ! దేవయానంబునఁ బుణ్యలోకంబునకు బొమ్మ'నెను. శంబూకుఁడు రాముని తలంపు గ్రహించి 'స్వామీ ! పురాతనబ్రహ్మవాదినియైన యగస్త్యమహర్షికి మ్రొక్కి శాశ్వతపదంబునకుఁ బోయెదను, పూజ్యపూజావ్యతిక్రమము శ్రేయస్సులకుఁ బ్రతిబంధకము లగుఁ గదా' యని పలికి వానిని వీడ్కొనెను.

వ్రణముమాడ్కి క్రొత్తవెతలఁ గూర్చి నన్నింతయు వివశునొనర్చుచున్నది. ఏమి సేయుదు ? ఏమైననగుఁ గాక ; పూర్వమిత్రములైన యీ భూప్రదేశంబులను జూడక పోరాదు' అని కృతనిశ్చయుఁడై కొంతవడి నందందు సంచరించి 'అహో ! ఎచ్చట తొల్లి నీరుపాఱుదలయుండెనో యచ్చట లంక లేర్పడెను ; వృక్షవిరళంబులుగానున్న తావులు తరుసాంద్రంబులుగాను దరుసాంద్రంబులుగానున్న యెడలు వృక్షవిరళంబులుగాను నై పరివర్తనయోగ ప్రభావంబును జాటుచున్నవి. వనమెల్ల నాఁటిదిగాక నూత్నముగాఁ దోఁచుచున్నవి. అచలములనుబట్టి దీనిని గుర్తింప నయ్యెఁగాని యొంటగుర్తింప రాదు. అహో ! భూమి సన్నివేశము నిలుకడలేనిది సుమా!' అని యొండు రెండడుగులు పెట్టి 'కటా ! ఇంనుండి పోవ నెంతయత్నించినను బంచవటీస్నేహము నాకాలిని గదలనీయకున్నది. స్నేహబలమెంతనవచ్చు ? అయ్యో! ప్రియతోడ నాకిచ్చట స్వగృహమువలె దినములు గడచుచుండెను ; ఇక్కడి కతలకు మాకుఁ బ్రొద్దు చాలకుండెను ; ప్రియురాలి సహచర్యమే నాఁటి నాసుఖసంతోషాదులకెల్ల మూలమై యుండెను. అట్టి ప్రియతమను బుద్ధిపూర్వకముగా వర్జించి సహచరీవిరహవిధురుఁడై యున్న యీకృతఘ్నుఁడు రాముఁడీపంచవటిని మరలఁ జూచుటెట్లో చూడకయే పోవుటెట్లో తోఁపదు. దీనిని సందర్శింతు నేని నాటిసంగతులు తలనూపి నన్ను దురంతర దుఃఖ సముద్రమునఁ ద్రోయక మానవు. అట్లని మరలుదు నేని నాకువాఁడు సంతోషంబునుగూర్చిన వాని నెల్ల ననాదరించిన కృతఘ్నుఁడ నగుదు' నని డోలాయమాన మానసుఁడై ముందుచనక మరలక యట్లే నిలిచెను.

రాముఁడు శంబూకవధార్థము వచ్చుటు పంచవటిని మరలఁ జూచుటు వాల్మీకిమహర్షి యోగదృష్టివలన నెఱిఁగి 'రాముఁడు రాజధాని యందున్నప్పుడు లోకాభ్యుదయవ్యాపారములఁ దగిలి యుండెను. ఆకారణంబున గలుగునట్టి చిత్తవ్యాసంగములు సీతావియోగక్లేశంబునకు నంతగా నెడ మాయవు. అతఁ డిప్పుఁడట్టి వ్యాసంగములులేక శోకమాత్రద్వితీయుఁడై పంచవటిని బ్రవేశించును. అట్టి ప్రవేశము వానికి మహానర్థకారియగును. అతఁ డెంతధీరుఁడైనను వాని యంతశ్శోక మిట్టియవస్థయందు సంక్షోభించి విస్తరిల్లకమానదు. ఆకారణంబున నకుగడుగునను మహాప్రమాద కారణములు

వానికిఁ గలుగు' నని తలపోసి వానికి రానున్న యాపదల నివారణమును మున్నుగా సంకల్పించి సీతాప్రియసఖియైన వాసంతిని రప్పించి యామెకు సంగతియెల్ల వివరించి 'అమ్మా! నీవు సీతవెంటనుండి యీ కార్యమును జేయవలయు' నని వచించి, వైదేహియొద్దకుఁజని 'అమ్మా! చిరంజీవులకుఁ గుశలవులకుఁ బండ్రెండవయేటి సంఖ్యాకమంగళగ్రంధి సలుపవలయును. అందులకుముందుగా నీవు నీపురాణశ్వశురుని రాజర్షి జనకుని సూర్యభగవానుని స్వయముగా నీచేతితోఁ గోసినపూవులతోఁ బూజింపుము. మాప్రభావంబున వనదేవతలకుఁగూడ నీవు కనఁబడవనఁగా మనుష్యులసంగతి వేఱచెప్పవలయునా? నీప్రియసఖి వాసంతి నీకుఁ దోడుగా నుండు' నని చెప్పి చనెను.

సీతాదేవి యమ్మునివచనంబులఁ దలదాల్చి పుష్పాపచయార్థము వనమునకు దరలెను. పాలి క్రుస్సినచెక్కుదోయితో విలోలకబరీభరముతో నున్న యాదేవి మూర్తీభవించిన కరుణరసమో తనువుదాల్చిన విరహవ్యధయో యన నుండఁ జూచి వాసంతి కడుంగడు ఖిన్నయై 'కటా! తొడిమనుండి గిల్లివైచిన కెంజిగురాకుఁ బోలు నీమెశరీరంబును నిసర్గసుకుమారమైనదానిని రామాంకవిక్షేపరూపదారుణదీర్ఘశోకము హృదయకుసుమశోషియైనది మొగలిరేకును శరత్కాలఘర్మమట్లు శుష్కింపఁజేయుచున్న' దని పరితాపపడుచు నామెవెంటఁ జనెను. వారట్లు పోయి వనముఁ జొచ్చి పూవులు గోయసాగిరి.

అంతలోన 'విమానరాజా! ఇటనే యుండుము' మను వాక్యము చెవిఁబడెను. సీతాదేవి యాధ్వనిని విని భయసంభ్రమోల్లాసంబులంది 'సఖీ! జలభరితమేఘగర్జనవలె గంభీరమాంసలమైన యీ భారతీనిర్ఘోషమెక్కడది? కర్ణవివరంబులను నించుచు మందభాగినికి నాకుఁగూడ దోడ్తోడ నూఱటఁ గలిగించుచున్న' దన వాసంతి యామెను జూచి 'అమ్మా! ఈధ్వని యెందుండి వచ్చెనో తెలియదు; అవ్యక్తముగా నున్నది. నీవు విపత్సముద్రములో మునిఁగి యుండియు మేఘగర్జనంబునకు మయూరివోలె నిట్టిధ్వనికిఁ జకితోత్కంఠితవగుచున్నావు. ఇదేమో వింతగానున్న' దనెను. నావుడు 'సఖీ! అవ్యక్తమనవలదు. స్వరసంయోగముచేత నానవాలుపట్టితిని, ఆర్యపుత్త్రుఁడే పలుకుచున్నా' డని సీతాదేవి సమాధానము చెప్పెను. వాసంతి యా

మాట విని 'చెలీ! మఱచితి; శూద్రుఁడొకఁడు తపంబాచరించుట తెలిసి వానిని శిక్షించుటకై యైక్ష్వాకుఁడు రాజు జనస్థానమునకు వచ్చినాఁడని వింటి' ననెను. సీతాదేవి సుంత ప్రసన్నహృదయయై 'ఆరాజు రాజధర్మమందుఁ గొఱవడనివాఁడు సుమా! అందువలననే వానికి నాతోడ గృహస్థధర్మము పోయినను రాజధర్మము మాత్రము వదల' దనెను. అంతలోన మరల,

"ఉ॥ ఎచ్చటనాకుఁ బక్షిమృగవృక్షము లొక్కటఁ జుట్టలయ్యెనో,
ఎచ్చట సీతఁగూడి చిర మింపొదవన్ సుఖవాసముంటినో,
యచ్చటి నిర్ఝరుల్ గుహలు నాదటఁ బూర్వపు నెయ్యమొప్పగా
హెచ్చినకూర్మి రమ్మనియదే ననుఁ బిల్చెడుమాడ్కిఁ దోఁచెడిన్॥"

అను వాక్యము వినవచ్చెను. సీతాదేవి యావంక దృష్టి పారించి 'హా! ఈయనశరీరము ప్రభాతచంద్రమండలమువలె వెల్లనై కృశించి దుర్బలమై గుర్తింప కావన్నది. గంభీరానుభావమాత్రముచేత వీనినిగుర్తింపనగును. ఆర్యపుత్త్రుఁడేయని వాసంతిని గౌఁగలించుకొని మూర్ఛిల్లెను. వాసంతి మామెను దేర్చి యోదార్ప సాగెను.

రాముఁడు పంచవటిని సంబోధించి 'కటా! అంతర్లీనమైన నాదుఃఖాగ్ని నీ దర్శనముచేత నుద్దీపితమై విశృంఖలముగా మండసాగెను. ఈ యగ్నిమంటలకుఁ బూర్వముపొడము పొగయో యన నిదే మూర్ఛ నన్నుఁ బైకొనుచున్నది. హా! ప్రియా! జానకీ! దండకారణ్యవాసప్రియసఖీ! హా! విదేహరాజపుత్త్రీ! అనురక్తవును బరిశుద్ధవునైన నిన్ను నిష్కారణముగా వదలిన ఫలమయ్యె' నని మూర్ఛనొందెను. సీతాదేవి మూర్ఛాగతుని దనపతిని గాంచి 'అయ్యో! అయ్యో! ఈమందభాగ్యను బేర్కొని యార్యపుత్త్రుఁడు నీలోత్పలములఁబోని తనకందోయిని మూసి నిరుత్సాహనిస్సహాఁడై వట్టినేలఁ జాపకట్టగాఁబడెను. చెలీ! చెలీ! కావుము, కావుము; ఆర్యపుత్త్రుని బ్రతికింపు' మని వాసంతిపాదముల వ్రాలెను. ఆమె సీతాదేవిని జేతులఁగూర్చి లేవనెత్తి 'కళ్యాణీ! రాముఁడు నీకేగాదు. సర్వజగత్తునకుఁగూడ పతియగును. వీని సంజీవనము నీకువలె లోకములకుఁ గూడఁ బ్రాణదానమగును. వీనిబ్రతుకు నీచేతిలోనున్నది. ఎట్లందువా? నీపాణి

సంస్పర్శయే వీనికి సంజీవనము. ఇతరోపాయముల నంతగా నమ్మరా' దనెను. సీతాదేవి యాసలహాను విని 'చెలీ! వివాసితనైన నాతాఁకునకు నార్యపుత్త్రుఁ డలుగునోయని జంకగుచున్నది. ఏమైననగుఁ గాక. నీమాట సేయుదును. ఆపదలందిట్లు మీనమేషము లెంచరా' దని పలికి పోయి రాముని తనహస్తముచేత హృదయలలాటాదిప్రదేశములందు నివిరెను. ఆ తాఁకుడుచేత రాముఁడు మూర్ఛ తేటి యాహ్లాదముతో నుచ్ఛ్వసిల్లుచు లేచెను. సీతాదేవి యట్లులేచిన రాముని జూచి త్రైలోక్యనాథునకు మరల జీవితము వచ్చె' నని లోలోన సంతసించెను.

రాముఁ డాస్పర్శసుఖంబును దలఁచుచు 'అకస్మాత్తుగా నాకిట్టి యుజ్జీవనముఁ గలిగించినదేదో యూహింపరాకున్నది. హరిచందనకిసలయంబులను దెచ్చి తద్రసంబును దీసి నాశరీరంబునకు రాసిరో, చంద్రకిరణాంకురంబులను బిండి యారసంబున నన్నుఁదడిపిరో, నిరంతరదుఃఖాగ్ని నెరియుచున్న నాజీవితవృక్షంబునకుఁ బరితర్పణంబుగా సంజీవనౌషధిరసంబును సంతరించి హృదయంబున నలఁదిరో తెలియరాదు. ఈ స్పర్శము నిక్కముగా నాకుఁ బూర్వానుభూతమే గాని క్రొత్తది గాదు. ఈతాఁకు నొకప్రక్క జీవనంబు నొకప్రక్క మోహకంబును రెంటిని నొక్కసారిగా గలిగించుచున్నది. అహో! ఈ తాకు విరహవ్యథాజనితమైన నామూర్ఛను దొలగించి యందుకు మాఱుగా నానందజడత్వమును గూర్చెను. సంజీవనౌషధిరసాదులకు నీపాటిశక్తి గలుగదు. అవి విరహజ్వరాతురులయెడ నుపయోగింపవు. ఇది యేదో విలక్షణమై యూహింపరాకున్నది' అని పలికి యేమో యాలోచింపసాగెను. సీతాదేవి భయదైన్యంబులకుఁ జిక్కి సుంత యోసరిలి 'దర్శనమైనను గలుగదని నిరాశచెందిన నాకు స్పర్శభాగ్యము చేకూఱెను. ఇదే నాకు బహుతరముసుమా' యని తలంచెను.

రాముఁడు లేచి కూర్చుండి 'సీతాదేవి తనతాఁకుడుగాక యొండుగతి నాకుఁ గలుగదని యెంచి వాపయి వాత్సల్యముచే నన్ను నిశ్చయముగా ననుగ్రహించెను గావలయు; కానీ పరికించెద' నని నలువలనులు చూడఁ జొచ్చెను. సీతాదేవి భయవిహ్వలయై 'అయ్యో! అయ్యో! ఆర్యపుత్త్రుఁడు నన్ను వెదకునాయేమి? ఏమిచేయుదు? వాసంతీ! ఆవలి కేగుదము.

నన్నుఁ గనుక చూచెనా అంగీకృతముగాని నాసన్నిధానమునకై మహారాజు మిక్కిలి కోపించును. దయితుఁడు గదా యని యందువుగాఁబోలు. దయితుఁడైనను మహారాజు దండధారిత్వముచేత ననతిలంఘ్య శాసనుఁడుగదా. ఇంత జనాపవాదమున్నను నాచారిత్రము వానికి స్పష్టము గావున నాపయి నింతవఱకు వానికిఁ గోపము గలుగదు. ఇంతతో నుండునేని కాలాంతరమున నైనను నాకు సమాగమప్రసక్తికి నవకాశముండును. ఇప్పుడు వానికంటబడుదునేని వానియాజ్ఞ నతిక్రమించిన దాననగుదును; వానికిఁగోపము తప్పక వచ్చును. ఆవల నాకట్టి ప్రత్యాశకు నవకాశముండ' దని మెల్లగా నడువఁగా వాసంతి యామె భయమును గ్రహించి 'చెలీ! మహర్షిప్రభావంబునఁ జేసి వనదేవతలకు నయితము నీవు కనఁబడవు. వట్టి శంకలకుఁ జిక్కి దొట్రుపాటు చెంద' వలదని ధైర్యము పలికెను.

రాముఁడట్లు నల్దెసలు చూచి 'ప్రాణేశ్వరీ! జానకీ! రమ్ము, నన్ను సంభావింపవా?' అని నోరారఁ బిలిచెను. సీతాదేవి శోకగద్గదయై 'ఆర్యపుత్రా! ఈపలు కీవృత్తాంతమునకు సరిపడదుగదా. నేను నీకుఁ బ్రియనగుట నిజమేని నాయెడ నిట్టిదారుణ మాచరుదువా?' అని కన్నీరు నించి 'కటా! నా హృదయము వజ్రమయమనుటకు వేఱు నిదర్శనమేల? జన్మాంతరమందయినను గలుగునని తలంపరాని దుర్లభదర్శనము నాకొసంగెను; ఈమందభాగ్యపయిఁ గల తనవాత్సల్య మాపలుకులే చాటుచున్నవి. ఇట్టి వానిఁ గూర్చి యిట్లాడునది వజ్రహృదయ గాక మఱేమగును? త్యజింపఁబడినట్టి నాకిది యుచితమే యందురా? నే నీయనహృదయము నెఱుంగుదును; ఈయన నాహృదయము నెఱుంగును. మామనంబులు పరస్పరానురాగబద్ధములై యున్నవి. దంపతులకుఁ బరస్పరానురాగమే గదా జీవితనిబంధనము. అందు వలననే యిందాక జీవింపనోచితిమి. ఇట్లుండియు నా హృదయమందు దయారసమెల్ల నిత్తఱి నింకిపోయెనో' యని లోలోనఁ బరితపించి 'చెలీ! వాసంతీ! అట్లు నిష్కారణముగాఁ బరిత్యజించియు నీయుఃఖవిధముగాఁ గనబడినంతనే నాహృదయ మేదళనొందెనో యెఱుంగకే యున్నా' నని నిట్టూర్చెను. వాసంతి సీతను గరమునబట్టి 'సఖీ! అంత మందమతినిగా నన్ను భావించితివా? ఇంతలోననే సమాగమమగునని తెలియమింజేసి నీహృదయము పైకి నుదాసీనము వహించి యుండుట 'ఈభ్రాంతి

నిర్ఘోష మెక్కడిది ?' అని నీవన్నప్పుడే గ్రహించితిని. ఆకారణపరిత్యాగ
రూపమైన విప్రియ మొనర్చుటవలన లోలోనఁ బెంగుచున్న నీరోషము ఆ
రాజు రాజధర్మంబునఁ గొఱపడఁడు' అనుటవలనఁ దెలిసెను. చిరతర
విరహాగ్నికి స్రుగ్గుచుండిన నీమనంబు తటాలున సంఘటిల్లిన ప్రియసమాలోక
నాదులవలన నుత్తంభితమై పూర్వకాలంవ్యాపెడసి ప్రణయకోపోన్ముఖమగుట
'ఆర్యపుత్త్రుఁడే' అని నీవు మూర్ఛిల్లుటవలన వెల్లడియయ్యెను. దయితుని
విరహఖేదవ్యంజకములైన ప్రలాప మూర్ఛాద్యనుభావంబులు నీప్రణయం
బును గాఢకరుణంబుగా మార్చుట 'ఆర్యపుత్త్రుని బ్రదికింపు' మని నీవన్న
మాట విశదపఱచెను. నీ మనంబు దయితవిషయిక స్థాయి రతిరూప భావము
బునఁజేసి నీప్రేమ కరఁగి లీనమగుట 'నేనీయన హృదయంబు నెఱుంగుదు'
ననుట వలన స్పష్టమయ్యెను. ఇట్లు తాటస్థ్యముగానుండి లోలోనఁ గలఁ
పించుచుఁ దటాలున నుత్తంభనమొంది యెట్టకేలకుఁ గరణమునకుఁ జిక్కి
నీవు పరితపించుచున్నావు. నా యూహ సరియేనా ?' అనెను. సీతాదేవి
తలవ్రాల్చి మిన్నకుండెను.

వాసంతి యంతట రాముని యెదుటఁబడి 'దేవా ! జయ' మనెను.
రాముఁ డామెను నిరూపించి 'అహో ! దేవికిఁ బ్రియసఖి వాసంతియా ?'
ఎందుండి వచ్చితి' వనెను. 'దేవరవారు పంచవటికి వచ్చుట విని గోదావరి
నుండి జటాయు శిఖరమునకు దక్షిణమున సీతాతీర్థము మీఁదుగా నిందు
వచ్చితి' నని యామె బదులు చెప్పెను. రాముఁడామాటలువిని 'అయ్యో!
ఈకథోద్ఘాతములు గుండియలను వ్రీల్చు'నని నిట్టూర్చెను. వాసంతి యంత
తో నూఱకుండక 'దేవరవారింత దవ్వువచ్చియుఁ బూర్వపరిచితస్థలంబులను
జూడకయే పోవుదరా' యని యడుగఁగా 'సఖీ ! వాసంతి ! చూచుటెట్లో
చూడకపోవుటెట్లో నిశ్చయింపఁజాలకుంటిని. నాతలఁపు చిక్కి నీవు
వచ్చుటవలనఁ దీఱెను. నీకోరినట్లే చేసెద' ననెను. రాముఁడు ముందు
వాని వెనుక వాసంతి సీతయుఁ దరలిరి.

వారట్లు తరలి గోదావరీనదిని డాసిరి. రాముఁడానదీమతల్లికి నమ
స్కరించెను. అత్తఱిఁ దన్నదీనిగమములనుండి గున్నయేనుఁగు పెంటితోడ
వెలువడి వారికెదురయ్యెను. వాసంతి యాకలభమును జూపి 'దేవా ! దేవి

పుత్త్రకుఁడు వధూద్వితీయుఁడై వచ్చుచున్నాఁడు. ఇతని గుర్తింతురా?' యని పలికెను. రాముఁ డాకరటిని గాంచి సీతను దలంచి 'దేవీ! నీపుణ్యము దొడ్డది. ఏకలభ మప్పుడప్పుడే మొలచుచున్న బిసకిసలయములఁబోని దంతాంకురంబులతో నీకర్ణావతంసలవలీపల్లవంబులను మేసెనో, యా నీ గారాపుఁ గొమరుఁడు తరుణుఁడై దాంపత్యకళ్యాణ మొందెనుగదా' యని వచించెను. రాముఁడామాటనందుకొని 'వాసంతీ! పుత్త్రకుఁడు కాంతాను వర్తనచాతుర్యమును నేర్చినాఁడు. ఎట్లందువా? లేఁదామరతూండ్లను శీలార్థమోయన విరిసి ప్రియురాలినోటఁ బెట్టుచుఁ దుండాగ్రంబునఁ గమల గంధబంధురతోయంబులెత్తి త్రావనిచ్చుచుఁ దుంపురులను జల్లగాఁ దైనఁ జల్లుచున్నాఁడు. ఇదియొకవిశేషముగాదు. యౌవనమిట్టి సేతల నెల్లప్రాణులచేతఁ జేయించును. పనాళముగాఁ బద్మపత్త్రమును గైకొని దానిఁ బ్రియురాలికి గొడుగుగాఁ బట్టుచున్న యీవిదగ్ధలీలావిడంబనము విశేషము సుమీ' యనెను.

సీతాదేవి వాసంతినిజేరి 'చెలీ! ఈగజపుత్త్రకుని గాంచినంతనే నా పుత్త్రకులు తలంపునకు వచ్చుచున్నారు. ఈషద్వికళంబులును గోమలంబులు నైన దంతములచేతఁ దనరారుచెక్కిళ్ళతోను ముగ్ధకాకలీవిహసితానుబద్ధముతోను గాకపక్షములతోను సొబగారుచున్న నాకన్నసుతుల నిర్మలముఖ పుండరీక యుగలంబు నార్యపుత్త్రుఁడు మూర్ధఘ్రాణనఁగాఁజూచుకల్మి నాకుఁ గలుగదయ్యెనే? కటా! నేను కనియేమి? అని కన్నీరు నించెను. వాసంతి యామెను సందిటఁగూర్చి 'అమ్మా! దైవానుగ్రహమున నీకోర్కి తీరెడుఁ గాక' యని యోదార్చెను. సీతాదేవి యంతతోఁ దన మనస్తాపంబును దాచుకొనక 'అమ్మా! పుత్త్రస్మరణచేత స్తనములుచేఁపి వారి తండ్రి సన్నిధానంబున నేను క్షణముసేపు సంసారిణి నైతి' ననెను. వాసంతి చిఱునవ్వుదాల్చి 'సఖీ! ఇందులకేమందుము. కానుపుగదా స్నేహప్రకర్షమునకుఁ బరమావధి. ఇది తల్లిదండ్రులకు సత్కృష్టమైన పరస్పరసంశ్లేషణము; ప్రణయపరిణామహేతువులన్నిటిలో నిది ముఖ్యమైనది; దంపతులయంతఃకరణస్నేహరసము పుంజీకృతమై యానందగ్రంథిగాఁ బరిణమించును; ఆ గ్రంథినే యపత్యమంతు' రని వచించి యామె సంతాపోత్కటమున గొంత శాంతపఱచి రాముని జేరబోయి 'అదిగో మదోద్ధతనృత్యముఁ జాలించి కదం

బాగ్రమెక్కి వర్షోదంబున మొలచి సొబగులారుచున్న చంచలపింఛము విచ్చి శిఖండక మనుమణిమకుటమును దాల్చి వధూసఖుఁడై కూయుచున్న యా నెమలిని జూతువా?' యని వానితోఁ బలికెను.

రాముఁడా నెమలి వంక దృష్టిసారించి 'సఖీ! చూచుచున్నాను. స్వతారకామండలీకరణసంకేతముచేత భ్రమణములను జూపుచు లయానుగుణచరణన్యాసశిక్షాగ్ధము భ్రూనటనంబు చతురత మీఱఁ బ్రచలించుటయే భూషణంబుగాఁ గరకిసలయతాళము వైచి యేముగ్ధ నృత్యము నేర్పుచుండెనో యట్టి నిన్ను నాకన్నపుత్త్రునివలె నిందుమనంబున స్మరింతు' నని పలికి పూచిపూవని యీకదంబమును దేవి పెంచెను. ఈ మయూరము దీని నే స్వజనముగాఁ దలఁచి ప్రమోదమందుచున్నది. దేవీస్మరణము లేనిచోఁ దత్పోషితమైన యీవృక్షమేల ప్రియమగును? అహో! తిర్యగ్జంతువులు గూడ పరిచయము ననుసరించును గదా' యనెను. వాసంతి యంతట రాముని సంబోధించి 'ఇదిగో యీకదళీవనము మధ్య శిలాతలము; ఇది దేవితోడి నీ శయనభాగ్యము ననుభవించెను. ఇందుండి దేవి హరిణకములకుఁ దృణ మొసంగుచుండెను. ఆకారణమున నవి యీచోటు వాయవు. దీనిపయి నుంత కూర్చుండుదువుగాక' యనెను.

ఆరాతిన్నెను దలంచినంతనే రామునిదుఃఖము వెల్లివిరిసెను. అతఁడు నిట్టూర్చి 'దీనిని నేను చూడనోప' నని యొంటిపడ నేడ్చుచు గూర్చుండెను. సీతాదేవి హృదయేశునియవస్థఁ జూచి 'సఖి! వాసంతి! ఆర్యపుత్త్రునకును నాకును నీవీప్రదేశమునఁ జూపి మానసంబులందు నిప్పుఁ జొనిపితివి గదా. కటా! అతఁడే యార్యపుత్త్రుఁడు; అదే పంచవటీవనము; నీవే యాప్రియసఖివి వాసంతివి; అవే నానావిస్రంభసాక్షులైన గోదావరీకాననోద్దేశములు; జాతినిర్విశేషములైన మృగపక్షిపాదపములు నవే. ఇవియెల్ల మందభాగ్యకు నాకు మతి యగపడుచునే యున్నను ఇవియెల్ల లేనట్లే యయ్యెను. ఏవి తొల్లి యానందదాయకములయ్యెనో యవే యిప్పుడిట్లు దుఃఖకరములగుటఁ జూడఁగా నిదియెల్ల వస్తుధర్మముగాదనియు దశావిశేషనియమితమనియు స్పష్టమయ్యెను. జీవలోకమునకు దశాపరిణామమిట్టిదిగా నున్న' దని వ్యథితాంతరంగయయ్యెను.

వాసంతి యామెకు నూఱటఁబల్కి 'సఖీ! సీతా! నీలోత్పలపత్త్ర లావణ్యమును మెచ్చని యంగములసౌరు పసమీఱుచుండఁగా నిరంతరము నీ చెంత మెలఁగుచున్నను నీ కెవఁడెప్పుడును గ్రొత్తవాఁడేయై నీనయనంబులకు నుత్సవము చేయుచుండునో యారాముఁ డిప్పుడు వెల్లవాఱి వికలాంగకుఁడును మహాదుర్బలుఁడునై యతఁడే యీతఁడని గుర్తింపరాకున్నను నేత్రపర్వము గానున్నాఁడు. వానిని జూడవా యేమి'యనెను. సీతాదేవి యామాటతోడఁ గన్నీరు జొటజొటఁగార్చి 'హా! దైవమా! నేను లేక యాయనయు ఆయన లేక నేనును అని యెవరును దలంపరుగదా. అట్టి మాకు విధిఘటన మిట్లయ్యెను. ఈయనదర్శనము ముహూర్తమాత్రమైనను జన్మాంతరము నందుఁబోలె సంప్రాప్తమయ్యెను. తనివిదీఱఁ జూతమన్న బాష్పంబు లడ్డగించుచున్నవి. అయినను వత్సలుని నాకన్నీటిబిందువులు రాలునప్పు డెప్పుడెప్పుడు సందుగలుగునో యప్పుడెల్లఁ జూచుచున్నా' ననెను. వాసంతి యాపలుకులు విని 'అహో! జీవితేశ్వరుఁడు నిష్కారణముగా నిరాకరించెనను తాపము లోలోన రగులుచున్నను వానియం దీమె యెంతయుఁ బ్రగుణాంతఃకరణయై యున్నది. ఇంతసరళహృదయకు నిట్టిదశావిపర్యాస మయ్యెఁగదా' యని పరితపించి సీతను సంజిటఁగూర్చి 'వత్సా! ఆనంద శోకాశ్రువులను వర్షించుచున్నదియు వెల్లనై చూడఁజూడ నందమగుచున్న దనియు నైన నీదృష్టి దయితుని గాంచు వెందమిచేత విచ్చి యుప్పవాల్పు గానక యంతర్గతప్రణయరసంబును దుగ్ధకుల్యవలె నీజీవితేశ్వరుని జలక మార్చుఁగాక' యని యోదార్చి పలికి రామునిడాయఁబోయి 'తరువులారా! రామదేవుఁడు స్వయముగా మరల మనవనమునకు నరుదెంచెను గావున ఫలప్రసూనసహితంబుగాఁ దేనియ లర్ఘ్యమిత్తురుగాత; వనానిలములారా! వికసితకమలసౌరభప్రచురంబుగా వీతురుగాత; శకుంతములారా! మీ సంతోషంబులు వెల్లివిరియగా నెలుఁగెత్తి యవ్యక్తమధురగానంబులు పాడుదురుగాక' యనెను.

రాముఁడు తలయూచి 'సఖి! వాసంతి! ఇటఁ గూర్చుండు' మనెను. ఆమె యట్లుగావించి కన్నీరునించుచు 'మహారాజా! కుమారలక్ష్మణునకుఁ గుశలమా' యని యడిగెను. రాముని హృదయ మెందో యుండెను గావున నతని కామాట వినరాదయ్యెను. ఆయన యచ్చటి తరు శకుని కురంగములను

జూచుచుఁ 'కటా! ప్రియురాలు స్వయముగా జలనీవార తృణంబులు సంతరించి తెచ్చి కమలకోమలములైన తనహస్తములతో నొసఁగి పెంచిన మిమ్ముఁ గాంచినంతనే శిలాకాఠిన్యమును మెచ్చని నాహృదయము కరఁగి యనిర్వచనీయమైన వికారము నన్ను పైకొనుచున్న' దనెను. వాసంతి యంతతో నూఱకుండక 'మహారాజా! నామాట వినరాదా? కుమార లక్ష్మణునికిఁ గుశలమా?' యని మరల నడిగెను. రాముఁడావచనము విని 'అహో! మహారాజా యనుచున్నది. ఎంత ప్రేమలేని పిలుపిది, సౌమిత్రిని గూర్చిన యీమెవాక్యము సబాష్పగద్గదాక్షరముగానున్నది. దీనింబట్టి యీమెకు సీతవృత్తాంతము తెలిసియుండనోపు' అని యాత్మగతమునఁ దలపోసి 'అవును, కుశలము కుమారునికి' అని యేడువసాగెను. వాసంతి యది సందుచేసుకొని 'దేవా! ఏమందు? ఎంత క్రూరుఁడవైతివి?' 'నీవే నా జీవితమవు, నీవే నాద్వితీయహృదయంబవు, నీవే నా నేత్రకౌముదివి, నీవే నా యంగకంబులకు నమృతంబవు' అని యేబేలకు నూర్లార్లుగా నిచ్చకములు నమ్మపలికితివో యాముగ్ధకుఁ గఠోరగర్భభరాలసకు నెట్టకేల కేమి గావించితివి? తలంపునఁగూడఁ దగని యింతదారుణ మొనర్పఁగా నీమది యెట్లోర్చె' నని వచించి దుఃఖవిశేషంబున మూర్ఛిల్లెను.

రాముఁ డామెను సమాస్వసించి 'సఖీ! లోకమంగీకరింపనందున నింతయయ్యెను. లోకమంగీకరింపనందులకుఁ గారణమేమందువా? అది లోకమునకే యెఱుక; నాకు లవమాత్రముగూడ తెలయదు. నా ప్రియురాలు పరమసాధ్వియని తెలిసియు నొండుపాయము గానక పరిత్యాగ పాతకము నొడికట్టితి' నని దుఃఖగద్గదస్వరమునఁ బలికెను. నావుడు 'ఓయి కఠోరా! యశమొకటే నీకుఁ బ్రియముగదా? నీయీకార్యమువలన నీకు నిష్టసిద్ధియయ్యెనా? ఆపన్నసత్వయై పతియే దేవతగాఁ గొల్చుచున్న ప్రాణసమానురాలిని నిష్కారణముగా కట్టలకుఁదోలుటవలనఁ గలుగు నపకీర్తికన్న ఘోరతరమైనది గలదా? నీయీ సేఁత పామునకు వెఱచి పులినోట దూఱుటగాదా? శరారుమృగసంచారభయంకరమైన ఘోరాటవిలో దాని గతి యేమయ్యెనో నీవేమిగాఁ దలఁతువో చెప్పెదవా?' యని వాసంతి యెత్తిపొడిచినట్లు పలికెను. ఆహృదయ విదారణవచనంబులను రాముఁడు

విని 'సఖీ! ఏమో యనుకొనుటేల? భీతకురంగశాబచపలనేత్ర, కఠోర గర్భభరాలస, జ్యోత్స్నామయి, మృణాళముగ్ధగాత్రవల్లి, యబలారత్నము మాంసాశనజంతువులపాలయ్యె' నని బలికి, 'హా! ప్రేయసీ! జానకీ! ఎచటనున్నావు?' అని పిలిచి 'కట్టా! భయవేగము హృదయంబును వ్రీల్చునేగాని రెండుగాఁ జేయదు; మోహమన్ననో తనువును సొమ్మసిలఁ జేయునేగాని చైతన్యము నంటదు. అంతస్సంతాపమన్ననో దేహమునెల్ల గాల్చునేగాని బూడిదగాఁ జేయదు; దైవమన్ననో మర్మములను బ్రహరించునేగాని యాయువును గొనదు. ఈపాపి యిట్టిచిత్రవధకుఁ బాత్రమయ్యెను. అయ్యో! దుర్భాగధేయోచితమైన మరణమేనియు నాకు రాకున్నది. ఏమిసేయుదు?—పౌరజానపదులారా! దేవి నాయింట నుండుట మీకు సరిపడదాయెను. మీకుగా నాజీవితేశ్వరిని దృణమువలె శూన్యాటవిలోఁ ద్యజించి నాదుఃఖము నెదలోఁ బూడ్చి యుంటిని. ఇప్పుడిచ్చటి చిరపరిచిత భావములు నాహృదయమును గరంపసాగెను. రోదనమే శరణమగుచున్నది. ఇదియేని సహింపరా' యని వావిచ్చి యేడువఁ జొచ్చెను.

వాసంతి వానిదుఃఖము నోర్వలేక 'దేవా! కడచినదానికై శోకించి ఫలములేదు; తాల్మి వహింపు' మనెను. రాముఁడదివిని 'సఖీ! దేవి పాడు పెట్టిచన్నట్టి యీవసుధకుఁ బదురెండవయేడు ప్రాప్తమయ్యెను. సీత లేదనెడిమాట కలిగనేగాని రాముఁడు లేఁడనుమాట కలుగదయ్యెను. హృదయాంతరమున నడ్డముగా నాటిన యలాతశల్యమట్లు సవిషదంశమట్లు శోకశల్యము నాహృదయమర్మములను గోరాడుచున్నను నేను సహింపలేవా? నాయంతఃకరణము నించుకేని చలింపనీయక యిందాక స్తంభించుకొని యుంటిని. పూర్వానుభూతములైన యాయాప్రియవస్తువులను జూడఁగా నాకిప్పుడీయుప్పెన గలిగెను. క్షుభితేంద్రియముల విజృంభణము నడఁచుటకై నాయొనర్చు ప్రయత్నములెల్ల నాయంతస్థమై యిట్టిదని వచింపరాకయున్న చేతోవికారమువలనఁ ద్రోపాడఁబడుచు మహోద్దామవేగ ఝరీహతికి సైకతసేతువట్లగుచున్నవి' అని నిట్టూర్చెను. వాసంతి యంతతోఁ జాలింపక 'దేవా! సీత గోదావరికిఁజని యందలి హంసమిథునంబుల విహారి

విభ్రమంబులకుఁ దవిలి యాసైకతస్థలంబుల నుంత తాపసింపఁగా దన్మార్గ మును నిరీక్షించుచు నీవీలతాగృహమందుండుటయు, ఆపూఁబోఁడి తిరిగి వచ్చుచు నిన్ను దుర్మనాయితునిగాఁ జూచి భీతయై కమలముకుళంబును బోని ప్రణామాంజలి నీకుఁ గావించుటయు మఱచితివా ?' యనెను. రాముఁడామాటతోఁడ వెల్లనై 'చండీ ! జానకీ ! ఇటనటు నాయంతర్నయ నంబునకుఁ గనఁబడుచునే యున్నావు. నాపయిజాలిఁ గొనవేని ? దేవీ ! నీపునఃప్రాప్తి గలుగునని యాశచేఁ గట్టుబడి యిన్నాళ్ళు నిలిచియుండిన నాహృదయము నీసమాగమవిలంబముచేత ప్రీలుచున్నది ; అంగప్రత్యంగ బంధనములెల్ల సడలుచున్నవి ! విశ్వమెల్ల శూన్యముగాఁ దోఁచుచున్నది ; అవిరళజ్వాలలు లోనెల్ల దహించుచున్నవి ; నాయంతరాత్మయన్నదో విహ్వ లత్వమొంది పెంజీఁకటిలో మునిగినట్లయ్యెను. మోహము బాహ్యాభ్యంతర ములనెల్ల వ్యాపించెను ; ప్రతిక్రియదోఁపని మందభాగ్యుఁడనైతిని ; ఈ వైశసము దాటుటెట్లోగదే' యని మూర్ఛిల్లెను.

రాముని దురవస్థనుగాంచి సీతాదేవియు 'హా ! ఆర్యపుత్రా ! ఈ మందభాగ్యనుగూర్చి సకలజీవలోకమంగళాధారభూతునికి నీకు సారెసారెకుఁ బ్రాణసందేహదారుణమైన దశాపరిణామము గలుగుచున్నది. హా ! చెడితి' నని మూర్ఛ నొందెను. వాసంతి సీతాదేవిని మూర్ఛదేర్చి 'సఖీ ! జాగు వలదు; నీజీవితేశ్వరుని సంభావింపు' మనెను. వైదేహి వడివడిగా సమీ పించి తనహస్తతలముచేత రామునిహృదయ లలాటస్థలములు స్పృశించెను. రాముఁడు మెల్లగా స్పృహవడసి యానందనిమీలితాక్షుఁడై 'అహో ! నా యంతర్బహిశ్శరీరధాతువులనెల్ల సుధామయలేపములఁ జిక్కనలదిరో యనఁగా సంస్పర్శము తటాలున నాకుఁ బ్రాణములొసఁగి యానందమును గూర్చినట్లే కూర్చి వైచిత్ర్యమును గలిగించెను. సఖీ ! వర్థిల్లుము ; జానకి దొరకెను ; సంతోషము, సంతోషము ; అన్యులతాఁకుడువలన నిట్టిసుఖో దయము గలుగదు. నాసతి యెక్కడ నున్నదందువా ? ఇదే యెదుర నే యున్నది. నిమీలితాక్షుఁడను గావున నేను జూడలేకున్నాను ; నీవేల చూపుటలేదు ?' అని పలికెను.

నప్పుడు వాసంతి 'దేవా! ప్రియసఖీదుఃఖదగ్ధను నన్నిట్లేల మర్మచ్ఛేదదారుణములైన ప్రలాపములచేత మరల దహించెద' వనెను. సీతాదేవి పతిమాటలు విని 'నాసంతాపము దీర్ఘదారుణమై యున్నను దానిని క్షణములోఁ బోనడఁచుచున్నట్టిదియుఁ జిరసద్భావసౌమ్యశీతలమైనట్టిదియు నైన యార్యపుత్రుని స్పర్శచేత నాహస్తము వజ్రలేపనద్ధమువోలెఁ జెమర్చుచుఁ గీలెడలినట్లు తడఁబడుచు వశముతప్పి వడఁకుచున్నది. ఏమిసేయుదు' నని తలపోయసాగెను. రాముఁడు వాసంతినిఁ జూచి 'సఖీ! నావి ప్రలాపములుగావు; పూర్వము కల్యాణసమయమందుఁ గంకణధరమైన యే కరపల్లవంబును వహ్నిసాక్షికంబుగా గ్రహించుభాగ్యము నాకుఁ గల్గెనో, అమృతమువలె నాప్యాయకమగుచుండు నాహస్తముయొక్క సంస్పర్శము నన్నానందవార్ధి నోలార్చునో, పద్మోపలమునకన్న మధురమును లవలీకందలమునకన్నఁ గోమలమునైన దేని సంస్పర్శము నాకుఁ బూర్వపరిచితమో యా పాణిపల్లవము నాకిప్పుడు పేదకుఁ బెన్నిధివలె లభించెను. ఆనందనిమీలితాక్షుఁడను గావున నేను నాసఖినిఁ జూడఁజాలకున్నాను. స్పర్శసుఖమును బట్టి యిట్లు నిర్వచింతు' ననెను. సీతాదేవి యాపలుకు లాలకించి 'ఈ ప్రణయముచేత నాపరిత్యాగశల్యము నున్మూలితమయ్యెను. ఆర్యపుత్రునిస్పర్శచేత మోహితనైతిని. ప్రమాదము సంభవించె' నని వెఱఁగుపడసాగెను. రాముఁడు వాసంతిని సంబోధించి 'ఆనందనిమీలితేంద్రియుఁడను ఉత్కంఠాపరాధీనుఁడను గావున సతీకరమును బట్టుకొనలేకున్నాను. నీవు నీ ప్రియసఖి నించుక సేపు పట్టుకొను' మనెను. ఆమాటతోడ సీతాదేవి తన కరమును వడిగా లాగికొని యావలకుఁ జనెను. రాముఁడు దుఃఖితుఁడై 'అయ్యో! వడఁకును జెమటయుఁగల నాచేతినుండి యట్టిదశలందేయున్న నీ కరమును దటాలునఁ జాఱతీసికొని పోయితివా! హా దేవీ! ఇంతకటిక మేల!' యని వెచ్చనూర్చెను. సీతాదేవి యవ్వల నిలిచి రామునందు దృష్టినిలిపి 'అయ్యో! ఆర్యపుత్రు నినయనంబులు సహజస్థితికి రాక నిశ్చలంబులై విషయగ్రహణశక్తి లేకయున్నవి. అయిన యింతవఱకుఁ గుదుటపడదు' అని చింతించి 'నాథా! ఈదశలోనున్న నిన్నుఁ జూచుచుఁ బ్రాణములు ధరించియున్న యీసీత కఠినాత్మురాలు గాక యౌదునా?' అని తన్ను నిందించెను. రాముఁడు చేతులు చాఁచి 'దేవీ! ఎచట నున్నావు? అను

గ్రహింపుము; ఈ దశలోనున్న నన్ను విడనాడుట నీకుఁ దగదు' అని జాలి వోడమఁబలికెను. సీతాదేవి యదివిని 'ఆర్యపుత్రా! ఈపలుకు విపరీతము గదా' యని వెచ్చనూర్చెను. వాసంతి రాముని బల్కరించి 'అనుగ్రహింపుము, అనుగ్రహింపుము. మితిమీఱిన విప్రలంభము పాలైతివి. నీవే నిన్ను లోకోత్తరధైర్యముచేత నిలువరించుకొనుము. నా ప్రియసఖి యిట లేదు. కాననకు నప్పగించినది యిటేల నుండు' ననెను. రాముఁడు తలయూఁచి 'వాసంతి! నీమాట నిజము; నా ప్రియ యిట లేదు; ఉన్నచో నీకగపడదా? కలఁగంటిఁగాబోలు. కలఁగనుటకు నిద్రయుండవలయును. రాముఁడు నిద్రకెన్నడో పగయయ్యెను. ఇదంతయు నిరంతర సంకల్ప పరంపరా పరికల్పితచిత్తభ్రమ గాని యొండుగాదు. భ్రమాశక్తి యింతనరాదు. అది సర్వదా నన్ను వెంబడించుచునే యున్న' దనెను.

వానియవస్థ మితిమీఱుట వాసంతి పరికించి తన్మనంబు నన్యంబులకు మరలింపఁదలఁచి 'దేవా! రావణుని యుక్కురథంబు జటాయువు తుత్తునియలొనర్చినది యిదిగో. జటాయువు ఱెక్కలను మునుముట్టఁ దునిచి భీతయైయున్న సీతనుగొని విద్యుత్తోడి యంబరమువలె రావణుఁడు వినువీధిఁద్రొక్కిన దిచ్చోటనే' యని యాతావులు జూపించెను. రాముఁడా మాటతోడ లేచి 'ఆ! పాపాత్మా! ఎటకేగెద'వని కత్తిదూసి వెంబడించు వాఁడువోలెఁ బఱుతెంపసాగెను. వాసంతి వానికి నడ్డము నిలిచి 'దేవా! ఎన్నఁడో చంపఁబడిన వానిపయి నీయలుక యింకను జల్లారదా?' యనెను. రాముఁడు నెమ్మది వహించి 'సఖీ! ఇప్పుడు నిక్కముగాఁ బ్రలాపమే చేసితిని. ఏలయందువా? నాటి నాసీతావిరహవ్యథకు రిపుసంహారమనెడి యవధియుండెను. మఱియు వానరప్రేషణ సేతుబంధనాదులును గుంభకర్ణ మేఘనాథాది వైరివీర విమర్దనంబున లోకంబునకు మహాద్భుతరచనంబుఁ గూర్చుటయును దద్విరహవ్యథను సహించుటకు నాకుఁ గొంతకుఁగొంత సాధనములయ్యెను. ఇప్పటి యీవిరహవ్యథకు దరి గాన్పింపదు; ప్రతిక్రియయుఁ దోఁపదు. ఇట్టిస్థితిలోఁ బ్రలాపములకన్న వేఱుమార్గమే మున్నది? ఎచ్చట సుగ్రీవుని చెల్మి వ్యర్థమో వానరపుంగవుల శక్తి యెచ్చట నుపయోగింపదో, జాంబవంతుని తెలివితేఁట లెచ్చటఁ బ్రకాశింపవో, వాయుపుత్త్రుని వేగమెందుఁ బనికిరాదో, ఎచటకు నలుండుఁగూడ దారిచూపలేఁడో

లక్ష్మణుని బాణములెందు సాగవో యచ్చట నాకు గత్యంతరమేమిగలదు? ఇందఱి సాహాయ్యంబున నాఁటి నావిరహవ్యధకు నంతముగలిగెను. ఇప్పుడా సాధనంబు లేవియు నుపయోగింపవు. సఖీ! వాసంతీ! ఈస్థితిలోనున్న రామునిఁ జూచుట సఖులకు దుఃఖమునకే గాని వేఱుగాదు. ఇఁకెంతసేపు నిన్నేడిపింతును? నాకుఁ బోవ ననుజ్ఞ యిమ్ము. అశ్వమేధయాగమును సంకల్పించిరి. సహధర్మచారిణి యెవతెయని శంకింపవలదు. బంగారుపుసీతాప్రతిమను సహధర్మచారిణిగాఁగొని యాక్రతువొనర్తురు. ఆ ప్రతిమను జూచుచునైనను నా నేత్రము కొంతతాల్మి నొందుఁగాక' యని పలికి వాసంతిని వీడ్కొని విమానరాజమెక్కెను.

రాముఁడు తనవిరహవ్యధ నిరవధి నివృత్తిక్రియనున్నప్పుఁడే సీతాదేవి ప్రాణములు నిలువున నెగచెను. అశ్వమేధయాగంబును సంకల్పించిరని వానినోట వచ్చినంతనే యామె మృతప్రాయగాఁ దోఁచెను. సీతాప్రతిమ సహధర్మచారిణియగునన్నంతనే యామెమనస్సు కుదుటనొందెను; ధన్యనైతినని యామె భావించెను. రాముఁడు తాఁ బోయెదనన్నంతనే యామెవగయుప్పెనవలెఁ బొంగెను. వాసంతి యామె నోదార్చి 'చెలీ! నీదృష్టి నీప్రాణనాథుని వెంబడించుచున్నది. ఇఁక మనము పదవన్యోన్యః పుత్రికులవర్ష వర్ధనమంగళములను నెఱవేర్చుటకుగా మహర్షి మనలను నిరీక్షించుచుండు' ననెను. సీతాదేవి యావాక్యములవలనఁ బ్రబోధితయై 'అపూర్వపుణ్యముచేత దర్శనమిచ్చిన నీచరణకమలములకు నమస్కార' మని లోలోన రామునకు మ్రొక్కి యావంకనుండి మనంబును ద్రిప్పలేక త్రిప్పి 'మేఘాంతరమందుఁ బూర్ణిమాచంద్రదర్శన మెంతసేపుగలుగు' నని చింతించుచు వాసంతి ననుసరించి యాశ్రమమార్గము పట్టెను.

## — అశ్వమేధయాగము —

రాముఁ డయోధ్యానగరముఁ జేరినంతనే యశ్వమేధయాగంబునకుఁ బూనఁగిరి. నానాదేశాధీశులకు సందేశము నంపఁజేసిరి. వానరరాజయిన సుగ్రీవునకు నంగదజాంబవన్నీలాది సకలకపివారంబునకు దూతలనుఁదరలించిరి. లంకాపతిని విభీషణుని సబాంధవంబుగా రమ్మని పిలుపుపంపిరి.

కేకయవిదేహాధిపులను ముఖ్యప్రియబంధువులను దోడ్కొని రా సందేశహారులను బంపిరి. వివిధదేశద్విజులకును నాశ్రమవాసులైన ఋషులకును వార్తనందించిరి. కవిగాయకవిదూషకులను వీణావాద్యప్రవీణులను నర్తకులను రప్పించిరి. దేశమెల్లెడలఁ జాటుఁబంచిరి.

అట్లు యాగమునుగూర్చి యథోచితప్రచారముఁ గావించి నైమిశారణ్యమున గోమతీతీరంబున విరివియైన మఖశాలను శాస్త్రరీతి నిర్మించి నాలుగు వర్ణములవారికిఁ దగువిడుదులేర్పాటుచేసి యాగ్రాణములను పాకశాలలను స్నానభోజనశాలలను గజరథతురగశాలలను గట్టించి యందందుఁ జలివచప్పరములను జలిపందిళ్లను గూర్చి విపణివీథులు తీర్చి దధిఘృతతైలంబులను మధుగుడశర్కరలను వివిధఫలమూలశాకపదార్థంబులను పుష్కలముగా సంతరించిరి.

అంతలోన శత్రుఘ్నుఁడు వచ్చెను. పౌరులు నిష్టబాంధవులు నంతఃపురకాంతలును రాజమాతయు భటాదులును సువర్ణసీతాప్రతిమయు యాగశాలఁ జేరెను. ‘రాముఁడు చతురబ్ధిపరీతమేదినీవలయంబునకు నేకచ్ఛత్రాధిపతియై యశ్వమేధంబును జేయుచుఁ దల్లక్షణంబుగా నిత్తురంగంబును వదలెను. ధీరులు గల్గినచో దీనిని బట్టవచ్చు’ ననెడి యక్షరంబులను సువర్ణపటముపయిఁ జెక్కించి యాపటము నొకశుభలక్షణలక్షితవాజిరత్నము ముఖంబునఁ గట్టి ససైన్యముగా దానిని వదలిరి. లక్ష్మణుఁడాహయము వెంటఁ దరలెను.

ఆయజ్ఞాశ్వంబెల్ల దేశములందు నిరాతంకముగా సంచరించి యేఁడాదికి యజ్ఞభూమిఁ జేరెను. అంతలోన నానాదేశాధీశులును వనసీమలనుండి ఋషులును పురపురాంతరములనుండి బ్రాహ్మణులును సర్వశాస్త్రవేత్తలు నరుదెంచిరి. లంకనుండి విభీషణుఁడును గిష్కింధనుండి సుగ్రీవుఁడును బంధుమిత్రపరివారముతోడ వచ్చిరి. మిథిలాధిపుఁడును గేకయరాజును జేరిరి.

రాముఁడంతట బ్రాహ్మణక్షత్రియులను బూజించుటకుఁగా భరతుని నియమించి యాగార్థవస్తువులనందిచ్చుటకుగా శత్రుఘ్ను నాజ్ఞాపించి,

యడిగినవారికి నడిగినట్లిష్టార్థములొసంగ సుగ్రీవు నేర్పాటుచేసి క్రతురక్షణార్థము విభీషణుని నిలిపి 'హనుమంతా ! ఏదియుఁ గొదువ కాకుండునట్లు తెచ్చియిచ్చు భారమునీ' దని వాయుసుతునకుఁ దెలిపి వసిష్ఠాది మునిముఖ్యుల సమ్మతినంది యాగశాలఁ బ్రవేశించి దీక్షవహించెను.

"ఉ॥ ఈమఖవైభవంబునకు నెంతయు సంతసముప్పతిల్లె నా
రా మును బ్రహ్మచేసిన మహాధ్వరముల్ మఘవంతుయజ్ఞముల్
సోమునియాగముల్ దపనసూనుహవం బుడుధీశుహోమ మీ
రాముని యశ్వమేధమఖరాజముతోఁ బ్రతిసేయవచ్చునే ॥"

అను ప్రస్తుతివచనంబులు చెలరేగెను. ఎల్లరుఁ దమతమకార్యములం దప్రమత్తులైయుండిరి.

అత్తఱి వాల్మీకిమహర్షి యాగమునుజూచుకౌతుకంబున శిష్యులతోడ వచ్చెను. రాముఁడు వానికి నమస్కరించి 'మునివర్యా ! మీరాకవలన నామఖము ఫలించెను. మీపాదధూళిసోఁకి క్రతుశాల పావనమయ్యెను. నాయెడ వాత్సల్యముగలదేని క్రతుసమాప్తిపర్యంతము మీరిందేయుండ వేడుదు' ననెను. వాల్మీకి వాని ప్రణయము నంగీకరించెను.

ఆఋషిసత్తముఁ డట్లు నిలిచి కుశలవులను బిలిచి,

"చ॥ ప్రవణతమీఱ మీరు కవపాయక రామకథాప్రపంచ మీ
యవనిపుకొల్వుకూటమున నధ్వరశాలల మౌనులున్నచో
ట్ల విపణివీథులన్ వనములన్ బహురాజసభాంతరంబులన్
గవిజనసన్నిధిన్ జదువఁగావలయున్ జనులందఱున్ వినన్ ॥"

"చ॥ స్వరములుఁ దాళముల్ లయలు సారపుమాటుకొలంబులేర్పడన్
జిరముగ మీరు నారదుఁడుచేసినశిక్ష ఫలింప నింక మీ
రిరువురు వీణెఁబూని దినమిర్వదిసర్గలలెక్క రాఘవే
శ్వరుసభఁ బాడుఁ డవ్విభునిచారుచరిత్రము సభ్యులౌననన్ ॥"

"మ॥ ఫలమూలాశనులై ధనేచ్ఛఁ గహియింపన్ బోక రామాయణం
బెలమిన్ రేపటినుండియున్ దొరకొనుం డెవ్వారు మీరంచుఁ నే

వలమైత్రిఁ రఘుభర్తమిమ్మడిగినఁ వాల్మీకిమౌనీంద్రు శి
ష్యులమంచుఁ వచియింపుఁ డవ్విభుని నెంచుం డాత్మలోఁ దండ్రిగాఁ॥”

—♦ రామాయణగానము ♦—

ఆ॥ వె॥ జననకారకుండుఁ జదువు నేర్పినవాఁడు,
కొలఁది ప్రజకునగును గూర్చుతండ్రి ;
ఎల్ల ప్రజకు ఱేఁడు చెల్లునుతండ్రియై
భరణరక్షణాది భావ్యసరణి ! ॥

అని చెప్పి పంపెను.

కుశలవులు గురునాజ్ఞఁ దలఁదాల్చి మఱునాఁడు రేపకడ లేచి ప్రాతఃకాలకృత్యములు దీర్చి వీణలు కైకొని మునీంద్రులసన్నిధియందును రాజులయెదుటను దేవాలయములప్రోలను వీథివేటలందును గావ్యము ననుదినము పాడుచు నొకనాఁడు సమయముచూచి యజ్ఞశాలఁ బ్రవేశించి కవఁగూడి విపంచికలూని రాగతాళలయాసమంచితంబుగా మృదుమధురస్వనంబునఁ బాడిరి. సభాస్థలినున్న పండితులు పాండిత్యంబునకును పౌరాణికులు పురాణవైఖరికిని శబ్దవేత్తలు పదసౌష్ఠవంబునకును స్వరలక్షణజ్ఞులు సుస్వరసంపదకును గాంధర్వవిద్యాపారంగతులు గానవిశేషంబునకును వైయ్యాకరణులు పాదాక్షరసమాసనిర్మాణకౌశలంబునకును ఛందోవేత్తలపూర్వమైన యనుష్టుప్ఛందంబునకును గావ్యవిదులు కావ్యనిర్మాణంబునకును లక్షణజ్ఞు లౌచితీపోషణంబునకును రసజ్ఞులు కావ్యరసంబునకును నీతిజ్ఞులు నీతిరక్షణంబునకును దలలూచి విస్మయమంది చిత్తంబులందే నిలకడచెందఁగాఁ జూడ్కులు రెప్పపాట్లను మానఁగాఁ జిత్తరుపులవలెనైరి. వారిగానాలాపగతి క్రతునిష్ఠనున్న రాముని చిత్తంబును గూడ హరించెను. ఆ ఱేఁడు నాటియజ్ఞకార్యములు దీర్చి మధ్యాహ్నమునఁ గొలువుదీర్చి యాకుమారగాయకులనుఁ జేరఁ బిలిచి తన సమీపంబునఁ గూర్చుండఁబెట్టెను. వారియవును రామునకు బింబప్రతిబింబసామ్యమునఁ దోఁచిరి.

“ఉ॥ ఈసుఖకాంతు లీనగవు లీకనుదామర లీయెలుఁగు లీ
చామనచాయ లీయుగభుజంబుల సోఁకము లీయురంబు లీ

కోమలమూర్తు లీవచనగుంభనలున్ గనుగొన్న గట్టిగా
రామునిలీల మించి రభిరామశరీరు లీరలెవ్వరో ?"

"ఉ॥ హారకిరీటకుండల భుజాంగదవస్త్ర సుగంధమాల్యముల్
వీరు ధరింపకీజటిలవేషములేటికిఁ దాల్చిరో ? శుభా
కార విలాససంపదలఁ గంతుజయంతుల ధిక్కరించి నా
రే ఋషిపుత్త్రులో ? ఋషులకెక్కడి వీమహనీయ రూపముల్ ॥"

అని సభ్యులు గుసగుసలాడసాగిరి. ఆధ్వని సభాంతరమెల్లఁ గప్పెను. లక్ష్మణుఁడు చేసన్నచేత సద్దునెల్ల నడఁచెను. ఆబాలగాయకులంతట సారెలు చక్కదిద్ది మేళవించి రామాయణమందలి మొదటియిరువదిసర్గలఁ బాడిరి.

"చ॥ స్వరము లయారె, మేలు శ్రుతి, బాగురె మూర్ఛన కంపితంబు బా
పురె, బళిగయ్యతాల్, నెఱసెఁబో నెఱమీటుకులంబుదాయి, య
ద్దిరస్ఫురితంబు, లమ్మ నునుదేనియలొల్కెడు ముద్దుపాట, నే
డిరవుననచ్చెఁగాదె సకలేంద్రియతర్పణ మద్భుతంబుగాన్ ॥"

అని పలుభంగులఁ గొనియాడిరి. రాముఁడును వారిగానమునకు మెచ్చి 'భరతా ! వీరికిఁ బదివేలవరాలిమ్ము ; మఱియేదికోరినదాని నెల్ల నొసంగు' మనెను. ఆగాయకులందునకుఁ జిఱునవ్వు దాల్చి కరములు మోడ్చి 'రాజేంద్రా ! కందమూలములు తిని కానలలోఁ దాపసవృత్తినుండు మాకు సువర్ణములేల ? మఱి యొండేల ?' యనిరి. రాముఁడు దరహాస కందళితవదనారవిందుఁడై 'ఈకృతినెవ్వరు రచించిరి ? దీనికిఁ బ్రమాణ మేమి ? ఇది యెవ్వరి చరిత్ర ? దీనిని మీరెవ్వరివలన నేర్చితి' రని యడి గెను. వారును 'రాజేంద్రా ! వాల్మీకిభగవానుఁడు దీనిని రచించెను. దీనిని రామాయణమందురు. ఇది మీకథయే సుమా. ఈగ్రంథమిరువదినాల్గువేలు. ఇందేనూఱుసర్గలు గలవు. గ్రంథమునెల్ల సప్తకాండములుగా విభజించెను. అందు మొదటి యాఱుకాండములు పట్టాభిషేకముతోఁ బూర్తియగును. ఆవలికథ నుత్తరకాండమునఁ బొందుపఱచెను. ఆఋషివలననే మేము దీనిని షట్కాండపర్యంతము నేర్చితిమి, మఖనిష్ఠాశ్రమ మనునట్లుగాఁ

ప్రతిదినము కొంత సేపు మీఱు వీనిని విన్నచో మా నేర్చిన విద్య సఫలమగు'నని వారు చెప్పిరి. రాముఁడందులకు సంతసించి వారి యిచ్ఛ సేయుదు నని పలికి నాఁడు కొలువు చాలించెను.

అది మొదలు ప్రతిదినము మధ్యాహ్నము వారిగానము సాగుచుండెను. తాలలయోపపన్నమును సర్గాన్వితమును స్వరశబ్దయుక్తమును తంత్రీలయ వ్యంజనయోగసహితంబునైన యాగానంబును రాముఁడువిని వారిని నింపాదిగాఁ జూచి 'వీరియందు జానకీలక్షణములు తోఁచుచున్నవి. సీతాదేవి కవలఁగాంచెనని వింటిని. వీరు వారుగానుందురా ?' యనితలఁపసాగెను. ఆతలఁపుతోడ సీతాదేవి వానిహృదయదర్పణంబునఁ బ్రతి ఫలించెను.

"చ॥ జడలుధరించి కృష్ణమృగచర్మములున్ బలునారచీరలున్
గొడుకులుఁదానుఁ గట్టుకొని కూరలఁగాయలఁద్రుంచుచున్
గుడిశెనువంత రేవగలుఁ గుందుచు నెంత యలంగియున్నదో
యడవులలోన సీత యకటా! యిఁకఁజూడక యెట్లుతాళుదున్॥"

అయ్యో! నాతలంపు నెఱవేఱు నెట్లు ?' అని రాముఁడు పెద్దయూరుం దలపోసి 'వైదేహి వచ్చి సభాంతరాళమున బాసచేసి తనశుద్ధినిఁ బ్రతిష్ఠించి వీరు నావలనఁ దాను గన్నకూనలని యుపలింగింపఁగన్నచోఁ బ్రజలు నమ్మరు. అందాక వీరిని నేను గ్రహింపరాదని నిశ్చయించి శుద్ధసమాచారులైన దూతలను రావించి 'మీరు వాల్మీకి భగవానుని యంతికంబునకుఁజని 'మునీంద్రా! సీత శుద్ధచరిత్రయు సాధ్వియు నగుట యెఱుంగుదును. అయినను లోకనిందకు వెఱచి యాసతిని వదలవలసివచ్చెను. ఆయింతి వచ్చి యీసభామధ్యంబున నిల్చి యెల్లగకుఁ బ్రత్యయంబగునట్లుగా శపథం బొనర్చుట యుక్తముగాఁ దోఁచుచున్న' దని వానికి నావిన్నపముగాఁ దెలిపి యామహానీయుఁడేమనునో సీతాపసోగతి మెట్లుండునో యెఱిఁగి రమ్మనెను. దూత లాపగమాద్యుత వచనంబులుఁ గని వాల్మీకిమునిపుంగవునొద్దకుఁ దరలిరి.

వాల్మీకిమహర్షి దూతలముఖంబున రామునితలంపు నెఱిఁగి యట్లే యాగునుగాక యని చెప్పి పంపెను. దూతలు వచ్చి సంగతియెల్ల రేనికిఁ

పొలిపిరి. రాముఁడంతట నందున్న రాజులను ఋషులను జూచి 'రేపు సీత యిందువచ్చి సభాంతరాళమున శపథము చేయనున్నది. ఎల్లరు వచ్చి విన నగును.' అనెను. ఆమాటతోడ నందున్న వారెల్లరు నివ్వెఱఁగంది 'రామా! నీకే తగు' ననిరి. నాటికి సభ ముగిసెను.

## —• సీతా పాతివ్రత్య పరీక్ష •—

మఱునాఁడు రాముఁడు యథాకాలమున యజ్ఞవాటిఁ బ్రవేశించెను. వసిష్ఠ వామదేవ జాబాలి కాశ్యప విశ్వామిత్ర పులస్త్య శక్తి భార్గవ వామన మార్కండేయ మౌద్గల్య గర్గ చ్యవన శతానంద భరద్వాజ నారద పర్వత గౌతమ కాత్యాయన సుయజ్ఞాగస్త్యప్రముఖులైన మహాత్ములును విభీషణాది రాక్షసులును విదర్భేశ్వర కేకయరాజప్రముఖ బాంధవులును మంత్రులును మిత్రులును జేరిరి. నాల్గువర్ణములవారు కోట్లకొలఁదిగా స్త్రీలును బురుషులును గూడిరి.

అంతఁ గొంతవడికి వాల్మీకి మహర్షి వచ్చెను. అమ్మునివరేణ్యుని వెంట నలువవెంట శ్రుతి వలె నొకకాంతామణి కృతాంజలియు బాష్పకంఠయునై తలవ్రాల్చి వచ్చెను. ఆదేవిని శోకవ్యాకులేంద్రియను జూచి నంతనే సభాస్థలమున హాలహలాశబ్దములు చెలరేఁగెను. 'మేలుమేలు రామా' యని కొందఱనిరి. 'బళిబళీ దేవీ వైదర్భీ' యని మఱికొందఱు పలికిరి.

వాల్మీకిమహర్షి యట్లు వచ్చి సభామధ్యంబున నిలిచి 'రామా! ఏ శీలవతీపాతివ్రత్యము నిష్కలంకమో, ఏశుద్ధచిత్త ధర్మమార్గమునుండి యావంతయుఁ దొలఁగదో, లోకాపవాదభయంబునఁ జేసి నీవలన నేకశోరగర్భ నా యాశ్రమాంత ప్రదేశంబునఁ ద్యజింపఁబడెనో, యాయీసీత మహావ్రత లోకాపవాద భీతునకు నీకుఁ బ్రత్యయ మీయనున్నది. అనుజ్ఞ కోరుచు. ఈకవలిద్దఱు నీసుతులు ; సత్యము పలుకుచున్నాను. రామా! నేను ప్రచేతసునకు దశమపుత్త్రుండను ; నానోటఁ గల్లరాదు. బొంకుదునేని నాతపమిన్నియేండ్లగాఁ జేసినది వ్యర్థమగుఁగాక. ఈమైథిలి మనోవా [illegible] రామా! [illegible]

సాక్షిగా నాయంతరాత్మసాక్షిగాఁ జెప్పుచున్నాను. సీత యాగర్భపరిశుద్ధురాలుగాని వేఱుగా' దనెను.

రాముఁ డావచనంబులు విని చేదోయి గూర్చి సీతపయి దృష్టి నిలిపి 'మహాభాగా! మీపలుకులు సత్యములు. మీవచనమే నాకుఁ బ్రత్యయము. ఈసీత తొల్లిదేవతల మ్రోల వహ్నిప్రవేశపూర్వకముగాఁ దనపాతివ్రత్యమును బ్రకటించెను. అంత నేనియ్యంతిని గయికొంటిని. ఇంటికి వచ్చినతరువాత లోకాపవాదము మోయరానిది తలయెత్తి మైథిలికి నాకు దవ్వుకల్పించెను. సీత యెట్టిపాపమెఱుంగదని తెలిసియు లోకమునకు వెఱచి యీకాంతను ద్యజించితిని. నాయీతప్పు క్షమింపవేఁడుదును. ఈబాలురు నాపుత్రులని యెఱుంగుదును. మనము వేయిపలుకులేటికన్న సీతయొక్క మాటపల్కనేని యదిజనులకుఁ దప్పని ప్రత్యక్షముగాఁ దోఁచుచున్న' దనెను.

సీతాశపథవృత్తాంతమును విని మహేంద్రాదిదేవతలు బ్రహ్మపురస్సరముగా వచ్చిరి. ఆదిత్య వసురుద్రాశ్వినిదేవతలును సిద్ధసాధ్యనాగసుపర్ణ గంధర్వ మరుత్తాదులును నింగిఁబర్విరి. వారినెల్ల రాముఁడు చూచి 'మహాత్ములారా! ఋషివాక్యమే నాకుఁజాలును. ప్రత్యయమాత్రాననే తనివి చెందునట్లు లేదు. వైదేహి విశుద్ధినిగూర్చి స్వయముగాఁ బలుకుటే మేలుగాఁదలఁతు' నని మరల వచించెను.

—◆ సీతాదేవిని భూదేవి తనలోనికిఁ గొనిపోవుట ◆—

వాయువు దివ్యగంధమనోహరముగా వీచి యాజనసమాజమును బరమాహ్లాదపరవశమొనర్చెను. అచింత్యమైన నాటిమాయదృశ్యంబు సకలసామాజికులు నిర్నిమేషులైరి. అంతఁ గాషాయవస్త్రయగు సీతాదేవి వారిమ్రోల నిలిచి చేదోయిఁగూర్చి యధోముఖియై

"శా॥ రామస్వామిపదాంబుజంబు లెద నారాధింతు నేనిన్ సదా
రామాజ్ఞన్ జరియింతు నేనిఁ దగుజాగ్రత్స్వప్నసుప్త్యవస్థలన్
రాముం దప్పని దాననౌటయును సత్యంబేని నాతల్లి నా
భూమీ! యీయెడఁ ద్రోవఁజూపి నను గొంపోవమ్మ నీలోనికిన్॥"

అని విస్పష్టాక్షరముల వచించెను. ఆమె శపథంబునకుఁ బురందరాది బృందారకులు మహాశ్చర్యమొందిరి; ఋషిపుంగవులు పరమాద్భుతవశులైరి. నరవానరనిశాచరప్రముఖనిఖిలజనంబులను శోకదైన్యంబులు పైకొనెను. ఆ మాటతోడ 'శతకోటిశతకోటిఘోషంబో సంవర్తసమయసముదితజలధరసంఘసంఘర్షణోజ్జాత జాతస్ఫీత నినాదంబో ప్రళయవేళాభయంకరఫణీశ్వరాభ్రంకషదంష్ట్రాంతర ఘోరముఖసహస్రమోముచ్యమాన విస్ఫురత్కాలికీలికాజాలక స్ఫులింగస్ఫుటాభీల దవానుకూల విశాలభూత్కారవిరావంబో యనల్పకల్పాంతకాలకంఠేకాల దిక్కూల ముద్రజ ఢక్కాఢమఢమత్కారంబో బ్రహ్మాండకరండ ఖండనోద్దండతాఖండ తరావరణ వరుణాలయోత్తుంగ జంఘాలతరంగ సంఘాత ఘుమఘుమార్భటియో' యనునట్టి దీర్ఘనిర్ఘోషంబు తత్సభామధ్య రత్నరత్నగర్భంబునుండి వెలువడెను. ఆధ్వనితోడ సీతాదేవి కట్టెదుట ధరాతలంబు బిట్టులిసి పట్టిల్లునఁబగిలి మహాభీలబిలంబొకటి యేర్పడెను. ఆబిలంబునుండి నవరత్నమణిమసృణఘృణివిసరంబులు వెల్లివిరిసెను. ఆకాంతుల వెనువెంట దివ్యసింహాసనంబును మోసికొని నాగకుమారులు దివ్యదేహులు వెడలివచ్చిరి. వారివెంట నొక్కదివ్యాంగన యుద్భవిల్లి వచ్చి సీతాదేవిని గ్రుచ్చి కవుంగలించి కన్నీరు దుడిచి 'తల్లీ! వగవవలదు; దైవగతి యెవ్వరికినిఁ దప్పదు; ఊఱడిల్లు' మని పలికి యామెను తత్సింహాసనంబునఁ గూర్చుండఁబెట్టుకొని రసాతలము సొచ్చెను. అట్లు చనుచున్న సీతాదేవిపయిఁ బుష్పవృష్టిఁ గురిసెను. దేవతలు సాధువాక్యంబులఁ బలికిరి. 'అహో! సీతాదేవి శీలమేమనవచ్చు' నని సభాగతులెల్లరు విస్మయమందిరి. ఒక్కముహూర్తము జగమెల్ల సంమోహితమైనట్లుండెను.

—♦ రాముని విలాపము ♦—

సీతాదేవి యట్లుచనుట రాముఁడు చూచి బాష్పవ్యాకులలోచనుండును, దీనచిత్తుఁడునై తలవంచి దండకాష్ఠము నండఁగొని పెల్లిదంబుగా నేడ్చి,

* మ॥ జననిందంబడలేక నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గానసం
బునఁ ద్రోయించినతప్పుచాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రిం

మునిచందంబున రచ్చఁబెట్టితివటంచుఙ్ డాఁగి పోనేల ? సొం
పున నేఁడింకొకసారి నీ నగుమొగంబుఙ్ జూపవే ? జానకీ ॥"

"మ॥ అకటా ! నీవు పతివ్రతామణివి నాయందెంతయుంగూర్మిఁ బా
యక వర్తింతువటంచు నమ్మితిఁగదే యగ్నాంబె నీవున్నచో
టికి నన్నుంగొనిపోక నిర్దయత నొంటిఙ్ డించిపోవం ; దలం
పకు నా నేరము లిందువచ్చి నిలవే మాటాడవే ? కోమలీ ॥"

"మ॥ సదనంబుం బెడఁబాసి నీవు బహువర్షంబుల్ వనక్షోణిఁ జెం
ది దురంతవ్యథలొంద నిన్ను ననురక్తింగూడి వర్తింపఁగా
నిది మేలైనయుపాయమంచు శపథంబేగోరతిఙ్ గాని నీ
హృదయంబించు కటింగినఙ్ దలఁతునే యీమాట ప్రాణేశ్వరీ ! ॥"

"చ॥ అదరెడుచిచ్చుఁ జొచ్చుతటి నాదటు నూరకచూచునాటి ని
ల్కడయును గానఁగోచి చిరకాలము తాళిన బెట్టిదంబు నా
యెడఁగని వంతలఙ్ విసివి యీతని కెక్కడి మోహమంచు ని
ప్పుడమి నెపంగి మాయమయి పోయితివే సొ ? పతివ్రతామణీ ! ॥"

"ఉ॥ కన్నుల సోరెకుఙ్ దొరఁగు కజ్జలసమ్మిళితాస్రధారతో
విన్నఁదనంబుతో మిగుల వెచ్చనియూర్పుల వాఁడువారి తోఁ
జిన్నిమొగంబు వంచిబలుసిగ్గునఁ గెల్లవమోడ్చి యిందు ని
ల్చున్ననినుఙ్ దలంచుకొన నూహ గలంగఁగదే వనామణీ ॥"

అయ్యో ! జానకీ ! వాల్మీకిమహర్షి యాశ్రమంబున జెందితివనియు
నట సుఖముందువనియు నిన్ను నీసుతులతోడ నెప్పటికైనను జూడఁ
గోతుననియుఁ జేరాసనుంటిని. నాయాసలెల్ల క్షణములో నిరాశలయ్యెను.
దైవదేహీ ! పాణిగ్రహణమునాటనుండి నీవే నాజీవనమని యెంచితిని. నా
కూర్మిదేవతవుగా నిన్ను భావించితిని ; నీతోడిదే నాకు లోకముగానుంటిని.
అట్టి నీవల్లభు నిట్లాడిచేసి చన నీమది యెట్లొప్పెనో గదా ?

"సీ॥ దర్పించి పరమేశుధన్వంబు విఱచుట
నీనిమిత్తమెకదా నీలవేణి !

యెలమితోఁగపిరాజు చెలిమిపాటించుట
నీకోసమేగదా నీరజాక్షి !
విబుధేంద్రసుతుఁబొంచి వ్రేసినిర్జించుట
నీకొఱకేగదా నిర్మలాంగి !
క్రోధించి సాగరక్షోభంబు సేయుట
నీపనికేగదా నీతినిలయ !

గీ॥ బ్రహ్మకులజునిఁ బౌలస్త్యపతిఁ గెలుచుట
నిన్నుఁగైకొంటకేగదా వన్నెలాడి !
యకట ! యవియెల్ల నెంచక నొకటిరెండు
తప్పులకు నన్ను నెడఁబాయఁ దగునె నీకు ?"

ప్రేయసీ ! నీమేలుఁనకుఁగా నీసుతులమేలునకుఁగా లోకంబుల మేలు నకుఁగా నేనీనాటకంబు నాడవలసివచ్చెను. అంతియగాని నిన్నుఁ జిన్న పుచ్చుటకుఁగాదు. ఈ రహస్యంబు నెఱుంగక నీవిట్లు వేఱుగాఁ దలఁచి యింత కటికతనమూనుదువని యెన్నడు నూహింపనైతిని. కళ్యాణీ నీవు లేనిరాముఁడుండునా ? నీవులేనిలోకము నాకు మహాతిమిరకూపము గదా. ఈచీఁకటిగుహలో నేనుపడియుండఁ జాలను' అని బహుభంగులఁ బరితపించి, భూదేవిని దలఁచి 'వసుమతీ ! నాయెట్టయెదుట నీవింతదుండగ మొనరుపవా ? నీవలన నాకును నాసీతకును దవ్వయ్యెఁగదా ? అహో ! ప్రియావియోగంబొనర్చి యభూతపూర్వమైన శోకంబును నాయెదఁ జొన్పితివి. వసుంధరా ! దాటరాని మహాసాగరంబును దాఁటి చొఱరాని లంకఁజొచ్చి గడపరానివైరిని గడపి సీతను సాధించి తెచ్చిన నాకు నీ గర్భంబునుండి యాచెలువనుఁ దెచ్చుట యొకకార్యమా ?' అని పలికి సభా స్తారులవంక మరలి,

"చ॥ దురుసున నామదిం గినుక దోఁపక ముందర సీతఁదెచ్చి యి
ద్ధరణియొసంగినన్ బ్రతుకుఁ దక్కిన మామకచాపముక్త ని
ష్ఠుర విశిఖప్రతానములఁ జూర్ణముచేసి యజాండమెల్ల నా
వరణపయోధిలోఁ గలిపివైచెద నొక్కక్షణంబులోపలన్॥"

అని గర్భనిర్భేదంబుగా వచించెను. రోషవశంబునం జేసి వాని పెదవు లదరసాగెను; దృక్కోణంబుల నగ్నికణంబు లురలెను; గటతటం బులు చలించెను; నాసాపుటంబుల నుచ్ఛ్వాసనంబులు పిక్కటిల్లెను; భ్రుకుటి మహావికటమై ఘటిల్లెను; దంతంబులఁ బటపటార్భటు లుప్పతిల్లెను; మోము చేవురించెను; నిమ్మేనఁ జిఱుచెమ్మటలు గప్పెను. రాముఁడట్లు కోపోద్దీపితమూర్తియై 'పంచభూత విలయ సమయ సముద్దండ తాండవ క్రీడా ప్రచండ చండీశ్వర విశ్వభయంకర కరణపారదృశ్యశశ్వద్వీరరసం బాకారంబుఁ గొన్న చందంబునఁ జూపట్టుచుఁ బుడమిపయి దృష్టిసారించి 'జడమతీ! అలఁతినిగా నన్నుఁ దలంచి సీతను లోఁగొన్న నీయహంకార మునకుఁ బ్రతిక్రియగా నిన్ను ధూళీఫాళీకరించి సమస్తమును జలమయ మొనర్తు నిదిగో చూడు' మనుచుఁ జెంతనున్న లక్ష్మణునిచేతి శరాసనంబు నొడిసి పుచ్చుకొని యెక్కుపెట్టి నారిసారించెను. ఆజ్యానిర్ఘాతధ్వనికి దిక్కులుపీఁటల వాఱి వ్రక్కలయ్యెను; ఉడువ్రజంబు జలజల రాలఁ జొచ్చెను; సాగరంబులు పంకిలంబులయ్యెను; రసాతలవాసులు భయ విహ్వలులైరి.

## —♦ బ్రహ్మ రామునకు శాంతిఁ గూర్చుట ♦—

పంకజాసనుఁడది గాంచి ప్రళయంబగునని వెఱచి హుటాహుటి దేవర్షిబ్రహ్మర్షిగణసమేతుఁడైవచ్చి 'రామా! రామా! ఇది తగునా? ఆగ్రహంబునఁ జేసి నీజన్మంబు వైష్ణవంబగుట మఱచితివా? సీతాదేవి యెందో పోయెనను భ్రమయేల? ఆపరమ సాధ్వి నీయాశ్రయ తపోబలం బున నాగలోకముచేరి స్వర్గమందలి నీపునస్సమాగమంబును నిరీక్షించుచు సుఖమున్నది. రామా! వాల్మీకిమహర్షి నీచరిత్రమును సుఖదుఃఖోపసేవన మైన దానిని జన్మప్రభృతి యవతారాంతముగా రచించెను. నేను దానిని తొల్లి సురలతోడ వింటిని. నీవును దానిని కొంతవింటివి. సాకల్యంబుగా దానిని విన ననుగ్రహింపుము. అట్లే మాటయిచ్చితివి. అందు నుత్తర కాండము,

"శా॥ సారప్రజ్ఞఘటించు శ్రోతల కభీష్టంబుల్ ప్రసాదించు భా
గీరథ్యాపగఁబోలి పంకమడచున్ గీర్భామినీపాదమం

జీరస్ఫారమృదుధ్వనిఁ జెవులకుఁ జేకూర్చునుల్లాసమీ
శ్రీరామాయణమాదికావ్యము సుమీ సీతామనోవల్లభా! ॥"

అనిపలికి సురలతోడ నంతర్హితుఁడయ్యెను.

రాముఁడంతఁ గోపముడిగి లక్ష్మణునిచేతికి విల్లందించి వాల్మీకిమహర్షి వంక మరలి 'మునీంద్రా! నీకావ్యమును విన ఋష్యాదులు కుతూహలురై యున్నారు. రేపకడనుండి దానిని సాంతముగా వినుదు' మని చెప్పి కొలువు సాలించి పుత్త్రులను వెంటఁగొని పర్ణశాలకుఁ బోయెను.

మఱునటిదినమునుండి కావ్యగానము కొనసాగి యజ్ఞసమాప్తమునకుఁ బూర్తియయ్యెను. ఈకార్యములిట్లు జరుగుచున్నను రామునిహృదయము సీతనంటి యుండుటంజేసి వానికి జగమెల్ల శూన్యముగా దోఁచెను. వానికిని శాంతికిని గడుదూరమయ్యెను. రాముఁడెట్లో యజ్ఞపరిసమాప్తిఁ గావించి యెల్లరను మర్యాదలతోడఁ బంపివైచి హృదయస్థసీతారూపద్వితీయుఁడై పుత్త్రులతోడ నయోధ్యచేరి కర్మక్రతువులందెల్ల సీతాసువర్ణవిగ్రహంబును జెంతనుంచుకొని యాకార్యములు జరుపుచు రాజ్యమేలుచుండెను.

### —♦ భరతునిపుత్త్రులకు గంధర్వరాజ్యపట్టాభిషేకమొనర్చుట ♦—.

ఇట్లు కొన్నాళ్ళు చనఁ గొండొకదివసంబునఁ గేకయరాజునొద్దనుండి గార్గ్యమహర్షి యనర్ఘపారితోషికములతోడవచ్చి తనరాక యెఱింగించెను. రాముఁడమ్మహర్షికి నెదురేగి వానిని సముచితసత్కారములతోడఁ గొని వచ్చి సుఖాసీనుని గావించి వానిరాకకుఁ గారణమడిగెను. ఆతాపసియు వానివినయంబునకు సంతసించి 'రామా! సింధూనదికి నుభయతటంబుల గంధర్వదేశము గలదు. అది ఫలమూలాభిరామమైయుండును. ఆదేశంబును రణకోవిదులైన గంధర్వులు రక్షించుచుందురు. వారు శైలూషసుతులు మూఁడుకోట్లుగలరు. వారివలని బాధయింతనరాదు. వారి సంహారంబునఁ గాని ప్రజలకుఁ బ్రాణమానములు దక్కవు. ఈకార్యమునకు నితరులు చాలరు. నీవు వారిని సంహరించి తద్రాజ్యంబునందు నీసుతులలో నొకని నిలిపి యశఃకీర్తులఁ బడయుము. నేను నీమేలుగోరువాఁడనేగాని యొండు

గాదుగదా ?' అని నీమేనమామ కేకయరాజు నీకుఁ దెలుపుటకు నన్నుఁ బంపెను. కర్తవ్యమూహింపు' మనెను.

రాముఁడదివిని 'మహాత్మా! మీయిష్టమొనర్తు' నని పలికి భరతుని తత్పుత్రయుగంబుతోడ రావించి యాతూనలకుఁ దద్రాజ్యాభిషేకమప్పుడే గావించి యయ్యుధపురను భరతునితోడ ససైన్యముగా దరలించెను. వారు నెల పదునైదు దినములకుఁ గేకయరాజ్యము చేరిరి.

భరతుఁడట్లువచ్చుట యుధాజిత్తు విని మహాప్రీతినొంది పెక్కువేల బలముతో వానికిఁ దోడయ్యెను. వారిరువురు నట్లు మహాబలసమేతులై గంధర్వదేశముఁ జొచ్చిరి. గంధర్వులును వారిరాకవిని సముచితబలంబులఁ గూర్చుకొని వారిని దాఁకిరి. ఇరుబలంబులకు రోమహర్షణంబుగాఁ దుముల యుద్ధమయ్యెను. ఏడు దినములు గడచెను. రుధిరంబులు వాహినులు గట్టి రణక్షోణినుండి ప్రవహింపసాగెను. ఎవరికిని జయాపజయంబులు గలుగవు. అంతట భరతుఁడు మహాక్రోధోగ్రమూర్తియై యత్యంతదారుణమైన సంవర్త నామకకాలాస్త్రంబును సంధించి యాకర్ణాంతముఁ దిగిచి గంధర్వులపై నేసెను. గంధర్వులెల్లరుఁ గాలపాశబద్ధులై యుమ్మెత్తివారచ్చట నే పడి క్షణములో మడిసిరి.

భరతుఁడంతట గంధర్వరాజ్యంబును స్వైవశమొనర్చుకొని యందుఁ దనపుత్త్రులపేర దక్షశిలాపుష్కరావతులను పేరి దివ్యపురంబులను రెంటి నిర్మించి తక్షశిలయందు దక్షుఁడను తన పెద్దకుమారునిని, బుష్కరావతి యందుఁ బుష్కరుఁడను తన రెండవ తనయుని నిలిపి ధనధాన్య వస్తువాహన సైన్యంబులను సమృద్ధముగాఁ గూర్చి పంచవర్షంబు లందుండి సుతులను వీడ్కొని రాముని కడకు వచ్చి సంగతియెల్ల వానికి విన్నవించెను.

లక్ష్మణపుత్త్రులను గారువథ చంద్రకాంత దేశంబులకు
బట్టాభిషేక మొనర్చుట.

రాముఁడును బరమామోదమంది లక్ష్మణునితో 'సౌమిత్రి! నీసుతు లంగద చంద్రకేతువులు రాజ్యభారము వహింపసమర్థులైయున్నారు. వారికిఁ

దగురాజ్యములేవో యూహింపరాకున్న' ననెను. భరతుఁడామాట నంది కొని కేలుమోడ్చి 'అన్నా! కారుపథదేశము మహారమణీయమును నిరామయమునై యుండును. ఆరాజ్యము నంగదునకుఁ గట్టనగును. మఱియుఁ జంద్రకాంత దేశమునకుఁ జంద్రకేతువును బతిగాఁ జేయుటయొప్పు' నని విన్నవించెను. రాముఁడామాటను బాటించి శుభముహూర్తంబున నయ్యిరువురు పుత్త్రుల నయ్యారాజ్యంబులకు నభిషిక్తులనుగా నొనర్చి యంగదుని వాని రాజ్యమందు నిలిపివచ్చుటకుగా లక్ష్మణునిని జంద్రకేతువును వానిరాజ్యమందు నిలిపివచ్చుటకుగా భరతునిని దగుసైన్యముతోఁ బంపెను. వారట్లా యాదేశంబులకుఁ జని వాని నాక్రమించి సుతుల నందందు నిలిపి యేఁడాది పాటచ్చటనే యుండి మరలివచ్చిరి.

## —♦ రామ యముల సమావేశము ♦—

ఇట్లు కొంతకాలము గడచిన తర్వాత కొండొకనాఁడు తాపసి యొకఁడు రాజద్వారము నొద్దకు వచ్చి యందున్న లక్ష్మణునిఁ జూచి 'రామునితోఁ బనికలిగి వచ్చితిని. నారాకను వానికి నెఱింగింపు' మనెను. లక్ష్మణుఁడు వెంటనే చని యాసంగతి నన్నకు విన్నవించి యాజ్ఞవడసి యత్తాపసినిఁ బ్రవేశపెట్టెను. రాముఁడా ఋషిసత్తమునకు నర్ఘ్యాదిపూజ లొనర్చి కుశలమారసి దివ్యకాంచనాసనంబు నిచ్చి 'మహాత్మా! నీవువచ్చిన యర్థమును దెలుపవేడుదు' ననెను. ఆతాపసియు రాముని కిట్లనియె 'వత్సా! నావచ్చినయర్థంబు నేకాంతముగా నీకుఁ దెలుపనగును. మనమిరువురముఁ దక్క యన్యులిందుండరాదు. ఏకాంతముగా మనము సంభాషించు నప్పు డిచ్చటకు నెవండు వచ్చినను వానిని దప్పక వధింతునని బాసచేసినఁగాని నావచ్చిన యర్థమును దెలుప' ననెను. రాముఁడట్లే ప్రతిజ్ఞచేసి 'లక్ష్మణా! నీవు ద్వారమందుండి యెవ్వరిని లోనికి రానీయవలదు. కాదని వచ్చినవాఁడు వధ్యుఁడగు'నని కట్టడిగావించి వానిని బంపెను.

అంత నత్తాపసి సమీక్షించి 'రామా; పితామహుని యాదేశమున నంతకుఁడనైన నే నిమ్మని వేషంబున నిందువచ్చితిని. ఆపితామహుఁడు నాముఖంబున నిన్నిట్లు ప్రబోధించుచున్నాఁడు. 'నీవు శ్రీమహావిష్ణువవుగాని

వేఱుగాదు. తొల్లి నీవు క్షీరసాగరంబున సర్పరాజుపయి శయనించి యోగనిద్రనుండఁగా నీనాభికమలంబునుండి నేను పుట్టితిని. నీ కర్ణరంధ్రంబులనుండి మధుకైటభులు జన్మించి మహోపద్రవము చేయసాగిరి. అయ్యసురులను ద్రుంచి వాని యెమ్ములచేత భూధరంబులను వారి మెదడుచేత ధాత్రీతలంబును గల్పించి లోకాధిపత్యమునకు నన్ను నియమించితివి. దుష్టశిక్షణ శిష్టరక్షణంబు నీవ్రతమైయున్నది. రావణాసురుఁడు జన్మించి ముల్లోకంబుల నెతలఁబెట్టసాగెను. వానిబాధలోర్వలేక సురలు నిన్నుఁ బ్రార్థించిరి. దేవతల ప్రణయంబంగీకరించి దశరథాత్మజుండవై యవతరించి దశకంఠుని బరిమార్చి లోకంబులచెట్టఁ దీర్చితివి. పదునొకండువేలయేండ్లు ధాత్రీతలంబును యథాశాస్త్రము పరిపాలించితివి. రాజ్యేచ్ఛ యింకను గలదేని నీవింటనే యుండనగును. ఒండుచో నిజధామంబునకు వేంచేయనగును. ఇట్లు హెచ్చరికచేయుచున్నాను'—రామా! ఇది పితామహుని వచనంబులు. మీచిత్త' మనెను. రాముఁడావచనంబులు సాకల్యంబుగా విని చిఱునవ్వుదాల్చి 'అంతకా! నావచ్చినకార్యముతెల్లఁ దీరెను. ఇఁక నాకిచ్చటఁ బనిలేదు. వైకుంఠమునకు వచ్చెద' ననెను.

—♦ దుర్వాసమహర్షి రామసందర్శనార్థము వచ్చుట ♦—

వారట్లు సంభాషించుచుండఁగా దుర్వాసమహర్షి రామసందర్శనార్థియై వచ్చి వాకిటనున్న లక్ష్మణునిఁ జూచి 'సౌమిత్రీ! రాముని శీఘ్రముగా సందర్శింపవలసివచ్చితిని. నారాక వానికిఁ దోడ్తోడఁ దెలుపు' మనెను. లక్ష్మణుఁడదివిని చేఁదోయి మోడ్చి 'మహాత్మా! రాముఁ డేకాంతమున నున్నాఁడు. ఇప్పుడచ్చటకుఁ బోఁజనదు. మీవచ్చినకార్యముఁ దెలుపవేఁడుదు' ననెను. దుర్వాసుఁడామాటలకుఁ గ్రోధకలుషితచిత్తుఁడై లక్ష్మణుని కొఱకొఱఁ జూచుచు, 'ఏమీ!

“చ॥ తనను నిలుపఁగా పితామహజనార్దనశంభులకైన శక్తిలే
దనఁగ నొకండు శక్తుఁడె? నృపాగ్రణి నీవు మదాగమంబుఁ దె
ల్పని పని నిక్కమేని పితృబాంధవపుత్రులతో ధనంబుతోఁ
దనయులతో మిముం గినిసి దగ్ధులుగా శపియింతు తక్షణా ॥'”

అని పరుషంబుగాఁ బలికెను. లక్ష్మణుఁడు వానికోపవచనంబులు విని 'కటా ! ఏమి సేయుదు ? ఈ ఋషి చండకోపుఁడగుట లోకవిదితము. ఇతఁ డన్నంత సేయును. అన్నగారి కట్టడి దాఁటరాదు. అచ్చటకుఁ బోవుదు నేని నాకుఁ జావు సిద్ధము. పోకున్నచో నాకారణంబున మాకులమెల్ల వీనిశాపదగ్ధమగును. ఇందఱవినాశంబునకు నేను కారణమగుటకన్న నా యొక్కని ప్రాణము పోయినను మేలేగదా' యని తలపోసి రాముని డాయఁ బోయి వానికి దుర్వాసాగమనంబును విన్నవించెను.

రాముఁడంతటఁ దనతో నేకాంతముననున్న మాయాతాపసిని గాలుని వీడ్కొని దుర్వాసమహర్షికి నెదురేగి కృతాంజలియై మర్యాదలతో వానిని దోడితెచ్చి 'మునీంద్రా ! మీవచ్చినకార్యము నాజ్ఞాపింపు' మని సవిన యంబుగా విన్నవించెను. దుర్వాసుఁడును రామునకు మెచ్చి 'ధర్మ వత్సలా ! నేను సహస్రవర్షతపస్సును దొఱఁగొంటిని. అది నేటితో సమాప్త మయ్యెను. భోజనార్థినై యిందు వచ్చితిని. ఏదిసిద్ధమో యది భుజింపఁ బెట్టు' మనెను. రాముఁడతఁడు కోరినట్లు యథాసిద్ధము భోజనమిడెను. ఆతాపసి యది కుడిచి సంతృప్తుఁడై రాముని సంభావించి నిజాశ్రమమునకుఁ బోయెను.

## — లక్ష్మణుని విసర్జించుట —

రాముఁడట్లు దుర్వాసమహర్షిని సాగనంపి వచ్చి కాలునివచనంబులు తలంచి మహాదుఃఖసంతప్తుఁడై తలవ్రాల్చి 'అకటా ! కాలుఁడేలవచ్చెనో ? వానికి నేనట్టి తీవ్రప్రతిజ్ఞ యేలఁగావించితినో ? ఇంతలోన దుర్వాసుఁడేల వచ్చెనో ? అయ్యో ! ఏమిసేయుదు ? ఎవఁడు తన సౌఖ్యంబులనెల్ల వర్జించి నారచీరలుగట్టి నావెంట గహనసీమలకువచ్చెనో, ఎవఁడు నాకుఁగా నిద్రా హారములుమాని పదునాలుగేండ్లు త్రిశుద్ధికి నమూల్యసేవలు మాకొనర్చెనో, ఎవఁడు నన్ను సీతాదేవివియోగ దుఃఖసాగరంబునఁబడి పరితపించుచుండిన వానిని సర్వవిధములఁ దేర్చెనో, ఎవఁడు నాకుఁగాఁ బ్రాణములను దెగించి ఘోరాసురభండనోద్యుక్తుఁడై నిజభుజాదర్పమెల్ల వ్యయించెనో, ఎవఁడు నాచిత్తవృత్తమెఱిఁగి నాయాజ్ఞలను గనుసన్నలఁ జేయుచు సర్వావస్థలందు నాకు మహోపకారమొనర్చుచుండెనో, యట్టి యాప్తునిఁ బరమవిశ్వాసినిఁ

బరోపకారపరాయణుని సత్యవ్రతుని గూర్మితమ్మునిఁ బ్రతిజ్ఞకుఁగా నెట్లు బలిపెట్టనోపుదు? కటా! తుదకు దైవమెంతయొనర్చె!' నని లోలోన వగచి వగచి,

"చ॥ అలుకవహించి యత్రికోకుఁడాఁకటి వెల్లనరేఁగి యందఱన్
బొలియఁగఁదిట్టిపోయినను బోదుము నెమ్మది నాత్మవాసికిన్
దలఁకక యేలవచ్చితివి నాయెడకున్ సడికోర్చి నిన్ను ని
ర్మలు నెడఁబాసియుంటి నికఁ బ్రాణము లెట్లు భరింతుఁదమ్ముడా!"

అని వావిచ్చి యేడ్చెను.

లక్ష్మణుఁడు రామసంతాపకారణంబు గ్రహించి 'అన్నా! నాకుఁగా సంతాపపడవలదు. కాలగతి యీవిధముగాఁ బూర్వనిర్మాణబద్ధమై యున్నది. దీనినిఁ దొలఁగఁదరము గాదు. వెఱవక నీప్రతినఁ గాపాడుము. ప్రతిజ్ఞాభంగమున నరకపతనమగును. నీకు నాయెడ నిక్కమైన ప్రేమ గలదేని నేను నీకెంతయుం ననుగ్రాహ్యుఁడనేని జంకుకళంకులుమాని నన్ను వధించి ధర్మమును గాపాడు' మని దోయిలొగ్గి విన్నవించెను.

రాముఁడామాటలకుఁ బ్రచలితేంద్రియుఁడై మంత్రిపురోహితులను రావించి సంగతియెల్ల వారికి వినిపించెను. వారును వృత్తాంతమెల్ల విని మాటాడనోపక తలవ్రాల్చి మిన్నకుండిరి. అంతలోన వసిష్ఠమహర్షి వచ్చెను. వానికి రాముఁడు సంగతియెల్లఁ దెలిపెను. ఆఋషీంద్రుఁడు సుంత ధ్యానగతుఁడై యుండి తలయూఁచి 'రామా! కాలమెవ్వారికినిఁ గడువరాదు, అనివార్య మశోచ్యము, ప్రతిజ్ఞాభంగము చేయరాదు. 'యథా రాజా తథా ప్రజా' యన వినవా? మాట తప్పినచో ధర్మము విలయంబొందును. ధర్మము లుప్తమైనచో ముల్లోకంబులును సచరాచరంబుగా నశించును. రామా! లోకంబుల మేలుకొఱకు నీవు నీప్రాణంపుఁ బ్రాణంబును సీతాదేవిని ద్యజించితివి. లోకాభ్యుదయార్థము నీవు వచ్చితివి. నీవచ్చిన యర్థంబునకుఁ గించన్మాత్రముగూడ భంగముగారాదు. లక్ష్మణునియందు నీప్రేమ మూర్తీభవించియుండుట జగద్విదితము. అట్టివానినిగూడ నీవు ధర్మప్రతిష్ఠాపనవిషయంబున జీరికిఁగొనవైతివన్నచో దీనిఫలమెంత కాలు

మెన్ని విధముల వ్యాపించునో యూహింపుము. ఎట్లు విచారించినను ధర్మ స్థాపనమే ప్రధానము. దానికిఁగాఁ ద్యజింపరానిది కలుగదు. ఈసంగతి నీకుఁ జెప్పవలయునా?' అని యూనిపల్కెను.

ఎట్టకేనికి రాముఁడు తెంపుచేసి తమ్ముఁడా! తత్త్వపరీక్షార్థము క్లిష్ట పరిస్థితులు గలుగు నందురు. అది నేఁడు నాకే సంప్రాప్తమయ్యెను. ధర్మ విపర్యయము కాఁగూడదుగావునఁ దదర్థము నిన్నుఁగూడఁ ద్యజించు చున్నాను. సాధువులయెడఁ ద్యాగము వధతో సాటియగు' ననెను. లక్ష్మణుఁడంత రామునిపాదంబులకు మ్రొక్కి యింటికిఁగూడ చనక యం దుండి వెడలి సరయూనదిని జేరి యాజలంబులఁ గ్రుంకెను. దేవతలు పుష్ప వృష్టిని గురిసి లక్ష్మణుని సశరీరంబుగా దివికిఁగొనిపోయిరి. అందలి ఋషులు లక్ష్మణుని గాంచి వారియొక్క చతుర్థాంశము వచ్చెనని హర్షించి వానిని బూజించిరి.

## —♦ కుశలవ పట్టాభిషేకము ♦—

రాముఁడట్లు లక్ష్మణుని విసర్జించి దుఃఖశోకసమన్వితుఁడై మంత్రి పురోహితులను జూచి 'ధర్మవత్సలుఁడైన భరతుని రాజ్యమందు నిలిపి నేను వనమునకు దరలుచున్నా' ననెను. ఆమాటవిని ప్రకృతివర్గమెల్లఁ దహ తహపడి వానికిఁ దలతో మ్రొక్కి నేల వ్రాలి గతప్రాణులువలె నయ్యెను. భరతుఁడును బ్రజ్ఞదప్పి కొండొకవడికిఁ దేరి 'అన్నా! నిన్నుఁగాదని రాజ్య మును నేనెంతమాత్రము నొల్లను. సత్యపూర్వకముగాఁ బ్రమాణము చేయు చున్నాను. ఈకుశలవులకుఁ బట్టముఁగట్టుము. కుశుఁడు కోసలరాజ్యంబు నకును లవుఁడుత్తరకోసలరాజ్యంబునకు నధిపతులగుదురుగాక. శత్రుఘ్ను నికిగా దూతలు తరలుగాక' అని విన్నవించెను.

భరతుని వచనంబులకుఁ బ్రజలు దిగారుపడిరి. వసిష్ఠుఁడు రాముని జూచి 'వత్సా! రామా! నీవచనంబులకుఁ బ్రజలెట్లయిరో చూతువా? వీరియభీష్టమొనర్చుట యెల్లవిధముల నీకగును. ఎన్నఁడుగాని నీవు ప్రజకు నప్రియంబొనర్ప' వనెను. రాముడామాటతోడ లేచి నిలిచి 'పౌరులారా! రాజ్యపరిపాలనము మీయభ్యుదయార్థమేగాని యాత్మసౌఖ్యార్థముగాదు.

మీకుఁ గానికార్యమును రాజు సేయరాదు. మీమతమేమో తెలుపనగు' ననెను. ప్రజలెల్లరుఁ జేతులఁగూర్చి 'స్వామీ! ఇంతకాలము మమ్మెల్లరను సుతప్రీతితోఁ బ్రోచితివి. ఇప్పుడు మమ్ము వదలి పోఁజెల్లునా? నీవు లేనినాఁడు మాగతి తండ్రిలేని బిడ్డలగతియగుఁగదా. మీనిశ్చయము మాఱ దేని మీవెంట మేమును వత్తుము. ఈవరమును మాకుఁ బ్రసాదింపుము. తపోవనంబులు దూఱుదువుగాక; పర్వతాంతరముల వసింతువుగాక; నదులు చొత్తువుగాక; నీవెచ్చటకుఁ జన్నను నీవెంట మేముందుము. మాకెల్లరకు సర్వార్థముల నీవే యీశ్వరుఁడవు. అట్టి నిన్ను మేము వదలి జీవింపజాలము. రాజా! ఇదే మాపరమాభీష్టము. ఈవరము ననుగ్రహింపు' మని యేకగ్రీవమునఁ బలికిరి.

రాముఁడు పౌరులదృఢభక్తికి సంతసము నలరి తనకర్తవ్యంబును నిశ్చయించుకొని కుశునిఁ గోసలదేశంబునకును లవుని నుత్తరకోసలదేశంబునకును బట్టాభిషేక మొనర్చెను.

అంత రాముఁడు తనసుతులను లక్ష్మణభరతశత్రుఘ్నుల పుత్త్రులను రావించి వారినెల్లరును గాఢాలింగనపురస్సరంబుగా దీవించి 'కన్నలారా! జనకులు తమతనయులకుఁగాఁ జేయవలసిన విద్యుక్త ధర్మంబులనెల్ల నెఱవేర్చితిమి. ఇఁకమీరు మీజీవితభారంబును స్వయముగా వహింపఁదగి యయ్యెను. మీకుఁ గఱపనైన విశేషంబులు లేవు. అయిన నొండు రెండు మాటలు చెప్పుదు వినుము.

—♦ పద్యమాల ♦—

"క॥ మతిఁదలఁపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టులసంప
త్ప్రీతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్ ॥" 1

"క॥ ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టియు సదసద్వివేకములు గల్గియు ముం
గట్టినకర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేరరు మనుజుల్ ॥" 2

క॥ ఆదిని సంయోగవియో
గాదిద్వంద్వములు దేహియగువానికి సం
పాదిల్లక తక్కవు పూ
ర్వోదయకర్మమున నెట్టి యోగికినైనన్ ॥ 3

"చ॥ విమలమొఱున్యమో పురుషవృత్తమెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థములివియుండఁగా నరుఁడు దక్కొనసేయ్చె తన్నుమ్రుచ్చిలన్ ॥"4

"క॥ ఎఱుకగలవారిచరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని
మఱవక నుష్ఠించునది సమంజసబుద్ధిన్ ॥" 5

"క॥ ఇచ్చునది ధనము పాత్రన
కచ్చుగ నొరు లేడకుండునది యభిముఖులై
వచ్చినయార్థుల వ్యథ
పుచ్చకచేయునది సర్వభూతప్రీతిన్ ॥" 6

క॥ మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగసభలన్ ॥ 7

తే॥ మదము గామంబు క్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోనిసహజ
వైరివర్గంబు నోడిచినవాఁడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహితతతుల ॥ 8

ఆ॥ సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మనొండెఱుంగ
నొరుల నొప్పికోడకుపతాపమొనరించు
నదియకడు నధర్మ మనిరి బుధులు ॥ 9

ఆ॥ వేదవిహితవిధుల నాదరించుటయూర్ధ్వ
గతికిఁ దెరువు విధులఁ గడచియుండు
నాఁగఁబడినవాని లోఁగకచేయుట
యధమగతికి మార్గమనిరి మునులు ॥ 10

క॥ ఆపదయైనను ధర్మ్మప
ప్రాప్తుగ రక్షింపవలయుఁ బరమార్థము ధ
ర్మ్మాపాయ మధార్మికులకు
నాపన జన్మాంతరమున నఘగతమగుటన్ ॥ 11

అట్లు హితంబుగఁ జెపి,

"ఉ॥ ఆశ్రితపోషణంబున సమంచితశీలమునన్ మనీషి వి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహినొప్పి సర్వలో
కాశ్రయులై దనర్పుమిఁక సత్యకళంక చరిత్రసంపదన్ ॥"

అని దీవించి సముచిత రథగజాశ్వసేనా కనకవస్తుసమేతంబుగా నిష్టజనంబుతోడ వారిని దత్తరాజ్యంబులకు నుచ్చి శత్రుఘ్నునికొడుకు మాతలను బంపెను.

—♦ మహాప్రస్థానికము ♦—

ఆదూతలు తరలి మధురాపురమార్గముఁబట్టి మార్గమధ్యంబున నంత సేపుగూడఁ గాలూనక మూఁడహోరాత్రములు నడచి మధురాపురముచేరి త్రుఘ్నుని సందర్శించి యుదంతమెల్ల వానికిఁ దెలిపి 'రఘువీరా! రాముఁడు నిన్ను వెంటఁగొని రమ్మనె' ననిరి. శత్రుఘ్నుఁడు సంగతియెల్ల ని కులక్షయ ముపస్థితమయ్యెనని గ్రహించి ప్రకృతివర్గంబును గాంచనుఁ నుపేరి పురోహితుని రావించి వృత్తాంతమెల్ల వారికిఁ దెలిపి తన రాజ్యం ను విభజించి సుబాహుఁడనుపేరి తనపెద్దకొడుకునకు మధురరాజ్యంబును త్రుఘ్నాతియనుపేరి తన రెండవసుతునకు వైదిశదేశంబు నిచ్చి హితం లు పలికి రథమెక్కి యొంటిగా నయోధ్యకుఁ దరలివచ్చి యచ్చట నులమధ్యఁ బావకుఁడువలెఁ దేజరిల్లుచున్న రాముని సందర్శించి వాని రణంబులకు నమస్కరించి ప్రాంజలియై 'అన్నా! నిన్ను వెంబడింప చ్చితి' ననెను.

అంతలోన రామస్వర్గారోహణవార్త దేశమెల్లఁ బ్రాకెను. కామరూపులైన వానరులును ఋక్షరాక్షసులును వేలకొలఁది సుగ్రీవుని బురస్కరించుకొని వచ్చిరి. దేవపుత్రులును ఋషిపుత్రులును గంధర్వాదులును జేరిరి. అంత సుగ్రీవుఁడు విధిపూర్వకముగా రామునకు నమస్కరించి 'స్వామీ! వానరరాజ్యంబు నంగదునకుఁ గట్టి నేనును మీవెంట రానిశ్చయించితి' ననెను. రాముఁడామాట విని 'సఖా! సుగ్రీవా! నామాట వినుము. నీతలఁపు మానుము. నేను నిన్ను వదలుటగాదు. కుశాగ్రబుద్ధికిఁ జెక్కులు చెప్పనేల!' యని వానిని నూరార్పులు పలికి, విభీషణుని వంక మరలి 'మిత్రమా! విభీషణా! ప్రజయెంతకాలముండునో యంతకాలము నీవు లంకాపట్టణంబును ధర్మయుక్తముగాఁ బరిపాలింపుచు నుండుము. సూర్యచంద్రులెందాక నుందురో నాచరిత్ర లోకమం దెంతకాలముండునో యంత కాలము నీవు నీరాజ్యము నేలుచుందువు. వేఱు తలంపవలదు; మాఱాడ వలదు. మఱియు జగన్నాథుఁడును సర్వదేవనమస్కృతుండును మా యిక్ష్వాకువులకుఁ గులదైవంబునునైన శ్రీరంగనాథునిఁ ద్రికశుద్ధికి నారాధింపుచుండు' మని చెప్పి, హనుమంతుని బిలిచి 'హరీశ్వరా! ఎందాక నాచరిత్ర ధరాతలంబుననుండునో యందాక నీవు ధ్రువంబుననుండు' మనెను. నావుడు మారుతి కేలొగ్గి 'స్వామీ! మీయాజ్ఞఁ దలదాల్తు' ననెను. అంతట రాముఁడు జాంబవంతునిని మైందద్వివిదులను సంబోధించి 'కలికాలమువచ్చునందాక సుఖముగా జీవించియుండు' రని చెప్పి వారినెల్ల వీడ్కొనెను.

తెల్లవాఱినంత రాముఁడు వసిష్ఠుని రావించి 'గురూత్తమా! అగ్నిహోత్రము ద్విజసహితంబుగా మున్నాడ నగు' ననెను. వసిష్ఠుఁడట్లే మహాప్రస్థానికమును విధిపూర్వకముగాఁ గావించెను. రాముఁడు సూక్ష్మాంబరము గట్టి గృహమునుండి వెడలెను. వాని దక్షిణపార్శ్వంబున శ్రీదేవియు సవ్యంబున హ్రీదేవియు ముందుభాగంబున వ్యవసాయాంగనయు నడచిరి. ఆయుధంబులు రూపుదాల్చి రాము ననుగమించెను. ఋషులును మహీసురులును వెంబడించిరి. అంతఃపురస్త్రీలు సవృద్ధబాలదాసీదాసంబుగా దరలిరి. భరతశత్రుఘ్నులును దవీయులతోడ నడచిరి. రామునిఁగడసారి చూపిడే యని రాజ్యమెల్ల పయిఁబయిఁబడి వెళ్లవిరిసెను.

అట్లు రాముఁడు హృష్టపుష్టజనావృతుఁడై యధ్యర్ధయోజనదూరము చని పశ్చిమవాహినియైన సరయూనదిఁ జేరెను. అంతలోన బ్రహ్మయు దేవర్షిగణసమావృతుఁడై వచ్చెను. వారివిమానముల దివ్యతేజస్సు మిన్నెల్ల నావరించి మిఱుమిట్లు గొల్పసాగెను. వాయువు సుఖప్రదముగా వీచెను; పుష్పవృష్టి గురిసెను; తూర్యరవంబులు చెలరేగెను; గంధర్వగానంబు లుప్పతిల్లెను.

బ్రహ్మ యంతరిక్షగతుఁడై "శుభము; శుభము. మహాత్మా! సర్వలోకశరణ్యా! లోకానుగ్రహార్థము నీవు నీయిచ్ఛానురూప శరీరంబులు దాల్తువు. నీలీలలు పరమాద్భుతంబులు. అచింత్యము మహాద్భుతము నక్షయము సర్వసంగ్రహమునైన నీతత్త్వము నెఱుంగసాధ్యముగాదు. నిన్ను నీమాయతప్ప యొరులెఱుంగజాలరు. నీవచ్చినకార్యము సమాప్తమయ్యెను. ఇఁక నీవు సశరీరంబుగా ననుజులతోడ నీవైష్ణవతేజంబును బ్రవేశింప వేడుదు" నని ప్రార్థించెను. అంత రాముఁడు సరయూజలంబులఁజొచ్చెను వానివెంట భరతాదులు నట్లెగావించిరి. సాధు వచనంబులు మాఱుమ్రోసెను. అట్లు శ్రీరామమహాప్రస్థానికము సంపూర్ణమయ్యెను.

రాముఁడట్లు తనవైష్ణవతేజంబుఁ జొచ్చి శ్రీమహావిష్ణువై వెలసి బ్రహ్మనుజేరి "పితామహా! ఈజనులెల్లరు స్నేహవశంబున నావెంట వచ్చిరి. నాకుఁగా త్యక్తాత్ములై వచ్చిన యీమహాభక్తులు పూజ్యులుగాని యేతన్మాత్రులుగారు" అని తన తలంపును సూచించెను. బ్రహ్మ తద్వచనంబు లాకర్ణించి "స్వామీ! వీరికెల్లరకు సాంతానికలోకంబులు గలుగుఁగాక. వేయేల! మనుష్యులేగాదు తిర్యగ్జంతువులైనను నిన్ను భక్తితో సంస్మరించుచుఁ బ్రాణంబులు వదలునేని బ్రహ్మగుణయుక్తులై బ్రహ్మలోకంబును బడయుదురు" అని వచించెను.

వానరులు వారివారి యంశములఁ జొచ్చిరి. సుగ్రీవుఁడు సూర్యమండలముఁ బ్రవేశించెను. తదితరులు సరయూతోయంబుఁ జొచ్చినవారు తమశరీరంబులనుఁ బాసి స్వర్గమునొందిరి. నాఁడుమొదలు సరయూజలంబులను మహాపవిత్రతఁ గాంచెను.

ఉత్తరకాండము సంపూర్ణము.

---



ఇట్లు రామాయణము సంపూర్ణమయ్యెను. బ్రహ్మప్రేరణముచేత వాల్మీకి మహర్షి వచించిన యీమహాకావ్యమును జదివినను విన్నను బాపము నశించి యాయురారోగ్య మహదైశ్వర్యంబులు సమకూఱుననగా దానితత్త్వము ననుష్ఠించు వారిసంగతి వేఱచెప్పవలయునా ? ఈరామాయణము గాయత్రీ స్వరూపముగావున దీని మహాత్మ్య మనిర్వచనీయము.

చ॥ మృదుకలవాణి యగ్నవతి యిద్ధచరిత్ర మనోజ్ఞభావ య
భ్యుదయ లసద్రసాత్మక సముజ్జ్వలలక్షణరీతిరమ్య సౌ
హృద నిఖిలాంగసుందరి యిదేకృతికన్యయలౌకికప్రియం
వద సకలాంధ్రమండలికి వత్సలయై తనరారుఁగావుతన్॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు ॥ 1

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సన్తు నిర్భయాః ॥ 2

అపుత్రాః పుత్రిణస్సన్తు పుత్రిణస్సన్తు పౌత్రిణః ।
అధనా స్సధనాస్సన్తు జీవంతు శరదాం శతమ్ ॥ 3

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయేనమః ॥ 4

సీ॥ అకలంక చిట్టిపాలకగోత్రజాతుండు
దొడ్డాన్వయమునఁ జేర్వడ్డవాఁడు
ఆంధ్రభూపాలసౌహార్ద సంపన్నుండు
కావలీ పౌరాగ్రగణ్యమూర్తి
పేరయరెడ్డికిఁ జేర్మిరామాంబకుఁ
నాఱవకాన్పు రెండవసుతుండు
సంస్కృతాంధ్రాంగల శారదాపదసేవి
పండితకవిచంద్రభావితుండు

తే॥ ప్రథిత వేంకటరామాఖ్యఁ బరఁగువాఁడు
బాలికాబాలవృద్ధసంభావ్యమగుచు
నాంధ్రవాణికిఁ గంఠమాల్యంబుగాఁగ
రామచరితంబు వివరించి వ్రాసెనిట్లు ॥

మ॥ పదియుందొమ్మిదినూర్లు ముప్పదియు నాపై నేడువర్షంబులన్
గదురన్ హూణశకంబునందుఁ ద్రిజగత్కల్యాణికిం దేవికిన్
బదిలంబై విజయాఖ్యనొప్పుదశమిన్ భావ్యంబుగా నీకృతిన్
దుదిముట్టించితి నైదుయేండ్ల శ్రమయుం దోఁచెన్ ఫలశ్రీకమై ॥

తే॥గీ॥ ముద్రితంబయ్యె శ్రీరామభద్రచరిత
కృష్ణజీవిత విరచనా కృషియునిండె
నస్మదీయజనవర్గమైనయట్టి
విక్రమంబున శ్రీమహావిజయదశమి ॥



# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 6 | యదా | యథా |
| ,, | 8 | కాణ | కారణ |
| ,, | 21 | యిదు | యిందు |
| 3 | 10 | విశ్రవసువుఁడు | విశ్రవసుఁడు |
| ,, | 14 | శాంత | శాంతి |
| ,, | 15 | మట్లు | యట్లు |
| ,, | 22 | పరమంధర్మం | సత్యంహిపరమంధర్మం |
| 5 | 12 | బెండాడి | బెండ్లాడి |
| 6 | 2 | పురంబొందు | పురంబొందు |
| ,, | 10 | దేవతి | దేవవతి |
| ,, | 16 | త్రేతాగ్నిబోలి | త్రేతాగ్నిబోని |
| 7 | 5 | గలుగము | గలుగరు |
| 8 | 2 | పుష్పోత్కట | పుష్పోత్కట |
| 10 | 23 | బిడాలబు | బిడాలంబు |
| 11 | 11 | మకరంబు | మకరంబులు |
| ,, | 17 | యాకరాం | యాకర్ణాం |
| 17 | 3 | సువర్ణ | సుపర్ణ |
| ,, | 9 | నాపి | నాపివా |
| 18 | 5 | కన్నులిచ్చి | కన్నువిచ్చి |
| 22 | 10 | నూరేండ్లుందు | నూరేండ్లందు |
| ,, | 26 | మండోదరి | మందోదరి |
| 23 | 5 | దోపఁరోదన | దోఁపరోదన |
| 24 | 23 | నందనవనంబు | చైత్రరథవనంబు |
| 25 | 19 | నాజాపించెను | నాజ్ఞాపించెను |
| 26 | 12 | మహాత్మా | మహార్త్మా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 28 | 12 | నందనవనంబు | చైత్రరథవనంబు |
| 29 | 15 | మని | ము |
| ,, | 24 | బట్టి | పట్టి |
| ,, | 25 | వెలుఁగత్తి | నెలుఁగత్తి |
| 37 | 3 | మధించి | మథించి |
| 38 | 17 | వారుమ | వారును |
| 40 | 16 | రావణుఁదు | రావణుఁడు |
| 42 | 14 | మరఱను | మరలెను |
| 44 | 9 | జీనపన్నో | బీనపన్నో |
| 45 | 14 | జయగాంతు | జయకాంతు |
| ,, | 24 | రంభనుధర్షించటు | మఘపురదండయాత్ర |
| 46 | 11 | తూణంబును | తూణీరంబును |
| 48 | 24 | | రంభనుధర్షించుట |
| 50 | 15 | కరీంధ్ర | కరీంద్ర |
| 53 | 24 | శవణు | శగణు |
| 54 | 3 | దఱుగ | దఱుగు |
| ,, | 25 | బులకరించు | మేనుపులకరించు |
| 55 | 28 | అదితు | అదిత్య |
| 57 | 8 | సడిలించె | సడలించె |
| 58 | 5 | భగ్లంబు | భల్లంబు |
| 59 | 2 | ఇంతలో | ఇంతలో |
| ,, | 5 | గనోనీయ | గనోయా |
| 60 | 13 | ర్యల్యంబు | ర్మల్యంబు |
| 61 | 19 | జేలుపు | దెలుపు |
| 62 | 5 | బాయావింధ్య | బావింధ్య |
| ,, | 25 | ఆహా ! | అహో ! |
| ,, | 26 | నక్రమాన | నక్రమీన |
| 33 | 15 | జలంబులు-చికి | జలంబులుబిగి |
| 64 | 24 | యుదాంత | యుగాంత |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 65 | 8 | నెమ | నెను |
| 67 | 25 | నయ్యాప్తి | నయ్యాస్తి |
| 68 | 23 | సగమేడిన | సగమేదిన |
| 72 | 18 | ప్రహస్ర | సహస్ర |
| 73 | 12 | తాండవలేపమా | తాండవవేపమా |
| ,, | 16 | జతుర్వేదలధ్య | జతుర్వేదములధ్య |
| 75 | 9 | సస్యాధ్య | సస్యాఢ్య |
| 76 | 2 | ప్రజావంతు | ప్రజ్ఞావంతు |
| ,, | 12 | యేడ్చు | యేచ్చు |
| 78 | 3 | నుమంత్రు | సుమంత్రు |
| 79 | 3 | నావిన్నతి | నావిన్నది |
| ,, | 14 | యాగవృనాం | యాగహానాం |
| 84 | 3 | మౌక్తిర | మౌక్తిక |
| ,, | 12 | ప్రతిపరార్థము | ప్రతిపదార్థము |
| 85 | 5 | నాటుయూపంబులు | నాటుమారేడియూపం |
| 94 | 15 | గోసలరాజ్యంబు పరమసుఖావాసమయ్యె | గోసలంబు సౌఖ్య శ్రీనివాసమయ్యె |
| 96 | 19 | విశ్రవసువుఁడు | విశ్రవసుఁడు |
| 97 | 2 | సంగ్రామకారులను | సంగ్రామకాలురను |
| 108 | 10 | నిన్నెడయించెడు | నిన్నెనయించెడు |
| 109 | 2 | పడిరి | మందిరి |
| ,, | 5 | బ్రహ్మవాదులను | బ్రహ్మవాదులును |
| ,, | 7 | గ్రుంకువిడి | గ్రుంకులిడి |
| 110 | 1 | కృతులై | కృతలై |
| ,, | 3 | వసుఁడై | వశుఁడై |
| ,, | 27 | బడికి | బలికి |
| 115 | 22 | సుతల | సంతుల |
| 120 | 5 | ఆనది | ఆనది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 120 | 5 | భగీరధు | భగీరథు |
| ,, | 12 | మయ్యోను | యయ్యోను |
| ,, | 23 | నవ్వుల | నవ్వల |
| 121 | 14 | విర్లి | విల్లి |
| ,, | 25 | నప్పరస | నప్సరస |
| 123 | 23 | ముఖుడై | ముఖులై |
| 127 | 1 | నసస్తే | నమస్తే |
| ,, | 17 | మీామాసం | మీామాంసక |
| 131 | 23 | నిడుదు | నిడుద |
| 132 | 8 | హాతు | హాత |
| 139 | 28 | వ్రతాం | వ్రతాంత |
| 141 | 9 | కలఁగదేని | కలఁగడేని |
| 142 | 1 | సూ్భర్తి | స్ఫూర్తి |
| 145 | 27 | బోదించి | బోధించి |
| 147 | 13 | జూపంబు | జాపం[illegible] |
| 148 | 18 | వినిచెను | విలిచెను |
| 150 | 5 | హాష్కి | హార్షికి |
| 152 | 5 | నాత్సల్యం | వాత్సల్యం |
| ,, | 18 | సువ్ణళ్ళ | సువర్ణళ్ళ |
| 158 | 5 | యర్ఘము | యర్ఘ్యము |
| 159 | 28 | కుమారుఁడగ:టం | కుమారుఁడవగుటం |
| 164 | 21 | గూల్చి | గూర్చి |
| ,, | 23 | చౌర్యకార్య | చౌర కార్య |
| 170 | 12 | ఇదియుహా | ఇదిమహా |
| 172 | 9 | యెమో | యేమో |
| 172 | 20 | లిరమర | లిరుమర |
| 178 | 21 | భతుఁడు | భరతుఁడు |
| ,, | 26 | శ్రదా | శ్రద్ధా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 183 | 17 | మంద | మింద |
| 186 | 11 | రక్షింము | రక్షింపుము |
| 191 | 4 | సింహాసన | సింహాసనా |
| 192 | 12 | విచిల్చి | విదిర్చి |
| 193 | 23 | దోఁజు | దోఁచు |
| 195 | 12 | లోకంబు | లోకంబు |
| 200 | 5 | గ్రస్తై | గ్రస్తై |
| 202 | 6 | బలిపును | బలిపెను |
| 205 | 25 | నిర్వీణుఁడై | నిర్విణ్ణుఁడై |
| 207 | 1 | పూరితంబగు | పూరితంబులగు |
| 209 | 22 | సమ్మతముని | సమ్మతములని |
| 215 | 20 | రాజర్షులవశ | రాజర్షులకువశ |
| 216 | 24 | కోడంత | కొండంత |
| 217 | 14 | రాముడుఁడట్లు | రాముఁడట్లు |
| 222 | 13 | వాఁగర్త | దాఁగర్త |
| 230 | 8 | సంకీరము | సంకీర్ణము |
| 231 | 26 | నింతువా | నింతువో |
| 232 | 4 | బీతు | బ్రీతు |
| 234 | 8 | దొరకడు | దొరకత్తు |
| 235 | 15 | దానిని | దానికి |
| 237 | 26 | దనపి | దనిపి |
| 244 | 27 | మొండు | మెండు |
| 245 | 23 | బాపు | చాపు |
| ,, | 28 | నిటూ | నిట్టూ |
| 263 | 19 | కులారావి | కులారావ |
| 265 | 15 | ప్రాసాభి | ప్రాసాదాభి |
| ,, | 12 | కొవరాసులు | కొష్టరాసులు |
| 268 | 15 | గంగావతరణ | గంగాతరణ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 433 | 6 | నీరుగ్రోళ్ళ | నీరుక్రోళ్ళ |
| ,, | 12 | మీయెడ | మీయెద |
| ,, | 14 | గూడపేం | గూఢపేం |
| 442 | 18 | సాధింపగావు. | సాధింపదు |
| 443 | 13 | కొఅకొ | కొఅకును |
| 447 | 4 | చేనుగజ | చెనుగజ |
| 448 | 13 | శాప్రపతి | శాపప్రతి |
| 450 | 26 | పుష్టిని | పుష్పిని |
| 459 | 8 | దండులను | దండ్యులను |
| ,, | 18 | దినాగ్ధముతో | దినార్ధములో |
| 460 | 7 | నిమిసం | నిమిషం |
| 462 | 13 | యూశ్వాశించి | యాశ్వాసించి |
| 463 | 28 | అటియు | ఆదియూ |
| 466 | 18 | నాయెడ | నాయెడ |
| 468 | 2 | ధగ్మవరు | ధర్మపరు |
| 474 | 20 | రామమయ్యో | రామయయ్యో |
| 520 | 18 | ప్రభామాస | ప్రభాభాస |
| 527 | 15 | ధూమ్రా | ధూప్ర |
| ,, | 20 | దీపంబుక్తై | దీపంబులకై |
| 528 | 2 | శంకాకులై | శంకాకులుతై |
| ,, | 16 | సురాలంబు | సురాలయంబు |
| 534 | 12 | సంగస్థానం | సంగమస్థానం |
| 540 | 20 | మరీచికెంచ్భో | మరీచిరించ్భో |
| 542 | 14 | దాలపుత్ర | శాలపుత్ర |
| 543 | 18 | బిబ్బిలు | జిప్పిలు |
| 544 | 12 | లలరె | లరెరె ! |
| 548 | 6 | సీతాపతి | దాశరథి |
| 550 | 14 | అకపివర్యులట్టు | అట్లు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 647 | 25 | ఆడుదియు | ఆడుది |
| ,, | 26 | ననియు | యనియు |
| 664 | 16 | సద్యః ప్రాసా | సద్యః ప్రసా |
| 670 | 18 | కూరెను | కూలెను |
| 677 | 17 | సమర్థము | సమర్థులు |
| 679 | 13 | నుండి | నుంచి |
| 680 | 17 | చనితివి | చనితివా ? |
| 684 | 29 | నరలోకక్ర- | నరులోకక్ర- |
| 691 | 26 | రాజాజయతి | 'రాజాజయతి |
| | | సుగ్రీవ | సుగ్రీవరాఘవేనాభిపాలితః' |
| 696 | 27 | జీవంబులును | భీవంబులును |
| 717 | 18 | నందులకు | అందులకు |
| 724 | 16 | మనివారి | మనవారి |
| 725 | 21 | లిచ్ఛకంబు | లిచ్చకంబు |
| 727 | 19 | ప్రాణార్థము | ప్రాణమునకుఁగా. |
| 739 | 18 | మోసమూ | మోసమో |
| 746 | 9 | ధాత్రీసలి | ధాత్రీస్థలి. |
| 749 | 1 | గబుగఁడు | గలుగఁడు |
| 756 | 8 | సుఖముతే | సుఖమునే |
| 758 | 14 | గాత | గాక |
| 759 | 24 | ధిక్యుడైనను | ధిక్యులైనను |
| 765 | 5 | మండోదరి | మందోదరి |
| 771 | 16 | మోల | మ్రోల |
| 772 | 5 | యన్యుల | నన్యుల |
| 773 | 17 | బొనర్చిన లువను | బొనర్చినలువను. |
| ,, | 29 | వృతుల | వృతల |
| 777 | 22 | జోపునటుగా | జోపునట్లుగా. |
| 778 | 6 | గొడ్డిల | గొడ్డట |

| పుటం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 346 | 11 | నల్వ్యర | నల్వ్యారు |
| 347 | 13 | వపుష్పంతుశె | వపుష్మంతుశై |
| 348 | 17 | ముందుగాక | ముందుగాక |
| 358 | 26 | సు స్త్రియో | సు ప్త్రియో |
| 360 | 5 | నా మెను | యా ఘెను |
| 865 | 19 | సీతకైన | సీతకై |
| ,, | 25 | విదర్శనముల | నిదర్శనములు |
| 867 | 3 | తామసికులు | తామసికులకు |
| ,, | 19 | నూహింతు నేని | నూహింతు వేని |
| 877 | 18 | ఞానమునకు | జ్ఞానమునకు |
| 878 | 3 | నీవచ్చుటు | నీవచ్చటు |
| ,, | 22 | ఇంతనక్న | ఇంతకన్న |
| 880 | 6 | దుఃఖిలప | దుఃఖింప |
| 884 | 27 | భటులును | భటులను |
| 920 | 9 | విందలలను | విందలను |
| 922 | 23 | కుమారి | కుమార |
| 934 | 24 | సీతాదేవియోగ | సీతావియోగ |
| 939 | 14 | శేడకుండునది | వేడకుండునది |